



Andhra Valmiki



Vasudasudu.

ARANYA
KANDAMU

No. III







SREEMATH

# ANDHRA VALMIKI RAMAYANAMU



A LITERAL METRICAL TRANSLATION
OF VALMIKI'S SANSKRIT RAMAYANAM

BY

**VAVILICOLANU SUBBA ROW,**
Telugu Pandit, Presidency College, Madras, (Now retired)
and the author of

Sree Kumarabhyudayamu, Sree Kausalya Parinayamu, Bhagavad Gita (Dwipada), Sree Krishna Leelamritam, Krishnavatara Thathwamu, Subhadra Vijaya Natakam, &c., &c., &c.

WITH AUTHOR'S OWN COMMENTARY

CALLED

MANDARAM.

PRINTED AT
THE LIBERTY PRESS, MADRAS.

1939

శ్రీరామసేవ.

# మనవి.

మహాశయులారా!

జగద్విఖ్యాత శ్రీరామభక్తులును నాంధ్ర వాల్మీకి బిరుదాంకితులునునగు శ్రీ వావిలికొలను సుబ్బరావు పంతులు (శ్రీ వాసుదాస దేశికస్వామివారు) గారిచే రచింపఁబడిన శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణమునకు వారే స్వయముగా మందర మనుపేర విపులమగు వ్యాఖ్య వ్రాసి బాలకాండము, అయోధ్యాకాండ ఆరణ్యకాండములోఁ బ్రథమభాగము నచ్చొత్తించియుండుట మీ కెల్లరకు నెరుకయే. ఇంతలో (1-8-1936) శ్రీవారు పరమపదించిరి. గ్రంథము గొప్పదగుట చేతను మొత్తము గ్రంథమంతయు నచ్చగుటకు ౧౦-౧౨ వేల రూపాయలు కావలసి యుండుటచేతను నీ మహాకార్యమునకు శ్రీవారిపిమ్మట స్వతంత్రించి యెవరును మొగ్గఁజాలరైరి. కాని శ్రీవారి శిష్యులయు నభిమానులయు హృదయములలో గ్రంథ మచ్చుకాకపోయెనే యని యాతురతమాత్రము చాల మిక్కుటముగా లేక పోలేదు. దేనికిని తరుణము రావలెను. శ్రీ భగవత్కటాక్షము కావలెను. ఈ సంవత్సరము జనవరినెలలో జరిగిన శ్రీవారి జయంత్యుత్సవములకు శ్రీవారి శిష్యులును అభిమానులును జాలమంది విచ్చేసి మందర ముద్రణమువిషయములోఁ బట్టు పట్టిరి. వారికి శ్రీహరి సహాయ మయ్యెను. ఒక యరగంటలో రు. ౭౫౦ లు కనక వర్షమువలెఁ గురిసెను. అందఱు చాల నుత్సాహపూరిత మనస్కులైరి. మందరము శ్రీహరి సేవనెత్తెనని యానందించిరి. కార్యోన్ముఖులైరి. శ్రీ శ్రీ ఈదర వేంకటరావుపంతులుగారు రందుఁ బ్రముఖులు. వీరి పట్టుదల సాహాయ్యమున నిది యింత తొందరలో నచ్చు కావుటకు వీలయినది. వీరికిఁ దోడు శ్రీ కూనంనేని వేంకటప్పదాసుఁడుగారును, శ్రీమాన్ పొత్తూరు వేంకటప్పదాసుఁడుగారును, తురగా పూర్ణచంద్రరావు పంతులుగారును సహాయులైరి. వీరందఱును నిష్కలంక గురుసేవాపరాయణులు. సర్వస్వము శ్రీ దేశికస్వామియే యనెడి యధ్యవసాయము గలవారు. ఈ గ్రంథము సాంతమగువఱకును వీరిట్టి యుత్కంఠ, కార్యదీక్ష గలవారయి యుండుటకుఁ దగిన శక్త్యుత్సాహములు శ్రీ సీతారాములును శ్రీ యాచార్యస్వామియగు శ్రీ వాసుదాసులవారును వీరికిఁ బ్రసాదించెదరుగాక! ఈ ముద్రణమునకగు ధనమును నొసంగిన నుదారాశయులగు సతీమతల్లులకును సాధుజనులకును నిరంతరాయశ్రేయఃపరంపరలను శ్రీ భగవంతుఁ డనుగ్రహించుఁ గాత!

౧౧-వ భాగముకూడ ముద్రణ మగుచున్నది. అది ఒకనెలలోపల పూర్తి కావచ్చును. మందరము ౧౦-వ భాగము ముద్రణమునకు సాయపడిన పుణ్యాత్ముల పవిత్రనామము లిందు వివరింపఁబడినవి.

ఆంధ్ర మహాశయు లీగ్రంథము తక్కిన భాగములు త్వరలో ముద్రణమగుటకుఁ దగిన చేయూఁత నొసంగెదరు గాక!

ఈ పుస్తకములు వలయువారును, విరాళముల నొసంగు వారును యీ దిగువ చిరునామాతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపఁ గోరుచున్నారు.

ఇట్లు విన్నవించు,
భవచ్చరణధూళి దాస శేషః.

శ్రీ వాల్మీకాశ్రమము,
శ్రీ పాదుకాక్షేత్రము, నడిగడ్డపాలెము, చుండూరుపోస్టు, తెనాలితాలూకా. అనిగాని—
మెస్సర్సు వేంకట్రామ అండ్ కో., హెడ్డాఫీసు: ఏలూరు.
బ్రాంచీలు :— బెజవాడ, రాజమండ్రి, తెనాలి, పాలకొల్లు, సికింద్రాబాదు; మద్రాసు.

# శ్రీమదాంధ్ర వాల్మీకిరామాయణ వ్యాఖ్యానమగు మందరము ౧౦-వ భాగము ముద్రించుటకు విరాళములొసంగిన దాతలు

| | | | | |
|---|---|---|---|---|
| ౧. | బ్రహ్మశ్రీ | ఈదర వేంకట్రావుగారు | ఏలూరు | ౫౦-౦-౦ |
| ౨. | శ్రీమాన్ | వనము శ్రీరామదాసుండుగారు | కమలాపురము, నైజాము | ౫౦-౦-౦ |
| ౩. | మ.రా.శ్రీ | పందిటి చెంగల్ రాయండుగారు | బాపట్ల | ౫౦-౦-౦ |
| ౪. | ,, | కూనంనేని భావయ్యగారు | నడిగడ్డపాలెము | ౨౫-౦-౦ |
| ౫. | ,, | కూనంనేని వేంకటప్పదాసుండుగారు | ,, | ౨౫-౦-౦ |
| ౬. | ,, | మధిర రంగదాసుండుగారు | చాగంటివారి పాలెము | ౨౫-౦-౦ |
| ౭. | ,, | బేతంచర్ల వేంకటదాసుండుగారు | సాతులూరు | ౧౦-౦-౦ |
| ౮. | శ్రీమాన్ | రావినూతుల నాగభూషణదాసుండుగారు | అంగలకుదురు | ౧౦-౦-౦ |
| ౯. | మ.రా.శ్రీ | అలపర్తి వీరయ్యగారు | ,, | ౫-౦-౦ |
| ౧౦. | ,, | కొమరవోలు భావయ్యగారు | నారికేళపల్లి | ౫-౦-౦ |
| ౧౧. | శ్రీమాన్ | అన్నసముద్రము రంగదాసుండుగారు | క్రొత్తూరు | ౫-౦-౦ |
| ౧౨. | మ.రా.శ్రీ | కనుమూరు రామస్వామిగారు | నార్నెపాడు | ౫-౦-౦ |
| ౧౩. | ,, | వేంపాటి లింగయ్యగారు | ఇరుకుపాలెము | ౫-౦-౦ |
| ౧౪. | ,, | గుండిమెడ వేంకటసుబ్బయ్యగారు | జూపూండి | ౫-౦-౦ |
| ౧౫. | ,, | గుళ్లపల్లి రామదాసుండుగారు | బ్రాహ్మణ కోడూరు | ౫-౦-౦ |
| ౧౬. | ,, | వంకాయలపాటి కోట్లింగముగారు | పొణుగుపాడు | ౫-౦-౦ |
| ౧౭. | ,, | బయ్యన బ్రహ్మయ్యగారు | సాతులూరు | ౩-౦-౦ |
| ౧౮. | ,, | కనగాల వేంకటప్పయ్యగారు | అంగలకుదురు | ౩-౦-౦ |
| ౧౯. | శ్రీమాన్ | కొండపల్లి నారాయణదాసుండుగారు | తిరువూరు | ౨-౦-౦ |
| ౨౦. | ,, | గోగులపాటి మంగయ్యగారు | గోగులపాడు | ౨-౦-౦ |
| ౨౧. | ,, | పులిపాక వేంకటప్పయ్యగారు | అమృతలూరు | ౨-౦-౦ |
| ౨౨. | మ.రా.శ్రీ | బయ్యన నాగయ్యగారు | సాతులూరు | ౨-౦-౦ |

| | | | |
|---|---|---|---|
| ౨౩. మ.రా.శ్రీ | దన్నారపు ఘన్ను గారు | సాతులూరు | ౨-౦-౦ |
| ౨౪. ,, | అలపర్తి సీతారామయ్య గారు | అంగలకుదురు | ౨-౦-౦ |
| ౨౫. ,, | గొట్టిపాటి సుబ్బయ్య గారు | సాతులూరు | ౧-౦-౦ |
| ౨౬. బ్రహ్మశ్రీ | అంబడిపూడి శేషయ్య గారు | గొడవఱ్ఱు | ౧-౦-౦ |
| ౨౭. ,, | గడ్డమణుగు లక్ష్మీనారాయణరావు గారు | ,, | ౧-౦-౦ |
| ౨౮. ,, | మోదుకూరు రామారావు గారు | మదరాసు | ౧-౦-౦ |
| ౨౯. మ.రా.శ్రీ | కంచర్ల కోటయ్య గారు | ఎనమదల | ౧-౦-౦ |
| ౩౦. ,, | దాసరి శ్రీమన్నారాయణ గారు | బాపట్ల | ౧-౦-౦ |
| ౩౧. ,, | రావిపాటి రామయ్య గారు | జూపూడి | ౧-౦-౦ |
| ౩౨. ,, | శిఖాకొలను సుబ్బారావు గారు | సత్తెనపల్లి | ౧-౦-౦ |
| ౩౩. ,, | సామినేని పానకాలు గారు | తమ్మర | ౧-౦-౦ |
| ౩౪. ,, | శాసనాల కొండయ్య గారు | ,, | ౧-౦-౦ |
| ౩౫. శ్రీమాన్ | నరహరి గోపదాసుడు గారు | ,, | ౧-౦-౦ |
| ౩౬. ,, | తురుమెళ్ల కృష్ణదాసుడు గారు | పెదపూడి | ౧-౦-౦ |
| ౩౭. ,, | వఝా బాలకృష్ణయ్య గారు | గుంటూరు | ౧-౦-౦ |
| ౩౮. ,, | గోగులపాటి వేంకట హనుమయ్య గారు | గోగులపాడు | ౧-౦-౦ |
| ౩౯. ,, | చల్లాపల్లి సేతురామయ్య గారు | లేమల్లెపాడు | ౧-౦-౦ |
| ౪౦. ,, | నాళ్ల జోగయ్య గారు | ,, | ౧-౦-౦ |
| ౪౧. ,, | చెడలవాడ సీతారామాంజనేయులు గారు | కూచపూడి | ౧-౦-౦ |
| ౪౨. మ.రా.శ్రీ | లోకసాని నరసింహారెడ్డి గారు | ముప్పాళ్ళ | ౧-౦-౦ |
| ౪౩. ,, | ఆవుల సత్యనారాయణ గారు | మాచవరము | ౧-౦-౦ |
| ౪౪. ,, | వెలగా నాగేంద్రయ్య గారు | ,, | ౧-౦-౦ |
| ౪౫. ,, | బండ్లమూడి పిచ్చయ్య గారు | ,, | ౧-౦-౦ |
| ౪౬. ,, | రామచంద్రుని కొండయ్య గారు | | ౧-౦-౦ |
| ౪౭. ,, | మిరియాల నారాయణ గారు | మధిర | ౧-౦-౦ |
| ౪౮. ,, | పరస లక్ష్మీనరసింహారావు గారు | ,, | ౧-౦-౦ |
| ౪౯. ,, | కొప్పినగుంట్ల సత్యనారాయణ గారు | ,, | ౧-౦-౦ |
| ౫౦. తి.స | కంభంపాటి లక్ష్మీనరసమ్మ గారు | సత్తెనపల్లి | ౫౦-౦-౦ |
| ౫౧. శ్రీమతి | ఈదర వేంకట సుబ్బమ్మాదేవి గారు | ఏలూరు | ౫-౦-౦ |
| ౫౨. తి.స | రాచమల్లు సుబ్బమ్మ గారు | సత్తెనపల్లె | ౫-౦-౦ |
| ౫౩. ,, | శిఖాకొలను సీతాదాసి గారు | ,, | ౫-౦-౦ |
| ౫౪. ,, | కూచపూడి చుక్కమ్మ గారు | బ్రాహ్మణ కోడూరు | ౨-౦-౦ |
| ౫౫. ,, | కూనంనేని రాఘవమ్మ గారు | ,, | ౨-౦-౦ |
| ౫౬. ,, | మాధవపెద్ది వేంకట సుబ్బమ్మ గారు | ,, | ౨-౦-౦ |
| ౫౭. ,, | మండవ మహాలక్ష్మమ్మ గారు | ,, | ౧-౦-౦ |
| ౫౮. ,, | నోరి హనుమాయమ్మ గారు | ,, | ౧-౦-౦ |
| ౫౯. ,, | దెందుకూరి లక్ష్మమ్మ గారు | ,, | ౧-౦-౦ |

| | | | | |
|---|---|---|---|---|
| ౬౦. | తి. స | పాలడుగు పిచ్చెమ్మగారు | గుడివాడ | ౨-౦-౦ |
| ౬౧. | ,, | పరుచూరు రోశమ్మగారు | వేములపాడు | ౨-౦-౦ |
| ౬౨. | ,, | పోలూరు హనుమాయమ్మగారు | అప్పికట్ల | ౨-౦-౦ |
| ౬౩. | ,, | వడ్లమూడి అరుంధతమ్మగారు | బెజవాడ | ౧-౦-౦ |
| ౬౪. | శ్రీమతి | పింగళి వేంకట లక్ష్మమ్మగారు | ,, | ౧-౦-౦ |
| ౬౫. | తి. స | గానుగపాటి సూర్యారామమ్మగారు | కోలవెన్ను | ౧-౦-౦ |
| ౬౬. | శ్రీమతి | అన్నసముద్రము సీతాదాసిగారు | కొత్తూరు నైజాము | ౧-౦-౦ |
| ౬౭. | ,, | ఆవుల అన్నపూర్ణమ్మగారు | మానవరము | ౧-౦-౦ |
| ౬౮. | తి. స | మోదుకూరు అంబమ్మగారు | అలపాడు | ౧-౦-౦ |
| ౬౯. | శ్రీమతి | ఘూరకవి కృష్ణవేణమ్మగారు | ఏలూరు | ౧-౦-౦ |
| ౭౦. | ,, | తురుమెళ్ల శేషమ్మగారు | మచిలీపట్నం | ౧-౦-౦ |
| ౭౧. | తి. స | గోగులపాటి వేంకట నరసమ్మగారు | గోగులపాడు | ౧-౦-౦ |
| ౭౨. | ,, | కొల్లిమర్ల రాఘవమ్మగారు | బాపట్ల | ౧-౦-౦ |
| ౭౩. | ,, | మాడా నారాయణమ్మగారు | సత్తెనపల్లి | ౧-౦-౦ |
| ౭౪. | ,, | ఎక్కల లక్ష్మీకాంతముగారు | ,, | ౧-౦-౦ |
| ౭౫. | శ్రీ | పండిటి చెంగల్రాయుడుగారి ధర్మపత్ని | బాపట్ల | ౧-౦-౦ |
| ౭౬. | తి. స | విన్నకోట వరలక్ష్మమ్మగారు | అమృతలూరు | ౧-౦-౦ |
| ౭౭. | శ్రీమతి | అట్లూరు లక్ష్మీదేవమ్మగారు | వానపాముల | ౧-౦-౦ |
| ౭౮. | తి. స | కొడాలి పున్నమ్మగారు | ,, | ౧-౦-౦ |
| ౭౯. | ,, | ఎలమద్ది లక్ష్మమ్మగారు | తెన్మెర | ౧-౦-౦ |
| ౮౦. | ,, | సిల్లు సుభద్రిగారు | ,, | ౧-౦-౦ |
| ౮౧. | ,, | గడ్డమణుగు అన్నపూర్ణమ్మగారు | మధిర | ౧-౦-౦ |
| ౮౨. | ,, | చిత్తిజల్లు వేంకటరత్నముగారు | ,, | ౧-౦-౦ |
| ౮౩. | శ్రీమతి | తురుమెళ్ళ రామపుణ్యవతమ్మగారు | ,, | ౧-౦-౦ |
| ౮౪. | తి. స | దొప్పలపూడి సీతమ్మగారు | శ్రీరంగపురము | ౧-౦-౦ |
| ౮౫. | ,, | సబ్రాజు వేంకాయమ్మగారు | బండారుపల్లి | ౧-౦-౦ |
| ౮౬. | ,, | చింతపాముల శేషమ్మగారు | ,, | ౧-౦-౦ |
| ౮౭. | ,, | ముప్పాళ్ల సుబ్బమ్మగారు | ,, | ౧-౦-౦ |
| ౮౮. | ,, | ఆవులపాటి చెంచమ్మగారు | ,, | ౧-౦-౦ |
| ౮౯. | ,, | అమ్మినేని రోశమ్మగారు | | ౧-౦-౦ |
| ౯౦. | ,, | ఎల్లాప్రెగడ సుబ్బమ్మగారు | | ౧-౦-౦ |
| ౯౧. | ,, | ధూళిపాళ్ళ శేషమ్మగారు | | ౧-౦-౦ |
| ౯౨. | ,, | అడిదం వెంకాయమ్మగారు | | ౧-౦-౦ |
| ౯౩. | ,, | బద్వేటి వేంకమ్మగారు | కొనకొండ | ౧-౦-౦ |
| | | | గుప్తదానము | ౧౧౯-౦-౦ |
| | | | | ౫౬౦-౦-౦ |

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణ

## విషయసూచిక



## అరణ్యకాండము

| సర్గసంఖ్య | అరణ్యకాండము | పుట సంఖ్య |
|---|---|---|
| | శ్రీరాముఁడు లక్ష్మణునకు సమాధానముఁ జెప్పుట | ౩౮౯ |
| | శ్రీరాముఁడు లక్ష్మణునితో మారీచు మాయయేని మాయామృగం బవశ్యవధ్యం బని చెప్పుట | ౩౯౨ |
| ౪౪. | శ్రీరాముఁడు మాయామృగము వెంటఁ బోవుట | ౩౯౭ |
| | శ్రీరాముని బాణముచే మారీచుఁడు 'హా లక్ష్మణా' యని యఱచి చచ్చుట | ౪౦౦ |
| ౪౫. | సీత లక్ష్మణుని రావణునకు సహాయుండుగఁ బొమ్మనుట | ౪౦౫ |
| | సీత లక్ష్మణునిఁ గోపించి పలుకుట | ౪౦౬ |
| | లక్ష్మణుఁడు సీతకు సమాధానముఁ జెప్పుట | ౪౦౮ |
| | సీత లక్ష్మణుని నిష్ఠురంబులు పలుకుట | ౪౧౦ |
| | లక్ష్మణుఁడు సీతపైఁ గోపించి రాము నొద్దకుఁ బోవుట | ౪౧౩ |
| ౪౬. | రావణుఁడు యతివేషము ధరించుట | ౪౧౮ |
| | సన్న్యాసివేషాదులగుఱించి | ౪౧౯ |
| | రావణుఁడు యతివేషంబున సీతయొద్దకు వచ్చుట | ౪౨౩ |
| | సీత యతివేషంబున నున్న రావణు సత్కరించుట | ౪౨౯ |
| ౪౭. | సీత మాయాయతికిఁ దన వృత్తాంతముఁ జెప్పుట | ౪౩౪ |
| | రావణుఁడు సీతకుఁ దన వృత్తాంతంబు జెప్పి యామెను దురుక్తు లాడుట | ౪౪౧ |
| | సీత రావణు నిష్ఠురంబులు పలుకుట | ౪౪౩ |
| ౪౮. | సీతకు రావణుఁడు తన స్వరూపముఁ జూపి భయోక్తు లాడుట | ౪౫౧ |
| | సీత రావణు నిందించుట | ౪౫౮ |
| ౪౯. | రావణుఁడు సీతను బలాత్కారముగ నెత్తికొని పోవుట | ౪౬౧ |
| | సీత రామలక్ష్మణులఁ బేర్కొని యేడ్చుట | ౪౬౮ |
| | సీత జటాయువుం జూచి పలవించుట | ౪౭౨ |
| ౫౦. | జటాయువు రావణుని దూషించుట | ౪౭౪ |
| ౫౧. | జటాయు రావణుల యుద్ధము | ౪౮౨ |
| | రావణుని జటాయువు పరుషోక్తు లాడుట | ౪౮౬ |
| | రావణుఁడు జటాయువు ఱెక్కలు నఱకుట | ౪౯౦ |
| ౫౨. | సీత రామలక్ష్మణులఁ గూర్చి యాక్రోశించుట | ౪౯౧ |
| | రావణుఁడు సీత నెత్తుకొని పరువెత్తుట | ౪౯౫ |
| ౫౩. | సీత రావణు నిందించుట | ౫౦౨ |
| ౫౪. | సీత తన యాభరణంబులు కపులముందట వైచుట | ౫౦౭ |
| | రావణుఁడు సీతతో లంకఁ జొచ్చుట | ౫౦౯ |
| | రావణుఁడు జనస్థానమునకుఁ గాపు పంచుట | ౫౧౧ |
| ౫౫. | రావణుఁడు సీతకుఁ దన సౌధంబుఁ జూపుట | ౫౧౩ |
| ౫౬. | సీత రావణునిఁ బరుషోక్తు లాడుట | ౫౨౨ |
| | రావణుఁడు సీతమీఁద రాక్షస స్త్రీల కావలి యుంచుట | ౫౩౦ |

| సర్గసంఖ్య | ఆరణ్యకాండము | పుట సంఖ్య |
|---|---|---|

## ఆరణ్యాకాండము

శ్రీరామసేవ



శ్రీః.

శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణేనమః

శ్రీమతే రామానుజాయనమః

శ్రీ శారదాయైనమః

శ్రీ హయగ్రీవ ప్రసన్న

# శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము

సవ్యాఖ్యానము.

## అరణ్యకాండము





శ్రీనారాయణ ! కరుణా
ధీనా ! దీనార్తిహరణ ధీమజ్జనర
క్షానిరతమా ! యపవర్గవి
ధానక్షమ ! యొంటిమిట్ట దశరథరామా!

## మందరము

వ్యాఖ్యానారంభము.

శ్రీరామచంద్ర ప్రభో పాహి పాహి!

సీ. తనపాదభక్తుల తనయునిగాఁ జేసెఁ, జేట్లూరి నరసింహ శిష్యుఁ జేసె
దయ దీనిఁ దా నంకితంబుగా గ్రహియించె, జగములఁ దనకీర్తి నెగడఁ జేసె
మందరభారంబు మహిమతో వహియించె, జనితవిషంబును సమయఁ జేసె
వాసుదాసుని దాను వాసుకిగాఁ జేసెఁ బ్రజలందుఁ దనభక్తిఁ బ్రబలఁ జేసెఁ

గీ. దనదు నీ గ్రంథమునకును దానె వ్యాఖ్య
గరిమ వ్రాయించుకొనె వనకాండమునకు
వాసుదాసునిచే దర్భ బ్రహ్మశరము
చేసి యప్రతిహతముగఁ జేసినట్లు॥

తే. గీ. ఆలసించుట నొండె మాంద్యమున నొండె
నించుక యుపేక్షచేసితినేని లెమ్మ
టంచుఁ బేర్వెట్టి లేపెడి యవనితనయ
రామచంద్రుఁడు గలుగ నా కేమిభయము ?

శ్రీనారాయణ=లక్ష్మీవిశిష్టుఁడవైన నారాయణా ! ఇచ్చట నీ నారాయణ శబ్దము ద్వయములోనిది- కేవలనారాయణుఁడైనచో హితబుద్ధిచేనైనను దనయాజ్ఞ నుల్లంఘించి యపరాధులైనవారిని "న క్షమామి" నేను క్షమింపను. "క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు" శాశ్వతముగా నసురయోనులందే పడవేసెదను. అని తండ్రియందువలె శిక్షకత్వమే యుండును. ఆయన యామాట లనఁగానే "దేవ్యా కారుణ్యరూపయా" యన్నట్లు మూర్తీభవించిన దయ యగు శ్రీదేవి ప్రక్కనే యుండి చేతిని బట్టుకొని 'యేమి నాథా ! మీరిట్టులనెదరు. హేయగుణరహితులరు- కల్యాణగుణసహితులరు నగు మీ వాక్కున నిట్టి కఠినోక్తులు రావచ్చునా ? తప్పుచేసినవారి నెల్ల దండింపఁ బూనిన లోకమునఁ దప్పుచేయని వారెవ్వరు ? అందఱిని శిక్షింపఁబూనిన మీరు రక్షించునది యెవరిని ? ఎవనియం దేమి మేలి గుణమున్నదో అది యాధారము చేసికొని వానిని రక్షింతునా యని మీరు సద్గుణములను వెదకవలయునుగాని యెవఁడేమి తప్పు చేసెనో యని వెదకి యా మాత్రమున వాని దండింపఁ బూనరాదు- దండము తమోగుణ భూయిష్ఠునకుఁదగును గాని శుద్ధసత్త్వగుణైకనిష్ఠ గలిగి జగద్రక్షాకార్యమే కృత్యముగా నుంచుకొనిన మీకుఁ దగినదికాదు. ఇంతకు నీ యపరాధము చేసినవా రెవ్వరు ? నీ బిడ్డలుగారా? మీ యంశసంభూతులుగారా? 'అహం స్మరామి-అహం సర్వ భూతేభ్యో దదామి-అహం సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి' యనిన మీ వాక్యములను స్మరించి రక్షింపు"మని సౌమ్యునిఁజేయును.

కరుణాధీనా=అన్ని గుణము లాయనకు వశములై యాయన సంకల్పము ప్రకారము వర్తించును- కరుణకు మాత్రమే యాయన వశపడి యది యాడించినట్లు లాడుచుండును-కావున నాయన కరుణ కధీనుండయ్యెను. "ఏవం సంసృతి చక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః, జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కాప్యుపజాయతే" ఈ విధముగ సంసార చక్రమందుఁ దగులుకొని తన కర్మములచే దిమ్మతిరుగుచు దుఃఖముచేఁ గలవరపడుచున్న జీవులను జూచి విష్ణువునకుఁ గృపకలుగును. ఈ విధముగ జగత్సృష్టికి, రక్షకు, సంహారమునకుఁ గరుణయే కారణము- అంతియకాదు- అటులు

కరుణకు వశుఁడైనవాఁడేమి చేయు ననిన:—దీనార్తిహరణ=కష్టదశయందుండువాని బాధను హరించువాఁడా? ఇతరుల దుఃఖమును బోఁగొట్టుట దయచేతనే కదా, బాధ వచ్చిన పిమ్మట దీను లేడ్చిన నపుడు రక్షించునే గాని నిజముగా దయగలవాఁడైనచో బాధరాకయుండఁజేయుట యుత్తమపక్షము గదా. అట్లులుచేయును. ధీమజ్జన రక్షా నియమా=బుద్ధిమంతుల రక్షించు నియమము గలవాఁడా· తన కనుకూలముగ వర్తించువారికి నాపదరాకుండఁ గాపాడును. తక్కినవారు మొఱపెట్టినపుడు కాపాడును. ఆయన యేమి మేలుచేయును-ఎట్లు కాపాడునందురా! అపవర్గ విధానక్షమ=మోక్ష మిచ్చుటయందు శక్తిగలవాఁడా! మరల జనన మరణములకు వచ్చి సంసారములో పడి పరితపింపకుండునట్లు మోక్షమిచ్చును. ఇంతటిమేలు చేయువాఁడు మఱి యెవ్వఁడు లేఁడుగదా. ఇంతకంటె మేలు లేదుగదా. నేనాయన నాశ్రయించినఁగదా మోక్షమిచ్చును- ఎక్కడనో మనకు గోచరుఁడుగాక వైకుంఠములోను బాల సముద్రములో నుండువానిని నేనెట్లు లాశ్రయింపఁగలను? ప్రజలయం దనురాగము కల వాఁడైనచో వారికి సులభసాధ్యుఁడుగా నుండవలయునుగాని యెక్కడనో గహన ప్రదేశమునఁ గానరాకయుండి మీ రిక్కడికి రండనిన నెవరుపోఁగలరు? దయగల వాని లక్షణ మిదియా యనరాదు. ఒంటిమిట్ట దశరథరామా=భక్తులకు సులభుఁడై కనులకు గోచరించుచు నొంటిమిట్టయందు దశరథరాముఁడై సాక్షాత్కరించియు న్నాఁడు. ఇంతకంటెను సౌలభ్య మెందుఁ గలదు. దశరథరామా=దశరథుని కుమారుఁడవైన రామా యను మధ్యమపదలోపిసమాసముగ నైనఁ జెప్పవచ్చును. దశరథునియొక్క రాముఁడని శేషషష్ఠియైనఁ జెప్పవచ్చును. ఇచట శేషషష్ఠి పితృపుత్ర భావరూపసంబంధార్థకము. లేక దశరథునకు రామా ఆనందకరుఁడా యని యైనఁ జెప్పవచ్చును. రథశబ్దమునకు దేహ మనియు నర్థముకలదు. 'రథః పౌరుష దేహయోః' త్రికాండశేషము. "ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ" భ. గీ. 'రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" ఇత్యాది ప్రయోగములవలన రథమనఁగా దేహము. మత్స్యకూర్మాది దశవిధ దేహములుగల రామా యని యర్థము. దశరథ=పక్షి వాహనుఁడా. ఈ యర్థము బాలకాండమందు వ్రాయఁబడెను. కావున గరుడవాహనుఁడవైన రామాయని యర్థము. కావున నొంటిమిట్టయందు వేంచేసి యుండు రాముఁడే గరుడవాహనుఁ డనియు, దశరూపధారి యనియు శ్రీమన్నారాయణుఁ డనియు గ్రాహ్యము. ఇట్టి యో శ్రీరామచంద్రమూర్తీ! నీ వరణ్యమునఁ జేసినచర్య వినిపించెదను వినుము.

కరుణాధీనా యనునది నాశ్రితరక్షణార్థము పితృవాక్యము నెపముగాఁగొని యరణ్యమునకు వచ్చుట తెలుపును. "పనిగొని యాత్మకార్యముగఁ బాపులనెల్ల నడంచు మీకు శోభనమొనగూర్ప మజ్జనకువాక్యము సాకుగ నేను వచ్చితి." (ప· ౮౮) అను రామచంద్రు వాక్యమే యీ యర్థమును దెలుపుచున్నది. "శక్తోపి

రాఘవస్తస్మై, రాజ్యం సంత్యజ్య ధర్మతః । దశగ్రీవవధార్థాయ పితుర్వచన హేతునా".
అను పాద్మవాక్యము దీనిని బలపఱుచుచున్నది.

దీనార్తిహరణ=ఇది "రమ్మవిగో రాఘవ కనుఁగొమ్ము వనంబునను నసురకోట్లచే నా। శమ్మునుగన్న మునీంద్రచయమ్ముల దేహము లెమ్ము"లను దానిని సూచించుచున్నది. ప. ౧౫. ధీమజ్జనరక్షానియమా = ఇది రామచంద్రమూర్తి శరభంగాశ్రమవాసులయెడఁజేసిన ప్రతిజ్ఞయు ఆ విషయమున సీతాదేవి చెప్పిన కొన్నివాక్యములకు రామచంద్రమూర్తి ప్రత్యుత్తర మిచ్చుటయు సూచించును. అపవర్గ... క్షమ=ఇది జటాయువునకు మోక్ష మిచ్చిన విషయముఁదెలుపును.

—♦ శ్రీరాముఁడు దండకారణ్యముఁ జొచ్చుట. ♦—

ఉ. ధీరుఁడు రామభూవరుఁడు♦తీవ్రపరాక్రమశాలి చొచ్చి దు
ష్ప్రాకరమహావనిన్, బహుళ♦ఘోరమృగావిలదండకాటవిన్,
హారివిహారి తాపసజ♦నాశ్రమమండల మందుఁ గాంచె నా
నారమణీయభూమిరుహ♦నవ్యము భవ్యము భూతసేవ్యమున్. ౨

అవతారిక:—పూర్వకాండమున జగజ్జన్మాదికారణుండును, వేదాంతవేద్యుండును పరబ్రహ్మమగు శ్రీరామచంద్రమూర్తికి నవిద్యాదోషగంధశూన్యతయు, ఆనందపరిపూర్తియు, సర్వాంతర్యామిత్వము, అత్యుత్తమ ధర్మప్రవర్తకత్వము నను నిటువంటి యనేకగుణములు చెప్పఁబడెను. ఈ కాండమున సజ్జనరక్షణమనెడి ధర్మము చెప్పఁబడును. పరిత్రాణాయ సాధూనామ్మను నవతార ప్రథమ ప్రయోజన మిందుఁ జెప్పఁబడును. సజ్జన సంరక్షణ మీ కాండమందలి సారాంశమగుట నది మొదటిపద్యముననే చెప్పఁబడెను.

అయోధ్యకాండమందు సామాన్యలౌకిక ధర్మములు - పుత్రధర్మము - రాజధర్మము-భ్రాతృధర్మము-మిత్రధర్మము - సత్యధర్మనిష్ఠలోనైనవి చెప్పఁబడెను. ఇందు విశేషధర్మములు చెప్పఁబడును.

శ్రీమద్రామాయణమందు శ్రీ సీతారామలక్ష్మణులు ముఖ్యులు. తక్కినవారు సందర్భానుసారముగ వచ్చినవారు. ఈ ముగ్వుర సంబంధము చిదచిదీశ్వరుల సంబంధమును దెలుపుచున్నది. ప్రకృతి కధిష్ఠానదేవత లక్ష్మి-సీత. ఈమె చైతన్యస్వరూపిణి-ప్రకృతిబద్ధాత్మస్థానమున నీమె చెప్పఁబడెను. లక్ష్మణుఁడు ప్రకృతి సంసర్గములేని జీవుఁడు. కావుననే యీయన భార్యతోడి జంజాటము లేనివాఁడుగాఁ జెప్పబడెను. శ్రీరాముఁ డీశ్వరుఁడు. ప్రకృతిబద్ధజీవుఁడు, శుద్ధజీవుఁడిరువురు నీశ్వరునాశ్రయించి యాయనకు శేషభూతులై యుండువారే. ఈతత్త్వము తెలిసినవాఁడు ముక్తుఁ డగునని భగవద్గీతయందుఁ బదునైదవయధ్యాయమునఁ జెప్పఁబడెను.

ద్వావిమౌపురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ
క్షరః సర్వాణి భూతాని, కూటస్థోక్షరఉచ్యతే.

ఉత్తమః పురుష స్త్వన్యః, పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః
తస్మాత్ క్షరమతీతోఽహ మక్షరాదపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదేచ, ప్రథితః పురుషోత్తమః
యో మామేవ మసంమూఢో జానాతి పురుషోత్తమమ్
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత·
ఇతి గుహ్యతమం శాస్త్ర మిదముక్తం మయానఘ
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్, కృతకృత్యశ్చ భారత॥

అర్థము.

క్షరుఁ డక్షరుఁడని యిరువురు పురుషులు లోకమునఁ బ్రసిద్ధులు. అందు క్షరుఁ డనువాఁడు అచిత్తు (ప్రకృతి) సాంగత్యము నొందిన బద్ధజీవుఁడు. ఈ యచిత్తుసంసర్గము లేని జీవుఁడు, ముక్తుఁడు, నిత్యుఁడు, రెండవవాఁడు- ఈ యిరువురకంటె నుత్తమపురుషుఁడు మఱియొకఁడు గలఁడు-ఆత డవ్యయుఁడు-ఆయనయే ప్రకృతిని, బ్రకృతి బద్ధజీవునిఁ బ్రకృతి ముక్తజీవుని భరించువాఁడు.

నేను మీఁదఁజెప్పిన క్షరాక్షరముల రెంటికంటె నుత్తముఁడను గావున లోకములందు వేదములందు నేను బురుషోత్తముఁడని ప్రసిద్ధిచెందితిని.

ఎవఁడంతయు నొకటియే యని ప్రమాదపడక నన్నిట్టివానిఁగాఁ దెలిసికొనుచున్నాఁడో వాఁడు సర్వము తెలిసినవాఁడై నన్నన్నివిధముల భజించును.

ఇది మిక్కిలి రహస్యమైన శాస్త్రము - నీకుఁజెప్పితిని - దీనిఁదెలిసికొనిన బుద్ధిమంతుఁడు కృతకృత్యుఁడు.

శ్రీమద్రామాయణ మీ మువ్వురసంబంధమునే యాదినుండి యంత్యమువఱకు బోధించుచున్నది· ఈ విషయము మనస్సునం దుంచుకొనక రామాయణము చదువువాఁడు ఆఖ్యాయిక చదువువాఁడే· ఇందు సీతాలక్ష్మణులకు శ్రీరామచంద్రమూర్తి యందుఁగల ప్రేమ భక్తులు, బాలకాండమున సామాన్యముగ సూక్ష్మముగ వర్ణింపఁబడెను.

(చూ. ప. బాల. ౫౨౩-౫౩౨-౫౩౪-౧౩౬౫-౧౩౬౬ ౧౩౬౭-౧౩౬౮)
ఆవల నయోధ్యాకాండమందుఁ దమసర్వసౌఖ్యములు వదలుకొని శ్రీరామచంద్రమూర్తి వెంటఁబోవుటయేగాక నీ కైంకర్యములేక నేనుండజాలనని లక్ష్మణుఁడు, నిన్ను విడనాడి నేనుండజాలనని సీత చెప్పుటచే ఆప్రేమభక్తులు విశేషించి చెప్పఁబడెను.

(చూ. అయో. ౭౯౦-౭౯౧-౮౨౮-౮౩౧-౮౪౭-౮౭౩-౮౮౬-౮౮౭-౧౪౨౬.)

ఆరణ్యకాండమందుఁ గబంధుఁడు రామలక్ష్మణులఁ బట్టుకొన్నప్పుడు నన్ను వీనికిఁ దిననిచ్చి, వాఁడు నన్నుఁ దినులోపల నీవు తప్పించుకొని పాఱిపొమ్మని రామ ప్రాణరక్షణార్థము తన ప్రాణముల లక్ష్మణుఁ డియ్యఁబూనుటయు (౧౯౯-౧ ప.) సీతాదేవి తానొంటిగ నుండియు స్త్రీయయ్యు భయములేక కామములేక రాముని భూషించి రావణుని దూషించుటయు (ప. ౮౦౧) వారి భక్తిప్రేమలు విశేషముగఁ దెలుపుచున్నవి.

ధీరుఁడు=ధైర్యశాలి-ఘాతుకమృగములతోనిండి రాక్షసభూయిష్ఠమైన ఘోరారణ్యముఁ బ్రవేశించుచున్నను భయపడనివాఁడు. ఆపదలందును మనసు చలింపని గుణము ధైర్యము - ఈ ధైర్యమునకుఁ గారణమేమనిన.— భూవరుఁడగుటయే= రాజగుటయే- రాజులకు ధైర్యము ప్రథమగుణము- ఉత్తరకుమారునివంటి పిఱికిపందలు లేరా యందు రేమో-తీవ్ర పరాక్రమశాలియగుటయే - తీవ్ర= తీక్ష్ణమైన - పరాక్రమశాలి=ఎట్టివిరోధులనైన నాక్రమించు తీక్ష్ణమైన శౌర్యాదులచేఁ బ్రకాశించువాఁడు- దుష్ప్రాక్రమహాటవిక్=ఇలువంటి వానికిని మిక్కిలి క్రూరమని తోఁచునట్టి పెద్ద యడవిని-క్రూరమగు నడవి యనఁగాఁ గ్రూరమృగములచేతను గ్రూరరాక్షసులచేతను నిండిన దనిభావము - బహుళఘోరమృగావిల=మిగుల భయంకరమైన యడవిమృగములచేఁగలఁత నొందినది యగు,దండకాటవిక్=దండకయను పేరుగల యడవియందు- సప్తమ్యర్థమున ద్వితీయ-హారి విహారి = మనోహరమగు సంచారముగలవాఁడు - ఇంత ఘోరారణ్యమందుఁ దిరుగుచున్నను నది యాయన కుద్యానవన మందు సంచరించుట వలె మనోహరమైయుండెనేకాని వికటముగ నుండలేదు- చొచ్చి=ప్రవేశించి- అందు= ఆ యరణ్యమందు. తాపసజనాశ్రమమండలము=తపస్సుచేసికొను వారి యాశ్రమప్రదేశము-కాంచెక్=చూచెను- అది యెట్లులున్నదనిన-నానా=పలువిధములైన-రమణీయ= అందమైన, భూమిరుహ=చెట్లచే- నవ్యము= సుందరమైనది- భవ్యము=శుభకరమైనది- భూతసేవ్యమ్ = సమస్తభూతములచేతను సేవింపఁబడ యోగ్యమైనది - ఇట్లనుటచే సహజవిరోధములుగల జంతువులును దమవైరము మానుకొని స్నేహభావముచేఁగలసి మెలసి తిరుగుచున్నవని భావము- (౨)మృగములందు మైత్రిగానవచ్చునుగాని యంత కంటెఁ గ్రూరులగు రాక్షసు లున్నవారుగదా యనిన వారును ఆశ్రమము పొలిమేర లోఁగా రాఁజాలరు- అది విడిచి యావలఁబోయిననే బాధింతురు- కావున రాక్షసులకు భయపడువారు కూడ నిర్భయముగా నందు వసింపవచ్చునని భావము-అటుగాక యాశ్రమములోనికి వారు రాఁగలిగియుండిన ఋషి-ముని-యని పేరులే లేకపోయి యుండవలెను- మండలము=ఆశ్రమముల సమూహము- 'చక్రవాళంతు మండల'మ్మని నిఘంటువు- దండక=దండుఁడను రాజు శుక్రాచార్యుని కూఁతును బలాత్కారముగఁ జెఱిచిన కారణముచే జనస్థానమందుఁ దప్ప నతని రాష్ట్రముపై మట్టివాన గురియునట్లు

శుక్రుఁడు శపించెను- అట్లు పాడుపడినభూమి యతనిపేర దండకారణ్య మయ్యెను- ఈ విషయ ముత్తరరామాయణమునఁ జెప్పఁబడెను. చూ. ప. ౧౩౪౯.

తా త్ప ర్య ము.

తీవ్రపరాక్రమముగలవాఁడును ధీరుఁడు నగు శ్రీరామచంద్రమూర్తి మిక్కిలి భయంకరములయిన మొకములచేఁ గలఁత నొందియు మిగులఁ గ్రూరమగు దండ కాటవిలోఁ బ్రవేశించి యందు నానావిధములైన సుందరములగు వృక్షములచే నంద మై శుభమై భూతసేవ్యమైన మునీంద్రుల యాశ్రమ సమూహమును జూచెను.

కం. చీరకుశ వ్యాప్తం బై, సారాగమకాంతిపూర♦సంపద మింటన్
భూరిద్యుతిదుర్దర్శం, బౌ రవిమండలము భాతి ♦నమరెడుదానిన్. 3

చీరకుశవ్యాప్తంబై=ఉదికి యారవేసిన నారచీరలచేతను యజ్ఞమునకై తెచ్చిన దర్భలచేతను వ్యాపించినదై-సారాగమ = సారవంతములైన వేదాధ్యయనముచేఁ గలిగిన, కాంతి=బ్రహ్మవర్చస్సుయొక్క-పూర=ప్రవాహముయొక్క, సంపదన్ = అతిశయముచే; భూరిద్యుతి = అధికమైనకాంతిచే; దుర్దర్శంబు = చూడరానిది-రవిమండలము భాతి=సూర్యమండలమువలె-అమరెడుదానిన్ = ఒప్పుచున్నదానిని - ఋషులసమూహమునకు సూర్యమండలమునకు బ్రహ్మతేజస్సునకు సూర్యరశ్మికి నుపమానోపమేయములు - ఇరువురతేజస్సునకు వేదోక్తతపస్సే కారణము.

భూరిద్యుతి దుర్దర్శంబౌ రవిమండల మనుటచే నిది గ్రీష్మర్తు వని యేర్పడుచున్నది-కావున నిది కార్తికమాస మను తిలకవ్యాఖ్యానము సందేహింపఁదగినదే-చెప్పవలసిన దానిని బ్రత్యక్షముగాఁ జెప్పక మఱియొకవిధముగాఁ జెప్పుట వాల్మీకి శైలియై యున్నది-లంకలో హనుమంతుఁ డున్నప్పుడు సూర్యోదయము మఱికొన్నిచోటుల నిట్లే చెప్పియున్నాఁడు.

సూర్యుఁడు దర్శింపరాకుండుట మధ్యాహ్నమందేకదా - ఉదయాస్తమయముల సూర్యునకు మందేహాదిరాక్షసబాధ గలదు. కాని మధ్యాహ్న సూర్యునకు వారిబాధ యెట్లులేదో యట్లే యాశ్రమవాసులకు రాక్షసబాధ లేదని భావము.

అడవి కావున సారాగమ = సారవంతములైన చెట్లయొక్క యని యర్థము చెప్పవచ్చునుగాని యుపమానోపమేయములకుఁ బోలిక లేకపోవును.

తా త్ప ర్య ము.

నారచీరలచేతను దర్భలచేతను వ్యాపించినదై సారవంతములైన వేదాధ్యయనములచేఁ గలిగిన బ్రహ్మవర్చస్సంపదచే నొప్పి మిగులగాంతిచే దుర్దర్శమగు సూర్యమండలమువలె నొప్పుచున్నదానిని.

సీ. నానామృగాకీర్ణ ♦ మై నవ్యవిష్కిర, కాంతమై యప్సరః♦కంజముఖుల
యాటల బాటల ♦ నర్చావిధంబుల, హర్షదం బై విశా♦లాగ్నిశరణ

ములచేత స్రుగ్భాండ♦ములచేతఁ గృష్ణాజి,నములచే దర్భసం ♦ తతులచేత
నొప్పారి సమిధల ♦ నుదకకుంభంబుల, ఫలమూలతతుల రా♦జిలుచు స్వాదు
తే. ఫలసమావృతవన్యస♦ల్లలితభూరి,ధారణీరుహవారసం♦భార మగుచు
హోమబలిసత్కృతం బయి♦యుదితవేద, నాదమయి నీరజోజ్జ్వలనళిని యగుచు.

నానామృగాకీర్ణమై = భూతసేవ్యమనునది వివరింపఁబడుచున్నది- నానా=అనేకములగు-మృగ=జంతువులచే; ఆకీర్ణము=వ్యాపించినది-నవ్య=క్రొత్తక్రొత్తలగు- విష్కిర=పక్షులచే - కాంతము = మనోహరమైనది-అప్సరః కంజముఖుల=అప్సరసలనెడి స్త్రీల యొక్క- ఆటలన్=క్రీడలచేతను , పాటలన్ = గానములచేతను - అర్చావిధులన్ = పూజలచేతను- హర్షదము = సంతోషము నిచ్చునది - ఒక ఋషిగాకున్న మఱియొక ఋషి యతఁడు గాకుండిన వేఱొకఋషి విడువక యజ్ఞముచేయుటచే దానికై యాహ్వానింపఁబడి వచ్చిన దేవతలవెంట దేవతాస్త్రీలు వచ్చి యాటలచేతను బాటలచేతను వారికి సంతోషము కలిగించుచుండిరని భావము - విశాల=వెడలుపైన; అగ్నిశరణములచేత=అగ్నిగృహములచే - అగ్నులు సర్వదా కాపాడఁ బడవలసినవి కావున వానికై వేఱుగదు లేర్పాటుచేసియుంచఁబడును- స్రుగ్భాండములచేతన్- స్రుక్కులు = హోమసమయముల నేతిని నగ్నిలో హోమముచేయుటకై యుపయోగించు కొయ్యమిళ్లులు-భాండము = పాత్ర=స్రువము = "పాత్రం స్రువాదికమ్" అని యమరుఁడు - ధ్రువ-ఉపభృత్తు-జుహూ; ఇవి స్రుక్కులందు భేదములు - కృష్ణాజినములచే = జింకచర్మములచే- దర్భసంతతులచే=దర్భసమూహములచే; సమిధలన్ = కొయ్యపుల్లలచే.

పలాశము=మోదుగు- ఖదిరము=చండ్ర, అశ్వత్థము=రావి- ఉదుంబరము = మేడి-అత్తి-వికంకతరు = పుల్లవెలగ-బిల్వ = మారేడు - శమి = జమ్మి-అర్కము=జిల్లేడు-వేతసము,=ప్రబ్బ-అపామార్గము = ఉత్తరేణి - దర్భ=దర్భలు - వీని పుల్లలు మాత్రమే హోమమునకుఁ బ్రశస్తములు-ఇందువెనుక వెనుకవానికంటె ముందుముందువి శ్రేష్ఠములు. ఇవి జుత్తిలి జిట్టెఁడు పొడు గుండవలయును. పై బొప్పతోడ నుండవలయును. వీనిలో పురుగులు రంధ్రములు పువ్వులుండరాదు-జీర్ణములైనవి తామునేల వ్రాలినవి పనికిరావు-వెలయిచ్చికొన్నవి శూద్రులు తెచ్చినవానితోను హోమముసేయువాఁడు పతితుఁ డగును. ఆజ్యధార నాలుగంగుళములపొడుగు మినుపగింజంత లా వుండవలయును. అన్నాహుతి పచ్చియుసిరిక కాయంత యుండవలెను- ఆవునెయ్యి శ్రేష్ఠము-అది యభావమైనచో మాహిషము- ఉదకకుంభంబులన్=నీటికడవలచే-రాజిలుచున్=ప్రకాశించుచు-స్వాదు = తియ్యనైన- మంచి రుచిగల - ఫల = పండ్లచే-సమావృత=ఆవరింపఁబడిన, వన్య = అడవియందుఁ బుట్టిన-సల్లలిత = మిగుల మనోహరమైన - భూరి=గొప్పవగు-ధారణీరుహ = చెట్లయొక్క - వార = సమూహముచే - సంభారము=నిండినది - హోమబలిసత్కృతంబు = వైశ్వదేవము మొదలగు హోమములచేతను - బలి=భూతబలి మొదలగు బలులచేతను, సత్కృతము=పూజింపఁ

బడినది - ఉదిత = పుట్టిన - వేదనాదము=వేదములధ్వని - అయి=కలిగి-నీరజ= కమలములచే-ఉజ్జ్వల=ప్రకాశించు - నళిని=సరస్సులు గలది.

తాత్పర్యము.

పలుతెగలగు మృగములచే వ్యాపించి పురములందెన్నఁడు కానరాని క్రొత్త క్రొత్తపక్షులచేఁ జూడఁగనులకుఁ బండువై యజ్ఞార్థమై వచ్చిన దేవతలవెంట వచ్చిన యప్సరస్త్రీల యాటలు- పాటలు - పూజలు మొదలగువానిచే సంతోషము గలిగించునదియై విశాలములైన యగ్నిహోత్ర గృహములచేతను - స్రుక్కులు - స్రువములు - దర్భలు - సమిధలు - జలకుంభములు-పండ్లు-కందమూలములుగలదై తియ్యనిపండ్లచే నిండిన యడవియందుఁబుట్టిన పెద్దచెట్లగుంపులచే నిండి హోమములు బలులు వీనిచే సత్కరింపఁబడినదై - వేదపాఠరవము గలిగి కమలములు గల కొలఁకులఁచే బ్రకాశించుచు,

కం. ఫలమూలాశనులును దాం,తులుఁ జీరాజినధరులును ♦ ద్యుమణికృశానూ
జ్జ్వల తేజు లగుపురాణము,నులు నిలువన్నీడ యయి మ♦నోహర మగుచున్. ౭

ఫలమూలాశనులును = పండ్లు - కందమూలములు ఆహారముగాఁగలవారును- దాంతులు=ఇంద్రియ నిగ్రహము గలవారు - చీరాజినధరులు = నారచీరలు - జింకచర్మములు ధరించినవారు - ద్యుమణి=సూర్యునివలె-కృశాను = అగ్నిహోత్రమువలె, ఉజ్జ్వల=ప్రకాశముగల - తేజులు=బ్రహ్మవర్చసుగలవారు నగు-పురాణమునులు=దీర్ఘకాలముగ వేలకొలఁది సంవత్సరములుగ తపోబలముచే జీవించియుండు మునులు - నిలువన్ = నిలుచుటకు - నీడయయి = ఉనికి పట్టయి - మనోహరము = మనస్సు నాకర్షించునది.

తాత్పర్యము.

ఫలములు కందమూలము లాహారముగా నింద్రియ నిగ్రహము గలిగి నారచీరలు జింకచర్మములు గట్టి బ్రహ్మవర్చస్సుచే సూర్యాగ్నులవలెఁ బ్రకాశించుచుండు పురాతనమునులు నిలువ నునికిపట్టయి మనస్సున కింపై,

కం. బ్రహ్మభవనతుల్యం బై, బ్రహ్మరవస్ఫీత మగుచు ♦ బ్రహ్మజ్ఞము లా
బ్రాహ్మణకదంబములచే, బ్రహ్మర్షులచేతఁ గడు శు♦భం బగు తలమున్. ౮

బ్రహ్మభవనతుల్యంబై = బ్రహ్మలోకముతో సమానమై - సన్న్యాసులుగానుండి తపస్వులుగానుండి మరణించినవారందఱు బ్రహ్మలోకమందుఁగదా చేరుదురు. అట్లే యిక్కడ నున్నారని భావము- బ్రహ్మరవస్ఫీతము = వేదముచే నతిశయించినది - బ్రహ్మజ్ఞములు = పరబ్రహ్మము నెఱిఁగినవారు - కడుశుభము = మిగుల మేలైనది - తలము = ప్రదేశము.

ప్రాజాపత్యం గృహస్థానం, బ్రాహ్మం సన్న్యాసినాం స్మృతమ్ ।
యోగినా మమృతం స్థానం, తద్విష్ణోః పరమంపదమ్।

ఏకాంతిన స్సదా బ్రహ్మధ్యాయినో యోగినో హి యే
తేషాం తత్పరమం స్థానం యద్వై పశ్యంతి సూరయః
గత్వా గత్వా నివర్తంతే చంద్రసూర్యాదయో గ్రహాః
అద్యాపి న నివర్తంతే ద్వాదశాక్షరచింతకాః॥ వి. పు. ౧-౭-౩-౭.

గృహస్థులకుఁ బ్రాజాపత్యలోకము, (భృగ్వాదిలోకము) సన్న్యాసులకు బ్రహ్మలోకము (ఇరువురు వ్యాఖ్యాత లిది సత్యలోక మనియే వ్రాసిరి. 'సన్న్యాసాత్ బ్రహ్మస్థానం' అని యనేక ప్రమాణములు గలవు.) ప్రతీకోపాసనచేయు యోగులకు ధ్రువమండలమునకు మీఁదనుండు విష్ణుపద మను లోకము. సదా భగవంతు నుపాసనముచేయు ఏకాంతులకు (ప్రపన్నులకు) నిత్యసూరులు చూచుచుండు పరమాకాశస్థానము - చంద్రసూర్యాది గ్రహము లన్నియుఁ బోయిపోయి మఱలమఱల వచ్చుచుండును - ద్వాదశాక్షరమంత్రోపాసకు లిప్పటికి మఱల వచ్చినవారు లేరు. ఇట్లు చెప్పుటచే బరమాకాశ ముపాసకుల (నిష్కామభక్తులయుఁ బ్రపన్నులయు) దని యేర్పడుచున్నది.

తాత్పర్యము.

వానప్రస్థ సన్న్యాసాశ్రమములనుండి మరణించినవారిచే నిండిన బ్రహ్మలోకమువలె జీవించియుండు తపస్వులచేతను హోమసమయ మందును అధ్యయన సమయమందును వెలువడు వేదనాదముచేతను - బరబ్రహ్మజ్ఞానము గల వారిచేతను మిగుల శుభకరమైన ప్రదేశమును,

ఉ. దాపునఁ గాంచి యా దశరథప్రభవుండు తదాశ్రమంబుఁ దాఁ
జాపము నెక్కుడించి చన సంయమివర్యులు దివ్యతత్త్వమే
ధాపరిణీతు లెంతయు ముదంబున వే యెదు రేగి కాంచి రా
త్మాపకుమారు రాముని యశస్విని జానకిఁ దమ్ము లక్ష్మణున్. ౭

దాపునన్=సమీపమందే - తదాశ్రమంబు = ఆ యాశ్రమము - దివ్యతత్త్వమేధాపరిణీతులు-దివ్య=అమానుషమైన-దేవతాసంబంధమైన-తత్త్వమేధా = తత్త్వజ్ఞానముచే - పరిణీతులు = విస్తారముగఁ గూడినవారు. ఇట్లు చెప్పుటచే శ్రీరామచంద్రమూర్తి సాక్షాద్భగవంతుఁడని సీతాదేవి సాక్షాల్లక్ష్మియని లక్ష్మణుఁడు భగవదంశమని యవతారరహస్య మెఱిఁగినవారు "జన్మకర్మచ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వత"యను భగవద్వాక్య మనుసంధింపవలెను-యశస్విని = విస్తారకీర్తి గల దానిని.

తాత్పర్యము.

ఇట్టి యాశ్రమమండలము సమీపమందే చూచి యా దశరథరాజకుమారుఁడు రామచంద్రమూర్తి యా యాశ్రమములలోని మృగములు తమ్ముఁజూచి భయపడకుండునట్లు చాపమెక్కు సడలించి సవినయముగాఁ బ్రవేశింపఁగా దివ్యదృష్టిగల యా ఋషీశ్వరు లవతార రహస్యమెఱిఁగినవారగుటచే వారిరాక ముందుగానే తెలిసి

కొని యిన్ని జన్మాలకు సాక్షాద్భగవద్దర్శనాలాపములు సమకూరెఁగదా, మనము వెదకుచుఁబోయినను దొరకనివాఁడు మనల ననుగ్రహింపఁ దానే వచ్చుచున్నాఁడు గదా! ఆహా యేమిదయ - యేమి దీనజనరక్షాపరత్వము - ఏమిసౌలభ్యము - ఏమిభక్త వాత్సల్యమని సంతోషించుచు నెదురుగాఁ బోయి సీతారామలక్ష్మణులను జూచిరి.

రాముని - జానకిని - లక్ష్మణుని జూచి రని చెప్పుటచే ముందు శ్రీరామచంద్ర మూర్తి రాఁగా నాయన వెనుక సీతాదేవి వచ్చెననియు - ఆమెవెనుక లక్ష్మణుఁడు వచ్చెననియు గ్రహింపనగును - ఈ విషయము స్పష్టముగ ౧౪౨వ పద్యంబున వివరింపఁబడెను.

—• మునులు తమ్ము రక్షింప శ్రీరామునిఁ బ్రార్థించుట. •—

ఉ. భాసురసంభవత్కుముద • బాంధవతేజుని రామచంద్రునిన్
శ్రీసహితున్ సుమిత్రసుతు • స్ఫీతయశస్విని జానకీసతిన్
మాసరరక్తిపూర్ణ బహు • మానపురస్సరయుక్తి మంగళా
శాసనసంప్రయుక్తిని బ్ర • శస్తమతుల్ భజియించి రాస్థమై. ౮

భాసుర=ప్రకాశించునట్టి - సంభవత్=పుట్టుచున్న - కుముదబాంధవ=కలువలకుఁ జుట్టమైన చంద్రుని కాంతివంటి - తేజుని = కాంతిగలవానిని - 'తస్మాత్సోమ రాజానో బ్రాహ్మణా'యని శ్రుతిచెప్పునట్లు చంద్రుడు బ్రాహ్మణులను రక్షించునట్లు రామచంద్రుఁడీ ఋషిమండలమును రక్షించువాఁడని యీ యుపమానము సూచించును. కు+ముద+బాంధవ=కు=భూమికి - ముద=సంతోషమిచ్చు - బాంధవుఁడు చుట్టమగువాఁడు - భూమికంతయు ననఁగా సమస్త జీవజంతువులకు సంతోష మిచ్చువాఁడు - ఇట్టివాఁడు శ్రీరామచంద్రమూర్తి యని భావము - ఈ యుపమానము చంద్రోదయమును సూచించెడిని - కావుననే యాతిథ్యసమర్పణము ఫలములదానము చెప్పఁబడెను. ఇది బహుళప్రథమయో ద్వితీయయో యని తోఁచెడిని - బాలచంద్రుఁడు పూజ్యుఁడైనట్టు శ్రీరామచంద్రుఁడు పూజ్యుఁడని భావము - శ్రీసహితున్ = భార్యాసేవారూపకలక్ష్మితోఁ గూడినవానిని, స్ఫీతయశస్విని=అధికమైన పతివ్రతా కీర్తిగలదానిని, మాసరమగు, రక్తి=అనురాగముచే, పూర్ణ=నిండిన, బహుమాన పురస్సరయుక్తి=గౌరవము ముందుగాఁగల, మంగళాశాసన సంప్రయుక్తిని=శుభముకలిగించు దీవనలచే దీవించుటచేత, సీతారామలక్ష్మణులయందు ఋషులు మిగుల ననురాగము గలవారగుటచే నిటువంటి దివ్యమంగళవిగ్రహములు గలవారికి నీ రాక్షసులు నిండిన ఘోరారణ్యమందు నేమిలోపము గలుగునో యని శంకించి యవి పరిహారమగుటకై శుభకరములైన యాశీర్వచనములు చేసి రనిభావము. ఇదిగదా పరమభక్తి లక్షణము; ఇందు మాసరరక్తి పూర్ణశబ్దము, 'పరానురక్తి రీశ్వరే' 'సా పరమ ప్రేమ రూపా' యనుభక్తిలక్షణములఁ దలఁపించి వీరు భక్తులని తెలుపుచున్నది - ప్రశస్తమతుల్=మిక్కిలిఁ గొనియాడఁబడిన మనస్సులు గలవారు, భక్తి పూర్ణులగుట

చేతనే ప్రశస్తమతులైరి. కావున భక్తిలేని జపతపస్సులు యోగములు ప్రశస్తములు గావని భావము; ఉదయించుచున్న చంద్రునివంటి తేజస్సుగల రామచంద్రుననుటచే నాయన తేజస్సుత్తరోత్తరాభివృద్ధి గాంచు నని భావము.

తాత్పర్యము.

ఉదయించు చంద్రునివంటి కాంతిగల శ్రీరామచంద్రమూర్తికిని సేవాలక్ష్మీ సమేతుఁడయిన లక్ష్మణునికిని విశేషయశోవతి యగు సీతాదేవికిని వారు నిండారు ప్రేమచే సగౌరవముగ మంగళాశాసనములు గావించి నిండు మనస్సుతో సేవించిరి.

ఉదయించుచున్న చంద్రుఁడు చీఁకట్లను హరించునట్లు రామచంద్రమూర్తి యరణ్యప్రవేశము రాక్షస నాశసూచక మని భావము.

కం. ఆ వనవాసులు శ్రీసీ,తావల్లభు సౌకుమార్య ♦ ధామ సువేష
శ్రీవపు సంహననము లా, పోవక కని విస్మయాబ్ధి ♦ మునిఁగిరి చిరమున్. ౯

అందు ఋషు లేకవాక్యముగా మంగళాశాసనము చేయవలసినంత పని యేమి కలిగెననినఁ గవి చెప్పుచున్నాఁడు.

వనవాసులు=అడవియందుండు వారు కావుననే యిట్టిదివ్యమంగళ విగ్రహో పేతుని వారెన్నఁడుఁ జూచినవారుకారని భావము, శ్రీసీతావల్లభుఁ = శ్రీయగు సీతయే యతిరూపవతి, 'అతిరూపవతీ సీతా' యని కలదు కదా! అటువంటి సీత వలచినవాఁ డెంతటి సుందరుఁడై యుండవలెను. కన్యకలు తమరూపము లెట్లున్నను వరుఁ డందగాఁడుగ నుండఁగోరుదురు. ఇఁక సుందరియగు కన్యక దనకంటె సుంద రుఁడు తనవిభుఁడుగా నుండఁగోరుట సహజమేకదా! సౌకుమార్యధామ సువేష శ్రీ వపుఁ = సుకుమారత్వమునకు స్థానమైన యాకారము కాంతిగల దేహముయొక్క; సంహననములు = అవయవము లెచ్చు తగ్గులులేక యేవేవి యెంతెంత యెట్లెట్లుండ వలయునో యంతంత యట్లట్లుండుటలు. ఆపోవక = తృప్తిలేక; కని=చూచి; విస్మ యాబ్ధిఁ = ఆశ్చర్యసముద్రమందు, చిరముఁ = దీర్ఘకాలము.

శ్లో. అంగప్రత్యంగకానాం, య స్సన్నివేశో యథోచితః
సుశ్లిష్ట సంధిబంధ స్తత్, సౌన్దర్య మితి చోచ్యతే॥

తాత్పర్యము.

అడవియందు నివసించు నా ఋషీశ్వరులు లక్ష్మీదేవియగు సీతాదేవికిఁ బ్రియుఁడైన వానిని, కోమలత్వమునకు స్థానమయిన యాకారము యొక్క కాంతిగల దేహసౌష్ఠవముగలవానిని నెంత చూచినను నింకను జూతమని తృప్తిలేకచూచి చూచి యాశ్చర్యసముద్రమున దీర్ఘకాలము మునిఁగిరి.

కం. జనకసుతామణినిఁ లక్ష్మణునిఁ శ్రీరామచంద్రు ♦ సర్వఋషీశుల్
కనుఁగొని యచ్చెరుపాటున, ననిమేషత్వంబుఁ గనిరి ♦ యాఁజనితృప్తిన్. ౧౦

తా త్ప ర్య ము.

సీతాదేవిని లక్ష్మణుని శ్రీరామచంద్రమూర్తిని ఋషీశ్వరు లందఱు చూచి చూచి యాశ్చర్యపడి ఱెప్పవ్రాల్పక మఱిమఱి తృప్తిలేక చూచిరి.

దీనివలన రామచంద్రువిషయమైన యాశ్చర్యము సీతాలక్ష్మణులవిషయమై కూడఁ గలిగెను.

ఇంతసేపు తామిట్లు చూచుటచేఁ దల్లికన్నులు దయ్యపుఁగన్నులన్నట్లు తమ దృష్టియే తాఁకెనేమో యని మంగళాశాసనములు గావించిరి. చూచిన పిమ్మట మంగళాశాసనమా ? మంగళాశాసనము చేసి చూచుటయా ? పూర్వాపరవ్యతిక్రమ మని యాక్షేపింపరాదు. కార్యము ముందు చెప్పి యట్టికార్యము చేయవలసిన కారణము వెనుకఁ జెప్పఁబడెను. అనిమేషత్వము = (౧) ఱెప్పపాటులేకుండుట, (౨) దేవత్వము, శ్రీరామచంద్రమూర్తిని దర్శించినమాత్రముననే వారికి దేవత్వ మీలోకమందే ప్రాప్తించెనని భావము.

ఱెప్పలు వ్రాల్చిన శ్రీరామచంద్రదర్శనానందమునకు విఘ్నముకలుగునేమో యని వారలు ఱెప్పలు వ్రాల్పరైరి. 'కృష్ణా - నిన్ను ఱెప్పపాటులేక చూడకుండఁ గంటి కడ్డముగ ఱెప్పలనేల సృజించె విధాత క్రూరుఁడై' యని కదా గోపికలు విలపించిరి.

దీనివలన భక్తులకు నానందానుభవమే ముఖ్యమని యేర్పడుచున్నది. "పరిపూర్ణ బ్రహ్మానుభవాత్మికా ముక్తిః" యనికదా ముక్తిలక్షణమును బూర్వులు చెప్పిరి. పరిపూర్ణ బ్రహ్మము ననుభవించుటే ముక్తియని భక్తముక్తిలక్షణము—నిరవధిక నిరతిశయ నిరంతరాయానంద మిందే కలదు.

ఇంతటి మహాభిలాషతో ఋషులుచూచి కౌఁగిలింపఁగోరి రనియు నాకోరిక యీ యవతారాంతరమునఁ గాదనియుఁ గృష్ణావతారంబునఁ దీరఁగల దని రామచంద్రమూర్తి చెప్పెననియు వీరందఱు గోపికలై బృందావనమునఁ గృష్ణునిఁ గౌఁగిలించిరనియుఁ గృష్ణోపనిషత్తునందుఁ గలదు.

"ఓం శ్రీమహావిష్ణుం సచ్చిదానంద లక్షణం రామచంద్రం దృష్ట్వా సర్వాంగసుందరం మునయో వనవాసినో విస్మితా బభూవుస్తం హోచు ర్నోనవద్యమవతారాన్వై గణ్యాంతే ఆలింగామో భవంత మితి భవాంతరే కృష్ణావతారే యూయం గోపికా భూత్వా మా మాలింగథ" దీనివలన గోపికలకు శ్రీకృష్ణునితో నాలింగన ప్రాప్తియేకాని సంభోగప్రాప్తి లేదని యేర్పడుచున్నది.

చం. అతిథిని నమ్మహాత్ముని సమస్తచరాచరభూతరక్షణో
న్మతిఁ దమపర్ణశాలలకు ధర్మరతుల్ కొనిపోయి యాసన
స్థితు నొనరించి యాయనల తేజులు మూల ఫలప్రసూనసం
హతుల నిజాశ్రమంబులను నర్పణచేసి మొగిడ్చి హస్తముల్. ౧౧

ఈ ౧౧-౧౭ పద్యములందు ఋషీశ్వరులు శ్రీరామచంద్రమూర్తికి శరణాగతి చేసిరని తెల్పఁబడును.

సమస్త చరాచరభూతరక్షణో న్నతిర్ = సమస్తములైన చరములు అచరములు నగు భూతముల రక్షించుటయందు విశేషసంతోషము గలవానిని, ఎట్టివాఁడైనను నతిథి పూజ్యుఁడే, అందు మహాత్ముఁడు పూజ్యుఁడు; అతిథులు తమనిమిత్త మనఁగా గ్రాసార్థులయియో స్వకార్యార్థులయియో వచ్చువారు. ఈ యతిథి యట్టివాఁడు కాఁడు; చరాచరములనెల్ల రక్షింపవలయు నని సంతోషముతో వచ్చినవాఁడు. ఈ యనరాకవలన లాభపడువారు ఆశ్రమస్థులే. సమస్త చరాచర రక్షకుఁడనుటచే భగవంతుఁడనియే యర్థము గ్రహింపవలయును. చరములను రాజులు రక్షింతురుగాని యచరములయిన వృక్షపర్వతపాషాణ గుల్మాదులను రక్షించురాజెవఁడు? కావున నట్టి వృక్షపాషాణాది శరీరములను దాలిచి జీవాత్మల నెల్లరక్షించి వానికభ్యుదయము గోరువాఁడు భగవంతుఁడే, అనలతేజులు = అగ్నిహోత్రుని తేజస్సునంటి తేజస్సు గలవారు వీరే యింతటి తేజస్సుగలవారయినచో వీ రాశ్రయించు రామచంద్రమూర్తి యిఁక నెంత తేజస్సుగలవాఁడయి యుండవలయునో, ధర్మరతుల్ = ధర్మమందుఁ బ్రీతిగలవారు, అనలతేజులు గావున రాక్షసులను దమ తపశ్శక్తిచే నాశము చేయఁగలిగియు మనము దాసులము బిడ్డలము మనదుఃఖము స్వామితోఁ దండ్రితోఁ జెప్పుకొనుటకు మనకు ధర్మముగాని స్వతంత్రునివలె వర్తించుట భక్తధర్మముగాదనియు "యోగక్షేమం వహామ్యహ" మ్మని యాయన చెప్పుచుండఁగా నాపని తాము చేయుటవలన భగవద్వాక్యమునందు విశ్వాసము లేమిని, క్రోధదాస్యమును స్వాతంత్ర్యమును తెలుపు నని తలఁచియు భగవంతునిమీఁదనే యాధారపడియుండుటే మనకు ధర్మ మనియు నుండువారు.

"అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి" యన్నట్టులు శాస్త్రవిశ్వాసములేనివారు చెడుదురు. త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః కామః క్రోధ స్తథాలోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్॥ భ. గీ. ౧౬-౨౧ ఆత్మను నాశముచేయుటకు నరకమునకు మార్గములు మూఁడు, కామము క్రోధము లోభము, కావున నీ మూఁటిని వదలవలెను. జీవుఁడు తాను భగవంతునకుఁ బరతంత్రుఁడనియు, భగవంతుఁడు స్వామియనియు నాయనయే సర్వస్వతంత్రుఁ డనియు నుండవలెను. తాను స్వతంత్రుఁడనుకొనెనేని చెడును.

'ఏష సర్వేశ్వరః, ఏష భూతాధిపతిః, ఏష భూతపాలః' శ్రుతి, ఈయనయే సర్వేశ్వరుఁడు - ఈయనయే భూతముల కధిపతి - ఈయనయే భూతములఁ బాలించువాఁడు.

లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా । రక్షక స్సర్వసిద్ధాంతే వేదాంతేషుచ గీయతే॥ వి. పు.

కరుణారూపిణియైన లక్ష్మితోఁగూడిన నారాయణుఁడే సర్వసిద్ధాంతములందు వేదాంతములందు రక్షకుఁడని చెప్పఁబడెను.

సర్వేషు దేశకాలేషు సర్వావస్థాసు చాచ్యుత
కింకరోస్మి హృషీకేశ భూయో భూయోఽస్మికింకరః॥

సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలయందు నారాయణా! నీకు నేను గింకరుఁడను. మఱలమఱలఁ జెప్పుచున్నాఁడను, కింకరుఁడను, కింకరుఁడను.

ఇట్టివిషయము తెలిసినవారు, తమ పర్ణశాలకుఁ=తమ ఆకుటిండ్లకు, దీని వలన నతిథి గొప్పవాఁడని యాయనయోగ్యతకుఁ దగినట్లు సత్కరింపవలయు నను నిర్బంధము లేదు. తమకుఁగలిగినదే శ్రద్ధాభక్తులతో నతిథికి సమర్పింపవలయునని సూచించుచున్నది.

యదాహారోభవేత్తేన, పూజయేత్పితృదేవతాః
తేనైవపూజయేన్నిత్య, మతిథం సముపాగతమ్॥ శంఖ.

తనకేది యాహారమో దానిచేఁ బితృదేవతలను అతిథులను బూజింపవలెను.

ఆసనస్థితుఁ=ఆసనమందున్న వానిని, అనఁగా గూర్చుండుటకుఁ బీఁటయో కృష్ణాజినమో సమర్పించిరని భావము, మూలఫల ప్రసూన సంహతులఁ = కంద మూలములయుఁ, బండ్లయుఁ, బుష్పములయు గుంపులను, నిజాశ్రమంబులను = తా ముండు నాశ్రమంబులను, అర్పణచేసి=తీసికొమ్మని యిచ్చి, మొగిడ్చి=మోడ్చి, అతిథులకు - భోజనవస్తువులు, లేక వారు కోరిన వేవైన నిచ్చుట గృహస్థులకుఁ దగినకార్యమే, కాని తమకుఁదామే తమ యిండ్లు వాఁకిండ్లు భూములు పుట్టలు గొడ్డు గోద లిచ్చుట శాస్త్రీయము కాదు. ఆచారము కాదు. సర్వ మొకనికే యిచ్చిన గృహస్థ ధర్మమందుండు వాఁడు తక్కిన యతిథుల నెట్లు పూజింపఁగలఁడు? తన్ను మాలిన ధర్మము లేదుగదా. అదియునుగాక వామనునివలె మీసర్వము నాకిమ్మని రామచంద్రమూర్తి యడుగను లేదు గదా. ఇట్లుండ వారంతటవారే యాశ్రమ సమర్పణముచేసి రన నది "మదీయత్వేనాభిమతేన వస్తు సర్వస్వామినే నారాయణాయ తుభ్యమేవ" "మాం మదీయంచ నిఖిలం చేతనాచేతనాత్మకమ్, స్వకైంకర్యోప కరణం వరద స్వీకురు స్వయ"యను ప్రపత్తి వాక్యమును స్మరింపఁజేయుచున్నది. 'ఏది నాదని మదిఁదలతునో యది సర్వము స్వామివైన నారాయణ! నీయది కావునఁ గైకొనుమూ' యనికదా ప్రసన్నులు చెప్పుదురు. మఱియును వారు నేను నాది యనుకొను చేతనాచేతనాత్మకమైన సర్వము (చేతనాత్మకము = జీవాత్మ భార్యలు పిల్లలు గొడ్డులు లోనైనవి. అచేతనాత్మకములు = దేహము, ఇల్లు, భూములు లోనైనవి). నీ కైంకర్యమునకుఁగాను దీసికొనుము - అని శరణాగతి భావమును దెలుపును.

"పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్
రత్నాని ధనధాన్యాని క్షేత్రాణిచ గృహాణిచ
సర్వధర్మాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్
లోకవిక్రాంతచరణౌ శరణంతే వ్రజం విభో॥

తండ్రిని తల్లిని, భార్యలను కొడుకులను బంధువులను, సఖులను గురువులను రత్నములను ధనధాన్యములను క్షేత్రములను, ఇండ్లను, మోక్షసాధనము లని చెప్పం జడు సర్వధర్మములను కర్మజ్ఞాన భక్తులను సర్వకామములను కైవల్యాదులను వదలి నేను విభూ? లోకముల నాక్రమించిన నీ చరణములనే శరణుజొచ్చితిని, అని కదా ప్రపన్నుఁడు చెప్పును.

మన సొత్తేదియు భగవంతున కీయలేదు. అజ్ఞానముచే భగవంతుని సొత్తును అహంకార మమకారదాసులమై మన దని తలఁచుచున్నాము. ఈ యజ్ఞానము తొలఁగి స్వామీ నీసొత్తు నీవు తీసికొమ్ము, అనుటే ప్రపన్నునికార్యము. అతఁడు నా సొత్తు నీ కిచ్చుచున్నా ననఁడు. "ఇంతవఱకు నాది యని నేను దురభిమానము వహించిన దానిని నీ కైంకర్యార్థము తీసికొనుము" అని మాత్రమే చెప్పును.

అనాత్మన్యాత్మబుద్ధిర్యా చాస్వే స్వమితి యా మతిః
సంసారతరు సంభూతి బీజ మేత ద్ద్విధా స్థితమ్॥ వి. పు. ౬-౭-౧౧.
సంసార విషవృక్షస్య. పాఠాంతరము.

ఆత్మకానిదేహము నాత్మ యనుకొనుట, తన సొత్తుకాని వానిని దేహపోషక ధారణాది వస్తువులను తన వని యెంచుట యీ రెండు సంసారవృక్షము పుట్టుటకు బీజము.

స్వాతంత్ర్యం నిజరక్షణం సముచితా వృత్తిశ్చ నాన్యోచితా
తస్యైవేతి హరే ర్వివిచ్య కథితం స్వస్యాపి నార్హం తతః॥

అను పూర్వాచార్యశ్లోక మనుసంధించునది. స్వాతంత్ర్యము, నన్ను రక్షించుకొనుట నా సర్వవిధ మనోవాక్కాయవృత్తులు ఇవన్నియు నాయనకే కాని యితరులకుఁగాదు. నాకుఁగాదు.

ఈ కారణములచే నిటువంటి యభిప్రాయము గల యా ఋషీశ్వరులు తమ యాశ్రమములను శ్రీరామ చంద్రమూర్తి కర్పణముచేసిరి. అటుగాదేని యా యాకు టిండ్లు రామచంద్రున కేల? దీనికే న్యాసమని పేరు. ఇదియే నిజమైన సన్న్యాసము.

తా త్ప ర్య ము .

అతిథిని, నందు మహాత్ముని, నందుఁ దనంతటఁదానే సమస్త చరాచరముల రక్షించుటయందు సంతోషముగలవానిని నగ్నిహోత్రమువంటి బ్రహ్మవర్చస్సు గలిగి ధర్మమందుఁ బ్రీతిగల యా ఋషీశ్వరులు తమ పర్ణశాలకు రామచంద్ర

మూర్తిని బిలుచుకొనిపోయి యాసనము సమర్పించి కూర్చుండఁజేసి కందమూల ఫలములు, పుష్పములు, తమ యాశ్రమములు సమర్పించి చేతులు జోడించి,

ఉ. ఈ మునికోటి కింతటికి ♦ నీవె శరణ్యుఁడ వీవె ధర్మర
క్షామహితుండ వో నుతయశా! గురువర్యుఁడు బూజనీయుఁడుఀ
స్వామియు మాననీయుఁడును ♦ శాసకుఁడు న్నృపుఁ డీవ సుమ్ము మ
త్స్వామివి నీవ, నీవు వన♦ధారుణి నుండిన నూర నుండిన్. ౧౨

శరణ్యుఁడవు = రక్షించుయోగ్యత గలవాఁడవు, ధర్మరక్షామహితుండవు = వారివారి స్వధర్మమందు వారువారుండునట్లు రక్షించుటచే గొప్పవాఁడవు, నుతయశా=పొగడఁబడిన కీర్తిగలవాఁడా, గురువర్యుఁడు=గురువులందు శ్రేష్ఠుఁడవు, గురువుల కందఱకుఁ బరమగురువగువాఁడు భగవంతుఁడే కదా! ఈ యభిప్రాయము లేదేని యీ విశేషణము వ్యర్థము. గురువులందు రాజమాత్రుఁడు చేరఁడు. పూజనీయుఁడుఀ=ఆకారణముచేతనే పూజింపఁదగినవాఁడవు, స్వామివి=స్వమ్ముగలవాఁడు స్వామి, స్వమ్ము అనఁగా సొమ్ము. సొమ్మెవరిదో వానికి స్వామి యనిపేరు. నిర్విశిష్టముగ స్వామివని చెప్పుటచే సమస్తలోకములు నీసొమ్ము, నీవే యంతకు స్వామివి, నిన్ను విడిచి వీని కధికారి మఱియొకఁడు లేఁడనిభావము. మాననీయుఁడు=గౌరవింపబడఁ దగినవాఁడవు.

అయోధ్యా పట్టణమందు సింహాసనమునఁ గూర్చుండి ప్రజల రక్షించునపుడైన మీకు సాహాయ్యము చేయఁగలను గాని యొంటరిగ నడవులపాలై వచ్చిన నే నేమి చేయఁగల నందువేమో? వనధారుణినుండిన్=నీవడవియందుండినను, ఊరనుండిన్=పట్టణమున సింహాసనమున నుండినను, నీవేస్వామివి, ఇట్లు సంపూర్ణ భరసమర్పణము వాక్కుచేతను, మనస్సుచేతను, క్రియారూపముగను భరన్యాసము చేయఁబడెను; తన్నురక్షించుభారము భగవంతునియందే యుంచుట భరన్యాసము.

తా త్ప ర్య ము.

ఈ మునికోటుల నందఱ రక్షించు శక్తిగలవాఁడవు నీవే, వారివారి స్వధర్మము వారువారు చేయునట్లు రక్షింపఁగల గొప్పతనము గలవాఁడవు నీవే. కావున మా స్వధర్మమున మేము నిర్బాధముగ వర్తించునట్లు చేయుము. ఇట్టివాఁడ వని నీ కీర్తి నందఱు నిదివఱకే పొగడుచున్నారు. నీవు గురువుల కెల్ల గురుఁడవగు పరమ గురువవు కావున పూజార్హుఁడవు. కావున మాచేయుపూజ నంగీకరించి బిడ్డలను దల్లిదండ్రులవలె రక్షింపుము. నేనేల రక్షించవలయునందువేమో, నీవు స్వామివి మేము మాది యనుకొనునది యంతయు నీసొమ్ముకాని మాసొమ్ముగాదు, నీసొమ్మును నీవు కాపాడుకొనకున్న మఱెవరు కాపాడఁగలరు? నీసొమ్ము నీవు కాపాడుకొనుటకు మా మనవేల? అది నీవే చేయవలసిన పనికదా, సర్వస్వామివి కనుకనే గౌరవింపఁబడఁ దగినవాఁడవు, మాయందేదైన లోపముండిన శాసింపఁదగినవాఁడవు, నృపుఁడు =

నరులను బాలించువాఁడవు, నరులు అనఁగా జీవకోటులు, ఈ రక్షాభారము నీ వడవియందుండిన నున్నది, పట్టణమందు సింహాసనస్థుఁడవై యుండిన నున్నది, సింహాసనస్థులై రక్షించు సోపాధికరక్షకులు తా మితరుల రక్షించుటకుఁ జతురంగ బలములతో రావలె, నీకట్టికార్యములేదు. నీవసహాయుఁడవై యెంతకార్యమైనఁ జేయఁగలవు. కావున నిరుపాధిక రక్షకుఁడవగు నీవు మమ్మెల్లర రక్షింపవలసినది విధియై యున్నది.

కం. ఇంద్రచతుర్భాగము ధర, ణీంద్రుఁడు గొని ప్రజలఁ బ్రోచి ♦ నృపతీసయా! ని
స్తంద్రత నతలోకుం డయి, సాంద్రసుఖము లనుభవించు ♦ సంతస మారన్. ౧౩

నేను రాజమాత్రుడనే నన్నేల మీరు విశేషముగఁ జెప్పెద రనిన నట్లైనను నా భారము నీకుఁ దప్పదనుచున్నారు.

ఇంద్రచతుర్భాగము=ఇంద్రునియొక్క నాలవభాగము, ధరణీంద్రుఁడు = రాజు, నిస్తంద్రతన్=హెచ్చరికతో, నతలోకుఁడు = నమస్కరించు లోకము గల వాఁడు, సాంద్ర=దట్టమైన, అధికమైన, సుఖములు=భోగములు, సంతసము=సంతోషము, ఆరన్=పూర్ణముగా.

ఇచ్చట నింద్రశబ్దము తక్కిన దిక్పాలుర కుపలక్షణము. "అష్టాభిర్లోకపాలానాం మాత్రాభి ర్నిర్మితో నృప" యని ప్రమాణము. చతుర్భాగమనుటచే నొక్కొక దిక్పాలుని తేజములో నాలవభాగము రాజు గ్రహించు నని భావము.

శ్లో. ఇంద్రానిల యమార్కాణా, మగ్నేశ్చ వరుణస్యచ
చంద్రవిత్తేశయో శ్చైవ, మాత్రా నిర్హృత్య శాశ్వతీః॥ మను. ౭-౪,

రాజు లేక ప్రపంచము మర్యాదమీఱి చెడిపోవుచుండఁగా బ్రహ్మ జగమును రక్షించుటకై యింద్రుఁడు, వాయువు, యముఁడు, సూర్యుఁడు, అగ్ని, వరుణుఁడు చంద్రుఁడు, కుబేరుఁడు వీరియంశములను గ్రహించి రాజును సృజించెను.

శ్లో. తపత్యాదిత్యవ చ్చైష, చక్షూంషిచ మనాంసిచ
నచైవం భువి శక్నోతి, కశ్చిద ప్యభివీక్షితుమ్॥

ఇతఁడు సూర్యునివలెఁ దన్నుఁజూచువారి చూడ్కులను మనస్సులను జుఱుచుఱ దహించుచున్నాఁడు. ఎవఁడును వీనిని దలయెత్తియైనఁ జూడఁజాలఁడు.

శ్లో. ఇంద్రస్యార్కస్య, వాయోశ్చ, యమస్య వరుణస్యచ
చంద్రస్యాగ్నేః పృథివ్యాశ్చ, తేజోవృత్తం నృప శ్చరేత్॥ మను. ౯-౩౦౩.

రాజు ఇంద్రుఁడు, సూర్యుఁడు, వాయువు, యముఁడు, వరుణుఁడు, చంద్రుఁడు, అగ్ని, భూమి వీరి తేజస్సును వర్తనమును గలవాఁడై మెలఁగవలయును.

శ్లో. వార్షికాం శ్చతురో మాసాన్, యథేంద్రోభిప్రవర్షతి
తథాఽభివర్షే త్స్వం రాష్ట్రం, కామై రింద్రవ్రతం చరన్.

ఇంద్రుఁడు వర్షాకాలము నాలుగునెలలు వర్షము గురియించి సస్యాదుల ఫలింపఁ జేయువిధముగ రాజింద్రునివలెఁ దనరాజ్యములోని ప్రజల కోరికలు పండునట్లు చేయవలయును.

శ్లో. అష్టౌ మాసాన్ యథాదిత్య, స్తోయం హరతి రశ్మిభిః
తథాహరేత్కరం రాష్ట్రా, న్నిత్య మర్కవ్రతం హి తత్.

సూర్యుఁడు తక్కిన యెనిమిది నెలలు తనకిరణములచేఁ గొంచెము గొంచెముగానే భూమినుండి జలమును గ్రహించునట్లు రాజును నీతిమార్గము దప్పక ప్రజలకు బాధ లేకుండునట్లు తనకు రావలసిన పన్నులను రాఁబట్టుకొనవలెను. దీనిపేరు సూర్యవ్రతము.

శ్లో. ప్రవిశ్య సర్వభూతాని, యథాచరతి మారుతః
తథా చారైః ప్రవేష్టవ్యం, వ్రత మేతద్ధి మారుతమ్.

ప్రాణవాయువు సకల ప్రాణులలోను బ్రవేశించి జీవింపఁజేయు విధముగ రాజు వేగులమూలమున నందఱిలోను బ్రవేశించి వారికష్టసుఖములు తెలిసి భరింపవలయును. దీనికి మారుతవ్రత మనిపేరు.

శ్లో. యథా యమః ప్రియద్వేష్యౌ ప్రాప్తే కాలే నియచ్ఛతి
తథా రాజ్ఞా నియంతవ్యాః, ప్రజా స్తద్ధి యమవ్రతమ్.

యమునికి శత్రువు లని మిత్రులని లేకున్నను వారివారి మరణకాలమున వారివారి పుణ్యపాపములకొలఁది పక్షపాతములేక సమముగా నియమించునో అట్లే రాజును నేరము లొనర్చినవారిని స్నేహద్వేషములు లేక వారివారి దోషములకుఁ దగినయట్లు దండింపవలయును. ఇది యమవ్రతము.

శ్లో. వరుణేన యథాపాశై ర్బద్ధ ఏవాభిదృశ్యతే
తథా పాపా న్నిగృహ్ణీయా ద్వ్రత మేతద్ధి వారుణమ్.

ఎవఁడు వరుణుని పాశములకుఁ గట్టువడ నియ్యకొనునో యతఁడు నిస్సంశయముగా వరుణపాశములచేఁ గట్టంబడినవాఁడే. కావున రాజు పాపకారులెట్లు తమ యధికారమును నిర్వహింపరో యట్లు వారి నవ్విధంబున దండింపవలయును. ఇది వరుణవ్రతము.

శ్లో. పరిపూర్ణం యథాచంద్రం, దృష్ట్వా హృష్యంతి మానవాః
తథా ప్రకృతయో యస్మిన్, స చాంద్రవ్రతికో నృపః.

పూర్ణచంద్రునిఁ జూచిన జను లెట్లు సంతోషింతురో యట్లు తన్నుఁ జూచినవారు సంతోషించునట్లు రాజుండవలయును. ఇది చంద్రవ్రతము.

శ్లో. ప్రతాపయుక్త స్తేజస్వీ, నిత్యం స్యా త్పాపకర్మసు
దుష్టసామంత హింస్రశ్చ, తదాగ్నేయవ్రతం స్మృతమ్.

రాజు ప్రతాపము తేజస్సుగలవాఁడై యెల్లప్పుడు పాపాత్ములను దుష్టులగు సామంతులను హింసించువాఁడై యుండవలయును. ఇది యాగ్నేయవ్రతము.

శ్లో.యథాసర్వాణి భూతాని, ధరా ధారయతే సమమ్
తథా సర్వాణి భూతాని బిభ్రతః, పార్థివం వ్రతమ్.

స్థావరములను జంగమములను నుత్తమనీచులను భూమి యెట్లు సమముగా భరించునో యట్లు రాజు పండిత మూర్ఖులను ధనిక దరిద్రులను దీనుల సనాథులను అందఱ భరింపవలయును. ఇది పృథ్వీవ్రతము. చూడుము మనుస్మృతి —
౭; ౪-౫౯-౬౬-౭-౮.

"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజ"మ్మని నీవు మనుష్యుఁడవని సాధారణరాజ వని నీవు చెప్పుకొన్నను నీ వింద్రునిలో (పరమాత్మలో) నాలుగవ భాగ మని మే మెఱుంగుదు మని భావము. అందఱ యైశ్వర్యము పరమాత్మయైశ్వర్యములోని యంశమేకదా. "ఇంద్రో మాయాభిః పురురూప మీయతే" యని శ్రుతి యందు నింద్రశబ్దము పరమాత్మపరమేకదా. ఇందతీతీంద్రః = పరమైశ్వర్యయుక్తుఁడు. ఇతి పరమైశ్వర్యే, గురుబాల॥ అని యుండుటచేఁ బరమైశ్వర్యయుక్తుఁడు భగవంతుఁడే. ఐశ్వర్య మాయన యాఱుశక్తులలో నొకటికదా. స్వర్గమందలి యింద్రుఁడు రాజ్యము పోఁగొట్టుకొని యెన్నిమార్లో యల్లాడినట్లు గ్రంథములందుఁ గలదు. అట్టివానికిఁ బరమైశ్వర్య మెట్లు చెప్పవచ్చును? కావున వాస్తవమున నింద్రుఁడు భగవంతుఁడే. "సమానానా ముత్తమ శ్లోకో అస్తు" అన్నట్లు దిక్పాలకులకంటె నధికైశ్వర్యము గలవాఁడు కావున నతనియందు నింద్రశబ్దము గౌణార్థముననే; ముఖ్యార్థము భగవంతునందే యన్వయము - ఈయభిప్రాయముతోనే ఋషుల వాక్యము చెప్పిరి. అటుగాక యుండిన సాధారణ రాజమాత్రునకు వారు నమస్కరింతురా! ఇండ్లు వాకిండ్లు నీవేయని సమర్పింతురా, నీ గర్భమందు మే మున్నామందురా. "దివ్యతత్త్వ మేధాపరిణీతులు" గావుననే భగవంతుఁ డిట్లవతరించె నని యెఱింగి గౌరవించిరి, శరణుచొచ్చిరి.

తాత్పర్యము.

రాజు దేవేంద్రాది దిక్పాలుర యందలి నాలుగవయంశము తేజస్సు గ్రహించి మిగుల హెచ్చరికతోఁ బ్రజల రక్షించుచు లోకులచే శ్లాఘింపఁబడి విశేష సుఖసంతోషము లనుభవించును.

క. కావున మే మెల్లరమును, నీవిషయమునందు నుంట ♦ నీచే నెపుడున్
గావం బడ నర్హుల మో, భూవరతనయాగ్రణీ! ప్ర♦భూతపుఁగరుణన్. ౧౪

నీ విషయమునందును=నీ యధీనమున నీ పాలనమునకు లోబడియుండు దేశమునందు, ప్రభూతపుఁగరుణన్ = విశేషదయచే.

### తాత్పర్యము.

మే మందఱము నీ దేశవాసుల మగుటచే నీచే రక్షింపఁబడ యోగ్యులము - కావున నీ వధికదయచే రక్షింపుము.

ఇచ్చట తాము రక్షింపఁబడుటకుఁ గారణము, భగవద్దేశవాసముగాఁ జెప్పఁబడినది. తక్కిన దేదియుండినను లేకున్నను రక్షింపఁబడుటకు దివ్యదేశవాసము చాలును. ఆ యొక్కటి గ్రహించి మా యందు నుపాసనాదు లెవ్వియు లేకున్నను నీవు రక్షింపవలయును. మే మెల్లరము = పెక్కు కష్టములు పడుచు వానిని నివారించుకొను శక్తియుపాయము లేక నీ వెప్పటికైన వచ్చి రక్షింతు వను నమ్మకముతోఁ బ్రాణములు బిగఁబట్టుకొనియుండు మేమందఱము. నీ విషయమునందు నుంటఁ = నీ దేశమందున్న కారణమున. ఇది సమస్త జనులకు మోక్ష మేల యియ్యరాదను ప్రశ్నకు సమాధానము. అగ్ని తన్నాశ్రయించిన వారి చలి కదా పోఁగొట్టును. అట్టులే భగవంతు నేకారణముచేనైన నాశ్రయించినవారు రక్షింపఁబడుదురు. దూరస్థులు = దూరస్థులే, నీచేఁ = సర్వలోక రక్షణమే స్వభావముగాఁగల నీచేత, ప్రభూతపుఁగరుణఁ = వీరు రక్షింపఁబడుటకు యోగ్యులా యయోగ్యులా యని యాలోచింపవలదు. మాయందిశక్తి సామర్థ్యము లున్నవి. మే మేమియు దోషముచేయలేదు కావున రక్షింపు మని విధించు యోగ్యత మాయందు లేదు, మేము దీనులము, కావున నీవు దయామూర్తివి గనుక నీగుణము నాలోచించి నేను వీరిని రక్షింపకుండిన నా స్వభావగుణమునకు భంగము వచ్చునే యని రక్షింపుము. అయోధ్యయందుఁ బుట్టిన చరాచరములు సదా నిన్ను దర్శించుట సేవించుట లోనగు నుపాయములచే నీయందుఁ బ్రేమగలవై యున్నవి. మాకట్టి భాగ్యములేదు, మన దేశమందున్నారు గదా యను నది కారణముగా గ్రహించి రక్షింపుము. ఇతరోపాయములం దపాయము లున్నవి. నీవిషయము నందునుంట = మనుష్యభావమునఁ జూచినచో దక్షిణ సముద్ర మధ్యమువఱకు నిక్ష్వాకులరాజ్యమే. కిష్కింధ ౪౧ సుందర ౯౯ ప. చూడుము. భగవద్దేశవాసమం దట్టి యపాయము లేదని ఋషుల యభిప్రాయ మని యొక పక్షము. పూర్వోత్తర శ్లోకములఁ బ్రపత్తిచేసి యుండుటచేత నదికారణముగా మమ్ము రక్షింపవలసిన దని మఱియొకపక్షము.

మునుపే ప్రపత్తిచేసియుండినచో నది యొక టేచాలునే. ఈ పద్యమందు భగవద్దేశవాసము రక్షహేతువుగాఁ జెప్ప నేల యని శంకింపరాదు. నీ యెదుటనుండు నపుడు మేము కష్టపడుట నీకు మఱింతలోపము గాదా యని తెలుపుటకై భగవద్దేశవాస ప్రశంస చేయఁబడెనుగాని ప్రపత్తినిగాదని యిది ప్రశంసింపఁబడలేదు. భగవద్దేశావాస మొక్కటియే రక్షణహేతువుగాఁ జెప్పవచ్చునే. ప్రపత్తినేల చెప్పవలె ననరాదు. భగవద్రక్షణమునకు భగవద్దేశవాస మొకటియే చాలినంత కారణమైనను ఇతరవిధ రక్షణములందు భగవద్దేశవాసముగాని యితర కారణములుగాని యెన్ని

యున్నను దోషము గాదు. ప్రపత్తికి విరోధమైనది కూడదు. దాని కనుకూలమైనవి యెన్నియున్నను దప్పుగాదు. ఇంతకు నీ ఋషీశ్వరులు మోక్షమును గోరినవారు గారు. దుష్టనిగ్రహమునే కోరిరి. కాఁబట్టి ప్రపత్తియు భగవద్దేశవాసము రెండును జెప్పుట యుక్తమే. ఇది తనిశ్లోకి వాఖ్యానుసారము.

ఓ ఋషీశ్వరులారా! మీానడవడి చూడ దాఁగఁబోయినచోట దయ్యాలపో రను నట్లున్నది. నే నన్నిజంజాటములు వ్యవహారములు వదలించుకొని యేకాంత మున నిశ్చింతముగ నుండ వచ్చితిని. ఇచ్చట మీరు యుద్ధకార్యమునందు దించు చున్నారు. నేనెట్లు చేయఁగలనందువేమో? అది సరిగాదు. మేము నిన్ను భగవం తుఁడనని కేవల ధర్మరక్షణార్థమై యవతరించితి వని నమ్మి శరణుచేసితిమి.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. భ. గీ.
యని నీవు చెప్పలేదా.

అకారణా త్కారణా ద్వా, కారణాకారణా న్నచ
శరీరగ్రహణం వ్యాపిన్ ధర్మత్రాణాయ కేవలమ్॥ వి. పు. ౫-౧-౫౦

పాపులవలె నరక మనుభవించుటకుఁగాని పుణ్యులవలె స్వర్గ మనుభవించుట కుఁగాని మనుష్యులవలె సుఖదుఃఖము లనుభవించుటకుఁగాని నీవు శరీరము గ్రహించిన వాఁడవు కావు. కేవల ధర్మరక్షణ నిమిత్తమే శరీరము ధరించితివి.

ప్రభూతపుఁ గరుణ = భగవంతుడు దనస్వభావ నిరవధిక నిరతిశయకరు ణచే మనల రక్షింపవలెనుగాని మనశక్తి సామర్థ్యములచే జ్ఞాన, బల, క్రియాదులచే మనము కృతార్థుల మగుదు మనుట కల్లమాట, నీదేశమందున్నారము గావున నీవు మమ్ము రక్షింపవలసినది నీకు విధియని చెప్పియుండినది పూర్ణప్రపత్తియై యుండదు. అట్టి యభిప్రాయము ఆకించన్యము విరోధము. కావున నట్టివిరోధము రాకుండుటకై ప్రభూతకరుణ చెప్పఁబడెను. ఋషీశ్వరుల యభిప్రాయమేమన:—మమ్ము రక్షింప వలసినదని మేము చెప్పుకొనుట మాకు విధి. (గోప్తృత్వవరణము) కావునఁ జెప్పి తిమి. ఏమి నెపముపెట్టి మిమ్ము రక్షింతును, ఏవ్యాజములేక మిమ్ము రక్షించిన లోకు లందఱు మీావంటివారు గారా? కావున లీలావిభూతి మానుకోవలసి వచ్చునే యందు వేమో? అట్టి నెపము నీకుఁ గావలసియుండిన వీరు మన దేశవాసులను నెపముపెట్టి రక్షింపుము, అదియును మేమది మాకు స్వత్వముగా (హక్కు = right) గాఁజె ప్పము, నీ స్వభావసిద్ధకారుణ్యముచేఁ జేయు మనియే మా ప్రార్థనము. ఈ విషయ మున విష్ణుపురాణమందలి యీా శ్లోకములు ముఖస్థములు చేయఁదగినవి.

శ్లో. యస్మాద్బ్రహ్మాచ రుద్రశ్చ, చంద్రేంద్ర మరుదశ్వినః
వసవశ్చ సహాదిత్యై స్తస్య స్తోష్యామి కి న్వహమ్

బ్రహ్మ, రుద్రుఁడు, చంద్రుఁడు, ఇంద్రుఁడు, మరుత్తులు, అశ్వినులు, ఆదిత్యుల తోడి వసువు లెవనివలనఁ గలిగిరో యట్టివాని నే నేమని స్తుతింతును ?

ఏకావయవ సూక్ష్మాంశాద్యస్యైద మఖిలం జగత్
కల్పనావయవస్యాంశ స్తస్య స్తోష్యామి కిన్వహమ్॥

ఎవనియవయవము లందలి యొక సూక్ష్మాంశముచే సమస్త ప్రపంచము కల్పిత మయ్యెనో యెవని యవయవాంశ కల్పనము సంకల్పసిద్ధమో యట్టివాని నే నేమని స్తుతింతును.

సదసద్రూపిణోయస్య, బ్రహ్మాద్యా స్త్రిదశోత్తమాః
పరమార్థం నజానంతి, తస్య స్తోష్యామి కిన్వహమ్॥

సత్తు, అసత్తు తన రూపముగాఁ గల బ్రహ్మముయొక్క పరమార్థమును దేవతోత్తములు కూడ నెఱుంగరో యట్టివాని నే నేమని స్తుతింతును.

బ్రహ్మాద్యై రర్చితోయస్తు గంధ పుష్పానులేపనైః
నందనాది సముద్భూతై స్సోర్చ్య తే వా కథం మయా.

నందనవనాదులందలి సుగంధపుష్పానులేపనముల బ్రహ్మాదు లెవనిఁ బూజింతురో యట్టివాని నే నేమి యర్చింపఁగలను.

యస్యావతారరూపాణి దేవరాజ స్సదార్చతి
నవేత్తిపరమం రూపం సోర్చ్యతే వా కథం మయా.

ఇంద్రుఁడు పరమరూపము యెవని తెలియనివాఁడై యవతార రూపముల సదా యర్చించునో యట్టివాని నే నెట్లు లర్చింపఁగలను.

విషయేభ్య స్సమాహృత్య సర్వాక్షాణిచ యోగినః
యమర్చయంతి ధ్యానేన సోర్చ్యతే వా కథం మయా.

ఇంద్రియములను విషయములను నియమించి ధ్యానముచే యోగు లర్చించు వాని నే నెట్లు లర్చింపఁగలను.

హృది సంకల్ప్య యద్రూపం ధ్యానే నార్చంతి యోగినః
భావపుష్పాదినా నాథ సోర్చ్యతే వా కథంమయా.

ఏ రూపమును యోగులు హృదయమందు సంకల్పించుకొని భావ పుష్పములచే నర్చింతురో నాథా, యట్టివాని నే నెట్లు లర్చింతును.

సోహం దేవదేవేశ నార్చనాదౌ స్తుతౌనచ
సామర్థ్యవాన్ కృపామాత్ర మనోవృత్తి ప్రసీద మే॥

దేవదేవ, యట్టినేను నీ యర్చనాదులందు స్తోత్రాదులందు సమర్థుఁడను గాను కావునఁ గేవలకరుణయే మనోవృత్తిగాఁ గల నీవు నన్ననుగ్రహింపుము.

అటుగాక నీవు మనుష్యభావమున మమ్ము మోసగింపఁజూచెదవా, నీ పాలనకు లోబడిన మమ్ముఁ గాపాడవేని నీకు నరకము తప్పదు.

అగోప్తారశ్చరాజానో బలిషడ్భాగతస్కరాః
సమర్థాశ్చాప్యదాతార స్తేవై నిరయగామినః॥ భార. ౧౨-౨౩-౯౦.
దొంగలై యాఱవభాగము పన్ను దీసి కొనుచుఁ బ్రజారక్షణము చేయకుండు
రాజులును సమర్థులైయుండి యీ వన్నియ్యనివారును నరకముపాలగుదురు.
అరక్షితారం రాజానం, బలిషడ్భాగహారిణమ్
తమాహుః సర్వలోకస్య సమగ్రపాపచారిణమ్. భార. ౧-౨౧౩-౯.
ఆఱవభాగము కప్పము తీసికొని రక్షింపనిరాజు సర్వలోకములలో సంపూర్ణ
పాపాత్ముఁడు.

ఉ. నిర్భర తేజ ! దండము మునిప్రకరంబుల మైన మా కసం
దర్భపుఁజేఁత, యాగ్రహముఁ ♦ దాల్పఁగలేము జితేంద్రియాప్తి, నీ
గర్భముఁ బోలె నీ కెపుడుఁ ♦ గావగ మమ్ముఁ దగు న్మహాత్మ ! ప్రా
దుర్భవదుత్కృపాపరతఁ ♦ దోయజనేత్ర ! తపోధనాఢ్యులన్. ౧౫

మీ రెంతో తపశ్శాలులే, ఏల తపోబలముచే దుష్టులను ధ్వంసము చేయ
రాదు. ఏల బహుకాలము బాధపడుచుండవలయు ననినఁ జెప్పుచున్నారు.

నిర్భర తేజ=అతిశయించునట్టి తేజము గలవాఁడా, ఇట్లనుటచే మా తేజస్సు
కంటె నీ తేజస్సే గొప్పదని భావము, మునిప్రవరులము = మననశీలుఁడు ముని,
ధ్యానము చేయుచుండువాఁడు. అందుఁ బ్రవరులము=శ్రేష్ఠులము, మాకు ధ్యానమే
ప్రధానము, దండము=శిక్షించుట, శపించుట, అసందర్భపుఁజేఁత = తగని కార్యము.
జితేంద్రియాప్తిన్=ఇంద్రియజయము నొందుటచే, కామక్రోధములను వదలుటచే,
ఆగ్రహమున్=కోపమును, కోపమునకు ధ్యానయోగమునకు మిగులదూరము, మేము
జయించిన కామక్రోధాదులకు మేము వశపడిన మే మిన్నాళ్లు శ్రమించినది వ్యర్థమే
యగునుగదా ! మేము కోపించుటచే మా చిరకాలార్జిత తపస్సు నాశము లగునుకదా!
కాఁబట్టి మేము శాపమిచ్చుటకు వలను పడదు. ఎపుడున్=సర్వకాల సర్వావస్థలందు,
నీ గర్భమువోలెన్ =నీ కడుపునందున్న శిశువువలె, కుక్షిబ్రహ్మాణార్భగర్భః అమ
రుఁడు. మహాత్మ=గొప్ప యుదారస్వభావము మనస్సుగలవాఁడా, ప్రాదుర్భవత్ =పుట్టు
చున్న, ఉత్కృపాపరతన్ = అతిశయించిన దయాగుణమే విశేషముగఁ గలవాఁడ
వగుటచేత, తపోధనాఢ్యులన్ = తపస్సే ధనముగాఁగల సంపన్నుల మగు వారిని,
కావఁగాఁదగున్=రక్షించుట యోగ్యమగును. ఇందుఁ జెప్పఁబడిన తపస్సు పవా
సాదులు ప్రాణాయామాదులు కావు. అన్ని తపసులలో శ్రేష్ఠమైన తపస్సేదియో
దానినే యిచట గ్రహింపవలెను.

తస్మాన్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః ॥ తైత్తి॥ అను శ్రుతి ప్రకారము
అన్ని తపస్సులలో శ్రేష్ఠమైనది న్యాసమే. అనగా భగవంతుఁడా! నీవే మాకు రక్ష
కుఁడవు, మమ్ము రక్షించు భారము నీయందున్నది యని రక్షణభారము భగవం

తునిపై వైచి నిర్భయముగా భగవంతుఁడవశ్యము రక్షించును. మోసగింపఁడను మహా విశ్వాసము గలిగియుండుట. ఇది గొప్ప తపస్సు, ఇట్టి తపస్సు మాకు ధనము. ఆధనమును నీయొద్ద దాఁచియుంచినవారము. ఇట్టి విశ్వాసము గలవారమగుటచేత మమ్ము మేము రక్షించుకోరాదు. దానికై యత్నింపనురాదు. నీవు రక్షించెదవని నమ్మియుండి మరల మమ్ము మేము రక్షించుకొనుట స్వాతంత్ర్యము వహించి నట్లగుటయే కాక నీయందు విశ్వాసము లేనట్లేకదా యగును. ఇది స్వరూపహానికదా! నీయందు విశ్వాసము లేకపోయిన నీవేల రక్షింతువు? రక్షింపవు. మమ్ము మేము రక్షించుకొనఁ జాలము. తల్లిగర్భము నందుండు శిశువు తల్లి తన్ను రక్షించు నను నమ్మకములేక తన్నుఁ దాను రక్షించుకొనఁగలదా? మా తపస్సుచేత మే మొదఱ నని దండింపఁగలము? తపస్సు వ్యర్థమగుటయే ఫలమయి రెంటను జెడుదుము. కావున మమ్ము నీవే రక్షింపవలయును.

ఇట్లనుటచే మునుల రక్షణము నిర్వ్యాజ మనుట సరికాదు. ఈ ఋషులు మోక్షార్థులే. కాని ఖరాదివధము మాత్రమే వారియుద్దేశము గాదు. ఖరాది శిక్షణమును శరభంగాశ్రమవాసులు ప్రార్థింపఁగలరు. ఇది గోవిందరాజాభిప్రాయము.

ఇది ౧౪ వ పద్యవ్యాఖ్యానము. (తనిశ్లోకి)తో విరోధించుచున్నది.

శ్లో. సాధనంచ ద్విధా కార్యం, ధర్మద్వేషి నిరాకృతౌ
శస్త్రాస్త్రవ్యాహరూపేణ, శాస్త్రరూపేణచైవహి. అహిర్బు.

ధర్మరక్షణము రెండు విధములఁ జేయఁబడును. శాస్త్రముచే హితాహితములు దెలుపుట. ధర్మమును విరోధించు వారిని శస్త్రాస్త్రములచే సంహరించుట. పైరు రక్షించుటయందు గడ్డిగాదము తీసివేయుట యెట్టిదో సాధు పరిత్రాణమందు దుష్టశిక్షణ మట్టిది. కావున మోక్షార్థులు దానిని వేఱుగఁగోరరు.

బ్రాహ్మణస్యతు దేహోయం నకామార్థాయ జాయతే
ఇహక్లేశాయ తపసే, ప్రేత్య త్వనుపమం సుఖమ్.

బ్రాహ్మణుని యీ దేహము కామార్థములకుఁగాను గలుగలేదు. ఈ లోకమునఁ దపోరూపకమైన దుఃఖము కొఱకును పరలోకమున నిరుపమాన సుఖమునకును గలిగినది.

## తాత్పర్యము.

చూచి భరించుటకు సాధ్యముగాని తేజస్సుగల శ్రీ రామచంద్రమూర్తీ! సర్వదా ధ్యానతత్పరులమై మా మనస్సులన్నియు నీయందే యుంచి యుండు కారణముచే నీసత్త్వగుణము కొంచెము మాయందును సంక్రమించుటచేతఁ దమోగుణ కార్యమైన దండము చేయుట మాకుఁ దగినదికాదు. అట్లు చేసితిమేని మాతపస్సు నాశమగుటయేకాక మేము స్వతంత్రుల మను నహంకార మొకటి జనించును. దానిచే

మాకు స్వరూపహానియే కలుగును. కావున మేమట్టివనిఁ బూనఁజాలము. నీగర్భమం దుండువారము (నారాయణశబ్దార్థ మనుసంధించునది.) తల్లిగర్భమందుండు శిశువును దల్లిగాక మఱియెవరు రక్షింపఁగలరు? శిశువు తన్నుఁదాను రక్షించుకొనఁగలదా? కావున మమ్ము రక్షించుభారము సర్వకాల సర్వావస్థల నీయందే యున్నది. కావున నీవు మమ్ము రక్షింపఁదగును. నీవు మిగుల దయగలవాఁడవు గదా. నీయందు మా రక్షాభారము వైచి నిన్నే నమ్మియుండు మాయందుఁ గాకున్న నీయపారదయ యెవరి యందుఁ బ్రసరింపఁజేయఁగలవు."

కం. అని యీగతి సీతాపతి, ననుజయుతుం బూజ చేసి యమ్మును లెల్లన్
వనభవసుమఫలతతులను, గొనబగు మూలములఁ దన్విఁగూరఁగఁ బ్రీతిన్. ౧౬

ఈగతిన్=ఈ విధముగ, సీతాపతిన్=ఆ రఘుపతి ననక సీతాపతి ననుటచే సీతతోఁడంగూడిన రామునికి శరణాగతిచేయవలయుగాని యొకరికి మాత్రమే చేయ రాదని సూచన. దంపతులను వేఱువేఱుగ విడఁదీసి పూజింపరాదు. అనుజయుతున్=తమ్మునితోఁగూడిన వానిని; శరణాగతి యుక్తమాటలతో ముగింపక క్రియారూప ముగను జూపుట ముఖ్యము గాన 'పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి' యన్నట్లు వారికిఁ గలిగిన ఫలాదు లర్పించుచున్నారు. అయుద్దేశము లేకున్న రెండవసారి ఫలము లీయఁబనిలేదుకదా. వనభవ=అడవియందుఁబుట్టిన, సుమ ఫలతతులను=పూలు పండ్లయొక్క సమూహములను. గొనబగు=చూచుటకు భుజిం చుటకు నింపైన, మూలములన్=కందమూలములను, తన్విఁగూరఁగన్=తృప్తికలుగు నట్లు, ప్రీతిన్=యో మే భక్త్యా ప్రయచ్ఛతి యను దానిని దెల్పుచున్నది. 'యద్భ క్ష్యం స్యాత్తతో దద్యాత్ బలిం భిక్షాంచ శక్తితః అమ్మూలఫలభిక్షాభి రర్చయే దాశ్రమాగతాః॥ మను. ౬-౭.

తన కేది యాహారమో బలిభిక్షములు దానితో చేయవలెను. జలమునుమూల ములు పండ్లు వీనిచే ఆశ్రమాగతులకు భిక్షచేయవలెను.

తాత్పర్యము.

ఈ విధముగఁ జెప్పినవారై సీతారామలక్ష్మణులను బూజించి శుష్కాలాప ములు శూన్యహస్తములు గాకుండునట్లు తమకుఁగల కందమూల ఫలాదులను వారు తృప్తిపడునట్లు లిచ్చిరి.

దీనివలన భగవంతుని బత్నీసమేతుఁగాఁ బరివారసమేతుఁగ నర్చించి భక్తితో దమకు భగవంతుఁ డిచ్చినదానిని నివేదింపవలయు నని యేర్పడుచున్నది.

ఈ ఋషిచర్య భగవదారాధన క్రమము సూచించుచున్నది.

"ఆసనస్థితు నొనరించి" (౧౧-వ పద్యము) యనుటచే "కూర్మాదీన్ దివ్య లోక"మ్మను శ్లోకమ్మునఁ జెప్పఁబడిన యాసనము సూచింపఁబడెను. అనలతేజు లను టచేఁ బూజకుల యుపనిషన్మంత్రపూర్వక భూతశుద్ధి తెలుపఁబడెను. అవల వార

వాక్యములు = త్వయ్యారాధన కామోఽయం । వ్రతం చరితు మిచ్ఛతి । సంకల్ప సిద్ధిర్భగవన్ । పూరయాస్య మనోరథాన్ ॥ అను వాక్యములు. "అనన్యశరణ స్త్వత్పాదారవిందయుగళం శరణం ప్రపద్యే" యను గద్యసూక్తులను దెలుపుచున్నవి. "సీతాలక్ష్మణసమేత శ్రీరామచంద్రమూర్తి నర్చించుట" సపరివారం భగవంత మ్మను వాక్యార్థమును సూచించుచున్నది. సుమము లర్పణచేసి యనుట పూజావిధానమును సూచించుచున్నది. ఫలములాది సమర్పణము, నైవేద్య సమర్పణము తెలుపుచున్నది. ప్రతిదినముచేయు భగవదారాధన క్రమ మిదియేకదా.

వీరందఱు తపస్వులు యోగులు కావున హృద్యాగమునఁ బ్రతిదినము చేయుచున్నట్లు బాహ్యయాగమును జేసి రని సూచన.

తే. సిద్ధసాధననిష్ఠులు ♦ శిఖిసమాను, లన్యతాపసవర్యులు ♦ న్యాయ్యవృత్తు
లీశ్వరుని రాము నర్చించి ♦ చెలిమి మిగుల, వారువారు యథాన్యాయ ♦ పద్ధతులను.

సిద్ధసాధననిష్ఠులు = సాధ్యమని సిద్ధమని మోక్షసాధనములు రెండువిధములు. సాధనమనఁగా సాధించునుపాయము, సాధ్యమనునది మనుష్యప్రయత్న పూర్వకమైనది. కర్మయోగము, జ్ఞానయోగము, అష్టాంగయోగము, భక్తియోగములోనైనవి, భగవత్ప్రాప్తికై మనము శ్రమించిచేయు నుపాయములు. ఉపేయము భగవంతుఁడు. ఈమార్గమందు నుపాయము ఉపేయము వేఱువేఱు; మంత్రుల సాహాయ్యముచేఁ బ్రభువు ననుగ్రహము సంపాదించుకొన్నట్లు; రెండవదగు సిద్ధోపాయమందు నుపాయము ఉపేయము రెండు భగవంతుఁడే. భగవంతు ననుగ్రహము సంపాదించుకొనుటకు భగవంతునే యుపాయముగాఁగొని యాయన పాదముల మీఁదనే "అపరాధ సహస్రభాజనం । పతితం భీమభవార్ణవోదరే । అగతిం శరణాగతం హరే । కృపయా కేవల మాత్మసాత్కురు." భగవంతుఁడా! వేలకొలఁదు లపరాధములు చేసి యీ సంసార మహాసముద్రమందుఁ బడితిని, నాకు వేఱుగతిలేదు. నీవేగతి కావునఁ గేవలకృపచే నాత్మసాక్షాత్కారము గలిగింపుము. "అధర్మనిష్ఠోఽస్మి నచాత్మవేదీ । న భక్తిమాన్ త్వచ్చరణారవిందే । అకించనోఽనన్యగతి శ్శరణ్య త్వత్పాదమూలం శరణం ప్రపద్యే॥ సర్వలోకశరణ్యా! నేను ధర్మనిష్ఠుఁడనుగాను, నేను ధర్మములు లోపములులేక చేయలేను. ఆత్మజ్ఞానము నాకులేదు. నాయందు భక్తియు లేదు. ఏవిధమైన యుపాయము సాధించుటకు శక్తిలేదు. ఆ మార్గము తెలియదు, నిన్ను విడిచిన నాకు వేఱుగతిలేదు. కావున నీ పాదములమీఁదఁ బడితిని, తరువాత నీ యిష్టము.

అనిచెప్పి యీ ప్రకారము భగవంతునిమీఁద మహావిశ్వాసము ఆత్మరక్షాభరము నుంచి తల్లిపొదిగిటి శిశువువలె నిర్భయుఁడై యుండుట. దీనికి సిద్ధసాధనమని పేరు; వీరే వాస్తవ సిద్ధులు. క్షుద్రములైన యణిమాదులు సాధించినవారు గారు; వారియందది గౌణము. ఇట్టి సాధనమందు నిష్ఠగలవారు సిద్ధసాధన నిష్ఠులు.

నిష్ఠ=ని+స్థ=విశేషముగ నుండుట, దేనియందు మనస్సు విశేషముగ నుంచి తదనుకూలకార్యములు చేయుచుందుమో దానికి నిష్ఠయనిపేరు. ఇదియే భక్తి. తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్. బ్ర. సూ. 1-1-7 శిఖిసమానులు=అగ్నిహోత్రమునకు సమానమైనవారు, అనఁగా దోషస్పర్శము లేనివారు, భగవంతుఁడుగాక వేఱొకఁడు తనకు రక్షకుఁడు గలఁడని యెంచుట, భగవత్ప్రాప్తికి భగవంతుఁడు గాక యితరోపాయములను వెదకుట, ఫలము భగవత్సాయుజ్యముగాక స్వర్గకైవల్యాదులుగోరుట సర్వమునకుఁ గర్తయు స్వామియు భగవంతుఁడని నమ్మక తాను గర్తయని స్వామియని తలఁచుట యివి దోషములు; సిద్ధసాధననిష్ఠు లీదోషములు లేనివారై యుండవలయును. అన్యతాపసవర్యులు = మీఁదఁ జెప్పఁబడినవారికంటె నితరులు, పూర్వము చెప్పఁబడినవారు. తపోమాపక కాయక్లేశమును సహించినవారు, వీరు దానికి శక్తి లేనివారు, న్యాయవృత్తులు = సిద్ధసాధననిష్ఠకుఁదగి న్యాయముతోఁ గూడిన కార్యములు చేయువారు, అనఁగా స్తుతిప్రణామాదులు లోనైనవి, ఈశ్వరుని = సమస్త ప్రపంచమునకుఁ బ్రభువై సమస్త చరాచరములు తనయాజ్ఞయం దుంచుకొని తన యిష్టప్రకారము ప్రవర్తింపఁజేయువానిని. "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి, భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" యని భగవద్వాక్యము గలదుగదా. ఇట్టి యీశ్వరుఁ డెవడనిన శ్రీరామచంద్రమూర్తియే కావున రామునర్చించిరి=పూజించిరి. ఎలమిన్=సంతోషముతో, భగవంతు నీశ్వరు శ్రీరాముఁ జేతులతో నర్చించుభాగ్యము మనకుఁ గలిగెఁగదాయని యపారసంతోషము, జీవి కింతకంటె భాగ్యమిం కేదిగలదు? యథాన్యాయ్యపద్ధతులను = వారివారి వర్ణాశ్రమాచార మార్గములను.

తాత్పర్యము.

సిద్ధసాధననిష్ఠులు, అగ్నిహోత్రసమానులు, ఇతర తాపసశ్రేష్ఠులు, న్యాయవృత్తులు వారివారి వర్ణాశ్రమాచార పద్ధతుల నీశ్వరు శ్రీరామచంద్రమూర్తిని మిగుల సంతోషముతోఁ బూజించిరి.

—♦ ౨-వ సర్గము. విరాధుండు సీత నెత్తుకొని పోవుట. ♦—

సీ. అంగీకృతాతిథ్యుఁ ♦ డై రామచంద్రుఁడు, వేగుఁబోకట గల్య ♦ విధులఁ దీర్చి
విశ్వమానులచేత ♦ వీడుకోల్వడసి యరణ్యంబునం బోయి ♦ పుణ్యమూర్తి
నానామృగాకీర్ణ ♦ నానాతరూదీర్ణ, శార్దూలసూకర ♦ సైరిభాచ్ఛ
భల్లసమాక్రాంత ♦ ఝిల్లీనినాదిత, నిష్కూజబహుశకు ♦ నిప్రవేక
తే. ధ్వస్తవృక్షలతాగుల్మ ♦ వార వారి, హీనసలిలాశయారణ్య ♦ పృథివి దాని
నడుమఁగని యెనుమిత్రాగ్ర ♦ నందనుఁడును, జానకియు వెన్నడింపఁగ ♦ సంతసమున.

అవతారిక:—ఇట్లు సిద్ధసాధన నిష్ఠులును మోక్షమపేక్షించు వారు నగు ఋషులు సీతారామలక్ష్మణుల యెడఁ జేసిన కైంకర్యము లక్ష్మీదేవితోఁ గూడిన భగ

వంతునివిషయమై చేసినదిగను మఱియు నది భాగవతుని పర్యంతము చేసినదిగను నింతకుఁ బూర్వము కవి చెప్పెను. ఇఁక శరభంగాశ్రమమునులు రాక్షసవధార్థమై శ్రీరామునియెడఁ జేసిన శరణాగతిఁ జెప్పఁబోవుచున్నాఁడు: దానికై రామునియెడ శరణ్యత్వశక్తి పూర్తిని జూపఁదలఁచి విరాధవధ చరిత్రమును బ్రారంభించుచున్నాఁడు. కావుననే సంక్షేపరామాయణమున శ్రీరామచంద్రమూర్తి విరాధవధ శరభంగ దర్శనమునకుఁ గానుకఁగాఁ జేసికొని యతని దర్శించె నను తాత్పర్య మిచ్చునట్లు విరాధుని ప్రక్కఁజేసి శరభంగు దర్శించి యని చెప్పఁబడెను.

అంగీకృతాతిథ్యుఁడై = అంగీకరింపఁబడిన యతిథిపూజగలవాఁడై, శ్రీ భూవల్లభుఁడైన భగవంతుఁడు భక్తు లర్పించు పదార్థముల వెల చూడఁడు, శ్రద్ధాభక్తులే మాత్రమో చూచును. కావున ఋషులు పూలు, పండ్లు సమర్పించినను వారి భక్త్యతిశయమునుబట్టి సంపూర్ణమనస్సుతో నంగీకరించెను. కావుననే యారాముఁడాతిథ్య మంగీకరించి యని జెప్పక యంగీకారమునకుఁ బ్రాధాన్య మిచ్చుచుఁ దొలుత నది చెప్పఁబడెను. "కం॥ దళమైనఁ బుష్పమైనను । ఫలమైనను సలిలమైనఁ బాయని భక్తిం । గొలిచిన జను లర్పించిన । నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్"॥ అను భగవద్వాక్య మిట స్మరింపనగు. వేగుఁబోకటన్ = ఉదయకాలమందు, కల్య విధులు=ప్రాతఃకాల కృత్యములైన స్నాన సంధ్యావందనాదులు,అథ కల్య మహాస్త్వహే. నానా. విశ్వమానులు=సమస్తమునులు, వీడుకోలు=అనుజ్ఞ, అరణ్యంబునన్ = అడవియందు, అచ్చటనేయుండ నిష్టపడలేదని భావము.

నానామృగాకీర్ణ=అనేకములైన మృగములచే వ్యాపించినదియు, నానాతరూదీర్ణ=అనేకములైన చెట్లచే గొప్పదైనదియు, శార్దూల = పులులచేతను, సూకర = అడవిపందులచేతను, సైరిభ=కారెనుబోతులచేతను, అచ్ఛభల్ల=ఎలుఁగుగొడ్లచేతను, సమాక్రాంత = ఆక్రమింపఁబడినదియు, ఝిల్లీనినాదిత = ఈలపురుగుల ధ్వనులుగల దానిని, నిష్కూజ = ధ్వనిలేని, బహు=అనేకములైన, శకుని ప్రవేక=శ్రేష్ఠములైన పక్షులుగలదియును, విరాధుని భయముచేఁ బక్షులుగూడ శబ్దముచేయక యున్నవని భావము. ధ్వస్తవృక్షలతాగుల్మ=నశించినచెట్లు, తీఁగలు, పొదలు, వీని, వారము=

యనుజ్ఞ దీసికొని యడవియందే పోయి యనేకవిధములైన మృగములచే వ్యాపించి నదియు ననేకవిధములైన వృక్షములు గలదియు, పులులు, అడవిపందులు, కారు దున్నపోతులు, ఎలుఁగులు విస్తారముగఁ గలదియు గీఁయను నీలపురుగుల ధ్వనిగల దియు ధ్వనింపని యనేకములైన గొప్ప పక్షులు గలదియు, విరాధుని భయముచే నెవరు వచ్చి తీసికొని పోకుండుటచేఁ బడి చివికి నశించు చెట్లు తీఁగలు పొదలుగల దియు, నీరులేని మడుఁగులు, కలదియు నగు నడవి నడుమ దనవెంట సీతాలక్ష్మ ణులు రాఁగాఁబోవుచుండెను.

సీ. ఆయెడ శైలశృం♦గాభు మహాస్వనుఁ, బురుషాదు గంభీర ♦ భూరినయను
వికటమహావక్త్రు ♦ విషమోదరు, సుదీర్ఘ విషమబీభత్సక ♦ వికృతరూపు
హత్తగఁ గ్రొవ్వుక్రొ♦న్నెత్తురు వసిసెడి, పులితోలు గట్టి త్రి♦భువనములను
మ్రింగెడునో యను♦భంగి నాస్యము విచ్చి, యంతకురీతి భూ♦తాళిభీతి
తే. కారణుం డయి నాల్గువ్యా♦ఘ్రములు రెండు
వృకములును మూఁడు సింగముల్ ♦ పృషతదశము
హస్తిశిరమును శూలాగ్ర♦మందు గుదిగఁ
గ్రుచ్చి పెడబొబ్బ లిడుచున్న ♦ క్రూరు గనియె. ౧౯

శైలశృంగాభుఁ=కొండ శిఖరముతో సమానుని, మహాస్వనుఁ= గొప్పకంఠ ధ్వనిగలవానిని, పురుషాదుఁ = మనుష్యులఁ దినువానిని, గంభీర భూరినయనుఁ = లోఁతై పెద్దవగు కన్నులుగల వానిని, వికట మహావక్త్రుఁ=భయంకరమైన పెద్దనోరు గల వానిని- విషమోదరుఁ=మిట్టలు పల్లములుగనుండు కడుపుగల వానిని, సుదీర్ఘ విషమ=మిక్కిలి నిడివియు నెచ్చుతగ్గులుగల, బీభత్సక = మిక్కిలి భయంకరమగు, వికృతరూపుఁ = వికార స్వరూపముగల వానిని, ఆస్యము=నోరు, విచ్చి=తెఱచి, అంతకు రీతిఁ=యమునివలె, భూతాతిభీతికారణుండయి = ప్రాణికోటికి మిగుల భయము కలిగించువాఁడై, వృకములు= తోడేళ్ళు, పృషతదశము = పదిదుప్పులు, హస్తి శిరము = ఏనుఁగుతల, గుదిగ = గుంపుగ.

## తాత్పర్యము.

ఇట్లడవియందుఁ బోవుచుఁ బర్వత శిఖరమువలెఁ బొడవైన దేహము గలిగి గొప్పగా ధ్వనించుచు మనుష్యులఁ దినువాఁడును, లోఁతైన పెద్దకన్నులు భయంకరమైన పెద్దనోరు మిట్టపల్లములుగల కడుపు మిగుల నిడివియై భయంకరమైన వికారాకారము గలిగి క్రొత్తగా నెత్తురు కాఱుచుండు పులి చర్మము గట్టికొని మూఁడు లోకములను మ్రింగుటకా యేమి యన్నట్లు నోరు తెఱచుకొని యమునివలె భూతములకు భయంకరుఁడై నాలుగు పులులు, రెండు తోడేళ్ళు, పది దుప్పులు, ఏనుఁగుతల శూలము కొనయందు గ్రుచ్చి పెద్ద బొబ్బలు పెట్టుచున్న క్రూరు నొకని రామచంద్ర మూర్తి చూచెను.

చం. అతఁడును రామలక్ష్మణుల ♦ నా జనకాత్మజఁ జూచి క్రుద్ధుఁడై
క్షితితల మెల్లఁ దెల్లదర ♦ గేరి లయాంతకుసట్లు భైరవా
తతనినదంబు నించుచు న♦టాటున మీఁదికిఁ బాటి జానకీ
సతిఁ గొనిపోయి యంకమునఁ ♦ జయ్యనఁ జేర్చి వచించె వారితోన్. ౨౦

క్రుద్ధుఁడై=కోపించినవాఁడై, క్షితి తలము=భూప్రదేశము. ఎల్లు + అదరన్=మిక్కిలి యదరఁగ; కేరి=విజృంభించి, లయాంతకుసట్లు = ప్రలయకాల యమునివలె, భైరవ=భయంకరమైన, ఆతత=విస్తారమైన, నినదంబు=ధ్వని, అటాటునన్ = తటాలున, అంకమునన్ = (చంకను) ఒడియందు, చయ్యనన్ = త్వరగా.

తాత్పర్యము.

ఆ విరాధుఁడు సీతారామలక్ష్మణులఁ జూచి కోపించినవాఁడై భూమి గడగడ లాడునట్లు ప్రలయకాలము నాఁటి యమునివలె విజృంభించి భయంకర ధ్వనులు గావించుచుఁ దటాలున వారిమీఁదికి బరువెత్తి సీతాదేవిని గ్రహించి తొండియం దుంచుకొని శ్రీరామలక్ష్మణులతో నిట్లనియె.

ఇచ్చట విరాధుఁడు సీతాదేవిని దాఁకి చంక కెత్తుకొన్నట్లు స్పష్టముగఁ జెప్పఁబడెను. రావణాసురుఁడు సీతను దాఁకుట సహింపక రావణుఁడు భూమితోనే పెళ్ళగించుకొనిపోయినాఁడనియు, అగ్నిలో డాఁగినదనియుఁ గల్పించినవారు దీని కేమి చెప్పెదరు. సత్యచరిత్రము వేఱు, భక్తికల్పితము వేఱు? భక్తిభావనచే సత్యము చెఱుపరాదు.

ఉ. ఎవ్వరు మీర లీ యడవి ♦ నిట్లు జటాజినధారులై కడుం
గ్రొవ్వున ఖడ్గచాపశర♦కోటి ధరించి చరింప భార్యతోన్?
జవ్వని యేల మానుల? క♦సాధుచరిత్రకులార ! చూడ మీ
నవ్వడి వేఱు, పాపులరు ♦ చావఁగలారు, మునీశదూషకుల్. ౨౧

జటాజినధారులై=జడలు చర్మములు ధరించినవారలై, ఖడ్గచాపశరకోటిన్ = కత్తి, విల్లు, బాణములును, జవ్వని=యువతి, అసాధుచరిత్రకులార = చెడునడవడిగల వారలారా, నవ్వడి = జాడ, మునీశదూషకుల్ = మునీశ్వరుల కపకీర్తి తెచ్చువారు, ఋషివేషమునకు విరుద్ధములగు నాయుధధారణము స్త్రీసంగ్రహణ మపకీర్తికరము లని భావము, భార్యతోన్=విరాధుఁడు శ్రీరామలక్ష్మణుల నిరువురను జూచి సంబోధించుచు నీవద మనుపయోగించుటచే వాఁడిరువురు నొకతెనే భార్యగాఁ జేసికొని రని యభిప్రాయపడి, యది దుష్టకార్యము గావున నసాధుచరిత్రకులార యనెను. కొందఱు దీనిని మఱియొకవిధముగ సమర్థింపఁజూచెదరు. భార్యయనఁగా భార్యయు వదినెయు నగు స్త్రీతో నని లక్షణావృత్తిచే నర్థము. ఎట్లన 'ప్రాణభృతి ఉపదధాతి' యను శ్రుతివాక్యమున ప్రాణభృతి యనుపదమునకు ప్రాణభృతులు నుభయులు నని యర్థము చెప్పఁబడెనుగదా. మఱియు నీన్యాయము 'ఋతం పిబంతౌ' యను శ్రుతి

వాక్యము ననుసరించియున్నది గదా. కాఁబట్టి యిట నట్లే యర్థము చెప్పుట యుక్త మందురు. ఎట్లర్థము చెప్పినను సీత లక్ష్మణు భార్య యని విరాధుఁడు చెప్పెనని తప్ప ర్థము తోఁపకమానదు. అది ధ్వనిదోషమగును. కావున నీయర్థము సరిగాదు. వీరి వావివరుసలు విరాధున కేమి తెలియును? ఇరువురు మగవారు ఒకస్త్రీ యుండుటచే వా రిరువురకు నామె భార్య యనియే తలఁచెననుటయే సరియగు విధము. విరాధుఁడు లక్షణ గ్రంథములు చదివి లక్షణావృత్తి నెఱిఁగి సీతాలక్ష్మణులు వదినె మఱఁదులని గ్రహించియుండెనేని మునీంద్ర దూషకు లని యేలదూషించెను? విల్లు బాణములు ధరించుటచే నందు రేని అగస్త్యుఁడు విల్లు బాణములు ధరించి వేఁటాడుచుండినవాఁడు కాఁడా - అది పూర్వకాలమున మునివిరుద్ధచర్యకాదు - పరశురాముఁ డెవ్వఁడు?

## తాత్పర్యము.

మీ రెవ్వరు? ఋషులవలె జడలు, చర్మములు ధరించి మిక్కిలి పొగరుపట్టి కత్తి విల్లు బాణములు పూని భార్యతో నడవియందు సంచరించుచున్నారు. మునీ శ్వరులకు వయస్సాఁడుది యేల? దుష్టప్రవర్తనము గలవారలారా! మీజాడ వేఱు గాఁ గానవచ్చుచున్నది. మీరు పాపాత్ములు, మునుల కపకీర్తి తెచ్చువారు, మీరు నాచేఁ జావఁగలరు.

ఋషీశ్వరులకు భార్యలులేరా? అగస్త్యు డాయుధములు ధరించి వేఁటాడ లేదా. ఇందేది ఋషులకు విరుద్ధచర్య? ఋషులకు భార్య లున్నను వారి నాశ్రమ ములందే యుంచి మగవారు మాత్రమే బయట సంచరింతురుగాని వెంట వేసికొని తిరుగరు. ప్రయాణమై పోవుచున్నా రనిన నిరువురకు నొక భార్యయుండదు. ఇది వాని దృష్టికి విరుద్ధచర్యగాఁ దోఁచినది.

చం. వినుఁడు విరాధనామకుఁడ ♦ వీరుఁడ సంభృతశస్త్రపాణి నై
మునిజనమాంసఖాది నయి ♦ మోదమునం జరియింతు నీ వనిన్
మునుకొని పాపశీలుర మిమ్ము ♦ ముం బొరికొంచని నల్లఁ ద్రావి యీ
వనితను నాదు పెండ్లముగ ♦ వారక కైకొనువాఁడ నమ్ముఁడీ. ౨౨

సంభృతశస్త్రపాణినై = శస్త్రములను జేతధరించినవాఁడనై, మునిజనమాంస ఖాదిని = మునుల మాంసమును భక్షించువాఁడను - అనిన్ = యుద్ధమందు - నల్ల = నెత్తురు.

## తాత్పర్యము.

నావృత్తాంతము చెప్పెద వినుఁడు, నాపేరు విరాధుఁడు, వీరుఁడను గావున నాయుధములు చేత ధరించి మునిజనులఁ జంపి వారి మాంసమును దినుచు సంతోష ముతో నీ యడవియందు సంచరించుచుందును. పాపాత్ము లగు మిమ్ము యుద్ధమందుఁ జంపి మీ నెత్తురు ద్రావి యీ యాఁడుదానిని నా పెండ్లాముగఁ జేసికొందును, నమ్ముఁడు.

కం. అనుచు విరాధుఁడు గావర,మునఁ బల్కినపల్కు విని ప్ర♦భూతప్రుభీతిన్
జనకసుత యోరుగాలికిఁ,బెనుపఱి కంపించు కదళి♦విధమున వడఁకెన్. ౧౩

కావరమునన్=గర్వమున, ప్రభూతపు భీతిన్=అధిక భయముచే, పెనుపు, అఱి=పెంపు చెడి, కంపించు=వణఁకు, కదళి=అరఁటిచెట్టు.

తాత్పర్యము.

ఆ విరాధుఁడు చెప్పినమాటలు విని సీతాదేవి మిగుల భయపడి పెద్దగాలికి నరఁటిచెట్టు వలె వడఁకెను.

కం. సీతాసతి సాధ్వసమతి, దైతేయాధిపతియంక♦తలమున వణఁకన్
వీతసహజముఖరుచియై, సీతాపతి యనుజుతో వ♦చించెను వనటన్ ౧౪

సాధ్వసమతి = భయపడిన మనస్సుగలది, దైతేయాధిపతి = రాక్షసశ్రేష్ఠుని యొక్క, వీత=పోయిన, సహజ=స్వభావసిద్ధమైన, ముఖరుచియై=ముఖకాంతి గలదై, వనటన్=దుఃఖముతో.

తాత్పర్యము.

సీతాదేవి భయపడినదై స్వభావసిద్ధమైన ముఖకాంతి చెడి తెల్లఁబోయి రాక్షసుని రొండియందు వణకుచుండుట చూచి శ్రీరామచంద్రమూర్తి దుఃఖించుచు లక్ష్మణునితో నిట్లనెను.

ఉ. కంటివె లక్ష్మణా జనకు♦గాదిలిపుత్రిక నాదు భార్య వా
ల్గంటి నితాంతసౌఖ్యరత ♦ క్ష్మావరనందిని భవ్యశీల లో
నంటినభీతిఁ గ్రూరదను♦జాధము నంకమున న్వణంకెడిన్
బంటవలంతికన్నె కెటు♦వంటి మహాపద వచ్చెఁ దమ్ముఁడా. ౧౫

గాదిలి=ప్రియమైన, వాల్గంటి=నిడుపాటి కన్నులు గలది, నితాంతసౌఖ్యరత = మిక్కిలి సౌఖ్యమందుఁ బ్రీతిగలది, క్ష్మావరనందిని=రాచకూఁతురు. భవ్యశీల = శుభకరమైన నడవడి గలది, లోన్=మనస్సులో. పంటవలంతి కన్నెకు=భూమిపుత్రికకు.

తాత్పర్యము.

లక్ష్మణా! జనకమహారాజు ప్రియపుత్రి, నా భార్య, నిడివికన్నులు గలది, రాచబిడ్డ, మిగుల సుఖ మపేక్షించునది యగు సీతాదేవి మనస్సులో నాటిన భయముచే రాక్షసు రొండియందు నెట్లు వణఁకుచున్నదో చూచితివా? తమ్ముఁడా! భూమికన్యకకు నెటువంటి గొప్పయాపద వచ్చెరా!

ఉ. ఏయది కోరి కానలకు ♦ నేగు మనె న్నను మధ్యమాంబ కై
కేయి ఫలించె నిప్పు డది, ♦ క్షిప్రగతిం దన పట్టి రాజ్యముం
జేయుటమాత్ర గోరక వి♦శిష్టజనప్రియు నన్నుఁ గానలన్
ద్రోయఁగ దీర్ఘదర్శిని మ♦నోవిభుఁ గోరుట దీనికే కదా. ౧౬

మధ్యమాంబ=నడిమితల్లి, కౌసల్యాసుమిత్రలతోడఁ జెప్పినపుడు కైకమూఁడవది, భార్యలనందఱ నుద్దేశించి చెప్పినపుడు మధ్యమ. లేక మఱియొక విధమున సమాధానము చెప్ప వచ్చును. భారతమందు 'కుంతీసుత మధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్,' అని యర్జునుఁడు చెప్పఁబడెను. కావున మధ్యముఁడనఁగా మూఁడవవాఁడని సమాధానము చెప్పుదురు. అటు గాకున్నఁ గుంతీ పుత్రులలో నర్జునుఁడు కడపటివాఁడే కదా. క్షిప్రగతిన్=శీఘ్రముగా, తనపట్టి=తనబిడ్డ, తన కొడుకు. పట్టి శబ్దము బిడ్డశబ్దమువలెఁ గొడుకునందుఁ గూఁతునందు వర్తించును. అపత్య శబ్దము వలె. విశిష్టజన ప్రియున్=అందఱ జనులకుఁ బ్రియుఁడైన వానిని. కైక రామచంద్రమూర్తిని నడవులకుఁ బంపఁగోరుటకు నాయన విశిష్టజన ప్రియుఁ డగుటయే కారణము, దీర్ఘదర్శిని = దూరాలోచనగలది, మనోవిభున్=భర్తను, దీనికే=సీతాదేవి యిట్లు వారింపఁబడుటకే.

## తాత్పర్యము.

కైకేయి యే ప్రయోజనముఁగోరి నన్నడవులకుఁబొమ్మని కోరెనో యది మిగులఁ దడవులేక యల్పకాలమందే లభించెను. ఆమె దూరాలోచన కలది కావున సర్వజనప్రియుఁడగు నేను నగరంబున నున్న భరతునకు రాజ్యము స్థిరపడదు. ప్రజలందఱు నతనికి వశపడరు; పైపెచ్చు నాయందలి ప్రీతిచే నతనితో విరోధింతురు, కావున నన్ను నడవులకుఁ బంపిన నావెంట సీతాదేవి పతివ్రత కావునఁ దప్పక వచ్చును. ఈ యడవులందే రాక్షసులవాఁతఁబడియో కష్టములు సహింపలేకయో చచ్చును. ఆమె చచ్చెనా రాముఁడు బ్రదుకఁడు. ఆమె తోడ వాఁడును జచ్చును. రాజ్యము భరతునకు స్థిరపడును. అని యిట్లాలోచించి కదా తనకొడుకునకు రాజ్యము మాత్రము గోరక నన్ను నడవులకుఁ బొమ్మనెను. ఆమె కోరిక కొలఁదికాల మందే ఫలించెను.

కైకేయి తొలుతఁ దెలివితక్కువ దగుటచేఁ గాముకయై రాముని రాజ్యభ్రంశము గోరినను ఆవల సౌమ్యయై యా యభిప్రాయము వదలినట్లు చిత్రకూటంబునందలి చరిత్రమువలనఁ దెలియనగును గదా! అట్లు పశ్చాత్తాప పడిన పిమ్మట దోషుల దూషింపవచ్చునా ?

చిత్రకూటమందలి చరిత్రము వలనఁ గైక యభిప్రాయము మాఱిన దని చెప్ప వలను పడదు. ఆమె కట్టి మనస్సుండినఁ దనదోషమును జెప్పి యొప్పుకొని యూరికి రమ్మని ప్రత్యేకముగఁ బిలిచి యుండవచ్చును. ఆ మాట యామె నోర రాలేదు. భరతుఁడు తల్లికి బుద్ధిచెప్పితి ననెను. కాని యా బుద్ధి యెంతమాత్ర మామె తలకెక్కెనో తెలియదు. రాముఁడూరికి రాకపోయిన భరతుఁడు రాజ్యముచేయక యేమి చేయఁ గలఁడు అను నభిప్రాయ మామె గలదై యుండవచ్చును. అట్టులే యనుకొందము. అయినను,

సత్పురుషులకుఁ బరులు నింద్యులైనను నిందింపవచ్చునా? కావున రాముఁడు పరుల దోషములను హృదయమునఁ గలవాఁడు కాకపోలేదు, అవి మనస్సున నాఁటి యుండినను బైకి నిర్మత్సరునివలె నటించెను.

అట్లు చెప్పఁబనిలేదు. ఎదుటివారి దోషములు మఱచిపోయినను కష్టములు ప్రాప్తించినపుడు అవి మనస్సునకు రాకపోవు. మన స్వవిషయమందుఁ బరాపకారమో బాధయో మఱచియుండినను ఏదైన సందర్భము పడినపు డది జ్ఞప్తికి వచ్చుట లేదా?

సామ్యదశయందు మనోగత మెంతదాఁచినను తీవ్ర శోకము నందు స్వప్నమందుఁ బానాదులచేఁ గాని యితర కారణములచేఁ గాని మనస్సు స్వాధీనమందు లేనపుడు మనస్సునందున్నట్లు బయలుపడును, అను నీతి దీనివలన నెఱుఁగ నగును.

కం. జనకుని మరణముకంటెను, గన రాజ్యశ్రీ హరణము ♦ కంటెను సీతా
వనజాక్షి నన్యుఁ డంటుట, ఘనతర మగు దుఃఖమునకుఁ ♦ గారణ మయ్యెన్. ౨౨

ఇప్పు డేమి యంతవిపత్తు వచ్చెను? ఏల దుఃఖించెద వనఁ జెప్పుచున్నాఁడు. రాజ్యశ్రీ = రాజ్యలక్ష్మి, హరణము = అపహరింపఁబడుట.

తాత్పర్యము.

జనకుని మరణవార్త వినుటవలనఁ గలిగిన దుఃఖముకంటెను రాజ్యము పోవుట వలనఁ గలిగిన దుఃఖముకంటెను సీతాదేవి నితరుఁడు తాఁకుట మిగుల దుఃఖమును గలిగించెను.

ఇచ్చటఁ జిన్నసందేహము: రాజ్యశ్రీ హరణముకంటె సీతాహరణ మెక్కువ దుఃఖము కలిగించె ననుటచే రాజ్యహరణము కొంచెమైన దుఃఖము కలిగించెఁ గదా? అయోధ్యాకాండమందుఁ దన వలనఁ బరులకుఁ గలిగిన దుఃఖమునకై తాను దుఃఖించెను, గాని రాజ్యము పోయెనని దుఃఖింపలేదని చెప్పఁబడెనే, అదియెట్లు?

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యా, స్తాం తితిక్షస్వ భారత. భ॥ గీ.

చలివేఁడుములు సుఖదుఃఖములు లోనైనవి మనము వలదన్నను గావలయునన్నను వచ్చును బోవును, నిత్యములు గావు. కావున వీనిని సహించుకొనుము, అని కృష్ణభగవానుఁ డుపదేశించెను. సహించుకొమ్మని చెప్పెనుగాని యవి యంటకుండఁ జేసికొమ్మని చెప్పలేదు. ఏల? అది యసాధ్యకార్యము. కావున బుద్ధిమంతుఁ డగువాఁ డవి వచ్చినపుడు రానిమ్మని వానిని దనవశమున నుంచుకొనును గాని వానికి వశపడి యజ్ఞుని వలె సంతోషశోకములకుఁ బాలుపడఁడు. ఇది యోగిలక్షణము. సుఖము దుఃఖము మనస్సునకే తగులదేని యా జీవి జడాయిమై యుండవలయును. చెట్లు కూడ శీతోష్ణబాధలు గల చిహ్నములు కనఁబఱచును, మనస్సున కంటనిది లేనట్లే.

కం. అని శోకబాష్పయుతలో, చనుడై వగపడెడి రామ ♦ చంద్రుని మోముం
 గని క్రుద్ధుండై లక్ష్మణుఁ, డనియెన్ రోఁజుచును మారు♦తాశనలీలన్. ౨౮

శోకబాష్ప=శోకముచేఁ గలిగిన కన్నీళ్ళతో, యుత=కూడిన, లోచనుఁడై = కన్నులు గలవాఁడై, వగ పడెడి=దుఃఖించు, రోఁజుచును=బుసకొట్టుచు, నిట్టూర్పులు విడుచుచు, మారుతాశనలీలన్ = పామువలె, పాములకు గాలి యాహారము.

ఇచ్చట శ్రీరామచంద్రమూర్తి కన్నీరుగాఱ నేడ్చెనని యున్నది. ఆపద లందు ధైర్యగుణము సజ్జనలక్షణ మని నీతిశాస్త్రము చెప్పుచుండ శ్రీరామచంద్రమూర్తి యేల యేడ్చెను?

1. విరాధుఁడు సీత నెత్తికొనిపోయెను. ఇఁకఁ దనకు భార్య యనునది లేదనియా?

2. విరాధునిఁ దాను వధించినను విరాధుఁడు సీతను దాఁకెను గావున నామె పాతివ్రత్యము చెడెను. ఆకారణముచే నిఁక నామెను భార్యగా స్వీకరింపరాదనియా?

3. సవతితల్లి కోరికయే నెఱవేఱెననియా?

4. రాక్షసుని చేతిలోఁ జిక్కి సీత యేమి బాధపడునో యనియా?

5. వానప్రస్థాశ్రమము నందుండి హింసమాని తపంబు సేయఁ దలచుఁ నాకీ హింసాకర్మము దాపరించెనే యనియా?

ఉత్త:— మొదటిదికాదు. పదునాలుగు సంవత్సరములు సీతారాములు బ్రహ్మచర్యదీక్ష వహించియుండిరి. సీతాదేవి తనకు వనయాత్ర దేహయాత్ర సుఖముగా జరుగుటయందు సహాయురాలని దుఃఖించెనే కాని రతిసుఖము లేదాయెనని యేడ్చిన వాఁడు కాఁడు. (ప. ౯౯౯-౧౦౦౦.)

రెండవదికాదు. పదినెలలు తన పరోక్షమున రావణాసురు స్వాధీనమందుండిన సీత యందుఁ దనకు సందేహము లేదని చెప్పెను. అట్టివాఁడు తన యెదుటనే యున్నప్పుడు సందేహించునా? ఆమె దుఃఖ మా సందేహమును బరిష్కరించుచున్నది.

మూఁడవదికాదు. కైకకోరిక నెఱవేఱునని తోఁచియే యుండిన యెడలఁ బదునైదవ సంవత్సరము ప్రథమ దినంబున నయోధ్యకు వచ్చెద మని చెప్పియే యుండఁడు. కనుక నా సందేహ మాయనకు లేదు.

నాలవదికాదు. సీతాదేవిని రాక్షసుఁడు చంపునని బాధపెట్టునని శ్రీరాముఁడు భయపడ లేదు. వాఁడట్టి కార్యము చేయఁజాల డని తెలియును.

ఐదవదియుఁగాదు. వానప్రస్థాశ్రమ మందుండిన ఋషీశ్వరు లగస్త్యాదులు మాంసశ్రాద్ధము పెట్టుచుండిరి. అంతియగాక శ్రీరామచంద్రుఁడే మాంసాహారము గ్రహించినటు లొకటిరెండు చోటులఁ జెప్పఁబడెను. (ఇది సందిగ్ధవిషయము.) కావున నిదియు సరియైనకారణము గాదు. అసాధుహింస హింస గాదు. 'అహింసాఽసాధుహింసేతి శ్రేయాన్ ధర్మ పరిగ్రహః॥' భా.12-15-49.

అటయిన వేఱొక కారణ మేమియనఁ గొంపలు విరాధుఁడు సీతాభక్తుఁడు, అట్టి వానిని జంపవలసి వచ్చెనే యని దుఃఖించె నందురు. వాస్తవకారణము రామచంద్రమూర్తియే పంటవలంతి కన్నె కెటువంటి మహాపద వచ్చెఁ దమ్ముఁడా యని తెలిపెను. ఇది యాశ్రిత విరహాసహన మను మార్దవ గుణమును పరదుఃఖాసహన మను కారుణ్యమును దెలుపును. "వ్యసనంబులు జనములకును బొసఁగినఁ దా నధిక దుఃఖమును బొందును." (అయోధ్య. ౬౬.) అనుదాని కిది లక్ష్యము.

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పి శోకముచేఁ గన్నీళ్లు కన్నులఁ గ్రమ్మఁగా వ్యసనపడుచున్న శ్రీరామచంద్రమూర్తి ముఖముఁ జూచి కోపించి పామువలె బుసకొట్టుచు లక్ష్మణుఁ డిట్లనియెను.

శా. గీర్వాణాధిప తేజ! భూతములకుం ♦ గీర్తింప నాథుండవై
గర్వంబేది యనాథు నట్లు కడుదుః♦ఖం బందె దే లన్న? కిం
కుర్వాణుండను నేను లేనె? యిదె మ♦త్క్రూరాస్త్రధారాహతిన్
దుర్వారోద్యమబాహుకేళిని విరా♦ధు న్నేలపా ల్చేసెదన్.　　౨౪

గీర్వాణాధిప తేజ=దేవతలకుఁ బ్రభువైన విష్ణుని తేజస్సువంటి తేజస్సుగలవాఁడా, గీర్వాణులు=దేవతలు, వీరిలో బ్రహ్మేంద్రాదులు చేరినవారే, వీరి కందఱకు నధిపతి భగవంతుఁడు విష్ణువే. కావున విష్ణుతేజా యనియే యర్థము చెప్పవలయును. అటుల చెప్పిననే భూతములకు నాథుండవై యనువాక్యముతో సామరస్యము కుదురును. విష్ణువు భూతముల కన్నిటికి నాథుఁడు కదా, భూతములకు = సమస్త చరాచర రూపక ప్రాణులకు, గర్వంబేది=గర్వముచెడి, అనాథునట్లు=దేబవలె, కింకుర్వాణుఁడను=దాసుఁడను=ఏమి చెప్పినను జేయువాఁడు, మత్=నాయొక్క, క్రూరాస్త్రధారా=క్రూరములైన కఱకు బాణముల, హతిన్=దెబ్బచే, దుర్వార=అడ్డగింపరాని, ఉద్యమ=ప్రయత్నముగల, బాహు=భుజముల, కేళిని=ఆటలయందు, నేలపాల్ చేసెదను=నేలఁబడఁగొట్టెదను.

భూతములకుం గీర్తింప నాథుండవై యనుటచే స్వరూపజ్ఞానమును స్మరింపఁ జేయుచున్నాఁడు. తన్ను నమ్మివచ్చిన దాని కింతకష్టము వచ్చెనేయని శోకావేశముచేఁ గలిగిన స్మృతి దొలఁగ స్వరూప స్వభావము స్మృతికిఁ దెచ్చుచున్నాఁడు. కావున వాస్తవార్థము వారు తెలియనివారు గారు. ఈ ప్రకారము లక్ష్మణుఁడు యుద్ధకాండమందు సీత నింద్రజిత్తు చంపెనని హనుమంతుఁడు చెప్పినపుడు రామచంద్రమూర్తి శోకావేశముచే మైమఱచియుండ "నిను మహాత్ముఁడైన యాత్మని నెఱుఁగలేక కటనీవ యిట్లు తపియింపఁ జేయ నేనేమి నేర్తు" నని చెప్పెను. 'స్మారయే త్వాం నశిక్షయే' నీకు జ్ఞప్తికిఁ దెచ్చుచున్నాను. గాని నేర్పలేదని సీతాదేవి చెప్పినట్లు లది స్మృతికిఁ దెచ్చుటమాత్రమే. పరులదుఃఖము తన దుఃఖముగా నెంచుకొనుటే దయ.

తాత్పర్యము.

విష్ణుతేజా! సమస్త భూతకోటికి నీవే దిక్కయ్యు చిత్తౌన్నత్యము విడిచి దిక్కులేని వానివలె నేల యిట్లు దుఃఖించెదవు. ఇప్పు డేమి చెడినదని నీకింత దుఃఖము, ఏపనియైనఁ జేయుటకు నీ సేవకుఁడు వీఁడు లేఁడా? నీ సేవచేయుట కేగదా వీఁడు వచ్చుట. అట్లైన నిప్పుడు నీ వేమి చేసెద వందువా, నాకఱకు బాణములచే వీనిని నా భుజప్రతాప కేళ నేల బడఁగొట్టెదను. వీఁడెక్కడికిఁ బోఁగలఁడు.

కం. భరతునిపైఁ బుట్టినదు,ర్భరకోపము నేఁడు వీని♦పై, శైలముపై
సురపతి వజ్రము విడిచిన, శరణిని నే విడుచువాఁడ♦గాకుత్థ్సవరా. ౩౦

దుర్భరకోపము=సహింపరాని కోపము

తాత్పర్యము.

ఆనాఁడు భరతునిపైఁ బుట్టిన కోపమునకు నాయన శరణాగతుఁ డగుటచేఁ బరిహారము లేక వ్యర్థమయిపోయెను. ఆ కోపమును నింద్రుఁడు కొండమీఁద వజ్రమును విడిచినట్లు వీనిపై విడిచెదను.

భరతుఁడు శ్రీరామచంద్రమూర్తిని జిత్రకూటమందు నీ వయోధ్యకు వచ్చి రాజ్యమేలు మని ప్రార్థించెను గదా. దీనివలన ముందు చేసినది యజ్ఞానకృత మని యేర్పడెను గదా.

అట్లుండ రామలక్ష్మణులు భరతాదులు రాజ్యాపహారకు లని యాక్షేపించుట తప్పుగాదా యని యాక్షేపము.

సీతా రామలక్ష్మణులకు ముప్పురకుఁ జిత్రకూటమునకు భరతుఁడు వచ్చి పోయిన పిమ్మట నాయన విషయమై సదభిప్రాయమే కాని దురభిప్రాయము లేదు.

భ్రాతలందఱు భరతుని పాటిగారని శ్రీరామచంద్రమూర్తి చెప్పెను. లక్ష్మణుఁడో (అరణ్య, పద్యములు ౨౨౦ మొదలు ౨౨౪ చూడుడు) "మనుజులలోను దండ్రిని గుమారుఁడు పోలఁడు పోలుఁదల్లినే యనియెడి లోకవార్త వృథయై చనెఁగైకయి పట్టియందు'' నని చెప్పెను. సీతాదేవియు "భ్రాతృవత్సలుఁడైన భరతుండు నాకయి యక్షౌహిణీ సేన నంపునయ్యా'' అని ప్రీతితోనే పలికెను.

కైక విషయమందు ముప్పురు ప్రసన్నులు గారు, నిష్ఠురము లాడుచుండిన వారే, ఏల?

కైక చిత్రకూటమందు నేను దెలివిమాలిన పనిచేసితిని క్షమింపుమని శ్రీరామచంద్రమూర్తిని గోరలేదు. భరతునకు భయపడి యాయనకు నెదురాడలేక మౌనము వహించి యుండెనుగాని వాస్తవముగ నామె పశ్చాత్తప్తయైనదా యనునది సందిగ్ధ విషయమే. తన కొడుకుకూడ వానప్రస్థాశ్రమస్థునివలె సర్వ భోగములు వదలి దుఃఖపడుచున్నాఁడే. శ్రీరామచంద్రమూర్తి మరల నయోధ్యకు వచ్చిన రాజ్యము లేకున్న మానెను. కడుపునిండఁ గూడు కంటినిండ నిద్ర ఒడలినిండ గుడ్డయైనఁ

గట్టుకొని సుఖపడనిమ్మని రామచంద్రమూర్తి యయోధ్యకు వచ్చుటకు సమ్మతించియైన నుండవచ్చును. లేదా తా నాలోచించిన ప్రకారము శ్రీరామచంద్రమూర్తి యడవిలో మరణించెనా భరతుఁడు రాజ్యము గ్రహింపక యేమి చేయఁగలఁడు. కావున రామచంద్రమూర్తి యయోధ్యకు రాకపోనిమ్మని తలచినను దలఁచియుండవచ్చును. ఇది యిట్లని నిర్ధారింపఁదగిన యాధారములు లేవు. ఆమె పశ్చాత్తాపపడినట్లు భరతుని వాక్యము దప్ప మఱి యే యాధారములేదు. ఒకవేళ పశ్చాత్తప్తయైనదనియే గ్రహింతము. పగపూని కొట్టుగాల్చి వాఁతవేసి నాఁడునా తెలియక చేసితిని రా యని చెప్పినంత మాత్రమున బాధపోవునా! తెలియకచేసెనని సమాధానపడినను వ్రణము సహింపరాని బాధకలిగించినపు డామె యిట్లు చేసెఁగదా యని స్మరణమునకు రాకయుండునా? కావునఁ గైకను సీతారామలక్ష్మణు లెగ్గాడుట స్వభావ విరుద్ధము కాదు. దీనిపై నొక యాక్షేపము. ఓయీ నీవు చెప్పినది లోకసామాన్యవిషయము. శ్రీరామచంద్రమూర్తి లోకసామాన్యుఁడుగాఁడు, "అపకారశతము సల్పిన విపరీతము నెంచఁ డాత్మ విజ్ఞుండగుటన్" అని కదా యాయన విషయము చెప్పఁబడెను. "వానియెడ నుండెనేని నేదేని దోష మద్ది గర్హ్యాంబుగాదు సదాళులకును" యుద్ధ ౩౬౯ ప. ఇట్టి రామచంద్రమూర్తి కైకయందు దోషమెంచవచ్చునా? శ్రీరామచంద్రమూర్తి యపరాధము లెంచమి యెప్పుడు? యావజ్జీవము దోషములే చేయుచుండినను వానినెంచఁడా? కొంతకాలముచేసి పశ్చాత్తప్తుఁడై రక్షింపుమని కోరినప్పుడా? అపరాధమే మనస్సునకు రాదనిన విరాధ రావణ వాలి ఖరదూషణ లవణాదుల దండింపవలసిన కారణమే లేదు. 'వినాశాయచ దుష్కృతా'మ్మను మాటయే వ్యర్థమగును. లోకమున నింటింటఁ బాపములు ప్రబలిపోవును. గృహమునందు భార్యలు బిడ్డలు సేవకులు దండమునకు వెఱచి లోబడియున్నవారే కాని యధర్మమునకు వెఱచి ధర్మమార్గమందుండువారు నూటికొక్కరులేరు. అట్లే దేశమందును బ్రజలు రాజదండభీతి ధర్మమందున్నవారు కాని ధర్మము నిమిత్తమై ధర్మమందుండువారు లేరు. భగవంతునియందుఁ బ్రభువునందు గృహస్థునియందు నిగ్రహశక్తి లేకుండిన లోకయాత్ర యొకనాఁడైన జరుగదు. కావున నెవరెన్ని దోషములు చేసినను బాహి పాహియని పాదములపైఁ బడిన వారిని వారి దోషము లెంచక రక్షించును. సీత రావణుని కిదియేకదా బోధించెను.

'తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ క్షిపామ్యజస్రమశుభా నాసురీ ష్వేవ యోనిషు.' భ-గీ. అట్టి విరోధులను క్రూరులను నరాధములను సంసారమందు సర్వదా యసురయోనులందుఁ ద్రోయుదును' అనియే భగవంతుఁడు చెప్పెనుగదా. "చెల్లియుండియు సైరణసేయునతఁడు" పుణ్యపురుషుఁడు గాని యసమర్థుని సైరణ శ్లాఘ్యమా? కావున శ్రీరామచంద్రమూర్తి కైకయందు దప్పెంచుట తప్పుగాదు. మఱియును నిది లోకవిడంబనార్థమని యెఱుంగవలయును.

కావున నిట్టి సందర్భముల నిట్లు తలఁచుట దోషముగాదని మనము గ్రహింప వలయును.

కం. విస్ఫుట మద్భుజబల వే, గస్ఫురదిషునికర మితనిఁ • గ్రక్కున వక్షః
ప్రస్ఫోటంబుగ నాటుచుఁ, బ్రస్ఫీతజవంబునం బ • రాసువుఁ జేయున్. ౩౧

విస్ఫుట=స్పష్టమైన, మద్భుజ=నా బాహువులయొక్క, బల=బలముయొక్క, వేగ=వేగముచే, స్ఫురత్=పోవుచున్న, ప్రకాశించుచున్న, ఇషునికరమున్=బాణ సమూహమును, వక్షః ప్రస్ఫోటంబుగన్=ఱొమ్ము చీల్చునట్లుగ, ప్రస్ఫీతజవంబునన్= మిక్కిలి యధికమైన వేగమున, పరాసువున్=పీనుగును, (ప్రాణములు పోయినవాని)

తా త్ప ర్య ము .

స్పష్టమైన నా భుజబలముచే విడువఁబడి వేగముగఁ బోవు బాణముల సమూహము శీఘ్రముగ వీనిఱొమ్మును బగులఁజీల్చుచు మిక్కిలి త్వరతో వీని బీనుఁగును జేయును.

## ౩-వ సర్గము.

కం. అని బలియుండు సుమిత్రా, తనయుఁడు రాక్షసునిఁ జూచి • దరహాసముతో
ననె నెవ్వఁడ వోరీ యీ, వనమున నీ వేల తిరుగు • వాఁడవు సుఖివై. ౩౨

దరహాసము=చిఱునవ్వు.

తా త్ప ర్య ము .

ఈ ప్రకారము శ్రీరామచంద్రమూర్తితోఁ జెప్పి రాక్షసువంకఁ దిరిగి బల వంతుఁడైన లక్ష్మణుఁడు చిఱునవ్వుతో ఓరీ! నీ వెవ్వఁడవు. ఈ వనమునందు నీ వేల తిరుగుచున్నాఁడవు.

కం. అని యడుగ నా విరాధుం, డనె వారలఁ జూచి యెవఁడ • వని నన్నడుగం
గను జాలెడి మీ రెవ్వరు, చనియెద రెట కనిన రామ • చంద్రుం డనియెన్. ౩౩

తా త్ప ర్య ము .

ఈ ప్రకారము లక్ష్మణుఁ డడుగఁగా వారినిఁజూచి విరాధుఁడు నా వనమునకు మీరు వచ్చి నన్నెవ్వఁడ వని మీ రడిగెదరే; మీ రెవ్వరు ? మీ రెచ్చటికిఁ బోవు చున్నారు. అనిన శ్రీరామచంద్రమూర్తి యిట్లనియె.

కం. తెలియుమురా యిక్ష్వాకుసు,కులులము క్షత్రియులము వన • గోచరులము ని
ర్మలవృత్తుల మెవఁడవు ? కా, నలలోనఁ జరింపఁ గార • ణం బేమి ? యనన్. ౩౪

తా త్ప ర్య ము .

ఓరీ వినరా ! మే మిక్ష్వాకువంశమునఁ బుట్టిన క్షత్రియులము, అడవియందుఁ జరించువారము, నీ వనుకొన్నట్లు మేము పాపాత్ములముగాము, నిర్దోషమైన నడవడి గలవారము, నీవేమి ప్రభావము గలవాఁడవు. ఈ యడవిలో నేల తిరుగుచున్నాఁ డవు, అనిన వాఁ డిట్లనియె.

వసంతమంజరి. వినుము నాజనకుండు జయుఁ డను♦వీరుఁ డంబ శతహ్రదా
ఖ్య నిఖిలావనిఁ గల్గు దనుజని♦కాయ మెల్ల విరాధుఁ డం
చును వచించును నన్నుఁ దపమున ♦ సూర్యవంశ్య! వరంబు నేఁ
గొనితి శస్త్రముచేత మరణముఁ ♦ గూర కుండఁగ బ్రహ్మచేన్. ౩౫

తా త్ప ర్య ము.

నా తండ్రి జయుఁడు, నాతల్లి శతహ్రద, విరాధుఁడని భూమియందలి దనుజు లెల్ల నన్నుఁబిలుతురు నేను దపస్సుచేసి శస్త్రముచేతఁ జావకుండ బ్రహ్మచే వరముఁగొంటిని; వి+రాధుఁడు=ప్రేమ లేనివాఁడు, క్రూరుఁడని యర్థము, కావుననే యారాధింపఁ దగనివాఁడు, గౌరవానర్హుఁడు, దనుజులు నన్ను విరాధుఁ డందు రను టచే నిది తల్లిదండ్రులు పెట్టిన పేరుగాదు, వృత్తముచే వచ్చినపేరు.

వసంత మంజరి, నభభనరసవ గణములు.

౧౩ వ యక్షరము యతిస్థానము.

కం. ఛేదనభేదనముల వ్యా, పాదింపం బడక యుండఁ ♦ బడసితి వరముల్
బైదలిని విడిచి పాఱుఁడు మేదిని బ్రదుకంగ నిష్ట ♦ మేనియు మీరున్. ౩౬

ఛేదన=తునుకలు తునుకలుగ నఱకుటచేతను, భేదనముల్ = పగులఁగొట్టఁ బడుటచేతను, వ్యాపాదింపఁబడక = చంపఁబడక, పైదలి = స్త్రీ, సీతాదేవిని, పాఱుఁడు = పరువెత్తిపొండు.

తా త్ప ర్య ము.

నఱకఁబడుటచేతను జీల్పఁబడుటచేతను జంపఁబడక యుండునట్లు వరము సంపాదించితిని. బ్రదుక నిష్టముండిన నీ స్త్రీని వదలి మీరు పరుగెత్తిపొండు, ఈ స్త్రీని నాకు వదల రేని మిమ్ముఁ జంపను.

రామలక్ష్మణులు విరాధుని వధించుట.

చం. అన విని కోపరక్తనయ♦నాంబుజుఁడై రఘురాముఁ డి ట్లనున్
దనుజకులాధమా! ఖలగుణా! యిటు మృత్యువు రోసె దీవు, న
న్నని మొనఁ దాఁకియుం జనెద♦వా మెయితోడ, నటం చధిజ్య మా
ధనువున శాతమార్గణక♦దంబముఁ గూర్చి సురారి నేయుచున్. ౩౭

కోపరక్తనయనాంబుజుఁడు=కోపముచే నెఱ్ఱనైన నేత్రకమలములు గలవాఁడు, రోసెదవు=వెదకెదవు, అని మొనన్ = యుద్ధముఖమందు, మెయితోడన్ = దేహముతో, అధిజ్యము=ఎక్కుపెట్టఁబడినది, మార్గణ=బాణముల, కదంబము = సమూహము, సురారిన్ = రాక్షసుని.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము వాఁడు చెప్పఁగాఁ గోపముచేఁ గన్ను లెఱ్ఱచేసి శ్రీ రామచంద్రమూర్తి యోరీ! నీచరాక్షసుఁడా! దుష్టుఁడా! నీవై మృత్యువును వెదకుచు వచ్చి

తివి. యుద్ధమున నా యెదుటఁబడి మరల దేహముతోడఁ బోఁగలవా యని విల్లెక్కు పెట్టి పదునైనబాణముల సమూహమున రాక్షసుని వేయుచు.

ఉ. వెండియు రుక్మపుంఖమయి ♦ విశ్రుతవాయుసుపర్ణ వేగితో
చ్చండము నైన సప్తశిత ♦ సాయకపంక్తి బుధారివక్షము
ద్దండతఁ దూఱ నైవ నది ♦ దారితదానవ దేహ శైలమై
దండిగ రక్తదిగ్ధమయి ♦ ధారిణిఁ జొచ్చెఁ గృశానుతుల్యమై. ౩౮

వెండియున్=మఱియును, రుక్మపుంఖము=బంగారుపిడి, విశ్రుత=ప్రసిద్ధమైన, వాయు సుపర్ణ=గాలి గరుడులయొక్క, వేగితోచ్చండము=వేగముచే మిగుల భయంకరమైన, సప్తశితసాయకపంక్తి=ఏడుపదునైన బాణములవరుస, బుధారివక్షము = రాక్షసుని ఱొమ్ము, బుధస్సూరా సురే సౌమ్యే॥నా॥ దారిత=చీల్పఁబడిన, దానవ = రాక్షసునియొక్క, దేహశైలమై= పర్వతమువంటి దేహముగలదై, రక్త దిగ్ధము = నెత్తుటిచేఁబూయఁబడినది, కృశానుతుల్యమై = ఎఱ్ఱగా నుండుటచే నగ్నిహోత్రముతో సమానమైనదై.

తాత్పర్యము.

మఱియును బంగారుపిడులు గలిగి గాలి యొక్కయు గరుడుని యొక్కయు వేగముగలవైన యేడు పదునైన బాణములు వానిఱొమ్ము దూఱిపోవునట్లువేయఁగా నవి గొండవంటి వాని దేహముఁ బగులఁ జీల్చుకొని నెత్తుటితోఁ దడిసి యెఱ్ఱనై పోయి భూమిలోఁ బ్రవేశించెను.

చం.శరజనితోగ్రవేదనను ♦ జానకి డించియుఁ గేల శూలముఁ
సరభసవృత్తిఁ గొంచు రఘు♦సత్తమయుగ్మముఁ గిట్టి యార్భటుల్
పరఁగ లయాంతకుం డనఁగ ♦ వక్త్రము విచ్చుడు నన్నదమ్ములుం
గురిసిరి నిర్జరారి పయిఁ ♦ గ్రూరకలంబకదంబవర్షమున్. ౩౯

శర=బాణములచే, జనిత=పుట్టిన, ఉగ్రవేదనను=మిగులబాధచే, డించి=నేల విడిచి, సరభసవృత్తిన్=తొందరపాటుతోఁ గూడిన వ్యాపారముతో, రఘుసత్తమ యుగ్మము=ఇరువురు రాఘవులను, రామలక్ష్మణులను, కిట్టి=సమీపించి, లయాంతకుండు=ప్రలయకాలమునాఁటి యముఁడో యన, వక్త్రము=నోరు, నిర్జరారిపైన్ = రాక్షసునిమీఁద, క్రూర=తీక్ష్ణములైన, కలంబ=బాణములయొక్క,కదంబ = సమూహముయొక్క, వర్షమున్ = వానను.

తాత్పర్యము.

బాణములు తాఁకుటవలనఁ గలిగిన బాధ సహింపలేక జానకిని నేల వదలి పెట్టి శూలము తీసికొని రామలక్ష్మణుల నిరువుర సమీపించి సింహనాదముచేయుచుఁ బ్రలయకాలమునాఁటి యమునివలె మ్రింగుటకై నోరు తెఱవఁగా రామలక్ష్మణు లిరువురు నా రాక్షసుమీఁద బదునగు బాణముల వర్షము గురియించిరి.

కం. ఆ మార్గణవృష్టికి నగి, భీమవపుష్మంతుఁ డగుచుఁ ♦ బెంచిన మేనిన్
భూమిని రాలెను విశిఖ, స్తోమము పతి పఱపె వెండి ♦ తోరపు ములుకుల్ ౪౦

మార్గణవృష్టికిన్=బాణవర్షమునకు, నగి=నవ్వి, ఇంతమాత్రమా మీ శౌర్యమని నవ్వెను. భీమవపుష్మంతుఁడు =భయంకరమైన పెద్ద దేహముగలవాఁడు, విశిఖస్తోమము=బాణసమూహము, తోరపుములుకుల్=విశేషముగ బాణములు.

తా త్ప ర్య ము.

శ్రీరామలక్ష్మణులు వేసిన యీ బాణవర్షముచూచి మీ బాణములు నన్నేమి చేయగలవని నవ్వి తన భయంకరమైన దేహమును బెంచెను. ఇట్లు దేహము పెరుఁగఁగా నాటియుండిన బాణము లన్నియు రాలి నేలఁబడెను. శ్రీరామచంద్రమూర్తి మఱియు విస్తారముగ గొప్ప బాణములఁ బ్రయోగించెను.

ఉ. వారలు వేయు శాతశర♦వర్షముఁ గన్గొని నవ్వె రక్కసుం,
డూరక వారునుం గురిసి ♦ రుగ్రఖగంబులు, దాన నొచ్చి దే
వారి వరంబు పెంపునను ♦ బ్రాణము లెంతయుఁ జిక్కఁబట్టి యా
శూరుల వైచె వజ్రనిభ ♦ శూలమున న్గగనంబు వెల్గగన్. ౪౧

శాతశరవర్షము = పదునుగల బాణములవాన, రక్కసుండు = రాక్షసుఁడు, ఉగ్రఖగంబులు = భయంకరములైన బాణములు, దేవారి = రాక్షసుఁడు, చిక్కఁబట్టి=బిగఁబట్టి, వజ్రముతో సమానమైన శూలముతో, గగనంబు=ఆకాశము, వరంబు పెంపునను = వరము వలన వచ్చిన యాధిక్యముచే, ఇచ్చట నీ వర మిచ్చినవాఁడు శివుఁడని మహేశ్వర తీర్థీయము. "విరాధో హాటకపురే విధివ న్మా మపూజయత్ మదనుగ్రహవైశిష్ట్యా దవధ్య స్స సురాసురైః" అను శ్లోక ముదహరింప బడెను. ౩౫ వ పద్యమున బ్రహ్మచేఁ దాను వరము గొన్నట్టు విరాధుఁడు చెప్పెను. వీఁడిరువుర చేతను వరములు పొందెనేమో. ఖగము ఖ + గ=ఆకాశమునఁ బోవునది.

తా త్ప ర్య ము.

శ్రీరామలక్ష్మణులు కురియుచున్న పదును గల బాణములవాన చూచి రాక్షసుఁడు నవ్వెను. వారును వదలక మీఁదమీఁద బాణములను బ్రయోగించిరి. దానిచే మిగుల నొప్పి చెందినవాఁడై యీ రాక్షసుఁడు ప్రాణములు పోకుండ బిగఁబట్టుకొని యీ శూరులపై నాకాశము వెలుగునట్లు వజ్రముతో సమానమైన శూలమును విసిరి వైచెను.

కం. మండుచు వచ్చెడి శూలము, గండున రెండంబకముల ♦ ఖండించెను గో
దండగురుఁ డశని మేరువు, గుండన నది భూమియద్రువఁ ♦ గూలె న్నేలన్. ౪౨

గండునన్ = పౌరుషమున, బలమున, అంబకములన్ = బాణములచే, ఖండించెను = తునుకలుచేసెను, కోదండగురుఁడు = విలువిద్యయందు నాచార్యుఁడు, అశని = పిడుగు.

తా త్ప ర్య ము .

మండుచు వచ్చుచున్న యా శూలమునుజూచి శ్రీరామచంద్రమూర్తి దానిని రెండు బాణములచే నఱికెను. అదియును బిడుగు తాఁకున నేల దొరలు మేరువు నందలి గుండువలె భూమి కంపించునట్లు నేలఁబడెను.

కం. శూలమును గూల్చి కృష్ణ, వ్యాలంబులఁ బోలు తమ కృ♦పాణంబుల దో
ర్లీల వెలుఁగంగ నడిచినఁ, గాలాంతకతుల్యుఁ డప్ర♦కంప్యులఁ గేలన్. ౪౩

కృష్ణవ్యాలంబులు = నల్లత్రాచుపాములు, కృపాణంబులన్=కత్తులచే, దోర్లీల= భుజబలముయొక్క విలాసము, అడచినన్ = కొట్టగా, కాలాంతకతుల్యుఁడు= ప్రలయ కాలమునాఁటి యమునితో సమానుఁడు, అప్రకంప్యులన్ = చలింపఁజేయ సాధ్యపడని వారిని, కేలన్ = చేతులతో.

తా త్ప ర్య ము .

వాని శూలము విఱిగి నేలఁబడఁగా రామలక్ష్మణు లిరువురు వానిమీఁద దుమికి నల్లత్రాచుపాములవలె నున్న తమ కత్తులతో వానిని గొట్టిరి. ధైర్యముచే నేమియుఁ జలింపక తన సమీపమునకు వచ్చియున్న వారలను బ్రలయకాలము నాఁటి యమునివంటివాఁడగు నా రాక్షసుఁడు,

తే. పట్టుకొని యెత్తుకొని మింటఁ ♦ బాఱ వాని
తలఁ పెఱుంగుచు రఘుపతి దమ్ము ననియె
నితని యిచ్ఛకొలందిని ♦ నేగనిమ్ము
దనుజుఁ డరిగిన దే త్రోవ ♦ మనకు ననఁగ. ౪౪

మింటన్ = ఆకాశమందు, పాఱన్ = పరువెత్తఁగా, తలఁపు = ఆలోచన.

తా త్ప ర్య ము .

వారి నిరువురను బట్టుకొని యెత్తికొని యాకాశమునఁ బరువెత్తెను. అడవి నడిమి ప్రదేశమునకుఁ దీసికొనిపోయి యక్కడ వధింపవలయు నన్న వాని యాలో చన తెలిసికొన్నవాఁడై శ్రీరామచంద్రమూర్తి 'లక్ష్మణా! వీనియిష్టము వచ్చిన త్రోవఁ బోవనిమ్ము! వాఁడు పోయిన దే మనకుఁ ద్రోవ' యనెను.

౪-వ సర్గము.

ఉ. మూఁపున వారి బాలకుల♦ ముచ్చటఁ దాల్చి వనంబుఁబట్టి పోఁ
దీఁపుర మద్దిగాంచి భయ♦తీవ్రత జానకి దుఃఖభారముల్
సైఁపక యేడ్చె బిగ్గఱగ ♦ సత్యరతుల్ శుచి రాముఁ దమ్ము ని
ట్లేఁపఁగఁ గొంచుఁబోయెడిఁ గ♦దే దనుజుండు దయావిహీనుఁడై. ౪౫

బాలకుల ముచ్చటన్ = పిల్లవాండ్రనువలె, పోన్=పోఁగా, తీఁపురము = ఆగ డము, భయతీవ్రతన్ = భయముయొక్క యాధిక్యముచే, దుఃఖభారముల్=అతిశయ దుఃఖమును, సైఁపక = సహింపలేక, ఏఁపఁగన్ = బాధింపఁగ.

తాత్పర్యము.

పిల్లవాండ్ర నెత్తుకొన్నట్లు వారిని భుజములమీఁది కెత్తుకొని యడవిదారిఁ బట్టి పోవుచుండఁగా నా యాగడము చూచి సీతాదేవి మిగుల భయపడి దుఃఖాతిశయము సహింపలేక 'యయ్యో రాక్షసుఁడు సత్యవాదియైన శ్రీరామచంద్రమూర్తిని నిర్మలాంతఃకరణము గల లక్ష్మణుని హింసించుటకై తీసికొనిపోవుచున్నాఁడే యని గట్టిగా నేడ్చెను. సత్యవాది నిర్మలుఁడను విశేషణములు శ్రీరాముని కన్వయింపవచ్చును.

కం. నను మ్రింగు నిచట బెబ్బులు,లును దోడేళ్ళులును జిఱుత♦లును వీడుము వా
రిని నన్నుఁ గొంచుఁ బొమ్మో,దనుజోత్తమ నీకు మ్రొక్కె♦దఁ దయఁగనవే. ౪౬

తాత్పర్యము.

దానవోత్తముఁడా! నన్నొంటిగ విడిచి వారిని దీసికొని పోయితివేని నన్నిచ్చటఁ బెద్దపులులు తోడేళ్లు చిఱుతపులులు మ్రింగిపోవును. కావున వారిని వదలిపెట్టి నన్నుఁగొనిపోయి చంపుము. అటులైన వారైనను సుఖముగ జీవింతురు. వారులేని యెడ నేను జచ్చినదాననే కావున నీకు నమస్కరించెదను. వారిని విడిచి నన్నుఁగొని పొమ్ము.

చ. ధరణిసుతార్తవాక్యముల ♦ దాశరథుల్విని దైత్యుఁ జంపఁగాఁ
త్వరపడి రందు లక్ష్మణుఁడు ♦ వామభుజంబును రామభద్రుఁ డా
శరు కుడిచేయియు న్నఱక ♦ సాంద్రవలాహకసన్నిభుండు భీ
కరపవిధారఁ బర్వతము♦కైవడిఁ గూలె ధరాతలంబునన్. ౪౭

ధరణిసుతా = సీతాదేవియొక్క, ఆర్తవాక్యములన్=వ్యసనముతోడి మాటలను, వామభుజము = ఎడమభుజము, ఆశరు = రాక్షసుని, అనఁగా, విరాధుఁడు లక్ష్మణుని గుడిభుజముమీఁద శ్రీరామచంద్రుని నెడమభుజముమీఁద నెత్తుకొనిపోవుచుండెను. కావున లక్ష్మణుఁడు వాని యెడమచేయి నఱక సాధ్యపడెను. అట్లే శ్రీరామచంద్రమూర్తి కుడివైపు లక్ష్మణుఁ డుండెనని గ్రహింపనగు. సాంద్రవలాహకసన్నిభుండు=కారుమబ్బుతో సమానుఁడు. భీకరపవిధారన్=భయంకరమైన వజ్రముయొక్క వాఁడి మొనచే.

తాత్పర్యము.

సీతాదేవి యేడ్చిన మాటలు విని శ్రీరామలక్ష్మణులు రాక్షసుని జంపఁగాఁ ద్వరపడినవారైరి. అందు విరాధుని కుడిభుజమందున్న లక్ష్మణుఁడు వాని యెడమచేతిని నఱికెను. శ్రీరామచంద్రమూర్తి యెడమభుజమున నున్నవాఁడగుటచేఁ గుడి భుజమును నఱకెను.

ఇక్కడ భుజమనఁగా నంసముగాదు, రెట్టయనియే యర్థము చెప్పవలయును. అంసములమీఁద వారు కూర్చుండిన కారణముచేతను చేతులతో వారిని బిగఁబట్టియున్న కారణముచేతను రెట్టల నఱికిరని చెప్పవలయును. ఇట్లు నఱకఁగా నల్లని

మబ్బుతో సమానమైన దేహముగల యీ రాక్షసుఁడు వజ్రముచేఁ గొట్టఁబడిన పర్వతమువలె నేల దభాలునఁ బడెను.

ఈ విరాధుఁడు రావణాసురుని వంటి బలముగలవాఁడని యుద్ధకాండమునఁ జెప్పఁబడెను.

అట్టైన రావణాసురుఁ డొక లక్ష్మణు మోయలేక పోయెను గదా. వీఁడు సీతారామలక్ష్మణుల ముగ్గుర నెట్లు మోయఁగలిగెను.

స్కాందపురాణమందలి యీ శ్లోకములను బట్టి దీనికి సమాధానము కుదుర్చుకొనవచ్చును.

అందు "సోపి తాం జానకీం దృష్ట్వా, శీఘ్రం సంజాత విక్రమః । ఇయం పరా మహాశక్తి స్సేయం స్వర్గస్యకారణం, అస్యా విబోధో మోక్షేపి కారణం బంధనేపిచ । తస్మా దిమాం భజిష్యామి, దిష్ట్యా ప్రాప్తంహి దర్శనమ్ । ఇతిదర్శనమాత్రేణ విముక్తాఘౌఘ పంజరః భక్తియుక్తో జహారైనాం సీతాం చైతన్యరూపిణీమ్॥ స్కాందము.

వాఁడును జానకిని జూచి విక్రమించి "ఈమె మహాపరాశక్తి. ఈమెవలన స్వర్గప్రాప్తికలదు. ఈమెను గుఱించిన విశేషజ్ఞానము మోక్షకారణము, తెలియమి బంధకారణము. ఈమెను నేను భజించెదను. నా యదృష్టముకొలఁది నా కీమె దర్శనము లభించెను." అని దర్శనముచేతనే పాపపుంజమునుండి విడివడి భక్తియుక్తుఁడై చైతన్యరూపిణి యగు సీతను హరించెను.

దీనివలన విరాధుఁడు లక్ష్మీభక్తుఁడని యేర్పడుచున్నది.

వీని పేరుకూడ భక్తుఁడనియే తెలుపుచున్నది. రాధశబ్దమునకు ఆరాధనమని యర్థము, వి + రాధు-డు = విశేషముగ నారాధించువాఁడు, బ్రహ్మసూత్రమునందలి 'అపి సంరాధనే' యనుపద మీ యర్థము కలదై యున్నది. వీఁడు తమోగుణభూయిష్ఠుఁడగు తామసభక్తుఁడని వీని యాహారవిహారములు తెలుపుచున్నవి. అయినను భక్తుఁడు భక్తుఁడే. ఘంటాకర్ణుఁడు భక్తుఁడుగాఁడా? రావణాసురుఁడు భక్తిహీనుఁడు. కావున వానికి సాధ్యముకానిది వీనికి సాధ్యమయ్యెను. హనుమంతుఁడు అంగదుడు భక్తులౌటచేఁ గదా రామలక్ష్మణుల మోయఁ గలిగిరి.

ఓయీ, విరాధుఁడు లక్ష్మీభక్తుఁడంటివి. భక్తిభావముతో సీతనెత్తికొనెనంటివి, సంతోషమేకాని, వాఁడు తన భక్తుఁ డని సీతకుఁ దెలియునా? తెలిసియుండిన నేల యామె వాఁ డెత్తికొన్నప్పుడు భయమున వణఁకెను? ఆమె భయముచే వణఁకలేదు. వాఁడు చంకకెత్తుకొన్నప్పుడు బిడ్డ యను భావముతో నూరకయుండెను. వాఁడు రామలక్ష్మణులఁ జంపెదనని యెప్పుడు చెప్పెనో యప్పుడు నా యందలి భక్తిచే వీఁడు వక్రమార్గమునఁ బోవుచున్నాఁడే. నే నాయన సంకల్పానుసారము పోవలసినదాననే కదా. ఆయనను గాదని నేను దేనిని జేయఁగలను. మా యిరువురను వీఁడు సమదృష్టిఁ జూచుటకు మాఱు వీఁడు భగవంతునితోను భాగవతునితో

విరోధము కట్టుకొనుచున్నాఁడు. వారివలన వీనికిఁ గీడు కలుగునే యని పుత్రవాత్సల్యముచే వానికి రాఁగల కీడు తలంచి వణఁకెను. కాని తనకుఁగాని రామలక్ష్మణులకుఁగాని కీడు కలుగునని వణఁకినది కాదు.

అటులైన శ్రీరామలక్ష్మణులను విరాధుఁ డెత్తుకొనిపోయినపుడు తన్ను పులులు తోడేళ్ళు మ్రింగు నని యేడ్చెనే!

అట్లు లేడ్చిన విరాధుఁడు తన దుఃఖము చూడలేక వారిని దనయొద్ద విడుచును. తనయెదుట శ్రీరామచంద్రుఁ డెవరిని హింసింపఁడు కావున వానికిఁ గీడు కలుగ దని యా యుపాయము చేసెను. దమయంతి యుత్తమ పతివ్రతయైనను మనుష్యస్త్రీయే కదా. ఆమె నన్ను మ్రింగుఁడని పులులఁ దోడేళ్ళ సింహములయొద్దకుఁ బోయి నిలువఁబడినను నవి తొలఁగిపోయెనుగాని యామెను దాఁకినవిగావు. అడవి యేనుఁగులు బిడారునంతయు ధ్వంసము చేసినను ఆమెను సమీపించినవికావు. అగ్నిహోత్రుఁడు చంద్రమతిని నేమియుఁ జేయఁజాలఁడయ్యెను. ఇది పాతివ్రత్య మహిమ. ఇట్టి విషయము దెలిసిన సీతాదేవి మృగములకా భయపడును?

విరాధుఁడు సీతాసమక్షమునఁ దన్ను శ్రీరామచంద్రమూర్తి చంపఁ డని యెఱింగియే వారిని దూరముగఁ దీసికొని పోయెను. శ్రీరామునిచే మరణము వాని కభీష్టము. రామలక్ష్మణులును వానిని దూరమునందే వధించి యావల సీతను జేరవచ్చిరి. వాని యభిప్రాయముఁ దెలిసికొనియే "యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్." ఏవ రేవ రే యే విధముగ నాయెడ భక్తి సేయుదురో వారిని నేనట్లే సేవింతు నను నియమము కలవాఁడు గనుక 'ఇతని యిచ్ఛకొలందిని నేగ నిమ్ము, దనుజుఁ డరిగినదే త్రోవ మనకు' నని రామచంద్రమూర్తి చెప్పెను.

సీతాదేవి పరోక్షమందే రామచంద్రమూర్తి విరాధమారీచ ఖర కబంధ వాలి రావణాదుల సంహరించెను. ఆమె యనుగ్రహించిన కాకాసుర జటాయు సుగ్రీవ విభీషణులఁ దాను ననుగ్రహించెను; సుగ్రీవుని యందలి విశ్వాసముచేఁగదా సీతాదేవి తన యాభరణము లాయనముందు వైచెను. అది తెలిసి రాముఁడు సుగ్రీవుని స్వీకరించెను. విభీషణుఁడు తన భార్యను బిడ్డను సీత కనుకూలురాండ్రుగా నుండఁజేసెను.

కం. ఆఁకరమున మోఁచేతుల, మోఁకాళులఁ బాదములను ♦ ముష్టులఁ బైపైఁ
గాఁకమెయిఁ గ్రుమ్మి గ్రుద్దుచు, వీఁకం బైకెత్తి యెత్తి ♦ విడుచుచు నేలన్. ౪౭

ఆఁకరమునన్ = ఆగ్రహముతో, ముష్టులన్ = పిడికిళ్ళచే, కాకమెయిన్ = తీక్ష్ణముగ.

తాత్పర్యము.

విరాధుఁ డాయుధములచేఁ జచ్చువాఁడు కాఁడు, చేతులు లేనివాఁడయ్యెను. కావున వాఁడు మఱియొక విధముగఁ జావఁడని వానిని మోఁచేతులతో మోఁకాళ్ళతోఁ గ్రుమ్మి గ్రుద్ది వానిని పైకెత్తి క్రిందవైచిరి.

కం. నఱకినఁ గరవాలంబుల, గుఱుకొని శితబాణములను ♦ గ్రుచ్చిన నేలం
జఱచిన నెట్టును జావని, కఱకుటసురఁ జూచి పలుకు ♦ గాదిలితమ్మున్. ౯
కరవాలంబులన్ = కత్తులచే, చఱచిరన్ = కొట్టినను.

తా త్ప ర్య ము.

కత్తులతో నఱకినను బాణములచేఁ గ్రుచ్చినను నేలపై మోఁదినను నే విధముగను జావని యా కఠినరాక్షసుని జూచి శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణుతో నిట్లనెను.

కం. భీతజనాభయదుఁడు శ్రీ, సీతాపతి వరము బలముఁ ♦ జేసి యసుర దా
శాతశరాదులఁ జావఁడు, గోతిని బాఁతంగ మృతిని ♦ గూరెడు ననినన్. ౧౦
భీతజన=భయపడినవారికి, అభయదుఁడు=అభయమిచ్చువాఁడు, శాతశరాదులన్=పదును గల కత్తులచే, బాణములచే, గోతిని=గుంతలో, పాఁతంగన్=పూడిచిన పక్షమున.

తా త్ప ర్య ము.

ఎట్టి భయము గలవారికైనను నభయప్రదానము చేయు శ్రీరామచంద్రమూర్తి 'వీఁడు వరబలమున బాణములచేఁ గత్తులచేఁ జచ్చెడివాఁడు కాఁడు, కావున నొక గుంతదీసి దానిలో వీనిని బూడ్చినఁ జచ్చును' అని చెప్పెను.

తే. ఆ విరాధుఁడు రాము ప ♦ ల్కాలకించి, యిట్టు లను శక్రతుల్య స♦మిద్ధ తేజ
యేను నీచేతఁ జచ్చితి♦ నెఱుఁగనైతిఁ, బూర్వమజ్ఞానమున నిన్నుఁ బురుషసింహ. ౧౧

తా త్ప ర్య ము.

శ్రీరామచంద్రమూర్తి చెప్పిన యీ మాట విని యావిరాధుఁ డాయనతో నిట్లనెను. 'ఇంద్రసమానతేజా! పురుషోత్తమా! నేను నీచేతఁ జచ్చినవాఁడనే. అజ్ఞానముచే నిన్ను నే నింతకుఁబూర్వ మెవఁడవై నది తెలిసికొనలేక పోయితిని.

ఈ సర్గమందు భగవంతుఁడగు శ్రీరామచంద్రమూర్తికి మహాభయకారణ మున్నను నిర్భయత్వము చెప్పఁబడెను.

—♦ విరాధుఁడు శ్రీరామునకుఁ దనశాపవిధంబు నెఱింగించుట. ♦—

సీ. కౌసల్యనందనా ♦ కరుణాత్మ శ్రీరామ, యెఱిఁగితిఁ దండ్రి మి♦మ్మిప్పు డేను
ఈ మహాభాగ సీ♦తామహాదేవిని, లక్ష్మణు నీతని ♦ లలితయశుఁడఁ
దొలుత గంధర్వుండ♦ దుంబురుఁ డనువాఁడఁ, గ్రమము దప్పిచరింప ♦రంభఁగూడి
శ్రీదుండు శపియించెఁ ♦ జేకొనుమీ రాక్షసాకృతి నని దాని ♦ కడలి నేను
తే. బలుకవే శాపమోక్షణ♦భంగి ననిన, దశరథసుతుండు రాముండు ♦ దర్పకలన
నెప్పుడు వధించు ని న్నని ♦ నప్పు డీవు, పొందెదవు తొంటిరూపని♦ పుందలించె. ౧౨

కౌసల్యానందనా=కౌసల్యకు సంతోషము కలిగించువాఁడా, ఈమహాభాగ=ఈమహాభాగ్యవతి, మహాభాగశబ్దము లక్ష్మినని సూచించుచున్నది. శ్రీదుఁడు=కుబేరుఁడు, అడలి=భయపడి, శాపమోక్షణభంగిన్=శాపము వదలిపోవు నుపాయము, తొంటిరూపు=మునుపున్న యాకారము, మందలించెన్ = చెప్పెను.

తాత్పర్యము

కౌసల్యానందనా! కరుణాస్వరూప! శ్రీరామచంద్రా! తండ్రీ! మీ రెవ్వరైనది యిప్పుడు తెలిసికొంటిని, శ్రీరాముఁడవగుట యవతారమూర్తివైన భగవంతుఁడవని సీతాదేవి లక్ష్మియని తెలిసికొంటిని. నేను బూర్వమునందుఁ దుంబురుఁడను గంధర్వుఁడను. రంభతోఁ గూడినవాఁడనై కామావేశమున మర్యాద దప్పి సంచరింపఁగాఁ గుబేరుఁడు రాక్షసుఁడవు కమ్మని శపియించెను. దానికి భయపడి శాపము తొలఁగిపోవు నుపాయము చెప్పుమనిన దశరథకుమారుఁడు శ్రీరామచంద్రమూర్తి యెప్పుడు నిన్నుఁ జంపునో యప్పుడు నీకు రాక్షసత్వము పోయి యెప్పటివలె గంధర్వరూపము వహింతు వనెను.

కం. శ్రీరఘురామా నీదయ, దారుణశాపంబు దొలఁగె ♦ ధన్యుఁడ నైతిన్
గూరిమి సెల విచ్చెదవే, చేరెద నాకంబు మీకు ♦ శ్రేయం బగుతన్. ౨౩

దారుణశాపంబు=భయంకరమైన శాపమువలన వచ్చినరూపము, నాకము=స్వర్గము, కం=సుఖము, అదిలేనిది అకము, న+అకము=అకములేనిది నాకము, నాకము=కేవల సుఖముగలది, దీనివలన శ్రీరామచంద్రమూర్తి వీనికి శాపమోక్షణము కలిగింప నీప్రాంతములకు వచ్చెనని యేర్పడుచున్నది.

తాత్పర్యము.

శ్రీరఘురామచంద్రమూర్తీ! నీ కరుణవలన భయంకరమైన శాపబాధతొలఁగెను; మీ దర్శనమునఁ గృతకృత్యుఁడనైతిని. స్వర్గమునకుఁ బోయెదను. దయయుంచి యాజ్ఞయిచ్చెదవా? మీకు మేలు గలుగునుగాక.

చం. ఇటు లొకసార్ధయోజనము ♦ నేగి కనుంగొను మందు స్వప్రభా
పటలహసత్పతంగు శర♦భంగు శుభంబగు నీకు న న్మహా
వటమున నావటించి రఘు♦వర్య పదంపడి పొమ్ము, దీని ము
న్నటి పెదవారు ధర్మ మని ♦ పల్కిరి చచ్చిన సోఁకుమూఁకకున్. ౨౪

సార్ధయోజనము=ఒకటిన్నర యామడ, స్వప్రభాపటల=తనకాంతిసమూహముచే, హసత్=నవ్వుచున్న, పతంగున్=సూర్యుఁడుకలవానిని, శరభంగున్=శరభంగుఁడను పేరుగల మహర్షిని, మహావటమున=పెద్దగుంతయందు, 'గర్తావటౌ భువి శ్వభ్రే' అమరుఁడు. ఆవటించి=ఉంచి, పదంపడి=ఆవల, పెదవారు=పెద్దవారు, సోఁకుమూఁకకున్=దనుజుల సమూహమునకు.

తా త్ప ర్య ము.

ఈ త్రోవ నొకటిన్నరయామడ దూరముపోఁగా నందు సూర్యతేజుఁడగు శరభంగమహర్షి యున్నవాఁడు. ఆయనను మీరు దర్శింపుఁడు, మేలగును. నన్ను గోతిలోఁ బాఁతి శ్రీరామచంద్రమూర్తీ! యావలఁబొమ్ము. చచ్చినదనుజుల నీప్రకారము పూడ్చుటయే ధర్మమని పూర్వులగు పెద్దలు చెప్పిరి.

కం. ఏవాఁడు గుంత నిడఁబడు, నావాఁడు సనాతనంబు ♦ లగు లోకములం
 దే వఱలు; సైఁపలేను మ,హావేదనఁ బ్రాణ మెగసి ♦ యరిగెడు ననినన్. ౫౫

తా త్ప ర్య ము.

ఎవఁడు భూమిలోఁ బాఁతి పెట్టఁబడునో వాఁడు సనాతన లోకములకుఁ బోవును అని వారు చెప్పిరి. ఇది మా కులమర్యాద; దేహమంతయు మీరు ముక్కలుగా ఖండించుటచే బాధసహింపరాక యున్నది, ప్రాణమెగసి పోవుచున్నది, కావున నన్ను శీఘ్రముగఁ బూడ్చిపొండు.

కం. ఏనుఁగునకువలె లక్ష్మణ, దానవునకు గుంత యొకటి ♦ త్రవ్వు మటంచున్
 దా నతనికంఠసీమను, బూనికఁ బాదంబు నుంచె ♦ భూపవరుండున్. ౫౬

తా త్ప ర్య ము.

‘లక్ష్మణా! ఏనుఁగులను బూడ్చుట కెంతగుంత త్రవ్వుదురో యంతది త్రవ్వుము; వీనిని దానియందు వైతము’ అని వాఁడు లేవకుండ శ్రీరామచంద్రమూర్తి వాని గొంతుపైఁ గాలుంచి యుణఁగఁ ద్రొక్కెను.

కం. సౌమిత్రి ఖనిత్రముఁ గొని, యా మానవభోజిపార్శ్వ ♦ మం దొకబిల ము
 ద్దామత్వరఁ ద్రవ్వ బల, స్థేమంబున వారు వాని ♦ దృఢగతిఁ ద్రోయన్. ౫౭

ఖనిత్రము=త్రవ్వుసాధనము, గడ్డపాఱ, మానవభోజి=మనుష్యులఁ దినువాని, పార్శ్వమందున్=ప్రక్కన, వాని దేహమున కానుకొని, బలస్థేమంబునన్ = బలాధిక్యముచే.

తా త్ప ర్య ము.

శ్రీరామచంద్రమూర్తి చెప్పినప్రకారము లక్ష్మణుఁడు విరాధుని దేహము ప్రక్కననే యొకగుంత శీఘ్రముగఁ ద్రవ్వెను. తరువాత శ్రీరామలక్ష్మణు లిరువురు గలసి వానిదేహమును దానిలోనికి బలవంతముగాఁ ద్రోచిరి.

కం. భైరవరవమునఁ గూలెను; శ్రీరాఘవు లతఁడు శస్త్ర ♦ బృందంబులచే,
 గూరఁడు మృతి నని వానిఁ బ్ర,హారంబులఁ జంపి రా బి ♦ లాంతరసీమన్. ౫౮

భైరవరవమునన్ = భయంకరధ్వనితో, శస్త్రబృందంబులచే=శస్త్రసమూహములచే, మంత్రవంతములుగాని కత్తి, బాణము, శూలము లోనైనవి శస్త్రములు. మంత్రవంతముగాఁ బ్రయోగింపఁబడునవి యస్త్రములు. ప్రహారంబులన్ = చేతిదెబ్బలచే, బిలాంతరసీమన్=గోతిలోపలి ప్రదేశమందు.

తాత్పర్యము.

శ్రీరామలక్ష్మణులు బలవంతముగాఁ ద్రోయఁగా వాఁడు భయంకర ధ్వని చేయుచు దానిలో దొరలెను. ఇట్లు వానిని గుంతలోఁ ద్రోచి కత్తులతోఁ గొట్టిన జావఁడని పిటికిటిపోటులచేఁ జంపిరి. ఊపిరియుండఁగా బూడ్చుట సరిగాదు గానఁ జంపి తరువాత వానిని బూడ్చిరి.

ఉ. రాముఁడు లక్ష్మణుండును వి♦రాధుని నీగతిఁ జంపి హృష్టు ల
 రై మహితాశ్మసంతతుల ♦ నబ్బిల మెల్లను బూడ్చి, కాంచనో
 ద్దామశరాసనంబులను ♦ దాలిచి, జానకిఁ జేరి చంద్ర భా
 ధాములు మింటఁబోలె రుచిధాములు వెల్గిరి కాననంబునన్. ౨౯

హృష్టులరై = సంతోషించినవారివలెనై, ఇట్లు చెప్పుటచే వారికి విరాధవధ యందు సంతోషము వాస్తవమున లేదని యేర్పడుచున్నది. మహిత = గొప్పవగు, అశ్మ = ఱాలయొక్క, సంతతులన్ = సమూహములచే, కాంచనోద్దామ = బంగారుచే నతిశయించిన, శరాసనంబులను = విండ్లను, శర + ఆసనము — బాణములను జిమ్మునది, జానకిఁజేరి = జానకిని సమీపించి, ఇట్లు చెప్పుటచే నామె యీ ఘోర కార్యము చూడలేక దవ్వుగ నుండెనని యేర్పడుచున్నది. కేవల దయాస్వరూప గావున హింసాకార్య మామె చూడఁజాలదు. చంద్రభాధాములు = చంద్రునివంటి సూర్యునివంటి కాంతిగలవారు, భా = సూర్యుఁడు, "ఖరాంశుర్భా రవి ర్భగః" త్రి. శే. చంద్రుని యుపమానము భార్యాసహితుఁడైన శ్రీరామచంద్రునికనియు సూర్యోపమానము భార్యలేని లక్ష్మణునికనియు గోవిందరాజీయము. ఇరువురు చంద్రునివలెఁ గళాసంపన్నులనియు నిరువురు సూర్యునివలెఁ బ్రతాప సంపన్నులనియు నర్థమని మహేశ్వర తీర్థీయము.

ఫలశ్రుతి : "యో విరాధ వధం నిత్యం శృణోతి శ్రావయేత వా తస్య పాపాని సర్వాణి వినష్టాని నసంశయః" విరాధవధమును నెవఁ డెప్పుడు వినునో వినుపించునో వాని పాపములన్నియు నశించును. సందేహములేదు. (స్కాందపురాణము.) రుచిధాములు = కాంతికి స్థానమైనవారు.

తాత్పర్యము.

శ్రీ రామలక్ష్మణులు విరాధు నీగతిఁ జంపి సంతోషించినవారివలెనై యా గోతిని బెద్దఱాలు అప్పలువేసి పూడ్చిరి. ఇట్లుచేసి దూరమునందుంచిన బంగారు మయమైన విండ్లను మరల గ్రహించి సీతాదేవి యున్నచోటికిఁ బోయి యాకానన మందు వా రాకాశమునఁ జంద్రసూర్యులవలెఁ బ్రకాశించిరి.

—♦ ౫-వ సర్గము. సీతారామలక్ష్మణులు శరభంగాశ్రమమునకుఁ బోవుట ♦—

సీ. జానకి నూఱార్చి ♦ సౌమిత్రిఁ గని రాముఁ, డిద్వని దుర్గమం ♦ బేగ మనకు
 సాధ్యంబుగాదు క♦ష్టము శరభంగుని, దర్శింపఁ బద మని ♦ తరలి వేగ

మాశ్రమోపాంతంబు♦నందుఁ గనుంగొనె, దివ్య సూర్యానల♦ తేజు గగన
యానరథోత్సంగు ♦ నమరచయానుగు, నుర్వి యంటక మింట ♦ నుండువాని
తే. సుప్రభాభరభూషణు ♦ శుద్ధవసను
హరిహయునిఁ దన్నుఁ దనుఁబోల్మ♦హాత్మవితతి
యర్థి భజియింప వెలిఁగెడు♦హరిని, బాండు
రాభ్రశశిబింబ సన్నిభ♦చ్ఛత్రవిభవు. ౬౦

దుర్గమంబు = ఘోరానిది, వని = అడవి, ఆశ్రమఉపాంతము = ఆశ్రమ సమీపమున, సూర్యానలతేజుఁ = సూర్యుని, అగ్నిహోత్రుని తేజస్సువంటి తేజస్సుగలవానిని, గగనయానరథోత్సంగుఁ = ఆకాశమునపోవు రథముతోఁగూడిన వానిని, అమరచయానుగుఁ = వెంబడివచ్చు దేవతలు గలవానిని, సుప్రభాభర = విశేషకాంతిగల, భూషణుఁ = ఆభరణములు గలవానిని, శుద్ధవసనుఁ = నిర్మలమైన వస్త్రము ధరించినవానిని, హరిహయుని = ఆకుపచ్చ గుఱ్ఱములు గలవానిని, వితతి=సమూహము, అర్థిన్ = ఆసక్తితో, హరిని=ఇంద్రుని, పాండురాభ్ర=తెల్లని మేఘముతోను, శశిబింబ = చంద్రబింబముతోను, సన్నిభ = సమానమైన, ఛత్ర= గొడుగుయొక్క, విభవుఁ = సంపదగలవానిని.

తాత్పర్యము.

భయశోకములచే ఖిన్నురాలై యున్న సీతాదేవిని సమాధానపఱిచి లక్ష్మణుఁ జూచి యీ యడవి త్రోవలులేక చెట్లు కంపలు బలిసి, పోవుటకు సాధ్యముగాక యున్నది. కావున శరభంగుని దర్శింప నా యాశ్రమమునకుఁ బోదమని యా యాశ్రమ సమీపమునకుఁ బోయి శ్రీరామచంద్రమూర్తి స్వర్గమందుండువాఁడును సూర్యాగ్నుల తేజముగలవాఁడును, నాకాశమున సంచరించు రథమునుండి దిగిన వాఁడును వెంటవచ్చుచున్న దేవతలు గలవాఁడును, భూమిని దాఁకక యాకాశమం దుండు వాడును, విశేషకాంతిగల యాభరణముల ధరించినవాఁడును, ఆకుపచ్చగుఱ్ఱములు గలవాఁడును, మహాత్ములసమూహము తన్ను సేవించుచుండ వెలుంగువాఁడును, చంద్ర బింబమువలె గుండ్రమై తెల్లనై తెల్లనిమేఘమువలె విరివికాంతి గల దగు గొడుగు గలవాఁడు నగు నింద్రుని జూచెను.

తే. చారురూపవతీకర♦సారసధృత భర్మదండమహాధన♦వ్యజనచామ
రావళీమృదులాందోళ♦నైకజనిత, మందమారుతచలితమ♦ళిందడింభు. ౬౧

ఇందును నింద్రుడే వర్ణింపఁబడు చున్నాఁడు.

చారు=మనోహరమైన, రూపవతీ=అందగత్తెలయొక్క, కరసారస = కమలములవంటి చేతుల, ధృత=ధరింపఁబడిన, భర్మదండ=బంగారుబెత్తములుగల, మహాధన=విశేషమువిలువగల, వ్యజనచామరావళీ=విసనకఱ్ఱలవలెనుండు చామరల సమూహముయొక్క, మృదుల=కోమలమైన, మెల్లని యని యర్థము. ఆందోళన = కద

లిక చే, ఏక=ముఖ్యముగా, జనిత=పుట్టిన, మందమారుత = మెల్లనిగాలికి, చలిత = కదలుచున్న, ఎగురుచున్న, మిళింద=తుమ్మెదల, డింభాన్=పిల్లలుగలవానిని.

తా త్ప ర్య ము.

దేవతాసుందరులు తమ కరకమలములందు ధరించిన బంగారు పిడులు గలిగి మిగుల విలువగల చామరములు మెల్లగా విసరుటవలన జనించిన మెల్లనిగాలికి నెగురుచున్న పిల్లతుమ్మెదలు గలవానిని.

కం. సురగంధర్వులు సిద్ధులు, పరమర్షులు గుములు గట్టి♦పరమస్తుతులన్
గర మభినందింపఁగ, సరసన వెలుఁగొందువానిఁ♦జక్కఁగఁ గాంచెన్. ౬౨

సురగంధర్వులు = దేవగంధర్వులు, మనుష్యగంధర్వులని రెండు జాతిగలదు, గుములు గట్టి=గుంపులై, అభినందింపఁగన్ = సంతోషపడునట్లు చేయుచుండఁగా, సరసన=సమీపమందే.

తా త్ప ర్య ము.

దేవగంధర్వులు, సిద్ధులు, గొప్ప ఋషులు, గుంపులై గొప్ప స్తోత్రములచే మిక్కిలి సంతోషపడునట్లు చేయుచుండఁగా సమీపమందే ప్రకాశించు వానిని జక్కఁగా శ్రీరామచంద్రమూర్తి చూచెను.

చం. పరమవిభాఽవిభంగశర♦భంగునితోడుత ముచ్చటించు నా
సురపతిఁ గాంచి తమ్ముఁ గని ♦ చూచితె లక్ష్మణ! వింత జాజ్వల
ద్వరరుచిమంతుఁ దీవ్రకర♦వంతుని వంతున నంతరిక్షసం
చరణచణంబు నైన యొక♦స్యందనమందు వెలుంగు నాతనిన్. ౬౩

పరమవిభా=గొప్ప కాంతియొక్క, అవిభంగ=భంగములేని, ముచ్చటించు= మాట్లాడు, జాజ్వలత్ = మిక్కిలి ప్రకాశించు, వర = శ్రేష్ఠమైన, రుచిమంతున్ = కాంతిగలవానిని, తీవ్రకరవంతుని = సూర్యుని, వంతున = విధముగ, అంతరిక్ష ఆకాశమందు, సంచరణ=సంచారముచేయుటయందు, చణంబునైన=సామర్థ్యముగల, స్యందనమందు=రథమందు.

తా త్ప ర్య ము.

విశేష బ్రహ్మతేజస్సుగల శరభంగునితో సంభాషించుచున్న యా యింద్రుని జూచి శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణుతో నిట్లనియె. ప్రకాశించుచున్న మిగులఁ గాంతిగలవాఁడును సూర్యునివలె నాకాశమందే సంచరింప శక్తి గల తేరియందుఁ బ్రకాశించువాఁడును నగువానిని జూచితివా?

ఉ. ఎట్టిహయంబు లుండు నని♦యింద్రునకు న్నన మెల్ల విందుమో
యట్టివ యాకుపచ్చనిహ♦యంబులు మింట రహింపఁ గంటివే
చుట్టి శతాంగముం గొలుచు♦శూరులు భూరికృపాణపాణులున్
దిట్టలు శోణవస్త్రకులు♦దీర్ఘభుజుల్ యువకుల్ సకుండలుల్. ౬౪

హయంబులు=గుఱ్ఱములు, రహింపఁగ=ప్రకాశింపఁగా, శతాంగముఁ=తేరిని, భూరి=గొప్పవగు, కృపాణ=కత్తులను, పాణులుఁ=చేతియందుఁ గలవారును, దిట్టలు=సమర్థులును, శోణవస్త్రకులు=ఎఱ్ఱవస్త్రములు ధరించినవారును, దీర్ఘభుజుల్=నిడివిచేతులు గలవారును, యువకుల్ = నడిమి ప్రాయమందుండు వారును, సకుండలుల్=కుండలములు ధరించినవారును.

తాత్పర్యము.

ఇంద్రునకెటువంటి గుఱ్ఱము లుండునని మనము శాస్త్రములందుఁ జెప్పఁగా విని యున్నామో యటువంటి యాకుపచ్చ గుఱ్ఱము లాకాశమందున్నవి, అవో చూచితివా, ఆ రథముచుట్టునుండి సేవించు వారు శూరులు, చేతులఁ బెద్ద కత్తులు గలవారు, నడిప్రాయమువారు, కుండలములు ధరించినవారు.

ఉ. హారవిహారహారివిపులాంచితవక్షులు శౌర్యదర్పదు
ర్వారులు వ్యాఘ్రము ల్పగిదిఁ బ్రాయమునం గనఁ బంచవింశతి
స్ఫారసముల్ సురావళికి సంతత మియ్యది ప్రాయ మాటచే
వీరలు దేవత, ల్సిలుఁడు వీరుఁడ నీవును సీత యిచ్చటన్. ౭౫

హార=సరములయొక్క, విహారసంచారముచే, హారి=మనోహరమైన, విపుల = విశాలమై, అంచిత = ప్రకాశించు, వక్షులు = ఱొమ్ములు గలవారు, శౌర్యదర్పదుర్వారులు=వారింపరాని శౌర్యము దర్పముగలవారు, పంచవింశతి = ఇరువదియైదగుటచే, స్ఫార=ప్రకాశించు, సముల్=ఏండ్లుగలవారు.

తాత్పర్యము.

వక్షస్థలమందుఁ బ్రకాశించు హారములు గలవారును అడ్డగింపరాని శౌర్యదర్పములు గలవారును, ఇరువదియైదు సంవత్సరముల వయస్సుగలిగి పులులవలె నుండువారునై యున్నారు. దేవతల కెప్పటికి నిదేకదా వయస్సు. కావున వీరు దేవతలే. లక్ష్మణా? నీవిందే సీతతోడ నిలువుము.

ఉ. వానివిధంబు నే నెఱిఁగి వచ్చెద నంచు మునీశు నాశ్రమం
బా నృపసూతి చేరఁ జననాతని రాకను గాంచి శక్రుఁ డ
మ్మానికి నేకతం బనియె మానవపాలుఁడు రాముఁ డిందు రాఁ
బూనినవాఁడు న న్గనఁగ బోలదు నా కిపు డీతనిం గనన్. ౭౬

శక్రుఁడు=ఇంద్రుఁడు, ఏకతంబు=రహస్యముగా.

తాత్పర్యము.

ఆ యింద్రునివృత్తాంతము నాయన యిచ్చటికేల వచ్చెనో తెలిసికొని వచ్చెదను అని చెప్పి మునీశుని యాశ్రమము చేరఁబోఁగా నాయన వచ్చుట చూచి యింద్రుఁడు రహస్యముగా శరభంగునితో శ్రీరామచంద్రుఁడు నన్నుఁ జూడ వచ్చుచున్నాఁడు, ఈయనను నే నిపుడు చూడరాదు.

ఉ. ఈయన చేయఁగాఁ దగిన ♦ యెంతయు దుష్కర మైనకార్యముల్
జేయఁగ నిమ్ముఁ ధన్యుఁడును ♦ జిష్ణుఁడు నై పొగ డొందఁ బిమ్మటన్
డాయుదు ముచ్చటింతు నని ♦ దానవవైరి నచించి మింటికై
పోయె శతాంగయుక్తి, నిటు ♦ పోవుడు నా పురుహూతుఁ డావలన్. ౬౭

దుష్కరము = ఇతరులు చేయుటకు నసాధ్యమైనది, జిష్ణుఁడు = జయశీలుఁడు, రావణుఁ జంపినవాఁడు, డాయుదున్ = సమీపింతును, ముచ్చటింతును = సంభాషింతును, దానవవైరి = ఇంద్రుఁడు, శతాంగయుక్తిన్ = రథముతో, పురుహూతుఁడు = ఇంద్రుఁడు.

తాత్పర్యము.

ఈయన చేయవలసిన యసాధ్యకార్యము రావణవధాదికము ముందున్నది. అది చేయనిమ్ము, అది యితరులు చేయలేనిది. అందుఁ గృతకృత్యుఁడై జయించినవాఁడై కీర్తిగన్నతరువాత నేను సమీపించి సంభాషించెదను. అని యింద్రుఁడు రథమెక్కి యాకాశమునఁ బోయెను. ఇట్లు యింద్రుఁడు వెడలిపోవఁగా,

రావణవధ మగునప్పటి కగును, ఇప్పుడేల మాటలాడరాదనిన నిప్పుడు నేను మాటలాడిన నాయన పరత్వము ప్రకటనము గాక తప్పదు. అయిన నేమంటివా, ఇప్పుడు పరత్వము ప్రకటనమైనచో రావణాసురుఁడు చావఁడు. అది యితర దేవతలకు సాధ్యము కానిది. మనుష్యవేషమున నీయనయే చేయవలసియున్నది. కావున నది యైన పిమ్మటఁ బరత్వము బయటఁబడినను భయములేదు.

రావణుఁడు శ్రీరామచంద్రమూర్తి సామాన్య మనుష్యుఁ డను భావము కలవాఁడయియే యుండవలయును.

కం. నృపకులతిలకుఁడు రాముఁడు, చపలాయతనేత్రతోడ ♦ సహజన్మునితో
సపరిచ్ఛదు సజ్వలనుం, దపసిం జేరంగఁ జనియెఁ ♦ దాత్పర్యమునన్. ౬౮

చపలాయత నేత్రతోడన్=చలించు దీర్ఘములయిన కన్నులుగల సీతాదేవితోడ, సహజన్మునితోన్=తమ్మునితో, సపరిచ్ఛదున్=పరికరములతో గూడినవానిని, సజ్వలనున్=అగ్నిహోత్రముతోఁ గూడినవానిని.

ఇట్లు దేవేంద్రుఁడు వెడలిపోగా శ్రీరామచంద్రమూర్తి వెనుకకు మరల వచ్చి సీతాలక్ష్మణులఁ గలసికొని వారితోడఁ బరికరములతోను నగ్నిహోత్రముతోను బ్రకాశించు శరభంగ మహర్షిని భక్తితోడఁ జేరబోయెను.

ఉ. చేరి మునీశుపాదములు ♦ శీర్షము సోఁక నమస్కరింప న
వ్వారల నర్ఘ్యపీఠముల♦పై వసియింపఁగఁ బంచి మాని, సీ
తారమణుండు శక్రుఁడు క♦తం బెది యిచ్చటి కేగుదేర నా
వారక సర్వముం దెలిపె ♦ వాసవురాకకుఁ గారణంబులన్. ౬౯

శీర్షము = తల, అర్హపీఠములపై = వారివారికిఁ దగిన పీటలయందు, పంచి= ఆజ్ఞాపించి, ఇచ్చటఁ జెప్పఁగా నని యర్థము. కితము = కారణము. ఇచ్చట శ్రీరామచంద్రమూర్తి నమస్కరించుట తన మానవత్వము, క్షత్రియత్వము, లోక సంగ్రహార్థము.

## తాత్పర్యము.

ఇట్లు రామచంద్రమూర్తి శరభంగునిఁ జేరఁబోయి యాయన పాదములు తన శిరస్సంట మ్రొక్కి నిలువఁగా నా మౌని యాముగ్వురకు వారికిఁ దగిన పీట లమర్చి కూర్చుండుఁ డని చెప్పెను. అప్పుడు శ్రీరామచంద్రమూర్తియు మునిని జూచి యింద్రుఁ డీచ్చటికి వచ్చిన కారణ మే మని యడుగఁగా నాయన యా కారణముఁ దెలిపెను.

—♦ శరభంగుండు శ్రీరామునితో నింద్రునిరాకకుఁ గారణంబుఁ జెప్పుట. ♦—

సీ. దాశరథీ! నేను ♦ దపమున క్షుద్రదు, రాసదం బైనయా♦బ్రహ్మలోక
మును సమార్జించితి ♦ ననుఁ గొనిపోవఁగ, వాసవుం డిచటికి ♦ వచ్చినాఁడు
అధికప్రియుండ వౌ ♦ నతిథివి దాపున, కరుదెంచి యుండుట ♦ యాత్మ నెఱిఁగి
నిన్ను దర్శింపక ♦ నే బ్రహ్మలోకంబుఁ, జనఁగ నా కేమియు ♦ మనసు రామి
ఆ. నిలిచినాఁడఁ, గలిగె ♦ నీదర్శనం బిఁక; దేవసేవితంబుఁ ♦ ద్రిదివపదము
నరుగువాఁడ మత్స♦మార్జితాక్షయశుభ, లోకచయము గలదు♦లోకవంద్య. ౨౦

క్షుద్రదురాసదము=నీచులు పొందరానిది, దేవసేవితంబు=దేవతలచే సేవింపఁబడునది, మత్సమార్జిత=నాచే సంపాదింపఁబడిన, అక్షయ=క్షయములేని, ఎప్పటికి ఫలము చెడని; స్వర్గాది లోకములకుఁ బోయినచోఁ జేసిన పుణ్యము క్షయింపఁగానే మరల భూమియందు జన్మింపవలసియుండును. అట్లు పుణ్యక్షయము కాని లోకములను సంపాదించితిని.

## తాత్పర్యము.

రామచంద్రదేవా! నేను తపస్సుచేసి క్షుద్రులు పొందరాని బ్రహ్మలోకమును సంపాదించితిని. అచ్చటికి నన్నుఁ బిలిచికొనిపోవ నింద్రుఁ డిచటికి వచ్చెను. ఆ బ్రహ్మలోకమునకంటెఁ బ్రియపడి కోరవలసిన నీ వతిథివై సమీపమునకు వచ్చియుండుట తెలిసి బ్రహ్మలోక ప్రాప్తికంటె నీ దర్శనము శ్రేష్ఠము కావున నిన్ను దర్శింపక యచ్చటికిఁబోవ మన స్సొల్లమిని నిలిచితిని. నీ దర్శనము కలిగెను. దేవతలు సేవించు త్రిదివమునకుఁ బోదును. నేను దపస్సుచే నార్జించినవి యెన్నటికి క్షయముకానివి పుణ్యలోకములు గలవు. నిన్ను దర్శింపక నేను బ్రహ్మలోకమునకుఁ బోవ నేమియు మనస్సురాలేదనుటచే బ్రహ్మలోక ప్రాప్తికంటె శ్రీరామచంద్రమూర్తి దర్శనమే శ్రేష్ఠమని భావము. ఇఁక నీదర్శన మయ్యెను. దేవసేవితంబైన త్రిదివమునకుఁ బోయెద ననుటచే 'స్వరవ్యయం స్వర్గ నాక త్రిదివ త్రిదశాలయాః' యని నిఘం

టువున( జెప్పఁబడిన యింద్రలోకముకాదు. ఏలన బ్రహ్మలోకమునకంటె శ్రీరామచంద్రమూర్తి దర్శనము శ్రేయస్కరమని కాచియుండి దర్శనము చేసికొనినవాఁడు బ్రహ్మలోకమునకైనఁ బోక స్వర్గలోకమునకుఁ బోయెదనని చెప్పినాఁడనుట తుచ్ఛము కావున, దేవసేవితము, "యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః" యనుచోఁ జెప్పఁబడిన పరమపదమే; త్రిదివమన్నప్పుడు త్రిపాద్విభూతి, "పాదోస్యవిశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" యనుచోఁ జెప్పఁబడినదే. అక్షయపుణ్యలోకమనుటచే బ్రహ్మలోకమునకు మీఁది యప్రాకృత లోకములే. "ఆబ్రహ్మభవనాల్లోకాః పునరావర్తినోర్జున" యని భగవద్గీతయందుఁ గలదుకదా! ఇంత రహస్య సంభాషణ కారణము రామపరత్వము ప్రకటనము చేయరామియే. రహస్యము తెలియని వారిది యతిథిసత్కారముగా గ్రహింతురు.

ఆ. స్వర్గలోకభవము♦బ్రహ్మలోకభనంబు, నైనసుకృత మెల్ల♦మానసీయ
　నీకు నొసఁగువాఁడఁ♦గైకొను మన సర్వ, శాస్త్రవేది రామ♦చంద్రుఁ డనియె. ౭౧

స్వర్గలోకభవము=స్వర్గలోకమునందు భోగప్రదేశ విశేషములు, బ్రహ్మలోకభవము=బ్రహ్మలోకమందుఁగల భోగప్రదేశ విశేషములు, వీనిని సంపాదించుటకు నేను జేసిన సుకృతము=పుణ్యము, సర్వశాస్త్రవేది=సర్వశాస్త్రములు తెలిసినవాఁడు,

తాత్పర్యము.

స్వర్గలోకమందలి భోగస్థానములను, బ్రహ్మలోకమందలి భోగస్థానములను సంపాదింప నేనేమి పుణ్యముచేసితినో యదియంతయు నీకు నిచ్చువాడ గ్రహింపుమనిన సకలశాస్త్రవేత్త యగు శ్రీరామచంద్రమూర్తి యిట్లనియె.

ఇది కర్మములను భగవదర్పణము చేయుట యగును. అట్లుగాక ఫలసంగమును గర్తృత్వము వదలి భగవత్కైంకర్య మను తలఁపుతోఁ గర్మములు చేయుట తనిశ్లోకి. దీనికే ఫలసమర్పణమని పేరు.

మహేశ్వరతీర్థ వ్యాఖ్యయందును సర్వేశ్వరుఁడగు శ్రీరామునందు ఫలసమర్పణాభిప్రాయమునఁ జెప్పఁబడెనని కలదు.

చం. కొనెదను నేన నీసుకృత♦కోటుల నెల్లను, మేము నిల్వ నీ
　వనమున వాసయోగ్య మగు♦పట్టెది చెప్పు, మ టన్నఁ బ్రాజ్ఞుఁ డి
　ట్లనియె సుతీక్ష్ణనామకమ♦హాత్ముఁడు మీ కెఱిఁగించు నాతనిన్
　గనఁ జనుఁ డీ వనంబునన ♦ కల్గు నతండు ఘటించు శ్రేయమున్　　౭౨

సుకృతకోటులన్=అనేకపుణ్య సమూహములను.

తాత్పర్యము.

"మునీంద్రా! నీ సుకృతములనెల్ల నేనే గ్రహించెదను, మేము నిలుచుటకు వాసయోగ్యమైన స్థలము చెప్పుము." అనినఁ బ్రకృష్ట జ్ఞానముగల శరభంగుఁ డిట్లనియె. మీరుండుటకుఁ దగిన స్థలమును సుతీక్ష్ణుఁడను మునీంద్రుఁ డెఱిఁగించును.

ఈ యడవియందే యాయన యున్నవాఁడు. ఆయన మీకు శ్రేయస్కరమైనది చెప్పును.

శరభంగుఁ డెట్లు పరతత్వరహస్యము దాఁచి మాటలాడెనో యట్లే శ్రీరామచంద్రమూర్తియు నీ పుణ్యములనెల్ల నేనే కొనియెదను అనెను. అనఁగా నీ వియ్యవలసిన పనిలేదు. నీవు నీ మనస్సున సంకల్పించినఁ జాలును. అది లేకున్నను లోపము లేదు; క్షత్రియధర్మము ననుసరించి పుచ్చుకోలు తగదు. కావున నట్లు చెప్పెనని ప్రతీతి; తనపుణ్యము లన్నియు నొకయతిథికి ధారపోసి యెవఁడు భ్రష్టుఁడగుటకుఁ గోరును. ఇచ్చట నట్లుగాదు. భగవంతునకు నిచ్చినది యొకటి కోటియగును. ఇది నష్టిలేని లాభకరమైన వ్యాపారము. భగవంతు నుద్దేశించి చేయు సాత్త్వికత్యాగము మనోవాక్కాయములలో దేనితోనైనఁ జేయవచ్చును.

నీ పుణ్యకోటులను నేనే తీసికొనెదను అనెనే, ఏల? అయ్యా! మునీంద్రా నీ వెంతకాలముగానో నాదర్శనము గోరి దానికై కాచి యుక్తకృత్యములనెల్లఁ జేయుచుండుట నే నెఱుఁగుదును. కావున నే నీ కంత్యకాలమున దర్శన మీయ వచ్చితిని. అట్లు నేను జేయనైతినేని యింతకాలముగ నీవు నన్నుగుఱించి పడినశ్రమ మను ఋణము నేనెట్లు తీర్చుకొనఁగలను? కావున నీకోర్కె నెఱవేర్చి యనుగ్రహించుటకే వచ్చితిని. ఎప్పుడు నిన్ననుగ్రహింప నిచ్ఛయించితినో యప్పుడే పుణ్యపాపరూపము లయిన నీ ప్రతిబంధముల నెల్ల నేను దొలఁగింపవలయును. ఇప్పుడు నా ప్రాప్తికి నీకుఁ దపస్సువలనఁ గలిగిన పుణ్యము ప్రతిబంధకము. ఎవ్వని నే ననుగ్రహింప నిచ్ఛగింతునో వాని సర్వస్వము నే నపహరింతునని చెప్పి బలివిషయమున నట్లే వర్తించితినిగదా. నీ ధనము నీసుకృతము. కావున నీవిచ్చినను నీయకున్నను నేనే దాని హరింతును. ఆ విషయమున నీ ప్రయత్న మనావశ్యకము, నా కర్తవ్యము నాకు దెలియును.

ఈ విషయమున నీశ్లోకములు స్మరణీయములు.

సత్యం బ్రవీమి మనుజాః స్వయ మూర్ధ్వబాహుః
యే మాం ముకుంద నరసింహ జనార్దనేతి
జీవన్ జప త్యనుదినం మరణే ఋణీవ
పాషాణ కాష్ఠ సదృశాయ దదామి ముక్తిమ్॥

ఓ మానవులారా! చేతులెత్తి ప్రమాణముచేసి చెప్పుచున్నాను. ఎవరు నన్నుఁ దమ జీవితకాలమందు ముకుంద నరసింహ జనార్దన యని ప్రతిదినము జపింతురో వారు మరణకాలమునఁ గఫవాతాదులచే స్మృతిదప్పి కట్టెవలె రాతివలెఁ బడియుండఁగా వాఁడు యావజ్జీవము చేసిన కృషి నేనే స్మరించుకొని యప్పుదీసికొనినవాఁడు అప్పు చెల్లించినట్లు ముక్తినిచ్చెదను. ఇది నరసింహ చరమశ్లోకము. ఇతర చరమశ్లోకముల నిట్లే స్మరింపుఁడు.

ఇంత పరత్వము సూచించుమాటలాడి వెంటనే యేమియుఁ దెలియని వాని వలె మా కుండుటకు స్థలము చెప్పుమని యడుగుట పరత్వ ప్రతారణార్థము.

ఈ యావాసవిషయమున ఋషు లందఱు తోడుదొంగలు. ఎటులైన సీతా రామలక్ష్మణులను బంచవటీ చేర్చిన నచ్చట ఖరాదులతో నే కారణముచేనైనఁ గల హము గలుగును. అప్పుడు వారు చంపఁబడుదు రని వారు చేసిన యాలోచన. ఇది, వారే ౪౽౭ వ పద్యంబున జెప్పిరి. ఆ కారణముచే మెల్లమెల్లఁగా నగస్త్యాశ్రమముఁ జేరఁజేసి యక్కడినుండి పంచవటిఁ జేర్చిరి.

ఉ. ఈ కడ నుండి మీర లెదు♦రేగుఁడు పాఱుచు నున్న యల్లమం
దాకిని కందునందును గ♦నం దగుఁ బూవుల తెప్ప, లద్దియే
మీ కరుగంగ మార్గము, ని♦మేషము నిల్వము తండ్రి ! దేహముం
బోకడపెట్టుదుం గుబుస♦మున్ ఫణిరాజము వీడునట్లుగన్.	౨౩

పోకడపెట్టుదున్ = వదలిపెట్టుదును, కుబుసము= దేహముమీఁది పొర, కుప్పసము, ఫణిరాజము=శ్రేష్ఠమైన పాము, మందాకిని. ఇది భాగీరథిగాదు, పుణ్యానదు లెల్ల గంగలే, చిత్రకూటమునందలి నదియు నిట్లే చెప్పఁబడెను.

తా త్ప ర్య ము .

రామచంద్రా ! మీ రిక్కడనుండి తూర్పుగాఁ బాఱుచున్న యీ పుణ్యానదికి నెదురెక్కి పడమటిముఖముగాఁ బొండు. నడుమనడుమఁ బూవుల గుంపులు తెప్పలు తెప్పలుగా నదియందు నందందుఁ గానవచ్చును. అదియే సరియైన మార్గము, రామచంద్రా! తండ్రీ! నాయనా, పోకుము కొంచెము సే పుండుము. నాగుఁబాము కుప్పసము వదలినట్లు దేహము వదలెదను.

ఉ. దానిని నీవు చూచి మఱి ♦ తర్లు మటంచును వేఁడి మంత్రపూ
తానల మాజ్యధారల ర♦యంబునఁ బ్రజ్వలితంబుఁ జేసి య
ద్దానను మాంసరక్తసహి♦తంబుగ నస్థులతోడ భస్మమై
మానియు వహ్నిసన్నిభకు♦మారకరూపముఁ దాల్చి క్రమ్మఱన్.	౨౪

తర్లుము=పయనింపుము, మంత్రపూతానలము=మంత్రములచే బవిత్రమైన యగ్నిహోత్రమును, ఆజ్యధారలన్=నేతిధారలచే, ప్రజ్వలితంబు = మండునదిగా, మాంసరక్త సహితంబుగన్ = మాంసముతోడను నెత్తుటితోడను, అస్థులతోడన్ = ఎముకలతోను, భస్మమై=బూదియై, వహ్నిసన్నిభ=అగ్నిహోత్రముతో సమానమైన, కుమారక రూపము = "బాలోఽథ పంచదశభి, స్త్రింశద్భిస్తు కుమారకః" రత్నాకరము; అని యుండుటచే నిరువదియైదేండ్ల ప్రాయపు రూపము.

తా త్ప ర్య ము .

నేనీ దేహమును వదలుటను జూచి యావలఁ బయనమై పొమ్మని ప్రార్థించి బ్రహ్మమేధ మంత్రములచేఁ బవిత్రమైన యగ్నిహోత్రమును బ్రజ్వలింపఁజేసి పరిస్త

రణాదులచే నలంకరించి యా యగ్నియందుఁ బ్రవేశించి మాంసము రక్తము ఎముకలతోడ భస్మమై శరభంగుఁడు మరలఁ గుమారుని రూపముదాల్చి.

సాధారణముగ శవమును గాల్చినపుడు సన్నయెముకలు భస్మమైనను పుర్రెలోనైన పెద్దయెముకలు భస్మముగాఁగావు. ఇక్కడ నట్లగుటకు యోగబలమే కారణము, భీష్ముని విషయమున "అమ్మహాత్ముం డవయవంబులఁ బ్రాణంబులు బాపికొనుచు వచ్చునయ్యై చోట్లు శల్యరహితంబు లగుచుండె నట్లగుటంగాంచి కృష్ణాదులగు నఖిలజనంబులు నాశ్చర్యభరితాంతఃకరణు లగుచుఁ గీర్తించిరి."

వానప్రస్థుఁడు తానై శరీరము నగ్నిలో దుమికి విడుచుట యాత్మహత్య గాదు. "అనుష్ఠానాసమర్థస్య, వానప్రస్థస్య జీర్యతః, భృగ్వగ్నిజలసంపాతైః మరణం ప్రవిధీయతే" వార్ధకముచే ననుష్ఠానము జరుపుకొనలేనివాఁడు కొండమీఁదనుండి పడిగాని, అగ్నిహోత్రమునందుఁగాని నీళ్ళలో బడికాని దేహము విడువవచ్చును.

"వృద్ధః శౌచక్రియాలుప్తః, ప్రత్యాఖ్యాత భిషక్రియః ఆత్మానం ఘాతయేదస్తు భృగ్వగ్న్యనశనాదిభిః."

అనియుఁ బ్రమాణము గలదు. ఇట్లు శక్తిలేనివారు మాత్రమేకాదు అనుష్ఠానశక్తిగలవారైనను దేహముతో సాధింపవలసినది యిఁకలేదు. ఇఁక మరల జన్మభయములేదని దేహముపై విరక్తి పుట్టినవాఁడు తపోబలముచే సాధింపవలసినదంతయు సాధించినవాఁ డెప్పుడైనను ద్యజింపవచ్చును. అది యాత్మహత్యకాదు. తపస్సుచే సాధింపవలసిన దంతయు సాధింపక పరలోకప్రాప్తి నిశ్చయములేక యవశిష్ట కర్మానుబద్ధులై కామక్రోధవశులై యుండువారు బలవంతముగ దేహమును వదలరాదు. దానివలన నధమలోకములు ప్రాప్తించును.

'ఆసన్న మరణార్థియైన యతీశుండు కాలదేశంబులఁ గాచికొనఁడు తనువు విసర్జించు తలఁపు జనించిన'' ననియు "ఇచ్ఛలేని యోగియొక్క మహాస్వార్థ, మింద్రియానుషంగ మింతలేక, ప్రాణములను వంచి బ్రహ్మరంధ్రముఁ జించి, బ్రహ్మమందుఁ గలియుఁ బార్థివేంద్ర'' యని కలదుగదా - కావుననే "యద్యుత్క్రాంతాతదావాప్తా, బ్రహ్మమేధానలం వ్రజేత్, నాభివక్తాత్మ నగ్నినకరోప్యయథాస్థలం-'' సంస్కారయేత్" అని చెప్పఁబడెను. ఈ కారణముచేతనే సహగమనము చేయు పతివ్రతలకును నాత్మహత్యాదోషము లేదు. సీతాదేవి యురపోసికొనుటకు యత్నించినదియు సీతాదేవి చంద్రమతు లగ్ని ప్రవేశించినదియు బాతివ్రత్య రూపక తపోబలముచేతనే.

చ. అనలమునుండి వెల్వడి మహర్షి సురాళిజగంబు దాఁటి చ
య్యనఁ జని బ్రహ్మలోకమునయందు సహానుచరుం బితామహుఁ

గనియె నతండు మానికిని ♦ గౌరవ మారఁగ స్వాగతంబుఁ బ
ల్కెను, మునిశక్తికి న్నగురుఁ ♦ గీర్తన చేసిరి విస్మయాత్ములై ౭౫

అనలమునుండి = అగ్నిహోత్రమునుండి, బ్రహ్మలోకమునయందు = పరబ్రహ్మాత్మకలోకమందు, సహానుచరుఁ = అనుచరులతోఁగూడిన వానిని, పితామహుఁ = బ్రహ్మను, ఇచట బ్రహ్మ పితామహశబ్దములు సవిగ్రహ పరబ్రహ్మమునే బోధించును. ఈ బ్రహ్మశబ్దము భగవంతుఁడు సగుణుఁడనియు (బృహత్త్వాత్ బృంహణత్వాత్) పితామహశబ్దము జగన్మూలకారణ మనియుఁ దెలుపును. లేనియెడల బూర్వోత్తర విరోధము సంఘటించును.

విస్మయాత్ములై = ఆశ్చర్యపడిన మనస్సుగలవారై, పితాహ మస్య జగతో మాతాధాతా పితామహః. భ. గీ. ౯-౧౭.

దీనివలన నుపాసకులు సన్న్యాసులవలె బ్రహ్మలోకమందు నిలువక పరమపదమును బొందెద రని యేర్పడెను. (చూడు ౭౦ వ ప. వ్యాఖ్య - ఆరణ్య).

తా త్ప ర్య ము.

అగ్నిహోత్రమునుండి లింగశరీరమైన కుమారకరూపముతో బయలుదేఱి దేవతల లోకము లన్నియు దాఁటి శీఘ్రముగ నందందు నిలువక పోయి పరబ్రహ్మలోకమందు భగవన్మూర్తిని జూచెను. ఆయనయు మునిని సుఖముగా వచ్చితివా యని ప్రశ్నించెను. ఈ ప్రశ్న కౌషీతక్యుపనిషత్తునందుఁ జెప్పఁబడిన ప్రశ్న యగును - సీతారామ లక్ష్మణులు మువ్వురును మునిశక్తి కాశ్చర్యపడిరి.

ఇచ్చట సురాళి జగంబును దాఁటి బ్రహ్మలోకమందుఁ బితామహుం గనియె ననుటచే నర్చిరాది మార్గము సూచింపఁబడెను.

తేఽర్చిష మభిసంభవం త్యర్చిషోఽహ రహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణపక్షాద్యాన్ షడుదఙ్ఙేతి మాసాం స్తాన్ మాసేభ్య స్సంవత్సరమ్ సంవత్సరా వాదిత్య మాదిత్యా చ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవస్స ఏనాన్ బ్రహ్మ గమయతి' ఈ యర్థమునే యీ శ్లోకము విశదీకరించుచున్నది.

"ముక్తో ర్చిర్దినపూర్వపక్ష షడుదఙ్మాసాబ్ద వాతాంశుమ ద్గ్లౌ విద్యు ద్వరుణేంద్ర ధాతృమహిత స్సీమాంతసింధ్వాప్లుతః । శ్రీవైకుంఠముపేత్య నిత్య మజడ స్తస్మిన్ పరబ్రహ్మణ స్సాయుజ్యం సమవాప్య నందతి సమం తే నైవ ధన్యః పుమాన్."

దేహమును విడిచిన ముక్తజీవుని నతివాహకులను దేవతలు క్రమక్రమముగా నెదురువచ్చి తోడుకొని తమ తమ పొలిమేరవఱకుఁబోయి యచ్చట నావలి యతివాహకున కప్పగింతురు. ఆ దేవతలపేర్లేవన, అర్చిస్సు, దినమున పూర్వపక్షము, ఉత్తరాయణ మాఱునెలలు, సంవత్సరము, వాయువు, సూర్యుఁడు, చంద్రుఁడు, విద్యుత్తు, వరుణుఁడు, ఇంద్రుఁడు, ధాత. ఈధాత ప్రాకృతమండలమునకు నప్రాకృత

మండలమునకు నడుమ విరజానదీతీరమున విడుచును. ఇంతవఱకుఁ బ్రయాణము సాగుటకై జీవున కత్యంత సూక్ష్మ ప్రాకృతశరీర మంటియుండును. ఇక్కడ నా లింగ శరీర మూడిపోవును. ఆవల సంకల్పముచేతనే విరజానదిని దాఁటిపోవును.

జీవుఁ డణు స్వరూపుఁడు గనుకనే యీ ప్రయాణము సాధ్యపడెను. జీవుఁ డణు స్వరూపుఁ డనియే శ్రుతులు స్మృతులు చెప్పుచున్నవి.

వాలాగ్రశతభాగస్తు కల్పితశ్చ త్సహస్రధా
తస్యభాగా చ్ఛతతమో జీవ సూక్ష్మ ఉదాహృతః ॥శంఖ॥

వెండ్రుక కొనను నూఱుభాగములు చేసి యందొకభాగమును వేయిభాగములు చేసి ఆ యొకభాగమును నూఱుభాగములుగా విభజించితిమేని యెంతయుండునో జీవుఁ డంతటివాఁడు.

వ్రీహిర్వా యవోవా, శ్యామాకోవా, శ్యామాకతండులోవా, ఏవమయ మంతరాత్మ౯ పురుషో హిరణ్మయో యథా జ్యోతి రధూమం॥ శతపథ. ౧-౬-3.

వడ్లగింజంతగాని యవధాన్యపుగింజంతగాని శ్యామాకధాన్యమంతగాని శ్యామాకపు బియ్యపు గింజంతగాని సూక్ష్మమగు వాఁడగు నంతరాత్మ (జీవుని) యందు హిరణ్మయ పురుషుఁడు పొగలేని జ్యోతిస్సుగా నున్నాఁడు.

వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్యచ
భాగో జీవ స్స విజ్ఞేయః. ॥శ్వేతాశ్వ॥

వెండ్రుక కొనను నూఱుభాగములుచేసి యందొక్కక్క దానిని మరల నూఱు భాగములు చేసినచో జీవుని పరిమాణ మేర్పడును.

ఆరాగ్రమాత్రోహ్య వ్యవరోపి దృష్టః.
జీవుఁడు ముల్లుకొనయంత సూక్ష్మముగఁ జూడఁబడినాఁడు.
ఏషోణు రాత్మచేతసా వేదితవ్యః॥ ముండ॥
ఈ జీవుఁడు అణువు - మనస్సుచేఁ దెలిసికొనఁదగినవాఁడు.

ఇట్లు చెప్పుటచేతను గమనాగమనములు చెప్పుటచేతను ముక్తపురుషునకు భోగము చెప్పుటచేతను, గాలిలోగాలి కలిసిన దను నాస్తికవాదము నిరస్తము. అట్లే దేహమంత యాత్మ యనువాదము నిరస్తము-ఆత్మసర్వవ్యాపి యనువాదము నిరస్తము.

శరభంగున కిట్టి యుత్తమలోకప్రాప్తి రామచంద్రమూర్తి సాన్నిధ్యమునఁ గలిగె నని యెఱుంగవలయును.

శరభంగునికిఁ బ్రాప్తించినది యప్రాకృత కేవలచైతన్యము శరీరము.

ముక్తుల కిట్టి శరీరము వారి సంకల్పానుసారము లభించును.

ఇక్కడ నొక చిన్నసందేహము - మీఁద వివరించినట్లు యోగసిద్ధుఁడు యోగబలముచే జీవుని సుషుమ్నానాడిలోనుండి పయనింపఁజేసి బ్రహ్మరంధ్రము భేదించుకొని పోవచ్చుగదా. అట్లు పోక శరభంగుఁ డగ్నిప్రవేశము చేసెనేల ? ఇది

క్లిష్టమార్గముకదా. శరభంగుని వంటివాని కిది క్లిష్టమార్గము గాదు. శిష్టమార్గమే. ఏలన - ఆయన నిర్ద్వంద్వుఁడు. ప్రత్యాహార సంయమములం దాటి తేఱిన వాఁడు. తపోగ్నిచేఁ బరిపూర్ణమగు శరీరము కలవాఁడు. కావునఁ బ్రాకృతాగ్ని బాధ యాయన కేమియు లేదు. అది నిమిత్తమాత్రమే - సీతాదేవిని జంద్రమతిని నగ్నిహోత్రుఁ డేమిచేయగలిగెను ? ఇక్కడ లౌకికాగ్ని నిమిత్తమాత్రమే. లౌకికాగ్నిచే భస్మముగాని యెముకలు పుఱ్ఱెలు నెన్నియో చూచుచున్నారు. ఈయన కట్టె శేష మేదియు మిగులలేదు. ఇది పార్వతీదేవి యోగాగ్నిచే దగ్ధమైనటువంటిది. యోగమువలనఁ బ్రాణము విడిచియుండిన శేషము మిగిలియుండును. ఆ శవమునకు దహనాద్యుత్తర క్రియ లావశ్యకమై యుండును. తక్కిన కర్మకాండము వెన్నంటినే వచ్చును - ఇప్పు డా బాధ బడనాయము తప్పినది.

ఒక కార్యమును సాధింప రెండుపాయము లుండిన నందు సుకరమార్గ మవలంబించువాఁడు బుద్ధిమంతుఁడు కనుకనే మరణదండమునకు యోగ్యుఁడగు వాలిని వధించుటయందు రెండుపాయము లుండినను శ్రీరామచంద్రమూర్తి సుకరము శీఘ్రఫలదము శాస్త్రావిరుద్ధమునగు నుపాయము నవలంబించెను.

—♦ ౬-వసర్గము. మునీంద్రులు శ్రీరామునితోఁ దమకష్టంబులు చెప్పి శరణుజొచ్చుట. ♦—

ఉ. వాని దినంబుఁ జేర నతి♦మానుష తేజుని రామచంద్రు వై
ఖానసవాలఖిల్యులును ♦ గాత్రశయాను, లశయ్యనీరప
త్త్రానిలభోజనుల్, సురప♦థాలయులున్, మహిశయ్యు, లశ్మకు
ట్టానల తేజులున్, ఘనర♦సాంతరమగ్నులు యోగలగ్నులున్. ౭౬

అతిమానుషతేజునిన్ = దివ్యతేజస్సుగలవానిని, వైఖానసవాలఖిల్యులును = "యే నఖాః తే వైఖానసాః యే వాలాః తే వాలఖిల్యాః" యను శ్రుతిప్రకారము భగవంతుని నఖములఁ బుట్టినవారు వైఖానసులు, భగవంతుని రోమములందుఁ బుట్టినవారు వాలఖిల్యులు. ౨. వైఖానసులు = విఖనసుఁడను ఋషిప్రోక్తమైన సూత్రముల ప్రకారము వర్తించువారు, గాత్రశయానులు = కూర్చుండి తలలను ఱొమ్మునందో భుజమునందో వ్రాల్చి నిద్రించువారు, వీరు నేలపైఁ బండుకొని నిద్రింపరు. అశయ్యులు=పండుకొననివారు, నీరపత్త్రానిలభోజనుల్ = నీరభోజనులు = నీళ్ళుమాత్రము త్రావి జీవించువారు, పత్త్రభోజనులు = ఆకులుతిని జీవించువారు, అనిలభోజనులు=గాలియే యాహారముగాఁ గలవారు, సురపథాలయులు=ఆకాశమే యిల్లుగాఁ గలవారు, మహిశయ్యులు = కటికినేలమీఁద నేమియుఁ బఱచుకొనక పండుకొనువారు, అశ్మకుట్టులు=గింజలను రాతితో నలియఁగొట్టి తినువారు, అనఁగా నగ్నితప్తము కాని ధాన్యము తినువారు. ౨. రాలతోఁ దమ దేహమును ఛేదించుకొనువారు. అనలతేజులు=అగ్నిహోత్రము తేజస్సువంటి తేజస్సుగలవారు, ఘనరసాంతర = నీటి

లోపల, మగ్నులు = మునిఁగి తపస్సుచేయువారు, యోగలగ్నులు = యోగమభ్యసించు వారు.

వైఖానస శబ్దవిచారము సందర్భోచితముగా నుండుటచేఁ గొంత యావిషయము వ్రాయవలసివచ్చెను.

అయోధ్య ౧౩౨౧-వ పద్యమందు శ్రీరామచంద్రమూర్తి వైఖానస మార్గస్థితుఁ డయ్యెనని చెప్పఁబడెను. అచ్చట వైఖానస మార్గ మనఁగా వానప్రస్థ ధర్మ మని వ్యాఖ్యాత లందఱు వ్రాసిరి. ఇది యిప్పటి వైఖానసులకుఁ గొందఱ కభిమతము గాకున్నను దప్పని చెప్ప వలనుపడ లేదు. గార్హస్థ్యమన్నట్లు వానప్రస్థ మనునది యాశ్రమము పేరు, గృహమునందుండు వాఁడు గృహస్థుఁడు. వనమందుండు వాఁడు వానప్రస్థుఁడు. గృహస్థుఁడు వానియిష్టమువచ్చిన దేవతలను సకాముఁడయియో నిష్కాముఁడయియో యర్చింపవచ్చును, వానప్రస్థుఁడు మోక్షార్థి కావున నేక దేవతోపాసకుఁడే కావలెను. ౭౬ - ౭౭ పద్యములందుఁ జెప్పబడినవారు వానప్రస్థులే, సన్న్యాసులుగారు.

అగ్ని పక్వాశనో వా స్యా త్కాలపక్వ భుగేవవా
అశ్మకుట్టో భవేద్వాపి దంతోలూఖలకోపివా
సద్యః ప్రక్షాళకో వా స్యా న్మాససంచయకోపివా
షాణ్మాస నిచయోవా స్యా త్సమానిచయ ఏవవా॥ వైద్య.

వ్రతభేదములను బట్టి నామభేదములు గలిగెను. అయినను వీరు మతమందు వైఖానసమతమువారే. అది యెట్టిదనిన:— విఖనసుఁడని బ్రహ్మకుఁ బేరు. ఈయన నారాయణునిచే నుపదేశమునొంది మత మొకటి స్థాపించెను. దానికి వైఖానస మతమని పేరు. భృగువు, మరీచి, అత్రి, కాశ్యపుఁడు-వీ రా మతప్రవర్తకులు. వీరందఱు విష్ణుభక్తులు. వీరు విష్ణ్వారాధనము మోక్షోపాయములందు ముఖ్యముగ నెంతురు. ఈయారాధనము అమూర్తికేఁగాని సమూర్తికేఁగాని చేయవచ్చును. అమూర్తి పూజ యనఁగా నగ్న్యాదులందు భగవంతు నారాధించుట, సమూర్తిపూజ యనఁగా బింబపూజ. దీనినే విగ్రహారాధనమని బేరపూజయని యందురు. వీరిమతమున రెండవదియే యుత్తమము. మోక్షసాధనయు భగవదారాధన మనియే వీరి మతము. అనఁగాఁ దక్కినవానికంటె నిది ముఖ్యము. దీనికి దక్కిన వంగములు.

వానప్రస్థ మాశ్రమమని యందలివారి మతము. వైఖానసమని మీఁద వ్రాసిన యభిప్రాయమును నీ క్రిందివాక్యములు బలపఱుచుచున్నవి.

వైఖానసో వనేవాసీ వానప్రస్థశ్చ తాపసః॥ యాదవ.

క్రియలు మానఁదగదు గృహాగతునికిఁ
దపసి కూర నుండఁదగదు సన్న్యాసికి
వనితతోడి పొత్తు వలదు వలదు॥ భాగ.

ఇందుఁ దపసిశబ్దము వానప్రస్థపర్యాయముగఁ బ్రయోగింపఁబడెను.
విఖనసోమతం వైఖానసం తత్రపరిస్థితాః వైఖానసాః వానప్రస్థాశ్రమిణ
ఇతి తావత్. తదుక్తం మనునా
పుష్పమూల ఫలైర్వాపి కేవలై ర్వర్తయే త్సదా
కాలపక్వైః స్వయంశీర్ణై ర్వైఖానస మతే స్థితః॥
విఖనా ఇతి సకారాన్తోప్యస్తి. తథాచ శ్రుతిః
ధేను ర్వహాణా మదితి స్సురాణాం బ్రహ్మ ఋభూణాం విఖనా
మునీనా మితి వైఖానససూత్ర ఏవ.
వానప్రస్థాశ్రమస్యోక్తత్వాత్ తదాశ్రమానువర్తినాం వైఖానసత్వ్యపదేశః
అని శ్రీనివాసాచార్యులవారు శాకుంతల వ్యాఖ్యయందు వ్రాసిరి.

ఈ వానప్రస్థాశ్రమము కలియుగమునఁ బరాశరులచే నిషేధింపఁ బడిన వానిలో నొకటి.

"మాంసదానం తదా శ్రాద్ధే వానప్రస్థాశ్రమగ్రహః॥

ఆశ్రమము నిషిద్ధమైనను వీరును, మనుస్మృతి, రామాయణమందుఁ జెప్పఁ బడినవా రొకవిధమువారా? భిన్నులా? యను విషయము విచార్యము. వైఖానస సూత్రావలంబుల మనువారు ఆ నియమములఁ బాటింపకున్నను నేఁటికిని గలరు. వారికి భగవదారాధనమే ముఖ్యవృత్తియై యున్నది.

ఇట్టిదే పాంచరాత్ర మని మఱియొకటి గలదు. అది సాక్షా ద్భగవత్ప్రోక్తము. దాని విచార మిచట నప్రస్తుతము.

యోగలగ్నులు=ఈదృశః పరమాత్మాయం, ప్రత్యగాత్మా తథేదృశః, తత్సంబంధానుసంధాన మితి యోగః ప్రకీర్తితః॥ యోగో నామేంద్రియై ర్వాక్యైః బుద్ధేర్బహిర్మ్నాణి సంస్థితిః, ప్రయుక్తై రప్రియుక్తై ర్వా భగవత్కర్మ విస్తరః॥

తాత్పర్యము.

శరభంగుఁ డట్లు పరమపదంబుఁ జేరఁగా దివ్యతేజస్సుగల రామచంద్రమూర్తి నా యడవియందుఁగల ఋషులు వాలఖిల్యులు, వైఖానసులు, కూర్చుండి నిద్రించువారు. ఎప్పుడు పండుకొననివారు, నీరు నాహారముగాఁ గలవారు, వానలు గురిసినను ఎండలు కాసినను ఆరుబయటనే యుండువారు, నేలపైఁబండుకొనువారు, గింజల నుడికింపక రాతిపై నలియఁగొట్టి తినువారు, అగ్నిహోత్రమువంటి తేజస్సుగలవారు - జలములో మునిఁగి (యనఁగా శిరస్సు మాత్రము మీదికి గానవచ్చునట్లుచేసి గొంతులోఁతు నీళ్లలోనుండి) తపస్సుచేయువారు, యోగమునందే లగ్నమైన మనస్సులు గలవారు.

కం. వ్రతులును సప్రక్షాళులు, సతతార్ద్రపటుల్ మరీచిపయపానులు ని
ర్జితసకలేంద్రియులును సమ్మతదంతోలూఖలు లైన మానివరేణ్యుల్. ౭౭

వ్రతులు=ఏ యాహారము తీసికొనక యెప్పు డుపవాస ముండువారు-సంప్రక్షాళులు (౧) ఎప్పుడు దేహము కడుగుచుండువారు (౨) భగవత్పాద ప్రక్షాళము నుండి పుట్టినవారు (3) ఏ దిన మాహార మా దినమున సంపాదించి సర్వము భగవంతునికి నివేదించి మఱునాటికి నెత్తిపెట్టుకొనక వినియోగించువారు-నిర్జిత=జయింపఁబడిన, సకలేంద్రియులు=అన్ని యింద్రియములు గలవారు - దంతోలూఖులు=దంతములే ఱోలుగాఁ గలవారు - ధాన్యమును బొట్టు తీయక యట్టులే నమలి తినువారు.

తాత్పర్యము.

నిరతోపవాసులు, తేపటి కనుమాట లేక యే దినము దొరికినది యా దినమందే భుజించువారు, దేహము నెప్పుడు తడుపుచుండువారు - సూర్యకిరణములు త్రావి (ultra violet rays) జీవించువారు, ఇంద్రియజయము గలవారు, దంతములే ఱోళ్లుగాఁ గలిగి యెట్లు దొరికిన ధాన్య మట్టులే నమలి తినువారును నగు మునిశ్రేష్ఠులు.

క. ధర్మజ్ఞు లచలచిత్తులు, ధర్మభృదగ్రీయుఁ బరమ ధర్మజ్ఞుని స
త్కర్మాచరణధురీణుని, నిర్మలు శ్రీరామచంద్రు నిఁ బలశాలిన్. ౭

ధర్మజ్ఞులు=ధర్మ మెఱిఁగినవారు - అచలచిత్తులు=చలింపని మనస్సుగలవారు- ఇట్టి మహర్షులు - ధర్మభృత్ + అగ్రీయుఁ = విల్లు పట్టెడువారిలో మొదటి వానిని (౨) ధర్మమును జెడకుండ భరించువారిలో మొదటివానిని - పరమ ధర్మజ్ఞుని=శ్రేష్ఠమైన ధర్మము - దెలిసినవానిని - ఇది విశేషధర్మము. శరణాగతరక్షణము పరమ ధర్మము. సత్కర్మాచరణధురీణుని = మంచికార్యములు చేయుటయందు సమర్థుని - నిర్మలు=దోషరహితుని - బలశాలిఁ = తాము కోరఁబోవు కార్యమును సమర్థింపఁగావలసిన బలముగలవానిని.

తాత్పర్యము.

ఆత్మరక్షణమందు మనము సమర్థులము గాము - పరాధీనులము - సర్వతంత్ర స్వతంత్రుఁడు సర్వజ్ఞుఁడు సర్వశక్తిమంతుఁడు ఆపద్బాంధవుఁడు భగవంతుఁడొక్కఁడే - ఆపదలయందాయనను రక్షరక్షయని శరణువేఁడుటే జీవునకు స్వధర్మమను ధర్మము నెఱిఁగినవారు-ఈ విషయమునఁ జలింపని చిత్తముగలవారు నగు మహర్షులు యోగులు మౌనులు 'పరిత్రాణాయ సాధూనా'మ్మని సాధు పరిత్రాణ ధర్మమందు మొదటివానిని, అట్లు పరిత్రాణమునకుఁ గావలసిన యాయుధము కోదండము ధరించిన వానిని - "సాధనంచ ద్విధాకార్యం ధర్మద్వేషినిరాకృతౌ। శస్త్రాస్త్రవ్యాహారూపేణ శాస్త్రరూపేణచైవహి॥ ॥అహి॥ ధర్మద్వేషులను రెండు విధముల సాధింపవలెను - శస్త్రాస్త్రములచే నొకటి - శాస్త్రముచే నొకటి - శాస్త్రమునకు లోపడనివారిని శస్త్రాస్త్రములచేఁ జక్కపఱుపవలయును - ఈ రెండు విధముల సామర్థ్యము శ్రీ రామచంద్రమూర్తియందుఁ గలదని, భావము - కృష్ణభగ

వానుఁడు నుపదేశముచే బాగుపడఁగలవారికి నుపదేశము అది వ్యర్థమని తోఁచిన చోటఁ దాడనము చేసెను - శక్తియుండిన మాత్రమునఁ బ్రయోజనము లేదు. కావున శరణాగత రక్షణమే పరమధర్మమను జ్ఞానము గలవానిని (కనుకనే తమ శరణాగతి వ్యర్థముకాదని నమ్మకము గలవారైరి.) సత్కార్యములు చేయుటయందు సామర్థ్యము గలవానిని, త్రికరణశుద్ధి గలవానిని, తమ కార్యము నెరవేర్చుటకుఁగావలసిన బలముగలవానిని - శ్రీరామచంద్రమూర్తిని.

ఉ. చేరి రఘూత్తమా! మనుజ♦శేఖర! వేల్పులలో బలారి నా
శ్రీరఘువంశ్యకోటులను ♦ శ్రేష్ఠుఁడ, వుర్వికి భర్త, వీవ నీ
భూరియశంబు విక్రమము ♦ భూనుతముల్, పితృభక్తి సత్యవా
చారతి ధర్మనిష్ఠయును ♦ సంతత మొప్పును బుష్కలంబుగన్. ౮

చేరి=సమీపించి - దీనిచే నాభిముఖ్యము - అభిగమనము చెప్పఁబడెను - బలారి=ఇంద్రుఁడు - నాన్=అనునట్లుగ - పుష్కలంబుగన్=దండిగ.

చేరి=స్వప్రకాశము పరబ్రహ్మ కకుత్థ్సవంశమునందుఁ బుట్టి మన భాగ్యవిశేషమున మన కన్నులకు గోచరించుచున్నాఁడు - కావున మన తపస్సులు దానములు నేఁడు ఫలించెను. అని తలంచి కృతార్థులుగాఁ దలంచి నిఱుపేదకు నిక్షేపము దొరికినట్లు నిర్భరానందముగ మునీశ్వరు లందఱు నానాదిక్కులనుండి చేరిరి - మహేశ్వర తీర్థులు.

మనుజ శేఖర వేల్పులలో బలారినాన్=ఇది కాకువు. నీవు దేవతలలో నింద్రుని వంటివాఁడవా? కావు. నీవు జగద్ధారణ పోషణకర్తవు.

తాత్పర్యము.

ఆశ్రయబుద్ధి సమీపించి రఘువంశసత్తమా - పురుషరత్నమా దేవతలం దింద్రుఁడో యనునట్లు రఘువంశమునఁ బుట్టినవారిలో నీవు శ్రేష్ఠుడవు. కావున నీ యభిజాతత్వము (గొప్పవంశమునఁ బుట్టుట) శ్లాఘ్యమైనది - గొప్ప వంశమునఁ బుట్టినవారికి గొప్ప బుద్ధియేకదా యుండును - అట్లు వంశకీర్తికరమైన బుద్ధియుఁగలవాడవు - అంతియకాక భూమికంతయు భర్తవు నీవే - శరభంగు ననుగ్రహించుటచే నీకీర్తియు, విరాధవధచే నీ విక్రమమును లోకులు పొగడుచున్నారు.

అరణ్యమునకు వచ్చుటచేఁ దండ్రియందలి భక్తి, భరతుఁడు ప్రార్థించినను ప్రతిజ్ఞ భంగముసేయమి సత్యవాక్కునందుఁగల ప్రీతి శరభంగానుగ్రహము వలన ధర్మమందు నిష్ఠ యివి నీయందు సంపూర్ణముగాఁ గొఱఁతలేక నిండియున్నవి.

కం. నిను ధర్మవత్సలు మహాత్ముని, ధర్మజ్ఞుని మఱుంగు ♦ మొగిఁ జొచ్చితి మో
జనకసుతాహృదయేశ్వర, విను మర్థించెద మొకండు ♦ విషయము నాథా. ౯౦

ధర్మవత్సలున్=శరణాగత రక్షణ ధర్మమును బ్రీతితో ననుష్ఠించువానిని-మహాత్మునిన్=పరమాత్మస్వరూపుని - గొప్పయుదార స్వభావము గలవానిని - ధర్మజ్ఞుని=

శరణాగత రక్షణ ధర్మ మపరిత్యాజ్య మని యవశ్యానుష్ఠేయ మని తెలిసినవానిని - మఱుంగు చొచ్చితిమి=శరణుచొచ్చితిమి. బిడ్డలకు భయముతోంచినపుడు తల్లిదండ్రుల చాటునకుఁ బోవునట్లు మేము నీచాటున నిలిచితిమి - మొగిన్=చక్కఁగా, త్రికరణశుద్ధిగా, జనక సుతాహృదయేశ్వర=జానకీవల్లభా - ఇది సీతాదేవి పురుషకారమును బ్రార్థించుట తెలిపెడిని - అర్థించెదము = యాచించెదము - నాథా = రక్షకుఁడా.

తా త్ప ర్య ము.

పరమాత్మ స్వరూపుఁడవై కావుననే గొప్పయుదారగుణము గలవాఁడవై శరణాగతరక్షణ విధము దెలిసి దానిని బ్రీతితో ననుష్ఠించుచు మాకు నాథుఁడ వగుటచే సీతావల్లభా! నీ మఱుఁగును త్రికరణ శుద్ధిగాఁ జొచ్చితిమి - నిన్ను మే మొక విషయము యాచించెదము.

ఉ. ఏ మొకమన్వి చేయ మది నెంచితి మిందునకై క్షమింపుమీ
భూమిధవుం డెవండు కరముం గొని యాఱవపాలు పుత్రుల
ట్లా మనుజాళిఁ బ్రోవఁడొ మహత్తరపాపము వాఁడు పొందెడిన్
రామ! య పాట భూమిజనరక్షయె కార్యము నేలఱేనికిన్. ౮౧

మన్వి = విన్నపము - కరమున్ = పన్నును - నేలఱేనికిన్ = రాజునకు - భూపతికి.

తా త్ప ర్య ము.

రామచంద్రా! మే మొక విన్నపము చేయఁదలఁచినారము - సత్సు కార్యవతాం పుంసామల మేహాగ్రత స్థితి" యను న్యాయమున మీరు వచ్చుటే చాలదా మిమ్ము జూడఁగనే మీ యభిప్రాయ మెఱుఁగలేనా, అంతమాత్ర మింగితజ్ఞానము నాకు లేదని తలఁచితిరా యనికోపింపకుము. మేము కార్యార్థులమై వచ్చినవార మగుటచే నీకుఁ దెలిసినను దెలియకున్నను అడిగినను నడుగకున్నను చెప్పుకొనవలసినది మాకు విధి- చెప్పుకొనలేదను లోపము మాయందుండరాదు - ఆఱవభాగములు పాలు కప్పము తీసికొని యేరాజు ప్రజలను దన బిడ్డలవలె రక్షింపఁడో యా రాజు మహాపాతకమును సంపాదించినవాఁ డగుచున్నాఁడు, కావున రామచంద్రా! ప్రజాపాలనమే రాజులకు ముఖ్యకార్యము.

అరక్షితారం రాజానం బలిషడ్భాగహారిణమ్
తమాహుః సర్వలోకస్య సమగ్ర మలహారకమ్॥ మను. 8-308

ఏరాజు ప్రజలవలన నాఱవభాగము కప్పము గొని వారిని బాలింపఁడో వాఁడు సకలజనుల పాపములను గొని నరకముల పాలగును.

(ఈ విషయ మయోధ్యాకాండమందు రామభరతసంవాదమున వివరింపఁబడినది.)

కం. తనప్రాణంబులపగిదిని, దనప్రాణముకంటె నిష్టతాపాత్రములౌ
  తనయుల గతి మనుజులఁ బ్రోచిన పతి చిరకీర్తి బ్రహ్మచేఁ బూజఁ గనున్. ౧౨
  ఇష్టతా పాత్రములు=ప్రేమకు యోగ్యులైనవారు - చిరకీర్తి = శాశ్వతమైన యశస్సు.

తా త్ప ర్య ము.

ఏరాజు తన ప్రాణములఁ దాను రక్షించురీతిని దన ప్రాణములకంటె నెక్కువ ప్రీతితోఁ గొడుకులను రక్షించు విధముగను బ్రజలను బరిపాలించునో యారాజు శాశ్వతకీర్తి సంపాదించి పరలోకమున బ్రహ్మలోకమునకుఁ బోయి యచట బ్రహ్మచే గౌరవింపఁబడును.

క. ఫలమూలంబులు మెసవుచు, నలఘుతపముఁ జేయు నా మహర్షులు తపమం
  దలినాలవభాగముఁ బ్రజ, నెలమిని రక్షింప రేని కిడుదురుగాదే. ౧౩
  మెసవుచున్ = తినుచు.

తా త్ప ర్య ము.

తాము వేరు వెల్లంకులు ఆకు లలములు తినుచు గొప్ప తపస్సుచేయు మహర్షులు తమంత కష్టించి సంపాదించిన తపఃఫలమందు నాలవభాగము రాజున కిచ్చుట యతఁడు ప్రజలను రక్షించునిమిత్తమైయేకదా.

౧౦-వ పద్యమం దాఱవభాగమని చెప్పఁబడెను. ఇందు నాల్గవభాగమని చెప్పఁబడెను. మఱికొన్నిచోటుల రెండవభాగము కప్పము చెప్పఁబడినది. ఇం దేది నిశ్చయము ?

సందర్భానుసారముగ నన్నియు సత్యములే.

"యస్యాన్నపాన పుష్టాంగః కురుతే ధర్మసంచయమ్
అన్నప్రదాతు స్తస్యార్థం, కర్తు శ్చార్థం నసంశయః॥

ధర్మకార్యములు చేయువాని నెవ్వఁ డన్నపానము లిచ్చి రక్షించునో వాఁడా ధర్మమందు సగముభాగము పొందును, ధర్మము చేసినవాఁడు సగముఫలముఁ బొందును. అను స్మృతివాక్యప్రకార మన్నదాత సగము పంచుకొనును. ఉపవాసులు ప్రజల వలన భిక్ష గ్రహించి బ్రతుకువారు వీరి ధర్మమునందు నాఱవభాగము, రాజుచే రక్షింపఁబడు దేశమునఁ బుట్టినఫలములు దిని బ్రతుకువారి ధర్మమందు నాలవభాగము రాజునకుఁ బోవును. ఇది యిప్పటివలెఁ గొని తినెడివారి విషయముగాదు.

శా. దీనార్తావనదక్ష ! విన్మ గలరీతిన్ బ్రహ్మభూయిష్ఠ మీ
  వానప్రస్థగణంబు భూరిమహిమన్ వాసిల్లి త్వన్నాథమే
  యైనన్ మిక్కిలి బాధలం గనెడి రామా దుష్టమాంసాశిసం
  తానం బేఁపఁగ మాకు నిష్టభయదానం బీఁగదే ప్రేముడిన్. ౧౪

దీనార్తావనదక్ష=పరులరాపిడిచే దుఃఖించువారిని, బాధపడువారిని రక్షించు సామర్థ్యము గలవాఁడా, బ్రహ్మభూయిష్ఠము=బ్రాహ్మణులు విశేషముగాఁ గలది, బ్రహ్మజ్ఞానము గలవారిచే నిండినది, త్వన్నాథము = నీవే దిక్కుగాఁగలది. దుష్టమాంసాశి సంతానంబు=చెడుగుణముగల రాక్షసుల సమూహము, ఏఁపఁగన్ = బాధింపఁగా; అభయము=భయపడవలదు, అని వాక్యదానమును, ప్రేమున్ = ప్రేమచే.

బ్రహ్మభూయిష్ఠము=బ్రహ్మవిద్యాభూయిష్ఠము, త్వన్నాథము = నీవేదిక్కుగాఁ గలది, ఇట్లనుటచే అనన్యశేషత్వము చెప్పఁబడెను.

వారికే నాథుఁడ వనుటచే అనన్యసాధనత్వము, అనన్యభోగ్యత్వము చెప్పఁబడెను. దీనివలన మహానిరతిశయ మహిమ చెప్పఁబడెను.

తాత్పర్యము.

దుష్టులుపెట్టు బాధలచే దుఃఖించుచు బాధపడువారిని రక్షించు సామర్థ్యము గల శ్రీరామచంద్రమూర్తీ! యథార్థము చెప్పుచున్నాము, వినుము. ఈ వానప్రస్థుల సమూహమందు బ్రాహ్మణులు విశేషించియున్నారు. కొంచెమమంది క్షత్రియులు వైశ్యులుకూడ నున్నారు. ఈ యిందఱుకూడ గొప్ప తపోమహిమచేఁ గీర్తిగాంచియు నీవే దిక్కని నమ్మియున్నారు. క్షత్రియులు వైశ్యులుకూడ స్వశక్తిచేఁ దమ్ము రక్షించుకొందమను తలంపుగలవారుగారు. ఇట్లు నిన్ను నమ్మి నీవే నాథుఁడుగ నెంచియుండియు దుష్టులగు రాక్షసులు పెట్టెడిబాధ సహింపలేక మిగుల బాధపడుచున్నారు. ఇది యుపేక్షించుట నీకుఁ దగినదికాదు. మాయందుఁ బ్రేమగలవాఁడవై మాకభయదాన మిమ్ము, మాకు భయములేకుండఁ జేయుము.

కం. రమ్మవిగో రాఘవ కనుఁ, గొమ్ము వనంబునను నసురకోటులచే నా
శమ్మును గన్న మునీంద్ర చ, యమ్ముల దేహమ్ములెమ్మ లంతటఁ గననా. ౧౬

ఎమ్ములు=ఎముకలు, అంతటన్ = అన్నిప్రదేశములందు, కననౌన్ = చూడవచ్చును.

తాత్పర్యము.

శ్రీరామచంద్రా! రాక్షససమూహములచే హింసింపఁబడిన మునుల దేహములందలి యెముకలు సర్వత్ర పడియున్నవి. అవిగో దూరమునఁ గానవచ్చుచున్నవి. మా వెంటరమ్ము, చూపెదము.

కం. పెంపఱ మందాకినితటిఁ, బంపానదిఁ జిత్రకూటపర్వతమున వా
సింపఁగ ఋషు లవ్వారిం, జంపెను నొంచెను సురారిసంఘము లీశా. ౧౭

పెంపఱన్=పెంపుచెడునట్లు, వాసింపఁగన్= వసింపఁగా, మందాకిని = శరభంగాశ్రమమునొద్ద నుండునది.

తాత్పర్యము.

మందాకినీ తీరమందు పంపానదియొడ్డున చిత్రకూటపర్వతమందు వసించు ఋషులను రాక్షసులు బాధించి చంపుచున్నారు.

ఇచ్చటఁ బంప నదిగాఁ జెప్పఁబడెను. ఈ కాండమందే ౭౩-వ సర్గమందు శీతోదకో హ్రదః ౪౦-వ శ్లో. చల్లనినీళ్ళ మడుఁగు, పుష్కరిణీం పంపాం=పంపయను పుష్కరిణి (కొలను) ౭౪-౪ లో పుష్కరిణ్యాః పంపాయాః; పంపాపుష్కరిణీ యని ౭౫-వ సర్గయందు పంపాపానీయ వాహినీం అని, ఉదకవాహినీ యనియుఁ జెప్పఁబడెను. ఈ వాక్యములు పంపయనునది కొలనా నదియా యను సందేహము గలిగించుచున్నవి.

పానీయవాహినీ, ఉదకవాహినీ శబ్దములు నీళ్ళను వహించునది యను నర్థమున గ్రహించినను ఇందు నది యని స్పష్టముగా నున్నది. పుష్కరిణీ శబ్దము నకుఁ గమలములు గలది యని నదీపర్యాయముగ నర్థము గ్రహింత మనిన హ్రద శబ్దము బాధించుచున్నది. భవభూతి "తదేతత్పంపాభిధానం పద్మసర" యనియే వ్రాసెను. ఈ విషయము కిష్కింధాకాండము ౧-వ పద్యము వ్యాఖ్యయందు విచారింపఁబడును.

చ. మునిజనవిప్రకారము న♦మోఘబలా! సయిరింప లేమిచే
నిను శరణంబు జొచ్చితిమి ♦ నీవె శరణ్యుఁడ వాసురాళిచేఁ
బొనుఁగుపడంగనీకు, కృప ♦ భూమితలంబున నీవు తప్ప మా
కును గతిలేదు, మా వెతలు ♦ కూలగ జేయవె జానకీపతీ.		౧౭

విప్రకారము=కీడు, అమోఘబలా=వ్యర్థముకాని బలముగలవాఁడా, శరణ్యుఁడవు=రక్షింప శక్తిగల యోగ్యుఁడవు, రక్షకుఁడవు, పొనుఁగుపడనీకు = నశింపనీయకుము, వెతలు = బాధలు, జానకీపతీ=ఈ పదము సీతాపురుషకారము సూచించుచున్నది, మమ్ము రక్షించువిషయమందు నీకు సందేహముండిన సీతాదేవి నడిగి చూడు మని భావము.

తాత్పర్యము.

దేహాభిమానము వదలి మృత్యువును లక్ష్యముసేయక తపస్సుచేయు మాకేల యీ మరణభీతి యందువేమో, మాకుఁగా మేము దుఃఖింప లేదు. సంసారము రోసి యడవులం దుండి తపస్సుచేసికొందమని వచ్చిన మునిజనులకుఁ గలుగు నపకారము మేము చూచి సహింపలేక యున్నాము. కావున నీవు రక్షింపఁగలవాఁడవు. అమోఘ బలుఁడవు కావున నిన్ను శరణుజొచ్చితిమి. మేము రాక్షసులచేఁ జావకుండ నీ దయాగుణము నాలోచించి కాపాడుము. నీవు మెచ్చునంతటి తపస్సు చేసితిమే, మమ్మేల కాపాడవని నిర్బంధింపము. బలముగలిగి దీనుల నార్తుల రక్షింపక పోవుట దయావంతుల లక్షణముగాదు. కావున నీ కల్యాణగుణము లాలోచించి

వానికి హాని రాకుండఁ గాపాడుకొనుము, ఎందఱో రాజులున్నారే వారిసహాయ మేల కోరినవారుగారు, ఇన్నాళ్ళేల సయిరించితి రనెదవేమో? నీవుతప్ప మాకు వేఱు గతిలేదు. మే మనన్యులమగుటచే నీరక్షకత్వమే కోరి నీవెప్పు డవతరింతువా ఎప్పుడు దర్శనమిత్తువా ఎప్పుడు మమ్ముఁ గృతార్థులఁజేసి రక్షింతువా, యని కాచి యున్నారము. కావున మాదుఃఖములు దొలఁగఁజేయుము, మా విషయమున దయ దలఁపవలయునా అక్కఱలేదా యను విషయమున సీతాదేవి నడిగిచూడుము.

ఇది యనన్యత్వమును బోధించుచున్నది - అనన్యత్వమనఁగా భగవంతునిఁ దప్ప వేఱొకని 1. రక్షకుఁడుగ దలఁపకుండుట, ౨. భగవత్ప్రాప్తి తప్ప వేఱు ఫలము గోరకుండుట ౩. భగవదనుగ్రహము సంపాదించుకొనుటకు భగవంతునే యుపాయముగఁగాని వేఱొక యుపాయము వెదకికొనకుండుట. మనము భగవంతుని వారమేకాని యితరులవారము కాము-ఆయనకు మనము స్వజనులము-కావున నన్ని భావముల నాయననే యాశ్రయించి యుండవలయు ననుట యనన్య భావము. భార్యాభర్తలు పితాపుత్రులు నెట్లేకీభావము వహించియుందురో యట్టిభావ మనన్యభావము అభేదబుద్ధియని యర్థము - అనఁగాఁ దండ్రి యెవఁడో నేనెవఁడో భిన్నపదార్థము లని కొడుకు దలఁచుట భేదాభిప్రాయము. తండ్రివాఁడను నేను, నాజన్మస్థితి పోషణాదుల కాయనయే యాధారము - ఆయనయారసుఁడనే కదా, కావున నభేదమని తలఁచుట యనన్యభావము. అట్లులే యల సముద్రము వేఱు, తాను వేఱని తలఁచుట, ఎండ, తాను వేఱు, సూర్యుఁడు వేఱని తలఁచుట యన్యభావము - కారణమున కంటె మేము భిన్నులము కామని యవి తలఁచుట యనన్యభావము - సముద్రమే నేనని యల తలఁచుటవంటిదిగాదు.

నీవే శరణ్యుఁడవని యుపపదములేక చెప్పుటచే సర్వలోకశరణ్యుడని భావము- అట్టి శరణ్యత్వమునకుఁ గావలసిన గుణములు బలము దయ యనునవి యమోఘబలా - కృపయను పదములచేఁ దెలుపఁబడెను - స్వామిత్వము - వేఱుగతి లేదనుట తెలుపును - శరణంబు చొచ్చితి మనుటచే నీవే యుపాయాంతర స్థానమందున్నవాఁడవని యర్థము - నీవే శరణ్యుఁడవనుటచే మహావిశ్వాస లోనుగాఁగల యంగసంపత్తి పూర్వకమైన రక్షాభరసమర్పణము చెప్పఁబడియె. మా వెతలు గూలఁగఁజేయవె యనునది గోప్తృత్వవరణమును దెలుపును. గోప్తృత్వవరణ మనఁగాఁ దమ యభిప్రాయము దెలుపుట-ఇది యనిష్టనివృత్తిరూపమగు ఫలమును బ్రార్థించుట తెలుపును-తనిశ్లోకి.

నీవు తప్ప మాకును గతిలేదనుచో "తమేవం విద్వా నమృత ఇహ భవతి నాన్యః పంథా అయనాయ విద్యతే" యను సూక్తమును స్మరింపవలయును.

—♦ శ్రీరాముఁడు మునుల కభయం బొసంగుట. ♦—

చం. అన రఘునాథుఁ డిట్లను మ♦హాత్ముల రీ రిటు నన్నుఁ బల్కఁగా
జను నె? త్వదాజ్ఞ వర్తిలుదు ♦ సంయములార! యరణ్యసీమకుఁ
బనిగొని యాత్మకార్యముగ ♦ బాపుల నెల్ల నడంచి మీకు శో
భన మొనగూర్ప మజ్జనకు ♦ వాక్యము సాకుగ నేను వచ్చితిన్. ౭౭

ఈరు=మీరు - త్వదాజ్ఞ = మీయాజ్ఞా ప్రకారము-ఆత్మకార్యముగ=నా పనిగ - ఇందుఁ గృతిత్వమను భగవద్గుణము వర్ణింపఁబడినది.

తాత్పర్యము.

అని ఋషు లందఱు చెప్పఁగా శ్రీరామచంద్రమూర్తి యిట్లనియె, మహానుభావులారా! మీరు నన్ను నిటు గొప్పచేసి పలుకవచ్చునా? నేను మీ యాజ్ఞా ప్రకారము వర్తించువాఁడనే - మీ రాజ్ఞాపింప నర్హులు గాని విజ్ఞాపింప నర్హులు గారు - నే నీయడవులకు నాస్వకార్యము మీఁదనే వచ్చితిని - ఏమి నీ స్వకార్యమందురా? ఈ యడవులందుండు రాక్షసులనెల్ల వధించి మీకు మేలు గలిగించుటే నా స్వకార్యము - అయ్యా! యివి యిచ్చకములు - ఇప్పుడు మేము ప్రార్థింపఁగా మాముఖప్రీతికై మాటలాడుచున్నావు - నీ తండ్రిని సత్యవాదిని జేయఁగదా నీవు వనములకు వచ్చితివందురేమో - అది నెపమేకాని యథార్థము గాదు - ఇందు నీ స్వప్రయోజన మే మందువా యాశ్రితుల రక్షింపవలసినది రక్షకుని విధిగదా! నా కార్యము నే నింతవఱకుఁ జేయక మీరు ప్రార్థించువఱకు నూరకుండుట నా లోపమే - మీరు సంయములు గనుక క్షమింపుఁడు.

భగవంతుఁడు భక్తపరాధీనుఁడు. గర్భస్థశిశువు కోరకున్నను తల్లిదండ్రులు దానిని బోషించువిధమున భక్తులు కోరకున్నను వారి యోగక్షేమములు నిర్వహించుట భగవంతుని కార్యము - అట్లు చేయకుండుట లోపము గదా - అయోధ్యా కాండమందలి ౪౬౭-౪౬౮ పద్యములం జూడుఁడు.

"శక్తోపి రాఘవస్తస్మై రాజ్యం సంత్యజ్యధర్మతః దశగ్రీవవధార్థాయ పితుర్వచన హేతునా॥" పద్మ-రామచంద్రమూర్తి రాజ్యము గ్రహింప శక్తుఁడయ్యును రావణుని జంపు నిమిత్తము పితృవచనము కారణముగాఁగొని రాజ్యమును వదలిపెట్టెను.

శ్రీరామచంద్రమూర్తి జనకవాక్య పరిపాలనార్థ మరణ్యముల పాలాయెనని పెక్కుతావులఁ జెప్పఁబడెను - ఇచ్చటఁ దనకుఁ బ్రధానకార్యములను రాక్షస వధ యనియుఁ దండ్రి వాక్యము నిమిత్తమాత్రమని చెప్పుటచేఁ దండ్రివాక్య మప్రధాన మయ్యెను - వారి యెదుర నా మాట వీరియెదుర నీ మాట చెప్పవచ్చునా? రావణాసురుఁ జంపుట ముఖ్యకార్య మయ్యెనేని పట్టాభిషిక్తుఁడై న పిదప నేల చంపఁబోరాదు - లవణాసురవధ మట్లుగాదా చేసెను?

ఆశ్రిత రక్షణమును మునీశ్వర కార్యమునే ముఖ్యముగను దండ్రివాక్యము దానికి నిమిత్తమగుట గౌణముగను శ్రీరామచంద్రమూర్తి యెంచె ననియే చెప్ప వలసియున్నది - మొట్టమొదట అయోధ్యాకాండమున సుమిత్రుఁడు పిలువ వచ్చి నపుడు శ్రీరామచంద్రుఁడు సీతాదేవితోఁ జెప్పిన వాక్యముల ధోరణిచూడఁ (ప. ౪౬౭-౪౬౮) గా నాశ్రితరక్షణకార్యమందే యాయనకు మనస్సు లగ్నమై నిమిత్తమునకై యెదురు చూచుచున్నట్లు కానవచ్చుచున్నది - ఇఁకఁ గైకతో సంభాషించునపుడు మీతండ్రి నాకు వరములిచ్చెను - నీ వరణ్యమునకుఁ బొమ్మన గానే యామె మాట యామె నోరనుండఁగానే పోయెద నని చెప్పెను.

తల్లికిఁ బోషణాదులయం దధికారమేకాని యాజ్ఞాపించు నధికారము లేదని ముందే కౌసల్యవిషయమున విచారింపఁబడెను; కౌసల్యకులేని యధికారము కైక కెందుండివచ్చెను? తండ్రి చెప్పనిమ్ము పోయెద ననియుండవచ్చును. అట్లు చెప్పినచోఁ దండ్రి చెప్పఁడు - ఇంతలో వసిష్ఠుఁడు లోనగువారు వచ్చి కైకప్రయత్నము సాగ నిచ్చియుండరు - అరణ్యయాత్ర నిలిచిపోయి యుండును - అది రాముని యుద్దేశము గాదు. భరతుఁడు మొదలగువారు నిన్ను రాజ్యభ్రష్టుని జేయు నధికారము దశరథు నకు లేదని వాదించినపుడు దానికి సమాధానము నేను బ్రమాణము చేసియున్నానని చెప్పెను - ఈయనను బ్రమాణము చేయుమని యెవరు కోరిరి? - కైక చెప్పిన మాటలు విని యూరక వెలుపలవచ్చి వసిష్ఠాదులతో లోపలి సందర్భము లిట్లున్నవి, నన్నేమి చేయు మనెదరని చెప్పి యుండవచ్చునుగదా - అరణ్యమునకుఁ బోవుటయందుఁ బట్టుదల లేకున్న నిట్లేల చేసియుండరాదు - అప్పుడు నేను బ్రమాణము చేసితి ననుమాట పుట్టఁ గారణము కలుగదు కదా - కావున నేదియేని నెపము కలిగించుకొని యరణ్యములకుఁ బోవలయు ననియే రాముని సంకల్పము.

ఇఁకఁ బట్టాభిషిక్తుఁడై రావణాసురవధ సలిపి యుండరాదా యనిన విరాధ వధ కబంధవధ ఖరాసురాదివధ వాలివధ వీనిని బరిశీలించినచోఁ బ్రతిపక్షుల దోషము స్వయముగఁ జూచికాని రామచంద్రమూర్తి దండించువాఁడు కాఁడు. రావణాసురు జంపఁ గారణము కలుగదు. ఒకవేళఁ బోయినను నీయనకుఁ గలది యక్షోహిణీసేన - తక్కిన రాజులందఱు గలిసినను 5—6 అక్షోహిణులగు నేమో! వీరు రాక్షసుల నోళ్లకు వడియాలుగాఁగూడఁ జాలరు. వాలియు సామంతరాజే కదా వాఁడు వానరసేనతో సహాయపడియుండఁడా యనిన మఱఁదలిని జెఱచి వధ్యు డైన దోషిని సాహాయ్యముచేయ నెట్లుకోరును? ఎప్పటికైన వాఁడు వధ్యుఁడే.

అదట్లులుండఁ దన్నాశ్రయించి శరణాగతులైన మునీశుల యాశ్రమము లందుఁ బదిసంవత్సరములు సంచరించి వారికోరిక ప్రకారము వారికి దర్శనమిచ్చెఁ గదా - సాధు పరిత్రాణమునందు దర్శన మిచ్చుటేకదా ప్రధానము. పట్టాభిషిక్తుఁ డైనచోఁ బదిసంవత్సరము లిట్లు తిరుగ సాధ్యపడునా? ఇప్పటి సౌలభ్య మప్పుడల

వచునా ? కావున నాశ్రితరక్షణము ముఖ్య మనియు దానికి నిమిత్తమగుటఁ బితృవాక్యపాలనము గౌణ మనియు నీవిధముగఁ దండ్రిని సత్యవాదిని జేసెను - ఆశ్రితుల రక్షించెను - దుష్టుల శిక్షించి సర్వకార్యములు చక్కఁబఱిచె ననియు నెఱుఁగవలయును,

క. కాన మహాఫలదం బగుఁ, గాననవాసంబు మాకు ♦ గం డడఁతు నని<br>మానిజనశాత్రవుల నిఁక, సానుజమద్బాహుశక్తి ♦ సంపదఁ గనుఁడీ. ౮౯

మహాఫలదంబు=గొప్ప ఫలమును గలిగించునది - కాననవాసంబు = అడవియందు వసించుట - అనిన్=యుద్ధమందు - గండడఁతున్ = గర్వమణఁచెదను - శాత్రవులన్=విరోధులను - సానుజ=తమ్మునితోఁగూడిన - మత్=నాయొక్క - బాహుశక్తిసంపదన్=భుజబలముయొక్క యాధిక్యమును. 

తాత్పర్యము.

ఈ కారణముచే మాకు నరణ్యావాసము గొప్పఫలము గలిగించునది యగును. యుద్ధమందు మునులకు విరోధులగు వారిని నాతమ్మునితోడఁ గలిసి వధించెదను - అప్పుడు నాభుజశక్తిచూడుఁడు. 

ఇక్కడఁ జెప్పఁబడిన మహాఫలము - ఆర్తశరణాగత రక్షణమే - అనఁగా ననిష్ట నివృత్తి - ఇష్ట ప్రాప్తి - నా భుజబలము చూడుఁ డనునది గర్వోక్తికాదు - మునులకు ధైర్యము కలుగుటకై పూనినకార్యమందుఁ దనకుఁగల యుత్సాహము దెలుపుటకై చెప్పినమాట - ఇష్టులకు ధైర్య సంతోషములును విరోధులకు భయమును గలిగించు కార్యసాధకుని వాక్యము లాత్మస్తుతులు గావు.



౭-వ సర్గము.

తే. ఇట్టు లభయం బొసంగి ము♦నీశ్వరులకు, సత్యనిరతుండు లక్ష్మణ♦సహితుఁ డగుచుఁ<br>జనె సుతీక్ష్ణాశ్రమంబున♦జాడఁబట్టి, యెల్లద్విజులును దనతోడ ♦ నేగుదేర. ౯౦

సత్య నిరతుండు=సత్యమందు విశేషాసక్తి గలవాఁడు - అనుటచేఁ దాను మునీశ్వరులకుఁ జెప్పినమాట నిర్వహింప మిక్కిలి యభిలాష గలవాఁడు.

తాత్పర్యము.

ఈ ప్రకార మాఋషీశ్వరుల కభయ మిచ్చిన రామచంద్రమూర్తి తనమాట నిర్వహించుటయందు విశేషాభిలాషగలవాఁడై తనతోడ ఋషీశ్వరు లందఱు రాఁగా లక్ష్మణుతోడ సుతీక్ష్ణాశ్రమమునకుఁ బోవు త్రోవఁబట్టి పయనించెను.

ఇచ్చట సీతాదేవిపేరు చెప్పలేదు - లక్ష్మణుని పేరుమాత్రము చెప్పఁబడెను - దీనివలన రాక్షసవధయందు శ్రీరామచంద్రమూర్తి కున్నంత యుత్సాహము లక్ష్మణునకుఁ గలదని యేర్పడుచున్నది - సీతాదేవికో మునిజనరక్షణము సమ్మతమే కాని నిష్కారణముగ రాక్షసవధ చేయుట సమ్మతముగాదు - కావున నీ విషయమున నన్నదమ్ముల కున్న యుత్సాహ మామెకు లేదు-ఇది సీతాదేవి రామచంద్రమూర్తి

కుపదేశించిన హితబోధవలన స్పష్టమగును - కావున నిది సూచించుటకే వాల్మీకి యిచ్చట సీతాదేవి పేరు చెప్పలేదు.

ఉ. ఒయ్యన దూర మేగి విపు♦లోదక వాహిని సంతరించెఁ దా
నయ్యెడ నంజనోన్నతఘ♦నాభమహీధ్రముఁ గాంచి సంతతా
క్షయ్యఫలప్రతానసుమ♦సంతతి వింతలు గొల్పఁ గానలో
నయ్యమరేంద్రవంద్యుఁడు శు♦భాశ్రమముం గనెఁ జీరమాల్యమున్. ౯౧

ఒయ్యనన్=మెల్లగా - గుంపుగా మాటలాడుచుఁ బోవుచున్న కారణముచే మెల్లగాఁ బయనించి రని సూచన - విపులోదకవాహిని = విస్తారముగ నీళ్లుగల యేటిని - సంతరించెన్ = దాఁటెను, అంజనోన్నత = అంజన పర్వతమువలె నెత్తైన దియు - ఘనాభ=మేఘముతో సమానమై వ్యాపించియుండు నదియు - నగు మహీధ్రమున్=పర్వతమును - సంతత=ఎల్లప్పుడు నెడఁదెగక - అక్షయ్య = క్షయముగాని ఫలప్రతాన సుమసంతతి=పండ్ల సమూహము - పుష్పముల సమూహము - చీరమాల్యమున్ = నారచీరలపంక్తులు గలది - దూరము = శరభంగుఁడు సమీపముననే సుతీక్ష్ణాశ్రమ మున్నదని చెప్పెనే యనిన మెల్లగాఁ బోవుటచే దూరమని తోఁచి యుండవచ్చును.

తాత్పర్యము.

తోడ వచ్చిన వానప్రస్థులతో ముచ్చటలాడుచు మెల్లగా దూరముపోయి యచ్చట రేవు చూచుకొని నదిని దాఁటి యచ్చటఁ గాటుక కొండవలె నల్లగా మబ్బువలె వ్యాపించియుండు పర్వతమును జూచి యా పర్వతము ప్రాంతమందు సర్వకాలముల నుడిపోక ఫలములచేఁ బూలచే నిండియుండు చెట్లను జూచి వాని సౌందర్య సంపత్తులకు నాశ్చర్యపడుచుఁ బోయిపోయి యా యడవిలో గాలి కారఁ గట్టిన నారచీరల వరుసలచే నందమయిన శుభాశ్రమమును రామచంద్రమూర్తి చూచెను.

—♦ శ్రీరాముఁడు సుతీక్ష్ణాశ్రమంబుఁ జేరుట. ♦—

క. డాసి యటఁ దపసి ధూళీ, ధూసరితజటాకలాపు ♦ ధుతపాపుని సౌ
ఖ్యాసనయుక్తునిఁ గని యి, ట్లాసీతాహృదయనేత ♦ యాడెం బ్రీతిన్. ౯౨

డాసి=సమీపించి-ధూళీ=వార్ధక బాధచే స్నానము చేయమిని దేహమందుఁ బుట్టిన మురికిచేతను గాలికివచ్చి పైపడిన దుమ్మువేతను-ధూసరిత=బూడిద వర్ణము గల - జటాకలాపున్=జడల సమూహము గల వానిని - ధుతపాపునిన్=చిమ్మివేయఁబడిన పాపములు గలవానిని - సౌఖ్యాసన యుక్తుని=సుఖాసన మందుండు వానిని - సీతా హృదయనేత=శ్రీరామచంద్రమూర్తి.

తా త్ప ర్య ము.

ఇటువంటి యాశ్రమమును సమీపించి, యందు స్నానము చేయకుండుటచేతను గాలికి వచ్చిన దుమ్ముచేతను బూజుపాఱిన దేహము-జడల సమూహము గలవానిని బాపరహితు యథాసుఖముగఁ గూర్చుండిన వానిని సుతీక్ష్ణుని శ్రీరామచంద్రమూర్తి చూచి ప్రీతితో నిట్లనియెను.

సుతీక్ష్ణుఁడు బ్రాహ్మణ తపస్విగదా స్నానములేక నిత్య కర్మానుష్ఠానము చేసి కొన వచ్చునా యని సందేహము - స్నానము చేయుట శుచిత్వముననే కదా.

అపవిత్రః పవిత్రోవా, సర్వావస్థాం గతోపివా
యః స్మరే త్పుండరీకాక్షం, సబాహ్యాభ్యంతరశ్శుచిః॥

అపవిత్రుఁడైనను బవిత్రుఁడైనను నేదశయం దుండినను భగవంతు విష్ణు నెవఁడు స్మరించుచుండునో వాఁడు లోపల వెలుపలఁ గూడ శుచియే.

జలస్నానము బాహ్యమలమును బోఁగొట్టునే కాని యాంతరమలమును బోఁగొట్టఁజాలదు. 'మానసం విష్ణుచింతన'మ్మని భగవద్ధ్యానరూపక మానసిక స్నానము చేయువాఁడు లోపల వెలుపలఁ గూడ శుచియే యని ప్రమాణము.

"తత్పాద పద్మజాం గంగాం, నిపతంతీం స్వమూర్ధని
చింతయే ద్బ్రహ్మరంధ్రేణ, ప్రవిశంతీం స్వకాం తనూం
తయా సంక్షాళితం ధ్యాయేత్ బాహ్యాభ్యంతరం మలమ్
తత్క్షణా ద్విరజో మంత్రీ, జాయతే స్ఫటికోపమః
ఇమం మానసికం స్నానం, ప్రోక్తం హరిహరాదిభిః
ఇదం స్నానం పరం మంత్రా, త్సహస్రాదధికం స్మృతమ్
సార్ధత్రికోటి తీర్థేషు, స్నానాత్కోటి గుణాధికమ్.
రజ స్తమో మోహజాతాః, జాగ్రత్స్వప్న సుషుప్తిజాః
వాజ్మనః కర్మజా దోషాన్నవై వా న్నవభి ర్హరేత్
యోనిత్య మాచరే త్తం తు, సవై నారాయణ స్స్మృతః
జ్ఞానహ్రదే, ధ్యానజలే, రాగ ద్వేషమలాపహే
యః స్నాతి మానసే తీర్థే, సయాతి పరమం పదమ్॥

ఆయన పాదపద్మములందుఁ బుట్టిన గంగ తన శిరస్సునఁ బడి బ్రహ్మరంధ్రములోఁ బ్రవేశించి తన దేహము లోపల వెలుపలఁ గడిగినట్లు ధ్యానింపవలెను. ఇట్లు మంత్రధ్యానము చేయువాఁడు రజోహీనుఁడై స్ఫటికమువలె నిర్మలుఁ డగును - ఈమానస స్నానము హరిహరాదులచేఁ జెప్పఁబడెను - ఇది మంత్ర స్నానమున కంటె వెయ్యంతలు శ్రేష్ఠము-మూఁడుకోట్ల యేఁబదిలక్షుల తీర్థములలో స్నానము చేయుటకంటె దీనియం దెక్కువ గుణము గలదు - రజసు - తమస్సు - మోహము వలనఁ బుట్టినవియు జాగ్రత్స్వప్న సుషుప్తులయందుఁ బుట్టినవియు మనోవాక్కర్మ

ముల వలనఁ బుట్టినవియు నగు తొమ్మిది విధములైన పాపము లీ మంత్రములు హరించుచున్నవి - ఎవఁడు ప్రతిదిన మీ స్నానము చేయునో వాఁడు నారాయణుడే- జ్ఞాన మను మడుఁగునందు రాగద్వేష మలముల హరించు ధ్యానజలములందు మానస తీర్థమున నెవఁడు స్నానము చేయునో వాఁడు పరమపదము చెందును.

ఇట్లుండ సర్వదా భగవద్యోగమందుండు నమ్మహామునికి దేహము మురికిని పోఁగొట్టు నీళ్లయందు స్నానము చేయకుండిన నేమి లోపము ?-అదియును గాక వానప్రస్థులకుఁ ద్రిషవణ స్నానమేల చెప్పఁబడె నన దానియందు విరక్తి పుట్టి చాలించుటకే యని పతంజలి చెప్పెను.

అనఁగా మూఁడు మార్లు స్నానముచేసినను దేహమునుండి మురికి రాక తప్పదు-వచ్చునది వచ్చుచునేయుండును-అట్లుండ నెన్ని స్నానములుచేసి యేమి ప్రయోజనము ? లోపల మలము పుట్టకుండు నుపాయము చేయవలయు నని ప్రయత్నించుటకే యిన్ని స్నానములు చెప్పబడెను.

**ఉ.** రాముఁడ నేను దాపసవ♦రా యనఘా భవదీయదర్శనో
ద్దాముదాన వచ్చితి, య♦థామతి సాదరదృష్టిఁ జూడవే
నా మునితల్లజుండు రఘు♦నందనుఁ గ్రుచ్చి కవుంగిలించి సీ
తామహిళేశ ! సేమము ము♦దంబు గదాయని వెండి యిట్లనున్. ౯౩

తాపసవరా = మునిశ్రేష్ఠుఁడా - అనఘా=పాప రహితుఁడా - భవదీయ దర్శనోద్దామ ముదాన=నిన్ను దర్శింపవలయు నను గొప్ప సంతోషముతో-సాదర దృష్టిన్=ఆదరముతోఁ గూడిన చూపుచేఁ జూడుము.

తాత్పర్యము.

ఋషీశ్వరా - పాప రహితుఁడా - నేను రాముఁడను నిన్ను దర్శింపవలె నని మిగుల సంతోషముతో వచ్చితిని - కావున మనసార ప్రేమగల చూపులఁ జూడుము - అని వేఁడఁగా మునిశ్రేష్ఠుఁడు రాముని గౌఁగిలించుకొని సీతేశ్వరా ! నీకు సేమమేకదా యని మఱియు నిట్లనియె.

**క.** నీవచ్చినకతమునఁ గడు, పావనమై యర్హనాథ♦వంతంబై భూ
మీవర యీ యాశ్రమ మెం, తో వెలయుచు నున్న దిపుడు ♦ దుర్భరతేజా! ౯౪

దుర్భరతేజా=భరింపరాని తేజముగలవాఁడా.

తాత్పర్యము.

ఇతరులకుఁ జూచియు సహింపరాని తేజస్సుగలవాఁడా! నీవు వచ్చిన కారణముచే నీయాశ్రమము మిగులఁ బవిత్రమై తగిన దిక్కుగలదై యిపుడు మిగులఁ బ్రకాశించుచున్నది.

**తే.** దేహమును వీడి యోవీర ♦ దేవలోక, మేగ నొల్లక నీవచ్చు ♦ టెఱిఁగి యింద
వేచి యున్నాఁడ నీకొఱ♦కై చు మయ్య, వచ్చి తీవిట మద్భాగ్య♦వశతఁ దండ్రి. ౯౫

తా త్ప ర్య ము.

ఓ వీరుఁడా! నీ విచ్చటికి వచ్చెద వని తెలిసి దేహమును వదలి దేవలోకము నకుఁ బోవుటకు సమ్మతింపక యిందే నీకొఱకై కాచియున్నాఁడను. నా పుణ్యము కొలఁది నాయనా! వచ్చితివి.

దీనిచే స్వర్గలోక బ్రహ్మలోక ప్రాప్తికంటె శ్రీరామచంద్ర ముఖారవింద దర్శనము శ్రేష్ఠమని భావము.

శ్రీరాముని దర్శించినవారికి ముక్తి గలదు. దేవలోక బ్రహ్మలోకమునకుఁ బోయినవారికి మరల జన్మము గలిగినఁ గలుగవచ్చునుగదా. ఆకారణముచే రామ దర్శన నిమిత్తమై కాచియున్నాఁడు.

తస్యాంతరాయో మైత్రేయ, దేవేంద్రత్వాదికం ఫలమ్

మైత్రేయా దేవేంద్రత్వము లోనైనది మోక్షమునకు విరోధి. పునర్జన్మ కారణము. కావున స్వర్గమునకుఁ బోనైతి నని గోవిందరాజీయము.

వాస్తవార్థ మేమనఁగా రావణవధ నిమిత్తమై రఘువంశమునఁ బుట్టిన నీ రాజ్యభ్రష్టత్వము చిత్రకూటవాసము నేను వింటిని. ఆ కారణముచే వానివధ నిమిత్తమై నీ వీప్రాంతములకు వచ్చెద వనియు వింటిని. కావున నీరాక కెదురు చూచుచు దేవలోకమునకుఁ బోనైతిని, పరమపురుషార్థమైన నీదర్శనమునకు స్వర్గము విఘ్నము. కావున దేహము విడువకయున్నాను. మహేశ్వర తీర్థీయము.

కం. వింటిని రాజ్యభ్రంశముఁ, గొంటయు మునిరూపుఁ జిత్ర♦కూటంబున వా
ల్గంటియుఁ దమ్ముండును నీ, వుంటయుఁ గాకుత్థ్సవర్య ♦ యుగ్రసుశౌర్యా! ౯౬.

రాజ్యభ్రంశము = రాజ్యముపోవుట-మునిరూపు = మునివేషము-వాల్గంటి = నిడుపైన కన్నులుగలది-కాకుత్థ్సవర్యా=కకుత్థ్సునివంశమునఁబుట్టినవారిలో శ్రేష్ఠుఁడా, ఉగ్రసుశౌర్యా=మిక్కిలి గొప్ప పరాక్రమము గలవాఁడా-కాకుత్థ్సవర్య యనుటచే కకుత్థ్సునివలె నీవు దేవకార్యము తీర్పవలసియున్నదని భావము.

తా త్ప ర్య ము.

కకుత్థ్సవంశమునఁ బుట్టినవారిలో శ్రేష్ఠుఁడవును మంచిపరాక్రమము గలిగిన శ్రీరామచంద్రమూర్తీ! రాజ్యమును వదలి మునివేషమునుదాల్చి చిత్రకూటపర్వత మున నీవు భార్యయగు సీతాదేవితోఁ దమ్ముఁడగు లక్ష్మణునితో నుండుటయు విన్నాను.

ఉ. రమ్మని పిల్వవచ్చె సుర♦రాజు ననుక్ సుకృతాప్తి దేవలో
కమ్ములు గెల్చినాఁడ నఁట ♦ కారుణికాగ్రణి నీవు మత్ప్రిసా
దమ్మున భార్యతో ననుఁగు♦దమ్మునితో విహరింపు వాన; నా
బమ్మను గశ్యపర్షి యనఁ ♦ బల్కె మహర్షి ని రామచంద్రుఁడున్. ౯౭

సుకృతాప్తి = పుణ్యము లభించుటచే - కారుణికాగ్రణి = దయావంతులలో శ్రేష్ఠుడా - మత్ప్రసాదమ్మునన్ = నాయందలి యనుగ్రహ బుద్ధితో, వానన్ = వానయందు-విహరింపు మనుటచేఁ గర్మ ఫలత్యాగము చెప్పఁబడినది.

తాత్పర్యము.

దయావంతులలో శ్రేష్ఠుఁడవైన రామచంద్రా! నేను సంపాదించిన పుణ్యములచే స్వర్గము సంపాదించితివని అచ్చటికి రమ్మని యింద్రుఁడు నన్నుఁ బిలువవచ్చెను. గాని నీవీయాశ్రమమునకు రాఁ గలవని నే నెఱిఁగియచ్చటికిఁ బోక నీ దర్శనమునకై కాచి యున్నాను - నా యం దనుగ్రహించి యా లోకములందు నీవు నీ భార్యతో లక్ష్మణుతో విహరింపుము - అని చెప్పఁగాఁ గశ్యపర్షి బ్రహ్మతోఁ జెప్పినట్లు రామచంద్రుఁ డిట్లు చెప్పెను.

మత్ప్రసాదమ్మునన్=నా యనుగ్రహముచే నని చెప్పరాదు. ఈ లోకములను జీవికోటి యనుభవించుటకై భగవంతుఁడు సృష్టించెను - అట్టివానిలో నాయన సంచరించుట కొఱకరియనుగ్రహ మేల ? కావున నీయర్థము సరిగాదు, 'మదీయత్వేనాభిమతంచ వస్తు సర్వ స్వామినే నారాయణాయతుభ్య మేవ నమమ' నాది యను నభిమానము నాకు దేనియందుఁగలదో యది సర్వస్వామివైన నీకేగాని నాకుఁగాదని ప్రపన్ను లందురు - కావున వానిని నాయందలి కనికరముచే గ్రహించి నన్నుఁ గృతార్థుని జేయు మని భావము.

రామచంద్రమూర్తి క్షత్రియ ధర్మము పురస్కరించుకొని దానమున నతని పుణ్యమును స్వీకరింప నొల్లక యిట్లు చెప్పుచున్నాఁడు.

చం. కొనెదను నేన నీసుకృత♦కోటి స్వయమ్మునఁగ, మేము నిల్వ నీ
వనమున వాసయోగ్య మగు♦ప ట్టెది! నీహితబుద్ధిశక్తులన్
వినిచెను గౌతమాన్వయుఁడు ♦ విశ్రుతుఁ డాశరభంగు డన్న, నా
ముని మధురోక్తి నిట్లనియె ♦ మోదరసాప్లుతుఁడై రఘూత్తమున్. ౧౫

విశ్రుతుఁడు=ప్రసిద్ధి కెక్కినవాఁడు - మోద రసాప్లుతుఁడై =సంతోషరసమున మునిఁగి స్నానము చేసినవాఁడై.

తాత్పర్యము.

మునీంద్రా నీతపఃఫలము నీవు నా కీయవలసిన పనిలేదు. ఫలకాంక్షలేక రామార్పణ మని నీవు సంకల్పించినఁజాలు-అవియే వచ్చి నన్నుఁ జెందును. అప్పుడు నేను గ్రహించెదను - మేము నిలుచుటకు వాసయోగ్యమైన స్థలమెయ్యది చెప్పుము-నీకు నాయందుఁగల హితబుద్ధి - నీ శక్తి గౌతమవంశము నందుఁబుట్టిన శరభంగుఁడు వినిపించెను - అని చెప్పఁగా నాముని యీ తియ్యనిమాటల కలరి సంతోషరసమున మునిఁగి శ్రీరామచంద్రునితో నిట్లనెను - 'కొనెదను నేన' యనుటచేఁ గర్మ ఫల స్వీకారము చెప్పఁబడెను.

సీ. రామ యీ యాశ్రమ♦భూమియే రమ్యంబు, గుణవంతమును ఋషి♦కోటు లిందుఁ
దప మాచరించు సం♦తతము ఫలాదులు, దండిగా నుండు మా♦ర్తాండ తేజ
యకుతోభయంబై న♦యాశ్రమభూమి ని,చ్ఛావిహారంబులు ♦ సలుపు మెకము
పిండు మాత్రమ తపో♦విఘ్నంబుఁగలిగించు, నది తక్క మఱియేభ♦యంబు లేదు
ఆ. నిలు మటన్న ననియె ♦ నిర్మల తేజ యా, మృగచయంబు శాత♦ఖగకదంబ
ములను జంప నీకుఁ ♦ గలుగు మనోవ్యథ, గానఁ బెక్కునాళ్లు♦గాదు నిలువ. ౯౯

అకుతోభయము=భయము లేనిది - మెకముపిండు = జింకల సమూహము - మృగచయంబుల్ = మృగముల గుంపును - శాత=పదునైన - ఖగ = బాణముల - కదంబములను=సమూహములచే.

తాత్పర్యము.

శ్రీరామచంద్రా! యీ యాశ్రమ భూమియే రమ్యమైనది - గుణము గలది - ఋషు లనేకు లిందుఁ దపము చేయుచుందురు - ఫలమూలములు దండిగా నన్ని వేళల దొరకును - ఇందు భయ మెట్టిదో తెలియరాదు - గావున నిష్టమువచ్చినట్లు తిరుగు మృగముల సమూహము మాత్రము వచ్చి దేహములు రుద్దుకొనుటచేఁ దపస్సునకు విఘ్నము గలిగించును-అది తప్ప మఱి యే భయము లేదు - కావున నిందే నిలుము- అని చెప్పఁగానే నామృగములను బాణములచేఁ జంపితినేని నీకు మనోవ్యథ గలుగును - కావునఁ బెక్కుదినములు నే నిందు నిలువరాదు.

కం. అని యచట నిలిచి సాయం, తనసంధ్యల్ వార్చి మౌని♦దత్తాహారం
బును గొని యారే లక్ష్మణ,జనకసుతాయుక్తి రామ♦చంద్రుఁడు గడపెన్. ౧౦౦

సాయంతనసంధ్యల్ = సాయంకాల సంధ్యావందనమును - మౌని దత్తాహారంబును=ఆ సుతీక్ష్ణునిచే నీయఁబడిన యాహారమును - ఫలాదులను - ఆరే=ఆరాత్రి - మౌని దత్త మనుటచే నాయనయే తనచేతులార నాయనలార తినుఁడని బిడ్డలకుఁ దలిదండ్రులు బువ్వపెట్టునట్లు చేతిలో నుంచె నని భావము.

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పి యా చోటనే నిలిచి సరసునకుఁ బోయి సాయం సంధ్యను వార్చి వచ్చి యాముని యిచ్చిన యాహారమును గొని యారాత్రి సీతాలక్ష్మణుల తోడ శ్రీరామచంద్రమూర్తి గడపెను.

లక్ష్మణ జనకసుతాయుక్తి ననుటచేఁ దాము ముగ్వురు నాశ్రమ విశేషములు ముని తపోమహిమ, తమయందలి ప్రేమ మొదలైనవానిని గుఱించి ముచ్చటలాడు చుండి రని భావము.

౮ - వ సర్గము.

ఉ. వేవిన లక్ష్మణుండు పృథి♦వీజయుఁ దానును గమ్మకల్వపూఁ
దావులు గ్రాలు నంబువులఁ ♦ దాన మొనర్చి హుతాశదైవపూ

జావిధిఁ దీర్చి పూర్వగిరి♦సానుతటంబున కేగుదెంచు ఛా
యావరుఁ గూర్చి మ్రొక్కి ముని ♦ నంజలిఁ జేర్చి వచించె నీగతిన్. ౧౦౧

వేవినన్ = వేగినన్ = ఉదయముకాఁగా. లక్ష్మణుండు పృథివీజయుఁ దాను - అని చెప్పుటచే ముందు లక్ష్మణుఁడు లేచి స్నానము చేసె ననియు నావల సీతయు లేచె నని గ్రహింప నగు - కమ్ర= మనోహరమైన రుచిగల, పూఁదావులు= పూలవాసనలు- అంబువులన్= జలమందు- తానము= స్నానము- హుతాశ= అగ్నిహోత్రము- దైవ పూజావిధి = భగవదారాధనము- "విశాలాక్షిని బత్నిని గూడి రామభద్రుండనఘుఁడు నారాయణుని సమర్చన సలిపెన్" అని యయోధ్య ౧౫౦ - వ పద్యమున నున్నది- తీర్చి= చక్కఁగా నెఱవేర్చి, పూర్వగిరి= తూరుపుఁ గొండయొక్క, సాను తటంబునన్=చఱియ ప్రదేశంబునందు. ఛాయావరున్ = సూర్యుని; "ఛాయాకాంతిస్సూర్యజాయా, ప్రతిబింబ మనాతపః" నానా॥౧॥ ఈ పద్యమందు ముందు హోమము ఆవల సూర్యోపస్థానము చేసెనని చెప్పుటచేఁ గాత్యాయన సూత్రప్రకారము శ్రీరామచంద్రమూర్తి కర్మానుష్ఠానముఁ గావించెనని తెలియనగు; సూర్యోదయము కాక ముందు హోమము చేయుట కాత్యాయన సూత్ర ప్రకారము; మునిన్ = ముని నుద్దేశించి.

అగ్నిహోత్రము, దేవపూజ, సంధ్య చెప్పఁబడుటచే సాహచర్య బలమునఁ దక్కిన రెండు నెట్లు నిత్యకర్మములో యట్టులే భగవదారాధన మని యేర్పడుచున్నది.

నవిష్ణ్వారాధనా త్పుణ్యం, విద్యతే కర్మవైదికమ్।
తస్మా దనాదిమధ్యాంతం, నిత్యమారాధయే ద్ధరిమ్
తద్విష్ణో రితి మంత్రేణ సూక్తేన పురుషేణవా॥ వ్యాసులు.

విష్ణ్వారాధనమునకంటెఁ బుణ్యమైన వైదికకర్మము లేదు; కావున నాది మధ్యాంతములు లేని హరిని నిత్య మారాధింపవలెను; ఇది తద్విష్ణో యను మంత్రముచేఁగాని పురుషసూక్తముచేఁగాని చేయవలెను. అని యుండుటచే భగవదారాధనము నిత్యకర్మమే. చేయకున్నఁ బ్రత్యవాయము కలదు. భగవంతునకు నివేదింపక తినువాఁడు పందియై పుట్టును. యజ్ఞ వేదాధ్యయనాదులకంటె విష్ణుపూజ కోటంత లెక్కుడు.

స్నాత్వా నిత్యం శుచిః కుర్యాద్దేవర్షి పితృతర్పణమ్
దేవతాభ్యర్చనం చైవ సమిదాధానమేవచ॥
బ్రహ్మచారీ గృహస్థోవా వానప్రస్థోఽథ భిక్షుకః
కేశవారాధనం హిత్వా నైవ యాతి పరాంగతిమ్॥ పుండరీక నారదసంవాదము.
యో మోహా దథవాలస్యా, దకృత్వా దేవతార్చనమ్
భుంక్తే స యాతి నరకాన్ సూకరేష్వపి జాయతే॥ వ్యాసులు.

కేశవార్చా గృహే యస్య నతిష్ఠతి మహీపతే
తస్యాన్నం నభో_క్తవ్య మభక్ష్యేణసమం హి తత్॥
అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ తథా యజ్ఞా స్సదక్షిణాః
హరే ర్నిత్యార్చన స్యైతే నాపి కోట్యంశే నో సమాః

"మద్యాజీమాం నమస్కురు" అను భ.గీ. వచనము నారాధనమునే బోధించుచున్నది.

వేవినఁ=క్వచి ద్గకారో వః అను సూత్రప్రకారము వేగినఁ వేవినఁ అయ్యెను. 'వేవిన మేడపై పలభి వేణిక జంట వహించి' ఆముక్త. ౧-౬౨.

తా త్ప ర్య ము.

తెల్లవాఱుజాము రాఁగా లక్ష్మణుఁడు ముందుగా లేచి స్నానముచేసి యుండఁగా సీతయు నిద్రలేచి యట్టులే చేసెను. శ్రీరామచంద్రమూర్తియు మనోహరమైన కలువపూవుల వాసనగల చల్లని తటాక జలంబులందు స్నానమాడి హోమము ఇష్టదైవమగు నారాయణు నర్చన గావించి సూర్యోదయము కాఁగా సూర్యోపస్థాన మొనరించి సూర్యునకు నమస్కరించి సుతీక్ష్ణమౌనిని సమీపించి యంజలి మోడ్చి యిట్లు చెప్పెను.

ఇందుఁ జెప్పఁబడినది యేకాగ్ని యేకాని త్రేతాగ్నులు కాదని తెలియనగును.

దైవపూజ యనుచో మూలమున సురాన్ అని యుండుటచే సపరివారుఁడైన నారాయణు నని గ్రహింపవలెను. "సహపత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్"అని యయోధ్యాకాండమందుఁ గలదుకదా.

మ. చెలువారన్ సుఖవృత్తి రే గడచె నీ♦చేఁ బూజలం బొందుటన్
సెలవా మా కిఁకఁ, దీవరించిరి ముని♦శ్రేష్ఠుల్ స్వకీయాశ్రమం
బులకున్ రం డని దండకాలయులు, నేఁ ♦ బోవం దలంతున్ ఋషీ
శులతో, మమ్ము ననుగ్రహింపుము తప♦శ్శుద్ధాంతరంగాంబుజా.　　　౧౦౨

చెలువారన్ = మిక్కిలి చక్కఁగ, సంతోషకరముగ, తపశ్శుద్ధాంతరంగాంబుజా=తపస్సుచేఁ బావనమైన హృదయకమలము గలవాఁడా, సుఖవృత్తిన్ = సుఖమైన విధముగ, దండకాలయులు=దండకయందు వాసముచేయువారు, స్వకీయ ఆశ్రమంబులన్=తమతమ పర్ణశాలలకు, తీవరించిరి=త్వరపెట్టిరి.

మార్గప్రదర్శనము నెపమున నీయాశ్రమము విడిచినది మొదలు పంచవటి చేరువఱకు ఋషులు కూడ నుండి రని తీర్థీయము.

తా త్ప ర్య ము.

తపస్సుచేఁ బవిత్రమైన హృదయముగల మునీంద్రా! నీవు మమ్ము గారవించి గౌరవించుటచే రాత్రి మాకు హాయిగాఁ గడచెను. ఇఁక బయలుదేఱి పోవుటకు నన్నుజ్ఞ యిచ్చెదరా? ఎచ్చటికిఁ బోఁదలఁచితి వందు రేమో తమతమ యాశ్రమములకు

రండని మమ్ము దండకారణ్యమున వసించు మునిశ్రేష్ఠులు తీవరపెట్టుచున్నారు. వారి వెంట నేనును బోవఁదలఁచినాను. కావున మాయందు దయయుంచి యనుజ్ఞ యిమ్ము.

నేఁ బోవం దలంతుఁ ఋషీశ్వరులతోన్ అనుటచేఁ దోవ తోడని మాత్రమే యర్థముకాదు; వారికార్యము నెఱవేర్చుటకుఁగా నని తదనుసరవర్తనము తదానుకూల్యము సూచించుచున్నది. నేఁ బోవందలతుఁ అని యేకవచనమునఁ జెప్పిన వాఁడు మ మ్మనుగ్రహింపు మని బహువచనమునఁ జెప్పుటచే ఋషులకార్యము సాధింప ముందు నేను బ్రవర్తింపవలసి యున్నది. ననుఁ గాదని వీ రాకార్యమున స్వతంత్రించి వర్తింపరు. కావున మేము ముప్పురము మునులకార్యమున వర్తించువారమే. అట్లు చేయుటకు మా కనుజ్ఞ యిచ్చి జయము కలుగ నాశీర్వదింపు మని భావము. నీవు తపశ్శుద్ధాంతరంగుఁడవు. కావున నీ యనుగ్రహము వ్యర్థము పోవదు.

చం. అనుచితమార్గవృత్తి నడు♦మంతరపు న్సిరిఁ గన్న దుష్కులుం
డన రవి చేతులం గొఱవు ♦ లాని దహింపక మున్నె పోదుమే
యని చరణంబు లంటినఁ బ్రి♦యంబునఁ గౌఁగిట నొత్తి యేగుఁడీ
జనకజ ఛాయవోలె నిను ♦ సంతతము న్భజియించి వెంట రాన్. ౧౦౩

అనుచితమార్గవృత్తిన్=అన్యాయమార్గమందు వర్తించుటచే, నడుమంతరపున్ సిరి = తాతలుతండ్రులు సంపాదించినదికాక మధ్యమునఁ జౌర్యాదుల సంపాదించిన సంపద, దుష్కులుఁడు = చెడ్డకులమునఁ బుట్టినవాఁడు, రవి=సూర్యుఁడు, మున్నె= ముందే, ప్రియంబునన్ = సంతోషముతో, ఇది విశేషణమైనను భారతాదుల విశేష్యముగాను బ్రయోగింపఁబడినది, "ప్రియములు పల్కి నిన్ననుసరింపఁగఁ బార్థుఁడుఁ గాను జుమ్మి." "దేవతల కప్రియములు గావించి మనుష్యు లధమగతు లగుదు రిలన్" "పాండవధర్మపత్ని ధర్మరత నయోనిజన్ బ్రకృతి మానవ భామినిఁగాఁ దలంచి దెప్పరములు పల్కఁగాఁ దగునె?" (దెప్పరములు = దెప్పరపుమాటలు. ఇష్టము=ఇష్టకార్యము, బెట్టిదంబులంగాని చక్కఁబడండు, బెట్టిదములు = బెట్టిదపుమాటలు. (ప్రౌ-వ్యా-శబ్ద ౧౨) పోదుమే=ప్రార్థనాద్యర్థకము, ఛాయవోలెన్=నీడవోలె.

తాత్పర్యము.

పుట్టువుచే దరిద్రుఁ డయ్యు వయస్సు వచ్చిన తరువాత నధర్మమార్గముల ధనము సంపాదించినవాఁడు. నడుమంతరపు సిరి నరాలమీఁది పుం డన్నట్లు పరులను విశేషము బాధించును. అందు వాఁడు నీచకులమునఁ బుట్టినవాఁ డగునేని వాని క్రౌర్య మడుగవలసిన పనియేలేదు. ఆవిధముగ సూర్యుఁడు తనచేతులఁ గొఱవులు ధరించి లోకము ను దహింపకముందే (అనఁగా నెండయెక్కక ముందే) పోవ సెల విమ్మని ప్రార్థించెదము, అని పాదములు దాఁకి నమస్కరింపఁగా స్నేహభావముచే దగ్గఱకుఁ దీసి గట్టిగాఁ గౌఁగిలించి రామచంద్రా ! నీ నీడ నిన్ను విడనాడక నీ వెంటనే వచ్చునట్లు సీత నిన్నుఁ గొలుచుచు రాఁగాఁ బోయిరమ్ము.

ఈ పద్యమున రాఁగల కార్యము సూచింపఁ బడినది.

అనుచిత మార్గవృత్తి నడుమంతరపుఁ సిరి గన్న దుష్కులుఁడు రావణుఁడు. రాక్షసరాజ్యము పిత్రార్జితముగాదు- రావణుఁడు వివాహితభార్యకుఁ బుట్టినవాఁడు కాఁడు. కావున దుష్కులుఁడు.

ఇఁక వీఁడు దుర్వృత్తిచేతనే సంపద సంపాదించినవాఁడు, అందు రాక్షసుఁడు కావున దుష్కులుఁడు, అనులోమజాతివాఁడు. ఇట్టి వీఁడు లోకమును బూర్ణముగాఁ దనదుర్వృత్తిచే నాశనముచేసి ఋషుల నందఱ బలివారకముందే వానివధ నిమిత్తమై పోవలసియున్న దని శ్రీరామచంద్రమూర్తి చెప్పఁగా సుతీక్ష్ణుఁడు "చేసెదను బాసఁ। సంజ్వల ద్వహ్నినేఁ, వనినేఁ రాముఁడు చొచ్చుచోఁ దలఁపుమా ప్రాగ్వర్తిగా నన్నెదఁ", అని ప్రమాణముచేసిన లక్ష్మణుఁడు నీవుసంకల్పించినకార్యము నెఱవేర్పుట యందు నీ కంటె ముం దంజయే యిడును, సీత యిట్టులు ప్రత్యక్షముగఁ గార్య నిర్వహణ సమర్థురాలై రావణుని ద్రుంపఁజాలక పోయినను నీనీడ నిన్నెడఁబాయక యె ట్లనుసరించి వర్తించునో యట్టులే యీమెయు నిన్ననుసరించియే యుండును. ఒక వేళ వియోగము కలిగినను నిన్ను వదలి పోయినదని యామె విషయమై సందేహింప కుము,నీ కార్యార్థ మయియే యామె యట్లు చేయును, నీ నీడ నిన్ను విడిచి వేఱొకని వెంటఁ బోవునా ? అని సూచించెను.

వెన్నంటి యనుటచే నీడ యెప్పుడు వెనుకప్రక్కనే యుండదు. సూర్యుఁడు వెనుకనుండిన నీడ ముం దుండును, సూర్యుఁడు ముందుండిన నీడ వెనుకప్రక్క నుండును. ఆ మాత్రమున నీడలేదని యర్థమా ? రాత్రులందుఁ జీఁకటిలో నీడ కాన రాదు. అట్టులే సీత నీకుఁ గానరాకపోయినను బొత్తిగ విడిచిపోయిన దని తలంప కుము, అనిభావము. ఇట్టి అభిప్రాయము లేదేని నీ భార్య నీ వెంట వచ్చునని యాయన యదియొక విశేషవిషయముగాఁ జెప్పవలయునా ? అడవుల కెవరు చెప్పిన నామె వచ్చెను ?

ఉ. అచ్చపుఁబుణ్య్లలీ ఋషులు ♦ హాయిగఁ బొమ్మ యరిష్టపద్ధతిఁ
విచ్చిన తామరల్ మిగుల ♦ వేడుకఁ గూర్చుకొలంకులుఁ గిరుల్
నిచ్చలుఁ బూచువృక్షములు ♦ నెమ్మల కేకలు నిర్ఝరాళి మీ
కెచ్చిన నిండుసమ్మదము ♦ నిచ్చును లక్ష్మణ! పోయి రావనా. ౧౦౪

అరిష్టపద్ధతిఁ=(౧) రిష్టముగానిది యరిష్టము, రిష్టమనఁగా అశుభమునకు, క్షేమమునకు, నాశమునకు, కత్తికి, పాపమునకును పేరు, రిష్టం స్యా దశుభ క్షేమ నాశ నిస్త్రింశ పాప్మసు॥ అని నానా ॥ర॥ (౨) అరిష్ట మశుభే తాక్రమే. నానా ॥ర॥ అరిష్ట మనఁగా అశుభమని యర్థము, ఈ విధముగా నీ పదము మేలును గీడును రెండును సూచించుచున్నది. "అరిష్టం గచ్ఛపంథాన"మ్మని మూలము. ఆశీర్వ దించువారు నీకు మే లగునుగాక యని దీవింతురుగాని యిట్లు సందిగ్ధముగా దీవింప

వచ్చునా? యందురేని భవిష్యత్తు దెలిసియే యట్లాయన దీవించెను. ఎట్లన, నిప్పుడు శ్రీరామచంద్రమూర్తి పూనిన రావణవధకార్య మిప్పు డల్పకాల భార్యావియోగమునకు, ఆవల దీర్ఘకాలవియోగమునకుఁ గారణమై యశుభమునే సమకూర్చెను. గాని యిది లోకమునకు క్షేమకర మైనదయ్యెను, ఆయనకుఁ గీర్తికరమయినదయ్యెను, ఆ కారణముచే నరిష్ట శబ్దమునకుఁ గల రెం డర్థములు గ్రాహ్యములే, విచ్చిన=విక సించిన, కొలంకులు=సరస్సులు, ఎల్లప్పుడు=అన్ని ఋతువులందును, పూచు వృక్షములు=పూచిన పూచుచున్న పూచఁగల చెట్లు, పూచు తద్ధర్మార్థకము, గావునఁ త్రికాలముల బోధించును, నెమ్మిల=నెమిళ్లయొక్క, నిర్ఝరాళి=వంకల వరుసలు, రమ్ము+అన్నా=రావనా, మీఁది పద్యంబున సీతాదేవికిఁ జెప్పవలసిన బుద్ధి పరోక్షముగఁ జెప్పెను. ఈ పద్యమున లక్ష్మణునకు సమక్షముననే చెప్పెను.

తాత్పర్యము.

శ్రీరామచంద్రా! యెవరివెంట నీవు పోఁదలఁచితివో యా యీ ఋషులు మిగులఁ బుణ్యాత్ములు; వారు నిన్నుఁ బాపకార్యములందుఁ బ్రేరింపరు; కావున వారి యిష్ట ప్రకారము పొమ్ము; దానివలన నీకుఁ గీడులేదు; మేలే గలదు. లక్ష్మణా! వికసించిన తామరలు గలిగి మిక్కిలి యందమై సంతోషము గలిగించు సరస్సులు, ఈ ఋతు వా ఋతు వనక యెల్లవేళ వికసించు వృక్షములు గల కొండలు, అందలి నెమిళ్ల కేకలు, నడుమ నడుమఁ గొండవంకలు మీ కత్యంత సంతోషము గలిగించును. కావున లక్ష్మణా! సుఖముగఁ బోయి రమ్ము.

చ. అనఘ మదాశ్రమంబునకు ♦ నాదట వెండియు మీరు రం డటం
చును సెల వీయగా భువన♦సుందరి జానకి చాపదండముల్
సునిశితఖడ్గతూణములు ♦ శూరవరాగ్ర్యుల కన్నదమ్ములక్
గొనుఁ డని యీయ వారలును ♦ గొంచు ధరించి ససజ్యచాపులై. ౧౦౫

అనఘ=పాపరహితుఁడవైన శ్రీరామచంద్రా, మదాశ్రమంబునకున్=నాయాశ్రమమునకు, ఆదటన్=ప్రీతితో, వెండియున్=మఱియొకసారి, భువనసుందరి=లోకైక సుందరి, లోకములో నందఱికంటెను సౌందర్యము గలది. చాప దండముల్ = దండము వంటివిండ్లు, దండములని చెప్పుటచే నిచ్చట నెక్కు పెట్టఁబడని విండ్లని గ్రహింపవలెను, సునిశిత=మిగులఁ బదునుగల. ఖడ్గ=ఖడ్గములు, తూణములు = అమ్ములపొదులు, శూరవరాగ్ర్యులన్=శ్రేష్ఠులగు శూరులలో మొదటివారు, ససజ్య చాపులై =ఎక్కు పెట్టఁబడిన విండ్లుగలవారై.

ఇచ్చట సీతాదేవి విల్లునమ్ములు తెచ్చి రామలక్ష్మణులను దీసి కొండని చెప్పి యిచ్చిన ట్లున్నది. మఱియెందు నిట్లు చెప్పఁబడలేదు. ఇట్లు చెప్పుటకుఁ గారణ మారయఁగా ఋష్యాశ్రమము ప్రవేశింపఁగానే యిచ్చట గొన్నినా ళ్లుండవచ్చును. ఇం దాయుధములతోఁ బనియుండదని తలఁచి సీతాదేవి యాయుధముల నెల్ల నాశ్రమ

మందొక చోటఁ బదిలపఱిచెను. శ్రీ రామచంద్రమూర్తి యనుచిత మార్గవృత్తి యని చెప్పుటయు నిరుపద్రవ మార్గమునఁ బొమ్మని ముని యాజ్ఞాపించుటయు, ఋషీశ్వరులు తమ బాధల గుఱించి చెప్పుమాటలు విని సీతాదేవి రాక్షసవధ జరుగఁ గలదని యోజించి యీ యాయుధములను దాఁచిన చోటినుండి తెచ్చి యిదిగో తీసికొండని వారి ప్రయత్నమునఁ దన సమ్మతియు నుత్సాహముఁ దెలుప నిచ్చెను; శూరవరాగ్ర్యుల ననుటచే రామలక్ష్మణులు యుద్ధమునకు నుద్యమించియుండి రని సూచించుచున్నది. భువన సుందరి యనుట రాక్షసవధకు నత్యంత సుందరి యగు సీతయే కారణ మనియు సూచన; రావణుఁ బ్రేరేంచిన దామె సౌందర్యమేకదా. ససజ్యచాపులై యని యచ్చట విండ్లెక్కుపెట్టి రనుటచే రాక్షస వధయందుఁ వారికిఁగల యుత్సాహము తీవరపాటు తెలియనయ్యెడిని.

మఱియొక కారణము గలదు. ధరించిన కాలమందుఁ దప్పఁ దక్కిన కాలమందు నాయుధములను బదిలపఱిచి దినదినము సీతాదేవి పూజించుచుండెను.

కం॥ "సతతమేను గంధసుమనో। వితతుల నర్చింప నాకుఁ బ్రియమగు కనకాంచితమగు నీ కార్ముకమీ గతిఁ బట్టెనె నేఁడు దిక్కుకానక వీరా" యని యుద్ధ ౭౮౫-వ పద్యమున సీతాదేవి విలపించెను. దీనివలన భర్త యగ్నిహోత్రమువలె నాయుధములను రక్షించుట భార్య కృత్య మని యేర్పడుచున్నది. కావున నవి యామె స్వాధీన మందుండుటచే నామె తెచ్చి యిచ్చెనని తెలియనగు.

తాత్పర్యము.

పాపరహితుఁడ వగు శ్రీరామచంద్రా! నాయాశ్రమమునకు మరలఁ బ్రీతిమై రండు' అని సెలవీయఁగా లోకసుందరియగు సీత విండ్లను పదునుగల కత్తులు అంబుల పొదులు రామ లక్ష్మణులకుఁ దీసికొండని చెప్పి యీయఁగా వారలు వానిని దీసికొని ధరించి యెక్కు పెట్టినవారై.

పితృవాక్యపరిపాలనమును నా స్వకార్యము నిమిత్తముగ నే నడవిఁ బ్రవేశించితిని; దైవవశమున రాక్షసుల వధించి మీ బాధ పరిహారముచేయు కార్యము తటస్థించినదని శ్రీరామచంద్రమూర్తి రాక్షస వధయందు మనస్సు పెట్టుట చూచి హింస వానప్రస్థ ధర్మమునకు విరుద్ధకార్యము, దానివలన వ్రతభంగ మగునని తలఁచి యహింస శ్రేష్ఠమనియు, వానప్రస్థుఁడుగా నుండునంతవఱకు హింసాకార్యము మానుఁ డనియుఁ బ్రేమ రూపిణియగు సీతాదేవి భర్తకు బోధించుచున్నదని మహేశ్వర తీర్థీయము.

రామలక్ష్మణులు విండ్లు ధరించిన విధముఁజూచి యాయుధముల పట్టు విడుపులు తెలిసిన సీతాదేవి వారు యుద్ధసన్నద్ధులై యున్నారని తెలిసి యిట్లు చెప్పుచున్నది.

నాథా! నీవేమో రాక్షసులతో యుద్ధమునకు సిద్ధపడి యున్నాఁడవు; మీ రిరువురు యుద్ధకార్యమందు మగ్నులై యుండ రాక్షసులు నాకేదైనఁ గీడు గావింతురు.

నన్ను వారు హరించికొని పోయిరేని నా వియోగము నీకు దుఃఖకరము గాక మానదు. నాదుఃఖము నీ కెట్లో నీ దుఃఖము నాకట్లే కావున మన యిరువురకు దుఃఖకరమైన యీ కార్యమున కేల పూనెదరు? ఆయుధము లిందే యుంచి పోదమని సీతాదేవి బోధించుచున్నదని గోవిందరాజీయము.

—♦ ౯-వ సర్గము. సీతాదేవి శ్రీరామునకు హితోపదేశంబు సేయుట. ♦—

కం. అందఱు చనునెడఁ దమి రఘు,నందను వదనంబుఁ గాంచి ♦ నవలా ప్రేమా
స్పందితహృదయంబున మృదు,మందమధురవచనరచన♦ మానుగ ననియెన్. ౧౦౯

అంధఱు = సీతారామ లక్ష్మణులు ఋషులు, చనునెడన్ = పోవు సమయమందు, తమిన్ = స్నేహభావముచే, వదనంబు=ముఖము, నవలా=స్త్రీ, సీత-ప్రేమాస్పందిత హృదయంబునన్ = ప్రేమచే మిక్కిలి చలించుచున్న హృదయముతో, మృదు=మెత్తనైన, మంద=మెల్లనైన, మధుర=తియ్యనైన, వచనరచన = మాటల కూర్పుతో, మానుగన్ = చక్కగా.

తాత్పర్యము.

అందఱు బయలుదేఱి పోవనున్న సమయమున సీతాదేవి శ్రీరామచంద్రుని ముఖారవిందముఁ జూచి స్నేహభావముచేఁ బ్రేమచే నాందోళన మొందుచున్న డెందముగలదై మెత్తని మెల్లని తియ్యని మాటలచే నిట్లు చెప్పెను.

తమిన్ = సీతాదేవి చెప్పఁబోవు మాటలకుఁ గేవలస్నేహమే కారణము. చేయఁబోవునది కార్యమా యకార్యమా యను విచారము కాదు. కార్యమే యైనను అతిస్నేహము పాపశంకి గావున నా కార్యము యుద్ధము చేయుటయందు నాయనకుఁ గీడేమి కలుగునో యని యాయనకు రాఁగల విపత్తు సహింపలేక యని భావము.

రఘునందను వదనంబుఁగాంచి = అడవులందుఁ బోవు నపుడు ౧౫౭ పద్యమునఁ జెప్పినట్లు ముందు శ్రీరామచంద్రమూర్తి యాయన వెనుక సీతాదేవి యామె వెనుక లక్ష్మణుఁడు పోవుచుండిరి. అట్టులే చెప్పినయెడల శ్రీరామునకు వెనుక ప్రక్కనుండి చెప్పిన ట్లగును. అప్పుడు సీతాదేవి ముఖమునందుఁగల దైన్యము స్నేహచంచల మయిన నేత్రముల తీరు శ్రీరామచంద్రమూర్తికి దృగ్గోచరములు గావు. తనవిధమును జూచిన శ్రీరామచంద్రమూర్తి మనస్సు కరఁగునని యామె తలంపు గావున నాయన కెదుట నిలువఁబడి చెప్పుచున్నది. ఇది నడిదోవలో జరిగిన సంభాషణము గాదు. ఆశ్రమ సమీపమందే జరిగెననుట బాగు.

ప్రేమాస్పందిత హృదయంబునన్=మీఁది పద్యంబున శ్రీరాముని యభిప్రాయంబుల గ్రహించి యుత్సాహముతోఁ దానే విల్లు నమ్ములు తెచ్చి యిచ్చిన సీతాదేవి యిప్పుడేల యిట్లు విఱుపు మాటలు చెప్పుచున్న దనినఁ బ్రేమచేఁ జలించు

హృదయము కల దగుటచేతనే, అప్పటికి రాక్షసవధ నామోదించెను గాని దాని వలన రాఁబోవు కష్టముల నాలోచించి భర్త యన్నికష్టములకుఁ బాలుపడుట సహింప లేక కేవల ప్రేమావిష్ట చిత్తయై చెప్పుచున్నదని భావము.

మృదువుగాఁ జెప్పె ననుటచే ధూర్తస్త్రీలవలెఁ బరుషముగాఁ జెప్పలేదని భావము. ధర్మరాజునకు హిత ముపదేశించిన ద్రౌపదివాక్యములఁ బోల్పునది.

మందముచే స్నేహముచే డగ్గుత్తికపడ మాటలాడెను. సాధారణముగఁ బురుషులు స్త్రీలకు వశపడుట యిట్టి మృదు మధుర వచనరచన చేతనే.

ఇప్పద్యంబున వృత్త్యనుప్రాసము గలదు.

మానుగ ననుటచే శాస్త్ర సమ్మతమైన రీతి నని గ్రాహ్యము. అశాస్త్రీయ హితము హితముగాదు.

సీ. నీవనుష్ఠించెడి ♦ నిష్ఠాప్రకారంబు, కామజవ్యసనముల్ ♦ కడకుఁ బాయ
వదలియు నొందఁగ ♦ వచ్చును గాదొకో, సూక్ష్మమార్గంబున ♦ శూరవర్య
కామజవ్యసనముల్ ♦ గలవొక మూఁడంచుఁ, బ్రథమంబు మిథ్యాభి ♦ భాషణంబు
దానికంటెను బర ♦ దారాభిగమనంబు, పగ లేకయును హింస ♦ పఱచుటయును
ఆ. గీడు; నీ వసత్య ♦ మాడిన యది లేద, యింక నాడఁబోవు ♦ టెపుడు లేదు;
తలఁచు టైనలేదు ♦ పలుక నేటికి నన్య, దారసంగమేచ్ఛ ♦ ధర్మనిరత. ౧౦౭

అనుష్ఠించెడి=ఆచరించుచున్న, నిష్ఠాప్రకారంబు = వానప్రస్థధర్మము, కామజ వ్యసనముల్ = కామమువలనఁ గలిగెడి వ్యసనములను, కడకుఁ = దూరముగా, వదలియు=వదలిపెట్టి కూడ, వదలి వదలక రెండు విధముల ననుష్ఠింపవచ్చునుగాని వానిని వదలి యనుష్ఠించుట శ్రేయస్కరము, శ్రేష్ఠముగదా, అగస్త్యుఁడు వానప్రస్థుఁడయ్యు వాతాపీల్వలుల వధింపలేదా, వేట లాడలేదా యని రామచంద్ర మూర్తియనునని తలఁచి యట్లుండుటకంటె నట్టిపనిచేయకుండుట శ్రేష్ఠమని సూచించు చున్నది. 'యు' అను సముచ్చయ మీ యర్థము నిచ్చుచున్నది, మిథ్యాభి భాషణంబు = అసత్యములు చెప్పుట, పరదారాభిగమనంబు=ఇతరుల భార్యలతోఁ గూడుట, అన్యదార = ఇతరుల భార్యలతో, సంగమ = కూడుటయందలి, ఇచ్ఛ = కోరిక, ధర్మనిరత=ధర్మమందు విశేష ప్రీతిగలవాఁడా, అభిభాషణ మనుచో, నుప సర్గమువలన నొక యర్థవిశేషము గానవచ్చెడి, నవ్వులకు నసత్యమాడుటయు మిథ్యా భాషణమేయగు, అయినను దానివలనఁ జెప్పినవానికిఁ బాపములేదు, పరులకు హానియులేదు, అటుగాక యభిభాషణ మయ్యెనేని యనఁగా నితరులకు నష్టకష్టములు కలుగునటు లసత్యము మాటలాడినచో నితరులకుఁ గలుగు నష్టకష్టములవలనఁ దనకుఁ బాపము కలుగును. ఇట్టి యసత్యము కామజవ్యసన మని యభిప్రాయము. దీనివలన సీతారామాంజనేయ సుగ్రీవు లాడిన యసత్యములు మిథ్యాభాషణము లయినను మిథ్యాభిభాషణములు గావు.

తా త్ప ర్య ము.

ప్రాణేశ్వరా నీ వనుష్ఠింపఁబూనిన వానప్రస్థ ధర్మము కామమువలనఁ గలుగు వ్యసనముల వదలికూడ సూక్ష్మమైన ధర్మమార్గమున ననుష్ఠింపవచ్చునుగదా, కామజ వ్యసనము లేవందువా, యవి మూఁడు. అందు మొదటిది యసత్యమాడుట, దాని కంటెను జెడ్డది పరస్త్రీలతో సంభోగించుట, దానికంటెఁ జెడ్డది పగలేక యితరుల నిష్కారణముగ హింసించుట, (దీనివలన నిష్కారణముగ నితరులు విరోధించి కీడు చేసిరేని హింసింపవచ్చునని యేర్పడుచున్నది.) ఈ మూఁటిలో మొదటి వ్యసనము మిథ్యాభిభాషణము నీయందు లేదు. ఇదివఱకు నీ వసత్యమాడినది లేదు, ఇఁక రెండవదియగు పరభార్యా సంగమము గుఱించి నీకట్టికోరికయే లేదు. ఇఁకఁ గార్య మున్నదని యెట్లు చెప్పనగు, నీవు ధర్మ నిరతుఁడ వగుట నీయం దట్టిపాపములు గాన రావు. కావున నధర్మకరదోషము లేదు, రెండవది అధర్మకరము, ధర్మనాశనము.

కం. లే దిప్పు డింకఁ గలుగం,బో దెప్పుడు వలపు పరుల ♦ పూఁబోఁడులపై
భూదయితా! నీమదినే, న్నోదించెద వాత్మ దార ♦ మోదముఁగూర్పన్. ౧౦౮

పూఁబోఁడులపైన్ = స్త్రీలమీఁద; వలపు = మోహము.

తా త్ప ర్య ము.

ఇతరుల భార్యలపైఁగామము నీ కిపుడు లేదు, ఇఁకమీఁద నెన్నఁడేని కలుగను బోదు, ఏలన:—నీ భార్య నీకు సంతోషము కలిగింప మనస్సునందే సంతోషించెదవు, వాచిక కాయిక వ్యాపారములు నీకు ముఖ్యములు గావు. నాతోడ నుండియు నీ విప్పు డవలంబించియుండు బ్రహ్మచర్య దీక్షయే దీనికి దృష్టాంతము. అట్లులైన భార్య నన్ను సంతోషపెట్టవలయునే కాని నావలన నాభార్య కెట్టి సంతోషములేదా యందువేమో, స్వభార్యకు సంతోషముఁ గూర్ప నీవు మనసునందే సంతోషపడుచుందువు. నే నెట్లు సంతోషించిన నాభార్యయు సంతోషించు నని భార్యకు సంతోషముఁగూర్ప నీవు సంతోషింతువు. మనసులోని సంతోషము ముఖనయన వికాసములవలన వెలుపలికిఁ గానవచ్చును గదా.

మనుస్మృతియందు,

మృగయాక్షా దివా స్వప్నః, పరివాదః స్త్రియో మదః
తౌర్యత్రికం వృథాట్యాచ, కామజో దశకో గుణః.

వేఁట, జూదము, పగటినిద్ర, పరనింద, స్త్రీ సంభోగము, మదము, నృత్త గీతాదులు, వ్యర్థముగఁ దిరుగుట, యివి పది కామమువలనఁ గలుగు వ్యసనములు. ఇందు 'పాన మక్షాః స్త్రియశ్చైవ మృగయాచ యథాక్రమమ్, ఏతత్కష్టతమం విద్యా చ్చతుష్కం కామజేగణే॥ ఆ పదింటిలో పానము, జూదము, స్త్రీ సాంగత్యము వేఁట, యివి క్రమముగా సాధింపఁ గష్టమైన కామజగుణములు అని యున్నది. 7-47-50.

చ. నిరతము సత్యధర్మరతి ♦ నిశ్చలబుద్ధివి లక్ష్మణాగ్రజా !
గురువచనస్థితుండవు న♦కుంఠిత సత్యము ధర్మ మెల్లనున్
స్థిరముగ నిల్చె నీ యెడ బం♦తీ! విజితేంద్రియులైనవారికిన్
దొరకొను నవ్వి, నే నెఱుఁగు♦దున్ భవదీయ జితేంద్రియత్వమున్. ౧౦౯

లక్ష్మణాగ్రజా=లక్ష్మణుని యన్నా, భార్య యొద్దలేని లక్ష్మణుఁడెట్టి బ్రహ్మచర్యదీక్ష నవలంబించి యున్నాఁడో భార్యయొద్ద నుండియు నసిధారావ్రతనిష్ఠ నీవట్టులే యున్నావు. కావున నీ వంతకంటె గొప్పవాఁడవే, ఎల? నిరతము=ఎల్లప్పుడు, నీవు సత్యధర్మరతిన్=సత్యము ధర్మము వీని యందలి ప్రీతియందు, నిశ్చల బుద్ధివి=చలింపని మనస్సు గలవాఁడవు. సత్య ధర్మములనుండి నీ మనస్సు చలింపదు, గురువచనస్థితుండవు=తండ్రిమాటయం దున్నవాఁడవు, అకుంఠిత=మొక్కవోని, విజితేంద్రియులు=ఇంద్రియములను జక్కఁగా జయించిన వారికి, దొరకొనున్=లభించును, ఈ యర్థమున నిందర్థానుస్వారము లేదు. అవి=సత్య ధర్మములు, భవదీయ=నీయొక్క, జితేంద్రియత్వము=ఇంద్రియ జయముగల విధమును.

## తాత్పర్యము.

లక్ష్మణాగ్రజా! నాథా! నీవు సర్వదా సత్యమునందు ధర్మమునందు జలింపని మనస్సు గలవాఁడవు. కావుననే కదా తండ్రి వాక్యము పరిపాలింప నింత శ్రమించుచున్నాఁడవు. తండ్రి నిమిత్తము సత్య ధర్మములు పూనుట మాత్రము కాదు, అవి నీ యం దెట్టి కొఱంత లేక స్థిరముగ నిలిచియున్నవి. ఇంతటి సత్య ధర్మస్థిరత్వము విజితేంద్రియులకు లభించునే గాని యితరులకు లభింపదు. నీ వెంతటి జితేంద్రియుఁడవో యది నే నెఱుఁగుదును.

సీ. మూఁడవయది యగు ♦ మూఢులు పగలేక, యితరుల ప్రాణంబు ♦ హింస సేయు
రౌద్రకర్మము రామ♦భద్రా దొరంకొంటి, వీ విప్ర మానుల♦ హేతువునను
దండకారణ్య వా♦స్తవ్యుల నసురులఁ, జంపఁ బ్రతిజ్ఞను ♦ జలిపి తీవు
యిది నిమిత్తంబుగా ♦ నిందు వచ్చితి వీవు, తమ్ముండు బాణ కో♦దండములను
తే. దాల్చి యిప్పుడు మీ రందుఁ ♦ దరలు చుండఁ, దావకీనశుభంబు హి♦తంబుగోరు
దాన నగుటను నామది ♦ దల్లడిల్లె,నాదు విన్నప మాలింపు ♦ నాథ కరుణ. ౧౧౦

రౌద్రకర్మము=తమోగుణప్రధానమైన క్రూరకార్యము, దొరంకొంటివి=చేయఁ బ్రారంభించితివి, ఈ యర్థమం దీ శబ్దమున నర్థానుస్వారము గలదు, వాస్తవ్యులన్=వసించువారలను, తరలుచుండన్ = ప్రయాణమై పోవుచుండ, తావకీన=నీయొక్క, తల్లడిల్లెన్=సంకటపడుచున్నది, ఆలింపు=వినుము.

వ్యాకరణము. ఇందు వచ్చితి వీవు తమ్ముండు, ఇందుఁ గ్రియ యేకవచనము, కర్త లిరువురు, నీవు తమ్మునితో వచ్చితి వని యర్థము గ్రహింపవలెను "ఒకానొక క్రో

సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపుడు క్రియలు తత్కర్తృకంబులు విభాషనగు," ప్రౌ-క్రియ-౨౬.

విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీ నిషాదియుక్ భార-ఆది-౨.ఆ. నరసఖుఁడ నీవు నరసఖుఁడును నరలోకమునం జనించి పీడలుడువుము. ఈ ద్రావిడ ప్రాణాయామ మేల ? వచ్చితి రీవు తమ్ముఁడన వచ్చనే యందు'రేని కర్త శ్రీరాముఁడే, లక్ష్మణుఁడు తోడ వచ్చినవాఁడే, బహువచన ప్రయోగ మిరువురను సమాన కర్తలఁ జేయును, అది సరిగాదు. లక్ష్మణున కట్టి యుద్దేశము లేదు, ఆయునకు రామ కైంకర్యముచేయు నుద్దేశము మాత్రమే.

తా త్ప ర్య ము.

రామచంద్రా! మిథ్యాభిభాషణము పరదార సంగమాభిలాష నీయందు లేవు. ఆ విషయమై నే నేమియుఁ జెప్ప రాలేదు కాని కామజవ్యసనములలో మూఁడవది తక్కిన రెంటి కంటెఁ గ్రూరమైనది. నీవు చేయఁబూనితివి. అది జ్ఞానహీనులు పగ లేకయును నితరుల ప్రాణముఁ దీయు క్రూరకార్యమగు. అది వారికిఁ దగును గాని నీకుఁ దగదు. అది నీ కెట్లు తెలిసె నందువా, మునీశ్వరుల నిమిత్తమై దండకారణ్యవాసులైన రాక్షసులఁ జంపఁ బ్రతిజ్ఞ పలికితివి, ఆ నిమిత్తముగా నిందు వచ్చితివి, ఇచ్చటికి వచ్చిన తరువాతఁ గదా నేను వారికిఁ జెప్పితి నందువేమో నీ కట్టి సంకల్పము లేకున్న మునివలెఁ జరించెద నన్న నీవు నీ తమ్ముఁడు విల్లు బాణములు లోనగు నాయుధము లేల తెచ్చితివి? అవి హింసించు సాధనములే కదా. ఆత్మరక్షణార్థమని తలఁపరాదా యందు వేమో. ఈ మునులంద ఱాత్త సంరక్షణార్థమే యాయుధముల ధరించినారు ! నేను సాయుధుఁడనై వచ్చుటచేత వీరు వచ్చి రక్షింపుమని నన్నుఁ బ్రార్థించిరి, నన్ను రాక్షసులు హింసింప వచ్చినపుడు క్షత్రియుండనై నే నెవరిఁ బ్రార్థింతును, అందువా, అట్లు వారు వచ్చినపుడు నీ వాయుధము లెత్త వచ్చును. ఇప్పుడు మీరు విల్లు బాణములు పట్టిన తీరు చూడఁగా యుద్ధ సన్నద్ధులై పోవున ట్లున్నది. ఆ కారణముచే మీకు శుభము హితముఁ గోరుదాన నగుట నిష్కారణ విరోధముచే మీ కేమి దుఃఖము కలుగునో యని సంకటపడు చున్నదానను. నీవు సత్యమునందు ధర్మమునందు స్థిరుఁడవు. ఇంతవఱకు రెంటిని సమముగాఁ గాపాడుకొని వచ్చుచున్నాఁడవు, సంతోషమే, ఇప్పుడు రెంటికి విరోధము పొసఁగున ట్లున్నది. సత్యముతో విరోధించు ధర్మము ధర్మము గాదు, ధర్మముతో విరోధించు సత్యము సత్యము గాదు.

అహింసార్థాయ భూతానాం, ధర్మప్రవచనం కృతమ్
యస్స్యా దహింసా సంయుక్త స్సధర్మ ఇతి నిశ్చయః. మ. భా. 12-101-12.

శాస్త్రములు చేయు ధర్మ ప్రవచనమంతయు భూతహింస నివారించుటకే కదా. ఏది యహింసతోఁ గూడినదో యది ధర్మము. ఏది హింసతోఁ గూడినదో

యది యధర్మము, అని కదా యీ ఋషులే వచించిరి. నీవు సత్యమందు నిలిచితివా నిష్కారణముగ రాక్షస హింస సేయక మానను, హింస మానితివా సత్యహాని కలదు. ఈద్వంద్వములోఁ బడుట బాగా ? నీ సంకటము తీరు నుపాయమేది యం దువా, విన్నవించెదను. నాయందు దయయుంచి యీఁడుదాని మాటలకేమిలే యనక వినుము.

ఉ. ఈరలపోక నాకు రుచియింప, దదేల యటంటి రేని నేఁ
గారణముల్ వచించెదను గార్ముకబాణకృపాణపాణులై
వీరుల రీరు పోవు చటవీచరులం గని యొక్కఁ డేదియేఁ
నారసము న్విడం గలరు నాథ యదే పగకారణం బగున్. ౧౧౧

ఈరల = మీయొక్క, పోక = ఋషులవెంటఁ బోవుట, మీరుయొక్క మొదటి రూపము ఈరు. కార్ముక బాణ కృపాణపాణులై = విల్లు, బాణము, ఖడ్గ ముచేత ధరించినవారై, అటవీచరులఁ = అడవియందు సంచరించు వారిని, రాక్ష సులను, నారసముఁ = బాణమును, నారాచ శబ్ద భవము.

తాత్పర్యము.

మీ రిప్పు డడవులకుఁ బ్రయాణమై పోవుటయే సమ్మతమైన కార్యము గాదు. పోయినంత మాత్రమున నేమియందువా కారణము చెప్పెద వినుము. మీరు యుద్ధ మునకు బోవు సన్నాహముతోఁ జేత విల్లు నమ్ములు కత్తులు ధరించిపోవుచున్నారు. త్రోవలో నెవఁడైన రాక్షసుఁడు కనఁబడెనా యిదిగో రాక్షసుఁడు దొరికెనని వానిపై బాణము ప్రయోగింపఁగలరు, ఆ దెబ్బ దిని వాఁడు చచ్చును. అదియే రాక్షసులకు మనకు విరోధకారణ మగును. రాక్షసులు మనకుఁ బ్రత్యక్షముగ నపకారము చేసినచో వారిని వధింపవచ్చును గాని యెవరినో ఋషీశ్వరులను నెవరో రాక్ష సులు చంపినారని వారు చెప్పినంత మాత్రమున నెవరినో నిరపరాధి రాక్షసుని జంపి మనమై కచ్చెకుఁ గాలు ద్రవ్వుట నాకు రుచింపలేదు. రాక్షసులమీఁద బాణము ప్రయోగింతునని నీ వెట్లూహించితివి? నీవు రాక్షసుల జంపుదునని ప్రతిజ్ఞ చేసితివి. నీవు సత్య ప్రతిజ్ఞుఁడవు, కావునఁ జంపక మానవు, భయపడకుము, నిష్కారణముగ నే నెవరిని జంపను. మనల హింసింపవచ్చిన వారినే హింసింతునని ధైర్యము చెప్పె దవా. అట్లైన నీ ప్రతిజ్ఞ నెఱవేఱుటెట్లు? దానికి సరియైన కారణము కలుగవలెను. ఆ కారణము నేనే యగుదును. అప్పుడు నానిమిత్తమై నీవు రాక్షసుల వధింపవచ్చును గాని నీ వేకపత్నీ వ్రతుఁడవు. నన్ను విడనాడి నీ వెట్లుండఁగలవు? నా వియోగ మున నీవెంత దుఃఖింతువో నీ దుఃఖము నేను సహింపఁజాలను. కావున మీ రరణ్య మునకుఁ బోవుట నాకు రుచింపలేదు. నావియోగమున మిమ్ము దుఃఖపెట్టియైనఁ బ్రతిజ్ఞ మీరు నెఱవేర్పఁజేయుట బాగా, ప్రతిజ్ఞ చెడినఁ జెడనీ మీరు దుఃఖము పడకుండుట బాగా యని నా విచారము.

కం. గంధవహబాంధవునకును, నింధనములపోల్కి క్షత్రి♦ యేశ్వరతతికిన్
బంధురశస్త్రంబులసంబంధము వర్ధిల్లఁజేయు ♦ బలతేజములన్. ౧౧౨

గంధవహ=వాయువుయొక్క, బాంధవునకున్ = మిత్రునకు, అనఁగా నగ్నిదేవునకు, ఇంధనములు = కట్టెలు, బంధురశస్త్రములు = ప్రకాశమానములగుటచే నందములైన యాయుధములు, బలతేజములన్ = బలమును దేజమును, వర్ధిల్లఁజేయును = వృద్ధినొందించును.

## తాత్పర్యము.

అగ్నిహోత్రమునకుఁ గట్టెల సాంగత్యముచే నెట్లు బలము తేజము వృద్ధియగునో యట్టులే క్షత్రియప్రభువుల సమూహమునకుఁ జేత నాయుధముండిన నది బలతేజముల వృద్ధిచేయును. కావునఁ గలహము మానుటకై యాయుధముల నిందే యుంచి పోదము.

—♦ సీత శ్రీరామునకు శస్త్రసాంగత్యదోషమును దెలుపు నితిహాసముఁ జెప్పుట. ♦—

సీ. ప్రాణేశ మున్నొకక♦యడవి సత్యాత్ముండు, ధర్మరతుండైన♦తపసి గలఁడు
కాననఖగమృగ♦కాండంబు లందతి,కరుణయు నమితరా♦గంబుఁ గలఁడు
అతనితపంబున ♦ కంతరాయముఁ గూర్ప, భటరూపధరుఁడయి ♦ కుటిలమతిని
వాసవుం డొకనాఁడు ♦ భాసమానకృపాణ, మిల్లడ యుంచి తా ♦ నేగె దివికి
తే. న్యాసరక్షణతత్పరుం ♦ డైననియమి, దాని ధరియించి చరియించుఁ ♦ గానలోన
ఫలములును మూలముల్ దెచ్చు♦పట్లనైన, విడిచిపోవఁడు దాని న♦ వ్వెడఁగుఁదపసి. ౧౧౩

కానన=అడవియందలి, ఖగ= పక్షులయు, మృగ=మృగములయు, కాండంబులందున్ = సమూహమందు, అమితరాగంబు= మిక్కిలి యనురాగము, ప్రేమ, అంతరాయము=విఘ్నము, భటరూపధరుఁడయి= భటునివేషము ధరించినవాఁడై, కుటిలమతిని=వంచనబుద్ధితో, వాసవుండు= ఇంద్రుండు, భాసమాన = తళతళ ప్రకాశించుచున్న, కృపాణము=కత్తి, ఇల్లడ= కొన్నిదినము లుంచుకొని మరల నిమ్మని, దివికి = స్వర్గమునకు, న్యాసరక్షణ తత్పరుండు = ఇల్లడసొమ్మును గాపాడుటయందు మిగుల నాసక్తిగలవాఁడు, నియమి=ఆ వ్రతస్థుఁడు, కానలోన్=అడవియందు, చరియించున్= తిరుగుచుండెను, వెడఁగుఁదపసి=పిచ్చితపసి, తపసి గలఁడు. ప్రబంధముల భూతమునకు వర్తమానమగు సు. వ్యా. వాక్య. ౪౩. పోవఁడు = పోయినవాఁడు కాఁడు "పాఱఁడు లేచి దిక్కులకు బాహువు లొగ్గఁడు బంధురాజిలోఁ దూఱఁడు" భాగ-౭.

రాజ చోర భయా ద్దాయాదానాంచ వంచనాత్
స్థాప్య తేన్య గృహే ద్రవ్యం, న్యాసస్య పరికీర్తితః

అన్నట్లు రాజుల చోరుల భయమువలనఁగాని దాయాదుల వంచనమువలనఁగాని యితరుల యింటిలో నుంచిన ద్రవ్యమునకు న్యాసమని పేరు.

తా త్ప ర్య ము.

ప్రాణేశ్వరా! రామచంద్రా!! పూర్వకాలమున సత్యధర్మములందాసక్తిగల యొక తపసియుండెను. అడవియందలి మృగపక్ష్యాదులందు మిగుల దయయు, ప్రేమము గలవాఁడు, ఆయన తపస్సునకు విఘ్నము కలిగింప నొకనాఁ డింద్రుఁడు భటునివేషము ధరించి వచ్చి దీనిని నీయొద్ద నుంచుకొమ్ము, మరల నేనువచ్చి తీసికొనెదనని యొక కత్తి యిచ్చి స్వర్గమునకుఁ బోయెను. ఇల్లడసొమ్ము జాగ్రత్తతోఁ గాపాడవలయు నను నాకత్తితో నా వెఱ్ఱితపసి పండ్లు వేళ్ళు తెచ్చుకొనుటకుఁ బోవునపుడైనను దానిని విడిచిపోక కూడఁదీసికొని పోవుచుండెను.

చ. ప్రతిదిన మిట్లు లా ముని కృపాణముఁ దోకొని పోవువాడుకన్
రతి జనియించె దానిపయి రౌద్రము దానన కల్గె, నైజ మౌ
మతి చెడి క్రూరకర్ముఁడయి మత్తత ధర్మవిధుల్ దొఱంగి దు
ర్గతి కతడేగెఁ నెంతటి నికారమొ కంటివె శస్త్రసంగతిన్, ౧౧౮

తోకొని=వెంటఁదీసికొని, వాడుకన్=అభ్యాసముచే, తృతీయార్థమున ద్వితీయ రతి=ప్రీతి, రౌద్రము=క్రౌర్యము, దానన=దానిచేతనే, అది ధరించియుండుటచేతనే, నైజము=సహజము, ఔ మతి=అయిన మనస్సు, అనఁగా దయతోఁగూడిన మనస్సు, మత్తతన్=మదముచే, ధర్మవిధుల్= తాను దనయాశ్రమమునకుఁ దగినకార్యములను, తొఱంగి=వదలి, దుర్గతి=అధోలోకమునకు, నికారమొ=కీడో, శస్త్రసంగతిన్ = ఆయుధముతో గూడియుండుటచేత.

తా త్ప ర్య ము.

ఆ తపసి ప్రతిదినము కత్తిని జేతధరించి పోవుటకు వాడుకపడగా, 'సంగాత్సంజాయతే కామ' మన్నట్లు దానియందు నొక ప్రీతి జనించెను. అంతకు ముందు కాయలు గసురులు చేతితోఁ గోయుచున్నవాఁడు కత్తితోఁ గోయసాగెను. అట్లే యగ్నిహోత్రమునకు సమిధలు చేతితో విఱుచువాఁడు కత్తిచేఁ గొమ్మలు కొట్ట నారంభించెను. ఆతరువాత నడవిమృగము లెదురుగా వచ్చినఁ దానై తొలఁగిపోవు వాఁడు వానిని గత్తితోఁగొట్టి తఱుమసాగెను. ఆవల హింసకే ప్రారంభించెను. ఈ క్రూరవినోదముల మరగి యతఁడు తానుజేయవలసిన నిత్యకృత్యము లుపేక్షించెను. ఆకారణమున వాఁడధోగతులకుఁ బోయెను. ఆయుధము చేతనుండుటచే నెంత యనర్థము కలిగెనో చూచితిరా! ఆయుధము చేతనుండెనేని దానిని గొట్టుదమా దీనిని గొట్టుదమా యను క్రూరపు బుద్ధి పుట్టనే పుట్టును.

తే. ఇదియు నొండు పురాతన♦వృత్త మధిప, శస్త్రసంయోగకారణ ♦ సంకలితము
ఆశ్రయాశసంయోగము♦నట్టి దండ్రు, శస్త్రసంయోగమును జూడ ♦ సారబుద్ధి ౧౧౫

పురాతనవృత్తము=పూర్వకాలమున జరిగినది, శస్త్రసంయోగకారణ సంకలితము=శస్త్రముతోఁ గూడియుండు కారణముచేఁ గలిగినది, శస్త్రసంయోగము = ఆయుధముతోఁ గూడియుండుట, ఆశ్రయాశసంయోగమునట్టిది = అగ్నిహోత్రముతోఁగూడి యుండుటవంటిది, ఆశ్రయాశుఁడు=ఆశ్రయమును నాహారముగాఁ గలవాఁడు, అగ్ని దేని నాశ్రయించునో దానిని దహించును. ఈపద మిచ్చుట సార్థకము. అలంకారము పరికరాంకురము. అట్లులే శస్త్రము దన్నెవ్వరు ధరింతురో వారిని నాశముచేయ యత్నించును. సంయోగము నట్టిది:—షష్ఠీసమాసంబున నుగాగమంబు.

తాత్పర్యము.

ఇప్పుడు నేను జెప్పిన యితిహాసము నా కల్పితముగాదు. పూర్వకాలమున జరిగిన చరిత్రమే. ఇది శస్త్రసంయోగమువలనఁ గలుగు కీడును దెలుపును. అగ్నిహోత్రుఁడు దాను దేనిని (కట్టెలనో వస్త్రములనో) నాశ్రయించునో దానినే దహించునట్లు శస్త్రముకూడఁ దన్నెవరు ధరింతురో వారినే చెఱుచును.

చం. చనవున స్నేహభావమున ♦ సారసలోచన నీవు నట్ సదా
కను బహుమానదృష్టి నిది ♦ కాదని నిం దలఁపించితిం జుమీ
మనమున నీవెఱుంగని సు♦మార్గము నేర్చుట గా దదెంత చూ
చిన రుచియింప దో సుజన♦శేఖర నీ దగునెత్తికో లిటన్. ౧౧౬

చనవున = నీవు నాకిచ్చిన స్వాతంత్ర్యముచేఁ గలిగిన మచ్చికచేత, స్నేహభావమున = నాకు సహజముగా నీయందుఁగల యనురాగముచేత, సదా = ఎల్లప్పుడు, కను=చూచు, బహుమాన దృష్టిన్=గౌరవముతోడి చూపుచేత, ఇది=మీరు సంకల్పించిన రాక్షసవధ; కాదు = సరిగాదు, తలఁపించితిని = స్మృతికి వచ్చునట్లు చేసితిని, సుమార్గము = మంచి త్రోవ, ఎత్తికోలు = ప్రయత్నము, ఇటన్ = ఈ సమయమం దీ ప్రదేశమందు.

తాత్పర్యము.

నే నజ్ఞుఁడనని నాకు నీవు నేర్పవచ్చితివా యనకుము. మీరు నాకిచ్చిన చనవుచేతను నన్ను నీవు సగౌరవముగఁ జూచి నా మాట యందాదరబుద్ధి వహించుటచేతను నాకు స్వభావసిద్ధమైన మీయందలి స్నేహముచేతను నేను మీకు మఱచిన దానిని జ్ఞప్తికి వచ్చునట్లు చేసితిని, గాన నీకుఁ దెలియని క్రొత్తమంచి విషయము నేర్పవచ్చిన దానఁగాను, కావున క్షమింపుము, నేనెంత దూర మాలోచించినను నీ సమయమం దిచ్చుట మీ ప్రయత్నము నాకు రుచింప లేదు. నీవు సుజనశేఖరుఁడవే, కాని యేదో ప్రమాదవశమున సుజన కృత్యము మఱచితివి.

చం. ధనువు ధరించి పోవుటయు ♦ దర్పమునం బగ యేమి లేక యా
దనుజుల దండకాశ్రితులఁ ♦ దార్కొని చంపుట కాని కార్యమే
యనువున నెంతచూచిన ని♦రాగసులన్ వధియింపఁ బూనుటల్
జననుతశీల! నామదికి ♦ సంతస మీయదొకింత యేనియున్. ౧౧౭

దర్పమునన్=బలగర్వముచే, కానికార్యము=సరిగానిపని, అనువునన్=విధమున, నిరాగసులన్=నిరపరాధులను.

తాత్పర్యము.

మునివృత్తినుండు వారి కాయుధములతోఁ బనిలేదు. కావున నాయుధములను మీరు ధరించుట మొదటి సరికాని పని, అవల మనము బలవంతులము మన కెవ్వ రడ్డమని బలగర్వముచేఁ బగలేకయును నెందో దండకారణ్యములోఁబడి యుండు వారిని రాక్షసులను బైపడి పోయి చంపుట రెండవసరిగాని పని, నేనెన్ని విధములనో యాలోచించి చూచితిని, రాక్షసులనైనను నిరపరాధుల దండించుట నాకు రుచింపలేదు. నా కొక కొంచెమైనను దృప్తి గలిగింపలేదు.

దీనివలన రామలక్ష్మణు లాయుధముల ధరించిన తీరు చూచి వీ రీదినమే త్రోవలో నెవఁడో యొక రాక్షసుఁ డెదురైన వానిని నిష్కారణముగాఁ జంపుదు రని యత్యంత దయావతియు మూర్తీభవించిన కృపారసమగు సీత తలంచి, యదిసరిగాని కార్యమని తనయసమ్మతమును దెలిపెనుగాని పూర్వాపరాధులైన రాక్షసుల దండింప రాదని కాదు. రామచంద్రమూర్తి తన విషయమున నపరాధము చేసిన వారిని, దనయెదుటఁ దనవారి కపరాధము చేసినవారిని దండింప వచ్చునని సీతాదేవి యభిప్రాయము. ఈ యభిప్రాయము శ్రీరామచంద్రమూర్తియుఁ గలవాఁడయియే వాలి సుగ్రీవుల యుద్ధమందు వాలి సుగ్రీవుల హింసించు దశవచ్చువఱ కూరకుండి యిఁక నూరకుండినఁ దనమిత్రునకు శరణాగతునకు నపాయము తప్ప దని నిశ్చయించి వాలిని బడఁగొట్టెను. కాని సుగ్రీవుఁడు చెప్పినంత మాత్రమున వాఁడెదురుగా రాఁగానే చంపలేదు. నిరాగసులన్ అను బహువచన ప్రయోగము. ఎవఁడు తప్పు చేసెనో వానిని మాత్రమే చంపవలెను గాని వానివారను కారణముచే నిర్దోషులను జంపరాదని సీతాదేవి యభిప్రాయము. ఆదండమైనను నేరమునకుఁ దగినదిగా నుండవలెనుగాని క్రూరముగా నుండరాదు. కావున సీతను మ్రింగవచ్చిన శూర్పణఖను దాటకనువలెఁ జంపక రామచంద్రమూర్తి ముక్కు చెవులు గోయించి పంపెను.

కం. వీరులు మఱికాననసం,చారులు నగు క్షత్రియులకు ♦ సార్తవ్రజర
క్షారంభమునకుఁ గార్ముక,ధారణ మగుఁగాక రిత్త♦దండము తగునే. ౧౧౮

కానన సంచారులు=అడవియందుఁ దిరుగువారు, సార్త=ఆర్తితోఁ గూడిన వారియొక్క, వ్రజ=సమూహముయొక్క, రక్షారంభమునకున్ = కాపాడు ప్రయ

త్నమునకు, కార్ముకధారణము = విల్లుపట్టుట, దండము=దండించుట, రిక్త=నిష్కారణముగ.

తాత్పర్యము.

వీరులు, అడవియందుఁ దిరుగువారు, నగు క్షత్రియులు ఆర్తజనరక్షణమునకై విల్లు బాణములు పట్టవచ్చును, గాని తెకతేరకుఁ బరుల దండింపఁ బట్టవచ్చునా.

కం. ఎక్కడిశస్త్రము కానన, మెక్కడ క్షాత్రం బదేడ ♦ నేటితపంబో
యిక్కార్యం బన్యోన్యము, మిక్కిలి వికటంబు చూడు♦మీ ప్రాణేశా. ౧౧౯

వికటంబు=విరుద్ధము, అలం. విషమము.

తాత్పర్యము.

ప్రాణేశ్వరా! శ్రీరామచంద్రా! అడవులందు మునివృత్తి సంచరించుటకు శస్త్రము ధరించుటకు నేమి సంబంధము? మునివృత్తి శాంతి ప్రధానము; ఆయుధ ధారణము క్రౌర్యప్రధానము; ఒకటి శుద్ధసాత్త్వికము, మఱియొకటి శుద్ధ తామసము. ఇఁక నీకులోచితమైన క్షత్రియత్వమేడ? బ్రాహ్మణోచితమైన తప సేడ? రెంటికిఁ బొంతనము లెట్లు కుదురును? నీవు చేయఁబూనిన యీ కార్యము పరస్పర విరుద్ధ గుణములు గలది. నీవే యాలోచింపుము; కావున రెంటిలో నొకటి విడువుము. వానప్రస్థమైన వదలుము; శస్త్రమైన వదలుము. క్షాత్రమైన వదలుము, తపస్సైన వదలుము; అటుగాని యెడల రెంటను జెడవలసి వచ్చును.

కం. ఏదేశపు ధర్మంబుల, నాదేశమునందు నడప ♦ నర్హమ కాదే
కాదే వని మునివృత్తిని, మోదించెడి నీకు నడవ ♦ మునిమార్గమునన్. ౧౨౦

'యత్ర దేశే యదాచారః తత్ర దేశే తథాక్రమః' అనున్యాయ మనుసరించి సీతాదేవి చెప్పుచున్నది. కాదే=కదా; కాదే కదార్థంబగు, ప్రౌ-వ్యా. క్రియ ౩౧. శౌరి కృపఁగాదె నాకు నక్షయ బలంబు-జై-౨ ఆ.

తాత్పర్యము.

ఏ దేశమునందు మనముందుమో యా దేశముల ధర్మముల ప్రకారమే మనము నడువవలయును. కావున ముని మార్గమున వర్తించెడి నీవు మునుల చర్యయగు నహింస నవలంబించుట సరియైన కార్యము గదా.

పూర్వార్ధమందలి యర్హమ యను పదమును ఉత్తరార్ధమందును గ్రహింపవలయును.

తే. శస్త్రసంభృతి మతి కలు♦షత్వ మొందఁ
గానఁ గానల శస్త్రసం♦గతిని విడుము;
క్షత్రధర్మంబు వహియింపఁ ♦ గార్యమగును
వెండియు నయోధ్యఁ జరియించు ♦ వేళ నీవు. ౧౨౧

శస్త్ర సంభృతిః = శస్త్రమును ధరించుటచే, మతి = మనస్సు, కలుష త్వము = పాపముతోఁ గూడుటను.

## తాత్పర్యము.

శస్త్రమును ధరించుటయే కలిగెనేని దాని నుపయోగింప వలయు నని పాపపు బుద్ధి పుట్టును. కావున నీ వడవుల నుండు కాలమందు శస్త్రము ధరింపవలదు. అటేని నీక నెప్పుడు నా కులోచిత ధర్మ మనుసరించి శస్త్రము ధరించుటయందు వేని, నయోధ్య యందు నీవు మరల గృహస్థ ధర్మమందుండు సమయంబున ధర్మ రక్షణార్థము శస్త్రము ధరింపవచ్చును.

మంజుభాషిణి. సిరియుఁ ధరఁ విడిచి ♦ చేరి కానలఁ
జరియించు నీ విపుడు ♦ సంయమింబలెఁ
దిరుగం దపోనియతి ♦ దేవ మోదముం
బరఁగించు నత్తకును ♦ మామగారికిన్. ౧౨౨

సిరి= శ్రీ= సంపద, ధరఁ= భూమిని, భూపరిపాలన కార్యమును, సంయమిం బలెఁ = మునీశ్వరువలె.

మంజుభాషిణీ వృత్తమునకు, సజసజగలు గణములు. ౯- న యక్షరము యతి, మంజుభాషిణి సీతగావున, మంజుభాషిణీ వృత్తము సమంజసమే.

## తాత్పర్యము.

అనుభవింపవలసిన యైశ్వర్యము, పాలింపవలసిన భూమి వదలిపెట్టి మునివలె నడవులఁ జేరిన నీవు మునివలెఁ దపస్సు చేయుచుంటివేని, రాముఁడు యథార్థవాది, నాయెదుటఁ జెప్పినట్లు చేయుచున్నాఁడని కైక సంతోషించును. నా కొడుకు విశేష శ్రమపడక సుఖముగా నున్నాఁడుగదా యని కౌసల్యయు సంతోషించును. వీరే గాక స్వర్గమందలి నా మామగారును నా కొడుకు నన్ను సత్యవాదిని జేయుచున్నాఁడని సంతోషింతురు. కావున నట్లు చేయుము.

కం. ధర్మంబున నర్థం బగు, ధర్మంబున సుఖము గలుగు ♦ ధర్మముచే స
త్కార్మంబులు ఫలియించెడి, శర్మకరా! జగము ధర్మ♦సారంబె కదా. ౧౨౩

అహింసా పరమోధర్మ యను న్యాయము ననుసరించి ధర్మాచరణమే శ్రేష్ఠ మని చెప్పుచున్నది.

శర్మకరా=లోకమునకు సుఖమును గలిగించువాఁడా, అర్థము = ధనము, ధర్మ సారము= ధర్మమే సారముగాఁగలది.

## తాత్పర్యము.

ధర్మముచే ధనము లభించును, ధర్మముచే సుఖము కలుగును, ధర్మము నందు నిలిచినవాఁడుచేయు సత్కార్మములు మంచి ఫలము నిచ్చును. ధర్మహీనుఁడు చేయు

సత్కర్మములు ఫలింపవు, కావున శర్మకరా! ప్రపంచము ధర్మమే సారముగాఁగలది, ధర్మము చెడిన జగమే చెడును.

కం. సుఖమున సుఖము లభింపదు, ప్రఖరవ్రతములకు నియమ♦పద్ధతులకు ను
న్ముఖుఁడై యాత్మ జయించిన, నఖిలోత్తమ మైన ధర్మ♦మలవడు నాథా. ౧౨౪

ప్రఖర వ్రతములకున్ = మిగుల కఠినములైన కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతములకు, నియమపద్ధతులకున్ = ఆహారవిహారాది నియమములకు, మార్గములకు, ఉన్ముఖుఁడై =అభిముఖుఁడై, వానిని బూనుకొన్నవాఁడైన, ఆత్మన్=మనస్సును, అలవడును = లభించును.

తాత్పర్యము.

రామచంద్రా! యీ ఋషీశ్వరులవెంట హాయిగా నీ యాశ్రమమున కాయాశ్రమమునకుఁ దిరుగుచుండిన సుఖము లేదు. పరలోకసుఖముఁ గోరినవారు కఠిన వ్రతములు నియమము లనుష్ఠింపవలెను. "సుఖాసుఖే నేహలభ్యం, దుఃఖేన సాధ్వీ లభతే సుఖాని. మ. భా. వన. ౨౩౩-౪. అని కలదుగదా వానివలన మనస్సు జయింపవచ్చును. మనస్సేకదా బంధమోక్షములకుఁ గారణము. మనస్సు జయించిన లోకోత్తరమైన ధర్మఫలము లభించును. కావున దానికై కృషిచేయుము.

కం. మానితసౌమ్యుఁడవున్ శుచి, ధీనియతుండవును నీకుఁ ♦ దెలియని దున్నే
ప్రాణేశ ముజ్జగంబుల, నే నెంతటిదాన నీకు ♦ నీతులు నేర్పన్. ౧౨౫

మానితసౌమ్యుఁడవున్ = గౌరవింపఁబడిన సాధుత్వముగలవాఁడవు, శుచిధీనియతుండవు=శుచిధీ=పవిత్రమైనబుద్ధిచే- నియతుండవు = నియమింపఁబడువాఁడవు, ఉన్నే=ఉన్నదా? లేదని యర్థము.

తాత్పర్యము.

నీ సౌజన్యము సాధుత్వము లోకముచే గౌరవింపఁబడునవి, మనస్సు వచ్చిన ప్రకారము చరింపక నిష్కల్మషమైన బుద్ధిచేఁ గార్యనియతిగలవాఁడవు. ఇట్టి నీకు మూఁడులోకములందుఁ దెలియని దేమున్నది, ప్రాణేశ్వరా! నీకు నీతులునేర్ప నే నెంతదానను.

చ. విపినతలంబులం దిరుగు♦వేళ నహింసఁ జరింపరాదె, స్త్రీ
చపలత నాకుఁ దోఁచినది ♦ సజ్జనవందిత యాడితిన్, ధరన్
నిపుణుఁ డెవండు ధర్మములు ♦ నీ కుపదేశ మొనర్పఁ, దమ్ముఁడున్
నృపవర నీవు నారసి చ♦రింపుఁడు మీకు రుచించుచొప్పునన్. ౧౨౬

విపినతలంబులన్ = అడవిప్రదేశములందు, సజ్జనవందిత= సత్పురుషులచే నమస్కరింపఁబడువాఁడా, స్త్రీచపలత = స్త్రీలకు స్వాభావసిద్ధమైన చపలబుద్ధిచే, నిపుణుఁడు=సమర్థుఁడు, నేర్పరి,'విదితేచాపి వక్తవ్యం సుహృద్భి రనురాగతః'॥భార.౪-౪-౯. తెలిసినవారికైనను వారియందుఁ బ్రేమగల సుహృత్తులు హితము చెప్పవలెను.

## తాత్పర్యము.

నీ వడవులలోఁ దిరుగు కాలమందు హింసావ్యాపారములేక యుండరాదా? ఇదియే నేను గోరునది, నీవు సజ్జనవందితుఁడవు, హింసారతుఁడ వయ్యెదవేని సజ్జనులు మెచ్చరేమో! రాముఁడు క్రూరుఁ డందురేమో యని విచారపడెదను, స్త్రీలకు స్థిర బుద్ధిలేదు. ఇతమిత్థమని నిశ్చయింపఁజాలరు కావున నాకు స్వభావసిద్ధమైన బుద్ధి చపలతచేఁ దోఁచినది చెప్పితిని. నీకు ధర్మములునేర్ప లోకమున సమర్థుఁ డెవఁడు గలఁడు. కావున నీవు సీతమ్మఁడు నాలోచించి మీకు నేది మేలని తోఁచునో యట్లు జేయుము.

—♦ ౧౦-వ సర్గము. శ్రీరాముఁడు సీతకు నార్తరక్షణము పరమధర్మం బని చెప్పుట. ♦—

చం. అతులితభర్తృభక్తి సతి ♦ యాడినపల్కులు వించు ధర్మసు
స్థితమతి రాముఁ డిట్లనియె ♦ దేవి తమిన్ భవదీయసత్కులో
చితముగ రాగతుల్యముగఁ ♦ జెప్పితి వియ్యెడ ధర్మబుద్ధి నా
మతిగతిఁ బల్కెద న్వినుము ♦ మానుగ నంతయు బోధ మయ్యెడిన్. ౧౨౭

రాముఁడా యాడినమాటఁ దప్పువాఁడు కాఁడు, కావున రాక్షసవధ చేయును గాని మానఁడు. అట్లని నిష్కారణముగా వారిని వధింపఁగోరఁడు. రాక్షసులా దుష్టులు, ఊరకుండువారుగారు, రాముని ధనుస్సునుజూచి తమకుఁ గీడుచేయునని భయపడి యేదైనఁ గీడుచేయఁ బ్రారంభింతురు, రాముఁ డూరకున్నను వారూర కొనరు. ఏ ప్రయత్నము లేక చిత్రకూటమం దూరక యల్పదినము లుండిన మాత్రముననే రాముఁ డందున్నాఁడని యచటి మునులను రాక్షసులు పలువిధముల బాధించి రని వారు చెప్పిరిగదా, రాక్షసులు రామచంద్రునకు ముఖాముఖి యెదురు కట్ల నిలిచి కీడుచేయఁజాలరు. రామచంద్రునకుఁ గీడుచేయవలయు ననిన వారు నాకుఁ గీడుచేయవలయును. సీతతో మీరిం దుండవలదని చిత్రకూటమునులు బోధించిరి గదా. ఏమాయోపాయములనైన వారు నాకుఁ గీడు గలిగించెదరేని రామచంద్ర మూర్తి మిగుల దుఃఖించి ప్రపంచసుఖమే మానును. ఆయనకట్టి కష్టదశ వచ్చుటకు నేనెట్లు కారణభూతురాల నగుదును. అని యాలోచించి రామునకుఁగల దుఃఖమాఁ పుటకై యీ విధముగాఁ జెప్పెనుగాని శ్రీరామచంద్రమూర్తియో, నీ వియో గము కలిగినఁ గలుగునుగాక, దుఃఖించిన దుఃఖింతునుగాక, దుష్టరాక్షసవధ మాననని ప్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు.

అతులిత భర్తృభక్త్యా=అసమానమైన పతిభక్తిచే, భక్తి పరమప్రేమముగదా, ధర్మసుస్థితమతి=ధర్మమందే (అర్థకామములందుఁగాదు.) చక్కఁగా నిలిచిన మనసుగల వాఁడు, తమిన్=ప్రేమముతో, భవదీయ=నీయొక్క, సత్కుల = మంచివంశమునకు,

ఉచితముగన్=తగినట్లు, రాగతుల్యముగన్ = నా యందు నీకుఁగల యనురాగమునకు సమానమైనట్లు, మతిగతిన్ = ఆలోచనవిధము, మనస్సురీతి.

తా త్ప ర్య ము .

పతివ్రతయగు సీతాదేవి కేవల పరమప్రేమచే దన క్షేమముఁ గోరి చెప్పిన మాటలు విని యామె యభిప్రాయమును గ్రహించి సీతాదేవి చెప్పిన యర్థకామ సుఖంబులందుఁ గోరికలేక ధర్మమే పరమార్థమని దానియందే నెలకొన్న మనస్సు గలవాఁడై శ్రీరామచంద్రమూర్తి యిట్లు చెప్పెను.

దేవీ ! నీవు ప్రేమతోడను నీవు జనించిన గొప్పవంశమునకుఁ దగినరీతిని నా యందు నీకుఁ గల యనురాగమునకుఁ దగినట్టు చెప్పితివి. ప్రేమను బురస్కరించుకొని కులధర్మహాని కలుగఁ జెప్పినదానవుకావు. నాకు దుఃఖము కలుగునే శ్రమపడుదునే యని నాకష్టము సహింపలేక నీకు నాయందుఁ గల యనురాగము కొలఁది చెప్పితివి. అటులని చెప్పరానిమాట చెప్పితివా, లేదు. ధర్మబుద్ధి చెప్పితివి, హింస మానుమం టివి, నిష్కారణవైర మెవ్వరితోను వలదంటివి. కాలము వ్యర్థముచేయక పరలోక సుఖమునకై తపస్సుచేయు మంటివి. ధర్మమార్గము వదల వల దంటివి. నా తల్లిదం డ్రులకు సంతోషకరమైన మార్గమున నాశ్రమమునకుఁ దగిన ధర్మ మనుష్ఠింపు మంటివి, ఇందేది చెడ్డది, కావున నీవు చెప్పినది తప్పని నేను జెప్పఁజాలను, అయినను నా మనస్థ్సితి నాయాలోచనవిధము చెప్పెద వినుము. చక్కఁగా నీకు బోధపడును.

శా. నీవే పల్కితి కాదె క్షత్త్రియులకు ♦ న్దీనార్తరక్షార్థమై
దేవీ చాపముఁ దాల్ప నర్హ్యమని, భీ♦తిన్ మానినాథు ల్మహా
భావుల్ దండకవారు తార కదవే ♦ బాధార్తిమై వచ్చి న
న్నీవే దిక్కని మఱ్ఱు చొచ్చి, రిత వొ♦నే వారిఁ బోపొం డనన్. ౧౨౮

దీనార్త రక్షార్థమై=దీనులను ఆర్తులను రక్షించుకొఱకై, మహాభావుల్ = గొప్ప మనస్సు, గొప్ప మహిమగలవారు, తార=వా రంతటవారే, బాధ = అతిశ యించిన, ఆర్తిన్=వ్యథచే.

తా త్ప ర్య ము.

దేవీ! నీవు క్షత్త్రియులకు 'సార్తి ప్రజరక్షారంభమునకుఁ గార్ముక ధారణమగు' నని యంగీకరించితివిగదా! ఇప్పుడు దండకయం దుండు మహానుభావులు గొప్పమన స్సుగలవారు, ఆకారణముచేఁ బరులను వారు బాధింపరు. అనిమిత్తముగ నితరుల బ్రేరింపరు. అట్టి యహింసాపరులైన ఋషులు రాక్షసులకు భయపడి వా రంతట నా ప్రయత్నము లేకయే మిక్కిలి దుఃఖపడుచు వచ్చి నీవే దిక్కని శరణు చొచ్చిరి. ఇట్లు నన్నొక్కనినే దిక్కని నమ్మియున్న నా యాశ్రితులను నెటులైనఁ బాపైపొం డని తిరస్కరించుట ధర్మమా? నీవే చెప్పుము.

హింస నిషేధించితివి, దాని నే నంగీకరించితిని. హింస యన నెటువంటిది ? నిరపరాధులగు సాధువుల హింసించుట హింస యనఁబడును గాని యసాధువుల హింసించుట హింసయగునా ?

అహింసాఽసాధుహింసేతి శ్రేయాన్ ధర్మపరిగ్రహః. భా. 12-15-49.

అహింస, అసాధుహింస రెండును శ్రేయస్కరములైన ధర్మములని శాస్త్రము చెప్పదా.

రాక్షస వధయందు నా కుద్దేశమేమి ? అది వినోదక్రీడగా నెంచితినా ? వారి రాజ్యము సంపద నాక్రమింపఁ దలఁచితినా ? వారిని నేను గామముచేఁ గాని క్రోధముచేఁ గాని లోభముచేఁ గాని మద మాత్సర్యములచేఁ గాని మోహముచేఁ గాని చంపఁ బూనలేదు కదా, సాధువుల మేలునకై చేయు కార్యమందు దోషముగలదా?

చ. అడవులఁ గాయ కూర కడు♦పార భుజించి శరీరయాత్రలన్
నడుపుచు ధర్మపద్ధతి న♦నారతమున్ వ్రతులైన మానులన్
విడువనివైర మెత్తి కడు♦నిష్ఠురవృత్తి వధించుచున్న యా
చెడుగుల మానుషాదులను ♦ జెప్పు మధర్మమె త్రుంపఁ బూనుటల్. ౧౯

ఋషీశ్వరులును దుష్టులైరేని వారు దుష్టులు, మీరు దుష్టులే, మీ యిష్టమెట్లులైనఁ బొం డనవచ్చును. అట్లు లేదనుచున్నాఁడు.

కడుపారన్=కడుపు నిండ, అనారతమున్=ఎల్లవేళల, వ్రతులు = వ్రతమూని యుండువారు, నిష్ఠురవృత్తిన్=నిర్దయమైన విధముగ, మానుషాదులను=మనుష్యులఁ దిను వారిని, త్రుంపన్=చంపుటకు.

## తాత్పర్యము.

దేవీ! యీ మును లడవులందు నం దొక కాయ యిం దొక కూర తెచ్చుకొని దానితోనే కడుపు నించుకొని దేహయాత్ర జరపువారు. రాక్షసులో మృగములనే కాదు మనుష్యులను బీఁకి తిని భోగము లనుభవింపఁగోరు వారు. వీరు ధర్మపద్ధతి నడుచువారు, వారో దయాదాక్షిణ్యములు లేక క్రూరపద్ధతి వర్తించువారు. వీరు సర్వదా వ్రతము లూనినవా రగుటచే నితర కార్య ప్రసక్తి గాని యితర విచారము గాని లేని వారు. వారో శిశ్నోదరపరాయణులై యితరుల బాధించుటయే వ్రతముగా గలవారు, (పరస్వ, పరదార హరణము మాకు ధర్మమని రావణుఁడు చెప్పెనుగదా.) ఇట్లు నిష్కారణ హింసాపరాయణులైన రాక్షసుల వధించి శిష్ట పరిత్రాణము చేయుట యధర్మమా? నీవే చెప్పుము.

క. దండక వసియించెడు ముని, దండంబులు మమ్ముఁ జేరి ♦ తమదుఃఖంబున్
గొండలుగఁ జెప్పుకొని కావుం డనుచున్ వేఁడ నేను ♦ గావుంబోనే. ౨౦

దండంబులు = సమూహములు.

తా త్ప ర్య ము.

దండకలో వసించు మునీశ్వరుల సమూహములు మా యిరువురఁ జేరవచ్చి కొండలు కోట్లుగఁ దమ దుఃఖము చెప్పి రక్షింపవలసిన దని ప్రార్థించిరి, అప్పుడు నేను,

తే. అంఘ్రిశుశ్రూషఁ దేర్పసం♦యముల లజ్జ, యయ్యె మీరలెననుఁజూడ♦నరుగుదేరఁ
 గరుణ శమియింపుఁ డెవ్వి మీ♦కాంక్షితంబు, లేమిచేయుదునో వచి♦యింపుడంటి ౧౩౦

అంఘ్రిశుశ్రూష=పాదసేవ, కాంక్షితంబులు=కోరికలు, ఇట్లు చెప్పుటచేఁ బెద్దలు వచ్చినపుడు వారిని గౌరవించి శుశ్రూష చేయవలయునని యేర్పడుచున్నది. లజ్జ=దుష్టులవలన బాధ లేకుండ రక్షింపవలసినది నా కార్యమైయుండ వారై యింత దూరము వచ్చి చెప్పుకొనువఱకు నా కర్తవ్యము నేను జేయక యూరకున్నాను గదా యని సిగ్గు.

తా త్ప ర్య ము .

వారి పాదములకు నమస్కరించి సంయములారా ! నేను మిమ్ముఁ జూడవచ్చుట ధర్మము. అట్టి నేను మీరు రాకముందే మిమ్మును జూడ రాకపోయితినిగదా యని సిగ్గుపడుచున్నాను. నా యపరాధమును దయచే క్షమింపుఁడు. మీ కోరిక లెవ్వి ? నేను మీకుఁ జేయవలసిన సాహాయ్యమేది చెప్పుఁడని ప్రార్థించితిని.

ఉ. మానిని వార లెల్ల నొక♦మాటగ దండకలోఁ జరించునా
 మానవభోజు లెల్లపుడు ♦ మార్తురరీతిని హోమవేళలన్
 మానక బాధపెట్టుచును ♦ మారకులై రెది దిక్కటంచు మే
 మూనినభీతి నుండఁగ నృ♦పోత్తమ మా సుకృతంబు పెంపునన్. ౧౩౨

మార్తురరీతిని = విరోధులవలె, మారకులై = హింసించువారై, సుకృతంబు పెంపునన్ = పుణ్యాతిశయముచే.

తా త్ప ర్య ము .

అప్పుడు దేవీ ! వా రందఱు నేక వాక్యముగ నిట్లనిరి. దండకలోఁ దిరుగు రాక్షసులు విరోధము పూని మేము హోమముచేయు సమయమందు మమ్ము బాధ పెట్టుచు హింసించుచున్నారు. ఈ బాధ పడలేక యెవఁడు మనకు రక్షకుఁడని భయ పడి విచారగ్రస్తులమై యుండఁగా, రాజేంద్రా! మా పుణ్యాతిశయముచే నీవు వచ్చి తివి. 'దుర్బలస్య బలం రాజా' యని కలదు కదా.

ఉ. వచ్చితి, వీవ దిక్కు, జన♦వర్య తపంబున రాక్షసాధముల్
 చచ్చి పడన్ శపింపఁ గల♦శక్తి వహించి చిరార్జితంబునై
 హెచ్చిన మత్తపంబులు వ్య♦యింపఁగ నొల్లక వారి చేతిలోఁ
 జచ్చుచునున్న వార మతి♦శాంతి వహించి సహించి బాధలన్. ౧౩౩

చిరార్జితంబు=దీర్ఘ కాలముగఁ గష్టపడి సంపాదించినది, వ్యయింపఁగ=వెచ్చ పెట్టఁగ, ఒల్లక=సమ్మతింపక.

తా త్ప ర్య ము.

మనల రక్షించువాఁ డెవఁడా యెవనితోఁ జెప్పుకొందమా యని యాలోచించు చుండఁగా బలహీనులకు రాజే దిక్కు గావున రాజవగుటచే వచ్చితివి. మీరు తపోబలముగలవారు గదా, మీరు శపించిన వారు చావరా. ఇతరుల మీరు వేఁడ వలయునా యందు వేమో. సత్యమే. మా తపోబలము పెంపున నా రాక్షసాధములు చచ్చిపడ శపింపఁగలము కాని చిరకాలముగ నెంతో కష్టపడి యార్జించిన తపశ్శక్తి వెచ్చపెట్ట నిష్టములేక వారిచేతఁ జిక్కి బాధలు సహించి శాంతి వహించి చచ్చు చున్నాము. ఈ దేహము పోయిన మా ప్రయత్నము లేకయే మఱియొక దేహము వచ్చును. తపస్సు పోయిన మరల నెంతో కాలము శ్రమింపక రాదు కదా. తపోహీను లమై జీవించుటకంటె, దపస్సంపన్నులమై చచ్చుటే శ్రేయస్కరము. అటైన మా సాహాయ్యమేల యందువేమో మరల జన్మము రాకుండుటకై కదా మేము తపస్సులు చేయుట. అట్టి తపస్సు పూర్తి కాకముందే చచ్చిన మరల జన్మము కలదు గదా. ఆ తపస్సులు పూర్తి చేసికొనుటకై నీ సాహాయ్యము కోరుచున్నాము.

కం. సులభంబు గాదు తపమును, జలుపుట దుష్కరము విఘ్న♦సంతతు లెపుడున్
గలిగెడుఁ గావున నసురలు, సొలయక మము ద్రుంగఁదిట్టఁ♦జూడుము మరలన్. [౧౩౮

దుష్కరము=దుఃఖముతోఁ జేయదగినది, కష్టసాధ్యము.

తా త్ప ర్య ము.

రామచంద్రా! తపముచేయుట సుళువుగాదు. అది మిగులఁ గష్టమైన కార్యము. అంత కష్టించి చేయుదు మనిన నడుమ నడుమ విఘ్నము లెన్నియో వచ్చుచుండును. ఇంత కష్టించి సంపాదించిన తపశ్శక్తిని మేము పోఁగొట్టుకొనలేక వారిని శపింపక యున్నాము. ఒకరా యిద్దఱా యెందఱనని శపింతుము? వచ్చినవారి నెల్లఁదిట్టఁబూనిన మా శక్తి యేమి మిగులును. జీవించినను వ్యర్థపుఁ జావు చావ వలసిన వారమే కదా.

కం. భావింపుము మాస్థితిఁ బ్రతి, గావింపుము మాతపంబు♦కడఁగను గతి సం
భావింపుము తమ్మునితో, నీవే మా కిచట దిక్కు ♦ నిర్మల కీర్తీ. ౧౩౯

నిర్మలకీర్తీ=ఆర్తత్రాణ పరాయణుఁడ వను నిర్మలమైన కీర్తిగలవాఁడా.

తా త్ప ర్య ము.

నిర్మలమైన కీర్తిగలవాఁడా, మాస్థితిగతు లాలోచింపుము, రాక్షసులు చేయు కార్యములకు మాఱుచేయుము మా తపంబులు సాంతమగు రీతి మాయందు దయ

దలఁచి మమ్ము గారవింపుము, నీవు నీతమ్ముఁడే మాకిచట దిక్కు. వేఱు రక్షకులు లేరు. మీరు తప్ప మఱి యేరాజు లైనను వీరి బారిఁబడి బ్రతికిపోలేరు.

ఇచ్చట లక్ష్మణ ప్రశంస పురుషకార సూచకము; హింసాత్మకమైన కార్యము గావున సీతాదేవి సహాయపడదు. ఇది స్త్రీలవలన నగు కార్యముకాదు.

కం. అన విని సర్వముఁ దీర్పఁగ, ననఁబోఁణీ ప్రతిన చేసి॰నాఁడను జుమ్మా
తనువునఁ బ్రాణము లుండఁగ, నని తప్పట లేదు సత్య॰మతిహిత మగుటన్. ౧౩౬

ననఁబోఁణీ=పుష్పకోమలా, పుష్పమువలెఁ గోమలమగు దేహముగలదానా! ఇట్లనుటచే నీవత్యంత సుకుమారివి గావున రాఁగల కష్టములకు భయపడెదవే కాని కష్టించియైన నాశ్రితరక్ష చేయవలయునని యాలోచింపవైతి వని భావము. ప్రతిన=ప్రతిజ్ఞ, బాస, అతిహితము=మిగుల హితము.

తా త్ప ర్య ము .

పూఁబోఁణీ! వారి ప్రకారము చెప్పఁగా వారి కార్య మంతయుఁ జక్కఁబఱుపఁ బ్రతిజ్ఞ చేసితినిజుమీ! ఊరార్పుమాటలు చెప్పి కన్నీళ్ళు తుడిచి పంపినవాఁడఁగాను, నాకు సత్య మన్నిటికంటె నత్యంతహితకర మగుటచే దేహమునఁ బ్రాణము లుండఁగాఁ జెప్పి తప్పను.

కం. న న్నాశ్రయించి కీడుం, దెన్నున నెన్నఁడును బోని॰దీనుల నసురుల్
పన్నుగఁ జంపిరి నీవే, యెన్నుమ యింతకు విరోధ॰హేతువు సుమతీ! ౧౩౭

తెన్నున=మార్గమందు, ఎన్నుమ=లెక్కింపుమా, విరోధహేతువు=పగకు. గారణము, సుమతీ=మంచిమనస్సుగలదానా, అసురులు=రాక్షసులు, (అసు+ర) ప్రాణములు దీయువారు.

తా త్ప ర్య ము .

నీవే దిక్కని న న్నాశ్రయించి యే సమయమందును బరులకు హానికరమగు మార్గమునఁబోక దిక్కులేనివారిని జీవహింసాపరులైన రాక్షసులు పనిపూని వధించిరి. నీవు నిర్మలమైన మంచిమనస్సు గలదానవుగదా. ఇంతకంటె విరోధకారణ మేదిగలదో చెప్పుము.

న న్నాశ్రయించువఱకు నెవ రేపాపములుచేసినను వారిపాపఫలము వారే యనుభవింతురని వారిని నేను రక్షింపఁ బ్రయత్నింపను. ఒకసారి నన్నాశ్రయించి నీవే దిక్కని వారిరక్షాభారమును నాయందువైచి పాపకార్యములు చేయకయుండు దిక్కులేనివారిని రక్షించుట నాకార్యము. దానికి నేను బూఁటపడియున్నాను. అట్టి నా యాశ్రితులను గావున నా పోష్యవర్గములోఁ జేరినవారిని రాక్షసులు ప్రాణముదీయుచున్నారు. నాభక్తులు నాప్రాణములుగదా! నాభక్తులను బాధించుట నన్ను బాధించుటేకదా! కావునఁ బగకారణము దీనికి మించినదేదికలదో నీవే వ్రేలు మడఁచి యెంచిచెప్పుము. అట్లు చెప్పఁగలవేని, సుమతీ! నీవు చెప్పినట్లు చేసెదను.

నీవదిక్కు=నీవేదిక్కు, మాతపస్సులు మాకు రక్షకము లని మేము తలఁప లేదు. మాతపస్సులచే మమ్ము రక్షించుకొనఁదలంచుట మా స్వాతంత్ర్యము ప్రకటించు టేకదా. నీకుఁ బరతంత్రులమైయుండు మేము స్వతంత్రించి మాశక్తిచే మేము రక్షించుకొనఁబూనుట మాకు స్వరూపహానిగదా. మాతపస్సులు ఫలింపనీ ఫలింపకపోనీ, రాక్షసులచే మేము చావనీ బ్రతుకనీ నీ పారతంత్ర్యము మేము వదల మని సూచన.

ఇచట రాయబారమువేళ శ్రీకృష్ణమూర్తి దుర్యోధనునకుఁ జెప్పిన వాక్యములు స్మరింపనగు.

క. అలుగుదు పాండవులకు వా,రలు నాకుం బ్రాణములు ధరావల్లభ యి
ట్టలముగఁ దమ ప్రాణములకు, నలుగు జనులు పగతు రనుట యనుమానంబే.

గీ. కారణంబులేక కౌంతేయులకు బాల్య
మాదిగాఁగఁ గీడె యాచరింతు
పుణ్యపరులు తోడఁ బుట్టువు లార్యులు
వైరమెత్తఁదగునె వారితోడ.

ఇట్లున్న మీ యందఱయన్నంబులు దుష్టాన్నంబులు”

ఉద్యో. ౩-౨౨౬-౨౨౭.

కృష్ణునకు దుర్యోధనుఁడు కీడుచేయకున్నను, ధర్మాత్ములైన పాండవులకుఁ గీడు చేయుటచే దుర్యోధనుఁడేకాక వానితోఁగలిసియుండు భీష్మద్రోణాదులుకూడ భగవంతునిచేఁ ద్యజింపఁబడిరి. రామాయణమున విభీషణువలె విదురుఁడుమాత్ర మనుగ్రహింపఁబడెను.

కం. విడిచెదఁ బ్రాణము లైన, న్విడిచెద నిన్నైనన్ దమ్ముని♦న్ విడిచెద నే
విడుతునె ప్రతిఙ్ఞ నందుం, బుడమిసురలతోడఁ బల్కి♦ముగ్ధా! యెపుడేన్. ౧౩౫

ముగ్ధా = సుందరీ! తెలియనిదానా.

తాత్పర్యము.

ఇఁక నామనోనిశ్చయము చెప్పెద వినుము. సత్యము రక్షించునిమిత్తము ప్రాణములైనను విడిచెదను. ప్రాణములకంటెఁ బ్రియమగు నిన్నైన విడిచెదను. నీకంటెఁ బ్రియుఁడగు తమ్ముని విడువవలసివచ్చినను విడుతును. గాని సామాన్యవిషయమైన ప్రతిజ్ఞ విడువను. అందు ముఖ్యముగా బ్రాహ్మణులకు మాట చెప్పి తప్పను.

కం. ఊరూరఁ గళత్రంబులు - నూరూరన్ బాంధవులును నొదవెదరకటా - యారయ
భ్రాత సహోదరుఁ - డారఁగ లభియించు దేశ మవనింగలదే॥ యుద్ధ. ౨౩౩౮ ప.

అనిచెప్పిన శ్రీరామచంద్రమూర్తి ‘కం. చెడకుండ ధర్మవిధి నిను,విడిచితి సౌమిత్రి నాదు ప్రియసోదరుఁడా, పుడమిని సాధుల కిష్టుల విడుచుట చంపుటయు నొక్క విధమై యునికిన్.ఉత్తర. ౧౬౦౯ వ పద్యము ‘భ్రాతాస్యాన్మూర్తిరాత్మ’ యనుమను

స్మృతి స్మరించుచునది. రామచంద్రమూర్తి సీతాదేవిని విడనాడుట ధర్మలోప భయమునను లక్ష్మణుఁ విడనాడుట సత్యలోప భయమునను గదా. అయోధ్య ౨౮౧౭ - ౨౮౧౮ పద్యవ్యాఖ్య చూచునది.

ప్రాణములైనను విడిచెదను=ఆత్మార్థం పృథ్వీంత్యజేత్, ఆత్మానం సర్వదా రక్షేద్దారైరపి ధనైరపి. భార్యను ధనమును వదలియైనఁ దన్ను రక్షించుకొనవలెను అనునది స్మరణీయము. నిన్నైనన్=అర్ధోవా ఏష ఆత్మనో యత్పత్నీ=తనయాత్మలో సగము భార్య గదా, 'ఆత్మాహి దారా సర్వేషాం దారసంగ్రహవర్తినామ్' కుటుంబులకు భార్యయే ఆత్మ - అయోధ్య ౩౭-౨౪.

'యోభర్తా సైవభార్యాస్మృతా-' వాజసనేయబ్రాహ్మణము. 'యోభర్తా సా స్మృతాంగనా' మను ౯-౪౫.

భర్తయే భార్య.

శాస్త్రప్రయోగా ద్వివిధాచ్చ వేదా

దాత్మామహ్యానన్యః పురుషస్య దారాః॥ కిష్కింధ. ౨౪ స. ౩౬.

శాస్త్రప్రయోగములవలనను నానా వేదములచేతను పురుషునకు భార్య తనయాత్మకంటె వేఱుగాదు. సత్యము విడువవలయునా, యిట్టి నిన్ను విడువవలయునా యని సందేహము వచ్చినప్పుడు నిన్ను వదలియైన సత్యమునే రక్షింతును. 'నజీవేయం క్షణమపి వినా తా మసితేక్షణా' మ్మన్నట్టు నిన్ను విడిచి క్షణమైన నేను జీవింపఁజాలకున్నను ముందు నిన్ను విడిచి సత్యధర్మముల రక్షించి యావలఁ బ్రాణము విడిచెదను. ఇట్టి గుణమునకు ధైర్య మనిపేరు. (అయోధ్య ౨౮౧౭ వ వ్యాఖ్య చూచునది.)

కం. మునిజనకార్యము పరిపాలన మే నొనరింపవలయు ♦ లలనా! వారల్
నను నడుగకయుండిన నన్, జనకసుతా! ప్రతిన సల్పి ♦ చనునే విడువన్. ౧౩౯

లలనా = సీతాదేవీ!

తాత్పర్యము.

ఆశ్రితరక్షాభారమును వహించిన నేను నాయాశ్రితులై మత్పరతంత్రులైయుండు మునిజనులకార్యము రక్షింపవలసినది నాకువిధి. ఒకసారి వారు నీ యాశ్రితులము మారక్షాభారము నీదియని చెప్పినఁజాలదా; గడియగడియకు నాకుఁ జెప్పుచుండవలయునా, నేనంతటి మఱపువాఁడనా, వారి యోగక్షేమములు నేనే విచారించుకొనవలెను. అట్లుండ వారు వచ్చి నాకృత్యము హెచ్చరించిన పిమ్మట వారికిఁ బ్రతిజ్ఞ చేసికూడ నెట్లు నెఱవేర్పక విడుతును. నీవు జనకరాజు కూఁతురవే. ఇది నీకుఁ దెలియనివిషయమా? అప్పు దీసికొనినవాఁడు పలుమాఱు డిగించుకొని యిచ్చుట శ్లాఘ్యమా? ఇయ్యకయే యుంట శ్లాఘ్యమా? రెండునుగావు. నన్ను నమ్మి నన్ను స్మరించి నన్ను ధ్యానించి, యర్చించి, జపించి, సేవించి, వర్ణించి, కీర్తించి, నాపై ఋణమెక్కించిన వారి ఋణము నేను దీర్చుకొనవలదా? "అహం స్మరామి మద్భక్తం" నాభక్తుని నేను స్మరిం

చెదను. అని నేను జెప్పినమాట నెఱవేర్చుటయం దాలస్యమైన దని నేను విచారపడు చుండ వారికార్యము నెరవేర్పక యెట్టు లుండఁగలను?

కం. స్నేహంబున మోహంబున, సౌహార్దంబునను బోధ ♦ సలిపితివి వరా
రోహా! మెచ్చితి బుద్ధులు, స్నేహవిహీనులకు నొరులు ♦ చెప్పుదురటవే. ౧౮౦
వరారోహా=ఉత్తమసతీ.

తాత్పర్యము.

నాకు నీయందు నీకు నాయందుఁగల స్నేహము మోహము కారణముచేతను మంచి మనస్సుగలదాన వగుటను బోధపఱిచితివి. రక్షోవధకుఁబూనినపుడు నాకు నీయందు, నీకు నాయందుఁగల స్నేహమోహప్రవాహమునకు విఘ్నము కలుగునే యను నీయనుతాపము గ్రహించితిని. అది సహించియైనఁ గార్యము నెఱవేర్పవల యును. ఉత్తమస్త్రీవిగావున నీ విట్టిబుద్ధులు చెప్పఁగలిగితివి. స్నేహము మోహము భర్తకుఁ దమయందులేకున్నను భర్తలపైఁ దమకు లేకున్నను జెప్పవత్తురా? చెప్పరు. కావున నీ వుత్తమగుణసంపన్న వని నిష్కపటవ్యాపార వని మెచ్చితిని.

చం. అనఘ భవత్కులంబునకు ♦ నంబుజపాణి! భవచ్చరిత్రకున్
గన ననురూప మర్హమగు ♦ కైవడిఁ బల్కితి నాకు నెప్పుడున్
వనిత సధర్మచారిణివి ♦ ప్రాణచయంబునకంటె మిన్న వం
చును వచియించి లక్ష్మణుఁడు ♦ సుందరియుం జనుదేర ధన్వియై. ౧౮౧

అనఘ=నిర్దోషురాలా, భవత్కులంబునకున్=నీవంశమునకు, అంబుజపాణి= కమలములవంటి చేతులుగలదానా (౨) కమలములను జేతియందుఁగల లక్ష్మీదేవీ, దీనిచే నవతార రహస్యమును స్మృతికిఁ దెచ్చుచున్నాఁడు. నీవేకదా పతివ్రతల పాతి వ్రత్యము చెఱచు రాక్షసుల దునుమ నేను నిమిత్త మయ్యెదను, మీ రా కార్యము చేయరం డని ప్రేరించితివి. ఇప్పుడు నీవు వెనుకంజ పెట్టఁదగునా? నీవు సహధర్మ చారిణి వని కదా నీ తండ్రి చెప్పెను. నీ తండ్రి వాక్యమును నీవు పాలించినట్లు సహ ధర్మచారిణినైన నా తండ్రి వాక్యమును నేను బరిపాలించెద నని నీవు చెప్పలేదా. దాని నిప్పుడు స్మరింపుము, దానికి సమయము వచ్చినది. వెనుదీయకుము. గుండె నిబ్బరము చేసికొమ్ము, అను నీ యర్థము నీ పదము సూచించుచున్నది. భవచ్చరిత్రకున్=నీ శీల మునకు, పతివ్రతయగు స్త్రీ పతిహితపరురాలై 'కార్యేషుదాసీ కరణేషుమంత్రీ' యన్నట్లు గదా యుండవలెను.

నీ వంశమునకు ననురూపము. నీ నడవడికర్హము. నీవు జనకరాజుకూఁతురవు. నీ తండ్రి "కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయ" యని కర్మయోగముచేతనే యోగసిద్ధి పొందిన మహానుభావుఁడు. విత్తొకటియైన చెట్టు మఱియొక్క టగునా?

ఇఁక నీ నడవడియో-

కం. తన కపకార మొనర్చిన, మనుజున కపకృతినొనర్ప మదిఁ దలఁపఁడు స
జ్జనుఁ డీ నియతిం బ్రోవఁగఁ, బొనరుర్ సజ్జనులు శీలభూషణు లెందుర్.

కం. కపివర పుణ్యులలోఁ బా, పపుజనములలోన వధకుఁ బాత్రులపట్లన్
గృపఁజూపవలయు సజ్జనుఁ, డపరాధముఁ జేయునట్టి యతఁడును గలఁడే.

గీ. పాపములె చేయుచును గామరూపు లగుచు
భువనహింసా విహారులై పోలుచున్న
యసురులకుఁ గీడుసేఁత కార్యంబుగాదు.

అను నభిప్రాయము గలదానవై యట్లే వర్తించుదానవుగదా! కాఁబట్టి నీవు చెప్పినది నీనడవడికిఁ దగియున్నది.

దీనివలన యుత్తమస్త్రీత్వము దృఢపడుచున్నది. నీవేమి చేయరానిపని చేసి చెప్పరానిది చెప్పితి వని నేను నిన్ను గోపింతును.

సహధర్మచారిణివి=నే నే ధర్మమందుఁ బ్రవర్తింతునో యట్టి ధర్మమందే నీవు నుండు దానవుగదా. ఏదశయందును ననపాయినివైన నీ విపు డేల జంకెదవు, మిన్నవు=శ్రేష్ఠురాలవు, మణి శబ్దము మిన్న, ధన్వి=ధనువు ధరియించిన వాఁడు.

తాత్పర్యము.

నిర్దోషురాలా! కమలహస్తా! నీవు పుట్టిన జనక వంశమునకు నీ శీలమునకుఁ దగినరీతిని జెప్పితివి. ఇందేమి దోషము గలదు. నీవు సహధర్మచారిణివి. ప్రాణముల కంటె నెక్కువ ప్రియమైనదానవు అని చెప్పి లక్ష్మణుఁడును సీతయుఁదోడ రాఁ దాను విల్లు ధరించి.

౧౧-వ సర్గము.

తే. అగ్రవర్తియై శ్రీరాముఁ డరుగుచుండె, నువిద తనుమధ్య మధ్యమం దుండె సీత
మహితకోదండదండసంభరణహస్తుఁ, డోలి వెన్నంటెఁ లక్ష్మణుఁ డొప్పుప్రేమ. ౧౪౨

అగ్రవర్తియై = ముందు పోవువాఁడై, ఉవిద = యువతి శబ్ద భవము, తనుమధ్య=సన్నని నడుముగలది, మధ్యమందున్=నడుమ, మహితము=మిగులఁ బూజ్యమైన, కోదండ దండ=వింటి బ్రద్దను, సంభరణ = ధరించిన, హస్తుఁడు = చేయిగలవాఁడు, ఓలి = వరుసగా, ప్రేమన్ = అనురాగముతో వెన్నంటెన్=వెనుక ప్రక్కఁ బోవుచుండెను.

తాత్పర్యము.

ముందు శ్రీరామచంద్రమూర్తి పోవుచుండెను. ఆయన వెనుక రామలక్ష్మణులకు నడుమ సన్నని నడుముగల సీత పోవుచుండెను. ఆమెకు వెనుక ధనుర్ధరుఁడై లక్ష్మణుఁడు ప్రేమ వశమునఁ బోవుచుండెను.

విశేషార్థము.

ఇందు ప్రణవ స్వరూపము. ప్రణవార్థము కలదని పూర్వులు చెప్పిరి.

'ఓం' అను నక్షరమునకుఁ బ్రణవ మనిపేరు. ఈ ఓం అనునది ఓమిత్యేకాక్షర మని చెప్పఁబడినను అది యొక యక్షరముగాదు. అందు "అకార ఉకార మకార ఇతి తా నేకధా సమభవ త్తదేత దో మితి" అని నారాయణోపనిషత్తునందు జెప్పఁబడిన ప్రకారము అ-ఉ-మకారములు మూఁడక్షరములు గలవు, అ + ఉ = సంధికలిసి ఓ యయ్యెను, దానికి మ్ చేరఁగా ఓమ్ అయ్యెను. ఇందు అకారము ఉకారము రెండును అచ్చులగుటచే సజాతీయములు ఒక విజాతీయము గలిసి యొకటిగానైనదే ఏకాక్షరమని చెప్పఁబడును.

ఈ పద్యమున మొదటిపాదము మొదల అకారమున్నది. రెండవ పాదము మొదట 'ఉవిద' ఉకారమున్నది. మూఁడవ పాదము మొదట మకార మున్నది. ఈ మూఁడు కలసి ఓమ్మని యాయె నని నాలుగవపాదము మొదటి యక్షరము కడపటియక్షరము కలసి చెప్పుచున్నవి. ఈ విధముగా నీ పద్యము ప్రణవ స్వరూపము. ఇఁక నీప్రణవమున కర్థమేమో విచారింతము. అ ఇతి బ్రహ్మ. అ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానం, అకారో విష్ణువాచకః ఇత్యాది ప్రమాణముల చేత అకారమునకు విష్ణువని యర్థము. భగవంతుఁడగు నారాయణుని మొదటి పేరు ఆయనయే.

ఎట్లనఁగా అకారము రక్షణ గతి హింసా ద్యర్థము గల 'అవ'ధాతువులవలనఁ బుట్టినది. అవధాతువునకు రక్షణము గతి హింస యని యర్థములు గలవు. ఈ మూఁడు కార్యములు చేయువాని నాశబ్దము బోధించును. యతోవా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ప్రయం త్యభిసంవిశంతి॥ ఎవనివలన నీ భూతములు పుట్టుచున్నవో ఎవనివలన జీవించుచున్నవో ప్రళయమం దెవనియందుఁ బ్రవేశించుచున్నవో.

విష్ణో స్సకాశా దుద్భూతం, జగ త్తత్రైవచ స్థితమ్
స్థితిసంయతికర్తా సౌ జగతోస్య జగచ్చ సః."

ఈ జగత్తు విష్ణువలనఁ బుట్టినది, ఆయనయందే యున్నది. ఈ ప్రపంచమునకు స్థితిసంయమికర్త యాయనయే, ఆయనయే జగత్తు, అనుటచే జగత్సృష్టి స్థితి సంహారములు చేయువాఁడు విష్ణువనియు, నాయనయే అకారవాచ్యుఁ డనియు నేర్పడెను. పంచవింశోయం పురుషః పంచవింశ ఆత్మాభవతి, యన్నట్లు హల్లులందు నిరువదియైదవ యక్షరమగు మకారము జీవుని బోధించును. 'మకారో జీవవాచకః' యని కలదు గదా. ఇఁక నీ రెంటికి నడుమనుండు ఉకారము లక్ష్మీదేవిని బోధించుచున్నది.

అకారేణోచ్యతే విష్ణుః సర్వలోకైకనాయకః
ఉకారేణోచ్యతే లక్ష్మీర్మకారో దాసవాచకః॥

అని బ్రహ్మసంహితయందుఁ గలదు.

అకారేణోచ్యతే విష్ణుః, సర్వదేవేశ్వరో హరిః
ఉద్ధృతా విష్ణునా లక్ష్మీ రుకారేణ తథోచ్యతే
మకారస్తు తయోర్దాస, ఇతి ప్రణవలక్షణమ్॥

సర్వదేవేశ్వరుఁ డగు విష్ణువు అకారముచేఁ జెప్పఁబడెను. విష్ణువుచే నుద్ధృతయగు లక్ష్మీదేవి ఉకారముచేఁ జెప్పఁబడెను. వారిరువురకు దాసుఁడు జీవుఁడు మకారముచేఁ జెప్పఁబడెను. ఇది ప్రణవలక్షణము.

కావున అకారము విష్ణువును ఉకారము లక్ష్మిని మకారము శేషుఁడగు లక్ష్మణుని సూచించును. విష్ణువే శ్రీరామచంద్రమూర్తి, లక్ష్మియే సీత, శేషుఁడే లక్ష్మణుఁడు. ఈ తత్త్వము బోధింప వారీ వరుసనఁ బయనించిరి.

ఇందు విష్ణువు, సర్వదా లక్ష్మీవిశిష్టుఁడై యుండునుగాని విడిచి యుండఁడు. 'విష్ణోరేషానపాయినీ' యని కలదుకదా. 'భాస్కరేణ ప్రభా యథా' యని సీతయు రాముఁడు చెప్పిరికదా. ఈ కారణముచేఁ బ్రథమపాదంబున నూరక రాముఁ డనక అగ్రవర్తియనుటచే ఈయనకుఁ బైవారు లేరని యర్థము. కావున నాయనయే స్వతంత్రుఁడు.

పితాసి లోకస్య చరాచరస్య త్వమస్యపూజ్యశ్చగురుర్గరీయాన్
న త్వత్సమోస్త్యభ్యధికః కుతోన్యో, లోకత్రయే ప్యప్రతిమప్రభావ.
భ. గీ. ౧౧-౪౩.

ఇక ఉకారము లక్ష్మిని దెలుపు నంటిమి. ఈమె జీవునకు భగవంతునకు మధ్యమున నుండునది. ఆ కారణముచే జీవుఁ డీమెను దాఁటిగాని భగవంతుని జూడఁ జాలఁడు. ఈమెకే మాయ యని పేరు, "యా మా" ఏమె లక్ష్మీదేవియో యామెయే మాయ. ఈ మాయను దాఁటని వానికి భగవత్ప్రాప్తిలేదు. కావున జీవుఁ డామె ననుసరించి పోవలెను. జీవుని భగవంతుని బొందించుటయే యామె కృత్యము. దీనినే పురుషకార మందురు. కావున ఉకారము జీవాత్మ పరమాత్మలకు గతి నిత్యసంబంధమును దెలుపుచున్నది. ఈమె యిరువురకు నడుమ నుండుటచే భగవదనుగ్రహమామె మూలముననే రావలయును. 'లక్ష్మ్యాశ్చ కారుణ్యరూపయా' యని యుండుటచే మూర్తీభవించిన భగవంతుని కరుణయే లక్ష్మీదేవి. భగవంతునిప్రాప్తి భగవంతుని కరుణచేతనేకదా కలుగవలయును. భగవంతుఁడును కరుణచేతనేగదా జీవునను గ్రహింపవలయును. తనుమధ్యా శబ్దమునకు మఱియొకయర్థము గ్రహింపనగు. తను వనఁగా దేహము. కావున దేహమధ్యమం దుండు నదియని యర్థము. విష్ణువు వక్షస్థలమందుఁగదా లక్ష్మీదేవియుండుట, తన హృదయమునకుఁ దెలియక యెవఁ

డైన సేవనియైన నెట్లు చేయఁగలడు. కావున శిరస్సు విష్ణువనియుఁ గంఠము క్రింది నడిమిభాగము లక్ష్మీదేవి యనియు భగవత్సంకల్ప ప్రకారమే లక్ష్మీదేవియు (శిరస్సున సంకల్పించినదే చేతులు నడుము etc.) చేయుచు నుండుననియు గ్రహింపనగు.

లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా
రక్షక స్సర్వసిద్ధాంతే వేదాంతేషుచ గీయతే॥

హృషీకేశుఁడగు విష్ణువు కారుణ్యరూపయగు లక్ష్మితోఁగూడి రక్షకుఁడగుచున్నాఁడని సర్వసిద్ధాంతములందు వేదాంతములందుఁ జెప్పబడినది, అనునది యిచట స్మరింపనగు.

అకారో విష్ణు రిత్యుక్తో, మకారో జీవవాచకః
తయోస్తు నిత్యసంబంధ ఉకారేణ ప్రకీర్తితః?                    అని ప్రమాణము.

మకారము జీవవాచకము, 'మకారో జీవవాచక' యనియు 'మకారోదాసవాచక'యనియు నుండుటచే జీవుఁడుదాసుఁడు.లక్ష్మీవిశిష్టుఁడైన భగవంతుని దాస్యమే జీవకృత్యము. వీఁడుచేయు కార్యము లన్నియు భగవంతుని కొఱకే యని యర్థము. ఈ దాస్యమును దెలుపుటకే మహిత కోదండ సంభరణ హస్తుఁడని లక్ష్మణుఁడు చెప్పఁబడియె. జీవుఁడు చేయుకృత్యములు భగవంతుని కొఱకే యను నర్థము ప్రణవమందే కలదు. ఎట్లన:—

మీఁద నుదహరించిన "అవ" ధాతువునకు క్విప్ప్రత్యయముచేయఁగా 'లోపో వ్యోర్వలి' యని వకారము లోపింపఁగా అవయందు అకారము మాత్రము మిగిలెను. ఈ యకారమునకు తాదర్థ్య(దానికొఱకు)చతుర్థియందు ఏకవచనరూపము ఆయయగుచున్నది. 'సుపాంసులుక్' అని సుబ్లోపముచేయఁగా అ యని చతుర్థ్యంతమున పాలయిత (పాలించువానికొఱకు) లుప్తచతుర్థీరూపమగుచున్నది. కావున అకారమున కిచట అకారవాచ్యునికొఱకు అని యర్థము చేయవలయును. ప్రథమగా నేల చెప్పరాదందు రేని ఓం నారాయణాయ యన్నప్పుడు విశేషణ విశేష్యములు సమాన విభక్తి యందుండవలయునుగదా. నారాయణునికొఱకు అని యర్థము చెప్పినపుడు ఆ యర్థమును దెలుపు అకారమున కా యర్థమునే చెప్పవలయును. "బ్రహ్మణేత్వామహస ఓ మిత్యాత్మానం యుంజీత" యను ప్రణవవివరణరూపమగు శ్రుతివాక్యమునందు బ్రహ్మణేయని చతుర్థి చెప్పఁబడి యుండుటచే నిందును జతుర్థియే గ్రహింపవలయును. కాఁగా మకారవాచ్యుఁడగు జీవుఁడు అకారవాచ్యుఁడగు భగవంతునికొఱకని కాగాఁ 'తదేవాగ్ని స్తద్వాయు స్తత్సూర్య స్తదుచంద్రమాః' అనుచో 'ఉ'కారము అవధారణార్థకమునఁ బ్రయోగింపఁబడినట్లు అ ఉ అన్నప్పుడు అ కొఱకే యితరులకుఁగాదు, అను నర్థము స్ఫురించుచున్నది. లక్ష్మణుఁడు శ్రీరామునకు దాసుఁడుగాని యితరులకుఁ గాఁడుగదా. శ్రీరాముఁడు ముందుపోవుటచేతను ఆయన ననుసరించి సీతయు ఆమె వెనుక లక్ష్మణుఁడు పోవుటచే నీయిరువురకు రక్షకుఁడు రాముఁ

డైనట్లు, మా, ప్రకృతి,లక్ష్మి సమానార్థకము లగుటచే ప్రకృతికి జీవునకును ధారణపోషణకర్త భగవంతుఁడే యని యేర్పడుచున్నది. అందు లక్ష్మణుఁ డిరువురకు వెనుకఁ బోవుటచే నాయనకు సీతారాములిరువురు సేవ్యులే యని తెలియనగును.

సర్వేషా మేవ లోకానా మీశ్వరీ మమవల్లభా
అస్యా మమ చ శేషంహి, విభూతి రుభయాత్మికా.
అనునది యిట ననుసంధించునది.

సా పరమప్రేమరూపా యను సూత్రప్రకారముఇచటఁ బ్రేమయనునది భక్తియే. భక్తిచే దాసుఁడై కదా లక్ష్మణుఁడు సర్వము నేన తీర్చెదనని కైంకర్యపరుఁ డగుట.

ఇదంతయు సత్యమేకాని దీనివలన మనము దెలిసికొనవలసినదేమి? సీతారామ లక్ష్మణులు తొలుత నరణ్యమునఁ బ్రవేశించినపుడు లక్ష్మణుఁడు ద్రోవచూపుచు ముందు బోవుచుండెను. ఇది కింకరవృత్తికిఁ దగిన వ్యాపారమే? దండకయందుఁ బ్రవేశించి ఋషులతో సహవాస మేర్పడిన పిమ్మట రామచంద్రమూర్తి ముందు పోవఁజొచ్చెను. ఈ మార్పునకేమి కారణము?

శ్రీ రామావతార మనుష్ఠానావతార మనియు శ్రీకృష్ణావతార మాచార్యావతార మనియు ముందే చెప్పఁబడెను. తన నడవడిచేతనే లోకులు సందేహదూరులై ధర్మము గ్రహింపఁజేసినవాఁడు శ్రీరామచంద్రమూర్తి. గంగదాఁటి చిత్రకూటము చేరువఱకు నిషాదజనము లుండిరిగాని ఋషులులేరు. దండకారణ్యము ఋషిమయము, ఋషులు తన వెంటవచ్చుచుండువారు. వీరు భగవద్ధర్మకర్మనిష్ఠులేయైనను నందఱు నొక్క తరగతివారుకారు. కావునఁ దత్త్వవిచారమందు సందేహములు గలవారైరి. ఏమి సందేహ మనిన:—

శ్రుతులొకచోట 'ఏక మే వా ద్వితీయంబ్రహ్మ' బ్రహ్మమొక్కటియే రెండవది లేదు. అని చెప్పెను. మఱియొకచోట 'సర్వంఖల్విదంబ్రహ్మ' ఈ ప్రపంచ మంతయు బ్రహ్మమేయగును. మఱియు పృథివియం దెవ డున్నాఁడో తన యందుండు నెవనిని బృథివి తెలిసికొనలేదో యెవనికిఁ బృథివిశరీరమో, ఎవఁడు పృథివిని నియమించుచున్నాఁడో యనియు నీ ప్రకారమే ఆత్మయందెవఁ డున్నాఁడో యాత్మ తనయందుండు వానిని నెవనిని దెలిసికొనలేదో యెవనికాత్మ శరీరమో యెవఁడాత్మను నియమించుచున్నాఁడో వాఁడు బ్రహ్మమని అంతర్యామి బ్రాహ్మణము చెప్పెను. సర్వప్రపంచము బ్రహ్మమైనచో నచేతనములగు స్థూలశరీరములుకూడ బ్రహ్మమా?బ్రహ్మము చేతనుఁడుకదా? చేతనబ్రహ్మ మచేతన ప్రపంచ మెట్టులయ్యెనని వారి సందేహము. ఈ సందేహము పరిణవార్థమును స్వానుష్ఠానముచేఁ జూపినఁగాని చక్కఁబడదని మీఁదఁ జెప్పినట్లు వర్తించెను. దానినే వాల్మీకి సూచించెను. ఇప్పుడు పరత్వము బయలుపఱుపవలసిన కాలముకాదు.

శ్రీరాముఁడు లట్లుపోవుటచే ఋషులసందేహము లెట్లు తీఱె ననిన:--- సంతతము ఋషులు బ్రహ్మవిచారమందుండు వారు గనుక వీరి ముగ్గురిస్థితి వారికిఁ బ్రణవము జ్ఞప్తికిఁ దేకమానదు. ప్రణవమున మూఁ డక్షరములుండియు నేకాక్షర మని చెప్పఁ బడునట్లే ప్రకృతిపురుష విశిష్టుఁడయినను బ్రహ్మమున కవి శరీర మని చెప్పుటచే శరీరము శరీరియొక్కటిగా లెక్కింపఁబడునట్లు బ్రహ్మమొక్కఁడే యని వారు గ్రహించిరి. శ్రీరాముఁ డరణ్యావాసము చేసెననిన సీతాలక్ష్మణులతోడఁ జేసెద ననియేకదా యర్థము. ఆవుపోవుచున్న దనినఁ గొమ్ములు తోఁకపోవుచున్న వని చెప్పవలయునా? దేవదత్తుఁడు వచ్చెననిన దేహమువిడిచి వచ్చెనని యర్థమా?

వానిని గుఱించి ప్రత్యేకముగాఁ జెప్పవలసినప్పుడు వేఱువేఱుగాఁ జెప్పఁబడును. అట్టిపని లేనిచో విశిష్టవస్తువే చెప్పఁబడును. అట్టులే ప్రపంచ మంతయు భగవంతుఁ డన్నప్పుడు స్థూలముగ మనకు గోచరించు ప్రకృతిని దానికి జీవభూతుఁడై యుండు పురుషుని వీనిని శరీరముగాఁగల బ్రహ్మమును మూఁటిని నొక్కటిగ గ్రహింపవలెను. స్థూలశరీరము కానవచ్చుచున్నది. సూక్ష్మము (అంతర్యామి) మనకుఁ గానవచ్చుట లేదు. వ్యష్టిగా భేదదృష్టిచేఁజూచిన తత్త్వములు మూఁడుగాఁ జెప్పవలసియుండును. సమష్టిమీఁద నొక్క టనియే చెప్పవలయును. ఈ మూఁడేదశయందును వేఱువేఱు గావు. ఏది యేకాలమునం దేయవస్థయందును వేఱుపడక నిత్యముగ సత్యముగ నంటియుండునో యది యాపదార్థముగానే చెప్పుట లోకవ్యవహారానుసారమై యున్నది. ఎండను జెప్పునపుడు సూర్యుఁడులేనిదిగాను సూర్యుని జెప్పునపు డెండ లేనివానిఁగా గ్రహింపఁజాలము. మొదటి అకారస్వరమే స్థానభేదముచేఁ బ్రయత్న భేదముచే ఉకార మకారము లని మనకు స్పష్టముగాఁ దెలియునట్లే యిదియును గ్రహింపనగు.

మూఁడు వేఱువేఱనినను అనవచ్చును. ఒకటియే యనినను అనవచ్చును, జీవుఁడు కడతేఱుమార్గము లక్ష్మణచర్య కైంకర్యమువలన నేర్చుకొనవలెను ఇప్పుడు జీవుఁడగు లక్ష్మణునకు పరమాత్మయగు రామచంద్రమూర్తికి నడుమ సీత (ప్రకృతి) యున్నది. ఆమె తెఱయడ్డముదీసినఁగాని రాముఁడు లక్ష్మణునకుఁ గానరాఁడు. వారిరువురకు సేవచేసిననే యా యడ్డము తొలఁగిపోవును. ఇది వారియనుగ్రహమువలనఁ గావలసినదేకాని మన ప్రయత్నముచే సాధ్య మగునదికాదు, అని యీ విధముగ ఋషీశ్వరులు గ్రహించి తమ సందేహములు తీర్చికొనిరి. ఈ విషయమే యర్జునురథ (దేహ) మందున్న శ్రీకృష్ణమూర్తి (పరమాత్మ) యర్జునునకు (జీవునకు) స్పష్టముగ నుపదేశించెను. ఈ ప్రణవార్థము పరమార్థతత్త్వమున విపులముగఁ జూచునది.

మానిని. సారము లౌనవసారసకైరవ♦సౌరభవాసితభాసితకా
　　సారములుం దటినీతటసైకత♦సంచరదంచిత చక్రయుగీ

వారములన్ గిరిసుందరకందర♦పాతసుపూతఝరీలహరీ
పూరములున్ సుమమంజులకుంజక♦పుంజితగుంజదళీంద్రములున్. ౧౪౩

నవ=క్రొత్తగాబూచిన, సారస=తామరపూవులయొక్కయు, కైరవ=తెల్లకలువపూవులయొక్కయు, సౌరభ=వాసనచేత, వాసిత=వాసనగలదిగాఁ జేయఁబడిన, భాసిత=ప్రకాశింపఁజేయఁబడిన, కాసారములన్=కొలఁకులును, తటినీ=ఏళ్లయొక్క, తట=గట్లయందలి, సైకత=ఇసుకదిబ్బలందు, సంచరత్=తిరుగుచున్నవియు, అంచిత=ఒప్పిన, చక్రయుగీ=చక్రవాకలజంటలయొక్క, వారములన్=సమూహములును, గిరి=పర్వతముయొక్క, సుందర=అందమైన, కందర=గుహలయందు, పాత=పడుచున్న, సుపూత=మిగులఁబవిత్రములైన, ఝరీ=సెలయేళ్లయొక్క, లహరీ=పెద్దయలలుగల, పూరములన్=ప్రవాహములును, సుమ=పుష్పములచేత, మంజుల=మనోహరములగు, కుంజక=పొదలయందు, స్వార్థకప్రత్యయము, పుంజిత=గుంపుగాఁజేరిన, గుంజత్=అవ్యక్తముగా శబ్దించుచున్న, అళీంద్రములన్=గొప్పతుమ్మెదలయును.

మానినీవృత్తము - సప్తభగణములు - గురువు - ౧౩ వ యతి.

తాత్పర్యము.

సారవంతములై క్రొత్తగా వికసించిన కమలములయు కలువలయు పరిమళముల గుమాయింపుచేఁ బ్రకాశించు కొలఁకులును, నదీతీరమునందలి యిసుకదిబ్బలయందుఁ దిరుగు నందములైన చక్రివాకదంపతుల సమూహములును,కొండలయందలి సుందరములైన గుహలలోఁ బడుచున్న నీళ్లుగల పవిత్రములైన కొండవంకల ప్రవాహములును పూవులచే నందమయిన పొదలయందు గుంపులై ఝుంకారముచేయు తుమ్మెదలును,

కం. భీకరసూకరపృథుదర్వీకర కాసరకరాగ్ర♦విస్తృతహిమవ
చ్ఛీకరకరికేసరినిక, రాకరగహ్వరవితాన ♦ మాదటఁ గనుచున్. ౧౪౪

భీకర=భయముకలిగించు, సూకర=అడవిపందులయొక్కయు, పృథు=గొప్పవగు, దర్వీకర=పాములయొక్కయు, కాసర=అడవిదున్నలయొక్కయు, కర=తొండములయొక్క, అగ్ర=కొననుండి, విస్తృత=విరివిగాఁజేయఁబడిన, హిమవత్=చల్లని శీకర=నీటితుంపురులుగల, కరి=ఏనుఁగుయొక్కయు, కేసరి=సింహములయు, నికర=సమూహమునకు, ఆకర=స్థానమైన, గహ్వర=గుహలయొక్క, వితానము = సమూహము, ఆదటన్=ప్రేమతో, కనుచున్=చూచుచు.

తాత్పర్యము.

భయంకరములైన యడవిపందులయు, పెనుబాములయు, అడవిదున్నపోతులయు, తొండములకొనల ఫూత్కారములచే విస్తారముగాఁజేయఁబడిన చల్లనితుం

పురులు గల యేనుఁగులయు, సింహములయు, సమూహములకు స్థానములైన గుహల సమూహములను బ్రీతితోఁ జూచుచు.

తే. అట్లు చని చని దవ్వుగ ♦ నంబరంబు
లంబమానదివాకర♦బింబ మగుచు
డంబుమీఱఁగ నొక యోజ♦నంబు చదర
మింబు గూర్చెడి యొక తటా♦కంబు శుభము.　　౧౪౫

దవ్వుగన్=దూరముగ, అంబరంబు= ఆకాశము, లంబమాన= వ్రేలాడుచున్న దివాకరబింబము=సూర్యబింబముగలది, డంబు=కాంతి, చదరము= సమముగానుండు నది, ఇంబు = ఇంపు.

తాత్పర్యము

ఇవియన్నియుఁజూచుచు దూరము పోయిపోయి సాయంకాలమగుటచే వ్రేలాడు చున్నట్లు కానవచ్చు సూర్యబింబముచేఁ బ్రకాశించుచు నొక యోజనము సమముగానుండు నొక యందమగు తటాకంబును.

క. అలినీమలినీకృతమున్, నలినీదళనీరజాత♦నవ్యము ద్విజరా
డ్లలనాకలనాదితమున్, బలదానవదిభవితాన♦బాధితతటమున్.　　౧౪౬

అలినీ=ఆఁడుతుమ్మెదలచే, మలినీకృతమున్= నల్లగాఁజేయబడినదియు, నలినీ దళ=తామరాకులచేతను, నీరజాత=తామరపూవులచేతను, నవ్యము = మనోహరమైనది, ద్విజరాట్=మగహంసపక్షులచేతను, లలనా= ఆఁడుహంసలచేతను, కల = అవ్యక్తమధురముగా, నాదితము = ధ్వనికలదిగాఁ జేయబడినదియు, బలదానవత్ = బలము- మదపునీళ్లుగల, ఇభ=ఏనుఁగుల, వితాన=సమూహముచే, బాధిత = బాధ గలదిగాఁజేయఁబడిన, తటమున్ = ఒడ్డు.

తాత్పర్యము.

ఆఁడుతుమ్మెదలు గుంపులు గుంపులుగా మూసురుటచే నల్లగాఁ జేయఁబడి నదియు, తామరాకులచేతను, తామరపూవులచేతను మనోహరమైనదియు, హంసల దంపతుల యవ్యక్త మధురధ్వనులుగలదియు, బలసి మదించిన యేనుఁగులు పోరాడు టచే బాధింపఁబడిన మీఁదఁ జెప్పఁబడిన తటాకముయొక్క యొడ్డును.

ఈ వనతటాకవర్ణనము నారాయణశబ్దార్థమును సూచించుచున్నది. నారము= జలము, దానికి అయనము=స్థానము అయినవాఁడు నారాయణుఁడు, తటాకము నారాయణమేకదా. నరము = జీవకోటి, దానిసమూహము నారము, దానికయనమైన వాఁడు నారాయణుడు జీవకోటి ౧౪౪వ ప. మున చెప్పఁబడెను

క. కనిమనుజహీన మయ్యును, ఘనతతసంగీత జాత ♦ ఘనపూతరవం
బును నందు హృదయసమ్మద,జనకంబుగ నాలకించి ♦ సౌమిత్రియుఁ దాన్.　　౧౪౭

కని=చూచి, మనుజహీనము= మనుష్యశూన్యమైనది, ఘన = తాళములచే తను, ఇది మర్దలములోనగు వాని కుపలక్షణము. సంగీత = గానముచేతను, జాత =

పుట్టిన, ఘనపూత=మిగులఁ బవిత్రమయిన, రవంబును, అందు=ఆ తటాకమందు, హృదయసమ్మదజనకంబుగ=హృదయమునకు సంతోషము కలుగునట్లు, ఆలకించి=విని.

తా త్ప ర్య ము.

తటాకమును దానితీరమునుజూచి మనుష్యులు లేకయును కంచుతాళములయు వీణాదులయు మనోహరధ్వని విని రామచంద్రుఁడును లక్ష్మణుఁడును.

—♦ మాండకర్ణివృత్తాంతము ధర్మభృతుఁడు శ్రీరామునకుఁ దెల్పుట. ♦—

సీ. తమతోడఁ జనుదెంచు♦ధర్మభృతుం డను,మునివరుఁ గనుఁగొని ♦ యనఘశీల
యిది యేమి వింత మా♦కెదఁ గౌతుకం బయ్యె, దీనిచరిత్రంబుఁ♦ దెలియ వినఁగ
వక్తవ్యమేని గో♦ప్యంబునుగా దేని, జెప్పవే యేమి యీ♦చిత్ర మనిన
జానకీనాయకు♦సల్లాప మాలించి, సరసివృత్తాంతంబు ♦ సర్వమిట్లు

ఆ. తపసి చెప్పఁ దొడఁగె♦ధర్మాత్మ విన వయ్య, మాండకర్ణి యనెడి♦దండితపసి
గడునుఁదపము బలిమి ♦ గల్పించె దీనిని, సార్వకాలికంబు ♦ చారుతరము. ౧౪౯

అనఘశీల = పాపరహితమగు సదాచారముగలవాఁడా, కౌతుకము = కోరిక, వక్తవ్యము=చెప్పఁదగినది, గోప్యము=రహస్యము, చిత్రము=ఆశ్చర్యము, సరసి = సరస్సుయొక్క, సార్వకాలికంబు=సర్వకాలముండునది, ఎండిపోనిదని భావము.

తా త్ప ర్య ము.

తమతోవచ్చుచున్న ధర్మభృతుఁడను మునిని జూచి సదాచారసంపత్తిగలవాఁడా! యిదియేమి యాశ్చర్యము. మనుష్యులు లేకయు తాళములు మొదలగువానిధ్వని వినవచ్చుచున్నది. దీనివృత్తాంతము విన నాశయగుచున్నది. నీవు చెప్పఁదగినదియై రహస్యముగాకుండుటచే మేము వినఁదగునదియగునేని యీ చిత్రమేమో చెప్పుము. అనిన రామచంద్రుమాటలు విని యీ తటాకంబు చరిత్రమంతయు నాయన యిట్లు చెప్పఁ బ్రారంభించెను. ధర్మాత్ముఁడా! వినుము. ఇచట మాండకర్ణి యను గొప్పతపస్వి తనతపోబలముచే దీనిని గల్పించెను. ఇది వానలు లేకున్నను నెండిపోవునదికాదు. చూచుటకును మనోహరముగా నుండును.

క. పంచాప్సర మనఁబడు నిది, యంచిత మగు దీని జలము♦నం దాతఁ డహా
పంచేంద్రియనిస్పృహుఁ డొనరించెం బదివేలయేండ్లు ♦ దృఢమతిఁ దపమున్. ౧౫౦

పంచేంద్రియనిస్పృహుఁడు = పంచేంద్రియముల కోరికలులేనివాఁడు, ఆహారాదులు లేనివాఁడు.

తా త్ప ర్య ము.

ఈ తటాకముపేరు పంచాప్సరము. ఈ నీళ్లలోనుండి యతఁడాహారాదులైన నాశింపక పదివేలయేండ్లు గాఢమైన తపస్సు గావించెను.

ఉ. నీర సమీరభక్షుఁ డయి ♦ నిష్ఠురమైనతపంబు సేయునా
ధీరు సమీరమిత్రముఖ♦దేవత లెల్లరు గాంచి భీతు లై

తా రొకచోటఁ జేర్కొని ప◆దం బెది కోరెడినో యితం డదే
తీరున విఘ్నముం గొలుపఁ ◆ దెర్వగు నంచుఁ దలంచి వంచనన్. ౧౫౦

నీరసమీరభక్షుఁడు = జలము గాలి యాహారముగాఁగలవాఁడు, నిష్ఠురము = కఠినము, ధీరుఁ = దృఢమైన మనస్సుగలవానిని, సమీరమిత్రు= వాయుసఖుఁ డగ్ని, ముఖ = మొదలుగాఁగల, భీతులై =భయపడినవారై, వంచనన్ = మోసపుబుద్ధిచేత స్వర్గఫలముఁగోరి కర్మములు, యోగములు, యాగములు, త్యాగములు, ధర్మములు చేయువారు వారివారి పుణ్యాతిశయమున దేవత లగుదురు. ఈ పరీక్షలందుఁ గడతేఱినవారి కీయుద్యోగ మనునట్లు ఈ మాత్రము తపస్సు చేసినవాని కింద్రత్వము, ఇంత మాత్రముచేసినవానికిఁ జంద్రత్వము అను నేర్పాటుగలదు. ఆమాత్రముచేసిన వా రా యా పదవులం దుండుచుందురు. (నహుషుఁ డింద్రుఁడైనట్లు) ఆ కారణముచే మఱి యెవ్వరైన భూలోకమున గొప్ప తపస్సుచేసి స్వర్గమునకు వచ్చినఁ దమ పదవులకు హానికలుగు ననియుఁ దమ దేవభోగములకంటె వారు హెచ్చుభోగము లనుభవింతు రనియుఁ దలఁచి దేవత లసూయాపరులై వారితపస్సులు చెఱుప యత్నింతురు. ఒక దేశమునం దాదేశీయున కన్న నన్యదేశీయుఁడు గొప్పపదవికి వచ్చునన్నచో నచ్చటి వారి కసూయయుండునుగదా. అట్లులే దేవతలును. దేవతలు భక్తులను మాత్రము బాధింపరు. ఏల ? వారు తమపదవు లాశించువారుగారు. ఆ త్రోవకూడఁ ద్రొక్కరు. కావున దేవతలుకూడ సహాయముచేయుచు గౌరవింతురు.

తాత్పర్యము.

ఆ మాండకర్ణి జలము కొన్నాళ్ళు, ఆవల గాలి కొన్నాళ్లు, ఆహారముగాఁగొని కఠినతపస్సు గావించెను. దృఢచిత్తముతో నాయన చేయు తపస్సుచూచి తమ పదవులం దేదికోరునో తములో నెవ్వనికి స్థానభ్రంశము గలుగునోయని భయపడి యగ్ని మొదలగు దేవతలు గుంపుగా నొకచోటఁజేరి యే విధముగ వీనితపస్సు చెఱుపవచ్చు నని యాలోచించి వంచనచేసి యాయన కామమును జయింపనివాఁడగుటచే నామూలముగ నతని తపస్సుచెఱుప నాలోచించిరి.

కం. మెఱుఁగులతుఱఁగలి గిఱికొను, తెఱగన్నుల తెఱవపిండుఁ ◆ దెంపునఁ బంపన్
మిఱుమిట్లు గొలుపు తేజునఁ, బఱిగొని రాతపసిదిటముఁ ◆ బడఁతుక లేవుర్. ౧౫౧

మెఱుఁగుల=మెఱుపులయొక్క, తుఱఁగలి = కాంతి, గిఱికొను = వ్యాపింపఁ జేయు, తెఱఁగన్నుల= దేవతల, తెఱపికన్ను= తెఱగన్ను, కన్నులు తెఱచుకొనియే యుందురుగాని ఱెప్పలు మూఁతలుపడనివారు, అనిమేషులు, తెఱవపిండున్ = స్త్రీల సమూహమును (తెఱ+వాయి = తెఱవ) తెంపునన్ = శీఘ్రముగ, మిఱుమిట్లు = దృష్టిచెదరఁజేయు, తేజునన్=కాంతిచే, ఏవురుపడఁతుకలు=ఐదుగురు స్త్రీలు, దిటము= ధైర్యము, పఱిగొనిరి = కొల్లపెట్టిరి - అపహరించిరి.

తాత్పర్యము.

దేవతలాలోచించి యాయనయందు గామముండుట తెలిసి యా మూలమున నాయనను జెఱుపదలచి యైదుగురు అప్సరసలఁ బంపిరి. వారు మెఱుపుఁదీఁగల వంటి దేహములతోఁ దమదేహకాంతు లాయనదృష్టులను మిఱుమిట్లు గొలుపుచుండ వచ్చి యాయన ధైర్యమును జెఱిచి వశపఱుచుకొనిరి.

కం. దృష్టపరావరుఁ డగు నా, శిష్టవరుఁడు సురలు కార్య♦సిద్ధిం గన నా
కృష్టగుణుఁడైన మరుశర, వృష్టికి నచ్చరలదృష్టి ♦ కెంతయు వఁగెన్. ౧౫౨

దృష్టపరావరుఁడు = దృష్ట + పర + అవరుఁడు = సాక్షాత్కరింపఁబడిన పరమాత్మయు, అవరుఁడు=జీవాత్మయుఁగలవాఁడు, శిష్టవరుఁడు = శిష్టులలో శ్రేష్ఠుఁడు - అగు నాఋషి, ఆకృష్టగుణుఁడు = లాగఁబడిన యల్లెత్రాడుగలవాఁడు, అగు మరు = మన్మథుని, శరవృష్టికిన్ = బాణవర్షమునకు, ఎంతయున్ = మిక్కిలి.

తాత్పర్యము.

శిష్టులలో శ్రేష్ఠు డగు నా ఋషి, ఆత్మసాక్షాత్కారము భగవత్సాక్షాత్కారము కలవాఁడయ్యుఁ గామమును జయింపనికారణమున దేవతలకార్యము ఫలించునట్లు మన్మథుని బాణములవర్షమునకు నప్సరసల దృష్టిపాతములకు గడగడ వడఁకెను.

కం. చేరినవారల దారల, గారామునఁ జేసి లోనఁ ♦ గల్పించి గృహం
బా రామలతో నీకా,సారమున రమించు యోగ♦సారము పేర్మిన్. ౧౫౩

రామలతో = స్త్రీలతో, కాసారమునన్ = సరస్సునందు, యోగసారము = యోగబలము, పేర్మిన్ = అతిశయముచే.

తాత్పర్యము.

తన్ను సమీపించిన యా స్త్రీలను దనభార్యలుగాఁ జేసికొని యానీటిలో నొక గృహము నిర్మించి యాస్త్రీలతోఁ దనయోగ బలముచేఁ గ్రీడించుచున్నాఁడు.

ఎంతయోగము సాధించినవారైనను భక్తిశూన్యులైనచోఁ గామరోషములకు వశపడి చెడుదురని దీనివలనఁ దెలియనగు.

చం. యమనియమాది యోగముల నాత్మనియంత్రితమయ్యుఁ గామరోషములఁ
బ్రచోదితంబ యగు శాంతివహింపదు విష్ణుభక్తిచేఁ గ్రమమున శాంతిగైకొనిన
కైవడి॥ భాగ.

భగవంతునకు ఫలసమర్పణముచేసి 'నమః' అననివాఁ డిట్లు భ్రష్టుఁడగును. న + మః నాకుఁగాదు. భగవంతునకే యని ఫలము సమర్పింపవలెను. అటుచేయని వాఁడు ఫలానుభవముపాలై యిట్లు చెడును. ఆయోగబలము కొన్నిదినాలకు నమసి పోఁగా నావల దేనికిఁ గొఱగాఁడుకదా.

కం. పావనయౌవనమున సం,భావన దేవనవిశేష♦పరుఁడై ముని నా
నావనజాక్షులతోడ మ,హావనమున నుండు నాద ♦ మదియ మహాత్మా. ౧౫౪

పావనయౌవనమునన్=నిర్మలమైన యౌవనముచే ననఁగాఁ గోడె వయస్సని యర్థము. దానియొక్క సంభావనన్=కూడికచే, దేవన=క్రీడలయందు, విశేష పరుఁడై=విశేష ప్రీతిగలవాఁడై క్రీడాయామపి దేవన మ్మని నానా॥ ర॥ వనజాక్షుల తోడన్=కమలములవంటి కన్నులుగల స్త్రీలతో, మహోత్సవమునన్=మిగుల నానంద ముతో, నాదము=ధ్వని.

తాత్పర్యము.

మహాత్మా! రామచంద్రా! యిది నడిమివయస్సు గలవాఁడై క్రీడాసక్తుఁడైన మునీశ్వరుఁ డా స్త్రీలతో సంతోషముతో నుండు చప్పుడు.

క. పాటలగంధుల యింపగు, నాటలరవళియును భూష♦ణాళీరవముల్
పాటల నినదము లీ గతి, వాటంబుగ వినఁబడున్ ది♦వాకరతేజా. ౧౫౫

పాటలగంధుల=స్త్రీలయొక్క, రవళి=ధ్వని, భూషణాళీరవముల్=సొమ్ముల సమూహముల ధ్వనులు, నినదము = ధ్వని, దివాకరతేజా = సూర్యుని కాంతి గలవాఁడా.

తాత్పర్యము.

సూర్యతేజా! యా స్త్రీల యాటలయు పాటలయు భూషణములయు ధ్వని యిట్లు చక్కఁగ వినఁబడు చుండును. కిష్కింధాకాండము ౩౬౧-పద్యమందు రామ లక్ష్మణులు సప్తజనాఖ్యులు ఋషు లుండి పోయిన స్థలమునకును నమస్కరించిరి గాని యిచట మాండకర్ణికి నమస్కరించిన వారు గారు. దీనిచేఁ గామవశులైన యోగులు సన్న్యాసులు నమస్కారార్హులు గారని తెలియవలయును.

చ. అనవుడు నీరజేక్షణుఁడు ♦ నబ్బుర మందుచుఁ దోడఁ దమ్ముఁడున్
జనకజ రాఁగఁ జీరకుశ♦సంవృతమున్ బహువిప్రపూర్ణమున్
గనుఁగొని యాశ్రమంబు ఋషి♦కాండసమర్చితుఁడై యటే మఱిన్
జనిన తలంబె చొచ్చుచు ది♦నంబులు పుచ్చె శరాసపాణియై. ౧౫౬

అనవుఁడు=అని చెప్పఁగా, అబ్బురము=ఆశ్చర్యము, చీరకుశ సంవృతమున్=చీరల చేతను దర్భలచేతను కూడినది. బహువిప్రపూర్ణమున్=అనేక బ్రాహ్మణులతో నిండి నది, ఋషికాండ = ఋషుల సమూహముచే, సమర్చితుఁడై=చక్కఁగఁ బూజింపఁ బడినవాఁడై, శరాసపాణియై=విల్లు కేల ధరించినవాఁడై.

తాత్పర్యము.

ఆ ముని యీ ప్రకారము చెప్పఁగా, శ్రీరామచంద్రమూర్తి విని యాశ్చర్య పడి తమ్ముఁడు భార్య కూడ రాఁగా, జెట్లయం దారవేయఁ బడిన నారచీరలతోను దర్భలతోను గూడినదై బ్రాహ్మణ సమూహముచే నిండినదైన యాశ్రమముఁ జూచి వా రందఱు తన్నుఁ జక్కఁగఁ బూజింపఁగా నా ప్రకారమే మఱికొన్ని యాశ్రమ ములకుఁ బోయిన చోటికే పోవుచు వారికి రాక్షసబాధ లేకుండుటకై విల్లు ధరించి యాశ్రమంబులందు సంచరించెను.

ఈ కాలమందు రామలక్ష్మణులు ఆశ్రమములం గావలికాచి తిరిగిరి. ఈ ప్రకారము చేయుచో నుత్తరమునుండి దక్షిణమునకుం బోయి మరలి యుత్తరముగను అట్లులే తూర్పునుండి పడమర, పడమరనుండి తూర్పు రాకపోకలు చేయుచుండిన కారణమునం బోయిన యాశ్రమమునకే మరలం బోవలసిన ట్లేర్పడెను. అదియును గాక రాక్షసబాధ యెక్కువగా నున్నచోటం బెక్కునాళ్లును, వారి బాధ విశేషము లేనిచోటం గొలంది దినము లుండిరి. ఈ సమయమందే మారీచుండు తన స్నేహితుల తోడం బోయి చావు తప్పించుకొని పరువెత్తినది. చూ. పద్యము ౬౧౭

సీ. ఒకచోట బదుమూండు ♦ నొక్కచోం బదిరెండు
    నొక్కెడ నాలు గిం♦కొక్కకడను
నైదును నాఱును ♦ నాఱు నొక్కటి యొక
    పాతి కెక్కువగ ము♦ప్పాతికగను
మూండు నెన్మిది మాస♦ములు రాముం డతిసుఖ
    మారంగాం గడపె నా♦యాయిచోట
నా ప్రకారంబు ఋ♦ష్యాశ్రమంబులయందు
    జరిపెను బదియేండ్లు ♦ చాపగురుండు.
తే. మరల నల్లసుతీక్ష్ణాశ్ర♦మంబునకును
    వచ్చి యచ్చోట నా మునివరుండు వేడం
    గొంతకాలంబు వసియించె ♦ నంత నొక్క
    నాండు రఘువీరుం డామున♦నాథుతోడ. ౧౫౭

ఒక పాతి కెక్కువగ=౧ ¼ ఒకటియు మీందం బాతిక నెలయని యర్థము. అనంగా నైదు వారములు. ఒకచోట ముప్పాతిక=మూండు వారములు. ఇందుం జెప్పంబడిన మాసములు ౧౩-౧౨-౪-౫-౬-౭-౧¼-¾-౮ కలిపిన ౬౦ యగుచున్నవి. అనంగా ౫ సంవత్సరము లగుచున్నవి. కొందఱు చిత్రకూటమున ౫ సంవత్సరము లున్నట్లు వ్రాసియున్నారు. అది సరియని తోంపదు. ఈ యాశ్రమవాస కాలమే ౧౦ సంవత్సరము లని తోంచుచున్నది. ఏలన "ఋష్యాశ్రమములందు జరపెను బదియేండ్లు" అనునది ౧౦ ఆశ్రమములందు అయిదు సంవత్సరములు జరపెననియు నంతకు మించి దండకయం దాశ్రమములు లేవనియుం జెప్పుటయు సరిగాం దోంపదు. విషయము ప్రత్యేకముగం జర్చింపం బడును.

## తాత్పర్యము.

ఒకచోటం బదమూండు ఒకచోటం బండ్రెండు. ఒకచోట నాలుగు మఱి యొకచోట నైదు మఱియొకచోట నాఱు మఱియొకచోట నేడు, ఒకచోట నొకటిం బాతిక, ఒకచోట ముప్పాతిక, ఒకచోట మూండు ఒకచోట నెనిమిది నెలలు ఈ ప్రకారము రామచంద్రమూర్తి పదిసంవత్సరము లాశ్రమములందుం గడపెను. ఇట్లు

జరపి మరల సుతీక్ష్ణాశ్రమమునకు వచ్చి యచ్చట సుతీక్ష్ణుకోరిక మేరకుఁ గొంతకాల ముండెను. ఇట్లుండు సమయమున శ్రీరామచంద్రమూర్తి మునీశ్వరుతో నిట్లనియె.

—♦ శ్రీరాముఁ డగస్త్యాశ్రమంబునకుఁ బోవ సుతీక్ష్ణునిచే ననుజ్ఞ గొనుట. ♦—

ఉ. ఈ వనమం దగస్త్యుఁడు ము♦నీశ్వరుఁ డుండెడినంచు నిత్యము౯
నే వినుచున్న వాఁడను ము♦నిప్రవరా స్థల మే నెఱుంగ స
ద్భావుని యమ్మునీశ్వరుప♦దంబులఁ గొల్వఁగ గోర్కి పుట్టె సీ
తావరజాన్వితంబుగఁ, ద♦దాశ్రమమార్గ మెఱుంగఁ బల్కవే. ౧౫౭

సద్భావుని = మంచి మనస్సుగల, అమ్మునీశ్వరు = ఆయగస్త్యునియొక్క, సీతాఽవరజాన్వితంబుగ౯ = సీతతోను, దమ్మునితోను, తదాశ్రమ మార్గము = ఆ యగస్త్యుని యాశ్రమమునకుఁ బోవు త్రోవ.

తాత్పర్యము.

మునీంద్రా! ఈ వనమందే యగస్త్యమునీశ్వరుఁ డున్నవాఁ డని ప్రతిదిన మందఱు చెప్పుకొనఁగా వినుచున్నాను గాని యాయన యుండు ప్రదేశము నే నెఱుంగను. నేను నా భార్యతోను లక్ష్మణునితోను ఆయనను దర్శింపఁగోరిక గలదు. అచ్చటికిఁ బోవు మార్గ మేదియో తెలుపఁగోరెదను.

కం. నావుడు సుతీక్ష్ణుఁ డిట్లను, నీ విషయము నేన చెప్ప♦నెంచెదులోన౯
నీవే ప్రస్తావించితి, భూవర! సంతోష మయ్యెఁ ♦ బొమ్మచ్చటికి౯. ౧౫౮

నావుడు = అని చెప్పఁగా.

తాత్పర్యము.

అని శ్రీరామచంద్రమూర్తియడుగఁగా సుతీక్ష్ణుఁడు నేనే నీ కీ విషయము చెప్ప దలఁచియుంటిని. నీవే యడిగితివి. రాజా! సంతోషమయ్యెను. నీవచ్చటికిఁ బొమ్ము.

చం. ఇట నొకనాల్గుయోజనము ♦ లేగితి వేనియు దక్షిణంబుగా
నట నొకరావితోఁపు గల ♦ దందు మిళిందకబృందసుందర
స్ఫుటదరవిందతుందిలవి♦శుద్ధజలాశయముల్ ఫలావళీ
విటపమనోహరోరుపృథి♦వీరుహముల్ జలపక్షిసంఘముల్. ౧౬౦

మిళిందక=తుమ్మెదల, బృంద=సమూహముచే, సుందర=అందమై, స్ఫుటత్= వికసించిన, అరవింద = కమలములచే, తుందిల = నిండిన, విశుద్ధ=నిర్మలమైన జలాశయముల్=మడుఁగులు, ఫలావళీ = పండ్లగుంపులచేతను, విటప = చిగుళ్లు మొదలగు వానిచే నిండిన కొమ్మలచే, మనోహర=ఇంపైన, ఉరు=పెద్ద, పృథివీరుహముల్= చెట్లు, జలపక్షిసంఘముల్=నీటిపక్షుల గుంపులు.

తాత్పర్యము.

ఇచటికి దక్షిణముగా నాలుగు యోజనములు పొమ్ము. అచట నొక రావి తోఁపుగలదు. అందుఁ దుమ్మెదల గుంపులచే నందమై వికసించుచున్న కమలములచే

నిండిన నిర్మలోదకములు గల మడుఁగులు పండ్లచేతను చిగుళ్లచేతను నిండిన కొమ్మలచే పెద్దచెట్లు, నీటి పక్షుల గుంపులు కలవు.

చం. కల వదియే రఘూత్తమ య♦గస్తిసహోదరునాశ్రమం బటన్
నిలువుము రేయి, వేగినను ♦ నీ వటపైఁ జను దక్షిణంబుగా
నల వనపాళిపార్శ్వమున ♦ నామడ యొక్కఁడు పోవ నం దగ
స్త్యులపరమాశ్రమస్థలిని ♦ జూచెదు కన్నులపండువై తగన్. ౧౬౧

అగస్తి=అగస్త్యుని, అగస్త్యునకు అగస్తియనియుఁ బేరుగలదు. 'దీని నగస్తినా బరఁగు' అని భారతప్రయోగముగలదు. వేగినను=ఉదయముకాఁగా, వనపాళిపార్శ్వమునన్=తోఁపులగుంపుల ప్రక్కఁగా, అనఁగాఁ జెట్లులేనిచోట, అగస్త్యుల=పూజ్యతయందు బహువచనము.

తాత్పర్యము.

అదియే యగస్త్యుని సోదరుఁడగు సుదర్శనమునియుండు నాశ్రమము, రాత్రి కందు నిలువుము. ఉదయముకాఁగా బయలుదేఱి దక్షిణముగాఁ దోఁపులప్రక్క చెట్లు లేనిచోట నొక యామడపొమ్ము. అందు అగస్త్యుని గొప్ప యాశ్రమమును కన్నులపండువుగాఁ జూడఁగలవు.

కం. బహుపాదపసంవృతమై, మహితంబై వనతలంబు ♦ మానగుచుండున్
మహికన్యామణిలక్ష్మణ, సహితముగ రమింప నీకుఁ ♦ జను సౌఖ్యముగన్. ౧౬౨

బహుపాదపసంవృతమై=అనేక వృక్షములతోఁగూడినదై. మహితంబై = గొప్పదై.

తాత్పర్యము.

అనేక వృక్షములతోఁగూడినదై గొప్పదియగు వనప్రదేశ మందమై కానవచ్చును. సీతాలక్ష్మణులతో నీవందు సుఖముగఁ గ్రీడింపవచ్చును.

కం. యతిహిత! నీ వతనిం గన, మతిగల్గినయేని యిపుడ ♦ మంచిది చనఁగా
జతనం బొనరింపు మనన్, క్షితిపతితనయుండు మౌని ♦ సెలవుం గొనుచున్. ౧౬౩

యతిహిత=యోగులకు మేలుచేయువాఁడా! జతనము=యత్నము, సెలవు=ఆజ్ఞ.

తాత్పర్యము.

యోగిప్రియా! నీ వగస్త్యుని జూడ మనస్సు గలదేని యిది మంచి సమయము. ప్రయాణయత్నము చేయుము అని చెప్పఁగా నాయన యాజ్ఞ తీసికొని రామచంద్రమూర్తి.

తరలము. ముని వచించిన త్రోవచొప్పున ♦ మువ్వురున్ వనిఁ బోవుచున్
గనిరి త్రోవల క్రేవలన్ ఘన♦కంధరాకృతబంధురం
బును ధరప్రచయంబునున్ సుమ♦పూర్ణరమ్యవనంబులన్
గొనబుమీఱిన వంకలం దమి ♦ గూర్చు మేలికొలంకులన్. ౧౬౪

వనిన్=అడవియందు, క్రేవలన్=ప్రక్కల, ఘన=గొప్పదియగు, కంధరాకృతిన్=మేఘమువలె, బంధురము = విస్తారమైనది, ధర ప్రచయంబునున్ = కొండల గుంపును, సుమపూర్ణరమ్యవనంబులన్ = పూలచేనిండి మనోహరమైన వనములను, గొనబుమీఱిన=అందముచే నతిశయించిన.

తరలము - న భ ర స జ జ గ - గణములు. పండ్రెండింట యతి.

తాత్పర్యము.

సుతీక్ష్ణమహాముని చెప్పిన త్రోవపట్టుకొని యడవియందు ముువ్వరు బయలుదేఱిపోవుచు మార్గముల ప్రక్కల కారుమబ్బువలె విస్తారమైనది యగు కొండలగుంపును పూలచేనిండిన మనోహరమయిన వనములను అందమైన వంకలను సంతోషము గలిగించు సరస్సులను జూచిరి.

చం. అవి గని రాఘవుండు హృదయంబు ముదంబునఁ బల్లవింపఁగా
నవరజుతోడ నిట్లనియె నన్న యగస్త్యునితమ్ము నాశ్రమం
బవు నిది నిక్కమౌ మనకు నమ్ముని చెప్పిన చిహ్నలన్నియున్
సవురుగ నున్న వీ వనిని జారుతరంబు ముదాకరంబునై.		౧౬౫

పల్లవింపఁగాన్=చిగిరింపఁగా, వికాసమునొందఁగా, అవరజుతోడన్ = తమ్మునితో, చిహ్నలు =గుఱుతులు, చిహ్నలు చిహ్నములని రెండు రూపములుగలవు. ఇది చరిత్రాదులందుఁ బఠితము.

ముత్ + ఆకరము=సంతోషమునకు స్థానము.

తాత్పర్యము.

ఇవన్నియుఁ జూచి రామచంద్రుఁడు మనస్సు సంతోషముచే వికాసము నొందఁగా లక్ష్మణునితో నిట్లనియె. లక్ష్మణా! మనకు సుతీక్ష్ణుఁడు చెప్పినగుర్తులిందుఁ గానవచ్చుచున్నవి. అగస్త్యసోదరు నాశ్రమము నిజముగా నిదియే, మనోహరమై సంతోషకరమై యున్నది. దీనిని జూడుము.

సీ. ఫలపుష్పకుట్మలభారావనతములై, తరులు గంటివె నేలఁ దాఁకు చుంటఁ
బరిపక్వపిప్పలి ఫలముల నొగరైన, గంధంబుఁ గొని వచ్చె గంధవహుఁడు
యచ్చట నచ్చట వ్రచ్చినకట్టెల, ప్రోవులు పడియున్న పొలుపుఁ గంటె
వైదూర్యకాంతులు వఱలికోయఁగఁబడ్డ, దర్భల నదె చూఁడు ధరణిమీఁద
తే. నీలమేఘాగ్రనిభమయి నెఱివహించు, పావకామలధూమాగ్ర పటలిఁగంటె
యదె వివర్తంపు రేవులయందు ద్విజులు, స్నానార్చితామలపుష్పోపహార మిడిరి.

ఫలపుష్పకుట్మలభారావనతములై = పండ్లయొక్కయు, పూలయొక్కయు మొగ్గలయొక్కయు, భార=బరువుచే, అవనతములై =వంగినవై, తరులు=చెట్లు, పరిపక్వ=మిగులఁబండిన, పిప్పలిఫల=రావిపండ్లయొక్క, గంధవహుఁడు = గాలి, వ్రచ్చిన = చీల్చిన, ప్రోవులు=రాసులు, వైదూర్యకాంతులు=వైడూర్యమణులయొక్క కాంతులు,

నీలమేఘ=నల్లనిమబ్బుయొక్క, అగ్రనిభమయి=కొనతోసమానమై, పావక=అగ్నిహోత్రుని, అమల = నిర్మలమైన, ధూమాగ్ర = పొగకొనలయొక్క, పటల=సమూహము, దూరమునుండి చూచుటచే చెట్లకుఁబైఁగఁ బొగకొనలు తెలియుచున్నవని భావము. వివిక్తంపు=జనుల సందడిలేని, ద్విజులు=బ్రాహ్మణులు, స్వార్జిత=తామైసంపాదించిన, ఇతరులిచ్చిన పూలుపయోగించినయెడల సగము ఫల మవి యిచ్చినవారికిఁబోవును. అమల=పరిశుద్ధములైన, పురుగులులేక వాడినవిగాక చేతితోను వస్త్రముతోను దెచ్చినవిగాక యని భావము. ఇట్టివి దేవపూజకుఁ బనికిరావు. పుష్పోపహారము=పూలకానుక, అనఁగాఁ బూలతో బలి యని యర్థము.

ఈ విషయమున నీశ్లోకము లనుసంధింపఁదగును.

సమిత్పుష్ప కుశాదీని, శ్రోత్రియః స్వయ మాహరేత్
శూద్రానీతైః క్రియక్రీతైః కర్మ కుర్వన్ పతత్యధః॥ సంవర్తుఁడు.

సమిధలు - పుష్పములు- దర్భలు- వీనిని బ్రాహ్మణుఁడు తానే తెచ్చుకోవలెను. శూద్రులు తెచ్చినవానితో, వెలయిచ్చి కొనినవానితోఁ గర్మముచేయువాఁ డధోగతుఁడగును.

త్యాజ్యం పర్యుషితం జంతుదూషితం పాదలంఘితమ్
మ్లానం స్పృష్టం తథాఽస్పృశ్యైః నీతంచ ప్రతిలోమజైః॥

దినముమీరినపూలు, పురుగులుగలవి, కాళ్ళతో దాఁటినవి, వాడినవి, అస్పృశ్యులు స్పృశించినవి ఎక్కువజాతి స్త్రీలయందుఁ దక్కువజాతి పురుషులకుఁ బుట్టినవారు తెచ్చినవి త్యాజ్యము.

తులసీమాహాత్మ్యమందు,

ఉత్తమం స్వార్జితం పుష్పం, మధ్యమం వన్య ముచ్యతే
అధమంతు క్రయక్రీతం, పారక్యం త్వధమాధమమ్॥
హస్తానీతం పటానీతం, స్వయం పతితమేవవా
దేవారామోద్భవం పుష్పం, గృహదేవాయ నార్చయేత్॥

తాను సంపాదించిన పుష్పములు శ్రేష్ఠములు. అడవులందు బుట్టినది మధ్యమము, వెలయిచ్చికొన్నది యధమము, పరులు తెచ్చి యిచ్చినది యధమాధమము చేతితోఁ దెచ్చినవి గుడ్డలో వేసికొని తెచ్చినవి, నేలఁ దమంతట రాలినవి, దేవోద్యానములందుఁ బుట్టినవి యగు పుష్పములను గృహదేవార్చనమం దుపయోగింపరాదు.

అశ్వమేధమందు,

అర్కపుష్పాణి చాన్యాని, అర్కపత్ర స్థితానిచ
నిర్గంధానిచ పుష్పాణి, సర్వాణ్యేతాని వర్జయేత్॥

జిల్లేడుపూలు - జిల్లేడాకులలోఁ దెచ్చినపూలు, వాసనలేనిపూలు ఇవన్నియు దేవపూజయందుఁ ద్యాజ్యములు.

నగృహే కరవీరోత్థైః కుసుమై రర్చనం హితమ్
విశేషత స్సకామస్య, సిద్ధిభూతియుతస్య చ॥

ఇంటియందు ముఖ్యముగ సకాముఁడు సిద్ధిసంపదగలవాఁడు గన్నేరుపూలఁ బూజింపరాదు.

స్కాందమున,

స్త్రీభిర్వా యదివా శూద్రై రానీతై స్తులసీదళైః
యేఽర్చంతి నరా విష్ణుం, తేవై నిరయగామినః॥

స్త్రీలచేఁగాని శూద్రులచేఁగాని తేఁబడిన తులసీదళములచే నెవఁడు విష్ణువును బూజించునో వాఁడు నరకము పాలగును.

తా త్ప ర్య ము.

లక్ష్మణా! చూడుము. పండ్లు పూలు మొగ్గలు-వీనిబరువుచేఁ జెట్లకొమ్మలు నేల జేరాడుచున్నవి. పండినరావిపండ్ల యొగరువాసనను వాయుదేవుఁడు తెచ్చుచున్నాఁడు. అందందు నగ్నిహోత్రమునకై చీల్చి వేయఁబడిన కట్టెలరాసులు పడియున్నవి. వైడూర్య కాంతులుగలిగి కోయఁబడిన దర్భలు నేలమీఁదఁబడియున్నవి. నల్లని మేఘము కొనవలె నగ్నిహోత్రుని పొగకొనలు కానవచ్చుచున్నవి. జనులులేని రేవులందుఁ దాము సంపాదించిన పుష్పములను బ్రాహ్మణులు బలిగా నుంచినారు.

తే. మనము వినిన యగస్త్యుని♦యనుజునాశ్ర,మంబ యిదెపో యెవండులో♦కంబుమేలు
పడఁగ నసురుల వధియించి ♦ ప్రజలఁ జేర్చె, దక్షిణంబున నతనికిఁ ♦ దమ్ముఁ డితఁడు.

ఇదెపో=నిశ్చయముగా నిదియే, పో నిశ్చయార్థమును దెలుపును.

తా త్ప ర్య ము .

అగస్త్యుని తమ్ముని యాశ్రమ మని దేనిని వింటిమో యది నిశ్చయముగా నిదియే. ఇందున్న సుదర్శనుఁడు లోకము మేలునిమిత్తమై యెవఁడు రాక్షసులవధించి ప్రజలు దక్షిణమున నుండఁజేసెనో యతని తమ్ముఁడు.

—♦ శ్రీరాముఁడు లక్ష్మణునకు వాతాపీల్వలులచరిత్రఁ జెప్పుట. ♦—

క. వాతాపీల్వలు లనియెడి,భ్రాతలు బ్రహ్మఘ్ను లిచటఁ ♦ బ్రబలిరి దేవా
రాతులు మున్నొకప్పుడు, జాతిధరామరులరూప♦సంపద వెలయన్.　　౧౬.౫

బ్రహ్మఘ్నులు= బ్రాహ్మణులఁజంపువారు, దేవారాతులు=దేవతలకు విరోధులు, రాక్షసులు, జాతిధరామరుల=పుట్టువుచే బ్రాహ్మణులగువారి, రూపసంపద = ఆకార లక్ష్మి.

## తాత్పర్యము.

పూర్వమొకప్పుడు వాతాపి ఇల్వలుఁడను సోదరులు బ్రాహ్మణవేషములు ధరించి బ్రాహ్మణులను జంపుచుండిరి.

ఉ. శ్రాద్ధము నేఁడు రండు ద్విజ♦సత్తములార యటంచు నెంతయున్
శ్రద్ధ నటించి సంస్కృతము♦నం బిలుచున్ గృహమందు సర్వమున్
సిద్ధమటంచు మేషముగఁ ♦ జేసి నిజానుజుఁ ద్రుంచి యిల్వలుం
డద్ధరణీసుపర్వులకు ♦ నా పలలంబె భుజింపఁ బెట్టుచున్. ౧౬౯

వారేవిధముగ బ్రాహ్మణులను జంపుచుండిరో యది యిందు వివరింపఁబడును.

శ్రాద్ధము = పితృకార్యము, శ్రద్ధతోఁ జేయఁబడినది శ్రాద్ధము. అనఁగాఁ బైతృకకర్మమున శ్రద్ధప్రధానము, అదిలేకుండిన నది నిష్ఫలము. ద్విజసత్తములార= బ్రాహ్మణశ్రేష్ఠులారా! నటించి= శ్రద్ధలేకున్నను నున్నవారివలె వర్తించి, సంస్కృతభాషయందు, దీనివలన బ్రాహ్మణులు సంస్కృతముననే మాటలాడుచుండిరనియు వీఁడు సంస్కృతము మాటలాడుటచే వీరు నిజమైన బ్రాహ్మణులని వారు మోసపోవఁ గారణము కలిగెననియు నెఱుంగునది. ఇది తీర్థీయవ్యాఖ్యానుసారము. గోవిందరాజీయమున 'వ్యాకరణ సంస్కారవతీం వాచం' అని కలదు. అప్పుడు వ్యాకరణదోషము లేక మాటలాడఁబడిన తెనుఁగు అఱవముకూడ సంస్కృతమే కాఁగలదు. అవి మాటలాడిన మునులు మోసపోదురా?

## తాత్పర్యము.

ఇల్వలుఁడనువాఁడు బ్రాహ్మణవేషము వేసికొని బ్రాహ్మణులయొద్దకుఁబోయి యీదినము మాయింట శ్రాద్ధము, మీరు నిమంత్రణమునకు రండని సంస్కృతముతోఁ బిలుతురు. సంస్కృతమునఁ బిలిచిన కారణముచే వాఁడు నిజమైన బ్రాహ్మణుఁడని వారు మోసపోయి యంగీకరించుచుండిరి. వాఁడు తనతమ్ముని మేకగాఁజేసి చంపి వండి యా మాంసము బ్రాహ్మణులకుఁ బెట్టుచుండెను.

పూర్వకాలమున శ్రాద్ధాదులందు బ్రాహ్మణులు మాంసము భుజించుచుండిరి. దానియందలి చెడుగుణమును ఇటువంటి మోసమును దెలిసికొని దానిని నిషేధించిరి.

ఇట్టులే సారాయమువలని దోషమెఱిఁగి శుక్రాచార్యులు సారాయము త్రాగుట నిషేధించెను.

దేవతార్థమని యెంత సమాధానము చెప్పినను ఆత్మార్థమనుభావము వీనియందు నిశ్శేషముగ సమయదు. ఆత్మార్థమనుభావము లవముండినను హింసాదోషము తప్పదు. కావున మాంసభక్షణము మానుటే యెవరికైన శ్రేయస్కరము. తమోగుణభూయిష్ఠులు భుజింపవచ్చును. ఇంకను గొన్ని జన్మములు క్రూరమృగములవలె నుండవచ్చును. క్షుద్రశక్తులకుఁ దప్పఁ దక్కిన దేవతలకు మాంసము నివేదింపరాదు. శక్తులకైనను మాంసము నిషేధించుటే శ్రేయస్కరము.

తే. కుడిచి కూర్చుండి విప్రులు ♦ దమపుకొనెడి, ధరణిసురులను గాంచి వా♦తాపిరమ్మ
టంచుఁ బిలుచును వాతాపి ♦ యంతలోన, వారిపొట్టలు వ్రచ్చి తా♦వచ్చు వెలికి.

కుడిచి=తిని, ధరణిసురులను=బ్రాహ్మణులను.

తా త్ప ర్య ము.

వారు నోరారఁ దిని పొట్టలు తడుపుకొనుచుఁ గూర్చుండఁగానే యిల్వలుఁడు వాతాపీ! రమ్ము, అని పిలుచును. వాఁడు పిలువఁగానే మాంసరూపమున వారి కడుపులోనున్న వాతాపి వారిపొట్టలు పగులఁజీల్చుకొని వెలికివచ్చును. ఆ బ్రాహ్మణులు చచ్చిపడుదురు. వారిని వారిరువురు పీఁకితిందురు. శుక్రునికడుపులోని కచుని వలె వాతాపి సంజీవని విద్యచే మరల బ్రతికెనని యూహింపవలయును.

కం. ఈ విధముగఁ గ్రవ్యాదుల,చే వేలకొలంది విప్ర♦శేఖరు లెల్లన్
జావుం గూరి రగస్త్యుఁడు, దేవత లర్థింప వారిఁ దీర్చెన్ మహిమన్. ౧౭౧

క్రవ్యాదులచే=రాక్షసులచే, (క్రవ్య+ఆదులు=మాంసముఁ దినువారు), అర్థింపన్=కోరఁగా, మహిమన్=తన ప్రభావముచే.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము రాక్షసులచే వేలకొలఁది బ్రాహ్మణులు చచ్చిరి. అప్పుడు దేవతలు ప్రార్థింపఁగా నగస్త్యుఁడు వారిని దన తపఃప్రభావముచే సమయఁజేసెను.

మ. కలశీసూనునకున్ నిమంత్రణము స♦ల్కన్ వార లమ్మాని య
ట్టుల కాసం దని యోగి సర్వమును గు♦డ్చున్ మెక్క హస్తోదకం
బుల సంపన్న మటంచు నీయఁ గొనె నా♦మోదంబుతో నంత ని
ల్వలుఁ డోతమ్ముఁడ! యన్న భ్రాతపయి నే♦లా భ్రాంతి రక్షోధమా. ౧౭౨

కలశీసూనునకున్=కలశమునం దుదయించినవానికి నగస్త్యునకు (ఉత్తరకాండము ౧౧౦-౨-ప చూడుఁడు.) హస్తోదకంబులన్=ఉత్తరాపోశనమునకు నీళ్లు, ఆమోదంబుతో=సంతోషముతో, అన్నన్=అని పిలువఁగా,ఆపోశనజల మొకరియ్యవలయును గాని తానై తీసికోరాదు.

తా త్ప ర్య ము.

ఒకనాఁడు వీరు అగస్త్యునకు నిమంత్రణము చెప్పఁగా నాయన యంగీకరించి భోజమునకుఁబోయి సర్వము భక్షించెను. అంతయు నయిన తరువాత 'అన్నసంపన్నం - సుసంపన్న మనిచెప్పి శ్రాద్ధము ముగించిన తరువాత నిల్వలుండు వాతాపి యని పిలిచెను అప్పుడగస్త్యుఁడు 'నీతమ్ముని మీఁద రాక్షసాధమా యింకను నేలరా భ్రాంతి. నీతమ్ముఁడు జీవించియున్నాఁడని తలఁచితివా? నీభ్రాత ప్రేతమైన సంగతి యెఱుఁగవా?'

కం. నాకడుపునఁ బడి వెడలఁగ, మీకా సాధ్యంబు? వాఁడు ♦ మేషాకృతితో
నా కుక్షిని బడి జీర్ణం, బై కాలునిపురముఁ జేరె ♦ నది యెఱుఁగవుగా. ౧౭౩

మేషాకృతితోఁ=మేఁకరూపముతో, కుక్షిని=కడుపునందు, కాలునిపురము=యముని పట్టణము.

తా త్ప ర్య ము .

నా కడుపులోఁబడి మరల వెలికివచ్చుటకు మీకు సాధ్యమగునా? నీ తమ్ముఁడెక్కడనున్నాఁడో చెప్పెద వినుము. మేఁకయై నా కడుపులోఁబడి జీర్ణమై యముని పట్టనమునకుఁబోయినాఁడు. ఇది నీకుఁ దెలియలేదుగదా.

చం. అని చిఱునవ్వునం బలుక ♦ నాతఁడు భ్రాతృవధం బెఱింగి హు
మ్మని పటురోషవేగమున ♦ నమ్మునిముఖ్యుని హింస చేయఁ బూ
నిన ననలాభదృష్టులను ♦ నీఱుగఁ జేసె ఘటోద్భవుండు చ
య్యన నలమానిసోదరుని♦యాశ్రమ మియ్యది చుమ్ము లక్ష్మణా. ౧౭౪

భ్రాతృవధంబు=తమ్ముఁడు చంపఁబడుట, అనలాభదృష్టులను=అగ్నిహోత్రముతో సమానములైన చూపులచే, నీఱుగన్=బూడిదగ, ఘటోద్భవుండు=అగస్త్యుఁడు, చయ్యనన్=త్వరితముగా.

తా త్ప ర్య ము .

అని మందహాసముతోఁ బలుకఁగాఁ దన తమ్ముఁడు చచ్చెనని తెలిసికొని యిల్వలుఁడు కోపంబున హుమ్మని యగస్త్యునిఁజంపఁ బైపడఁగాఁ గా నమ్మునిని నిప్పులు గ్రక్కుచూపులచే నతని భస్మముచేసెను. అట్టి మహిమగలవాని తమ్ముని యాశ్రమ మిదే లక్ష్మణా!

భారతంబున నీచరిత్ర మిట్లు వనపర్వంబునఁ జెప్పఁబడినది. అగస్త్యుఁడు ధనార్థియై ముఫ్వురు రాజుల యాచించెను. ముఫ్వురు ధనములేనివారై ధనవంతుడని పేరుపడిన యిల్వలునొద్ద కాయనను బిలుచుకొనిపోయిరి. వాఁడు వాతాపిని జంపి కూరఁగా జేసిపెట్టఁగా రాజులు భయపడి తినరైరి. అగస్త్యుఁడు తిని వాతాపిని లోపలనే జీర్ణింపఁ జేసికొని హతునిఁజేసెను. ఇల్వలుఁ డదియెఱిఁగి భయపడి వారు వచ్చిన కార్యంబడుగ నగస్త్యుఁడు ధనార్థులమై వచ్చితి మనిచెప్పి యా రాజులకుఁ దనకుఁ గావలసినంత ధనమిప్పించుకొనిపోయెనుగాని యిల్వలుఁ డారాటముపట్టజాలక వారిని వెంబడించి చంపఁబోఁగా హుంకారముచే నగస్త్యుఁడు వానిని వధించెను.

చం. అనునెడఁ బ్రొద్దు గ్రుంకుసమ♦యం బగుడుం గృతసాంధ్యుఁడై మునీం
ద్రునిఁ గని మ్రొక్కి యాతఁ డిడు♦తోరపుమూలములన్ ఫలంబులం
గొని యట రేయి పుచ్చి రఘు♦కుంజరుఁ డర్కుఁడు దోఁప వానితో
ననియె మహాత్మ నీకృపను♦హాయిగఁ బుచ్చితి మిందు రాత్రిరిన్. ౧౭౫

ప్రొద్దు=బ్రధ్నశబ్దభవము, సూర్యుఁడు, కృతసాంధ్యుఁడై=సంధ్యవార్చినవాఁడై - తోరపుమూలములన్=విస్తారములైన వేళ్లను గడ్డలను.

తాత్పర్యము.

ఇట్లు చెప్పుచుండు సమయంబున సూర్యుఁడస్తమించు సమయము కాఁగా సాయంసంధ్యవార్చి యా మునీశ్వరుఁడు దండిగనిచ్చిన ఫలములను మూలములను దనివిదీర భుజించి యా రాత్రి యచ్చటఁగడపి రామచంద్రమూర్తి సూర్యుఁడు కానరాఁగా మునీంద్రునిఁజూచి మహాత్మా! నీదయవలన రాత్రి యిచ్చట సుఖముగాఁ గడపితిమి.

ప్రొద్దుగ్రుంకు సమయంబగుడుఁ అనుటచే సాయంసంధ్య యర్ధాస్తసమయమున వార్వవలయుఁగాన నట్టి సమయమయ్యె నని భావము.

కం. మీయన్నను గనఁగోరఁగాఁ, బోయెద మాజ్ఞప్తిమే త♦పోధన యనుడుఁ
జేయుం డటు లని యానతి, యీయఁగ మును విన్న త్రో♦వ నేఁగుచు వారల్. ౧౨౬

ఆజ్ఞప్తియే=ఆజ్ఞ యిచ్చెదరా.

తాత్పర్యము.

మీ యన్నను దర్శించుటకై పోయెదము, ఆనతిచ్చెదరా యనిన నటులే చేయుండు, పోయిరండని సెలవీయఁగా సీతారామలక్ష్మణులు పూర్వము సుతీక్ష్ణుఁడు చెప్పఁగా వినిన త్రోవబట్టిరి.

సీ. మంజులసంజుల♦పుంజముల్ మాధవీ, కుంజముల్ బిల్వని♦కుంజములును
సాలంబు లుత్తాల♦తాలంబులును సుని, వారముల్ చిరిబిల్వ♦వారములును
సుందరతిందుక ♦ బృందముల్, కుందముల్, మధుపాత్తమధుపూర్ణ♦మధుకములును
సుమనోహరామల♦సుమనోవరాకల, నాగతతతులు పు♦న్నాగములును
తే. దిమిశపనసలు బహువిహం♦గమసమూహ
కలకలాంచితములు నైన♦క్ష్మారుహములు
కరికరాకృష్టములు కపి♦కంపితములు
గనులపండువుగాఁగ గ♦న్గొనిరి వనిని. ౧౨౭

మంజుల...పుంజముల్ = మనోహరములగు నశోకవృక్షములతోఁపులును, మాధవీకుంజముల్ = పూలగురివెంద తీఁగలపొదలును, నికుంజములు = పొదలును, సాలంబులు = మద్దిచెట్లను, ఉత్తాలతాలంబులు = ఎత్తైన తాటిచెట్లును, నివారముల్ = ఆపేరి వృక్షవిశేషములును, చిరిబిల్వావారములును = కానుగు తోఁపులును, సుందర...బృందముల్ = అందములగు తుమ్మికి తోఁపులును, కుందముల్ = మొల్లతీఁగలును, మధుప...మధుకములును = తుమ్మెదలచే, ఆత్త = గ్రహింపఁబడిన, మధు = తేనెచేత, పూర్ణ=నిండిన, మధుకములును=ఇప్పచెట్లును, సుమనోహర = మిగుల ఇంపైనవియు, అమల=నిర్మలములు నగు, సుమనః+వర=మంచి వాసనగల, ఆగమ=వృక్షముల, తతులు = సమూహములు, పున్నాగములు=సుర పొన్నలు, తిమిశ...పనసలు=తిమిశవృక్షములు, పనసచెట్లు, తెనుఁగున కుశ, దర్భ

పనస, వీనికి మువర్ణకము రాదు. కరి...ఆకృష్టములు=ఏనుఁగుల తొండములచే నీడ్వఁబడినవి. కపికంపితములు = క్రోఁతులచే నూఁగులాడింపఁబడినవి.

తా త్ప ర్య ము.

మనోహరములైన యశోక వృక్షముల సమూహములును, బండిగురివెందల పొదలును, మారేడు తోఁపులును మద్దులును నెత్తైన తాటిచెట్లును, నివారములును, కానుగు తోఁపులును, అందములైన తుమ్మికి చెట్లగుంపులును, మొల్ల తీఁగలును తుమ్మెదలచేఁ బొందఁబడిన తేనెతో నిండిన యిప్పచెట్లును, మిగుల మనోహరములయిన శ్రేష్ఠములయి పూలుగల చెట్లును, సురపొన్నలును, తిమిశవృక్షములు, పనస చెట్లు అనేకములగు పక్షుల గుంపుల కోలాహలధ్వనులచే మనోహరములగు వృక్షములును, ఏనుఁగుల తొండములచే లాగఁబడినవియుఁ గ్రోఁతులచే నూఁగులాడింపఁబడినవియు నగు చెట్లను గన్నుల పండువుగా వా రావనమందుఁ జూచిరి.

కం. తనవెనుకను గడుదాపునఁ, జనుదెంచెడి లక్ష్మణునకు ♦ జనవరుఁ డనియెన్
గనితివె స్నిగ్ధదళంబుల, ఘనశాంతమృగద్విజాళిఁ ♦ గావున నిటకున్. ౧౭౮

స్నిగ్ధదళంబులన్ = నునుపైన యాకులను, ఘనశాంత మృగద్విజావళిన్ = మిగుల శాంతిగల జింకలను బక్షులను.

తా త్ప ర్య ము.

తనకు వెనుకగ మిగుల సమీపమున వచ్చుచున్న లక్ష్మణుఁజూచి శ్రీరామచంద్రమూర్తి యిట్లనియె. లక్ష్మణా! చూచితివా? యిచట నాకులు తపసులు నీళ్లుపోసి పెంచుటచే నునుపులై యున్నవి. జింకలు పక్షులు మిగుల శాంతిగుణము గలవై యున్నవి.

వెనుకవచ్చు పిన్నవారు పెద్దలదాఁటిపోరాదు గనుక లక్ష్మణుఁడు వెనుక ప్రక్కగాఁ గేవలము సమీపముననే వచ్చుచుండెను. అడవియందలి మృగముల వలెఁ బక్షులవలెఁగాక ముని మాహాత్మ్యముచే నందలి మృగములు పక్షులుకూడ శాంతములై యదరు బెదరులేక యున్నవి. ఈ కారణముచే వీరు అగస్త్యునియాశ్రమ ప్రదేశము పొలిమేర జొచ్చిరని భావము.

—♦ శ్రీరాముఁ డగస్త్యాశ్రమంబుఁ జూచుట. ♦—

తే. అనతిదూరంబునంద మ♦హాత్ము నాశ్ర,మంబు గల దందు నిజమహి♦మంబు పేర్మి
నవనియందు నగస్త్యవి♦ఖ్యాతిఁ గాంచి,నట్టి మానీశ్వరుం డుండు♦నార్యవినుత. ౧౭౯

అనతిదూరంబునంద = సమీపమందే, అగస్త్య విఖ్యాతి=అగస్త్యుఁడను కీర్తి, అగ+స్త్య=పర్వతము నణఁచుటచే నగస్త్యుఁడను పేరు పొందెనని యర్థము, అగం=పర్వతం, స్త్యతి=స్తభ్నాతి ఇతి అగస్త్యః అగః=కుంభః తత్రస్త్యానః సంహృతః, ఇది అగస్త్యః.

అగస్త్య, అగస్తి, అగస్త్యుని పేర్లు. ఈయన జన్మమును బట్టి యీయాయనకుఁ గలశోద్భవుఁడు కుంభోద్భవుఁడు, ఘటోద్భవుఁడు కలశీసూనుఁడు లోనగు పేర్లు గలవు. చర్యలఁబట్టి పీతాబ్ధి, వింధ్యదమనుఁడు అను పేర్లుగలవు. ఈయన భార్య పేరు లోపాముద్ర. ఆమెకు కౌశీతకి, వరప్రద యనియుఁ బేర్లుగలవు. రామాయణ కాలమున వింధ్యమునకు దక్షిణమునఁ గుంజరపర్వత మీయన వాసస్థానము.

తాత్పర్యము.

లక్ష్మణా! యిచ్చటికి సమీపమందే తన మహిమచే నగస్త్యుఁడని ప్రసిద్ధిగాంచిన మునీశ్వరు నాశ్రమ ముండును.

తే. ప్రాజ్యధూమాకులవనంబు ♦ శ్రాంతలోక
సుఖదమును జీరమాలికా♦సుందరంబు
శాంతమృగయూథయుతము ని♦తాంతరమ్య
విహగనాదిత మయి యది ♦ వెలసెఁ గంటె. ౧౭౦

ప్రాజ్యధూమాకులవనంబు= ప్రాజ్య= అధికమైన, ప్ర + ఆజ్య = నేతియొక్క. ధూమ=పొగచేత, ఆకుల= నిండిన, వనంబు= అడవికలది, విశేషముగ నాజ్యాహుతులవలన వెలువడిన పొగలచే నిండినవనము, శ్రాంత = గాసిపడిన, లోక = సమూహమునకు, సుఖదము = సుఖము నిచ్చునది. చీరమాలికాసుందరంబు = ఆరవేసిన నారచీరల వరుసలచే నందమైనది. శాంత=అదరు, బెదరు, పైపడి పొడువ వచ్చుట, యిటువంటి గుణములులేని మృగసమూహములచేఁ గూడినది, నితాంత = మిక్కిలి, రమ్య=మనోహరమైన, మృగ=పక్షులచే, నాదితము=ధ్వని గలదిగాఁ జేయఁబడినది, వెలసెన్ = ప్రకాశించుచున్నది.

తాత్పర్యము

ఈ వనము విశేషముగ హోమధూమముచే నిండియున్నది. బడలినవారు విశ్రమింపఁదగియున్నది. నారచీరల వరుసలచే నందమైనది. శాంతమైన మృగసమూహములు గలది. మిగుల రమ్యము లగు పక్షుల ధ్వనిగలదియై ప్రకాశించుచున్నది. కావున నిది ఋష్యాశ్రమములలోఁ జేరిన భూమియే.

క. ఈపుణ్యాత్ముఁడీ దిక్కును, బ్రాపించిన మొదలు శాంతి♦పరులై యసురుల్
లోపలఁ దటతట మన వెఱ, చూపులఁ జూచెదర కాని♦చూపరు సూడున్. ౧౭౧

సూడున్ = విరోధము.

తాత్పర్యము.

ఈ పుణ్యాత్ముఁడీ దక్షిణదిక్కును జేరినపిమ్మట రాక్షసులు క్రూరస్వభావము మాని భయమున గుండెలు కొట్టుకొన బెదరుచూపుల దూరమునుండి చూచుచుండుదు రేకాని ఋషుల సమీపించి విరోధించి హింసింపరు.

అనఁగా వారివారి యునికిపట్టులందే వారుండి యచ్చటికి వచ్చినవారిని నశు చులుగా నుండువారిని భక్షింతురు. ఈయన వచ్చినది మొదలు అంతకు ముందుండి నంత రాక్షసోపద్రవము లేదు.

ద్రావిడ భాషాక్షరోత్పత్తి కగస్త్యుఁడే కారణమందురు. ఆ భాషయందు నగస్త్యునిపేర గ్రంథములు గలవు. అగస్త్యువైద్యము దక్షిణమునఁ బ్రసిద్ధి. ద్రావిడము శాపదుష్టము.

తే. ఇమ్మునీశ్వరు పేరట ♦ నెసఁగుఁ గాదె, దిక్కు దక్షిణ మితనిని ♦ దేశమునను
దీవ్రకరుని నిరోధింపఁ ♦ దివిరి వింధ్య శైల మిప్పటికిని నుండు ♦ నేల నంటి. ౧౮౨

తీవ్రకరుని = సూర్యుని.

తాత్పర్యము.

దక్షిణదిశ అగస్త్యుదిశ యనియేకదా పేరొందినది. సూర్యుని నడ్డగింపఁ బూనిన వింధ్యపర్వత మీయన యాజ్ఞచే నేలతోపాటైనది.

సూర్యుఁడు మేరుపర్వతమునకుఁ బ్రదక్షిణము చేయనేల? నాకేల చేయ రాదు. దానికంటె నేను దక్కువనా యని వింధ్యపర్వతము మేరువుపై నసూయ వహించి సూర్యుఁడు తన్నుఁజుట్టి వచ్చునట్లు చేయవలయును అని సూర్యమండల మెత్తున వింధ్య మూరక పెరిఁగి సూర్యునిమార్గ మరికట్టెను. దానివలన సూర్య చంద్ర నక్షత్రముల ప్రయాణము సాఁగక రాత్రిపగలు తాఱుమాఱయ్యెను. వైదిక కర్మములకు హానికల్గెను. దేశమున క్షోభ జనించెను. అప్పుడు దేవతలు అగస్త్యుని బ్రార్థించిరి. అప్పు డాయన యుత్తరమునుండి దక్షిణమునకు బయలుదేరి వింధ్య పర్వతమార్గమున వచ్చి వింధ్యపర్వతమును పర్వతోత్తమా! నేను ముసలివాఁడను, నాభార్య లోపాముద్ర స్త్రీ. నినుదాఁటి మేము దక్షిణము పోఁజాలము. కావున మాకు శ్రమములేకుండ నణఁగుమా యని ప్రార్థించెను. ఆయన కోరినట్టు చేయ కున్న శపించునన్న భయముతో నాయన నడచిపోవ ననుకూలపడునట్లు వింధ్యము నేలతో పాటయ్యెను. ఆయన దాఁటివచ్చి మరల నేను వచ్చువఱకు నీ విట్లేయుండు మనెను. మరల నగస్త్యుఁడుత్తరము పోనులేదు. వింధ్యము పెరుఁగను లేదు,

సీ. దీర్ఘాయువైన యా♦దీప్త తేజునియాశ్రమము వినీతజనస♦మంచితంబు
ఈ జగదర్చితు ♦ నెలమి సేవించిన, మనకు శుభంబులు ♦ మొనయఁ గలవు
వనవాస శేషంబు♦దినము లితనిఁ గొల్చి,యిందె యుందము మహా♦నందముగను
నిచట గంధర్వాది♦నిచయ మీ మితభోజి, బర్యుపాసించును ♦ భక్తితోడ
తే. శఠుఁడు కల్లరి కూళ నృ♦శంసకుండు, కామవృత్తుండు నిట బ్రదు♦కంగఁ జాలఁ
డమరయక్షపతంగనా♦గాదు లిచట, నలరు ధర్మైకరతి నియ♦తాశనముల. ౧౮౩

దీర్ఘాయువు = చాలఁగాలము జీవించువాఁడు, దీప్తతేజుని = ప్రకాశించు బ్రహ్మవర్చస్సుగల వానిని, వినీతజన=అణఁకువగల జనులచే, సమంచితంబు = ఒప్పు

నది. జగదర్చితుఁ౯ = ప్రపంచముచేఁ బూజింపఁబడువానిని, నిచయము = సమూహము, మితభోజి = మితముగా భుజించువాఁడు. పర్యుపాసించును = మిగుల సేవించును, శఠుఁడు=వంచకుఁడు, కల్లరి=అసత్యమాడువాఁడు, కూళ=క్రూరుఁడు, నృశంసకుఁడు=ఘాతకుఁడు, కామవృత్తుండు = స్వేచ్ఛానుసారము నియమములకు లోఁబడక వర్తించువాఁడు. అమర= దేవతలు, యక్ష=యక్షులు, పతంగ=గరుడాది పక్షిజాతులు, నాగాదులు=నాగజాతికిఁ జేరిన పాములు మొదలైనవి, ధర్మైకరతి = ధర్మమునందే ప్రీతిగలవై, నియతాశనములఁ౯ = ఆహారనియమముగలవై, అలరుఁ౯ = సంతోషించును.

తా త్ప ర్య ము.

ఈయన చిరకాలముగ జీవించియుండువాఁడు. ఈ తేజోవంతుని యాశ్రమమందందఱు వినయవంతులు భయభక్తులుగలవారు. ఈయనను వీరు వారనక లోకమునందలి యెల్లవారు సేవింతురు కావున మనము సేవించిన మనకును శుభమగును. మనము వనవాసము చేయవలసిన పదునాలుగేండ్లలోఁ గడచిపోయినకాలము పోను మిగిలిన కాల మీయనను గొల్చి యీ యాశ్రమమందే సంతోషముతో నుందము. ఈయన యాహారనియమము గలవాఁడై యల్పాహారముతో నుండువాఁడు కావున నీయనను గంధర్వులును గుంపులైవచ్చి భక్తితోసేవించి పోవుచుందురు. ఉప్పునీళ్లలోని చేప మంచినీళ్లలో బ్రతుకలేనట్టు వంచకుఁడు అసత్యవాది క్రూరుఁడు ఘాతకుఁడు స్వేచ్ఛావిహారి యీ యాశ్రమమందు బ్రతుకలేఁడు. దేవయక్ష పతంగాదులుకూడ నీ యాశ్రమమందు నాహారనియమముగలవై యీ కారణమున నిర్మలమనస్సులు గలవై ధర్మమందే ప్రీతిగలిగి వర్తించును.

కం. ఈయెడ సిద్ధులు తమతమ, కాయంబులు విడిచి సూర్య♦కల్పద్యుతి వై
హాయసయానములను నవ, కాయంబులఁ దాల్చి దివికి ♦ గమనించి రయా.౧౫౪

సిద్ధులు=యోగసిద్ధులు, సూర్యకల్పద్యుతి = సూర్యకాంతితో సమానమైన కాంతిగలవారై, వైహాయస యానములను = దేవతావిమానములపై, నవకాయంబులను = క్రొత్త దేహములను, దివికి = స్వర్గమునకు, గమనించిరి = పోయిరి.

తా త్ప ర్య ము.

ఇచ్చటఁ దపస్సుచేసిన యనేకులు తమ తపస్సిద్ధిచే దేహములు వదలి సూర్యతేజముగలవారై విమానములమీఁద దేవలోకమునకుఁ బోయిరి.

కం. ఇందలి భూతావళిచే, వందితు లయి దేవతలు ధ్రు♦వంబుగ నిడుదుర్
బృందారకయక్షత్వము, లందంబుగ రాజ్యభోగ ♦ మైశ్వర్యంబుల్. ౧౫౫

భూతావళిచే = జీవుల సమూహముచే, వందితులయి = నమస్కరింపఁబడినవారై, వానికి దేవత్వము, యక్షత్వము, రాజ్యభోగము, ఐశ్వర్యము దీర్ఘకాల మనుభవింపనిత్తురు.

తా త్ప ర్య ము.

ఇచ్చటి ఋషులు మాత్రమే కాదు. ఇతర భూతములును నిచ్చటికి వచ్చుచుఁ బోవుచున్నవి. దేవతలను దర్శించి వారిని స్తుతించి నమస్కరించుటచే దేవతలు వారికిని, దేవత్వము యక్షత్వము రాజ్యభోగము ఐశ్వర్య మనుగ్రహింతురు.

కం. వచ్చితి మాశ్రమమునకుఁ సచ్చరితా నీవు మున్ను ♦ చని జానకి నే
వచ్చుటలు విన్నవింపుము, చెచ్చెరఁ జను మన్న నట్ల ♦ చేయుచు నతఁడున్. ౧౮౬

తా త్ప ర్య ము.

లక్ష్మణా ! యగస్త్యుని యాశ్రమమునకు రానేవచ్చితిమి. నీవు ముందుగఁ బోయి నేను జానకి వచ్చియున్నామని విన్నవింపుము. త్వరగాఁ బొమ్మనిన నాయన యట్టులే చేయుచు,

౧౨-వ సర్గము. శ్రీరాముఁ డగస్త్యునకుఁ దన రాకఁ దెలుప లక్ష్మణుఁ బంపుట.

తే. ఆశ్రమపదంబునం జొచ్చి ♦ యచట నున్న, కలశసంభవుశిష్యుని ♦ గాంచి పలికె
దశరథునిపెద్దకొడుకు సీతాధవుండు, రామచంద్రుండు చనుదెంచె ♦ రమణితోడ. ౧౮౭

తా త్ప ర్య ము.

ఆశ్రమ ప్రదేశము ప్రవేశించి యచ్చట నున్న యగస్త్యశిష్యునిఁ జూచి యయ్యా ! దశరథమహారాజు పెద్దకొడుకు సీతాదేవి భర్త శ్రీరామచంద్రమూర్తి భార్యతోడ మునిదర్శనార్థమై వచ్చినవాఁడు.

సీతాదేవి నేను వచ్చినారమని చెప్పుమనుటచే నీ వాలోచించు రావణ వధకుఁ గావలసిన కారయిత్రి, కర్త యిరువురము వచ్చితిమని చెప్పుమని భావము.

అగస్త్యుఁడు తక్కిన ఋషులు సీతారాములను బంచవటిఁ జేర్చిన కారణ మదియె కదా.

కం. మునిదర్శనార్థముగ; రామునితమ్ముఁడ లక్ష్మణుండ ♦ మునివర నన్నుఁ
వినవే హితుఁడఁ భక్తుఁడ, ననుకూలుఁడ నతని గొల్తు ♦ ననవరతంబున్. ౧౮౮

తా త్ప ర్య ము.

ఆరాముని తమ్ముఁడను, నాపేరు లక్ష్మణుఁడందురు. నే నాయనకు హితుఁడను భక్తుఁడను అనుకూలుఁడను, ఎల్లవేళల నాయనను సేవించువాఁడను, మా పేరు నీవు వినలేదా, హితుఁడు= మేలుకోరువాఁడు, ఇట్టివాఁడు పూజ్యులవిషయమునఁ బ్రేమగలవాఁడై యుండవలయును. ఇట్టివాఁడు భక్తుఁడు. వీఁడు అనుకూలకార్యములు చేయు తెలివిగలవాఁడై యుండవలయును. అట్టి యానుకూల్యము నాయందుగలదని భావము. ఆనుకూల్యస్య సంకల్పము ప్రాతికూల్యస్య వర్జనముగదా ప్రపన్నుని లక్షణము.

కం. సనయంబుగ జనకుని యాజ్ఞను వనములఁ జొచ్చితిమి ప్రశస్తచరిత్రుల్
మునివరుఁ గనుగొనఁ గోరెద, మనఘాత్మక విన్నవింపు మా మారాకల్.
సనయంబుగ=నీతితోఁ గూడినట్లు.

తా త్ప ర్య ము.

జనకాజ్ఞఁ బాలింపవలయు నన్ననీతి ననుసరించి యడవులకు వచ్చినారము. మిగులఁ గొనియాడఁబడిన చరిత్రముగల మీ గురువును అగస్త్యమునీంద్రుని దర్శింపఁ గోరెదము. మేము వచ్చుట యాయనకుఁ దెలిపి పుణ్యము కట్టుకొమ్ము. అనఘాత్మక యనుటచే నిది సమయముగాదు, మరల రా పో యనవల దని భావము.

చం. అనవుడు వల్లె యంచు నతఁ డగ్నిగృహంబును జొచ్చి యత్తపో
ధనుఁ గని మ్రొక్కిచెప్పె దశరథ ప్రభుపుత్రులు రామలక్ష్మణుల్
వనజదళాక్షి సీతయును వచ్చినవారలు నీదు సేవకై
మనవి యొనర్పుమీ యనిరి మౌనివరా! ముద లేది? నావుడున్. ౧౦

వల్లె=ఇది యంగీకారమును సూచించు పదము, సరి-అగ్నిగృహంబును జొచ్చి=ఆ సమయమునకు నగస్త్యుఁడు హోమముచేయుచున్న ప్రదేశమును బ్రవేశించి, ముదల=ఆజ్ఞ.

తా త్ప ర్య ము.

అని లక్ష్మణుఁడు చెప్పఁగా నట్లే చేసెద నని హోమగృహమందున్న యగస్త్యుని జూచి నమస్కరించి తపోధనా! దశరథరాజకుమారులు రామలక్ష్మణులు సీతయు నీసేవకై వచ్చియున్నారు. వా రిట్లు నీతో మనవిచేయు మనిరి. మునీంద్రా యేమి యాజ్ఞ. తోడుకొనివత్తునా?

—శ్రీ సీతారామలక్ష్మణు లగస్త్యాశ్రమంబులోనికిఁ బోవుట—

ఉ. భాగ్యము! రామచంద్రుఁ డిట వచ్చెనె యిన్నిదినాల కేని, యా
యోగ్యచరిత్రు రాకకయి యుల్లమునం దొగిఁ గాచి యుంటి, స
మ్యగ్యుతభక్తి వారలను నాదట సత్కృతిఁ దన్ప మువ్వురన్
భోగ్యవిధిన్ జవంబునను బొమ్మిట దోడ్కొని రమ్ము శిష్యుఁడా. ౧౧

ఆదట=ప్రీతితోఁ, సత్కృతిన్=సత్కారముచే, తన్పన్=తృప్తులఁ జేయుటకు, జవంబునను=శీఘ్రముగా.

గురువును జూడవచ్చి నపుడు నమస్కారము, వెడలిపోవునపుడు నమస్కారము చేసినట్లు చెప్పుటచే నది శిష్యధర్మమని యెఱుఁగునది.

తా త్ప ర్య ము.

ఔరా! నాయదృష్టము. ఇన్నాళ్ళకైనను రామచంద్రమూర్తి యిచ్చటికి వచ్చెను గదా! అంతియే చాలును. సాధుయోగ్యమైన నడవడిగల యాయన యెప్పుడు

వచ్చునా యని యెదురుచూచుచుంటిని. ఆ మువ్వురను బూర్ణభక్తితో భోగ్యమైన విధముగా గౌరవింపవలయును. పొమ్ము, శిష్యుఁడా యిచటికిఁ దోడ్కొనిరమ్ము.

దీని వాస్తవార్థము: ఔరా నాయదృష్టము. నాకులదైవతమై సర్వలోకశరణ్యుఁడైన శ్రీరామచంద్రమూర్తి సీతాలక్ష్మణులతో గొప్ప వ్యాధిచేఁ బీడింపఁబడువాని యొద్దకు వైద్యుఁడువచ్చినట్లు దీర్ఘకాలమునకు నన్నుఁ జూడవచ్చెనా? ఏమి నా భాగ్యము. శ్రవణానంద మనుభవించితి నని మహేశ్వరతీర్థీయము.

ఉ. వారిని లోను రం డనక ♦ వల్వని జా గొనరించి తే లనన్
గూరినభక్తి నాతఁడును ♦ గొబ్బున మ్రొక్కి ససంభ్రమంబుగన్
జేరి సుమిత్రపట్టి! రఘు♦శేఖరుఁ డెచ్చట నున్నవాఁడో యే
తేరుఁడు మీర లన్న మహి♦దేవకుమారునితోడ నాతఁడున్. ౧౯-౨

వల్వని జాగు=అనావశ్యకమైన యాలస్యమును, ససంభ్రమంబుగన్=తత్తఱపాటుతో, ఏతేరుఁడు=రండు, మహిదేవకుమారునితోడ=బ్రాహ్మణ బాలునితో.

తా త్ప ర్య ము.

అనావశ్యకమైన యాలస్య మేలచేసితివి. సీతారామలక్ష్మణు లను పేర్లు వినఁగానే వెంటనే లోపలికిఁ బిలుచుకొని రావలెనా? నీవు రానుపోను యింతకాలము వ్యర్థము చేసి వారిని వాకిట నిలువఁబెట్టవలయునా? వారు మనవాకిట నిలువవలసిన వారా? యనఁగానే శిష్యుఁడు గురువునకు సమస్కరించి తత్తఱపాటుతోఁ బరువునఁ బోయి లక్ష్మణా! యేఁడీ రామచంద్రమూర్తి? రండు మీరు అని చెప్పఁగా నాబ్రాహ్మణ కుమారునితో లక్ష్మణుఁడు.

చం. వెలుపల వచ్చి యందు రఘు♦వీరుని జానకిఁ జూపెఁ జూపినన్
సలలితరీతి మౌనివచ♦నంబులు శిష్యుఁడు చెప్పి రాము న
స్ఖలితవిధిన్ బహూకృతునిఁ♦గా నొనరించిన వారు ప్రోది జిం
కల నలువంకలం గనుచుఁ గ్రన్నన లోనికిఁ బోవు చయ్యెడన్. ౧౯-౩

అస్ఖలితవిధిన్=లోపములేని విధముగా, బహూకృతునిఁగాన్=గౌరవింపఁబడినవానినిగా, నలువంకలన్=నాలుగు ప్రక్కలందు, క్రన్నన=త్వరగా.

తా త్ప ర్య ము.

వెలుపల వచ్చి యావిప్రబాలునకు రామచంద్రమూర్తిని సీతను జూపెను. ఆయనయు మునిచెప్పిన మాటలు వారికిఁ జెప్పి వారిని శాస్త్రవిధానముచొప్పున గౌరవించెను. వారును నాలుగుప్రక్కలనుండు సాకుడుజింకలఁజూచుచు శీఘ్రముగ లోపలికిఁ బోవుచు నక్కడ.

సీ. పరమేష్ఠిస్థానంబు ♦ పావకశ్రీవిష్ణు, శశిదివాకర♦స్థానములును
బద్మారిస్థానంబు ♦ భగునిస్థానంబును, ధనదు ధాత విధాత♦స్థానములును

ననిలునిస్థాన మ♦నంతుని స్థానంబు, గాయత్రిస్థానంబు ♦ గడచి పోవ
వసువులస్థానంబు ♦ వరుణునిస్థానంబు, స్కందుని ధర్మని♦స్థానములును
తే. ననెడి పూజాప్రదేశముల్ ♦ గనుచుఁ బోవ, శిష్యపరివృతుఁడై ముని♦శేఖరుండు
దనకు నెదు రరుదేరఁగ ♦ ననుజుఁ జూచి, కంటె వచ్చెడివాఁడె య♦గస్త్యముని.

దేవపూజాగృహమందు శ్రీరామచంద్రమూర్తి చూచిన అగస్త్యుఁ డర్చించు దేవతలస్థానములు చెప్పుచున్నాఁడు. వీని నన్నిటినిదాఁటి యగస్త్యుని జూడఁబోయెను. అవి యేవనిన, పరమేష్ఠిస్థానము = బ్రహ్మస్థానము, పావక=అగ్నిహోత్రుని యొక్క. శక్ర=ఇంద్రుని, దివాకర=సూర్యుని, పద్మారి=చంద్రుని, ధనద=కుబేరుని, అనిలుని=వాయువుయొక్క, అనంతుని=శేషునియొక్క, స్కందుని=కుమారస్వామి యొక్క, శిష్యపరివృతుఁడు=శిష్యులచేఁ జుట్టఁబడినవాఁడు.

తాత్పర్యము.

బ్రహ్మస్థానము (ఇచట స్థానమనఁగా బ్రహ్మను ఆవహింపఁజేసి పూజించుప్రదేశము) అగ్నిస్థానము, శ్రీవిష్ణుస్థానము, ఇంద్రునిస్థానము, సూర్యస్థానము, చంద్రస్థానము, భగునిస్థానము, కుబేరస్థానము, ధాతస్థానము, విధాతస్థానము, వాయుస్థానము ఆదిశేషునిస్థానము, గాయత్రీస్థానము దీనిని దాఁటిపోవ వసువులస్థానము, వరుణుని స్థానము, కుమారస్వామిస్థానము,ధర్మునిస్థానము, అను పూజాప్రదేశములు చూచుచుఁ బోవుచుండఁగా శిష్యులతోఁగూడి యగస్త్యుఁడెదురుగ రాఁగా నాయనఁజూచి శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణునితో లక్ష్మణా! యావచ్చుచున్నాఁడే, యాయనయే యగస్త్యుఁడు.

ఈ స్థానములందు శివునిపేరుగాని రుద్రుని పేరుగాని లేదు. దీనివలన శివుఁడు పూజార్హుఁడుగాఁడని గోవిందరాజభాష్యమునం దిట్లు వ్రాయఁ బడినది.

బ్రహ్మ-అగ్ని - విష్ణువు - మహేంద్రుఁడు - వివస్వతుఁడుఁ సోముఁడు - భగుఁడు, కుబేరుఁడు - ధాత-విధాత-వాయువు - అనంతుఁడు - గాయత్రి - వసువు - వరుణుఁడు కార్తికేయుఁడు, ధర్ముఁడు వీరు పదునేడుగురు దేవతలు 'యోవైసప్తదశ' యను ననువాకమునఁ జెప్పఁబడిన పదునేడక్షరముల దేవతలు, యజ్ఞశీలుఁడైన మునిచేఁ బూజార్థము వీరు ప్రతిష్ఠితులు. అని తెలియఁదగు. ఇందుఁ బూజ్యులగు దేవతలందు రుద్రునిపేరు చెప్పఁబడమిని నాయన యపూజ్యుఁ డని చెప్పఁబడెను. ఇప్పుడు కొందఱాయనను బూజచేయుట తామసశాస్త్రముల ననుసరించి యని గ్రహించునది.

దీనికిఁ బ్రత్యుత్తరముగఁ గాఁబోలు నప్పయదీక్షితులవారు,

ఇచట గంధర్వాది నిచయ మీామితభోజిఁ
బర్యుపాసించును భక్తితోడ
అమరయక్షపతగ నాగాదులిచట
నలరు ధర్మైక రతి నియతాశనముల

నని (౧౫-౩-ప) ముందే చెప్పఁబడియుండుటచే నిచట స్థానము లని చెప్పఁబడిన దేవత లగస్త్యుని నుపాసింపవచ్చినవారే. శివుఁడు వీరికంటె గొప్పవాఁడగుటచే రాలేదు. అని సమాధానము వ్రాసిరి. ఆక్షేప మెంత బాగున్నదో సమాధానమంత బాగు గనేయున్నది. ఇందు శివుని పేరు చెప్పనంతమాత్రమున సర్వత్ర సర్వజనులకు శివుఁ డపూజ్యుఁ డనరాదు. ప్రపన్నులు భక్తులేక భక్తులు అనన్యభక్తులు కావున ముముక్షువు లొక్క భగవంతు నారాధించుటే తగును. ఆకారణముచే నితర దేవతలఁ దూలనాడ రాదు. పాంచరాత్రసంహితలందే సంకర్షణావతారము రుద్రుఁ డని యున్నది. శ్రీ భాగవతమందే వైష్ణవులందు శంభునివలె పురాణములందు భాగవతము శ్రేష్ఠమని చెప్పఁబడెను. దేనికిఁ గొఱగాని వైష్ణవ నామధారి బాహ్యవేషయుక్తుఁడే పూజ్యుఁ డైనచో వైష్ణవసత్తముడని తానే చెప్పు శివు,డెట్లు పూజ్యుఁడుగాఁడు? అట్లు చెప్పుట భాగవతాపచారముకాదా. తలచుట్టము తోఁకపగయన్నట్లు స్కందుఁడు పూజ్యుఁ డైనచో నాయన తండ్రి యేలగాఁడు? శ్రీవైష్ణవులు స్కందుని కుబేరుని వరు ణుని బూజించుచున్నారా. వీరే యగస్త్యునకుఁ బూజ్యులైనపుడు శివుఁడేల యపూజ్యుఁ డయ్యెను. 'యోరుద్రో అగ్నౌ యో అప్సు య ఓషధీషు యోరుద్రో విశ్వా భువనావివేశ తస్మైరుద్రాయ నమో అస్తు' అని వైష్ణవులు చెప్పుచున్నారా లేదా? అస్మత్పితామహం రుద్రరూపమ్మని చెప్పుచున్నారా లేదా? 'త్ర్యంబకం యజామహే' యనుచున్నారాలేదా. కావున శ్రీవైష్ణవులు శివుని భూషింపకుండినఁ బోనిందు, దూషింపరాదు.

సృష్టిస్థిత్యంతకరణాత్, బ్రహ్మవిష్ణు శివాత్మికామ్
స సంజ్ఞాం యాతి భగవాన్, ఏకఏవ జనార్దనః॥

భగవంతుఁడగు జనార్దనుఁడొకఁడే సృష్టిస్థితిలయములు చేయ బ్రహ్మ విష్ణు శివనామములం బొందుచున్నాఁడు. (వి. పు. ౧-౩-౬౭.)

స ఏవ సృజ్య స్సచ సర్గకర్తా సఏవ పాత్యత్తిచ పాల్యతేచ॥ ఆయనయే సృజింపఁ బడుచున్నాఁడు సృజించుచున్నాఁడు రక్షించుచున్నాఁడు హరించుచున్నాఁడు పాలిం పఁబడుచున్నాఁడు. ఇట్టి ప్రమాణము లనేకములు గలవు. కార్యాంతరముననే వేషాంతరము వేయఁగానే తత్త్వజ్ఞులు గౌరవింపఁదగదా? సర్వం విష్ణుమయం జగత్తని చెప్పెడి వైష్ణవమతమందు గడ్డిపోఁచనైన ద్వేషింప సందుగలదా? శివునందు మోక్ష ప్రదత్వము లేకుండునుగాక, పూజ్యత లేక పోలేదు.

దీక్షితులవారి సమాధానము సరిగాదు. ముప్పది మూఁడుకోట్ల దేవతలు నగస్త్యు నారాధింపవత్తురేని కర్మకాండప్రకార మనువాకమునఁ జెప్పఁబడిన పదు నేడుగురికే స్థానములు కల్పింపనేల? తక్కినవారి గతియేమి? అగస్త్యుఁడు నిత్య మర్చించు దేవతలపేర్లు చెప్పఁబడెనుగాని యాయనను గొల్వవచ్చిన వారిపేర్లు చెప్ప బడలేదు. ఈ పద్యమునందలి సోమ శబ్దమునకుఁ జంద్రుఁడని చెప్పక శివుఁడని

చెప్పిన నెవ రేమి చేయఁగలరు ? ఇందలి యగ్ని శబ్దమునకు 'అగ్ని రత్ర రుద్రః'అని తిలక వ్యాఖ్యయందును 'తత్రాగ్నిశబ్దేన శంభురుచ్యతే' యని శిరోమణి వ్యాఖ్యయందును గలదు. దీనికిఁ గారణ మీ యగ్నిశబ్దము బ్రహ్మవిష్ణు శబ్దములకు నడుమ నుండుటయే యని శిరోమణి. ఇది క్లిష్టకల్పనము.

—♦ సీతారామలక్ష్మణు లగస్త్యు దర్శించుట. ♦—

కం. కాంబోలు నతని తేజము,చేఁ బరికించితి నటంచుఁ ♦ జేరి రవినిభుఁ
దాఁ బదముల వ్రాలిన మఱి, పూఁబోఁడియు లక్ష్మణుండుఁ ♦ బూర్ణ శ్రద్ధన్. ౧౯౫

తా త్ప ర్య ము.

ఈయనయే యగస్త్యుఁడు అని తోఁచుచున్నది. ఎట్లు తెలియు నన నాయన బ్రహ్మవర్చస్సునుబట్టి తెలిసికొంటిని, అని శ్రీరామచంద్రమూర్తి యాయనను సమీపించి పాదములపై వ్రాలఁగా నావల సీతాదేవియు లక్ష్మణుఁడు శ్రద్ధాభక్తులతో,

తే. మ్రొక్కి నిలుచున్న నమ్మునిముఖ్యుఁ డెలమి
రాము నతిథిగ గ్రహియించి ♦ ప్రేమమునను
నర్ఘ్యపాద్యాదు లొసగుచు ♦ నర్చసలిపి
నేమ మారసి కూర్చుండఁ ♦ జెప్పి పిదప. ౧౯౬

తా త్ప ర్య ము.

అభివందనముచేసి నిలిచియుండఁగా నామునిశ్రేష్ఠుఁడు శ్రీరామచంద్రమూర్తిని నతిథిగ గ్రహించి ప్రేమతో నతిథుల కీయదగిన యర్ఘ్యము పాద్యము మొదలయి నవి యిచ్చి పూజించి యోగక్షేమములు విచారించి కూర్చుండు మని చెప్పి యావల.

తే. ప్రథితచరితుండు వైశ్వదే♦వంబు సలిపి, యర్ఘ్యమిడి చక్కఁగావించి♦యతిథిపూజ
ధర్మవిదుఁడు వానప్రస్థ♦ధర్మసరణి, భోజనం బిడి తనరంగఁ ♦ బూర్ణతుష్టి. ౧౯౭

ప్రథితచరితుండు = కీర్తికెక్కిన యాచారము గలవాఁడు, పూర్ణతుష్టి=నిండు తృప్తి.

తా త్ప ర్య ము

ప్రసిద్ధికెక్కిన యాచారము గల యగస్త్యుఁడు వైశ్వదేవము గావించి యర్ఘ్య మిచ్చి యతిథిపూజ సలిపి ధర్మము తెలిసినవాఁడగుటచే వానప్రస్థ ధర్మము ప్రకారము నిండు తృప్తికలుగునట్లు భోజనము పెట్టెను.

వానప్రస్థసరణి భోజనంబిడి యనుటచేఁ దన కేది యాహారమో యదియే వారికిఁ బెట్టెనని గ్రహింపనగు.

యదాహారో భవే త్తేన, పూజ♦యే త్పితృదేవతాః
తేనైవ పూజయే న్నిత్య, మతిథిం సముపాగతమ్. ॥శంఖ॥

తన కేది యాహారమో తనపితృదేవతల నా యాహారముచేతనే పూజింపవలెను, దానిచేతనే యతిథులను బూజింపవలెను.

తే. తాను దొలుదొల్తఁ గూర్చుండి ♦ తత్త్వవేది
యంజలి ఘటించి కూర్చున్న ♦ యమలధర్మ
కోవిదుని రాముఁ గనుఁగొని ♦ కూర్మి మీఱ
నిట్టు లనియెను ధర్మంబు ♦ తెలుకవడఁగ. ౧౯౮

తత్త్వవేది = జీవాత్మ పరమాత్మల విషయమైన యథార్థజ్ఞానము గలవాఁడు. అమల ధర్మకోవిదుని=నిర్మల ధర్మమందుఁ బండితుని. కః విదుడు=కోవిదుఁడు, బ్రహ్మజ్ఞానముకలవాఁ డని యర్థము. నిర్మలధర్మజ్ఞానము బ్రహ్మజ్ఞానమే కదా.

తాత్పర్యము.

ఆత్మ తత్త్వముఁ దెలిసిన యగస్త్యుఁడు తాను ముందుఁ గూర్చుండి యావలఁ దన యనుమతిపై నంజలి జోడించి కూర్చుండిన నిర్మల ధర్మజ్ఞానమందుఁ బండితుఁడైన శ్రీరామచంద్రునిఁ జూచి కూర్మితో వానప్రస్థ గృహస్థధర్మములు తెలియ నిట్లు పలికెను.

శ్రీరామచంద్రమూర్తి యమలధర్మకోవిదుఁ డని చెప్పుచు మరల నాయనకు ధర్మ ముపదేశింపఁ బ్రయత్నించుట వ్యర్థశ్రమము గదా యను సందేహము రావచ్చును. ఈ చెప్పబోవు ధర్మము రామునకుఁ జెప్పినను వాస్తవమున సీత నుద్దేశించి చెప్పెడు మాటయే. రాఁబోవు రావణవృత్తాంతము దెలిసి హెచ్చరించుచున్నాఁడు. అటుగాకున్నను దెలిసినవారికైనను వారిమేలు కోరువారు హితముపదేశింపవలయును.

కం. ఎఱుకగలవారికైనను । గఱపకతక్క నుచితప్రకారము లెల్లన్ ।
గొఱలు హితు లట్లగుట నం । దఱకును జెప్పంగవలయుఁ దగియెడు బుద్ధుల్॥

భార. విరాట. ౧-౧౧౫

కం. హోమంబు సలిపి యతిథికి, శ్రీమహితా యర్ఘ్యమిచ్చి ♦ సేవింపఁగ నా
నామెయిఁ జలుపని తపసి ని, జామిషమును గూటసాక్షి ♦ యటు లట మెక్కున్.

నిజామిషమును=తన మాంసమును, కూటసాక్షి = మోసపుసాక్ష్యము చెప్పువాఁడు, కూటము=మోసము, అటన్=పరలోకమందు, ఆ మెయిన్=ఆ విధముగా;

తాత్పర్యము.

హోమము గావించి యతిథికి నావల నర్ఘ్యమునిచ్చి యాయనను సేవింపవలయును. ఆ విధముగఁ జేయని వానప్రస్థుఁడు పరలోకమందు మోసపుసాక్ష్యము చెప్పినవానివలె తన మాంసమును దానే తినుచుండును.

నయజ్ఞై ర్దక్షిణావద్భి, ర్వహ్ని శుశ్రూషయా తథా
గృహీ స్వర్గ మవాప్నోతి, యథాచాతిథిపూజనాత్॥
తస్మాత్సర్వ ప్రయత్నేన గృహస్థోఽతిథిమాగతమ్
ఆహార శయనాద్యైన విధివత్ప్రతిపూజయేత్॥

అతిథిపూజచేత గృహస్థుఁడుపోవు స్వర్గలోకమునకు దక్షిణలతోడ యజ్ఞములు చేసినవారు, అగ్నిహోత్రముల సేవించువారు పోఁజాలరు. కావున సర్వవిధముల గృహస్థుఁడు తన యింటికివచ్చిన యతిథిని నాహారము నిచ్చియు శయనమిచ్చియు యథావిధి పూజింపవలెను.

ఇష్టోవా యదివా ద్వేష్యో, మూర్ఖః పండిత ఏవవా
సంప్రాప్తో వైశ్వదేవాంతే, సోఽతిథిః స్వర్గసంక్రమః॥
చోరశ్చ్వాథ చండాలః, శత్రుర్వా పితృఘాతుకః
దేశకాలేతు సంప్రాప్త, స్సోఽతిథి స్వర్గసంక్రమః॥ పరాశరః.

తన మిత్రుఁడుగాని శత్రుఁడుగాని మూర్ఖుఁడుగాని పండితుఁడుగాని వైశ్వదేవము కడపటవచ్చెనేని వాఁడే యతిథి. వాఁడు స్వర్గము నొందఁజేయును.

దొంగగాని చండాలుఁడుగాని శత్రువుగాని తండ్రిని జంపినవాఁడుగాని సరియైన వేళయందుఁ బ్రదేశమందు వచ్చెనేని వాఁడు అతిథి. వాఁడు స్వర్గమునొందఁ జేయును. 'ద్విషంతం నైవ భోజయేత్' పగవాని కన్నముపెట్టరా దనునది యదేశకాలముల వచ్చినవాని విషయము.

అశ్వమేధమందు,

దూరాధ్వగం శ్రాంత మనువ్రజంత, దేవాశ్చసర్వే పితరోగ్నయశ్చ
తస్మిన్ద్విజే పూజితేపూజితాస్స్యుః దితేనిరాశా అపితేప్రయాంతి॥

దూరము నడచి బడలినవానివెంట దేవతలెల్లరు పితరులు అగ్నులుకూడఁ బోదురు. కావున నాతని బూజించినవారు దేవతలనెల్లఁ బూజించిన వారగుదురు. వారు నిరాశులైపోయిరా దేవతలును బోదురు.

అతిథి ర్యస్య భగ్నాశో, గృహా త్ప్రతినివర్తతే
సతస్మై దుష్కృతం దత్వా, పుణ్య మాదాయ గచ్ఛతి॥

అతిథి యెవనియింట నాశచెడినవాఁడై యాదరింపఁబడకపోవునో వాఁడు తన పాప మతని కిచ్చి యతని పుణ్యమును దీసికొనిపోవును.

శూద్రోవా ప్రతిలోమోవా యది శ్రాంతః క్షుధాతురః
భోజయే త్తం ప్రయత్నేన, గృహ మభ్యాగతో యది॥ హారీతుఁడు.

బడలి యాఁకలిగొని యింటికి వచ్చిన యభ్యాగతుఁడు శూద్రుఁడైనను, ఎక్కువ జాతి స్త్రీయందుఁ దక్కువజాతివానికిఁ బుట్టినవాఁడైనను వానికి నన్నముపెట్టవలెను. ఇది పాషండులుగాని వారి విషయము. పాషండః పతితోవాపి, క్షుధార్తో గృహమాగతః । నైవ దద్యాత్స పక్వాన్న, మామమేవ ప్రదాపయేత్॥ పాషండుఁడుగాని పతితుఁడుగాని ఆఁకలిగొని యింటికివచ్చెనేని వానికిఁ బక్వాన్నముపెట్టరాదు, ధాన్యము పెట్టి పొమ్మనవలెను.

నపృచ్ఛే ద్గోత్రచరణౌ, నస్వాధ్యాయో నచశ్రుతమ్
చిత్తే విభావయే త్తత్ర దేవోయం సముపస్థితః॥
అభ్యాగతో జ్ఞాతపూర్వః, అజ్ఞాతో ఽతిథి రుచ్యతే॥

అతిథిని నీగోత్రమేమి నీసూత్రమేమి నీవేమి చదివితివి ఏమి వింటివని యడుగ రాదు. దేవుఁడే యావిధముగ వచ్చినాఁడని యెంచవలెను. ముందు తెలిసినవాఁడు అభ్యాగతుఁడు. పూర్వపరిచయములేనివాఁడు అతిథి.

పాషండినో వికర్మస్థాన్ బైడాలిక వ్రతాన్ శఠాన్
హైతుకాం బకవృత్తీంశ్చ, వాఙ్మాత్రేణాపి నార్చయేత్॥

పాషండులను కర్మహీనులను పిల్లివలె వ్రతమును బూనినవారిని కపటులను హైతుకులను బకధ్యానము చేయువారిని మాటలచేనైన నాదరింపరాదు.

నష్టశౌచే వ్రతభ్రష్టే, విప్రే వేదవివర్జితే
దీయమానం రుదత్యన్నం కిం మయా దుష్కృతం కృతమ్॥

శుచియగు నాచారము వదలినవారికి వ్రతభ్రష్టులకు వేదమువదలిన బ్రాహ్మణునకు, నన్నము పెట్టితిమేని యయ్యో! వీని కడుపులోనికిఁ బోవుట కెంతపాపము చేసితినో యని యన్న మేడ్చును.

వేదవిద్యా వ్రతస్నాతే, శ్రోత్రియే గృహమాగతే
క్రీడంత్యోషధయ స్సర్వా, యాస్యామి పరమాంగతిమ్॥

వేదవిద్యయందు స్నాతుడైన శ్రోత్రియుఁడు ఇంటికి వచ్చెనేని పరమగతి మాకు లభించునని యా యింటిలోని ధాన్యము సంతోషముతో నృత్యము సలుపును. బృహస్పతి.

భోజనార్థంచ స్వేవిప్రః కులగోత్రే న నివేదయేత్
భోజనార్థం హి తే శంసన్ వాంతాశీ త్యుచ్యతే బుధైః॥

భోజనార్థము వచ్చిన బ్రాహ్మణుఁడు తన కులగోత్రములు చెప్పరాదు. అట్లు చెప్పెనేని వాఁడు క్రక్కిన కూడు తినినవాఁడగును.

ఇది పూర్వకాలమునఁ జెల్లును. ఈ కాలమున నీచజాతివారును బ్రాహ్మణులమనియే వచ్చి మోసగించుచున్నారు. కావునఁ బరీక్షింపక విడువరాదు.

దేవపూజానంతరము గోదోహనమాత్రకాల మతిథి యభ్యాగతికై వాకిటఁ గాచి యుండవలెను. గోదోహన మనఁగా ఆవును పాలుపిండునంతకాలము.

గోదోహనమాత్ర మంకణేఽతిథిం ప్రతీక్షమాణ ఆసీత॥ శంఖుఁడు॥ నాడికాయా శ్చతుర్భాగం గోదోహం బ్రువతే బుధాః॥ గడియలో నాలుగవభాగము గోదోహనకాల మని చెప్పఁబడును. అనఁగా ఆఱునిమిషములు అతిథి అభ్యాగతులకై కాచి యుండి ఆలోపల రాలేని భుజింపవచ్చును.

వైశ్వదేవ కృతం పాపం, భిక్షురేకో వ్యపోహతి
నభిక్షుణా కృతంపాపం, వైశ్వదేవో వ్యపోహతి॥

అని యుండుటవలన వైశ్వదేవమునకు ముందు భిక్షువు వచ్చెనేని యతనికి ముందు పెట్టవలయును. వైశ్వదేవము చేయకున్నను దోషములేదు. అయినను, ఇది ఏకపాత్రపక్షవిషయము. రెండు మూఁడు పాత్రములలో నన్నము చేయఁబడియుండెనేని వైశ్వదేవము చేయవలయును. ఇది యతి విషయము. కూటసాక్ష్యము చెప్పినవానికిఁ బ్రాయశ్చిత్తము ముందొకచోఁ జెప్పఁబడెను.

ఉ. రాజవు సర్వలోకనికరంబుల కీవు మహారథుండవుఁ
బ్రాజితధర్మవర్తివి విరాజితకీర్తివి మాన్యమూర్తివిఁ
బూజకుఁ బూర్ణయోగ్యుఁడవు భూవర వచ్చితి కూర్మివింద వై
యోజ దలిర్ప మాకు సుకృతోదయ మింతకు నొండు గల్గునే. ౨౦౦

అతిథిగా వచ్చిన యధమ మనుష్యు నాదరించిననే యెంతో మహాఫలము చెప్పఁబడుచుండ నిఁక నీవంటి యతిథి నాదరించినఁ గలుగు ఫలమునకు మేర లేదనుచున్నాఁడు. సర్వలోకనికరంబులకుఁ = సమస్త జనసమూహములకు, 2 అనంతకోటి బ్రహ్మాండములకు, నీవు రాజవు= భర్తవు, పతివి 'పతిం విశ్వస్య' యని శ్రుతి చెప్పుచున్నదికదా! మహారథుండవు=గొప్ప వీరుఁడవు, 2 మహాత్ముఁడగు గరుత్మంతుని వాహనముగాఁగలవాఁడవు, భ్రాజితధర్మమూర్తివి=(1) ప్రకాశించు ధర్మమే యాకారముగా గలవాఁడవు, 2 లోకశిక్షార్థమై ధర్మముల ననుష్ఠించువాఁడవు,విరాజితకీర్తివి=1 ప్రకాశించు కీర్తిగలవాఁడవు, 2 పరమాత్ముఁడ వని ప్రసిద్ధికీర్తిగన్న వాఁడవు'విశ్వత్యుపిప్యోమ్నివా తే పరమాత్మని' నానా. ర॥ వి. అనఁగా పరమాత్మకుఁ బేరు. 'రామపదేనాసౌ పరబ్రహ్మాభిధీయతే' యని యగస్త్యవాక్యమే కలదుగదా! మాన్యమూర్తివిఁ = 1 పూజింపఁదగిన రూపముగలవాఁడవు, 2 యోగులకు ధ్యానింపఁదగిన యాకారముగలవాఁడవు, పూజకు = సర్వవిధపూజ్యకర్మములకు, పూర్ణయోగ్యుఁడవు = పూర్ణముగఁ దగినవాఁడవు, కొందఱు దేవతలు కొన్నిటికే యోగ్యులు, నీవన్నిటికి యోగ్యుఁడవు, ఏదేవతలకుఁ జేయుపూజ నీపూజయేకదా! 'ఇష్టాపూర్తం బహుధాజాతం జాయమానం విశ్వం బిభర్తి భువనస్యనాభి' యనుశ్రుతి యిటఁ బ్రమాణము, భూమిప= 1 రాజా, హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌయన్నట్లుశ్రీభూదేవులకుఁబతియైనవాఁడవు.కూర్మివిందవు= ప్రియాతిథివి, సుకృతోదయము = పుణ్యఫలానుభవారంభము, ఇంతకుఁ = ఇంతకంటె.

తాత్పర్యము.

సమస్త ప్రపంచమునకు నందలి జనులకు నీవే ప్రభుడవు. నీవే మహారథుఁడవు, నీవే మూర్తీభవించిన ధర్ముఁడవు. విశేషముగఁ బ్రకాశించు కీర్తిగలవాఁడవు, గౌరవింపఁదగు నాకారము గలవాఁడవు. ఎంతటి పూజకును బూర్ణముగఁదగినవాఁ

డవు, భూపతివి. ఇట్టి నీవు ప్రియాతిథివై వచ్చితివి. ఇంతకు మించిన పుణ్యఫలోదయము మఱియొకటిగలదా?

క. అని ఫలమూలసుమంబులు, తనివి చనఁగ వారి కిచ్చి ♦ తదనంతర మా
జనకసుతాధవునకు ముని, ఘనచాపాక్షయశరాదిఁ ♦ గనిపించి యనెన్. ౨౦౧

ఫలమూలసుమంబులు=పండ్లు, వేళ్లు, పూలు, తనివి=తృప్తి, ఘన = గొప్పదియగు, చాప=విల్లు, అక్షయశరాది= తఱుఁగని బాణములు గల యంబులపొదులు, కనిపించి= చూపించి.

౧౯౭-వ పద్యంబున బూర్ణతుష్టిగలుగ భోజన మిడినట్లు చెప్పఁబడెను. ఇచ్చట ఫలమూలము లిచ్చినట్లు మరలఁ జెప్పఁబడెను. ఇది సీతాదేవి కని యెఱుంగునది. భర్తలతోడ భార్యలు భుజింపరాదు గనుక నప్పుడామె భుజింపలేదు. స్త్రీలు పురుషులేక పంక్తి భుజింపరాదు.

తాత్పర్యము.

అని యీ ప్రకారముచెప్పి వారికిఁ గడుపునిండఁ బండ్లను వేళ్లను పూలను దిననిచ్చి యావల శ్రీరామచంద్రమూర్తికి నొక గొప్పవిల్లు అక్షయబాణములు తూణీరములు చూపించి యిట్లనియె

—♦ అగస్త్యుడు శ్రీరామునకు వైష్ణవాయుధంబులు సమర్పించుట. ♦—

సీ. ఈ దివ్యమహనీయ ♦ హేమమణీభూషి, తానమవిష్ణుశ♦రాసనంబు
నిర్మిత మల విశ్వ♦కర్మచే నీ శర,రాజ మమోఘంబు ♦ రవినికాశ
మబ్జజదత్త మీ♦యక్షయ్యసాయక,ములు శిత బాణసం♦పూర్ణ తూణు
లనఘ సువర్ణాంచి♦తాసియుఁ గోశంబుఁ, బాకారిదత్తముల్ ♦ భానుతేజ
ఆ. యీశరాసనమున ♦ నింద్రవిరోధుల, సంగరమునఁ జంపి ♦ శార్ఙ్గధన్వి
జయము గొనియెఁ జుమ్ము♦శరములు నవ్వియు, యసియుఁ దరకసంబు♦లవియు రామ.

దివ్య= దేవలోకసంబంధమై, మహనీయ = పూజింపఁదగినదియై, హేమమణీభూషిత= బంగారుచేతను మాణిక్యములచేతను నలంకరింపఁబడినదియు, అనమ = సమానములేని, శరరాజము = శ్రేష్ఠమయినబాణము, అమోఘంబు = వ్యర్థముపోనిది, రవినికాశము=సూర్యునితోఁ సమానమైనది, అబ్జజదత్తము=బ్రహ్మచే నీయఁబడినది, అక్షయ్యసాయకములు= క్షయముగాని బాణములు, శిత= పదునైన, బాణ = బాణములచే, సంపూర్ణ=నిండిన, తూణులు=పొదులు, సువర్ణాంచితాసియు = బంగారు పిడిచేఁ బ్రకాశించు కత్తియు, కోశంబు = ఒరయును, పాకారిదత్తము = ఇంద్రునిచే నీయఁబడినవి, భానుతేజ=సూర్యునికాంతివంటి కాంతిగలవాఁడా, శార్ఙ్గధన్వి = విష్ణువు, అసి=కత్తి, తరకసంబులు= అంబులపొదులు.

ఇది వైష్ణవధనుస్సు అని చెప్పుటచేఁ బరశురామునివలన శ్రీరామచంద్రమూర్తి గ్రహించిన ధనువును అప్పుడు వరుణుచేతి కిచ్చెను. అదియే యిప్పుడిందు

వరుణునిచే నుంచఁబడి ఖరాదివధ కై రామచంద్రునకు మరల నీయఁబడెను. బ్రహ్మదేవుఁ డిచ్చినది బాణసమూహము. బాలకాండమున సంక్షేపరామాయణమందు ౧౧౧-వ పద్యము నైంద్రధను వనుట ఛత్రిన్యాయమున నని యెఱుంగవలయును.

తాత్పర్యము.

దేవసంబంధమై, పూజ్యమై, బంగారు రత్నములచే నలంకరింపఁబడినదైన యసమానమైన యీ విష్ణుధనుస్సును విశ్వకర్మ నిర్మించెను. ఈ బాణసమూహము వ్యర్థముగఁ బోవునదికాదు. సూర్యునికాంతివంటి కాంతిగలది. ఇది బ్రహ్మచే నీయఁబడినది. ఈ యక్షయ బాణములు పదునైన బాణములతో నిండిన యమ్ములపొదులు, బంగారు పిడిగల కత్తియు దానియొరయు నింద్రుఁ డిచ్చినవి. సూర్యతేజా! యీ వింటిచే విష్ణుదేవుఁడు రాక్షసులను యుద్ధమందుఁ జంపి జయముగొనెను. ఈ బాణములు, కత్తి, పొదులు ఆయన యుద్ధమం దుపయోగించినవే.

ఆ. వఱల జయము నీకు ♦ వజ్రివజ్రంబును, గొనినభంగి వీనిఁ ♦ గొను మటంచుఁ
దద్వరాయుధముల ♦ దశరథసుతరత్న, మున కొసంగి యిట్టు ♦ లనియె మఱియు

వజ్రి=ఇంద్రుఁడు, వరాయుధములు=శ్రేష్ఠములయిన యాయుధములు.

తాత్పర్యము.

నీకును జయము గలుగుటకు నింద్రుఁడు వజ్రంబును గ్రహియించినట్లు వీనిని గ్రహింపు మని యాశ్రేష్ఠము లయిన యాయుధములను శ్రీరామచంద్రమూర్తి కిచ్చి మఱియు నిట్లు చెప్పెను.

వజ్రివజ్రమువలెఁ గొను మనుటచే నీ సొత్తు నీవే గ్రహింపుము. నీసొత్తు నీకిచ్చుటకు నేనెవ్వఁడను, అని భావము.

—♦ ౧౩-వ సర్గము. అగస్త్యుఁడు శ్రీరామునితో సల్లాపంబు లాడుట. ♦—

శా. రామా! లక్ష్మణ! ప్రీతి సమ్మదము నా♦రంగంటి భూపుత్రితోఁ
బ్రేమ న్నన్గన మీరు వచ్చుటను, దా♦రిన్ గాసిపాలైతి రీ
రామారత్నముఁ జూడ వ్యక్తముగ వి♦శ్రాంతిన్ మదిం గోరెడిన్,
భూమీశాత్మజ కోమలాంగి వ్యసనం♦బుం గాన దెప్పట్టునన్. ౨౦౪

తాత్పర్యము.

శ్రీరామచంద్రా! లక్ష్మణా! మీరు సీతాదేవితోడ నన్నుఁజూడవచ్చుటచే మిక్కిలి సంతోషించితిని. మీరు త్రోవనడచుటచేఁ జాల బడలినారు. ఈ స్త్రీరత్నము సీతాదేవి స్పష్టముగ బడలిక పాపుకొన మనస్సునఁ గోరుచున్నది. ఏలన నీమె రాచకూఁతురు. సుకుమారదేహము గలది. ఎన్నఁడు కష్టపడినదిగాదు.

ఉ. అట్టి కుమారి కష్టనిచ♦యంబుల కెల్లను నాటపట్టులై
నట్టి వనంబులన్ ధవుని♦యందలి నిట్టలమైనభక్తిచే

నిట్టులు వచ్చి దుష్కరము ♦ నీమె ఘటించెను, గాన నీమె కె
ట్టెట్టు సుఖంబో యట్లు చరి♦యింపుము సొంపుగ నిందు రాఘవా. ౨౦౫

కుమారి=చిన్నవయస్సుది, ఇప్పటికి సీతాదేవికి ముప్పది సంవత్సరముల వయస్సు; కష్టనిచయంబులకున్ = కష్టసమూహములకు, ఆటపట్టులు = క్రీడాస్థానములు, నిట్టలము = గాఢము, దుష్కరము=కష్టకార్యము.

తాత్పర్యము.

అటువంటి చిన్నవయస్సుది, కష్టసమూహములకెల్లను స్థానమైన యడవులందు భర్తయందుఁగల గాఢమైన భక్తిచే నీ ప్రకారము వచ్చి యసాధ్యకార్యము చేసిన దయ్యెను. కావున నీవు నుపేక్షలేక యామె కేది సుఖమో దానినే శ్రీరామచంద్రా! చేయుచుండుము. మీ దిక్కుడనే హాయిగా నుండవచ్చును.

కం. సృష్టి మొదలుకొని జగమున, స్పష్టముగ స్త్రీలు మగని ♦ సౌఖ్యదశం దా
రిష్టుం డని రంజింతురు, కష్టంబులు వచ్చెనేని ♦ కడ కీడ్తు రయా. ౨౦౬

తాత్పర్యము.

ప్రపంచము పుట్టినది మొదలు స్త్రీల లక్షణ మేమందువా భర్త తమ్ము సుఖదశయందుంచెనా యతఁడు ప్రియుఁడని సంతోషింపఁజేయుదురు. తాము సంతోషింతురు - వానికిఁ గష్టదశ ప్రాప్తించెనా వానినిదూరముగాఁ ద్రోచి స్వేచ్ఛగాఁ జరింతురు.

కం. మెఱపుల చాంచల్యంబును, గఱకుఁదనంబునను వాఁడి♦కత్తులబిఱుసున్
నెఱవడి గరుడానిలముల,పఱపును దెఱవలకు నెందుఁ♦బ్రకృతిగుణంబుల్. ౨౦౭

నెఱివడిన్=మిక్కిలి వేగమున, తెఱవలకు=స్త్రీలకు.

తాత్పర్యము.

మెఱపు లెంత చంచలములో స్త్రీల మనస్సు లంత చంచలములు - కఱకుఁదనమునఁ బదునైన కత్తుల బిఱుసెట్టిదో వారిహృదయము లట్టివి - ఎన్నిదినాల స్నేహమైనను వారు నిమిషమునఁ దెగఁ గోయఁగలరు. ఇఁక విషయములందు గరుడుని వేగము వాయువేగము గలవై వారిమనస్సులు నిండు వేగమునఁ బరువెత్తును. మెఱపువలె వక్రమైన బుద్ధిని నొకపురుషునిమీఁదినుండి మఱియొక పురుషుని మీఁదికి మెఱపు మెఱిసినంతలో మార్పఁగలరు. ఇఁకస్నేహము తెగఁదీయుటయందుఁ బదునైనకత్తితో నఱికినట్టే-దయాదాక్షిణ్యములు జంకుగొంకు ఉండదు.ఇవి స్త్రీలకుఁ బుట్టువుతోనే వచ్చిన స్వభావగుణములు.

కం. ఈ నీయిల్లాలియెడం, గానంగా రాదు దోష♦కణమేనియు ని
మ్మానవతి సతీజనస, మ్మానితయ యరుంధతీస♦మాన తలంపన్. ౨౦౮

ఇది సాధారణ స్త్రీసముదాయముయొక్క లక్షణము-నీ భార్యయం దిట్టిలక్షణములు లేవనుచున్నాఁడు.

దోషకణము=అల్పదోషము - సతీజన=పతివ్రతాజనులచే, సమ్మానితయ=గౌర వింపఁబడినదే - పతివ్రతలగు వారుకూడ నీమె గొప్ప పతివ్రత యని యీమెను బూజింతురు.

తా త్ప ర్య ము .

ఈ నీ యిల్లాలగు సీతాదేవియందు నిట్టిదోష మొకటియైన నల్పమైన లేదు - ఈమె పతివ్రతలచేఁ బూజింపఁబడినది - ఆ యరుంధతియే యీమెకు సమానురాలు.

ఈ ప్రకారము సీతాదేవి నగస్త్యుఁడు స్తుతించుట యామె మనస్సును బాతి వ్రత్యమునందు స్థిరపఱచుటకేకాక పరపురుష సాంగత్యము నొల్లక రావణునకు లోఁబడక చెఱసాలయందు నవయు దేవతాదిస్త్రీలనుగూడ చెఱనుండి విడిపింప వలయు నను బుద్ధి యామెకుఁబుట్టుటకే - ఆమె చెఱ యనుభవించినది యీ యుద్దేశము తోనే కదా.

కం. ఈవైదేహియు లక్ష్మణుఁ, డీవును వసియింపఁ గలుగు♦నీ దేశము రా
మా! వితతాలంకృతమై, పావన మగు నన్న రామ♦భద్రుఁడు పలికెన్. ౨౦౯

తా త్ప ర్య ము .

ఇటువంటి యీ సీతాదేవియు నీ సేవకై స్వార్థము సర్వము త్యాగము చేసిన యీలక్ష్మణుఁడు, ఇటువంటి వారిసేవకు యోగ్యుఁడవగు నీవును, నీదేశమందుందు వేని రామచంద్రా! యిది మిక్కిలి యలంకరింపఁబడినదై పవిత్రమగును - అని చెప్పఁగా రామచంద్రమూర్తి యిట్లనెను.

కం. దారానుజయుక్తుఁడనై, ఘోరాటవిఁ దిరుగు నాదు♦గుణములు నీకున్
గూరిచె ముద మటు గాన ను,దారగుణా! నీదుకృపను♦ ధన్యుఁడనైతిన్. ౨౧౦

దారానుజయుక్తుఁడనై=భార్యతోను దమ్మునితోను గూడినవాఁడనై - ఘోరా టవిన్=భయంకరమైన యరణ్యమందు.

తా త్ప ర్య ము.

భార్యతోను దమ్మునితో భయంకరమైన యడవియందుఁ దిరుగు నాగుణములు నీకు సంతోషము గలిగించెఁ గావున నీ దయచే నేను ధన్యుఁడనైతిని.

ఆ. నీటివలను గలిగి ♦ నిండార నడవులు, గలుగు నాశ్రమంబుఁ ♦ గరుణ మీఱ
నానతీయ వయ్య యచ్చోటఁ గాలంబు, గడువు దీఱ దాఁక ♦ గడపువాఁడ. ౨౧౧

తా త్ప ర్య ము.

జలసౌకర్యముగలదై దట్టముగ నడవులుండు ప్రదేశమేదో దానిని దెలుపుము. అచ్చటనుండి వ్రతకాలము దీఱువఱకుఁ గాలముఁ గడపెదను.

కం. ఇటు రాముఁ డడుగఁగా నొక, త్రుటి యాలోచించి విగత♦దోషుఁడు పలికెన్
స్ఫుటధీరతరోక్తులతోఁ, బటుతరగుణభద్ర! రామ♦భద్రా! వినుమా. ౨౧౨

త్రుటి=అల్పకాలము, విగత దోషుఁడు=దోషములేనివాఁడు. స్ఫుట=స్పష్టమైన, ధీరతర=మిగుల ధైర్యముగల, ఉక్తులతో=మాటలతో.

తా త్ప ర్య ము.

ఈప్రకారము శ్రీరామచంద్రమూర్తి యడుగఁగా నల్పకాల మాలోచించి దోషరహితుఁడగు నగస్త్యుఁడు స్పష్టమైధీరములయిన మాటలతో మిగుల గొప్ప కల్యాణగుణములు గలవాఁడా! శ్రీరామభద్రా! వినుము.

ఒకత్రుటి యాలోచించి=ఋషీశ్వరు లందఱు తోడుదొంగలు - సీతారామ లక్ష్మణులను ఎట్లులైనఁ బంచవటిఁ జేర్పవలయునని యందఱు కలసి యాలోచించిన వారే. ఆకారణముచేతనే దానికి సమీపమున నుండు నగస్త్యాశ్రమమునకుఁ గడపటఁ దెచ్చి చేర్చిరి. కాఁబట్టి స్థలవిషయమై యాలోచింపవలసినది లేదు. ఇఁక నాలోచన యేమనఁగా వీ రక్కడఁ జేరిరేని వీరికిఁ గష్టములు తప్పవు. రాక్షసులతోఁ బోరు సిద్ధము; సీతాపహరణము సత్యము; దుస్సహదుఃఖానుభవము సత్యము. దీనికిఁ గారణభూతుఁడను నేనైయా దోష మనుభవింపవలసివచ్చునేమో యని యాలోచన. అదియునుగాక యిక్కడనే యుందు మని వచ్చినవాఁడు వేఱొకచోటికిఁబోయెద ననుచున్నాఁడే యేమికారణమై యుండు నని యాలోచన.

విగతదోషుఁడు: ఇదిదోషముగాదని యీపదము తెలుపుచున్నది. సీతారామ లక్ష్మణులను బంచవటిని జేర్చుటయందు వారు కష్టములపాలై దుఃఖము లనుభవింప వలయు నను క్రోధ మగస్త్యునందులేదు - ఆయనకు స్వార్థలాభములేదు - అది లోక క్షేమంకరకార్యము - కావున దోషము లేదని తీరుమానించుకొనెను - అదియునుగాక రామచంద్రమూర్తియే యచటకుఁ బోవ నాలోచించినపుడు ప్రేరకత్వముకూడ నగ స్త్యునందులేదు - భగవత్సంకల్పమున కనుకూలుఁ డగుటయే కదా భక్తునకుఁ బ్రథమకార్యము.

ఇట్లు దోషములేదని నిశ్చయించుకొని వారికిఁ గష్టము గలిగినను దానివలనఁ జెడిపోవునది యేదియునులేదు. సీతకును భయము లేదు. రామలక్ష్మణులకు భయము లేదు. ఒకసంవత్సరము వీరు కష్టపడినఁ గలకాలము లోకము సుఖపడును. అని ధైర్యము తెచ్చుకొని నిస్సందేహ వాక్కులతో ధీరుఁడై చెప్పెనని గ్రాహ్యము.

రామభద్రా యనుటలో భద్ర శబ్దము మంగళాశాసనము. స్ఫుటతర గుణ భద్ర యనుటలో నీకల్యాణగుణములే నీకు మేలుకలుగఁజేయును అని హెచ్చరిక.

కం. బహుమూలఫలోదక మై, బహుమృగసంకీర్ణ మగుచుఁ ♦ బంచవటి యనన్
మహిత మగు తలము సౌఖ్యావహ మిట కామడలు రెండు♦ వర్తిలు దవ్వై.౧౩

బహుమూలఫలోదకమై = విస్తారముగ మూలములు ఫలములు జలములు గలదై - బహుమృగ సంకీర్ణము=అనేక జంతువులచే వ్యాపించినది, సౌఖ్యావహము= సుఖము గలిగించునది.

తా త్ప ర్య ము.

విస్తారముగ మూలములు ఫలములు జలములు గలదై నానా మృగములచేఁ గూడినదై పంచవటి యను పేరుగల యొక గొప్పస్థల మిచ్చటికి రెండామడ దూర మందున్నది. అది సుఖమైన ప్రదేశము.

కం. చని యట నాశ్రమసంస్థా,పన మొనరిచి యీ సుమిత్రఁ బట్టియు మీరుం
జనకుని వాక్యము నడపుఁడు, చనియెం బెద్దయుఁ ద్వదీయ సమయాబ్దంబుల్. ౨౧౪

త్వదీయసమయాబ్దంబుల్=మీరు నియమించుకొనిన గడువు సంవత్సరములు, పెద్దయు=చాలభాగము- ౧౩-సంవత్సరములు- చనియెన్.

తా త్ప ర్య ము.

మీరు నియమించుకొనిన గడువు పదునాలుగు సంవత్సరములలోఁ జాల గాలము గడచిపోయినది, తక్కిన కాలము మీ రచట నాశ్రమము స్థాపించుకొని మీరు దంపతులును లక్ష్మణుఁడును దండ్రివాక్యముఁ బాలింపుఁడు.

కం. ప్రతినను దీరిచి ధరకుం, బతివై సుఖపడెదు రామభద్రా మరలన్
క్షితిపతి యయాతివలెఁ దొలి,సుతుఁ డగు నీచేఁ దరించి సుగతిం బడసెన్. ౨౧౫

ప్రతినను=ప్రతిజ్ఞను, క్షితిపతి=దశరథుఁడు, సుగతిన్=పుణ్యాలోకమును.

తా త్ప ర్య ము.

రామచంద్రా! నీవు పదునాలుగు సంవత్సరములు వనవాసము చేసెద నని చేసిన ప్రతిజ్ఞను బూర్ణముగ నెఱవేర్చి రాజవై సుఖించెదవు. నీవు పెద్దకొడు కగుటచే నీ తండ్రి తనకొడుకు యయాతి తనకోరిక నెరవేర్చుకొని సుఖించినట్లు పుణ్యలోకమును బొందెను.

కం. ఎఱిఁగితి నీవృత్తాంతముఁ, గొఱలెడి దశరథమహీశు కూరిమిచేతన్
గఱుకొని తపోబలంబున, మఱియును నీ లోని తలఁపు మార్గముఁ గంటిన్. ౨౧౬

తా త్ప ర్య ము.

దశరథునిపై నాకుఁగల ప్రేమచే నతనికుమారుఁడవైన నీ చరిత్ర మంతయును నీలోని యాలోచనవిధమును నా తపోబలముచేఁ దెలిసికొంటిని. నేనేమి యాలోచించితి నంటివా. నీ విచ్చటికి వచ్చుచు "వనవాస శేషంబు దినము నీతనిఁ గొల్చియుందమ యుందము మహానందముగను" అని చెప్పితివి. ఆ యభిప్రాయము ననుసరించి నేనును మీ రిందు నుండుఁ డంటిని. నీ వా యభిప్రాయము మార్చుకొని నీటివలను గలిగి నిండారు నడవులు గలుగు నాశ్రమంబు దెలుపు మంటివి. ఇక్కడ నుండఁ దలఁచిన వాఁడేల వేఱొకస్థల మడుగుచున్నాఁడని త్రుటి యాలోచించితిని. నీ యభిప్రాయము దెలిసికొని నేనును మీరు పంచవటికిఁ బొండని చెప్పితిని.

కం. కావున మీ రిట నాతో,నావాసము జేయుఁ డనుచు ననుమతి యిడియున్
బోవలయుఁ బంచవటి కని, నే వలసెం జెప్ప మీకు నీరజనేత్రా. ౨౧౭

తా త్ప ర్య ము.

ఈకారణముచే నాతోడ మీరు నివసింపుఁడని తొలుతఁ జెప్పియు మరలఁ బంచవటికిఁ బొండని మీకుఁ జెప్పవలసివచ్చెను. నీసంకల్పమునకు నన్యథా నేనేల వర్తింతును.

శా. రామా! యయ్యది శ్లాఘనీయము, గడుఁ ♦ రమ్యంబు, గోదావరీ
శ్రీమన్నిమ్నగ దాపు, పండ్లు సుమనో♦బృందంబు కొల్లల్, ఖగ
స్తోమంబుల్ మృగముల్ మహాద్భుతముఁ గూ♦ర్చుం నిచ్చ, లేకాంత, మెం
తే మోదంబు ఘటించు సీత, కిట కెం♦తే దూరముం గాదు సూ.     ౨౧

శ్లాఘనీయము = పొగడఁదగినది, శ్రీమన్నిమ్నగ=అందమైనది, దాపు= సమీపమందేయున్నది, సుమనోబృందంబు= పూలసమూహము, ఖగస్తోమంబుల్ = పక్షులగుంపులు, నిచ్చలు=సర్వదా, ఏకాంతము=నిర్జనము, ఎంతేన్ = మిక్కిలి.

తా త్ప ర్య ము.

శ్రీరామచంద్రా! యది మిగులఁగొనియాడఁదగిన ప్రదేశము. మిక్కిలి యందమైనది. గోదావరినది సమీపమందేయున్నది. పండ్లు పూలు దండి, పక్షులు మృగములు ఆశ్చర్యము కలిగించును, జను లుండినది కాదు, సీతకు మిక్కిలి సంతోషకరముగా నుండును, ఇచ్చటికిఁ జాలదూరమును గాదు.

కం. మీరును జానకితోఁ ద, ద్ధారిణి వసియించి కాచి ♦ తాపసజనముల్
పేరిమి విహరింపుఁడు చను, దారి నెఱింగింతు నీకుఁ ♦ దత్స్థలమునకున్.     ౨౧

తా త్ప ర్య ము.

మీరును జానకితో నా ప్రదేశమం దుండి తపస్వులను రక్షించి గొప్ప పేరు వహించి సంచరింపుఁడు - అచ్చటికిఁబోవు మార్గముఁ దెలిపెదను.

మీ రా ధారిణి వసియించి యనినఁజాలునే - జానకితోనని యామెను బ్రత్యేకించి చెప్పనేల? కాచి తాపస జనముల్=నిర్మనుష్యమైన ప్రదేశము- అందు రాక్షస భూమి అక్కడనుండియే తపస్వులను రక్షింప నెట్లు సాధ్యము? అక్కడనుండిన 'పేరేమి' యెట్లు గలుగును? ఇవన్ని యాలోచించి చూడఁ గాఁగల విషయముల నెఱిఁగియే యగస్త్యుఁడు మాట్లాడుచున్నాఁ డనుట స్పష్టము.

మ. అదిగోఁ జూడుమ యిప్పతోఁపు రఘురా♦మా! కాన నా; దాని కా
యుదగాశం జని తేని మత్తి యట డా♦యుల్ మిన్ను మ్మ, నా పిమ్మటల్
బొదలుల్ మిట్టుతలంబు నిర్వణము, ద♦ద్భూమిం దరింపంగ నం
దొదవుం బర్వత మొండు, పంచవటి పొ♦ల్పొప్పుం జుమీ చేరువన్.     ౨౨౦

ఉదగాశన్ = ఉత్తరపు దిక్కునందు - నిర్వణము - నిర్ + వనము=వనము లేనిది - బయలు - తరింపఁగన్ = దాఁటిపోవ - చేరువన్ = ఆ పర్వత సమీపమందు.

తాత్పర్యము.

రామచంద్రా! యిదిగోఁ జూడుము - ఇప్పుడోఁపు కానవచ్చుచున్నది - దాని కుత్తరముగఁ బోయిన నొక మఱ్ఱిచెట్టు గానవచ్చును. ఆవల మిట్టప్రదేశము -చెట్లులేని బయలున్నది. అది దాఁటిపోయిన నొక పర్వతముగలదు - దాని సమీపమందే పంచవటియున్నది.

తే. నావుడును ముని కభివాద•నం బొనర్చి, సెలవుఁ గొని రణవీరులు ♦ సీతతోడ
నుద్ధృతాయుధహస్తులై ♦ యొయ్యఁ జనిరి, పంచవటికిని నిర్దిష్ట•పథముఁ బట్టి.

అభివాదనము = సాష్టాంగ నమస్కారము, రణవీరులు = యుద్ధమునందు పరాక్రమముగలవారు, ఉద్ధృతాయుధ హస్తులై = ఎత్తఁబడిన యాయుధములు గల చేతులుగలవారై, నిర్దిష్టపథముఁబట్టి = అగస్త్యుఁడు చెప్పిన జాడపట్టుకొని.

తాత్పర్యము.

అని చెప్పఁగా రామలక్ష్మణులు మునీశ్వరునకు నమస్కరించి యాయనయొద్ద సెలవు తీసికొని యెత్తఁబడిన యాయుధములుగల చేతులుగలవారై యా రణవీరులు సీతతోడ, నగస్త్యుఁడు చూపిన జాడపట్టుకొని పంచవటికి మెల్లగాఁబోయిరి.

ఈ పద్యమునందలి రణవీరులు, ఉద్ధృతాయుధహస్తులు అనుపదములు వీరు యుద్ధసన్నద్ధులై పోయిరని తెలుపుచున్నవి. ఇచ్చటఁ బాఠకుల కొక సందేహముకలుగ వచ్చును. అనసూయాదేవి సీతాదేవి నాదరించినట్టు లగస్త్యునిభార్య లోపాముద్ర యేల యామెను నాదరింపలేదు. ఆమె పేరు ప్రస్తావనకూడలేదే, యేల?

ఆశ్రమమందు లోపాముద్ర లేదు. అగస్త్యున కనేకాశ్రమములుగలవు. బ్రహ్మగిరి (కూర్గుమండలమున) యను పర్వతమం దగస్త్యుఁడొకసారి తపస్సుచేయుచు తన భార్యను లోపాముద్ర నొంటిగా విడిచియుండ నొల్లక యామెను దన కమండలు పాత్రమునందుంచి తపమునకుఁబోయెను. ఆవల నొక కాకివచ్చి యా పాత్రమును బోరగిలఁ ద్రోసెను. ఆ నిర్బంధమును సహింపలేకయుండిన లోపాముద్ర తన తపశ్శక్తిచే నేతైపాఱెను. ఆ నదికే కావేరి యనుపేరు. ఈ కావేరిపేరు సుగ్రీవుఁడు చెప్పుటచే (కిష్కింధ. ౧౦౫౪) నిప్పటికే యామె నదియైనట్లు తెలియనగు. ఉత్తరము వారికి గంగయెట్టిదో దాక్షిణాత్యులకుఁ గావేరి యట్టిది. దానిని వారు గంగయనియే పిలుతురు.

—♦ ౧౪-వ సర్గము, శ్రీరాముఁడు జటాయువుం జూచుట. ♦—

సీ. అరుగుచో వారు మ♦హాకాయు గృధ్రేశు, భూరివిక్రము వట♦భూజసంస్థుఁ
గని దైత్యుఁ డని♦యెంచి కడిమి నీ వెవ్వఁడ, వన నాతఁ డనియె న♦త్యంతసౌమ్య
భంగిని మధురోక్తిఁ ♦ బరమసంప్రీతిని, వత్స మీ తండ్రికిఁ ♦ బరమసఖుఁడ
నా విని వార లా♦నందంబుతో నాత్మ, జనకవయస్యుని ♦ సత్కరించి

ఆ. యేమి పేర టన్న ♦ నెలమి నాతఁడు దన, పూర్వవంశకథను ♦ బూర్ణముగను
జెప్పఁ దొడఁగె నిట్లు ♦ శ్రీరాముతోడుత, సర్వభూతజన్మ♦సహితముగను.

మహాకాయమ్=గొప్ప దేహముగలవానిని, గృధ్రమ్=గ్రద్దలకు రాజైన వానిని, భూరివిక్రమమ్=అధికపరాక్రమము గలవానిని, వటభూజసంస్థమ్=మఱ్ఱిచెట్టుపై నున్న వానిని,అత్యంత సౌమ్యభంగిని=మిక్కిలి మంచిమాటలతో, మధురోక్తిః=తియ్యనిమాటలతో, వత్స=నాయనా, దీనిని గొందఱు శబ్దానభిజ్ఞులు ప్రథమ బహు. యందు వత్సలనుచున్నారు. అది సరిగాదు, పరమసఖుఁడ=మిక్కిలి మిత్రుఁడను, ఆత్మజనక వయస్యుని=తమ తండ్రిస్నేహితుని, సత్కరించి=తండ్రిని గౌరవించునట్లు గౌరవించి, తండ్రికి ముఖ్యస్నేహితులు తండ్రివలెనే పూజ్యులు, సర్వభూత జన్మసహితముగను=సమస్త భూతములు పుట్టిన విధముతో.

తాత్పర్యము.

అట్టివారు పోవునపుడు పెద్దదేహము గల గ్రద్దరాజును మహాపరాక్రమవంతుని అగస్త్యుఁడు చెప్పిన మఱ్ఱిచెట్టుపై నుండు వానిని జూచి రాక్షసుఁ డీరూపము ధరించి యున్నాఁడని తలఁచి బలముదెలియ నెవ్వఁడవు నీవు అని యడుగఁగా నతఁడు మిగుల మంచిమాటలతోఁ దియ్యనిపలుకులతో సంతోషముతో నాయనా! రామచంద్రా! మీ తండ్రికి నేను మిక్కిలి ప్రియమైన స్నేహితుఁడను అని చెప్పఁగా వారు మిగుల సంతోషించి తమతండ్రి మిత్రుని దండ్రినివలె గౌరవించి, యయ్యా! నీ పేరేమనిన జటాయువు తన పూర్వకథను భూతములు పుట్టినవిధము మొదలుకొని చెప్పఁ దొడఁగెను.

సీ. భూతసృష్టికి బీజ♦భూతు లై మును ప్రజా,పతు లనఁ గలిగిరి ♦ పరమయశులు
వారిలోఁ బ్రథముఁడు ♦ వఱలెఁ గర్దముఁ డన, విక్రీతుఁ డాతని ♦ వెనుక శేష
సంశ్రయుల్ పిమ్మట ♦ స్థాణుమరీచ్యత్రి,లును గ్రతువు పులస్త్యుఁ♦డును గలిగిరి
యంగిరుండు ప్రచేతుఁ ♦ డావలఁ బులహుండు, దక్ష వివస్వంతు ♦ లక్షయమతి
తే. కశ్యపుఁడు కడగొట్టుగాఁ ♦ గలిగి రందు
దక్షునకు నఱువదిగురు ♦ తనయ లుద్భ
వింప నెనమండ్ర వారిలోఁ ♦ బెండ్లి యాడెఁ
గశ్యపుఁడు వారి పేరులు ♦ కరుణ వినుము. ౨౨౩

బీజభూతులై=విత్తనమువంటివారై, కారణమై.

తాత్పర్యము.

భూతసృష్టికిఁ గారణభూతులై పూర్వము కొందఱు ప్రజాపతులు గలిగిరి. వారిలో మొదటివాఁడు కర్దముఁడు, ఆవల విక్రీతుఁడు, శేషుఁడు, సంశ్రయుఁడు, స్థాణువు, మరీచి, అత్రి, క్రతువు, పులస్త్యుఁడు, అంగిరుఁడు, ప్రచేతుఁడు, పులహుఁడు, దక్షుఁడు, వివస్వతుఁడు, కడపటివాఁడు, కశ్యపుఁడు. వీరిలో దక్షునకు నఱువదిగురు

పుత్రికలుపుట్టిరి. వారిలో నెనమండ్రను గశ్యపుఁడు పెండ్లియాడెను. వా రెవ్వరనిన వారి పేరులు వినుము.

తే. అదితి దితియును దనువును ♦ నతులచరిత!
కాళియును గ్రోధవశ యను♦కలికి తామ్ర
మనువు ననలయు నందురు ♦ మాననతుల
నాండ్రఁ గనుఁగొని కశ్యపుఁ ♦ డనియె నిట్లు. ౨౨౪

తాత్పర్యము.

అదితి - దితి - దనువు - కాళి - క్రోధవశ - తామ్ర - మనువు - అనల: ఈ యెనమండ్రను భార్యలుగా గ్రహించి కశ్యపుఁడు వారితో నిట్లనియె.

కం. మీరు త్రిలోకీరక్షణ, భూరిక్షము లైనవారిఁ ♦ బుత్రులఁ గనుఁడీ
పేరిమి మత్తుల్యుల నన, నారులు తొలినల్వు రొప్పి♦నం దక్కసతుల్. ౨౨౫

త్రిలోకీ=మూఁడులోకముల, సమాహారద్విగుసమాసము, కావున త్రిలోకి యని రూపము, రక్షణ=రక్షించుటయందు, భూరిక్షములు=మిగుల సమర్థులు, మత్తుల్యులన్=నాతో సమానులైనవారిని, నారులు=స్త్రీలు, తొలినల్వురు=మొదటఁ జెప్పఁబడిన నలువురు.

తాత్పర్యము.

మీరు మూఁడులోకములను రక్షించుటకు సమర్థులైన వారిని నాతో సమానులను గొడుకులఁ గనుఁడు. అని చెప్పఁగా మొదటఁ జెప్పిన నలువురు అదితి దితి దనువు కాళి యనువారు దాని కంగీకరించిరి.

ఆ. సమ్మతింపరైరి ♦ సరవి ముప్పది మువ్వు,రైన సుతులఁ గనియె ♦ నదితి యందు
వారలైరి రుద్ర♦వస్వాశ్వినేయు లా,దిత్యు లనఁగఁ బరఁగు ♦ దేవవరులు. ౨౨౬

తాత్పర్యము.

తక్కినస్త్రీలు భర్తమాట నంగీకరింపరైరి. అందు అదితి పదునొకండ్రు రుద్రులను, ఎనిమిదిమంది వసువులను, ఇరువు రాశ్వినేయులను, పండ్రెండుగురు ఆదిత్యులను ముప్పదిమువ్వురను దేవతలను గనెను. వీరు స్వర్గవాసులు.

తే. దితికి దైత్యులు గలిగి రీ క్షితితలంబు, వారలదియ ససాగర♦వనము మున్ను
దనువునకును నశ్వగ్రీవుఁ ♦ డనఁగఁబుట్టెఁ, గాళికకు నరకుండును ♦ గాలకుండు. ౨౨౭

తాత్పర్యము.

దితికి దైత్యులు గలిగిరి. సముద్రముతో వనములతోఁ దొలుత నీభూమియంతయు వారిదే. దనువునకు నశ్వగ్రీవుఁ డనువాఁడును కాళికకు నరకుఁడు కాలకుఁడు ననువారు జన్మించిరి.

దీనివలన భర్తయందలి భక్తికొలఁది ఫలము గలిగెనని గ్రాహ్యము.

సీ. కలిగిరి తామ్రకుఁ ♦ గ్రౌంచియు భాసియు శ్యేనియు ధృతరాష్ట్రి ♦ చెలఁగి శుకియుఁ
గన్యక లేవురు ♦ క్రౌంచి యులూకాళి, భాసి భాసంబులఁ ♦ బ్రసవ మయ్యె
శ్యేనియు గృధ్రాళి ♦ శ్యేనంబులను గనె, ధృతరాష్ట్రి హంసల ♦ నుతగుణాఢ్య
కలహంసచక్రవా♦కంబుల శుకియును, నతఁ గాంచె, నతకు వి♦నత జనించెఁ
తే. గ్రోధవశకును బదుగురు♦కూఁతులైరి
సురస మృగమంద హరి శ్వేత ♦ సురభి భద్ర
మదయు మాతంగి శార్దూలి ♦ మఱియుఁ గద్రు
కయును మృగియును; మృగికి మృ♦గంబు లొదవె.          ౨౨

తాత్పర్యము.

తామ్ర యనుదానికి క్రౌంచి, భాసి, శ్యేని, ధృతరాష్ట్రి, శుకి యను కన్యకలైదుగురు గలిగిరి. అందు క్రౌంచి యులూకములను (గూబలను) భాసి భాసములను బ్రసవించెను. శ్యేని గ్రద్దలను డేగలను గనెను. ధృతరాష్ట్రి హంసలను కలహంసలను చక్రవాకములను గనెను. శుకి నతను గనెను. నత వినతను గాంచెను. క్రోధయను భార్యకుఁ బదుగురుకూఁతులు సురస, మృగమంద, హరి, శ్వేత, సురభి, భద్రమద, మాతంగి, శార్దూలి, కద్రిక, మృగియుఁ గలిగిరి. మృగికి జింకలు గలిగెను.

సీ. మృగమందకును గల్గె♦ బుఋక్షముల్ సృమరముల్, చమరముల్, హరికి సిం♦హములుఁ
భద్రిమదకు రామ♦భద్ర! యిరావతి, దానికి నైరావ♦తంబు గజము [గపులు
మాతంగికిని బుట్టె♦మాతంగములు, వ్యాఘ్రములును గోలాంగూల♦ములునుగలిగె
శార్దూలికిని; దిగ్గజంబులు శ్వేతకు, సురభికి రోహిణి ♦ సురుచిరాంగ
తే. మఱియు గంధర్వి, నాలు సం♦భవము లయ్యె
రోహిణికిని, గంధర్వికి ♦ వాహవితతి;
సురస బహుఫణముల నాగ♦వరులఁ గాంచెఁ
గద్రువకుఁ బన్నగంబులు ♦ గలిగె నయ్య.

తాత్పర్యము.

మృగమంద యనుదానికి ఎలుఁగులు సృమరములు చమరములు జనించెను. హరి యనుదానికి సింహములు భద్రమదకు నిరావతి, దాని కైరావతగజము, మాతంగములు, శార్దూలికి వ్యాఘ్రములు గోలాంగూలములు, శ్వేతకు దిగ్గజములు, సురభికి రోహిణి, గంధర్వి, అందు రోహిణికి గోవులు గంధర్వికి గుఱ్ఱములు జనించెను. సురస పెక్కు పడగలుగల నాగులఁ గాంచెను. కద్రివకుఁ బాములు కలిగెను.

సీ. మను వనుదానికి ♦ మనుజులు పుట్టిరి, బ్రాహ్మణ క్షత్రియ♦వైశ్యశూద్రు
లనువారు సర్వపు♦ణ్యఫలవృక్షంబుల, ననలాఖ్య గనియెను ♦ వినతయనెడు
శుకి సుతాసుతకును ♦ సుతు లరుణుండును, గరుడుండు నాఁగను ♦ గలిగిరయ్య
సురస తోఁబుట్టువౌ ♦ సుదతికిఁ గద్రువ,కును ధరణీభరం ♦ బును వహించు

తే. వేయిపడగల శేషుండు ♦ వెలసె నందు, నరుణసుతుఁ డను సంపాతి ♦ కవరజుండ
నన ఘనన్ను జటాయు వ♦టండ్రు శ్యేని, కాత్మజుఁడ నిష్టమేని సా♦యం బొనర్తు.
తాత్పర్యము,

మనువను దానికి మనుష్యులు పుట్టిరి. మానవులు మనుజులు అను శబ్దమునకు నిదియే సరియైన వ్యుత్పత్తిగా నున్నది. మనుస్మృతికారుఁడైన మనువుచేఁ బాలింపఁబడువారు మానవులు మనుజులు ననవచ్చును. ఈ మనుజులలో నాలుగుభేదములు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లనువారు. అనలకు సమస్తమైన ఫలవృక్షములు జనించెను. శుకి కూఁతురగు నతకూఁతురయిన వినతకు అరుణుఁడు గరుడుఁడని యిరువురు కొడుకులు. సురస చెల్లెలగు కద్రువకు భూమిని మోయు వేయిపడగల శేషుఁడు వెలసె. కద్రూశబ్ద ముకారాంతమైనను తత్సమమున కద్రువయని రూపమేకాని కద్రువు అనికాదు. కద్రువ నాగమాత, బా. వ్యా. కద్రువవంశమును మరలఁ జెప్పుటకు అట్టి లోకానిష్టకారులైన పాములను వధించి విష్ణువు వాహనమైన గరుత్మంతుని వంశమువాఁడను నేనని తన ప్రఖ్యాతికై జటాయువు చెప్పెనని కొందఱు తన వంశమువలెఁ గద్రువవంశము ప్రసిద్ధమని తెలుపుటకై యని మఱికొందఱు మరలఁ జెప్పఁబడె నందురు. అరుణుని సుతుఁడను, తొడలులేనివాఁడు కావున నీ యరుణునకు ననూరుఁడని పేరు. ఎఱ్ఱనివాఁడు కావున నరుణుఁ డనిపేరు. సంపాతి యనువానికిఁ దమ్ముడను, నాపేరు జటాయువని యందురు. శ్యేనికుమారుఁడను. నీకిష్టమేని నీకు నేను సహాయము చేసెదను.

జటాయువంశ పరంపర.

కశ్యపుఁడు - శుకి - నత - వినత - అనూరుఁడు - జటాయువు. కావునఁ గశ్యపునకు నాఱవవాఁడు జటాయువు.

శ్యేని శుకియను వా రిరువురు కశ్యపుని భార్యయగు తామ్ర కూఁతుండ్రు. ఈ శ్యేని మునిమనుమనిభార్య యెట్లయ్యె నని సందేహము. తన తల్లిపేరు శ్యేనియని జటాయువు చెప్పెనేకాని తనకు ముత్తవ్వయని చెప్పలేదు. కావున ఆమె పేరుగలది మఱియొకతె యని తలంపవలయును. అటుగాదు, శుకి సోదరి శ్యేనియందు రేని మనుజులందఱు నొక మనువు బిడ్డలే కదా, సోదరన్యాయమేకదా ? ఎట్లు స్త్రీపురుషు లొకరి నొకరు వివాహమాడుచున్నారు. విధినిషేధములు మనుష్యులందేకాని మృగపక్షులందు లేవు. పురాణాంతరములందు సృష్టివిధము మరియొకరీతిగా నున్నది. ఇది వైవస్వత మన్వంతర వృత్తాంతము.

క. కాంతారము దుర్గము దు,ర్దాంతము రక్షోన్వితంబు ♦ రామా ! మృగయా
స్వాంతమున మీరు చన నే, కాంతంబుగ నున్నసీతఁ ♦ గడిమిం గాతున్. ౹౩౧

కాంతారము=అడవి, దుర్గము= చొరరానిది. రక్షః+అనిత్యము = రాక్షసులతోఁగూడినది,దుర్దాంతము=త్రోవలు కొట్టుటకు రాక్షసబాధ యణఁచుటకు సాధ్యము

కానిది - మృగయాప్రాంతమునన్ = వేటయందలి మనస్సుచే - ఏకాంతంబుగ= ఒంటరిగ - కడిమిన్=నాబలముచే - కాతున్ = రక్షింతును.

తాత్పర్యము.

మా కితరుల సాహాయ్యమేల? నీవేమి సహాయము చేయఁగల వందువేమో? ఈ యడవి ప్రవేశింపరానిది. త్రోవలు డొంకలు సరిగా లేవు - జనసంచారము లేనిది - కంపలుకొట్టి త్రోవలుచేయుటకు సాధ్యపడదు - అదియును గాక రాక్షసు లుండు చోటు. ఈ సందర్భమున మీరిరువురు వేటకై పోయినపుడు సీతాదేవి యొంటరిగాఁ గదా యుండును. అప్పుడు మృగబాధ రాక్షసబాధ లేకుండ నాబలముచే నామెను రక్షింతును.

చం. అనుడు జటాయువాక్యముల ♦ నంతయు నాదట నాలకించి యా
జనకహితుం గవుంగిటను ♦ సమ్మతిఁ గ్రుచ్చుచు మైత్రిగాధలన్
వినుచును నప్పగించి పృథి♦వీసుత నాతనికిన్ సహాయుఁడై
యనఘుఁడు తోడ రాఁగఁ జని ♦ రందఱుఁ బంచవటిం గనుంగొనన్. ౨౩౨

ఆదటన్=ప్రీతితో - మైత్రిగాధలన్=జటాయువునకు దశరథునకుఁ గలిగినస్నేహ విధము-ఎప్పుడేల యది యెట్లు గలిగెనో తెలియదు. కౌసల్యాపరిణయము చూచునది.

తాత్పర్యము.

అని జటాయువు చెప్పఁగా నాయన వాక్యము లన్నియుఁ బ్రీతితో విని తన తండ్రి మిత్రుఁడగు నాయనను సంతోషముతోఁ గౌఁగిలించుకొని తన తండ్రికిని నాయనకును గలిగిన స్నేహవిధ మాయన చెప్పఁగా వినుచు నిఁకను సీతను రక్షింప వలసినది నీ భారమని యాయన కప్పగించి యాపుణ్యమూర్తి తమకుఁ దోడురాఁగా నందఱును బంచవటిఁజూడఁ బోయిరి.

కం. వడి గొని మండెడి జ్వలనుఁడు, మిడుతల దహియించుగతి న♦మిత్రజనములన్
బొడ యడఁగింపఁగ జొచ్చెం, దొడి తొడి రాముండు తమ్ము♦తోఁ బంచవటిన్.

జ్వలనుఁడు = అగ్నిహోత్రుఁడు - అమిత్రజనములన్ = విరోధులను - పొడ = రూపు - తొడితొడి=బిఱబిఱ - అగ్నిహోత్రుఁడు మిడుతలవలె నని చెప్పుటచే శత్రు వధము రామునకుఁ గష్టకార్యము కాదని సూచితము.

అదియునుగాక మిడుత లున్న చోటికి నగ్నిహోత్రము పోదు. మిడుతలే వచ్చి యగ్నిలోఁబడి చచ్చును. అట్టులే రాక్షసులును రామునిపై పడి వచ్చి చత్తురని భావము.

తాత్పర్యము.

గాలికి రేఁగి మండెడుమంట తనలోఁబడిన మిడుతలను దహించునట్లు విరోధి జనముల రూపుమాపుటకు శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణుతో శీఘ్రముగఁ బంచ వటిని బ్రవేశించెను.

—♦ ౧౫-వ సర్గము సీతారామలక్ష్మణులు పంచవటిఁ బ్రవేశించుట. ♦—

క. నానావ్యాళమృగాయుత, మా నా పంచవటిఁ గాంచి ♦ యంబుజనేత్రుం
డానందితు సౌమిత్రిని, మానితమధురోక్తి ననియె ♦ మన ముప్పొంగన్. ౨౩౪

నానావ్యాళమృగాయుతము=అనేకములయిన పాములు మృగములు గలది- అయుతము=పదివేలు - శతం సహస్ర మయుత మ్మన్నట్టు లిక్కడ నానంత్యార్థకము- ఆనందితున్=సీతారాములకు సేవ యథేచ్ఛముగాఁ జేయుటకు దగిన స్థలము దొరికె నని సంతోషముచే నుప్పొంగువాని, మధురోక్తిన్=తియ్యని మాటచే- లక్ష్మణునకు సంతోషమగుటచే రామునకును మిగుల సంతోష కరమయ్యెనని భావము - కార్యము చేయవలసిన చోటికి వచ్చితిమిగదా యని రామునకు సంతోషము - సౌమిత్రి నను టచే 'రాముఁడ యెఱుంగు మీ దశరథుఁడు' అని సుమిత్ర చెప్పినమాటల ప్రకారము కైంకర్యముచేయ సిద్ధపడియుండు వానిని.

తా త్ప ర్య ము.

అనేకములగు సర్పములు మృగములు గల యీ పంచవటిని జూచి రామచం ద్రుఁడు నిరంకుశ పూర్ణ సీతారామశుశ్రూషకుఁ దగిన స్థలము దొరికెఁగదా యని యుప్పొంగు లక్ష్మణునితోఁ గార్యము చేయవలసిన చోటికి వచ్చితిమిఁగదా, ఇది లక్ష్మ ణునకు సంతోషకరముగా నున్నది గదా యని యుప్పొంగుచు గౌరవముతోడి తియ్యనిమాటల నిట్లనెను.

శా. అన్నా! పంచవటీ ప్రతీతి గల ర♦మ్యం బైన దేశం బిదే
కన్నారం గన నౌ సుపుష్పితలతా♦వృక్షాజాతజాతంబు లో
విన్నాణీ! పరికించి చెప్పు మిఁక బృ♦థ్వీకన్యకున్ నీకు నా
కు న్నిండార ముదంబు నాశ్రమ మెటం ♦ గూర్పంగ నౌ లక్ష్మణా. ౨౩౫

అన్నా= ఇది ప్రీతిని సూచించును. పంచవటీ ప్రతీతి=పంచవటియని ప్రఖ్యాతి గల - రమ్యము= మనోహరము - చూతపున్నాగాది వృక్షము లుండుటచే వనము రమ్యము. చదరముగా మెత్తని తెల్లని యిసుకగలదగుటచే స్థలము రమ్యము - పంచ వటి యని ప్రఖ్యాతిగన్న ప్రదేశమనుటచే నీ పేరు మునులు పలుమాఱు చెప్పఁగా శ్రీరాముఁడు వినియుండె నని గ్రహింపనగు - ఈయనను ఇక్కడఁ జేర్పవలయు ననియే మునుల యాలోచన - ఆ కారణముచే దీనియందు రుచిపుట్టుటకై యీ పేరు నలువురు పలుమాఱు చెప్పుచుండిరి. సుపుష్పిత లతావృక్షజాత జాతంబులు=మిగులఁ బుష్పించిన తీఁగలయు చెట్లయు సమూహములు - విన్నాణీ=నేర్పరీ; అనఁగా నడవు లందు నిది మంచి స్థలము, ఇది చెడ్డస్థల మని నిర్ణయించుటయందు సామర్థ్యముగల వాఁడని భావము; పరికించి= పరీక్షించి - నలువంకలు శోధించి - పృథ్వీకన్యకున్ = సీతకు - ఔ = తగును.

తా త్ప ర్య ము.

అన్నా! లక్ష్మణా! పంచవటి పంచవటి యని ప్రఖ్యాతిగన్న రమ్యమైన ప్రదేశ మిదియే- చక్కఁగాఁ బూచిన తీఁగలు చెట్లు గుంపులు గుంపులుగాఁ గన్నులపండు వుగాఁ గానవచ్చుచున్నవి. అడవులం దాశ్రమస్థలము నిర్ణయించుటయందు నేర్పుగల వాఁడా - ఇందు సీతకు నీకు నాకు మన మువ్వురకు ననుకూలమై సంతోషకరమైన స్థల మేదో చూచి చెప్పుము.

ఉ. నీటికి దవ్వుగాక రమ♦ణీయవనీహృదయంగమస్థలీ
వాటులు గల్గి మిఱ్ఱులును ♦ బల్లము లేక సమప్రదేశ మై
గాటముగాఁగఁ బూవులును ♦ గట్టియలుం గుశలుం సమీప మై
నేటగు సైకతం బయిన♦నిర్మలదేశముఁ జూడుమీ యనన్. ౨౩౬

నీటికి దవ్వుగాక=ఏఱుమడుఁగులు దూరమందుండెనా మనము స్నానసంధ్యా దులకుఁ బోవుటకు వచ్చుటకు నెండయందుఁ జీకటివేళఁ గష్టముగా నుండును. కావున నీటిపట్లు సమీపమం దుండవలెను - రమణీయవనీ= అందమైన యడవియందు కంపచెట్లు మొదలైనవి లేక ఫలవృక్షములు నీడలు గల వృక్షములుగల ప్రదేశములు- హృదయంగమస్థలీవాటులు = మనస్సు నాకర్షింపఁగల ప్రదేశము లుండవలెను - ఇట్లున్న యెడల సీతావిహారమునకు ననుకూలపడును - మిఱ్ఱులు పల్లము లేక = నేల చదరముగానుండిన నాకుఁ బండుకొనను ననుకూలపడును - గాటముగాఁగఁ బూవులు కట్టెలు - కుశలు సమీపమై = నీవు సేకరించుటకు దూరముపోవలసిన పని లేక పూవులు కట్టెలు దర్భలు సమీపమందే లభించునవియై యుండవలయును - సైక తంబు= ఇసుకనేలగా నుండవలెను - గులకరాలు గలదియైనఁ బండుకొనుటకు ననుకూలపడదుగదా - నిర్మలదేశము = మృగములపేఁడ పెంటలేనిది.

తా త్ప ర్య ము .

నీటికి దూరముగా నుండరాదు - మనస్సునకింపైన దేశముగా నీటికి దూరము గాక యిచ్ఛావిహారమునకు యోగ్యమైనదిగా నుండవలెను - నేలచదరమై పండు కొన సుఖకరమైనదిగా నుండవలెను - నీవు తెచ్చుటకుఁ బూలు కట్టెలు దర్భలు దండిగా సమీపమందే యుండవలయును. జాతిగొట్టు నేలగాక పండుకొనుటకుఁ గూర్చుండుటకు ననుకూలమైన మెత్తని నేలగా నుండవలెను - పెంటలు పేఁడ కుప్పలు లేక నిర్మలమైయుండవలెను. ఇట్టి ప్రదేశముగా నిర్ణయింపుము - మనము కొన్నాళ్లిందుండవలసిన వారము- కావున ననుకూలప్రదేశము బాగు గదా! కావున మన మువ్వురకు సౌఖ్యకరమగు స్థలము చూడుము.

ఉ. అంజలి చేసి జానకి స♦మక్షమునం దను లక్ష్మణుండు భూ
రంజనశీల యియ్యెడఁ ది♦రంబుగ మీరు శతాబ్దముల్ ముదా

త్తం జరియింప మీకుఁ బరతంత్రుఁడ నే, నటుగాన మీరె నా
కుం జనవార నాజ్ఞయిడఁ గోరెద మీకు రుచించుస్థానమున్.                    ౨౩౭

అంజలిచేసి=చేతులు జోడించి నమస్కరించి, జానకి సమక్షమునన్=సీతాదేవి చూచుచుండఁగా, భూరంజనశీల=ప్రజలను సంతోషపెట్టు స్వభావముగలవాఁడా - తిరంబుగన్=నిలుకడగ - శతాబ్దముల్=నూఱుసంవత్సరములు - శత మానంత్యార్థకము - కావున పెక్కులేండ్లు - ముదాత్మన్=సంతోషించు మనస్సుతో - పరతంత్రుఁడను=దాసుఁడను - మీయాజ్ఞ చొప్పున వర్తించువాఁడను.

తాత్పర్యము.

ఈప్రకారము శ్రీరామచంద్రమూర్తి చెప్పఁగా లక్ష్మణుఁడు చేతులు జోడించి నమస్కరించి సీతాదేవి సముఖమందు నిట్లనియెను. భూమిజనులను సంతోషింపఁజేయు స్వభావముగలవాఁడా - మీరిచ్చట నూర్లకొలఁది సంవత్సరములు సంతోషముతో స్థిరముగ నుండినను మీకు నేను దాసుఁడనే కాని స్వతంత్రుఁడఁగాను. కావున మీరే ప్రేమతో మీకు సమ్మతమైన స్థలమం దాశ్రమము నిర్మింప నాజ్ఞ యిడఁ గోరెదను.

విశేషార్థము.

లక్ష్మణుఁడు - రామకైంకర్యమే చిహ్నముగాఁగలవాఁడు - సన్న్యాసులకుఁ గాషాయవస్త్రము దండ కమండలువులు చిహ్నములైనట్లు శ్రీయనకుఁ గైంకర్యమే చిహ్నము. దీనివలన దండ కమండలువులను విడిచిన సన్న్యాసి యెట్లు పతితుఁడో యట్లే కైంకర్యము విడిచిన భగవత్పరతంత్రుఁడగు భక్తుఁడును బతితుఁ డని భావము. అంజలిచేసిన=నమస్కారముద్ర, "అంజలిః పరమాముద్రా" యని యన్ని ముద్రలలో నిది శ్రేష్ఠమైనది. ఇప్పు డంజలి చేయవలసిన కారణమేమి? గురువు నొద్ద శిష్యుఁడుకాని స్వామియొద్ద భృత్యుఁడు కాని మాటలాడునపుడు అంజలి జోడించి వినయమున మాటలాడవలయును. 2. తప్పుచేసినవారు చేతులు జోడించి నమస్కరించి క్షమాపణ కోరుదురుగదా! తాను రామచంద్రునకుఁ బరతంత్రుఁడ నని యాయనకుఁ దెలిసియుండియు నీకు సుఖకరమైన తావు వెదుకు మని యనెనే తన సుఖమే నాసుఖము గాని నాకుఁ బ్రత్యేకసుఖ మెచ్చటిది? ప్రత్యేకసుఖము నేను గోరుట స్వతంత్రుఁడ నను తలం పున్నఁగదా. నేను స్వాతంత్ర్యము వహించితినేని పతితుఁడ నేకదా. నా పారతంత్ర్యమున కది శత్రువుగదా. నేనేదో యపరాధమును ఈయనయెడఁ జేసి యుండవలె. లేకున్న నట్లు చెప్పఁడు. చిత్రకూటమునఁ బర్ణశాల కట్టుమని చెప్పెనే కాని నీకు సుఖకరమైనచోటఁ గట్టుమని చెప్పలేదే. ఇప్పుడు చెప్పుటకు నాయం దేదే మహాపరాధ ముండవలెను. ఆ యపరాధమునకుఁ బ్రాయశ్చిత్తము వీ రిరువురకు నమస్కరించుటే. ప్రపన్నునకు దానికి మించిన ప్రాయశ్చిత్తము లేదు కదా యని తలంచి యంజలి మోడ్చెను. జానకి సమక్షమునన్=సీత యంగీకరింపకున్న రామ

చంద్రుఁ డంగీకరింపఁడు. సీత యనుగ్రహించెనా రామానుగ్రహము నిశ్చయము. "అలమేషా పరిత్రాతుం రాఘవాత్ రాక్షసీగణమ్" రాముని వలని భయమునుండి రక్షింప నీమె సమర్థురాలని కలుకుగదా. ఆ కారణముచే ముం దామెను జేమోడ్పు తోఁజూచి రామచంద్రునితో ననుచున్నాఁడు. ఆమె పురుషకారభూత కావున నామె యనుగ్రహ మావశ్యము. అదియునుగాక రామవాక్యసరణిఁ బట్టి నే నేదో మహాపరాధము చేసితి నని తోఁచుచున్నది. ఈయపరాధమునకుఁ బ్రాయశ్చిత్త మెట్లు?

పాయశ్చిత్త ప్రసంగేతు, సర్వపాప సముద్భవే
మా మేకాం దేవదేవస్య మహిషీం శరణంవ్రజేత్॥

అని యుండుటచే ఏ పాపమును జేసినను బ్రాయశ్చిత్తము పెట్టుకోవలసివచ్చె నేని ప్రపన్నుఁడు లక్ష్మీ శరణమే కోరవలయును అను శాస్త్ర నియమ ప్రకారము ఆమె యనుగ్రహమును గోరెను. భూరంజనశీల=భూమీ జనుల రంజింపఁజేయుచు, రాజవై రాముఁడవై, ఇయ్యేడ=ఈలోకమందు, ఈ లీలా విభూతియందు అనుటచే నీ పరస్వరూపమందు నిత్య విభూతియందు నేను శేషుఁడనై నీకు నివాసముగాను నీవు పండుకొనఁ దలఁచినపుడు శయ్యగాను, కూర్చుండఁ దలఁచినపుడు సింహాసనము గాను, లేచి నడచునపుడు పాదుకలుగాను, కావలసినప్పుడు పైవస్త్రముగాను, పండు కొనునపుడు తలదిండుగాను, మీరు బైటఁబోవునపుడు గొడుగుగాను నేను శరీర భేద ముచే నీకు సేవచేయుచునో యదేవిధముగనే యిందును శేషవృత్తి నవలంబించి దాస్యము చేయుదును. అందు నిందుఁగూడ దాస్యమే నాస్వరూపము.

తిరంబుగ = ఎన్నాళ్లు మీరు లీలావిభూతిలో నుందురో యన్ని దినాలు చేసెదను.

మీరు=భార్యాభర్తలు, ఇట్లు చెప్పుటచే సీతారాము లిరువురు సేవ్యులే. ఒక రిని విడిచి మఱియొకరిని సేవింపరాదు. నారదీయమందు.

గృహీచ గృహిణీశ్చైవ సలక్ష్మీకం హరిం యజేత్
అన్యథా దోషమాప్నోతి వసుదేవ సుతం వినా
కృష్ణమూర్తౌ సలక్ష్మీక నియమో నాస్తిభూపతే
లక్ష్మ్యాయుక్తో ప్యయుక్తోవా కృష్ణః పూజ్యోనసంశయః॥

గృహస్థుఁడు గృహిణి (ఇల్లాలు) లక్ష్మీదేవితోఁ గూడియుండు విష్ణువునే (వసు దేవ సుతుని విడిచి) పూజింపవలెను- కృష్ణమూర్తిపూజయందు లక్ష్మి యుండవలయు నను నియమములేదు- లక్ష్మికూడ నుండినను లేకుండినను కృష్ణుఁడు పూజ్యుఁడే-కావున రాముని విడిచి సీతను బూజింపరాదు- సీతను విడిచి రామచంద్రుని బూజింపరాదు-

శతాబ్దముల్=ద్విగు రేకవచన మ్మను వ్యాకరణసూత్రప్రకారము శతాబ్ద మని యేక వచనముగానే యుండవలెను- బహువచనముచే నట్టినూర్లు అనేకము లనిగ్రహింప వలెను- పరతంత్రుఁడనే = ఎప్పుడు నేను నీకు నమస్కరించితినో యప్పుడే నీవు

స్వామివి, నేను భృత్యుఁడను, భార్యయు దాసుఁడు స్వతంత్రులుగారుగదా. సీతాదేవి నీకెట్టులో మీ యిరువురకు నేనట్టివాఁడనే కావున మీ యిష్టము ప్రకారము నేను వర్తించువాఁడనేకాని నా కిష్ట మనునది యేది గలదు.ఇట్లుండ నాకు సుఖమైనది నేను జూచుకొని యిది నాకు సుఖముగా నున్నది మీరు నిందే యుండుఁడని చెప్పుదునా? అది మహాపరాధముకదా. కావున మీరే నా కాజ్ఞయింపు. స్వాతంత్ర్యము మీకు స్వత్వమయినట్టు పారతంత్ర్యము నాకు స్వత్వము. దానిని మీరు విడువరాదు. దీనిని నేను విడువరాదు. నీకున్నంత స్వాతంత్ర్య మెట్లితరులకు లేదో నా కున్నంత పారతంత్ర్య మితరులకు లేదు. కావున నితరులకు దుర్లభమైన నాపారతంత్ర్యమును నాశముచేయఁ గోరక న న్నాజ్ఞాపించి నాచేఁ బనిగొనుము. ఈ యర్థమునే ద్వయమం దలి యుత్తరభాగము దెలుపుచున్నది. పరమార్థతత్త్వము చూచునది.

భగవంతుఁ డీప్రకారము తనవారిని మోసగించి వారిమనస్సులు పరీక్షింపఁ జూచును. హెచ్చరిక గలిగి మోసపోనివాఁడు ధన్యుఁడు. అట్టివాఁడుకదా యథార్థ భక్తిగల లక్ష్మణుఁడు. కైంకర్యపరుఁడు. తనకు నష్టమైనను గష్టమైనను అనిష్టమైనను భగవంతుని యిష్టప్రకారము కైంకర్యము చేయవలయునుగాని తన యిష్టప్రకారము చేయరాదని యేర్పడుచున్నది.

చం. అనవుడు రాఘవుండును మ♦హాత్ముని లక్ష్మణుమాట కెంతయుఁ
దనిసని హర్ష మంది యుచి♦తం బగు దేశము రోసిఁ దమ్ము కే
లిని దనకేలఁ బట్టుకొని ♦ లీలమెయిన్ వచియించె నీస్థలం
బనుజ! సమంబు పుష్పితన♦గాన్విత మాశ్రమ మిందుఁ గూర్పుమీ. ౨౩౦

రోసి=వెదకి, సమంబు = చదరమై మిట్టపల్లములు లేక యున్నది. పుష్పిత నగాన్వితము=పూచినచెట్లతోఁ గూడినది.

తాత్పర్యము.

అని లక్ష్మణుఁడు చెప్పఁగా గొప్పమనస్సు గొప్ప స్వభావముగల లక్ష్మణుని మాటకు మిక్కిలి సంతోషించి వెదకి తగిన స్థలము నిశ్చయించి లక్ష్మణునిచేయి ప్రేమ సూచకముగఁ దనచేతఁ బట్టుకొని యిట్లు చెప్పెను. తమ్ముఁడా యీప్రదేశము మిట్టపల్ల ములు లేక చదరముగా నున్నది. పూచినచెట్లును గలవు. ఇం దాశ్రమము నిర్మింపుము.

తే. అదిగో నాదిత్యసంకాశ ♦ మైన సురభి,గంధిపద్మాళిఁ గోమ రయి♦బంధురముగఁ
బద్మసేవిత మైనట్టి♦పద్మసరసి, దాపునం దున్న యది సుమి♦త్రాతనూజ. ౨౩౯

ఆదిత్యసంకాశము=సూర్యునితో సమానము, అట్టి యెఱ్ఱని కాంతిగలది, సురభి గంధి = మంచివాసనగల, పద్మాళిన్=ఎఱ్ఱతామరలచే, కోమరయి=అందమై, బంధు రముగన్=మనోహరముగ, పద్మసేవితయు=లక్ష్మిచే సేవింపఁబడినది. లక్ష్మి పద్మాలయ గదా, పద్మసరసి=తామరకొలను, పద్మసేవితము =(౧) ఇది సాధ్యసమాన మని కాని

(౨) "జ్యాపోహ్రిస్వః సంజ్ఞాచ్ఛందసో ర్బహుళ్" మను సూత్రప్రకారము పద్మా పద్మ హ్రస్వ మయ్యెననికాని గ్రహింపనగు. సంజ్ఞయనఁగాఁ బేరు. పద్మ యనునది పేరు గావున సమాసమున హ్రస్వ మయ్యెను. నదిసుతగురుకర్ణశల్యానాగపురీశుల్ అన్నట్టులు.

తాత్పర్యము.

సూర్యకాంతియు మంచి వాసనయుఁగల యెఱ్ఱతామరలచే నందమై లక్ష్మీదేవిచే సేవింపఁబడు తామరకొలను సమీపమందే యున్నది. ఏటికిఁ బోవ వలనుపడ నప్పుడు మన మీజలమే వాడుకొనవచ్చును.

తులసీ కాననం యత్ర యత్రపద్మ వనానిచ
వసంతి వైష్ణవా యత్ర తత్ర సన్నిహితో హరిః॥

అను వాక్యమును బట్టి యిచ్చట 'ఆదిత్యసంకాశ' మనుటచే సూర్యమండలమం దుండు విష్ణువువలె నిందును విష్ణు వున్నాఁడనియు,సురభిగంధిపద్మాళిఁగొమరయి యనుటచే సర్వగంధ స్సర్వరస యను శ్రుతిప్రకారము ఆయన పరిమళమే గుమాయించు చున్నదనియు పద్మసేవిత మయినట్టి పద్మసరసియనుటచే పుట్టినింట నాఁడుబిడ్డ లున్నట్టు లిందు లక్ష్మికమలములందు వసించు చున్నదనియు ఆ కారణముచే నిది సరసి కావున సర్వదా మనకు సేవ్య మనియు వ్యంగ్యము.

కం. సురుచిరపుష్పితతరువై, వరసారసహంసచక్ర♦వాకాన్విత మై
పరమర్షి యనిన గోదా, వరి యిదె కడురమ్య మగుచు ♦ వఱలెడిఁ గంటే. ౨౪౦

సురుచిర=మిగుల మనోహరముగ, పుష్పిత=పూచిన, తరువై=చెట్లుగలదై, వరశ్రేష్ఠములైన సారస=కమలములు, హంస = హంసలు, చక్రవాక = జక్కవలు, అన్వితమై=వీనితోఁ గూడినదై, పరమర్షి=మునిశ్రేష్ఠుఁడు, అగస్త్యుఁడు, వఱలెడిఁ= ప్రకాశించుచున్నది. ఉభయవిధ మహతీనా మ్మనుటచే చక్రవాకాన్వితమై యని చెప్పఁబడియె.

తాత్పర్యము.

మిగులఁ బూచిన చెట్లను తీరమందుఁగలదై, కమలములు, హంసలు, చక్రవాకములు గలదై యగస్త్యుఁడు చెప్పిన గోదావరి ప్రకాశించుచున్నది. చూచితివా? ఇది మిగుల దవ్వునుగాదు, దాపునుగాదు.

ఇది ముత్తైదువు దర్శనమువలె శుభసూచకమని చెప్పుచున్నాఁడు- గోదావరి కొప్పునందుఁ బూలు తుఱిమి కమలములవంటి కన్నులు హంస నడకవంటి నడక చక్రవాకములవంటి స్తనములుగల సువాసినివలె నున్నదని వ్యంగ్యము.

ఉ. సుందరకందరంబులను ♦ సొంపును నింపు రహింపఁ గేకికా
బృంద మమందనాదమున ♦ నెల్గిడ నగ్గడ బూచి కాచి యా
నందము కందళింపఁగ ఘ♦నంబులు భూమిరుహంబు లొప్పఁగా
దండడి పర్వతంబు లివె ♦ దవ్వును దాపును గాక యుండెడిన్. ౨౪౧

సుందరకందరంబులును=అందమైన గుహలును, కేకిబృందము = ఆఁడు నెమిళ్ల సమూహము. అమందనాదమునన్=పెద్ద ధ్వనితో, ఎల్గిడన్ = ధ్వనింపఁగా, కందళింపఁగన్=మొలకయెత్తఁగా, ఘనంబులు=గొప్పవి, భూమిరుహంబులు=చెట్లు, దండడి=తఱుచు.

తాత్పర్యము.

అందములైన గుహలు మిక్కిలి యింపుగా నాఁడు నెమిళ్లు బిగ్గరగా నలుప్రక్కలఁగూయు ధ్వనులు పూచి కాచి సంతోషము విస్తరింపఁజేయు పెద్ద వృక్షములు కలవై పర్వతంబులు మిగుల దూరముగాక దగ్గఱగాక యున్నవి.

తే. పెక్కుతావులఁ బైడియు ♦ వెండి రాగి, ధాతువులచేత నొప్పు ధా♦త్రీతలములు
వన్నెల నలంకరించిన ♦ వారణముల, చెన్ను వహియించు చున్నవో♦యన్నకంటె. ౨౪౨

పెక్కుతావులన్ = అనేక స్థలములందు, పైఁడి = బంగారు, ధాతువులు = శుద్ధిచేయని లోహములు, వారణములచెన్ను = ఏనుగుల కాంతి.

తాత్పర్యము.

తమ్ముఁడా! యనేక స్థలములందు బంగారు వెండి రాగి యీ లోహములచే నొప్పు భూప్రదేశములు రంగులు పూసిన యేనుగుల విధమున నున్నవి, చూచితివా.

మత్తకోకిలము. సాలతాలతమాలతుంగర♦సాలజాలమధూకకు
ద్దాలవంజుల నక్తమాలవి♦తానసిందుక చందనో
ద్దాలచంపక పారిజాతక♦దంబనింబకపిత్థత
క్కోలకేసరజంభకింశుక♦కూటపాటలకోటులన్. ౨౪౩

సాల=మద్దిచెట్లు - తాల=తాటిచెట్లు - తమాల=చీఁకటిమ్రాఁకులు- తుంగ=ఎత్తైన, రసాల=తియ్యమామిడిచెట్లు, జాల=సమూహము, మధూక=ఇప్ప, కుద్దాల=కాంచనచెట్లు, వంజుల=అశోకములు, నక్తమాల = కానుగుచెట్లయొక్క, వితాన=సమూహము, సిందుకచెట్లు, చందన=శ్రీగంధపుచెట్లు, ఉద్దాల = విరిగినమ్రాఁకులు, చంపక=సంపంగిచెట్లు, పారిజాత=పారిజాతముల, కదంబ=గుంపు, నింబ = వేపచెట్లు, కపిత్థ=వెలగచెట్లు, తక్కోల= తక్కోలపుచెట్లు, కేసర= పొన్నచెట్లు, జంభ = నిమ్మచెట్లు, కింశుక=మోదుగుచెట్ల, కూట=సమూహము, పాటల=పాదిరిచెట్లు: వీనియొక్క కోటులన్=సమూహములచే.

మత్తకోకిలము. రస జ జ భర గణములు. ౧౧-వ యింట యతి (అన్నియుఁ జెట్లపేరులే కావునఁ దాత్పర్యము వ్రాయలేదు.)

చ. గిరులు రహించె నీతలము ♦ కీర్తితమున్ మృగపక్షిలోకసుం
దరమును బుణ్యదంబు నిటఁ ♦ దమ్ముఁడ పక్షివిభుండు బాసయై

పరఁగ వసింత మన్న వెసఁ♦బర్ణకుటీరము సద్విశాలమున్
ఖరకరవంశవర్ధనుఁడు ♦ గట్టె సుమిత్రతనూజుఁ డన్నకై. ౨౮౪

గిరులు=పర్వతములు, రహించెన్=ప్రకాశించుచున్నవి. తలము = స్థలము, కీర్తితమున్=పొగడఁదగినది. మృగపక్షి లోకసుందరము=మృగములయు పక్షులయు సమూహముచే నందమైనదియు, పుణ్యదంబు = పుణ్యమిచ్చునది. పక్షివిభుండు = జటాయువు, బాసట=సహాయుఁడు, వెసన్=త్వరగా, పర్ణకుటీరమున్ = ఆకుటింటిని, సద్విశాలమున్=మిగుల విశాలమైనది. ఖరకరవంశవర్ధనుఁడు = సూర్యవంశమును వృద్ధిచేయువాఁడు, సుమిత్రతనూజుఁడు=లక్ష్మణుఁడు అన్నకై=రామచంద్రుని నిమిత్తమై.

తా త్ప ర్య ము.

పర్వతములు ప్రకాశించుచున్నవి. ఈ ప్రదేశము శ్లాఘ్యమైనది. మృగములయుఁ బక్షులయు గుంపులచే నందమైనది. పుణ్యము నిచ్చునది. కావున నిచ్చట మనకు జటాయువుతోడుకాఁగా నుందము. త్వరగాఁ బర్ణశాల నిర్మింపుము. అనఁగా లక్ష్మణుఁడు శీఘ్రముగ నొక యాకుటింటిని గట్టెను.

—♦ లక్ష్మణుఁడు పంచవటిఁ బర్ణశాల నిర్మించుట. ♦—

ఉ. నేలఁ బునాది త్రవ్వి కడు♦నేటుగ గోడలు పెట్టి బొంగుకం
బాలను నిల్పి వానిపయి♦ప్రక్క వెదుళ్లను బర్చి జమ్మివా
సాలు గుదిర్చి నారలను ♦ జక్క బిగించియు బోద తెల్లునన్
జాలఁగఁ గప్పి దిమ్మెసను ♦ సారెకు దంచి సపాటుగా మహిన్. ౨౮౫

పునాది=అస్తిథారము. నేటుగ=చక్కఁగా. సపాటుగా= చదరముగా- ఎచ్చు తక్కువలు లేకుండ-

తా త్ప ర్య ము.

భూమియందుఁ బునాది తీసి చక్కగ గోడలుపెట్టి లావువెదుళ్లు స్తంభాలుగ నాటి వానిమీద ప్రక్కవెదుళ్ళు సన్ననివి పఱచి జమ్మికొమ్మలు వాసాలుచేసి నారలతో గట్టిగ బిగించి యా వెదుళ్ళమీఁద బోదతెల్లును దట్టముగఁ గప్పి నేలనుగట్టియు చదరము నునుపు నగునట్లు దిమ్మెసతో మూఁడు నాలుగుమార్లు నీళ్ళు చల్లి చల్లి దంచి,

సీ. గోదావరికిఁ బోయి ♦ గ్రుంకి సత్వరుఁడయి, పండ్లుఁ బూవులుఁ దెచ్చి♦ బలియొసర్చి
శాంతికార్యంబుల ♦ సాంతము ల్గావించి, యన్నకుఁ గాన్పించె ♦ నాశ్రమంబు
సీతాసమేతుఁడై ♦ శ్రీరాముఁ డది చూచి, యానందరసభరి♦తాత్ముఁ డగుచుఁ
దమ్ముఁ జేరఁగ దీసి ♦ తనకౌగిటను గ్రుచ్చి, యనురాగ ముప్పొంగ ♦ ననియె నిట్లు
తే. ఘనమతీ! భవత్కృతమహా♦కార్యమునకు, నీడుగాఁ బారితోషకం♦బేమి యీయఁ
గలను గావున నర్మిలిఁ ♦ గౌఁగిలించి, నాఁడ నీ శక్తి కేమను♦వాఁడఁ గుజ్జ. ౨౮౬

గ్రుంకి=స్నానముచేసి, సత్వరుఁడయి=త్వరతోఁ గూడినవాఁడై, ఆనందరసముచే నిండిన మనస్సుగలవాఁడు - భవత్కృత = నీచేఁ జేయఁబడిన - మహాకార్యము

నర్హ=గొప్పపనికి-పారితోషకము=కానుక, అర్హ్మలిక=ప్రేమతో-కుఱ్ఱ=చిన్నవాఁడా- "తపోవనే - మఠే - బ్రహ్మచర్యాదా వాశ్రమోస్త్రియా"మ్మని బాణుఁడు-ఆశ్రమమనఁగా తపోవనమునకు మఠమునకు బ్రహ్మచర్యాదులకుఁ బేరు.

తా త్ప ర్య ము.

ఇట్లు కుటీరము సిద్ధముచేసి గోదావరికిఁ బోయి స్నానముచేసి జాగుచేయక పండ్లు పూలు తెచ్చి వాస్తుబలియిచ్చి శాంతికార్యములు గావించి యాశ్రమము నన్నకుఁ జూపించెను. (ఇంతవఱకు సీతారాములు ప్రక్కతోఁపులో నుండిరి) సీతతోఁ గూడి రామచంద్రుఁ డదిచూచి మిగుల సంతోషించి తమ్ముని గౌఁగిలించి ప్రేమ యుప్పొంగుచుండ నిట్లనియె. గొప్ప మనస్సుగల లక్ష్మణా! నీవు చేసిన గొప్ప కార్యమునకు సమానమైన కానుక నేనేమి యీయఁగలను. కావునఁ బ్రేమతోఁ గౌఁగిలించెదను. చిన్నవాఁడా నీశక్తి నేమని మెచ్చుదును.

చం అనఘ తలం పెఱుంగుదు న♦యజ్ఞ! కృతజ్ఞుఁడ విట్టి నిర్హ దనూ
 జునిఁగను గన్నతండ్రి యతి♦శుద్ధుఁడు ధర్ముఁడు నాదుపాలికిన్
 విను మనియున్నవాఁడ యని ♦ నెమ్మి వచించి సుఖంబుగా వసిం
 చెను నటఁ గొంతకాలము వసి♦ష్ఠుఁడు వేల్పు దివంబునం బలెన్. ౨౮౭

అనఘ=స్వార్థ మను దోషములేనివాఁడా! తలంపెఱుఁగుదు=నా యభిప్రాయము నేను జెప్పకున్నను అన్నకీప్రకార ముండుట యిష్టముగదా! యీ ప్రకారము గట్టిన వదినెతోడ నాయన యేకాంత ముండ సంతోషించునుగదా యని తెలిసికొని చేయువాఁడవు. నయజ్ఞ=నీవు నావలె రాజకుమారుఁడవై భోగముల మరగినవాఁడ వయ్యు నాశ్రమ నిర్మాణమపుడు అన్న కిది, నా కిదియని నీకొక యనుకూలస్థలము నేర్పఱుచుకొనక నాకు సుఖము గలిగించు నేర్పాటులుమాత్రము చేసితివి. కృతజ్ఞుఁడవు=ఏది యెట్లు చేయవలయునో తెలిసినవాఁడవు. రామచంద్రుఁడు దశరథునకు లేక లేక కలిగినకొడుకు కావున నాయన విషయములో నేమి యనిష్టము గొట్టునో యన్నికార్యములు చంద్రతారాబలములు లోనైనవి విచారించి చేయును. ఇల్లును నట్లే కట్టించి యిచ్చెను. ఇదంతయుఁ దెలిసినవాఁడగుటచే లక్ష్మణుఁడును అన్నియు నాలోచించి పర్ణకుటీరము నిర్మించెను. అతిశుద్ధుఁడు=మిగుల నిర్మలుఁడు- తండ్రియంతటి శుద్ధుఁడు గనుకనే నీవు నింతటివాఁడ వైతివి. ధర్ముఁడు=ధర్మాత్ముఁడు-మనియున్నవాఁడు=జీవించియున్నవాఁడు - తాను జీవించియున్నంతకాలము నా విషయమై యే కొఱఁత లేకుండ విచారించుచున్నవాఁడు. కావునఁ దాను బోవుచుఁ దనస్థానమున నిన్ను నుంచెనని భావము.

తా త్ప ర్య ము.

పాపరహితుఁడా! నా యభిప్రాయ మెట్టిదో నేను జెప్పకయే తెలిసికొనఁగలవు. నీతి నెఱిఁగినవాఁడవు. ఏది యెట్లు చేసిన నాకు హితమో తెలిసినవాఁడవు. ఇట్టి

నిన్నుఁ గని మిగుల శుద్ధుఁడును ధర్మాత్ముఁడునైన తండ్రి మరణించినను నా పాలిటికి బ్రతికియే యున్నవాఁడు. నీవుండుటనుబట్టి యాయన లేఁడను కొఱంత దోఁపలేదు. అని చెప్పి సుఖముగా స్వర్గమున విష్ణువువలె నందుఁ గొంతకాలము వసించెను.

పంచవటి.

పంచవటీస్థల మేది యను విచారము చిరకాలముగ ననేకుల బాధించుచున్నది. భద్రాచలమునొద్ద పర్ణశాలయని కొందఱు నాసికయని కొందఱు నభిప్రాయపడుచున్నారు. ఇం దేది సత్యమో రామాయణముఁబట్టి స్థలశోధనముఁబట్టి నిర్ధారింపవలసియున్నది. (1) పంచవటి గోదావరీతీరస్థ మనుట నిర్వివాదవిషయము. (2) పంచవటియొద్ద గోదావరి యుత్తరమునుండి దక్షిణమునకుఁ బాఱుచుండవలెను. ఏలన-రామలక్ష్మణులు సీతాదేవిని గోదావరివెంట వెదకుచు వచ్చిరి. (చూ. ౧౦౮౦-౧౦౮౧-౧౦౫౨) ఇట్లు వచ్చునపుడు మృగములు దక్షిణపువైపు సీతపోయిన దని చూపఁగా రామలక్ష్మణులు-

చక్కఁ దక్షిణముపోక (ఏ అడ్డము గనుక) నైఋతిదిశగాఁబోయి జటాయువును గోదావరితీరమందుఁ జూచిరి- ఈ కారణముచే గోదావరి జటాయుపడిన స్థలమువరకు దక్షిణాభిముఖముగానే పాఱుచుండవలయును- జటాయువునకు గోదావరి జలముతో నివాపములు విడిచిన కారణముచే గోదావరితీరమై యుండవలెను- (చూ. ౧౧౭౮ ౩-పాదము) ఇక్కడనుండి రామలక్ష్మణులు నైఋతిదిశయందే మూఁడుకోసులు పయనించిరి- ఇంతవఱకుఁ దూర్పుగాఁ బోవుటకు నే అడ్డమువచ్చును. కనుకఁ దూర్పుగాఁ బోలేదు. కొంత తూర్పుపోయినఁగాని జటాయువు చెప్పిన దక్షిణమార్గము లభింపదు- కావున నచ్చటనుండి మూఁడు కోసులు తూర్పుగాఁ బోయిరి- ఇప్పు డిప్పటి భద్రాచలమునొద్ద గోదావరికి దక్షిణదిశయం దున్నవారైరి. ఇట్లు వచ్చిన కారణముచే వారు గోదావరిని దాఁటవలసిన పనిపడలేదు. ఈ కారణముచేఁ బంచవటి గోదావరికిఁ బడమటితీరమందే యుండెనని యంగీకరింపక తప్పదు. తూర్పునం దుండెనేని గోదావరి దాఁటియేయుండవలెను- ఆ విషయము వాల్మీకి చెప్పలేదు. అదియునుగాక యిప్పటి పర్ణశాలయే పంచవటి యని గ్రహించినచో వారు నైఋతి ప్రయాణము చేసియుండిరేని యేటిపాలు గావలసియుండును- భద్రాచలమునొద్ద నేఱుదాఁటిన ట్లాకరు వ్రాసిరిగాని యది విచారించి వ్రాసిన వ్రాఁత కాదు - ఇప్పటి పర్ణశాల కాదు కాని దాని కెదురొడ్డునఁ జక్కఁగఁ బంచవటి యుండెనని చెప్పవచ్చును- నవీనచంద్రదాసు, ఎం.ఏ., గారు ప్రకటించిన మనదేశపటమునందు నాసికను బంచవటిచేసి యక్కడనుండి చక్కఁ దక్షిణమువచ్చినట్లు వ్రాసియున్నారు - ఇది రామాయణమునకు విరుద్ధము- పంచవటి గోదావరీ పశ్చిమతీరమం దుండె ననుటకు స్థలము సహాయపడుచున్నది- పర్ణశాల కెదురుగ రథగుట్టయనియున్నది- ఇందు రావణాసురుఁడు తేరిని దాఁచియుంచె నని చెప్పుదురు- ౮౧౪వ పద్యమున రావణుఁడు సీతా

దేవి నెత్తుకొనివచ్చెనో లేదో తేరు సిద్ధముగా నుండెనని చెప్పఁబడెను సమీపమందే యది కానరాకయుండుటచేత నీపని కొనసాగెనుగాని యేటికొకయొడ్డునఁ దేరు, సీతయు రావణుఁడు మఱియొక యొడ్డున నుండిన నిది సాగియుండదు. కావునఁ బంచవటి పడమటివైపుననే యుండవలెను. హరణ మా ప్రక్కననే యయి యుండవలెను. అంతియ కాదు. దీనికి సమీపమందే సీతగుట్టలని పెద్ద పర్వతముగలదు. ఇందు ఖరుఁడు యుద్ధమునకు వచ్చినపుడు సీతాలక్ష్మణు లుండిరనియు నా కారణమున కా గుట్టల కా పేరు వచ్చెననియుఁ జెప్పుదురు. కాదనుటకుఁ గారణము కానరాదు. తూర్పుటొడ్డున నుండి రేని యేఱుదాటిపోయి యా యా గుట్టలలో నుండవలసియుండును. ఈ గుట్ట క్రిందఁ బడమటివైపునఁ బెద్ద బయలున్నది. అందుఁ బదునాలుగువేల రాక్షసులు నిలిచి యుద్ధముచేయ వీలగు స్థలము గలదఁట. సీతాలక్ష్మణుల కీ ప్రదేశమున జరగు యుద్ధము కానవచ్చుచుండును.

అదియునుగాక ౭౬-వ పద్యమందుఁ బద్మసరస్సు పంచవటి సమీపమందే యున్నట్లు చెప్పఁబడెను. అదియే యింతవఱకున్నదో లేదో చెప్ప సాధ్యపడదు గాని యిటువంటి పెద్ద చెఱు వున్నట్లు కోయలు చెప్పిరి. ఈ చెఱువునకు గోదావరికి నడుమఁ బంచవటి, వర్షకాలమందు నేటి నీళ్లు బురదగా నున్నప్పు డీ చెఱువు నీళ్లు సీతారామలక్ష్మణులు వాడుకొనుచు వచ్చిరి. ఇప్పటి పర్ణశాలకు దక్షిణమున గోదావరీతీరమున భద్రాచలమునకు వచ్చుమార్గము నడుమ దుమ్ముగూడె మని యొక గ్రామముగలదు. దీని కెదురుగ నేటి కావలియొడ్డున నొక చిన్న గుట్టకలదు. దీని సమీపమందు జటాయు రావణులయుద్ధము జరిగె నందురు. కాదనుటకుఁ దగిన కారణములులేవు. ఇప్పుడు గోదావరి తూరుపుటొడ్డు కోసికొని వచ్చుచున్నది. ఇప్పటి యేటినడుమ దుమ్ముగూడెము వీధులు కొన్ని యుండెనఁట. అచ్చటఁ జూచినవారే చెప్పుచున్నారు. ధూమగూడెము దుమ్ముగూడె మయ్యెను. ఆ గుట్టయొద్దనే జటాయువును రామచంద్రమూర్తి సంస్కరించెను. ఇప్పటి హంపియే పంపయనియు మీఁదఁ జెప్పినచోటఁ బర్ణశాలయుండెననియుఁ జెప్ప మఱియొక నిరాకరింపరాని ప్రబల కారణము గలదు. రామలక్ష్మణులు లంకకుఁబోవునపు డేమార్గమునఁబోయినను లంకనుండి మరలునపుడు విమానమున జక్కఁగాఁబయనించిరిగాని వంకరటింకరత్రోవలఁ బోయియుండరనుట స్పష్టము. లంకనుండి సముద్రము దాఁటివచ్చినపిమ్మట రామేశ్వర ముందు స్థలమునుండి యయోధ్యకుఁ బయనించిరనుట యందఱు నంగీకరించి యున్నారు. అది సత్యమేని రామేశ్వరమునుండి చక్కఁగా నయోధ్యకు గీతగీఁచినచో నాగీఁతకు సమీపమందే యెడమవైపునఁ గిష్కింధయుఁ గుడివైపునఁ బంచవటియు నుండవలెను. ఈ రెండు స్థలములను రామచంద్రమూర్తి సీతాదేవికిఁ జూపించెఁగదా! చూ. ౭౮-౦౦, ౭౮-౦౮, ౭౮-౧౭) ఈ మార్గమునకు నాసికకు సంబంధము లేదు. కావునఁ బంచవటి నాసిక కానేరదు. నాసిక యనునది మొదటిపేరుగాదనియు

నవశిఖ యనునది నాసిక=నాసిక యయ్యెననియుఁ బురాణములందుఁ బ్రసిద్ధికెక్కిన నాసిక శూర్పణఖదే యగుటచే నా కథకు దానికి ముడిపెట్టిరనియు నొకరు వ్రాసియున్నారు. నాసిక పంచవటి కాదనుటకు మఱికొన్ని కారణములు గలవు. నవీన చంద్రదాసుగారు ప్రకటించిన పటమునందు సీతారామలక్ష్మణులు చిత్రకూటము నుండి దక్షిణముగా ఋక్షవంతమునకు వచ్చి యచ్చటనుండి పశ్చిమాభిముఖులై నాసిక చేరినట్టు వ్రాసియున్నారు. వారు చెప్పినమార్గమునందు వింధ్యపర్వతమునే గాక నర్మదా తపతులనుదాఁటి విదర్భలోనుండి నాసికకుఁ బోవలసియున్నది. ఇది చాల దుర్గమమార్గమటుండ వాల్మీకి సీతారామలక్ష్మణులు వింధ్యమునుగాని నర్మదా తపతులనుగాని దాఁటినట్టు చెప్పలేదు. వారు దాఁటియేయుండిన నాసుప్రసిద్ధనదులను వాల్మీకి చెప్పియేయుండును. అదియునుగాక నాసికనుండి బయలుదేఱి రామలక్ష్మణులు నిందు దక్షిణమువచ్చి యావల నాగ్నేయమునఁ గిష్కింధకువచ్చినట్లు నవీనచంద్ర దాసుగారు వ్రాసియున్నారు. ఇది రామాయణమునకుఁ బ్రత్యక్షవిరుద్ధము. రామ లక్ష్మణులు నైఋతిమూలగ (౧౮౮-౯-ప.) నావలఁ గొంత మరల నైఋతిగఁ (౧౮౦) బోయి యచ్చటినుండి తూర్పుగఁ (౧౧౯౧) బోయి కబంధుని జంపి యచట నుండి మరలఁ బడమరగాఁబోయి పంప (తుంగభద్ర)చేరి యచటకుఁ బడమగనుండు శబరి గుహకుఁబోయిరి. (౧౭౫౩-ప.)

మీఁద వ్రాసినట్లు జటాయు గుట్టయొద్దనుండి నైఋతిగా వచ్చిననే కిష్కింధకు రాఁగలరుగాని నాసికావాదులు చెప్పునట్టు లాగ్నేయమూలముగాఁ బోయి యుండిన సముద్రతీరము చేరియుండురు గాని కిష్కింధ చేరియుండరు. ఆగ్నేయ మూలగాఁ బ్రయాణముచేసినట్లు రామాయణమున నొక మాటయైనలేదు. నాసికా పక్షవాదులును పంప హంపి కిష్కింధయనియే వ్రాసియున్నారు.

భద్రాచలమునొద్ద నుష్ణగుండము సీతాదేవి స్నానము చేయుచుండె ననుటయు రేకపల్లెయొద్ద జటాయు ఱెక్క పడెననియుఁ జెప్పుట కల్పితములు.

—♦ ౧౬-వ సర్గము. లక్ష్మణుఁడు హేమంతఋతువును వర్ణించి యన్నకుఁ జెప్పుట. ♦—

కం. కాంతానుజయుతుఁడై యే,కాంతసుఖము మీఱ నుండఁగా శారదవే
 ళాంతమున నిష్ట మగు హే,మంతము పొడసూపె సురుచిమంతం బగుచున్.

కాంతానుజయుతుఁడై = భార్యతోను దమ్మునితోను గూడినవాఁడై, ఏకాంత సుఖము=విస్తారసుఖము, సుఖము దుఃఖము ననునవి మనస్సునందున్నవిగాని బయటి పదార్థములందులేవు. తృప్తుడే సుఖపురుషుఁడు, సుఖస్య దుఃఖస్య నకోఽపి దాతా యని కలదుగదా. నిత్యతృప్తున కెందున్నను సుఖమే. శారద వేళాంతమునన్=శర త్కాలము కడచిపోయిన తరువాత, హేమంతము=మంచుకాలము, పొడసూపెన్= కానవచ్చెను. సురుచిమంతము=మిగులఁ గాంతిగలది, ఇష్టము=ఋషులకుఁ దపము

చేయ ననుకూలమైనది. ఖరాదుల సంహరించి జయముపొందుటకు మూలమగు శూర్పణఖను తనయొద్దకు రప్పించుటచే రామునకు నిష్టమైనది.

ఈ ప్రకరణమున శూర్పణఖాగమనసూచకముగ హేమంతాగమమును లక్ష్మణుండు వర్ణించుచున్నాఁడు.

తాత్పర్యము.

ఆ పర్ణశాలయందు నిష్టురాలగు సీతతోను తమ్ముఁడగు లక్ష్మణుతోను మిగుల సుఖముగ శ్రీరామచంద్రమూర్తి యున్నసమయమున శరత్కాలము ముగిసిపోఁగా నిష్టమగు మంచుకాలము ప్రాప్తించెను.

ఉ. ఆవల నొక్క వేకువ మ♦హాత్ముఁడు రాముఁడు స్నాన మాడ గో
దావరికిం జనంగ వని♦తాయుతుఁ డై బడిఁ బాత్రహస్తుఁడై
పోవుచు లక్ష్మణుం డసియెఁ ♦ బొల్పయి యబ్దము దేన రాజిలుఁ
బావిరి నీ కభీష్ట మది ♦ వచ్చెనుగా యల సీతు వీరుఁడన్. ౨౮౯

అబ్దము= సంవత్సరము, దేనఁ= దేనిచే, వావిరి= మిక్కిలి, సీతువు= మంచుకాలము, నీ కభీష్టము=నీకుఁ బ్రియమైనది. మాసానాం మార్గశీర్షోస్మి యని మార్గశిరము తానే యని కృష్ణభగవానుఁడు చెప్పెనుగదా. నయనై దేవ నవోపగూహానాని యన్నట్లు ఎండకాలమందువలెఁ గాక చలికాలమందు భార్యాభర్తలు కౌఁగలించుకొని పండుకొందురు.

శ్రీరామచంద్రమూర్తి తపోవిశేషము తెలియుటకై హేమంతఋతువు వర్ణింపఁబడుచున్నది.

తాత్పర్యము.

ఇట్లు హేమంతఋతువు రాఁగా ఆ ఋతువునం దొకనాఁటి తెల్లవాఱుజామున రామచంద్రమూర్తి గోదావరియందు స్నానముచేయ సీతాదేవితోఁ బోవుచుండఁగా లక్ష్మణుఁడు కమండలువు దీసికొని వెంటఁబోవుచుండెను. అప్పుడు లక్ష్మణుఁడు రామచంద్రునితో నిట్లనియె. అన్నా! యే ఋతువుచే సంవత్సరము ప్రకాశించునో నీకు నిష్టమైన మాస మేదియో యట్టి మార్గశిరము హేమంతఋతువు నగు మంచుకాల మిపుడు ప్రాప్తించెనుగదా.

వ్యాకరణము.

దేనఁ=అది ఇది ఏది యనువానికిఁ దృతీయాసప్తమ్యేకవచనంబులందు దాన దీన దేన ననియు వాని బహువచనములందు వాన వీన వేన ననియు రూపంబులగు. త్రి. శే. ౬౨.

క. బిఱుసెక్కి మేను ప్రజలకుఁ, గఱ కెక్కెను నీటి కనవ♦గాహ్యముగ నిలఁ
మెఱుఁ గెక్కెఁ బైరుపచ్చలు, నఱమఱలే కాప్తుఁడయ్యె ♦ హవ్యవహుండున్.

బిఱుసు=కాఠిన్యము, కఱకు=క్రూరత్వము, అనవగాహ్యముగఁ= స్నానముచేయ సాధ్యముగాకుండునట్లు, అఱమఱలేక= భేదభావములేక, ఆప్తుఁడు= కావలసినవాఁడు మేలుకోరువాఁడు, హవ్యవహుండు = అగ్నిహోత్రుఁడు, స్వభావోక్త్యలంకారము.

అగు స్వభావోక్తి జాత్యాద్యలంకారముగల స్వభావమెంతేని వర్ణింపఁబడియెనేని, 'హరిణములు చూచె నుత్తరాంగాక్షములును స్తబ్ధకర్ణములగుచునట్ల చందమునను.'

ఈ స్వభావోక్తి రసవంతమైన వర్ణనముగా నుండవలెను. గాని

మాహిష్మతీ పురీమధ్యే ముహు ర్వాఘ్రాయ మేదినీమ్
ఏకపాదం సముద్ధృత్య శ్వా మూత్రం విసృజత్యహో॥

మాహిష్మతీపురము నడుమ నొక కుక్క నేల పలుమారు వాసనచూచి యొక కాలెత్తి మూత్రము విడిచెను. ఔరా! అను నట్లుండరాదు.

తాత్పర్యము.

ప్రజలకు దేహము కఠినమాయెను. స్నానముచేయుటకు సాధ్యపడకుండునట్లు నీటికిఁ బండ్లువచ్చి కఱవసాగెను. పైరుపచ్చలు కాంతితోఁ గూడినవాయెను. అగ్నిహోత్రుఁడు మునుపటివలెఁగాక యీప్పుడే దగ్గఱకుఁ బ్రజల రానీయసాగెను.

క. పొంగళ్ళను బొంగింతురు, ముంగడ దేవతలకు బితృముఖ్యులకు బుధుల్
రంగారు క్రొత్తధాన్యము, లం గడు గతపాపు లగుచు ♦ లాలితచరితా. ౨౫౧

రంగారు=కాంతిగల, బుధుల్=తమకు శ్రేయస్కరమగు దాని నెఱిఁగినవారు.

తాత్పర్యము.

తమకు శ్రేయస్కరము లగు వానిఁ దెలిసినవారు క్రొత్తధాన్యము రాఁగానే దానిని పాలలోఁ బొంగించి దానిని బితృదేవతలకు దేవతలకు నివేదించి పాపరహితు లగుచున్నారు.

దీనికే యాగ్రయణమని పేరు. 'నా నిష్ట్వాగ్రయణే నాహితాగ్ని ర్నవస్య ధాన్యస్యాశ్నీయాద్వ్రీహీణాం యవానాం శ్యామాకానా మగ్రే పాకస్య యజేత॥' యను సూత్రమున నాపస్తంబు లీకార్య మవశ్యము చేయఁదగినదని చెప్పినారు.

తే. దండయాత్రాభిరక్తిని ♦ ధరణిపతులు
పరమగోరససంపన్న♦తరులు ప్రాజ్య
కాము లయి జానపదులును ♦ గ్రాలు చుంద్రు
గాదె యన్నయ్య యీ మంచు♦కాలమునను. ౨౫౨

దండయాత్రాభిరక్తిని=యుద్ధయాత్రయందలి విశేషప్రీతిచే, ధరణిపతులు=రాజులును, పరమగోరస సంపన్నతరులు=మిగుల శ్రేష్ఠమైన యావుపాలు పెరుఁగు లోనైనవిగలవారు, ప్రాజ్యకాములు=మిక్కిలి కామనుగలవారు, జానపదులును=ఊళ్ళయం దుండువారు.

తాత్పర్యము.

అన్నా! రాజులు యుద్ధమునకై యాత్రపోవుటయందును బెద్దగ్రామముల యందుండువారు పాలు పెరుగు మొదలయినవి తినుటయందును మిగులఁ గోరిక గలవారై యీ మంచుకాలమందు వర్తింతురుకదా!

కం. దక్షిణదిశయందు జగ, చ్చక్షువు రాణించు చుండ ♦ శశ్వచ్ఛోభా
లక్షణతిలకచ్యుతహారి, ణాక్షి యనఁగ నుత్తరదిశ ♦ యమరెడిఁ గంటే. —౧౩

జగచ్చక్షువు=సూర్యుఁడు, శశ్వచ్ఛోభా=శాశ్వతకాంతి, లక్షణ=చిహ్నమైన, తిలక = నొసటనుంచుకొను బొట్టుచేత, హారిణాక్షి = స్త్రీ ఉత్ప్రేక్షాలంకారము వ్యంగ్యము.

తాత్పర్యము.

దక్షిణదిశయందు సూర్యుఁడున్న కారణముచే నుత్తరదిశ ముత్తైదువుచిహ్నమై ముఖమునకు శాశ్వతకాంతిని గలిగించు కుంకుమబొట్టులేని యాఁడుదానివలె నున్నది. ఇది దక్షిణాయనమగుటచే సూర్యుఁడు దక్షిణదిశయందే యుండును. శ్రీరామచంద్రమూర్తి యుత్తరదేశమున లేమిని నది విధవవలె నున్నది.

తే. సహజముగ మంచుగడ్డల♦స్థాన మైన
వాఁడు హిమవంతుఁ డీ తఱి ♦ వేఁడివెలుఁగు
మిగుల దూరగుఁ డౌటను ♦ మీఁతె సార్థ
కాఖ్యుఁడై కాలమహిమంబు♦నగ్గలికను. —౧౪

సార్థకాఖ్యుఁడై=సార్థకమగు పేరితోఁ గూడినవాఁడై, అగ్గలికను=అతిశయముచే, నిరుక్తియలంకారము.

తాత్పర్యము.

హిమవత్పర్వతము స్వభావముగానే మంచుగడ్డలస్థానము. అందు నీ కాలమున సూర్యుఁడు దూరమం దుండుటచే మంచుకరఁగుట మానుటచే హిమవంతుఁడు (మంచుగడ్డలుకలవాఁడు) అను పేరర్థముతోఁగూడినవాఁడై కాలమహిమచే నొప్పుచున్నాఁడు.

సీ. మధ్యాహ్నముల జనుల్♦మలయ సుఖంబుగా, నింపైన నునువెచ్చ♦యెండలొప్పె
సలలితార్కంబులై ♦ ఛాయల జిల్లను, జలములు గ్రాలె దు♦స్సహము లగుచు
మృదులసూర్యంబులై ♦ మిహికావృతంబులై, వలిగాలి వీవఁగ ♦ వనము లెల్ల
మానవసంచార♦హీనంబులుగ ముద్ద,కట్లు కట్టిన నిజాం♦గములు గలుగు
తే. జనులతో దివసంబులు ♦ సాగు నిప్పుడు, కానఁగా రాని వెలిపడ♦కలను గలిగి
పుష్యనీతములయి మంచు♦బూఁజువాఱె, యీఁదగాలిని రే లిప్డు♦వృద్ధిఁ జెందె.

మలయఁగ=సంచరింప, నునువెచ్చ=కొంచెము వేఁడిమి, సలలితార్కంబులై=వేఁడిమిలేని సూర్యునిగలవై, ఛాయల=చెట్లనీడల, దుస్సహము=సహింపఁగష్టమైనది, మృదులసూర్యంబులు=తీక్ష్ణముగాని సూర్యకిరణములుగలవై, మిహికావృతంబులై=మంచుచే నావరింపఁబడినవై, వలిగాలి=చల్లనిగాలి, మానవసంచారహీనంబుగఁ=మనుష్యులు తిరుగుటలేక, నిజాంగములు=తమ దేహములు, దివసంబులు=పగళ్లు, వెలిపడకలు=బయళ్ళయందలి పండుకొనుటలు, పుష్యనీతములయి=పుష్యనక్షత్రముచే జరుపఁబడినవియై, మంచుకాలమున రాత్రులు పుష్యనక్షత్రముచేఁ దెలిసికొందురు. బూఁజువాఱె=బూఁజుపట్టినట్లు తెల్లనై, ఈఁదగాలిని=చల్లనిగాలిచే

వృద్ధి చెందెన్=పగటికాలముకంటె రాత్రులందుఁ బ్రొద్దెక్కువ యయ్యెను. "అహములు సన్నములయ్యెను, దహనుఁడుహితవయ్యె దీర్ఘదశలయ్యె నిశల్" భాగ.

తాత్పర్యము.

ఉదయమున సాయంకాలమున మంచు విశేషించి యుండును. గావున జనులకు సంచారయోగ్యములు గావు. మధ్యాహ్నమందు జనులు సుఖముగ సంచరించుటకుఁ గొంచెము వేడిమిగల యెండ లొప్పుచుండును. చెట్లనీడలయందు సూర్యకిరణములు విశేషముగఁ దగులని కారణమున నీళ్లు జిల్లుమని తాఁకుటకే కష్టముగా నుండును. ఎండలు కొంచెముగా వ్యాపించుటచేతను మంచుచేఁ గప్పఁబడుటను జల్లనిగాలి విసరుటచేతను వనములందు మనుష్యసంచారములేదు. ఇఁక వానియందలి పక్షులలో వాయువునొప్పులచేఁ గీళ్లుపట్టుకొనిపోయినవారివలెఁ దమ యవయవములు ముద్దకట్టుకొని పడియుండును. పగళ్లీవిధముగా జరుగుచున్నవి. రాత్రులందు బయలందుఁ బండుకొనువారులేరు. పుష్యనక్షత్రమును జూచి ప్రొద్దు తెలిసికొనవలసియున్నది. రాత్రులు బూఁజుపట్టినట్లు తెల్లవాఱి చలిగాలిచే వృద్ధినిబొందుచున్నవి. పుష్యనీతము=పుష్యముతోఁగూడిన పున్నమ ప్రధానముగాఁ గలది. పుష్యమాసమునకు సమీపించినవై.

రేలు వృద్ధిచెందె ననుటచేఁ దమోగుణము ప్రధానముగాఁగల రాక్షసాదులకు వృద్ధియు సాధుజనసంచారమాంద్యము, జ్ఞానహీనత గల కాలమును సూచించుచు రాక్షసబాధచే నిప్పుడు దేశమిట్లున్నదని భావము సూచితము.

కం. వావిరి నిజసౌభాగ్యం, బీ విధుఁ డర్కున కొసంగి ♦ హిమబిందువులన్
గావి గొని తేజ మఱె నో,టావిరిచే గ్రుడ్డియైన♦యద్దము పోల్కిన్. ౨౫౬

ఈ విధుఁడు=ఈచంద్రుఁడు అనుటచే నింకను సూర్యోదయము కాలేదు. అంతకుముందేకదా స్నానముచేసి యర్ఘ్యమియ్యవలెను. నిజసౌభాగ్యము=లోకమునకు నాహ్లాదము కలిగించు తన శక్తిని, అర్కునకున్=సూర్యునకు, హిమబిందువులన్=మంచు తుంపురులచే, కావిగొని=ఎఱ్ఱబాఱి, తేజమఱెన్ = కాంతిహీనుఁడయ్యెను. నోటావిరిచే=నోటితో నూఁదఁగా నా యావిరిక్రమ్ముటచే, గ్రుడ్డియైన=సరిగాఁ గానరాని, ఉపమాలంకారము.

తాత్పర్యము.

ఆహ్లాదము కలిగించువాఁడు కావునఁ జంద్రునకుఁ జంద్రుఁడనిపేరు. ఇప్పుడా పేరు తనకు వ్యర్థముచేసికొని లోకుల సంతోషింపఁజేయు శక్తిని సూర్యున కిచ్చెను. ఆ కారణముచేఁ దపనుఁ డనుపేరు (తపింపఁజేయువాఁడు) సూర్యునందు వ్యర్థమై చంద్రునివలె నయ్యెను. అనఁగా సూర్యుఁడు చంద్రునివలెఁ బ్రజలకు సంతోషకరుఁ డయ్యెను. చంద్రుఁడో మంచు కురియుటచే జనులకు బాధ కలిగించువాఁ డయ్యెను. అంతియగాక మంచుతుంపరలు వ్యాపించుటచేఁ జంద్రబింబము నోటియావిరి క్రమ్మఁగా

గ్రుడ్డియైన యద్దమువలెఁ గానవచ్చెను. వ్యతిరేకాలంకారము. ఐశ్వర్యవంతుఁడని పేరుగల యింద్రుఁడు తన యైశ్వర్యమును రావణాసురుని కిచ్చి తాను దేజోహీనుఁడై యున్నాఁడని సూచితము.

తే. నిండుపున్నమనాఁటివె♦న్నెలలరేయి, యివముచే మలినం బయి ♦ యెలమిసీయ
దెండఁ గావిరివాఱిన♦పృథివికన్య, మాడ్కి నుండియుఁ దత్కాంతి♦మహిమ లేదు.

ఇవము=మంచు, హిమశబ్దభవము.

తాత్పర్యము.

నిండుపున్నమనాఁటిరాత్రి మంచుచే మలినమగుటచే సంతోషము గలిగింప కున్నది. ఇది యెండచేఁ గావిగొన్న సీతాదేవివలె నున్నదికాని యామె కున్న కాంతి మాత్రము లేదు. దీనిచే సీతాదేవి యెండ'గొట్టుపడినను గాంతియుత్సాహము గోలుపోయినదికాదు, అని యేర్పడుచున్నది. దీనిచే సీతాదేవి రావణుచే బాధింపఁబడినను దేహము గాసిపడినను ముఖవర్చస్సు, మనస్సునందలి ధైర్యోత్సాహములు గోలుపోదని వ్యంగ్యము.

కం. సహజంబుగ శీతలుఁ డై, మిహికాయోగమున నిపుడు ♦ మిహిరకులేంద్రా
రహి ద్విగుణితశీతలుఁ డై, యహర్ముఖములందుఁ బశ్చి♦మానిలుఁ డొప్పెన్.

పశ్చిమానిలుఁడు=పడమటిగాలి, సహజముగ=స్వభావముచేతనే, శీతలుఁడై=చల్లనివాఁడై, మిహికాయోగమునన్ = మంచుతోఁ గూడుటచే, ద్విగుణీకృత శీతలుఁడై =ఇబ్బడించిన చలిమిరి కలవాఁడై, అహర్ముఖములందున్=ఉదయకాలములందు.

తాత్పర్యము.

పడమటిగాలి స్వభావముచేతనే చల్లనిది, (౧) వాయువునకు శీతస్పర్శ స్వభావసిద్ధమని గోవిందరాజీయము, (౨) వాయువున కనుష్ణాశీతస్పర్శము స్వభావమని తీర్థీయము. వాయువునందు వేఁడిమికాని చలిమిరికాని స్వభావముగ లేదు. ఉష్ణపదార్థసంగతిచే గాలియు వేఁడియగును, శీతపదార్థసాంగత్యముచేఁ జల్లనగును. తేజస్సు జలము వాయువునకు వెనుకఁబుట్టినవేకదా. అయినను ఉదయకాలమందు వేఁడిమిగలిగించు సూర్యకిరణములు లేవు. రాత్రులందు వేఁడిమిపోయి యందు ముఖ్యముగ నాలుగవజామున నెండకాలమందును గాలి చల్లగానే వీచును. ఇప్పుడో దానికిఁదోడు మంచుబిందువులును జేరినవి. కావున నుదయమువేళ గాలి యిబ్బడించిన చలిమిరి కలదై యుండును.

శ్రీరామచంద్రమూర్తి స్వభావముచే దయగలవాఁడు, శాంతుఁడు. క్రోధమాహారయ త్తీవ్రం వధార్థం సర్వరక్షసా మ్మన్నట్లు రాక్షసవధవేళ నాకార్యము నిమిత్తమై కోపము తెచ్చుకొనును. ఇప్పుడు ఋషీశ్వరులు తమబాధలు చెప్పుకొనుటచే నాయన దయాగుణ మతిశయించినదని భావము.

భగవంతుఁడు స్వాభావికముగఁ గృపాళు వనియు రామావతారకాలమున బ్రహ్మాదిస్తోత్రముచే నాయనకృప మఱింత యధికమయ్యె ననియు ఋష్యాశ్రమ ఋషుల ప్రార్థనచే నది మఱింత యధికతరమైనదనియు సూచితము. గోవిందరాజీయము.

కం. యవగోధూమవిరాజిత, మవు బాష్పచ్ఛన్నవిపిన ♦ మర్కోదయమం
దవిరళక్రౌంచీసారస, రవముల శోభిల్లఁ దొడఁగె ♦ రాఘవ కంటే! ౨౫౯

యవగోధూమ విరాజితము=యవలచేతను గోధుమలచేతను, (ఈ పైరులచే) ప్రకాశించునది. బాష్పచ్ఛన్న విపినము = మంచుతుంపరలచేఁ గప్పఁబడిన యడవి, అర్కోదయమందు= సూర్యోదయకాలమున, అవిరళక్రౌంచీసారసరవములన్ = దట్టములయిన ఆఁడు క్రౌంచపక్షులయు బెగ్గురులయు ధ్వనులచే, శోభిల్లఁ దొడఁగెన్= ప్రకాశింపఁ బ్రారంభించెను.

తా త్ప ర్య ము.

యవగోధూమముల పైరులచేఁ బ్రకాశించుచు మంచుబిందువులచేఁగప్పఁబడిన యడవి సూర్యోదయసమయముకాఁగా ఆఁడు క్రౌంచపక్షులు బెగ్గురులు వీనిధ్వనిచేఁ బ్రకాశించుచున్నది.

మంచుకాలమున నీటిమీఁదనుండి యావిరి లేచునట్లు పైరులమీఁదినుండియు నావిరి లేచి పొగవలెఁ గానవచ్చుచుండును.

యవగోధూమవిరాజితము; బాష్పచ్ఛన్నమైన విపినము అనుటచే రావణుని బాధకు వెఱచి లోకము గగ్గురుపాటొంది కన్నీరు గార్చుచుండెనని సూచించును.

అర్కోదయము - రామజననము సూచించును.

క్రౌంచీసారసనినాదములు = రాత్రివేళ మంచునకువెఱచి గూళ్ళలోఁ బడియుండిన ఆఁడుక్రౌంచములు బెగ్గురులు సూర్యోదయమున సంతోషముచే నెలుఁగు నిచ్చినట్లు రావణునిచే బాధింపఁబడిన స్త్రీలు పురుషులు రాముఁ డుదయించెను. రావణుఁడు చచ్చెనని సంతోషముతో ధ్వనించి రని సూచితము

బాష్పశబ్దముచే రామకృప సూచితము. యవగోధూమయనుటచే ఋషి తపోవృద్ధి సూచితము. రవములనుటచే వేదాధ్యయనము సూచితము. ఇఁకఁ బై రామ కృపాతిశయముచే ఋషుల తపస్సులు వర్ధిల్లి యాశ్రమములు వేదఘోషములు గల వగునని సూచితము. గోవిందరాజీయము.

తే. కలితఖర్జూరసుమముల♦కాంతి గలిగి, పూర్ణతండుల మగు శిరం♦బును నొకింత
వంచి యపరంజిబంగరు♦వన్నె మెఱసి, యున్న వరిపైరుఁ గంటివే ♦ యుల్లమలర.

కలితఖర్జూరసుమములకాంతి = అందమైన ఖర్జూర పుష్పములకాంతి, పూర్ణతండులము=వడ్లగింజలతో నిండినది, ఉల్లము + అలరన్ = మనస్సునకు సంతోషము కలుగునట్లు.

తా త్ప ర్య ము.

ఖర్జూరపుఁ బూలవంటి కాంతి గలిగి యెన్నులు వడ్లగింజలతో నిండి యా బరువునఁ దలలు వంచి పండుటచే నపరంజి బంగారువన్నె గలిగిన పైరు చూచితిరా?

విద్యయొసఁగును వినయమన్నట్లు సుజనులందు విద్యాధనసంపత్తి పక్వమగు కొలఁది వినయము హెచ్చుచుండును, అని సూచితము. జడలుగల వృద్ధఋషులును శ్రీరామచంద్రమూర్తికి నమస్కరించెద రని సూచిత మని గోవిందరాజీయము.

తే. మంచుతుంపర బెరసి వ్యా♦పించు చున్న
కిరణములతోడ సూర్యుండు ♦ కరము దవ్వ
నందు నభ్యుదితుం డయి ♦ చందమామ
పోలె నున్నాఁడు గనుగొమ్ము ♦ పుణ్యశీల. ౨౬౧

అభ్యుదితుఁడు=ఉదయించినవాఁడు.

తా త్ప ర్య ము.

సూర్యుఁ డుదయించినను మంచంతయుఁ బోలేదు. తుంపరగా సన్నగా వ్యాపించియే యున్నది. ఆ కారణముచే సూర్యుఁ డుదయించి చాలఁ బ్రొద్దెక్కినను జందమామవలె నున్నాఁడు.

నీ వడవికివచ్చి బహుకాలమయ్యును, దుర్బలునివలె రాక్షసులచే నేల యవమానింపఁబడుచు నూరకున్నా వని సూచితము.

తే. రామ పూర్వాహ్ణమునఁ బస ♦ యేమి లేక
హాయిగా మేను సోఁకి మ♦ధ్యాహ్న వేళఁ
గించిదాపాండురంబులు ♦ నించుకంత
మెఱుపులై యున్నయవి చూడు ♦ యెండ లిపుడు. ౨౬౨

పూర్వాహ్ణమునన్ = మధ్యాహ్నమునకు ముందటికాలమునందు, పస=సత్తు, కించిత్ + ఆ పాండురంబులు = కొంచెము తెల్లనైనవి.

తా త్ప ర్య ము.

శ్రీరామచంద్రా! మధ్యాహ్నమునకు ముందు ఎండవేఁడిమిలేక సుఖముగా దేహమునకు సోకుచు మధ్యాహ్నమందుఁ గొంచెము తెలుపు కొంచె మెఱుపునై సూర్యకిరణము లున్నవి.

రాక్షసులు వరిల్లి నీశక్తి లోకమునకుఁ గానరాకుండఁ జేయుచుండఁగా శక్తిగలిగియు వారి నుపేక్షించి యూరకుండుట సరిగాదని సూచిత మని గోవిందరాజీయము.

తే. ఇవము తువ్వర రాలుట ♦ నించుకంత, తడిసి యున్నట్టి పచ్చిక♦తావులందు
హేళియీరెండ ప్రాలిన♦లీలఁ గంటె, మంచుబొట్టులు వజ్రాల♦ మాడ్కిఁ దనరె.

ఇవముతువ్వర=మంచుతుంపర, హేళి=సూర్యుఁడు, ఈరెండ=కొంచెమెండ.

తాత్పర్యము.

మంచుతుంపర రాలుటచేఁ గొంచెము తడిసియున్న లేఁబచ్చిక పట్టులందు సూర్యుని యీరెండ పడినవిధము చూచితివా! సూర్యకాంతి యీ బిందువులపైఁ బడుటచే నవి వజ్రాలవలెఁ గానవచ్చుచున్నవి.

రాక్షసోపద్రవముచేత ఋషులు దుఃఖింపఁగా నాపై రాముని కృపగల్గుట సూచిత మని గోవిందరాజీయము.

తే. అడవియేనుఁగు పెనుదప్పిఁ ♦ బడియు మిగులఁ
జిల్లు మనియున్ననీటిని ♦ నల్లయదిగొ
నంటియును ద్రావకయ తొండ ♦ మల్ల ముడుఁచు
కొనుచు నున్నది తిలకింపు ♦ కులవతంస ౨౬౪

పెనుదప్పిఁబడియు=మిగుల దాహముఁగొనియు, జిల్లుమని=చల్లగా (అనుకరణ శబ్దము), కులవతంస=సూర్యునివంశమునఁ బుట్టినవారిలో శ్రేష్ఠుఁడా!

తాత్పర్యము.

అన్నా! యీ యడవి యేనుఁగును జూడుము. అది మిక్కిలి దప్పిచే బాధ పడుచుండి నీళ్లు ద్రావవలె నని తొండముకొనచే నీటిని దాఁకియు నది జిల్లుమని యుండుటచేఁ ద్రావక తొండమును ముడుచుకొనుచున్నది.

రావణభయ మధికముగా నున్నదనుట సూచితము, అని గోవిందరాజీయము. దేవత లిష్టభోగము లనుభవింప నెంతో కోరిక గలిగియు ననుభవించుటకై భోగ్యములఁ దాఁకియు రాక్షసభయముచే మానుకొనుచున్నా రని భావము.

తే. నీటిపక్షులు గూర్చుండి ♦ నీటివెంట
మునుఁగఁగా జంకుచున్నవి ♦ యనఘచరిత
దురమునను గోఁచలగువారు ♦ చొరఁగలేని
తీరు దలపించుచును వాని♦ తెఱఁగుఁ గంటె. ౨౬౫

దురమునను = యుద్ధమందు, కోఁచలు=పిఱుకులు, తలపించుచును = జ్ఞప్తికిఁ దెచ్చుచు.

తాత్పర్యము.

నీటిపక్షులు ఎప్పుడు నీళ్లలో నుండునవియైనను నీటివెంటఁ దీరమునఁ గూర్చుండి నీటిలో దిగుటకు భయపడుచున్నవి. వీనినిజూడఁ బిఱికివారు యుద్ధరంగమునఁ బ్రవేశింప జంకువిధమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి.

యుద్ధమునం దాఱితేఱి లక్ష్యములేనివాఁడ వయ్యు రాక్షసులతోడి యుద్ధమునకు శంకించుచుండుటచే నీవు పిఱికివలెఁ గానవచ్చెద వనియు నా జంకు వదలి పూనిన కార్యము నిర్వహింపు మనియు భావము.

కం. లో నీహారపుఁజీఁకటి, పైని యవశ్యాయతమము ♦ పటుగతిఁ గప్పం
గా నిద్రించెడివిధమునఁ, గాననము విపుష్ప మగుచుఁ ♦ గ్రాలెడి నన్నా. ౨౬౬

నీహారపుఁ జీఁకటి = మంచు అనెడి యంధకారము, అవశ్యాయ = మంచు యొక్క, తమము=చీఁకటి, పటుగతిన్=విస్తారముగ, విపుష్పము=పుష్పములు లేనిది, మంచుచేఁ బూ లన్నియుఁ జెడిరాలిన వని యర్థము.

తా త్ప ర్య ము.

లోపలను బయటను మంచు అనెడి చీఁకటి, విస్తారముగఁ గప్పఁగా నడవి పూలులేని దగుచు నొప్పియున్నది. అన్నా! చూచినావా?

మంచు కురియుటచే నాసీటిబరువునకు ఆకులు చిగుళ్లు కదలమిని నడవి చీఁకటి క్రమ్మఁగా నిదురించువారివలె నున్నది. మీఁద గ్రమ్మిన మంచుటావిరి నిదురించువారు దుప్పట్లు కప్పుకొన్న ట్లున్నది. పుష్పములు లేకుండుటచేఁ గన్నులు మూసికొన్న ట్లున్నవి. ఈకారణముచే వనములు నిదురపోవుచున్న ట్లున్నవి. గోవింద రాజీయము, ఉత్ప్రేక్షాలంకారము.

నిద్రించువారికి రాత్రికాలపుఁ జీఁకటియు నిద్ర యనెడి చీఁకటియు రెండును నావశ్యకము లే. అప్పుడు వారు కన్నులు మూసికొని నిద్రింతురు. ప్రకృతము రెండు విధము లయిన మంచు లనెడి రెండు చీఁకట్లు క్రమ్ముకొనఁగా నడవి నిద్రించున ట్లుత్ప్రేక్షింపఁబడెను. విపుష్ప మనుట కన్నులు మూసికొనుట సూచితము. మహేశ్వర తీర్థీయము.

కం. ఆవిరి గ్రమ్మినసీటను, రావముచేఁ దెలియఁబడెడి ♦ రహిఁ బెగ్గురుల్
దూవరమంచునఁ దడిసిన, యా వాలుకపంక్తి నేఁడు ♦ లలరెడిఁ గనుమా. ౨౬౭

తూవర=తువ్వర తుంపర, వాలుకపంక్తి=ఇసుక వరుస.

తా త్ప ర్య ము.

నీళ్లలో నుండు బెగ్గురుపక్షులు మంచుయొక్క యావిరి కప్పుటచే వెలికిఁ గానరాకున్నను వాని ధ్వనులచేఁ దెలియఁబడుచున్నవి. భూమియో మంచుతుంపరలచేఁ దడిసియున్నది.

ఇందు నదు లనుటచే ఋషులను గ్రహింపవలెను. ఏటినీ ళ్లావిరిచేఁ గప్పఁబడుట, బెగ్గురులు ధ్వనులచేఁ దెలియఁబడుట వీనిచే ఋషు లాశ్రమంబులం దేయుండి దుఃఖాక్రాంతులై వెలికివచ్చిన రాక్షసులు చంపుదు రను భయముచే దాఁగి మూలుగుచుండుట సూచితము.

కం. ఇవ మిదె పయిపయి రాలుట, రవికరములు మృదువు లగుట ♦ రామా చలికిన్
బ్రవిమల మగుశిలమీఁదం, దవిలినసలిలములు రసవి♦ధంబుగ నయ్యెన్. ౨౬౮

రవికరములు=సూర్యకిరణములు, మృదువులు=వేఁడిమిలేనివి, సలిలములు = జలములు, ఇవము=హిమము.

తాత్పర్యము.

మీఁదమీఁద మంచు రాలుటచేతను సూర్యకిరణములందు వేఁడిమి లేకుండుట చేతను రామచంద్రా! నిర్మలమగు జాలమీఁదఁ బడిన నీళ్లుగూడ విషములయియే యున్నవి.

మీఁదమీఁద మంచు గురియుట మీఁదమీఁద రాక్షసులు పైపడి వచ్చుట. సూర్యకిరణములు వేఁడిమిలేకుండుట నీవు మాంద్యము వహించుట. కావునఁ గొండల మీఁదనుండు ఋషులుగూడ దుఃఖింపవలసివచ్చెను.

రసమనఁగా విషమనుటకు, "శృంగారముఖ్యమధురాది సువర్ణరేతో నిర్యాస రాగ గరళ ద్రవపారదేషు" నానా॥ ర॥

కం. ప్రాలేయధ్వస్తంబును, జాల జరాజర్ఝరితము ♦ జాఱెఁజి కింజ
ల్కాళియు బిసశేషం బగు, నాళీకముతోడఁ గొలను♦నాణెముఁ బాసెన్. ౨౭

ప్రాలేయధ్వస్తంబు=మంచుచే నాశముచేయఁబడినది. జరా=ముసలితనముచే, జర్ఝరితము=మంచికాంతి చెడినది, కింజల్కాళి=అకరువులు, దుద్దులు (దిమ్మెలు), బిస శేషము=తామరకాఁడమాత్రము మిగిలినది, నాళీకము=తామర, నాణెముఁ=అంద మును, కమలములకు మంచుకాలము నాశకాలము.

తాత్పర్యము.

తామరపూలు పూచి చాలఁగాలమగుటచే మంచుచే నందముచెడి వాడి కాంతిఁ బాసి యకరువులు దిమ్మెలు రాలిపోఁగాఁ గాఁడలుమాత్రము మిగిలిన తామరలతోఁ గొలఁకు లందము చెడియున్నవి.

ఇచ్చటఁ గొలఁకులు ఋష్యాశ్రమములు, రాక్షసులు తమవారి నందఱను జంపఁగా ముసలివారై యొంటరిసంటరిగా ఋషులు మిగులుటచే నందము చెడిన యాశ్రమముల విధము సూచితము.

అవతారిక:—ఇంతవఱకు శ్రీరాముల యుపేక్షచే ఋషీశ్వరులు పడుబాధలు వారుండుస్థితి యన్యాపదేశముగఁ జెప్పఁబడెను. ఇఁక నక్కడ నయోధ్యలో భరతుని స్థితిఁ దెలుపుచు నాయనను జూడఁబోవుకాలము సమీపించుచున్నది కావున నీ విందువచ్చిన కార్యము పూర్ణముచేయ యత్నింపుమని హెచ్చరించుచున్నాఁడు.

చం. కన నిటు పుండువంటి చలి♦కాలమునన్ భరతుం డయోధ్యలో
ఘనతరదుఃఖవేదనను ♦ గ్రాఁగుచు, రాజ్యము మాని, భోగముల్
గొనక, తపస్వియై, నిదురఁ ♦ గూరుచు నేలపయిన్, మితాన్నమున్
గొనుచును, నీపయిం గలుగు♦కూరిమి పెంపున నున్నవాఁడుగా. ౨౮

క్రాఁగుచున్=తపించుచు.

తాత్పర్యము.

ఇటువంటిపుండువలె బాధాకరమైన మంచుకాలమందు నయోధ్యలో మిగుల

దుఃఖబాధచేఁ దపించుచు రాజ్యసంపద వదలి భోగములాసింపక, యుపవాసము లుండి జడలు నారలు ధరించి మంచములు పఱుపులు వదలి యొుసుబయల నేలమీఁదఁ బండుకొనుచుఁ గొంచెముగా ఫలాదులు దినుచు నీపయింగల భక్తిచే భరతుఁడు నవయుచున్నాఁడు గదా.

కం. ఇదియే వేళ కతండును, నిదురఁ మేలుకొని యేటినీట మునుంగన్
గదుకొని ప్రకృతులు గొలువఁగ, సదమలమతిఁ జనుచు నుండు ♦ సరయువుఁ జేరన్.

ప్రకృతులు = మంత్రులు మొదలగువారు, కొలువఁగన్ = ఆయనపైనున్న భక్తిగౌరవములచే నా సమయమందును సేవించి వెంటరాఁగా.

తాత్పర్యము.

అన్నయ్యా! మనము లేచినవేళకే భరతుఁడును నిద్రలేచి సరయూనదిలో స్నానముచేయుటకై మంత్రులు మొదలగువారు చుట్టు క్రమ్ముకొని సేవింపఁగా నిర్మలమగు మనస్సుతోఁ బోవలసివచ్చెనే యను విచారములేక పోవుచుండును గదా.

భరతుఁడును వానప్రస్థచర్య జరపుచు నందిగ్రామంబున నున్నవాఁడు. ఆశ్రమస్వీకారము చేయలేదు. కావున నాయన గ్రామమందుండుట దోషముగాదు, ఇంట నుండియు సన్న్యాసివలె వర్తింపవచ్చును గదా.

కం. గారామునఁ బెరిగిన సుకు, మారుఁడు భరతుండు సుఖము ♦ మఱిగిన యాతం
డేరీతి నపరనిశలన్, సారసనయనుండు గ్రుంకు ♦ సరయువునందున్. ౨౭౨

గారామున = అల్లారు ముద్దుగా, పెరిఁగిన = తండ్రి భరతుని ప్రేమతోఁ బెంచెను. నీ వన్నను నతని విశేష ప్రేమచేఁ బెంచితివి, సుకుమారుఁడు = ప్రేమరస భరితములయిన నీ చూపులు మీఁద సోఁకినను వాడిపోవునంతటి కోమల దేహము గలవాఁడు, అపరనిశలన్ = అపరరాత్రములందు, బాలవిధవలగు స్త్రీలు మనుష్యులు తమ ముఖమును నుదయముననే చూచిన జారత్వమున మగనిఁ జంపిన యీ ముండ ముఖము ప్రొద్దుననే చూచితిమి. నేఁడేమో కీడు కలుగునని యెట్లు తమ్ము దూషింతురని యెవరు నిద్రలేవకముందే లేచి వెలికార్యములు తీర్చుకొందురో యట్లే జనులు నిద్రలేచిన తరువాతఁ దాను లేచి బయటవచ్చినఁ దన ముఖముఁ జూచువారు ఈ పాపివలనఁ గదా రాజ్యమునకు శ్రీరామచంద్రమూర్తికి నింతకష్టము వచ్చెనని దూషింతురని భయపడి మనుష్యసంచారములేని యపరరాత్రులందు స్నానమునకుఁ బోవునని భావము. సరయువునందుఁ గ్రుంకున్ = సరయువు వేగముగాఁ బాఱుచున్నను తాఁబేళ్ళు విశేషముగ నున్నను మనస్సునందు గల దుఃఖాతిశయముచే దానిని లక్ష్యపెట్టక నిర్భయముగా మునిఁగి స్నానముచేయును. సారసనయనుండు = కమలములు రాత్రివేళ ముకుళించును.

అట్లు హాయిగా నిద్రింప వలసిన కాలమందు నేటి చల్లని నీటిలో మునుఁగును, క్రుంకన్ = మునుఁగును. ఒడ్డుననుండి చెంబుతో నీళ్లుముంచి పోసి

కొనుటకాదు, నీళ్ళలో మునుఁగును. ఎంతసేపు? ఎంతలోఁతున మునిఁగినఁ బరులు వెలుపలికిఁ దీసికొని రావలసియుండునో యంత సేపు మునుఁగును. ఇటువంటి వాఁడెట్లు చల్లని యేటినీళ్ళలో మునుఁగును అని లక్ష్మణుఁడు సందేహించుచున్నాఁడు. ఏలనఁ దనకు రామ విరహతాపములేదు, ఇతరవిచారము లేదు. కనుక లక్ష్మణునకు నీళ్ళు చలి యని వేఁడిమియని తెలియుచున్నవి. కావునఁ దనవలెనే భరతుఁ డనుకొని సందేహించుచున్నాఁడు. కాని రామవియోగతాపవహ్ని లోపలఁ బ్రజ్వరిల్లుటచే వెలుపలిచలి యాయన మనస్సునకుఁ దగిలినదే కాదు. అదియును గాక 'ఉపతప్తోదకా నద్యః'' యని రామవిరహముచే నదులు కూడఁ దపించినవియని యుండుటచేఁ జలిప్రశంసయే లేదు. తీవ్రమనోవేదన గల కాలములో వెలుపలి సుఖదుఃఖములు మనస్సున నంటవు.

సీ. మహనీయతరసుకు♦మారుండు వీరుండు, సురుచిరానుదరుండు ♦ సుందరుండు
రాజితసర్వధ♦ర్మజ్ఞుండు, ప్రాజ్ఞుండు, సత్ప్రమదాపాది ♦ సత్యవాది
నిర్దుష్టకార్యైక♦నిరతుండు భరతుండు, మత్తారిమదశోషి ♦ మధురభాషి
యాజానుదీర్ఘ బా♦హుండు గుండరాగుండు, హ్రీనిషేధుండు జి♦తేంద్రియుండు
ఆ. భక్తిమేదురుండు ♦ భవదీయసోదరుం, డఖిలభోగరాశి ♦ యానఁ బాసి
స్వర్గమును జయించె ♦ వనసీమఁ జరియించు, నిన్ను బోలి తపము ♦ నిష్ఠఁ దూలి.

మహనీయతర సుకుమారుండు = మిక్కిలి యతిశయించిన కోమలదేహము గలవాఁడు. పెద్దకొడుకవని నిన్నుఁ బెంచిన గోమునకంటెఁ దన ప్రియురాలగు కైక కొడుకను కారణమునఁ బ్రీతితోను, ఏమి యుపేక్షించినఁ గైక కోపించునో యను భీతిచేతను నెక్కువ గోమున మనతండ్రిచేఁ బెంపఁబడినవాఁడు. మహనీయ సుకుమారుఁడు, వీరుండు=అంతటి సుకుమారుఁడయ్యు యుద్ధరంగమున నెంతగాసికైన నోర్చు పరాక్రమముగలవాఁడు. సురుచిరానుదరుండు=సుందరమై స్వల్పమైన కడుపు గలవాఁడు. సుకుమారులు కష్టముచేయక తిండిమాత్ర మెక్కువ దినుటచేఁ బొట్టలు ముందటికి వచ్చియుండును. ఈయన కట్లులేదు, అనఁగా కడుపేలే దని యర్థము కాదు. ఉదరము స్వల్పముగా నున్నదని యర్థము. నకారమునకు అల్పమనియు నర్థము గలదు. "హేరంబేనః పుమాన్నాస్త్రీ నాభావం జ్ఞానపాద్యయోః వంధ్యాసూక్ష్మ పరిక్లిష్ట శూన్యభేదేషు నస్త్రిషు, నానా॥ ర॥ న+ఉదరుఁడు= అనుదరుఁడు, నకారమునకుఁ బరముగ వృత్తియందు నచ్చువచ్చెనేని 'న' అన్ అగును, అనుదరుఁడనఁగా అరచేతివలె లోపలికిఁబోయియుండు కడుపుకలవాఁడు, సుందరుఁడు = అందగాఁడు, రాజిత ధర్మజ్ఞుఁడు=ప్రకాశించు సమస్తధర్మములు తెలిసినవాఁడు, ప్రాజ్ఞుఁడు= చదువుటచేఁ దెలియుట మాత్రమేకాదు. వానిని జక్కఁగా నాలోచించి యవలోడనము చేసినవాఁడు, సత్+ప్రమదాపాది = సత్పురుషులకు సంతోషము గలిగించువాఁడు, సత్యవాది=ఇతరులకు సంతోషము గలిగింపవలయునని యసత్యము చెప్ప

వాఁడునుగాఁడు. నిర్దుష్ట=దోషములేని, కార్యైక=కార్యములందే, నిరతుండు = అతి ప్రీతిగలవాఁడు, మత్తారి మదశోషి=మదించిన శత్రువుల గర్వమును నెండ జేయువాఁడు, మధురభాషి = శత్రువుల గర్వము నణఁచుటయందును కఠినముగ మాటలాడువాఁడు కాఁడు, ఆ+జాను+దీర్ఘ బాహాంగుఁడు = మోఁకాళ్లవఱకుఁ గల నిడుపులైన చేతులుగలవాఁడు, అరాగుండు=మాత్సర్యము లేనిఁ వాఁడు, 'రాగోను రాగో మాత్సర్య'యని నిఘంటువు, హ్రీనిషేధుండు=చేయరాని పనులు చేయుట యందు సిగ్గుపడువాఁడు, జితేంద్రియుండు=ఇంద్రియముల జయించినవాఁడు, భక్తి మేదురుండు=నీయందు గాఢమైన భక్తిగలవాఁడు, భవదీయ సోదరుండు=నీ తోడఁ బుట్టినవాఁడు, తమ్ముఁడు, అఖిల భోగరాశి=సమస్త భోగములకుప్పయైన వాఁడు.

## తాత్పర్యము.

నీకంటెను మిగుల సుకుమారుఁడును వీరుఁడును పలుచని కడుపుగలవాఁడును చక్కనివాఁడును కావునఁ గప్పింపఁదగినవాఁడును, సమస్త ధర్మములు తెలిసినవాఁడును, వానిని జక్కఁగ నవలోడనము చేసినవాఁడును, సజ్జనులకు సంతోషకరుఁడును, సత్యవాదియు, దోషములేని కార్యములఁ జేయువాఁడును- మదించిన శత్రువుల గర్వ మణఁచు వాఁడును, తియ్యని పలుకులు పలుకువాఁడును, మోఁకాళ్ల నంటు చేతులు గలవాఁడును, మాత్సర్యము దుష్కామము లేనివాఁడును, చేయరాని పనులు చేయుటయందు సిగ్గుపడువాఁడును, ఇంద్రియ జయముగలవాఁడును, గాఢ భక్తిగల వాఁడును, అఖిలభోగముల రాశియగువాఁడును నగు నీ తమ్ముఁడు భరతుఁడు ఆశను వదలి యడవియందుఁ దపించు నీవలెఁ దపమున నిష్ఠఁ బూని స్వర్గమును దిరస్కరించిన వాఁడయ్యెను.

నిద్రాహారము లుజ్జగించి, యుపవాసతపః క్లేశముల బుజ్జగించి నీవిరహతాపాతిశయమున దేహము విడిచెనేని తపఃఫలముగ స్వర్గ మెచ్చట దాపరించునో యది నీ దర్శనమునకు విఘ్నకారియగుటయే గాక నీదర్శనమువలనఁ గలుగు ఫలముతో నది సరికాదు కావునఁ బ్రాణములు పోకుండ బిగఁబట్టుకొనియున్నాఁడు.

ఇట్లు నీ వడవులకు వచ్చి దీర్ఘకాలమైనను నీవు సంకల్పించిన ప్రకారము ఋషులు గోరినప్రకారము, రాక్షసవధయుఁ జేయవైతివి. నీకై ప్రాణములు బిగఁ బట్టుకొనియున్న తమ్ముని నాదరించిన వాఁడవు కావైతివి. కాలమా సమీపించుచున్నది. పెట్టుకొన్న కార్యమా బహుప్రయాససాధ్య మైనదని హెచ్చరించి యందఱ యన్నియనర్థముల మూలకారణమైన కైకను నిందించుచున్నాఁడు.

చం. మనుజులలోనఁ దండ్రిని గుమారుఁడు పోలఁడు, పోలుఁ దల్లినే,
యనియెడిలోకవార్త వృథయై చనెఁ గైకయిపట్టియందు; నే
మన నుతశీలి యాజి పతియై, గుణియా భరతుండు పుత్రుఁడై
చనియెడి కైక యట్టి ఖలశాతమనస్విని యాట యెట్లొకో. ౨౭౮

యాజి=దశరథుఁడు,ఖల=దుష్టురాలు, శాతమనస్విని=తీక్ష్ణమైన మనస్సుగలది, అట్టి=అంతటి ఘోరకార్యము చేయఁ దెగించినది.

తా త్ప ర్య ము.

ధన్యా పితృముఖీకన్యా, ధన్యో మాతృముఖ స్సుతః

తండ్రినిబోలిన కూఁతురు తల్లినిబోలిన కొడుకు ధన్యులని సామెతయుండఁగా, సముద్రములోఁ గలిసిన నీరు సముద్రమువంటిది కావలసియుండఁగా ధర్మస్వభావుఁడైన దశరథునకు భార్యయై యిటువంటి సుగుణసంపత్తిగల కొడుకునకుఁ దల్లియగు కైక యింతటి దుష్టురాలు, వాఁడిగల మనస్సుగలది యెట్లయ్యెనో.

సీతారాములు నిష్కారణముగ మంచులో గాలిలో నెండలలోఁబడెడి కష్టములు చూచి సహింపలేక వీనికి మూలకందమైన కైకను దూషింపఁదలఁచి యారంభమందే యామెపేరెత్తిన శ్రీరామచంద్రమూర్తి కోపించునని తొలుత "అనారంభో మనుష్యాణాం ప్రథమం బుద్ధి లక్షణమ్, ఆరంభస్యాంతే గమనం ద్వితీయం బుద్ధిలక్షణమ్॥ ఒక కార్యమునకుఁ బూనుకొనకయుండుట మొదటి బుద్ధిలక్షణము. పూనుకొనెనా పొంతముగ నెఱవేర్చుట రెండవ బుద్ధిలక్షణము, అను న్యాయము ననుసరించి పూనినకార్యము నెఱవేర్పకున్నావని యన్యాపదేశముగ హెచ్చరించి యుపమానముచే భరతుని ప్రస్తావన దెచ్చి దాని కనుగుణముగఁ గైక ప్రశంస తెచ్చి యామెను లక్ష్మణుఁడు నిందించుచున్నాఁడు.

లక్ష్మణుసందేహము న్యాయమైనదే కాని రామలక్ష్మణ భరతశత్రుఘ్నుల జన్మమునకు బీజము కారణముగాదు. క్షేత్రము కారణముగాదు. పాయసరూపము వహించిన భగవత్తేజము కారణము కావున తల్లిదండ్రుల గుణములు వీరి నంటవలసినది లేదు.

చం. అన విని కైక నేల దురు♦సాడఁగ! రాఘవవంశనాథు త
త్తనయుచరిత్రఁ జెప్పుము ము♦దం బగు, నే వనవాసనిష్ఠపై
మనము దిటంబు చేసియును ♦ మాన్యుని నబ్భరతుం దలంచినన్
వనటను మానసంబు కడు♦ బాలిశవృత్తి భజించు లక్ష్మణా. ౨౭౫

అనన్=తనయందలి భరతునందలి ప్రేమచే నిట్లు చెప్పఁగా, దురుసు+ఆడఁగన్=కఠినవాక్కులు పలుకఁగా. రాఘవవంశనాథుతత్తనయుచరిత్ర=రఘువంశమున బుట్టినవారిలో గొప్పవాఁడైన, తత్ = ఆ కైకయొక్క, తనయు చరిత్ర = కొడుకు వృత్తాంతము, ముదంబగున్=సంతోషించెదను. ఆమెచేసినకార్యము వలన మన కిప్పటి కేమియుఁగీడు మూఁడలేదుగదా. నిష్కారణముగ నేల యామెను దూషింపవలెను? పుణ్యాత్ముభరతునే ప్రశంసింపుము. "ఆస్ఫోటయంతిపితరః ప్రనృత్యంతి పితామహాః" యనుట యట్టివాని విషయమేకదా, వనటను=శోకముచే, బాలిశవృత్తిని=పామరవ్యాపారమును, సంయోగవియోగములు దైవకృతములు, దేహిస్వ

భావగుణము లని తెలిసియు నది తెలియని పామరుఁడు దుఃఖించునట్లు దుఃఖింప మన స్సగుచున్నది.

తా త్ప ర్య ము.

ఆ ప్రకారము లక్ష్మణుఁడు చెప్పఁగా లక్ష్మణా యేల నిర్నిమిత్తముగఁ గైకను దూషించెదవు. రఘువంశనాథుఁడగు నామె కొడుకును బ్రశంసింపుము. అది నాకు సంతోషముఁ గలిగించును. వనవాసము సాంతముగ నెఱవేర్పవలయు నని మనస్సు దృఢము చేసికొనియును భరతుని దలంచినపు డయ్యో భరతునియొద్దకుఁ బోయిన బాగుండునే ఆయనను విడిచివచ్చితినే యని పామరులకు వలె నాకును దుఃఖము గలుగుచున్నది.

కం. ఆమధురభాషణంబులు, నామహిత ప్రియోక్తి హృద్య♦మై యమృతరస
స్తోమనిభం బయి యెపుడున్, నామనమున మఱపురాదు♦నాయన వింటే. ౨౭౬

ఆ మధురభాషణంబులు=ఆనాఁడు భరతుఁ డాడిన తియ్యనిమాటలు, ఆమహిత ప్రియోక్తి=ఉత్తమధురమే కాదు ప్రియము లైనమాటలు, అమృత రసస్తోమనిభంబు= అమృతరస సమూహముతో సమానమై, ఎపుడున్=ఏకాలమందును.

ఛందస్సు. మహిత౨ ఇందలి తకారము లఘువు.

తా త్ప ర్య ము.

నాయనా! లక్ష్మణా! కొందఱ మాటలు తొలుత విన మధురములుగానే యుం డునుగాని తుదకవి యప్రియములై పరిణమించును. భరతునిమాట లట్టి యిచ్చక ములుగావు. కొన్ని పదార్థములు నాలుకకుఁ దియ్యగా నుండినను లోపలికిఁబోయిన వికారకారణ మగునుగదా, భరతునిమాట లట్టివిగాక యమృతమువంటివి. లోపలికిఁ బోయినను దేహారోగ్యము గలిగించు నోషధివంటివి. అదియును నొక చుక్క రెండు చుక్కలుగాదు. అమృతరస ప్రవాహము గావున సర్వదా యాయన మాటలు నాకు నిప్పటికి మఱపురావు.

కం.నిను భరతుని శత్రుఘ్నుని, జనకజ నేఁ గూడియుండు♦సమ్మద మెన్నం
డొనరు నొకో యని వగచుచుఁ, జనియెం గౌతమికి రామ♦చంద్రుం డాడన్. ౨౭౭

తా త్ప ర్య ము.

నిన్ను భరతుని శత్రుఘ్నుని సీతను నేను గూడుకొని సంతోషముతో నుండు టెన్నఁడో కదాయని వ్యసనపడుచు గోదావరికి స్నానార్థమై శ్రీరామచంద్రమూర్తి పోయెను.

ఉన్నవారిని విడిచి లేనివారికై వగవనేల యనరాదు. ఇంటియందేదైన పండుగు జరగెనేని పదిమంది కొడుకు లెదురుగానుండి యొకఁడు దూరమం దుండినను దల్లిదండ్రుల మనస్సు వానిమీఁదనే యుండును. ఆ మాత్రమున నున్నవారిపైఁ బ్రేమ లేదనరాదు. చంద్రుని పదునాఱుకళలలో నొక కళ తక్కువైనను కొఱఁత కొఱఁ తయేకదా.

కం. చని సీతానుజయుతుఁడై, యినముని పితృదైవతముల ♦ కెఱఁగి కృతాసే
చనుఁడై గిరిజానందులు, తనుఁ గొలువంగ నుండు రుద్ర♦తద్గతి నుండెన్. ౨౭౮

సీతానుజయుతుఁడై = సీతతోను దమ్మునితోను గూడినవాఁడై, ఇనముని పితృదైవతములకున్ = సూర్యునకు ఋషులకు పితరులకు దేవతలకు, ఎఱఁగి = నమస్కరించి, కృతాసేచనుఁడై = స్నానముచేసినవాఁడై, గిరిజానందులు = పార్వతియు నందికేశ్వరుఁడు, రుద్రతద్గతి = రుద్రునివలె. రుద్రుఁడు = ప్రజలను ప్రలయమందు నేడిపించువాఁడు.

తాత్పర్యము.

సీతాలక్ష్మణులతో స్నానము చేసివచ్చి సంధ్యాది కృత్యములను బ్రహ్మయజ్ఞమును జేసినవాఁడై పార్వతీ నందులతోఁగూడిన రుద్రునివలె నుండెను.

ఇచ్చట రుద్రుని నుపమానముగాఁ జెప్పుటచేఁ గాఁబోవు సంహారకార్యము సూచింపఁబడుచున్నది.

♦ ౧౭-వ సర్గము. శూర్పణఖ శ్రీరామునిఁ జూచుట. ♦

ఉ. ఆ హత లక్షణుండు వసు♦ధాత్మజ లక్ష్మణుఁ గూడి గౌతమీ
వాహినిఁ దాన మాడి నిజ♦పర్ణ కుటీరముఁ జేరి యందు ని
ష్ఠాహితకల్య కృత్యముల ♦ నన్నిటిఁ దీరిచి శాలలో వరా
రోహయుఁ దానుఁ దమ్ముఁడు ని♦రూఢమతిం జని యిష్టగోష్ఠికై. ౨౭౯

వనవాసమునకు సంకల్పించిన పదునాలుగు సంవత్సరములలో నిప్పుడు పదుమూఁడవ సంవత్సరము జరగుచున్నది, అందిది మార్గశిరము.

తస్మిం స్త్రయోదశాబ్దాని, రామస్య సమతిక్రమః
గోదావర్యా స్తటేపుణ్యే, పంచవట్యాం మనోరమే॥ పాద్మ.

ఏపాపిని సీతాసుఖలతా కుఠారమో, యెవతె సోదరవంశముస్త్రాకుద్దాలమో యెవతె సీతాపాతివ్రత్య శ్రీరామకల్యాణగుణ బలపరాక్రమ రత్నములకు నికషోపలమో, యెవతె కాముకీవిధవలకు నెట్టిదండము సముచితమని లోకమునకు స్వానుభవమునఁ బ్రకటించెనో చెడిపె లగు నాఁడుబిడ్డల మాట వినినఁ గొంపలు గూలుననుటకు నెవతె లక్ష్యభూత యయ్యెనో యట్టి శూర్పణఖ వచ్చుట యిఁకఁ జెప్పఁబడును.

ఆహతలక్షణుండు = గుణములచేఁ బ్రసిద్ధిచెందినవాఁడు శ్రీరామచంద్రమూర్తి, గౌతమీవాహినిన్ = గోదావరియందు, తానము = స్నానము, ఆడి = చేసి, నిజపర్ణకుటీరమున్ = తన యాకుటింటిని, నిష్ఠా-హిత-కల్య-కృత్యములన్ = శ్రద్ధచేఁ జేయఁబడిన ప్రాతఃకాలమునఁ జేయఁదగిన కార్యములను, హోమము, బ్రహ్మయజ్ఞాదులని కొంద ఱనిరి. రాముఁడు సూర్యోదయమునకుఁ బూర్వము హోమము చేయువాఁడని ముందు వ్యాఖ్యాతలు వ్రాసిరి. దాని ననుసరించి చూచిన నిప్పుడు చేయు కార్యములు బ్రహ్మయజ్ఞాదు లనుట సముచితమేకాని ౨౬౩-వ పద్యమువలన ౨౬౧-వ పద్యము

వలన గోదావరికిఁ బోవు సమయమందే సూర్యోదయమైనట్లు తేర్పడుచున్నది. అంతి యకాదు. ప్రాద్దెక్కినట్లును నర్థము కాఁగలదు. ఇది యానాఁటి వర్తమానకాల వృత్తాంత మన వలనుపడదు. ప్రతిదినము జరుగునది యానాఁడు చెప్పెను. గాని యప్పుడే సూర్యుఁడు పుట్టి బారెఁడు ప్రొద్దెక్కినతరువాత స్నానానికిఁ బోయినారనుట విరుద్ధచర్యయేకాక పూర్వోత్తర విరుద్ధచర్యయు నగును. శాలలోన్=ఇట్లు చెప్పుటచే నిత్యకర్మానుష్ఠానము పర్ణశాల వెలుపలనే చేసి యావల లోపలికి వచ్చి రని తెలియ వలెను. నిత్యకర్మానుష్ఠానములు పర్ణశాలకు వెలుపలనే చేయవలెను. వరారోహ యు=సీతయు, వర+ఆరోహ=పెద్ద పిఱుఁదులుగలది, నిరూఢమతిన్=గొప్ప మన స్సుతో, గౌతమమహర్షి తపస్సుచేసి తెచ్చినది, కావున గోదావరికి గౌతమి యని పేరు. భాగీరథివలె.

తా త్ప ర్య ము.

కల్యాణగుణములచేఁ బ్రసిద్ధికెక్కిన శ్రీరామచంద్రమూర్తి సీతాలక్ష్మణులఁ గూడి గోదావరిని స్నానముచేసి తన తపోవనముఁజేరి యందు నిష్ఠచేఁ బ్రాతఃకాల కృత్యములనెల్ల నాశ్రమముననే వెలుపలఁ దీరిచి పడసాలలో సీతయుఁ దాను లక్ష్మ ణుఁడు పూర్వులు పెద్దల కథలు చెప్పుచు ముచ్చటలాడుచుండ.

కం. ఆసీనుం డయి లసదితి, హాసంబులఁ జెప్పు చుండ ♦ నాసౌమ్యుఁడు సీ
తాసహితుం డయి దివిఁ జి,త్రాసంగతుఁ డైన చంద్రు♦ రాణఁ దనర్చెన్. ౨౮౧

ఆసీనుండయి=కూర్చుండి, లసత్=ప్రకాశించు, ప్రసిద్ధులగు పురుషుల, ఇతి హాసంబులు=చరిత్రములు, పూర్వమిట్లు జరిగెనని చెప్పఁబడునది యితిహాసము, చిత్రాసంగతుఁడైన=చిత్రానక్షత్రముతోఁ గూడిన.

తా త్ప ర్య ము.

శ్రీరామచంద్రమూర్తి కూర్చుండి పూర్వరాజులయు రాజర్షులయుఁ జరిత్ర ములు చెప్పుచుండ నా సాధుగుణలక్షితుఁడు చైత్రశుద్ధపూర్ణిమనాఁడు చిత్రానక్షత్ర ముతోఁ గూడియుండు చంద్రునివలెఁ బ్రకాశించెను. చిత్రాహార్తికమే కమ్మనన్నట్లు చిత్రయొంటి నక్షత్రమే శుద్ధమైన తెల్లని కాంతి గలది. అట్టులే సీతయు,

ఆ. కతలు చెప్పుచున్న ♦ కాకుత్థ్సమణి దేవ, విభు నదాటుగాఁగ ♦ నిర్జరారి
మైనపంక్తివదను♦ననుజాత శూర్పణ, ఖాఖ్య చూచి చొచ్చె♦నాశ్రమంబు. ౨౮౧

అదాటుగాఁగన్ = ఆకస్మికముగ, పూర్వసంకల్పములేక యాదృచ్ఛికముగ, పంక్తివదను=పదిముఖములుగల రావణాసురుని, అనుజాత=చెల్లెలు, శూర్పణఖాఖ్య= శూర్పణఖ యను పేరుగలది, చేటలంతగోళ్లుగలది. కావున దీనికి శూర్పణఖ (శూర్ప+ నఖ) యనిపేరు. దీని మగఁడు విద్యుజ్జిహ్వుఁడు. వీఁడు రావణాసురునిచేఁ జంపఁ బడెను. ఈకథ యుత్తరకాండమునఁ గలదు, చొచ్చెన్=ప్రవేశించెను.

తాత్పర్యము.

కథలు చెప్పుచున్న విష్ణుసన్నిభుడైన శ్రీరాముని నదాటున రావణాసురుని చెల్లెలు శూర్పణఖ యను పేరుగలది చూచి యాశ్రమమునఁ బ్రవేశించెను.

సీ. హర్యక్ష నిభవక్షు ♦ నరవిందపత్రాక్షు, సంతతోత్సాహు నా♦జానుబాహు
సలలిత దీప్తాస్యు ♦ సజ్జనతోపాస్యు, నింద్రసమానుఁ గ♦జేంద్రయాను
వర్ణితసుకుమారు ♦ బహుళజటాభారు, సమధిక ప్రియదర్శు ♦ శత్రుకర్శు
నిందీవరశ్యాము ♦ సౌందర్యజితకాము, భూపలక్షణయుక్తు ♦ భూరిశక్తు
తే. రాముఁ గనుఁగొని కుసుమనా♦రాచశాత, బాణదారితచిత్తయై ♦ పాపశీల
రాక్షసాంగన యతనిఁ జే♦రంగ వచ్చె, వృత్తమధ్య మహోదరి ♦ వికటవృత్త.

హర్యక్షనిభవక్షున్ = సింహము ఱొమ్ముతో సమానమైన ఱొమ్ముగలవానిని, అనఁగా విశాలమైన ఱొమ్ముగలవానిని, అరవిందపత్రాక్షున్ = తామర రేకులవంటి కన్నులు గలవానిని, సంతతోత్సాహున్=ఎల్లప్పు డుత్సాహముగలవానిని, ఆజాను బాహున్ = మోఁకాళ్లనంటు చేతులు గలవానిని, సలలితదీప్తాస్యున్ = మనోహరమై ప్రకాశించు ముఖముఁగలవానిని, సజ్జనతా+ఉపాస్యున్ = సత్పురుష సమూహముచే నుపాసింపఁబడ యోగ్యుఁడగువానిని, గజేంద్రయాను=గొప్ప యేనుఁగు నడక గలవానిని, వర్ణిత=కీర్తింపఁబడిన, సుకుమారున్=కోమల దేహముగలవానిని, బహుళ జటాభారున్=విస్తారమైన జడలభారముగలవానిని, సమధికప్రియదర్శున్ = మిక్కిలి ప్రియమైన దర్శనముగలవానిని, శత్రుకర్శున్ = శత్రువులను గృశింపఁజేయువానిని, ఇందీవరశ్యామున్=నల్లకలువలవలె నల్లనగువానిని, సౌందర్యజితకామున్ = చక్కఁదనముచే జయింపఁబడిన మన్మథుని గలవానిని, భూపలక్షణయుక్తున్=రాజచిహ్నములు గలవానిని, కుసుమనారాచ=పూలు బాణములుగాఁగల మన్మథునియొక్క, శాత= పదునైన, బాణ=బాణములచే, దారిత=చీల్పఁబడిన, చిత్తయై = మనస్సుగలదియై, పాపశీల = పాపముచేయుటే స్వభావముగాఁగలది, వృత్తమధ్యున్=గుండ్రని నడుము గలవానిని, మహోదరి=పెద్ద పొట్టగలది, వికటవృత్త=భయంకర చర్యగలది.

తాత్పర్యము.

సింహము ఱొమ్మువలె విశాలమైన ఱొమ్ముగలవానిని, తామర రేకులవంటి కన్నులుగలవానిని, నెడఁదెగని యుత్సాహముగలవానిని, దీర్ఘములైన మోఁకాళ్లనంటు చేతులుగలవానిని, అందమై ప్రకాశించు ముఖము గలవానిని, సత్పురుషులచే నుపాసింపఁబడువానిని, ఇంద్రునితో సమానుని, నేనుఁగు నడకవంటి నడక గలవానిని, కీర్తింపఁబడిన కోమలత్వము గలవానిని, విస్తారముగ జడలు ధరించినవానిని, సెంత చూచినను నింకను జూతమను నాశగలిగించు ప్రియమైన దర్శనము గలవానిని, శత్రువులఁ గృశింపఁజేయు వానిని, నల్లకలువల చామని చాయ గలవానిని, సౌందర్యమున మన్మథుని జయించినవానిని, రాజచిహ్నములుగలవానిని, మిగుల శక్తిగలవానిని,

సన్నని నడుము గలవానిని, శ్రీరామచంద్రమూర్తిని జూచి కామదగ్ధచిత్తయై పాపపు స్వభావము గల యారాక్షసి పెద్ద పొట్టగలది భయంకరవృత్తయగునది చేరవచ్చెను.

విశాలమైన యొోష్మనుటచే దానిని జూడఁగానే స్త్రీలకు గాఢాలింగనమందుఁ గోరికగలిగించుచున్నదని భావము. ఇట్లే తక్కినవి యూహించునది.

ఇందు శూర్పణఖ శ్రీరామచంద్రుని జూచి కామమోహితయైనట్టు చెప్పఁబడెను. ఇది విధవగుటయేగాక తలవెండ్రుకలు నెరసిన ముసలిదియనికూడ రామాయణము యుద్ధకాండము ౨౨౦౦-వ పద్యమువలనఁ దెలియవచ్చెడిని.

సీ. తానేడ నిండారుఁదఱుల మోము కురూప
యతఁడేడ రాకాసుధాంశుముఖుఁడు,
తానేడ నరసిన తలవెండ్రుకల డొక్క
యతఁడేడ నిందిందిరాలకుండు.

అని లంకలో రాక్షసస్త్రీలు పలవించిరి. శూర్పణఖ రహస్యమును దన దుశ్చేష్టను కప్పిపెట్టి బొంకెనుగాని యదియెట్టులో (బహుశః సీతాదేవి వలననైయుండును) రహస్యము బయలుపడెను. రాక్షసజాతి విధవలు తలవెండ్రుకలు ధరింతురని దీనివలనఁ దెలియనయ్యెడి.

దేహము ముడుతలు పడి తలవెండ్రుకలు నరసి ముట్లుడిగినస్త్రీకిని గామము గలుగుననియు వయస్సునది కామమును జంపఁజాలదనియు దీనివలన నేర్పడుచున్నది. ఇది సత్యము. ఈయర్థమునే యష్టావక్రుని కుత్తరదిక్కును నిట్లని బోధించెను.

స్థవిరాణామపిస్త్రీణాం, బాధతేమైథునజ్వరః
ముసలివారైనస్త్రీలనుగూడ మైథునజ్వరము బాధించును.

ఇవ మనుచిత మక్రమశ్చ పుంసాం
యదిహ జరాస్వపి మాన్మథవికారాః
యదపి చ నకృతం నితంబినీనాం
స్తనపతనావధిజీవితం వా రతంవా. భర్తృహరి.

ఈ విషయమే శృంగార శతకమున నీ శ్లోకమందు జెప్పియున్నాఁడు.

చ. సుముఖుని దుర్ముఖీమణి, వి॰శుద్ధసుశీలుని బాపశీల, యు
త్తమశుభరూపవేషుని ని॰తాంత వికార విరూప, సుస్వరుఁ
సమధిక భైరవస్వర, వి॰శాలవిలోచను భీకరాక్షి, యా
భ్రమరవినీతకుంతలవి॰రాజితుఁ దామ్రశిరోజ, దక్షిణున్. ౨౮౩

సుముఖుని = చంద్రబింబమువలె నందమైన ముఖముగల వానిని, దుర్ముఖీమణీ=వికారముఖముగల స్త్రీలలో శ్రేష్ఠురాలు, విశుద్ధసుశీలుని= నిర్మలమైన మంచి నడవడిగల వానిని, పాపశీల=పాపముచేయు స్వభావముగలది. ఉత్తమ శుభరూపవేషుని=శ్రేష్ఠమై మంగళకరమైన చక్కఁదనము అలంకారము గలవానిని, నితాంత

వికార విరూప = మిక్కిలి రోఁత పుట్టఁజేయు కురూపముగలది. సుస్వరుఁ = మంచి కంఠస్వరముగల వానిని, సమధికభైరవస్వర=మిగుల భయంకరమైన కంఠస్వరము గలది. విశాలవిలోచనుఁ=వెడలిపాటికన్నులుగలవానిని, భీకరాక్షి = భయంకరము లైన మిడిగ్రుడ్లుగలది. భ్రమర = తుమ్మెదలవలెనల్లనైన, వినీతకుంతలవిరాజితుఁ = అణఁగియున్న వెండ్రుకలచేఁ బ్రకాశించువానిని, తామ్రశిరోజ = గుఱ్ఱపువెండ్రుకల వలె నెఱ్ఱనైన రేఁగిన వెండ్రుకలు గలది.

తా త్ప ర్య ము.

మంచియందమైన ముఖముగలవానిని వికారమైన ముఖముగలది, పవిత్ర చరిత్రుని పాపస్వభావ, శ్రేష్ఠమైనయందము నలంకారము గలవానిని మిక్కిలి కురూప, వినసొంపైన కంఠస్వరముగలవానిని భయంకర ఖరస్వర, వెడలుపాటికన్నులు గలవానిని గూబకన్నువంటి మిడిగ్రుడ్లుకలది, తుమ్మెదలవలె నల్లపై నున్నపైన వెండ్రుకలు గలవానిని ఎఱ్ఱపైన వెండ్రుకలుగలది. పైపద్యముతో నన్వయము.

తే. వామభాషిణి, తరుణుని ♦ బలితదేహ, దారుణాకార ప్రియుని ను♦ద్గాఢభయద
వేష యిట్లనుఁ బంచశ♦రేషుదగ్ధ,చిత్తయగుచును మోహాంపుఁ♦దత్తరమున.—౧౮౪

దక్షిణుఁ=కపటము లేని మాటలవానిని, వామభాషిణి = వక్రభాషలుగలది, తరుణునిఁ=వయస్సువానిని, పలితదేహ=నరసిన దేహముగలది, దారుణాకార = భయంకరాకారముగలది, ప్రియుని = చూడఁ బ్రియమైన యాకారముగల వానిని, ఉద్గాఢభయదవేష=మిగుల భయంకరమైన వేషముగలది, పంచశర=మన్మథుని, "అరవింద మశోకంచ చూతంచ నవమల్లికా, నీలోత్పలంచ పంచైతే పంచబాణస్య సాయకాః" కమలము, అశోకము, లేమామిడి, మల్లె, నల్లకలువ ఈ పుష్పములు మన్మథబాణములు, ఇషు=బాణములచే, దగ్ధ=కాల్పఁబడిన, చిత్త = మనస్సుగలది, మోహాంపుఁదత్తరమునఁ = మోహమువలనఁగలిగిన తత్తఱపాటుతో.

తా త్ప ర్య ము.

ఋజుభాషుని వక్రభాషిణి, వయసువానిని తలవెండ్రుకలు నరసిన ముసలిది, భయంకరాకార ప్రియుఁడగువాని. భయంకరవేషముగలది, మన్మథబాణములచే దహింపఁబడిన మనస్సుగలదై మోహావేశముచే నిట్లనెను.

దగ్ధచిత్తయనుటచే వివేకము పూర్ణముగ నాశమయ్యెనని భావము. కాముకునకుఁ గన్నులు లేవు. తన యయోగ్యత ఎదుటివానియోగ్యత పరిశీలించు వివేకము కాముకునకుఁ గలుగదు అని తెలుపుటకే యిరువురను గవి పోల్చి చెప్పెను.

దీనివలనఁ గామ మెట్లు బుద్ధిని నాశముచేయునో తెలియనగు.

—♦ శ్రీరాముఁడు శూర్పణఖకుఁ దన వృత్తాంతముఁ జెప్పుట. ♦—

ఉ. ఎవ్వఁడ వీవు? చెప్పుము ము♦నీశ్వరవేషముఁ దాల్చి భార్యతో
నివ్వనభూమిఁ జూపనిశ♦తేషుచయంబులఁ బూని రాక్షసుల్

క్రొవ్వున సంచరించు నెడఁ ♦ గ్రుమ్మర నేల? నిమిత్త మేమి మీ
రివ్విధి నిందు నుండ? నన ♦ నిట్లనియెన్ ఋజుబుద్ధి రాముఁడున్. ౨౮౫

నిశితేషుచయంబులు=పదునైన బాణముల సమూహములు.

తా త్ప ర్య ము.

నీ వెవ్వఁడవు, జడలచే మునీశ్వరుల వేషము ధరించి కాముకుఁడవై భార్యతోను క్షత్రియరూపమున విల్లు బాణములతోను రాక్షసులు స్వేచ్ఛగాఁ దిరుగు నీస్థలమున కేల వచ్చితివి? ఈ ప్రకార మిచ్చటనుండఁ గారణ మేమి? అని యడిగి యడుగఁగా శ్రీరామచంద్రమూర్తి వంచనలేక యథార్థము నిట్లు చెప్పెను.

జడలు ధరించి నీవు ముని వేషము వేసియుఁ గామమునకు వశుఁడవై భార్యతోడనున్నావు. క్షత్రియశూరునివలె విల్లు బాణములు ధరించియున్నావు. ఇచ్చటి రాక్షసులు నీవొక మగవానివలె భార్యతోనుండుటయు సహింపరు, శూరునివలె విల్లు బాణములు ధరించియుండుటయు సహింపరు, అని భావము.

కం. రాముని కనృతం బాడుట, యేమాత్రం బైనఁ గా ద♦భీష్టం, బందున్
రామానికటమునఁ దప, శ్శ్రీమహితావస్థ నింక ♦ జెప్పఁగ నేలా. ౨౮౬

అనృతము=అసత్యము, ఏ మాత్రంబైనన్=ఎంత కొంచెమైనను, రామానికటమునన్ = స్త్రీసన్నిధానమందు, తపశ్శ్రీ మహితావస్థ = తపస్సంపదచే నుండు నుత్తమ స్థితియందు.

తా త్ప ర్య ము.

ఎట్టి సందర్భమందు నవ్వులకైనను అసత్య మాడుట రామున కిష్టమైన కార్యముగాదు. అందు నాఁడువారి యెదుటఁ దపస్సుచేయుచుండు స్థితియం దబద్ధమాడఁ డని చెప్పనలెనా.

స్త్రీలయెదుట నసత్యమాడరా దనుటచే పరోక్షమున నాడవచ్చునని యభిప్రాయముగాదు. పరోక్షమున నసత్య మాడువారుకూడ వారియెదుట నసత్యమాడ రాదు. వీఁ డిట్టివంచకుఁడా యనివారు తలఁచుటచే గౌరవహాని యగుటయేగాక భర్తలసత్యమాడిన మే మేల యాడరాదని వారు నసత్యమాడుదురు. ఆకారణమున వారిపాపము తాము పంచుకొనవలసివచ్చును. భార్యలయెదుట నసత్యమాడువాడును భార్య యుండియు జారత్వము చేయువాఁడును, వారి కసత్యమాడుటకు అంకాడుటకు ననుజ్ఞయిచ్చినవాఁడే, మార్గము చూపినవాఁడే. రెండవదియగు వ్రతదీక్షాకాలమందు నసత్యమాడినదపఃఫలము నాశమగును. ఒక్కొక్కటియిట్టిదై యుండఁగా రెండును గలసియున్నదశలో శ్రీరామచంద్రమూర్తియై యెట్లసత్యమాడఁగలఁడు.

సీ. ధరణీతలేంద్రుండు ♦ దశరథనాముండు, త్రిదశ తేజుఁ డొకండు ♦ తేజరిల్లు
నారాజుకొడుకుల♦యం దగ్రజుడ నేను, రాముఁ డందురు నన్ను ♦ భూమిజనులు
నాతమ్ముఁ డీతండు ♦ నా వెంటఁ జనుదెంచె, లక్ష్మణాఖ్యాతుండు ♦ లలితగుణుఁడు
ఈతన్వి నాభార్య ♦ సీత యందురు పేరఁ, దల్లిదండ్రులయాజ్ఞఁ ♦ దప్పనోడి

ఆ. ధర్మకాంక్షఁ జేసి ♦ ధర్మార్థమై యిట, వచ్చినార మేము ♦ వనిత వింటె
యింక జెప్పు మెవతె ♦ వీవు? నీపే రేది? తథ్యమాడు మెవరి♦దాన వీవు? ౨౭౭

త్రిదశతేజుఁడు = దేవతల తేజస్సువంటి తేజస్సుగలవాఁడు, అగ్రజుఁడును = పెద్దవాఁడును, ధర్మకాంక్ష=పితృవాక్యపరిపాలన మనెడి ధర్మము నిర్వహించుకోరికచే, ధర్మార్థమై=తపోరూపధర్మము సాధించుకొఱకు; శరణాగత రక్షారూపక రాక్షసవధము నిమిత్తమని ధ్వని, తథ్యము=సత్యము.

తా త్ప ర్య ము.

దశరథుఁడనుపేరుగల రాజు దేవసముఁ డొకఁడు గలఁడు. ఆయనకొడుకులలో నేను బెద్దవాఁడను. నన్ను రాముఁడని లోకులు పిలుతురు. వీఁడు నాతమ్ముఁడు, లక్ష్మణు డనువాఁడు, నావెంటవచ్చెను, ఈ స్త్రీ నా భార్య, సీతయనుపేరుగలది. తల్లిదండ్రుల యాజ్ఞ మీఱలేక పితృవాక్య పరిపాలన మనుధర్మము నిర్వహించుకోరికతోఁ దపోరూపధర్మము స్థాపించుకొఱకై మేము వచ్చినారము.

మాచరిత్రము వింటివిగదా. ఇఁక నీవేజాతిదానవు! నీపేరేమి? ఎవ్వరిదానవు? సత్యము చెప్పుము.

తే. ఒయ్యనమనోజ్ఞవేషంబు♦నొప్పఁగాన, రాక్షసి వటంచుఁబల్కఁగ♦ రాదె చెప్పుమ
యిచ్చటికి నీవు రాఁగతం♦ బేమి?యనిన,సత్యము వచింతు నోరామ♦చంద్ర! వినుము.

తా త్ప ర్య ము.

ఇది రాక్షసభూమియైనను నీ మనోహరాకారము చూచిన రాక్షసి వవుదువని చెప్పరాదు. ఇచ్చటికి నీవు వచ్చుటకేమి కారణ మని రామచంద్రమూర్తి యడుగఁగా రామచంద్రా నిజము చెప్పెద వినుము.

ఒయ్య+నమనోజ్ఞ వేషము, కాఁ=కాఁగా,ఆరాక్షసివి కావని చెప్పరాదు. రాక్షసివవుదువని చెప్పవచ్చున?

దీనివలన రామచంద్రుని సమీపించినపుడు శూర్పణఖ సుందరరూపము ధరించి వచ్చెనని యేర్పడుచున్నది. దానిని విరూపగా కవి వర్ణించుట వాస్తవార్థము తెలుపుటకే.

ఒయ్య + నమనోజ్ఞవేషము = మనోహరముకాని వేషము, రాక్షసివిగావటంచుఁ=రాక్షసివి కావని చెప్పసాధ్యపడదు, రాక్షసివే, ఇదిరాక్షసులు సంచారము చేయు స్థలమని నీవు చెప్పుటచే నీవు రాక్షసివనియే తోఁచుచున్నది. కావునఁ గవి యున్నరూపమునే వర్ణించెను.

—♦ శూర్పణఖ శ్రీరాముని మోహించుట. ♦—

సీ. నేను శూర్పణఖ నా♦నెగడిన రాక్షస, తరుణి నేరూపైన ♦ దాల్ప నేర్తు
నీయరణ్యంబున ♦ నేకతఁ జరియింతు, సర్వభయంకర ♦ చరిత నగుచు

విన లేదె నీ వల♦విశ్రవసునిపుత్రు, రాక్షసనాయకు ♦ రావణాఖ్యు
నాతండె మాయన్న ♦ యధికనిద్రాళు వౌ,కుంభకర్ణుం డతి♦క్రూరబలుఁడు
తే. దనుజచేష్టితదూరుండు ♦ ధర్మచిత్తుఁ, డగు విభీషణుఁడును దోడు ♦ లమరరూప!
తోడఁబుట్టువు లా ఖర♦దూషణులును, నతులసంగ్రామశూరు లో♦యంద గాఁడ!

ఏకత్ర=ఒంటరిగా, సర్వలోకభయంకరచరితను=సమస్త ప్రాణికోట్లకు భయము కలిగించు నడవడిగలదానను, ఇట్లు చెప్పుటచే నేను జెప్పఁబోవు రతికార్యము మనము చేయునపుడు అడ్డమువచ్చుటకు నెట్టివారును భయపడుదురు అని భావము. అధికనిద్రాళువు=విశేషముగ నిద్రించు స్వభావముగలవాఁడు, దనుజచేష్టితదూరుఁడు=రాక్షసకృత్యములకు దూరమైనవాఁడు, ధర్మచిత్తుఁడు=ధర్మమందు మనస్సుగలవాఁడు, తోడులు=తోడఁబుట్టినవారు, ఆ=ప్రసిద్ధికెక్కిన, అతులసంగ్రామశూరులు=యుద్ధమం దసమానశూరులు, విభీషణుఁడును=విభీషణుఁడుకూడ ననుటచే, మా రాక్షసచేష్టలు లేనివాఁడు కావున మీలో నుండఁదగినవాఁ డనికాని నీవు ధర్మాత్ముఁడవని చెప్పుకొంటివే, అట్టి ధర్మాత్ముఁడు, మాలో నాకు సోదరుఁడై యున్నాఁడనికాని భావము.

తాత్పర్యము.

ఓ దేవస్వరూప, సుందరుఁడా! నేను శూర్పణఖ యను రాక్షసస్త్రీని, కోరిన రూపము ధరింపఁగలను, ప్రాణికోటులకు భయము గలిగించుదాననై యీ యడవులలో నేను నొంటరిగాఁ దిరుగుచుందును. విశ్రవసునికొడుకు రాక్షసరాజు నగు రావణుని పేరు నీవు వినలేదా. అతఁడు మా యన్న. నిదురబోతు కుంభకర్ణుఁడు ధర్మాత్ముఁడై రాక్షసచేష్టలులేని విభీషణుఁడుకూడ నా తోడఁబుట్టినవారు. ఖరదూషణులుకూడ నాకు దోడఁబుట్టువులే. వారు యుద్ధములందు మహాశూరులు.

ఉ. వారి నతిక్రమించి మది♦వచ్చినచొప్పు చరించుచుందు, నా
కారమునందు నీ సముని ♦ గానమి నెందును నిన్ను నేను గ
న్నారఁగఁ గన్న దాది హృద♦యంబున నీవ మగండు గాఁగ నేఁ
గోరితి నిన్నుఁ జేరితి న♦కుంఠితవృత్తిని బూరుషోత్తమా. ౨౯౦

అతిక్రమించి=వారి యాజ్ఞకులోపడక, మదివచ్చిన చొప్పున=నా యిష్టప్రకారము, అకుంఠితవృత్తిని=అడ్డములేని విధముగా, పూరుషోత్తమా=మగవారలలో శ్రేష్ఠుఁడా.

తాత్పర్యము.

వావివరుసలకై వారు నా యన్నలని చెప్పితినేకాని వారి యాజ్ఞకు లోపడి వర్తించుదాననుగాను, నా యిష్టప్రకారము నేను దిరుగుచుందును. కావున నీవు నన్ను గ్రహించితివా వారు నీపైఁ గోపింతు రని నీవు భయపడవలదు. చక్కఁదనమునందు నీవంటివానిని నేను జూడలేదు. కావునఁ గన్నులార నిన్నుఁ జూచినది మొదలు దొడ్డమగవాఁడా! నీవు నాకుఁదగిన మగఁడ వని నిన్నుఁ గోరితిని. నీవు నన్నుఁ దిరస్క-

రించితివా మాయన్నల నందఱను నీ మీఁదికి యుద్ధమునకుఁ బిలిచికొనివచ్చి చంపించెదను.

ఉ. ఏ మనుకొంటివో నను మ॰హీశ! యమేయతరప్రభావల
క్ష్మీమిత స్వైరసంచరణ॰సిద్ధబలాన్వితఁ; నా మగండవై
హామిక సౌఖ్యముల్ పడయు॰మా, యిది యేమిటి సీత రోఁత, నీ
కీ మదిరాక్షి యర్హ యగు॰నే వికృతాంగి విరూప యిస్సిసీ. ౨౯౧

మహీశ=రాజా, అమేయతర ప్రభావలక్ష్మీమితన్=కొలఁది చెప్పరాని ప్రభావసంపదచేఁ దెలియఁబడుదానను, స్వైర=నా యిచ్చచొప్పున, సంచరణ=తిరుగుటయందు, సిద్ధ=ప్రసిద్ధమైన లేక సిద్ధిపొందిన బలముతో, అన్విత కూడినదానను, హామికన్=గర్వముతో, అహమహమికా శబ్దభవము, వికృతాంగి = వికారమైన దేహము గలది, విరూప=ఎచ్చు తగ్గురూపముగలది, ఇస్సిసీ=ఛీ ఛీ.

తా త్ప ర్య ము.

రామా! నన్నేమిగా నీవు తలఁచితివి. ఎవతో త్రోవనబోవునాఁడుది యనుకొంటివా? నేను మహీశుఁడ నను గర్వము నీ కక్కఱలేదు. నేను ఇంతంతని పరిమాణము చెప్పరాని ప్రభావసంపదచే స్తోత్రము చేయఁబడుదానను, నీవు భూమికిఁ బ్రభువైనచో నన్నుఁ బ్రభావలక్ష్మియే కొనియాడుచున్నది. అంతియకాదు. నీవు కాల్పనడఁబోవలసినవాఁడవే. నేను నాయిష్టముచొప్పున సంచారముచేయు బలమునందు సిద్ధిపొందినదానను, కాఁబట్టి నామగండవై నేను శూర్పణఖ మగఁడ నని గర్వపడుము. నా కిడవలకే భార్య యిది యున్నదికదా యందువేమో, ఛీ ఛీ యిది యేమి సీత, చూడ రోఁతపుట్టుచున్నది. ప్రేలెఁడు ముక్కు, వెన్నంటుడొక్క, విఱిచిన బొందె తుంటలవలె విఱుగు కాలు సేతులు, చింతాకంత కన్నులు, దీనికి గోళ్లే లేవే, నా సొగసు నేనే చెప్పరాదు కాని నాడొక్క నాపిక్క నా ముక్కు నాచెక్కు నాగోళ్లు నా కాళ్ళు నా కన్నులు నా చన్నులు నా చేతు లెట్లున్నవో చూడు. ఇది వికారరూప, దీనిని వదలిపెట్టు. పొమ్మనుము దూరముగ, నీ వంటివానికి నిటువంటిదా తగిన పెండ్లాము. కాదు కాదు. నేనే యద్దుముద్దుపెండ్లామను.

శా. ఏనే నీ కనురూపభార్యను జుమీ ॰ యిల్లాలిఁగాఁ గొమ్ము స
న్నీ నీ సీతఁ గరాళ దుష్టవనితన్ ॰ హేయన్ మనుష్యాంగనన్
నే నీ తమ్మునితోడ బ్రింగెద నిదే ॰ నీ వేను శైలాటవీ
నానాకందరసుందరోర్వుల మగం ॰ డా! వేడ్కఁ గ్రీడింతమా. ౨౯౨

నీ కనురూపభార్యను = నీ రూపమునకుఁ దగిన రూపముగల భార్యను నేనే, కరాళన్=భయము గలిగించుదానిని, దుష్టవనితన్=దుర్మార్గురాలగుస్త్రీని, హేయన్=నీచను, మనుష్యాంగనన్=మనుష్యస్త్రీని, శైల=పర్వతములందలి, నానా=అనేకములయిన, కందర=గుహలయందును, ఉర్వులన్=భూములయందును, లేకగుహాప్రదేశము

లందును, వేడ్కన్ = విలాసముగా, ఉల్లాసముగా, క్రీడింతమా ! ముద్దుమగఁడా ! మగఁడా ! ఆలుమగనియాట లాడుకొందమా.

తాత్పర్యము.

నన్ను సరిగాఁ జూడుము. నేనే నీకుఁ దగినభార్యనుగదా ? అవు ననుము. కావున నన్ను నీ భార్యగాఁ గైకొనుము. దీని నేమిచేయు మనెదవా ? దీనిని జూచిన నాకే భయమగుచున్నదే, నీ వెట్లు భయపడకున్నావు. దానికి భయపడియే నీవు దానికి వణఁగిపడియున్నావు కాఁబోలు. దుర్మార్గురాలు కావున సవతి మచ్చరమున నన్ను హింసించును. నాకు వశబడితివని నిన్నుఁ జంపును. కావుననే నీచురాలు. అది యునుగాక మనుష్యస్త్రీ. నాకు భోజ్యమైనది. కావున దీనిని నీ తమ్మునితోడ నిపుడే గుటుక్కున మ్రింగెదను ఆవల నీ కే జంజాటములేదు. కావున నా ముద్దు మగఁడా ! కొండలలో నడవులలో గుహలలో స్వేచ్ఛగా నాడుకొందమా ?

౧౮-వ సర్గము.

కం. అనవుడుఁ జెఱున వ్వాలయఁగ, దనుజాంగన కసమబాణ♦ తాడితకును వా
క్యనిపుణుఁడు మృదులవాక్యంబున విస్పష్టార్థయుక్త♦ముగ నిట్లనియెన్. ౨౯౩

అసమబాణ=బేసిబాణములుగల మన్మథునిచే, తాడితకున్=తన్నఁబడినదానికి, వాక్యనిపుణుఁడు=మాటలయందు నేర్పుగలవాఁడు, మృదులవాక్యంబునన్ = మెత్తని మాటలచే, విస్పష్టార్థయుక్తముగన్=మిగుల స్పష్టమైన యర్థముతోఁగూడినట్లు.

శూర్పణఖ = నఖముఖా త్సంజ్ఞాయామ్. పాణిని, 4-1-58 ప్రకారము శూర్పణఖ యనియే రూపము. అటు సంజ్ఞార్థకముగఁ గాక శూర్ప ఇవనఖా యస్యాస్సాయని విగ్రహము చెప్పునెడల శూర్పనఖియని చెప్పవలెను. సంజ్ఞావాచకముకాదు గావున 'పూర్వపదా త్సంజ్ఞాయాం' మను సూత్రప్రకారము నకారము ణకారముగా మాఱదు.

తాత్పర్యము.

అని శూర్పణఖ చెప్పఁగాఁ గామవశ యయిన యా రాక్షసికి మాటలయందు నేర్పుగల శ్రీరామచంద్రమూర్తి కోపపడక మెత్తనిమాటలతో సందేహము గలుగకుండునట్లు తాను జెప్పినది స్పష్టముగ బోధపడునట్లు చెప్పెను.

ఉ. ఆడితి దీనిఁ బెండ్లి, ప్రియు♦రా లిది నా, కెటు వీడ నేరుతున్
జూడుము నిన్నువంటి పెను♦సుందరికిన్ సవతాలిపోరు నా
వీడనిదుఃఖకారణము ♦ వీనిఁ గనుంగొను శీలవంతు, నా
తోడుఁ, బ్రియావలోకను, సు♦దుర్భర తేజుని, లక్ష్మణాఖ్యునిన్. ౨౯౪

ప్రియావలోకనున్ = చూచుటకుఁ బ్రియమైనవానిని, సుదుర్భర తేజునిన్ = మిక్కిలి సహింపరాని తేజముగలవానిని, లక్ష్మణాఖ్యునిన్ =లక్ష్మణుఁడను పేరుగల వానిని.

తాత్పర్యము.

రాకాసీ! దీనిని ముందు మించి పెండ్లాడితిని, అయిన మించినదేమి విడువు మనెదవా? ఇప్పుడు ప్రియురాలైన దీనిని నేనెట్లు విడుతును. అది ధర్మముగాదే. అది యుండనీ నేను నుండెదనందువా? నీ వంటి యత్యద్భుతమగు నందగత్తెకు సవతాలి పోరు సహింపరానిది. కావున నీకు దుఃఖము కలుగక తప్పదు. నిన్ను దుఃఖపెట్టుటకా పెండ్లిచేసికొనుట? కావున నా మీఁది భ్రాంతివదలుము, నేను కామము నిలుపలేనం దువా? ఇదిగో వీనిని జూడుము. మంచి శీలముగలవాఁడు. నాతమ్ముఁడు. చూచుటకుఁ బ్రియుమైనవాఁడు. సహింపరాని తేజముగలవాఁడు. లక్ష్మణుఁ డను పేరుగలవాఁడు.

శ్రీరామచంద్రమూర్తి యిట్లు పరిహాసమాడవచ్చునా యందు రేని "గురుణాపి సమం హాస్యం కర్తవ్యం కుటిలం వినా" కౌటిల్యము అవమానించు తలంపులేక గురువుతోనైనను నెగతాళిగ మాటలాడవచ్చును, అను న్యాయము కలదు.

ఉ. వీఁ డనభార్యలేఁ, డతులవీరవరుండును, జాణ, ప్రాయపుం
బోఁడిమి గల్గుసుందరుఁ, డపూర్వి, సతీమణిలాలసుండు, పూఁ
బోఁడి! భవత్స్వరూపమును బోల్పఁగ నీకపతిత్వయోగ్యుఁడౌ
వాఁడె, భజింపు వీని ననపత్నత నెండ సుమేరురీతిగన్. ౨౯౫

భార్య లేఁడు=భార్యలేనివాఁడు, పెండ్లికానివాఁడని శూర్పణఖ గ్రహించెను. నావలె భార్యసమీపమందు లేనివాఁ డని రాముని యర్థము. దీనికి మూలము 'అకృత దారః' అని అనఁగా అ+కృతదారః = అకారమునకు నంతఃపురమని యర్థము. అకారో బ్రహ్మవిష్ణ్వీశ కమఠేష్వంగణే గారవేంతఃపురే హేతౌ అని నానా. ర. అనఁగా నంతఃపురమం దుంచఁబడిన భార్యగలవాఁడని యర్థము. అతులవీరవరుండు = శ్రేష్ఠులగు వీరులయం దసమానుఁడు, జాణ=సమర్థుఁడు, ప్రాయపుంబోఁడిమి = యౌవనపటుత్వము, 'న వితథా పరిహాస కథాస్వపి' పరిహాస విరుద్ధకథాభిలాషిగాఁడు. అనియు 'అనృతం నోక్తపూర్వం మే నచవక్ష్యే కదాచన' అనృతము ముందు చెప్పినది లేదు. ఇఁకఁ జెప్పఁబోవునదిలేదు అన్న రాముని వాక్కులం దసత్యదోష మారోపింపరాదు గనుక నిట్టి యర్థమే గ్రహింపవలెను. ఇట్లు రెండర్థములు కలుగునట్లు చెప్పుట యసత్య మగునా కాదా? రెండర్థములు కలుగఁజెప్పిన ధర్మరాజు దోషియగు నేని శ్రీరామచంద్రమూర్తి యేలకాఁడు? రెంటను బరులు మోసపోయిరికదా? యను సందేహము రావచ్చునుగాని యది సరిగాదు.

ధర్మరాజు స్వలాభతత్పరుఁడై సత్యము చెప్పవెఱచి మోసపువిధముగఁ జెప్పెను. అది ద్రోణునకుఁ బ్రాణహాని కలిగించెను. శ్రీరామచంద్రుఁ డాడినమాటలవలన శూర్పణఖకు వచ్చిన నష్టిలేదు. ఆయనకు వచ్చిన లాభముఁలేదు. పరిహాసించి పంపవలయుననియే యాయన యుద్దేశము. పరిహాసమునకై యాడు నసత్యమందు దోషములేదని శ్రీకృష్ణభగవానుఁడే చెప్పెను.

ఉ. ప్రాణభయంబు పట్టుల, వివాహము వేళల, సర్వ బంధువుల్
మానక చావ నున్నెడ, సమస్త ధనంబును మూల ముట్టుగా
హానిగ, హాస్యమాడు సమయంబునయందు నసత్యమాడినన్
దానిని దోషముం చనరు ధర్మవిధిజ్ఞులు పాండునందనా.

కృష్ణలీలామృతము, నూతకృష్ణలీల.

అపూర్వి=ఇంతకుముందు భార్యాసుఖమెఱిఁగినవాఁడు పూర్వి. అది లేనివాఁడపూర్వి, అనఁగాఁ జిరకాలముగ భార్యను జూచినవాఁడును గాఁడు. కాఁబట్టియే సతీమణిలాలసుండు = భార్యయందుఁ గోరిక గలవాఁడు. అనఁగా వేఱొకభార్యను గ్రహించు కోరికగలవాఁడని భావము. ఆ భార్యనే మరలఁజూడఁ గోరికగలవాఁడనియు భావము. ఈ రెండును ఊర్మిళ నుద్దేశించి చెప్పఁబడె నని యంతరాశయము. భార్యాయుక్తుఁడై యుండు తన సౌఖ్యస్థితిని, భార్యాహీనుఁడై యుండు లక్ష్మణుని స్థితినిజూచి యయ్యో! యూర్మిళ మగనిముఖము చూచుచుండు పుణ్యమైన లేదాయెఁగా యని యెంత తపించుచున్నదో, ఆమెను బిలుచుకొని వచ్చియుండిన నామెకు సంతోషముగా నుండును. లక్ష్మణునకు సంతోషముగా నుండును. సీతకుఁ దోఁడుగానుండును గదా యని రాముఁడు తపించువాఁడు. ఆ యుద్దేశమును లక్ష్మణుని మీఁదఁబెట్టి బయలుపఱుచుచున్నాఁడు, భవత్స్వరూపమును=నీ సౌందర్యమును, నీక=నీకే, పతిత్వయోగ్యుఁడౌ౯=పతిగా నుండ నర్హుఁడగును, నీకు+అపతిత్వయోగ్యుఁడౌ౯=పతిగా నుండఁదగఁడు, పూ అనునది పూ=ఛీ, యనుకరణముగ గ్రహించి ('పూఅని')బోఁడీ=బోడిముండా! నీకు కా వాఁడు పతిగా నుండఁదగినవాఁడని యన్వయింపవచ్చును. శ్లేషమందు సఖండ నిర్బిందువులకు సమ్మేళనము శాస్త్రీయము కావున నట్టి యర్థము యుక్తమే, కాకువు గ్రహింపవలెను. నీకా పతిత్వయోగ్యుఁడని భావము. అసపత్నిక=సవతిపోరు లేకుండునట్లు, ఎండ సుమేరు రీతిగ౯=ఎండ మేరుపర్వతముమీఁదఁ గొంత భాగమునఁ గొంతసేపెట్లుండునో యట్లనిభావము. "ఆఁడుదాని బజీతు సేయంగఁజూడకున్న" మొదటనే పొమ్మనరాదా యనిన నది యెంతో కామాతిశయమునఁ గొండంతయాసతో సుఖపడఁగోరి వచ్చెనుగాని దుర్బుద్ధియై వచ్చినది కాదు. కావునఁ దటాలున గద్దరించి పొమ్మనిన నది యెంత మనస్సులో నొచ్చుకొనునో, మంచి మాటలచేతనే కాదనిపించి పంపిన నంత మనోవ్యథయుండదు. మంచి మాటలకేమి దారిద్ర్యమాయని దయాళువై యిట్లు రామచంద్రమూర్తి మాటలాడె నని తెలియవలయును.

తాత్పర్యము.

ఈ లక్ష్మణుఁడు భార్యలేనివాఁడు. అసమానశౌర్యవంతుఁడు, సమర్థుఁడు. యౌవనమందున్నవాఁడు, అందగాఁడు, ఇదివఱకు భార్యాసుఖ మెఱుఁగఁడు, భార్య గావలెనని కోరువాఁడు నీ యందమైన రూపమును జూడఁగా వీఁడు నీకపతిత్వయోగ్యుఁడగును, పూ బోఁడీ! సవతిపోరు లేనిదానివై యితని భజింపుము.

కం.అను రాముని పల్కులు విని, దనుజాంగన కామమోహి♦తస్వాంతమునన్
జని కని లక్ష్మణుతో ని, ట్లనియె వృథాకాలయాప♦నాసహమతియై. ౭౯౬

దనుజాంగన=రాక్షసస్త్రీ, కామముచే మోహింపఁబడిన మనస్సుతో, వృథా=వ్యర్థముగా, కాలయాపన = కాలముగడపుటను, అసహన = ఓర్పులేని, మతియై = మనస్సుగలదై, చని=పోయి యనుటచే లక్ష్మణుఁడు పర్ణశాల వెలుపల నున్నాఁడని గ్రాహ్యము.

తాత్పర్యము.

అని శ్రీరామచంద్రమూర్తి చెప్పఁగా విని యా రాక్షసి కామమోహము కన్నులఁగప్పి యుండుటచేఁ దన విధవాగర్భాధాన నూతన మహోత్సవము నిమిష మైన జాగగుట సహింపలేక లక్ష్మణుతో నిట్లనెను.

కం.నీచక్కఁదనమునకుఁ సరి,యాచెలువను నేనె నీకు ♦ నాలయ్యెద, న
న్నోచెలువుఁడ! కైకొమ్మా, వే చనుదమె వనుల గిరుల ♦ విహరింపంగన్. ౭౯౭

తాత్పర్యము.

ఓయి యందగాఁడా! నీ చక్కఁదనమునకు సరియైన యందగత్తెను నేనే, నీకుఁ బెండ్లామయ్యెదను. నీవు వివాహము చేసికొమ్ము (కై+కొమ్ము = పాణిగ్రహణముచేయు) (వే = త్వరగా) వనులయందుఁ గొండలయందు సంచారము చేయఁ బోదమా, రా-రా! పోదము!

చం.అన విని లక్ష్మణుండు పరి♦హాసముగా నను నేను దాసునిన్
డను, ననుఁ బెండ్లియాడి యక♦టా చెలి దాసిన వీవు నాఁడె! నా
యనువున నజ్జవర్ణిని మ♦హాత్మున కన్నకు నేను బంటనై
మనుట యెఱుంగవో యిటులు♦మాటలు చెప్పెదె నీ వెటింగినన్. ౭౯౮

తాత్పర్యము.

శ్రీరామచంద్రమూర్తి పరిహాసముగా మాటలాడిన భావము తెలిసికొని లక్ష్మణుఁడును బరిహాసముగానే యనుచున్నాఁడు. ఓసీ! వెఱ్ఱిపిల్లా! నేను దాసిన వాఁడను. నన్నుఁబెండ్లాడి నీవు దాసివై వీరిసేవ సేయుచుందువా? నీ చక్కఁదనమునకు నీవు దాసివగానా యుండఁగోరెదవు? అబ్జవర్ణిని-అనబ్జవర్ణిని యని పదచ్ఛేదము గ్రహింపనగు. ఈ మహాత్మునకు నేను బంటనై సేవచేయుచున్నానే, అది నీకుఁ దెలియదా యేమే? నీకుఁదెలియదు లే. తెలిసియుండిన నేనేమి దాసిన వానిని మగనిఁగాఁ జేసికొనుట యేమి యని తలఁచియుందువు.

తే.ఆ సమృద్ధార్థునకునసి♦ద్ధార్థ! నిజము,ముదిత వమలవర్ణిని పీవ ♦ ముద్దు లొలుకు
భార్యవు కనిష్ఠురాలవై ♦ బ్రదుకు చుందు,వింత తలఁపవ నన్ను నే ♦ నేమటందు.

ఆ సమృద్ధార్థునకున = ఆ యధికలాభము గలవానికే. ఓసి సిద్ధార్థురాలా! నిజము=నిశ్చయము, ముదితవు=సంతోషపెట్టుదానవు. (౨) ఆ సమృద్ధార్థునకున్+

అసిద్ధార్థురాలా, నిజము+అముదితవు, అని వాస్తవార్థము, అమల వర్ణినివి=నిర్మల వర్ణము (కాంతి) గలదానవు-

ముదితవు+అ=ముదితవ, మలవర్ణినివి=మైలతోఁగూడిన కాంతిగలదానవు, కనిష్ఠురాలవు = చిన్నభార్యవు.

తా త్ప ర్య ము .

అటువంటి సమృద్ధమైన యర్థముగలవానిని సిద్ధార్థవు నీవే సంతోషింపఁజేయఁ గలదానవు. నిర్మలకాంతిగల దానవు కావున నీ వాయననే వరించితివా, నీవు చిన్న పెండ్లామపై కులుకుచు ముద్దులొలుకుచుందువు. మగవారికిఁ బెద్దపెండ్లాలమీఁదనుండు ప్రేమకంటెఁ జిన్న పెండ్లాలమీఁదఁ బ్రేమ యెక్కువ కదా. ఈ మాత్ర మాలోచింపలేవే, నిన్ను నే నేమందును.

తే. ఈవిరూపఁ గరాళను ♦ నీయసతిని, నిర్ణతోదరి వృద్ధను ♦ నెట్టి నిన్ను
భార్యఁ గైకొను నిటువంటి♦పరమరూప, విడిచి మానవి నెవ్వఁడే ♦ వేడ్కసేయు?

విరూపను = వికార స్వరూపముగలదానిని. కరాళను=భయంకరమైన దానిని, అసతిని=దుష్టస్త్రీని, నిర్ణతోదరి=పెద్ద పొట్టగలదానిని, వృద్ధను=ముసలిదానిని, అగు నిన్ను నెట్టి యని యొకయర్థము. ఇట్టి సీతను నెట్టి యని రెండవయర్థము, పరమ+రూపయని యొకయర్థము, పరమ్+అరూప యని రెండవయర్థము.

అటుగాక విరూపాది శబ్దములు సీతాపర్యాయములుగా భావించు నెడ.

విరూపను = విశేషసౌందర్యము గలదానిని. "రూపస్వభావే శుక్లాదౌ సౌందర్యే నాటకేపిచ॥ నానా॥ ర॥ త్రిలోకైకసుందరి యని యర్థము.

అసతిని, "నవిద్యతే అన్యాసతీసా" అటువంటిది మఱియొక స్త్రీలేనిది, అనుత్తమ, అఘోరశబ్దములవలె.

కరాళను= పొడవైన దంతములు గల దానిని, కరాళోదంతురే తుంగేదాదుణేపిచ కథ్యత ఇతి.

నిర్ణతోదరి=నిమ్నమైన యుదరము గలది. తనుమధ్య యని యర్థము.

వృద్ధను=జ్ఞానగుణశీలముల యందు వృద్ధను. ఎవ్వఁడే = (౧) ఎవ్వఁడైనను, (౨) వ్యతిరేకార్థము బోధించు ప్రశ్న.

ఈ యర్థము మహేశ్వర తీర్థీయానుసారము.

తా త్ప ర్య ము.

ఇటువంటి వికారస్వరూపను భయంకరను నసతిని పెద్ద పొట్ట గలదానిని ముసలిదానిని జానకిని నెట్టి నిన్ను భార్యఁగాఁ గైకొనును. ఇటువంటి పరమసుందరిని విడిచి యెవఁడు మనుష్యస్త్రీకై వేడుకపడును, పడఁ డని భావము.

రెండవది ఇటువంటివికారను...అగు నిన్ను నెట్టి, భార్య యగు సీతను గైకొనును గాని పరమవికార స్వరూపవైన ని న్నెవఁడే గ్రహించు నని వాస్తవార్థము.

కం. అని లక్ష్మణుండు పలికిన, విని యది పరిహాస మగుట ♦ వెకలి యెఱుంగకే
చని పర్ణకుటీరములో, జనకసుతాయుతున కనియె ♦ స్మరమర్దిత యై. ౩౦౧
వెకలి=బుద్ధిలేనిది, స్మరమర్దితయై=మన్మథునిచే గొట్టఁబడినదై.

తాత్పర్యము.

అని లక్ష్మణుఁడు పలుకఁగా నా బుద్ధిలేనిది యవి పరిహాసవచనము లని తెలిసికొనలేక నిజమని నమ్మి పర్ణశాలలో సీతతోనుండు శ్రీరామచంద్రునొద్దకుఁ బోయి మదనతాపవశమున నిట్లనెను.

తే. ఈ విరూపను నసతిని ♦ నీకరాళ, నిర్ణతోదరిఁ జేపట్టి ♦ నీవు నన్ను
గారవింపవ మ్రింగి యీ♦గరిత నిపుడు, సవతిపోరాటములు లేక ♦ సౌఖ్యపడుదు.

తాత్పర్యము.

ఈ విరూపను నసతిని ఈ కరాళను నిర్ణతోదరిని గ్రహించి నీవు నన్ను గారవింపకున్నావు, కావున దీనిని నిపుడే మ్రింగి సవతిపోరు లేక సౌఖ్యపడుదును.

తరలము. అని కురంగకిశోరలోచన ♦ నా యలాతనిభాక్షి హుం
మ్మనుచు రోహిణిమీఁదఁ బాఱు మ♦హత్తరోల్క యనంగ రాఁ
గని మహాబలశాలి రాముఁడు ♦ గ్రక్కునం బిగఁబట్టి కిం
కను సుమిత్రతనూజుతో ననుఁ ♦ గంటె లక్ష్మణ రక్కసిన్. ౩౦౩

కురంగ కిశోరలోచనన్=జింకపిల్ల కన్నులవంటి కన్నులుగలదానిని, అలాతనిభాక్షి = కొఱవితో సమానమైన కన్నులుగలది, హుమ్మనుచున్ = హుంకారము చేయుచు, మహత్తర = మిగుల గొప్పదగు, ఉల్క=కొఱవి నక్షత్రమువలె, రాన్= వచ్చుటను, గ్రక్కునన్=శీఘ్రముగ, కింకను = కోపముతో, రక్కసిని, రాక్షసీ శబ్దభవము, దీనివలన నిప్పుడు శూర్పణఖ నిజస్వరూపముతో నున్నట్లు గ్రహింపఁదగు. తరలము న భ ర స జ జ గ లు ౧౨-వ యింట యతి.

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పినదై జింకపిల్లకన్నులవంటి కన్నులుగల సీతపైఁ గొఱవుల వంటి కన్నులుగల శూర్పణఖ రోహిణిమీఁదికి గొఱవి నక్షత్రముపోయినట్లు రాఁగాఁ జూచి మిగుల బలశాలియగు శ్రీరామచంద్రమూర్తి దానిని బిగఁబట్టి కోపముతో లక్ష్మణుఁ జూచి యిట్లనెను.

పరిహాసమాడిన వీరికిఁ దనయందుఁ గామములేదని యెఱిఁగి పోవును గదా యని శ్రీరామచంద్రమూర్తి తలఁచెను గాని యది విపరీతముగఁ బరిణమించెను గావునఁ గోపగించెను.

కం. నీచులతో నెప్పుడుఁ బరి,యాచక మాడంగఁ గూడ ♦ దక్కట యిదె సీ
తాచపలాక్షియు స్వస్థత, నే చందంబునను బ్రతికి ♦ యెసఁగునొ కనుమీ. ౩౦౪

నీచులతోఁ = నీచకులము, నీచగుణము నీచబుద్ధిగలవారితో, పరియాచకము=హాస్యము, హాస్యమెఱుఁగని వారితోను బరిహాసమాడరాదు, స్వస్థతఁ = నెమ్మదిని,

తాత్పర్యము.

లక్ష్మణా! నీచులతోఁ బరిహాసమాడుట తప్పు, అట్లు మనము చేయుటచే నీ కష్టము కలిగెను. దీనివాతఁబడక సీతాదేవి యెట్లు బ్రతికి సుఖించునో యాలోచింపుము.

—♦ లక్ష్మణుఁడు శూర్పణఖముక్కుసెవులను గోయుట ♦—

తే. ఈ మహోదరి నసతిని ♦ నీ విరూప
నీమదోన్మత్త రాకాసి ♦ నిపుడపట్టి
చేయుము విరూప నన్న న♦మేయబలుఁడు
కోపమున దాని ముకుసెవుల్ ♦ గోసె నసిని. ౩౦౫

మదోన్మత్తఁ= గర్వముచే దేహము తెలియనిదానిని, విరూపను=రూపము మాఱినదానిఁగా, ఇది తొలుతనే విరూప కావున దీనిని మఱింత విరూపనుగాఁ జేయుము, అమేయబలుఁడు=పరిమాణములేని బలముగలవాఁడు, అసిని=కత్తిచే.

తాత్పర్యము.

ఇది స్త్రీ. ఆయుధము ధరించి యుద్ధమునకు వచ్చినదికాదు. కావునఁ జంపరాదు. శిక్షింపకున్న నిది పోదు కావున నీ మహోదరిని నసతిని విరూపను బలగర్వముచే దేహము తెలియనిదానిని రాకాసిని నిపుడే పట్టుకొని విరూపనుగాఁ జేయుము. అనిన మహాబలశాలినియైన శూర్పణఖకంటె మహాబలశాలియగు లక్ష్మణుఁడు తటాలునఁ గత్తిదూసి యది యెదిరించినను విడువక పట్టి దాని ముక్కుచెవులు తెగఁగోసి ముక్కిడిసేసెను.

తాం ఖడ్గ ముద్గృహ్య, కర్ణనాసాం ప్రచిచ్ఛదే॥ పద్మ. అని రాముఁడే ముక్కుసెవులు కోసె నని యున్నది. యుద్ధమున భటులు జయించిన రాజు జయించినాఁడందురు. భటు లోడిన రా జోడె నందురు. అట్లులే యిదియు నని గ్రహించునది.

నేరములేక దండింపరాదను న్యాయ్యము ననుసరించి యింతవఱకు వారు సైరించిరి. ఇప్పుడు సీతను మ్రింగఁ బ్రయత్నించుటచే శిక్షింపవలసివచ్చెను. ఇది సీతాదేవికిని సమ్మతమైనకార్యమే.

శ్రీరామచంద్రమూర్తియందు శూర్పణఖ స్నేహబద్ధభావయేకాని విరోధభావము కలది కాదుగదా, అట్టిదానిని దండింపవచ్చునా?

తనయందుఁ బ్రీతిగలవారైనను దనవారియందుఁ బ్రీతిలేక వారిని ద్వేషించు వారిని భగవంతుఁడు సైఁపఁడు. కావున శూర్పణఖ కీ దండనము. రామచంద్రుని ద్వేషించి సీతయందు మన సుంచిన రావణుఁడును దండ్యుఁడే. కావున సీతారా

ముల నిరువురను సేవింపవలయును. అదియును గాక దాని కామము ధర్మవిరుద్ధము. విధవయయ్యు రతిగోరుట దుష్టము కావున దండ్యయయ్యె.

ఇచట ముక్కు సెవులు గోసెనని కలదు. ఇవి స్తనోష్ఠముల కుపలక్షణము. అనఁగా ముక్కు చెవులు మాత్రమే కాక చన్నులు పెదవులుకూడఁ గోయఁబడెనని యర్థము. కామాంధలైన స్త్రీల కిటుసేసిన మరల వ్యభిచరింపకుందురని కాఁబోలు రాముని యభిప్రాయము. "సకృత్త కర్ణనాసోష్ఠాం చకార రఘునందనః" అను భారత వాక్యము మహేశ్వరతీర్థీయమం దుదాహరింపఁబడెనుగాని యేలొకో యిది ముద్రిత ప్రతులందుఁ గానరాకున్నది. శూర్పణఖ రావణుని జూచినపట్టున "హతేషు తేషు రక్షస్సు తత శ్శూర్పణఖా పునః। యయౌ నికృత్తనాసోష్ఠీ లంకాం భ్రాతు ర్నివేశన" మ్మని కలదు. స్కాందమున, "లక్ష్మణః తూర్ణముత్థాయ కరవాలేన వీర్యవాన్, కర్ణౌ స్తనౌ నాసికాంచ అచ్ఛిన ద్రామశాసనాత్" అని కలదు. మహేశ్వరతీర్థీయము.

ఉ. ముక్కును వీను లీకరణి ♦ మొక్కలు వోయిన మొత్తుకొంచుఁ జే
రుక్కునఁ గారుమబ్బు వలె ♦ హోయని కానయు మాఱుమ్రోయ నా
రక్కసి బొబ్బ వెట్టుచును ♦ రక్తము గాఱ వికారరూప యై
యుక్కసుతోడ నేడ్చుచు వ♦నాంతరవీథులఁ బాఱె గ్రక్కునన్. ౩౦౬

వీనులు=చెవులు, ఈకరణిన్=ఈ విధముగ, కారుమబ్బు=వానకాలమందలి మేఘము, కానయున్=అడవికూడ, గోడలు కొండలు ఇటువంటి వస్తువులు ప్రతిధ్వని యిచ్చునుగాని నడుమ విచ్ఛిత్తిగల చెట్లు మొదలయినవి ప్రతిధ్వని నీయవు. అయినను దాని కూఁతదెబ్బకుఁ జెట్లుకూడఁ బ్రతిధ్వను లిచ్చెనని తెలియునది. లేదా దూరముగనుండు కొండలు ప్రతిధ్వనించె నని యెఱుఁగనగు; ఉక్కసు = ఆక్రోశ శబ్దభవము, శూర్పణఖ యింతగ నేడ్చినది గాయముల బాధచేఁగాదు. నలుగురు నవ్వుదు రని మనుష్యులచే విరూపనైతినే యని యవమానముచే.

తాత్పర్యము.

ముక్కు సెవు లీవిధముగా మొక్కలుపోఁగా లబలబ నోరు కొట్టుకొనుచు ఱొమ్ము గ్రుద్దికొనుచు వానకాలమందలి మేఘ ముఱిమినట్లు, లడవి ప్రతిధ్వను లీనునట్లు పెద్ద ధ్వనితో బొబ్బలు పెట్టుచు నెత్తురు గాఱుచుండ వికారరూపము మఱింత వికారము కాఁగా మనుష్యులు తన్నిట్లు చేసిరే నలుగురు నవ్వుదురే యని యాక్రోశముతో నేడ్చుచు నడవులలోఁ బడి వేగముగఁ బరువెత్తెను.

తే. చని జనస్థానమందు రా♦క్షసపరీతుఁ, డైన సోదరు ఖరుఁ గని ♦ యార్తనాద
మడర దివినుండి పడియెడి♦పిడుగుపగిది, నేలఁబడి పెద్ద యెలుఁగున ♦ నేడ్చుచుండె.

రాక్షసపరీతుఁడు = రాక్షసులచేఁ జుట్టఁబడినవాఁడు. పిడుగు - ఇది వేగమును రాఁగల యనిష్టమును దెలుపును.

తా త్ప ర్య ము.

ఇట్లు పరుగెత్తిపోయి జనస్థానమందు రాక్షసులచేఁ జుట్టుకొనఁబడియుండు తన తమ్ముని ఖరునిజూచి యేడుపు ధ్వనితో నాకాశమునుండి పిడుగు పడినట్లు దబాలున నేలఁబడి పెద్దపెట్టున నేడ్చుచుండెను.

—♦ ౧౯-వ సర్గము. ఖరుఁడు శూర్పణఖ వికృతవేషమును జూచి కోపించుట ♦—

క. తడియఁగ నెత్తుట దేహము, పుడమిం బడి వికృతరూప♦మున నేడ్చెడు న
వ్వడఁతుకఁ గని యాగ్రహమున, నుడుకుచు ఖరుఁ డిట్టు లనియె ♦ నుగ్రాకృతియై.

ఉగ్రాకృతియై=భయంకరమైన యాకారముగలవాఁడై.

తా త్ప ర్య ము.

దేహము నెత్తుటఁ దడియుచుండఁగా నేలమీఁదఁ బడి వికారరూపమున నేడ్చు చున్నదానిని జూచి ఖరుఁ డిట్టులనియె.

ఉ. ఎవ్వఁ డనాగసాచలమ♦హిష్ఠవిషోజ్జ్వలకృష్ణసర్పముల్
గ్రొవ్వున వ్రేలితోఁ జెనకెఁ ♦ గ్రోలె నెవండు విషంబుఁ? గంఠమం
దెవ్వఁడు చుట్టుకోఁ గలిగె ♦ హీనమనీషను గాలపాశ? మే
నెవ్వడి నేగి వాని యిదె ♦ నేలను గూల్చెద, నెత్రు పీల్చెదన్. ౩౦౯

అనాగస=అపకారముచేయక (బుస్సుమనిదైన ననక), అచల=కదలక యొక చోటఁ దనపుట్టలోఁ దానుండు, మహిష్ఠ=పెద్ద, విషోజ్జ్వల= విషముచేఁ బ్రకాశించు, కృష్ణసర్పముల్=నల్లత్రాఁచుపామును, గ్రొవ్వునన్ = కండకావరముచేఁ బాముగదా కఱచు ననుభయములేక, వ్రేలితోఁ జెనకెన్=వ్రేలితోఁగిఱెను, వ్రేలితోఁ జెనకుటచేఁ బాము తటాలున దానిని గఱచుటకు ననుకూలపడును, హీనమనీషను= బుద్ధిలేమిచే, కాలపాశమును= మృత్యువుచేతియందలి త్రాళ్ళను మృత్యువుతానై వేయక యూర కున్నను బుద్ధిలేనివాఁ డగుటచే దానిని దానే మెడకు వేసికొనెను. నెఱ+వడి= నిండు వేగమున, నెత్రు=నెత్తురు.

తా త్ప ర్య ము.

ఎవరిని దఱుక బెదరింపక బుసకొట్టక తనంతటఁ దాను బుట్టలోఁ గదలక యుండు మహాభయంకర విషమును గల నల్లత్రాఁచుపామును నెవఁడు వ్రేలితోఁ బొడిచెను? ఎవఁడు విషము త్రావెను? ఎవఁడు తనకై తానే మృత్యుపాశమును దన కంఠమునకుఁ దగిలించి బిగించుకొనెను? చెప్పుము. నేనిప్పుడే తెప్పునఁ బోయి వానిని జంపి నెత్తురు త్రావెదను.

క. బలవిక్రమసంపన్నవు, వలచినచో వలచినట్లు ♦ వలచిన వేషం
బులఁ దిరిగెద వీ దుర్దశఁ, గలికి! యర్థాయు వెవఁడు ♦ గలిగించె నొకో. ౩౧౦

బలవిక్రమసంపన్నవు=నీకు దేహబలసంపత్తి, విశేషవిక్రమముగలవు. వలచి నచోన్=కోరినచోట్ల, వలచినట్లు=నీ కోరినప్రకారము, వలచిన వేషంబులన్ = కోరిన రూపము ధరించి, దుర్దశ=కష్టస్థితి, అర్థాయువు = సగముప్రాయముండే చచ్చువాఁడు.

తా త్ప ర్య ము.

నీవు బలము విక్రమము విశేషముగఁ గలదానవు. కావున సామాన్య బలవంతులు నిన్నుఁ బరిభవింపలేరు. నీవు కోరినచోట్లఁ గోరిన రూపముతోఁ గోరినట్లు తిరుగుదానవు. నిన్నడ్డగించువారు లేరు. ఇట్టి నిన్ను నెవఁడే దీర్ఘకాలము బ్రతుక నిచ్చలేనివాఁ డిట్టి కష్టస్థితికి దెచ్చెను.

క. సురవరగంధర్వాదులఁ, బరమర్షులనే నెవండు ♦ పరమాపకృతిన్
దురుసునఁ జేయ దెగించిన, గురుసాహసుఁ డెవఁడు చెపుము ♦ కూల్చెద వానిన్.

పరమాపకృతిన్ = గొప్ప యుపకారమును, దురుసునన్ = దుష్టతనముచేత, గురుసాహసుఁడు = గొప్ప తెంపుగలవాఁడు.

తా త్ప ర్య ము

సురలందుఁగాని గంధర్వులందుఁగాని పరమర్షులందుఁగాని దౌర్జన్యముచే నిటువంటి గొప్ప యపకారము చేయఁ దెగించినవాఁడెవఁడు చెప్పుము. వానిని వధించెదను

ఆ. సురలయందుఁ బాక♦సూదనుఁడును సహ
స్రాక్షుఁ డగు మహేంద్రుఁ ♦ డైన నాకు
నప్రియంబుఁ గూర్ప ♦ నడలెడి నా నెవ్వఁ
డోర్చు నా కనిష్ట ♦ మొనరఁజేయు. ౧౧

పాకసూదనుఁడును=ఇంద్రుఁడును, అడలెడిన్=భయపడును, అనిష్టము=అప్రియమైనకార్యము, పాకాసురుఁడు= వృత్రాసురుని సోదరుఁడు.

తా త్ప ర్య ము.

దేవతలలోఁ బాకాసురుని జంపిన వేయికన్నుల యింద్రుఁడయినను నాకు నప్రియమైన కార్యముచేయ భయపడుచుండును. మఱియెవ్వఁడు నాకు నప్రియము చేయఁగలవాఁడు.

క. నీరములు నున్న క్షీరము, సారస మానెడు విధానఁ ♦ జయ్యన నిదె నా
నారాచంబుల నాతని, ధారణిఁ బడవైచి త్రావెదన్ బ్రాణంబుల్. ౧౩

తా త్ప ర్య ము.

నీళ్ళలో నున్న పాలను హంస త్రావినట్లు శీఘ్రముగ నిదిగో నిప్పుడే నాబాణములచే నతని భూమిని గూల్చి వాని ప్రాణవాయువులు త్రావెదను.

ఉ. క్రూరరణాంగణంబునను ♦ గూలిచి వేని సఫేన రక్తముల్
ఘోరమదాశుగోత్కరము ♦ గ్రోలఁగఁ గోరెదు? శాతబాణని
ర్దారితమర్మసంఘుఁ డయి ♦ దారుణగృధ్రపతత్రిజాతి కా
హారముగా నెవండొ యిటు ♦ లాఁటిడిపెట్టె నినున్ సహోదరీ. ౧౪

క్రూరరణాంగణంబునను=భయంకరమైన యుద్ధభూమియందు, వేనిన్ = ఎవనిని, సఫేన = నురుగుతోఁగూడిన, రక్తముల్ = నెత్తుటిని, ఘోర=భయంకరమైన,

మదాశుగోత్కరము=నా బాణముల సమూహము, క్రోలఁగక = త్రావఁగా, శాత= పదునైన, బాణ= బాణములచే, నిర్దారిత= చీల్పబడిన, మర్మసంఘుఁడై =గుండెలు మొదలగు మర్మస్థానసమూహములు గలవాఁడయి, దారుణ=భయంకరమైన, గృధ్ర= గ్రద్దలయు, పతత్రి=పక్షులయు, జాతికిక్=జాతికి, ఆఁకుడి పెట్టెను=బాధించెను.

తాత్పర్యము.

అయ్యో! నా ముద్దుటక్కా! యుద్ధభూమియందు నెవ్వని జంపి వాని నెత్తురును నురుగుతోడ నాబాణములు త్రావఁగఁ గోరెదవు? నా పదునైన బాణములచేఁ జీల్పఁబడిన యెవఁడు గ్రద్దలు మొదలగు పక్షిజాతి కాహారము గాఁగోరెదవు. ముద్దు ముద్దుగా ముక్కరకు నోయకుండ నెవ్వఁడు నిన్నిట్లు బాధపఱిచెను?

ఉ. కావఁగ వాని దేవతలు ♦ గారు సమర్థులు, కారు రాక్షసుల్,
చావు నిజంబు వానికిని ♦ శాతశరాహతి; నేడ దేఱి నీ
వే విధినైన వాని గుఱు ♦ తేర్పడఁ జెప్పు మటన్న భ్రాతృవా
క్యావళి నాలకించి బహుళాశ్రులు వెల్లిగొనంగ నిట్లనున్. ౧౫

తాత్పర్యము.

అటువంటి వానిని రక్షించుటకు దేవతలు సమర్థులుగారు, రాక్షసులుగారు, నా బాణముల దెబ్బలచే వానికిఁ జావు సత్యము, కావున బడలిక దీర్చుకొని నిన్నీ ప్రకారముచేసిన వాని గుఱుతులు చెప్పుము, అని ఖరుఁ డడుగఁగాఁ దోడఁ బుట్టిన వాని మాటలు విని విస్తారముగఁ గన్నీళ్లు కాల్వలు పాఱ నీ ప్రకారము చెప్పెను.

— ♦ శూర్పణఖ ఖరునకు సీతారామలక్ష్మణుల వృత్తాంతముఁ జెప్పుట. ♦ —

చం. తరుణులు ప్రాప్తరూపులును ♦ దాపస వేషులు సౌకుమార్యభా
స్వరులు మహాబలుల్ విశద ♦ వారిజ నేత్రులు వల్కలాజినాం
బరులును వన్యమూలఫల ♦ భక్షులు దాంతులు ధర్ములుక్ సహో
దరులును రామలక్ష్మణులు ♦ దాశరథుల్ సుమి వారు రాక్షసా. ౧౬

తరుణులు=యౌవనవంతులు, ప్రాప్తరూపులు=సుందరులు, తాపసవేషులు = తపస్వులవేషములు వేసినవారు, సౌకుమార్య=సుకుమారత్వముచే, భాస్వరులు = ప్రకాశించువారు, మహాబలుల్ = మిగుల బలముగలవారు, విశద వారిజలోచనులు= వికసించిన కమలములవంటి కన్నులుగలవారు, వల్కలాజినాంబరులు = నారచీరలు, కృష్ణాజినము వస్త్రముగాఁ గలవారు, వన్య = అడవియందుఁ బుట్టిన, మూల ఫల భక్షులు=గడ్డలు పండ్లు దినువారు, దాంతులు=ఇంద్రియ నిగ్రహము గలవారు, ధర్ములుక్ = ధర్మమందుండువారు, సహోదరులు= అన్నదమ్ములును శ్రీరామలక్ష్మణులును = శ్రీరాముఁడు లక్ష్మణుఁ డను పేర్లుగలవారు, దాశరథుల్ = దశరథ రాజ కుమారులు.

## తాత్పర్యము.

నన్నీప్రకారము చేసినవారెవ్వరనెదవా. చెప్పెద వినుము? రాక్షసుఁడా! వారు యౌవనవంతులు, చక్కదనము గలవారు, మునులవేషముల వేసినవారు, కోమలదేహులు, మహాబలసంపన్నులు, వికసించిన తామరపూవులవంటి కన్నులు గలవారు, నారచీరలు కృష్ణాజినములు వస్త్రములుగాఁ గలవారు, అడవియందుఁ బుట్టిన గడ్డలు పండ్లు దినువారు, ఇంద్రియనిగ్రహము గలవారు, ధర్మమార్గమున నుండువారు, అన్నదమ్ములు, దశరథరాజకుమారులు, శ్రీరామలక్ష్మణులను పేర్లు గలవారు.

నిన్ను విరూపను జేసినవారెవ్వరు అనుప్రశ్నకు సరియైన ప్రత్యుత్తరము దశరథ రాజకుమారులు శ్రీరామలక్ష్మణులని చెప్పవలసియుండఁగా తరుణులు అనియేల వారి సౌందర్యవర్ణనము ప్రారంభించెను? కామము విఘ్నమై క్రోధముగాఁ బరిణమించినను లోని కామము చావలేదు; వైరాగ్యము జనింపనులేదు. గాఢముగ శ్రీరామలక్ష్మణరూపములందు మనస్సు నాటియుండుటచే వారిమూర్తులే దానికిఁ గన్నుల యెదుటఁ గానవచ్చుచున్నవి. అట్లు కామమోహిత యగుటచే దానిని నిగ్రహింపలేక సోదరుని యెదుటను లోని భావమునే ప్రకటించుచున్నది. ఇచ్చట గోపికల "గురుణా మగ్రతో వక్తుం కింబ్రవీమిన నః క్షమమ్। గురవః కింకరిష్యంతి, దగ్ధానాం విరహాగ్నినా" పెద్దవారియెదుట నిటుల మాటలాడుట మీకుఁ దగదని చెప్పెదవా? విరహ మనెడి యగ్నిచే దగ్ధమైన మమ్ముఁ బెద్దవారేమి చేయఁగలరు? వి-పు. "కామాతురాణాం న భయం నలజ్జా" కామాతురులకు భయములేదు, లజ్జలేదు. ఈ కారణముచే రామలక్ష్మణుల సౌందర్య వర్ణనముచేఁ బ్రారంభించెను. ఇది స్త్రీయగు శూర్పణఖయందు విశేషముగాదు. శ్రీరామచంద్రమూర్తిని జూచినవా రందఱు అనుకూలురుగాని ప్రతికూలురుగాని యిట్టివారే యగుదురు. పురుషుఁడు బ్రహ్మచారి వానరుఁడైన హనుమంతుఁడు సీతాదేవితో నా మగని లక్షణము లెవ్వియని యడిగినపుడు త్రిస్థిరుఁడు త్రిప్రలంబుఁడు అని చెప్పవలసియుండఁగా "రాముండు కమల పత్రవిశాల లోచనుండు" అని సౌందర్యమునే చెప్పెను.

౨. "సుప్త ప్రమత్తకుపితానాం భావజ్ఞానాం దృష్ట" మను న్యాయము ప్రకారము నిద్రించువారియందు ఒడలెఱుఁగని మత్తులందుఁ గోపించినవారియందు యథార్థము బయలుపడును. కావున శూర్పణఖ ముక్కు సెవులు ఛేదించుటచేఁ బ్రమత్తయుఁ గుపితయునై యిది చెప్పవచ్చును, ఇది చెప్పరాదను తెలివి మఱచి హృదయమున నుండినది బయలుపఱచెను.

"కన్యా వరయతే రూప" మనునటులు కామినుల నాకర్షించునది పురుషుల వయసును, సౌందర్యముగదా, కావున వానినే చెప్పెను.

౩. తన్ను శ్రీరామచంద్రుఁడు కదా విరూపను జేయించినవాఁడు. ఆయన యాజ్ఞకు లోబడి లక్ష్మణుఁడా కార్యము చేసెను. కావున నపరాధి శ్రీరాముఁడే. కావున శ్రీరామచంద్రు నొకనినే దూషింపవలసి యుండఁగా నిరువురను గలిపి చెప్పనేల? కర్త కార్యముచేసినవాఁడు, కారయిత చేయించినవాఁడు, నిరువురు దోషులే, ఇరువురు రూపసంపన్నులే. ఇరువురు సమాన వయస్కులే, ఇరువురను శూర్పణఖ వలచినదే, ఇరువురు మహాబలులే, అన్నిట నిరువురు సమానులే, కావున నిరువురను గలిపి చెప్పెను.

ప్రాప్త+రూపులు, ప్ర+ఆప్తరూపులు ప్రకృష్టముగఁ బొందఁబడిన సౌందర్యము గలవారు. అనఁగా లోకమున సుందరపురుషు లని ప్రఖ్యాతివహించిన కంతు జయంత వసంత నలకూబరాదులకు సౌందర్యభిక్ష యీయనపెట్టినదే. ముష్టిసౌందర్యమే యిట్లుండ నిఁకసౌందర్య సౌభాగ్యఖనుల సౌందర్య మెట్లుండవలె. అంతటి సుందరు లని భావము.

భిక్ష మెట్లనిన "అంగాదంగాత్సంభవసి" అనునట్లు తండ్రియంగములోఁ గొంత తీసికొనియేకదా కొడుకు పుట్టును అట్టులే మన్మథుఁడు దండ్రి యందములోఁ గొంతయే గలవాఁడు. కావుననే కదా 'సాక్షాన్మన్మథమన్మథ' యని భగవంతుఁడు చెప్పఁబడెను.

ప్రాప్తరూపులు, "ఉత్పన్నం ద్రవ్యం క్షణ మగుణం తిష్ఠతి" పుట్టినద్రవ్యము క్షణకాలము గుణహీనమై యుండును, అను న్యాయము ప్రకారము లోకములోని వస్తువు లన్నియుఁ బుట్టినతరువాత గుణములను బొందినవే రూపదాక్షిణ్య సంపన్నునిఁ గౌసల్య గనెను అని చెప్పుటచే వీరుగుణములతోనే పుట్టినవారు కాఁబట్టి వీరి కివి క్రొత్తగా వచ్చినవికావు, సహజములు. ఈ కారణముచే వారి సౌందర్యమునకు వయస్సు కారణము గాదు. దానివలన నది యెక్కువయుఁ గాలేదు.

"రామేతి రామేతి సదైవ బుద్ధ్యా విచింత్య వాచా బ్రువతీ తమేవ," రాముఁడు రాముఁ డని యాయననే బుద్ధియం దాలోచించి నోరను నాయననే చెప్పెను. అన్నట్లును స్త్రీలు సర్వదా స్మరింపఁదగినది సుమా ఆయన రూపము.

స్త్రీలు కామినులు, కాముకలు వారు మోహించుట గొప్పయా యనకుము "పుంసాం మోహనరూపాయ" పురుషుల దృష్టిని గూడ హరించునది సుమీ వారి సౌందర్యము. సౌందర్య మంతయు ననుభవింపఁగలవారెవ్వరు? కన్నో ముఖమో యే యవయవముమీఁద దృష్టిపడునో యా దృష్టి మన స్సాయవయవముపై నంతతో నిలిచిపోవును. దాని సౌందర్య మనుభవించుచు నందే మేకు కొట్టి బిగించినట్లు నిలిచిపోవునంతటి సౌందర్యము. త్రిభువనసుందరి సీతయు.

"చూడదు రాక్షసాంగనలఁ జూడదు పుష్పఫల ద్రుమంబులం, జూడదు రమ్య హర్మ్యముల సుందరి డెందము నందు నెప్పుడుం జూడఁగఁ గోరుచుం భువనసుందరు

రాముని నొక్కనిఁ" అన్నట్లు రామునిసౌందర్యమును జూచి సిగ్గుపడుచుండెను. మనుష్యులమాట యేల?

ధన్యా దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చపరమర్షయః
మమ పశ్యంతి యే నాథం రామం రాజీవలోచనమ్॥

అన్నట్టు లోకకన్నులను జూచినంత మాత్రముననే దేవతలుకూడ ధన్యులగుదురు. వారు నేత్రాలోకముచేతనే ధ్యానధారణాసమాధులు కుదిరి బ్రహ్మానందవశు లగుదురు. తక్కిన యవయవసౌందర్యానుభవము వారికిలేదు. అట్టిది సుమీ వారి సౌందర్యము.

అటయిన వారి కాసౌందర్యము వయస్సువలన వచ్చినదా? కాకుండిన వేషము వలన హెచ్చినదా.

తాపసవేషులు = పాడుగోడకైనఁ బైపూఁత శృంగార మన్నట్టులు కొందఱు విశేషసౌందర్యముగలవారు గాక పోయినను సొమ్ములచేత వస్త్రములచేత నలంకరింపఁబడి విశేషసుందరులుగానే కానవత్తురు. వీరి దిట్లు పెట్టుసొగసా పుట్టుసొగసా యనిన వారికి వస్త్రభూషణాద్యలంకారములు లేవు. రాజవేషములు లేవు. నీ వెప్పుడు చూచు మునులవేషముతో జడలు ధరించి యున్నారు. ఈ వేషముతోనే యింత సుందరముగాఁ గానవచ్చు వా రలంకరించుకొన్నప్పుడు మఱియెట్లు గానవచ్చెదరో.

అట్లైనఁ దపసులై గాలిలో నెండలో వానలోఁ దిరుగువారైరేని వారిదేహములు కలుషలై యుండును గదా. అది సౌందర్య హానికరముగాదా యందువేమో, కాదు. సౌకుమార్యభాస్వరులు = సుకుమారత్వముచేఁ బ్రకాశించువారు. కన్నులు ముక్కు లోనైన యవయవములు పుట్టువుతో నెట్లువచ్చెనో యట్లు సౌకుమార్యము పుట్టువుతోనే వచ్చినది. కావున గాలికి వానకుఁ బోవునదికాదు. కావున మీ దేహములవలెఁ గర్కశములైనవి కావు. పుష్పములవలె సహజకోమలములు, కావుననే కదా వారిదేహములను బూవులతోఁ బోల్చి "అతసీపుష్పసంకాశ" మ్మని చెప్పఁబడెను. ఎటువంటి సౌకుమార్య మనుకొంటివో పరులు వ్రేలితోఁ దాఁకుటచేఁగాదు పూలతోఁ దాఁకినను నక్కడ దేహము కందును, అంతియేకాదు. ప్రౌఢస్త్రీల దృష్టిపాతమునుగూడ సహింపలేనంతటి సౌకుమార్యముసుమా సుకుమారత్వమే సౌకుమార్యము. సు+కుమారుఁడు=కుమారుఁడు మన్మథుఁడు, 'కుమారో మాసుతే స్కందే' నానా॥ ర॥ ఆ మన్మథునికంటె సుష్ఠువైనవాఁడు. దేహములేని సౌందర్య మదియేమి సౌందర్యము? దాని ననుభవించువారెవరు? వీరట్లుగాదు, సు+కు+మార+భాస్వరులు=సు=బాగుగా=కు భూమియందు, మారభాస్వరులు = మన్మథత్వముచేఁ బ్రకాశించువారు. దేవలోకమున దేహములేక యెవరికిఁ గానరాకయుండు మన్మథుని వంటివారుగారు. భూమియం దందఱకుఁ గానవచ్చునట్టు లిరువురై యున్న

వారు. వారు నన్నుఁ బట్టుకొనినపుడా స్పర్శసుఖముచే నావంటిదానికిని దేహము తెలియలేదు. అట్టిస్థితిలో వారు నాముక్కు సెవులు గోసిరి. అటుగాకున్న వారు కత్తియెత్తఁగానే పరువెత్తిరాక పోయితినా? వారు నన్ను విడుచువఱకు నా ముక్కు సెవులు పోయినవిషయమే నాకుఁ దెలియదు, అంతటి సుకుమారులు.

మహాబలులు=అంతటి కోమలదేహులైన నా బాణముల ఘాత నేమి సహింపఁ గలరు, నిమిషములోఁ జంపెద నందువేమో జాగ్రత్తసుమా.

మహాబలులు= మిగుల బలవంతులు, వారిబలము నీ వెఱుంగవు, మారీచాదు లెఱుంగుదురు. 'కింక గొనెనేని యసాధ్యుఁడు నిండువెల్లినేఁ । ఘనతరబాణపంక్తి నరికట్టు సతారము సగ్రహంబునొ । ఘనపదముల్ శరంబులఁ బగుల్చుఁ జుమీ రఘురాముఁ డుద్ధతిఁ.' కావున బలహీను లని తలంపకుము, మహాబలుల్=ఇది తన కామోద్రేకము ననుసరించి చెప్పుచున్నది. "రామస్తు సీతయా సార్ధం విజహార బహూన్ ఋతూన్" అన్నట్టు లెడఁదెగక స్త్రీలతో సంవత్సరముల కొలది భోగించినను క్షీణింపని బలముగలవారు. అనుభవింప సామర్థ్యము బలము కావున నిట్టిబలము గలవాఁడు. దీనివలన దుర్బలలగు మనుష్యస్త్రీలకేగాక నావంటి రాక్షస స్త్రీలకుఁగూడ రతితృప్తి గలిగింపఁగలవాఁడు. సాధారణముగ లోకమున స్త్రీలు తమ చాతుర్యవిశేషములచే మగవారిని మఱపి తమయందు వారి కాశపుట్టించి లోపఱుచు కొనఁగలవారు. అట్టి స్త్రీలే వారిని జూడఁగానే తామే కామపరవశ లగుచుండ నిఁక వారిని గెలుచు ప్రయత్నము లేమి చేయఁగలరు.

ఓసీ, సముదాయావయవశోభ బాగుగనే యుండవచ్చును గాని యవయవములఁ బ్రత్యేకముగఁ జూచిన నెట్లుండునో యనెదవా.

విశదవారిజలోచనులు= వికసించుటచే విశాలమైన కమలమువంటి కన్నులు గలవారుగాని 'సంరక్తనయనా ఘోరా' యన్నట్లు మీవలె నెఱ్ఱని మిడిగ్రుడ్లు కలవారు గారు. "ధన్యులు రాజీవాక్షునిఁగను దేవ సిద్ధ మౌనిప్రవరుల్" అన్నట్లు దేవసిద్ధ మౌనులను గూడ నా నేత్రసౌందర్యసంపత్తి ధన్యులను జేయఁగలదు. ఇచ్చట నేత్ర శబ్దమునకు దృష్టియనియే యర్థము గ్రహింపవలెను. ఇట్లు చెప్పుటచే సీతవలె రాముఁడును గాటుక కంటివాఁ డని, రక్తాపాంగుఁడని చెప్పుటతో విరోధింపదు. అవి మహాపురుష లక్షణములు. విశదమనఁగాఁ దెలుపు, "విశదో ధవళే వ్యక్తే శుచౌ త్రిషు గుణేతువా॥" నానా ॥ర॥ కావునఁ దెల్లని కమలములవంటి దృష్టులు గలవా రనుటచే సత్త్వగుణము కన్నులఁ గురియుచున్న దని భావము. తమోగుణము గల కన్ను లందుఁ దూఁగుఁబోతుతనము, కావిరంగు నుండును. రజోగుణము ప్రబలిన కన్నులు కోపముతోఁగూడినవై యుండును. అట్టివి లేక వారి కన్ను లెల్లవేళ సత్త్వప్రసన్నములై యుండును. ఇట్లు చెప్పుటచే వీరి కన్నులయందు శాంతిరసము కుదురై నిలిచె నని భావము. "శాంతి నిర్మలహీరకాంతిగతుల" నని, శాంతిరసము వజ్రమువలెఁ దెల్లనిది.

రహస్యవిషయములను మనస్సు దాఁపగలిగినను దానిగుట్టును గన్నులు రట్టు చేయును. కామము కోపము లోనైనవి కన్నులవలననే తెలిసికొనవచ్చును. ఆ కారణముచే 'ఆత్మానం మానుషం మన్యే' నేను మనుష్యుఁడ నని తలఁచెదను, అని పరత్వము దాఁచి మాటలాడినను, ఈయన కన్నులు చూడఁగానే "యథాకప్యాసం పుండరీక మేవ మక్షిణీ" యను శ్రుతిని స్మృతికిఁ దెచ్చి యీయన పుండరీకాక్షుఁడైన పరమపురుషుఁ డని చాటించుచున్నట్లున్నవి సుమా!

కన్నులు తేటగా నుండుటచే విశదవారిజనేత్రు లని చెప్పఁబడెను గాని కమల మెంత వికసించినను మూరెడు వైశాల్యముగల దగునా, బారెఁడు వైశాల్యము గల దగునా? ఈకన్ను లట్టివిగావు. లీలావిభూతిని నిత్యముక్త బద్ధాఖ్యు లగు వారిని నేక కాలమందు లోఁగొని యనుగ్రహించు సామర్థ్యము గలవి. కావున వానివైశద్య మనిర్వచనీయము.

మహాబలులు, విశదవారిజనేత్రులు, భుజబలముచే నితరులపైఁ దూపులు ప్రయోగించకయు చూపులచేతనే వశపఱచుకొనఁగలవారు. వారు చూపులు సోఁకి నంతన నెట్టి స్త్రీలును బురుషులును బాదాక్రాంతు లగుదురు.

చేతులు తమబలముచేఁ బరులఁ బాదాక్రాంతులఁ జేయఁగాఁ బ్రసన్నదృష్టులు వారిభయముఁ బాపి యనుగ్రహించును.

వల్కలాజినాంబరులు=కృష్ణాజినమును వస్త్రముగాఁ గట్టుకొన్నవారు. 'ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ' "కిమవహి మధురాణాం మండనం నాకృతీనా" మ్మన్నట్టు లనఁగా, ఈ శకుంతల నారచీరెలు గట్టుకొనియున్నను మిగుల రమణీయమై యున్నది. సౌందర్యముగల వారి కేని యాభరణముకాఁజాలను? శాకుంతల. ఏదికట్టు కొన్నను ఏది పెట్టుకొన్నను సుందరుల సౌందర్యమునకు హానిలేదు. అదియొక సొగసు గానే యుండును. సుస్వరముగలవా రేడ్చినను బాగుండునుగదా.

ఇట్లు వారు నారచీరలు గట్టుకొన్నను మిక్కిలి సుందరులుగానే కానవచ్చు చున్నారు.

మఱియొక యోజన:—

ఖరుఁడు రావణుఁ డను మాపేర్లు వినఁగానే దేవతలుకూడ గడగడలాడుచుండ మా సోదరి నిట్లు పరిభవించి దీనిమూలమున మమ్ముఁ బరిభవింపఁ దలఁచిన మహావీరు లెంతటి బలశాలులో యని ఖరుఁడు భయపడఁగావానిముఖ నేత్రవికారములచే వాని మనస్థితిఁ దెలిసికొని వానికి ధైర్యమువచ్చునట్లు చెప్పియుద్ధమునకుఁ బురికొల్పుటకై శూర్పణఖ యిట్లు చెప్పుచున్నది. తరుణులు = యౌవనదశయందుండు వారు, నీవలెఁ బ్రౌఢులుగారు. యౌవనే విషమైషిణా మ్మనునట్లు, స్త్రీలతోఁగూడి సుఖింతమను కోరిక గలవారేకాని, చావునకుఁ దెగించి యుద్ధమునకు వచ్చువారుగారు.

ప్రాప్తరూపులు=ప్రాప్తరూప సురూపాభిరూపాః పండిత సౌమ్యయోః, ప్రాప్తరూప, సురూప, అభిరూపశబ్దములు పండితునందును, సుందరమైన దానియందు వర్తించును. వీరు పండితు లగుటచే వాక్కలహమందు గెలువఁగలవారేకాని బాణయుద్ధమందు గెలువ శక్తిగలవారు కారు. 'కన్యా కామయతే రూప'మ్మను నటులు సౌందర్యమున వీరు స్త్రీలను వశపఱచుకొనఁగలరు గాని పరాక్రమముచే శత్రువులను వశపఱుచుకొను సామర్థ్యము గలవారు కారు.

వన్నె బొమ్మలవలె పైపైవన్నెల్ పచరించువారేకాని లోపలఁ బసగల వారుకారు.

తాపసవేషులు ముక్కుపట్టుకొని యొకమూలఁ గూర్చుండనేర్చిన వారే కాని వీరులవలె రణరంగమున వ్యవహరించువారుగారు.

సౌకుమార్యభాస్వరులు, పుష్పములవలె మిగులఁ గోమలమైన దేహముగల వారు. నీ బాణఘాతము కేమి యోర్వఁగలరు? అదియును గాక శ్రీమంతులు = శ్రీమంతుని పుత్రులు. అల్లారు ముద్దుగా నెండకన్ను వానకన్నెఱుఁగక పుట్టి పెరిఁగినవారు. ఇట్టివారు ఖరకరుఁడవైన నీ బాణవర్షమునకుఁ బ్రతాపమునకు నేమి యోర్వఁగలరు? వారిని జూచితివా, వీరా మనతో యుద్ధము చేయఁగలవారని నీకే తెలియఁగలదు.

మహాబలులు = కేవలము బలహీనులు, దేహబలము, ధనబలము మనోబలము, బంధుబలము, సేనాబలము లోనగు బలములేవియు లేనివారు. ఇట్టివారు ఈ బలసంపత్తి పూర్తిగాఁగల నీతో నేమి యుద్ధముచేయఁగలరు. కేవలము దుర్బలులగుట నేకార్యమునందు సమర్థులుగారు. అదియునుగాక మహతీ = రక్షణీయా + అబలా యయో స్సా మహాబలా, కాళ్ళబందము మెడకురిత్రాడువలెఁ దమచే రక్షణీయయగు భార్యగలవారు. మనము యుద్ధములోఁ జచ్చిన నిది యెవరిపాలగునోయని దానిని రక్షించుటకై పరువెత్తిపోదురుగాని చచ్చినఁ జచ్చితిమని సాహసము చేయఁగలవారు గారు.

అంతటి దుర్బలులు గాకున్న నొక యాఁడుదానిమాటఁ దిరస్కరింపక యడవుల పాలగుదురా? "న యుద్ధయోగ్యతా మస్యమశ్యామి సహరాక్షసైః॥" రాక్షసులతో యుద్ధముచేయ నా కొడుకు సమర్థుఁడుగాఁడని వారితండ్రియే చెప్పనంతటి బలహీనులు. తమకొడుకులు మొనగాండ్రు సమర్థులని తండ్రులు చెప్పుట లోకధర్మము. ఎంతో విశేషకారణము లేకున్న నిట్లు తండ్రి చెప్పునా? విశదవారిజనేత్రులు, అయ్యయ్యో ముందు మించి యీ రాక్షసి నవమానించితిమే. దీని కన్నులు ప్రబలులున్నారే! వారందఱు మనపైవత్తురేమో. ఏమిరా దైవమా యని ముఖమంతయు కన్నులు చేసికొని భయముచే విశాలముగా విచ్చి ఱెప్పపాటులేక దిక్కులు చూచుచున్నవారు.

వారిజము=కమలము, వారియందు=నీళ్ళయందున్నప్పుడు స్వస్థానబలముచే బాగుగనే యుండును. కానిఆ స్థలమువిడిచి వెలుపల వచ్చినఁ జెడును. అట్టులే వీరును దమ పట్టనమందు గొప్పగరాణించువారైనను వనములందు వీరిబల మేమి పనిచేయును. నీకా స్థానబలముగలదు. వారి కదిలేదు. ఇట్టి స్థితియందు వారి మనస్సు విధమును వారి కన్నులే తెలుపుచున్నవి.

వారు స్వదేహబలహీనులే యగుదురుగాక! ధనమూలమున బలము సంపాదింపవచ్చును గదా యందువేమో. అందును వారు సమర్థులుగారు.

వల్కలాజినాంబరులు = వస్త్రములు కొనుటకు ధనములేక దరిద్రులై చెట్ల పట్టలు, మృగచర్మములు కట్టుకొని కప్పుకొని తిరుగుచున్నారు. కట్టుగుడ్డలకు గతిలేని వారు జీతముల నిచ్చి యుద్ధభటులనా తోడితేఁగలరు? కట్టుకొనను గప్పుకొనను ఏకవిధమైన యాచ్ఛాదనము లేదు. చెట్లను యాచించి నారపట్టలు మృగముల హింసించి చర్మములు సంపాదించి కాలక్షేపము చేయుచున్నారు.

వన్యమూలఫలభక్షులు = అంత దుర్బలత్వమునకుఁ గారణ మేమందువా? కడుపునిండఁ దిన బలకరమైన యాహారములేదు. అడవులలోనుండు కందమూలములఁ దినువారి కేమి దేహబల ముండును?

దాంతులు. - ఆ కారణముచే నింద్రియ వ్యాపారము లుడిగియుండువారు.

ఆకారణముచేతనే 'భగ్నాత్కృషేః భాగవతా భవంతి' యన్నట్లు ధర్మమార్గమం దున్నవారు.

వారిలో బలిష్ఠుఁడెవ్వఁడు బలహీనుఁడెవ్వఁడందువా? ఇద్దఱు సమానులే.

మఱియొక యోజన :—

కయ్యమునకు నెయ్యమునకు వియ్యమునకు సమత వలయు నన్నట్లు నాతో సమానునితో యుద్ధము చేసినఁబేరు ప్రతిష్ఠయుఁ గలుగునుగాని యిటువంటి దుర్బలులతో యుద్ధముచేసి గెలిచినను లాభ మేమి యని నిస్పృహుఁ డగునేమో యని తలఁచి వానికి రోషపౌరుషములు వర్ధిల్లఁజెప్పుచున్నది.

ఓరీ ఖరా! యిదివఱకు నీవు దండకయందు ముక్కు పట్టుకొని తపస్సుచేయుచుఁ బ్రతికృతిచేయలేని పేదబాఁపలను హింసించినవాఁడవే కాని నిలువఁబడి యుద్ధము చేసినవారితోఁ బోరినవాఁడవు కావు. ఆ కారణమున నేను బలశాలిని, పరాక్రమవంతుఁడ ననుకొనుచున్నావు. ఇఁక నా యాటలు చెల్లవు. నా ముక్కు సెవులు గోసినవా రెటువంటి వారనుకొంటివో తెలియునా?

తరుణులు = మంచికోడెవయస్సున నుండు వారు యౌవనమదముచే యుద్ధమనిన సిద్ధమనువారు. అట్టివారితో యుద్ధముచేసినఁగదా నీ మగతనము బయటపడును. వా రింకను నెటువంటివా రని తలఁచితివో, తరుణులు = బాలురుగారు, ముదుసళ్ళుగారు. క్రొవ్విన కోడెవయస్సునం దుండువారు. పరిభవమును సహింపనీని

వయస్సునందుండువారు. 'యావనే విజిగీషూణా' మ్మన్నట్లు యుద్ధముచేయవలె. గెలువవలె నను నుత్సాహముగల వయస్సునందుండువారు. నీశక్తి కిట్టివాఁడొక్కఁడే చాలియుండఁగా నిరువు రట్టివారున్నారు. నీవంటి పిఱికిపంద యటువంటివారితో నేమి యుద్ధముచేయఁగలఁడు.

ప్రాయ మున్నంత మాత్రముననే లాభ మేమి? యుద్ధమునందు జయమిచ్చునది యిదియొకటియా యందువేమో, ప్రాప్తరూపులు. 'సింహోరస్కం మహాబాహు'మ్మన్నట్లు శత్రువులను గెలుచుటకు వారి కాయుధములతోఁ బనియేలేదు. వారు రిత్తచేతులతో వచ్చినను మీరు వారిని గెలువలేరు. వారి భుజములతీరు వక్షము సౌరు చూడఁగానే అబ్బా మహావీరు లని శత్రువులు భయపడి కాలికి బుద్ధిచెప్పుదురు. దేనిచే నిరూపింపఁబడుదురో యది రూపము. వీరు బాల్యమునుండి శత్రువుల గెలిచి కీర్తికి ముఖ్యస్థాన మను ప్రసిద్ధిగాంచినవారు. ఏ యప్రసిద్ధులను నెంతప్రయాసపడి గెలిచిరో యందువేమో సౌకుమార్యభాస్వరులు = అనాయాసముగ శత్రువుల గెలుచువారు. ఏసాహాయ్యముచే వారట్లు చేయఁగల రందువేమో.

మహాబలులు=దేహబలము మనోబలము ఉపాయబలము వీనిచేత "కిన్ను సాగరమేఖలాం మహీం దహతి కోపేన* కోపించి సముద్రములతోడి భూమిని నింకను దహింపలేదా యను నంతటి శక్తిసామర్థ్యముగలవారు. అంతియకాదు.

కం. ఈనిఖిలావని యక్షుల, దానవ రక్షఃపిశాచ పతులను వలతేఁ, భానుజ యంగుళి
కొనచే, నే నిమిషములోనఁ జిమ్మనే మిత్త్రిఁగనన్. యుద్ధ. అన్నట్టు లింత కార్యము చేయఁగలవారు. ఇట్టివారియెదుట నీ చతురంగబలముతో నీ వేమి చేయఁగలవు. అవమానము సహించి ప్రాణభీతి నింటనే యుండుము. అదే నీకు శరణము.

మహాబలులు=ఎంతకాలము నిద్రాహారాదులు వదలి యుద్ధముచేసినను శ్రమము గలిగింపని అతిబల మహాబల యను విద్యలు గలవారు. మీ రట్టు లాఁకలి దప్పు లోర్వఁగలరా? ఇది నీ కెట్లు తెలియునందువేమో.

విశదవారిజనేత్రులు - ఇన్ని సంవత్సరములుగ వా రెండలో గాలిలో వానలో మంచులోఁ దిరిగి తగిన నిద్రాహారములు లేక కాల్నడఁ దిరుగుచున్నను గొంచెమైన నేత్రకాంతి సౌందర్యము తగ్గినదికాదు. మనస్సునకు నేమిసంకటము దోఁచినను గన్నుల వలనఁ దెలియునుగదా! వారి కన్నులు నీటియందలి తామరలవలె నున్నవి. ఎంతటి శత్రులనైనను యుద్ధమందుఁ దృణప్రాయముగాఁ జూచువారు గావున వారికి వెఱపును గఱదలును లేవు. వీరుం డగుటఁ అన్నట్లు వారి కన్నులకు సంకోచ వికాసములు లేవు. ఎల్లవేళల నేకవిధముగానే యుండును.

'ప్రీతివిస్ఫారితేక్షణా' మ్మన్నట్లు వారి కన్నులు శత్రువులను జూచునపుడును క్రోధముచే నెఱ్ఱనగావు. క్రౌర్యము దోఁపదు. ఉత్సాహముచే మఱిమఱి యంతకంతకు వికాసము గల వగుచుండును. అయ్యో! వీ రెంతటి మతిహీనులు, శరణు అనిన

రక్షించెదనే, నిష్కారణముగ వీరు చావసిద్ధపడియున్నారే. పైబడి వచ్చినపుడు కొట్టకవిధిలేదు. నేనేమిచేయుదునని శత్రువుల విషయమందును 'రిపూణా మపి వత్సల' యన్నట్లు పరితాపమే యీయన కన్నులు తెలుపును.

వల్కలాజినాంబరులు=తాపసులంటివే,ఆకస్మికముగ పై పడిన నేమిచేయఁగల రందువా? దేహాభిమానము ప్రాణభయముగల భీరువులకుఁ గవచాదులు. వారి కవియనావశ్యకములు. వా రెప్పుడును నారవస్త్రమును నడుమునకుఁగట్టి కృష్ణాజినమును పైన బిగించియే యుందురు- వారి దేహరక్షణమున కవి చాలును. వానిని భేదించు మగవాఁడేఁడీ. 'ధనుషా యుధి శాత్రవాః' వింటిచేత రాముఁడు శత్రువులను గెలుచును. అని యుండుటచే వారికిఁ జేతవిల్లుండినఁ జాలును. కవచాదులు లేకున్న లోపములేదు. కనుక నీవు వారిమీఁదికి బోయితివా నేను ముక్కు కోయించుకొన్నరీతిని నీవు తల కోయించుకొందువు. కనుక నీ వింటనే యాఁడువారియెదుట దంభములు చెప్పుచుండుము. అదియే నీకు క్షేమమార్గము. నా యవమానము నేనెట్లైన సహింతును.

"ఒప్పని వాఁడైయైన, నొక యొప్పుమి దండితుఁడైనఁ దూఱఁగా నెప్పుడెఱుంగనే నెదుర నేనియుఁ జాటుగనేని రాముసిన్" అనునట్లుసర్వలోక స్పృహణీయుఁడైన శ్రీరాముని కల్యాణగుణములు మిత్రులకు నమిత్రులకుఁ గూడ నానందకరములు గావునఁ దాను విరూపతనొందినను ఆయన రూపగుణవర్ణనాదులచే నానంద మనుభవింపఁగోరి యిట్లు వర్ణించె నని మహేశ్వరతీర్థీయము.

అంకాడుట, అందు విధవయై అంకాడుట దుష్టకార్యమని యే యాఁడుదానికి దెలియదు? తెలిసియుఁ గామబలంబునఁ దానై పైపడిపోయి పురుషుని వరించియు నతఁడు నిరాకరించెనేని యది చెడ్డయవమానముగ నెంచి చిత్రాంగివలెఁ బ్రవర్తించుట దుష్టస్త్రీలయం దందఱయందు నుండుగుణమే. స్త్రీ మగవాఁడు తన్ను వలచి తన్నుఁ బ్రార్థింపవలయుననియే కోరుచుండును. అటువంటిది తానై కోరినను బురుషుఁడు నిరాకరించెనేని దానికిఁ గోపము రాకయుండునా! ఊర్వశి యర్జునుని శపింపలేదా? అట్లులే శూర్పణఖయును తన్నవమానించుటచే వారల దండింపవలయునన్న క్రోధముండినను శ్రీరామచంద్రమూర్తి సౌందర్యాదులను మనస్సునుండి తోసివేయఁజాలక మఱియు నా ధోరణినే చెప్పుచున్నది.

కం. భూవల్లభ చిహ్నాంకితు, లా వరగంధర్వనాయకాభులు వారల్
దేవతలో మానవులో, భావింపఁగ రాదు తేజు పరికించినచోన్. ౩౧౭

భూవల్లభచిహ్నాంకితులు = రాజచిహ్నములుగలవారు, వరగంధర్వ నాయకాభులు = శ్రేష్ఠుఁడగు గంధర్వరాజుతో సమానులు.

తాత్పర్యము.

తాము దశరథరాజకుమారులమని చెప్పిరికాని వారి తేజస్సు చూచిన వారి మాట నమ్మరాకున్నది. అయినను వారసత్యమాడువారుగారు. కావున వారి మాట

ప్రకారము వారు మనుష్యులో, నా యభిప్రాయము ప్రకారము దేవతలో చెప్పఁ జాలను. చూచుటకు రాజచిహ్నములు ధరించినను గంధర్వరాజుతో సమానులుగా నున్నారు.

కం. వారలమధ్యంబున నొక, నారీమణిఁ గంటిఁ దరుణి ♦ నవ్యమనోజ్ఞా
కార సమస్తాభరణో, దార సుమధ్యమ సరోజ♦దళనేత్ర నటన్. ౧౮

నవ్యమనోజ్ఞాకారన్ = క్రొత్తయగు నింపైన యాకారముగలదానిని, సమస్తాభరణోదారన్ = అన్నివిధములయిన సొమ్ములు ధరించుటచే గొప్ప దానిని, సుమధ్యమన్=సన్నని నడుముగలదానిని, సరోజదళనేత్రన్ = తామర రేకులవంటి కన్నులు గలదానిని, అటన్ = ఆ యాశ్రమమందు.

తాత్పర్యము.

ఆ యిరువురనడుమ నొక ప్రాయంపుఁబడుచును సమస్తాభరణములు ధరించిన దానిని సన్నని నడుము గలదానిని తామర రేకులవంటి కన్నులుఁగలదానిని జూచితిని. అటువంటి సుందరిని నే నిదివఱకుఁ జూచియుండలేదు.

కం. ఆ యువతి నిమిత్తంబుగ, నాయిద్దఱు నొక్కటగుచు ♦ ననతిం బలె నీ
చాయ ననాథయునుంబలె, బాయని దురవస్థలకును ♦ బాల్పఱిచి రయా. ౧౯

తాత్పర్యము.

ఆ పడుచు నిమిత్తమై వా రిద్దఱొక్కటై నన్ను అంకుటాలినివలె దిక్కులేనిదానివలె నిటువంటి దురవస్థల పాలుచేసిరి, అయా=తండ్రీ. జ్యేష్ఠభ్రాత కావున.

ఒకరు దండింపుమని చెప్పుట మఱియొకఁ డట్లుచేయుటచే నిరువు రేకీభవించిరని భావము.

సీతయెట్లు నిమిత్త మాయెనో యామెకుఁ దనకు నేమి సంబంధమో చెప్పినది కాదు. రావణునొద్దఁ జెప్పిన కారణ మిక్కడ నొప్పదు. మఱియేమి చెప్పుటకుఁ దోఁపలేదు. అంకుటాలినివలె ననుటచే అంకుటాలి కిది తగినశిక్షయని యేర్పడుచున్నది.

కం. ఆకుటిలశీలరక్తము, నీకహతులవారి నురువు♦నెత్తురుఁ దమిచే
నాకంఠముఁ గ్రోలఁగ ని,మ్మా కోరితి నిదియె మొదటి♦యభిలాష సుమీ. ౨౦

కుటిలశీలరక్తము=వంచనము స్వభావముగాఁగల యాసీతయొక్క నెత్తురును, అనీకహతుల = యుద్ధమందుఁ జంపఁబడినవారియొక్క, తమిచేన్ = కోరికదీర, ఆకంఠము=కుత్తుకబంటిగ, క్రోలఁగనిమ్మా=త్రాగునట్లుచేయుమా? మొదటి యభిలాష = ముఖ్యమైన యభిలాష.    తాత్పర్యము.

తాను రామలక్ష్మణుల వర్ణించినవిధమును బట్టియు తన పరిభవమునకు సీత యెట్లు నిమిత్తమయ్యెనో యదియు శూర్పణఖ చెప్పకుండుటచేతను నిది కండక్రొవ్వునఁ గాముకమైపోయి పరిభవింపఁబడెను. దీని కీ శిక్షన్యాయ్యమే యని ఖరుఁడు దలంచునేమోయని వాని సందేహము దీరుటకై తాను సీతాదేవి నెత్తురు ద్రావఁబోఁగా వారిరు

వురు తన్నుఁబరిభవించిరని చెప్పుచున్నది. దీని మాటలవలనను, నుత్తరకాండమందలి కుంభీనస వాక్కులవలన రాక్షసవిధవా స్త్రీలయందును జారత్వము విధవావివాహము గర్హ్యము లని యేర్పడుచున్నది.

ఆ కారణముచే నేను వంచనగుణము గల సీత నెత్తురు త్రాగవలెను. వారు జీవించియుండఁగా నది సాధ్యపడదు. కావున వారిని యుద్ధములో నీవు చంపవలెను. నురువుతోడి వారి నెత్తురు గొంతున కానునట్లు నేను ద్రాగవలెను. ఇది నాముఖ్యమైన కోరిక. దీనిని గొనసాగనిమ్ము.

ఇట్లు చెప్పుటచే దీనికి సీతయందుఁ గ్రోధమేకాని రామలక్ష్మణులకు దీనికిఁ బ్రత్యక్షసంబంధములేదని ఖరు డర్థము చేసికొనవలె నని దాని యుపాయము.

సీతానిమిత్తమై తన కిట్టిపరాభవము గలిగెననుట కేవల మసత్యముగాదు. సీతను జంపఁబోవుటచేఁగదా వారామె నిమిత్తమై దాని నిట్లు పరిభవించిరి. సీతలేకుండిన రామలక్ష్మణులు తన్ను భార్యగా గ్రహించియుందు రనియే దాని యభిప్రాయము. కావున దోషము సీతయం దారోపించెను.

మహేశ్వరతీర్థయమం దీ ఖరుని విషయ మిట్లు వ్రాయఁబడినది. "తస్మాద్యః క్రూరరూపేణ దేహేన హరతామృతమ్। విష్ణు ర్దాశరథి ర్భూత్వా, మోక్షయిష్యతి సువ్రత॥" అని విష్ణువు దశరథరాముఁడై పుట్టి శివశాపముచే రాక్షసత్వము నొందిన నీకు శాపమోక్షణము గావించునని యాయనచే ననుగ్రహింపఁబడిన చంద్రకాంతుఁడను యాజ్ఞవల్క్యుని కొడుకే ఖరుఁడు. ఆ కారణముచేతనే రామవృత్తాంతమును శూర్పణఖ చెప్పఁగా విని శ్రీరామచంద్రమూర్తి విష్ణువని యెఱిఁగి సపరివారముగ శ్రీరామచంద్రునిచేఁ జావఁగోరి చెల్లెలి ప్రీతికై పోలె యుద్ధార్థము రాక్షసులను బంపుచున్నాఁడు. ఈ సందర్భమున శేషధర్మములందలి భీష్మయుధిష్ఠిర సంవాదమందలి ఈ శ్లోకముల ననుసంధింపవలెను. భీష్ముఁడు - యాజ్ఞవల్క్యసుతారాజన్, త్రయోవై లోకవిశ్రుతాః। చంద్రకాంత మహామేధ, విజయా బ్రాహ్మణోత్తమాః। ఖరస్య దూషణ శ్చైతి, త్రిశిరా బ్రహ్మవిత్తమాః। ఆసన్ తేషాంచ శిష్యాంచ చతుర్దశ సహస్రధా॥ ధర్మరాజా! యాజ్ఞవల్క్యనకు చంద్రకాంతుఁడు మహామేధుఁడు విజయుఁడను ముద్వురు కొడుకులు గలరు. వారే ఖరుఁడు దూషణుఁడు త్రిశిరుఁడు ననువారైరి. వారి శిష్యులు పదునాలుగువేవురు రాక్షసులైరి. కావున వారి వాక్యములు బాహ్యదృష్టికి బరుషము లైనను వాస్తవమున సౌమ్యములే.

—♦ ఖరుండు పదునల్వురురాక్షసుల శ్రీరామునిమీఁదికిఁ బంపుట ♦—

చం. అన విని దానిమాటలకు ♦ నాగ్రహమెత్తి ఖరుండు క్రూరులన్
దనుజవరేణ్యులం బదియు♦నల్వుర నంతకతుల్య తేజులన్
గని యనె దుశ్చరిత్రయగు♦కామినితో మనుజుల్ శరాసనో
ద్ఘనులు మృగాజినాంబరులు ♦ దార్కొని నిల్చిరి దండకాటవిన్. 3_౨౧

అంతకతుల్యతేజుల౯ = యమునితో సమానమైన తేజస్సుగలవారిని, దుశ్చ రిత్రి—చెడునడవడిగలది- శరాసనోద్ధనులు=కోదండములను ధరించుటచే గొప్పవారు, మృగాజినాంబరులు = జింకచర్మము వస్త్రముగాఁగలవారు,దుశ్చరిత్ర=ఎటువంటి చరిత్రము కష్టసాధ్యమో యటువంటి చరిత్రముగలది సీతాదేవి. అనఁగా మహాపతివ్రత యని మహేశ్వర తీర్థీయము. తాత్పర్యము.

అని యిట్లు శూర్పణఖ చెప్పఁగా ఖరుఁడు కోపించి క్రూరులు యమునితో సమానులు, నగు పదునలుగురు రాక్షసులను జూచి దండకారణ్యమందు నొక చెడు నడవడిగల యాఁడుదానితో నిరువురు మనుష్యులు కోదండ ధరులు కృష్ణాజినములు గట్టినవారు వచ్చినవారు.

తే. వారు హతులుగ మాయక్క ♦ వాంఛపడియెఁ, జుండు నెత్తురు ద్రావంగ ♦ శూరులార
యప్పకోరికి దీర్పంగ ♦ నరుగుఁడనిన, వీరు లరిగిరి యాసతి ♦ వెంట రాఁగ. ౩౨౨

హతులుగ౯ = చంపఁబడఁగా, వాంఛపడియె = కోరెను, అప్ప = అక్క.

తాత్పర్యము.

వారు చంపఁబడఁగా వారినెత్తురు ద్రావ మాయక్క కోరుచున్నది. కావున మీరు మాయక్కకోరిక నెఱవేర్పఁబొం డనఁగా వారు శూర్పణఖ రామలక్ష్మణు లను జూపుటకై తమతోడరాఁగా దండకారణ్యమునకుఁ బోయిరి.

రహస్యార్థము, హతులుగ౯ = మనముచావఁగా, నెత్తురు ద్రావంగ౯=మన నెత్తురు ద్రావుటకుఁగోరుచున్నది. కావున మీరు హతులుగ౯ "హనహింసాగత్యోః" గత్యర్థము లన్నియు జ్ఞానార్థకములు గావున హతులుగాఁగ౯= తెలిసికోఁబడిన వారు అగుటకు, మీరుపోయి వారి వృత్తాంతముఁ దెలిసికొనిరండు పొండు. తీర్థీయాను సారము.

౨౦-వ సర్గము.

శా. వాతోత్క్షిప్తఘనోత్కరంబుపగిది౯ ♦ వా రేగి యాభ్రాతల౯
సీతాయుక్తుల నాశ్రమస్థలసమా♦సీనప్రభావంతుల౯
దైతేయాంగన చూపఁ జూచి రల సీ♦తానాథుఁ డా రాక్షసా
న్వీత౯ శూర్పణఖం గనుంగొని యను ♦ దీప్తాస్యుఁ డౌ లక్ష్మణున్. ౩౨౩

వాత = గాలిచే, ఉత్క్షిప్త = ఎగురఁగొట్టఁబడిన, ఘన = మేఘముల, ఉత్కరంబు=సమూహము, ఆశ్రమస్థల=ఆశ్రమ ప్రదేశమందు, సమాసీన=కూర్చుండిన, ప్రభావంతుల౯=తేజస్సుచేఁ బ్రకాశించువారిని, దైతేయాంగన = రాక్షసస్త్రీయగు శూర్పణఖ, రాక్షసాన్వీత౯ = రాక్షసులతోఁగూడిన దానిని, దీప్తాస్యుఁడౌ = కోపముతో మండుచున్న ముఖముగలవాఁ డగు.

తాత్పర్యము.

గాలిచే నెగురఁగొట్టబడిన మేఘములవలె వారువచ్చి సీతతోఁ గూడినవారిని, ఆశ్రమమందుఁ గూర్చుండిన తేజోవంతులగు నన్నదమ్ములను శూర్పణఖ చూపఁగా

జూచిరి. శ్రీరామచంద్రమూర్త్తి రాక్షసులతోఁడ వచ్చిన దానిని జూచి కోపముచే మండుచున్న లక్ష్మణునితో ని ట్లనుచున్నాఁడు.

ఉ. ఇంచుక నిల్వు మీ విచట ♦ నీయెలనాఁగను గాచి వీరలం
 ద్రుంచెద నన్న వల్లె యనఁ♦దూర్ణమ సజ్యశరాసనుండు నై
 కాంచనపుంఖబాణములఁ ♦ గైకొని కంజవిలోచనుండు దు
 ర్వ్యంచకరాక్షసాధములవంకఁ గనుంగొని పల్కె నీగతిన్. ౩_౨౪

ఇంచుక = కొంచెముసేపు, ఎలనాఁగను = స్త్రీని, సీతననుట, వల్లె = సరి. తూర్ణమ = త్వరగా, సజ్య = ఎక్కుపెట్టఁబడిన, శరాసనుండు = విల్లుకలవాఁడై, కాంచనపుంఖ = బంగారు పిడులుగల, కంజవిలోచనుండు = కమలములవంటికన్నులు గలవాఁడు. యుద్ధము తటస్థించినను నేత్రములందు వికారములేక మునుపటివలెనే యున్నవాఁడని భావము, దుర్వ్యంచక = చెడుమోసముగల.

తాత్పర్యము.

లక్ష్మణా! కొంచెముసేపు నీ విచట సీతను రక్షించుకొనుచుండుము. వీరి నేను జంపి వచ్చెదను. అని చెప్పఁగా నాయన యంగీకరించెను. అంతఁ గమలనేత్రుఁడగు శ్రీరామచంద్రమూర్త్తి విల్లెక్కుపెట్టి బంగారు పింజగల బాణములఁ దీసికొని ద్రోహులను రాక్షసులను జూచి యిట్లు చెప్పెను.

సీ. రామలక్ష్మణు లను♦భ్రాతల మే మల,దశరథు సుతులము ♦ దండకాట
 విని సీతతోఁ గూడ ♦ విహరింప వచ్చిన,వారము ఫలమూల♦వారభక్ష
 కులము తాపసులము ♦ లలి ధర్మరతులము, దాంతుల మే మిటు♦దండకవని
 నిచ్చ వసింతు మి♦ కేల మాపై మీరు, వచ్చుట మి మ్మఘ♦వర్త్తనులను
తే. మునులయాదేశమునఁ జేసి ♦ యనిని గిట్టి, వ్రచ్చి వధియింప వచ్చిన♦వార మేము
 ధైర్యవంతుల రేనియుఁ ♦ దలఁగకుండు, బ్రతుకుపై నాశ గలిగినఁ♦బాఱిపొండు.

ధర్మరతులము = ధర్మమం దాసక్తిగలవారము. దాంతులము=ఇంద్రియ నిగ్రహము గలవారము. అగుటచే మీవలె నొకరిని మేమై బాధించువారము గాము. అఘవర్త్తనులను=పాపపు నడవడిగలవారిని, కిట్టి=సమీపించి, వ్రచ్చి = చీల్చి.

తాత్పర్యము.

ఓ రాక్షసులారా! మే మన్నదమ్ములము, రామలక్ష్మణు లనువారము, ప్రసిద్ధుఁడైన దశరథమహారాజకుమారులము. ఈ దండకారణ్యమందు నీ సీతతో సంచారముచేయ వచ్చినారము; కందమూలఫలములను భక్షించువారము; తపస్సుచేయువారము; ధర్మమం దాసక్తిగలవారము. ఇంద్రియ నిగ్రహముగలవారము. కావున మావలన నెవ్వరికే కీడును లేదు. మాయిష్టప్రకారము మేము సర్వజనసాధారణమైన దండకయందు వసింతుము. మీయిండ్లయొద్దకైన వచ్చిన వారము గాము. మిమ్ము బాధించిన వారము గాము. ఇట్టి మామీఁద నిష్కారణముగ మీ రేల క్రోధమువహించి యిచ్చటికి వచ్చి

తిరి. ఇంత దండకారణ్యమున్నదే. అందే యెందైన నుండరాదా యందురేమో. మీరైౖ మమ్ముఁ జెనకితిరా మునులయాజ్ఞచే దుష్టవర్తను లగు రాక్షసులను మిమ్ము యుద్ధమందుఁ జంప వచ్చినవారము. మీరు ధైర్యముగలవారైతిరా నిలిచి యుద్ధము చేయుఁడు. బ్రతుకుమీఁదఁ గోరిక యుండెనా పాఱిపొండు, మిమ్ము బాధింపను.

కం. అన నాపదునల్వురు కిం,కను రాముని కిట్టు లనిరి ♦ కరముల వెలుఁగన్
సునిశితశూలాయుధములు, విను రామా! మేము వచ్చు♦వృత్తాంతంబున్. ౩౨౬

కింకను=కోపముచే, కరములన్ = చేతులందు, సునిశిత శూలాయుధములు= పదునుగల యీటెలను నాయుధములను.

తా త్ప ర్య ము.

ఆ పదునాలుగుమంది రాక్షసు లామాటవిని కోపించినవారై చేతఁ బదునైన శూలములు పట్టుకొని రామా మేము వచ్చిన వృత్తాంతము వినుము.

ఉ. కోపముఁ బుట్టఁ జేసితి వ♦కుంఠపరాక్రమవంతుఁడైన మా
భూపతికిన్ ఖరేంద్రునకుఁ ♦ బోయెద రెం దిఁకమీఁద మేనితో
నీ పదునల్వురం గదిసి ♦ యెక్కటి నిల్వఁగ నైన శక్యమే
యేపున సంగరస్థలిని ♦ నేద్దెఱ మార్కొను మాట లేటికిన్. ౩౨౭

అకుంఠపరాక్రమవంతుఁడు = మొక్కవోని పరాక్రమము గలవాఁడు, మేనితోన్=శరీరముతో, సంగరస్థలిని=యుద్ధ భూమియందు.

రహస్యార్థమున, పోయెద రెందిఁకమీఁద మేనితో, అనఁగా మీరు దేహమున్నంతవఱకు మాకు భయపడి యెక్కడికిఁ బోవలసిన పనిలేదు. ఇందే యథా సుఖముగా నుండవచ్చును. మీరు మమ్ముఁ జంపవచ్చితిరే మే మెట్టులిందు నుండఁగల మందురేమో, పదునల్వురన్ = ప్రథమార్థంబున ద్వితీయ, కావున నీ పదునాలుగురును ససహాయుఁడైన నిన్నుఁ గదిసి నిల్వఁగనైన సాధ్యమా, మా రాజు పంపెను, వచ్చితిమి, ఇఁక నీయొద్ద నిలుచుటకే సాధ్యముగానప్పుడు నీతో యుద్ధమునందు నెదిరించుట యనుమాటయేల? కావున నీవు సుఖముండవచ్చును.

తా త్ప ర్య ము.

రామా! పూర్ణపరాక్రమవంతుఁడైన మా ఖరమహారాజునకు మీరు కోపము వచ్చునట్లు చేసితిరి. ఇఁకమీఁద దేహముతో నెందుఁబోఁగలరు. మరణించి పోవలసిన వారే, ఈ వచ్చియుండు పదునాలుగురు రాక్షసులయెదుట నొంటరివాఁడవై నిలువఁగానైన నీకు సాధ్యమా? అదియే సాధ్యము గానపుడు మమ్మెదిరించి యుద్ధము సేయుట యనుమాట తలంపనేల.

—♦ శ్రీరాముఁడు పదునల్వురు రాక్షసులఁ జంపుట. ♦—

మ. ఇవె మద్బాహువిముక్త ఘోరపరఘా♦హీనోజ్జ్వలచ్ఛూలముల్
దవులన్ వీర్యము విల్లుఁ బ్రాణములు బే♦లా వీడు దం చంద ఱొ

క్కవడిం జిమ్మిన శూలసంఘములలో♦కస్తుత్యుఁ డాయన్నిటిన్
రవలై నేలఁ దొరంగ నేసెను సువ♦ర్ణస్ఫారబాణావళిన్. ౩౨౦

మద్బాహువిముక్త = మాబాహువులచే విడువఁబడిన, ఘోర = భయంకరమైన, పరిఘ = ఇనుపకట్లగుదియలు, అహీన = గొప్పవగు, ఉజ్జ్వలత్ = మెఱయుచున్న, శూలముల్ = శూలములు, తవులన్ = నిన్నుఁదాఁకఁగా, బేలా = మతిహీనుఁడా, ఒక్కవడిన్ = ఒక్కసారిగ, ఏకకాలమందు, లోకస్తుత్యుఁడు =లోకములవారిచే స్తోత్రముచేయఁబడినవాఁడు, రవలై = చిన్న చిన్నతునుకలై, తొందరగన్ = పడునట్లు, సువర్ణస్ఫారబాణావళిన్ = బంగారుచేఁ బ్రకాశించు బాణసమూహములచే

తాత్పర్యము.

ఇవె చూడుము, మేము ప్రయోగించు గుదియలు శూలములు నిన్నుఁ దాఁకఁగా నీవు వీర్యము విల్లు బాణములు నన్నియు వదలెదవు. అని యందఱొక్కసారిగ శూలములను విసరివైవఁగా జగద్వందితుఁడైన శ్రీరామచంద్రుఁడు బంగారు చెక్కఁబడిన బాణములచే వానినెల్లఁ జిన్నచిన్నతునుకలై నేల రాలఁగొట్టెను.

సీతాదేవి నిరపరాధుల రాక్షసులనైనను జంపరాదని బోధించియుండెను. దానిని శ్రీరామచంద్రమూర్తియు నామోదించెను. శూర్పణఖ నిర్నిమిత్తముగ సీతాదేవిని జంపవచ్చెను. కావున శ్రీరామచంద్రమూర్తి కాముకయగు విధవకుఁ జేయవలసిన శిక్షచేసి పంపెను. అది దేహబలము బంధుబలము గలది కావున రాక్షసులను గలహమునకుఁ దోడి తెచ్చెను "నసామరక్షస్సుగుణాయ కల్ప్యతే" యన్నట్లు రాక్షసులయందు సామము నిష్ప్రయోజనము, వారు దండైకసాధ్యులు, కావున రామచంద్రమూర్తి స్వరక్షణార్థము యుద్ధము చేయవలసి వచ్చెను.

ఇప్పుడు రాక్షసులు తన్నుఁజంప నాయుధములు ప్రయోగించి ప్రథమాపరాధులైరి. వీరును సామసాధ్యులుగారు. కావున వారి యాయుధములను దొలుత ఖండించి తరువాత వారినే వధించుచున్నాఁడు.

ఉ. ఏసియు నంతఁ బోక మను♦జేంద్రవరుండు శిలాశితార్కభా
భాసుర రుక్మపుంఖశిత♦బాణచతుర్దశ మూని వింటఁ గ్రూ
రాసురసంహతిం గని బ♦లారి శతారమునట్లు వైవఁగా
దూసి యురంబులన్ ధరణిఁ♦ దూఱె శరంబులు, రాక్షసాధముల్. ౩౨౧

శిలాశిత = (1) ఒఱపు రాతిమీఁదఁ బదునుపెట్టఁబడిన (2) రాతియందును వాఁడియైనది. అనగాఁ బాషాణములనైన భేదించునది, అర్కభా = సూర్యకాంతితో, భాసుర = ప్రకాశించు, రుక్మపుంఖ = బంగారు పింజగలిగిన, శిత = కఱకైన, బాణచతుర్దశము = పదునాలుగు బాణములను, వింటన్ = ధనుస్సునందు, ఊని = సంధించి, క్రూర = కఠినచిత్తులై హింసచేయు, ఆసుర = రాక్షసుల, సంహతిన్ = సమూహమును, బలారి = ఇంద్రుఁడు, శతారము = నూఱంచులుగల వజ్రమును.

తాత్పర్యము.

రాక్షసుల శూలములు తునుకలై పోవునట్లు వేసియు నంతతో నూరకుండుట ప్రమాద మని తలఁచి వారిపైఁ బదునై మెఱుఁగు లీనుచు సూర్యునివలెఁ బ్రకాశించు బంగారు పిడులుగల పదునాలుగు బాణములను బ్రయోగింపఁగా నవి వారి ఱొమ్ము లందు దూఱి వీఁపున వెడలి నేలపై రాలెను.

తే. ఛిన్నమూలద్రుమంబుల♦చెలువు దోఁప, శోణితార్ద్రాంగులై గత♦ప్రాణు లగుచుఁ
బడిరి పుడమిని వారల♦పాటు చూచి, భీతిఁగొని పాఱె నాచుప్ప♦నాతి మరలి. 330

ఛిన్నమూల=వేళ్లు ఛేదింపఁబడిన, ద్రుమంబుల=చెట్లయొక్క, శోణితార్ద్రాంగులై=నెత్తుటిచేఁ దడిసిన శరీరములు గలవారై, గతప్రాణులు=ప్రాణములు పోయిన వారు, పుడమిని=నేలమీఁద, చుప్పనాతి=శూర్పణఖ.

తాత్పర్యము.

ఆ రాక్షసాధములు వేళ్లు ఛేదించినఁ బడుచెట్ల వలె నెత్తుటఁదడిసిన దేహము లతోఁ బ్రాణములు పోయినవారై భూమిమీఁద బడిరి. వారట్లు పడఁగాఁజూచి భయ పడి శూర్పణఖ తిరిగి పరుగెత్తెను.

రాక్షసుల శూలములు విఱిసి పడఁగా వారు నిరాయుధులైరి కదా వారిని రామ చంద్రమూర్తి వధించుట న్యాయ్యమా? వారు నిరాయుధులుగారు. పరిఘములు వారి యొద్ద నున్నట్లు మీఁదఁ జెప్పఁబడెను. అదిగాక రాక్షసు లాయుధములు లేకున్నను జేతులతోఁగూడ యుద్ధముచేయుదురు. అట్టివారు నిరాయుధులా? వాలిసుగ్రీవులే యాయుధములతో యుద్ధముచేసిరి? శూలము విఱిగిన తరువాతఁ గుంభకర్ణుఁ డేయా యాయుధములతో యుద్ధము చేసెను? కబంధుఁ డేయాయుధములు గలవాఁడు? నిరా యుధు ననఁగా యుద్ధము చేయలేక ప్రథమయుద్ధమందు రావణువలె నిలఁబడిన వాని విషయమేకాని యాయుధము లేకున్నను యుద్ధోన్ముఖుఁడైన వాని విషయముగాదు. అట్లుగాదేని శత్రువులు ముష్టులచేఁ గొట్టుచున్నను, గొంతు పిసుకుచున్నను నిరాయు ధులని సహించి యూరకుండవచ్చునా?

౨౧-వ సర్గము.

తే. పెద్దపెట్టున నఱచుచు ♦ భీషణముగ, నాజనస్థానమందు ఖ♦రాసురారి
సన్నిధిని బడ నిర్యాస♦సల్లకియన, నాయనర్థసమాగత ♦ కనియె నతఁడు. 331

పెద్దపెట్టునన్=గట్టిగా, భీషణముగన్=భయంకరముగ, జనస్థానమందు=దండ కారణ్యమునందు నిప్పుడు రాక్షసు లుండు స్థలము. ఆ యడవిపైకి జనులకు వాసయో గ్యమైనస్థలము. దీనిచరిత్ర ముత్తరకాండమునఁగలదు. నిర్యాసనల్లకి=బంక కాఱు చున్న యందుగు తీఁగవలె, అనర్థసమాగతకు=రాక్షసనాశనముకై వచ్చినవానికి, జన స్థానము=ఖరుని రాజధాని త్రికంటకము ఇప్పటి త్ర్యంబక మనిరొందఱు. ఇది నాసి కకు సమీపమున నున్నది. నాసికయే పంచవటి యగునేని రెండు సంవత్సరముల కాల

మంత సమీపముననున్న వారిని రాక్షసులెఱుంగకుండిరనుట విశ్వాసపాత్రముగాదు.

తా త్ప ర్య ము .

భయంకరముగ గట్టిగ నఱచుచు నేడ్చుచు జనస్థానమందున్న ఖరాసురుని యెదుట బంక కాఱుచున్నయందుగుతీఁగవలెఁ బడఁగా రాక్షసనాశమునకై వచ్చిన దానినిజూఁచి ఖరుఁ డిట్టు లనియెను.

ఉ. ఏమిటి కేడ్చెదే మరల ♦ నెంతయు శూరుల రాక్షసేంద్రులన్
నీమత మాచరింప నటు ♦ నీబడిఁ బంచితిఁ గాదె? వారలో
మామక భక్తులున్ హితులు ♦ మానరు కార్యముఁ జేయకుండ ధై
ర్యామలులున్ సురక్తు లప♦రాజితు లాహవభూమి సోదరీ ! 33౨

అపరాజితులు=పరాజయము నొందనివారు.

తా త్ప ర్య ము .

దేనికే మరల నేడ్చుచు వచ్చితివి? నీకోరిన ప్రకారము మిగుల శూరు లయిన రాక్షసశ్రేష్ఠులను నీ యిష్టప్రకారము చేయుటకు నీ వెంటనే పంచితినిగదా? ఇంకను నేడువనేల? ఆ పదునాలుగురు నాయందు భక్తిగలవారు నాహితము గోరువారు. నేను జెప్పిన కార్యము చేయకమానరు. మిగుల ధీరులు. అనురాగము గలవారు. యుద్ధము నందుఁ బరులకు జయింపరానివారు.

కం. ఈయేడ్పునకుం గారణ, మేయది? హానాథ యనుచు ♦ నిటు పొర్లెద వే
లా యాశీవిషభామిని, చాయను ధర వ్రాలి? చెప్పుము ♦ సందర్భంబున్. 333

ఆశీవిషభామిని=ఆఁడుపాము. హా నాథ యనుటచే నామగఁడుండిన నాకిట్టిగతి వచ్చి యుండునా యని భావము.

తా త్ప ర్య ము .

అయ్యో! నాథా యని యాఁడుపామువలె నేలఁబడి పొరలిపొరలి యేడ్చెదవే? ఏమి కారణము మరలఁ గలిగెనే? ఉన్న విషయమేమో చెప్పుము.

కం. దిక్కై నే నుండఁగ నిల, దిక్కెవ్వరు లేనియట్లు ♦ దీనత నేలా
స్రుక్కెదు లే లెమ్మిఁక నా, కక్కడికథఁ దెలుపు విడువు ♦ మాత్మను భీతిన్. 33౪

తా త్ప ర్య ము .

దీనురాలవై యయ్యో! నాకు దిక్కెవ్వరులేరే యని యేడ్చెదవేల? నేనున్నాను గదా దిక్కు. లేవే! అక్కడ నేమిజరిగెనో చెప్పవే? భయము వదలవే?

ఆ. అనినఁ గనుల నీరు ♦ హస్తతలంబులఁ, దుడిచికొనుచు లేచి ♦ తోడఁబుట్టుఁ
జూచి యనియె నాదు♦సూడు దీర్పఁగఁ బదు, నలువు రసురవరుల♦బలుల నీవు. 33౫

సూడు=పగ.

తా త్ప ర్య ము .

అని ఖరుఁ డడుగఁగాఁ గన్నీరు చేతులతోఁ దుడిచికొనుచులేచి కూర్చుండి తోడఁబుట్టువును జూచి నాపగ దీర్చుటకై నీవు బలవంతులనే పదునలువుర రాక్షసులఁ బంపుట నిజమే.

—♦ శూర్పణఖ ఖరుని రామునిమీఁదికి యుద్ధమునకుఁ బోవఁ బ్రేరించుట ♦—

చం. పనుచుట నిక్క, మాయసుర♦వర్యులు రామనిశాతఘోరరో
పనికరదారితాంగు లయి ♦ వ్రాలఁగ నేల క్షణంబులోన భీ
తిని గొని పర్వువాఱితిని ♦ దెప్పెన నీకడ, కేమి చెప్పెదన్
దనువునఁ గంప మిప్పటికి ♦ దాఱ దొకింతయుఁ జూడుమా ఖరా. ౩౩౮

రామ=రామునియొక్క, నిశాత=పదునైన, ఘోర=భయంకరమైన, రోప=బాణములయొక్క, నికర = సమూహముచే, దారిత = చీల్చఁబడిన, అంగులు=దేహములుగలవారు, తాఱదు=తగ్గదు.

తాత్పర్యము.

అయిననేమి నీవు పంపినవారు రాముని పదునై భయంకరములైన బాణములచేఁ జీల్పఁబడిన దేహముగలవారై క్షణకాలములో నేలఁబడి చచ్చిరి. అది చూచి యిఁక నక్కడనుండిన నన్నేమిచేయుదురో వెంటఁబడుదురో యను భయముచే, గాలికొలఁది పరువెత్తి వచ్చితిని. అప్పుడు పుట్టినవణఁ కిప్పటికిఁ దగ్గలేదు. ఖరుఁడా! చూడుము. నామాట యసత్యమేమో ?

తే. ఘనతరవిషాదనక్రసం♦కలిత మగుచు, మహితతరపరిత్రాసోర్మి♦మాలి యయిన
భూరిదుఃఖాంబునిధిలోనఁ♦దీర మునిఁగి, యున్న నన్నుద్ధరింపుమా♦ యూఱడించి.

ఘనతర = మిక్కిలి గొప్పదియగు, విషాద = ఏమియుఁ దోఁపకుండఁజేయు మనోదుఃఖమనెడి, నక్ర=మొసళ్ళతోడ, సంకలితము=కూడినది, మహితతర=మిక్కిలి గొప్పదగు, పరిత్రాస = భయమనెడి, ఊర్మి = అలలయొక్క, మాలి = వరుసగలది, తీరన్=పూర్ణముగ, ఉద్ధరింపుము=లేవఁదీయుము.

తాత్పర్యము.

గొప్ప విషాదమను మొసళ్ళను మహాభయమనెడు నలలనుగలదైన పెద్ద దుఃఖమను సముద్రములో మునిఁగిన నన్ను లేవఁదీయుము.

ఉ. నీ కయి కూలినట్టిరజ♦నీచరముఖ్యులయందు నాపయిన్
నీ కొకయింతయేని దయ ♦ నిక్కముగా మదిఁ గల్గె నేనియున్
నీకును రామునిం దొడరి ♦ నిల్వ బలంబు దిటంబు నున్న నే
దీ కనుఁగొందు వెల్వడుము ♦ దెప్పెన జంప నిశాటకంటకున్. ౩౩౯

నిశాటకంటకున్=రాక్షసులపాలికి ముల్లైన వానిని.

తాత్పర్యము.

నీపనికై పోయి చచ్చిన రాక్షసులందు తోఁబుట్టిన నాయందు నీకుఁ గొంచెమైన దయ నిజముగానుండెనా, నీవు రాముని నెదిరించి యుద్ధముచేయ ధైర్యముండెనా, యేదీ చూతును తత్క్షణమే యారాక్షసులపాలికి ముల్లైన రామునిమీఁదికి యుద్ధమునకై బయలుదేఱుము.

చచ్చిన రాక్షసులమీఁదను బ్రదికియుండు నా మీఁదను దయ లేకున్నను రాము నెదిరించి యుద్ధముచేయు ధైర్యము లేకున్నను నాతోపాటు నీవు నింటనేయుండుము. నే నేడ్చుచునుందును. నీవు సంతోషముగ నవ్వుచుండుము. ఆయన నిశాటకంటకుఁడు గావున నీ విటఁ గూర్చుండినను నిన్ను విడువఁడు. ఎప్పటికైనను బ్రక్కముల్లు గ్రుచ్చుకొనక యూరకుండునా?

కం. నాకుం బగవాఁ డగునా, కాకుత్స్థుని నీవు చంపఁ ♦ గడఁగవయేనిన్
బోకడపెట్టుదుఁ బ్రాణము, నీకడ నే నిపుడు నిజము ♦ నిరపత్రప నై. ౩౯

కడఁగవయేనిన్ = ప్రయత్నముఁ జేయక పోయితివా? పోకడపెట్టుదున్ = పోఁగొట్టుకొందును, నిరపత్రపనై = అవమానము విడిచినదాననై.

తా త్ప ర్య ము.

నాకు శత్రువగు శ్రీరామచంద్రమూర్తిని నీవు చంపఁ బ్రయత్నింపక పోయితివా నీవు చూచుచుండ నీ యెదుటనే ప్రాణములు వదలుదును. ముక్కు చెవులు గోయించుకొనియుఁ బగదీర్చుకొననేరనేని యీ యవమానపు బ్రతుకు బ్రదుకుటకంటెఁ జచ్చుటమేలుగదా?

క. నీవును నీసైన్యముతో, నావీరుని ముందల సంగ ♦ రావని నిలువన్
లే వని నామదిఁ దోఁచెను, నీ వెచ్చట నాతఁ డెచట ♦ నెటి బలధృతులన్. ౪౦

తా త్ప ర్య ము.

నా యారాటముకొలఁది నేను చెప్పుచున్నానుగాని వాస్తవ మాలోచించిన నీవు నీ సేనతోడఁ బోయినను యుద్ధభూమియందు నాయన యెదుట నిలువలేవని తోఁచుచున్నది. ఆయనబలము ఆయన ధైర్యమది యెక్కడ? పిఱికిపందవు, దుర్బలుఁడవు, నీ వెక్కడ?

పౌరుషము హెచ్చింప నిట్లు చెప్పుచున్నది. ఈ కుయుక్తులు పౌరుషోద్రేకకరములగు వాక్కులు స్త్రీలయందు దండి. నిష్ఠుర మగువారిభావము దెలిసికొనలేక ముందు వెనుక లాలోచింపక చెవులు వ్రేలవేయువారు ఖరునివలెఁ జెడుటయు సిద్ధము. స్త్రీలు విశేషస్వార్థపరలు. తమకార్యము నిమిత్తమై యెంత సాహసమైన నెట్టి యకార్యమైనఁ జేయుదురు. చేయింతురు. స్త్రీబుద్ధిః ప్రలయంకరి యనుట సత్యము. ఆఁడుదాని మాటలు విని ముందువెనుక లాలోచింపక కలహమునకు దిగువాఁడు ఖరుఁడే (మగగాడిద). ఎవరెట్లు పాడైపోయినను దమపట్టు సాగవలె ననియే వారిపట్టుదల. దీనికై యెన్ని వేషములైన వేయుదురు.

ఆ. శూరమాని వీవు ♦ శూరుండవా కావు, బలము గల దటంచు ♦ భ్రాంతి పడెదు
రాక్షసుండ వయ్యు ♦ రామలక్ష్మణులను, మానవులను జంపఁ ♦ బూనలేవు. ౪౧

దానినే యింకను విస్పష్టముగాఁ జెప్పుచున్నది.

శూరమానివి = శూరుఁడ నని నీవు ప్రగల్భములు చెప్పితివికాని నీవు నిజమైన

శూరుఁడవు కావు. నీకు బలము గలదని నీకు భ్రమమాత్రము గలదు గాని వాస్తవమున నీకు బలములేదు. మనుష్యులను దిను రాక్షసుఁడవుగాఁ బుట్టియు లక్షలుగారు కోట్లుగారు ఇరువురు మనుష్యు లింత యవమానపఱచి నిన్ను ధిక్కరించి నీవారిని జంపినను వారిని జంప నీవు యత్నింపలేకయున్నావు. వాస్తవ శూరుఁడు బలశాలి యిట్లింత సే పూరకుండునా?

ఉ. రామునితోడ డీకొన దు♦రంబున నీకును శక్తి గల్గినన్
 భీమబలంబుతో వెడలు ♦ వేగ, బలంబు దిటంబు లేని నీ
 కీ మహితాటవీస్థలము ♦ నేటికిరా? కులపాంసనా? వెసన్
 బో మరి యొండుచోటి కిటఁ ♦ బూడ్చును రాముఁడు జాగు చేసినన్. ౩౭౨

తాత్పర్యము.

నాకేమి! బలశౌర్యములు లేకపోవుటయేమి!! దేవతలను జయించినవాఁడనందువా? అట్లైన నేఁడి నీ బలశౌర్యములు చూతము, వెంటనే శ్రీరామచంద్రుని యుద్ధమున నెదుర్కొన సేనతో బయలుదేఱుము. అటుచేయఁ జాలవైతివా బలము ధైర్యములేని పిఱికి పందకు నీకీ దండకాటవి యేమిటికిరా? ఓరి కులదూషకా! రాక్షస కులమునకు నపకీర్తి తెచ్చుటకుఁ బుట్టితివా? ఇఁక నిక్కడ జాగుచేసితివా? అదిగో రాముఁడు వచ్చుచున్నాఁడు. నిన్నిక్కడనే పూడ్చును. మఱియొక చోటికిఁ బరువెత్తుము.

ఉ. ఏ మనుకొంటివో రఘుకు♦లేశ్వరు రాముని వాని తమ్మునిన్
 నాముకుపీనులన్ నఱకి ♦ న న్నిటుచేసిన వీరు నంచు ను
 ద్దామపిచండ చండిక యు♦దారతఁ గడ్పును మోఁదికొంచు దుః
 ఖామితతప్తయైన నసు♦రాధిపుఁ డిట్లను నానెలంతకున్. ౩౭౩

ఉద్దామపిచండ = పెద్దకడుపుగలది, చండిక = మొండికోపముగలది.

తాత్పర్యము.

నా ముక్కు సెవులుగోసి నన్నిటు లవమానించిన వీరుని రఘువంశనాయకుని శ్రీరామచంద్రమూర్తిని ఆయన తమ్ముని లక్ష్మణుని నీ వేమని తలఁచితివిరా? సామాన్య మనుష్యు లనుకొంటివా? పదిమంది నూఱుమంది యాయనను గెలువఁ గలరని తలఁచితివా? అని చెప్పి పెద్దపొట్టగల యాచండి దబాదబా యని పెద్దనగారా వాయించి నట్లు కడుపుమీఁద బాదుకొనుచు దుఃఖాగ్నిచేఁ దపించుచుండఁగా రాక్షసనాయకుఁడు దాని కిట్లనెను.

౨౨-వ సర్గము.

—♦ ఖరుఁడు సేనతోడ శ్రీరామునిమీఁదికి యుద్ధమునకుఁ బోవుట ♦—

చ. భవదవమానసంజనిత♦బాధమదాగ్రహమున్ సమృద్ధిమ
 ల్లవణపయోధిభంగిని ద♦లం బిఁకఁ గా దణఁగింప, హీనమా
 నవు నొక క్షీణజీవితు మ♦నంబున రాముని లెక్క గొందు నే
 భువిఁ దనదుష్టచేష్టలనె ♦ పోయెడిఁ గాక స్వనామశేషుఁడై. ౩౭౪

భవత్=నీయొక్క, అవమాన = పరాభవముచే, సంజనిత= పుట్టిన, బాధ = అధికమైన, మత్=నాయొక్క, ఆగ్రహముః = కోపమును, సమృద్ధిమత్ = ఉప్పొంగి వచ్చుచున్న, లవణపయోధిభంగిని=ఉప్పునీళ్ళ సముద్రమువలె, తలము = సాధ్యము, 'తలమే బ్రహ్మకునైన' నని అల్లసానిపెద్దన్న, హీనమానవుః=నీచ మనుష్యుని, క్షీణ జీవితుః=క్షయించిన యాయువు గలవానిని, స్వనామశేషుఁడై=తన పేరు మాత్రము లోకమున నిలిచినవాఁడై.

తాత్పర్యము.

నా తోఁబుట్టువగు నిన్ను నవమానపఱిచిరన్న యవమానముచేఁ బుట్టినకోపమును, పొంగవచ్చు సముద్రము నణపరానట్లు లణఁపసాధ్యపడదు. నీచమనుష్యుని చచ్చినవారితో సమానుఁడైనవానిని నేను లక్ష్యపెట్టుదునా? వానిని నేను జంపవలసిన పనిలేదు. వాని దుష్టచేష్టలచే వాఁడే లోకమునఁ జంపబడును. ఇట్టివాఁ డిట్టి కార్యము చేసి చచ్చె నని పేరుమాత్రము నిలుచును.

ఉ. ఏడువ కేల యేడ్చెద వి♦దే చని రాము సహానుజుః జముం
గూడఁగఁ బంపువాఁడఁ జుమి ♦ క్రూరకఠోరకుఠారధార న
క్కీడరివేఁడినెత్తురులు ♦ కేలికొలందిని జుఱ్ఱుకొమ్ము నీ
నూడు దొలంగ నన్న విని ♦ శూర్పణఖాసతి హృష్టచిత్తయై. ౩౪౫

జముః= యమధర్మరాజును, క్రూర=పదునైన, కఠోర=కఠినమైన, కుఠార = కత్తియొక్క, ధారః=వాదరచే, కీడరి=కీడుచేయువాని, నూడు=పగ, హృష్టచిత్తయై సంతోషించిన మనస్సుగలదై.

తాత్పర్యము.

ఏలయేడ్చెద వేడువకుము. ఇదిగో సిపుడేపోయి తమ్మునితోడ రామచంద్రుని నా పదునై కఠినమైన కత్తిచేఁ జంపెదను. ఆ దుష్టుని వేఁడివేఁడి నెత్తురులు చేతుల కొలంది నీపగదీర జుఱ్ఱుకొమ్ము. అని చెప్పఁగా విని శూర్పణఖ సంతోషించినదయ్యెను.

క. వెండియు మార్ఖ్యంబున ఖరుఁ, గొండాడిన నతఁడు రేఁగి ♦ క్రూరతతోను
చ్చండుని దళవాయిని బలు,గండని దూషణునిఁ జూచి ♦ కడువడిఁ బలికెన్. ౩౪౬

కొండాడినః=పొగడఁగా, రేఁగి=విజృంభించి, ఉచ్చండునిః= మిగుల భయంకరుని, దళవాయినిః=సేనానాయకుని, బలుగండనిః=మిగుల పౌరుషము గలవానిని, కడువడిః= మిగుల తొందరతో.

తాత్పర్యము.

అట్లు వాఁడు చెప్పినదానితోఁ దృప్తిపడి యూరకుండక పట్టినపట్టు సాధింపవలయునన్న తలంపుతో నది మిగులఁ బొగడెను. వాఁడు క్రోఁతికి సారాయము పోసినట్లుగా విజృంభించి మిగుల పౌరుషము కోపముగల సేనానాయకుని దూషణుఁ డనువానిని జూచి మిగులఁ దొందరపాటుతో.

సీ. పదునాల్గువేవుర ♦ బలభీమవేగుల, సమరానివర్తుల ♦ సాహసికుల
నీలజీమూత స♦న్నిభవర్ణదేహులఁ, గ్రూరుల హింసావి♦హారరతుల
సింహవిక్రముల మ♦చ్చిత్తానువర్తుల, నుద్యోగవంతుల ♦ నుగ్రబలులఁ
గూర్పుమీ వేగమ ♦ కోదండశరఖడ్గ, వివిధసాధనముల ♦ వెలయునట్టి
తే. మద్రథంబును గొనిరమ్ము ♦ మహితతేజ
చనుదు మున్నుగఁ బౌలస్త్య♦సంతతులకుఁ
జావు గూడఁగ శ్రీరామ♦చంద్రునకును
జయము వెలయఁగఁ బేర్కొందు ♦ జగములందు. 382

బలభీమవేగులన్=బలముచే భయంకరమైన వేగముగలవారిని, సమరానివర్తులన్=యుద్ధమునందు వెనుకదీయనివారిని, సాహసికులన్ = తెంపుగలవారిని, నీలజీమూత సన్నిభ వర్ణదేహులన్=నల్లమేఘమువంటి కాంతిగల దేహములు గలవారిని, క్రూరులన్ = దయలేనివారిని, హింసావిహారరతులన్ = హింసచేయు క్రీడలయందుఁ బ్రీతిగలవారిని, సింహవిక్రములన్ = సింహము పరాక్రమమువంటి పరాక్రమము గలవారిని, మచ్చిత్తానువర్తులన్=నామనస్సు చొప్పున నడచువారిని, ఉద్యోగవంతులన్=యుద్ధమునం దెక్కువ ప్రయత్నమును గలవారిని. ఉగ్రబలులన్=భయంకరమైన బలముగలవారిని, పౌలస్త్యసంతతులకున్=పులస్త్యవంశమునఁ బుట్టినవారి గుంపునకు, పేర్కొందున్ = ప్రసిద్ధి వహించెదను.

తా త్ప ర్య ము .

బలముచే భయంకరమైన వేగము గలవారిని, యుద్ధమునందు వీఁపు చూపనివారిని, సాహసవంతులను, నల్లని మేఘమువంటి వన్నెగల దేహముగలవారిని, దయలేనివారిని, హింసచేయు క్రీడలయందుఁ బ్రీతిగలవారిని, సింహమువలెఁ బరాక్రమించువారిని, నాయిష్టము చొప్పున నడచువారిని, రణప్రయత్నముగలవారిని, భయంకరమైన బలముగలవారిని పదునాలుగువేల రాక్షసులను శీఘ్రముగ సమకూర్పుము. విండ్లు, బాణములు, కత్తులు, ఇత రానేకాయుధములు గల నా తేరిని దీసికొని రమ్ము. పౌలస్త్యవంశమునఁబుట్టిన యీ రాక్షసులకు ముందుగా నేఁ బోదును. నావెనుక వారు రావచ్చును. శ్రీరామచంద్రునకుఁ జావు గూడునట్లుచేసి జయముఁ గైకొని లోకమునఁ బ్రసిద్ధి వహింతును. ఇది వాఁ డనుకొన్నవిధము. వాఁ డన్న మాటలకు వేఱొక యర్థముగలదు. పౌలస్త్యసంతతులకుఁ జావు గూడఁగ, శ్రీరామచంద్రునకు జయము వెలయఁగ నేను ముందుగాఁ బోదును. శ్రీరామునిచేఁ జచ్చి లోకమునఁ గీర్తిని సంపాదింతును. సత్యావాణీ సరస్వతీ యని కలదుగదా ? కాఁగలది ముందుగానే సరస్వతి వాని నోరఁ బలికించెను.

చం. అన విని దూషణుండు పఱిశ♦యార్కనిభంబు మహారథంబుఁ జ
య్యన శబళాశ్వయుక్తముగ ♦ నాతని మ్రోలను నిల్పఁ దప్తకాం

చనలసితంబు హేమమయ♦చక్రము మత్స్యసుమద్రుమాద్రిప
క్షినికరచంద్రసూర్యగము♦ గేతనఖడ్గకృపాణకింకిణీ
వినిచయయుక్తమున్ రథము♦ వే ఖరు డెక్కె నమర్షచిత్తుఁడై. ౩౮౮

ప్రలయార్కనిభంబు=ప్రలయకాలమందలి సూర్యునితో సమానము, శబల+అశ్వయుక్తముగ = నానావర్ణములుగల గుఱ్ఱములు కట్టఁబడిన దానినిగా, తప్త=పుటము వేయఁబడిన, కాంచన=బంగారమువలె, లసితంబు = ప్రకాశించునది, హేమమయచక్రము = బంగారుమయమైన గాండ్లుగలది. మత్స్య...సూర్యగము = బంగారుతోఁ జేయఁబడిన చేఁపలు చెట్లు పూలు కొండలు పక్షిసమూహములు చంద్రుఁడు సూర్యుఁడుగలది, కేతన=ధ్వజము, ఖడ్గ=బాకు, కృపాణ=కత్తులు, కింకిణీవినిచయము=చిఱుగజ్జెల సమూహము, వీనితో యుక్తముగ = కూడినది, అమర్షచిత్తుఁడై = కోపముతోఁ గూడిన మనస్సుగలవాఁడై.

తాత్పర్యము.

ఆ ప్రకారము ఖరుఁడు చెప్పఁగా విని దూషణుఁడు ప్రలయకాలమునాఁటి సూర్యునితో సమానమైన నానావర్ణములుగల గుఱ్ఱములను గట్టిన తేరిని నతని ముందటఁ దెచ్చి నిలిపెను. ఇట్లు నిలుపఁగాఁ బుటము వేసిన బంగారువలెఁ బ్రకాశించునదియు బంగారు మయములైన చక్రములు కలదియు బంగారుతోఁ జేసిన చేఁపలు పూలు చెట్లు కొండలు పక్షులు సూర్యుఁడు చంద్రుడు ఇటువంటి బొమ్మలచేఁ గట్టఁబడినదియు, ధ్వజము బాకులు కత్తులు మువ్వలుగలదియు నగు తేరిని గోపముతో ఖరుఁ డెక్కెను.

ఉ. అంతట దూషణుండును మ♦హాధ్వజినీయుతుఁడై ఖరేంద్రుత
ప్రాంతముఁ జేరి నిల్వ నతఁ♦ డాజ్ఞ యొసంగెఁ జనంగ నంత దు
ర్దాంతజవంబునం గదలె♦ రావము దిక్కులఁ బిక్కటిల్ల సం
భ్రాంతము లౌచు సత్త్వములు♦ బమ్మెరపోవఁగ సొమ్మసిల్లఁగన్. ౩౮౯

మహాధ్వజినీయుతుఁడై = గొప్ప సేనతోఁగూడినవాఁడై, ఖరేంద్రుతప్రాంతము=ఖరాసురునిప్రక్కన, దుర్దాంతజవంబునన్=అణఁపరాని వేగముతో, రావము=ధ్వని, సత్త్వములు=అడవిమృగములు, బమ్మెరపోవఁగన్ = భ్రమశబ్దభవము బమ్మెర. భ్రమగొని తిరుగుడువడఁగా, సొమ్మసిల్లఁగన్=మూర్ఛపోయి కూలఁగా.

తాత్పర్యము.

ఖరుఁడు తేరెక్కఁగా దూషణుఁడు గొప్ప సేనతో ఖరుని ప్రక్కన నిలువఁబడెను. అప్పుడు సేన కదలనిమ్మని ఖరుఁ డాజ్ఞాపింపఁగా నడ్డములేని వేగమున సేన పయనమయ్యెను. ఆధ్వని దిక్కులందెల్ల మిక్కుటము గాఁగా నడవియందలి మృగములు తత్తఱపాటుతోఁ గొని దిగ్భ్రమగొని యెటుపోవుటకుఁ దోఁపక తికమకలాడెను. కొన్ని భయమున మూర్ఛపోయెను.

ఉ. భాసుర శూలముద్గరకృ♦పాణపరశ్వధఖడ్గవజ్రఘో
రాసిక పట్టిసాళిపరి♦ఘాదిక కార్ముక బాణహస్తులై
వేసము భీతు గొల్పఁ బృథి♦వీతల మెల్ల వణంక రాక్షసుల్
రోసముతోడ వెల్వడిరి ♦ రూక్షమతుల్ పదునాల్గు వేవురున్. ౩౧౦

భాసుర=ప్రకాశించు, శూల = సలాకువంటి మొనగల యాయుధము, ముద్గర = కుఱుచ యినుపదుడ్డుకఱ్ఱలు, కృపాణ=కత్తులు, పరశ్వధ = గండ్రగొడ్డండ్లు, ఖడ్గ= బాకులు, వజ్ర = వజ్రాయుధమువలె, ఘోర = భయంకరమైన, అసిక =చిన్నకత్తి, పట్టిస = బల్లెము, పాళి = సమూహము, పరిఘ= ఇనుపకట్లగుదియ, కార్ముక=విల్లు, భీతు = భీతి, రూక్షమతుల్ = కఠిన మనస్సులుగలవారు.

తా త్ప ర్య ము.

సలాకులు, ముద్గరములు, కత్తులు, గండ్రగొడ్డండ్లు బాకులు వజ్రాయుధముల వంటి కత్తులు, బల్లెములు, ఇనుపకట్లగుదియలు, విండ్లు, బాణములు చేతులందు ధరించినవారై వారివేసములే చూచువారికి భయము కలిగించుచుండ భూమి గడగడ వడఁక రోషముతోఁ బదునాలుగు వేల మందిరాక్షసులు వెల్వడిరి.

మొదట వచ్చినవారు పదునాలుగురు, ఇప్పుడు పదునాలుగు వేవురు.

కం. ఖరుచిత్త మెఱిఁగి సారథి, సరభసముగఁ దేరు దోలె ♦ సైన్యము వెంటన్
ధరణియు దిశలు విదిక్కులు, నెర వయ్యెం దద్రథాంగ♦నిబిడధ్వనిచేన్. ౩౧౧

సరభసముగన్=తీవ్రముగ, విదిక్కులు=మూలలు. నెరవయ్యెన్=నిండెను.

తా త్ప ర్య ము.

ఖరుని మనస్సెఱిఁగి యతనిసారథి సైన్యము వెంబడి తీవ్రముగ రథమును దోలెను. ఆ రథగమన వేగమునఁ బుట్టిన ధ్వనిచే భూమియు దిక్కులు దిక్కుల మూలలు నిండెను.

చం. గురుతరకోపయుక్తుఁడయి ♦ క్రూరచరిత్రుఁడు నిర్జరారి భీ
కరఖరకంఠరావమున ♦ గాఢమహాపవనేరితంబు ప్ర
స్తరచయవృష్టిహేతుజల♦దంబు మఱొందుఘనంబు వొడ్చున
క్కరణిని సారథిం బొడిచె ♦ గ్రక్కునఁ దోలుము తోలు మం చొగిన్. ౩౧౨

గురుతరకోపయుక్తుఁడయి = మిగుల నతిశయించిన కోపముతోఁ గూడినవాఁడై, భీకర=భయంకరమైన, ఖర=కఠినమైన, కంఠరావమునన్ = గొంతుధ్వనితో, గాఢ=అధికమైన, పవన = గాలిచే, ఈరితంబు=ప్రేరింపఁబడినది, ప్రస్తరచయ=ఱాల సమూహముల, వానకు హేతువైన, జలదంబు = మేఘము, ఘనంబు =మేఘము.

తా త్ప ర్య ము.

మిగుల నతిశయించిన కోపముగలవాఁడై క్రూరపు నడవడిగల ఖరుఁడు భయంకరమైన గాడిదధ్వనివంటి కఠినధ్వనిచేఁ బెద్దగాలిచేఁ బ్రేరింపఁబడి ఱాలవాన

గురియు నొక మేఘము మఱియొక మేఘమును బొడిచినట్లు సారథిని దోలుము తోలు మని పొడిచెను.

—♦ ౨౩-వ సర్గము, ఖరునకు దుశ్శకునంబు లగుట ♦—

ఉ. ఈనెఱి రాక్షసావళి స♦మీకసముత్సుకితాత్మ నా జన
స్థానము వీడ గార్ద భము♦చాయను మేఘము రక్తతోయ మా
వానను బెల్లుగాఁ గురిసె ♦ వాహ్యాచయంబు యదృచ్ఛఁ బుష్పసం
తానచితప్రదేశమున ♦ దబ్బున జాఱిపడెక్ సమస్థలిన్. ౩౫౩

ఈనెఱిక్ = ఈవిధముగ, సమీక = యుద్ధమందు, సముత్సుకిత = మిక్కిలి సంతోషముగల, ఆత్మక్ = మనస్సుతో, జనస్థానము=ఖరాదులు కాఁపురము చేయు స్థలముపేరు, గార్దభము = గాడిద, రక్తతోయము = నెత్తురువంటి నీళ్లు, వాహ్యాచయంబు = గుఱ్ఱముల సమూహము. యదృచ్ఛక్ = ఆకస్మికముగ, తమంతటఁదామే, పుష్పసంతాన = పూలసమూహముచే, చిత = నిండిన, సమస్థలిక్ = చదరపునేల.

తా త్ప ర్య ము.

ఈ విధముగ రాక్షసులు యుద్ధకాంక్షచేఁ బోవుచుండఁగా గాడిదరంగుగల మేఘము రక్తవర్ణముగల నీళ్ళను వానగాఁ గురిసెను. తేరికిఁ గట్టిన గుఱ్ఱములు సమప్రదేశమునందు గుంతలు మిట్టలు లేకున్నను బూలచే నిండినచోటఁ దటాలున జాఱిపడెను.

ఉ. శ్యామము లోహితాంత మయి ♦ యప్పుడు సూర్యు నలాతచక్రమై
భీమతరంబునై పరిధి ♦ వేగమ చుట్టెను, గ్రద్ద యెక్కెఁ పు
న్హేమసమిద్ధదండమున ♦ నెమ్మది నెక్కొని యుండె, విస్వరో
ద్దామములై చెలంగె భయ♦దంబుగ నందుఁ బలాదసత్త్వముల్. ౩౫౪

పరిధి = పరివేషము, గుడి, సూర్యచంద్రులచుట్టు గుండ్రముగాఁ గానవచ్చు వెలుతురు, ఇది శ్యామము = నల్లనిది, లోహితాంతము = అంచున నెఱుపుగలది, అలాత చక్రమై = కొఱవి త్రిప్పిన నేర్పడు చక్రమువంటి చక్రమై, భీమతరంబునై = మిగుల భయంకరమై, హేమసమిద్ధదండమునక్ = బంగారుతోఁగూడిన దండము నందు, నెక్కొని = నెలవుకొని, వ్రాలి, విస్వరోద్దామములై = వికారస్వరములచే గొప్పవై, పలాదసత్త్వముల్ = మాంసము దిను జంతువులు.

తా త్ప ర్య ము.

సూర్యునిచుట్టు కొరవి చక్రమువలె గుండ్రమై నల్లనై యంచున నెఱ్ఱనై భయంకరముగ పరివేషము గానవచ్చెను. బంగారు ధ్వజదండముపై గ్రద్ద వ్రాలి కూర్చుండెను. మాంసము దిను జంతువులు వికారస్వరములు నిండించెను.

ఉ. నక్కలు గూయఁ జొచ్చె దిన♦నాథు దెసం గని, శైలపాళిపైక్
ప్రక్కలఁబోలి నెత్తురుల♦వర్షపుధారలు గార్చె, మబ్బుపిం

డొక్కటఁ జిమ్మచీఁకటులు ♦ నుర్వియు దిక్కులు దోఁపకుండఁగా
రెక్కొనె, వేళగామి దన♦రెన్ క్షతజార్ద్రపటాభసంధ్యయున్. ౩౫౫

దిననాథుదెసన్ = సూర్యునివంక, పింజు = సమూహము, రెక్కొనెన్ = వృద్ధిచెందెను, క్షతజ = నెత్తుటిచే, ఆర్ద్ర = తడిసిన, పటాభ = వస్త్రముతో సమానమైన, సంధ్యాకాలము.

తాత్పర్యము.

సూర్యునికెదురై యాయనను జూచి నక్కలు కూయసాగెను. కొండల గుంపు వజ్రధారచే నింద్రుఁడు ఱెక్కలు నఱికినపుడు నెత్తురు గాఱినట్లు లప్పుడు నెత్తురు గార్పఁజొచ్చెను. ఇదిభూమి ఇవి దిక్కులని తెలియరాకుండునట్లు చిమ్మచీఁకటులు గ్రమ్ము మబ్బుల పింజు వృద్ధిచెందెను. సంధ్యాకాలము కాకపోయినను, ఆకాశము నెత్తుటఁ దడిసిన గుడ్డవలెఁ గానవచ్చెను.

కం. ఖరునకు నభిముఖ మగుచును, ఖరతర రవములను నినిచె, ♦ గంకవృకాదుల్
పరుసపుమంటలు గ్రక్కుచుఁ, బరఁగించెను వఱడు లెల్ల ♦ భయదస్వనముల్. ౩౫౬

అభిముఖము = ఎదురు, ఖరతరరవములను = మిగులఁబరుషములయిన ధ్వనులను, కంక వృకాదుల్ = గ్రద్దలు తోడేళ్లు మొదలయినవి, వఱడులు = నక్కలు భయదస్వనముల్ = భయంకరధ్వనులు.

తాత్పర్యము.

ఖరున కెదురుముఖమై గ్రద్దలు తోడేళ్లు మిగులఁ బరుషములైనధ్వనులు చేసెను. నక్కలు మంటలు గ్రక్కుచు భయంకరముగఁ గూసెను.

సీ. పర్వంబు గాకయు ♦ భాను స్వర్భానువు, పట్టె దినేశుని♦పజ్జఁ గ్రమ్మె
నొకపరిఘాకార♦వికటకబంధంబు, ఱివ్వునఁ బెనుగాలి ♦ ఱేసె నెదుట
దేజంబు చెడియె నం♦భోజబంధువు నిశ, గామియుఁ దారకల్ ♦ గ్రహచయంబు
ద్యోతలంబునను ఖ♦ద్యోతకాంతిని దోఁచె, సంలీనపృథురోమ♦సంఘ మగుచు
ఆ. శుష్కకంజ మగుచుఁ ♦ జొప్పఱెఁ గొలఁకులు, భూజతతులు విగత♦పుష్పములును
ఫలయుతంబు లగుచుఁ ♦ బొడఱెఁ గెందూళులు, లలమె గాలిలేక ♦ యభిముఖముగ

స్వర్భానువు = రాహువు, దినేశుని = సూర్యునియొక్క, పరిఘాకార = గుదియవంటి యాకారముగల, వికటకబంధంబు = భయంకరమైన మొండెము వంటి మేఘము. అంభోజ బంధువు = సూర్యుఁడు, నిశ = రాత్రి, ద్యోతలంబున్ = ఆకాశమునందు, ఖద్యోతకాంతిని = మిణుఁగురుబూఁచులకాంతితో, సంలీన = డాఁగిన, పృథురోమ = చేఁపలయొక్క, సంఘము = గుంపుకలది, శుష్కకంజము = ఎండిన కమలములు గలది, చొప్పఱెన్ = అందము చెడెను, భూజతతులు = చెట్ల గుంపులు, విగతపుష్పములు = రాలిన పూలు గలవి, కెందూళులు = ఎఱ్ఱని దుమ్ములు, కెంపు+దూళి = కెందూళి.

తా త్ప ర్య ము.

అమావాస్య కాకపోయినను రాహువు సూర్యుని బట్టెను. సూర్యునకు బ్రక్కన భయంకరంబైన మొండె మొకటి గానవచ్చెను. ఎదురు ముఖముగ బెద్ద గాలి వీవ్వనపోచెను. సూర్యకాంతి క్షయించెను. రాత్రి గాకున్నను దారకలు గ్రహము లాకాశమున మిణుఁగురుపురుగులవలెఁ గానవచ్చెను. నీళ్లలో డాఁగిన చేఁపలు కమలములు గలవై సరస్సు లుండెను. చెట్లనుండి పూలు పండ్లు రాలిపోయెను. గాలి లేకయున్నను నెదురుగ నెఱ్ఱని దుమ్ములు ప్రబలెను.

కం. శారీతతి వీచీకూ, చీరవముల నించె నపుడు ♦ చెలఁగెను భయదా
 కారములను నిర్ఘాతో, ల్కారభసజ్యోతిరనిల♦కాండము లంతన్. ౩౫౮

శారీతతి = ఆఁడుగోరువంకలు, వీచీకూచీరవములన్ = వీచి, కూచి యను ధ్వనులను, నిర్ఘాత=పిడుగు, ఉల్కా=కొఱవి, రభస=వేగముతోఁగూడిన, జ్యోతిః = కాంతి, అనిల = గాలియొక్క, కాండము=సమూహము, ఉల్కా యనునది యొక విధమైన తేజస్సు, నిర్ఘాతము వాయువిశేషము, "ఉల్కా శిరసి విశాలా, నిపతంతీ వర్ధతే తనుపశ్చాత్, పవనాభిహతా గగనా, దవనౌచ యదా సమాపతతి। భవతి తదానిర్ఘాత స్సచపాపో దీర్ఘఖగవిరుతః" వరాహమిహిరుఁడు.

తా త్ప ర్య ము.

గోరువంక పక్షులు వీచి కూచియని యఱవసాగెను భయంకరాకారములతో నిర్ఘాతవాయువులు ఉల్కా తేజస్సులు నతిశయించెను.

చం. వడఁకె వసుంధరాస్థలి స♦పర్వతకాననమై యవార్యమై
 యెడమభుజంబు బిట్టదరె ♦ నెంతయు గర్జల నింపఁ బోయినన్
 జడిమ గొనెం గళం బసుర♦నాథునకుం గనునీరు గాఱె నొ
 వ్వడరె లలాటమందు జడుఁ ♦ డాఁగఁడు యాత్రను వీనిఁ జూచియున్. ౩౫౯

గర్జలన్=సింహనాదముల, జడిమ=మొద్దుతనము, జడుఁడు = మూఢుఁడు ఆఁగఁడు=నిలుపఁడు.

తా త్ప ర్య ము.

భూమి కొండలతో నదులతో వడఁకెను. ఖరునకు నెడమభుజ మదరెను. సింహనాదము చేయుద మనిన గొంతు మొద్దుపాఱి ధ్వనిరాదయ్యెను; నిష్కారణ ముగఁ గన్నుల నీరు కాఱెను; నొసట నొప్పిపుట్టెను; ఇన్ని యవశకునములు దోఁచి నను ఆమూఢుఁడు ప్రయాణము నిలిపినవాఁడు కాఁడు.

కం. భీతిప్రద మైనమహో, త్పాతంబుల నన్ని దెసలఁ ♦ బరికించియునున్
 దై తేయభ ర్త రక్షో, వ్రాతంబును గాంచి నగుచు ♦ బలగర్వమునన్. ౩౬౦

భీతి ప్రదము=భయము కలిగించునది, మహోత్పాతంబులు=గొప్పయవశకునములు, పరికించియును=చూచియును, తత్స. పరీక్షించు; వ్రాతము=సమూహము

తాత్పర్యము.

ఈ విధముగ భయంకరములగు గొప్ప యవశకునములు నాలుగు ప్రక్కలం గలుగుట చూచియును ఆ రాక్షస నాయకుఁడు బలగర్వముచే వాని నలక్ష్యపఱిచి రాక్షసుల గుంపుతో వారధైర్యపడుదు రేమో యని తలఁచి యిట్లనుచున్నాఁడు.

కం. ప్రకటముగఁ దోఁచు నీ యవశకునంబుల కేను జంక • సైనికులారా
వికలుఁ డగుఁ బిఱికి వీనికి, నకుటిలభుజబలుఁడు వీని • నాత్మం గొనునే. ౩౬౧

జంకన్ = భయపడును.

తాత్పర్యము.

స్పష్టముగఁ గానవచ్చు నీయవశకునములకు సైనికులారా! నేను జంకువాఁడను గాను. పిఱికివాఁడు వీనికిఁ గలఁతపడును గాని వాస్తవముగ భుజబలము గలవాఁడు వీనిని మనస్సున లక్ష్యపెట్టునా?

కం. తారల నైనను మచ్ఛర, ధారల ధరఁ గూల్తు దండి • దండింతుఁ జుండీ
యా రాఘవుల వధింపక, క్రూరాహవమందు వెనుక • కున్ మరలుదునే. ౩౬౨

మచ్ఛరధారలన్ = నాబాణవర్షముచే, దండి=యముని, దండముగలవాఁడు దండి, క్రూరాహవమందున్ = క్రూరమైన యుద్ధమందు.

తాత్పర్యము.

నా బాణవర్షముచే నక్షత్రముల నైనను నేలఁ బడఁగొట్టుదును, యముని దండింతును, అట్టి బలపరాక్రమములు గల నేను రామ లక్ష్మణుల యుద్ధమందుఁ జంపక వెనుకకుఁ బోదునా?

ఉ. కోరిక దీర నా భగిని • క్రోలెడిఁగావుత వారి రక్తముల్
ఘోరసమీకమందు మును • గూరదు నాకుఁ బరాభవంబు లీ
మేరకు మీర సాక్షులు సు•మీ యనృతంబు వచింప, నింద్రునిన్
బోర జయించినాఁడ నఁట • పొల్లు మనుష్యులచేతఁ జత్తునే. ౩౬౩

భగిని=అక్క, అప్ప, "అత్తికా భగినీ జ్యేష్ఠా" యని నిఘంటువు. క్రోలెడిన్ = త్రావును, సమీకమందున్=యుద్ధమందు. పరాభవంబు = అపజయము, పొల్లు = నిస్సారము.

తాత్పర్యము.

మా యక్క తన కోరిక దీర వారి రక్తములను త్రావునుగాక. యుద్ధమందింతకుఁ బూర్వ మెన్నఁడు నా కపజయము వచ్చినది లేదు. ఇది మీరే కన్నులారఁ జూచి యున్నారు. అసత్యము చెప్పను. యుద్ధమందు నింద్రుని జయించినాఁడను. అట్టి వాఁడను నే నిస్సారపు మనుష్యులచేఁ జత్తునా?

మ. అని గర్జింపఁగఁ దన్నినాదమున ర•క్షోధీశు లానందవా
రిని దేలాడిరి కాలపాశముల బం•దీభూతులై; యుద్ధద
ర్శన కాంక్షాగత దేవసిద్ధ బుషిరాజవ్రాత గంధర్వులో
య్యన గోబ్రాహ్మణ లోకసంగత జనే•భ్య స్స్వస్తి యంచున్ మఱిన్. ౩౬౪

గర్జింపఁగఁగా=సింహనాదము చేయఁగా, తత్+నినాదమునన్=ఆధ్వనికి, బందీభూతులై=కట్టుపడినవారై, యుద్ధదర్శన=యుద్ధము చూడవలయు నను, కాంక్షా=కోరికచేత, ఆగత=వచ్చిన, గోవులకు, బ్రాహ్మణ=బ్రాహ్మణులకు, లోకసంగత=లోకమునకు మేలుచేయు, జనేభ్యః=జనులకు, స్వస్తి=మేలు కలుగునుగాక, దేవతలు కావున వారి భాషలో వారు మాట్లాడిరి.

తేలాడు=ఇది శబ్దపల్లవక్రియ, వేఱు వేఱర్థములుగల రెండుక్రియ లొక యర్థమునే యిచ్చునపుడు శబ్దపల్లవ క్రియ యనఁబడును, తేలు+ఆడు=తేలాడు, ఇట్లులే, అందు+ఇచ్చు = అందిచ్చు, ఇందుఁ గ్వార్థక సంధిగల దని కొందఱు భ్రమింతురు, ఇం దవయవార్థము గ్రాహ్యముకాదు. నిలుచుండు అనునదియు శబ్దపల్లవక్రియయే. నిలుచు+ఉండు. ఇందుఁగ్త్వార్థకసంధి గలదేని నిలిచుండు అని కావలయును గాని నిలుచుండు అని కానేరదు గదా, నిలిచుండు అను రూప మాంధ్రంబున లేదు. చాపము+నా కందిమ్మనుచో, అందిమ్ము అనునది శబ్దపల్లవము. నాకు నందున ట్టిమ్మని యర్థమేకాని నీ వంది నాకు నిమ్మని యర్థముకాదు. సులభవ్యా — క్రియ. ౧౭౯-వ సూ.

తాత్పర్యము.

ఇట్లు చెప్పి సింహనాదము చేయఁగా రాక్షస శ్రేష్ఠులందఱు యముని పాశములచేఁ గట్టఁబడినవారై యా ధ్వనికి సంతోష సముద్రమునఁ దేలాడిరి. యుద్ధము చూడవలయునని వచ్చి యాకాశమున నిలిచిన దేవతలు సిద్ధులు ఋషిశ్రేష్ఠులు గంధర్వులు గోవులకు బ్రాహ్మణులకు లోకహితకారులకు మేలు కలుగునుగాక యని మఱియును.

మాలిని. జయతు జయతు రామ ♦ స్సంయుగే సర్వదైత్యా
న్నయగుణహిత చక్రీ ♦ వాశరా న్నంచు మింటన్
రయమునఁ జను దేరన్ ♦ రాక్షసక్రూరసేనా
చయములఁ గని రంతన్ ♦ సంభ్రమోత్సాహదీప్తిన్. ౩౬౨

జయతు = జయించునుగాక, జయించునుగాక ఆదరమున ద్విరుక్తి, రామః = రాముఁడు, సంయుగే=యుద్ధమందు, సర్వదైత్యాన్=సమస్తరాక్షసులను, అయగుణహిత చక్రీవా=శుభము గలిగించు గుణములచేఁ బ్రకాశించు హితుఁడైన విష్ణువువలె, ఆశరాన్=రాక్షసులను, మింటన్=ఆకాశమునందు, మాలిని, ననమయయగణంబులు, తొమ్మిదవ యింట యతి.

తాత్పర్యము.

లోకహితముగోరి శుభకార్యములుచేయు సుదర్శనచక్రధారియైన విష్ణువు రాక్షసులను జయించునట్లు శ్రీరామచంద్రుఁడు సర్వరాక్షసులను యుద్ధమందు జయించునుగాక యని చెప్పుచు నాకాశమందుండి రాక్షససేన సంభ్రమముచేతను ఉత్సాహముచేతను బ్రకాశించుచు రాఁగాఁ జూచిరి,

సీ. ఖరుఁడు శతాంగవే♦గంబున సైన్యంబుఁ, దలమీఱి చన నమా♦త్యులును శ్యేన
గామి పృథుగ్రీవ♦కాలకార్ముక యజ్ఞ,శత్రు సర్పాస్య దు♦ర్జయులు మేఘ
మాలి పరుష మహా♦మాలి విహంగమ,రుధిరాశనులు యశో♦రూథు లతుల
వీరుండు నా కర♦వీరాక్షుఁ డనఁ గను, బన్నిద్ద ఱాతని♦బడిని జనిరి

తే. యంత దూషణుఁ గొల్చి స్థూ♦లాక్షుఁడును బ్ర
మాథియు మహాపాలుండు ♦ మఱి త్రిశిరుఁడు
ననఁగ నల్వురు చనిరి యు♦ద్ధాభికాంక్ష
నిజపదోద్ధూత్రరజములు ♦ నిశ ఘటింప. ౩౬౬

శతాంగవేగంబునన్ = రథవేగముచే, తలమీఱి=సేన నంతయు దాఁటి, బడిని =వెంట, నిజపద=తమకాళ్లచే, ఉద్ధూత=ఎగురఁగొట్టఁబడిన, రజములు = దుమ్ములు, నిశఘటింపన్=రాత్రిసి గలిగింపఁగా.

తా త్ప ర్య ము.

తాను గోరినంత వేగముగ సేన నడవకుండుటచే ఖరుఁడు జాగుసైఁపక మిగుల వేగంబున సేనయంతయు వెనుకఁబడునట్లు ముందుగాఁదన దేరిని దోలించెను. అతని వెంటనే యమాత్యులు శ్యేనగామి, పృథుగ్రీవుఁడు, కాలకార్ముకుఁడు, యజ్ఞశత్రువు సర్పాస్యుడు, దుర్జయుఁడు, మేఘమాలి, పరుషుఁడు, మహామాలి, విహంగముఁడు రుధిరాశనుఁడు, కరవీరాక్షుఁడు, ననువారు పండ్రెండుగురు పోయిరి. అంత దూషణుని వెంట స్థూలాక్షుఁడు, ప్రమాథి, మహాకపాలుఁడు, త్రిశిరుఁడు నను నల్వురుపోగా వారి పాదఘట్టనచే రేఁగిన ధూళి రాత్రివచ్చినదా యేమి యనునట్లు చీఁకట్లు గ్రమ్మఁజేసెను.

కం. ఖరకరనిశాకరులపైఁ బురుగతిఁ జను గ్రహచయంబు♦బోలిక రక్షో
వరసైన్యము సరగం జనె, ఖరకరకులమణులఁ దాఁకఁ♦గలహప్రియమై. ౩౬౭

ఖరకర నిశాకరులపై=సూర్య చంద్రులమీఁద, పురుగతిన్ = అధికవేగమున, గ్రహచయము=రాహుకేతువులు, ఖరకరకులమణులన్ = సూర్యవంశములో శ్రేష్ఠులగు వారిని, కలహప్రియమై=యుద్ధమునం దాసక్తిగలదై.

తా త్ప ర్య ము.

సూర్య చంద్రులపైఁ గ్రూరగ్రహముల గుంపు పరువెత్తునట్లు సూర్యవంశమునఁ బుట్టినవారిలో శ్రేష్ఠులగు శ్రీరామలక్ష్మణులమీఁదికి యుద్ధకాంక్షచే రాక్షససైన్యము బయనించెను.

౨౪-వ సర్గము. రాముఁడు లక్ష్మణునకు యుద్ధశకునంబులఁ జూపుట.

ఉ. ఆ తరుణంబునన్ రఘుకు♦లాగ్రణి యెల్లెడ నారఁదోఁచు ను
త్పాతము లెల్లఁ జూపి పిన♦తమ్మునకి ట్లనుఁ గంటె లక్ష్మణా
భూతభయావహం బగుప్ర♦భూతనిశాచరనాశసూచకో
త్పాతము లెల్లెడం బ్రబలెఁ♦దప్పదు ముప్పు ఘటిల్లు జూడఁగన్. ౩౬౮

ఆ తరుణంబునన్=ఆ సమయమందు, దేశ్యము నందే యీ శబ్దమున కీ యర్థము. నిజము, కరము, నిరతము, లంపట లోనగు శబ్దము లుభయభాషలందును గలవు, అర్థము భిన్నము. అది తెలియనివారు నిజానిజము లని దేహలంపట యని వాడెదరు, ఆరన్=బాగుగ, పినతమ్ముఁడు=లక్ష్మణుఁడు, పెద్ద తమ్ముఁడు భరతుఁడు, భూతభయావహము=ప్రాణికోటికి భయముగలిగించునది, ప్రభూత=అధికమైన, నిశాచర=రాక్షసులయొక్క, నాశ=చేటును, సూచక=సూచించు, ఉత్పాత = అపశకునములు.

తాత్పర్యము.

ఆ సమయమందు శ్రీరామచంద్రమూర్తి యున్ని దిక్కులయందు స్పష్టముగాఁ గానవచ్చు నపశకునముల నన్నిటినిజూపి చిన్నతమ్మున కిట్లనియెను. లక్ష్మణా! చూచితివా! రాక్షసులకు వినాశమును సూచించు నపశకునము లన్నిచోటుల విస్తారముగాఁ గానవచ్చుచున్నవి. ఏదియో కీడు రాఁగలదు, ఈ శకునములు వ్యర్థములగునవి కావు.

కం. చావఁగలవారి మోములు, వే విన్నఁదనంబులఁ జెందు ♦ విగ్రహమందున్
నీవదనము సప్రభమై, శ్రీ వెలసి ప్రసన్నమగుచుఁ ♦ జెల్వారెఁ జుమీ! ౩౬౯

విన్నఁదనంబు = దీనత్వము, విగ్రహమందున్ = కలహమందు, వదనము = ముఖము, సప్రభమై=కాంతితోఁగూడినదై, శ్రీన్=శోభనముచే, ప్రసన్నము=నిర్మలము, సంతుష్టము, చెల్వారెన్=అందమైయున్నది.

తాత్పర్యము

మరణము సమీపించిన వారి ముఖములు యుద్ధసమయమున వెల్లనై కాంతిహీనములై యుండును. నీముఖము కాంతితోఁగూడి శోభాయుక్తమై నిర్మలమై యందమైయున్నది. కావున జయము నాకు మాత్రమేకాదు. నీకును జయము గలదు. మనకు భయములేదు. తన ముఖము తనకుఁగానరాదు. కావున లక్ష్మణుఁ జూచి చెప్పుచున్నాఁడు.

సీ. గర్దభారుణములై ♦ ఖరనిస్వనంబులై, రక్తధారంబులై ♦ క్రాలెఁ గంటె
చదల మేఘంబులు ♦ చలియించుచున్నవి, మచ్చాపములు సధూ ♦ మంబు లగుచు
జ్వలియించె శరములు ♦ వనరాజిఁ గలవిహంగంబుల యులివుచం ♦ దంబుఁ జూడఁ
బ్రాణగొడ్డంబైన ♦ భయ ముప్పతిలు వేగ,శత్రువుల్ చత్తురు ♦ జయము మనకుఁ
తే. గల్గు గడుఘోరమైనసంగ్రామ మొదవు
నదరెడిని మఱిమఱి కుడి ♦ హస్త మిపుడు
రాక్షసాళి భయంకరా ♦ రావములును
భేరికాఝాంకృతులు న వె ♦ వినఁగ నయ్యె. ౩౭౦

చదలన్=ఆకాశమందు, గర్దభారుణములై=గాడిదవలె బూడిదరంగు గలవై, ఖరనిస్వనంబుల=గాడిదధ్వనివలెఁ గఠోరధ్వని గలవి, రక్తధారంబులు = నెత్తురువంటి

ధారలుగలవై, సధూమంబులు=పొగతోఁగూడినవి. మచ్చాపములు = మన విండ్లు,
నీది నాదియని భావము, జ్వలియించెన్=మండుచున్నవి, శరములు = బాణములు,
వనరాజిన్=వనసమూహమందు, విహంగంబులు=పక్షుల, ఉలివు చందంబున్ = ధ్వని
విధము, ప్రాణగొడ్డము=ప్రాణహింసకము, ఇది యనింద్య గ్రామ్య మని బాలవ్యా
కరణము- పాణికుట్టక శబ్ద భవ మని ప్రౌఢ వ్యాకరణము, ప్రాణగొడ్డ మగ్రామ్యంబు
నాఁదగు, అంచపదము, అంచయానలోనగు వాని వంటిది. ప్రౌ. వ్యా. సంజ్ఞ.
౧౨ సూ. దీనికి భారతంబునఁ బ్రయోగము గలదు "లోభనిరతిఁ బెద్ద కాసపడి
పాడి దొఱంగినఁ బ్రాణగొడ్డపుం బనులగు భా. అను ర.ఆ. కం. విను రాజ్య
మిషముం గొనఁ బలువురచేతఁ బ్రాణగొడ్డంబై యున్నను ధీరుఁడేమఱమి, నది, దన
కుం దక్కించుకొను బుధస్తుత్యముగన్" శాంతి. ౨ ఆ. ౧౯౮ ప. సంగ్రామము =
యుద్ధము, రాక్షసాళి=రాక్షసుల సమూహములయొక్క, భయంకరారావములును =
భయముగలిగించు ధ్వనులును, భేరికాభాంకృతులు = నగారాల భాం భాం అను
ధ్వనులును.

తా త్ప ర్య ము.

ఆకాశమునందు మేఘములు గాడిద కాంతిగలవై, గాడిదల కఠోరధ్వనులు
గలవై నెత్తురువంటి జలధారలుగలవై యున్నవి. మనవిండ్లు పొగలెగయుచుఁ దమం
తటఁ దామే కదలుచున్నవి. చాపములందు మంట లెగయుచున్నవి. అడవుల
యందుఁ బక్షులధ్వని విధముజూడఁ బ్రాణహింసాత్మకమైన భయము కలుగును.
శత్రువులు చత్తురు, మనకు జయముగలదు. మిగుల భయంకరమైన యుద్ధము కలు
గును. కుడిచేయి యదరుచున్నది. రాక్షసుల భయంకరధ్వనులు నగారాల మోఁతలు,
వినవచ్చుచున్నవి. కావున శత్రువులు సమీపమందే వచ్చుచున్నారు.

కం. ఆపద రాఁగల దని, మదిఁ లోపలఁ దోఁపగ మనీషి ♦ లోలుఁడు గా కా
యాపద దొలఁగు నుపాయము, వే పూర్వమ చేసికొనును ♦ విమలప్రజ్ఞన్. ౩౭౧

మనీషి=ఆలోచనపరుఁడు, లోలుఁడు=చలించినవాఁడు.

తా త్ప ర్య ము.

ఆపద రాఁబోవుచున్నదని తెలియఁగానే యనాగత విధాతయగు నాలోచన
పరుఁడు చలింపక యా యాపదఁ దొలఁగద్రోయు నుపాయ మేదో దానిని ముందు
గానే తనబుద్ధిచే నాలోచించి చేయును.

—♦ శ్రీరాముఁడు సీతాలక్ష్మణుల గుహ నుండఁ బనిచి యుద్ధసన్నద్ధుఁ డగుట. ♦—

కం. కావున శరచాపంబుల, వావిరి ధరియించి నీవు ♦ వైదేహిఁ బ్రభూ
తావనిరుహనిబిరీస, గ్రావాంతరదరికిఁ బొమ్ము ♦ కదలుము లెమ్మా. ౩౭౨

ప్రభూత=విస్తారము, అవనిరుహ=చెట్లచే, నిబిరీస=దట్టమైన, గ్రావాంతర=
కొండలలోనుండు, దరికిన్=గుహకు.

తాత్పర్యము.

కాఁబట్టి యిప్పుడు నీవు చేయవలసినపని చెప్పెదను. సీతాదేవి యిందుండెనా యామెకు వారు కీడు గలిగింతురు. కావున నామె యిందుండరాదు. ఒంటరిగా నెందును బంపరాదు. కావున నీవామెను బిలుచుకొని విల్లుబాణములు ధరించినవాఁడవై దట్టముగ బలసిన చెట్లగుంపులుగల కొండగుహలోనికిఁ బొమ్ము. ఆమెను లోపలనుంచి నీవు వెలుపలఁ గావలియుండుము. ప్రయాణముకమ్ము, లేలెమ్ము, నేనొకపని నీవొకపని చేయవలసియున్నది, రెండును ముఖ్యములైనవేసుమా.

వీని నిప్పుడు సీతమ్మగుట్టలందురు. రాక్షసనేన తూర్పుముఖమై వచ్చెను. సీతాలక్ష్మణు లేటియొడ్డువెంట నుత్తరముఖముగఁ బోయిరి.

కం. బదు లాడితి వేనియు నా, పదములపై నాన సుమ్ము ♦ బలవంతుఁ డవుఁ
గదనప్రియ! శూరుఁడ వం, చెద నెఱుఁగుదుఁ గలవు వీరి ♦ నెల్ల వధింపన్. 323
ఆన = ఒట్టు.

తాత్పర్యము.

నేను జెప్పినమాటకు బదులుచెప్పితివా నా పాదములమీఁద నొట్టు. యుద్ధప్రియా! నీవు బలహీనుఁడ వని వీరితో యుద్ధముచేసి గెలువలేవని నిన్నాపనికి నేర్పాటుచేయలేదు. నీవు బలవంతుఁడవు, శూరుఁడవు, వీరి నందఱను జయింపఁగలవు.

కం.అం దొకయింతయు నా మది, సందేహము లే దకైన ♦ స్వయముగ రక్షో
బృందంబుఁ జంపఁగోరెద, ముందుగ నీ వరుగు మన్న ♦ మునుకొని త్వరమై. 324

తాత్పర్యము.

ఇందు సందేహము లేదు. అయినను నీరాక్షసులను నేనే స్వయముగఁ జంపఁగోరెదను. అంతియకాని మఱియేకారణము లేదు. వారు రాకముందే బయలుదేఱి పొమ్ము. మునులకు వాగ్దానము చేసినవాఁడను నేను. కావునఁ బ్రథమప్రయత్నము నాదిగా నుండుట నాకు యశస్కరము. అటుగాక నిన్ను యుద్ధమునకు విడిచి నేను జాటుగఁ బోయితినేని రాముఁడు మాటలవాఁడేకాని సమయమునకు ముఖము తప్పించి తాను దనపెండ్లాము గుహలో డాఁగి చిన్నవానిని ముందుఁ ద్రోచెనందురు నీవు నన్నిట్టి యపకీర్తిపాలు చేయవచ్చునా? కావున నేనే యుద్ధముచేసెదను.

కం. శరచాపంబులు దాలిచి, ధరణీసుతతో సుమిత్ర ♦ తనయుం డరుగన్
సరి వెళ్ళిరిగా వారని, పరమముదంబునను రామ ♦ భద్రుఁడు గడఁకన్. 325

తాత్పర్యము.

రామచంద్రమూర్తి చెప్పినప్రకారము త్వరపడి లక్ష్మణుడు విల్లుబాణములు ధరించి సీతాదేవితో వెళ్ళిపోయెను. సరి యిక సీతవిచారము లేదు. అని సంతోషపడి రామచంద్రమూర్తి యుద్ధప్రయత్నము చేసినవాఁడై.

చ. అనలనికాశభూరికవ♦చావృతుఁడై పెనుఁజీఁకటిం బొగల్
గొనని కృశాను నట్లు రుచిఁ ♦ గూరి యుదగ్రనిశాత బాణముల్
ధనువును గేలఁ బూని గుణ♦దారుణరావము దిగ్వితానభే
దన మొనరింప నిల్చె వసు♦ధావరపుత్త్రుఁ డుదీర్ణగాత్రుఁడై. ౩౭౬

అనిలనికాశ=అగ్నిహోత్రముతో సమానమైన, భూరి=గొప్పదగు, కవచావృతుఁడై=కవచముచేఁ గప్పఁబడినవాఁడై, పెనుఁజీకటిన్ = దట్టమైన చీకటియందు, పొగంగొనని=పొగలేని, కృశానునట్లు=అగ్నిహోత్రునివలె, రుచిన్ = కాంతిని, కూరి=పొంది, ఉదగ్ర= భయంకరమైన, నిశాత = పదునైన, గుణ = అల్లెత్రాటియొక్క, దిగ్వితాన=దిక్సమూహములయొక్క, ఉదీర్ణ=ఉత్సాహముచేఁ బెరిఁగిన, గాత్రుఁడై= దేహముగలవాఁడై, పొగలేని కృశానునట్లు అనుటచే శత్రునిరాసము క్షణమాత్రకార్యమని భావము.

తా త్ప ర్య ము.

మండుచున్న యగ్నితో సమానమైన గొప్పకవచము తొడిగికొనిన వాఁడై గాఢాంధకారములోఁ బొగలేని యగ్నిహోత్రునివలెఁ గాంతిని బొంది పదునైన బాణములను వింటిని చేతులఁ బట్టుకొని యల్లెత్రాటి ధ్వనిచే దిక్కులు భేదిల్లఁగా రామచంద్రమూర్తి యుత్సాహముచేఁ బెరిఁగిన దేహముగలవాఁడై విజృంభించి నిలిచెను.

సీ. అప్పుడు గంధర్వ♦ లాదిగా దేవతల్, చారణుల్ గుంపులై ♦ సమరదర్శ
నాసక్తిఁ జనుదెంచి ♦ యంబరమ్మున నిల్చి, ఋషు లొండొరులతోడ ♦ నిట్టు లనిరి
స్వస్తిగోబ్రాహ్మణే♦భ్యోస్తు యే త్రిభువనా,నా మభిసంగతా♦ భీమయామి
నీచరాన్ పౌలస్త్య♦నిచయాన్ రణే రామ,చంద్రమహీశ్వరో♦జయతు జయతు
తే. చక్రపాణి ర్యథా రణే♦సర్వదైత్య, పుంగవా న్నంచు మఱి ధర్మ♦బుద్ధి నృపతి
వీరుఁ డొకరుఁడు పదునాల్గు♦వేలు చెనఁటి,సోఁకు లెట్లగునో యని♦చూత మనుచు ౩౭౭

సమరదర్శనాసక్తిన్ = యుద్ధముచూచుకోరికచే, ఋషులు 'వారిలో' లేక 'అందు' ననుపద మధ్యాహారము.

భూతార్థసమాపక క్రియ వలయుచో వాక్యాంతర జనిస్థానంబగు, అగుచోఁ గర్త తత్కర్త లందలిదియు నెద్దియే నొండగు. ప్రౌ-వ్యా-వాక్య-౧౬-సూ. "ధవళాక్షుల్ చనికాంచి రంత నెదుటన్, దత్తీరదేశంబునం, దవదాతాంబుజ ఫేనపుంజనిభు నయ్యశ్వోత్తమున్ దవ్వులన్" కని కద్రువ వినతం జూచి' భార- ఆది- ౨-ఆ, కని యనుటకు ధవళాక్షుల్ అనునది కర్త. చూచి యనుటకు కద్రువ కర్తృపదము, కని అందు కద్రువ యనియర్థము. "దేవలోకంబున కరుగు వా రెదుర ద్వాపరం

బుతో వచ్చు కలిం గని శక్రుం డిదియేమి యెందుఁబోయెద రని యడిగిన యింద్రునకుఁ గలి యిట్లనియెం భార-ఆరణ్యా

ఇచ్చట 'కని' యనఁగా 'కనిరి' అందు నని యర్థము గ్రహింపవలెను. ఇట్లులే యిచ్చటను 'నిల్చి' యనఁగా నిల్చిరి' అనియు నందు నధ్యాహార మనియు గ్రహింప నగు. యే=ఎవ్వరు, త్రిభువనానాం = మూఁడులోకములకు, అభిసంగతాః = మేలు చేయువారో, అట్టి, గోబ్రాహ్మణేభ్యః=గోవులకు బ్రాహ్మణులకు, స్వస్తి అస్తు=శుభము కలుగునుగాక, రామచంద్రమహీశ్వరః = రామచంద్రభూపాలుఁడు, భీమయామినీ చరాన్=క్రూరరాక్షసులను, పౌలస్త్య నిచయాన్ = పులస్త్యవంశమునఁ బుట్టినవారి గుంపును, రణే=యుద్ధమునందు, చక్రపాణిః = విష్ణువు, రణే సర్వదైత్యపుంగవాన్, యథా=యుద్ధమందు సమస్తదైత్య శ్రేష్ఠులనువలె, జయతుజయతు=జయించునుగాక జయించునుగాక, ఆదరమున ద్విరుక్తి. పుంగవాన్ + అంచు, అనుకరణంబునం దుది హల్లునకు ద్విర్వచనంబగు. సు-వ్యా: సంధి ౮౫-సూ కింతత్ + అనియె. కింత త్తనియె - కస్త్వమ్ + అనియె - కస్త్వమ్మనియె. ఇట్లే యిందును గ్రహింపవలెను, లుక్సంశ్లేషౌ నాచి యను సూత్రమున కిది విషయముగాదు పుంగవాన్ = ద్రుత ప్రకృతికముగాదు, సంస్కృతమునందు ద్రుతప్రకృతికములు లేవు, చెనఁటిసోఁకులు = దుష్టరాక్షసులు, గంధర్వులాదిగా ననుటచే ౩౬౪-వ పద్యమునఁ జెప్పఁబడిన దేవ సిద్ధ ఋషి రాజవ్రాత గంధర్వు లని గ్రహింపనగు. ఆకాశమున ఖరసేనల వెంట వచ్చుట జెప్పఁబడెను. ౩౬౫ వ పద్యంబునందు దేవతలు ఇచ్చటవచ్చి రణభూమికి సరిగా మింటనిలుచుట చెప్పఁబడెను. కావునఁ బునరుక్తిదోషము లేదు.

గోవులు బ్రాహ్మణులు లోకమునకుఁ జేయు మేలేది యనిన,

అగ్నౌప్రాస్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే<br>
ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టే రన్నం తతఃప్రజాః.

అని కలదు. అగ్నియందు, వేల్వఁబడిన యాహుతి సూర్యుని చెందును. సూర్యునివలన వర్షము, వర్షమువలన నన్నము, దానివలనఁ బ్రజలు కలుగుదురు. జీవించుదురు.

హోమమునకు గవ్యములే శ్రేష్ఠములు-కావున ఆవుపాలు - ఆవునెయ్యి-ఆవు పెరుఁగు- ఇవియే ముఖ్యపదార్థములు. వీనిచే బ్రాహ్మణులు హోమము చేయుదురు. కావున గో బ్రాహ్మణులు లోకహితాభిలాషులు.

అన్నాద్భవంతి భూతాని, పర్జన్యా దన్నసంభవః<br>
యజ్ఞాద్భవతి పర్జన్యో, యజ్ఞః కర్మసముద్భవః<br>
కర్మబ్రహ్మోద్భవం విద్ధి, బ్రహ్మాక్షరసముద్భవమ్<br>
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ భ. గీ. ౩-౧౪.

లోకా స్సమస్తా సుఖినోభవంతు. అని త్రిసంధ్యములందు వారు చెప్పుచుందురు.

తా. ఉత్సాహప్రబుద్ధుఁడై యుద్ధసన్నద్ధుఁడై నిలిచిన రామభద్రునిఁజూచి యుద్ధముఁజూచు కోరికచే వచ్చి ఆకాశమున గంధర్వులు దేవతలు చారణులు లోనగువారు వచ్చి నిలిచిరి. అందు ఋషులు తమలో నొకరితో నొకరు మూఁడు లోకములకు మేలు గోరువారెవ్వరో యట్టి గోబ్రాహ్మణులకు శుభమగునుగాక. చక్రపాణి యగు విష్ణువు దైత్యశ్రేష్ఠులనెల్ల నెట్లు యుద్ధమున జయించెనో యట్లు రామభద్రుఁడు పులస్త్యవంశమునఁ బుట్టిన భయంకరరాక్షసులనెల్ల యుద్ధమునందు జయించునుగాక జయించునుగాక యనిరి. మఱియు ధర్మాత్ముఁడు రాజవీరుఁడు రామభద్రుఁడొంటివాఁడు. అధర్మవర్తులగు దుష్టరాక్షసులు పదునాలుగు వేవురు. యుద్ధమెట్లగునో - ధర్మమే జయించునో అధర్మమే జయించునో చూడవలయునని; చక్రపాణివిశేష్యము సాభిప్రాయము గావున పరికరాఁకురాలంకారము.

క. కౌతూహలమున నుండిరి, జాతోగ్రరుషాపినాకిసమ వేషం బౌ
భూతాధికభీత్యావహ,సీతాపతిరూపుఁ గాంచి చేడ్పడె జగముల్. 　　３２౮

కౌతూహలమునన్ = సంతోషముతో, జాత = పుట్టిన, ఉగ్ర = భయంకరమైన, రుషా = కోపముగల, పినాకి = రుద్రునితో, సమ = సమానమైన వేషంబౌ = ఆకారముగల, చేయఁబోవునది సంహారకార్యము కావున-పినాకహస్తుఁడైన రుద్రుఁ డుపమింపఁ బడెను. భూత = ప్రాణికోట్లకు, అధిక = విస్తారమైన, భీతి = భయమును, ఆవహ = కలిగించు, సీతాపతి = రామచంద్రుని, రూపున్ = రూపమును. సంస్కృతసమాసంబునఁ గడపటిపదము వైకృతరూపముగలదియగును. చేడ్పడెన్ = బాధనొందెను. చేటుపడు = చేడ్పడునయ్యెనని తోఁచెడిని. పినాకిసమవేషము ఖరాదులవధింపఁబూనినరామచంద్రునందు ప్రళయకాలరుద్రునివంటి రూపమే దేవతలకుఁ గానవచ్చెను.

"రుద్రతేజోవిలసితం - దృష్ట్వా రామకళేబరమ్.
శంఖం చక్రంచ శూలంచ, పినాకం ఖేటమేవచ
ఖట్వాంచ ఘంటాం డమరుం బాణపాశాంకుశంతథా
చాపం వజ్రంచ ఖడ్గంచ పరశుం త్రాసకారణమ్.
జయశ్రియంచ గంగాంచ దదృశుః సిద్ధచారణాః"
అని స్కాందమునఁగలదు. మహేశ్వరతీర్థీయము.

తా. మిగుల నాశగొనియుండిరి. కోపాతిశయముచే జగత్సంహారకార్యమునకున్ముఖుఁడైన పినాకహస్తుఁడైన రుద్రుని యాకారముతో సమానమైన భయంకరాకారము వహించి భూతములకు భీతినిగలిగించు రామభద్రుని రూపముఁగాంచి లోకములు బాధపడెను.

ఖరసైన్యము రామునిం జూచుట.

సీ. అంత. గంభీరని♦ర్హ్రాదయు ఘోరవ, ర్మాయుధధ్వజయునౌ ♦ నసురసేన
చటులహుంకారంబు ♦ చాపటంకారంబు, భేరిభాంకారంబు ♦ భీమరథిక
వరులధిక్కారంబు ♦ పదదభక్కారంబు,తోఁపఁ దో తెంచుడుఁ ♦ దుములముగను
నారవంబునకుఁ గాం♦తారమండలిజంతు,నికరంబు భీతిల్లి ♦ నిఖిలదిశల

తే. బఱచి పఱచి నిశ్శబ్దంపుఁ♦బట్టుఁజేరి, తిరిగి చూచెను రాక్షస♦వరులసేన
రామచంద్రునిఁ గదియ సం♦గ్రామకేళి,పండితుఁడు దాని నల్లడ ♦ పాఱఁజూచి.

నిర్హ్రాదము = ధ్వని, వర్మ = కవచము, ధ్వజ = టెక్కెము, చటుల = భయంకరమైన, తుములముగను=సంకులముగ, రవంబునకుఁ=ధ్వనికి, కాంతార మండలి = అడవియందలి, నికరంబు = సమూహము, భీతిల్లి = భయపడి, పఱచి = పరుగెత్తి.

తా. అంతట గంభీరధ్వనియు, భయంకరమైన కవచములు, ఆయుధములు, ధ్వజములు గలదియునైన రాక్షససేనయందలి భటులయొక్క హుమ్మను కంఠధ్వనులు విండ్లయల్లెత్రాడుల టంట మ్మనుధ్వనులును, నగారాల భాంభామ్మనుధ్వనులును, రథికుల ధిక్కారంబులును, వారు నడచునపుడు వారికాళ్ల దభదభను చప్పుడులును గలుగఁగా పెద్దసంకులమయ్యెను. ఆ ధ్వనికి నడవులందలి మృగసమూహము భయపడి నలుదిక్కులఁ బరువెత్తి పరువెత్తి యా చప్పుడు వినరాని స్థలముఁజేరి తిరిగిచూచెను. అంత రాక్షసులసేన రాముని సమీపింపఁగా దాని నంతయు యుద్ధపండితుఁడగు రామభద్రుఁడు వారి నందఱఁ బాఱఁజూచెను.

శా.వింటన్ బాణముఁ గూర్చి యీడ్చి పలభు♦గ్వీరాసుపాళీమరు
ల్లుంటాకుండు గఁ దెచ్చికొంచుఁ గినుకన్ ♦ లోలాక్షుఁడై కల్పపు
న్మంటల్ గ్రక్కుకృశానుచందమగుచు న్దక్షాధ్వరాలంభ ము
క్కంటింబోలి దిదృక్షు భీకరతరా♦కారంబునం గ్రాలినన్. ౩౮౦

పలభుక్ + వీర + అసు + పాళీ + మరుత్ + లుంటాకుండుగన్ = మాంసభక్షకులైన రాక్షసవీరుల ప్రాణసమూహము లనువాయువును హరించువాఁడుగ, కినుకన్ = కోపమును, తెచ్చుకొని = కోపము స్వభావముగ నాయనయందు లేదు, కార్యార్థమై కావలసియున్నది కావున నాసమయంబునకుఁ జలిచే వణఁకు వాఁడు దూరమున నున్న వస్త్రమును లాగుకొని కప్పుకొన్నట్లు కోపమును దెచ్చుకొనెను. ఇది జితేంద్రియుని లక్షణము. వారు కావలయునన్నప్పుడు కోపము వచ్చును. పొమ్మనినఁ బోవును. తక్కినవారికివలె వారి యనుమతిలేక రాదు. పనితీరిన తరువాత నిలువదు, లోల + అక్షుఁడై = చలించుకన్నులు గలవాఁడై,

కల్పవున్మంటలన్ = ప్రలయకాలమందలి మంటలను, కృశానుచందమునన్ = అగ్ని హోత్రునివలె, దక్షాధ్వరాలంభు = దక్షునియజ్ఞము ధ్వంసముచేయు. ఆలంభస్స్పర్శహింసయోః నానా. ర. ముక్కంటికిన్ = మూఁడుకన్నులుగల శివుని, దిదృక్షు = చూచుకోరికగలవారికి, భీకరతర = మిగుల భయంకరమైన, ఆకారంబునన్ = రూపముతో, క్రాలినన్ = ప్రకాశింపఁగా.

తా. అల్లెత్రాటియందు బాణము సంధించి ప్రయోగమునకు సిద్ధముగా నీడ్చి రాక్షసుల ప్రాణవాయువు లపహరించుటకై కోపముఁదెచ్చుకొని చలించు కన్నులు గలవాఁడై ప్రలయకాలమునందలి యగ్నిహోత్రునివలె మండుచు దక్షాధ్వరధ్వంసమునాఁటి శివునివలె చూపఱులకు భయంకరమైన యాకారముతో నొప్పఁగా.

క. భీషణరోషుం డగురఘు,భూషణు వేషంబుఁ జూచి ♦ భూతములు మహా
ఘోషంబునఁ బఱచెను సం,తోషము చెడి భూరిభీతిఁ ♦ ద్రొక్కటపడుచున్. ౩౮౧

భీషణరోషుఁడు = భయంకరమైన కోపముగలవాఁడు.

తా. భయంకరమైన కోపముఁ దెచ్చుకొన్నవాఁడైన రామభద్రుని యాకారముఁజూచి భూతములు పెద్దధ్వనులతో సంతోషముచెడి యధికభయమునఁ ద్రొక్కటపడుచుఁ బరువెత్తెను.

క. ధ్వజకోదండాభరణ, వ్రజజాజ్వలదగ్ని తుల్య♦వర్మాన్వితమై
రజనీచరసైన్యము పం,కజహితజనివేళ జలద♦గణమన నొప్పెన్. ౩౮౨

ధ్వజ = టెక్కెములు, కోదండ = విండ్లు, ఆభరణవ్రజ = భూషణముల సమూహములు, జాజ్వలదగ్నితుల్య = మండుచున్న యగ్నితోసమానమైన, వర్మ = కవచములు, వీనితో, అన్వితమై = కూడినదై, రజనీచరసైన్యము = రాక్షససేన, పంకజహిత = సూర్యునియొక్క, జనివేళన్ = పుట్టువుసమయమందు, జలదగణము = మేఘసమూహము - సూర్యోదయముకాఁగానే మేఘములు క్షీణించును. వేఁడిమికి నంతయు నావిరియై కానరాక పోవును.

రామచంద్రునికి ప్రలయకాలవహ్నిని, దక్షాధ్వరధ్వంసకుఁడగు శివుని నుపమానములుగఁ జెప్పుటచే శత్రుసంహారము జయము సిద్ధమని యేర్పడెను.

రాక్షసులను ప్రాతఃకాలమేఘమునకుఁ బోల్చుటచే క్షయము సిద్ధమని సూచింపఁబడెను.

తా. ధ్వజములు, విండ్లు, ఆభరణసమూహము మండుచున్న యగ్నివంటి కవచములుగల రాక్షససేన సూర్యోదయమందలి మేఘములవలెఁ గానిపించెను.

## ౨౫-వ సర్గము. ఖరుఁడు సేనతోడ శ్రీరాముఁ దాఁకుట.

క. క్రుద్ధు రిపుఘాతి రణస,న్నద్ధు నవష్టబ్ధచాపు ♦ నరపతితనయుఁ
బద్ధాంగుళిత్రుఁ గని ఖరుఁ, డిద్ధగతిఁ సూత పఱపు♦మీ యట కనియెన్. ౩౭౩

క్రుద్ధుఁ = కోపించియుండు వానిని, రిపుఘాతిఁ = శత్రుసంహారమందు దక్షుని, రణసన్నద్ధుఁ = యుద్ధమునకు సిద్ధపడియుండువానిని, అవష్టబ్ధచాపుఁ = వింటిని ధరించిన వానిని, బద్ధాంగుళిత్రుఁ = చేతిువ్రేళ్లకు రక్షకముగాఁ గట్టుకొనఁబడిన చేతి జిరా కలవానిని, పఱపుమీ = తోలుమా, అటకుఁ = రామచంద్రుఁడున్నచోటికి.

తా. కోపించినవాఁడును, శత్రుసంహారకుఁడును, యుద్ధసన్నద్ధుఁడును కోదండ ధరుఁడును, కట్టుకోనఁబడిన వ్రేళ్లకవచము గలవాఁడునునగు రామభద్రునిఁజూచి ఖరుఁడు సారథీ! తేరిని నాతఁ డున్నచోటికిఁ దోలు మనెను.

ఉ. ఆతనిఁ జుట్టి రాత్రిచరు ♦ లార్భటి నించి రతండు తారకో
పేతకుజాకృతిఁ వెలిఁగి ♦ భీమశితేషుపరంపరల్ వెసఁ
వ్యాతతరీతి వైచె నృపు ♦ నందఱుఁబట్టిసశూలముద్గర
వ్రాతపరశ్వధాసు లని♦వారణ వైచిరి వారిజాక్షుపై. ౩౭౪

ఆర్భటిఁ = కంఠధ్వనిని, తారకా = నక్షత్రములతో, ఉపేత = కూడిన, కుజాకృతిఁ = అంగారకగ్రహమువలె, భీమశితేషుపరంపరల్ = భయంకరములైన పదునైన బాణములవరుసలు, వ్యాతతరీతిఁ = మిగుల విస్తారముగ, పట్టిస … అసులు = అడ్డకత్తులు, శూలములు, ఇనుపగుదియలు వీని సమూహములు, గండ్ర గొడ్డండ్లు, కత్తులు, అనివారణఁ = అడ్డములేక.

తా. ఖరుఁ డిట్లు రామభద్రునిమీఁదికిఁ దేరు తోలింపఁగా నతనిచుట్టు ముట్టుకొని రాక్షసులు సింహనాదములు గావించిరి. ఖరుఁడును నక్షత్రములతోఁ గూడిన యంగారకునివలె వెలిఁగి భయంకరములై పదునైన బాణముల పరంపర లను విస్తారముగ ఆలస్యములేక రామునిపై వైచెను. తక్కిన వారందఱు రాముని చుట్టుముట్టి గుదియలు శూలములు గండ్రగొడ్డండ్లు కత్తులు నాయనపై విసరివిసరి వైచిరి. ఇప్పుడును అగరగొండ్లు రాక్షసులే; శ్రీరాముఁ డాత్మరక్షణ పరాయణుఁ డయియే నిలిచెను.

క. కాండములతోడ మదవే,తండంబులతోడ ఘనర♦థంబులతోడఁ
మెండుగఁ బైపడి రసురులు, చండాంశుకులావతంసుఁ ♦ జేక్కాడంగన్. ౩౭౫

కాండములతోడఁ = బాణములతో, మద = మదించిన, వేతండముల

తోడన్ = ఏనుగులతో, చండాంశుకులావతంసున్ = సూర్యవంశమునఁ బుట్టిన వారిలో శ్రేష్ఠుఁడగు రామభద్రుని, చేక్కాడంగన్ = సంహరించుటకు.

తా. రామభద్రుని వధించుటకై రాక్షసులు బాణములతోడను, ఏనుఁగులతోడను, రథములతోడను, నొక్కసారిగఁ బైపడివచ్చిరి.

క. ధారాధరసంఘము జల,ధారాపూరములచేత ♦ ధరణీధరమున్
బోరన ముంచెడిగతి శర,వారంబులు రామువిూఁద ♦ వర్షించి రొగిన్. ౩౮౬

ధారాధరసంఘము = మేఘసమూహము, జలధారాపూరములచేత = నీటిధారలప్రవాహములచేత, ధరణీధరమున్ = పర్వతమును.

తా. మేఘములు నీటిధారల ప్రవాహములచేఁ బర్వతమును బోరన ముంచు రీతిగ రామునివిూఁద బాణవర్షము గురియించిరి.

దీనివలన నీయుద్ధమందును బ్రథమాపరాధులు రాక్షసులే యని యేర్పడెను.

క. పారావారము తటినీ,పూరము లోఁగొనెడిరీతిఁ ♦ బురుషోత్తముఁ డా
క్రూరతరసాధనంబుల, నారాచవితానముల క్ష♦ణంబున నణఁచెన్. ౩౮౭

పారావారము = సముద్రము, తటినీపూరమున్ = ఏళ్ల ప్రవాహమును, లోఁగొనెడిరీతి = లోపలుచుకొను విధముగ, నారాచవితానంబులన్ = బాణసమూహములచే.

తా. తనను చేరవచ్చిన నదులను సముద్రుఁడు పేరు రూపము లేకుండఁ జేయునట్లు రామభద్రుఁడు తన బాణసమూహముచే వారల సర్వాయుధములను రూపుమాపెను.

ఉ. ధీరత దీప్తవజ్రనిహ♦తిన్ వ్యథఁ గూరనిభూరిశైలమో
నా రఘువీరుఁ డుగ్రముగ ♦ నాటినసాధనకోటి నింతయున్
గారణఁ బొందఁ డయ్యెమెయిఁ ♦ గాఱెడిరక్తముతో దినాంతమే
ఘోరుచయావృతార్కుఁడన ♦ నొప్పె నవీనవిలాసభాసియై. ౩౮౮

ధీరతన్ = ధైర్యముచే, దీప్తవజ్రనిహతిన్ = మండుచున్న పిడుగుదెబ్బలచే, వ్యథ = బాధ, మనోవేదన-నాన్ = అనునట్లు. కారణన్ = వేదనను "కారణాతు యాతనాతీవ్రవేదనా" అమరకోశము, దినాంత = సాయంకాలమందలి, మేఘోరుచయ = మబ్బులగొప్పగుంపుచే, ఆవృత = ఆవరింపఁబడిన, అర్కుఁడు = సూర్యుఁడు, నవీన = క్రొత్తయగు, విలాస = సౌందర్యముచే, భాసి = ప్రకాశించువాఁడు.

తా. మండుచున్న పిడుగుదెబ్బచే బాధనొందని పెద్దపర్వతమోయనునట్లు రామభద్రుఁడు ధైర్యవంతుఁడై తనకుఁ దగిలిన సాధనములచేఁ గొంచెమైన వేదనఁ

బొందినవాఁడు కాఁడయ్యె. దేహమున నెత్తురు గాఱుచుండ సాయంకాలమందలి మేఘములచే నావరింపఁబడిన సూర్యునివలెఁ గ్రొత్తయందముతోఁ బ్రకాశించెను.

ఉ. అక్కట రామచంద్రు సుగు♦ణాంబుధి నొక్కనిఁ జుట్టు ముట్టియీ
   క్షుక్కడిసోఁకుమూఁక లిటు ♦ మోఁదెడినే యని దేవతల్ ఋషుల్
   మిక్కిలి పొక్కి,రంత మిత్రి♦మీఱినకిన్క రఘూత్తముండు దా
   గ్రక్కున మండలీకృతసు♦కార్ముకుఁడై విశిఖోత్కరంబులన్. ౩౮౯

అక్కట=అయ్యో, హాకష్టమ్. దీనితద్భవము అక్కట. సుగుణాంబుధిన్ = మంచిగుణములకు సముద్రుఁడైనవానిని, క్షుక్కడి=క్షుద్రమైన, సోఁకుమూఁకలు =రాక్షసులగుంపులు, మోఁదెడినే = కొట్టుచున్నవే, పొక్కిరి = పరితాపపడిరి, కిన్కన్ = కోపముచే, మండలీకృత=ఆకర్ణాంతములాగుటచే గుండ్రముగాఁజేయఁ బడిన, కార్ముకుఁడై = విల్లుగలవాఁడై, విశిఖ + ఉత్కరంబులన్ = బాణసమూహములను.

తా. అయ్యో, మంచిగుణములనెడి రత్నములకు సముద్రుఁడైన శ్రీరామ చంద్రమూర్తిని క్షుద్రరాక్షససమూహము చుట్టుకొని యాయుధములచేఁ గొట్టు చున్నదే యని దేవతలు ఋషులు మిగులఁ బరితపించిరి. అంతట రామభద్రుఁడు మిక్కిలి కోపించి వింటిని నాకర్ణాంతము లాగి బాణములను.

## శ్రీరాముఁడు ఖరుసేనను నుఱుమాడుట.

ఉ. నూఱులు వేలు దుర్విషహ♦నూతనసూర్యజదండతుల్యముల్
   తేఱి గనంగ రాక పటు♦తీవ్రత వైచిన రాక్షసాళులన్
   దూఱి కృతాంతపాశగతి ♦ దోఁపఁగ వారల మేను వ్రచ్చి న
   ల్లేఱులఁ దోఁగి యభ్ర పద ♦ మేగె జ్వలద్దహనార్చులోయనన్. ౩౯౦

దుర్విషహ = ఏమియు సహింపరాని, నూతన = క్రొత్తయగు, సూర్యజ దండ = యమునిదండముతో. తుల్యముల్ =సమానములు, కృతాంతపాశగతిన్ = యమునిపాశమువిధమున, మేను = దేహము, వ్రచ్చి = చీల్చి, నల్ల + ఏఱుల = నెత్తురునదులందు, తోఁగి = మునిఁగి, అభ్రపదము = ఆకాశము, జ్వలత్ =మండు చున్న, దహన = అగ్నియొక్క, అర్చులో = జ్వాలలో యనునట్లు.

తా. సహింపరాని యమదండములవంటివానిని, కన్నెత్తి చూచుటకైన సాధ్యపడకుండునట్లు నూర్లువేలుగ మిక్కిలివేగముగ వైవఁగ నవి రాక్షసగుంపులను దూఱి యమునిపాశములవలె వారి దేహములను జీల్చి వారి నెత్తురు నదులందు మునిఁగి వెడలిమండుచున్న యగ్నిజ్వాలలవలె నాకాశమునకుఁ బోయెను.

ఉ. ఎన్నఁగరాని బాణముల ♦ నేసియుఁ గోసియు వ్రచ్చి క్రుచ్చియున్
బన్నగ శత్రుసంఘముల ♦ బాహులఁ గాళుల నూరులం దలల్
గ్రొన్నగలన్ ధ్వజాగ్రములఁ ♦ గుప్పలు కుప్పలు వెట్టఁ గ్రోధసం
ఛన్నహృదంతరాళుఁ డయి ♦ శత్రులు తత్తఱ మంద రాముఁడున్. ౩౯౧

ఎన్నఁగరాని = లెక్కింప సాధ్యముగాని, క్రోధ = కోపముచే, సంఛన్న = కప్పఁబడిన, హృత్ + అంతరాళుఁడయి = హృదయములోపలి ప్రదేశముగలవాఁడై.

తా. రామభద్రమూర్తి లెక్కలేని బాణములను బ్రయోగించి చీల్చిక్రుచ్చి శత్రువుల కాళ్లుతొడలు, చేతులు వాతులు - తొడలు మెడలు - తలలు మొలలు - నగలు, టెక్కెములపై భాగములు తెగనఱికి కుప్పలుకుప్పలుగాఁ బెట్టి క్రోధముచేఁ గప్పఁబడిన హృదయప్రదేశము గలవాఁడై విరోధులు తత్తఱలాడునట్లు.

సీ. కాంచనభూషణో♦దంచితహయముల, సాదులతోడుతఁ ♦ జమరి చమరి
మావటివాండ్రతో ♦ మత్తగజంబుల, నంత లంతలు దును♦మాడి యాడి
రథికసారథులతో ♦ రథనికరంబులఁ, గఱకు టంపరలచే ♦ నఱికి నఱికి
పటుతరగర్వదు♦ర్భరభటచ్ఛటలను, గూరబ్రద్దలువోలెఁ ♦ గోసి కోసి
తే. మండలీకృతచండకో♦దండదండ, సర్వతోముఖనిర్గళ♦చ్చటులవిశిఖ
ఖరగభస్తిఖరాంశుని♦కరణివెలుఁగ, నసురతతిభీతిఁ గూపెట్టె ♦ నంగలార్చె.

కాంచనభూషణ = బంగారుసొమ్ములచే, ఉదంచిత = అలంకరింపఁబడిన, హయములన్ = గుఱ్ఱములను, సాదులతోడుతన్ = రౌతులతో, చమరిచమరి = చంపిచంపి, అతిశయార్థకమున ద్విరుక్తి - అంతలంతలు = కొంచెము కొంచెము తునుకలుగా, తునుమాడియాడి = తునుమాడి తునుమాడి, శబ్దపల్లవక్రియలు కొన్ని ద్విరుక్తంబులగుచో నుత్తమపదంబు పూర్వావయవంబునకు లోపంబగు. త్రి-శే-క్రి ౨౮. తునుము + ఆడు = తునుమాడు, రథికుఁడు = రథస్వామి, సారథి = రథముతోలువాఁడు, కఱకు + అంపరన్ = పదునైన బాణములచే, పటుతర = మిక్కిలి యధికమైన, గర్వ = మదముచే, దుర్భర = అధికులైన, భట = భటులయొక్క, ఛటలను = సమూహములను, మండలీకృత = గుండ్రముగాఁ జేయఁబడిన, చండ = భయంకరమైన, కోదండదండ = దండమువంటి వింటినుండి, సర్వతోముఖ = అన్ని దిక్కులకు, నిర్గళత్ = బయలుదేఱు, చటుల = తీక్ష్ణమైన, విశిఖ = బాణముల నెడి, ఖరగభస్తి = తీక్ష్ణములైన కిరణములుగల, ఖరాంశుని = సూర్యుని, కరణి = వలె, కూపెట్టెన్ = కుయ్యోమొఱ్ఱో యని యఱచెను, అంగలార్చెన్ = దుఃఖించెను.

తా. బంగారుసొమ్ములచే నలంకరింపఁబడిన గుఱ్ఱములను జంపిచంపి,

మావటివాండ్రతోడ మదించిన యేనుఁగులను తునుకలు తునుకలుగాఁ గొట్టికొట్టి రథికులతోడను సారథులతోడను రథసమూహములను పదునగు బాణములచే నఱకి నఱకి, మిక్కిలి మదించిన భటులగుంపులను వండఁదఱిఁగిన కూరముక్కల వలెఁ గోసికోసి, యల్లెత్రాడు చెవివఱకు లాగుటచే గుండ్రమైన వింటినుండి నలుముఖముల వెలువడు బాణములనెడి వేఁడికిరణముల సూర్యునివలెఁ బ్రకాశింపఁగ రాక్షససేన యఱచి దుఃఖించెను.

క. శుష్కం బగువని దవశో, చిష్కేశునిచేతఁబోలెఁ ♦ జిత్రంబుగ నా
పుష్కరనేత్రునిచే నా, ముష్కరపరపాళి యూఁచ♦ముట్టుగఁ గూలన్. ౩౬౩

శుష్కంబగు = ఎండిన, దవశోచిష్కేశునిచేతన్ = కాఱుచిచ్చుచేత, పుష్కరనేత్రునిచేన్ = కమలములవంటి కన్నులుగల రామభద్రునిచే, ముష్కరపరపాళి = మూర్ఖులగు శత్రువుల సమూహము, ఊఁచముట్టగన్ = మొదలంట, దుష్కరప్రాసము.

తా. ఎండినయడవి దావాగ్నిచేవలె నాశ్చర్యముగ నా రామభద్రునిచే నా మూర్ఖులగు రాక్షసుల గుంపు మొదలు ముట్టఁజావఁగా.

ఉ. వారలలోనఁ గొంద అని♦వారణవారణవిక్రమక్రముల్
శూరులు మండలాగ్రసృగ♦శూలపరశ్వధహస్తులై బలో
దారుని రాము నైచిన ని♦తాంతశితాశుగసంహతిన్ వెసన్
వారలసాధనంబులను ♦ వారిశిరంబులఁ ద్రుంచె నొక్కటన్. ౩౬౪

అనివారణ = అడ్డములేని, వారణ = ఏనుఁగుయొక్క, విక్రమక్రముల్ = బలముగలవారు, మండలాగ్ర = కత్తి, సృగ = సాఁగు – భిండివాలము – పరశ్వధ= గండ్రగొడ్డలి, హస్తులై = వీనిని జేతులయందుఁ గలవారై, బల + ఉదారుని = అధికబలముగలవానిని, నితాంత = మిక్కిలి, శిత = పదునైన, ఆశుగసంహతిన్= బాణసమూహముచే, వెసన్ = శీఘ్రముగ.

తా. వారిలో నేనుఁగుబలమంత బలముగలవారు కొందఱు శూరులు కత్తులు భిండివాలములు శూలములు గండ్రగొడ్డండ్లు లోనైనవిచేతఁ దీసికొని బలసంపన్నుఁడైన రామభద్రునిపై వైవఁగా నాయన మిగులఁ బదునైన బాణముల సమూహముచే వారి యాయుధములను వారి తలలను నేకకాలమందు నఱికివైచెను.

క. శరములు కరములు శిరములు, శరాసనములుగూలి యమర♦శత్రులు చావన్
బరికించి తక్కనసురో, త్కరము వెఱచి పఱవఁదొడఁగె ♦ ఖరుమాటునకున్.

తా. రాక్షసుల బాణములు, చేతులు, తలలు, చాపములు, నేలఁగూలి చచ్చుటఁజూచి మిగిలిన రాక్షసులగుమి భయపడి ఖరునిచాటునకుఁబోయి నిలిచిరి.

సుగంధి. మానవేంద్రముక్తశాత♦మార్గణాసహిష్ణులై
వైనతేయపక్షజాత♦వాతధూతభూజసం
తానరీతి భీతయాతు♦ధానకోటి యోటమై
దీనవృత్తిఁ బాఱఁ జొచ్చె ♦ దేవవైరి డాయఁగన్. ౩౯౬

మానవేంద్ర = రామభూపాలునిచే, ముక్త = విడువఁబడిన, శాత = పదునైన, మార్గణ = బాణముల ఘాతకు, అసహిష్ణులై = సహింపలేనివారై, వైనతేయ = వినతకొడుకగు గరుత్మంతుని, పక్ష = ఱెక్కలవలన, జాత = పుట్టిన, వాత = గాలిచే, ధూత = ఎగురఁగొట్టఁబడిన, భూజ = చెట్లయొక్క, సంతాన రీతిన్ = సమూహమువలె, భీత = భయపడిన, యాతుధానకోటి = రాక్షససమూహము, ఓటమై = పరాభవపడి, దీనవృత్తి = భయమున, దేవవైరి = దేవతలకు విరోధియగు ఖరుని; సుగంధి, రజరజర. తొమ్మిదింట యతి. సుగంధుల నుత్సాహము లనవచ్చునుగాని యుత్సాహములన్నియు సుగంధులు గావు.

తా. రామభద్రభూపాలునిచే విడువఁబడిన పదునైన బాణములను సహింపలేనివారై గరుడునిఱెక్కల గాలిచే నెగురఁగొట్టఁబడిన చెట్లగుంపువలె భయపడిన రాక్షసుల సమూహము పరాభవపడి దుఃఖించుచు ఖరుని మాటునకుఁ బోయిరి.

సీ. వారల కెల్లను ♦ ధీరతఁ గల్పించి, భీషణరోషుఁడై ♦ దూషణుండు
కాకుత్స్థతిలకుపైఁ ♦ గవిసినతోడన, మునుపటివారును ♦ మూఁగి తొడరి
సాలతాలశిలాది♦సాధనంబులతోడఁ, బైపడఁ జొచ్చినఁ ♦ బార్థివుండు
ఘోరతరాకృతిఁ ♦ గురియించె శరవృష్టి, యసురులు పిఱువోవ ♦ కని యొనర్ప
తే. రోమహర్షణమయ్యె సం♦గ్రామ మప్పు, డంతఁ బోవక యసురు ల♦త్యంతరోష
మొదవ డెసలందుఁ జీఁకట్లు ♦ గదుర నొక్క, పెట్ట పైపడి రామునిఁ ♦ జుట్టుముట్టి.

కల్పించి = కలుగునట్లుచేసి, భీషణరోషుఁడై = భయంకరమైన కోపముగలవాఁడై, సాలతాలశిలాది = మద్దిచెట్లు, తాడిచెట్లు, ఱాలు మొదలైన, పిఱువోవక = వెనుదీయక, అని = యుద్ధము. రోమహర్షణమయ్యెన్ = భయముచే గగ్గురుపాటు కలిగించునది యయ్యెను.

తా. ధైర్యము గోలుపోయి వెనుకకుఁ దిరిగివచ్చిన వారి కందఱకు మరల ధైర్యము వచ్చునట్లుచేసి దూషణుఁడు భీషణరోషుఁడై రామభద్రుపైఁ గవిసెను. వెంటనే యిదివఱకు మరలినవారును గుంపుగూడి తమ యాయుధములు ముందు

ఖండితము లగుటచే మద్దిచెట్లు, తాటిచెట్లు, ఱాలు నాయుధములుగాఁ దీసికొని రామభద్రునిమీఁదఁ బైపడవచ్చిరి. రామభద్రుఁడును భయంకర బాణవర్షము వారిపైఁ గురియించెను. రాక్షసులు వెనుదీయక యుద్ధమొనర్చిరి. అప్పుడు యుద్ధము చూచువారికి గగుర్పాటు కలిగించెను. అంతలోఁ బోక రాక్షసులు మన మింద అము. వీఁడొక్కఁడు. వీనిని గెలువలేమేని యవమానముగదా యని మిగులఁ గోపించినవారై రామభద్రునిపై పడవచ్చి చుట్టుముట్టుకొని.

స్రగ్ధర. ఘోరప్రాసాసిఖడ్గా♦కుటిలశరతతు ♦ ల్గుప్పగా మీఁద గుప్పన్
జ్యారావోద్భిన్నశత్రూ♦చ్చయహృదయపుటీ♦సద్ముఁ డై కంఠరావో
దారుం డై శత్రుఘాతా♦ర్థముగ భయదగాం♦ధర్వనారాచ మేసెన్
నీరంధ్రం బై దిశాళుల్ ♦ నిశితఖగతతిన్ ♦నిండ సీతేశుఁ డంతన్. ౩౯౭

ఘోర=భయంకరమైన, ప్రాస-అసి-ఖడ్గ – అకుటిలశరతతుల్ – ప్రాసము= ఈఁటె; గుప్పన్ = వేయఁగా, జ్యారావ = అల్లెత్రాటి మ్రోఁతచేత, ఉద్భిన్న = పగిలిన, శత్రు + ఉచ్చయ = పగవారి సమూహముయొక్క, హృదయపుటీ సద్ముఁడై =దొప్పవంటి హృదయస్థానముగలవాఁడై, కంఠరావోదారుండై =సింహ నాదముచే గొప్పవాఁడై, శత్రుఘాతార్థము = శత్రువులను సంహరించుకొఱకు, నీరంధ్రము – నిర్ — రంధ్రము = సందులేనిది, నిశితఖగతతిన్ =పదునైన బాణ సమూహములచే; స్రగ్ధర. మరభనయ య య ఎనిమిదింట నెనిమిదింట యతులు.

తా. భయంకరములైన యీఁటెలు, కత్తులు, బాణపరంపరలు కుప్పలు కుప్పలుగా వారు తనమీఁద నేయఁగా రామభద్రుఁడు ధనుష్టంకారముచే వారి గుండెలు పగులఁజేసి సింహనాదము గావించి శత్రుసంహారమునకై దిక్కులందు సందులేక కఱకుబాణములు నిండునట్లు గాంధర్వాస్త్రమును బ్రయోగించెను.

శా. ఆగాంధర్వమహాస్త్రసంజనితనా♦నాకారఘోరాస్త్రసం
పూగాంధీకృత మయ్యె వ్యోమము, దివిం ♦ బూషుండు మోఘాంశుఁ డై
సాగెన్, సేనయుఁ దూలి వ్రాలి పడి నా♦శం బంది తుత్తునియలై
వ్రేగుల్ వ్రెస్సిన సోలి కూలి తుము రై ♦ బీభత్స మై పాడఱెన్. ౩౯౮

గాంధర్వమహాస్త్ర=ఆగాంధర్వాస్త్రమువలన, సంజనిత=పుట్టిన, నానాకార= అనేకములగు రూపములుగల, ఘోరాస్త్ర = భయంకరములైన యస్త్రముల యొక్క, సంపూగ = సమూహముచే, అంధీకృతమయ్యెన్ = చీఁకటిగాఁ జేయఁ బడినదయ్యెను, వ్యోమము = ఆకాశము, దివిన్ = ఆకాశమందు, పూషుండు = సూర్యుఁడు, మోఘాంశుఁడై = వ్యర్థములయిన కిరణములుగలవాఁడై.

తా. ఆ గాంధర్వమహాస్త్రమునందుఁ బుట్టిన యనేకాకారములు గల

భయంకరాస్త్రసమూహముచే, నాకాశము చీఁకట్లు క్రమ్మినదయ్యెను. ఆకాశమున సూర్యుఁడు భూమిపైఁ బడనివగుటచే వ్యర్థకిరణములు గలవాఁడై పోయెను. రాక్షససేన తూలి, వ్రాలి, పడి, తునుకలు తునుకలై శ్రేణులు దెగిపడఁగా మూర్ఛపోయి కూలి, పొడిపొడియై భయంకరమై నాశమైపోయెను.

క. శరనికరాదానంబును, శరసంధానంబు మోక్ష♦శరగమనంబుల్
పరికింప రాశరులు కర,చరణనికృంతనము దక్క♦ స్వవ్యూహమునన్. ౮౦

శరనికర = బాణసమూహములయొక్క, ఆదానంబును = లాగుటను, శరసంధానంబు = బాణములను వింటఁగూర్చుటయు, మోక్ష = విడుచుటయు, శరగమనంబుల్ = బాణములుపోవుటయు, ఆశరులు = రాక్షసులు, పరికింపరు = చూడఁజాలినవారు కారైరి, కరచరణనికృంతనము = కాలుసేతులు నఱకఁబడుట, తక్కన్ = తప్ప, స్వవ్యూహమునన్ = తమసేనయందు.

తా. రాక్షసులు తమ సేనయందు భటుల కాలుసేతులు తెగిపడుట తప్ప రామభద్రుఁడు బాణములు పొదులనుండి తీయుటగాని విడుచుటగాని బాణము పోవుటగాని చూచినవారు కారు.

క. ఆలోకబాంధవుండు దు,రాలోకుఁడుఁ గాఁగ దెసల ♦ నలమఁగ నిరులా
భీలవుగతి రఘుపతిశర,జాలమ్ములు గ్రక్కుచున్న♦చందముతోఁచెన్. ౮౧

లోకబాంధవుఁడు=సూర్యుఁడు, దురాలోకుఁడు=కానరానివాఁడు, ఇరులు=చీఁకటులు, అలమఁగన్ = వ్యాపింపఁగా.

తా. సూర్యుఁడు కానరాకుండునట్లు దెసలయందుఁ జీఁకట్లు వ్యాపించునట్లు రామచంద్రుఁడు బాణములు గ్రక్కుచున్నాఁడా యేమి యన్నట్లుండెను.

క. తగులుట నొగులుట చచ్చుట, పగతురు ప్రోవులుగ నేలఁ♦ బడుటయుఁజూడన్
యుగపత్క్రియ వెలసెను గడు,వెగ డందిరి మింటఁ జూచు♦వేల్పులు మౌనుల్.

యుగపత్క్రియ = ఏకకాలమందు జరిగినపని.

తా. రాక్షసులకు బాణముతగులుట, అవయవములు విఱుగుట, చచ్చుట, పగవారు కుప్పలు కుప్పలుగా నేలఁబడుట, యవి యన్నియు నాకాశముననుండి చూచు దేవతలకు మునులకు నేకకాలమందు జరిగిన పనిగాఁదోఁచెను.

సీ. ఉష్ణీషములతోడి♦యుత్తమాంగంబులు, నవనిపైఁ బడి దొర ♦ లాడు చుండ
నంగదకటకస♦మన్వితబాహువుల్, కట్టలు కట్టలై ♦ క్రాలు చుండ
ఊరుహస్కంధాళి♦కరణిఁ గృత్తంబులై, కుఱువులు ధరనిండఁ ♦ బఱచి యుండ
వివిధవిభూషణా♦న్వితజానుసంఘముల్, ఖండఖండంబులై ♦ కదిమి యుండ
తే. చండవేదండరథహయ♦చ్ఛత్రచామ,రధ్వజవ్యజనంబులు ♦ రవరవలుగఁ

బుడమి నిండారి నిశ్శేష♦భూతజాత,భీతిజాతక మయ్యె దృ♦గ్భీషముగను. ౪౦౩

ఉష్ణీషములతోడి = తలపాగాలతోడ, ఉత్తమాంగంబులు = శిరస్సులు, అంగద = బాహుపురులతో, కటక = కడియముతో, సమన్విత=కూడిన, బాహువుల్ = చేతులు, ఉర్వీరుహ = చెట్లయొక్క, స్కంధాళి = బోదెలసమూహముల, కరణిన్ = విధముగా, కృత్తంబులై = నఱకఁబడినవై, ఊరువులు = తొడలు, వివిధవిభూషణ = పలుతెగలగు నాభరణములతో, అన్విత = కూడిన, జానుసంఘముల్ = మోఁకాళ్లగుంపులు, ఖండఖండంబులై = తునకలుతునకలై, కదిమి = సంక్రమించుకొని, చండ = భయంకరములగు, వేదండ = ఏనుఁగులు, రథ = తేరులు, హయ = గుఱ్ఱములు, ఛత్ర = గొడుగులు, చామర = వింజామరలు, ధ్వజ = టెక్కెములు, వ్యజనములు = విసనకఱ్ఱలు, రవరవలుగన్ = తునకలు తునకలుగ, పుడమిన్ = భూమియందు, నిండారి = పూర్ణముగ వ్యాపించి, నిశ్శేష = సమస్త, భూతజాత = భూతముల సమూహములకు, భీతిజాతకము = భయముగలిగించునది, దృగ్భీషముగను = చూపునకు భయంకరము.

తా. తలగుడ్డలతోడి తలలు నేలమీఁద దొరలుచుండెను. భుజకీర్తులు, కడియములు, వీనితోఁగూడిన చేతులు కట్టలుకట్టలుగఁ బడియుండెను. చెట్లబోదెలవలె నఱకఁబడి తొడలు భూమిమీఁదఁ బఱచినట్లుండెను. నానాలంకారములతోఁ గూడిన మోఁకాళ్లు తుంటలుతుంటలుగా నాక్రమించుకొనియుండెను. భయంకరంబులైన యేనుఁగులు, తేరులు, గుఱ్ఱములు, గొడుగులు, చామరములు, టెక్కెములు, వీవనలు సన్ననిపొడులై భూమియంతయునిండి సమస్త భూతసంఘములకు భయజనకంబులై చూపునకు ఘోరముగనుండెను.

కవిరాజవిరాజితము.

విఱిగినతేరులు గూలినశూరులు ♦ వ్రీలినకేతువులున్ గొడుగుల్
తెఱచిననోరులు పాఱెడిపీరులు ♦ వ్రెల్లినగారులు పొల్లుహరుల్
తఱిగినచేతులు తున్గినమూతులు ♦ తాఱెడిభీతులు మిక్కుటమై
తెఱఁగఱి రాక్షససైన్యము సర్వము ♦ దీఱుచు నుండఁగ దూషణుఁడున్.

వ్రీలిన=పడిపోయిన, తెఱఁగు + అఱ=మునుపున్న విధముచెడి, తీఱుచు = నాశమగుచు, గారు=ఏనుఁగు

కవిరాజవిరాజితము. ఒక్క నగణము. ఆఱు జగణములు. వగణము ౧౪-వ యింట యతి. దీని భేదము అయోధ్యాకాండ మునఁ జర్చితము.

తా. విఱిగిన రథములు. చచ్చిపడిన శూరులు. నేలవ్రాలిన ధ్వజములు, గొడుగులు, తెఱచిన నోరులు, పరువెత్తుచున్న పీరులు, పడిపోయిన యేనుఁగులు,

వ్రాల్గాడు గుజ్జములు, కోయఁబడినచేతులు, తునుకలైన మూతులు, ప్రక్కలకు నొదుగు పిఱుకులు, నధికమై మునుపటి విధముచెడి రాక్షససైన్యము సర్వము నాశమగుచుండఁగ నపుడు దూషణుఁడు.

౨౬-వ సర్గము. దూషణుఁడు శ్రీరామునితో యుద్ధముఁ జేసి చచ్చుట.

ఆ. ఐదు వేల కఱకు♦టసురుల రామవధార్థ మంప వార ♦ లశనితుల్య
శూలఖడ్గబాణ♦జాలవర్షము మున్న, గాఁగఁ గవియఁ జూచి ♦ కడిమి మెఱసి.

అశనితుల్య = వజ్రములతో సమానములైన, కడిమి = పరాక్రమము.

తా. ఐదు వేలమంది కఠినదేహములు మనస్సులుగల రాక్షసులను రామభద్రునిఁ జంపుటకై పంపఁగా వారు వజ్రములతో సమానములైన శూలములయు ఖడ్గములయు బాణములయు వర్షము గురియించుచు తనమీఁదికి రాఁగాఁ జూచి పరాక్రమించి.

మ. శరవర్షంబున వారిసాధనములం ♦ జక్కాడి వర్షంబు పై
దొరఁగం బొల్చువృషంబుభంగి రఘునా♦థుం డొప్పి సక్రోధుఁ డై
శరధారాప్లుతి దూషణాన్వితముగా ♦ సైన్యంబు దైన్యంబు నొం
ద రణోర్విం జెలరేఁగి కార్మొగిలుచం♦దం బారఁగా ముంచినన్. ౪౦౬

శరవర్షంబునన్ = బాణములవానచే, చక్కాడి = నఱికి, వృషంబుభంగిన్ = ఎద్దువలె, శరధారాప్లుతి = బాణధారలనెడి నీటిధారలస్నానముచే, దైన్యంబు = దీనదశను, కార్మొగిలు = వానకాలమందలి మేఘము.

తా. శ్రీరామభద్రుఁడు తన బాణవర్షముచే వారి యాయుధముల నన్నిటిని ఖండించి తనమీఁద వానగురియుచున్నను జలింపని కోడెవలెనై కోపించినవాఁడై దూషణుతోడ సైన్యమంతయు దుఃఖదశకురాఁగా యుద్ధభూమియందు విజృంభించి వానకాలమందలి మేఘము వర్షధారలచే ముంచునట్లు బాణవర్షముచే స్నానము చేయించెను.

క. రోషంబున శాత్రవచయ, దూషణుఁ డగుదూషణుండు ♦ దోర్బలలీలా
భీషణుఁడై వజ్రనికా, శేషువులం బఱపుటయును ♦ నినకులుఁ డలుకన్. ౪౦౭

శాత్రవచయదూషణుఁడు = శత్రుసమూహముల నాశముచేయువాఁడు, దోర్బల = భుజములబలముయొక్క, లీలా = విలాసముచే, భీషణుఁడై = భయంకరుఁడై, వజ్రనికాశ = వజ్రముతో సమానములైన, ఇషువులన్ = బాణములను, పఱపుటయును = ప్రయోగింపఁగా, ఇనకులుఁడు = సూర్యవంశమున బుట్టినవాఁడు-శ్రీరామభద్రుఁడు.

తా. శత్రుసమూహములను నాశనముచేయఁగల దూషణుఁడు రోషముతో

భుజబలవిలాసముచే భయంకరుఁడై వజ్రముతో సమానములైన బాణములను ప్రయోగింపఁగా రామభద్రుఁడును కోపించినవాఁడై.

చం. క్షురమునఁ జాపముం దునిమి ♦ క్రూరచతుశ్శితమార్గణాహతిన్
హరులను నాల్గిటిం జదిపి ♦ యావలఁ గూలఁగ నేసి సూతుకం
ధరమును నర్ధచంద్రమున ♦ ధాత్రి శరత్రిక మూని దూషణున్
బరువడి వక్షముం జొరఁగఁ ♦ బార్థివవర్యుఁడు వైవ దైత్యుఁడున్. ౨౦౮

క్షురమునన్ = మంగలికత్తివంటి బాణముచే, చతుశ్శితమార్గణాహతిన్ = పదునైన నాలుగుబాణముల దెబ్బచే — హరులను = గుఱ్ఱములను, చదిపి = చంపి సూతుకంధరమును = సారథికంఠమును, శరత్రికము = మూఁడుబాణములు.

మంగలికత్తివంటి బాణముచే విల్లుద్రుంచి పదునుగల నాలుగుబాణములచే నాలుగుగుఱ్ఱములను జంపి, తరువాత సారథికంఠమును నర్ధచంద్రబాణముచే నఱికి మూఁడుబాణములు దూషణునిఱొమ్మున నాటునట్లు రామభద్రుఁడు వేయఁగా రాక్షసుఁడును;

ఉ. కాంచనపట్టవేష్టితము ♦ క్ష్మాధరశృంగనిభంబు దేవతా
సంచయమర్దనక్షమము ♦ శంకువికీర్ణము వైరిరాడ్వసో
దంచితమున్ మహాశనిశ ♦ తారసమంబు విరోధిపట్టన
ప్రాంచితగోపురోద్దళన ♦ బంధుర మాపరిఘంబు గ్రాలఁగన్. ౨౦౯

కాంచనపట్టవేష్టితము = బంగారుకట్టువేసినది, క్ష్మాధరశృంగనిభంబు = పర్వతశిఖరముతో సమానమైనది, దేవతాసంచయ = దేవతలసమూహమును, మర్దన = కొట్టుటయందు, క్షమము = యోగ్యమైనది, శంకువికీర్ణము = మేకులచే నిండినది, వైరిరాట్ + వసా + ఉదంచితము = గొప్పశత్రువుల క్రొవ్వుచేఁ బ్రకాశించునది, మహాశనిశతారసమంబు = గొప్పపిడుగుతోను, వజ్రముతోను, సమానమైనది, విరోధిపట్టన = శత్రువుల నగరములందలి, ప్రాంచిత గోపుర = గొప్పగోపురములను, ఉద్దళన = చీల్చుటయందు, బంధురము = గొప్పదైనది, పరిఘంబు = గుదియ.

తా. బంగారుకట్లుగలిగి కొండశిఖరములతో సమానమై దేవతలను మర్దింప శక్తిగలదై మేకులుగలిగి శత్రువుల క్రొవ్వుచే నొప్పి, పిడుగుతోను, వజ్రముతోను, సమానమై విరోధుల పట్టనములందలి గోపురముల విఱుగఁదన్నునది యైన కట్లగుదియను ధరించినవాఁడై

కం. ఉక్కుమిగిలి సరభసముగ, నక్కరణిని మీఁదఁ బడఁగ ♦ నరుదేరఁగఁ దా
గ్రక్కున నిరుశరములఁ దొడి, రక్కసునిరుకేలు నఱకె ♦ రాముండు వడిన్. ౨౧౦

ఉక్కు = బలము, సరభసముగన్ = శీఘ్రముగ, ఇరుశరములన్ = రెండు బాణములను, తొడి = తొడిగి-సంధించి, ఇరుకేలు = రెండుచేతులు, కేలు ఇది నిత్యైకవచనాంతము. దీనికి బహువచనమున వేఱురూపములేదు.

తా. బలముచే నతిశయించి మిగుల శీఘ్రముగ మీఁదఁ జెప్పినట్లు తన మీఁదఁబడుటకై వచ్చుచుండఁగా రామభద్రుఁడు తటాలున రెండుబాణములచే వాని రెండుచేతులను నఱకెను.

కం. కరయుగముతోడ నాయస,పరిఘము ధరఁ గూలె వాస♦వధ్వజ మనఁగన్
గరములు దెగ నసురుఁడు వడె, ధరణిని నిర్వారదంత♦దంతి యనంగన్. ౪౧౧

కరయుగముతోడ = రెండుచేతులతో, ఆయసపరిఘము = ఇనుపగుదియ, వాసవధ్వజము=ఇంద్రధ్వజము, నిర్వారదంతదంతి=కొమ్ములూడఁబెఱికినయేనుఁగు.

తా. రెండుచేతులతో నినుపగుదియను బట్టుకొని పైకెత్తికొట్టుటకై తన యొద్దకు వచ్చుచున్న దూషణుని రెండుచేతులను రెండుబాణములచే రామభద్రుఁడు నఱకఁగా నది యింద్రోత్సవమందు నింద్రధ్వజమువలె నేలఁగూలెను. చేతులు రెండు తెగుటచే దూషణుఁడును కొమ్ములుపెఱికిన యేనుఁగువలెనై చచ్చెను.

ఆ. అసురు నిహతుఁ జూచి ♦ యఖిలభూతంబులు, మేలు మే లటంచు ♦ మెచ్చె రాము
నంతలోన దూష♦ణాంతకు పై రోష,వివశు లగుచు నసుర ♦ వీరవరులు. ౪౧౨

నిహతున్ = చంపఁబడినవానిని.

తా. చచ్చిపడిన దూషణుఁజూచి భూతంబులన్నియు మేలుమేలని శ్రీరామభద్రుని బొగడెను. ఆలోపలనే కొందఱు రాక్షసవీరులు కోపముచే దేహము దెలియనివారై రామభద్రుమీఁదికి

క. స్థూలాక్షుఁడు పట్టిసమున్, శూలంబు మహాకపాల♦సురవైరియు నా
భీలపరశువుఁ బ్రమాథియుఁ, గేలం ద్రిప్పుచును వేగ ♦ గిట్టి కవియఁగన్. ౪౧౩

తా. స్థూలాక్షుఁడనువాఁడు పట్టిసమును, మహాకపాలుఁడను రాక్షసుఁడు శూలమును, ప్రమాథియనువాఁడు భయంకరమైన గండ్రగొడ్డలిని దీసికొని చేతులతోఁ ద్రిప్పుచు సమీపించి పైపడరాఁగా

సీ. మైథిలీపతి శిత♦మార్గణపంక్తిమ,హాకపాలుశిరంబు ♦ నవనిఁ గూల్చి
మహితబాణమునఁ బ్ర♦మాథిని వధియించి,స్థూలాక్షుకనుల బా♦ణాళిఁ గూరి
పంచసహస్రరా♦త్రించరవరులను, బంచసహస్రరో♦పముల నొకట
ఖండింపఁగా దూష♦ణుండు ససైన్యుఁ డై, రూపఱిపోక ఖ♦రుండు చూచి

ఆ. కినుక గదుర నీచ♦మనుజునిచేఁ జచ్చె, దూషణుండు సేన♦తోడ మీరు
చని వధింపుఁ డతని♦ననుచు యోధులఁ బంపి, తాను జనియె రాముఁ♦దాఁకుమతిని,

పంచసహస్రరాత్రించరవరులను = ఐదువేలరాక్షసశ్రేష్ఠులను, రోపములను = బాణములచే, ససైన్యుఁడై = సేనతోడ, రూపఱిపోక = రూపు మాసిపోవుటను, కినుక = కోపము, కదురఁగ = కలుగఁగా.

తా. రామభద్రుఁడు పదునైనబాణములవరుసలచే మహాకపాలుని తల నేలఁబడఁగొట్టి యొకగొప్పబాణమునఁ బ్రమాథిని జంపి, స్థూలాక్షుని కనులలో బాణములను జొనిపి యైదువేల రాక్షసులను నైదువేలబాణములచే నొక్కసారిగ ఖండింపఁగా దూషణుఁ డతనిసేనతోడ రూపుమాసిపోవుటచూచి ఖరుఁడు క్షుద్రమనుష్యులచే దూషణుఁడు సేనతోడఁ జచ్చెను. మీరు పోయి రామభద్రుని జంపుఁడని యోధుల కాజ్ఞాపించి రామునితో యుద్ధముచేయఁ దా నే బయలు దేఱెను.

## కాలకార్ముకాది సేనాపతులు పన్నిద్దఱు శ్రీరామునిచేఁజచ్చుట

సీ. కాలకార్ముక మేఘ♦మాలి మహామాలి, దుర్జయ యజ్ఞశ♦త్రులు విహంగ
ముండును రుధిరాశ♦నుండు సర్పాస్యుండు, స్థిరపృథుగ్రీవుండు ♦ శ్యేనగామి
విశ్రుతబలి కర♦వీరాక్షుఁడును బరుషుం డనువారు పం♦డ్రెండుమంది
దళవాయు లొక్కట ♦ దాశరథిని దాఁకి, విశిఖచయంబుల♦వృష్టి గురియ
ఆ. వారిబాణములను ♦ వారించి రాముండు, వజ్రతుల్యబాణ♦వర్షమునను
తరులఁబోలె నఱకి ♦ ధరణికి బలియిచ్చె, నిర్జరారివరుల ♦ నిమిషమునను. ౮౧౫

దళవాయులు = సేనానాయకులు, విశిఖచయంబులవృష్టి = బాణసమూహములవాన, తరులఁబోలెఁ = చెట్లవలె నిర్జరారివరులఁ = రాక్షసశ్రేష్ఠులను.

తా. కాలకార్ముకుఁడు, మేఘమాలి, మహామాలి, దుర్జయుఁడు, యజ్ఞశత్రుఁడు, విహంగముఁడు, రుధిరాశనుఁడు, సర్పాస్యుఁడు, పృథుగ్రీవుఁడు, శ్యేనగామి, కరవీరాక్షుఁడు, పరుషుఁడు ననువారు పండ్రెండుగురు సేనానాయకు లొక్కసారి రామభద్రుని ఢీకొని బాణవర్షముఁ గురియింపఁగా వారిబాణములను ఖండించి రామభద్రుఁడును వజ్రముతో సమానములైన బాణములవర్షముఁ గురియించి చెట్లను నఱకి పడఁద్రోచినట్లు వారిని నఱకి భూదేవికి నిమిషములో బలియిచ్చెను.

క. కర్ణాకారేషుల నా,కర్ణాంతము లాగి నూటి ♦ ఖలశతకంబుఁ
దూర్ణమ వేయింటను సము,దీర్ణబలుం డగుచు నేసెఁ♦దెగ వేవు రనిన్. ౮౧౬

కర్ణికారేషుల = గన్నేరాకులవంటి యాకారముగల బాణముల, ఆకర్ణాంతము = చెవికొనవఱకు, ఖలశతకంబుఁ = నూర్వురుదుష్టులను, తూర్ణము = వేగము, సముదీర్ణబలుండు = వృద్ధిపొందిన బలముగలవాఁడు, తెగ = ఖండములగునట్లు, వేవురు = వేయిమంది.

ఉదీర్ణబలుఁడనుటచే యుద్ధముచేయుకొలఁది బలము హెచ్చుచుండెను గాని క్షయింపలేదని భావము.

తా. గన్నేరాకులవంటి బాణములను నూటినినాకర్ణాంతము లాగి నూఱు గురిని, వెయ్యిబాణములచే వేయిమందిని నఱికి భూమికి బలియిచ్చెను.

ఉ. కూలిన చాపదండములు ♦ గుప్పలు రాలిన భూషణంబులున్
వ్రాలిన టెక్కియంబులును ♦ బ్రద్దలువాఱినస్యందనంబులున్
జాలుగఁ గాఱురక్తములు ♦ చాలిక నన్నవిధంబు దోఁపఁగా
గాలునివంటయి ల్లనఁగఁ ♦ గ్రాలె రణావని రక్తపంకమై. ౪౧౭

చాపదండములు=దండములవంటివిండ్లు, స్యందనములు= తేర్లు, చాలుగన్ = ప్రవాహముగ, చాలును = సమృద్ధి, కాలుని = యముని, రణావని=యుద్ధభూమి, రక్తసిక్తమై = నెత్తుటితోఁ దడిసినదై.

తా. పడిపోయినవిండ్లు, కుప్పలుపడిన సొమ్ములు, ఒఱగిన ధ్వజములు, తునకలయిన తేరులు, వంకలుపాఱు నెత్తురులు. ఇఁకఁజాలును. దండియన్నట్లు కానరాఁగా నిదియేమి యమునివంటయిల్లా యనునట్లు యుద్ధభూమి నెత్తుటితోఁ దడిసి కానవచ్చెను.

ఆ. రక్తసిక్తు లగుచు ♦ ముక్తకేశంబుల,తోడ ధరణిఁ బడిన♦దుష్టదివిజ
వైరిచయము కేశ♦వర్గంబుతో నిల, కుశసమేత వేది♦కొమరు దాల్చె. ౪౧౮

రక్తసిక్తులు = నెత్తుటితోఁ దడిసినవారు, ముక్తకేశంబులతోడన్ = ముడివీడి వ్రేలాడు వెండ్రుకలతో, దుష్ట = దుర్మార్గులయిన, దివిజవైరి = రాక్షసులయొక్క, చయము = సమూహము, కేశవర్గంబులతోన్ = వెండ్రుకలగుంపులతో, కుశసమేతవేదికొమరు = దర్భలతోడి వేదివిధమును.

తా. నెత్తుటఁ దడిసి, విరిసిన వెండ్రుకలతో నేలమీఁదఁబడిన దుష్టరాక్షససమూహముయొక్క వెండ్రుకలతో భూమి దర్భలతోడి వేదివలెఁ గానవచ్చెను.

క. పదునాలుగువేవుర దు,ర్మదుల మహాక్రూరకర్మ♦రాక్షసవరులన్
బదికుఁడు నెక్కటినరుఁడగు, సదమలమతి రామమూర్తి♦చంపెం గడిమిన్.

వేవురన్ = వేయిమందిని, దుర్మదులన్ = చెడ్డపొగరుగలవారిని, మహాక్రూరకర్మ = మిక్కిలి క్రూరములైన పనులుచేయు, పదికుఁడు = కాల్నడనుండువాఁడు, ఎక్కటి = అసహాయుఁడు, ఒక్కఁడు – నరుఁడు = మనుష్యుఁడు, సదమలమతి = నిర్మలమనస్సుగలవాఁడు, కడిమిన్ = బలముచే.

తా. దుష్టగర్వనిష్ఠులును మిగులఁ గ్రూరకార్యములు చేయువారును నగు

రాక్షసులను పదునాలుగువేలమందిని, కాలినడనుండువాఁడు ఒంటిరిగాఁడు మను ష్యుఁడునగు నిర్మలమనస్సుగల రామమూర్తి భుజబలముచేఁ జంపెను.

క. దురమునకుం బూనినయా, యిరువాఁగున నప్పు డొప్పి ♦ రిల జీవముతో
ఖరుఁడు త్రిశిరుండు శాత్రవ, హరుఁ డగురాముండుఁ దక్కి ♦నంతయుఁ దీఱెన్.

దురమునకున్ = యుద్ధమునకు, ఇరువాఁగునన్ = రెండుపక్షములందు, తీఱెన్ = సమసెను.

తా. యుద్ధమునకుఁ బూనుకొన్న రెండు పక్షముల వారిలో నప్పుడు ఖరుఁడు, త్రిశిరుఁడు, రామభద్రుఁడు తప్పఁ దక్కిన యందఱుఁ జచ్చిరి.

## ౨౭-వ సర్గము. త్రిశిరుండు శ్రీరామునితోఁ బోరి చచ్చుట.

చ. ఖరుఁ డది చూచి రామునకుఁ ♦ గట్టెదు రై చనఁ బూన వాహినీ
వరుఁడు త్రిశీర్షుఁ డడ్డపడి ♦ వాసవమర్దన నేను గల్గఁగాఁ
బరుపయి నీవు పోవు టిది ♦ భావ్యమె? రాముని గీముఁ బట్టి మ
చ్ఛరములఁ ద్రుంచి వైతు నిము♦సంబున, బాస నొనర్తు వింటిపై. ౭౨౧

కట్టెదురు = కడు + ఎదురు - ఎట్టెదురు. కడు, నడు, నిడు, కుఱు, చిఱు శబ్దంబులకు నచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారం బగు. వాహినీవరుఁడు=సేనా నాయకుఁడు, వాసవమర్దన=ఇంద్రునిదండించినవాఁడా, పరుపయి = విరోధిమీఁదికి, భావ్యమే=సరియా. గీముక్, నిందయందు గా, గీలగు. రాముఁడు గీముఁడు ఇట్లు.

తా. సేనయంతయు నాశమైపోవుటచూచి ఖరుఁడు రాముని కభిముఖుఁడై పోవఁ బ్రయత్నింపఁగా సేనానాయకుఁడగు త్రిశిరుఁడు ఇంద్రుని గెలిచినవాఁడా నేను జీవించియుండఁగా శత్రువుమీఁదికి నీవు పోవుట మర్యాదయా? ఇట్టి యాలో చన నీవు చేయవచ్చునా? తుచ్ఛుఁడైన రామునిఁబట్టి నా బాణములచే నిమిష ములో నజుకివైచెదను. ఈ వింటిమీఁదఁ బ్రమాణముచేసి చెప్పెదను.

చ. అతనికి నేనొ నా కతఁడొ ♦ యంతకుఁ డయ్యెడు, నిల్చి చూడుమీ
హతుఁడుగ రాముఁడుం జనుదు ♦ వంత నిజాలయమున్ ముదాన, నే
మృతుఁడుగ నైన నీ వతని ♦ మేటిరణంబునఁ గిట్టి పట్టి యు
ద్ధతి నడఁగింపు, మన్న నతఁ ♦ డట్లగుఁ గావుతఁ బొమ్మటం చనన్. ౭౨౨

అంతకుఁడు = యముఁడు, చంపువాఁడు, నిజాలయమున్ = నీ యింటిని, ముదానన్ =సంతోషముతో. ఖరదూషణత్రిశిరులు ముగ్వు రేక కాలమున రామ చంద్రుని దాఁకియుండిన గెలిచియుందురేమో యని కొందఱకు భ్రాంతి. జయాప

జయము లెట్లుండినను పూర్వకాలమున వీరులగు వారు వీరులతోఁ బోరునపుడు పరసహాయ్యమపేక్షించుట యవమానకరమని తలఁచుచుండిరి. ఒకవీరునిమీఁదికి నొకవీరుఁడే పోవలెనుగాని పెక్కువమంది పోయి జయించుటయు నవమానకరమే. ఒకవీరునిపైఁ జిల్లరమూఁక యెందఱైనఁ బైపడవచ్చునుగాని వీరుఁడ ననుకొను వాఁడు రెండవవాని సాహాయ్యము కోరక "యశోవా మృత్యుర్వా" యని యసహాయుఁడై యుద్ధముచేయును. మఱియెవఁడైన సాహాయ్యముచేసిన నది తన్నవమానించినట్లెంచును. కావుననేకదా లక్ష్మణుమీఁద రావణుఁడు శక్తి వైచినపుడు రాముఁడూరక చూచుచుండెను గాని ఖండింపఁడయ్యెను. కుంభకర్ణుఁడు సుగ్రీవునిఁ బట్టుకొని పోవునపుడు హనుమంతుఁ డూరక వెంటఁబోయెను గాని విడిపించినవాఁడు కాఁడు.

ఈ ధర్మము ద్వాపరముననే చెడినది. అభిమన్యువధయే దృష్టాంతము. ఏ విధముననో యొకవిధముగ శత్రువును జంపుట యిప్పటివారికి ముఖ్యము. ధర్మముతోఁ బనిలేదు. నేఁటికాలపు యుద్ధమును యుద్ధమనరాదు. వేఁట యనవలయును. వంచనము ప్రధానముగాని పౌరుషము ప్రధానముగాదు.

తా. రాముని నేనో నన్ను రాముఁడో చంపుట నిజము. దీని నీవు నిల్చి చూచుచుండుము. రాముఁడు చచ్చెనా నీవు సంతోషముతో నింటికిఁ బొమ్ము. నేను జచ్చితినా నీవు రామునిమీఁదికి యుద్ధమునకుఁ బోయి యతని గర్వమణఁగింపుము. అని చెప్పఁగా ఖరుఁ డట్టులేయగును గాక పొమ్మనెను.

చ. చనియెఁ ద్రిశృంగపర్వతము♦చాడ్పున స్యందన మెక్కి రాముపై
సునిశితబాణజాలముల ♦ జోరున వర్షముఁ బోలె వైచి క్రం
దున జలసిక్తమైనపెను♦దుందుభి నాఁ ద్రిశిరుండు గర్జలన్
నినిచిన, విల్లు ద్రిప్పుచును ♦ నిష్ఠురబాణము లూని రాముఁడున్. ౮౨౩

త్రిశృంగపర్వతము=మూఁడుశిఖరములుగల కొండ, జలసిక్తమైన=నీటితోఁ దడిసిన, దుందుభి = నగారా.

తా. త్రిశిరుఁడు మూఁడు శిఖరముల కొండవలెనై రథమెక్కిపోయి రామభద్రుని మీఁద జోరున వర్షమువలె బాణములు గురియించి నీటఁదడిసిన నగారాధ్వనివలె సింహనాదములు సేయఁగా రామభద్రుఁడును రా రమ్మని తనవిల్లు గిరగిరద్రిప్పుచు కఠిన బాణములు ధరించి.

చ. త్రిశిరుని వైచె నాతఁడును ♦ దీవ్రతరాగ్రహవృత్తి రేఁగినన్
దశరథు నాత్మ సూతికిని ♦ నాకివిరోధికి నద్భు తావహం

బళమితతీవ్రతం దగె మృ♦గాధిపదంతిరణం బనంగ, నా
త్రిశిరుఁడు భల్లకత్రయ మ♦రీణగతిఁ న్నృపుఫాలభాగమున్. ౮_౨౮

తీవ్రతర + ఆగ్రహ + వృత్తి=మిక్కిలితీవ్రమైన కోపముయొక్క వ్యాపారముచే, నాకివిరోధి= దేవశత్రువగు త్రిశిరునకు, ఆత్మసూతికి= కుమారునకు, అద్భుతావహంబు=ఆశ్చర్యకరమైనయుద్ధము, అశమితతీవ్రతన్ = అణఁగని తీవ్రత్వముచే, మృగాధిపదంతిరణంబు = సింహమునకు నేనుఁగునకు జరిగిన యుద్ధము. ఈ యుపమానము రామత్రిశిరుల బలతారతమ్యమును దెలుపుటేగాక జయము రామచంద్రునకే సిద్ధమనియుఁ దెలుపుచున్నది. భల్లత్రయమున్ = మూఁడు బాణములను, అరీణరీతిన్ = సూటిగా, ఫాలభాగమున్ = నొసటి ప్రదేశమును.

తా. త్రిశిరునిమీఁద వేయఁగానతఁడును మిగులఁగోపించి విజృంభింపఁగా రామభద్రునకు రాక్షసునకు యుడుగని వేగమున నద్భుతమైనయుద్ధము సింహమునకు నేనుఁగునకువలె జరిగెను. అప్పుడు త్రిశిరుఁడు మూఁడు బాణములను రామభద్రునినొసట నాటునట్లు వైచెను.

ఉ. క్రుచ్చినఁ గోప మెత్తి రఘు♦కుంజరుఁ డిట్లను రాక్షసాధమా
మెచ్చితి నిన్ను శూరుఁడవు ♦ మెత్తనిపూవులువోలె బాణముల్
గ్రుచ్చితి నాలలాటమునఁ ♦ గొమ్మిదె నచ్ఛరపాళి యంచుఁ బెం
పచ్చుపడంగ వానియుర♦మందు శరంబులు నాలుగుం బడిన్. ౮_౨౯

తా. ఇట్లు త్రిశిరుఁడు నొసట నాట బాణములు వేయఁగా రామభద్రుఁడు కోపించి యోరి నీచరాక్షసుఁడా, నిన్ను శూరుఁడవని మెచ్చితిని. (ఇది పరిహాసవచనము) మెత్తనిపూవులు వేసినట్టు బాణములు నానొసట నాట వేసితివి. ఇదిగో నా బాణములను గ్రహింపుము అని పదునాల్గు బాణములను వాని ఱొమ్మునందు.

ఉ. నాటఁగ వైచి గుఱ్ఱముల ♦ నాల్గిట సూతుని నెన్మిదింట నొ
క్కేటునఁ డెక్కెముం దునిమి ♦ పృథ్వికి దాఁటునిశాటువక్ష మా
స్ఫోటముగాఁగఁ దీవ్రశర♦పూగము వైచిన వీతచేష్టుఁడై
పోటఱి చచ్చి నేలఁ బడెఁ ♦ బూర్వనికృత్తనిజోత్తమాంగుఁడై. ౮_౩౦

నిశాటు = రాక్షసునియొక్క, ఆస్ఫోటముగాఁగ = పగులునట్లు, తీవ్రశరపూగమున్ = తీక్ష్ణములైన బాణసమూహమును, వీతచేష్టుఁడై = చేష్ట లుడిగినవాఁడై, పోటఱి = శక్తిహీనుఁడై, పూర్వ = ముందే, నికృత్త = నఱకఁబడిన, నిజ = తనయొక్క, ఉత్తమాంగుఁడై = శిరస్సుగలవాఁడై.

తా. నాటునట్లు వేసి గుఱ్ఱముల నాలుగు బాణములచేతను, సారథి నెనిమిదింటను, ఒక్కదెబ్బతో టెక్కెమును ద్రుంచి భూమిమీఁదికి దుముకఁబోవు రాక్ష

ముని వక్షము చీలునట్లు తీవ్రబాణము వైచిన పౌరుషహీనుఁడై చేష్ట లుడిగి ఖండింపఁబడిన శిరస్సుగలవాఁడై నేలఁబడెను.

ఉ. ఆతనిపాటుఁ గన్గొని ఖ♦రాశ్రయసేవకరాక్షసుల్ మహా
భీతిని బాఱి రెల్లయెడ ♦ బెబ్బులిఁ జూచినలేళ్లు వోలె నా
భీతుల నెల్ల ద్రిప్పికొని ♦ పేరలుకన్ ఖరుఁ డిందు రాహువ
ట్లాతతలీల నాదశర♦థాధిపనందను మార్కొనం జనెన్. ౮_౨౭

భీతులన్ = భయపడినవారిని, పేరలుకన్ = పెద్దకోపముతో. పేర్వాదుల లుగాగమము విభాషనగుఁ గావున నిచట లుగాగమము లేదు. ఇందున్ = చంద్రుని, ఉభయసేనలయందు ముప్వురుతప్పఁ దక్కినయందఱుఁ జచ్చినట్లు ౮_౨౦-వ పద్యమునఁ జెప్పబడెను. ఇచ్చటఁ గొందఱు శేషించినట్లు చెప్పఁబడినది. వీరెవ్వరు ?

౮_౨౦-వ పద్యమున యుద్ధమునకై వచ్చిన వారిలో నని చెప్పఁబడెను. యుద్ధమునకై వచ్చినవారు పదునాల్గు వేవురు. వీరందఱు జంపఁబడిరి, ౮౧౯-వ పద్యమునఁ జెప్పఁబడెను.

యుద్ధయాత్ర పోవునపుడు యుద్ధభటులకు సహాయులై బాణములు మోసి కొని పోవువారు లోనగు పరిచారకులు కొందఱు పోవుచుందురు. ఇందుఁ జెప్పఁబడిన వారా తెగలోని వారు. రామభద్రుఁడు యుద్ధమునకై వచ్చిన వారిని మాత్రమే చంపెనుగాని వారి సేవకులను జంపినవాఁడు కాఁడు. కావుననే యిచ్చట ఖరాశ్రయ సేవకరాక్షసులని చెప్పఁబడెను గాని యుద్ధభటులని చెప్పఁబడలేదు. కావుననే వీరిపై బాణము ప్రయోగించినట్లు చెప్పఁబడలేదు. ఇదియకదా సీతోపదేశము. దోషముచేయని వానిని జంపరాదు. ఒకఁడు దోషముచేసినను వాని దోషమునకై వానితోఁ గలసియున్న మాత్రమున నిర్దోషులను జంపరాదు. ఇచ్చట రామచంద్రునిచే నీ ధర్మమనుష్ఠింపఁబడెను.

తా. త్రిశిరుఁడు పడిపోవుటచూచి ఖరుని నాశ్రయించియుండు సేవకులగు రాక్షసులు రామభద్రుఁ డిఁకఁ దమ్ముఁ జంపునే యని మహాభయమున పెద్దపులిని జూచిన లేళ్లవలె నాలుగు దిక్కులకుఁ బరువెత్తిరి. నేనుండఁగా మీకేమి ప్రాణ భయమని వారికి ధైర్యముచెప్పి వారినందఱుఁ బిలుచుకొనివచ్చి నిండు కోపమున ఖరుఁడు చంద్రునిమీఁదికి రాహువుపోవునట్లు పోయెను.

## ౨౭-వ సర్గము. ఖరుఁడు శ్రీరామునితో రణం బొనర్చుట.

సీ. అని దూషణత్రిశీ♦ర్షాదుల గతిఁ జూచి, గుండె ఝల్లనఁగ ఖ♦రుం డి దేమి
విక్రమం బవుర దో♦ర్విక్రమవంతులఁ, బదునాల్గువేవురఁ ♦ బ్రథితబలులఁ

త్రిశిరుని దూషణుఁ ♦ ద్రిక్కక ఖండించె, రాముఁ డెక్కటి నేమి♦భీమబలము!
కానిమ్ము చూచెదఁ ♦ గాక యం చింద్రుని, నముచి మార్కొనినచం♦దంబుదోఁప
తే. గవిసి యాశీవిషోపమ♦కాండములను, గుప్పఁగూరలుగా వైచి ♦ గుణము మీటు
చస్త్రశస్త్రకళాదిసా♦మర్థ్య మెల్లఁ, బ్రకటితంబుగఁ జలిపెను ♦ రణము ఖరుఁడు.

అనిఁ = యుద్ధమందు, ఝల్లనఁగ = ఇదియనుకరణపదము గావున వర్గ చతుర్థాక్షరము గలదయ్యెను. ఋ ౠ ఌ ౡ విసర్గ వర్గయుగ్జ ఇ + శషలు. తత్సమాన్య దేశ్యానుకరణంబులఁగూడి యాంధ్రభాషంజొచ్చు సు. వ్యా. సంజ్ఞా ౧౭ సూ.

దోర్విక్రమవంతులఁ = భుజబలము పరాక్రమముగల వారిని, ప్రథిత బలులఁ = ప్రసిద్ధులైన బలశాలురను, త్రిక్కక = తప్పక, ఎక్కటి = అసహాయుఁడై. నముచి = ఒకానొకరాక్షసుఁడు, ఆశీవిషోపమ = పాములతో సమానములైన, కాండములను = బాణములను, గుప్పగూరలుగాఁ = కుప్పలుపడునట్లు, గుణము = అల్లెత్రాడు.

తా. యుద్ధమునందు దూషణుఁడు త్రిశిరుఁడు చచ్చుటఁజూచి గుండె ఝల్లుమన ఖరుఁ డిట్టులనుకొనెను: 'ఆహా? యదియేమి విక్రమము? ఔరా! ప్రసిద్ధికెక్కిన బలశాలులను బదునాలుగువేలమందిని, దూషణుని త్రిశిరుని నొక్కనినైన వదలక యొంటరిగాఁడైన రాముఁడు ఖండించెను. ఏమి భయంకరబలము! నేనొక్కఁడను వీనికి లక్ష్యమా? అయినను గానిమ్ము చూచెదనుగాక' అని యింద్రుని మీఁదికి నముచిపోయినట్లు కవిసిపాములవలెఁ గ్రూరములైన బాణములను కుప్పలు కుప్పలుగాఁ బ్రయోగించి నారి మీటుచు తనయస్త్రశస్త్ర విద్యాపాండిత్యమంతయు వెల్లడియగునట్లు ఖరుఁడు యుద్ధముచేసెను.

మ. సకలాశాపరిపూరణంబుగ మహా♦శస్త్రాస్త్రసంతానముల్
భ్రుకుటీభంగముతోడ రాముపయిఁ జో♦ప్పం దప్ప నీ కేసినఁ
వికలత్వం బొకయింత లేక నిజదో♦ర్విక్రాంతి దీపింప సా
యకముల్ దుర్విషహస్ఫులింగచటుల♦వ్యాపారముల్ గ్రక్కనన్. ౭౨౯

సకల + ఆశా + పరిపూరణంబుగఁ = సమస్తదిక్కులు నిండునట్లు, మహాశస్త్రాస్త్రసంతానముల్ = గొప్ప శస్త్రములయు నస్త్రములయు సమూహములు, భ్రుకుటీభంగముతోడ = బొమముడితో, వికలత్వంబు = నిబ్బరములేమి, నిజ = తన, దోః = భుజముల, విక్రాంతి = పరాక్రమము, దీపింపఁ = వెలుగఁగా, సాయకముల్ = బాణములు, దుర్విషహ = సైఁపరాని, స్ఫులింగ = మిణుఁగురులుగలవి, చటులవ్యాపారముల్ = వేగముగల మనస్సుగలవి.

తా. ఖరుఁడు కోపముచే కనుబొమలు ముడివైచి సమస్తదిక్కులు నిండు నట్లు గొప్ప యస్త్రములయు శస్త్రములయు సమూహములను రామభద్రుఁడు కొంచెమైన మనస్సు చెదరనీక తన భుజపరాక్రమము ప్రకాశించునట్లు లోపవరాని మిఱుఁగురులుగలవియు మహావేగముతోఁ బోవునవియునగు బాణములను జాగు లేక.

శా. ఆకాశం బవకాశశూన్యముగ నేయన్ బాణజాలావృతుం
డై కానంబడఁ డయ్యె సూర్యుఁ డటు లన్యోన్యప్రఘాతార్థులై
త్రాక్రాంతుం డసురాధినేత పెనఁగన్ శాతాశుగాళిన్ ఖరుం
డాకౌసల్యతనూజు నొంచె సృణి మత్తానేకపంబుంబలెన్. ౪౩౦

అవకాశశూన్యముగన్ = ఎడములేకుండునట్లు, బాణజాల + ఆవృతుండై = బాణసమూహములచేఁ గప్పఁబడినవాఁడై, అన్యోన్యప్రఘాతార్థులై = ఒండొరులను గొట్టు కోరికగలవారై, శాతాశుగాళిన్ = పదునైన బాణముల వరుసచే, సృణిన్ = అంకుశముచే, మత్త = మదించిన, అనేకపంబుంబలెన్ = ఏనుఁగునువలె.

తా. ఆకాశమున సందులేనట్లు వేయఁగా నాబాణముల సమూహముచే నావరింపఁబడినవాఁడై సూర్యుఁడు కానరాఁడయ్యె. ఆప్రకార మొకరినొకరు కొట్టవలయుననుకోరికతో రామభద్రుఁడు ఖరుఁడు యుద్ధము సేయునెడ మదించిన యేనుఁగును నంకుశముతోఁ బొడిచినట్లు ఖరుఁడు పదునైన బాణముల వరుసలచే రామభద్రు నొప్పించెను.

ఉ. నొంచి యుగావసానశమనుం దలఁపించుచు నిల్చి ఘోరరా
త్రించరకోటితోడఁ గడుఁదీవ్రత నీతఁడు పోరి పోరి తా
నించుక డయ్యఁడే యనుచు నెంచె, మృగేంద్రపరాక్రమున్ ఖరున్
గాంచె నరేంద్రుఁ డల్పపుమృగంబును సింహము చూచుకైవడిన్. ౪౩౧

యుగావసానశమనున్ = ప్రలయకాలమందలి యమధర్మరాజును, తలపించుచున్ = జ్ఞప్తికిఁ దెచ్చుచు, ఘోరరాత్రించరకోటితోడన్ = భయంకరులైన రాక్షసుల సమూహముతో, కడుఁ దీవ్రతన్ = మిక్కిలియధికముగ, పోరిపోరి = ఎంతోయుద్ధముచేసియు, ఇంచుక = కొంచెమైనను, డయ్యఁడే = అలసటచెందిన వాఁడుగాఁడే, మృగేంద్రపరాక్రమున్ = సింహవిక్రముని, కైవడిన్ = విధముగ.

తా. ఈప్రకారము నొప్పించి ప్రలయకాలయమునిఁ దలఁపునకుఁ దెచ్చునట్లు నిలిచి భయంకరులైన యిందఱు రాక్షసుల గుంపుతో నెంతో యుద్ధము చేసియుఁ గొంచెమైన నీసింహవిక్రముఁ డలయకున్నాఁడే యేమి యీయనబల మని యాలోచించెను. రామభద్రుఁడును వాని సింహ మొక యల్పమృగమును

జూచినట్లు చూచెనేకాని వాఁడొకబలవంతుఁడగురాక్షసుఁడని తలంచినవాఁడును గాఁడు.

క. క్రించుఁడు భాస్కరసన్నిభ, కాంచనరథతలమునందుఁ ♦ గాండాసనముం
జంచద్గతిఁ ద్రిప్పుచుఁ బా, శాంచితకరశమనుభంగి ♦ నవనిపుఁ గదిసెన్. ౪౩౨

క్రించుఁడు = అల్పుఁడగు ఖరుఁడు, భాస్కర = సూర్యునితో, సన్నిభ = సమానమైన, కాంచనరథతలమునందు = బంగారు తేరియందు, కాండాసనమున్ = వింటిని, కాండ + ఆసనము = బాణములను జిమ్మునది, చంచత్ + గతిన్ = గిరగిర తిరుగువిధముగా, పాశాంచితకర = పాశముచేఁ బ్రకాశించు హస్తముగల, శమనుభంగిన్ = యమునివలె, అవనిపున్ = రాజును, కదిసెన్ = సమీపించెను.

తా. అల్పుఁడైన ఖరుఁడు సూర్యునివలెఁ బ్రకాశించు బంగారు తేరిపైనుండి గిరగిర వింటిని ద్రిప్పుచు పాశమునుచేత ధరించిన యమునివలె రామభద్రు సమీపించి.

ఖరుఁడు శ్రీరాముకవచంబు భేదించుట.

చ. వనదహనంబు డాయుశల♦భం బన రామునిఁ దాఁకి విల్లు చ
య్యనఁ గరలాఘవంబు మెఱ♦యన్ దృఢముష్టితలంబు ద్రెయ్యఁగా
సునిశితబాణముల్ వఱపి ♦ సూర్యనికాశకలంబసప్తకం
బున రఘువీరుకంకటము ♦ భూమిపయిం బడ నేసెఁ దీవ్రుఁడై. ౪౩౩

వనదహనంబున్ = కారుచిచ్చును, డాయు = సమీపించు, శలభంబనన్ = మిడుతయనునట్లు, సూర్యనికాశ = సూర్యునితో సమానమైన, కలంబసప్తకంబునన్ = ఏడుబాణములతో, కంకటము = కవచము, తీవ్రుఁడై = వేగముగలవాఁడై.

తా. కాఱుచిచ్చును సమీపించు మిడుతవలె రామునిఁ దాఁకి తనహస్తలాఘవము మెఱయునట్లు రామభద్రుఁడు పట్టినవిల్లు, వింటిని పట్టుకొన్న పిడికిలి చీలునట్లుగా కఱకుములుకులఁ బ్రయోగించి, సూర్యునితో సమానమైనకాంతిగల యేడు బాణములచే రామభద్రుని కవచము నేలమీఁదఁ బడునట్లు వేగముగఁగొట్టెను.

చ. కవచము నేలఁ గూల్చి లయ♦కాలభయంకరగర్జలట్టియా
రవముల నించుచున్ శితశ♦రంబు లసంఖ్యముగాఁగఁ గప్ప భూ
ధవుఁడు ఖరామరారి శర♦తాడితుఁడై గతధూమవహ్నినా
మివుల వెలింగె భీషణస♦మీకతలంబున రోషదీప్తుఁడై. ౪౩౪

లయకాల = ప్రలయమందలియముని, భయంకరమైన, గర్జలట్టి = సింహనాదములవంటి, ఆరవములన్ = ధ్వనులను, శర = బాణములచే, తాడితుఁడై = కొట్టఁబడినవాఁడై, గతధూమ = పోయినపొగగల, పొగలేనివహ్నినాన్ =

అగ్నిరివో యనునట్లు, మిగులన్ = మిక్కిలి, రోషదీప్తుఁడై = కోపముచే మండుచున్నవాఁడై, భీమణసమీకతలంబునన్ = భయంకరమైన యుద్ధప్రదేశమందు, వెలిఁగెన్ = ప్రకాశించెను.

తా. ఇట్లు ఖరుఁడు రామభద్రుని కవచము నేలఁబడఁ గొట్టి ప్రలయకాలమందలి యముని సింహనాదములవంటి సింహనాదములు గావించుచు పదునుగల బాణములు లెక్కలేక గురియింపఁగా రామభద్రుఁడును రాక్షసునిబాణములచేఁ గొట్టఁబడి పొగలేనిమంటవలె రోషముచే మండుచు భయంకరమగు యుద్ధభూమియందుఁ బ్రకాశించెను.

ఉ. కోపము రూపముం గొనిన♦కోపున నాతనిరూపు మాపఁగా
నేపున నవ్యచాపము ము♦నీశ్వరదత్తము వైష్ణవంబు సీ
తాపతి పూని రోపముల ♦ దారుణరీతి ఖరధ్వజంబు ధా
త్రీపతితంబుఁ జేయ నది ♦ ద్రెళ్లె సురాజ్ఞను సూర్యుఁడో యనన్. ౭౩౫

కోపునన్ = విధముగ, మునీశ్వరదత్తము = అగస్త్యునిచే నీయఁబడిన వైష్ణవధనుస్సును, రోపములన్ = బాణములను, ధాత్రీపతితంబున్ = నేలఁబడినది.

తా. కోపము రూపము ధరించినట్లయి యతని జంపుటకుఁగాను అగస్త్యుఁడిచ్చిన వైష్ణవధనుస్సును దీసికొని రామభద్రుఁడు బాణముల సంధించి ఖరుని ధ్వజము విఱిగి నేలఁబడునట్లు కొట్టఁగా నది దేవతలశాపముచేఁ బడు సూర్యునివలెఁ బడెను.

ఉ. సంగరమర్మకోవిదుఁడు ♦ శాతశరంబుల రామచంద్రు–మ
ర్మాంగము లోలి దూఁటఁ బ్రద♦రాగ్ర్యచతుష్కము వైచి రక్తసి
క్తాంగునిఁ జేయ, మూర్ధమును♦నాయతబాహు లురంబు నాటఁగా
రింగునఁ గ్రుచ్చెఁ దా నొకట ♦ రెంటను మూఁటను రాముఁ డాఖరున్. ౭౩౬

సంగరమర్మకోవిదుఁడు = యుద్ధరహస్యములందుఁబండితుఁడు, శాతశరంబులన్ = పదునైనబాణములచే, మర్మాంగములు = ఆయువుపట్టులు, ఓలిన్ = వరుసగా, దూఁటన్ = పొడుచునట్లు, ప్రదరాగ్ర్యచతుష్కము = నాలుగుమేలిబాణములను, రక్తసిక్తాంగునిన్ = నెత్తుటఁ దడిసిన దేహముగల వానిని, మూర్ధము = శిరస్సు,

తా. యుద్ధరహస్యము దెలిసిన ఖరుఁడు నాలుగు పదునుగల బాణములచే రామభద్రుని యాయువు పట్టులుపొడుచునట్టులేసి నెత్తుటఁదడిసిన దేహముగలవానిని గాఁజేయఁగా నాయనయు నొక బాణమును శిరస్సునందు, రెండు బాణములను బాహువులందు, మూఁడు బాణములు వక్షస్థలమునందు నాటనేసెను.

చ. ఉఱక విభుండు వెండియుఁ ద్రయోదశ బాణములూని వైరిపెం
పఱఁగ నొకంటఁ గాఁడియు హయంబుల నాల్గిట సూతు నొక్కటన్
బిఱుసన మూఁటిచే నొగయు వేగమ యక్షము రెంటఁ ద్రుంచి క్ర
చ్ఛున నవలీల బాణయుత చాపముఁ ద్రెంచెను ద్వాదశంబునన్. ౪౩౭

ఉఱక=లక్ష్యము సేయక, త్రయోదశ బాణములు=పదుమూఁడు బాణములు, పెంపు+అఱఁగన్=విజృంభణ మణఁగునట్లు, క్రచ్ఛున్=శీఘ్రముగ, అవలీలన్=సునాయాసముగ, బాణయుతచాపమున్=బాణముతోఁగూడియుండిన వింటిని, ద్వాదశంబునన్=పండ్రెండవ దానిచే.

తా. ఖరుఁడు వేయు బాణములను లక్ష్యపెట్టక రామభద్రుఁడు పదుమూఁడు బాణములు సంధించి శత్రువు విజృంభణ మణఁగునట్లు ఒకదానితో కాఁడియు, నాలుగింటిచే గుఱ్ఱములను, సారథి నొక్కదానిచేతను, మూఁడు బాణములచే నొగయు, ఇరుసును రెండింటిచేతను, బాణముతోడి వింటిని పండ్రెండవ బాణమునను ద్రుంచెను.

క. పతి వెండియుఁ బదుమూఁడవ, శితశరమున ఖరుని మేను చీల్చిన నతఁడున్
హతసారథి హతహయుఁడై, క్షితికిని లంఘించె గదను గేలం గొనుచున్. ౪౩౮

తా. పదునగు పదమూఁడవ బాణముచే ఖరుని దేహము చీలునట్లు వేయఁగా నతఁడు చంపఁబడిన సారథియు గుఱ్ఱములు గలవాఁడై చేత గద తీసికొని భూమిమీఁదికి దాఁటెను.

క. అద్భుత మగు కౌసల్యా, ప్రోద్భవు చారిత్రమునకుఁ బుష్కరవీథిన్
ముద్భారంబునఁ బొదలుచు, సద్భావముతోడఁ బూజ సలిపిరి వేల్పుల్. ౪౩౯

కౌసల్యాప్రోద్భవు=కౌసల్య కుమారుఁడగు రామభద్రుని, పుష్కరవీథిన్=ఆకాశ మార్గంబున, ముత్+భారంబునన్=సంతోషాతిశయముచే, సద్భావముతోడన్=మంచి తలంపుతో, వేల్పుల్=దేవతలు.

౨౯-వ సర్గము. ఖరుని శ్రీరాముఁడు నిందించుట.

చ. గద గొని నిల్చియున్న ఖరుఁ గాంచి ధరాతనయాధవుం డనున్
మృదువుగ హృద్వ్రణంబులగు నిష్ఠురవాక్కుల రాక్షసాధమా!
గొదకొని తేరులున్ హరులుఁ గుంజరముల్ పొలుపార గర్వివై
యదయత లోకదూష్య మగు నాఁడిచేఁతలు చేసి తిస్సిరో. ౪౪౦

హృద్వ్రణంబులు=హృదయమునఁ బుండువంటివి, గొదకొని=అతిశయించి, ఆఁడిచేఁతలన్=చెడ్డకార్యములను, ఇస్సిరో=ఛీఛీ, కుంజరములు=ఏనుఁగులు,

లోకదూష్యము=జనులచే నిందింపఁబడునది ; ధరణీతనయావిభుండనుటచే సీతా దేవి రక్షణ ప్రధానకార్య మని చెప్పిన మాటలు స్మరించినవాఁడని భావము.

ఈ ఘోరయుద్ధమందు మాటల కెడములేకున్నను గర్వకారణములగు సర్వము, సేనయు, నాయుధములు సమయుటచే నిష్ఫలుడైనఁ దెలివి తెచ్చుకొని బాగుపడునేమో రక్షింతమను నుద్దేశ్యముతో నయము భయము దోఁప రామ భద్రుఁడు ఖరునితోఁ జెప్పుచున్నాఁడు—౨౨౫ వఱకు నీతిని బోధించునవి. అవల భీతిని కలిగించునవి. ఇవియే యీ పద్యమునందు మృదువులని, నిష్ఠుర వాక్యములని చెప్పఁబడెను.

తా. చేత గదఁబట్టుకొని నిలిచియుండు ఖరుని జూచి సీతాపతి మెత్తని మాటలచేతను హృదయమునఁ బుండువంటి కఠినవాక్కులచేతను నిట్లనెను. ఓరీ! నీచరాక్షసుఁడా! విస్తారముగ రథములు, గుఱ్ఱములు, ఏనుఁగు లుండుటచే గర్వించినవాఁడవై, దయలేనివాఁడవై లోకులు నిందించు చెడ్డపనులు చేసితివి. ఛీ, ఛీ.

క. తాపముఁ గూర్చుచు జనులకుఁ, బాపంబులఁ జేయువాఁడు ♦ పరమేశ్వరుఁ డేన్
బ్రాపించుఁ గీడుఁ దప్పక, పాపాత్మా! నీవిధంబుఁ ♦ బలుకఁగ నేలా. ౨౨౧

తా. జనులకు బాధ గలిగించుపాపకార్యములను జేయువాఁడు పరమేశ్వరుఁ డైనను దప్పక కీడులకుఁ బాలుపడును. పాపీ! ఇఁక నీవనఁగా నెంతవాఁడవు?

చ. భువనవిరుద్ధ మైనపనిఁ ♦ బూని యొనర్చుచు దుష్టచిత్తుఁ డై
పొవరున సంచరించుఖలు♦పొం గణఁగింపఁగఁ జూతు రెల్లరున్
భవనసమాగతో గ్రఫణి♦భంగిని; ధూర్తు స్వలోభ కామసం
భవకలుషంబులం జెడును ♦ బ్రాహ్మణి దా వడగండ్లచే బలెన్. ౨౨౨

భువనవిరుద్ధము = లోకమునకు విరోధమైనది, పొంగు = గర్వము, భవన సమాగత = ఇంటిలోఁజేరిన, ఫణిభంగిని=పామువలె, ధూర్తు = దుష్టుఁడు; వృద్ధ, నీచ, మూర్ఖ, ధూర్త, గృహస్థ చార్వాకశబ్దములకు ప్రథమావిభక్తి ప్రత్యయము ''డు'' లేకయు రూపములు గలవు. ఇవి ఉకారాంతము లగును; ధూర్తుఁడు, ధూర్తు రెండును సాధురూపంబులే. స్వలోభకామ=తనలోభముకామముచే, సంభవ = పుట్టిన, కలుషంబులన్ = పాపములచే, బ్రాహ్మణి = నలికండ్ల పాము.

తా. ఇంటిలోఁజేరిన పామును జంపుటకు నెట్లు జనములు యత్నము చేయుదురో యట్టులే లోకమునకుఁ గీడు కలిగించు కార్యములను జేయుచు చెడ్డమనస్సు గలవాఁడై గర్విష్ఠియై తిరుగు దుష్టుని గర్వ మణఁగింప లోకులెల్లరు సాధువులసాధువులుకూడఁ బ్రయత్నింతురు. దుష్టుఁడు, తా నొకరికి నీయరా దనులోభగుణము

చేతను పరులది తనకు రావలయు నను కామముచేతను కలిగినపాపములచే నలి కండ్లపాము వడగండ్లను దిని చచ్చినట్లు చెడును.

ఉ. ఏమిఫలంబుఁ బొందెదవొ ♦ హీననిశాటుఁడ! దండకాటవీ
భూమిఁ జరించుసాధుముని♦పుంగవులన్ వరధర్మనిష్ఠులన్
హామికఁ జంపి చంపి; కలు♦షాత్ములసంపద శీర్ణమూల మా
భూమిరుహంబుభంగి నిలఁ♦బోవదు దీర్ఘముగా దురాత్మకా. ౭౭౩

హీననిశాటుఁడ = నీచరాక్షసుఁడా! హామికన్ = గర్వముచే, శీర్ణమూలము= వేరు తెగినది, భూమిరుహము = చెట్టు, దీర్ఘముగా = చిరకాలము.

తా. నేనేమి పాపము చేసితిని నేను పాపము చేసియుండిన నా కీసంపద యెట్లు వచ్చెను? అందువేమో. ఓరీ నీచరాక్షసా? దండకారణ్యమునందు సంచరించు మునిశ్రేష్ఠులను గొప్ప ధర్మమునందు నిలుకడగలవారై యా కారణముచేఁ బరుల కెవ్వరికి నేబాధయుఁ గలిగింపని సాధువులను నీ యిష్టము ప్రకారము గర్వించి చంపితివి కదా. దానివలన నేమి మేలు గలుగునని తలఁచితివి? సాధారణముగ నీ జన్మమునఁ జేసిన పుణ్యపాప ఫలము లీ జన్మమందే యనుభవమునకు రావు. పోయిన జన్మములందుఁ జేసిన పుణ్యమువలన నీ జన్మమున సంపద గలుగును. అయిన నేమి లాభము? పుణ్యముచేతఁగదా మన కైశ్వర్యము గలిగె నను జ్ఞానమ్ము లేక మదముచేఁ బాపములు చేయువారి సంపద వేరుచెడిన చెట్టువలె దీర్ఘకాలము నిలువదు. త్వరలోనే నశించును. అట్టులే పోయిన జన్మమున నీవు చేసిన పుణ్యఫలము తీఱినది. పాప ఫల మనుభవించు కాలము వచ్చినది.

క. ఋతువులు సమకూరినచో, క్షితిజము తగుపూలు పూచు♦ చెలువున నరుఁ డు
ద్ధతిఁ జేసినయఘములఫల, మతఁడ యవశ్యంబు నొందు ♦ నయ్యయివేళన్. ౭౭౪

క్షితిజము = చెట్టు.

తా. విత్తనము నాటఁగానే పూలు పండ్లు చేతికి రానట్లు పాపముచేసిన వెంటనే పాపఫలము రాదు. చెట్లు ఋతువులు ప్రాప్తించినపుడు గదా పూలు పూచును. అట్టులే మనుష్యుఁడు తానుజేసిన పాపఫలము దానికాలము వచ్చినపుడు తప్పక యనుభవించును.

క. విసమును గూడినయన్నము, గ్రసియించినవానిపగిదిఁ గలుషఫలము లౌ
దొసఁగులు పాపాత్ముం డెటు, వెసఁగుడుచుం; బాపఫలము ♦ వృథ పోదెపుడున్.

గ్రసియించిన = తినిన, దొసఁగులు = కీడులు, వెసన్ = శీఘ్రముగా,

తా. విసముతోఁ గలసిన యన్నము దినినచోఁ దప్పక కీడెట్లు కలుగునో

యట్టులే పాపఫలములయిన కీడులును శీఘ్రమునందే యే విధముగనైన మనుష్యుఁ డనుభవించునుగాని తప్పదు.

ఆ. పాప మాచరించు♦పాపాత్మకుల భువ, నాహితార్థులైన♦యట్టిఖలుల
సంహరించుటకును ♦ జననాథుచే నాజ్ఞఁ, బొందివచ్చినాఁడఁ ♦ బొలసుదిండి. ౭౭౬

భువనాహితార్థులు = జనులకుఁ గీడుచేయఁగోరువారలు, ఖలులన్ = దుష్టులను, పొలసుదిండి = మాంసభక్షకుఁడ.

తా. పాపకార్యములు చేయు పాపాత్ములను లోకమునకుఁ గీడుచేయఁదలఁచు దుష్టులను జంపుటకై రాజాజ్ఞగొని, రాక్షసుఁడా వచ్చితిని.

"కుమతులకుం గర్తయగుచుఁ గోపింపంగా । నమితాజ్ఞానిపుణుండగు । శమనుండా వీఁడునేఁడు జగములకెల్లన్" అన్నట్లు లోకములోని పాపాత్ముల దండించుటకు నీ వేమి యమధర్మరాజవా ? మేమెట్లుండిన నీ కేమి ? అందువేమో. పరలోకమున దండించువాఁడు యముఁడైనచో నీలోకమునఁ బాపులదండించువాఁడురాజు. కావున నేను బాపాత్ముల దండింప రాజాజ్ఞ గొని వచ్చితిని.

రాజవుకమ్ము నీవు జనరాజికి, వన్యమృగాళి కయ్యెదన్ రాజను దండకాటవికి గ్రక్కునఁ, బోయెదఁ బొమ్ము వీటికిన్. అను (అయోధ్య ౨౮౨ పద్యము) వాక్యమిచ్చట స్మరణీయము. ఇంతవఱకు నయముగఁజెప్పి వానియందు మెత్తనిపాటుగానక యిఁక భయముచేనైన మంచిమార్గమునకు వచ్చునేమో యని కఠినముగఁ జెప్పుచున్నాఁడు.

ఉ. పాములు పుట్టలోనికిని ♦ బాఱెడుభంగి మదీయమార్గణ
స్తోమము నీశరీరమునఁ ♦ దూఱి నినున్ సహసైన్యమిత్రుఁగా
నీమునుచంపినట్టివ్రత♦నిష్ఠుల వెంబడిఁ గాపు పుచ్చురా
నీమెయి కండగర్వమును ♦ నేఁ డిటఁ జూపర చూతు రాక్షసా. ౭౭౭

మదీయ = నా యొక్క, మార్గణ = బాణముల, స్తోమము = సమూహము.

తా. పుట్టలోకిఁ బాములు పోవు విధముగ నా బాణములు నీ శరీరమునఁ దూఱి నిన్ను నీ సైనికులతోడను, మిత్రులతోడను, ముందు నీవు చంపిన ఋషుల వెంటఁగాపు పోవఁజేయును. నీ దేహమునఁ గండగర్వ మెంతయున్నదో యంతయు నిప్పుడే చూపుము చూచెదను.

ఇటువంటి దుష్టరాక్షసులు పుణ్యాత్ములైన మునులుపోవు లోకమునకే పోదురా ?

"ద్వావిమౌపురుషౌలోకే, సూర్యమండల భేధినౌ, పరివ్రాడ్యోగయుక్తశ్చ రణేచైవాభిముఖోహతః." అన్నట్లు యుద్ధమున వెనుకంజవెట్టక యభిముఖుఁడై చచ్చిన వీరునకు స్వర్గముకలదు. ఇది సర్వవీరసామాన్యము. ఇఁక శ్రీరామునిచే యుద్ధమునఁ జచ్చినవారికి స్వర్గప్రాప్తియేల మోక్షప్రాప్తియుఁ గలుగును. మరణకాలమున భగవద్దర్శనము, భగవచ్చింత గలవారికి నరకమేల వచ్చును? కావున రాక్షసదర్శనమున రాక్షసచింతచే రాక్షసులచేతఁ జచ్చినమునులకంటె వీరికే గొప్ప ఫలము కలదు. కావుననే స్కాందమున "రామవిద్ధా నిశిచరా బాణైర్మర్మసుతాడితాః రామమాసాద్యసమరే సాయుజ్యపదవీంగతా" యని రాక్షసులకు సాయుజ్యము వచ్చినట్లు చెప్పఁబడెను.

"యం యం వాపిస్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్
తం తమేవైతి కౌంతేయ సదామద్భావభావితః" భ. గీ. ౮. ౬.

ఈ విషయమున శ్రీభాగవతంబున

కం. వైరానుబంధనంబునఁ
జేరినచందమునవిష్ణుఁ జిరతరభక్తిన్
జేరఁగరాదని తోఁచెను
నారాయణభక్తియుక్తి నా చిత్తమునన్.

అను నారదసూక్తి స్మరణీయము.

పరమభక్తివలెఁ బరమవైరము సాయుజ్యము కలిగించును. "ఏనకేనాప్యుపాయేన మనః కృష్ణే నివేశయే" త్తని యేయుపాయముచేనైన సరియె మనస్సు భగవంతునందు నిలుపుట ప్రధానము. ఈ యుద్ధమునఁ జచ్చిన పదునాలుగువేల రాక్షసులకు సాయుజ్యముగలదా? లేదు. వీరికి శ్రీరామచంద్రమూర్తియందుఁ బరత్వబుద్ధిలేదు. తీవ్రధ్యానములేదు, యుద్ధమునఁ జచ్చినవారి విషయమై భారతంబున నిట్లు చెప్పఁబడినది.

మైత్త్వాతాని శరీరాణి హృష్టైః పరమసంయుగే
దేవరాజసమాన్ లోకా నతాస్తే సత్యవిక్రమాః
యే త్వహృష్టేన మనసా మర్తవ్య మితి భారత
యుధ్యమానా హతాః సంఖ్యే, గాంధర్వైః సహసంగతాః
యేచ సంగ్రామభూమిష్ఠా, యాచమానాః పరాఙ్ముఖాః
శస్త్రేణ నిధనం ప్రాప్తా గతాస్తే గుహ్యకా న్ప్రతి
పాత్యమానాః పరైర్యేతు హీయమానా నిరాయుధాః

ప్రీణిషే.వా మహాత్మానః పరా నభిముఖా రణే
ఛిద్యమానాః శస్త్రైః శస్త్రైః క్షత్రధర్మపరాయణా
హతా స్తే బ్రహ్మసదనం గతా వీరాః సువర్చసః॥

యుద్ధమందు శరీరములను సంతోషముతో శత్రువుల బాణాగ్నియందు హోమముచేసినవారికి నింద్రలోకము, మనస్సున సంతోషములేక చావవలసినదే గనుక యుద్ధముచేయుద మని చేసి చచ్చినవారికి గంధర్వలోకము, సంగ్రామమందు యాచించుచునో పరాఙ్ముఖులయియో పోవుతఱి బాణములు తగిలి చచ్చినవారు గుహ్యలోకమునకు, క్షత్రధర్మమెఱింగి పలాయనమగుటయవమానకర మని తలంచి శత్రువుల నెదిరించి నిరాయుధులై పోయిచంపఁబడినవారు బ్రహ్మలోకమునకుఁ బోదురు. అంతియ కాని యందఱకు సమానలోకము రాదు.

చ. నిరయము నొంద యుద్ధ ధర♦ణిస్థలి మామక తీవ్రమార్గణో
త్కరములఁ గూలియున్న నిను ♦ గాఢముదాన విమానసుస్థితుల్
దురుసున నీవధించినవ్ర♦తుల్ గనుఁగొందురు, తాటిపండున
ప్పురుస భవచ్ఛిరంబుఁ బడ ♦ వైచెద నీబల మెంతో చూపుమా.　　౭౭౮

నిరయము = నరకబాధవంటిబాధ, మామక = నాయొక్క, తీవ్ర = పదునైన, మార్గణ = బాణముల, ఉత్కరములన్ = సమూహములచే, కూలియున్న = చచ్చిపడిన, గాఢముదాన = అత్యంతసంతోషముతో, విమానసుస్థితుల్ = విమానమందుఁ జక్కఁగా నున్నవారు, దురుసునన్ = దుష్టుతనముచే, వ్రతుల్ = మునులు, ఇందు నిరయమనఁగా యమనరకముగాదు; బాణఘాతములచే గలుగు నరక బాధ వంటి బాధయని యర్థము. అటుగాకున్న మీఁది పద్యమునఁ జెప్పఁబడినది వ్యర్థమగును.

తా. యుద్ధరంగమందు నాబాణముల నేలఁగూలి బాధపడు నిన్నుఁజూచి నీవు వధించిన మునులు ఆకాశమున విమానము లందున్నవారై మిగుల సంతోషముతోఁ జూతురు.

తాటిపండు నేలఁబడఁగొట్టినట్లు నీ శరీరమును నేలఁబడఁగొట్టెదను. కావున నీ బలమెంత యున్నదో దాని నంతయుఁ జూపుము. నీ బలమంతయు నీవు చూపిన పిమ్మటనే నిన్నుఁ జంపెదను. బలమంతయుఁ జూపిన రాముఁడేమై యుండునో యను కొఱంత నీకు నీ వారికి నక్కఱలేదు,

చ. అని తను నాడు రామమను♦జాధిపుఁ గన్గొని కోపరక్తలో
చనుఁ డయి నవ్వి రాక్షసుఁడు ♦ చెప్పిడిమూఁకను జంపినంత నే

కనుఁగవ కానలేక కడు♦గర్వమునన్ నిను నీవ మెచ్చుకో
ఘనత లభించునే? విను వి♦కత్థనముల్ బలియుండు పల్కునే? ౨౨౯

చప్పిడి = సారహీనమయినది, వికత్థనముల్ = తన్నుఁదాను బొగడుకొను మాటలు, బలియుండు = బలవంతుఁడు.

తా. అని తన్ను నిష్ఠురములాడుచున్న రామభద్రునిఁ జూచి యవి తన మేలునకై చెప్పఁబడుచున్నవని తెలిసికొనలేని యాఖరుఁడు యుద్ధమునందు సాధారణముగ నందఱచేఁ జెప్పఁబడు బిభీషికోక్తు లని (బెదరింపుమాట లని) తలఁచి కోపముచేఁ గన్నులెఱ్ఱచేసి నవ్వి యిట్లనెను. ఓరీ! నిస్సారమైన యీ గుంపును జంపినంతనే గర్వముచేఁ గన్నులుగానలేక మహాశూరుఁడ నని నిన్ను నీవు మెచ్చుకొనఁగానే గౌరవమువచ్చునా? బలవంతుఁ డగువాఁడు తన్నుఁ దా మెచ్చుకొనునా?

మఱియొకయర్థము-నవ్వి=మహాత్ములుకూడ నొక్కొక్కసారి తమ యోగ్యతకుఁ దగనికార్యములు చేయుదురుకదా యనినవ్వి.

చప్పిడి...లభించునే = రామచంద్రా నీవు మహానుభావుఁడవు. భగవంతుఁడవు. నీవు సంకల్పముచేతనే అనేకకోటిబ్రహ్మాండముల సృష్టింపఁగలవు. సంహరింపఁగలవు. అట్టి నీ వీచచ్చుమూఁకలఁ గొందఱఁజంపి యదియొకగొప్ప కార్యముగఁ జెప్పెదవేల? అది నీయోగ్యతకుఁ దగినకార్యమా? నీవంటిబలిష్ఠుఁడు కూడ నాత్మస్తుతి యను దోషమునకుఁ బాలుపడునా? నీవహంకార మమకారములు లేనివాఁడవే. ఈ యహంకారమెందుండివచ్చెను. నిన్నుభయపెట్టుట కందువా? నీవెవఁడవో నాకు వాస్తవము తెలియకుండినఁగదా నీకు భయపడుదును. నాశాపమోక్షణము చేయవచ్చిన విష్ణువవే. నామేలుకోరివచ్చిన నీకు భయపడుదునా? నన్ను భయముపెట్టి యింకను జీవింపఁజేసి శాపఫలమింకను ననుభవించుచు నీ పాడుజన్మమునందే యుండు మనెదవా? ఇట్టియభిప్రాయము నీకుఁదగునా?

సీ. పౌరుషశాలి యా♦బలవంతుఁ డేయెడఁ, దాఁజెప్పనే స్వకృ♦త్యములఁ బొగడి
నీచు లౌధారిణీ♦నేతలు నీయట్లు, రజ్జు లాడెదరు ని♦రర్థకముగఁ
దనమహాకుల ప్రసూ♦తత్వంబుఁ జాటుచు, ననవసరంబుగ ♦ మనుజుఁ డెవఁడు
మృత్యుకాలంబున♦మేకొనుఁ బొగడుకో? దర్భాగ్రమున నున్న♦దహనుమాడ్కి

తే. నిట్టు నిను నీవ పొగడుకోఁ♦బట్టి తెలిసె నీలఘుత్వంబు; గదఁగొని♦ కేలనిలువ ధాతుచితమప్రకంప్యమా♦ధరణిధరము,చొప్పమైనున్న నన్నిటఁ♦జూడవొక్కొ.

రజ్జులు = పొగడుకోలుమాటలు, నిరర్థకముగన్ = నిష్ప్రయోజనముగ, మహాకులప్రసూతత్వము = గొప్పవంశమునఁబుట్టుట, చాటుచున్ = ప్రకటించుచు,

అనవసరంబుగన్ = సమయముగానప్పుడు, దర్భాగ్రమునన్ = దర్భకొనయందు, దహనుమాడ్కిన్ = అగ్నివలె, లఘుత్వంబు = పలుచఁదనము, ధాతుచితము = ధాతువులతోఁగూడినది, అప్రకంప్యము = కదలింపరానిది, ధరణీధరము=కొండ, నీచులౌధారుణీనేతలు = నీవు నీచుఁడవు రాజవుగావు, వారివలె మహాత్ముఁడవగు నీవేల నటించెదవు? మృత్యుకాలంబునన్ = శత్రువులకు మరణకాలము ప్రాప్తించినదని తెలిసియు వారియెదుట నెవఁడు తన్నుఁదాను బొగడుకొనును? అది నిష్ప్రయోజనకార్యముగదా, చచ్చెడివారియెదుటనా పౌరుషోక్తులు.

తా. మగతనముగల బలశాలి తనకార్యములను దాను జెప్పుకొనఁడు. నీచులగురాజులే నీవలె నిష్ప్రయోజనముగ వ్యర్థభాషణము లాడుదురు. తాను గొప్పవంశమునఁ బుట్టితినని ప్రకటించుచు ననమర్థంబుగ నీవలె మరణము సమీపించినసమయంబునఁ దన్నుఁదాను బొగడుకొన నంగీకరించును. నిన్ను నీవు పొగడుకొనఁబట్టి దర్భకొనయందలి యగ్నివలె నీవెంతటినీచుఁడవో తెలిసెను. చేత గదఁ బట్టుకొని ధాతువులతోఁగూడి కదలింపరాని పర్వతమువలెనుండు నేను నీకుఁ గానరాలేదా.

అ. పాశహస్తుఁ డైన♦భాస్కరసూనుఁడు, జగము లన్ని బారి♦సమరుమాడ్కి
నీగదానిహతిని ♦ నిప్పుడ నినుఁ జంపఁ, జాలువాఁడఁ జూడు ♦సత్త్వహీన.౨౨౦

భాస్కరసూనుఁడు = యముఁడు, బారిసమరుమాడ్కిన్ = హింసించురీతి, సత్త్వహీన = బలహీనుఁడా.

తా. ప్రలయకాలమందు యముఁ డొకపాశముచేతనే లోకముల నన్నిటిని హింసించునట్లు నే నీయొకగదచేతనే లోకములనెల్ల హింసింపఁగలను గాని నిన్నుఁ జంపఁజాలువాఁడనా? కాను. అని యర్థము.

సత్త్వహీన = ఇచ్చట సత్త్వము తక్కిన రెండు ప్రకృతిగుణములకు నుపలక్షణము; అనఁగాఁ బ్రకృతిసంబంధములైన సత్త్వరజస్తమస్సులు నీయందు లేవు.

అప్రాకృతపురుషుఁడవగుటశుద్ధసత్త్వమయదివ్యమంగళవిగ్రహోపేతుఁడవు.

తా. ప్రలయకాలమున యముఁడు పాశముఁ జేతఁబట్టుకొని ప్రపంచమునఁ గల జీవులనెల్ల హింసించునట్టు లీగదదెబ్బచేత నిప్పుడే నిన్నుఁ జంపెదను. బలహీనుఁడా! చూడుము.

ఉ. నిన్ననఁ బూనుకొన్నను న♦నేకము లున్నవి, పల్కనొల్ల, నా
సన్నదినాంత మయ్యె, రవి ♦ జాఱిన యుద్ధవిఘాత మబ్బెడిన్

జన్నసురారిపాళులకుఁ ♦ జయ్యనఁ ద్వద్వధ నశ్రుమార్జనం
బున్నది చేయఁగాఁగలుగుసను త్తమకార్యము, మాట లేటికిన్? ౪౫-౨

ఆసన్నదినాంతము = సమీపించినసాయంకాలము, యుద్ధవిఘాతము = యుద్ధమునకు విఘ్నము, చన్న = మరణించిన, సురారిపాళులకున్ = రాక్షస సమూహములకు, త్వత్ వధ = నిన్నుఁజంపుటచే, అశ్రుమార్జనంబు = కన్నీళ్లు తుడుచుట, ఉత్తమకార్యము = గొప్పపని, నీవలనఁజచ్చుటచే దర్భాగ్రమున నున్న దహనుమాడ్కి = దర్భాగ్రముననున్న యగ్ని బంగారువలె నతివేగముగానుండి ప్రకాశించినను, నల్పకాలమందే చల్లాఱి వేఱొకవస్తువును గాల్పలేనట్లు, నీహొగడు కోలుచే నీవు గొప్పవాఁడవుగా కొంచెముసేపు కానవచ్చినను, వెంటనే నీవేమి యుఁ జేయఁజాలనివాఁడవని యేర్పడునని గోవిందరాజీయము— బంగారును దహించు నగ్నిచే బంగారువలెనుండు పిత్తళినిగాల్చిన నల్లగాఁగానవచ్చును. అట్లే శూరులకుఁ దగినమాటలు నీవు చెప్పుటచే నీశూరమానిత్వము బయలుపడెనని మహేశ్వరతీర్థీయము.

తా. నిన్ను నే ననఁబూనిన ననవలసిన వెన్నియో యున్నవి కాని యన నిష్ట ము లేదు. ఏలయందువా? సాయంకాలముసమీపించినది. సూర్యుఁ డస్తమించెనా యుద్ధము నిలుపవలసివచ్చును. రాత్రి మాకనుకూలకాలమేకదా. యేల నిలుపవలె నందువా?

నీవు మనుష్యుఁడవు రాత్రులందుఁ జీఁకటిలో నీవు యుద్ధముచేయలేవు. అట్టి ప్రతికూలసమయమందు నిన్నుఁ జంపుట నాపౌరుషమునకుఁదగినది కాదు. అదియునుగాక నిన్ను ప్రొద్దుగ్రుంకులోపలఁజంపి నీచేఁ జచ్చినవారికై యేడ్చువారి బంధువులకు నేను గన్నీళ్లుదుడిచి సమాధానపెట్టవలసిన గొప్పకార్యమున్నది. నీతో ముచ్చటల పెట్టుకొంటినేని యది యెట్లు నెఱవేఱును?

వాస్తవార్థము— నీచేఁ జచ్చినవారి స్త్రీలు బంధువులు నీపాపాత్మునిచే వీనికై మామగవారందఱుఁ జచ్చిరని నన్ను దూషించుచున్నారు. వారివలె నేను నీచేఁ జచ్చితినా వారు సమాధానపడి నన్ను దూషింపకుందురు. నేనొకఁడు బ్రదికి యింటికిఁబోయితినా వారిదుఃఖము నేను జూడలేను కావున నీచే నాకు మరణమే శ్రేయస్కరము. ఈయర్థమున త్వద్వధన్, త్వత్ = త్వతః, నీవలని వధను అని అన్వయింపవలెను. ఈకారణముచే నీవు నాకు హితముపదేశించినను ఆప్రకారము వర్తింపఁజాలకున్నాను.

చ. అని గదఁ గేలఁ ద్రిప్పి మనుజాధిపుఁ బిడ్డనుబోలె వైచినన్
ఘనతరవృక్షగుల్మముల ♦ నాశమొనర్చుచుఁ గిట్టి రాఁగ మిం

టన రఘురామచంద్రుఁడు ఘ♦నప్రదరప్రకరంబునన్ వడిన్
దునుకలుగాఁగఁ గూల్చె ఫణిఁ ♦ దోరపుమంత్రబలంబునం బలెన్. ౪౫౩

పిడ్గునుబోలె = పిడుగునుబోలె—అచ్చికంబులఁబదమధ్య నులుఁడురుల యుత్వంబునకు లోపంబు బహుళంబు. సు. వ్యా. సంధి ౨౧. అడుగడ్డునకు మాధవానుచింతన, భాగ; ఘనతరవృక్షగుల్మముల = గొప్పచెట్లను, బొదలను, కిట్టి = సమీపించి, మింటన = ఆకాశమునందే, ఘనప్రదరప్రకరంబునన్ = గొప్పబాణముల సమూహముచే, ఫణిన్ = పామును, ఘనతరవృక్షగుల్మముల నాశమొనర్చుచు ననుటచే వీరు యుద్ధముచేయుస్థలము పెద్ద అరబయలుగాదని యేర్పడుచున్నది. అంతటి ఘోరారణ్యములో నిందఱు నిలుచుటకు యుద్ధముచేయుటకుఁ జాలినంతబయలెందుండివచ్చును.

తా. ఈప్రకారముచెప్పి గదను చేతితోఁద్రిప్పి విసరి పిడుగును వైచినట్టు రామభద్రునిపై వైచెను. అదియును మార్గమందున్న చెట్లను పొదలను నాశము చేయుచు పైపడిరాఁగ దానినాకాశమందే రామభద్రుఁడు గొప్పబాణసమూహముచే మహామంత్రముచేఁ బామునువలెఁ దునుకలుగాఁ గూల్చెను.

ఉ. కూలిచి దిగ్భ్రమన్ బెగడు♦కూళను ధర్మరతాత్ముఁ డిట్లనున్
ప్రేలితి వేమియో బలము♦పెంపును జూపితి వింతమాత్ర కే
బాలిశ! రజ్జు లాడితివి ♦ బాణవిదారిత మై ధరాస్థలిన్
దూలిననీగదం గనుము ♦ తూర్ణమ రమ్ము వచః ప్రగల్భుఁడా. ౪౫౪

దిగ్భ్రమన్ = దిక్కుతెలియక, బెగడు = భయపడు, కూళను = క్రూరుని, ధర్మరతాత్ముఁడు = నిరాయుధునివేయరాదనుధర్మము దెలిసిన రామభద్రుఁడు—ప్రేలితివి = వదరితివి, బాలిశ = మూర్ఖుఁడా, రజ్జులు = వ్యర్థభాషణములు, బాణవిదారితమై = బాణముచేఁ జీల్పఁబడినదై, ధరాస్థలిన్ = భూమిమీఁద, తూర్ణము = త్వరగా, వచః ప్రగల్భుఁడా = మాటలయందు సమర్థుఁడా.

తా. గదను నేలఁ బడఁగొట్టి యయ్యో గదపోయెనే యిఁక నేమిగతి యని దిక్కుదోఁపక భయపడి నిలుచున్న ఖరునిఁజూచి, యోరీ! యేమేమియో వదరితివి గదా. నీబలాతిశయమంతయుఁ జూపితివిగదా. చెప్పినను దెలిసికోనలేని మూర్ఖుఁడా! యీమాత్రమునకా యట్లు వ్యర్థపుమాటలాడితివి. నీయొక్కగదచేతనే లోకములనెల్ల నాకులపఱిచెదనంటివే. అది యేగతిఁ బట్టెనో బాణములచేఁ జీల్పఁబడి యెట్లు నేలఁబడియున్నదో చూచితివా? మాటలనేర్పరీ! ఇఁకరమ్ము.

క. కూలిన రాక్షసులకు బాష్పాళిని మార్జన మొనర్తు♦నని యాడిననీ
యాలాపము లనృతము లై, యాలోనన వెలసెఁ గంటె♦హీనచరిత్రా. ౪౫౫

తా. చచ్చినవారికై కన్నీళ్ళుతుడుచుపని యున్నదంటివే. నీచుఁడా నీమాట లెట్లసత్యములయ్యెనో యంతలోనె చూచితివిగదా.

కం. గరుటామంతుం డమృతము, హరియించినరీతి నీదు ♦ ప్రాణము లివిగో
హరియింప నాశరంబులు, నురుఁగుల నెత్తుటిని గ్రోల ♦ నుసలెడు మహియున్.

గరుటామంతుఁడు = గరుడుఁడు. గరుత్మంతుని తద్భవము గరుడ = గరుటామంతుఁడు – గరుటాలమంతుఁడు. ఇవి రూపాంతరములు.

తా. గరుత్మంతుఁడు అమృతము హరించినట్లు నా బాణములు నీప్రాణములను హరింపఁగా నురుఁగులతోడి నెత్తుటిని త్రాగుటకు భూమి యెదురుచూచుచున్నది.

ఉ. ధూళిని ద్రుంగ మేను నిజ♦దోర్యుగ మూర్విని జాఁచి దుర్లభా
లోలవిశాలనేత్ర నవి♦లోలతఁ గౌఁగిటఁ జేర్చుచాడ్పునన్
నేలను గ్రుచ్చి దీర్ఘమగు♦నిద్దురవోయెద, వంత నొమ్ములన్
గేలిడి నిద్రవోయెదరు ♦ కీర్తితపుణ్యులు సంయమీశ్వరుల్. ౨౫౭

ద్రుంగన్ = మునుఁగఁగా, నిజదోర్యుగము = నీ రెండుచేతులను – దుర్లభాలోల విశాలనేత్రన్ = కష్టపడి సంపాదించిన చలించు వెడలుపాటి కన్నులుగల స్త్రీని– అవిలోలత = ఏకమనస్సుతోఁ జపలతలేక– దీర్ఘమగు నిద్దురవోయెదవు = చచ్చెదవు– సంయమీశ్వరుల్ = మునిశ్రేష్ఠులు.

తా. నీదేహము భూమిలో మునిఁగిచేతులు చాఁచుకొని యపురూపముగ నతి కష్టముపై లభించిన స్త్రీని నేకచిత్తముతోఁ గౌఁగిలించి పండుకొన్నట్లు బోర్లబడి భూమిని గౌఁగిలించికొని చావఁగలవు. అంతట నీబాధ తొలఁగెనని యొమ్ముల మీఁదఁ జేతులుంచుకొని నిర్భయముగా నిర్విచారముగ సుఖముగా మునీంద్రులు నిద్రపోవుదురు. ప్రాణము పోయినఁగదా చేతులుచాఁచి నేలను గ్రుచ్చిపడుట. ముందవి చెప్పనేలయనిన గుఱుకవెట్టి నిద్రపోయినట్లని యెఱుఁగునది.

సీ. రాక్షసా! మచ్చర♦ప్రకరంబులను జన,స్థాన మిప్పుడు హత♦స్థాన మైన
నిర్భయతను ముని♦నికురుంబములు సంచ,రించు నీదండకఁ ♦ గొంచ కెదను
భయపెట్టురక్కసుల్ ♦ భయముపాటున నలు,దెసలఁ బాఱెదరు చూ♦దిక్కులేక
కన్నీళ్లఁ దడిసిన♦విన్ననిమోముల, నీ కనురూప లౌ♦నీదుభార్య

ఆ. లిట్టిమగని నిన్నుఁ ♦ గట్టికొంటను నిడ్డు, తెలిసి శోకరసము♦ తెఱఁగుఁ గామ
సౌఖ్యములకుఁ బాసి ♦ చని నిరర్థకజీవ, లగుదు రింక రాక్ష♦సాపశదుఁడ. ౨౫౮

మత్ + శర + ప్రకరంబులను = నాయొక్క బాణముల సమూహములచే, హతస్థానము=చచ్చినవారి గృహములు గలది, నికురుంబములు=సమూహములు, కొంచక = సందేహింపక, రక్కసుల్ = రాక్షసస్త్రీలు, నిరర్థకజీవలు = విధవల గుటచే ప్రయోజనములేని బ్రదుకుగలవారు. రాక్షసులందును విధవావివాహములు లేవు ఉత్తర. ౫౫౧ ప, చూడుము) రాక్షసాపశదుఁడ = నీచరాక్షసుఁడా.

తా. ఓరీ రాక్షసుఁడా? నాబాణములచే జనస్థానము ప్రేతస్థానముకాఁగా మునులగుంపులు నిర్భయముగా నీదండకయందు నింక సంకోచములేక తిరుగఁగలరు. ఇంతవఱకుఁ మునులను భయపెట్టుచున్న రాక్షసస్త్రీలు ఇఁక వారు వచ్చి నాకు చెప్పుదురేమో నేను దమ్ము చంపుదునేమో యని భయపడుచు దిక్కులేనివారై దిక్కుల వెంటఁ బరువెత్తుదురు. నీకుఁదగిన నీభార్యలు కన్నీళ్లతోఁ దడిసి వెలవెలఁ బోయిన ముఖములతో దొంగ వానిభార్య యెప్పటికైన ముండయే యన్నట్లు నీవంటి మగనిఁ గట్టుకొనుటచే నిప్పుడు శోకరసమెట్టిదో తెలిసికొని కామసౌఖ్యములవదలి నీచరాక్షసుఁడా బ్రతికియు ప్రయోజనములేని బ్రదుకుబ్రదికెదరు. తాను జచ్చినఁ దనపెండ్లాలు విధవలై దిక్కులేనివారై యల్లాడుదురే యను విచారముచేనైన యుద్ధము చాలించి శరణాగతుఁడగునేమో రక్షింతమను తలంపుతో నాఁడు వారి ప్రశంస కావింపఁబడెను. అనురూపభార్యలందుఁ బ్రేమయుండునుగదా.

ఉ. ఓరి నృశంస నీచ విను ♦ మోరిదురితాత్మక విప్రకంటకా
క్రూరమనీష మీవలనఁ ♦ గూరినభీతిని మౌనిపుంగవుల్
దారు హవిస్సు నగ్ని నిడు♦దాఁకను సంశయలోలచిత్తులై
సారెకుఁ గంప మొందెదరు ♦ సాగునొకో యిఁక నట్టిచేతలున్.    ౪౫౯

నృశంస = ఘాతకుఁడా, విప్రకంటకా = బ్రాహ్మణబాధకా, క్రూరమనీష = దయలేని మనస్సుగలవాఁడా, కూరిన = కలిగిన, సంశయలోలచిత్తులై = సందేహముతోఁ జలించు మనస్సుగలవారై, చేఁతలు = చేష్టలు.

తా. నీకుఁదగిన భార్యలంటివే నేనెట్టివాఁడనందువా, ఓరీ ఘాతకుఁడా! నీచుఁడా, పాపాత్ముఁడా- బ్రాహ్మణద్వేషి- నిర్దయమైన మనస్సుగలవాఁడా! మీ వలనఁ గలిగిన భయముచే మునిశ్రేష్ఠులు హోమసమయంబులందుఁ దాము హవిస్సును నగ్నిలో వేయువఱకు నెక్కడ నేరాక్షసుండు వచ్చునో యెవఁడు విఘ్నము చేయునో యని సందేహముచేఁ జలించు మనస్సుగలవారై పలుమాఱు గడగడలాడుచుందురు. ఇఁక నట్టిచేష్టలు జరుగునని తలఁచితివా.

కం. అన విని ఖరతరవచనం,బున ఖరుఁ డిట్లనియెఁ బ్రాణ♦ములు వోయెడివే
ళను గూడ గర్వపడియెదు, మనుజాధమ! నీ వదెట్టి♦మానిసి వొక్కో.    ౪౬౦

ఖరతర వచనంబునన్ = మిగులఁ గఠినమైన మాటచే.

తా. ఈప్రకారము రామభద్రుఁడనఁగా మిక్కిలి కఠినములైన మాటలచే ఖరుఁడిట్లనియెను. ఓరీ నీచమనుష్యుఁడా? నీవెట్టిమనుష్యుఁడవురా. ప్రాణముపోవుటకు సిద్ధముగానుండు సమయమందుఁగూడఁ బొగరుపడుచున్నావు.

ఉ. కాలము దీఱినాతఁ డెఱుఁ♦గం గలఁడే యిది పల్కవచ్చు నీ
లీల వచింపరా దనెడి♦లీలలు, కార్య మకార్యమున్ మదిన్
జాలు నొకో తలంప మతి♦సత్త్వము వాసి షడింద్రియప్రభల్
దూలుటఁ జేసి; నీవిధము ♦ దోఁచెడి నట్టులు గాఁగ రాముఁడా. ౪౬౧

కాలముతీఱినాతఁడు=జీవితకాలము ముగిసినవాఁడు, మతిసత్త్వము=మనోబలము, షట్+ఇంద్రియప్రభల్ = ఆఱు ఇంద్రియముల తేజస్సు జ్ఞానము.

తా. మృత్యువాసన్నమై వచ్చినవాఁడు ఇదిమాటలాడవచ్చును ఇది మాటలాడరాదు అనువిధముగాని యిదిచేయఁదగును, ఇది చేయరాదను విధముగాని బుద్ధి బలముపోయి ఆఱింద్రియములు జ్ఞానము తొలఁగుటచే తెలిసికొనఁగలఁడా? లేఁడు- నీవిధముకూడ నట్టులే తోఁచుచున్నది.

చ. అని కలయంగ నాల్గుదెస ♦ లారసి దవ్వున నున్న పెన్నగం
బును మొద లంటఁ బీఁకి కను♦బొమ్మలు నాట్యము లాడ ఱివ్వు ఱి
వ్వున వడిఁ ద్రిప్పి నెత్తురులు ♦ పుట్ట రదంబుల మోవి నొత్తియే
పున గుఱిచూచి చచ్చితివి ♦ పో మనుజాధమ యంచు వైచినన్. ౪౬౨

ఆరసి = వెదకి, దవ్వున = దూరమందు, రదంబుల = దంతములచే, మోవిన్ = పెదవిని.

తా. ఇట్లు పలికి నాలుగుప్రక్కలు పాఱఁజూచి వెదకి దూరమందున్న పెద్ద వృక్షమునొకదాని వ్రేళ్లతోఁ బీఁకి కనుబొమ్మలు చలించుచుండఁగా ఱివ్వుఱివ్వున వేగముగాఁ ద్రిప్పి నెత్తురుకాఱునట్టు పెదవులుకొఱుకుచు గుఱిచూచి నీచమనుష్యుఁడా చచ్చితివి పో యని విసరివైచెను. అంతట యినుపగదను నఱకినవానికి నీచెట్టే మాత్రమని కాలబలమున వానికిఁ దోఁచినదికాదు. జూదమునందు యుద్ధమందు నెంతెంత యోటుపడునో యంతంత చలము హెచ్చుచుండును.

—ఖరుఁడు శ్రీరాముచే హతుం డగుట.—

ఉ. వచ్చెడు దానిఁ జూచి రఘు♦వర్యుఁడు శాతకలంబకంబులన్
బిచ్చెలు పిచ్చెలై పడఁగ ♦ వ్రేల్మిడిఁ ద్రుంచి యలంతిఁ బ్రోఁడ యూ

కుచ్చితుఁ డంచుఁ దీవ్ర మగు♦క్రోధముఁ దాల్చి మేనఁ జెమ్మటల్
పిచ్ఛిల రక్తనేత్రుఁ డయి ♦ భీకరమార్గణసంచయంబులన్. ౪౬౩

శాతకలంబకంబులన్ = వాఁడిబాణములచే, త్రేల్మిడి = చిటికెవేయునంతలో, అలంతి = కొంచెముతో, పిచ్ఛిలన్ = ఉబ్బుచుండఁగా, భీకరమార్గణ సంచయంబులన్ = భయంకరమైన బాణసమూహముచే.

తా. అట్లు వచ్చుచున్న యా వృకుమును జూచి రామభద్రుఁడు వాఁడి బాణములచే చిన్నచిన్నతునుకలై పడునట్లు చిటికెవేయు నంతలో నఱికి యీ దుష్టుఁడు కొంచెముతోఁ బోవువాఁడు కాఁడు. వీనియందు దయ నిరర్థకమని నిశ్చయించుకొని మిగులఁ గోపము దెచ్చుకొని దేహమునఁ జెమ్మట లుబ్బుచుండ కన్నులెఱ్ఱనగాఁగా భీతినిగలిగించు బాణముల సమూహముచే.

ఉ. చిల్లులు వోవ మేను వెసఁ ♦ జేసిన నెత్తురు కొండవంకనాఁ
బెల్లుగఁ దోర్లఁ వేదనను ♦ బెల్కుఱి తాళఁగలేక మత్తు సం
ధిల్లఁ గృతాస్త్రు పైపడఁగఁ ♦ దేఁకువ తివ్వన రాఁగ నెత్రు చి
ప్పిల్లెడుమేనివానిఁ గని ♦ వెన్కడు గుంచి జవైకగామియై. ౪౬౪

తా. దేహమంతయు రంధ్రములు పడునట్లు కొట్టఁగా కొండవంకవలె నెత్తురు గాఱుచుండెను. ఆ బాధ సహింపలేక యవయవములు విలవిలఁబోవుచుండఁగా దేహము తెలియక వింట బాణము సంధించియుండు రామభద్రునిపైఁ బడుటకు ధైర్యముతో తివ్వనరాఁగా నెత్తురు కాఱుచున్న దేహము గలవానిని జూచి బాణము ప్రయోగించుటకు నెడముండుటకై యొక యడుగు వెనుకకుఁ బెట్టి యతివేగగమనముగలవాఁడై ముందుపెట్టిన కాలు వెనుకకుఁ బెట్టుట వీరునికిఁ దగినకార్యము గాదు. అయినను జేనెఁడుసందైన లేకున్న నస్త్రప్రయోగము సాధ్యము కాదు. కావున దానికై వెనుకడుగు పెట్టెనుగాని వెఱచి కాదు. దీనిని బురస్కరించుకొని "క్వచిదతి సఙ్కటవిషయే సుభటానా మభితోఽయవపసర్ప" యని వేదాంతదేశికవాక్యము గలదు.

ఉ. కాంతిని బ్రహ్మదండమున♦కంటె ఘనం బగుపావకాభదు
ర్దాంతశరంబు శక్రదము ♦ గ్రక్కునవైవఁగ బిడ్డువోలె నా
శాంతము మాఱుమ్రోయఁ జని ♦ నాఖరువక్షము గాఁడఁ గూలె నా
ద్యంతము దగ్ధుఁ డౌచుఁ ద్రిపు♦రాంతక దగ్ధఖలాంధకుం డనన్. ౪౬౫

బ్రహ్మదండమునకంటె = బ్రహ్మాస్త్రమునకంటె, పావకాభ = అగ్నితో సమానమైన, దుర్దాంతశరంబు = అమోఘమైన బాణము, శక్రదము = ఇంద్రుఁడిచ్చినది, ఆశాంతము = దిక్కులకడవఱకు, గాఁడన్ = నాటఁగా, ఆద్యంతము =

తలమొదలు పాదమువఱకు, దగ్ధుఁడు = కాలినవాఁడు, త్రిపురాంతక = శివునిచే, దగ్ధ=దహింపఁబడిన, ఖల = దుష్టుఁడైన, అంధకుంబలెక్ = అంధకాసురునివలె. ఈ అంధకాసురుఁడు శ్వేతారణ్యమున నుండినవాఁడు. ఈశ్వేతారణ్యము కావేరి సముద్ర సంగమమునకు సమీపముననుండు ప్రదేశము.

తా. బ్రహ్మాదండమునకంటె నెక్కువ కాంతిగలదై యగ్నిహోత్రమువలె జ్వలించుచు నింద్రునిచే నీయఁబడిన యమోఘబాణమును శీఘ్రముగ వేయఁగా పిడుగువలె దిక్కులు ధ్వని యిచ్చునట్లు ధ్వనించుచుఁబోయి యా ఖరునివక్షము నందు నాటఁగా దానిచే దేహమంతయుఁ గాలరుద్రునిచే దగ్ధుఁడైన యంధకాసురునివలెఁ బడెను.

క. ఫేనమున నముచి పవిధా,రానిహతిని వృత్రబలులరమణను శ్రీసీ
తానాథునిమార్గణమున, మానవభుగ్వరుఁడు గూలె మహి భస్మితుఁ డై.

ఫేనమునక్ = నురుఁగుచే, నముచిరమణను = నముచివలె, పవిధారానిహతిని = వజ్రాయుధమునంచు దెబ్బచే వృత్రాసుర బలాసురుల రమణను, మానవభుగ్వరుఁడు=రాక్షసశ్రేష్ఠుఁడు=మనుష్యుల భుజించువాఁడు. మానవభుక్కు – కొన్ని యెడల నుపమానంబులు పెక్కులగుచో నివి కడ దాని కొక్కటికి చూపఁబడె. ప్రౌ. వ్యా. సమాస ౪౦ సూత్రము ప్రకారము ఉపమావాచకము రమణ యను నది యొక్కచోటనే గూర్పఁబడియె.

నముచి యను రాక్షసుఁడు ఆర్ద్రముచే, శుష్కముచేఁ జావకుండ వరముఁ దీసికొనుటచే నింద్రుఁడు తడిది ఎండినది కాని నురుగును వజ్రాయుధమునకుఁ దగిలించి దానితో వానిని గొట్టి చంపెను.

తా. నురుఁగుచే నముచియు, వజ్రముచే వృత్రుఁడు బలుఁడను రాక్షసులు చచ్చినట్లు శ్రీరామచంద్రుని బాణముచే భస్మమై యాఖరాసురుఁడు చచ్చిపడెను.

### మహర్షులు శ్రీరామునిఁ బ్రశంసించుట.

ఉ. అంతట గుంపుగూడి విదితాత్ములు రాజఋషుల్ మునుల్ ధరా
కాంతుని వేడ్క నిట్లనిరి గౌరవ మార మహాత్మ నిన్ను నీ
ప్రాంతముఁ జేరఁ బంప శరభంగునిఁ జూడఁగ వచ్చె నాఁడు పా
కాంతకుఁ డామహర్షులు నుపాయమునక్ నినుఁ జేర్చి రీయెడన్. ౨౯౭

విదితాత్ములు = ఆత్మసాక్షాత్కారముగలవారు, ధరాకాంతుని = రామచంద్రభూపాలుని, ప్రాంతము=ఈసమీపప్రదేశము, పాకాంతకుఁడు=ఇంద్రుఁడు.

తా. ఇట్లు ఖరుఁడు చావఁగానే గుంపుగూడి యాత్మసాక్షాత్కారముగల రాజఋషులు మునులు శ్రీరామచంద్రభూపతితో గౌరవమున నిట్లనిరి. మహాత్మా నిన్ను నీప్రదేశమునఁజేరఁ బంపుమని కోరుటకై యింద్రుఁ డానాఁడు శరభంగుని జూడవచ్చెను. ఆశరభంగసుతీక్ష్ణాగస్త్యాది మహర్షు లుపాయముచేసి నిన్ను నిచటఁ జేర్చిరి.

శా. త్రుంపింపం గలుషాత్మకంబు నసుర♦స్తోమంబు ని న్నిందు ర
ప్పింపం గల్గెను, దీరె మాపనులు, నీ♦పే రెన్నుచున్ హాయి రా
ణింపన్ మానులు దండకాటవిని దం♦డ్రీ! యింక ధర్మంబు దీ
పింపన్ నిచ్చలు సంచరించెదరు ని♦ర్భీతిన్ స్వధర్మంబులన్. ౪౫౭

త్రుంపింపన్ = సంహరింపఁజేయుటకై, కలుషాత్మకంబు = పాపస్వభావము గల, అసురస్తోమంబున్ = రాక్షససమూహమును, తీరెన్ = చక్కఁబడెను, హాయి = సుఖము, నిచ్చలు = సర్వదా, నిర్భీతిన్ = భయమువిడిచి, స్వధర్మంబులన్ = తమధర్మములందు, సంచరించెదరు.

తా. పాపస్వభావముగల రాక్షససమూహమును జంపించుటకై నిన్నిందు వచ్చునట్లు చేసితిమి. మాపనులు చక్కఁబడెను. నీ పేరు చెప్పుకొనుచు సుఖముగాఁ దండ్రీ! మునులు దండకాటవియందు నన్నివేళల భయమువిడిచి వారివారి ధర్మంబులందు వారువారు తిరుగఁగలరు.

క. అను నీలోనన చారణ,జనయుతముగ దేవతలును ♦ జననాథుని పై
ఘనపుష్పవృష్టి గురిసిరి, వినువీదిని నిండె దుందు♦భిధ్వానంబుల్. ౪౫౮

తా. వీరీప్రకారము చెప్పుచుండఁగనే యాకాశమునుండి చారణులతోడఁ గూడి దేవతలు రామచంద్రుపై పెద్దపుష్పవర్షము గురియంజేసిరి. ఆకాశమార్గమున దేవదుందుభిధ్వనులు నిండెను.

శా. ఔరా యేమిపరాక్రమం, బరరె యే♦ మాదాక్ష్య సత్త్వంబు, ల
య్యారే యాపదునాల్గువేలు మనుజా♦దానీకముల్ దాఁక నీ
శ్రీరాముండు పదాతి యై యొకఁడ త్రుం♦చెన్ వానినిన్ భీకరా
కారుం డై ఘటికాత్రయంబునను సా♦క్షాద్విష్ణు వోఁ జూడఁగన్. ౪౬౦

దాక్ష్యసత్త్వంబులు = దాక్ష్యము = దక్షత్వము, కార్యనిర్వహణశక్తి, అనఁగా రాక్షసులనందఱఁ జంపఁజాలినశక్తి, సత్త్వము = బలము, మనుజాద + అనీకముల్ = రాక్షసులసేనలు, పదాతియై = కాల్నడగలవాఁడై, ఘటికాత్రయంబునను = మూఁడు గడియలలోఁ (డెబ్బదిరెండు నిమిషములు,) సాక్షాద్విష్ణువు = ప్రత్యక్షవిష్ణువు.

తా. ఆహా! ఏమిపరాక్రమము! ఏమి కార్యసాధనసామర్థ్యము! ఔరా! బలము ఏమని చెప్పవచ్చును! ఒంటరిగాఁడు కాళ్లమీఁద నిలఁబడి పదునాలుగు వేలరాక్షసులను మూఁడుగడియలలో సంహరించెనే యిది యితరులకు సాధ్యమా కాదు కావున నీయన ప్రత్యక్షవిష్ణువే.

## సీతాలక్ష్మణులు శ్రీరాముఁ జేర వచ్చుట.

క. అని కొండాడుచుఁ దమ తమ,మనుకులకుం జనిరి లోని♦మనికిత మాఱఁగ
గన వచ్చినసుర; లంతం, జనుదెంచెను లక్ష్మణుండు ♦ జానకితోడన్. ౪౭౧

కొండాడుచున్ = పొగడుచు, మనుకులకున్ = ఉనికిపట్టులకు, లోనిమనికి తము = మనస్సులోని దుఃఖము, ఆఱన్ = క్షయింపఁగా.

తా. అని పొగడుచు దేవతలు, తమమనోవేదన శమింపఁగాఁ దమతమ స్థానంబులకుఁబోయిరి. అంతట లక్ష్మణుండు సీతాదేవితో వచ్చెను.

క. విజయి యయి యచటిమౌని, వ్రజములు పూజింపఁ దోడ ♦ రా లక్ష్మణుఁడున్
గజగమనంబునఁ జనియెను, నజితపరాక్రముఁడు స్వాశ్ర♦మావనిఁ జేరన్. ౪౭౨

విజయి = గెలుపొందినవాఁడు, గజగమనంబునన్ = ఏనుఁగు నడకవంటి నడకతో, అజితపరాక్రముఁడు = జయింపఁబడని పరాక్రమముగలవాఁడు, స్వాశ్ర మావనిన్ = తమ యాశ్రమభూమిని. దీనివలన నాశ్రమమునకు దూరము నందే యుద్ధము జరిగెనని తెలియనగు. సీతాలక్ష్మణులు యుద్ధము జరిగినచోటికే వచ్చిరి.

తా. గెలుపుగొన్నవాఁడై యచట మునిసమూహము పూజింపఁగా సీతా లక్ష్మణులు తనతోడరాఁగా నేనుఁగు నడకలవంటి నడకతో విలాసముగ నప రాజితుఁడగు రామచంద్రమూర్తి తన యాశ్రమముఁ జేరవచ్చెను.

క. అంతట నాయనఁగనియరి, హంతను బరమర్షులకు సు♦ఖావహు హర్షా
క్రాంతయయి భర్త జగతీ,కాంతుని వైదేహి బిగ్గ ♦ కౌఁగిటఁ గ్రుచ్చెన్. ౪౭౩

అంతటన్ = ఆశ్రమముఁజేరినతరువాత, ఆయనన్ = శ్రీరామచంద్ర మూర్తిని, కని = చూచి, అరిహంతనున్ = శత్రువుల సంహరించినవానిని, పరమర్షులకున్ = ఋషిశ్రేష్ఠులకు, సుఖావహున్ = సుఖము కలిగించినవానిని, హర్షాక్రాంత = సంతోషముచే నాక్రమింపఁబడినది, అయి, భర్తన్ = పతిని, జగతీకాంతుని = రాజును, వైదేహి = సీత, బిగ్గ = గట్టిగా, కౌఁగిటఁగ్రుచ్చెన్ = కౌఁగిలించెను.

తా. ఆశ్రమప్రదేశముఁ జేరిన తరువాత సీతాదేవి శత్రుసంహారకుఁడును ఋషులకు సంతోషము గలిగించినవాఁడును, భర్తయునగు శ్రీరామచంద్రమూర్తిని గట్టిగఁ గౌఁగిలించెను.

పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే - భ.గీ.

సాధువుల రక్షించుటకును పాపాత్ముల నాశముచేయుటకును, ధర్మసంస్థాపనము చేయుటకును, ప్రతియుగంబున నేను బుట్టుచుండుదును. అని శ్రీకృష్ణభగవానుఁడు చెప్పెను. ఈ విషయమే యుత్తరాకాండమున నిట్లు చెప్పఁబడెను.

అవతారముసార్థకముచేయ నుపక్రమించుట యీ పద్యముఁ దెలుపుచున్నది.

అరిహంతను ననునది దుష్టశిక్షణమును పరమర్షులకు సుఖావహుననునది సాధురక్షణమును దెలిపెడి.

ఇంతకుముందు చెప్పఁబడిన చరిత్రము దీనికిఁ బీఠికవంటిదై దుష్టులెవరు? శిష్టులెవరు? వారికిఁగలిగిన బాధయెట్టిది? అను విషయమును ఈ కార్యము నిమిత్తమై శ్రీరామచంద్రమూర్తిదండకకు వచ్చుటయునై యున్నది. మీఁది భగవద్గీతయందలి శ్లోకము సాధువులను రక్షించుటకై దుష్టుల శిక్షించుట యుద్దేశ్యముగాఁ జెప్పఁబడెను. దీనివలన దుష్టులు శిక్షించుట ప్రథమకార్యమగుచున్నది. కార్యముచేయఁబూనినపుడు మొదటఁజేయవలసినది మొదటఁజేయవలయును గనుక నరిహంతను అని దుష్టశిక్షణము తొలుతఁజెప్పి దానివలనఁగలిగిన సాధుపరిత్రాణము రెండవదిగాఁ జెప్పఁబడెను. ఖరాదివధకుఁ గారణము దానివలని ప్రయోజనము ఋషిసంరక్షణమె కదా.

శ్రీమహాలక్ష్మిదేవి స్త్రీలను బాధించు రాక్షసుల సమూలము నాశముచేయఁగదా భర్తను భూమిపై నవతరింపఁగోరి తానును నవతరించెను. అట్టి తన కోరిక నెఱవేర్పఁ బ్రారంభించుటచే సీతాదేవి తనకోరిక నెఱవేఱుకాలము సమీపించెఁగదా యని సంతోషించి తన కార్యమును స్వకార్యముగ నెంచిన భర్తను తన సంతోషము సమ్మతిఁ దెలుపఁ గౌఁగిలించుకొనుచున్నది.

ఆయనను గని కౌఁగిలించెను, రాక్షసులా వేలకొలఁది వచ్చుచున్నారు. రామచంద్రమూర్తియా యొంటరిగాఁడు. యుద్ధమెట్లు పర్యవసించునో మరల నీయనను నేను గన్నారఁజూడఁగలనా యని భయపడుచున్నసీత రామచంద్రమూర్తిని మరలఁ జూచి వీరుల తారతమ్యజ్ఞాన మెఱింగిన వంశమునఁబుట్టిన దగుటచే సగౌరవముగఁ గౌఁగిలించుకొనెను.

ఆయనను ౧. పూర్వము యుద్ధకాలమున గుంపులోఁ గానరాకయున్న వానిని ౨. వీరవ్రణములచే కాఱుచున్న నెత్తుటిచే రోమకూపములనుండి వెలువడు చెమటబొట్లచేఁగూడియున్నవానిని ౩. కోదండదండమునాధారముచేసికొని నిలఁబడి కొంచెము శ్రమముదీర్చుకొనుచున్నవానిని ౪. వ్రేలాడువెండ్రుకలను దీఁగలచేఁగట్టినవానిని ౫. బిగించిన నడికట్టుగలవానిని ౬. బాహువులందు ధరించిన రెండమ్ములపొదులు గలవానిని ౭, యుద్ధము ముగియుటచేఁ గోప ముప శమింపఁగాఁ బ్రసన్నమైన వదనముగలవానిని ౮. సీతాలక్ష్మణు లింకను రాలేదే యని తమ రాకకై యెదురుచూచువానిని ౯. పదునలుగురుపోయిన పదునాలుగు వేలమంది వచ్చినట్లు లంకను రాక్షసులువచ్చెదరేమో యని నలుప్రక్కలఁ జూచువానిని ౧౦. పూర్వము లోకులు రాముఁడు మహావీరుఁడని తాను వినియుండి యిప్పుడావీరకార్యము జేసినవానిని.

కని = ఒకరు చెప్పఁగా విని కాదు. తానే కన్నారఁజూచి – ఆయనఁ గని రిపుహంతను ననుటచే నెందుండి చూచిన యుద్ధము కానవచ్చునో యట్టిచోట సీతాలక్ష్మణులుండిరని తెలియనగు. సీత గుహలోపలనుండుటచే యుద్ధము చూచియుండదు. ఎటువంటివానిని జూచి యనిన అరిహంతను ౧. శత్రువులఁజంపినవానిని. శత్రువుల జంపినవానిననుటచే తనయందు విరోధబుద్ధిలేక తనతో యుద్ధము చేయు కోరికతో రాక యుండుసేనానాయకులసేవకులు మొదలైనవారిని జంపలేదని భావము. దీనిచే దుష్టనిగ్రహము చెప్పఁబడెను.

౨ అరిహంతను = అనుటచే హననవ్యాపారముమాత్రమే సీత చూచెనుగాని బాణముదీయుట, సంధించుట, విడుచుట, బాణముపోవుట, యిదియేమియు నామెకుఁ గానవచ్చినదికాదు. అత్యంతగమనవేగముచే నని యెఱుఁగవలయును.

పరమర్షులకు సుఖావహం = తపోలేశముచే సర్వరాక్షసులను ధ్వంసము చేయఁగలవారు ఋషులు. ఇఁక పరమర్షుల కసాధ్యమైనదే లేదు. అయినను ఎవరెవరికి స్వధర్మమందు వారు వారు నిలువవలయుననియే వారివ్రతము. రక్షించుధర్మము భగవంతునిది. రక్షింపఁబడు ధర్మము జీవునిది. కావున రక్ష్యుఁడగువాఁడు రక్షకత్వమును వహించుట స్వధర్మముగాదు. పరధర్మమగును. "మరణమైనను స్వధర్మంబు మేలు, పరధర్మమెప్పుడు భయకారణం"బగుటచే భగవంతుఁడే రావలె. ఆయనకార్యమాయన చేయవలె. ఆయన చేయవలసినకార్యము మనము చేయరాదు. అట్లుచేసిన స్వరూపహానియగునని యెన్నిబాధలైన సహించుచు శ్రీరామచంద్రమూర్తిరాకయు, నాయన ప్రతిజ్ఞానిర్వహణము వీనికై యెదురుచూచుచుండినవారు. సీతాదేవియు నిట్లుచేసినదే కదా.

సుఖావహం = "మిక్కిలి బాధలంగనెడి రామా దుష్టవధాంపాశసంతానంబే పంగ" నన్నట్లు "రమ్మవిగో రాఘవ కనుంగొమ్ము అసురకోటులచే నాశమ్మును గన్న మునీంద్రులయెమ్ము" లన్నట్లు దుఃఖపడువారి దుఃఖమును నాశముచేసి సుఖము కలిగించినవానిని.

హర్షాక్రాంత = సంతోషముచే నాక్రమింపఁబడినది.

'సతి ధర్మిణి ధర్మా' ధర్మియుండును. ధర్మముండును. అను న్యాయముచే రామవిజయరూపమైన ధర్మి లభించుటచే దానిధర్మమైన హర్షము లభించెను. జయము హర్షమను గుణముకలది. గుణియుండిన గుణము దానితోడనే యుండును. (-౨) హర్షమనఁగా = గగ్గురుపాటు, లోపలనుండు సంతోషముపొంగి రోమకూపములమూలమున వెలుపలికి వచ్చెనా యన్నట్లు దేహమునందు గగ్గురుపాటుగల దానిని.

భర్తారం = పతిని "లోకభర్తారం సుషువేయ" మన్నట్లు లోకములనన్నిటిని భరించువానిని; భర్త భార్య నెట్లు భరించునో లోకములనన్నిటిని నట్లే భరించువాఁడని భావము. దీనివలనఁ జిదచిత్తులకు నీశ్వరునకు భార్యాభర్తృసంబంధము చెప్పఁబడెను.

జగతీకాంతుని = కామ్యత ఇతికాంతః- కాంక్షింపఁబడునది కస్యసుఖస్య, అంతోనిశ్చయో, ఉక్తేతివా కాంతం- సుఖముయొక్క నిశ్చయము దీనియందుఁ గలదు. గురు. ప్ర.

ఈ వ్యుత్పత్తులవలన కాంతుఁడనఁగాఁ గోరఁబడువాఁడనియు, ఏల కోరఁబడునినిన సుఖనిశ్చయము, నిశ్చయసుఖము వానియందుఁగలదు కావునఁ గోరఁబడుననియు నేర్పడెను. ఎవరిచేఁ గోరఁబడినాఁడనిన జగతిచే, జగతిశబ్దము స్త్రీలింగమగుటచే స్త్రీ తనకు సుఖము గలిగించు ప్రియు నెట్లు కోరునో యట్లు జగతిచేఁ గోరఁబడెనని భావము. స్త్రీ ప్రాయమితరత్సర్వం జగద్బ్రహ్మపురస్సరమ్మని కలదు కదా. భర్తయనుపదమున భర్తృధర్మమునకుఁ బ్రాధాన్య మీయఁబడెను. జగతీకాంతుఁడనుచో సతీధర్మమునకుఁ బ్రాధాన్య మీయఁబడెను. ఇట్లు చెప్పుటచే జగదీశ్వరులకు నన్యోన్యానన్యత్వము చెప్పఁబడెను. అనఁగా రామునకు జగతితప్ప భరించవలసినది వేఱులేదు. జగతికి రాముఁడుతప్ప నిశ్చయసుఖమునకై కోరఁబడఁదగినవాఁడు వేఱొకఁడు లేఁడు అనిభావము.

"కోరె వసుమతీకాంత తనకూర్చు వల్లభుఁడుగ" నని యయోధ్య ౨౭వ పద్యమునఁ జెప్పఁబడెనుగదా.

కావున నిశ్చయసుఖము (మోక్షము) కోరువారు శ్రీరామచంద్రమూర్తిని దమకాంతుఁడుగ భర్తగా వరింపవలెనని భావము. కాంతుఁడు = మనోహరుఁడు, లోకములో భర్తలు పతివ్రతలగు స్త్రీలకు మనోహరులగుట వింతగాదు. శ్రీరామచంద్రమూర్తి యట్టివాఁడుకాఁడు. దర్శనమాత్రమునఁ జూచునట్టి యెల్లవారి మనస్సులు హరించువాఁడు.

వైదేహీ=జనకరాజు కూఁతురు. స్త్రీలు సహజముగా భీరువులు. అందు ఘోర యుద్ధము చూచినపుడు భయపడుట స్వభావము. అట్టిచో సీతాదేవి మారణవ్యాపారాసక్తుఁడైన రామచంద్రునిఁజూచి యెట్లు సంతోషించెను. సీతాదేవి బ్రాహ్మణ స్త్రీ కాదు. 'మిథిలాధిపతిర్వీర' యన్నట్టు వీరుఁడైన జనకునింటఁ బెరిఁగినది. కావున యుద్ధవిషయము వీరధర్మము చక్కఁగాఁ దెలిసినది. అందు వీర్యశుల్క కావున రామచంద్రమూర్తిశౌర్యమునకు సంతోషించెను.

బిగ్గఁ గౌఁగిటఁగ్రుచ్చెన్ = గట్టిగాఁ గౌఁగిలించుకొనెను. హృదయమందు నిరవధికప్రేమ యెంతగాఢముగనున్నదో యంత గాఢముగఁ గౌఁగిలించెను. లోకభర్త శ్రీరామచంద్రమూర్తి. లోకమాత సీత. కావునఁ దనబిడ్డలను రక్షింప శ్రమపడు భర్తవిషయమై ద్విగుణితప్రేమగలదై గట్టిగఁ గౌఁగిలించెను. గాయములకు వేఁడి వేఁడి నిమ్మకాయ పొట్లములు గాఁచుట లోకప్రసిద్ధము. అట్టులే శ్రీరామచంద్రమూర్తిదేహమునందలి గాయములను తన చనులవేఁడిమిచేఁ గాఁచునట్లు కౌఁగిలించెను.

అత్యంతప్రేమవశలయిన స్త్రీలు తమప్రేమ నెట్లు చూపఁగలరు? కౌఁగిలించుటచేతనే. కావునఁ గౌఁగిలించెను.

రామచంద్రమూర్తిలేని సీత గుహనుండివచ్చినదై రాముని గౌఁగిలించెననుటచే హృదయగుహనుండు జీవుఁడు పరతంత్రుఁడై ఆచార్యువలన సర్వస్వామిని దర్శించి దానిచే సర్వవిరోధివర్గము నశింపఁగా నందుండి వెలువడి నిత్యసూరుల గోష్ఠియందుండు స్వామిని దర్శించి తద్భోగపరివాహ మనుభవించు నని ధ్వని. గోవిందరాజీయము. ఆయనర్=''తే తు యావంత ఏవాజౌ తావాంస్తు దదృశేసహైః'' అన్నట్లు తత్కాలమున స్వేచ్ఛగా గ్రహింపఁబడిన పదునాలుగువేల దివ్యమంగళ విగ్రహములు గలవాఁడై యొక్కొక్కరాక్షసునకుఁ బ్రత్యేకముగ నొక్కొక్క రామునివలెనుండి కానవచ్చిన వానిని (౨) ఇంద్రాదులందఱుఁగలసియు జయింపరాని పదునాలుగువేలరాక్షసులను నవలీలగా నొకటిన్నరముహూర్తములో జయించి తాను గాయపడక తనయెదుటనున్నవానిని (౩) ''నాదు జనకుండు మిథిలాధినాథుఁడు రామ। జామాత పురుషవిగ్రహముగొన్న స్త్రీయటంచు నుదలఁ

పఁడే''యని యజ్ఞానముచేఁ దాను బరిహసించినవానిని (౪)''ఎన్నఁగరాని బాణముల నేసియుఁ గోసియుఁ ద్రచ్చిద్రుచ్చియుఁ! బన్నుగ శత్రుసంఘముల బాహులఁగాళుల నూరులందలల్ఁ ద్రొన్నగలన్ ధ్వజాగ్రముల గుప్పలుకుప్పలువెట్టి'' యన్నట్లు శత్రువుల వధించినవానిని (౫) 'పరిత్రాణాయ సాధూనా' మ్మన్నట్లు తన ప్రతిజ్ఞను బరిపాలింప నవతరించి దుష్టులగురాక్షసుల సంహరించి సాధువులకు ఋషులకు జగన్మోహన దివ్యమంగళ విగ్రహసాక్షాత్కారముచేఁ బరమానందము కలిగించిన వానిని-కౌఁగిటఁగ్రుచ్చెన్=ఆయుధములచే నైనగాయములను స్తనముల వేఁడిమిచే పరిహరించుటకై గాఢాలింగనము గావించెను.

క. ఉక్కునఁ బేరెక్కినయా, రక్కసులం ద్రుంచి మౌని♦రాజనుతుండై
చెక్కుచెమర్పని రాముని, నక్కువలహితాస్య మఱియు ♦ నక్కున నొత్తెన్.

ఉక్కునన్ = బలమునందు, పేరెక్కిన = ప్రసిద్ధికెక్కిన, చెక్కుచెమర్పని = ఏమియుఘూతపడని, అక్కువలహితాస్య = ఆ కలువలమిత్రుఁడైన చంద్రునివంటి ముఖముకలది, అక్కునన్ = ఱొమ్ముచే, కువలము = కువలయము.

మీఁది పద్యమునందలి విశేషమే మఱియుఁ జెప్పుచున్నాఁడు.

తా. బలమునందుఁ బ్రసిద్ధులైన రాక్షసుల వధించి మునీంద్రులచే నుతింపఁబడి ఘూతపడని రామచంద్రమూర్తిని, చంద్రవదనయగు సీత ఱొమ్ముల నొత్తెను.

శ్రుత్వా శ్రీరామవిజయం, పాపబంధాత్ ప్రముచ్యతే।
తథైవశృంఖలాబంధా, దృణబంధా ద్విముచ్యతే।
శ్రుత్వా పుష్పవతీ నారీ, తనయం వంశవర్ధనమ్।
లభతే రాఘవేంద్రస్య, ప్రసాదా త్కీర్తివర్ధనమ్॥ స్కాంద.

శ్రీరామచంద్రమూర్తిజయము విన్నవారు పాపబంధములవలనను కారాగృహబంధంబులవలనను ఋణబాధవలనను, విడువఁబడుదురు. పుష్పవతియగు స్త్రీ వినెనేని రామచంద్రమూర్తి యనుగ్రహమువలన వంశోద్ధారకుఁ గొడుకును గనును.

శరణాగతిమంత్రవివరణరూపమగు శ్రీరామాయణమునందు నింతవఱకుఁ జెప్పఁబడిన గ్రంథసందర్భముచే ఉత్తరఖండార్థము వివరింపఁబడెను. ఆ మంత్రమునందుఁగల రెండు ఖండములలోన నుష్ఠానదశయందు ప్రథమఖండార్థము ముఖ్యము. వ్యుత్పత్తిదశయందు ఉత్తరఖండార్థము ముఖ్యము. ఫలానుసారముగా నుపాయప్రవృత్తి కావున వ్యుత్పత్తికలుగుటకై యుత్తరఖండార్థ మింతవఱకుఁగల గ్రంథమునఁ జెప్పఁబడెను. అందు బాలకాండమందు మంత్రమందలి మొదటిమాటకు నర్థమగు పురుషకారయోగము దెలుపఁబడెను. అయోధ్యాకాండమందు రెండవ మాటకు నర్థమైన సౌలభ్యాదిగుణయోగము చెప్పఁబడెను. ఆరణ్యకాండమందు

శూర్పణఖ రాకముందు జరిగిన వృత్తాంతముచే చతుర్థీవిభక్తి ప్రత్యయమైన పదమున కర్థమగు కింకరవృత్తి చెప్పఁబడెను. ఆపిమ్మట ఖరవధాంతవృత్తాంతముచే చరమపదమునకు నర్థమగు విరోధి నివృత్తి చెప్పఁబడెను. ఇఁకమీఁద మిగిలినగ్రంథముచే పూర్వఖండముయొక్క యర్థము చెప్పఁబడును. అది యెట్లన:- ఆరణ్యకాండశేషముచే విభీషణునికి లభించిన పురుషకారసాన్నిధ్యము చెప్పఁబడును. కిష్కింధాకాండముచే నారాయణపదమునకు నర్థమైన వాత్సల్యము—సుందరాకాండముచే చరణశబ్దముచే చెప్పఁబడిన దివ్యమంగళవిగ్రహముయొక్క విశిష్టత్వము—రాముండు కమలపత్రవిశాలలోచనుండు లోనగు వాక్యములచేఁజెప్పఁబడెను. యుద్ధకాండమందు శరణాగతి చెప్పఁబడెను. ఉత్తరకాండమువలనఁ బ్రపన్నుని చర్య తెలియనగు. దేవతల శరణాగతికి ఫలము రావణవధ. ఇది యంగి. దీని కంగముగా మునుల శరణాగతి దానిఫలమైన ఖరాదివధ చెప్పఁబడెను. ఇఁక రావణవధకు నిమిత్తమైన సీతాపహరణరూపబీజమును వేయుచున్నాఁడు.'

## ౩౧-వ సర్గము. అకంపనుఁడు రావణునకు ఖరాదివధవృత్తాంతముఁ జెప్పుట.

సీ. అట నకంపనుఁ డను♦నసురుండు వడి జనస్థానంబునందుండి ♦ తరలి పోయి
లంకాపురముఁ జొచ్చి ♦ లంకేశ్వరునిఁ గాంచి, రాజ! జనస్థాన♦రాక్షసాళి
ఖరుఁ డాదిగాఁగ సం♦గ్రామవీథిని జంపఁబడియె నెట్లెట్లో నేఁ ♦ బ్రాణములను
దక్కించుకొని యీయు♦దంతముఁ దెల్పఁగ, వచ్చితి నన దశ♦వదనుఁ డదరి

తే. కనుల నిప్పులు రాల నా♦తనికి ననియె, నెవఁడురా యోరి మిక్కిలి♦హృద్యమైన
నాజనస్థానమును గూల్చి♦నాఁడు నేఁడ, దెట్టిలోకంబునందు వాఁ ♦ డింక బ్రదుకు.

అట = ఇచ్చట, నాశ్రమమందలి సీతారామచర్య దెలిపి ఖరవధానంతరము జనస్థానమున జరిగినవిషయము చెప్పుచున్నాఁడు, అట = జనస్థానమందు. హృద్యము = మనోహరము.

తా. జనస్థానమందుండి యకంపనుఁడను రావణు వేగులవాఁడు శీఘ్రముగ బయలుదేఱిపోయి లంకఁ బ్రవేశించి లంకాధిపతియైన రావణాసురునిఁజూచి రాజా! జనస్థానమందున్న రాక్షసులు ఖరుఁడు మొదలగు వారందఱు యుద్ధమునఁ జంపఁబడిరి. నే నెట్లెట్లో (స్త్రీవేషము వేసికొని) యతి కష్టముపైన ప్రాణములను దక్కించుకొని యీ వృత్తాంతము నీకుఁ జెప్పవచ్చితిని అని చెప్పఁగా రావణుఁడదిరిపడి కన్నులందు నిప్పులురాలుచుండ, నోరీ! నాకు మనోహరమైన జనస్థానమును నేఁడు నాశముచేసినవాఁ డెవఁడురా? వాఁడిఁక నే లోకమందును బ్రదుకురా.

వర్తిగా = శూర్పణఖకంటె వేగముగ. అదియాఁడుది. కావున దానికంటె ముం దకంపనుఁడు పోఁగలైను. వీఁడు ముందుపోవుటకు వేఱొక కారణముగలదు. శూర్పణఖ లంకకుఁబోయి రావణున కీవార్త చెప్పునని అకంపనుఁ డెఱుఁగును. అది ముందుచెప్పునేని వేగులవాఁడవైయుండి యింతకార్యము జరుగఁగానే నాకేల వెంటనే చెప్పలేదని రావణుఁడు వీనిని దండించును. ఆభయముచే ముందుగ వీఁడు పోయెను. రాజా! రాక్షసరాజా! నీవు రాక్షసులకురాజవు. రాక్షసులు చచ్చిన నీ వెవరికి రాజవు? కావున నీ రాజత్వము కాపాడుకొన యత్నింపుము. నా రాక్షసరాజత్వమున కేమిరా హానివచ్చెను? జనస్థాన రాక్షసాళి చంపఁబడియె. బలవంతులగు సహాయు లొకరిద్దఱు పోయినను బలము తగ్గుచుండ నీక నందఱు జచ్చిన నీవు బలహీనుఁడ వగుట చెప్పవలయునా?

లంకాపురము = లంకానగర మొక్కటియె - దానికిఁ జేరికగాఁ బల్లెలుగాని పట్టణములుగాని లేవు. దానికి ద్వారమువంటిది జనస్థానము. అది చెడుటయనఁగా లంకకోట గవనివాకిండ్లు తెఱచినట్లె. ఉత్తరమునుండి రాజులెవ్వరు లంకమీఁదికి రాకుండునట్లు ఖరాదులు కాపాడుచుండిరి. వారు హతులగుటచే తలుపులు తెఱచిన యింటిలోనికి నెవరైన దూఱినట్టు లిఁక నెవరైన నాటంకములేక రావచ్చును. ఇట్టిది జనస్థానమొకటియె కాని పెక్కులులేవు. అది నాశమగుట యనిన రాక్షసులకు లంకయందుఁదప్ప మఱి యెందును నిలువ నీడలేని దయ్యెనని యర్థము.

రాక్షసాళి చంపఁబడియె = రాక్షసులు చచ్చుచుండిన ఖరాదు లేమి చేయు చుండిరి రా

ఖరుఁడాదిగాఁగ = ఖరుఁడు, దూషణుఁడు, త్రిశిరుఁడు, వీరి మంత్రులు, సైని కులు, అందఱు హతులైరి.

అందఱు చచ్చిన నీవెట్లు వచ్చితివి? స్త్రీవేషము వేసికొని యెట్లెట్లో తప్పించుకొని వచ్చితిని.

"స్త్రీవధంబు శంకచేసినట్టి యమ్మహాత్ముచేత నెమ్మోయినో విడువఁగఁ బడుటనోర్తు బ్రదికి యిటకు వచ్చితి"నని శూర్పణఖ చెప్పును. ఇది గోవిందరాజీ యానుసారము. అందొక యాక్షేపము దోఁచెడిని. అకంపనుఁడు యుద్ధభూమియం దున్నవాఁడైనచో వీనికిస్త్రీ వేషమునకుఁ గావలసిన చీర, పాపటతోడ తలనిండ వెంద్రుక లివి యెందుండి వచ్చెను? దీనికి సమాధానము కామరూపి - కావున నని చెప్పవలయును.

నేను కేవలసాక్షిగాఁ జూచుచుండిన కారణముచే నాకు రామబాణములు తగులలేదని - మహేశ్వరతీర్థీయము - వీఁడు వేగులవాఁడు కావున నిరాయుధుఁడు.

దూరమునుండి యుద్ధము చూచుచుండినవాఁడు. కావునఁ దప్పించుకొనఁ గలిగెను. వీఁడు రామచంద్రమూర్తియందు ప్రతికూలభావము లేనివాఁడు. రామచంద్ర మూర్తి యుద్ధము చేయువిధము చూచి యిది యమానుషచర్యయని యనుకూల భావమును గలవాఁడుగా నుండవలెను. కావుననే వీనికి భగవద్జ్ఞానము లభించినది.

ఉ. నాకపకార మేదియు నొ♦నర్చి సుఖంపడ లేరు నిక్క మా
నాకపదండపాణులును ♦ యక్షపవిష్ణులు, దండి దండితోఁ
వీకునఁ జేయుదుఁ దహను♦వేఁడిమి దగ్గ మొనర్తు మృత్యువుఁ
జోక వధించెదం బవన♦సూర్యులఁ గట్టెదఁ గాలఁ బెట్టెదన్. ౭౭౬

నాకప+దండపాణులును = ఇంద్రుఁడు,యముఁడు, యక్షపవిష్ణులు = కుబేర విష్ణువులు, ఇచ్చటి విష్ణుశబ్దము వరుణుని బోధించుచున్నది. ఏలన నాలుగు దిక్కుల యధిపతులఁ జెప్పుచు ఇంద్రుఁడు, యముఁడు, కుబేరుఁడు, విష్ణువని చెప్పినపుడు వరుణునిగదా గ్రహింపవలెను. అదియునుగాక "ఇమంమేవరుణశ్రుధీహవ" యను మంత్రమును విశ్వామిత్రుఁడు శునశ్శేపున కుపదేశించెను. శునశ్శేపోహ్యహ్వద్గృ భీతస్త్రిష్వాదిత్యం ద్రుపదేషుబద్ధః అవైనంరాజా వరుణః స సృజ్యాద్విగ్వాగ్ అదబ్ధో విము మోక్తుపాశాఁ అని చెప్పఁబడెను.

ఇట్లు ఇంద్రుని వరుణుని నుపాసింపుమని విశ్వామిత్రుఁడు చెప్పఁగా శునశ్శేపుఁడు ఇంద్రుని నింద్రానుజుని (ఉపేంద్రుని) ధ్యానించి వారిచే బంధముక్తుఁడయ్యెనని రామాయణమునఁ జెప్పఁబడెను. అదియునుగాక విష్ణువరుణ శబ్దములు సమానార్థకములు; వరుణ మనఁగా ఆవరణము. వరుణుఁ డనఁగా నావరించి యుండువాఁడు. సర్వవ్యాపియని యర్థము. విష్ణుశబ్దార్థ మిదియే కదా. కావున నిచట విష్ణు శబ్దమునకు వరుణుఁడని యర్థము గ్రాహ్యము. ఇట్టులే మహాదేవ శబ్దము ఇంద్రపర్యాయముగ వాల్మీకి యుపయోగించెను. అరణ్య ౭ సర్గ ౧౧ శ్లోకము - దేవరాజ శ్శతక్రతుః, ఉపాగమ్యాచ మాం దేవో మహాదేవస్సురేశ్వరః॥ అని కలదు. 'అత్ర పూర్వం మహాదేవ' యని సముద్రపర్యాయమునఁ బ్రయోగింపఁబడెను. కావునఁ బ్రకరణానుసారముగఁ బూర్వోత్తర సందర్భము లాలోచించి యర్థముచెప్ప టొప్పు. అర్థాత్ప్రకరణాల్లింగా దౌచిత్యాదర్థ నిర్ణయః, అని కదా యర్థ నిర్ణయ మం దాలోచింపవలసిన విషయములు. వాల్మీకి యమరకోశము చూచి పదములు ప్రయోగింప లేదు. వీకునఁ = పరాక్రమముచే, కాలఁబెట్టెదను = నేలఁబెట్టి కాలరాచెదను.

తా॥ దిక్పాలురైన యింద్ర యమ వరుణ కుబేరులు నాకేమించె మప కారము చేసినను సుఖముగ నుండఁజాలరు. దండము ధరించి యముఁడు వచ్చి

నను దండించెదను. దహనుని దహించెదను. మృత్యువునకు నేనే మృత్యువ నయ్యె దను. సూర్యచంద్రులను నేలఁబెట్టి కాలరాచెదను.

చ. అనిన నకంపనుండు భయ మంది విభూ! యభయం బొసంగి దే
నిని నిజముగ్ వచింతు నన నీ కభయం బిడినాఁడఁ జెప్పుమీ
మనమునఁ గొంక కెల్ల నన మానవభోజననాథుతో నకం
పనుఁ డనియెం గరద్వయము భక్తిభయంబుల మోడ్చి యీగతిన్.　　　౪౭౭

కరద్వయము = రెండు చేతులు, మోడ్చి = ముకుళించి.

తా. రావణుఁ డిట్లు పలుకఁగా నకంపనుఁడు చెడ్డవార్త చెప్పిన నన్నేమి చేయునో యని భయపడి చెప్పక విధిలేకుండుటచే నిట్లనియె. "ప్రభూ! నీకు భయము లేదు. నిన్నేమియు ననను.నిజము చెప్పు"మని యభయ మిచ్చెదవేని యున్నదున్నట్లు చెప్పెదను. అనిన 'నీ కభయ మిచ్చితిని. సందేహము లేక వాస్తవము చెప్పుము.' అనిన రెండుచేతులు జోడించి భయభక్తులతో నకంపనుఁ డిట్లనియె.

ఉ. మానితవృత్తబాహుఁ డసమానబలుండు వృషాంసుఁ డిందుతు
ల్యాననబింబుఁడుగ్ దశరథాత్మజుఁ డుత్తమకీర్తి బాణకీ
లానలమూర్తి రాముఁ డపరాజితవిక్రముఁ డాతఁడే జన
స్థానముఁ బాడు చేసెను వెసగ్ ఖరదూషణసంయుతంబుగన్.　　　౪౭౮

మానితవృత్తబాహుఁడు = గౌరవయోగ్యమైన గుండ్రమగు బాహువులు కలవాఁడు, వృష+అంసుఁడు = ఆఁబోతు మూఁపురములవంటి మూఁపురములు గలవాఁడు, ఇందుతుల్య = చంద్రునితో సమానమైన, ఆననబింబుఁడు = ముఖ బింబముగలవాఁడు, బాణకీలానలమూర్తి = బాణము లనెడి జ్వాలలు గల యగ్ని హోత్రుఁడు, అపరాజితవిక్రముఁడు = పరాజయములేని పరాక్రముఁడు, విష్ణు పరాక్రమమువంటి పరాక్రమము గలవాఁడు. అపరాజితౌ హరీశౌ, నా నా॥ ర॥ **అతఁడే** = అతఁడొక్కఁడే - ఇతర సాహాయ్యము లేక

తా. గౌరవింపఁదగిన గుండ్రని బాహువులు గలవాఁడు, సమానములేని బలము గలవాఁడు, ఆఁబోతు మూఁపురములవలె నెత్తైన మూఁపురములు గలవాఁడు, చంద్రబింబమువంటి ముఖము గలవాఁడు, దశరథమహారాజు కుమారుఁడు, మంచి కీర్తిగలవాఁడు, బాణము లనెడి జ్వాలలుగల యగ్నిహోత్రుఁడు, పరాజయ మెఱుఁగని పరాక్రమముగలవాఁడు, అతఁ డొక్కఁడే ఖరదూషణాదులతోడ మిక్కిలి వేగముగ జనస్థానము నాశముచేసెను.

కం. అన విని పెనుఁబాము నన న,ద్దనుజవరుఁడు రోఁజుచుగ్ యథాస్థితి చెప్పుమా
చనుదెంచెనో యింద్రామర,జనయుతుఁడై యటకు రామచంద్రుం డనికిన్.

రోఁజుచున్ = బుసగొట్టుచు, ఇంద్రామర జనయుతుఁడై = ఇంద్రుఁడు మొదలగు దేవతలతోఁగూడి.

తా. అని చెప్పఁగా విని రావణాసురుఁడు పెద్ద పామువలె శ్వాసము విడుచుచు నోరీ నిజము చెప్పుము. రామచంద్రుఁడు యుద్ధమునకు నింద్రాదులను దోడు తెచ్చుకొని వచ్చెనా? నీవు చెప్పినది యొంటరివానికి సాధ్యమగు పనికాదు. కావున నెవరితోడు తెచ్చుకొనె నని భావము.

—అకంపనుఁడు రావణునకు శ్రీరాముపరాక్రమంబు వర్ణించిచెప్పుట.—

కం. తెలుపుమ యన రావణుతోఁ, బలికె నకంపనుఁడు రామ♦భద్రుని తేజో
బలవిక్రమవిధ మంతయుఁ, గలది గలట్టుగను వీత♦గర్వుం డగుచున్. ౪౫౦

తేజోబలవిక్రమవిధము = తేజము, బలము, పరాక్రమము, వీనితీరు. వీతగర్వుఁడు = గర్వము లేనివాఁడు.

తా. చెప్పుమని రావణుఁ డడుగఁగా నకంపనుఁడు రామచంద్రమూర్తి యొక్క తేజస్సు, బలము, పరాక్రమము విధము గర్వము విడిచి యున్నదున్నట్టు లిట్లు లనెను.

తే. విల్లు పట్టెడివారిలో ♦ నెల్ల మేటి, బహుళదివ్యాస్త్రసుగుణసం♦పన్నవర్యుఁ
డాహవమునఁ బురందరునంతవాఁడు, రామనాముఁడు దివ్యప♦రాక్రముండు.

బహుళ = అనేకములైన, దివ్యాస్త్రములు, సుగుణములు నను సంపత్తి గల వారిలో శ్రేష్ఠుఁడు, ఆహవమునన్ = యుద్ధమందు, పురందరునంతవాఁడు = ఇంద్రునితో సమానుఁడు, దివ్యపరాక్రముండు = దేవతల పరాక్రమమువంటి పరాక్రమము గలవాఁడు.

తా. రాముఁ డను పేరుగలవాఁడు. విల్లాయుధములు ధరించు వారిలో నెల్ల గొప్పవాఁడు. అనేక దివ్యాస్త్రములు సుగుణ సంపత్తి గలవాఁడు. యుద్ధమునందు నింద్రునితో సమానుఁడు. దేవతల పరాక్రమమువంటి పరాక్రమముగలవాఁడు.

ఉ. ఆతనిసోదరుండు తన♦యన్నకుఁ దుల్యుఁడు శక్తి, దుందుభి
స్నిగ్ధతరస్వరుండు రక్తసర♦సీరుహనేత్రుఁడు లక్ష్మణుండు కం
జాతముఖుండు, నన్నకును ♦ సంతతముం గడుఁగూర్చు నగ్నికి
న్వాతమురీతి, రాముపల♦నం జెడిరెల్ల మనపట్టు దండకన్. ౪౫౨

తుల్యుఁడు=సమానుఁడు, దుందుభిస్నిగ్ధతరస్వరుండు = భేరిధ్వనివంటి గొప్ప కంఠ

ధ్వనిగలవాఁడు, రక్తసరసీరుహనేత్రుఁడు = ఎఱ్ఱకమలమువంటి కన్నులు గల వాఁడు, కంజాతముఖుండు = కమలమువంటి ముఖము గలవాఁడు.

తా. ఆరామునకుఁ దమ్ముఁడొకఁడు గలఁడు. వాఁడు శక్తియందు నన్నకు సమానుఁడు. ఎఱ్ఱతామరవంటి కన్నులు గలవాఁడు. ఆయనపేరు లక్ష్మణుఁడు. కమలమువంటి ముఖము గలవాఁడు. ఎల్లప్పు డన్నకు నగ్నికి వాయువువలె నను కూలుఁడు. అయినను ఈయన యుద్ధమందు లేఁడు. ఒక రామునివలననే దండక యందు మనయునికిపట్టు పాడయ్యెను.

ఉ. రా రనిఁ దోడు దేవతలు ♦ రాఁడు బలారియు, రాముఁ డొక్కఁడే
క్రూరనిశాతబాణములఁ ♦ గూల్చెను రాక్షసకోటి నెల్ల, బం
గారపుఁబింజతూపులు తెఱఁగ్ విడి వెల్వడి పంచవక్త్రయు
క్తోరగపంక్తు లౌచు నసురోత్తములన్ గబళించె నాజిలోన్.  ౪౮3

అనిన్ = యుద్ధమందు, తోడు = సహాయము, బలారి = ఇంద్రుఁడు, బంగా రపుఁ బింజతూపులు = బంగారు పిడులుగల బాణములు, తెఱఁగ్ = అల్లెత్రాటిని, విడి = విడిచి, పంచవక్త్రి = అయిదు తలలతో, యుక్త = కూడిన, ఉరగ = పాముల, పంక్తులు=వరుసలు, కబళించెన్=మ్రింగెను, ఆజిలోన్ = యుద్ధమందు.

తా. నీవు సందేహించినట్టులు రామచంద్రునకు దేవతలు సాహాయ్యము చేయలేదు. ఇంద్రుఁడును రాలేదు. రామచంద్రమూర్తి యొక్కఁడే పదునైన బాణములే యాయుధములుగాఁ గొని రాక్షససమూహమునంతయు వధించెను. ఆ బాణములను నాయన ప్రయోగించుటయు లేదు. బంగారుపిడులు గల యా బాణములు తమంతటఁ దామె యల్లెత్రాటినుండి బయలుదేఱి యైదుతలల పాము లై యుద్ధమందు రాక్షసుల నెల్ల మ్రింగెను.

కం.ఏయే తెఱఁగుల దిగులున, నేయే తెరువులను బోవు ♦ నెల్లపగఱ క
య్యాయి తెఱంగుల మఱి నా,యాయిపథంబులను దోఁచు ♦ నని రాముండున్.

తా.ఏయేవిధముల యేయేమార్గములందు రాక్షసులు భయపడి పోవుదురో యాయా విధముల నాయామార్గముల శత్రువుల కందఱకు రామచంద్రుఁడు యుద్ధ మందుఁ గానవచ్చుచుండెను.

ఇచ్చటఁ గొందఱు రామచంద్రమూర్తి పెక్కు రూపముల ధరించి రాక్షసు లకుఁ గానవచ్చినట్లు చెప్పెదరు. కొఱవి త్రిప్పినప్పుడు నిప్పొక చోటనున్నను అన్ని చోటుల నున్నట్లు కానవచ్చిన విధముగా నత్యంత గమనవేగముచే నట్లందఱ కన్ని చోటులఁ గానవచ్చెను. మూలబలయుద్ధమునందు నిట్టులే వర్తించెను. ఇది యిం

ంద్రజాలము గాదు యోగవిద్యకాదు. అద్భుతగమనశక్తి. దిగులున నను విశేషణసామర్థ్యముచే రామదర్శనమునకు భయము కారణమని గోవిందరాజీయము. కంసునకు సర్వత్ర కృష్ణ దర్శనమునకు భయమే కదా కారణము.

ఏయే తెఱఁగుల నేయే తెరువుల, భయపడిన రాక్షసులు రాక్షసస్వరూపమును దాఁచుట కేయే రూపము లెత్తుదురో వారివారికి నెదుట రామచంద్రుఁడే కానవచ్చెను. ఎవరేయే వస్తువుల చాటున దాఁచుకొనఁబోవుదురో వారివారి కా యావస్తువు లందు రామచంద్రమూర్తి కానవచ్చు చుండెను. ఆవస్తువులే రామచంద్రమూర్తిగాఁ గానవచ్చెను. ఏయే తెరువుల నెవరెవరు స్వరక్షణార్థము పోదురో వారివారి కాయా మార్గములం దెదుట రామమూర్తియే కానవచ్చెను. దీనిచే ప్రతి రాక్షసుని యెదుట "స్వేచ్ఛా గృహీత" దేహములతో రామమూర్తి కానవచ్చెను. మహేశ్వరతీర్థీయము. తనిశ్లోకి.

కం. ఈనెఱిఁ బాడఱ్ఱె జనస్థానం బన నాలకించి ♦ దశవదనుఁడు రో
షాననమున ననె నరిగెద, నే నిదె మానవులఁ బట్టి ♦ హింసింపంగన్. ౭౮౫

ఈ నెఱిన్ = ఈ విధముగ, ఆలకించి = విని, దశవదనుఁడు = రావణుఁడు, రోష + ఆననమునన్ = కోపముతోడ నెఱ్ఱనైన ముఖముతో.

తా. ఈవిధముగ జనస్థానమంతయుఁ బాడఱ్ఱెను అని యకంపనుఁడు చెప్పఁగా విని రావణుఁడు ముఖ మెఱ్ఱచేసి యిదిగో యిప్పుడే యా మనుష్యులను జంప బయలుదేఱెదను.

చం. అనిన నకంపనుం డనియె ♦ నానృపువిశ్రుతవిక్రమంబులన్
విను మనురేంద్ర! కింక గొనె♦నేని యసాధ్యుఁడు, నిండువెల్లి నేన్
ఘనతరబాణపంక్తి నరి♦కట్టు, నతారము నగ్రహంబు నా
ఘనపదమున్ శరంబులఁ బ♦గల్చుఁ జుమీ రఘురాముఁ డుద్ధతిన్. ౭౮౬

విశ్రుత = ప్రసిద్ధమైన, కింక = కోపము, ఇందలి పూర్ణబిందువు కినుక యందలి నువర్ణస్థానమున వచ్చినదిగాదు. కినుక = కిన్క-యగునుగాని కింక కాదు. ఇక్కడఁ గింక యనఁగా మితిమీఱిన కోపమని గ్రహింపవలెను. అసాధ్యుఁడు = గెలువరానివాఁడు, వీరికివారికని వ్యవస్థ చెప్పకుండుటచే నీకే కాదు బ్రహ్మరుద్రేంద్రాదులకైన నసాధ్యుఁడని భావము (తీర్థీయము) నిండువెల్లి నేన్ = పూర్ణప్రవాహమునైనను, అరికట్టున్ = అడ్డగించును, ఘనపదమున్ = ఆకాశమును.

తా. రావణుఁ డిట్లు చెప్పఁగా రామచంద్రుని బలపరాక్రమంబులను వివరించి యకంపనుఁడు చెప్పుచున్నాఁడు. రాక్షసరాజా! నీ వాయనమీఁదికి యుద్ధము

నకుఁ బోయిన మేలు లేదు. ఆయనకుఁ గోపము వచ్చెనా నీవే కాదు. బ్రహ్మేంద్రాదులును ఆయనను గెలువలేరు. పొంగి పొరలివచ్చిన సంపూర్ణప్రవాహమునైనను బాణములచే రాకుండ నిలుపఁగలఁడు. గ్రహములతో నక్షత్రములతోఁ గూడిన యాకాశమునైనను బాణములచేఁ జీల్పఁగలఁడు.

విశ్రుతవిక్రమంబులన్ = (1) అతిమానుషకర్మములను. (2) ఇతిహాసపురాణములందుఁ బ్రసిద్ధమైన యతని చర్యలను; విక్రమము = పరుల నాశ్రయించి లోపఱచుకొను సామర్థ్యము—ఇది త్రివిక్రమావతారమును సూచించుచున్నది; విక్రమంబు = విక్రమము చూపఁ బ్రారంభించెనా నివారింపసాధ్యము కానివాఁడు, నిండువెల్లి నరికట్టు ననుటచే రాఁగల కృష్ణావతారమో గడచిన కృష్ణావతారమో సూచితము. భయానకావర్తశతాకులనదీ మార్గందదౌసింధు రిహ శ్రియఃపతే - యని భాగవతము. ఇది మత్స్యావతారమును సూచించునని కొందఱు. తారలు, అశ్విని మొదలుగాగల యిరువదియేడు నక్షత్రములు, గ్రహములు, సూర్యాదులు, ఘనపదము ఆకాశమనుటచే నది యధిష్ఠానముగాఁగల యండకోశములని యర్థము. పగల్చున్=దీనిచేఁ ద్రివిక్రమావతారమునఁ జేసినకార్యము సూచితము. "యో అస్కభాయదుత్తరగ్ం సదస్థం విచక్రమాణస్త్రే ధోరుగాయ" యని శ్రుతి. గోవిందరాజ తీర్థీయము.

"విక్రమంబుల న్వినుమసురేంద్ర కింకగానెనేని" యనుచో నిత్యయతియని యప్ప కవి— ఇది యుభయ యతులలోఁ జేరినది—వాస్తవార్థమున నిది యఖండ యతియే.

శా. శ్రీమంతుం డతఁ డుద్ధరింపఁ గలఁ డు♦ర్వీన్, లీలఁ గూపారవే
　లామర్యాద నడంచి యంబునిధి కీ♦లాలంబులన్ వే జగ
　త్స్తోమం బెల్లను ముంపఁ జాలు గురుశ♦క్తుం, డంబురాశిస్మయం
　బామూలంబు హరించు, మారుతము నే♦నాఁకట్టు బాణంబులన్.　　౪౮౭

శ్రీమంతుండు = ఆయన కెట్టిశక్తి గలిగెనందు వేని యాయన శ్రీమంతుఁడు-అడవులలో కూటికి గుడ్డకు లేక తిరుగువాఁడు, ధన సంపన్నుఁ డనరాదు. లక్ష్మీదేవియుక్తుఁడనియే చెప్పవలెను. ఇచట మతుప్ప్రత్యయము నిత్యయోగమును దెలుపును. భూమనిందా ప్రశంసాసు, నిత్యయోగేతిశాయనే సంబంధేస్తి వివక్షాయాం భవంతి మతు బాదయ—సిద్ధాంతకౌముది. సర్వదా శ్రీతోఁ గూడి యుండువాఁడని యర్థము. 'విష్ణోరేషానపాయినీ' యనివి. పు. శ్రీమంతుఁడు గనుకనే యింతటి శక్తిసంపన్నుఁడు. ఆశ్రీ లేదాయెనా నిర్వ్యాపారుఁడే. ఈవిషయమునే, అప్రమేయంహి తత్తేజో యస్య సా జానకాత్మజా-సీతాదేవి యెవనిదో

వాని తేజ మప్రమేయము అను మారీచవాక్యము స్మరణీయము. ఉర్విన్ =భూమిని, ఉద్ధరింపఁగలఁడు = సముద్రములో మునుఁగుభూమిని నెత్తఁగలఁడు. ఇది వరహావతారమును సూచించుచున్నది. 'తాం వరాహో భూత్వా హర' త్తని శ్రుతి. కూపార = సముద్రముయొక్క, అకూపారశ్చ కూపారో యని ద్విరూపకోశము. వేలామర్యాద = చెలియలికట్ట దాఁటి రారాదను నియమము, కీలాలంబులన్ = నీటియందు, జగత్త్రయంబెల్లను = సమస్త ప్రపంచంబును, గురుశక్తుఁడు = గొప్ప శక్తి గలవాఁడు, ఉర్విన్ = అనఁగా భూమియందలి జనుల నని గ్రహింపవలెను. శ్రీమంతుఁడు కావున సంసారసాగరమున మునిఁగిన జనుల నుద్ధరించుననుటచే లక్ష్మీపురుషకారమువలననే జను లుద్ధరింపఁ బడుదురని సూచితము. కావున దేవీయుక్తుఁడైన భగవంతుఁడే సేవ్యుఁడు - శ్రీమంతుఁ డుర్వి నుద్ధరించుననుటచే శ్రీదేవికి భూదేవికి సవతిమచ్చరము లేదని యెఱుఁగవలయు. శ్రీయంశమే భూమి.

సీతావిశిష్టుఁడగు రామచంద్రమూర్తి భూమిమీఁదఁ బుట్టి సంసారసాగరమున మునిఁగిన వారి నుద్ధరించుననుటచే నాయన పరాత్పరుఁడని యాయన మోక్షప్రదాన సామర్థ్యము చెప్పఁబడెను.

జగత్త్రయం బెల్లను కీలాలంబులన్ ముంపఁజాలు ననుటచే జగత్సంహారశక్తియుఁ జెప్పఁబడెను. సంహారకారణముకూడ శ్రీరాముఁడే యని తీర్థీయము. ఇందు సంకర్షణావతారమును సూచించునని. గో॥ రా॥

గురుశక్తుఁడు = పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావిక జ్ఞాన బల క్రియాచ॥ ఈయన పరశక్తియే యనేకవిధముల ప్రసిద్ధిచెందినది. అవియేవన, స్వభావసిద్ధములైన జ్ఞానముబలము క్రియ మొదలయినవి. అంబురాశిస్మయము= సముద్రగర్వము, ఆమూలము = మూలముట్టుగ, హరింపంజాలు ననుటచే రామచంద్రమూర్తి చేయఁబోవు సేతుబంధన కార్యము సూచింపఁబడియె. మారుతమునేన్ = వాయువునైనను, ఆఁకట్టు = అడ్డగించును, ఆఁగు + కట్టు = ఆఁకట్టు, ఇచ్చట మారుత మనునది అన్నిభూతముల కుపలక్షణము. పృథివ్యప్సుప్రలీయతే ఆపస్తేజసి లీయంతే యని చెప్పిన క్రమప్రకారము ప్రలయము చేయఁగలఁడని భావము.

ఎల్లలోకనికరమున్ హరించి యని క్రింది పద్యమునఁ జెప్పఁబడుటచే నిచట సంహార క్రమమే గ్రాహ్యము.

తా. శ్రీమంతుఁడగు రామచంద్రమూర్తి భూమిని నుద్ధరింపఁ గలఁడు. అవలీలగ సముద్రము చెలియలికట్ట దాఁటి రారాదను నియమము నణఁచి భూమి నంతయు సముద్రములో ముంపఁగల శక్తి గలవాఁడు, సముద్రగర్వమును మొదలు

ముట్ట నాశము చేయఁగలఁడు. బాణములచే వాయువునైనను నడ్డకట్టఁ గలఁడు.

చం. ఘనతరవిక్రమంబునను ♦ గాఢమహాయశుఁ డాతఁ డెల్లలో
కనికరముఁ హరించియును ♦ గ్రమ్మర సృష్టి యొనర్పఁ జాలు, నా
మనుజమృగేంద్రుఁ డీప్రజల ♦ మానుగ నట్టులె చేయు, నీకు నా
మనుజవరుం డసాధ్యుఁ డని ♦ మన్మత మియ్యది పంక్తికంధరా! ౮౯౯

ఘనతరవిక్రమంబునను = మిగులగొప్పది యగు పరాక్రమముచే, గాఢమహాయశుఁడు = అధికమైన గొప్ప కీర్తి గలవాఁడు, ఎల్లలోకనికరముఁ = సమస్తములైన లోకముల సమూహమును, మన్మతము = నా యభిప్రాయము, పంక్తికంధరా = పదితలలు గలవాఁడా, ప్రజలఁ = మనుష్యులను, ప్రజాస్యాత్సంతతే జనే. అమరకోశము, అథ ప్రజానామధిపప్రభాత॥ రుపు.

తా. అధికమైన పరాక్రమముచే విశేషకీర్తిమంతుఁడైన రామచంద్రుఁడు సమస్త లోకములను సంహరించి మరల సృష్టింపఁగలఁడు. ఈ ప్రజల నట్టులే చేయఁగలఁడు, రామచంద్రమూర్తి నీకు గెలువ సాధ్యముకాని వాఁడని నాయభిప్రాయము.

విక్రమంబునను=సంకల్పమాత్రముచే, "నారాయణోకామయత"-"ఇచ్ఛామాత్రప్రభోస్సృష్టి" ఇత్యాదులు. మహాయశుఁడు=షడ్గుణైశ్వర్యవంతుఁడని ప్రసిద్ధి గన్నవాఁడు, ఎల్లలోకనికరముఁ = ఇట్లనుటచే నండములతోఁ గూడిన సమస్త లోకములు సూచితము. క్రమ్మర సృష్టి యొనర్పఁజాలు=ఇట్లు చెప్పుటచే పూర్వ కల్పాంతమున సంహరించిన యీయనయే మరల సృష్టియుఁ గావించెను. ఈ రెండు కార్యములు చేసినవాఁ డొకఁడేయని సూచితము. ఈ విధముగ సృష్టి స్థితి సంహారములకు మూఁటికిఁ గర్త రామచంద్రమూర్తియే యని చెప్పఁబడెను. ఇవియే కదా పరబ్రహ్మ లక్షణములు — ఓయి.

"ఏకోహవై నారాయణ ఆసీత్, నబ్రహ్మ నేశానో, నాపో, నాగ్నిషోమౌ, నేమేద్యావా పృథివీ, ననక్షత్రాణి నసూర్యో నచంద్రమా స్స ఏకాకీ నరమేత", మహోపనిషత్తు.

నారాయణుఁ డొక్కఁడే యుండెను, బ్రహ్మ లేఁడు. శివుఁడు లేఁడు. జలములు లేవు. అగ్ని సోముఁడు లేఁడు. ఈ భూమి, యాకాశము లేదు. నక్షత్రములు లేవు. సూర్యుఁడు లేఁడు. చంద్రుఁడు లేఁడు. ఆయన యొక్కఁడే క్రీడింపలేనివాఁ డయ్యెను.

అని యీ ప్రకారము జగత్సృష్టిసంహారకత్వములు నారాయణు కృత్యము లని యుపనిషత్తులు చెప్పుచుండ నీవు రామచంద్రమూర్తి యనియెదవే

యది యెట్లనిన - ఆ నరసింహమూర్తియే యీయన 'రావణుఁ జంప దేవతా బృందనుతిఁ సనాతనుఁడు విష్ణువు దోఁచె ధరఁ నరాకృతిఁ' అనుటచే (అయో౧) నారాయణుఁడే యీ రామచంద్రమూర్తిగాని తద్భిన్నుఁడు గాఁడు. లోకనికర మని సముదాయముగఁ జెప్పుటచే తమస్సుమొదలుపృథివివఱకు నానా వికార ములు పొందిన ప్రకృతియనియుఁ బ్రజల నను బహువచనప్రయోగముచే (ప్ర + జ) జీవాత్మలనియు గ్రాహ్యము. జీవప్రకృతులు నిత్యములైయుండ వానికి సృష్టి చెప్పవచ్చునా యందువేని సృష్టి శబ్దమునకు విడుచుట యని యర్థముకాని లేనిది నూతనముగాఁ గల్పించుట యనికాదు. కావున హరించుట యనఁగా లోప లికిఁ దీసికొనుట యనియు, సృష్టి యనఁగా వెలుపలికి విడుచుట యనియు గ్రహింప వలయును. ఇచ్చటఁ జెప్పఁబడిన జీవాత్మలు ప్రకృతిలో లీనమై యుండినవి యని గ్రహింపనగు. మనుజవరుండు=పురుషోత్తముఁడు=పురుషులకంటె (క్షరాక్షరముల కంటె) నుత్తముఁడు. పురుషోత్తముఁ డన్నట్లు మనుజులకంటె శ్రేష్ఠుఁడు మనుజ వరుఁడు. వరశబ్దమునకు శ్రేష్ఠుఁడని యర్థము.

మత్ + మతము=నా యభిప్రాయము. ఆయనపరాక్రమమును గన్నులారఁ జూచిన నా యభిప్రాయము.

మన్మతము = (1) నేను రాక్షసజాతిలోఁ జేరినను పూర్వజన్మ కృత సుకృత పరిపాకవశమున శ్రీరామమహత్త్వవిషయజ్ఞానము గలిగిన నాయభిప్రాయము.

నీవో 'ఆసురంయోని మాపన్నా మూఢా జన్మని జన్మని.' యన్నట్లు పాప వశమున నాసురప్రకృతిగల మూఢుఁడవు. నీ వసురుఁడవు కావున (అసు + ర) ప్రాణహింస చేయు టొక్కటే యెఱిఁగినవాఁడవు. కావున నీ వాయనమహిమ యెఱుఁగఁజాలవు. 'మాంసము నమలెడి దుష్టనృశంసులు కానంగలేరు ధర్మ' మన్నట్లు హింసాలోలురైన క్రూరులకు రామతత్త్వ మెట్లు తెలియఁగలదు? (2) సనత్కుమారాదులు చెప్పిన యితిహాస శ్రవణాదుల వలనఁ గలిగిన రామ పరత్వ జ్ఞానము గలిగిన నాయొక్క; వేగులవాఁడగుటచే మాఱువేషములతో ఋషుల యాశ్రమములకుఁ బోయి వారువారు చెప్పు తత్త్వజ్ఞానము వినికిడిగలవాఁడు. (3) మాల్యవంతుఁడు మొదలగు వారు చెప్పిన మాలి—సుమాలి వధాది వృత్తాంత శ్రవణమువలన వాస్తవ విషయ మెఱిఁగిన నాయొక్క (4) విశ్వరూప దర్శనము వలెఁ బదునాలుగు వేల రాక్షసుల యుద్ధమందు ప్రతి రాక్షసునకు రామ విగ్రహ భేదాది ప్రతిపత్తి గల నాకు—యుద్ధమందలి రాక్షసుఁ డొక్క రామునే చూడఁ గలిగెను. నేనో యొక్కొక్క రాక్షసుని యెదుట నొక్కొక్క రాముని చొప్పున ననేకరాముల నేకకాలమందుఁ జూచితిని. అట్టి నాయొక్క యభిప్రాయము. అటు

గాదేని యకంపనుని నెపమున ఋషియే రామపరత్వము స్తుతించె నని యెఱుఁగ నగు. గోవిందరాజీయము. ఈ వ్యాఖ్యాత యభిప్రాయ మేమన:—అకంపనుఁడు తనకుఁ బ్రతికూలుఁడు గాక యేమి జరుగునో చూతమని సాక్షిగా వచ్చిన వాఁడగుటచేఁ దనమహిమఁ జూచి యబ్బురపోయిన వీనిచేత వాస్తవ విషయము రావణునకుఁ జెప్పించిన నికనైన వాఁడు మేలుకొని తన కనుకూలుఁడై ప్రవర్తించునుగాక యని రావణుమేలు కోరి వీని కిట్టి జ్ఞానమును రామచంద్రమూర్తియే యనుగ్రహించెను అని.

పఙ్క్తికంధరా = రాముఁడొక్క తల గలవాఁడు. నేను బదితలలు గలవాఁడనని గర్వపడెదవేమో. సహస్రశీర్షా యని చెప్పినట్లు రామలక్ష్మణు లిరువురు వేయేసి తలలు గలవారు (ఆదిశేషుఁ డగుటచే లక్ష్మణునకు వేయి తలలని యెఱుఁగ నగు) కంధర శబ్దమునకు మేఘ మనియు నర్థము. కావున వారు గట్టిగ శ్వాస విడిచిరేని యా వాయువునకు మేఘమువలె నీ వెక్కడ నెగిరిపోదువో; ఎదుట నిలువనైన నిలువఁ గలవా? ఇఁక యుద్ధమేమి చేయఁగలవు? అల్ప శక్తిగల నీవు అనంతశక్తుఁ డగువానితో నెట్లు యుద్ధము చేయఁగలవు? ఆయన మనుజవరుఁడు. నీకు మనుజులచేఁ జావకుండ వరము లేదుగదా కావున నీపాలిటిమృత్యు దేవతయే.

ఉ. ఈ వొకఁ డంచుఁ బల్క నది ♦ యేటికి లోకమునందుఁ గల్గర
క్షోవరలోక మంతయును ♦ గూడియు నాతని డాయలేదు పా
పావహకర్తృతాళి దివి♦జాలయముం జొర నేరనట్లు; లా
భూవిభుఁ జంపుయుక్తిఁ బరి♦పూర్ణమనంబున విన్ము చెప్పెదన్. ౨౮

రక్షోవరలోకము = రాక్షస శ్రేష్ఠులు, నముచి హిరణ్యకశిపు శంబర, బలి మొదలగు వారలు, అంతయు=అందఱు కలిసి యొక్కటిగఁ జేరియు, డాయలేదు= సమీపింపనైనఁ జాలదు, ఇఁక నీవొక్కఁడ వేమి చేయఁగలవు? సమష్ట్యర్థమున నేకవచన ప్రయోగము. లేదు అనునది యమహదర్థకద్యోతకము. అచేతనములెన్నియైన నొక చేతనమునకు సరి రాఁగలవు! అని భావము. పాపావహకర్తృతాళి= పాపము గలిగించు కార్యములు చేయువారి సమూహము, దివిజాలయమున్ = స్వర్గమును.

తా. రామచంద్రమూర్తిని గెలువలేని వాఁడవు నీవొకఁడవే కాదు. లోకమునఁ గలుగు రాక్షసశ్రేష్ఠు లందఱును మనుష్యులును అందఱు నేకమైనను ఆయన సమీపమునకునైనఁ బోలేరు. ఆయన యొకఁడు; మే మిందఱము చేరిననేల యాయనను గెలువలే మందు వేమో—ఎందఱుపాపాత్ములు గుమిచేరినను స్వర్గమునకుఁ బోఁగలరా? పాపాత్ములకు స్వర్గప్రాప్తి లేనట్టు పాపాత్ముఁడవైన నీకు

రామ సాలోక్యప్రాప్తియు లేదని భావము. కావున రామచంద్రమూర్తిని నీవు చంపఁ దలఁచిన (చచ్చిన వానితో సమానునిఁగఁ జేయఁదలఁచిన) నేనొక యుపాయము చెప్పెదను. ఏకాగ్రచిత్తములో వినుము.

{ అకంపనుఁడు రావణునితో సీతాపహరణము శ్రీరామవధోపాయంబుగఁ జెప్పుట. }

ఉ. ఏ మని చెప్పువాఁడ నసు♦రేంద్ర! రఘూత్తముభార్య సీత నా
భామ త్రిలోకసుందరి యి♦భప్రతిమానసుయాన యావనో
ద్దామ నితంబినీమణి యు♦దంచితరత్నవిభూషితాంగి, యా
సామజవైరిమధ్యకును ♦ సాటి జగంబున లేదు రాక్షసా. ౨౯౦

ఇభప్రతిమానసుయాన = ఇభ = ఏనుఁగు నడకతో, ప్రతిమాన=సమానమైన, యాన = గమనము గలది, యావనోద్దామ = ప్రాయముచే గొప్పది,నితంబినీమణి = స్త్రీలయందు శ్రేష్ఠురాలు, ఉదంచిత = మిక్కిలి ప్రకాశించు, రత్నవిభూషితాంగి = రత్నములచేఁజెక్కఁబడిన భూషణములచే నలంకరింపఁబడిన దేహము గలది, సామజవైరి = సింహము నడుమువంటి, మధ్య = నడుము గలది.

తా. ఓ యసురరాజా? రామచంద్రునిభార్యయగు సీతను గుఱించి నే నేమి చెప్పఁగలను? రామచంద్రునిగుఱించి వృత్తబాహుఁడని, వృషాంసుఁడని చెప్పితిని. సీతావిషయమై చెప్పుటకు నాకు సాధ్యము గాదు. అయినను చెప్పవలయును గావునఁ జెప్పెదను. ఆమె సౌందర్యము వంటిసౌందర్యము గలది మూఁడు లోకములందును లేదు. ఆమె నడక యేనుఁగునడక వంటిది. నడిమి ప్రాయమందున్నది.

'త్యజే దంత్య కులోద్భూతాం వృద్ధస్త్రీం కన్యకాం త్యజే' త్తనునట్లు ముసలిది గాదు. లేఁత వయస్సుది గాదు. నితంబినీమణి = స్త్రీలయందు రత్నము వంటిది. ఇప్పుడు నీకుండు స్త్రీలందఱు బంగారు ముద్దలు. వీరిలో నామెను దెచ్చి యుంచితివా రత్నములు చెక్కిన యాభరణమువంటి దగును. ఆమె స్వభావముచేతనే సుందరి. 'సొమ్ములాయుధములు ముద్దుగుమ్మలకు' నన్నట్లు భూషణములు ధరించుటచే మఱింత సౌందర్యము హెచ్చినది. సింహమునడుమువంటి సన్నని నడుము గలది. ఆమెకు సమానమైనది లోకమున లేదు.

రఘూత్తము భార్య = రామచంద్రుని మహిమ నీకుఁ జెప్పితిని గదా. అటువంటి వాఁడు 'ప్రాణేభ్యోపి గరీయసీ' యని తన ప్రాణముకంటె గొప్పగాఁ జూచుకొనునది మఱి యెంత మహిమ గలదిగా నుండవలెనో చెప్పుటకు నాకు సాధ్యమా?

త్రిలోక సుందరి = మూఁడు లోకములం దుండు సుందరపదార్థములసౌందర్య మెల్ల నొక్కటిగ నొక్కచోఁ గుప్ప చేసినను ఆమె సౌందర్యమునకు సరిరాదు.

క. సురులను గంధర్వుల న,చ్చరలను నాశరుల నైన ♦ జానకి నెనయం
దరుణీమణి లే దనఁగా, నరసతుల వచింప నేల ♦ నమదమరేంద్రా. ౪౯౧

సురులను = దేవతాస్త్రీలయందైనను - సురశబ్దమునకు స్త్రీలింగరూపము సురీ. దాని తత్సమము సురి. దాని బహువచనరూపము సురులు. దేవతలు అను నర్థమున సురలనియే రూపము. కొన్నియెడలనజడంబు తృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి. ప్రౌ. వ్యా కారక ౧౫.'బలిమిఁగొనినధనము పదివేలయొంబెలఁ బెటికిరాఁగ నైరిభీకరుండు వచ్చెనకులుఁడు' భార. సభా. ౧అ. 'అనిన నలుగాలివాన గోవును,సశేష శబ్దముల మంత్రమును లోహజాతిఁ గాంచ,న మును మనుజుల విప్రుండు సమధికత్వభాజనములండ్రు వేదప్రపంచవిదులు.' భార- శాంతి. ౧ అ. గంధర్వులన్=గంధర్వస్త్రీలయందు, అచ్చరలను = అప్సరసస్త్రీల యందు,ఆశరులన్ = రాక్షసస్త్రీలయందు - నమత్ + అమరేంద్రా = నమస్క రించుచున్న యింద్రుఁడు గలవాఁడా.

తా. దేవతాస్త్రీలయందుఁగాని గంధర్వస్త్రీలయందుఁగాని అప్సరస లందుఁగాని రాక్షసస్త్రీలయందుఁగాని జానకితో సమానమైనస్త్రీ లేదు. ఇఁక మనుష్యస్త్రీలయందు లేదని చెప్పవలెనా.

దేవతాస్త్రీలకంటె గొప్పదనుటచే సాక్షాల్లక్ష్మియే యని భావము.

క. ఆమెను నీవిటఁ దెచ్చినఁ, గామి రఘూత్తముఁడు చచ్చుఁ ♦ గాంతావిరహో
ద్దామానలమునఁ బడి యన, నామాటల నాదరించి ♦ యసురేంద్రుఁ డనున్.

ఆమెను - అ+అమ్మ - అ + అమ = ఆమె - కావున ఆమెను అనఁగా ఆ యమ్మను నని యర్థము. ఇట్టి మాతృబుద్ధి సీతయందుఁగలవాఁడగుటచే దానిని నని చెప్పక ఆమె ననిచెప్పెను. ఇటన్ = ఈప్రదేశమునకు - లంకకు - కామి = ఆమె యందుఁ గామముగలవాఁడు, కాంతా విరహోద్దామానలమునన్ = ప్రియురాలి వియోగమను గొప్ప యగ్నియందు, ఆదరించి = ఆలోచన బాగున్నదని యామో దించి.

తా. ఆమెను నీవిచ్చటికిఁ దెచ్చితివా యామెయందుఁ గామముగల రాముఁ డు ప్రియురాలిని నెడఁ బాయుటచేఁ గలిగిన తాపమనెడి యగ్నిలోఁబడి చచ్చును. అని చెప్పఁగా రావణుఁడా యాలోచన బాగున్నదని యామోదించెను. తేర కాఁడు ది దొరకుట యొకటి, యుద్ధములేకయే శత్రువు చచ్చుట యొకటి. ఈకారణము లచే నా యాలోచన వానికి రుచించెను.

పూర్వపుణ్యవశమున జ్ఞానముగలిగి రామునందుఁ బరతత్త్వబుద్ధి గలిగిన యకంపనుఁడిట్టి దురాలోచన మేల చెప్పెను?

౧. 'యథా రాజా తథా ప్రజా' యన్నట్లు రాజు లెట్టివంటివారో ప్రజలట్టివారలగుదురని చెప్పినపుడు ఇఁక రాజసేవకులట్టివారగుట యేమియాశ్చర్యము?

౨. 'అర్థదాసా జనాస్సర్వే' యన్నట్లు కడుపుకూటికై యొకరియొద్దఁ గొలువునకుఁ గుదిరినవాఁ డెంత గుణసంపన్నుఁడైనను దనయేలినవానికిఁ బ్రియముగ మాటలాడకుండిన నతనియనుగ్రహము రాదు.

3. జరిగినది చెప్పి యూరకుండవచ్చునుగదా. ఈ దురాలోచన యేల చెప్పవలె ననిన రావణాసురుఁడు తలంచినట్లు యుద్ధమునకుఁబోయెనా దండకలోనే రామచంద్రమూర్తిచే హతుఁడగుట నిజము. తరువాతఁ గుంభకర్ణుఁడు తూఁగుఁ బోతు. ఇంద్రజిత్తు బాలుఁడగుటచేఁ దండ్రి పగదీర్చుకొనుటకై వాఁడు, తక్కిన కొడుకులు, బంధువులు, యుద్ధమునకు వత్తురు. చత్తురు. విభీషణుఁడు రాజగును. తనకూటిలో మట్టిపడును. కావున మంథర తనసౌఖ్యమునకై కైకకు దురాలోచన చెప్పినట్లు వీఁడును రావణుఁడు యుద్ధమునకుఁ బోకుండునట్లు వానికిఁ బ్రియముగ నుండునట్లు చెప్పెను. రావణుఁడు దుష్కామి. స్త్రీవ్యసనాసక్తుఁడు గావున నది వానికి రుచించెను. తన కోకయాఁడుది లభించిన ట్లగును. రాముఁడు చచ్చినట్లగును. కావున నీయాలోచన నామోదించెను.

౪. ఇచ్చట నొక్కవిషయ మాలోచింపవలసియున్నది. నీవు సీతాదేవిని హరించితివేని రామచంద్రమూర్తి కామి గావున భార్యావియోగతాపమునఁ జచ్చునని యకంపనుఁడు చెప్పెనుగదా. ఇది శాస్త్రసిద్ధమా లోకసిద్ధమా? మరణించిన భార్యవెంట భర్త సహగమనము చేయవలయునని శాస్త్రము విధింపలేదు. కాముకుఁడయ్యేనేని రెండవవివాహము చేసికొనవచ్చును. "దేశే దేశే కళత్రాణి" యని రాముఁడే చెప్పెనుగదా. లేదా విధురుఁడై బ్రహ్మచర్య మవలంబించి యుండవచ్చును. కావున నిది శాస్త్రసిద్ధముకాదు. లోకసిద్ధమా యనిన భర్తవెంట సహగమనముచేసిన స్త్రీలు గలరుగాని భార్యవెంట సహగమనముచేసినవారుకాని యావిరహమునఁ జచ్చినవారుగాని మగవారియందింతవఱకు లేరు. శాస్త్రము లోకాచారమిట్లుండ సీత నపహరించిన రామచంద్రుఁడు చచ్చునని యకంపనుఁడేమని యుపదేశించెను? అనుభవమునకు వచ్చినవిధముగ దీనివలన విపరీతఫలము గలిగినఁ గలుగవచ్చును. భార్య చచ్చినదనిన 'భార్యాదుఃఖం పునర్భార్యా' రెండవభార్య వచ్చువఱకే చచ్చిన మొదటిభార్యవిషయమైన దుఃఖ మన్నట్లు. కొన్నాళ్లేడ్చి యూరకుండును. అటుగాక పరుఁడు హరించికొని పోయినాఁడనిన నాయవ

మానముచే రోషము పెరిఁగి యాద్రోంగను జంపఁజూచును. కావున నీయుపాయ మపాయముతోఁగూడినది. అయిన దేమో యైనది పోయిన దేమో పోయిన దని యూరకున్నను గలహము లేదు. నాచెల్లెలి ముక్కు చెవులు కోసితివిగావున నీ పెండ్లాము గొంతు కోసెద నని సీతాదేవిని జంపి పీనుఁగును అక్కడనే పాఱవేసియుండిన రాముఁడు దానిని జూచి యెవరో రాక్షసులు చంపిపోయినారని కొంతసేపేడ్చి యూరక యుండియుండును. లేదా యకంపనుఁ డూహించినట్లు రామచంద్రుఁడు చచ్చినా వ్యసనము లేదు. అటుగాక యిటుగాక లంకలోఁ దెచ్చిపెట్టుకొనుట చూరులోఁ గొఱవి చెక్కినట్లేగదా. ఈక్షుద్రాలోచన యకంపనుఁడు రావణు మేలుకోరి చెప్పెనా కీడుకోరి చెప్పెనా? వీనిక్షేమము సుఖము రావణుక్షేమముపై నాధారపడి యుండుటచే బుద్ధిపూర్వకముగా నతని కీడుకోరి చెప్పినాఁడనుట సమంజసముగాదు. కావున వానియాలోచన వేఱువిధమై యుండవలయును. "జనకాత్మజ సంబంధంబున రాముం డప్రమేయ తేజుండయ్యెను" అని మారీచునకుఁ గలిగిన జ్ఞానమే యకంపనునకుఁ గలిగియుండవచ్చును. రామచంద్రుఁడు శ్రీమంతుఁడని యకంపనుఁడును చెప్పెను. అనఁగా శ్రీచేఁ బ్రసిద్ధికివచ్చినవాఁడని యర్థము. శ్రీ సీతాదేవి లేకపోయిన నప్రమేయ తేజము రామునకు లేదు. ఆ యప్రమేయ తేజ మెట్టిదైనది యనుభవ జన్యజ్ఞానము గలవాఁడగుటచే మారీచుఁడు సీతాదేవిని హరింపవలదని రావణునకు బోధించెను. అనుభవజన్యజ్ఞాన మకంపనునకు లేదు. కావున సీతారాముల వేఱుపఱుపవచ్చునని యకంపనుఁడు తలఁచెను.

సృష్టిస్థిత్యంతకారేణ నిగ్రహానుగ్రహాత్మనా ॥అహి॥ అన్నట్లు భగవంతునందు పంచవిధ సంకల్పశక్తులు గలవు. అనుగ్రహశక్తికే కృప యనిపేరు. ఈ కృపాశక్తిచేతనే భగవంతుఁడు సృష్టి, స్థితి, లయము, నిగ్రహము కావించుచుండును. ఇన్నిటికిఁ గృప యే కారణము. ఈ కృపాశక్తియే లక్ష్మి. "లక్ష్మ్యాసహ హృషీకేశో దేవ్యాకారుణ్యరూపయా। రక్షకస్సర్వసిద్ధాంతే, వేదాంతేషు చ గీయతే" కారుణ్యరూపిణియగు లక్ష్మీదేవితోడ నారాయణుఁడు జగద్రక్షకుఁడు అని వేదములు వేదాంతములు సిద్ధాంతముచేయుచున్నవని యర్థము. కావున వాస్తవమున సృష్టి స్థితి సంహారకార్యముల కవ్యవధానకర్త్రి లక్ష్మీదేవియే. ఎండచేత సూర్యుఁడెట్లు కార్యములుచేయుచున్నాఁడో యట్టులే యామెచే భగవంతుఁడు కార్యములు చేయుచున్నాఁడు. సీతోపనిషత్తునందు – "శ్రీరామసాన్నిధ్యవశాజ్జగదాధారకారిణీ (జగదానందకారిణీ అని పాఠాంతరము) ఉత్పత్తి స్థితి సంహారకారిణీ సర్వదేహినామ్ సీతాభగవతీ జ్ఞేయా మూలప్రకృతి సంజ్ఞితా ప్రణవత్వాత్ప్రకృతిరితి వదంతి బ్రహ్మవాదినః" సాదేవీ త్రివిధాభవతి శక్త్యాత్మనా ఇచ్ఛాశక్తి క్రియాశక్తి సాక్షాచ్ఛక్తి రితి; ఇచ్ఛాశక్తి స్త్రివిధాభవతి శ్రీభూమి

సీతాత్మికా శ్రీదేవీ త్రివిధం రూపం కృత్వా భగవత్సంకల్పానుగుణ్యేన లోకరక్షణార్థం రూపం ధారయతి.

శ్రీరామసాన్నిధ్యవశమున నీమె జగదాధారయు సర్వదేహులయుత్పత్తిస్థితి సంహారకారిణియు నగుచున్నది. భగవతియగు సీతకే మూలప్రకృతి యనిపేరు. ప్రణవమగుటచేఁ బ్రకృతియని బ్రహ్మవాదులందురు. ఆమె త్రివిధ శక్త్యాత్మికా - ఇచ్ఛాశక్తి - క్రియాశక్తి - సాక్షాచ్ఛక్తి - ఈ యిచ్ఛాశక్తి శ్రీభూమినీళ లని మూఁడువిధములు - ఈ శ్రీదేవి త్రివిధరూపములు ధరించి భగవత్సంకల్పానుసారముగ లోకరక్షణార్థము రూపము ధరించుచుండును. సర్వభూతసృష్టి యీమెవలన జరగుటచే నీమె సర్వలోకజనని యనఁబడుచుండును. ఇదియే సంగ్రహముగ మాయయయ్యెను. మాయా యనఁగా, యా = ఎవతె, మా = తల్లియో యామె మాయ - "లోకమాతా మా రమా మంగళదేవతా" దాని సంగ్రహరూపమే మా=అమ్మ.

తల్లిని బిలుచునపుడు అమ్మా యందుమేకాని నాయమ్మ యనముకదా. కావునఁ దల్లియను నర్థముగల మా శబ్దముచే లక్ష్మీదేవి పిలువఁబడును. ఈమె లోకమునకుఁ దల్లి యగుటచేఁగదా లోకమునకు నంతయుఁ జంద్రుఁడు చందమామ యయ్యెను.

మమ యోనిర్మహద్బ్రహ్మ, తస్మిన్ గర్భం దదామ్యహమ్
సంభవః సర్వభూతానాం తతో భవతిభారత.
సర్వయోనిషు కౌంతేయ, మూర్తయః సంభవంతియః॥
తస్యాం బ్రహ్మ మహద్యోని, రహం బీజప్రదః పితా॥ భ. గీ ౧౪, శ్లో ౩॥౪

భగవంతుఁ డేయే యవతార మెత్తుచుండునో యామెయుఁ దదనుగుణమైన రూప మెత్తుచుండును. ఇంతటిశక్తి తన స్వాధీనమం దుండుటచేఁగదా రామచంద్రుఁ డింతటివాఁడైనాఁడు. ఈమె రావణుస్వాధీనమందుండిన రావణుఁడింతవాఁ డగును. అప్పుడు రాముఁడు జీవించినను మృతప్రాయుఁడగును. ఇప్పుడు శ్రీమంతుఁడగువాఁడు సీతను వేఱుపఱచిన నశ్రీమంతుఁడు అనఁగా దరిద్రుఁడగును. అంతియకాదు. శ్రీమంతునిలో శ్రీపోఁగా మంతుఁడుమాత్రమే మిగులును. మంతుఁడు అనఁగా మనుష్యుఁడు - "మర్త్యాపరాధయోర్మంతుః" అనినానా - అనఁగా పరశురామునందుండిన భగవత్తేజస్సు పోఁగానే యాయన నిర్వీర్యుఁడై బ్రాహ్మణత్వముమాత్రము మిగిలినవాఁడయినట్లు రాముఁడును మనుష్యమాత్రత్వము మిగిలినవాఁడగును. అప్పుడు సులభముగ జయింపవచ్చును. తమ రాజు బాగుండినఁ దాము బాగుండవచ్చు నని యాలోచించి సద్భావముతోనే

యీయాలోచన చెప్పెనుగాని సూర్యునినుండి యెండను విడఁదీసినట్లు వారి నిద్దఱ వేఱుపఱుప సాధ్యమా యనిమాత్ర మాలోచించినవాఁడుకాఁడు.

నీవిట్టి పౌరషా టభిప్రాయముగలవాఁడవై యున్నావు, నీయభిప్రాయము సరిగాదని తెలుపుటకే "అనన్యా రాఘవే ణాహం భాస్క-రేణ ప్రభాయథా" సూర్యునకు నెండవలె రామునకు నే ననన్యను నీవు వేఱుపఱుపలే వని సీతాదేవి రావణునకు బోధించెనుగాని యవి వానిచెవులలో దూఱినవికావు.

ఈపద్యంబున నాదరించి యనుమాటకు మహేశ్వరతీర్థీయ వ్యాఖ్యయం దిట్లు వ్రాయఁబడెను.

అథాపరాం కథాం దివ్యాం, శృణు రాజర్ష పురాతనీమ్.
యదర్థం రామవై దేహీ, రావణేన హృతాపురా
పురా కృతయుగే రామ, ప్రజాపతిసుతం ప్రభుమ్.
సనత్కుమారమాసీనం, రావణో వాక్య మబ్రవీత్.
రావణః॥ దైత్యదానవ రక్షాంసి యే హతా స్సమ రేరయః
కాం గతిం ప్రతిపద్యంతే, కేన తే హరిణా హతః.

సనత్కుమారః॥ యేయేహతాశ్చక్రధరేణ రాజర్ష। త్రైలోక్యనాథేన జనార్దనేన। తేతే గతా స్తన్నిలయం నరేంద్రా. క్రోధోపి దేవస్యవరేణ తుల్యః॥ శ్రుత్వా తత స్తద్వచనం నిశాచర, స్సనత్కుమారస్య ముఖాద్వినిర్గతమ్। తథాప్రహృష్ట స్స బభూవవిస్మితః కథం ను యాస్యామి హరిం మహాహవే॥

మునిః॥ మనసశ్చేప్సితం యత్త ద్భవిష్యతి తదాహవే।
సుఖీభవ మహాబాహో, కించిత్కాలం ప్రతీక్షయ॥
అథవా రాక్షసేంద్ర! త్వం, యదీదం ప్రష్టుమిచ్ఛసి।
కథయిష్యామి తే సర్వం, శ్రూయతాం యది రోచతే॥
కృతయుగే వ్యతీతే వై,ముఖే త్రేతాయుగస్య తు।
హితార్థం దేవమర్త్యానాం, భవితా నృపరిగ్రహః॥
ఇక్ష్వాకూణాం చ యో రాజా, భావ్యో దశరథో భువి।
తస్య సూను ర్మహాతేజా, రామోనామ భవిష్యతి॥
ఏవం శ్రుత్వా మహాబాహుః, రాక్షసేంద్రః ప్రతాపవాన్।
త్వయా సహ విరోధేచ్ఛు, శ్చింతయామాస రాఘవ॥
సనత్కుమారా త్తద్వాక్యం, చింతయానో ముహుర్ముహుః।
రావణే ముముదే మోహా, ద్యుద్ధార్థీ విచచారహ॥
ఏతదర్థం మహాబాహో, రావణేన దురాత్మనా।

సుతా జనకరాజస్య, హృతా రామ మహామతే।
లంకామానీయ యత్నేన, మాతేవ పరిరక్షితా.

ఇత్యాది అతఏవ రావణస్య సీతారామభృత్యత్వేన తా వుద్దిశ్య తేన వక్ష్యమాణాని బాహ్యదృష్ట్యా దుర్భాషణవత్ప్రతీయమానాన్యపి వాక్యాని, వస్తుతః స్తుతిపరాణ్యేవ. తథా తత్రతత్ర వ్యాఖ్యాస్యామః."

అగస్త్యుఁడు, రామా! సీతను రావణుఁడేల హరించెనో చెప్పెదనువినుము. పూర్వకాలమునఁ గృతయుగమందు బ్రహ్మకుమారుఁడైన సనత్కుమారుని జూచి రావణుఁడు విష్ణువుచేఁ జచ్చినవారిగతి యేమి యని ప్రశ్నింపఁగా విష్ణువుచేఁ జచ్చిన వారు విష్ణులోకమునకుఁబోదురు. భగవంతుని క్రోధముకూడ ననుగ్రహముతో సమానమే. అనిచెప్పఁగా రావణుఁడు సంతోషించి యాయనతో నాకెట్లు యుద్ధముచేయఁ బొసఁగునని యడిగిన మునీంద్రుఁ డిట్లనియె. ఎవరికోరిక యెట్లున్నదో యట్లే కాఁగలదు. కొంచెముకాల మెదురుచూడుము. అయినను నిట్టిది నాకు నెట్లు లభించునందువా త్రేతాయుగారంభమున దేవమనుష్య హితార్థముగ నాయన మనుష్యరూపముతో దశరథరాజకుమారుఁడై రామనామమున జన్మించును. ఆ మాటలు రావణుఁడు విని నీతో యుద్ధముచేయఁ గోరికగలవాఁడై యెట్లు యుద్ధము తటస్థించునా యని యాలోచించుచుండెను. ఈనిమిత్తమై దురాత్ముఁడగు రావణునిచే సీతాదేవి హరింపఁబడి తల్లివలె రక్షింపఁబడెను. దీనినిబట్టి సీతారాములను రావణుఁడు పలుకుమాటలు దూషణములుగాఁ దోఁచినను వాస్తవమున స్తుతివాక్యములే యగును గాన నచ్చటచ్చట స్తుతిపరముగఁగూడ వ్యాఖ్యానము చేయుదుము అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి.

మీఁద ననువదింపఁబడిన శ్లోకములుత్తరకాండమున ప్రక్షిప్తసర్గములలో ౩,౪ సర్గములందున్నవి.

'ఏతదర్థం మహాబాహో' అను శ్లోకము లందుఁ గానరాలేదు. ఈప్రక్షిప్త సర్గములకు మహేశ్వరతీర్థులు వ్యాఖ్యానమును వ్రాసినవారుగారు. గోవిందరాజీయవ్యాఖ్యయులేదు. కావునఁ బ్రక్షిప్తములు ప్రమాణములు గాఁజాలవు. అదియునుగాక ఈజన్మమున రావణునకు విష్ణులోకప్రాప్తిలేదు. మోక్షమే లభించియుండినచో మరల వీఁడు శిశుపాలుఁడుగాఁ బుట్టవలసినకారణము గలుగదు. జయవిజయులు శీఘ్రముగ మరల వైకుంఠప్రాప్తి గోరి మూఁడుజన్మముల విరోధమునుగదా గోరిరి. ఇట్టులుండ హిరణ్యకశిపు శిశుపాలురు కేవల విరోధులై యుండ రావణుఁ డెట్లు భక్తుఁడయ్యెనో – అదియునుగాక వీనికి విష్ణులోకప్రాప్తిలేనట్టు విష్ణుపురాణమున స్పష్టముగఁగలదు. ఎట్లన:—

తత్రత్రితు హిరణ్యకశిపో విష్ణురయ మిత్యే తన్నమనస్యభూత్ ॥౪॥ నిరతిశయ పుణ్యజాత సముద్భూత మేతత్సత్య మితి రజోద్రేకాన్యగ్రాహిణ్యేకాగ్రమతి స్తద్భావనాయోగా త్తతో ప్రాప్తవధహైతుకీం నిరతిశయమేవాఖిలత్రైలోక్యాధిక్యకారిణీం దశాననత్వే భోగసంపద మవాప॥ ౫॥ తత స్తస్మిన్ననాదినిధనే పరబ్రహ్మభూతే భగవత్యనాలంబనీకృతమనస్తల్లయం దశాననత్వే ప్యనంగపరాధీనతయా జానకీసక్తచేతసో దాశరథిరూపధారిణ స్తద్రూపదర్శనమేవాసీత్ నాయమచ్యుత ఇత్యాసక్తి ర్వ్యపదోంతఃకరణస్య మానుషబుద్ధిరేవ కేవల మస్యాభూత్ ॥ ౬॥ పునరప్యచ్యుత వినిపాతనమాత్ర ఫల మఖిలభూమండలశ్లాఘ్య చేదిరాజకులే జన్మావ్యాహత మైశ్వర్యం శిశుపాలత్వే ప్యవాప॥

దీనివలన రావణుఁడు కామపరవశుఁడై సీతను హరించెననియు నా జన్మమున వానికి విష్ణులోకప్రాప్తి లేదనియు స్పష్టపడియెను.

రామునితో యుద్ధముచేసి చచ్చుటయే వానికి ముఖ్యోద్దేశ మయ్యెనేని యీ ద్రావిడప్రాణాయామమేల? యుద్ధకారణముకలిగెఁ గావున చక్కఁగా సేనలతోనే యొంటరిగా ద్విగ్విజయమునకుఁ బోవుచుండినవిధముగఁ బోయి యుద్ధము చేసి చచ్చియుండ వచ్చునే.

ప్రక్షిప్తశ్లోకములలో నున్నట్లు రావణునకు రామచంద్రమూర్తియందు మనుష్యభావములేక దేవభావముండెనేని యీయనచేఁ జచ్చుట యెట్లు సంభవించెను? ఇది బ్రహ్మవరమునకు విరోధముగాదా?

అదియునుగాక సీతాదేవిని లంకలోనుంచిన పక్షమున రామచంద్రమూర్తి యచ్చటికి రాఁజాలఁడనికదా వాని యభిప్రాయము. ఇది కంఠోక్తిగా నెన్నిమాఱులో రావణుఁడే చెప్పెనుగదా! యుద్ధముఁగోరిన వాఁడిట్లుచేయునా? తల్లివలె సీతాదేవిని రక్షించెననికదా ప్రక్షిప్తశ్లోకములు చెప్పుచున్నవి. అట్లు వానికి మాతృభావముండెనేని తల్లి నెట్లు గౌరవింపవలయునో యట్లు గౌరవించెనా? తన తల్లిని నీ ప్రకారమే వనములో నుంచి నిన్నుఁ జంపెదను కోసెదను తినెద నని బెదరించుచుండెనా? దుర్వాటవాక్యములు పలికెనా?

తన్ను రావణుఁడు భక్తిచే గ్రహించెనో కాముకుఁడై గ్రహించెనో తెలిసికోలేనంతటి మూఢురాలా జానకీదేవి? ఏల రావణుఁడు సమూలము హతుఁడగువఱకు లంకవిడిచి రానని యామె చెప్పెను? భక్తునియందింత కాఠిన్యము సీతాదేవియా వహించును?

రావణునకుఁ దల్లియను భావము సీతాదేవియందుండెనేని నీచన్నులిట్లు

న్నవి, నీతొడలట్లున్నవి, నీ పిఱ్ఱలిట్టు లున్నవనునా? తనతల్లి నిట్లెవ్వఁడైన నెంత పాపియైన ననునా? తాయిగండ మతమువాఁ డనునేమో.

భక్తుఁడు తాను మోక్షముఁ గోరునుగాని నిర్వంశమైపోవు కార్యముఁ జేయునా?

భారతంబున - వనపర్వంబున - ౨౮౨ అధ్యాయము.

రావణః కామబాణార్తో దదర్శో పససర్పచ.

దేవదానవగంధర్వయక్షకింపురుషై ర్వృధి.

అజి తో౽శోకవనికాం, యయా కందర్పపీడితః. ఇందు రావణుఁడు కామ బాణార్తుఁడు. కందర్పపీడితుఁడని చెప్పఁబడెను గదా.

రావణుఁడు సీతాదేవి భక్తుఁడో కాముకుఁడో యీ క్రింద పద్యములవలనఁ దెలియఁదగు.

మహాపార్శ్వుఁడనువాఁడు నీవు సీతాదేవిని కోడిపుంజువలె బలాత్కార ముగఁ జెఱుపరాదా యని బోధింపఁగా రావణుఁడు తాను బరస్త్రీలను బలాత్కా రించి చెఱుపకుండఁ దనకుగల బ్రహ్మశాపమును జెప్పుచుం.

క. ఈ శాపభీతిఁగాదే, యాశింపకయున్నవాఁడ నవనిజఁగాదే
నాశయనంబున నెపుడో, యాశఁపా దేహఁగూడనా జంకుదునా?

యని ప్రత్యుత్తర మిచ్చెను.

ఇది రావణుఁడు సీతను దల్లివలె రక్షించిన విధము. ఇంద్రజిత్తు వధానంత రము రావణుఁడు సీతాదేవిని జంపఁబోయి తనమాతృభక్తిని వెల్లడించెను. సీత యందు భక్తిగలవాఁడైనచో రాముఁడు చచ్చెనని మాయాధనుస్సు - శిరము నేల సీతకుఁ జూపవలెను! ఎటులైన నయభయముల సీతను దనకు వశపఱుపుఁడని యేల రాక్షస స్త్రీలకు బోధింపవలెను?

రామచంద్రమూర్తిచేఁ జావవలయునని కోరికగలవానికార్యములా యివి?

ప్రక్షిప్తశ్లోకములందు రామావతారము త్రేతాది నని వ్రాయఁబడెను. అది సరిగాదు. త్రేతాద్వాపరసంధియందు రామావతారము. తక్కినవియందందు వ్రాయఁబడును. రావణుఁడు సీతా భక్తుఁడేని లోకవంద్యుఁడే కాని యిది నిలువఁ గాల్లులేని కల్పితాభిప్రాయము.

రాము నాశ్రయించి సీతను ద్వేషించిన శూర్పణఖవలెను, సీతను గోరి రాము ని ద్వేషించిన రావణువలెను నగుదురు.

## రావణుఁడు మారీచుం జూడఁ బోవుట.

శా. కానీ నే వఱువాత నేగి ధరణీ♦కన్యామణిం దెత్తు మో
దానన్ నీ విఁకఁ బొమ్మటం చనిపి దై♦త్యస్వామి సూర్యాభ తే
జోనిస్తుల్యము రాసభాంచితము నై ♦ శుభ్రంబునౌ తేరిపైఁ
దా నొక్కండుగ సూతయుక్తుఁ డయి య♦ధ్యాసీనుఁడై వెల్వడెన్. ౪౯౩

కానీ = కానిమ్ము, నీవు చెప్పినటులే చేసెదను. ఇచ్చునకు సర్వత్ర యా యగు. ఇవ్వ అనుట యపశబ్దము. వఱువాతన్ = ఉదయమున, సూర్యాభ = సూర్యునితో సమానమైన, తేజస్ = కాంతిచే, నిస్తుల్యము = అసమానమైనది, రాసభాంచితము = కంచరగాడిదలచే నొప్పినది, శుభ్రము = తెల్లనిది, అధ్యాసీనుఁడై = కూర్చున్నవాఁడై, వెల్వడెన్ = బయలుదేఱెను. అశ్వశాస్త్రమునఁ గంచరగాడిదల లక్షణమిట్లు చెప్పఁబడెను.

అశ్వస్యగ్భ్యస్సముత్పన్నా, స్తస్మాదశ్వతరాఃఖరాః,
ఖరరూక్షస్వరా స్తీక్ష్ణాః, ఖరశీలాః ఖరాంఘ్రియః.

ఆఁడుగుఱ్ఱములకు మగగాడిదలకుఁ బుట్టినవి యశ్వతరులు. కంచరగాడిదలు.

తా. నీవు చెప్పినటులే చేసెదను. ఉదయమునఁబోయి సీతాదేవిని దెత్తును. నీవు పొమ్మని పంపి రావణుఁడు సూర్యునివలెఁ బ్రకాశించు కంచరగాడిదలు కట్టిన తెల్లని తేఱిపై సారథితోఁ దానొక్కఁడే బయలుదేఱెను.

క. వినువీదిఁ జనెడు నాస్యందన మయ్యెడఁ దోఁచె మేఘ♦తతిమధ్యమునన్
గొనబారుచంద్రమండల, మన నటు చని తాటకేయు♦నాశ్రమమందున్.

వినువీది = ఆకాశమార్గము, వీథిశబ్దభవమువీది— స్యందనము = రథము, తాటకేయు = తాటకకొడుకైన మారీచుని, అపత్యార్థకతద్ధితము, ఆశ్రమము = తపోవనము.

తా. ఆకాశమార్గమునఁ బోవుచున్న యారథ మాసమయంబున మేఘముల నడుమనుండు చంద్రమండలమువలెఁ గానవచ్చెను. అట్లుపోయి మారీచుని యాశ్రమమందు (చంద్రుఁడు పోకున్నను, పోవుచున్న మేఘముల నడుమ నున్నప్పుడు చంద్రుఁడు పోవుచున్నట్లు కానవచ్చును.)

తే. అవతరించిన మారీచుఁ ♦ డరుగుదెంచి, భవ్యము లగునమానుష♦భక్ష్యభోజ్య
ములను దృప్తునిఁగాఁ జేసి ♦ పూజ సలిపి, యర్ఘ్యపాద్యాదు లర్పించి♦యని యెనిట్లు.

అవతరించినన్ = దిగఁగా; అమానుష = మనుష్యులకు దుర్లభములైన, ఇందు ఁగ్రమ మనపేక్షితము.

తా. తేరు దిగఁగా మారీచుఁడు వచ్చి యర్ఘ్యపాద్యము లిచ్చి యాసన మర్పించి మనుష్యులకు దుర్లభములయిన మేలగు భక్ష్యములు భోజ్యములు నిచ్చి తృప్తునిఁగాఁజేసి యిట్లనెను.

క. సేమంబే యసురేశ్వర, సేమంబే రాక్షసులకుఁ ♦ జెచ్చెర నీవిం
దీమెయి నరుదెంచుటచే, నేమో కలదనుచు శంక ♦ యెద జనియించెన్. ౪౬

చెచ్చెరన్ = శీఘ్రముగ, ఈమెయిన్ = ఈవిధముగ, ఒంటరిగా, ఏమో = ఏదియోవిశేషము గొప్పకార్యము, ఎదన్ = హృదయమందు.

తా. రాక్షసరాజా! నీకు రాక్షసుల కందఱకు క్షేమమేకదా. ఉపద్రవమే దియు సంభవింపలేదుగదా. ఈ ప్రకారముతోడెవ్వఁడును లేక యొంటరివాఁడవై యెకాయెకీనవచ్చుటచూడ నేదియో గొప్పకార్యము తటస్థించినదని సందేహము కలుగుచున్నది.

ఉ. ఆనుడు లాలకించి యసు♦రాధిపుఁడిట్లనుఁ దండ్రి! రాముఁ డన్
మానవుఁ డొక్కరుం డుసుఱు♦మాలిచి రక్షకకోటులన్ జన
స్థానముఁ బాడు చేసె రణ♦శౌండత, నాతనిభార్యఁ దెచ్చుచో
మానుగ నాకుఁ దోడగుము ♦ మానుతు నాపగఁ దద్విధంబుగన్. ౪౭

నుడులు = మాటలు, ఉసుఱుమాలిచి = చంపి, రణశౌండత = యుద్ధసామర్థ్యముచే.

తా. ఆమాటలు విని రావణాసురుఁ డిట్లనియె. తండ్రీ! రాముఁ డను నొక్క మానవుఁడు రాక్షసులనందఱ యుద్ధసామర్థ్యముచే వధించి జనస్థానము పాడుపడఁ జేసెను. ఆతనిభార్యను నే నపహరించి తేఁదలఁచితిని. ఈవిషయమున నీవు నాకుఁ దోడగుము. ఆవిధముగ నాపగఁ దీర్చుకొందును.

మారీచుఁడు రావణునకు శ్రీరామునితోడివిరోధంబు వల దని చెప్పుట.

క. నావుడు మారీచుం డను, నేవాఁ డొకో నీకుఁ దెల్పె ♦ హితశత్రుం డై
యావై దేహినిగూరిచి, యేవాఁ డొకో నీదుచేటు ♦ నెదురుం జూచున్. ౪౮

నావుడు = అనవుడు, అని చెప్పఁగా, హితశత్రుండై = హితునివలెఁ గనఁబడు వాస్తవశత్రువు.

తా. రావణుఁడీప్రకారము చెప్పఁగా విని సీతాదేవినిగుఱించి నీకు లోపల శత్రుత్వము, వెలుపల మిత్రత్వముగలవాఁడెవఁడు చెప్పెను. ఎవఁడు నీవెప్పుడెప్పుడు చెడుదువాయని యెదురుచూచుచున్నాఁడు.

ఉ. నీకు హితుండు గాఁడు ధర♦జేసుతఁ దెమ్మనినట్టివాఁడు, ము
ల్లోకము లేలువానికిని ♦ లోలత శృంగము భంగ మొందఁగాఁ
జేకొనఁ జేయ నెవ్వఁడు? ప్ర♦సిద్ధవిషోరగదంష్ట్రఁ బీకఁగా
నీ కెవఁడో వచించె? నిటు ♦ నిద్రితునిన్ దలఁ దన్నె నెవ్వఁడో?  ४८८

శృంగము = ప్రాధాన్యము. "శృంగం ప్రాధాన్యసాన్వోశ్చ" అమరకోశము. విషోరగ = విషముతోఁగూడిన పాముయొక్క, దంష్ట్ర = కోఱ, నిద్రితునిన్ = హెచ్చరిక తప్పియుండువానిని.

తా. సీతను దెమ్మనిచెప్పినవాఁడు నీమేలుకోరినవాఁడుకాఁడు. ఇప్పుడు మూఁడులోకములు పరిపాలించు నీప్రముఖత్వముఁజూచి సహింపలేక యది భగ్నమై పోవఁజేయ నెవ్వఁడు ప్రయత్నించెను? ప్రసిద్ధమైన విషసర్పముకోఱ పీఁకుమని నీ కెవఁడుచెప్పెను? ఏమఱి వాస్తవము తెలియక నిద్రపోవువానివలెనుండు నీతల నెవ్వఁడు తన్నెను?

చ. సురవరవైరి భూనుతవి♦శుద్ధకులాభిజనాగ్రహస్తమై
యురుతరశౌర్యదాన మయి ♦ యుగ్రభుజార్గళసద్విషాణమై
పరజనభీకరం బగుచు ♦ వాలెడురాఘవగంధహస్తినిన్
దురమునఁ దేఱిచూచుటకు ♦ నూల్కొన కిప్పుడు రాక్షసోత్తమా.  ४९०

సురవరవైరి=ఇంద్రునకు విరోధీ! భూ=భూలోకములోని జనులచే; నుత= స్తోత్రముచేయఁబడిన, విశుద్ధ = ఎట్టిదోషములేని, కుల = వంశమున, అభిజన= పుట్టుకయనెడి, అగ్రహస్తమై = తొండము కొనగలదై, ఏనుఁగునకుఁ దొండ మెంతముఖ్యమో మనుష్యులకు గొప్పవంశమునఁబుట్టుట యంతముఖ్యము. కావున రెంటికి రూపకము. ఉరుతర = మిగుల నధికమైన, శౌర్య = పరాక్రమమనెడి, దానము = మదపునీళ్లుగలది, పరాక్రమ మదములు జనులు తిరస్కరింపకుండు టకు హేతువులు. కావున రెంటికి రూపకము – ఉగ్ర = భయంకరమైన, భుజార్గళ= గడియమ్రాఁకులవంటి భుజములనెడి, సద్విషాణమై = మంచికొమ్ములుగలదై – ఏనుఁగునకు కొమ్ములెట్టివో భుజములట్టి వని రూపకము. వాలెడు = అతిశయించెడి, రాఘవగంధహస్తినిన్ = రామచంద్రమూర్తియనెడు మదపుటేనుఁగును, దురమునన్ = యుద్ధమందు, తేఱిచూచుటకున్ = తెప్పలెత్తిచూచుటకు, నూల్కొనకు = ప్రయత్నింపకుము.

తా. రాక్షసరాజా! జగత్ప్రసిద్ధమైన గొప్ప వంశమునఁ బుట్టుట యనెడి తొండముకొన, గొప్ప పరాక్రమమనెడి మదపునీళ్లు, గడియమ్రాఁకులవంటి చేతులనెడి దంతములు, శత్రువులకు భయము గలిగించు రాముఁడనెడి మదపుటేనుఁ

గును నింద్రవిరోధీ! యిప్పుడు కనుతెప్ప లెత్తియైనఁ జూచుటకు యత్నింపకుము; సురవరవైరి=అనుటచే నింద్రుని జయించితిని గదా, మనుష్యుఁ డెంతయని గర్వింపకు మని భావము. రాక్షసోత్తమా = నీవు రాక్షసులందు మాత్రము శ్రేష్ఠుఁడవు. రామచంద్రుఁడో భూజనుల యందఱచేత గొప్పవాఁడని స్తోత్రము చేయఁబడు వాఁడు. నాలుగవ పాదమున అనునాసికాక్షరయతి.

మ. కలహాంతస్థితిసంధివాలమును ర♦క్షఃకాండసత్త్వాపహం
బలఘుస్ఫారకలంబసన్నఖము వా♦తాసిస్ఫురద్దంష్ట్రముర్
బలితం బైన నృసింహమూర్తి నిదురన్ ♦ మ్రాన్పాటు మై నుండఁగాఁ
జలముం బూనుచు నీవు లేపఁ దగునే ♦ చర్చింపు లంకేశ్వరా. ౫౦౧

అంతకు నతిశయము చెప్పఁదలఁచి సింహముగా రూపించుచున్నాఁడు. కలహ + అంత + స్థితి = యుద్ధము మొదట నిలుచుట యనెడి సంధివాలము=వీఁపు పై నుండెడి వాలము. అనఁగా సింహము మిగులఁ గోపించినపుడు తోఁక పై కెత్తుకొనును. అది కలహమునఁ బైకి దూఁకుటను సూచించును. కావున యుద్ధ ముఖమున నిలుచుటకు-సింహము తోఁక పై కెత్తుటకు రూపకము. రక్షఃకాండ=రాక్షస సమూహమనెడి, సత్త్వ=జంతువులను, అపహము=చంపునది, అలఘు=గొప్పవై, స్ఫార=ప్రకాశముగల, కలంబ=బాణము లనెడి, సన్నఖము=వాఁడిగోళ్ళు గలది, శాతాసి=పదునైన కత్తి యనెడి, స్ఫురత్=ప్రకాశించు, దంష్ట్రము=కోఱలు గలది. బలితము=బలము గలది, నృసింహమూర్తి=నరుఁడుగా జనించిన శ్రీరాముఁ డనెడి సింహము, నిదురన్=శ్రీరామచంద్రమూర్తి విషయమున, ఏ కార్యము చేయక యూరకయుండు వాని స్థితియందు, మ్రాన్పాటుమైన్=నిశ్చలత్వముచే, చేలము=హఠము, చర్చింపు=చక్కఁగా నాలోచింపుము.

తా. యుద్ధముఖమున నిలుచుట యను పై కెత్తఁబడిన తోఁక గలదియు, రాక్షస సమూహమను మృగముల సంహరించునదియు, గొప్ప బాణము లనెడు వాఁడిగోళ్ళు గలదియు, వాఁడి గల కత్తు లను కోఱలుగలదియు నగు బలిష్ఠమైన నరరూపమును వహించిన రాముఁడను సింహము తానెందో యొకరిని బాధింపక నిద్రించుచుండఁగాఁ జెట్టు కొట్టి మీఁదఁ ద్రోచికొనునట్లు దానిని లేపవచ్చునా. చక్కఁగా నాలోచింపుము.

క. చాపావహారము భుజా,టోపాధికపంకమును బ♦టుశరోర్మికముర్
దీపితరణౌఘ మగుసీ,తాపతిపాతాళమందుఁ ♦ దగదు పడంగన్. ౫౦౨

సింహము బారిని బడి తప్పించుకొనిన జంతువులు లేవా యను నే నేమో యని. సింహముబారిఁబడి తప్పించుకొనినఁ దప్పించుకొనవచ్చునుగాని రాముని బారిని బడినవారు తప్పించుకొన రని పాతాళము నుపమానముగాఁ జెప్పు

చున్నాఁడు. చాప + అవహారము = విల్లనెడు మొసలి కలది. సమీపింపఁగానే గబ క్కున వాతవేసి కొనునది యని భావము. భుజాటోప = భుజబలముయొక్క వేగ మనెడి, అధికపంకము = మిగుల బురద గలది, బురదలో దిగఁబడినవాఁడు మరల నెట్లు వెలికి రాజాలఁడో యట్లులే రాముని భుజబలమున కగ్గమైనవాఁడు మరల నూపిరితో రాఁడని భావము. సముద్రమునందు నలలమీఁద నలలు వచ్చి, సముద్ర ములోఁబడిన వానిని లోఁగొని యెట్లు హింసించునో యట్లులే రామబాణ పరం పరలు పైఁబడి ముంచి హతునిఁ జేయునని భావము. పటు = దృఢములయిన, శర = బాణము లనెడి, ఊర్మికము = అలలు గలది, దీపిత = బాణకాంతులచేఁ బ్రకా శించు, రణౌఘు = యుద్ధ మనెడి ప్రవాహముగల, సీతాపతి పాతాళమందు = సీతా పతియను పాతాళమందు = సముద్రమందు (మహేశ్వర తీర్థీయము).

తా. పాతాళమందుఁబడినవారు మరలఁ బైకి రాఁజాలనట్లు రామ పాతాళమున నీవు పడితివా మరల నూపిరితో వెలుపల రాఁజాలవు. రామపాతాళ మెట్టి దనెదవా. విల్లే మొసలిగాఁ గలది. నీళ్లలో నడుగుపెట్టి పెట్టక ముందే వాత వేసికొనును. దానిని దాఁటిపోయితివా భుజ వేగమను పెద్ద బురద గలదు. అందు దిగఁబడితివా యంతతోనే చెల్లు. అది దాఁటి పోయితివా బాణపరంపరలను నలలు మీఁదమీఁద వచ్చి పడి లోపలికి నీడ్చుకొని హతుని జేయును. ఇట్టి యుద్ధ ప్రవాహము గల రామపాతాళమందుఁ బడిన జీవితాశ లేదు.

క. క్షమియింపుము లంకేశ్వర, శమమున లంకకును బొమ్ము ♦ స్వసతులతోడన్
రమియింపుము వనసీమను, రమియించుత భార్యతోడ ♦ రాముఁడు ప్రీతిన్. 49

ఇట్లు వాస్తవార్థమును జెప్పి ప్రేమాధిక్యమునఁ బ్రార్థించుచున్నాఁడు.

తా. లంకాధిపతీ! నేను బరుషముగఁ జెప్పితి నని కోపింపకుము. క్షమిం పుము. వాస్తవమును నీమేలుగోరి చెప్పితిని. కోప ముడిగి లంకకుఁ బొమ్ము. నీ భార్యలతో నీవు పురమునఁ గ్రీడింపుము. అడవిలో నాయనభార్యతో నాయన క్రీడించుఁ గాక. ఆయన భార్యతో నాయున క్రీడింపకుండఁ జేసితివా నీ భార్యలతో నీవు క్రీడింపఁబోవు.

క. అనుచును మారీచుం డిటు, తను బోధింపఁగను విబుధ♦దమనుఁడు వల్లే
యనుచును లంకాపురికిని, జని తనమందిరముఁ జొచ్చె ♦ సంతుష్టుం డై. 50

తా. ఇట్లు మారీచుఁడు హిత ముపదేశింపఁగా నట్లులే చేసెదనని యంగీక రించి లంకకుఁ బోయి సంతోషముతోఁ దన గృహము ప్రవేశించెను.

ఇప్పటికి రావణునకు శూర్పణఖావిరూపకరణ వృత్తాంతము తెలియదు. అకంపనుఁడు తెలిసియుఁ జెప్పలేదు. ఏల చెప్ప లేదు? రావణాసురుఁడు ఖరాదు

లకు రామచంద్రునకు యుద్ధమేల తటస్థించె నని యడిగినవాఁడు కాఁడు. అందఱు ఋషులను జంపఁబోయినట్టు రాముని జంపఁబోయి చచ్చిరేమో యని తలఁచి రావణుఁడు ప్రశ్నింపలేదు. తానై చెప్పుటకు నకంపనుఁ డంతటి ధైర్యపరుఁడు గాఁడు. నీతియుఁ గాదు. నీ చెల్లెలి ముక్కు సెవులు రామలక్ష్మణులు గోసిరి. ఆ కారణమున యుద్ధము పొసఁగెనని శూర్పణఖ వారియొద్ద కేల పోయెనని రావణుఁ డడుగును. సేవకుఁడు నీ చెల్లెలు అంకాడఁబోయిన దని యెట్లు చెప్పును? మఱి యేదైన గారణము చెప్పిన శూర్పణఖవచ్చి యేమి చెప్పునో-అది వచ్చును. చెప్పును. ఆ వెంట మన కేల యని యకంపనుఁ డావిషయము ప్రస్తావించిన వాఁడు కాఁడు. కావున రామునితో బలవద్విరోధమేల? నేనొకఁడను బోయిన నందఱఁ జంపిన వానిని నేను జయింపఁగలనని యేమి నమ్మకమని యాలోచించి సంతుష్టుఁడై యింటికిఁ బోయెను.

## ౩౨-వ సర్గము. శూర్పణఖ లంక కేగి రావణుఁ జూచుట.

సీ. ఈరేడు వేవురు ♦ క్రూరరాక్షసవరుల్, ఖరుఁడు దూషణుఁడు త్రి♦శిరుఁడు లోను
గా నొక్కరాముచేఁ ♦ గదనతలంబునఁ, గూలుట గనుఁగొని ♦ యోలికొనుచు
భూరిరావమున వా♦పోవు చనన్యదు,ష్కర మైనరాముని♦క్రమముఁ గాంచి
యుద్విగ్న యగుచును ♦ నురవడిఁ జనె దశ,కంఠరక్షితము లం♦కాపురంబుఁ

తే. గదియ నరిగి విమానాగ్ర♦గతుని దీప్త
తేజు సురపరివృతసుర♦రాజుఁబోలి
సచివయుతుఁ డగువాని భా♦స్కరనిభంబు
కాంచనాసనమున యథా♦కామితముగ. ౧-౫

ఈరేడు = రెండేడులు = పదునాలుగు, వేవురు = వేయిమంది, ఒక్కరాముచేన్ = ఒంటరివాఁడైన రామచంద్రమూర్తిచే, కదనతలంబునన్ = యుద్ధభూమియందు, ఓలికొనుచున్ = అఱచుచు, వాపోవుచున్ = ఏడ్చుచు, అనన్యదుష్కరము = ఇతరులకు సాధ్యముకానిది, ఉద్విగ్న = మిక్కిలి భయపడినది, ఉరవడిన్ = మిగుల వేగముగ, విమానాగ్రగతునిన్ = పుష్పకమందున్నవానిని, సురపరివృత = దేవతలచేఁ జుట్టఁబడిన, సురరాజున్ = ఇంద్రుని, సచివయుతుఁడు = మంత్రులతోఁ గూడినవాఁడు, భాస్కరనిభంబు = సూర్యునితో సమానమైనది యగు, కాంచనాసనమునన్ = బంగారుపీఠమునందు, యథాకామితముగన్ = ఇష్టప్రకారము.

తా. పదునాలుగువేలు క్రూరులైన రాక్షసశ్రేష్ఠులు ఖరుఁడు దూషణుఁడు త్రిశిరుఁడు మొదలైనవా రొంటరివాఁడైన రామచంద్రుచే యుద్ధమందుఁ జచ్చుట

చూచి బొబ్బలుపెట్టుచు గట్టిగ నేడ్చుచు నితరులకు సాధ్యముగాని రాము పరాక్రమము చూచి మిగుల భయపడి శీఘ్రముగ రావణుఁడు పాలించు లంకకుఁబోయి దేవతలచేఁ జుట్టఁబడిన యింద్రునివలె పుష్పకవిమానమందు మంత్రులతోఁడ సూర్యునిబోలిన బంగారుపీఠమందుఁ దన యిష్టప్రకారము.

తే. జాతరూపవేదిస్థజా♦జ్వల్యమాన, జాతవేదునిగతి నొప్పు♦సకల దేవ
భూతగంధర్వతాపస♦జాతముల క, జయ్యుఁ డగువాని శమనుని♦సాటివాని. ౫౦౬

జాతరూప = బంగారుమయమైన, వేదిస్థ= వేదియందు, జాజ్వల్యమాన = మండుచున్న, జాతవేదునిగతిన్ = అగ్నిహోత్రునివలె, అజయ్యుఁడు = జయింప శక్యముగాని వాఁడు, శమనుని = యముని.

తా. బంగా రిటికలతోఁ గట్టఁబడిన వేదియందుండి నేతితో హోమముచేయుటచే మండుచున్న నగ్నిహోత్రునివలె సమస్తభూతములకు గంధర్వులకు తాపసజాతములకు=తపస్వుల సమూహములకు జయింప సాధ్యపడనివానిని యమునివంటి వానిని.

క. అసురసురవిషమసంయుగ,రస నతులితనిశితకులిశ♦ప్రహరణకలితో
ల్లసితవ్రణు సురకరిసర,భసదంతకృతకిణకలిత♦పటువత్సతలున్. ౫౦౭

అసుర = రాక్షసులయు, సుర = దేవతలయు, విషమ = భయంకరమైన, సంయుగ + రసన్ = యుద్ధభూమియందు, అతులిత=అసమానమైన, నిశిత=పదునైన, కులిశ = వజ్రాయుధముయొక్క, ప్రహరణ=దెబ్బచే, కలిత=చేయఁబడిన, ఉల్లసిత=ప్రకాశించు, వ్రణున్=గాయముగలవానిని, వజ్రాయుధముచే గాయము మాత్రమే కలిగెనుగాని మరణము లేదని భావము. సురకరి = ఐరావతముయొక్క, సరభస = వేగముతోఁగూడిన, దంత = దంతములచే, కృత = చేయఁబడిన, కిణ= కాయలచే, కలిత = కూడిన, పటు = దృఢమైన, వత్సతలున్ = వక్షముగల వానిని.

తా. దేవాసురులకు జరిగిన ఘోరయుద్ధమందు అసమానమైన పదునుగల వజ్రాయుధము దెబ్బచే గాయముమాత్రము పడిన వక్షముగలవానిని, ఐరావతము కొమ్ములచేఁ బొడువఁగా కాయలుకాచిన ఱొమ్ము గలవానిని.

క. ఇరువది నిడుకరములు పది,శిరములు వింజామరములు ♦ శ్వేతచ్ఛత్రం
బురువిపులోరము భూపతి, వరలక్షణములును గలుగు♦వానిని వీరుల్. ౫౦౮

ఉరు = గొప్పతనము, విపుల = విశాలమైన, ఉరము = ఱొమ్ము.

ఇందు రావణునకుఁ బదితలలు ఇరువదిచేతు లున్నట్టు చెప్పఁబడినది. వీనికి నాలుగు కాళ్లున్నట్లు కొన్నిప్రమాణములు గలవు.

ఇత్యుక్తా మునినా తేన దుఃఖహర్షసమన్వితా। అచిరేణైవకాలేన, సుషువే పుత్ర మద్భుతమ్। దశాస్యం వింశతిభుజం భిన్నాంజనచయోపమమ్। పాదైశ్చతుర్భి రత్యుగ్రం తామ్రోష్ఠం తామ్రమూర్ధజమ్॥ నారదీయే జైమినీరామాయణే ద్వాదశేధ్యాయే సప్తదశశ్లోకః॥ రఘువంశే అష్టాదశసర్గే—భుజమూర్ధోరు బాహుళ్యా దేకోపిధన దానుజః.—జానకీపరిణయనాటకే. శిరోదశకమగ్రతః పదచతుష్టయం చాన్యతః

దశాస్యోవింశతి భుజశ్చతుష్పాన్మానమందిరం. ఇత్యభిధాన రత్నమాలా.

వీనితలలగుఱించిన చర్చ వేఱొకచోఁ గాననగు.

తా. దీర్ఘములైన ఇరువదిచేతులు, పదితలలు, తెల్లనిచామరములు, తెల్లగొడుగు, విశాలమై యెత్తైనట్టి రాజచిహ్నములుగల వీరుని.

తే. స్నిగ్ధవైడూర్యసంకాశు ♦ నిగనిగత్సు, వర్ణ మణికుండలుని మహా♦వదను శుక్ల
దశను విష్ణుచక్రాదిసా♦ధనశతాన్య, శస్త్రతాడితు నాహత♦సకల దేహు. ౫౦౯

స్నిగ్ధ = మినమినమెఱయుచున్న, వైడూర్యసంకాశున్ = వైడూర్యముతో సమానమైనవానిని, వైదూర్యము ॥రూ॥ నిగనిగత్ = నిగనిగలాడుచున్న, సువర్ణ = బంగారుతోఁజేయఁబడిన, మణికుండలునిన్ = రత్నములు చెక్కఁబడిన చెవికుండలములుఁగలవానిని, మహావదను = పెద్దముఖముగలవానిని, శుక్లదశను = తెల్లని దంతములుగలవానిని, విష్ణుచక్ర = విష్ణుచక్రము, ఆదిమొదలుగాఁగల, సాధనశత = అనేకాయుధములచేతను, అన్యశస్త్ర = ఇతరములయిన శస్త్రములచేతను, తాడితున్ = కొట్టఁబడినవానిని, ఆహత = కొట్టఁబడిన, సకలదేహున్ = సమస్తావయవములుగలవానిని, వానిదేహమునందు దెబ్బతగులనిభాగము లేదని భావము. విష్ణుచక్రము = విష్ణుచక్రమనఁగా నారాయణు సుదర్శనమని భ్రమింపరాదు. మాల్యవదాదులతో యుద్ధముచేసినట్లు రావణునితో విష్ణువుయుద్ధముచేసినట్లు రామాయణమునలేదు. కావున సుదర్శనప్రయోగమునకుఁ గారణములేదు. ఈవిష్ణుచక్రమనునది ఆపేరుగల యాయుధము. దీనిని విశ్వామిత్రుఁడు రామచంద్రమూర్తి కుపదేశించెను. (బాల ౬౭౨ పద్యము చూచునది.) దీనినే విశ్వామిత్రుఁడు వసిష్ఠునిపైఁ బ్రయోగించెను. (చూడు ప ౧౦౭౦. బాల.) సుదర్శనచక్రము విశ్వామిత్రునకెట్లు లభించె? అతఁడది ప్రయోగింప వ్యర్థమెట్లయ్యె? ఇంతకు సుదర్శనమనునది భగవంతుని సంకల్పశక్తి. అది తదితరుల కెట్లు లభ్యపడును?

ప్రాణో మాయా క్రియాశక్తిః । భావ ఉన్మేష ఉద్యమః
సుదర్శనం చ సంకల్పః । శబ్దాః పర్యాయ వాచకాః అహిర్బుధ్న్యే॥౧॥

ఉన్మేషః పరమః శక్తేర్విష్ణోః కోట్యంశకోట్యశః, । భావ్యభావక భేదేన సా ద్విధా వ్యవతిష్ఠతే, భావకో విష్ణుసంకల్పః । సుదర్శనపరాహ్వయః॥

కావున నీపేరటియస్త్రమును ఇంద్రుఁడో మఱియెవరో ప్రయోగించిన రావణు నది గాయపఱిచియుండును. అంతియకాని యది సుదర్శనచక్రముగాదు.

తా. వైడూర్యమువలె మిలమిల మెఱయువానిని, నిగనిగలాడు రత్నములు చెక్కిన బంగారుకుండలములు గలవానిని, పెద్దముఖముగలవానిని, తెల్లని దంతములుగలవానిని, విష్ణుచక్రము లోనగు ననేకాయుధములచేఁ గొట్టఁబడి గాయఁబడిన సకలావయవములు గలవానిని.

క. అక్షోభ్యార్ణవనిచయ, ప్రక్షోభణు సకలభూరి♦వసుధాధరసం
ప్రక్షేప్తను సురవరబల, విక్షేపకు రాక్షసైక♦విభు భీప్రదునిన్. ౧౦

అక్షోభ్య = ఇతరులకుఁగలఁతపెట్టసాధ్యపడని, అర్ణవనిచయ = సముద్రసమూహములను, ప్రక్షోభణున్ = కలఁతపెట్టువానిని, సకల = సమస్తములైన, భూరి = గొప్పవగు, వసుధాధర = పర్వతములను, ప్రక్షేప్తను = విసరివేయఁగలవానిని, సురవరబల = దేవతాశ్రేష్ఠులబలమును, విక్షేపకున్ = తిరస్కరించువానిని, రాక్షసైకవిభున్ = రాక్షసులకొక్కఁడే ప్రభువగువానిని, భీప్రదునిన్ = భయముకలిగించువానిని.

తా. ఇతరులకుఁ గలఁతపెట్ట సాధ్యపడని సముద్రములను గలవరపఱచు శక్తిగలవానిని, సమస్తపర్వతములను నెగమీటఁగలవానిని, దేవేంద్రాదుల బలమును దిరస్కరించినవానిని, చూచువారికి భయముగలిగించువానిని, రాక్షసులకు నొక్కఁడే ప్రభువగువానిని.

తే. అన్యదారాభిమర్శను ♦ నఖిలదివ్య, శస్త్రయోక్తను దాపస♦సప్తతంతు
విఘ్నకరు భోగవతి సర్ప♦విభుని వాసు, కినిబరాజితుఁ జేసి ప్ర♦ధనమునందు. ౧౧

అన్యదార = ఇతరులభార్యలను, అభిమర్శను = అపహరించువానిని, అఖిల...యోక్తను = సమస్తదివ్యములైన శస్త్రములతోఁగూడినవానిని, సప్తతంతు = యజ్ఞములను, ప్రధనమునందు = యుద్ధమందు, పరాజితుఁజేసి = ఓడించి.

తా. ఇతరులభార్య నపహరించువానిని, సమస్తములైన దివ్యాయుధములతోఁగూడినవానిని, ఋషుల యజ్ఞముల విఘ్నపఱచువానిని, భోగవతీపురమున సర్పరాజైన వాసుకిని యుద్ధమందు నోడించి.

క. తక్షకుని నోడిచి తద్వన, జేక్షణ హరియించి హరన♦గేంద్రమునందున్
యక్షపతి గెలిచి పుష్పక, మాక్షణమునఁ దెచ్చినట్టి♦యతిశూరవరున్. ౧౨

ఒడిచి = గెలిచి, తద్వనజేక్షణన్ = వానిభార్యను, హరనగేంద్రమునందున్ = కైలాసపర్వతమందు, యక్షపతిన్ = కుబేరుని.

తా. తక్షకుని గెలిచి యాతనిభార్య నపహరించినవానిని, కైలాసమునందుఁ గుబేరుని గెలిచి పుష్పకమను విమానమును దెచ్చినశూరుని.

క. నందనచైత్రరథంబుల, సుందరమగునళిని గినుపు ♦ చొప్పడనాశం
బందించినబలి నుదయం, బందెడిరవిశసులఁ గేల ♦ నాఁగెడు బలియున్. ౧౬౩

నందన = దేవతల యుద్యానవనము, చైత్రరథము = కుబేరుని యుద్యానము, నళిని = సరస్సును. రూ. నళినము. కినుపు = కోపము, రవిశసుల=సూర్యచంద్రుల 'పదాంత శి, బహువచనంబున సు' యగు. ఆఁగెడు = అడ్డగించు.

ఇంద్రుని యుద్యానమును, కుబేరుని యుద్యానమందుఁగల నళినియను సరస్సును, గోపించి నాశముచేసిన బలిష్ఠుని, ఉదయించు సూర్యచంద్రులను, చేతితో నడ్డగింపఁగల శక్తిమంతుని.

సీ. హా యనలోకముల్ ♦ హాయనదశసహస్రకము తపంబును ♦ జలిపి మున్ను
పరమేష్ఠిఁ గూరిచి ♦ శిరములు దెగఁగోసి, యర్పించి పూజించి ♦ యతనిచేత
దైతేయ దేవగం♦ధర్వపిశాచప,తంగోరగములచే♦తను మనుష్య
జాతీతరములచే ♦ సంగ్రామమున మృతి, లేకుండ వరములఁ ♦ జేకొనుచును

ఆ. హోమములను జెఱచి♦సోమంబు హరియించి,ప్రాప్తయజ్ఞములను♦బాడుచేయు
బ్రహ్మహంత దుష్టు ♦ బాధకర్కశు దయా, హీను నహితరతుని ♦ నింద్రవైరి.

హా = అయ్యో, హాయనదశసహస్రకము = పదివేలసంవత్సరములు—పరమేష్ఠిన్ = బ్రహ్మను, మనుష్యజాతీతరములచే = మనుష్యజాతికంటె నితరములయినజాతులచేత, ప్రాప్తయజ్ఞములను=దక్షిణాదానమువఱకు వచ్చిన యజ్ఞములను, బ్రహ్మహంతన్ = బ్రాహ్మణులను జంపువానిని, బాధకర్కశున్ = మిగులఁ గఠినుని, దయాహీనున్ =దయలేనివానిని—ఇంద్రవైరిన్ = ఇంద్రునకుఁ బగవానిని.

ఉ. రావణు సర్వభూతచయ♦రావణు నిర్జరలోకలోకవి
ద్రావణు నట్టహాసకృత♦దైవతకంజముఖాళిగర్భవి
స్రావణు భూరిదోశ్చయప♦రాక్రమభంజితగాఢదంతకై
రావణు లోకపీడనప♦రాయణుఁ గుత్సితధీతురాయణున్. ౧౮౫

రావణున్ = రావణుఁడను బిరుదును బొందినవానిని, రావణుఁడను పేరు నడుమ వచ్చినదేకాని నామకరణము నాఁడు పెట్టఁబడినదికాదు. మొదటిపేరు దశకంధరుఁడు.

కం. విశదయశుండును ధాతృస,దృశుఁడగు నవ్మా నివచ్చి ♦ దృష్టించి సుతున్।
దశకంధరుఁడగుకతమున, దశకంధరుఁడనుచు నిడియెఁ ♦ దన్నామంబున్॥
ఉత్తర ౧౯౨.

విశ్రవశ్శబ్దమునకు నపత్యార్థక తద్ధితము పుల్లింగబున రావణుఁడయ్యె. ఇది వైయాకరణమతము. కైలాసపర్వతముక్రిందఁ జేతులుపడి నలిగినపుడు లోకము నిండ ధ్వనించుటచేఁగాని, లోకమును హాహారావపూరితము చేయుటచేఁగాని, రావణుఁడయ్యెనని పౌరాణికమతము.

ఇది యుత్తరరామాయణమున క. శైలాక్రాంతుఁడనై నీవీలీల మహారవంబు నెల్లజగంబుల్ వ్యాలోలంబుగఁజేయుట, హాళిన్ ఘటియింతు రావణాఖ్యను నీకున్॥ "33౬" అని శివుఁడుచెప్పెను.

రామపత్నీం, వనస్థాం, నిన్యా యేతి రావణః॥ అని మాంత్రికులందురు. ఇది మాంత్రికమతము. రామపత్నిని, వనస్థను, నపహరించినవాఁడు రావణుఁడు.

రవణస్యాపత్యంపుమాన్ రావణః, రవణునికొమారుఁడు కావున రావణుఁడని యొకవ్యుత్పత్తిగలదు.

సర్వభూతభయరావణున్ = సమస్తప్రాణులను మొత్తోయని యఱపించువానిని, నిర్జరలోక = స్వర్గమండలి, లోక = జనులను, విద్రావణున్ = పరువెత్తునట్లు చేయువానిని, అట్టహాస = పెద్దనవ్వుచే, కృత = చేయఁబడిన, దైవత = దేవతలయొక్క, కంజముఖాళీ = స్త్రీసమూహముల, గర్భ = గర్భముల, విస్రావణున్ = జాఱిపోవుట గలవానిని, భూరి = గొప్పవగు, దోః + చయ = బాహుసమూహములయొక్క, పరాక్రమబలముచే, భంజిత = విఱుగఁగొట్టఁబడిన, గాఢ = అధికమైన, దంతక = దంతములుగల, ఐరావణున్ = ఐరావతమను నేనుఁగుగలవానిని, లోకపీడన = లోకములను బాధించుటయను, పరాయణున్ = సర్వమునయినవానిని, లోకమును బాధించుటతప్ప వానికి వేఱుకోరిక లేదనుట. 'పరమాసక్తే రయనం పరాయణం' పరమాసక్తికి స్థానమైనవాఁడు, కుత్సితధీ = కుచ్చితపుబుద్ధియందుఁ దొందరగలవానిని, తుర = త్వరణే—తురస్యాయనం=తురాయణం.

తా. సమస్తప్రాణులను మొత్తోయని యేడిపించువానిని, దేవతలను బాఱఁదోలినవానిని, పెద్దనవ్వుచేతనే దేవతాస్త్రీలకు గర్భస్రావమగునట్లు చేయువానిని, (గర్భిణీస్త్రీలు పెద్దయుఱుము పిడుగుధ్వని వినినను ఉన్నట్లుండి మిక్కిలి భయపడినను గర్భము పడిపోవును.) భుజశౌర్యముచేత విఱువఁబడిన యైరావతము

యొక్క దంతములు గలవానిని, జనుల బాధించుటయందే పరమాసక్తిగలవానిని, కుచ్ఛితపుటాలోచనయందు తొందరగలవానిని.

క. రాక్షసకులవర్ధను బ్రత్యక్షలయాంతకుని భూషణాలంకృతునిన్
వీక్షించి నిజభ్రాతను, రాక్షసి శూర్పణఖ భయభరంబున బలికెన్. ౨౧౬

రాక్షసకులవర్ధనున్ = రాక్షసవంశమును వృద్ధిచేసినవానిని. 'వర్ధనంఛేద నేపిస్యాత్.' నానా ॥ర॥ అని యుండుటచే నింతవఱకు రాక్షసకులము వృద్ధిచేసిన వానిని, ఇకఁ ఛేదించువాని నని గ్రహింపవలయును.

ప్రత్యక్షలయాంతకునిన్ = కన్నులకుఁ గానవచ్చు ప్రలయకాలమందలియ ముని, ఆయముని జూచినవారు లేరు. ఇప్పుడు వీనినిజూచిన ప్రలయకాలయముఁ డిట్టివాఁడు గదా యని తెలిసికొనవచ్చును. భూషణాలంకృతునిన్ = భూషణములచే నలంకరింపఁబడినవానిని, భయభరంబునన్ = భయాతిశయముచే.

తా. ఇంతవఱకు రాక్షసవంశమును వృద్ధిపఱిచినవానిని, కన్నులకుఁ గాన వచ్చు ప్రలయకాలయముని, ఆభరణములచే నలంకరింపఁబడినవానిని, తనయన్నను జూచి శూర్పణఖ రామునివలనఁ గలిగిన భయాతిశయమున నిట్లనెను.

### 33-వ సర్గము. శూర్పణఖ రావణు నిందించుట.

ఉ. మంతురు లాలకింప నవమానముపాటును దుఃఖపాటు మ
ర్త్యాంతకుఁ డట్టెచూడఁగ దురాగ్రహ మెత్తి ప్రమత్త! దుర్మదా!
సంతతకామభోగముల జాల్ముఁడ వౌచునిరంకుశుండ వై
చెంతల నిన్ను మ్రింగ వెసఁ జేరినమిత్తిని గానలేవుగా. ౨౧౭

మర్త్యాంతకుఁడు = రాక్షసుఁడగు రావణుఁడు, అట్టెచూడఁగ = ముఖ వయనవికారములు లేక చూడఁగా, అది మనస్సునందుఁ దన్నుఁ జూడఁగానే రావ ణుఁడు, ఏమే చెల్లెలా! నిన్నెవ్వఁడే యిట్లుచేసెను? అనిలేచివచ్చి యాదరించునని తలఁచియుండునది. రావణుఁడు దాని నెగాదిగ చూచుచుండెను గాని యది యను కొన్నట్టు చేసినవాఁడు గాఁడు. ప్రమత్తా = దేహము తెలియనివాఁడా, దుర్మదా= చెడ్డగర్వముగలవాఁడా, జాల్ముఁడవు = మూఢుఁడవు, నిరంకుశుండవై = అడ్డము లేనివాఁడవై, మిత్తిని = మృత్యువును.

తా. తనకుఁగలిగిన యవమానము తనదుఃఖము చూచికూడ నాదరిం పక యూరకచూచుచున్న రావణుఁజూచి మంత్రులు వినుచుండ మంత్రుల సన్నిధి నిట్లు పలుకవచ్చునా యనికూడఁ దలంపక దురాగ్రహముచే నిట్లనియె: ఓరి! కండక్రొవ్వున మదించి దేహము తెలియనివాఁడా (నీ దేహమే నీకుఁ దెలియ

నపుడు నన్ను నీ కెట్లు తెలియు నని భావము) ఎల్లవేళలఁ గామసుఖములందు నాసక్తిగలిగి యడ్డములేక దండించువాఁడును లేక మూఢుఁడవై నీప్రక్కన నిన్ను పాత వేసికొనుటకై కాచియుండు మృత్యుదేవతను నీవు తెలిసికోలేక యున్న వాఁడవుకదా.

చ. సతతము గ్రామ్యభోగముల ♦ సక్తుఁడు రక్తుఁడుఁ గామవృత్తుఁ డౌ
క్షితిపతిని౯ స్మశానపుశి♦ఖింబలె లోకులు గౌరవింతురే ?
మతిచెడి రాజ్యకార్యముల ♦ మానుగఁ దాన యొనర్పనట్టిభూ
పతి సహకార్యజాలుఁ డయి ♦ పా డయి పోవు స్వరాజ్యయుక్తుఁ డై. ౫౧౮

గ్రామ్యభోగంబుల౯ = మైథునాది కార్యములందు, సక్తుఁడు = తగిలిన మనస్సుగలవాఁడు, రక్తుఁడు = ప్రీతిగలవాఁడు, కామవృత్తుఁడు = ఇచ్ఛవచ్చినట్లు నడచువాఁడు, క్షితిపతిని౯ = రాజును, స్మశానపుశిఖింబలె౯ = వల్లకాటియందలి నిప్పువలె, అగ్నిహోత్రము సర్వదా పవిత్రమైనదే జనులచే నాదరింపఁ బడవలసినదే అయినను స్మశానాగ్నిత్యాజ్యము గదా-అట్లు రాజు సర్వజనసేవ్యుఁడే యైనను గామాసక్తుఁడై లోకమువారికి నిష్ప్రయోజకుఁ డగుటచేఁ ద్యాజ్యుఁడే.

మతిచెడి = బుద్ధిచెడిపోయి, అనఁగా నాలోకించుశక్తి లేక-'విడువక సతులం దగిలెడి జడునకు నెక్కడివి బుద్ధిచాతుర్యంబుల్' అన్నట్లు స్త్రీలతో నెక్కువగా రమించువానికి బుద్ధిబలముండదు.

తా. ఎల్లప్పుడు స్త్రీలతో రతిక్రీడలనే మరగి వానియందే ప్రీతిగలవాఁడై తనయిచ్ఛవచ్చినచొప్పున సంచరించురాజును ప్రజలు స్మశానాగ్నివలె గౌరవింతురా ? నీయం దట్టి దోషముగలదు కావున అట్టులే నిన్ను లోకులు గౌరవింపరు. స్త్రీలతో విశేషముగ సంభోగించుటచే బుద్ధిబలముచెడి కార్యాకార్యము లాలోచించుశక్తి లేక రాజకార్యములు తానై చేయని రాజు తాను జెడును. వాఁడు పూనిన కార్యములు చెడును. వాని రాజ్యముచెడును. నీ వీగతికే రానున్నావు.

ఇదివఱకే రావణుఁడు స్త్రీవ్యసనమున మతిచెడినాఁడని దూషించుచు సీతాదేవినిభార్యగా గ్రహింపుమని తాను బోధించుచున్నది.

ఉ. చారుల నేరి నుంపక వి♦చారవిదూరతఁ బౌరకోటికి౯
సారెకు దర్శనం బిడక ♦ చాటున మాటున నుండి కార్యపుం
భారములందు నెవ్వరివొ ♦ మాటల నమ్మెచు నస్వతంత్రుఁ డౌ
ఘోరమహేంద్రుఁ బంకమును ♦ సామజరీతి నరుల్ దృజింపరే. ౫౧౯

చారుల౯ = వేగువాండ్రను, విచారవిదూరత = ఆలోచనములేక, అస్వతంత్రుఁడు = పరాధీనుఁడు, ౧. భార్యాదిపరతంత్రుఁడు, ౨. దోవనఁబోవువారికిఁ

బరతంత్రుఁడు, ౩. మంత్రులకు ఁబరతంత్రుఁడు, పంకమును=బురదను, సామజరీతి= ఏనుఁగువలె, త్యజింపరె = వదలరా.

తా. వేగులవారి నేర్పాటుచేసి యెక్కడెక్కడ నేయే కార్యములు జరుగుచున్నవో—యెవరు మిత్రులో యెవరు శత్రువులో మొదలగునవి తెలిసికొనక—ఆలోచనయు లేక—ప్రజలకుఁ బలుమారు దర్శన మీయక యంతఃపురమున కాంతాసంగతుఁడై చాటున నుండుచు కార్యములు తానై చేయవలసివచ్చినపుడు పూర్వోత్తర సందర్భములు తెలియమిచే నెవరో సంబంధము లేనివారో, స్వార్థపరులో చెప్పిన మాటలు నమ్ముచు భార్యలు, మంత్రులు, త్రోవనఁబోవువారు చెప్పినమాటలు నమ్మి పరాధీనుఁడైన రాజును, బురదనుండి యేనుఁగు దూరమునందే తొలఁగునట్లు లోకులు తొలఁగిపోదురు.

చ. తమతమపెత్తనంబు చెడఁ ♦ దారు స్వతంత్రులు గాక ధారిణీ
రమణులు వేరిచేతఁ దమ♦రాష్ట్రము నేలఁగఁ జేయఁ జూతురో
క్రమమున వారిచేత జల♦రాశి నగంబులపోల్కి మున్గి రూ
పము చెడిపోవు చుండుదురు ♦ ప్రాభవముల్ మును మున్నె నాశిలన్. ౧౦

పెత్తనము = పెద్దతనము, నగంబులపోల్కి = పర్వతములవలె, ప్రాభవముల్ = ప్రభుత్వగౌరవసంపదలు.

తా. అన్నికార్యములందుఁ దానుబెద్దగా నుండి తన యిష్టప్రకారము స్వతంత్రించి కార్యములుచేయక యితరులకుఁ బెత్తనమిచ్చి వారిచేఁ గార్యములుచేయించు రాజులు సముద్రములోఁ బర్వతములు మునిఁగినట్లు వారిచేతనే చెడుదురు. వారి ప్రభుత్వము, అధికారము సంపద వారికంటె ముందుగానే నశించును.

ఉ. నీకపకారము న్నెఱప ♦ నిచ్చలు సందులు రోయు చుండ నా
నాకనివాసదానవగ♦ణంబులు చారవిచారదూరతన్
బ్రాకటబుద్ధిచంచలతఁ ♦ గ్రాలెడు నీ వెటు లింక రాజ వై
యాకరణిన్ మనంగఁ గల ♦ వీయిలఁ బ్రాణముతోడ నేనియున్. ౧౧

నిచ్చలు = నిత్యము, నాకనివాస = దేవతల, చారవిచారదూరతన్ = వేగులవాండ్రుగాని యాలోచనగాని లేకుండుటచే, బుద్ధిచంచలతన్ = స్థిరమైన బుద్ధిలేమి.

తా. నీకుఁ గీడుచేయ నెపుడు సందుదొరకునా యని దేవతలు దానవులు నెల్లప్పుడు సమయము వెదకుచుండ వేగులులేక కార్యాలోచనపరత్వము లేక స్థిరబుద్ధిలేక చపలుఁడవై యుండు నీవు రాజవై యీ ప్రకారము ప్రాణముతోనైన నెటులుండఁగలవు ?

క. హో దింతకుఁ బసితనముగ్, రా దేమియుఁ దెలివి నీకు ♦ రాక్షస మఱియున్
లే దెఱుక వలయుపట్లన్, భూదయితుఁడ వగుచు నెట్లు ♦ పోలు పొందెదవో.

ఇంతకున్ = ఇంతవఱకు, పసితనము = బాల్యము, భూదయితుఁడవు = రాజవు.

తా. ఇన్నియేండ్లు చెల్లి యింతవయస్సు వచ్చినను అవివేకము పోలేదు. వివేకము రాలేదు. ఏవేవి తెలియఁదగినవో యవి నీవెఱుఁగవు. ఇట్టివాఁడవు రాజవై యెట్లు బాగుపడెదవు.

క. వేగుల బండారంబుల, బా గగునీతులను నెవఁడు ♦ పరతంత్రుం డౌ
నాగర్వితనవుమన్నీఁ, డో గద్దఱి ప్రకృతి జనుల ♦ కుద్దియ సువిశ్వా. ౧౩

వేగులన్ = వేగులవాండ్ర, శత్రురాజుల చరిత్రము, తన రాజ్యములోని వారి నడవడి విషయమునను, బండారంబులను = ధనగృహంబులందును. గర్వితనవుమన్నీఁడు = గర్వముగలరాజు, గద్దఱి=దిట్టతనము గలవాఁడా, ప్రకృతిజనులకున్ = పామరులకు, పుట్టినవారు పుట్టినట్లు తెలివితేటలు లేక యుండువారు యథాజాతులు, ఉద్ది = సమానము.

తా. తనకు స్వంత వేగులవాండ్రులేక యితరు లేర్పాటుచేసిన వేగులవాండ్ర మాటలు నమ్మి వర్తించువాఁడును, ధనకోశమునఁ బరులకుఁ బెత్తన మిచ్చిన వాఁడును, ఇతరులు చెప్పిన నీతుల ననుసరించువాఁడును, వాఁడెంత దిట్టతనము గల ప్రభువైనను పామరునకు సమానుఁడే.

క. దూరస్థపువిషయంబులఁ, జారులచే నెఱుఁగుఁ గాన ♦ క్ష్మారమణునకున్
దూరపుఁజూపరి యనుపే, రారయ సార్థకము; లేద ♦ యది నీయందున్. ౧౪

తా. దూరదేశంబుల జరుగు విషయంబులను వేగులమూలమునఁ దాను సమక్షమునఁ జూచువాఁడే యగును. కాన రాజునకు (దీర్ఘచక్షువు) దూరపుఁ జూపు గలవాఁడని పేరు. నీకు వేగులు లేరు గావున నీ కాచూపు లేదు.

క. ఈనెఱిగ సచివవర్గము, మానక సేవింప సుఖము ♦ మరగుట నేచం
దాన నెఱింగెదు స్వజనవి,తానజనస్థానలయముఁ ♦ త్వద్వైరులచేన్. ౧౫

నెఱిగన్ = విధముగ, సచివవర్గము = మంత్రుల సమూహము, స్వజనవితాన = నీవారి సమూహముగల, జనస్థానలయము - జనస్థానము నాశమగుట, త్వత్ =నీ, వైరులచేన్ = విరోధులచే.

తా. ఈ విధముగ నిప్పుడు నీవున్నట్లు మంత్రులగుంపు సేవింపఁగా వారి మాటలు వినుచు సుఖము మరగిన కారణముచే నీ జనస్థానమున నీ బంధువు

లందఱుఁ జచ్చిన వార్త నీ వెఱ్ఱుఁగఁ గలవు? తాను జెప్పఁబోవు నాలోచనకు మంత్రులు విఱువు చెప్పుదు రను నభిప్రాయముతో ముందుగనే వారిమీఁద దెబ్బ తీయుచున్నది.

క. పదునాలుగువేవుర రణ,పదమున ఖరదూషణాది♦బంధుయుతముగా
సదమదముచేసెఁ ద్రిజగ,ద్విదితంబుగ రాముఁ డొకఁడ♦వింటిబలమునన్. గీ_౧౬

సదమదము = నాశము, త్రిజగద్విదితంబుగన్ = మూఁడులోకములకుఁ దెలియునట్లు.

తా. ఖరదూషణాది బంధువులతోఁడఁ బదునాలుగు వేల రాక్షసులను రామచంద్రమూర్తి యొకఁడే తన వింటి బలముచే యుద్ధభూమిని నాశము చేసెను.

ఆ. నీసహోదరాళి♦ నిర్మూల మొనరించె, ఋషుల కెల్ల నభయ♦ మిచ్చి కాచె
నిర్భయంబుఁ జేసె♦ నీదండకాటవి, సాంద్రబలుఁడు రామ♦చంద్రుఁ డిపుడు.

తా. నీ తమ్ములను బంధువులను నందఱను మొదలుముట్ట నొక్కఁడైన లేకుండునట్లు నాశము చేసెను. నీకు విరోధులై నీ కీడు గోరు ఋషుల కందఱకు మీఁకిఁక రావణభయము లేదు. నేను రక్షించెద నని చెప్పెను. దండకారణ్యము న నీవారిభయము లేకుండఁ జేసెను. ఇవి యన్నియు మిగుల బలముగల రామచంద్రుఁ డొక్కఁడే చేసెను.

చ. పిసినివి, వేగువారలకు♦ వేతన మీయవు, లెస్స మత్తుచే
వసపడి కార్యతంత్రముల♦ వారికి వీరికి మందబుద్ధి వై
యసమతి మీఁద దెఱుంగవు, భ♦యంబు స్వదేశమునందుఁ బుట్ట నీ
విసిరో యెఱుంగ విందనుక♦ నేమని నిన్ననవచ్చు రావణా! గీ_౧౭

పిసినివి = లోభివి, వేతనము = జీతము, వసపడి = వశపడి, మందబుద్ధివై = బుద్ధిలేని వాఁడవై, అసము = కీర్తి, అతి = క్షయించి. మీఁదు = రాఁగలది.

తా. లోభివి కావున వేగులవారికి జీతము లీయవు కావున వారందందు జరుగు వృత్తాంతములు నీకు వెంటవెంటనే తెలుపరు. బాగుగ మదించి యితరులకు స్వాధీనపడి స్వతంత్రశక్తిలేక యా మంత్రి యీ మంత్రి చెప్పినట్లు వినుచు రాఁగల కీడు తెలిసికోలేక యున్నావు. నీ రాష్ట్రమునందే భయము పుట్టుట నీకింత వఱకుఁ దెలియదు గదా. రావణా నిన్నేమనవచ్చును.

ఉ. కొంచెపుజీత మిచ్చునృపుఁ♦ గ్రూరుని మత్తుని గర్వితుల్ శఠుల్
ముంచినవేళ నాపదలు♦ మోటుకొనం డొకభృత్యుఁడేనిఁ, గో
పించు చకారణంబ యతి♦భీష్మత నామికఁ దన్నుఁ దాన భూ
మించు నసభ్యు భూపతిని♦ సేవకులుల్ స్వజనంబె చంపెడిన్. గీ_౧౮

శఠుఁ = రహస్యముగాఁ గీడుచేయు ద్రోహిని. మోటుకొనఁడు = పూను కొనఁడు అతిభీష్మతఁ = మిక్కిలి భయంకరత్వముచే. అలుకఁ = గర్వముచే.

తా. కష్టమునకుఁ దగిన ట్లీయక సేవకులకు జీతము కొంచెముగా నిచ్చు క్రూరునికి, మదముపట్టినవానికి, పొగరుఁబోతునకు, ద్రోహికి నాపదలు ప్రాప్తించు నపుడు సేవకులం దొకఁడైనను సహాయముచేయ యత్నింపఁడు. కారణము లేక కోపించును. ఇతరులు భయపడునట్లు వర్తించుచు గర్వియై తన్నుఁ దానే పొగడు కొను రాజును వానిబంధువులు వానిసేవకులే చంపుదురు.

చ. తెలివిగఁ గార్యతంత్రములు ♦ దీర్పక యాపదలందు శంకచేఁ
జలితుఁడు గానిభూపతికి ♦ సంపద లెల్లను వేగ రూపఱం
బలుచనిగడ్డిపోఁచకు స♦మానుఁడు వాఁడయి దుఃఖ మొందఁగాఁ
జులకనఁ జూతు రెల్లరును ♦ శోకముఁ బొందరు వానిభంగికిన్. ౫3౦

కార్యతంత్రములు = కార్యాలోచనములు, శంకచేఁ = భయముచే, సందేహముచే, 'శంకాత్రాస వితర్కయోః' నానా॥ర॥ చలితుఁడు = చలించినవాఁడు, రూపఱఁ = నాశమైపోవఁగా.

తా. తాఁకు దప్పులు తెలిసి చక్కని యాలోచనతోఁ గార్యములు చేయక యాపదలు వచ్చినను భయముచేఁ దనకార్యములందే స్థిరుఁడయిన రాజునకు నైశ్వర్యమంతయు నాశమై పోఁగా వాఁడు సన్నగడ్డి పోఁచకు సమానుఁడయి దుఃఖించుచుండఁగా వాని నందఱు నలక్ష్యముగఁ జూతురే కాని యయ్యో పాపము వాని కెట్టి గతి వచ్చెనే యని యొకరైన వ్యసనపడరు.

మత్తకోకిలము. ఎండుకట్టెల మంటిపెళ్ళల ♦ నేనియుఁ మఱి దుమ్ముచే
నొండుకార్యము కల్గుఁ గాని స♦మూహ చేయఁగ రాజుగా
నుండి భ్రష్టత నొందినట్టిన♦రోత్తముం డొకగవ్వకేఁ
ఖండితాహితసంచయా! కొఱ♦గాఁడు నిక్కము నమ్ముమీ. ౫3౧

సమూహ = చక్కని యాలోచన, ఖండిత = నఱకఁబడిన, అహితసంచయ = శత్రుసమూహము గలవాఁడా.

తా. లోకమున దేనికిఁ బనికిరాని వని తలఁచిన యల్పములగు నెండిన కట్టెలు, మంటిపెళ్ళలు, నేలదుమ్ము, వీనితోనైన నేదో యొక సమయమునఁ బని యుండును గాని యెంత యాలోచించినను రాజుగానుండి రాజ్యము పోఁగొట్టుకొనిన వాఁడు గవ్వకైనను గొఱగాఁడు.

మత్తకోకిలము, రసజజభరగణములు. ౧౧-వ యింట యతి.

తే. కట్టివిడిచిన వస్త్రంబుఁ ♦ బెట్టి తీసి, నట్టిమాల్యంబుఁ బోలుచు ♦ నవనివిభుఁడు
రాజపదమునుండి తా ♦ భ్రష్టుఁ డైన, నాతఁ డెంతటివాఁ డేని ♦ రర్థకుండు.

తా. ఎంతటి వెలగలదిగాని విడిచిన వస్త్రము, ఎంత రమ్యమైనదిగాని ధరించి తీసిన పూలదండ యెట్లు మరల నుపయోగమునకు యోగ్యములు గావో యట్లు రాజుగానుండి భ్రష్టుఁడైనవాఁ డెంత గొప్పగా బ్రతికినవాఁడైనను గొఱగాని వాఁడే. దీనివలనఁ దాను గట్టి విడిచినదైనను మరల నావస్త్రము తడిపి యుదికి యాఱవేయువఱకు ధరింపరాదు. మరియొకరి వస్త్రము తాను గట్టనే రాదు. అట్లులే యొకరు ముడిచి విడిచినది వాసన చూచినది యగు పూలదండను ధరింపరాదు.

ఆ. అప్రమాదబుద్ధి ♦ యయి యన్ని యెఱుఁగుచు, నింద్రియముల గెలిచి ♦ కృతము దెలిసి
ధర్మశీలుఁ డైన ♦ ధారిణీనాథుండు, చిరముగా సుఖించు ♦ సిరులతోడ. ॥౩౩॥

అప్రమాదబుద్ధి = హెచ్చరికతోఁ గూడిన బుద్ధి.

తా. హెచ్చరికగలవాఁడై మీఁదఁ జెప్పఁబడినవన్నియుఁ దెలిసికొని యింద్రియములకు వశపడక వానిని దన వశమున నుంచుకొని—తన రాజ్యమునందుఁ బరుల రాజ్యములం దేవేవి యెట్లెట్లు జరుగుచున్నవో తెలిసికొనుచుఁ బరులు తనకుఁ జేసిన మేలు మఱవక ధర్మస్వభావుఁడైన రాజు దీర్ఘకాలము సంపదతో సుఖించును. దుర్మార్గులు తామెంత యధర్మమందుఁ బ్రవర్తించుచుండినను బరులకు హితోపదేశము చేయునపుడు ధర్మమునే యుపదేశింతురు.

క. నయనంబుల నిదురించియు, నయదృక్కుల మేలుకొని య ♦ నయ ముండి రుషా
దయలను వ్యక్తముఁ జేసెడు, నయకార్యుని నృపతిఁ గొలుచు ♦ నఖిలజనంబుల్.

నయనంబులన్ = కన్నులచే, నయదృక్కులన్ = నీతి యనెడు కన్నులచే, అనయము = ఎల్లప్పుడు, రుషా = కోపమును, వ్యక్తము = స్పష్టము, నయకార్యుని = నీతితప్పక కార్యములు చేయువానిని.

తా. కన్నులు మూసికొని నిదురించుచుండినను, నీతిశాస్త్ర మనెడి కన్నులచే మేలుకొని యెప్పుడు నుండినవాఁడై యాయా సమయమునకుఁ దగినట్లు దోషులపైఁ గోపము, సాధువులపై దయ, కనఁబఱుచుచు నీతిమార్గమున వర్తించు రాజును సర్వసేవకులు భయభక్తులఁ గొలుచుచుందురు.

చ. వెదకిన లేదు నీయెడను ♦ వీఱిఁడి యిట్టిగుణంబు లొక్కటేన్
గదనమునందు రక్కసు ల ♦ కాలలయంబున దండకాటవిన్
సదమద మాట నీవెఱుఁగఁ ♦ జాలవు చారులు లేమి, శత్రులన్
మదిని నుపేక్ష చేసెదవు ♦ మానితసౌఖ్యరసావశాత్మతన్. ॥౩౪॥

వీటోఁడి= దుర్బుద్ధీ, అకాలలయంబునఁ = కాలముకాని కాలమందు వచ్చిన ప్రలయంబునందు, నడమడమాట = చచ్చుట, మానిత = కాముకులచే, గారవింపఁ బడు, సౌఖ్యరస = సౌఖ్యానందముచే, అవశ = స్వాధీనము తప్పిన, ఆత్మతఁ = మనస్సుగలవాఁడవగుటచేత,

తా. అవివేకీ! నీయందు వెదకిచూచినను రాజుల కుండవలసిన పైనాఁడ వివరించిన గుణములందొక్కటియైన లేదు. వానలేని వట్టిపిడుగువలె నకాలమున వచ్చిన ప్రలయమందు దండకారణ్యమున నీవు కాపుగా నుంచినవారందఱు యుద్ధమునఁ జచ్చుట వేగులు లేమిచే నీవు తెలియకున్నావు. సౌఖ్యములం దాసక్తుఁడవై నిన్నుఁ జంపనున్న శత్రువుల నుపేక్షించుచున్నావు.

శూర్పణఖ యాక్షేపించినది ఖరాదివధవిషయమైనమాత్రమే కాదు. నీకు లోపడి నీరాజ్యమునకుఁ జేరిన దండకారణ్యమందు నీకు విరోధులైన మునులకు నభయహస్తమిచ్చి, రాక్షసులఁ జంపెదనని ప్రతిజ్ఞచేసి, తాను రాక్షసులఁ జంపుటకై వచ్చితి నని, రామచంద్రమూర్తి విస్పష్టముగఁ జెప్పుచు విరాధాదిరాక్షసుల నందందు వధించుచు రెండు మూఁడు సంవత్సరములుగాఁ గడుపులోఁ బుండువలె జనస్థాన సమీపమందే వచ్చియుండినను నీవు తెలిసికోలేకయున్నావు. నీకు వేగులవారున్న పక్షమున నీవిషయమప్పుడే తెలిసియుండును. ప్రతిక్రియచేసియు నుందువని దాని యాక్షేపము.

గావః పశ్యంతి గంధేన, వేదైః పశ్యంతి పండితాః।
చారైః పశ్యంతి రాజాన, శ్చక్షుర్భ్యా మితరే జనాః॥

ఆవులు వాసనపట్టి తెలిసికొనుచున్నవి. పండితులు వేదములచేఁ దెలిసికొనుచున్నారు. రాజులు వేగులచేఁ దెలిసికొనుచున్నారు. ఇతరమనుష్యులు కన్నులఁజూచి తెలిసికొనుచున్నారు. పండితులకు శాస్త్రము కన్నువంటిది. కన్నులెదుట నుండు వానినిమాత్రమే చూడఁగలవు. ఇంద్రియములకు గోచరింపనివానిని లక్షణము శాస్త్రము దెలుపును. అట్టులే వేగులును సమక్షమునఁ జూడకున్నను, వేగులచే నెవఁడెవఁ డేయేదేశమున నేయేకాలమున నేమేమి చేయుచున్నాఁడో చేయఁగలఁడో తెలిసికొనుచున్నాఁడు.

తే. దేశకాలవిభేదంబుఁ ♦ దెలియలేవు, గుణము దోషంబు నెఱిఁగెడి♦కోలఁది లేదు
కాన నోరక్కసులఱేఁడ♦కలిమిఁ బాసి, వ్యసనములనొందెదవు చూడు♦వైళమీవు.

దేశకాలవిభేదంబు = దేశభేదము, కాలభేదము, రక్కసులఱేఁడ = రాక్షసరాజా! కలిమి = సంపద, వైళము = శీఘ్రకాలమందే.

తా. అన్నిదేశములును మనకనుకూలమైన స్వదేశములే, అన్నికాలములు

మనకనుకూలములయినవే, యనుకొనుచున్నావుగాని భిన్నదేశములందు భిన్నకాలములందు జరుగువిషయములను కామాసక్తుఁడవై, భోగపరతంత్రుఁడవగుటచేఁ దెలిసికొనలేకయున్నావు. ఎవరియందు దేనియందు నేమంచి కలదో యేచెడ్డ కలదో యది తెలిసికొనుశక్తి లేదు. కావున నో రాక్షసరాజా! శీఘ్రకాలమునందే నీవు సంపదను బోఁగొట్టుకొనఁగలవు.

శూర్పణఖ సత్యమే చెప్పెను. గుణదోషజ్ఞానము లేకపోవుటచేతను గేవల కామాసక్తుఁడగుటచేతనుగదా శూర్పణఖ చెప్పఁబోవువిధమునఁ జేసి నాశమయ్యెను.

## ౩౪-వ సర్గము.

చ. అనుచునభీతచారయిటు ♦ లాడినస్వీయము దోషజాలముల్
ధనబలదర్పదర్పితుఁడు ♦ తద్ద విచారముఁ జేసి యిట్లనున్
గనుఁగవ జేవుఱింపఁగను ♦ గ్రక్కున మాటడి చుప్పనాతితో
ననుజ! వచింపు సర్వమును ♦ నచ్చటివార్త లటంచు వెండియున్. ౧౩౭

అభీతచార = భయములేక సంచరించునది. అనఁగాఁ నీపురుషునొద్దకుఁ బోవచ్చును. ఈపురుషునియొద్దకుఁ బోరాదనికాని, యీప్రదేశమునకుఁబోవచ్చును ఈప్రదేశమునకుఁ బోరాదనికాని సిగ్గు భయము విడిచి తిరుగునది. ధన-బల-దర్ప-దర్పితుఁడు = ధనగర్వము, బలగర్వము కలవాఁడు, దర్పదర్పితుఁడు = పాకంపచతి యన్నట్లు, కనుఁగవ = రెండుకన్నులు, జేవుఱింపఁగను = ఎఱ్ఱపడఁగా, గ్రక్కునము = కఠినపుమాటలు, చుప్పనాతి = శూర్పణఖ-రూ-చుప్పనాక, అనుజ = చెల్లెలా.

తనవికారస్వరూపముతో నిండుకొలువున మంత్రులతోడ నుండునపుడు ఆఁడుది, రాజు చెల్లెలు, అంతఃపురమున నుండవలసినది బజాఱిలంజవలె నిండఱిలోకి వచ్చి యేమిగోపమువచ్చునో యని యాలోచింపక మాట్లాడినపుడే యది సిగ్గు బిడియము భయము విడిచినదని స్పష్టపడెను. ఇంతవఱకు శూర్పణఖ తనపరాభవ కారణముగాని పరాభవించిన వానిపేరుగాని చెప్పినదికాదు. ఏల? ఆవిషయము ముందుగాఁ జెప్పినఁ దన్నవమానించిన కారణముచేఁ దన్నుదూషించుచున్నదని యభిప్రాయపడునేమో, అట్టియభిప్రాయము కలిగెనేని తాను జెప్పినట్టు చేయఁడేమో చేయకుండిన రాముని మరలఁ బరాభవింపవలెఁ జంపవలె ననిన కోరిక కొనసాగదే యని తలంచి నీవారిని నీశత్రువులువచ్చి మూలముట్టుగఁ జంపినను నీవు తెలిసికొనలేక వారికి సాహాయ్యముచేయక నిర్విచారుఁడవై యున్నావని తనదోషముమాత్రము ప్రకటించుటచేతను అకంపనుని మాటలవలన నిది సత్యమని యేర్పడుటచేతను మనమిప్పుడేమి చేయవచ్చునా యెంతప్రమాదమో తటస్థింపకుండిన నిది యిట్లు పదుగురులోనికి వచ్చి యిట్లు చెప్పునాయని యిది చెప్పినట్లు దండకలో పదు

మూఁడు సంవత్సరములుగా దండకలో జరుగు శత్రువుల యాలోచన తెలిసికొన లేకుండుట మనదోషమేకదా యని యాలోచించి

దశరథుని విషయమునఁ గైక యెట్టియుపాయము చేసెనో యట్టి యుపాయమే శూర్పణఖయుఁ జేసెను. అక్కడఁ గామము. ఇక్కడఁ గ్రోధము.

తా. ఈప్రకారము సిగ్గు బిడియము భయము లేని యాశూర్పణఖ చెప్పిన తనదోషములగుఱించి ధనగర్వము, దేహబలగర్వము, సేనా బలగర్వము గలవాఁడగుటచే నన్నెవ్వఁడేమిచేయఁగలఁడని మదాంధుఁడై యుండిన రావణుఁడు తనచెల్లెలు చెప్పినవిషయ మాలోచించి కోపముచేఁ గన్నులెఱ్ఱచేసి తన్ను నిష్ఠురములాడుచున్న నాతితోఁ జెల్లెలా యచ్చటి వృత్తాంతమంతయుఁ జెప్పుమని మఱియు నిట్లనియె.

ఉ. రాముఁ డనంగ నెవ్వఁడు ప♦రాక్రమ మెట్టిది రూప మెట్టి దా
రాముఁడు దండకాటవికి ♦ రాఁ గత మేమి ఖరాదిరాక్షస
స్తోమము నేమియాయుధము♦తో వధియించెను జెప్పు మన్న నా
భామిని చెప్పఁగాఁ దొడఁగె ♦ భానుకులేంద్రుచరిత్ర మంతయున్. ॥౩౮

కతము = కారణము.

తా. రాముఁ డనువాఁ డెవ్వఁడు? వాఁ డెట్టి పరాక్రమముగలవాఁడు? దేవతారూపమా. మనుష్యస్వరూపమా. మఱి యెట్టిస్వరూపముగలవాఁడు? ఏల దండకాటవికి వచ్చెను? ఖరాదిరాక్షసుల నేయాయుధముతోఁ జంపెను? విల్లు బాణములతోనా లేక ఏవైన నూతనాయుధములతోనా? యని యడుగఁగా నాశూర్పణఖ రామచరిత్ర మిట్లు చెప్పఁ బ్రారంభించెను.

శూర్పణఖ రావణుతో శ్రీరాముని వర్ణించి చెప్పుట.

సీ. నిడుదబాహులవాఁడు ♦ వెడఁదకన్నులవాఁడు, వల్కకృష్ణాజినాం♦బరమువాఁడు
దర్పకరూపుఁడు ♦ దశరథతనయుఁడు, రాముఁడు భయదప♦రాక్రముండు
హేమపట్టావృత♦భీమచాపముఁ దాల్చి, చిమ్ము బాణముల స♦ర్పమ్ము లట్ల
కాండసంధానంబుఁ ♦ గాండవికర్షంబుఁ, గాండప్రయోగంబుఁ ♦ గాన నైతిఁ

ఆ. బండియున్నపైరు ♦ వడగండ్లవ్రేటున, నేలఁ బడెడిరీతిఁ ♦ గూలుచున్న
సేనమాత్రఁ గంటిఁ ♦ జెప్పుదు నేమని, యతనిజవము బలము ♦ నస్త్రబలము.

రాముఁడేమి పరాక్రమమువాఁడు, ఏయాయుధముగలవాఁడు, మనుష్యుఁడా దేవతయా యని రావణుఁడు తనకుఁ దెలియవలసిన విషయములనుగుఱించి ప్రశ్నింపఁగా శూర్పణఖ కామోపహతచిత్త గావున రామునియాకారము మఱచెద

మన్నను మఱపురాక కన్నుల గట్టినట్లుండుటచే నాయన యాకారస్వరూపసౌందర్య వర్ణనముతోఁ బ్రారంభించుచున్నది.

నిడుద = నిడుపాటి, వెడఁద = విశాలములైన, వల్క = నారవస్త్రము, కృష్ణాజిన = జింకచర్మము, అంబరము = వస్త్రము, దర్పకరూపుఁడు = మన్మథుని సౌందర్యమువంటి సౌందర్యముగలవాఁడు, భయద = భయముగలిగించు, పరాక్రముండు = శౌర్యముగలవాఁడు, హేమపట్టావృత = బంగారుపట్టతోఁగప్పఁబడిన, భీమచాపము = భయంకరమైన వింటిని, కాండసంధానంబు = బాణముఁగూర్చుట, కాండవికర్షంబు = బాణములాగుట, కాండప్రయోగంబు = బాణమును విడుచుట, కాననైతి = చూచినదానఁగాను.

తా. దీర్ఘములైనభుజములుగలవాఁడు, విశాలములైనకన్నులుగలవాఁడు, నారచీరెలు జింకచర్మము వస్త్రములుగాఁ గలవాఁడు. మన్మథునివలె సుందరుఁడు. దశరథునికుమారుఁడు. ఆయనపేరు రాముఁడు. భయంకరమైన శౌర్యముగలవాఁడు. బంగారపుపట్టతోఁగూడిన భయంకరమైన విల్లుగలవాఁడు. దానితోఁ బుట్టలోనిపాములు వెలికివచ్చునట్లు బాణములను జిమ్మును.

ఫలమునుబట్టి బాణములనువైచినాఁడని గ్రహింపవలయునేకాని బాణము వింటఁగూర్చుట గాని యల్లెత్రాడు లాగుటగాని విడుచుటగాని నాకుఁ గానరాలేదు, పండినపైరు వడగండ్లదెబ్బచే నెట్లు నేలపైఁ బడిపోవునో యట్లు పడుచున్న సేననుమాత్రము చూడఁగలిగితిని. ఇఁక నతనివేగము, భుజబలము, అస్త్రబలము నే నేమని చెప్పుదును.

క. ఖరదూషణసహితంబుగఁ, బరఁగినపదునాల్గువేలు ♦ పటురాక్షసులన్
సరి మూఁడుగడియలను దా, శరముల నుఱుమాడె నొకఁడ ♦ చరణస్థితుఁడై.

తా. ఖరుఁడు, దూషణుఁడు లోనుగాగల పదునాలుగువేలమంది రాక్షసులను సరిగా మూఁడుగడియలలోఁ గాళ్ళమీఁద నిలిచి యొంటరిగాఁడు బాణములచే నాశముచేసెను.

ఆ. అభయ మొసఁగె దండ♦కాటవిమునులకు, స్త్రీవధంబు శంక♦చేసినట్టి
యమ్మహాత్ము చేత ♦ నెమ్మెయినో విడువంగఁ బడుట నోర్తు♦బ్రదికి యిటకు.

దండకారణ్యమందలి మునులకు నిఁక మీరు రాక్షసులకు భయపడవలదని వారికి నభయహస్తమిచ్చెను. అందఱు చావఁగా నీవుమాత్ర మెట్లు బ్రతికివచ్చితివి. నీవచ్చుటలేవా. చూచిచెప్పుచున్నావా వినికిడిచేఁ జెప్పుచున్నావా యందువేమో నే నాగుంపులోనే యుంటిని. కాని నే నాఁడుదాననగుటచే స్త్రీహత్యవలన దోషమువచ్చు నని యాయన గొప్పమనస్సుగలవాఁడగుటచేఁ జంపక వదలెను.

మఱియొకఁడైనచోఁ దొలుతఁ బదునాలుగురఁ దరువాత పదునాల్గువేవురఁ దోడి తెచ్చినది. దీని నూపిరితోవిడిచిన నిఁక నెందఱఁ దెచ్చునో యని చంపియుండును. ఎందఱువచ్చి నన్నేమిచేయఁగలరని యాయనకు ధైర్యము.

విడువఁబడుట యనుటచేఁ జేచిక్కినదానిని బుద్ధిపూర్వకముగా వదలెనని భావము.

ఉ. వచ్చితి, రాముతమ్ముఁ డని♦వారణతేజుఁడు లక్ష్మణుండు దా
వచ్చు సమంబు రామునకు ♦ వాలి మహాగుణసంపదన్ సతం
బచ్చపుభక్తిఁ గొల్చును మ♦హోగ్రహశీలి యజయ్యుఁ డాజిలో
సచ్చరితుండు రాము నప♦సవ్యభుజంబు బహిశ్చరాసువున్. ౫౮౨

అనివారణతేజుఁడు = నివారింపరాని తేజముగలవాఁడు, వాలి = అతిశయించి, అజయ్యుఁడు = జయింపసాధ్యముగానివాఁడు, అపసవ్యభుజంబు = కుడిభుజమైనవాఁడు, బహిశ్చరాసువున్ = వెలుపలిప్రాణము.

తా. అట్లు చిక్కినను పోపొమ్మని విడుచుటచేత బ్రతికివచ్చితిని. ఆరామునకుఁ దమ్ముఁడు లక్ష్మణుఁడనువాఁడు కలఁడు. తేజోధికత నన్నకు నన్నిట సమానుఁడు. అన్నను భక్తితో సేవించువాఁడు. మిగులఁ గోపముగలవాఁడు, యుద్ధమందు జయింపరానివాఁడు. సాధువర్తనముగలవాఁడు. రామునకుఁ గుడిభుజము వెలుపలిప్రాణము నైనవాఁడు.

## శూర్పణఖ రావణుతో సీతను వర్ణించి చెప్పుట.

సీ. రాముని ప్రియదార ♦ రమణీయసంచార, యురుకీర్తికలిత రం♦భోరులలిత
చంపకసుమనాస ♦ చంద్రికాదరహాస, సౌందర్యసదన రా♦కేందువదన
పతిహితమతిపూర్ణ ♦ భవ్యకాంచనవర్ణ, నీలకుంతలభార ♦ నీతిసార
హర్యక్షనిభమధ్య ♦ యఖిలలోకారాధ్య, సీతాభిధాన సు♦శ్రీనిధాన
ఆ. మపరలక్ష్మివోలె ♦ నావనలక్ష్మి నా, వెలుఁగు చున్నయదియు ♦ వేల్పుఁజెలులఁ
గిన్నరాంగనలను ♦ గీర్తితగంధర్వ,సతులఁ గంటి నిట్టి♦సతిని గాన. ౫౮౩

ప్రియదార = ఇష్టురాలైన భార్య, రమణీయసంచార = అందమైన నడకగలది, ఉరుకీర్తికలిత = మిక్కిలి కీర్తితోఁగూడినది, రంభా + ఊరు + లలిత = అరఁటిస్తంభములవంటి తొడలచే నందమైనది, చంపకసుమనాస = సంపెంగపువ్వువంటి ముక్కుగలది, చంద్రికాదరహాస = వెన్నెలవంటి చిరునవ్వుగలది, సౌందర్యసదన = అందమునకు నిల్లైనది, రాకేందువదన = పదునాఱుకళలతోఁగూడినచంద్రుని గల రాత్రి నాఁటి చంద్రునివంటి ముఖముగలది, పతిహితమతిపూర్ణ = భర్తకుమేలు

చేయు మనస్సుచే నిండినది, భవ్యకాంచనవర్ణ = శ్రేష్ఠమైన బంగారువన్నెగలది, నీలకుంతలభార = నల్లనివెండ్రుకలను విశేషముగఁగలది, నీతిసార = నీతియందలి సారమైనది, హర్యక్షనిభమధ్య = సింహమునడుమువంటి నడుముగలది, అఖిల లోకారాధ్య = సమస్తజనులచే నర్చింపఁబడునది, సీతాభిధాన = సీతయనుపేరు గలది, సుశ్రీనిధానము = మంచికాంతికి నిధియైనది, అపరలక్ష్మి = లక్ష్మీదేవికిఁ బ్రతి రూపమైనది.

రావణునకుఁ గామోద్రేకము గలుగుటకై సీతాదేవిని బ్రత్యవయవము వర్ణించి చెప్పుచున్నది.

తా. రామచంద్రునకు నిష్టురాలైనభార్య సీత యనుపేరుగలది యొకతె గలదు. ఆమె యందమైన గమనము గలది. సమస్త సద్గుణములచేత గొప్ప కీర్తిని గాంచినది. ఆమెతొడ లరఁటిస్తంభములవలె నున్నవి. ఆమెముక్కు సంపెఁగ పువ్వువలె నున్నది. వెన్నెలవంటి చిఱునవ్వు గలది. ఆమెసౌందర్యమునకు నునికి పట్టు. షోడశ కళాపూర్ణుఁడైన చంద్రునివంటి ముఖము గలది. పతికి హితము చేయు కోరిక నిండుగఁ గలది. మంచి బంగారువన్నె గలది. తలనిండ నల్లనివెండ్రుకలు గలది. నీతియందలి స్థిరాంశ మేదియో యది. సింహమునడుమువంటి సన్నని నడుము గలది. సమస్త జనులచే నారాధింపఁబడునది. మంచి శోభకు గనియైనది. రెండవ లక్ష్మియై వనదేవతవలె వెలుఁగుచున్నది. నేను దేవతాస్త్రీలను, కిన్నర స్త్రీలను, పేరైన గంధర్వ స్త్రీలను జూచితినిగాని, యిటువంటి స్త్రీని నేనెందును జూడలేదు.

ఉ. కంటిని యక్షకాంతలను ♦ గంటిని గింపురుషాంబుజాక్షులన్
గంటిని దైత్యకామినులఁ ♦ గాని రఘూద్వహు దేవివంటి దై
కంటికిఁ బండు వౌకలువ ♦ కంటిని మూఁడుజగంబులందు నేఁ
గంటయు వింట లేదు గజ ♦ గామినిచంద మిఁ కేమి చెప్పుదున్. ౫౮౮

తా. నేను యక్ష స్త్రీలను, కింపురుష స్త్రీలను, దైత్య స్త్రీలను, చూచితినిగాని రామచంద్రునిభార్యవంటిదై కన్నులకు నానందము గలిగించు కలువపూవులవంటి కన్నులుగలదానిని మూఁడులోకంబులందును నేను జూడలేదు. ఇట్టిది మఱి యొకటి యున్నదని వినను లేదు. ఇంత కెక్కువ నేనేమి చెప్పఁగలను.

క. ఎవ్వనికి సీతభార్యయొ, యెవ్వనిఁ గవుఁగింటఁ జేర్చు ♦ నింతి యెలమిచే
నవ్వాఁడు ముజ్జగంబుల, నవ్వాసవుకంటె నధికుఁ ♦ డై వర్ధిల్లున్. ౫౮౯

ఎలమిచేన్ = సంతోషముతో.

తా. సీత యెవ్వనికి భార్యయో, యెవ్వని నామె సంతోషముతోఁ గవుఁగిలించునో యా పురుషుఁడు మూఁడు లోకంబులందు నింద్రునికంటె గొప్పవాఁడయి వృద్ధిచెందును.

భార్యయో=సీతాలింగనసౌఖ్యము లేకున్నను ఆమె నూరక యింట నుంచుకొని భరించుచుండినను జాలును. అట్టివాఁ డింద్రునివంటి యైశ్వర్యభోగము లనుభవించును. లక్ష్మీదేవిని నింద్రుఁడు, 'ప్రసీద దేవి పద్మాక్షి మాస్మాం స్త్యాక్షీః కదాచన' యనియే కదా కోరెను. లక్ష్మీసాన్నిధ్యమే సకలైశ్వర్యప్రదము గదా.

ఎలమిచేఁ గవుఁ గింటఁ జేర్చును=సంతోషముతోఁ గౌఁగిలించునో, భార్యగాకున్నను పుత్రభావముతోనైన సంతోషముతో నామెయే యెవనిఁ గౌఁగిలించునో వాఁ డింద్రునికంటె గొప్పవాఁడై బ్రహ్మవంటివాఁ డగును. ఇఁక నామె యిల్లాలే యైనచో నట్టి పురుషుని విషయమేమి చెప్పను?

ఉ. ఆరమణీలలామ యస♦మాంచితరూప సుశీల యావనో
దారవిహార నీకుఁ దగు♦దార సతీమణి కీవె యర్హుఁ డౌ
పూరుషుఁ డంచు నిద్దఱను ♦ బోలిచి చూచి ధరాత్మజాతఁ దో
తేరఁగ నందుఁ బోయితిని ♦ దేరకు ముక్కు-ను గోలుపోయితిన్.　　౧౯౮

అసమాంచితరూప = ఈడులేక ప్రకాశించు సౌందర్యముగలది, సుశీల = మంచినడవడిగలది, యావనోదారవిహార = వయస్సువలని యతిశయముచే సంచరించునది, దార = భార్య, తోతేరఁగ = తీసికొనివచ్చుటకు, తేరకు = నిష్కారణముగ, వృథాగా, కోలుపోయితి = పోఁగొట్టుకొంటిని.

తా. మంచిసౌందర్యముచేతను, నడవడిచేతను వయస్సుచేతను స్త్రీలయందు శ్రేష్ఠురాలైన యా సీత నీకుఁ దగిన భార్య. ఆమెకు నీవు దగిన భర్తవని యిద్దఱను బోలిచిచూచి యా సీతను దెచ్చి నీ కీయఁ దలఁచి యందుఁ బోయితిని. ముక్కు-ను బోఁగొట్టుకొంటిని. 'అంకాడ నేర్చినమ్మ బొంకాడ నేరువకున్న బొంత నక్కల పాలామె'నను సామెత గలదుగదా. దీనివలన స్త్రీలు పురుషుల చిత్తవృత్తి యెఱింగి వారు నచ్చునట్టి యచ్చిక బుచ్చికపు టిచ్చకపు మాటలు చెప్పి వారిచేఁ దమ కార్యము సాధించుకొందు రని యేర్పడుచున్నది. స్త్రీ లిచ్చకము లాడినను, విశేషవినయవిధేయతలు కనఁబఱచినను దమవలన నేదో కార్యము కావలసియు వేషమువేసినారని పురుషు లెంచి హెచ్చరిక గలవారుగా నుండవలయును. నయము పనిచేయదేని నిష్ఠురములు అవి పనిచేయనియెడఁ బ్రత్యక్షవిరోధము పూని తమపని స్త్రీలు సాధింతురు. వారితోడి యతి స్నేహము కీడే గలిగించును. విరోధము కీడే గలిగించును. పురుషునకు మధ్యస్థవృత్తి క్షేమంకరము.

రామాయణమునఁ జెప్పఁబడుటచేఁ గైక, మంథర, శూర్పణఖ, ప్రసిద్ధికి వచ్చిరి గాని వారిని మించిన స్త్రీలీనాఁడును గలరు. అటు లని యందఱు నట్టివారని భ్రమింపరాదు. కైకయున్న యింటనే కౌసల్యా సుమిత్ర లుండిరి. శూర్పణఖ యింటియందే మండోదరి సరమాదు లుండిరి. ఎవరెట్టి వారైనది నిర్ధారించుట పురుషుని తెలివితేటలపై నున్నది. ఇట్లు స్త్రీల దోషముచెప్పుటచేఁ బురుషు లందఱు పరమసాధువులని యభిప్రాయముగాదు. కల్లకపటము లెఱుఁగని నిష్కల్మష హృదయలగు నిల్లాండ్రను దుశ్చరిత్రులై నిష్కారణముగ వేఁచి బొక్కలాడు దుష్టపురుషు లెందఱో గలరు.

క. అఱ్ఱాడుచు నట నిట సతి,యఱ్ఱునకుం బోవ మోస ♦ మది గని తనక
న్నెఱ్ఱగ లక్ష్మణుఁ డదయత, మొఱ్ఱో యని యఱవఁ గోసె ♦ ముక్కుం జెవులున్.

అటనిటన్ = అక్కడనిక్కడ, అఱ్ఱాడుచున్ = తిరుగుచు, అఱ్ఱునకు = సమీపమునకు, మోసము = నాకుటిలభావమును, కన్నెఱ్ఱగన్ = కోపముచేఁ గన్నులు ఎఱ్ఱనగాఁగా, అదయత = దయలేమి.

తా. మగవారికిఁ దెలియకుండ సీతాదేవి నెత్తుకొనివచ్చి నీకియ్యఁ దలఁచి చుట్టుపట్ల తిరుగుచుండి సీతయొద్దకుఁ బోయితిని. నా కుటిలవర్తన మెఱిఁగి లక్ష్మణుఁడు నేను మొఱ్ఱోయని మొత్తుకొనుచున్నను విడువక పట్టుకొని నా ముక్కు సెవులు మొదలంటఁ గోసెను.

క. నీ వేగి కన్నులారఁగ, నావగకత్తియను బూర్ణి♦మాబ్జాస్యఁ గనన్
బూవిలుతువేల్పుదాసరి,వై విడవే బిగువు గిగువు ♦ నాక్షణమందున్. ౨౨

వగకత్తియను = వగలాఁడిని, అందగత్తెను, పూర్ణిమా+అబ్జ+ఆస్యన్ = పున్నమనాఁటి చంద్రునివంటి ముఖముగల దానిని, కనన్ = చూచితివేని, పూవిలుతువేల్పు = పూవులు విల్లుగాఁగల మన్మథునకు, దాసరివై = దాసుఁడవై. దాస శబ్దభవము దాసరి, గిగువు = నిందయందు గిగ్గీలగు.

తా. నీవే పోయి యా సొగసుకత్తెను గన్నులారఁ జూచితివా మన్మథునకు దాసుఁడవై యాక్షణమందే నీ బిగువు వదలెదవు.

ఉ. పమ్మినప్రేమ జానకిని ♦ భార్యగఁ గైకొన నిష్ట మేని లే
లె మ్మపసవ్యపాదమును ♦ లేవఁగ నెత్తు జయార్థ, మందుఁ బో
పొ మ్మిపుడే, రఘూత్తములఁ ♦ బోర వధించి యనాథ సీతఁ దే
తెమ్ము, సుఖోపభోగములఁ ♦ దేలుము తత్సతితోడ రావణా. ౨౩

పమ్మిన = అతిశయించిన, అపసవ్యపాదము = కుడికాలు, కుడికాలుముందు పెట్టుట శుభసూచకము, ఎడమకాలు ముందుపెట్టుట నాశసూచకము, జయార్థము

= గెలుపుకొఱకు, అనాథ = దిక్కులేనిది, సుఖోపభోగములన్ = సౌఖ్యానుభవములను.

తా. అధికప్రేమచే నీవు జానకిని భార్యగఁ గైకొనుట సమ్మత మయ్యేని మేలు గలుగుకొఱకై కుడికాలు ముందుంచి, యిప్పుడే లే లెమ్ము. ఇప్పుడే దండకారణ్యమున సీత యుండుచోటికిఁ బొమ్ము. రామలక్ష్మణులను యుద్ధమునందు జంపుము, మగఁడుచచ్చి దిక్కులేకయుండు సీతను దీసికొనివచ్చి నీ యిష్టమువచ్చిన చొప్పున రమింపుము.

మీఁది వ్యాఖ్యానమందు స్త్రీలతోడి యతిస్నేహము కీడునకుఁ గారణమగును. విరోధము కీడునకుఁ గారణమగు నని చెప్పఁబడెను. అతిస్నేహముచేఁ జెడినవాఁడు దశరథుఁడు. ఇఁక విరోధించినచో వారెంత కీడైనఁ జేయ నెట్లు యత్నింతురో యది శూర్పణఖాచర్యవలన స్పష్టమగుచున్నది. రామచంద్రమూర్తి తనకు వశుఁడు గాకుండుటచే నాయనను జంపింపవలయు నని ఖరుని నిష్ఠురములాడి యుద్ధమునకుఁబంపెను. ఇప్పుడిచ్చకము లాడి రావణుఁ బ్రేరించుచున్నది. దొంగతనముగా సీతను దెచ్చుట మాత్రముతో సంతుష్టిపడక రామలక్ష్మణులఁ జంపు మనుచున్నది. అప్పు డాముప్పురమీఁదఁ దనపగ సాధించిన ట్లగును.

ఉ. రామునిచేతఁ జచ్చినఖ♦ర ప్రముఖాసురకోటిమీఁద నీ
కేమియుఁ బ్రేమ యుండిన న♦హీనముదంబుగ వారి కెల్ల నా
రామునిఁ దోడివారలను ♦ రాక్షసరాజ! వధించి రమ్ము, నీ
కీమెయి సమ్మతం బయిన ♦ నేగుము నేఁ డటకుం దిరుండ వై. ౫౫౦

ఆఁడుదానివిషయమై బలవద్విరోధమేల యని రావణుఁ డుపేక్షించునో యని మఱి రోష మెక్కించుచున్నది.

ఏమియు = ఏమాత్రమైనను, అహీనముదము=ఎక్కువసంతోషము, తిరుండవై = స్థిరచిత్తము ధైర్యము గలవాఁడవయి.

తా. రామునిచేతఁ జచ్చిన ఖరుఁడు మొదలగు రాక్షససమూహములో నొకనిమీఁదనైన నొకించుకయైనఁ బ్రేమ యనునది నీమనస్సునందుండెనా రాముని వానికి సహాయులగువారినిగూడఁ జంపిరమ్ము. ఇది నీకు సమ్మతమైన నే ధైర్యముతోఁబొమ్ము.

క. రుచియించె నేనియును నా,వచనంబులు నీకు నసుర♦వల్లభ! వేవే
విచికిత్సాహీనుఁడ వై, విచికిలగంధిన్ గ్రహింప♦వెడలుము మఱియున్. ౫౫౧

విచికిత్సా = సందేహము, విచికిలగంధిన్ = పూవులవాసనవంటి వాసన గలదానిని.

తా. నామాటలు నీకు రుచించెనా శీఘ్రముగ జాగుచేయక సందేహము విడిచి మల్లెపూవులవాసనగల సీతను దోడుకొనిరమ్ము. బయలుదేఱుము.

ఉ. నీబల మెంతమాత్రమొ ము♦నిప్రకరార్దన! మున్ను చూచి యా
 పై బలవత్కృతంబుగ నృ♦పాలసుతన్ హరియింపఁ బూనుమీ
 దేబెలువోలె దండకను ♦ దిక్కినయాఖరదూషణాదిర
 క్షోబలవీరులం దలఁచి ♦ చూచి ప్రతిక్రియకై కడంగుమీ. ౫౫

మునిప్రకరార్దన = మునులసమూహమును దుఃఖపెట్టువాఁడా, బలవత్కృతంబుగన్ = బలాత్కారముగ.

తా. రావణా! నేను జెప్పితినని నింద నామీఁదఁ బెట్టకుము. నాకుఁదోఁచినది నేను జెప్పితిని. ఎదుటిబలముగుఱించి చెప్పితిని. నీబలమెంతమాత్రమో నీవే యాలోచించి యంతకెక్కువబలము నీకున్నఁ బోయి బలవంతముగ సీతను దెమ్ము. ఇది నీసుఖమునిమిత్తమై.

ఇఁక నీనిమిత్తమై దండకయందు దిక్కులేనివారివలెఁ జచ్చిన ఖరాది రాక్షసులయందలి కృతజ్ఞతకై వారికి వచ్చిన యకాలమరణ మాలోచించి దానికి బదులేమి చేయవలయునో యది చేయుము.

నింద నామీఁదఁ జెప్పకుము. ఇది స్త్రీలు చెప్పు సమాధానమే. వారు చెప్పినట్టు విని పనిచేయఁగా నాపనివలనఁ గీడుకలిగినప్పుడు నీవు చెప్పినట్లు వినుటచే నాకీకష్ట మవమానమువచ్చెనని మగవాఁడనిన అది యేమో నాకేమి తెలియును. నాకుఁ దోఁచినది నేను జెప్పితిని. ఆఁడుదానను అంతదూరమూలోచించు తెలివి మాకున్నదా? నీవును మగవాఁడవే యాలోచించి సరిగానే చేయరాదా, నేను వద్దంటినా యనును. అట్టులే శూర్పణఖయుఁ గార్యము చెడెనేని నింద తనమీఁద రాకుండుటకై హెచ్చరిక చెప్పుచున్నది.

-ooo- ౩౫-వసర్గము. రావణుండురహస్యంబుగ మారీచాశ్రమంబునకుఁబోవుట -ooo-

సీ. అన రోమహర్షణం ♦ బైనశూర్పణఖవా,క్యంబుల విని రావ♦ణాసురుండు
 మంత్రులతోడుత ♦ మంతనం బుండి కా,ర్యంబుచందంబును ♦ నాత్మ నెఱిఁగి
 వారికిసెలవిచ్చి ♦ పనిచి తానును బోయి, యోజించి కార్యంబు ♦ లున్న తెఱఁగు
 తనతలపోఁతవి♦ధంబునఁ గలమేలు, హానియు వానిబ♦లాబలములు

తే. నట్టె యోజించి యిద మిత్థ♦మనుచునిశ్చ,యించిస్థిరబుద్ధి వాహన♦గృహముఁ జేరి
 గూఢగతిసారథిని దేరు ♦ గూర్పఁ బనుప, నతఁడు గ్రక్కునసమకట్టె♦స్యందనంబు.

రోమహర్షణము = భయము కలిగించునది యగుటచే గగుర్పాటు కలిగించునది. శూర్పణఖ= (౧) శూర్పేణ యజ్ఞాది సత్క్రియాం నఖయతి విదూషయతీతి శూర్పనఖా. నఖ విదూషణ ఇతి ధాతుః. చేటచే యజ్ఞాదిసత్క్రియలు పాడుచేయునది. (౨) చేటవంటి గోళ్లుగలది, మంత్రసంబుండై = ఆలోచించి, కార్యంబుచందంబు నాత్మ నెఱిఁగి = కార్యవిధము తెలిసికొన్నవాఁడై, ఇదమిత్థమ్మనుచు=ఇది యీప్రకారము చేయవలసినదనుచు, స్యందనంబు = తేరు.

తా. దేహమున గగుర్పాటు గలిగించు భయోత్పాదకములయిన శూర్పణఖ మాటల విని మంత్రులతో నాలోచించి కార్య మున్నవిధము నెఱిఁగి వారిని పొండని పంపి కార్యము జరుగవలసినవిధము నిట్లు లాలోచించెను. (౧) రాముఁడు చేసిన కార్యములకు ననఁగా శూర్పణఖను విరూపనుచేయుట, (౨) ఖరాదుల వధించుట యీరెంటికిఁ బ్రతి చేయక తప్పదు. ఊరకయుండినఁ బౌరుషహీనుఁడని బలహీనుఁడని లోకులు దేవతలు నవ్వుదురు. 'సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే' మానవంతునకు మరణమునకంటె నపకీర్తి చెడ్డది.

'ప్రాణమేవ పరిత్యజ్య మానమేవాభిరక్షతు' = ప్రాణము పోఁగొట్టుకొనియైన మానము రక్షించుకొనవలయును. కావున నూరకుండుట మానహానికరము, అపకీర్తికరము. అట్లు కార్యము చేయవలసియుండెనేని యేది చేయవలె? ఎట్లు చేయవలెను? బహిరంగముగా యుద్ధమునకుఁబోదునా, పదునాలుగు వేల మహాబలశాలుల నొక్కఁడే కాళ్లమీఁద నిలఁబడి మూఁడు గడియలలోఁ జంపినవాఁడు సామాన్యుఁడుగాఁడు. ఇట్టివానితోడి యుద్ధమందు నేనే జయింతు నని యేమి నమ్మకము? కనుక నిది సాపాయము. వంచనచేసి సీతను హరించి తెచ్చితినా-ఎక్కడనో యున్న వారి నింటిమీఁదికి నేనై తెచ్చినట్లగును. వా రిచ్చటికి వచ్చిరా యూరకపోరు. రామలక్ష్మణులు నాపోబడి తెలియుట, తెలిసినను సముద్రము దాఁటుట, లంకకువచ్చుట, యుద్ధమున గెలుచుట, యిది యిరువురుమనుష్యుల కసంభావితము.

ఒకవేళ నట్లు చేయకున్న భార్యను గోలుపోయితి నన్నవ్యసనముతోనో యవమానముతోనో చావనే చచ్చెనా మఱిమేలు. సీతను వశపఱచుకొంటినా-నా కేభయము లేదు. ఆ విషయము వారికిఁ దెలియఁగానే చత్తురు.

రావణునకు సీత వశపడినను నవమానము పోఁగొట్టుకొనుటకై రావణుని రామచంద్రమూర్తి వధించియే యుండును. రావణ వధానంతరము సీతారామ సంభాషణము దీనిని స్థిరపఱుచుచున్నది. సీతయు; దక్కును; ఇది నిరపాయమైన మార్గము. సుకరము. కావున నిట్లు చేయుట మేలని యాలోచించి తీర్మానించు

కొనెను. ఇట్లు నిశ్చయించుకొని మనస్సు దృఢము చేసికొని గుఱ్ఱముల లాయమునకుఁ బోయి రహస్యముగఁ దేరు సిద్ధముచేసి తెమ్మని సారథికిఁ జెప్పఁగా వాఁడట్లులే చేసెను.

రహస్యముగ = (౧) బహిరంగముగఁ జేసిన వృద్ధులును విభీషణుఁడు మందోదరి మొదలగువారు పోనీయ రను భావముతో వేలకొలఁది స్త్రీలను వారి మగవారియెదుట బలాత్కారముగఁ దెచ్చిన నీ వొక స్త్రీని దొంగలించి తేఁదలఁచుటకు నీకుసిగ్గులేదా యని ఛీ కొట్టి యుందురు. (౨) శూరధర్మము పౌరుషము విడిచి చోరధర్మము నాశ్రయించుట లజ్జాకరమని రహస్యముగ (౩) మీఁదఁ జెప్పిన మంత్రాలోచన యీ విషయమై కాదు. ఏవో యితర కార్యముల యాలోచనము కావున నీ విషయము మంత్రులకును దెలియదు. కావున రహస్యము.

'రామ సౌమిత్రి సంరక్షణీయను సీత నపహరించితివేరి నడిగి నీవు' ఇత్యాది కుంభకర్ణుని వాక్యములవలన (యుద్ధ. ప. ౨౮౧) రావణుఁ డీవిషయము మంత్రులతో నాలోచించినవాఁడు కాఁడని యేర్పడుచున్నది.

సీ. కామసంచారంబుఁ ♦ గాంచనాంచితమును, ఖరపిశాచవదన♦ఖరయుతంబు
నంబుదధ్వానమా ♦ నరద మంబుధి డాయ, ధవళాతపత్రంబు ♦ ధవళ మైన
వాలవ్యజనమును ♦ వాలఁగఁ గాంచన,కుండలంబులు తేజుఁ ♦ గురియ నెక్కి
స్నిగ్ధవైడూర్యస♦న్నిభుఁడును వింశతి,కరుఁడును బంక్తికం♦ధరుండు నగుచు
తే. దర్శనీయపరిచ్ఛద♦తతుల వెలిఁగి, భయదదశశీర్ష శైలంబు♦పగిది నొప్పి
చంచలాబలాకసహిత♦శరదమనఁగఁ, గ్రూరచరితుండు మునికంట♦కుండుచనియె.

కామసంచారంబు = ఇష్టము వచ్చినట్లు ఇష్టమైన మార్గమునఁ బోవఁగలది, కాంచనాంచితము = బంగారు రేకులచేఁ బ్రకాశించునది, ఖరపిశాచవదన ఖరయుతంబు = క్రూరములైన పిశాచముఖములతోఁ గూడిన కంచరగాడిదలను గట్టినది, అంబుదధ్వానము = మేఘము ఱిమినట్లు ధ్వనించునది, అరదము = రథ శబ్దభవము-అకారమాగమము; అంబుధి డాయన్ = సముద్రతీరము చేరఁగా-అనుటచే రథము నింటియొద్ద నెక్కినవాఁడు కాఁడు. సముద్రతీరమునకుఁ దేరు తెమ్మని సారథికిఁ జెప్పి తాను వేఱొకమార్గమున నచటికిఁ బోయి యెవరు లేనిచోట రథ మెక్కె నని యేర్పడుచున్నది. ధవళాతపత్రంబు = తెల్లని గొడుగు, ఆతప+త్రము=ఎండ నుండి రక్షించునది, ధవళమైన = తెల్లని, వాలవ్యజనము = చామరము (తోఁక విసనకఱ్ఱ), వాలఁగన్ =అతిశయింపఁగ, కాంచనకుండలములు=బంగారు కర్ణాభరణములు, స్నిగ్ధ వైడూర్యసన్నిభుఁడును = నిగనిగమను వైడూర్యముతో సమానుఁడు, వింశతికరుఁడును = ఇరువదిచేతులు గలవాఁడును, పంక్తికంధరుఁడు =

పదిమొడలు గలవాఁడు, దర్శనీయ = చూచుట కందమైన, పరిచ్ఛద = వస్త్రముల సమూహములచేత, భయద = భయంకరమైన, దశశీర్ష = పది తలలుగల, శైలంబు= పర్వతము, చంచలా = మెఱపులతోను, బలాక = కొంగలతోను, సహిత = కూడిన, శరదము = మేఘము, మునికంటకుండు = మునులకు బాధ గలిగించు వాఁడు.

తా. ఇచ్ఛవచ్చినట్లు పోఁగలదై బంగారు రేకులతోఁ బ్రకాశించుచు పిశాచ ముఖములుగల కంచరగాడిదలతోఁగూడి మేఘగర్జనమువంటిధ్వనిగల తేరిని సముద్రతీరమునకు సారథి తీసికొని రాఁగాఁ దెల్లని గొడుగు వెలిచామరము లతిశయింపఁగా బంగారు చెవుల పోగులు తళుక్కని మెఱయ దానిపై నెక్కి మినమిన మెఱయు వైడూర్యకాంతియు నిరువది చేతులు పదితలలు గలవాఁడై సుందరములైన వస్త్రములతో చూచుటకు భయము కలిగించు పదిశిఖరముల కొండవలె నొప్పి మెఱపులతోఁ గొంగలతోఁ గూడిన మేఘమువలె నాకాశ మార్గమునఁ గ్రూరపు నడవడిగల యా మునివిరోధి పోయెను.

రావణునకు మేఘమునకు, తేరికిఁ గొంగలకు, సొమ్ములకు మెఱుపులకు నుపమానంబులు.

ఇందు రావణుఁడు పదితలలు నిరువదిచేతులు గలవాఁడై యున్నట్లు చెప్పఁ బడెను.

సీ. శీతమంగళతోయ♦పూతసరస్సుల, బహుపుష్పఫలవృక్ష♦పటలిచేత
వేదీసమావృత♦విస్ఫుటాశ్రమముల, సాలతాలతమాల♦నాళికేర
కదళికాఢకిపూగ ♦ కమ్రవృక్షంబుల, నాగసువర్ణగం♦ధర్వకిన్న
రాళులచేత న♦త్యంతమితాహార,మునులచే జితకామ♦ఘనులచేత

తే. నజుల వైఖానసులచేత ♦ ననఘమాష,వంశజులచే మరీచప♦వాలఖిల్య
గణముచేతను సిద్ధచా♦రణులచేతఁ,జెలఁగు వేలాప్రదేశంబుఁ♦జేరఁ జనియె.౫౫

శీత = చల్లని. మంగళ = శుభకరములైన, తోయ = నీళ్ళచే, పూత = పవిత్రములయిన, సరస్సులన్ = కొలఁకులచేత, పటల = సమూహము, వేదీ సమావృత విస్ఫుటాశ్రమములన్ = వేదులతోఁ గూడిన మిగుల స్ఫుటమైన యా శ్రమములచేతను, యజ్ఞశాలయందలి యరుఁగు వేది-సాల = మద్దిచెట్లు, తాల = తాటిచెట్లు, తమాల = చీఁకటిమ్రాఁకులు, నాళికేర = టెంకాయచెట్లు, రూ. నారి కేళము. కదళికా = అరఁటిచెట్లు, ఆఢకి = కందిచెట్లు, పూగ = పోఁకచెట్లు, ఈ మొదలగు కమ్రవృక్షంబుల్ = ఇంపైన చెట్లచే, నాగ = పాములు, సుపర్ణ = గరుడపక్షులు. అత్యంత = మిక్కిలి, మితాహార = కొంచెము ఆహారముగల

వారిచేతను, జితకామఘనులచేతను=జయింపఁబడిన కామముగల గొప్పవారిచేతను, అజులు = తల్లిగర్భమునుండి పుట్టని, వైఖానసులచేత = బ్రహ్మగోటినుండి పుట్టిన వారిచేతను, 'యేనఖాః వైఖానసాః' అని శ్రుతి, అనఘ = దోషరహితమైన, మాషవంశజులచే = మాషవంశమునఁ బుట్టినవారి చేతను, మరీచప = సూర్యకిరణములను (Ultra Vislet rays) ద్రావువారిచేతను, ప్రాణాధారశక్తి యీ కిరణములందుఁ గలదు- వాలఖిల్యగణముచేతను = వాలఖిల్యు లను ఋషుల సమూహముచేతను, బ్రహ్మవాలమునఁ బుట్టినవారు. 'యేవాలాః తే వాలఖిల్యాః' అని శ్రుతి, వాలము లనఁగా వెంట్రుకలు.

తా. చల్లని మంచినీళ్ళచేఁ బవిత్రములైన కొలఁకులచేతను, అనేకములగు పూలు పండ్లుగల వృక్షములచేతను, యజ్ఞమున వేయఁబడిన తిన్నెలచే నొప్పు నాశ్రమములచేతను, మద్ది, తాటి, చీఁకటి, టెంకాయ, పోఁక, కంది, యరఁటిచెట్ల చేతను, నాగులు, గరుడులు, గంధర్వులు, కిన్నరులు మొదలగువారి సమూహముల చేతను మిక్కిలి మితాహారముగల మునులచేతను, కామము జయించిన గొప్పవారిచేతను, వైఖానస, మాష, వాలఖిల్యులచేతను, సిద్ధచారణులచేతను, నొప్పుచున్న సముద్రతీరముఁ జేరఁబోయెను.

సీ. ఆటలఁ బాటలఁ ♦ బాటన వేలుపుఁ, బాటలాధర లెల్ల ♦ నీటు మెఱయ
నంచలుఁ గ్రౌంచులు ♦ నంచితంబుగ స్వర,సంచయంబులఁ జెవుల్ ♦ నించుచుండ
హారసంభారముల్ ♦ హారివిశాలముల్, నీహారతుల్యముల్ ♦ నిర్మలములు
వరమనోహరగీత♦వాదిత్రసంజుష్ట, దేవయానంబులు ♦ దేజరిల్ల

తే. నచ్చరలను గంధర్వవి♦యచ్చరులను, నిజతపోబలజితలోక♦నిచయఘనుల
మఱియునిర్యాసరసమూలశమహితచంద, నాగరుధరారుహంబుల ♦ నందమగుచు

పాటనన్ = అలంకారముచే, పాటలాధరలు = ఎఱ్ఱని పెదవులుగలవారు స్త్రీలు, నీహారతుల్యముల్ = మంచుతో సమానమైనవి, దేవయానంబులు = విమానంబులు, వియచ్చరులను = దేవతలను, నిజతపోబల = తమ తపోబలముచే, జిత = జయింపఁబడిన, లోకనిచయఘనులన్ = పుణ్యలోకసమూహములుగల గొప్పవారిచేత, నిర్యాసరస = ఇంగువరసముగల, మూల = మూలమను పేరుగల యోషధులచేతను (మూలమను వేరునుండి స్రవించునీరు ఇంగువయని ప్రసిద్ధి), మహిత = గొప్పవగు, చందన = శ్రీగంధము, అగరుధరారుహంబులన్ = అగరు చెట్లచేత.

తా. ఆటలచేతఁ బాటలచేత నలంకారములచేత దేవతాస్త్రీలు నీటు మెఱయుచుండఁగా (పూర్వగ్రంథపరిచయములేని యాంగ్లభాషాభిజ్ఞులు నీటుశబ్ద

మా భాషలోని సీటు తెలుఁగున సంక్రమించిన దందురు. ఆంగ్లేయులీ దేశమునకు రాని కాలమున వ్రాయఁబడిన గ్రంథములం దీపదము కానవచ్చుచున్నది.) హంసలు, క్రౌంచములు మనోహరధ్వనులు నించుచుండ, హారములచే నిండినవి మనోహరముగ విశాలములయినవి మంచుతో సమానమైనవి నిర్మలములయినవి యింపైన సంగీతము వాద్యము వీనిచేఁగూడిన విమానములు ప్రకాశించుచుండ, అప్సరసలను గంధర్వులను దేవతలను- తమ తపోబలముచేఁ బుణ్యలోకముల జయించినవారిని మార్గమధ్యమునఁ జూచెను. ఇఁక వనములు వర్ణింపఁబడుచున్నవి. ఇంగువ రసముగాఱు మూలమను పేరుగల ఔషధులచేతను, శ్రీగంధము చెట్లు, అగరుచెట్లు వీనిచేతను నందమై.

తే. ఘ్రాణతృప్తికరంబు లై♦క్రాలువనుల, నేత్రతృప్తికరంబు లై♦నెగడుస్థలుల
శ్రవణతృప్తికరంబు లై♦చాగుధ్వనుల, హృదయతృప్తికరంబుగఁ♦బొదలుదాని

ఘ్రాణతృప్తికరంబులు = మంచివాసనచే ముక్కులకు సంతోషము గలిగించునవి. నేత్ర తృప్తికరంబులు = అందముచేఁ గన్నులకు సంతోషము గలిగించునవి, శ్రవణతృప్తికరములు = చెవులకు విననింపైనవి, హృదయ తృప్తికరంబులు= హృదయమునకు సంతోషము గలిగించునవి.

తా. పరిమళములచే ముక్కులకు సంతోషము కలిగించు వనములచేతను, చూచుట కింపైన వస్తువులుగల స్థలములచేతను, వినుట కింపైనధ్వనులు గలవాని చేతను హృదయాహ్లాదకరమగుదానిని.

క. ముక్తాప్రవాళనీరజ,సక్తము నిర్మలతటాక♦చంచల్లహరీ
యుక్తము మరీచగుల్మ,వ్యక్తము నై విత్తధాన్య♦వనితాయుత మై. ౫౫౮

ముక్తా = ముత్యములచేతను, ప్రవాళ = పగడములచేతను, నీరజ=కమలములచేతను, సక్తము = కూడినది, నిర్మలతటాక = పరిశుద్ధమైన చెఱువులందు, చంచత్ = ప్రకాశించుచున్న, లహరీయుక్తము = అలలతోఁగూడినది, మరీచగుల్మవ్యక్తమునై = మిరియాల పొదలచే స్పష్టముగాఁ దెలియఁబడునది, విత్త = ధనముతోను, ధాన్య = ధాన్యముతోను, వనితా = స్త్రీలతోను, యుతము = కూడినది.

తా. ముత్యములు పగడములు కమలములు వీనితోఁగూడినదియు, నిర్మలములయిన చెఱువులయందుఁ బ్రకాశించు నలలు గలదియు, మిరియాల పొదలు గలదియు, ధనధాన్యస్త్రీసమృద్ధిగలదియు.

క. కరితురగస్యందనసం,భరితం బయి హృద్య మైన♦పట్టనవితతిఁ
బరికించుచుఁ దెమ్మెర లై, సురనగరసమాన మైన♦సుందరవేలన్. ౫౫౯

కరి, తురగ, స్యందన, సంభరితము = ఏనుఁగులచేతను గుఱ్ఱములచేతను, రథములచేతను నిండినది యగు మనోహరమైన పట్టనసమూహమును, తెమ్మెరలై = చల్లనిగాలిగలదై, సురనగరసమానమైన = దేవతా పట్టనముతో సమానమైన, వేలన్ = వాగర్తను - సముద్రతీరమును.

తా. ఏనుఁగులు, గుఱ్ఱములు, తేరులు, వీనిచే నిండినపట్టనములను జూచుచుఁ జల్లనిగాలి గలిగి సుందరమైన సముద్రతీరమును జూచెను.

సీ. కనుఁగొని యటఁ గాంచె ♦ ఘనసన్నిభం బయి, శతయోజనాయత♦శాఖ లొప్పు
పెనుమఱ్ఱివృక్షంబు ♦ మును వైనతేయుండు, కవణంబుగా గజ♦కచ్ఛపముల
గోళ్లలో నిఱికి తా ♦ గొబ్బునఁ జని దాని,కొమ్మను వ్రాల భా♦రమ్ముచేత
బల్లున విఱిగిన ♦ వాలఖిల్యాదులు, తప మందుఁ జేయుట ♦ దయ దలంచి

తే. ముక్కునను దానిఁ గొని జవ ♦ మెక్కుడుగను
జనుచుఁ గ్రోవనయొంటికా♦లను భుజించె
నామిషము నిషాదవిషయ ♦ మంత చెఱిచి
మునుల ముక్తుల నొనరించి ♦ ముదముఁ జెంది. ౫౭०

ఘనసన్నిభము = మేఘముతో సమానము, శతయోజనాయత = నూఱామడ పొడవుగల, శాఖలు = కొమ్మలు, వైనతేయుండు = వినత కుమారుఁడైన గరుత్మంతుఁడు. కవణంబుగాన్ = ఆహారముగా, గజకచ్ఛపములన్ = ఏనుఁగును దాఁబేటిని, ఆమిషము = మాంసము, నిషాదవిషయము = బోయదేశము.

తా. ఇట్లుచూచి యీ ప్రదేశమందు మేఘములతో సమానమై నూఱామడ పొడవుగల కొమ్మలుగలిగిన పెద్ద మఱ్ఱిచెట్టును జూచెను. అది పూర్వము గరుత్మంతుఁడు స్వర్గమునకుఁబోవు సమయంబునఁ దన కాహారముగాఁ దమలోఁ దాము పోరాడుచున్న గజకచ్ఛపములను, గోళ్లలో నిఱికించుకొని తటాలున దాని కొమ్మమీఁద వ్రాలఁగా నాభారము సహింపలేక నాకొమ్మ ఫళక్కని విఱిగెను. ఆ కొమ్మను బట్టుకొని వాలఖిల్యాదులు తపము సేయుచుండిరి. కొమ్మ క్రిందఁబడిన వారు తమతపస్సు విఘ్నమయ్యె నని శపింతురని వెఱచి యా కొమ్మను ముక్కుతోఁ బట్టుకొని త్వరగాఁ బోవుచు నొంటికాలితో నామాంసము భుజించి ఆ మునులను బ్రార్థించి వారు వెడలిపోఁగా బోయపల్లెను నాశముచేసి సంతోషించి.

క. ద్విగుణీకృతవిక్రముఁ డయి, గగనంబున కెగసి యినుప♦కమ్ములకిటికీల్
పగ్గిలిచి ఛులిచి మణీమయ, మగునింద్రగృహంబు నమృత♦మతఁడు హరించెన్.

ద్విగుణీకృతవిక్రముఁడయి = ఆహారము సంతుష్టిగ లభించుటచే నిబ్బడించిన బలశౌర్యములు గలవాఁడై, గగనమునకున్ = ఆకాశమునకు.

రెండింతలు బలశౌర్యములుగలవాఁడయి యాకాశమున కెగిరి యినుపకమ్ము లకిటికీలు పగులఁగొట్టి రాల్చి మణులతోనిండిన యింద్రునిగృహము ప్రవేశించి యాగరుత్మంతుఁడు అమృతము హరించెను.

తే. అట్టితాపసగణజుష్ట ♦ మైనదాని, నరుణసోదరకృతచిహ్న ♦ మైనదాని
పేరున సుభద్రమనఁగను♦ వెలయుదాని, వటకుజంబును గనిదాఁటి ♦ వనధి నసుర.

అరుణసోదర = అనూరుని తమ్ముఁడైన గరుత్మంతునిచే, కృత = చేయఁబడిన, చిహ్నము = గుఱుతు, వటకుజంబును = మఱ్ఱిచెట్టును.

తా. అటువంటి తాపసుల సమూహముతోఁ గూడినదానిని, గరుత్మంతునిచే గుర్తుపెట్టఁబడిన దానిని, సుభద్రమనుపేరుగల దానిని మఱ్ఱిచెట్టును జూచి, సముద్రము దాఁటి యా రావణాసురుఁడు.

ఉ. అం దొకచోటఁ బావనవ♦నాంతరసీమ మితాశనుండు న
స్పందని జేంద్రియుండు మృగ♦చర్మధరుండు జటాధరుండు నై
పొందుగ నార లూని తప♦ముం బచరించుచు నున్న తాటకా
నందనుఁ జేరఁ బోవఁగ ఘు♦నంబు నమానుష మైనరీతిగన్. ౫౬ 3

పావన = నిర్మలమైన, వనాంతరసీమన్ = వనములోపలిప్రదేశమున, మితాశనుండు = ఆహారనియమముగలిగి కొంచెముగ భుజించువాఁడు. అస్పందని జేంద్రియుండు = చలింపని తన యింద్రియములుగలవాఁడు, మృగచర్మధరుండు = జింకచర్మము ధరించినవాఁడు, జటాభరుండు = విశేషము జడలుగలవాఁడు, నారలు = నారవస్త్రములు, తాటకానందనున్ = మారీచుని, అమానుషము = మనుష్యులకుదుర్లభమైన విధముగ, అనఁగా దేవతను బూజించునట్లు పూజించెను. ఇది గోకర్ణక్షేత్రము. ఇప్పటి రామేశ్వరము.

తా. ఆవనమందొక ప్రదేశమున నిర్మలమైన ప్రదేశమున మితాహారుఁడై చలింపని యింద్రియములుగలవాఁడై జింకచర్మముధరించి జడలుగలవాఁడై నారవస్త్రములు కట్టుకొని తపముచేయుచున్న మారీచునిఁజేరఁ బోఁగా నతఁడు మనుష్యులకు దుర్లభమైన విధముగ.

క. పూజించి పావనోదక,భోజనములఁ దృప్తుఁ జేసి ♦ పొరి మఱి పలభు
గ్రాజుం గని సేమమె కద, రాజా యీలోన మరల ♦ రాఁ గత మేమీ. ౫౬౪

ఫలభుక్ రాజు = మాంసముదిను రాక్షసులకు రాజు, కతము = కారణము, ఈ లోనన్ = ఇంతలోపలనే మొన్నపోయినవాఁడవు. ఈ దినము మరల వచ్చుటకు కారణమే మని యడుగుటచే నకంపను వృత్తాంతము ప్రక్షిప్తమనువాదము నిరస్తము. ఇదియే మొదటిసారి అయియుండిన నింతలో మరల నని చెప్పఁ గారణ

ముండదు. మొదటిసారి రావణుఁడు వచ్చినపుడీమార్గవర్ణనము చెప్పఁబడలేదే. ఇప్పుడేల యీ గొడవ యని సందేహింపరాదు. ఎంతదూరము ఎంతకష్టపడి వచ్చినది తెలుపుటకును ఇంత శ్రమపడి రెండవసారివచ్చిన వాఁడూరక కార్యముసాధింపకపోఁడని తెలుపుటకే యిది చెప్పఁబడెను. సుగ్రీవుఁడు తొలిసారి వాలిమీఁదికిఁ బోయినపుడు వర్ణింపని మార్గవిశేషములు రెండవసారి చెప్పలేదా. గరుత్మంతుని వృత్తాంతకథన మప్రస్తుతముకాదా యనరాదు. భగవంతుని వాహనమైన పక్షిమాత్రమునకు నింత జవసత్త్వములుండఁగా భగవంతుఁడగు రామున కెంత జవసత్త్వంబు లుండునో యదియైన నెఱుఁగఁజాలఁ డయ్యెఁగదా యని రావణుని మాఢ్యము దెలుపఁ గవి యీవృత్తాంతముఁ జెప్పెను.

-‍-౩౬-వ సర్గము రావణుఁడు మారీచుతో జనస్థానవృత్తాంతముఁ జెప్పుట.-‍-

క. అనవుడు రావణుఁ డిట్లను, వినుతండ్రీ!నాదువాక్య♦విస్తరమును నేఁ
జనుదెంచితి నార్తుఁడ నై, కన నీయార్తునకు నీవ ♦ గతివి మహాత్మా. ౫౬౫

వాక్య విస్తరము = మాటలవిరివి, తండ్రీ, మహాత్మా యీ మాటలు చంకదుద్ధుశరణార్థియను సామెతకు లక్ష్యభూతములయినవి.

తా. అని యిట్లడుగఁగా రావణుఁడు ముందు నయముగ నిట్లనియె, తండ్రీ! విశదముగ వివరముగఁ జెప్పెదను వినుము. ఆర్తుఁడనై వచ్చితిని. మహాత్మా!నా యార్తి బోఁగొట్టుటకు నీవుతప్ప నాకు వేఱు గతిలేదు.

సీ. నీ వెఱుంగుదు రజ♦నీచరేశ్వర జన,స్థానంబునందు నా♦తమ్ముఁ డైన
ఖరుఁడు దూషణుఁడును ♦ గాదిలిచెలియలు, చుప్పనాతియు నతి♦శూరుఁ డైన
త్రిశిరుండు లోనగు♦తీవ్ర తేజులు చతు,ర్దశసహస్రాసురుల్ ♦ రమణ నాదు
నాదేశమునఁ జేసి ♦ యావాస మొనరించి, బహుధర్మరతులను♦బఱచు చుంట

ఆ. యట్టివార లిపుడు ♦ నెట్టన క్రుద్ధు లై, వివిధసాధనసము♦పేతు లగుచుఁ
గూడి యొక్క పెట్ట ♦ క్రూరత రామునిఁ, జెనయ నతఁడు కోప♦చిత్తుఁ డగుచు.

రజనీచరేశ్వర = రాక్షసశ్రేష్ఠుఁడా. ఆదేశమునఁజేసి = ఆజ్ఞచేత, ఆవాస మొనరించి = కాఁపురముండి.

తా. నిశాచరశ్రేష్ఠుఁడా! నా యాజ్ఞప్రకారము నా తమ్ములు ఖరుఁడు దూషణుఁడు ముద్దుచెల్లెలు శూర్పణఖ అతిశూరుఁడైన త్రిశిరుఁడు మొదలగువారు పదునాలుగువేలమంది రాక్షసులు జనస్థానమునఁ గాఁపురముండి ధర్మాత్ములగు వారిని బాధలుపెట్టుచుండుట నీకుఁ దెలియునుగదా. అట్టివా రిపుడు మిక్కిలి కోపించినవారై నానావిధాయుధములను నొక్కసారిగ రామునిఁదాఁకఁగా నతఁడు కోపించినవాఁడై,

మ. పరుషం బాడక యొక్కఁడేని విశిఖ♦వ్యాపారకోదండుఁ డై
సరగం గూల్చెఁ జతుర్దశాసురసహ♦స్రంబుం ద్రిశీర్షాదులన్
నరుఁడుం దాను బదాతియై ఖరు బలిన్ ♦ శక్రారినిన్ దూషణున్
వరుసన్ రూపము మాపెఁ, జల్పె నభయ♦వ్యాయామమున్ దండకన్. ౫౬౭

పరుషము = నిష్ఠురము, విశిఖవ్యాపార కోదండుఁడై = బాణములను జిమ్ము విల్లుగలవాఁడై, సరగన్ = శీఘ్రముగ, చతుర్దశాసురసహస్రంబున్ = పదునాలుగు వేల రాక్షసులను, త్రిశీర్షాదులన్ = త్రిశిరుఁడు మొదలగువారిని, పదాతి= కాలినడకగలవాఁడై, బలిన్ = బలవంతుని, శక్రారినిన్ = ఇంద్రవిరోధిని, అభయ వ్యాయామమున్ = నిర్భయముగా సంచరించుటను, "పరుషంబాడక = అనుక్త్వా విక్రమే ద్యస్తు। తద్వై సత్పురుషవ్రతమ్." భా. ర. 7. 158. 19.

తా. మిక్కిలి గాంభీర్యగుణముగలవాఁడు కావున నిష్ఠుర మొక్కటియైనఁ బలుకక వింటిచే బాణములను బ్రయోగించుచు త్రిశీర్షుఁడు మొదలగు పదునాలుగు వేలమంది రాక్షసులను ఆ మనుష్యుఁడు కాలిమీఁద నిలఁబడి బలవంతుఁడైన ఖరుని, ఇంద్రవైరియగు దూషణుని వరుసగాఁ జంపెను. అంతియగాక మునులు లోనగువారు దండకయందు మనభయములేక స్వేచ్ఛగా సంచరింపఁజేసెను.

క. జనకుఁడు వెడలం గొట్టిన, వనులందు సభార్యుఁడతఁడు ♦ వనరెడునృపపాం
సనుఁడు కుశీలుఁడు తీక్ష్ణుం, డనయుం డజితేంద్రియుఁడు ద♦యారహితుండున్.

వనరెడు = దుఃఖించువాఁడు, నృపపాంసనుఁడు = నీచపు క్షత్రియుఁడు, కుశీలుఁడు = కుత్సిత స్వభావుఁడు, తీక్ష్ణుఁడు = క్రూరుఁడు, అనయుఁడు = నీతిలేని వాఁడు, అజితేంద్రియుఁడు = ఇంద్రియ నిగ్రహము లేనివాఁడు, దయారహితుఁడు = కృపలేనివాఁడు,

తా. తండ్రి వెడలఁగొట్టఁగా భార్యతోఁడ నడవులలోఁబడి దుఃఖించు నీచ క్షత్రియుఁడు కుచ్ఛితపు నడవడిగలవాఁడు కోపగుణముగలవాఁడు నీతి తప్పినవాఁడు ఇంద్రియ జయములేనివాఁడు కరుణాశూన్యుఁడు.

క. భూతాహితలోలాత్ముఁడు, వీతసుధర్ముండు మిగుల ♦ వీజేఁడి పగన్
హేతువు లేకయె నాయను,జాతకు ముకుసెవులు కోసె ♦ సత్త్వమదమునన్.

భూత = జీవకోటికి, అహిత = కీడుచేయుటయందు, లోల = ఆసక్తిగల, "లోలశ్చల సతృష్ణయోః" నానా.ర. ఆత్ముఁడు = మనస్సుగలవాఁడు, వీత సుధర్ముండు = సరియగు ధర్మప్రవర్తనములేనివాఁడు, వీజేఁడి = వివేకము లేని వాఁడు, సత్త్వమదమునన్ = బలగర్వముచే,

తా. జీవకోటికిఁ గీడుచేయు నాశగలమనస్సుగలవాఁడు-ధర్మమును వదలినవాఁడు వివేకమేమియులేనివాఁడు - నాతో విరోధింపఁ గారణములేకున్నను నిష్కారణముగ నాచెల్లెలి ముక్కు సెవులను బలగర్వముచేఁ గోసెను.

రావణాసురునిమాట కొకవిధమున నర్థము సమర్థింపవచ్చును.

నృపపాంసనుఁడు = నిష్కారణముగఁ దండ్రి యడవులకుఁ బొమ్మనఁగానే తన క్షాత్రముఁజూపి రాజ్యము దక్కించుకొనక బీదబాఁపనివలె భయపడి యడవులకు వచ్చినవాఁ డుత్తమక్షత్రియుఁడెట్లగును? కావున నధమక్షత్రియుఁడే కావుననే,

కుశీలుఁడు = మంచి క్షత్రియవృత్తముగలవాఁడు కాఁడు,

తీక్ష్ణుఁడు = వేఁడిమిగలవాఁడు, ఉత్తమక్షత్రియుఁడు సర్వదా తీక్ష్ణుఁడయి యుండరాదు, సర్వదాశాంతుఁడయియు నుండరాదు. కనుకనే.

అనయుఁడు = రాజనీతి తెలియనివాఁడు.

అజితేంద్రియుఁడు = కనుకనే భార్యను విడిచియుండలేక యడవులకును భార్యను బిలిచికొనివచ్చెను.

దయారహితుఁడు గనుకనే యందఱ నేక కాలమందుఁజంపిన వీరి భార్యలగతియేమి బిడ్డలగతియేమి యని యాలోచించినవాఁడు కాఁడు.

భూతాహితలోలాత్ముఁడు = ఎప్పుడు దయావంతుఁడు కాఁడో యప్పుడే భూతకోటికిఁ గీడుచేయువాఁడగును.

వీతసుధర్ముండు = స్వధర్మము సుధర్మము దానిని వదలి బ్రాహ్మణులవలెఁ దపస్సుచేసికొనుటకై పరధర్మ మవలంబించినవాఁడు,

వీఱిఁడి = వివేకహీనుఁడు, తాఁకు దప్పు లాలోచింపలేనివాఁడు. ఈయాఁడుది యొంటరిది యని చూచెనే కాని దీని నవమానపఱచిన దీనివలన నెంతప్రమాదము రాఁగలదో యని యాలోచించినవాఁడు కాఁడు.

పూర్వప్రతిజ్ఞప్రకారము రావణవాక్యములకు సాధ్వర్థము మహేశ్వరతీర్థీయమం దిట్లు సమర్థింపఁబడినది. వారివాదము గోడలేని చిత్తరు వని ముందే చెప్పఁబడెను. అయినను రావణునివాక్యములు భక్తవాక్యములని వారు వ్రాసినయర్థము విశదీకరింపఁబడుచున్నది.

జనకుండు వెడలంగొట్టిన...తండ్రికోపించి వెడలఁగొట్టఁగా నడవులకువచ్చి వసరుచున్నాఁడా యేమి, కాదు. కైకేయీ వరదానమోహితుఁడై తనసత్యము కాపాడుకొనఁ బొమ్మనిన వచ్చినవాఁడు, సభార్యుఁడు, సభా+ఆర్యుఁడు = సభయందుఁబూజ్యుఁడు = సభ్యుఁడనుట. నృపపాంసనుఁడు = నరులను పాలించు

వాఁడు నృపుఁడు — నృప+ప-నృపాన్ +పాతీతి నృపపః. రాజులను బాలించు వాఁడు నృపపుఁడు. వాఁడే అంసనుఁడు=అనఁగా నాశముసేయువాఁడు. అంసన మాఘాత ఇతిధాతుః-అనఁగా శత్రువుల నాశముచేయువాఁడు. అట్టివాఁడు కుశీలుఁడు; కుశీలుఁడగునా యేమి కాఁడనుట కాక్వర్థకము-కిమ్మనునది అధ్యాహారము. కావున సద్వృత్తుఁడే. తీక్ష్ణుఁడు అనఁగాఁ గార్యములం దలసుఁడు గాఁడనుట. అట్టివాఁడు అనయుండ. అనయుఁడా? కాఁడనుట. జితేంద్రియుఁడు. అనయుండ+జితేంద్రియుఁడని పదచ్ఛేదము, దయా+అరహితుఁడు = దయలేనివాఁడుకాఁడు, కావున భూత+ఆహిత+లోలాత్ముఁడు=భూతములకుఁ బూర్ణముగ హితముచేయుట యందాసక్తిగలవాఁడు. అట్టివీతధర్ముఁడు, వీతధర్ముఁడు = వీత+విరుద్ధ+ధర్ముడు. వీతధర్ముఁడు, మధ్యమపదలోపిసమాసము, విరుద్ధధర్మముల వదలినవాఁడు. వీఱిఁడి = అవివేకియా యేమి కాఁడు.

యథాశ్రుతమగు నర్థము స్పష్టమే-వాస్తవముగ సనత్కుమారవచనములచే విష్ణురూపుఁడగు శ్రీరామునిచేఁ జంపఁబడి యాయనలోకముఁ బొందుటకు నాయనభార్యను దెచ్చెదను. ద్రోహ బుద్ధిచేఁగాదు. తీర్థీయము. సనత్కుమారవచనములని చెప్పఁబడిన శ్లోకములు ప్రక్షిప్తము లని మున్నే చెప్పఁబడెను. కావున వీరి వాస్తవార్థ మనునదియు నిరాధారమే. అదియునుగాక యసందర్భపు గాకువులచే మధ్యమపదలోపులచే, లక్షణావృత్తిచే నర్థముచెప్పుమార్గము ప్రశస్తమైనదికాదు. శ్రుతార్థము స్పష్టముగాలేక సందేహముకలిగించెనేని యపుడు లక్షణావృత్తి, మధ్యమపదలోపి, కాకువు గ్రహింపవచ్చునుగాని యిచ్చవచ్చినటులెల్ల గ్రహింపరాదు. గంగలో గొల్లపల్లె యున్నది అనుచో గంగనీళ్ళలో పల్లెయుండఁజాలదు కావున గంగాతీరమం దని లక్షణచే గ్రహింపవచ్చును. ౫౭౦ వ పద్యమున కాకుస్వరమున్నది. బియ్యపురామయ్య వచ్చినాఁడు. అన్నప్పుడు బియ్యమమ్మురామయ్యయో కొనురామయ్యయో ఆయింటిపేరుగల రామయ్యయో యను సందేహము వచ్చినపుడు బియ్యము+అమ్మ+రామయ్య యని మధ్యమపదలోపి సమాసముచెప్పవచ్చును. అట్టివ్యవస్థలేదేని ప్రతివాక్యమునకు విరుద్ధార్థము కల్పింపవచ్చును. ఒకస్త్రీని మఱియొకఁడు నీమగఁడనియడిగిన మధ్యమపదలోపి సమాసమని నీ అంకుమగఁడని వాస్తవప్రశ్న యనవచ్చును. రాముఁడా మహాధర్మాత్ముఁడే యనిన కాకువుచే ధర్మాత్ముఁడుకాఁడని యర్థము చేయవచ్చును. ఎల్లయ్యకొడుకు పుల్లయ్య యన్నప్పుడు ఎల్లయ్య కౌరసుఁడు పుల్లయ్య యని యర్థముకాదు. ఎల్లయ్య యింటిలోనో పొరుగింటిలోనో యుండిన వానికొడుకు పుల్లయ్య యని లక్షణావృత్తిచేఁ జెప్పవచ్చును. ఇట్టియర్థములు శాస్త్ర మంగీకరింపదు. కావున వీనిపై నాధారపడిన మతములు వాదములు నంగీకార్యములుకావు. వీరు

'వాస్తవార్థమేమనఁగా' యనివ్రాసిరికదా. వీరియభిప్రాయప్రకారము వాస్తవము + కాని + అర్థము = వాస్తవార్థమని మధ్యమపదలోపి చెప్పవచ్చునుగదా. వాస్తవార్థమేమి? ఇది వాస్తవార్థ మనుకొంటివాయేమి కాదు సుమా. అని కాకువు. వాస్తవార్థము అనఁగా యథార్థమైన యర్థముగాదు. దానికి దూరమైనదని యర్థము అని లక్షణచేఁ జెప్పవచ్చును గదా. కావున వీరు వ్రాసినది య వాస్తవార్థమని వీరి మార్గ మను సరించియే చెప్పవచ్చును. కావున నీ వ్యాఖ్యార్థముయథార్థముగాదు. ఆ యర్థమును సాధించిన మార్గము ప్రశస్తమైనది కాదు. రావణుఁడు భక్తుఁడను వీరి యభిప్రాయము సరిగాదని తిలక వ్యాఖ్యాతయు వ్రాసియున్నాఁడు.

ప్రస్తుతమునఁ గొందఱు రావణభక్తులు-రావణుఁడు పరమభక్తుఁడు సాధువనియు రాముఁడే దోషియనియు వాదించుటచే ఆ వాదదౌర్బల్యము, నిరాకరత్వము తెలుప నిది వ్రాయవలసి వచ్చెను. రావణువంటి రామభక్తులు, శూర్పణఖవంటి సీతాభక్తులు బయలుదేఱిన నిఁక మన దేశమున కేమికొఱఁత ?

## రావణుఁడు మారీచుని దోడుపడ వేఁడుట.

ఉ. కావున వానిభార్య సుర♦కాంతనుబోనిసురూప జానకి౯
నే వెసఁ దేరఁగాఁ జనెద ♦ నీవు సహాయుఁడు గమ్ము, తమ్ములు౯
నీవును నాకు బాసటగ ♦ నిర్జరకోటుల నైన నాజిలో
భావన సేయుదు౯ దృణము♦భంగి నిజం బిది రాక్షసోత్తమా. ౧౫౦

సురకాంతనుబోని = దేవతాస్త్రీతో సమానురాలైన.

తా. రాముఁ డిట్టివాఁ డగుటచే దేవతాస్త్రీతో సమానమైన సౌందర్యముగల యతని భార్యను జానకిని నేను తెచ్చుటకు శీఘ్రముగాఁ బోవుచున్నాను. నీవు నాకుఁ దోడురావలయును. నా తమ్ములు నీవు నాకు సహాయులైయుండ యుద్ధములో దేవతలనైన గడ్డిపోఁచవలెఁ జూతును. ఇది నా నిశ్చయము.

ఉ. కావున నాకుఁ దోడ్పడుము ♦ కానను నీకు సముండు వీర్యసం
భావన నేని దర్పసదు♦పాయములందున యేని నాజిలో
నీ వొనరింప లేనియవి ♦ నిస్తులమాయలు లేవు లోకమం
దీవిషయం బెఱింగి కద ♦ యే నిటు వచ్చితి నిన్నుఁ జూడఁగన్. ౧౫౧

తోడ్పడుము=సాహాయ్యముచేయుము, దర్పసదుపాయములందునయేని = బలగర్వమునందు మంచియుపాయములు చేయుటయందు.

తా. ఇది నా యభిప్రాయము కావున నీవు నాకు సహాయుఁడవు కమ్ము. శౌర్యమందు బలమందు మంచియుపాయము చేయుటయందు నీకు సమానులు

లేరు. యుద్ధమందు నీవు పన్నలేని మాయలులేవు. నీవిట్టి వాఁడవని తెలిసికదా నిన్నుఁ జూడ నింతదూరమువచ్చితిని.

ఉ. ఏ నొనరింపఁగాఁ దగిన ♦ దెయ్యది యంటివ యేని విన్ము జాం
బూనదచిత్రబిందుమృగ♦మూర్తి ధరించి చరింప రాముఁడున్
జానకి యున్న యాశ్రమము♦చక్కటి, భ్రాతలఁ బంపుఁ బట్టఁగా
మానిని, రాహు చంద్రుప్రభ ♦ మాడ్కి హరించెద నొంటి మైథిలిన్. ౫౭౨

జాంబూనద = బంగారువంటి, చిత్ర = ఆశ్చర్యకర్యములైన, బిందు = చుక్కలుగల, మృగమూర్తి = జింకయాకారము, చక్కటిన్ = ప్రదేశమున.

తా. నేనేమి సాహాయ్యముచేయుదు ననెదవేమో నీవు చేయవలసిన పని చెప్పెద వినుము. బంగారు వన్నె విచిత్రపుఁ జుక్కలుగల జింకవై రాముఁడు సీత యున్న యాశ్రమప్రదేశమందు సంచరించుచుండుము. నిన్నుఁ బట్టుటకై యామె రామలక్ష్మణులఁ బంపును. అప్పుడు నేను రాహువు చంద్రకాంతిని హరించినట్టు లొంటరిగానుండు జానకిని హరించెదను.

రాహువు చంద్రకాంతిని హరించిన ట్లనుటచే రాహువు కొంచెము కాలము లోకమున కాకాంతి గానరాకుండఁజేయునట్లు రావణుఁడు కొంతకాలము సీత లోకమునకుఁ గానరాకుండఁ జేయఁగలఁడు. రాహువు చంద్రబింబము నేమియుఁ జేయఁ జాలనట్లు రావణుఁడును సీతనేమియుఁజేయఁ జాలఁడని భావము. లోకములోని చీఁకటి చంద్రకాంతి తగులఁగానే యది స్వరూపము లేకపోవును. అట్టులే సీతా సాన్నిధ్యము దొరకినవారు తమ యజ్ఞానముఁ బోఁగొట్టుకొని బాగుపడుదురు. తమోగ్రహమైన రాహువు అట్లు తన చీఁకటి పోఁగొట్టుకొన లేకయున్నాఁడు. అట్టులే రావణుఁడు సీతాసాన్నిధ్యము లభించియుఁ దనయజ్ఞానముఁ బోఁగొట్టుకొనక పోవును.

రాహ్వాదులకు వు లోపంబువైకల్పికంబు. ఉ. రాహు-రాహువు, బాహు-బాహువు, సాధు - సాధువు, శరత్తు - శరత్తువు- కావున ఇందు రాహు అనియే ప్రయోగింపఁబడెను.

క. జాయావియోగకర్శితుఁ, డై యడలెడిరామచంద్రు ♦ నంత వధింతున్
హాయిగ సుఖయింతును మఱి, మాయయ్యా నలుపు మింత♦మాత్రం బనినన్.

జాయావియోగకర్శితుఁడు = భార్య నెడఁబాయుటచే నాదుఃఖమున శుష్కించినవాఁడు, అడలెడి = దుఃఖించెడి, మాయయ్యా = మాతండ్రీ, ఇది కార్య సాధనమునకై ప్రార్థన.

తా. భార్య లేకపోవుటచేఁ గృశించి దుఃఖించురామచంద్రుని నంతట

వధించి సుఖముగా నిర్విచారముగ నుందును. మాతండ్రీ యింతమాత్రము సాహాయ్యము చేయుము.

శా. మారీచుండును రావణుం డనినరా♦మక్ష్మాధవోదంతముం
దీర న్విన్నను గుండె ఝల్లు మనఁగా♦ నిశ్చేష్టుఁ డై కంపియై
నో రెండం గనుచూపు నిట్రగొన నెం♦డున్వాతెఱల్ నాకుచున్
ధీరత్వం బఱి ప్రేతకల్పుఁ డయి దై♦తేయాధిపుం జూచుచున్. ౫౭౪

రామ+క్ష్మాధవ+ఉదంతమున్ = రామచంద్రరాజు వృత్తాంతము, తీరన్ = సాంతముగ, నిశ్చేష్టుఁడై = చేష్టలుడిగినవాఁడై, కంపియై = వణఁకుగలవాఁడై, నిట్రగొనన్ = తెప్పపాటు లేకయుండఁగా, వాతెఱల్ = పెదవులు వాయి+తెఱ= వాతెఱ, అఱి = క్షయించి, ప్రేతకల్పుఁడయి = శవమునకుఁ గొంచెము తక్కువగా సమానుఁడయి, దైతేయాధిపున్ = రావణుని.

తా. రావణుఁడు చెప్పిన రామచంద్రమహారాజు వృత్తాంతమును బూర్ణముగా మారీచుఁడు విని నా ప్రాణమునకే ముప్పువచ్చెఁగదా యని గుండెలు ఝల్లన భయపడి తొలుత నిశ్చేష్టుఁడై యుండి తెప్పిరిలి వణకుఁచు నోట తడిలేకపోఁగా నిలువు చూపులఁ జూచుచు పెదవులు నాకుచు ధైర్యముచెడఁగా శవముతో సమానుఁడయి రావణుని జూచుచు.

క. రామపరాక్రమవిజ్ఞుం, డౌమానవభోజి భీతి♦హతచిత్త సు
త్రామారికిఁ దనకును గడు, సేమముగా నిట్లు పలికెఁ♦జేమోడుపుతోన్. ౫౭౫

విజ్ఞుండు = చక్కఁగాఁ దెలిసినవాఁడు, మానవభోజి = మనుష్యులను భుజించువాఁడు - రాక్షసుఁడు, భీతిహతచిత్తతన్ = భయముచేఁ గొట్టఁబడిన మనస్సుతో, సుత్రామారికి = ఇంద్రునకు విరోధియగు రావణునకు, చేమోడుపుతోన్ = అంజలిపూర్వకముగ.

తా. రామచంద్రమూర్తి శౌర్యవిధ మనుభవముచే బాగుగఁ దెలిసికొనినవాఁడగు మారీచుఁడు భయపడి రెండుచేతులు జోడించి రావణునకుఁ దనకు క్షేమకరమైనవిధముగ నిట్లనియె.

## ౩౭-వ సర్గము. మారీచుఁడు రావణునకు శ్రీరాముని బలపరాక్రమములు దెల్పుట.

క. అనయముప్రియవాక్యంబుల, ననియెడిజను లెందు సులభు♦ లప్రియ మయ్యున్
గనఁ బథ్యమైనసూక్తిని, ననువాఁడును వినెడివాఁడు♦ నరుదసురేంద్రా. ౫౭౬

అనయము = ఎల్లప్పుడు, ప్రియవాక్యంబులు = ముఖప్రీతిమాటలు, పథ్యము = హితము, సూక్తిని = మంచిమాటను.

తా. రావణా! లోకమునందు స్వార్థలాభపరులై వినుట కింపైన యిచ్చకములాడువారు సులభముగా లభింతురు. వారిని వెదకి తెచ్చుకొనవలసిన శ్రమముతోఁ బనిలేదు. ఆపత్కాలమందైనను వినుటకుఁ గటువై ప్రియముగాకున్నను హితమై కాలాంతరమున మేలుగలిగించు మాటలను జెప్పువాఁడును వినువాఁడును దుర్లభుఁడు. ఒకవేళ యెదుటివాని మేలుగోరి చెప్పువాఁడు దొరకినను వినెడివాఁడు దొరకఁడు. కావున నేను జెప్పఁబోవుమాటలు వినుటకు నీకుఁ బ్రియములు గాకున్నను గాలాంతరమున మే లిచ్చునవి యగును కావున వాని నుపేక్షింపకుము.

ఉ. అమహనీయవిక్రము గు♦ణాధికు రాముని బాశహస్తసు
త్రామసమాను నీ కెఱుఁగ ♦ రాదు చలాత్ముఁడ! వేగు లేమిచే
రాముని కాగ్రహంబు మది ♦ రాఁజక యుండెడిఁగాక యీజగ
త్స్తోమ మరాక్షసం బగుచుఁ ♦ దూలక యుండెడిఁగాక నాయనా. ౫౭౭

పాశహస్త = వరుణునితోను, సుత్రామ = ఇంద్రునితోను సమానుః = సాటియైనవానిని, చలాత్ముఁడ = చపలచిత్తుఁడ-తాను జెప్పినది విని యంగీకరించి పోయి వెంటనేమరల వచ్చుటచే చపలచిత్తుఁడు. వేగులేమిచేః = చారులులేని కారణమున, జగత్ + స్తోమము = లోకసమూహము, అరాక్షసంబగుచు = రాక్షసశూన్యమై, తూలక = జీవకోటినుండి తొలఁగక.

తా. రావణా! రామచంద్రునితో విరోధము వలదని మొన్న నేను జెప్పితిని. సరియని యంగీకరించి పోయితివి. ఇంతలో మనస్సు మార్చుకొని మరల వచ్చితివి. ఇంతటి చపలచిత్తుఁడవు నేనేమి చెప్పిన నీవేమి వినఁగలవు. లాభపడఁగలవు. అయినను నీమేలు గోరువాఁడనగుటచే నీకు పథ్యములయిన మాటలనే చెప్పెదను. నీకా లోకములో నెక్కడెక్కడ నేమేమి జరుగుచున్నవో వెంట వెంటఁ దెలియఁ జెప్పుటకు వేగులవాండ్రు లేరు. ఆకారణముచే గొప్పపరాక్రమముగలవాఁడు సుగుణసంపత్తిచే నధికుఁడు వరుణునితో నింద్రునితో బలమున సమానుఁడునగు రామునివృత్తాంతము నీవెఱుఁగవు. నీవు రామచంద్రునకుఁ గోపమువచ్చు కార్యములు చేయకుము. ఆయనకుఁ గోపమువచ్చెనా లోకమున రాక్షసజాతియని పేరు కూడ నుండదు.

సీ. నీప్రాణములు నిట్ట♦నిల్ువనఁ దీయఁగ, జన్మమెత్తదు గదా♦జనకతనయ
ధారిణిసుతనిమి♦త్తంబుగ నాకేమి, కలుగ కుండెడుఁగాక ♦ కష్టములును
గామవృత్తుఁడ వీవు ♦ గావుట నాథుండు, గాసిగాకున్నె లం♦కాపురంబు
స్వచ్ఛందవృత్తిని ♦ జరియించు నినుఁ గూడి, పాడు గా కుందురా♦బంధుజనులు

ఆ. నిన్నుఁబోఁటికుమతి ♦ నిష్ఠురశీలుండు, పాపమంత్రితుండు ♦ ప్రభుతఁ గాంచి
తన్ను రాష్ట్రమెల్లఁ♦దనవారితోఁగూడ, మూలముట్టు చెఱుచు♦మూర్ఖుఁడగుచు.

నిట్టనిల్వనక = నిలఁబడినవాఁడు నిలువఁబడినట్లై, కామవృత్తుఁడవు= కామము స్వభావముగాఁగలవాఁడవు. కాపురుక = అగుటచేత, స్వచ్ఛందవృత్తిని = ఇష్టమువచ్చినట్లు, పాపమంత్రితుండు = పాపపుటాలోచన గలవాఁడు జన్మమెత్తదు గదా యనుచోఁగాకువు. జన్మమెత్తినట్లేయున్నది. లేకున్న నీకీబుద్ధిపుట్ట దనిభావము. ఆమె యట్టి దగునో కాదో నీవు చేయుకార్యముచే నిర్ధారింపవలసియున్నది.

తా. లోకమున సాధారణముగాఁ బ్రాణులు నేలపైఁబడి ప్రాణములు విడుతురు. నీకంతటి యవకాశముకూడ నీయక నిలువఁబడిన వాని ప్రాణములు నిలిచియుండఁగనే తీయుటకై సీతాదేవి పుట్టినదా యేమి? నీగతి యెట్టులైన నగును గాక- చేసెడివాఁడ వనుభవించెదవు. ఆమె నెపమున నాకేమి కీడుకలుగకుండ నిమ్ము- కామమే శీలముగాఁగల నీవు రాజగుటచే లంకాపురము కష్టములపాలుగాకుండునా? కానే యగును. మనస్సువచ్చినట్లెల్ల పోకలుపోవు నీతోడబంధువులందఱు నాశమైపోకయుందురా? నీవంటి చెడుబుద్ధిగలవాఁడు, కఠినస్వభావముగలవాఁడు, పాపపుటాలోచనలుగలవాఁడు, ప్రభువై చెప్పినను దెలిసికొలేనివాఁడు స్వాపరాధమునఁ దాను జెడుటయేగాక రాజ్యమునందలి ప్రజలను జెఱుచును. ఇతరులతోఁ బోవునా యనిన తనబంధువులనుగూడ సమూలముగఁ జెఱుచును.

ఉ. కాఁడయ కాఁడు రాముఁ డిల ♦ క్షత్రియపాంసనుఁడుం గుశీలుఁడుక
గాఁడయ ధర్మగుణ♦కాండవిహీనుఁడు గాఁడు తీక్ష్ణుఁడుక
గాఁడు సమస్తభూతహిత♦కార్యవిదూరుఁడు గాఁడు కానకుక
రాఁడయ తండ్రి నెట్టినను ♦ రావణ! నీ కెవ రట్లు చెప్పిరో. ౯౭౭

తా. రావణా! రామచంద్రమూర్తియందు నీవారోపించిన దోషములం దొకటియైన నాయనయందు లేదు. ఆయన నీచక్షత్రియుఁడు కాఁడు. కుత్సితస్వభావము గలవాఁడు కాఁడు. లోభిగాఁడు. ధర్మగుణ సమూహము లేనివాఁడు కాఁడు. తీక్ష్ణుఁడు కాఁడు. భూతములకు నహితము చేయువాఁడు కాఁడయ్యా కాఁడు. తండ్రి కోపించి నెట్టఁగా నడవికి వచ్చినవాఁడు కాఁడు. ఎవరు నీకావిధముగఁ జెప్పిరో కాని యన్నియు నసత్యములే.

క. తనజనకుఁడు కైకయిచే, తను వంచితుఁ డగుట గాంచి ♦ తండ్రిని బుజువాదిని జేయఁగైక ప్రీతికి, జనకుని ప్రీతికిని వనికిఁ ♦ జనెఁ జ్యుతసుఖుఁడై. ౯౭౦.

తా. తన తండ్రి కైకేయిచే వంచింపఁబడినాఁడని తెలిసి యాయనను సత్య

వాదిని జేయుటకై, కైకకుఁ బ్రీతి కలిగించుటకు సర్వసౌఖ్యములు తానై నిండు మనస్సుతో వదలి యడవులకుఁ బోయెను.

క. విను రఘురాముఁడు కర్కశుఁ, డును గాఁడు కళావిహీనుఁ♦డుం గాఁ డవశుం
డును గాఁడు నిక్కమింతయు, ననృతము దుశ్శ్రుతము లేల♦యాడెదు తండ్రీ. ౫౯౧

కర్కశుఁడు = కఠినుఁడు, కళావిహీనుఁడు = విద్యావిహీనుఁడు, అవశుఁడు = పరతంత్రుఁడై నీవలె నొకరు చెప్పినట్లు వినువాఁడు గాఁడు. నిక్కము = నిజము, అనృతము = అసత్యము-లేనిది కల్పించి చెప్పుట, దుశ్శ్రుతము = విపరీతముగ వినినది, ఉన్నదానికి విరుద్ధముగఁ జెప్పుట.

తా. రామచంద్రమూర్తి కఠినచిత్తుఁడు గాఁడు. విద్య లేనివాఁడు గాఁడు. ఇతరుల యిష్టముప్రకారము వర్తించువాఁడు కాఁడు. ఇది నిజము - ఏల లేనివి కల్పించి యున్నవి తాఱుమాఱుగఁ జెప్పెదవు నాయనా.

ఉ. రాముఁడు ధర్మమూర్తి యప♦రాజితసత్యపరాక్రముండు, సు
త్రాముఁడు దేవతాతతికి ♦ రాణ విభుండు సమస్త మాజగ
త్స్తోమముపాలికిన్, సుమతి ♦ సూర్యునికాంతి హరించునట్లు స్వో
ద్దామసుశీలగుప్త వసు♦ధాసుతనా హరియింపఁ జూడఁగన్? ౫౯౨

ఇఁక రామచంద్రమూర్తినిగుఱించి వాస్తవమును జెప్పెదను విను మనుచున్నాఁడు. అపరాజిత = ఓటమి లేని-సత్యపరాక్రముఁడు = సత్యమైన శౌర్యము గలవాఁడు. యుద్ధమునందు నోడిపోవుట యనునది లేదు. ధర్మమార్గమందు నిలిచియే గెలుచును. సత్యపరాక్రముఁడు = సత్యమే పరాక్రమముగాఁ గలవాఁడు, ఆయనసత్యమే యెట్టివారినైన నోడించి లోపడఁజేయును. సుత్రాముఁడు = ఇంద్రుఁడు, సుమతి = మంచిమనస్సుగలవాఁడు, స్వోద్దామసుశీలగుప్తన్ — స్వ = తనయొక్క, ఉద్దామ = గొప్పదైన, సుశీల = పాతివ్రత్యముచే, గుప్త = రక్షింపఁబడునది, వసుధాసుతనా = సీతనా.

తా. రామచంద్రుఁడు ఆకారముగొన్న ధర్మము. యుద్ధమునందుఁ బరాజయములేనివాఁడు. సత్యమైన శౌర్యము గలవాఁడు. కావున మోసపు యుద్ధము లాయన చేయఁడు. దేవతలకు నింద్రుఁ డెట్లో సమస్తజగముల కాయన యా విధముగ ప్రభువు. మంచిమనస్సుగలవాఁడు. సూర్యునికాంతిని హరింప యత్నించునట్టు లట్టి రామునినుండి సీతనా వేఱుపఱుపఁ జూచెదవు! ఇది నీకు సాధ్యమా? రామచంద్రమూర్తిచే నామె రక్షింపఁబడుచున్నది. రామునినుండి వేఱుగఁ దీసిన రక్షకుఁడు లేక నీవు చెప్పినట్లు విను నని తలఁచితివి. ఆమె తన పాతివ్రత్యముచేఁ దన్నుఁ దాను గాపాడుకొనుచున్నది. తన రక్షాభార మితరుల

యందు వైచినదికాదు. కావున నీవు హరించినను నీకు లోపము నని తలంపకుము
తమ్ముఁ దాము కాపాడుకొనలేనివారుగదా పరరక్షణము కోరవలె. కావున
యుద్దేశము కొనసాగదు.

క. శరకీలామాలికలన్, దరిఁ జేరఁగ రాని దాని ♦ ధనురింధనసం
భరితంబు సంప్రదీప్తము, వరరాఘవవహ్నిఁ బడఁగఁ ♦ బాఱఁగఁ దగునే. ౫౦

శరకీలామాలికలన్ = బాణము లను జ్వాలలవరుసలచే, దరిన్ = సమీప
మందు, ధనురింధనసంభరితంబు = విల్లనెడి కట్టెలచే భరింపఁ బడినది, సంప్రదీప్త
ము = భగభగ మండుచుండునది, వరరాఘవవహ్ని = శ్రేష్ఠమైన రామచంద్రు
డను నగ్ని.

తా. సీతాదేవిని నీవు హరింపఁ జూచెదవు. ఆమెసమీపమునకు నీవు పో
గలిగినఁ గదా హరించుట. ఆమెను రాముఁ డను నగ్నిహోత్రము చుట్టుకొ
రక్షించుచున్నది. ఆ యగ్ని యెట్టి దనెదవా? దానికి బాణములే జ్వాలలు. దూర
మున నుండఁగానే దహించును. ఇఁక సమీపమునకుఁ బోయి బ్రదుకు టెట్లు?
యగ్నిని ప్రజ్వలింపఁజేయు సమిధ ధనస్సు. ఇట్టి యగ్ని నివురుకప్పియున్న దని తల
చెదవేమో? అది భగభగ మండుచునే యున్నది. ఇట్టి యగ్నియందు మిడుత
వలెఁ బోయి చావ నేల కోరెదవు?

శా. చాపవ్యాదితదీప్తవక్త్రుని మహా♦స్త్రజ్వాలు సామర్షునిన్
జాపోద్దీపితపాశధారిని విప♦క్షవ్రాతసంహారు సీ
తాపద్మాయతలోచనాహృదయనా♦థ శ్రాద్ధదేవున్ సుఖ
వ్యాపారాసువు లెల్లవీడి చన నే♦లా తంద్రి డాయన్ వెసన్. ౫౧

చాపవ్యాదితదీప్తవక్త్రునిన్ = విల్లనెడి తెఱవఁబడినదియు మండునదియు
నగు నోరుగలవానిని, మహాస్త్రజ్వాలున్ = గొప్ప యస్త్రము లనెడి శిఖలు గల
వానిని, సామర్షునిన్ = సీతను జెనకిన కారణమునఁ గోపముతోఁ గూడిన వానిని,
చాపోద్దీపిత పాశహస్తునిన్ = విల్లనెడి ప్రకాశించెడి పాశమును చేతియందుఁ గల
వానిని, విపక్షవ్రాత సంహారున్ = శత్రుసమూహములను సంహరించువానిని,
సీతాపద్మాయతలోచనా హృదయనాథ శ్రాద్ధదేవున్ = పద్మమువలె విశాల
మైన కన్నులుగల సీతకు హృదయేశ్వరుఁ డనెడి యముని, సుఖవ్యాపారాసువులు=
సౌఖ్యము, రాజ్యమేలుట, ప్రాణములు-నాలుగవపాదంబున ప్లుతయతి. భీతి-శోక-
తర్క-గీత-దూరాహ్వాన। సంశయార్థములను జరగుఁబ్లుతము-ఈ యర్థములందుఁ
బ్లుతముగలదు-కాకుస్వరమనఁగా స్వరవికారము (స్వరము మాఱిపోవుట).

తా. తండ్రీ! విల్లనెడి తెఱచిన మండుచున్న నోరుగలవానిని, గొప్ప యస్త్రము లనెడి శిఖలు గలవానిని, సీతను నీవు చెనకుటచేఁ గోపించినవానిని, చాప మనెడి ప్రకాశించు పాశమును ధరించినవానిని, శత్రుసమూహముల సంహరించు వానిని, సీతాపతి యనెడి యముని సమీపించుటకు సుఖము రాజ్యకార్యము ప్రాణములు అన్నియు వదలి నాయనా యేల పోయెదవు?

క. జనకాత్మజసంబంధం,బున రాముం డప్రమేయ♦పురుతేజుం డ
య్యెను నట్టిరాముచాపము, తనుఁ గావఁగ నున్నసీతఁ♦దరమా తేరన్. ౪౮౪

తా. సీతాదేవిసంబంధమునఁ జేసి రాముఁడు ఛేదింపరాని గొప్ప తేజము కలవాఁ డయ్యెను. అటువంటి రాముని విల్లు తన్ను రక్షింపఁగానున్న సీతను దెచ్చుటకు నీకు సాధ్యమా.

జనకాత్మజ = జనకరాజు కూఁతురు. 'ఇదం బ్రాహ్మ మిదం క్షాత్రం శాపాదపి శరాదపి' యని యోగబలముచే శపింపను గలఁడు విల్లుపట్టి యుద్ధముచేసి శత్రువులఁ జంపను గలఁడు. అట్టివాని కూఁతురు అని సీతకు వంశమువలన వచ్చిన మాహాత్మ్యము చెప్పఁబడెను.

"శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే" యన్నట్లు సీతాసంబంధముచేత రాము నంతటివాఁడు విశేషతేజోవంతుఁ డయ్యెను అనుటచే సీతాదేవిమాహాత్మ్యము చెప్పఁబడెను.

రాముచాపము తనుఁ గావఁగన్ = సీతాదేవివలన వచ్చిన మాహాత్మ్యమే కాని రామునకు నైజమాహాత్మ్యము లేదా యందువేమో. అంతటి మహిమగల సీతను రామునివిల్లు గాచుచున్నది. రామసంబంధమున నచేతనమైన వింటికే యంతటి మహాత్ములైన సీతను రక్షించుశక్తి యుండిన నిఁక రామునం దెంత శక్తియుండవలెను? రామచంద్రమూర్తి లవకాలమాత్రము చేతఁబట్టుటచే దర్భపోఁచ బ్రహ్మాస్త్రమై బ్రహ్మరుద్రేంద్రాదుల కభేద్యముకాఁగాఁ జిరకాలము చేతఁబట్టినవింటియం దెంత మహిమయుండదు?—నిజవంశమాహాత్మ్యము రామునివంటివానికిఁ దేజము కలిగించు మాహాత్మ్యముగల సీతను కోదండధరుఁడైన రామచంద్రమూర్తి రక్షించుచుండఁగాఁ దీసికొనివచ్చుటకు నీకు సాధ్యమా?

జనకాత్మజసంబంధమున రాముం డప్రమేయ పురుతేజుం డనుటచే = రాము నందు లేని తేజస్సును సీతాదేవి రామునందుఁ బ్రవేశపెట్టె నని యర్థముకాదు. రామతేజస్సే (శక్తియే) సీత కావునఁ బూర్వము లేనిది క్రొత్త దొకటి దేహమునఁ బ్రవేశపెట్టఁబడెననుట సరిగాదు. ౧౧౨-వ పద్యంబున సీతాదేవి చెప్పినట్లు సీతా సన్నిధిని రాముని తేజస్సు ఆమె లేనప్పటికంటె నెక్కువగా విజృంభించును. ఇది

వారివారి యనుభవమునందే చూడవచ్చును. ఎంత చచ్చువిధవనాగన్న యైనను స్త్రీలయెదుట లేనిపౌరుషము నటించును. ఆఁడువారి దృష్టికిఁ దా నసమర్థుఁడుగాఁ గానరాఁగూడ దని వాని యభిప్రాయము.

క. సింహోరస్కుం డగునర,సింహునిపద్మాక్షి సత్య♦శీలాఢ్య వ్యపే
తాంహశ్చరితను రాక్షస,సింహా! డాయంగఁ బోకు ♦ చెప్పితి హితమున్.

సింహోరస్కునిక్ = సింహముఱొమ్మువలె విశాల మగుఱొమ్ముగలవానిని, నరసింహుని పద్మాక్షిక్ = పురుషశ్రేష్ఠుఁడగు రామచంద్రునిభార్యను, సత్యశీలాఢ్య = సత్యము పాతివ్రత్యము అను సంపదగలది. లేక యథార్థ పాతివ్రత్య సంపద గలది. వ్యపేత + అంహస్ + చరితను = పాపపు నడవడి లేనిదానిని, రాక్షససింహా = రాక్షసులందు శ్రేష్ఠుఁడా, డాయంగఁ బోకుము = సమీపింపకుము.

తా. సింహముఱొమ్మువంటి విశాలవక్షస్థలముగలవాఁడును, పురుషశ్రేష్ఠుఁడు నగు శ్రీరాముని భార్యను, సత్యశీలసంపన్నను, పాపచరిత్రమేమియు లేనిదానిని సమీపింపకుము. నీమేలుగోరి చెప్పుచున్నాను. రావణా! నీవు రాక్షససింహుఁడవు. ఆయన నరసింహుఁడు. హిరణ్యకశిపునంతటివాఁడు నరసింహుని బారిఁబడి యేమయ్యెనో యెఱుఁగవా? అట్టివాఁడు రక్షించుదానిని, అంతియగాక సత్యము పాతివ్రత్యము రక్షించుదానిని, కొంచెమైనను బాప మనునది లేనిదానిని నీవు సమీపింపకుము. నీవు రామునకుఁ గోపమువచ్చినను జెడుదువు, సీతకుఁ గోపమువచ్చినను జెడుదువు. ఇఁక నిరువురకుఁ గోపమువచ్చిన నీ గతియేమి? ఆలోచించి యాప్రక్కఁబోకుము.

క. విను ప్రాణముకంటెను రా,మునకుం బ్రియహితను సీత ♦ మోహముచేతన్
వనవహ్నిశిఖను బట్టఁగఁ, జనుపోలిక నిగ్రహింపఁ♦జనకుము శుభ మా. ౨౦

తా. సీతయనఁగా నేమనుకొంటివో – రామచంద్రమూర్తి యామెను దన ప్రాణముకంటెను బ్రియమైనదానినిగాను హితమైనదానినిగానురక్షించుచున్నాఁడు. అట్టి సీతను నీ వజ్ఞానివై వలచి గ్రహింపఁదలఁచుట కాఱుచిచ్చు శిఖను బట్టుకొనఁ బోవుటే. నీ ప్రయత్నము నీకు మరణాంతక మగునుగాని మానదు. అట్లు పోకుండిన నీకు క్షేమముగలదు. వారై నీమీఁదికి రారు. కావున నీకు భయములేదు.

క. కొనసాగనియాకార్యము, పనిపూని సురారి? యేమి♦ఫలము గుడిచెదో
విను మతనికంటఁ బడితే, నని నంతటఁ దీఱు నీదు♦నాయుష్యంబున్. ౨౧

పడితేన్ = పడితివేని.

తా. నీవనుకొన్న కార్యము కొనసాగునదికాదు. అట్టి యసాధ్యము

సాపాయమునైన పనికిఁ బూని నీవేమి లాభ మనుభవించెదవో నాకుఁ దెలియలేదు. సీతను హరించుమాట యటుండనీ. ఆ రాముని కన్నులకు నీవు కనఁబడితివా నీ యాయుస్సు ఆ గడియతోఁ దీఱిన దని తలంపుము.

ఉ. రామునితో విరోధమును ♦ రాక్షసనాయక! కొంటి వేని నీ
కామితరాజ్యభోగసుఖ♦కాండముఁ బ్రాణముఁ దక్కఁ బోదు నీ
కేమియుఁ గొంతకాల మిల ♦ నింకను సౌఖ్యపడంగ నిష్టమేఁ
రాముమనంబు నొచ్చుపని ♦ రావణ చేయకు మయ్య వేఁడెదన్. ౫౮

తా. రాక్షసరాజా! రామచంద్రమూర్తితో నీవు విరోధించితివా నీ కోరికలు రాజ్యభోగములు, సుఖములు ప్రాణము వీనిలో నొకటైన నీకు మిగులదు. కాఁబట్టి నీ కింకను గొంతకాలము సుఖపడఁగోరిక యేమైన నుండెనా రామచంద్ర మూర్తిమనస్సు నొచ్చుకొను పనిచేయకుము. నిన్ను నేను బ్రార్థించెదను.

చ. చనుము పురంబు, ధర్మహిత♦సత్తము లైనవిభీషణాదులం
గనుము సభన్, మదిం దలఁచు♦కార్యమునందు గుణాగుణంబులన్
వినుము, బలాబలంబులను ♦ వెండియు స్వాన్యబలప్రమాణ మె
య్యన మది నిశ్చయింపుము, హి♦తాహిత మెంచి యొనర్పు కార్యమున్.

తా. నీవు లంకకుఁ బొమ్ము. అందు ధర్మబుద్ధి గలిగి నీమేలు గోరు విభీషణుఁడు మొదలగువారిని రహస్యముగాఁగాదు సభయందుఁ జూడుము. నీ వనుకొన్న కార్యమునందు గుణమెంతో యగుణమెంతో వారు చెప్పఁగా వినుము. దానిలో నేది బలమో యేది దుర్బలమో మఱియు నీబలమెంతో రాముని బలమెంతో నిశ్చయింపుము. ఆవల నిది మనకుమేలు ఇది కీడు అని యెంచి కార్యముచేయుము.

క. నాకుం దోఁచిన యది యిది, యాకోసలరాజపుత్రు ♦ నాహవమందున్
నీకు నెఱి గాదు డాయఁగఁ, జేకొను నాబుద్ధి నీకుఁ♦జెలఁగు శుభంబుల్. ౫౯౧

ఆహవమందున్ = యుద్ధమునందు, నెఱిగాదు = నీతిగాదు, క్రమముగాదు.

తా. నాకుఁదోఁచినది నేను జెప్పెదను. రామచంద్రుని నీవు యుద్ధరంగమున సమీపింపవలదు. నాబుద్ధి వినుము. నీకు మేలు కలుగును.

{ 3౯-వ సర్గము. మారీచుఁడు రావణుతో శ్రీరాముచేఁ దాను బడినపాట్లు దెలుపుట. }

సీ. వినవయ్య దశకంఠ ♦ విపులాతలం బెల్ల, వేయిగజంబుల♦విపులబలముఁ
దాలిచి పర్వతో♦త్తాలరూపంబున, నీలజీమూతస♦న్నిభశరీర

కాంతితో సంతప్త♦కాంచనకుండల,ధారి నై పరిఘాయు♦ధంబుఁ బూని
లోకంబు భీతిమై ♦ నాకులపాటొంద, దండకాటవిఁ దపో♦ధనులమాంస

తే. ములను మెక్కుచుఁ దిరుగఁగ ♦ మునివరుండు
గాధిజుఁడు భీతి దశరథుఁ ♦ గాంచి యిపుడు
భయము ఘటియిల్లె మారీచు♦వలన నాకు
రామభద్రునిఁ బనుపవే ♦ క్రతువుఁ గావ. ౫౯-౨

విపులాతలంబు = భూప్రదేశము, విపుల = విస్తారము, పర్వతోత్తాలరూపంబునన్ = కొండవలె నెత్తైనయాకారముగలిగి, నీలజీమూతసన్నిభ = నల్లనిమేఘముతో సమానమైన శరీరకాంతితో, సంతప్తకాంచనకుండలధారినై = పుటము వేయఁబడిన బంగారుకుండలముల ధరించినవాఁడనై, పరిఘాయుధంబు = ఇనుపకట్ల గుదియ యను ఆయుధమును, క్రతువు = యజ్ఞము.

తా. దశగ్రీవా! వినుము. నేను వేయియేనుఁగుల విస్తారబలముగలవాఁడనై పర్వతమువలె నెత్తైన యాకారము ధరించి కాఱుమొగిలువంటి దేహకాంతితో నపరంజి బంగారుకుండలములతో గుదియఁ జేతఁ బట్టుకొని నన్నుఁ జూచి భూతములన్నియు భయమున వ్యాకులపడుచుండ, మునులమాంసముఁ దినుచు భూప్రదేశమంతయుఁ దిరుగుచుండ విశ్వామిత్రముని భయపడి దశరథరాజును జూచి రాజేంద్రా! మారీచునివలన నాకు భయము సంభవించెను. నాయజ్ఞము రక్షింప రామభద్రుని బంపుమా యని వేఁడెను.

చ. అనవుడుఁ గౌశికోక్తులకు ♦ నానరపాలకుఁ డిట్లనుం దపో
ధన పసివాఁడు రాఘవుఁడు ♦ ద్వాదశవత్సరుఁ డస్త్రకౌశలం
బును గలుగండు కావునఁ జ♦మూసహితంబుగ నేన వచ్చి యా
దనుజులఁ ద్రుంచి మీకును ని♦తాంతము సంతస మారఁ జేసెదన్. ౫౯-३

కౌశికోక్తులకున్ = విశ్వామిత్రుమాటలకు, ద్వాదశవత్సరుఁడు = పండ్రెండేండ్లవాఁడు, అస్త్రకౌశలంబును = అస్త్రప్రయోగములందు నేర్పు, కలుగండు = కలిగినవాఁడుకాఁడు, చమూసహితంబుగన్ = సేనతోడ, నితాంతము = మిక్కిలి సంతసము = సంతోషము.

తా. ఆవిశ్వామిత్రుఁడు చెప్పినమాటలు విని దశరథుఁ డిట్లనియె. మునీశ్వరా! రామచంద్రుఁడు పసిబాలుఁడు. పండ్రెండేండ్లవాఁడు. అస్త్రవిద్యయందు నేర్పరిగాఁడు. కావున సేనతోడ నేనే వచ్చి యారాక్షసులఁ జంపి మీకు మిక్కిలి సంతోషము గలిగించెదను.

ఇచ్చటవిశ్వామిత్రయాగసంరక్షణకాలమునకు రామచంద్రమూర్తి పంద్రెండేండ్లవాఁ డని కంఠోక్తిగ నున్నది. కావున బాలకాండమందుఁ జెప్పిన ఊనషోడశాబ్దుఁడనుటకు పంద్రెండేండ్లవాఁడని యర్థము గ్రహించుటయే సమంజసము. ఇది రావణు బెదరించుటకై తక్కువవయస్సు చెప్పెనని తీర్థీయము. రాముని విషయమై చెప్పిన తక్కినమాటలకు భయపడని రావణుఁడు పంద్రెండేండ్లవాఁడనఁగానే భయపడు నని మారీచుఁడు తలఁచెఁగాఁబోలు. అట్లు బెదరింపఁ జెప్పెనేని మఱింత భయపెట్టుటకై యనిమిదేండ్లవాఁడనియే చెప్పియుండును. ఈవయోవిచారము మఱియొకచోటఁ జేయఁబడును.

శా. ఆమాట ల్విని కౌశికుం డనియె రా♦జా! రాముఁ డొక్కండు గా
　కామాంసాశనవర్యునిం దలపడం♦గాఁ జాలఁ డెవ్వండు, స్వ
　ర్ధామస్తోమము నీవు గాచుట ప్రసి♦ద్ధంబే కదా సైన్యముల్
　సేమం బారఁగ నుండ ని మ్మిచటనే♦ శ్రీరాముఁ గొంపోయెదన్. ౭౯-౪

మాంసాశనవర్యునిన్ = రాక్షసశ్రేష్ఠుని, తలపడంగాన్ = ఎదిరింపఁగా, స్వర్ధామస్తోమము = దేవతాసమూహమును.

తా. ఆదశరథుమాటలు విని విశ్వామిత్రుఁ డిట్లనియెను. రాజా! యారాక్షసుని నెదిరింపగలవాఁడు రాముఁడుదప్ప మఱియొకఁడులేఁడు. నీ విదివఱకు దేవతలను రక్షించుట జగత్ప్రసిద్ధమేకదా. నీసేన లచటికి వచ్చి రాక్షసులచే నిష్కారణముగఁ జావనేల? ఇందే సుఖంబుండనిమ్ము. శ్రీరాముని దీసికొనిపోయెదను.

క. బాలుం డయ్యును నాతఁడు, చాలున్ రాక్షసుల నొంప♦ సమధిక తేజో
　లాలితుఁ డగుటను నీకుం, జాలశుభంబులు ఘటిల్లు♦ మాధవచంద్రా. ౭౯-౫

తా. శ్రీరామచంద్రమూర్తి పిల్లవాఁడైనను రాక్షసులఁ జంప సమర్థుఁడు. అంతయధికమైన తేజస్సుగలవాఁడు. నీవు రామచంద్రుని నావెంటఁ బంపితివా నీకు మిక్కిలి శుభములు గలుగును.

క. అనుచున్ రామునిఁ దోడ్కొని, చని విశ్వామిత్ర మౌని♦ సంతోషమునన్
　దనయాశ్రమమున దండకఁ, బనిపూనెన్ సవమునకును♦వనదేశమునన్. ౭౯-౬

సవమునకున్ = యజ్ఞమునకు.

తా. అనిచెప్పి రామచంద్రమూర్తిని దనవెంటఁ దీసికొని సంతోషముతో దండకలోని తనయాశ్రమమునకుఁ బోయి యావనములో యజ్ఞము చేయ నారంభించెను.

ఉ. ఆయెడ రాముఁ డేకవస♦నాంచితుఁ డై, శిఖి యై, సరోజప
త్త్రాయతనేత్రుఁడై, మెఱయు♦హాటకమాలిక లీల వ్రేలఁగా
శ్రీయుతమూ_ర్తి యై, ముఖము♦చెల్వముచందముఁ జాటు చుండ లేఁ
బ్రాయము, విల్లు మీటుచును ♦ స్వద్యుతిఁ గాన వెలుంగఁ జేయుచున్. ౧౪

ఏకవసనాంచితుఁడై = ఒంటిగుడ్డగలవాఁడై, శిఖియై = శిఖ (జులుపాలు) గలవాఁడై, సరోజపత్త్రాయతనేత్రుఁడై = ఉదయమున తామరకొలనులోఁబూచిన తామర రేకులవలె విశాలములైన నేత్రములుగలవాఁడై, హాటకమాలిక = బాల్యమునధరింపఁ బులిగోళ్లు మొదలగునవి గ్రుచ్చిచేసిన బంగారుసరము, శ్రీయుతమూ_ర్తియై = లక్ష్మీదేవితోఁగూడిన యాకారము గలవాఁడై, శోభతోఁగూడిన యాకారముగలవాఁడై, ముఖము చెల్వముచందము = ముఖముయొక్క యందము యొక్క విధము=మీసకట్టులేనిముఖము, లేఁబ్రాయము = లేఁతవయస్సు, స్వద్యుతిన్ = నెమలిమెడవంటి తన దేహకాంతితో.

తా. శ్రీరాముఁ డాకాలమున బ్రహ్మచారిగావున నొంటివస్త్రము మొలకుఁ జుట్టుకొని జ్వాలలుగలిగి యుదయమునఁ దామరకొలనిలోఁ బూచిన తామరపుష్పముయొక్క విశాలము లగు రేకులవంటి కన్నులుగలవాఁడై, పులిగోళ్లు మొదలైనవి గ్రుచ్చినబంగారుతీఁగ మెడలో వ్రేలాడుచుండ, మిగుల శోభతోఁగూడిన దేహముగలవాఁడై, మీసకట్టుకూడ నేర్పడని ముఖముతీరు లేఁబ్రాయమును స్పష్టముగఁ దెలుపుచుండఁగా విల్లు రంతమ్మని మ్రోయించుచు నడవియంతయు నెమలిమెడవంటి దనదేహకాంతిచే శ్యామారుణముగాఁ బ్రకాశింపఁజేయుచు.

క. పొడతెంచు బాలచంద్రుని,వడువున శోభిల్ల లబ్ధ♦వరగర్వమునన్
గడువడిఁ జనుదెంచితి న,య్యెడకున్ మేఘాభ కాంతి♦యెసక మెసంగన్. ౧౫

పొడతెంచు = ఉదయించు, వడువునన్ = విధమున.

తా. అట్టివాఁడయ్యు నుదయించు బాలచంద్రునివలె సౌమ్యుఁడై ప్రకాశించుచుండ వరములుగల వనుగర్వముచే మేఘకాంతి యతిశయించుచుండ విసవిస నచ్చటికి వచ్చితిని.

ఉదయించు బాలచంద్రుఁ డనుటచే జన్మప్రభృతి శత్రునిరసనము సహజగుణముగాఁ గలవాఁ డని భావము. బాలచంద్రుఁ డనుటచే నుత్తరోత్తరాభివృద్ధి సూచితము. ఏకవసనాంచితుఁడనుటచేఁ గవచముకూడ తొడగలేదని భావము.

చ. ఇటు చనుదెంచునన్నుఁ గని ♦ యింతయు భ్రాంతుఁడు గాక చాపమున్
బటుగతి నెక్కుపెట్టఁ బసిబాలకుఁ డంచు నుపేక్షఁజేసి యా

జటిలుని వేదిచాయకు వె♦సం జనుచు న్ననుఁ జిమ్మె రాముఁడుర్
జటులశరంబునం బడఁగ ♦ సంద్రమునన్ శతయోజనంబులన్.   ౧౯

ఇంతయు = కొంచెమైనను, భ్రాంతుఁడు=తత్తరపడినవాఁడు, జటిలుని=జడలుధరించినవానియొక్క-మునియొక్క, వెసన్ = త్వరగా.

తా. ఇటువచ్చుచున్న నన్నుఁ జూచి రామచంద్రుఁడు కొంచెమైనను తత్తరపాటులేక విల్లెక్కు పెట్టి నిలిచియుండఁగాఁ బసిబాలుఁడు వీనితో నేమని యలక్ష్యభావముతో విశ్వామిత్రుఁడు హోమముచేయు వేదియొద్దకుఁబోఁగా నొక తీవ్రమైన బాణముచే నూఱామడదూరమున సముద్రములోఁ బడునట్లు చిమ్మెను.

క. ఊపిరితో నను విడుచుటఁ, గూపారమునందు మూర్ఛఁ ♦ గూలియు నెంతో
సేపునకుఁ దెలివిఁ గని లం,కాపురికిం జనితి తేఁడ ♦ గర్వం బూడన్.   ౨౦

కూపారమునందున్ = సముద్రమందు.

తా. చంపక నన్నుఁ బ్రాణములతో వదలినకారణమున మూర్ఛపోయి సముద్రములోఁబడియు నెంతోసేపునకు స్మృతిరాఁగా గర్వము పాసి లంకకుఁ బోయితిని.

క. బాలుఁడు నకృతాస్త్రుం డగు,గోలయె న న్నట్లు పఱచెఁ ♦ గూలిచె సైన్యం
బాలమునకు నివు డెత్తిన, నేలా వచియింప రాక్ష♦సేశ్వర! ఫలమున్.   ౨౧

అకృతాస్త్రుఁడు = అస్త్రాభ్యాసము సరిగాలేనివాఁడు, గోల = ముగ్ధుఁడు, పఱచెన్ = బాధించెను, ఆలమునకున్ = యుద్ధమునకు, ఇపుడు = ఈవయస్సున, ఎత్తినన్ = దండెత్తిన.

తా. పసివాఁడు, అస్త్రవిద్య తెలియనివాఁడు, ముగ్ధుఁడు నగువాఁడే నన్నిట్లు బాధించెను. సైన్యమంతయు ధ్వంసముచేసెను. ఇప్పు డాయన మంచివయస్సునందున్నవాఁడు. ఇప్పుడు నీవు యుద్ధమునకై దండెత్తితివా కలుగఁబోవుఫలము నే నేలచెప్పవలె? అనుభవించి నీవే తెలిసికొనఁగలవు.

ఉ. కావున రామునిం జెనకఁ ♦ గార్యము గా దని నీప్రయత్నముర్
రావణ! యాఁపఁగా వలసె ♦ రామునితోఁ బగ గొంటివేనియుర్
బోవదు రిత్త కయ్యదియు ♦ భూరితరాపద రాక్షసాళికిర్
నీవ ఘటించి నట్ల యగు ♦ నిక్కము నమ్ముము పంక్తికంధరా.   ౨౨

తా. ఈకారణముచేత రామచంద్రుని నీవు యుద్ధమం దెదిరించుట తగిన పనిగాదని నీప్రయత్నము నడ్డగింపవలసెను. రామచంద్రునితో విరోధించితివా యది యూరకపోదు. రాక్షససమూహమునకు నీవే గొప్పవిపత్తు కలిగించినవాఁడవగుదువు. నిజము. రావణా! నామాట నమ్ముము.

ఉ. క్రీడలు సొంపు పెంపుఁ దన♦రింపఁగ నిం పగునుత్సవంబులన్
గూడి చరించు నీయసుర♦కోటికిఁ దాపము కీడుఁ గూర్పఁగాఁ
జూడకు, భర్మహర్మ్యతల♦సుందర సౌధవితాన లంకయుం
బా డయి పోవఁ జూచెదవు♦మైథిలికై విను రాక్షసోత్తమా. ౬౦౩

భర్మ = బంగారుమయమైన. హర్మ్యతల = ధనికులమేడలప్రదేశముగల దియు. సుందరసౌధవితాన = అందమైన రాజగృహముల సముదాయముగలదియు, మైథిలికై = సీతాదేవికొఱకై.

తా. ఆటలును సంతోషాతిశయమును గలిగించు పండుగులందు నందఱుఁ గలసిమెలసి తిరుగు నీరాక్షసులకు నీవే సంతాపము ముప్పు గలుగఁజేయఁ జూడకుము. బంగారు హర్మ్యములు, సుందరములగు రాజగృహములు గల లంక సీతాదేవికొఱకై పాడై పోవు నాలోచన చేయుచున్నావు.

ఉ. పాపముఁ జేయ కెంతయును♦ బావనరీతిఁ జరించు చుండియున్,
బాపులసంగతిం బరుల♦పాపములం జెడుఁ జుమ్ము సజ్జనుం;
డాపద నొందుఁ బన్నగజ♦లాశయమందలిచేఁపపిండు, నీ
పాపమునన్ సుఖానుభవ♦భవ్యులఁ జూచెదు నేలపాలుగాన్. ౬౦౪

పావనరీతిన్ = శుద్ధమైనవిధముగ, పన్నగజలాశయమందలి = పాముగల మడుఁగునందలి, చేఁపపిండు = చేఁపలసమూహము, సుఖానుభవభవ్యులన్ = సుఖము ననుభవించు మంచినడవడిగలవారిని.

తా. సత్పురుషుఁడు తా నేపాపముచేయక శుద్ధవర్తనముగలవాఁడై యుండి నను పాపులతో సహవాసము గలిగెనేని వారిపాపములచేఁ దానుగూడఁ జెడును. ఎట్లనెదవా? పాములుగల మడుఁగునందుండు చేఁప లెవరి కేయాపద గలిగింపకున్నను వానితోడనుండినకారణముచే వానిని జంపవచ్చినవారిచేతనో గరుత్మంతునిచేతనో తాము చచ్చును. ఆవిధముగ నీవు పాపముచేసి నీవు చెడుటయేగాక హాయిగా నిర్విచారముగా నేదోషములేక సుఖ మనుభవించువారినిగూడ నాశముచేయఁ జూచుచున్నావు.

క. ఏపాప మెఱుఁగకున్నను, నీపాపముకతన దివ్య♦నిరుపమమణిభూ
షాపటలదివ్యచందన,లేపనయుతరాక్షసావ♦లిం దెగఁ గనెదే. ౬౦౫

దివ్య = దేవతాసంబంధమైన, నిరుపమ = సమానములేని, మణిభూషాపటల = రత్నములుచెక్కిన యాభరణ సమూహములతోను, దివ్యచందనలేపన = దివ్యమైన గంధపుఁబూఁతలతోను, యుత = కూడిన, రాక్షసావళిన్ = రాక్షస సమూహమును, తెగన్ = చావఁగా.

తా. తామేపాపముచేయమి యటులుండఁ దెలియక యుండియును నీవు చేయు పాపముచే దివ్యరత్నభూషణములచే దివ్యగంధములపూఁతలచే సంతోషించు రాక్షసులను జావఁజేసెదవా?

చ. అనిమొనఁ జావఁగా మిగిలి♦నట్టినిశాచరు లాత్మదారలం
గొనియునొ వీడియో దెసల♦కుం బరువెత్తఁగ దిక్కుమాలి లం
కను గలకొంప లెల్ల శర♦కాండహుతాశనహేతిపాళిచే
తను దెగఁగాలి నీఱగుట ♦ తప్పక చూచెదు నీవ రావణా. ౬౦౬

అనిమొన = యుద్ధముఖమునందు, దిక్కుమాలి = రక్షకులులేక, శరకాండ = బాణసమూహములనెడు, హుతాశన = అగ్నిహోత్రునియొక్క, హేతి = జ్వాలల- హేతిర్జ్వాలాయుధాంశుషు - నానా ॥ర॥ పాళిచేన్ = సమూహముచే, నీఱు = బూది.

తా. యుద్ధముఖమున రామచంద్రునిచేఁ జావఁగా మిగిలిన రాక్షసులు తమ భార్యలను దమవెంటఁ దీసికొనియో లేక వదలిపెట్టియో దిక్కులవెంట రక్షకులు లేక పరువెత్తఁగా లంకయందుండు నిండ్లన్నియు బాణసమూహము లను నగ్నిజ్వాలలచేఁగాలి బూదియయి పోవుట నీవే కన్నులారఁజూచెదవు.

క. పరదార వలచుకంటెం, బరికింపఁగ వేఱె భూరి♦పాపము గలదే?
సురవైరీ నీభార్యలు, తరుణులు పదివేలు లేరె ♦ తర్కింపు మదిన్. ౬౦౭

పరదారన్ = ఇతరునిభార్యను, వలచుకంటెన్ = మోహించుటకంటె, పరికింపఁగన్ = ఎంతయాలోచించినను, ఇహమునఁజెడినఁ బరమందైన నీకు మేలు లేదు. మహాపాపముచేసినవానికి పరలోకసౌఖ్యమెట్లు వచ్చును.

తా. ఇతరునిభార్యను మోహించుటకంటె గొప్పపాపము వేఱేదియైనఁ గలదా? లేదు. నీవా భార్యలేనివాఁడవు కావు. పదివేలమందిభార్యలు వయస్సుననుండువారు గలరు. వారితో నీయిష్టముచొప్పున భోగింపవచ్చునుగదా. ఆపదతోఁగూడిన సీతాసాంగత్య మేల కోరెదవు? నీవే యాలోచింపుము. ఈకార్యముచే నీవు నుభయలోకములఁ జెడెదవు.

ఉ. కమ్మ స్వదారలోలుఁడవు ♦ కావుము నీదుకులంబు రాక్షసా
నెమ్మదిగా సురూప లగు♦నీప్రియభార్యలతోడఁ గూర్మి మి
త్రమ్ములతోడ నింకయుఁ జి♦రంబుగ సౌఖ్యము నందఁ గోరితే
నెమ్మొయి రామచంద్రునకు ♦ నెగ్గొనరింపకు చాటి చెప్పితిన్. ౬౦౮

స్వదారలోలుఁడవు = నీభార్యలయందు నాసక్తిగలవాఁడవు, కోరితేన్ = కోరితివేని, ఎగ్గు = కీడు.

తా. నీభార్యలతోడ యథేచ్ఛగా నీవు క్రీడింపుము. నీవంశము రక్షింపుము. అందగత్తెలగు నీభార్యలతో ప్రేమగల స్నేహితులతో నింకను దీర్ఘకాలము సుఖింప వలయునను కోరికయుండెనా రామచంద్రునకుఁ గీడు గావింపకుము. స్పష్టముగాఁ జెప్పుచున్నాను. ఇది రహస్యవిషయముగాదు.

మాలిని. వలదు వలదు సీతా♦వారిజాక్షిన్ గ్రహింపన్
జెలిమికలిమి నీకుం ♦ జెప్పెదం, గాదటంచున్
బలిమిని గ్రహియింపన్ ♦ బంధుమిత్రాళితోడన్
గలవు కలనఁ గూలన్ ♦ క్ష్మాసుతానాథుచేతన్. ౬౯

తా. రావణా! సీతాదేవిని నీవు హరింపవలదు వలదు. నే నీమాట నీమీఁద నాకుఁగల ప్రేమచే నీక్షేమము గోరి చెప్పుచున్నాను. నామాట వినక బలాత్కారముగ సీతను గ్రహించితివా బంధువులతో మిత్రులతో యుద్ధమునందు రాముచేఁ జావఁగలవు.

మాలిని = న నమయ య గణంబుల్. తొమ్మిదింట యతి.

## ౩౯-వ సర్గము. మారీచుఁడు రావణుతోఁ దాను రామునిబారి బడి తప్పించుకొన్నవిధముఁ దెల్పుట.

శా. ఎట్టెట్టో విడిపించె నన్నపుడు ధా♦త్రీశుండు సంగ్రామమం
దిట్టట్టాడక విన్ము చెప్పెదను ద♦ద్వృత్తంబు నూత్నంబు, నే
నట్టుల్ స్రుక్కియు రాముచేఁ బడి యుదే♦యారణ్యవీథిన్ బడిన్
దిట్టల్ దైత్యులు జింకరూపముల సే♦తే నిద్ద తే నుద్ధతిన్. ౭౦

ధాత్రీశుండు = రామచంద్రుఁడు, ఇట్టట్టాడక = అడ్డమాటలు చెప్పక, నూత్నంబు = క్రొత్తది, బడిన్ = నావెంబడి, ఉద్ధతిన్ = గర్వముచే, ఎట్టో+ఎట్టో, ఎట్టెట్టో, అపుడు = విశ్వామిత్రయాగరక్షణకాలమున.

తా. విశ్వామిత్రయాగరక్షణకాలమందు రామచంద్రుఁడు యుద్ధరంగమున నన్ను నూపిరితో విడిచెనుగాని యందఱను జంపినవాఁడు నన్నొక్కని నెట్లు విడిపించెనో యేల విడిపించెనో నే నెఱుఁగను. బ్రదికియుండుటమాత్ర మెఱుఁగుదును. ఇది ప్రాఁతవృత్తాంతము. క్రొత్తగా నిటీవల జరిగినది చెప్పెద. అడ్డమాటలు చెప్పక సావధానచిత్తుఁడవై వినుము. ఆప్రకారము రామునిచే దెబ్బతిని దండకారణ్యమందే నావెంబడి యిద్దఱు యోధులు దిట్టతనము గలవారు జింకరూపములతో రాఁగా నేను గర్వించినవాఁడనై.

తే. దీప్తజిహ్వుయుఁ బెనుమేను ♦ దీర్ఘదంష్ట్ర
లమరు ఘోరమృగంబయి ♦ యగ్నిహోత్ర
గృహములను దీర్థములఁ జైత్య ♦ వృక్షములను
గ్రుమ్మరితి మాంసభోజి నై ♦ క్రూరమతిని. ౯౧౧

దీప్తజిహ్వ = మండుచున్నట్లుండు నెఱ్ఱనినాలుకయు, పెనుమేను = పెద్ద దేహము, దీర్ఘదంష్ట్రి = నిడివియగు కోఱలు, ఘోరమృగంబయి = భయంకరమయిన జంతువయి, చైత్యవృక్షములన్ = రచ్చమ్రాఁకులను.

తా. ఇతరులను హింసించి తినుటకుఁ గావలసిన మండుచున్నదానివలెనుండు నాలుక, పెద్దదేహము, నిడుపాటికోఱలుగల భయంకర మృగమనై, ఋష్యాశ్రమంబులందలి యగ్నిహోత్రములందును, తీర్థములందును, రచ్చమ్రాఁకులందును, మాంసమును దినువాఁడనై, క్రూరమైన మనస్సుతో సంచరించితిని.

తే. దండకారణ్యతాపస ♦ కాండములను
గూల నడిచియు రుధిరంబుఁ ♦ గ్రోలి వారి
మాంసముల మెక్కుచు నధర్మ ♦ మార్గపరత
నొడలు దెలియక మత్తెక్కి ♦ యొక్కనాఁడు. ౯౧౨

రుధిరము = నెత్తురు, అధర్మమార్గపరతన్ = అధర్మమార్గమందలి యాసక్తిచే, ఒడలు = దేహము, మత్తు = మదము.

తా. దండకారణ్యమందుండు తపస్వుల సమూహములను బడఁద్రొన్ని వారి నెత్తురు ద్రావుచు వారిమాంసముఁ దినుచు నధర్మమార్గమునందలి యాసక్తిచే దేహము తెలియక మదించి యొకానొకదినమందు.

సీ. తాపసవేషంబుఁ ♦ దాల్చి మితాహార, యుక్తి భూతావనా ♦ సక్తిగల్గు
రామభద్రుఁడు మహా ♦ వ్రత ధరాకన్యయు, మిత్రతేజుండు సౌ ♦ మిత్రి యుండు
చక్కటికిని బోయి ♦ చిక్కెరా ముని యని, పూర్వవైరంబును ♦ బుద్ధిఁ దలఁచి
వాఁడికొమ్ములు వంచి ♦ వేఁడిమి దీపింప, బుద్ధిహీనుఁడ నై ♦ పొడువఁ బోవఁ
తే. జాప మెక్కిడి నాయున్న ♦ చాయఁ జూచి, గరుడమారుతనిస్వన ♦ కలితవజ్ర
సన్నిభాశుగములమూఁటి ♦ సరగ విడువ, నుఱికితిని వాని వేగంబు ♦ నెఱుఁగుకతన

మితాహారయుక్తిన్ = మితముగా నాహారమును దీసికొనువాఁడై భూత+ఆవన+ఆసక్తి = ప్రాణులను రక్షింపఁ గోరికగలిగి, మహావ్రత = పరమపతివ్రత, మిత్రతేజుండు = సూర్యునివంటి తేజస్సుగలవాఁడు, చక్కటిన్ = ప్రదేశమునకు,

గరుడమారుతస్వన = గరుడునియొక్కయు గాలియొక్కయు ధ్వనితో, కలిత = కూడిన, వజ్రసన్నిభ = వజ్రముతోసమానమైన, ఆశుగములన్ = బాణములను.

తా. తపసివేషము ధరించి మితాహారము గొనుచు ప్రాణికోటుల రక్షింపఁ గోరికగల రామచంద్రుఁడును, పరమపతివ్రతయగు సీతాదేవియు, సూర్యకాంతివంటి కాంతిగల లక్ష్మణుఁడును, నొకచో నుండఁగా, నక్కడికిఁ బోయి చిక్కెరా మునీశ్వరుఁ డని పూర్వవైరంబుఁ దలఁచి పదునగుకొమ్ములు వంచి వేఁడిమి ప్రజ్వరిల్ల తక్కినయందఱు తపస్వులవలె హింసాపరుఁడుకాఁడు కావున మనల నేమిచేయఁ డని బుద్ధిలేనివాఁడనై తలఁచి రామచంద్రుని బొడువఁబోయితిని. ఆయన నా వంకఁజూచి చాపమెక్కుపెట్టి గరుడుఁడు గాలి తీవ్రవఁ బోవు నప్పు డెట్లు శబ్దమగునో యట్టిశబ్దముగల వజ్రమువంటి మూఁడుబాణములను విడిచెను. ఆబాణవేగముదెబ్బ తెలిసినవాఁడనగుట నాయన బాణము సంధించి సంధింపకముందే పరువెత్తితిని.

క. కావున నే బ్రతికితి నా,తోవచ్చినవారు వాఁడి♦తూపులు దాఁకన్
బోవిడిచిరి ప్రాణంబుల, నేవానికి వశము రాము ♦ నెదిరియు బ్రదుకన్. ౬౧౪

తా. రామచంద్రబాణములు వెనుకనుండి తాఁకవు కావున నేను బ్రదికితిని. నాతోడ వచ్చినవా రిద్ద ఱాబాణములు దవిలి చచ్చిరి. రామచంద్రు నెదిరించియు బ్రతుక నెవరికి సాధ్యము.

చ. విదితబలాఢ్యుఁ డైనరఘు♦వీరునిబారికిఁ దప్పి యె ట్టెటో
బ్రదికితి నాఁటఁ గోలె నిట ♦ రాక్షసనాయక! సన్న్యసించి ని
ర్మదమున యోగయుక్తి ముని♦మాడ్కిఁ జరించుచు నున్నవాఁడ, నా
హృదయముపాటు నే మనుదు ♦ శ్రీరఘురాముని సంస్మరించినన్. ౬౧౫

విదితబలాఢ్యుఁడు = ప్రసిద్ధికెక్కిన బలసంపదగలవాఁడు, ఎట్టెటో = ఏవిధముగనో, అతి కష్టముపై, నాఁటఁగోలె = ఆ దినముమొదలు, ఇట = ఈయాశ్రమమందు, నిర్మదమునన్ = మదములేమిచే.

తా. ప్రసిద్ధబలసంపదగల రామచంద్రునిబారిఁబడి తప్పించుకొని యెట్టెటో బ్రతికి యిఁక మెదలాడినఁ జంపు నను భయముచే నా దినముమొదలుకొని యీ ప్రదేశమందు గర్వహీనుఁడనై యోగాభ్యాసముచేయుచు, మునివలె నున్నాఁడను. ఆ శ్రీరాముని మనస్సునఁ దలఁచితినా నా హృదయము పడెడుపాటు నేనేమని చెప్పుదును.

క. భూరిధనుస్సు మృగాజిన,చీరంబులు దాల్చి చెట్టు♦చెట్టున దశకం
ఠా! రాముఁడు గనఁబడెడి న,నారతముం బాశహస్తుఁ ♦ డగుయముపోల్కిన్.

భూరిధనుస్సు = గొప్పవిల్లు, మృగాజినచీరంబులు = జింకచర్మము నార చీరలు, అనారతమున్ = ఎల్లప్పుడు.

తా. పెద్దవిల్లు పట్టుకొని నారచీరలు జింకచర్మము ధరించి రావణా చెట్టు చెట్టునందు నెల్ల వేళలఁ జూచినప్పుడంతయు పాశము ధరించిన యమునివలెఁ గాన వచ్చుచున్నాఁడు.

ఉ. రాములు వేనవేలుగను ♦ రావణ! తోఁచెద రెల్ల వేళలన్
రామమయంబుగాఁగ విపి♦నంబు సమస్తము గోచరించెడిన్
రాముఁడు లేనిపట్టులను ♦ రాముఁడ కన్పడు,స్వప్నమందునున్
రామునిఁ గాంచి బొబ్బరిలి ♦ రాత్రుల నిద్దుర లేక యుందుదున్. ౬౦౭

విపినము = అడవి, గోచరించెడిన్ = కానవచ్చుచున్నది, బొబ్బరిలి = బొబ్బలుపెట్టి.

తా. రాముఁడు చెట్లమీఁదనెక్కి కూర్చుండి నీకుఁ గానవచ్చెనందువేమో, అట్లుగాదు, ఒక్కచోట నొకరాముఁడు కనఁబడిన నీయూహ సరియనవచ్చును. ఎల్ల వేళల వేనవేలుగ రామచంద్రమూర్తులు గానవచ్చుచుందురు. అడవియంతయు రామమయముగాఁ గానవచ్చుచున్నది. ఇంద్రజాల మనెదవేమో? రాముఁడు లేని దూరపుఁ బ్రదేశములం దుండ మని పోయిన నచ్చటను రాముఁడే కానవచ్చు చున్నాఁడు. పగటనే కాదు, రాత్రి కన్నులుమూసికొనినను, రాముఁడు కనఁబడఁగా బొబ్బలుపెట్టి లేతును. ఆ కారణమున నిద్దుర యనునది లేక కన్నులు మూసినను రాముఁడే కానవచ్చును. నేనేమి చేయుదును? (భాగవత దశమస్కంధము ౧౫౪-౧౫౭ వ ప. చూచునది.)

క. రామునిపే రన విబుధవి,రామా! వేఱ చెప్ప నేల ♦ రత్నము రథముల్
రామ లని రాదిశబ్ద,స్తోమము చెవిఁబడిన మనము ♦ సుడివడు భీతిన్. ౬౦౮

విబుధవిరామా = దేవతల నంత మొందించువాఁడా.

తా. రాముని జూచి భయపడుట యటుండనీ. రామునిపే రనిన భయపడు చున్నాను. రామునిపేరేగాదు. రత్నము, రథము, రామ లని యిట్టి రకారము మొదటఁగల శబ్దములు విన్నను రెండవయక్షరము వచ్చునేమో రాముఁడే వచ్చె నేమో యని మనస్సు కలవరపడుచున్నది.

చ. వలవదు నీకు రామునెడ ♦ వైరము, యుద్ధమునందు నమ్మహా
బలు నెనయంగ లేవు, రఘు♦వర్యుపరాక్రమ మే నెఱుంగుదుం
బలి నముచిన్ వధింపఁగ స♦మర్థుఁడు, శక్తుఁడ వేని నీవ య
చ్ఛలమునఁ బోరు, కానియెడ ♦ సైరణ సేయుము బంధుతామ్రుతిన్. ౬౦౯

బంధుతా = బంధుసమూహములయొక్క, మృతిక్ = మరణమును, ఈ- 'తా' (తల్) సమూహార్థంబున గ్రామ, జన, బంధు, సహాయ, గజశబ్దములకుఁ బరముగఁ జేర్పఁబడును.

తా. రావణా! రామచంద్రునందు నీవు వైరిబుద్ధి విడువుము. యుద్ధమునందు నీ వాయనకు సమానుఁడవుకావు. నీశక్తి నాకుఁ దెలియును. ఆయనశక్తి నాకుఁ దెలియును. ఆయన బలి నముచులనైనను వధింపఁగల శక్తిసంపన్నుఁడు. నీకు శక్తి యుండెనా నీవే పోయి యాగ్రహముతో యుద్ధముసేయుము; బలములేదాయెనా యయినదయినది. ఏమిచేయవచ్చునని బంధువులమరణము సహించి యూరకుండుము. మీ యిరువురనడుమ నా ప్రాణమేల తీయ నాలోచించెదవు? ఆ రెంటిలో నొకటిచేయు మంతియకాని దొంగతనము చేయకుము.

క. నే వసుధఁ గొన్ని దినములు, జీవించుట యిష్టమేని ♦ చెప్పకు మయ్యా
రావణ! నాతో నాసీ, తావిభుకథఁ జాలుఁ జాలుఁ ♦ దలపై వచ్చున్. ౬౨౦

తా. ఇంకను నేను గొన్నిదినములు బ్రదికి భూమిపైనుండుట నీ కిష్టమాయెనా, యా సీతాపతికథ నాతోఁజెప్పకుము. అది నా తలపోవుపని యగును.

ఉ. పెక్కురుసాధువుల్ జగతిఁ ♦ బెద్దయు ధర్మరతాత్ము లయ్యునుం
దక్కినవారిదోషమునఁ ♦ దారు నశించెద, రట్లు నేను నీ
ముక్కడిసేఁతలం జెడుట ♦ రూఢియ, నీబడి రాను నేను, నీ
యిక్కృతి నీ కభీష్ట మగు♦వృత్తిఁ జరింపుము, నన్ను వీడుమీ. ౬౨౧

తా. అనేకులు సాధువులు దాముమిగుల ధర్మాత్ము లయినను, నితరుల దోషమునఁ దాము నశింతురు. అట్లే నేను నీవు మతిమాలి చేయుకార్యములచేఁ జెడఁగలను. ఇది నిజము. నీవెంట నేను రాను. ఈ కార్యమందు నీ యిష్టమువచ్చినచొప్పున చేసికొనుము. నన్ను వదలిపెట్టుము.

క. రాముఁడు నిస్తులసత్త్వోద్ధాముఁడు పటు తేజుఁ డధిక♦ దర్పస్థైర్య
స్థేముఁడు రాక్షసలోకవి, రాముఁడు గా నేల నీకు ♦ రావణ చలుపన్. ౬౨౨

నిస్తుల = అసమానమైన, సత్త్వ=బలముచే, ఉద్ధాముఁడు=గొప్పవాఁడు, అధిక = విశేషమైన, దర్పస్థైర్యస్థేముఁడు = గర్వము, మనోదార్ఢ్యము, శరీర బలము గలవాఁడు, రాక్షసలోక విరాముఁడు = రాక్షసప్రపంచమును నాశము చేసినవాఁడు.

తా. రామచంద్రమూర్తి యసమానబలాతిశయము గలవాఁడు. దృఢమైన

తేజస్సుగలవాఁడు. అధికమగు గర్వము,మనోదార్ఢ్యము, శరీరబలము గలవాఁడు, ఇట్టివానిని రాక్షసజననాశకుఁడుగా నేలచేసెదవు.

ఉ. హామికతోడ నాదశర♦థాత్మజులన్ మనచుప్పనాతి దా
నే మని డాసె? నంతఁ జన ♦ కీను మెయిం బెరరేచె నాఖరున్
స్తోమముతోడ వాఁడు చని ♦ దొమ్మి యొనర్చి గతించె రాముచే,
రాముఁడు చేసినట్టియప♦రాధ మ దేదియొ పల్కు రావణా. ౬౨౩

కారణములేక శూర్పణఖ ముక్కుసెవులు గోసె నన్నమాటకుఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు.

హామికతోడన్ = గర్వముతోడ, పెరరేచెన్ = పురికొలిపెను, దొమ్మి = యుద్ధము.

తా. అడవులలో వారంతట వా రొక యాశ్రమము కల్పించుకొని యొకరి పేరు ప్రస్తావన లేక యుండఁగా మన శూర్పణఖ పొగరుఁబోతుతనముచే నేమని వారిని బెదరింపఁ బోయెను. అంతతోఁ బోక ఖరాదులను యుద్ధమునకుఁ బురికొలిపెను. వారు గుంపుగాఁబోయి యుద్ధముచేసిరి. రాముచేఁ జచ్చిరి. ఇందు రామచంద్రమూర్తి చేసిన నేరమేమో చెప్పుము.

క. చుట్టములహితముఁ గోరుచుఁ, బట్టుగ నాయాడుమేలు♦పలుకులు చేఁదై
తట్టిన రామునిచే నని, గిట్టెదు సహబంధుమిత్ర♦కీర్తిగ నినినన్. ౬౨౪

తా. బంధువులమేలు గోరి పట్టుమని గట్టిగ నే చెప్పినమాటలు నీకుఁ జేఁదై తోఁచెనా బంధువులతో స్నేహితులతో కీర్తితో యుద్ధమందుఁ జచ్చెదవు.

## ౪౦-వ సర్గము.

క. యుక్తంబు క్షమము నగుత,త్సూక్తిని గొనఁడయ్యెఁ దనకె ♦ శుభ మని మరణా
సక్తుం డౌషధములను వి,రక్తిని గ్రహియింపనట్లు ♦ రావణుఁ డాత్మన్. ౬౨౫

యుక్తంబు = న్యాయ్యమైనది, క్షమము = పనినెఱవేఱుటకుఁ దగినది, తత్ = ఆ మారీచుని, సూక్తిని = హితవాక్యములను, మరణాసక్తుఁడు = చావఁగోరువాఁడు, విరక్తిని = వైరాగ్యముచే, చచ్చినఁ జచ్చెదను బ్రతికిన బ్రతికెద నను భావముతో.

తా. న్యాయముతోఁ గూడినది కార్యసాధనమునకు నుపయోగించునది యగు మారీచుహితవాక్యమును చావఁగోరెడి వాఁడు వైరాగ్యముచే మందు తీసికొనన ట్లు గ్రహింపఁ డయ్యెను.

~~~{ రావణుఁడు మారీచునిఁ బరుషంబు లాడి బలాత్కరించి తోడుపడ నంగీకరింపఁ జేయుట. }~~~

క. ఈచొప్పున నయహితవా, చాచతురత బోధ సేయు సచివాగ్రణి మా
రీచు విధిచోదితుఁడు క్షణ. దాచరపతి పరుషఫణితిఁ దా ని ట్లనియెన్. ౬ ౨౬

నయహితవాచాచతురత = న్యాయము హితముతోఁ గూడి వాక్యనిపుణత్వముచే-బోధించు మంత్రిశ్రేష్ఠుఁడయిన మారీచునిఁ జూచి, విధిచోదితుఁడు = దైవముచేఁ బ్రేరేపింపఁ బడినవాఁడు, క్షణదాచర = రాత్రియందుఁ దిరుగు రాక్షసులను, పతి = పాలించువాఁడు, పరుషఫణితిన్ = కఠినమైన మాటలతో.

తా. ఈ విధముగ నీతియుక్తమై హితమైన మాటలను, మాటల నేర్పు కొలఁది బోధించు మంత్రిశ్రేష్ఠుఁడైన మారీచునిఁ జూచి రావణుఁడు నిష్ఠుర వాక్యములతో నిట్లనెను.

శా. మారీచా! నిను నెవ్వఁ డీకథల సంభాషింపఁగాఁ గోరె? నో
రారం బ్రేలితి వేలరా చవుట బీజావాప మోనాఁగ వ్యా
హారంబుల్? మనుజుండు మూర్ఖుఁడును బాపాత్ముండు రాముండు; నా
యారాజన్యు నెడాటపుంబనులు నీవా నేర్తు భేదింపఁగన్. ౬ ౨౭

ప్రేలితివి = వదరితివి, చవుటన్ = చవిటి నేలయందు, బీజావాపమో = విత్తనము నాటుటయో, వ్యాహారంబుల్ = మాటలు, నా = నాయొక్క, ఆరాజన్యు = రాజయిన యారామువిషయమునఁ జేయు, పనులు = కార్యములు, సీతాహరణాదులు, భేదింపఁగన్ = నిలిపివేయుటకా

నాలుగవపాదంబున ప్లుతయతి.

తా. నయమునఁ దన యిష్టప్రకారము చేయునేమో యని తండ్రీ యని సంబోధించెను. నయము వ్యర్థ మనుకొని ప్రభువు మాటలాడినట్లు మాటలాడు చున్నాఁడు. ఓరీ మారీచుఁడా? నిన్నెవ్వఁడురా యీ కథలు చెప్పు మని యడిగెను. చవిటినేలయందు విత్తనములు చల్లినట్లు నోరెండ నేలరా వదరితివి. రాముఁడు మనుష్యుఁడు, మూర్ఖుఁడు, పాపాత్ముఁడు, అట్టివాని సరిచేసికొని నేను యుద్ధము చేయఁ బోదునా? ఆ రాజు విషయమై నేను జేయు పనులను నివారింపఁ జేయుటకు నీవా శక్తుఁడవు. నీచే నది యగునని తలఁచితివా.

ఇందు రాముఁడు మనుజుండు మూర్ఖుఁడు పాపాత్ముఁడను రావణవాక్యములకు వాస్తవార్థమని తీర్థీయమున వ్యాఖ్యలేదు. ఇందు రాముఁడు మనుజుఁడని రావణుఁడు చెప్పుటచే వానికి రాముఁడు మనుష్యుఁడను భావమే కాని విష్ణువను భావము లేదని తెలియనయ్యెడిని.
~~~

ఆ. ఆఁడుదాని మొఱుగు ♦ లాలించి రాజ్యంబుఁ, దల్లిఁ దండ్రి హితవి♦తానములను
విడిచి తత్క్షణంబ ♦ నడచు చరణ్యంబు, లందుఁ జొచ్చె నెంత♦ మందుఁ డతఁడు.

తా. ఆఁడుదాని వ్యర్థ ప్రలాపములను విని రాజ్యమును దల్లిని దండ్రిని హిత సమూహమును వదలి తటాలున నడవులకు వచ్చిన వాఁడెంత బుద్ధిహీనుఁడుగా నుండవలెను. ఇట్టివాని నీవొక గొప్పగాఁ జెప్పెదవే. నీవెంత బుద్ధిహీనుఁడవు?

క. నీవ కన ఖరనిహంతకు. భూవరతనయునకుఁ బ్రాణ♦ములకుం బ్రియ యగా
శ్రీనై దేహిఁ గ్రహించెద, నీవశమా త్రిప్ప నాదు♦నిశ్చితబుద్ధిన్. ౬౨౯

తా. నీవే చూచుచుండఁగా నీ కన్నుల యెదుటనే ఖరునిఁ జంపిన రామునకు నతని ప్రాణంబులకంటె ప్రియురాలగు సీతను పట్టితెచ్చెదను. నేను నిశ్చయించిన దానిని త్రిప్పుటకు నీకు సాధ్యమా.

ఉ. వాసవుఁ డాదిగా విబుధ♦వర్గము లైన మదుద్యమంబులన్
వీసమునంతఁ ద్రిప్ప వశ♦ నీ వటరా ననుఁ జక్కదిద్దఁగా?
వాసి గుణంబు దోషము ను♦పాయ మపాయము చెప్పు మన్నఁ గా
దే సచివుండు చెప్పఁదగుఁ♦ దెల్విగఁ గార్యవినిశ్చయంబునన్? ౬౩౦

వాసవుఁడు = ఇంద్రుఁడు, విబుధ వర్గములు = దేవతా సమూహములు, మత్ + ఉద్యమంబులన్ = నా ప్రయత్నములను, వీసమునంతన్ = వీసమంత యైనను, త్రిప్పవు = త్రిప్పఁజాలవు.

తా. ఇంద్రుఁడు మొదలగు దేవతాసమూహము లన్ని కలిసియైనను నా ప్రయత్నములందు నొక కొంచమైనను త్రిప్పఁజాల వనఁగా నికె నీవా నన్ను దిద్దువాఁడవు. ఏమి నీ యహంకారము. కార్యము చేయవలయునా పనిలేదా యని నిశ్చయించుటకై దీనియందు గుణమేమి దోషమేమి ఏది యుపాయము ఎట్లు చేసిన నపాయము గలదు. అను విషయములను రాజడిగినప్పుడుకదా మంత్రి యగువాఁడు వానిని చెప్పవలయును.

క. ఇది యెట్టని ప్రభు వడిగిన, బ్రదుకం గాంక్షించుమంత్రి ♦ బద్ధాంజలి యై
మదిఁ గలరీతి నణంకువ, విదితము సేయంగఁ దగును ♦ వెర వొనరంగన్. ౬౩౧

తా. ఈ కార్యము నెట్లు చేయవలయు నని రాజడిగినప్పుడు బ్రదుకుమీఁద నాశగల మంత్రి చేతులు జోడించుకొని వినయముతోఁ దన మనస్సునఁ గలది సదుపాయముగ విన్నవింపవలెను.

క. హితమును మృదుపూర్వము న, ప్రతికూలము శుభము నైన♦వాక్యముచేతన్
బతికి వివరింపఁ దగు స, మ్మత మగుగతి మంత్రి వినయ♦మండనయుక్తిన్. ౬౩౨

తా. అదియైన నెట్లు చెప్పవలయును? ఆ చెప్పెడి మాట ప్రభువునకు మేలిచ్చునదిగ నుండవలెను. మెత్తని మాటలఁ జెప్పవలెను. పరుషముగఁ జెప్ప రాదు. ప్రతికూలముగఁ జెప్పరాదు. అనుకూలించిన విధముగఁ జెప్పవలెను. శుభమైన వాక్కులచేత వినయమును నలంకారముగఁ గలవాఁడై రాజునకు సమ్మత మగు విధముగఁ జెప్పవలయును.

క. మానార్హుఁడైనభూపతి, మానవివర్జితము లైన♦మహితశుభోక్తుల్
వీనులఁ బెట్టఁడదెంతటి,మానిసి వచియించె నేని ♦ మారీచుండా. ౬౩౩

మానార్హుఁడు = గౌరవ యోగ్యుఁడు, మాన వివర్జితములు = మానముచే వదలిపెట్టఁబడినవి, మానిసి = మనుష్యుఁడు, మనుష్య శబ్దభవము, రాకాసి - రక్కసి శబ్దములవలె దీనికి నుభయ లింగముల నొక రూపమే.

తా. గౌరవ యోగ్యుఁడగు రాజు మానము విడిచిన మాట లవి యెంత శుభములైన వైనను ఎంతటి పెద్దమనుష్యుఁడు చెప్పినను చెవులఁ బెట్టఁడు. 'మారీచుఁడా, నీ తమ్ము లందఱుఁ జచ్చినఁ జావనీ, నీ చెల్లెలి ముక్కు సెవులు గోసినఁ గోయనీ నా కేమి యని యూరక యింటఁ గూర్చుండు' మనిన నవమానము సహించి మానము గోలుపోయి నీవు చెప్పితి వని యెట్లూరకుందును.

ఆ. వాసవాగ్నిసోమ♦భానుజవరుణుల,విక్రమాఢ్యములును ♦ విపులసౌమ్య
దండములుఁ బ్రసన్న♦తయుఁ దాల్చు భూపతి, యెల్ల వేళఁ బూజ్యుఁ♦డింతనిజము.

వాసవ = ఇంద్రుని, అగ్ని = అగ్నిహోత్రుని, సోమ = చంద్రుని, భానుజ= యముని, వరుణ = వరుణుని, విక్రమము, వేఁడిమి, ఆహ్లాదకత్వము, దండము, ప్రసన్నత.

తా. రాజగువాఁడు వాసవునివలె విక్రమము, అగ్నివలెఁ దీక్ష్ణత, చంద్రుని వలె సంతోషకరత్వము, యమునివలె దండము, వరుణునివలెఁ బ్రసన్నత గల వాఁడై యాయా సమయంబుల నాయా వారిపట్ల నుపయోగించు చుండెనేని పూజ్యుఁడగును.

ఉ. నీవును ధర్మముం దెలియ♦నేరక కేవలమోహితుండ వై
యేవియొ కాఱు లాడెదవు ♦ హీనమతీ! పనిపొంటె కాఁగ, ని
న్నీవిషయంబునం దడిగె ♦ నెవ్వఁడు కీడును మేలు? నీకృతిఁ
నీ వొనరింపు సాహ్య మని ♦ నే వచియింప ని ఁటేల ప్రేలఁగన్? ౬౩౫

ధర్మముఁ = ఇది మంత్రి ధర్మము. ఇది రాజ ధర్మము అని, మోహితుండ వై = జ్ఞానహీనుఁడవై, కాఱులు = వ్యర్థపు మాటలు, హీనమతీ = బుద్ధిలేని వాఁడా, పనిపొంటెఁ = ఒక కార్యము చేయుకొఱకు.

తా. బుద్ధిహీనుఁడా! నేనొక కార్యము చేయుకొఱకు నీ సాహాయ్యము గోరి రాఁగా సచివ ధర్మ మిది యను తెలివిలేక నీ వేవియో యింతసేపు పనికిరాని మాట లన్ని వదరితివి. ఈ విషయమునఁ గీడు మేలు నిన్నెవఁడురా యడిగెను. నేనడుగలేదు గదా–ఈ కార్యమందు నీవు సాహాయ్యము చేయవలసిన దని నే నడుగఁగా వాఁగెద వేల?

సీ. వినుము నీసాయంబు♦విధము వచించెద, రజతబిందువులచే♦ రమ్య మైన
బంగరుజింక వై ♦ రంగుగ రామాశ్ర,మముపొంత రాముని♦మహిళ యెదుటఁ
దిరుగు చుండుము నీదు♦తీరుఁ గనుంగొని, విస్మయపడుచును ♦ విభునితోడఁ
బద్మాయతాక్షి నిన్ ♦ బట్టితెమ్మను నంత, దవ్వుగఁ గొనిపోయి ♦ దాశరథిని
తే. జానకీ ! లక్ష్మణా! యని ♦ చావుకూఁత
రామవాక్యానురూపంబు♦గా మహీజ
వినఁగ వేయుమ యద్దాన వికల ♦ యగుచు
మెలఁత రామునిఁ జూడ సౌ♦మిత్రిఁ బనుచు. ౬౩౬

సాయము = తోడుపాటు, సాహ్య శబ్దభవము, సాహాయ్య శబ్దభవ మని యైనఁ జెప్పవచ్చును.

రజత బిందువులచే = వెండిచుక్కలచే, మహిళ = స్త్రీ, రామవాక్యానురూపంబుగ = రామునివాక్యము ననుసరించి, మహీజ = సీత.

తా. నీవు నాకుఁ జేయవలసిన సాహాయ్యవిధము చెప్పెద వినుము. వెండిచుక్కలు గల బంగారు జింకవు గమ్ము. రామాశ్రమమునొద్ద సీత కెదుట సంచరింపుము. నీ విధముఁ జూచి నిజముగా నీవు జింక వని నమ్మి యాశ్చర్యపడి సీతాదేవి నిన్నుఁ బట్టుకొని రమ్మని మగనిని బనుచును. నీ వారాముని దూరముగఁ దీసికొని పోయి యక్కడ జానకీ లక్ష్మణా యని చచ్చెడువారి కంఠధ్వనితో రామునికంఠమువంటి కంఠముతో బిగ్గ నఱవుము. అది రాముని కంఠధ్వని యని సీత నమ్మి మనస్సు వికలముగాఁగా రామునిఁ జూడ లక్ష్మణుని బంపును.

క. సౌమిత్రియు సౌహృదమున, రాముని నెమకంగఁ బోవు ♦ రాకొమరులు పో
రామునిరామ హరించెద, నామఘవుఁడు శచినిబోలె ♦ హాయిగ నేనున్. ౬౩౭

సౌహృద(య)మునన్ = అన్నయందుండు ప్రేమచే, నెమకంగన్ = వెదకుటకై, రాకొమరులు = రాజకుమారులు, పోన్ = పోఁగా, రామన్ = స్త్రీని, మఘవుఁడు = ఇంద్రుఁడు, శచిని = తనభార్యయగు పులోమజను.

తా. అన్నయందలి స్నేహముచే లక్ష్మణుఁడు రాముని వెదకుటకై పోవును. ఆ రాజకుమారు లిరువురు వెడలిపోఁగా రామునిభార్యను సీతను నింద్రుఁడు పులో

మునివద్దనుండి శచిని హరించి తన భార్యగాఁ జేసికొన్నట్లు నేను హరించి భార్యగాఁ జేసికొని సుఖపడెదను. ఇంద్రుండు శచివలె నని చెప్పిన యుపమానము రావణునకు దుద్దేశమును స్పష్టపఱుచుచున్నది. రావణభక్తిపరముగా నీ యుపమానము తీర్థీయమున సమర్థింపఁ బడలేదు. కావున రావణుండు దురుద్దేశముతోనే సీత నపహరించె ననుట స్పష్టము.

తే. ఇంతమాత్ర మొనర్చి నీ వేగవయ్య, యిచ్చెదను నర్ధరాజ్యంబు ♦ నిచ్చువాఁడ
ముందు నీ వేగు కార్యసం ♦ పూర్తిఁబొందు, నిన్ను వెనుకొందు రథమున ♦ నిర్జరారి.

తా. ఈమాత్రము సాహాయ్యము నీవు చేసి నీయిష్టమువచ్చినట్లు పొమ్ము. నీకు నా రాజ్యములో సగ మిచ్చెదను. కార్యము పూర్తిచేయుకొఱకు నీవు ముందు పొమ్ము. నీ వెంట నేను దేరిమీఁద వచ్చెదను.

క. వంచించి రాము సీత గ్రహించి రణమువూట లేక ♦ యేగెద సుఖినై
యుంచుక సేపున లంకకుఁ, గొంచెపుఁబని దీని నీవు ♦ గూర్పక యున్నన్. ౨౩౯

తా. రాముని మోసగించి సీతను హరించి యుద్ధ మనుమాటలేక సుఖముగాఁ గొంచెముసేపులో నింటికిఁ బోయెదను. నీవు దీనిని జేయక పోయితివా

ఉ. కూరుచువాఁడ మృత్యువును ♦ గొబ్బున, నీ కిది సమ్మతంబ యే
కోరిక సంఘటింపు, మటు ♦ గూడ దటంచును బ్రేలెదే బలా
త్కారమునన్ ఘటించెదవు ♦ తప్పదు, తెల్విని దెచ్చుకో, సుఖా
ధారత నుందు రే బ్రదికి ♦ ధారిణిపప్రతికూలభాషణుల్? ౨౪౦

ధారిణిపప్రతికూలభాషణుల్ = రాజాజ్ఞ ధిక్కరించి మాటలాడువారు.

తా. నిన్ను శీఘ్రముగఁ జంపెదను. అటుగాక నేను జెప్పినది నీకు సమ్మతమాయెనా, నేను జెప్పినట్లు చేయుము. అటుగాదు. నాకు సమ్మతము లేదని వదరెదవా. నీచేత బలవంతముగానైనఁ జేయించెదను. తప్పదు. కావునఁ దెలివిని దెచ్చుకొమ్ము. రాజులకు విరోధించి మాటలాడువారు సుఖపడుదురా?

క. అట కేగ సందియమున్మృతి, యిటఁ బ్రేలుచు నున్నధ్రువము ♦ మృత్యువు నాచే
నటు మేలో యిటు మేలో, పటుమతి యోజించి కార్య ♦ పరుఁడవు కమ్మా. ౨౪౧

తా. నేను జెప్పినట్లు అక్కడికిఁ బోయితివా నీవు చచ్చుట సందేహము. ఒకవేళఁ దప్పించుకొన వచ్చును. ఇక్కడ నిట్టులే వదరుచుంటివా, నాచేత నీకుఁ జావు నిజము. అచ్చటికిఁ బోవుట మేలో యిచ్చటనే చచ్చుట మేలో యాలోచించి యేది తగిన కార్యమో యది చేయుము.

## ౪౧-వ సర్గము. మారీచుఁడు రావణు నిందించుట.

క. అని రాజుకరణి ముద లిడ, విని మారీచుండు పరుష♦వికటోక్తుల న
ద్దనుజాధిపునకు ననియెం, గనఁగాఁ బ్రతికూల మైన♦గతి నీగతిగన్. ౯౪౨

రాజుకరణిన్ = రాజువలె, ముదల = ఆజ్ఞ, పరుషవికటోక్తులన్ = కఠినములు, వికటములు—విరుద్ధములు నగు మాటలను - రాజువలె ననుటచే రామచంద్రమూర్తితో నెపుడు విరోధించెనో యపుడే వాని రాజత్వము పోయిన దని మున్యాశయము. కావున రాజులు చెప్ప యోగ్యమగు దాని వీఁడు చెప్పినాఁడు. కాని వీని కిట్లు చెప్ప యోగ్యత తప్పినది. లేక మీఁదఁజెప్పినట్లు ఔద్ధత్యము గలవాఁడై యని చెప్పవచ్చును. కావున మారీచుఁడు ధిక్కరించి రాజును గౌరవమెంచక మాటలాడెను.

తా. అని రాజువలె నాజ్ఞాపింపఁగా మారీచుఁడు విని నిష్ఠురములు, విరుద్ధములగు ప్రతికూలవాక్యముల నిట్లు రావణుతో ననెను.

సీ. పుత్రభృత్యామాత్య♦మిత్రాన్వితంబుగాఁ, జేటు గూర్చెడి యిట్టి♦చెనఁటిపనిని
రావణా! యేపాపి♦రా నీకు బోధించె, సుఖముగా నీ వుంట ♦ చూడలేక
యెకుచ్చితుఁడో నీకు♦మృత్యువక్త్రముఁ జూపె, జెడుపొమ్మటంచు ను♦పాయమునను
బలహీను లగుభవత్పరిపంథు లిట్లీవు, బలవద్విరోధాన ♦ భంగపడఁగఁ

ఆ. దలఁపు గూర్చినారు ♦ తెలియంగ లేవది, హితముఁ జెప్పునట్లు♦హీనుఁ డెవఁడొ
నీదుకూళచేఁత ♦ నీవ నశింపఁగఁ, గోరుచున్నవాఁడు ♦ కుటిలబుద్ధి. ౯౪౩

వక్త్రము = నోరు, భవత్పరిపంథులు = నీ శత్రువులు, బలవద్విరోధానన్ = బలవంతునితోడి విరోధముచే,

తా. కొడుకులతో సేవకులతో మంత్రులతో స్నేహితులతో నీకుఁ గీడు గలిగించు నీ దుష్టకార్యమును నీకు బోధించిన నీచుఁ డెవఁడు, వాఁడు నీచుఁడు గావుననే తాను జెడక నీవు చెడునట్లు చెప్పెను. ఉత్తముఁ డైనచోఁ బ్రత్యక్షము గనే నీతో విరోధించి యుండును. నీవు సుఖముగా నుండుట చూడలేక పోయి పడు మని యుపాయముచేసి యీనెపమున నీకు మృత్యుదేవత నోరు చూపించెను. నిన్ను యుద్ధమున జయింప బలములేని నీశత్రువులు నీ వీవిధముగ బలవంతునితో విరోధము కట్టుకొని చెడిపోవ నాలోచించినారు. అది నీవు తెలిసికోలేక యున్నావు. నీకు మేలు చెప్పువానివలె నెవఁడో దుష్టుఁడు నీవు చేయు పాపకార్యముతో నీవే నశింపఁ గోరుచున్నాఁడు.

శా. లేరా నీకు నమాత్యవర్యు? లిటు తె♦ల్వింప భాసి వర్తించు నిర్
గారా దంచు వచింపరా? హితముఁ బ♦ల్కం జూడరేఁ వారలే
లా రక్షోధిప? భూమి నింకఁ గల రే♦ ప్రాణాన? దుర్మార్గసం
చారుఁ భూపతి దిద్దనట్టిసచివుల్ ♦ చాకున్నఁ గీడౌఁ దుదిన్. ౬౪౪

తా. నీకు వేగులు లేనట్లు మంత్రులుకూడా లేరా యేమి? అట్లుండిన వారింకను జీవించియుండినఁ దెలివిలేక నీవు చేయు నీపని సరిగాదని చెప్పలేదా. అట్లు నీమేలు కోరి చెప్పని మంత్రు లుండిన నేమి లాభము? లేకున్న నేమికొఱఁత? వా రింకను బ్రదికి యున్నారా? వక్రమార్గమునఁ బోవు రాజును సరిదిద్దని మంత్రులు చచ్చుటే మేలు. వారు బ్రదికియుండినఁ గడపటఁ గీడే కలుగును.

మూఁడవపాదంబున ప్లుతయతి.

క. జనపతి ప్రసన్నుఁ డైనను, మొనయును ధర్మార్థకామ♦ములు సచివులకున్
వినుము విపర్యయమునఁ బ్రజ, వనటం బడు మంత్రుల కవి ♦ వ్యర్థంబు లగున్.

జనపతి = రాజు, ప్రసన్నుఁడైనను = సద్గుణవంతుఁ డయ్యేనేని—నిర్మలచిత్తుఁడైనయెడల, సచివులకున్ = మంత్రులకు, విపర్యయమున = విపరీతమైనయెడల, అనఁగా రాజు నిర్మలచిత్తుఁడు కానియెడల, వనటంబడున్ = దుఃఖమొందును, అవి = ధర్మార్థకామములు.

తా. రాజు సుగుణసంపత్తి నిర్మలమైనమనస్సు గలవాఁ డయ్యేనేని మంత్రులు ధర్మార్థకామములు కలిగి ధర్మములు చేయుదురు. ధనము సంపాదింతురు. కామము ననుభవింతురు. రా జట్టివాఁడుగాకున్న, మంత్రులకు ధర్మార్థకామములు లేవు. జనులు దుఃఖపడుదురు.

తే. రాజమూలంబు విజయధ♦ర్మంబు లగుట, రక్షితవ్యుండు సర్వదా ♦ రాజవరుఁడు
క్రూరుఁడవినీతుఁడును బ్రతి♦కూలుఁడైన, నృపతియెట్టులురాజ్యంబు♦నేలఁగలఁడు.

విజయధర్మంబులు = గెలుపు, ధర్మము, రాజమూలము = రాజుకారణము-రక్షితవ్యుండు = రక్షింపఁబడయోగ్యుఁడు, అవినీతుఁడు = ఇంద్రియజయములేనివాఁడు, "వినయోహీంద్రియజయ" యని కామందకుఁడు.

తా. వేరు బాగుండిన నాకులు పూలు పండ్లు బాగుండునట్లు రాజు బాగుండిన విజయము ధర్మము ప్రజలకుఁ గలుగుచుండును. ఆ కారణముచే సర్వవేళల రాజు రక్షింపఁబడఁదగినవాఁడు- అటుగాక రాజు క్రూరదండనము ఇంద్రియలోలత్వము జనవిరుద్ధతగలవాఁ డయ్యేనేని ప్రజల నెట్లు పరిపాలింపఁగలఁడు?

క. క్రూరులు ప్రధాను లైనను, భూరమణునితోడఁ గూలి♦పోదురు తారున్
సారథి మందుం డైనను, వారువములు వానితోడఁ ♦ బడు గుంతలలోన్,

తా. ఇఁక మంత్రులు క్రూరములైన యుపాయములు చెప్పువారైరా రాజుతోడఁ దాము నశింతురు. ఎట్లన్న సారథి బుద్ధిలేనివాఁడై గుఱ్ఱములఁ జక్క దిద్దుకొనలేనివాఁడు గుఱ్ఱములతోడఁ దాను గుంతలోఁబడును.

ఉ. పెక్కురుసాధువుల్ జగతిఁ ♦ బెద్దయు ధర్మరతాత్ము లయ్యునున్
దక్కటివారిదోషమునఁ ♦ దారు నశింతురు బంధుయుక్తులై
నిక్కన భూవిరుద్ధమతి ♦ నిష్ఠురుఁడై పతి రాజ్యమేలినన్
నక్కలు గాచుమేఁక లన ♦ నాశముఁ బొందెదువారు లోకులున్. ౬౪౮

తా. అనేకులు సాధువులు లోకమునఁ దాము మిగుల ధర్మమం దాసక్తి గల మనస్సుగలవారై యట్టులే వర్తించుచున్నను ఇతరులుచేసిన పాపములచే వారును బంధువులతోడ నశింతురు. ఇది నిజము. భూజనులకు విరుద్ధమైన మనస్సు గలవాఁడై రాజు రాజ్య మేలెనేని నక్కలు రక్షించు మేఁకలవలె లోకులు రాజు చేతనే చెడుదురు. కాఁబట్టి రాజును సరియైనమార్గమం దుంచవలసినది మంత్రులకుఁ బ్రజలకు విధి. అట్లుండఁడేని వానిని దొలఁగించి మఱియొకని రాజుగాఁ జేయవలయును. ప్రజలకొఱకు రాజు గాని రాజుకొఱకు ప్రజలు గారు.

ఉ. నాయెడ నాకుఁ గాఁగ వ్యస♦నంబు జనింపదు సుమ్ము కాకతా
లీయముగాఁగ వచ్చినబ♦లిష్ఠపుఁ జేటున, కీవు మూర్ఖతన్
న్యాయముఁ దప్పి యింద్రియజ♦యంబు గణింపక దుర్మనీష న
త్యాయతసేనతోఁ జెడెద ♦ వంచుఁ దపించెదఁ ద్వన్నిమిత్తమై. ౬౪౯

నే నింతదూరము నిర్బంధముగాఁ జెప్పుటకుఁ గారణము నాకు రాఁగల కీడు నకువెఱచి యని తలఁచెదవేమో, అది సరిగా దనుచున్నాఁడు. కాకతాళీయము = ఆకస్మికముగ వచ్చినది, కాకి వ్రాలుటకు తాటిపండు పడుటకు సరిపోయినట్లు, దుర్మనీషన్ = చెడుబుద్ధితో, అత్యాయతసేనతో = విస్తారసేనతో, నీవుచేసిన పాపమునకు నీ వొకఁడవే పోవునట్లుండిన వ్యసనము లేదు. విస్తారముగ సేనయంతయు నీ నిమిత్తముగఁ జచ్చెదరు. త్వన్నిమిత్తమై = నీకొఱకై.

తా. ఆకస్మికముగ నిర్నిమిత్తముగ నాకీ చెడ్డకీడు గలిగెనని నేను దుఃఖింపలేదు. చెప్పినను దెలిసికొనలేక న్యాయము వదలి యింద్రియదాసుఁడవై కావునసే చెడుబుద్ధిగలవాఁడవై నీ వొకఁడవేకాక సర్వసైన్యముతోఁ జెడెదవే యని నీకై తపించెదను.

క. ననుఁ జంపి రామచంద్రుఁడు, నిను వెంటనె చంపుఁ జుమ్ము ♦ నిక్కముగా శత్రునిచేఁ దునుమంబడుటను, దనుజకులాధీశ నేను ♦ ధన్యుఁడ నగుదున్. ౬౫౦

తా. నాకు రాఁగల మరణమునకై నేను శోకింపను అని తానుజెప్పిన మాటకుఁ గారణము చెప్పుచున్నాఁడు.

నన్ను రామచంద్రుఁడు చంపి వెంటనే నిన్నును జంపును. ఇది నిజము గావున పరమపాపాత్ముఁడవైన నీచేతఁ జచ్చుటకంటె నీ శత్రువై పరమపుణ్యాత్ముఁడైన రామునిచేఁ జచ్చితినేని ధన్యుఁడనగుదును.

విశ్వామిత్రయాగరక్షణముమొదలుకొని ఖరాదివధవఱకుఁ గల రామచంద్రుని యమానుషచరిత్రమువలన నీయన మనుష్యమాత్రుఁడుగాఁడు, భగవంతుఁడే యిట్లవతరించియుండవలెను. లేకున్న విశ్వామిత్రయాగమున నన్నుఁ బరిభవించుట, అహల్యాశాపమోచనము, శివధనుర్భంగము, పరశురామపరాభవము, పరసత్యరక్షావ్రతము, రావణుతో సమానబలుఁడగు విరాధువధించుట, ఖరాదులవధించుట, యివి మనుష్యసాధ్యములు కావు. భగవత్కృతములే యని నిశ్చయించుకొని రావణునిచేఁ జచ్చుటకంటె రామునిచేఁ జచ్చుటే శ్రేయస్కరమని చెప్పుచున్నాఁడు. ఈ సందర్భమున.

"రామాదపిహి మర్తవ్యం, మర్తవ్యం రావణాదపి, ఉభయోరపి మర్తవ్యే, వరం రామా న్నరావణాత్" రామునిచేనైనఁ జావవలె. రావణుచేనైనఁ జావవలె. చావవలసినది యొకటి నిశ్చయమై యుండ రావణుచేతఁ జచ్చుటకంటె రామునిచేఁ జచ్చుటే మేలు, అను నృసింహపురాణోక్తి స్మరింపనగు.

ఉ. ఆరఘురాముకంటఁ బడి ♦ నప్పుడె చచ్చినవాఁడ నేను, నీ
వారమణిన్ హరించి హతుఁ ♦ డయ్యెదు నమ్ముము బాంధవాళితో,
వారిజనేత్ర నెత్తికొని ♦ వచ్చితి వేనియు నీవ దేడ నీ
యూ రది యేడ రాక్షసకు♦లోత్తము లెక్కడ నే న దెక్కడన్. ౭౫౧

తా. నేను జెప్పినట్లు నీవు చేసిపోయిన నీకేల రామునివలన భయ మందు వేమో? నీవుచెప్పిన వేషము వేసికొని యెప్పుడు పోదునో యప్పుడే యాయన యిది నా వంచన యని యెఱుఁగఁగలఁడు. వంచన యని దుష్టభావముతో వచ్చితి నని యెప్పుడు తెలిసికొనెనో యప్పుడే చంపక వదలఁడు. నేను పోవుటే తరవాయి చచ్చుటే నిజము. ఆయనకన్నులకుఁ గనఁబడువఱకే నా జీవితము. ఇట్లు నే నొకఁడనే చచ్చెదను. నీవో సీతను హరించికొనిపోయి బంధువులతోఁడఁ జచ్చెదవు. నమ్ముము. నన్నుఁ జంపించి నీవు బ్రదుకుట కల్ల. సీతాదేవిని కొనిపోయితివా నీ వెక్కడ నీ యూరెక్కడ రాక్షసశ్రేష్ఠులెక్కడ, నే నెక్కడ అంద అన్ని గతులఁ బోవలసినవారే.

వసంతతిలక. నీమేలు గోరి యిటు ♦ నేను హితంబుఁ బల్కన్
నామాట నీ వెద న♦నాదృతిఁ జేసె దయ్యో
యే మందు రావణ సు♦హృజ్జనపథ్యవాక్యం
బేమాడ్కి మృత్యువశుఁ ♦ డేర్పడ నాలకించున్.　　　　౬౫౨

అనాదృతి = అనాదరణము, సుహృజ్జన=మిత్రులయొక్క, పథ్యవాక్యంబు= మేలుకలిగించుమాటను, మృత్యువశుఁడు = మృత్యుదేవతకుఁ జిక్కినవాఁడు, ఆలకించున్ = వినును,

వసంతతిలక = త భ జ జ గ గ గ ణములు, ఎనిమిదింటయతి.

తా. నీమేలుగోరి రావణా నీకు హితమైనదాని బోధింపఁగా నామాట నీ వలక్ష్యముచేసెదవు. అయ్యో నిన్ను నేనేమనఁగలను? మృత్యువునకు వశపడి చావనుండువాఁడు మిత్రులుచెప్పెడు పథ్యవాక్యములు వినఁగలఁడా?

౪౨-వ సర్గము.

చ. అని యసురేశ్వరుం గని భ♦యంబునఁ బోదము లెమ్ము రావణా
ధనురసిబాణపాణి వసు♦ధాతనయాపతి మద్వధోద్యమున్
గనుఁగొన నిట్టనిల్చిన ది♦గాలునఁ జావఁ గలాఁడ, రామచం
ద్రుని ననిఁ దాఁకియు న్నసుల♦తో మరలం గలవాఁడుఁ గల్గునే.　　　　౬౫3

భయంబునన్ = చంపుననుభీతిచేత, ధనురసిబాణపాణి = విల్లు, కత్తి, బాణములు చేతియందుఁగలవాఁడు, మద్వధోద్యమున్ = నన్నుఁజంపఁ బ్రయత్నించువానిని, దిగాలున = నిర్వ్యాపారతతో, అనిన్ = యుద్ధమందు, అసులతోన్ = ప్రాణములతో.

తా. అని రావణాసురునిఁ జూచి యాలసించిన నిపుడే చంపునను భయముచే రావణా పోదములెమ్ము. విల్లు బాణములు కత్తి చేతధరించినరాముని నన్నుఁ జంపఁ బూనినవానిఁ జూడఁగనే దిగుల్పడి నిలుచుండినవాఁడను నిలుచుండినట్లే చావఁగలను. నన్నుఁజంపుట కాయనదర్శనమే చాలును. వాస్తవమిట్లుండ యుద్ధమందు రామచంద్రుని దాఁకియు నూపిరితో మరలి వచ్చువాఁడున్నాఁడా?

తే. దండధరదండమున నిహ♦తుండ వైన, నీకు నాకును సరిపోయె ♦ నేస్తమిచటఁ
జేటు కాలంబునకుఁ దగు♦చెనఁటిబుద్ధిఁ, జేసి చెడిపోవు ని న్నేమి ♦ చేయవచ్చు.

దండధర = యముని, దండమున = దండముచే, నిహతుండవు = కొట్టఁబడినవాఁడవు, నేస్తము = స్నేహము.

తా. యమదండముచేఁ గొట్టఁబడినవారమగుట నీకును నాకును స్నేహము సరిగానే కుదిరినది. చెడిపోవుకాలము వచ్చుటఁజేసి చెడుబుద్ధిగల నిన్నేమి చేయ వచ్చును. చచ్చుటకే సిద్ధముగానుండు నీకంతకుమించిన దండన మెవఁడేమిచేయఁ గలఁడు?

తే. నాయనా యిదెపోవుచు♦న్నాఁడ నీకు, స్వస్తియగుఁగాత మనినను♦సంప్రహృష్ట
చిత్తుఁడై పల్కు రాక్షస ♦ శేఖరుండు, దనదుకౌఁగిటఁ జేర్చి యా♦తనిని దమిని.

సంప్రహృష్టచిత్తుఁడై =సంతోషించినమనస్సుగలవాఁడై, తమిని= ప్రేమతో.

తా. రావణా నీవుచెప్పినట్లు నేను ముందు నిదిగోఁ బోవుచున్నాను. నీకు మేలగునుగాక! యని చెప్పఁగా రావణుఁడు సంతోషించి ప్రేమతో నతనిఁ గౌఁగి లించెను.

శా. సైరా యిట్టులు మాటలాడ వలదా ♦ శౌండీర్యయుక్తంబుగా
నారం జూచిన మద్వచస్సరణిగా♦హా యిప్డు డై తీవు పో
మారీచుండవు పూర్వ మెవ్వఁడవొ, మా♦మారీచుఁ డట్లాడునే,
యారోహింపుము రత్నభూషితమదీ♦యస్యందనంబుల్ వెసన్. ౬౫౬

సైరా = అంగీకారమునుసూచించు శ్లాఘావాక్యము ప్రశంసార్థకము. శౌండీర్యయుక్తంబుగాన్ = వీర్యముతోఁగూడినట్లు, శౌండీరభావము, శౌండీర్యము, వీర్యమువలె, "శౌండీరస్త్యాగివీరయోః" నిఘంటు, మద్వచఃసరణిగాన్ = నా మాటలవిధముగ, హా=ప్రశంసార్థకము, ఆరోహింపుము=ఎక్కుము, రత్నభూషిత= రత్నములచే నలంకరింపఁబడిన, మదీయ = నాయొక్క, స్యందనంబున్ = రథమును, వెసన్ = త్వరగా.

తా. సైరామారీచా!! పౌరుషముతోఁగూడినమాట లిట్లుగదా మాటలాడవలె. నామాటల ననుకరించియుండునది యిదిగదా. ఇప్పుడు నీవు నిజమైన మారీచుఁడవు. పూర్వమెవ్వఁడవో మామారీచుఁడావిధముగఁ బిఱికిబంటువలె మాటలాడునా? రత్నములచే నలంకరింపఁబడిన నా రథ మెక్కుము. త్వరగా నెక్కుము. పోదము.

—రావణమారీచులు పంచవటికిఁ బ్రయాణ మగుట.—

ఉ. వచ్చెద నేను దోన, యట ♦ వచ్చి ధరాసుత మోసగించి నీ
యిచ్చను బొమ్ము, నేనును మ♦హీసుత యొంటిగ నుండ బల్మిమైఁ
జెచ్చెర సంగ్రహించికొని ♦ చేరెద లంక, నటంచుఁ దద్రథం
బచ్చెలపాది యెక్కి చనె ♦ నాశ్రమమండలి దాఁటి చేయ్యనన్... .. ౬౫౭

తోన = తోడన, నీవెంట, బల్మిమై = బలాత్కారముగ, చేలపాది= మాత్సర్యస్వభావముగలవాఁడు.

తా. నేను నీతోడనే వచ్చెదను. అచటికి వచ్చి జానకిని మోసగించి నీయిష్ట మునచ్చినట్లు పొమ్ము. నేను నొంటరిగానుండు సీతను బలాత్కారమున గ్రహించి లంకకుఁ బోయెదను. అని యామచ్చరి యారథమెక్కి యా యాశ్రమప్రదేశము త్వరగా దాఁటిపోయెను.

చ. చని చని రాక్షసేశ్వరుఁడు ♦ శైలసరిద్వనభూరిరాష్ట్రప
త్తననగరంబులం గడచి ♦ దండకలో రఘురామునాశ్రమం
బును గని తేరు డిగ్గి కర♦ముం దనకేలఁ గదించి మిత్రుతో
ననియె నరంటిచెట్లు గల♦యద్దియె రామునివాస మోసఖా.  ౬౯

చనిచని = పోయిపోయి, దూరప్రదేశగమనము కావున ద్విరుక్తి, శైల, సరిత్, వన, భూరిరాష్ట్ర, పత్తన, నగరంబులన్ = కొండలను, నదులను, అడవులను, పెద్దరాష్ట్రములను, పట్టనములను, నగరములను, కరమునన్ = మారీచుని చేతిని-నగరము = క్రీడార్థము వృక్షములు. నగ (పర్వతములు) ములుగలది నగరము. పర్వతసమానములైన రాజగృహములుగలది నగరము. నగరీ యని రూపాంతరము గలదు. వర్తకులు దీనింగురించి వత్తురు గనుక పత్తనము— పట్టనము. ఈభేదము లీశ్లోకములవలనఁ దెలియనగు.

గ్రామశ్చ నగరంచైవ పట్టనం ఖర్వటం పురం। ఖేటకం కుసుమంచైవ। శిబిరం రాజవాసికం, సేనాముఖ మితిత్యేవం దశధా కీర్తితం బుధైః॥ విప్రాణాంచ సభృత్యానాం వాసో గ్రామ ఇతీరితః। సఏవ విప్రై రాకీర్ణ స్త్వగ్రహార ఇతిస్మృతః॥ కుటుంబి భేదై రేకోనత్రింశద్భిశ్చ సమన్వితః। అనేకనారీసంబద్ధం నానాశిల్పజనైర్వృతం, క్రయవిక్రయకై కీర్ణం సర్వదేవైస్సమన్వితం నగరం త్వితి విఖ్యాతం పట్టనంశ్రుణు సాంప్రతం, ద్వీపాంతరాగత ద్రవ్య క్రయవిక్రయకైర్యుతం, పట్టనం త్వభిధీరే స్యాత్తయోర్మిశ్రంతు ఖర్వటం, క్రయవిక్రయ కైర్యుక్తం నానాజాతి సమన్వితం, తంతువాయ సమాయుక్తం తత్పురం త్వితి కథ్యతే, ఏతైరధిష్ఠితం యత్తత్ ఖేటకం పరికీర్తితమ్। తేషామేకాంతరేష్వేవ వాసః కుసుమముచ్యతే॥ వాస్తుశాస్త్రము.

తా. ఇట్లు పోయిపోయి రావణుఁడు కొండలను, నదులను, వనములను, రాష్ట్రములను, పత్తనములను, నగరములను దాఁటి దండకయందుండు రామచంద్రునియాశ్రమముఁ జూచి తేరు దిగి మారీచుని చేతిని తనచేతఁ బట్టుకొని, మిత్రమా! యదిగో నరఁటిచెట్లుగలదే రాముని నివాసభూమి.

## మారీచుఁడు మాయామృగం బగుట.

సీ. మనము వచ్చినయట్టి♦పనిని గా నిమ్మన, ననఘమణీద్ధశృం♦గాగ్రములును
తెలుపు నల్పును గల♦లలితముఖంబును, గెందమ్మికల్హారా♦లంద మైన
యాస్యంబు నింద్రనీ♦లాభశ్రవణములు, కించిదభ్యున్నత♦గ్రీవ మొనరి
నీలదళాధరం ♦ బోలిఁ గుందేందువ, జ్రాభంబు నుదరంబు ♦ నబ్జ కేస

తే. రములఁ బోలెడివీఁపు పా♦ర్శ్వము మధూక
కాంతి వైడూర్యనిభఖుర♦గణము సుతను
జంఘులును గల్గి వాసవ♦చాపతుల్య
మూర్ధ్వపుచ్ఛంబు మెఱుఁగుల♦యొప్పు గలిగి. ౬౫౯

అనఘమణీ = గొప్పరత్నమైన యింద్రనీలమువలె, ఇద్ధ = ప్రకాశింపఁజేయఁబడిన, శృంగ+అగ్రములు = కొమ్ములకొనలు, లలితముఖము = ముద్దుమోము, కెందమ్మి = ఎఱ్ఱతామర, కల్హారాలు = కలువకాంతి, ఆస్యంబు = ముఖములోని పైభాగము, ఇంద్రనీలాభ = ఇంద్రనీలములకాంతిగల, శ్రవణములు = చెవులు, కించిత్ = కొంచెముగా, అభ్యున్నత = ఎత్తైన, గ్రీవము=మెడ, నీలదళాధరంబు = ఇంద్రనీలములతునుకలవంటి పెదవి, కుందేందువజ్రాభంబు= మొల్లలు, చంద్రుఁడు, వజ్రము, వీనివంటిదగు. ఉదరంబు = కడుపు, అబ్జకేసరములు = తామరలయందలి యకరువులు, మధూకకాంత = ఇప్పపూవువంటి రంగుగలది, పార్శ్వము= ప్రక్క, ఒక్కప్రక్కయే యిట్లుండునది. రెండవప్రక్క పసిఁడివెండి జిగుల్ మీఱు ప్రక్కలని. ౬౬౯ పద్యంబునఁగలదు. వైడూర్యనిభ=వైడూర్యములతో సమానమైన, ఖురగణము = గిట్టలసమూహము, సుతనుజంఘులు = అందమై సన్ననైనపిక్కలు, వాసవచాపతుల్యము=ఇంద్రధనుస్సుతో సమానము అనఁగా ననేకవర్ణములుగలది. ఊర్ధ్వపుచ్ఛము = తోఁక పైభాగము. పైపద్యముతో నన్వయము.

తా. మన మేమి పనికై వచ్చితిమో యాపని చేయు మని రావణుఁడు చెప్పఁగా నింద్రనీలమణులకాంతిగల కొనకొమ్ములును తెలుపు నలుపు గల యందమైన ముఖమును, ఎఱ్ఱతామర-కల్వరంగుగల ముఖము, ఇంద్రనీలములవంటి చెవులు, కొంచె మెత్తైన మెడ, నీలముల పలుకులవంటి పెదవి, మొల్లలు చంద్రుఁడు వజ్రమువలెఁ దెల్లనైన కడుపు, తామరలయందలి యకరులవంటి వీఁపు, ఇప్పపూవుల వంటి ప్రక్క, వైడూర్యములవంటి గిట్టలు, సన్నని పిక్కలు, ఇంద్రధనుస్సువలెఁ బలు రంగులుగల తోఁకపై భాగముయొక్క మెఱుపులు గలిగి.

క. నిమిషంబున మారీచుఁడు, రమణీయం బైనహరిణ♦రాజం బగుచున్
క్రమముగఁ దిరుగుచు రామా, శ్రమముల్ వెలిఁగించె నాయ♦రణ్యమునందున్.

హరిణరాజము = శ్రేష్ఠమైన జింక.

తా. నిమిషములో మారీచుఁడు శ్రేష్ఠమైన జింకయై క్రమముగఁ దిరుగుచు నాయరణ్యమునందు రామునితపోవనమును బ్రకాశింపఁజేసెను.

ఉ. జానకి బేలుపుచ్చ దను♦జప్రవరుం డట లేఁజిగుళ్లులన్
మానుగఁ ద్రుంచు, లేఁగసవు♦నం జరియించు, గ్రసించు, వెంజి రం
భానవగేహకంబుల న♦మందగతిన్ విహరించుఁ, దన్ను న
బ్జానన చూడఁగల్గుతల♦మందు యథామతి సంచరించెడున్. ౬౬౧

బేలుపుచ్చన్ = మోసగింప, వేఁగసవునన్ = లేఁతపచ్చికయందు, గ్రసించు = తిను, రంభానవగేహకంబులన్ = అరఁటిచెట్లచేఁ జేయఁబడిన క్రొత్తకల్పితగృహములందు, అమందగతిన్ = వడిగా, యథామతి=మనస్సునకువచ్చిన చొప్పున.

తా. జానకీదేవిని మోసగించుటకై యారాక్షసుఁడు లేఁతచిగుళ్లను ద్రుంచుచు లేఁతపచ్చికపట్టుల సంచరించును. దానిని గొఱికి తినును. అరఁటిచెట్లతోఁ గల్పింపఁబడిన క్రొత్తయిండ్లయందు వడివడిగాఁ దిరుగును. ఎచ్చటఁ దిరిగిన సీత తన్నుఁ జూడఁగలదో యచ్చట నిచ్చకొలఁదిఁ దిరుగును.

క. పఱచున్ దవ్వుగఁ బచ్చికఁ,గఱచున్ మృగయూథములను♦గలయున్ ధ్వనికిన్
వెఱచుం జను మరలున్ వా, తెఱచుం బన్నుండు కొన్ని♦తెరువులయందున్.

పఱచున్ = పరువెత్తును, వా = నోరు, పన్నుండున్ = పండుకొనును.

తా.దూరముగఁ బరువెత్తును. పచ్చికకొఱుకును. ఇతరములయిన జింకల గుంపులలోఁ గలయును. చప్పుడైన నులికిపడును. పోవును,మరల వెనుకకువచ్చును. ఆవలించినట్లు నోరు తెఱచును, కొన్నిమార్గములందుఁ బండుకొనును.

క. ఆశ్రమము జేర వచ్చున్, మైశ్రమము హరించునట్లు♦ మహిఁ బచ్చికపై
విశ్రమ మొనరఁ బరుండు గ,తశ్రమ మైనట్లు లేచి♦ తటుకునఁ బోవున్. ౬౬౩

తా. ఆశ్రమసమీపమునకు వచ్చును. దేహముబడలికఁ బాపుకొను దానివలె భూమిమీఁదఁ బచ్చికపై కొంచెముసేపు పండుకొనును. బడలిక తీరినదానివలె లేచి తటాలునఁ బోవును.

క. పలురంగుల మెయిబిందులు, తళుక్కొత్త చివాలటంచు♦ దాఁటున్ దోఁటన్
నిలుచుం దరలున్ మరలుం,దొలఁగున్ మలఁగున్ హొరంగుర దోరముగాఁగన్.

తా. పెక్కువిధములయిన రంగులుగల దేహమునందలి చుక్కలు తళుక్కనునట్లు చివాలున దాఁటును. తోఁటయందు నిలుచును. మరల బయలుదేఱిపో

వును. కొంచెము సేపు దూరముగఁ దొలఁగిపోవును. దేహకాంతి యతిశయించునట్లు మరలును.

ఉ. మండలనుండి వచ్చు నవ♦మండలచిత్రగతిం జరించు నా
సుందరి చూడ నిట్టటులు ♦ చూచును నిట్లు చరింపఁ గానన
బందలియన్యజంతుచయ ♦ మాదట డాసియు మూరుకొంచు వే
చిందఱవంద లై భయము♦చేఁ బఱచున్ దశదిక్తటంబులన్. ౬౬

మండలచిత్రగతిన్ = గుండ్రము గుండ్రముగా వింతవిధముగ, అన్యజంతుచయము = ఇతర జంతుసమూహము, ఆదటన్ = ప్రేమతో, మూరుకొంచున్ = వాసనచూచుచు, చిందఱవందలై = చెల్లాచెదరై పఱచున్, = పరువెత్తును, దశదిక్తటంబులన్ = పదిదిక్కులయందలి ప్రదేశములను.

తా. మృగములగుంపులతోడఁ బోయి మరలివచ్చును. క్రొత్తగా మండలాకారముగా గావా తిరిగినట్లు తిరుగును. సీతను జూడనివిధముగ నీప్రక్క నాప్రక్క చూచును. ఈప్రకార మడవిలోఁ దిరుగుచుండఁగా తక్కిన మృగములు నిజమైనమృగ మని సమీపించి వాసన చూచి భయపడి చెదఱిపోయి భయముచే దిక్కుదిక్కులకుఁ బరువెత్తును. వాసనచే వాస్తవము తెలిసికొనుశక్తి మృగములకుఁగలదు.

క. మృగవధరతుఁ డయ్యును నా,మృగలోచన మోసగింప ♦ స్పృశియించును ద
న్మృగముల మఱుఁ గిడుచును నై,జగుణముఁ దత్కాలమంద ♦ జానకి నెమ్మిన్.

మృగవధరతుఁడు = మృగములఁ జాపుటయందుఁ బ్రీతిగలవాఁడు, మృగలోచనన్ = జింకకన్నులవంటి కన్నులుగల సీతను-నైజగుణము= స్వభావగుణము, మఱుఁగిడుచును = దాఁచుచు.

తా. మృగములఁ జంపుటయందు నాసక్తిగలవాఁడయ్యును సీతాదేవి యిది నిజమైన జింక యని తలఁచునుగాక యని యవి సమీపమునకు వచ్చినను దనస్వభావము దాఁచి వానిని నూరక స్పృశించునేకాని చంపఁడు. ఇట్లది తిరుగుచున్న కాలమందే జానకి సంతోషముతో

## ౪౩-వ సర్గము. జానకి మాయామృగంబును జూచుట.

క. కుసుమాపచయక్రీడా,లసమాన యశోకచూత♦లాలితసుమనో
విసరంబులఁ గోయుచు నా,యసమానమృగంబుఁ గాంచి ♦ యబ్బురపోయెన్.

కుసుమాపచయ = పూలుగోయు, క్రీడా = ఆటచే, లసమాన=ప్రకాశించునది, అశోక+చూత+లాలిత+సుమనో+విసరంబులన్ = అశోకవనములయు

మామిళ్లయు కోమలమైన పూలసమూహంబులను-దీనివలన నిది వసంతఋతువని యేర్పడెను.

తా. పూలుకోయు క్రీడచే ప్రకాశించుచు అశోకములందలి మామిళ్ల యందలి పూలుగోయుచు నాయీడులేని జింకను జూచి యాశ్చర్యపడెను.

తే. హారిదంతోష్ఠి విస్మయ♦హసితనేత్ర
స్నేహపూర్వంబుగాఁ జూచెఁ ♦ జిత్రమృగము
మదిరలోచన తనుఁ జూచి ♦ ముదము గొనెడి
కొలఁది నదియును వింతవే♦డ్కల నొనర్చు. ౬౬౮

హారి = మనోహరమైన, దంతోష్ఠి = దంతములు పెదవులు గలది, విస్మయ = ఆశ్చర్యముచే, హసిత = నవ్వుచున్న, నేత్ర = కన్నులుగలది, మదిరలోచన = ఆనందముగలిగించు చూపులుగలది.

తా. మనోహరమైన దంతములు, పెదవులు గలిగి ఆశ్చర్యముచే నవ్వుచున్న కన్నులుగలదై వింతజింకను ప్రేమతోఁ జూచెను. సీతాదేవి తన్నుఁజూచి సంతోషించుకొలఁది నదియును వింతవింత వేడుకలు సేయును.

తే. పసిఁడివెండిజిగుల్ మీఱు♦ప్రక్కలమరఁ, గానవెలిఁగించుచిత్రమృ♦గంబుఁగాంచి
రండు రండని సతి పిల్చెఁ ♦ బ్రాణనాథు, సంభృతాయుధు లక్ష్మణు ♦ సత్వరముగ.

జిగుల్ = కాంతులు, సంభృతాయుధున్ = ధరింపఁబడిన యాయుధము గలవానిని, ఇట్లు చెప్పుటచే నాయుధములతోడ రండని, సీత పిలిచె నని యూహింపఁదగును.

తా. వెండిబంగారు కాంతులుగల ప్రక్కలొప్పుచు నడవినిఁ బ్రకాశింపఁ జేయుచున్న వింతజింకను జూచి సీత తనభర్తను రామచంద్రుని, ఆయుధధరుఁడైన లక్ష్మణు రండురండని పిలిచెను.

శా. చేర న్వచ్చి సుమిత్రపట్టి కని యా♦జింకం గడున్ శంకచే
శ్రీరాముం గని యిట్లు వాకొనియె, మా♦రీచాసురుం డేతదా
కారం బూని మునీశపాళి మృగయా♦కాంక్షాగతోర్వీశులన్
క్రూరుం డై వధియించు నీయడవిఁ గా♦కుత్థ్సాన్వయగ్రామణీ. ౬౭౦

ఏతదాకారంబు = ఇటువంటి రూపమును, మునీశపాళిన్ = మునీశ్వరుల సమూహమును, మృగయా = వేఁటయందలి, కాంక్షా=కోరికచే, ఆగత=వచ్చిన, ఉర్వీశులన్ = రాజులను, కాకుత్థ్సాన్వయగ్రామణీ = కకుత్థ్సునివంశమునఁ బుట్టిన వారిలో శ్రేష్ఠుఁడా, వాకొనియెను = చెప్పెను.

తా. దగ్గఱకు వచ్చి లక్ష్మణుఁడు దానిని జూచి సందేహించి శ్రీరాములతో నిట్లు చెప్పెను. రఘూత్తమా! మారీచుఁడను రాక్షసుఁ డిటువంటి యాకారమును బూని మునీశ్వరులను వేటకై వచ్చిన రాజులను క్రూరుఁడై వధించుచుండును.

క. మాయావి యల్లయసురుఁడె, మాయామృగరూప మెత్తి ♦ మలయును గంధ
ర్వాయతపురి యట్టిది యీ, కాయము నిక్కంబు గాదు ♦ కంజదళాక్షా. ౬౭

మాయావి = మాయగలవాఁడు,-కల యను నర్థమున విన్ ప్రత్యయము వచ్చును. అస్మాయామేధాస్రజో వినిః పాణిని. 5, 2, 121. మాయావి-మేధావి-స్రగ్వి - తేజస్వి — మలయును = తిరుగును, గంధర్వాయతపురి = విశాలమైన గంధర్వనగరము- ఆశ్చర్యముగఁ గనఁబడి క్షణములో నశించెడి మేఘాకారము గంధర్వనగర మనఁబడును. మాయామృగరూపము=అద్భుతమైన యోగశక్తిచేఁ గల్పించుకొనిన జింకరూపము.

తా. యోగశక్తిగల యీ రాక్షసుఁడే తన యద్భుతయోగశక్తిచే జింకవలెనై తిరుగుచుండును. ఈ యాకారము గంధర్వనగరము వంటిది, నిజముకాదు. నిజమైన జింక యెట్లుపయోగపడునో యిది యట్లు లుపయోగపడదు.

సీత మాయామృగంబును బట్టి తెమ్మని కోరుట.

ఉ. కంటిమె వింటిమే కనక♦కాంతిమణీమయ మామృగంబు, నా
కంటికిఁ జూడ మాయ యనఁ♦గా, శుచిహాసిని భర్తఁ జేరి వా
ల్గంటి మఱంది నాఁగి నిజ♦కాంతునితో మృగచర్మమందు లో
నంటినమక్కువం బలికెఁ ♦ బ్రాణధవా! విను మాస గొల్పెడిన్. ౬౮

కనకకాంతిమణీమయము = బంగారుకాంతియు మణులకాంతులచే నిండియుండునదియు, మాయ = వంచన, శుచిహాసిని=పరిశుద్ధమైన నవ్వుగలది, ఆఁగి= అడ్డగించి.

తా. బంగారువన్నె కలదియు నవరత్నముల కాంతులుగల చుక్కలు నవయవములు గలదియు నగు జింక యిన్నిసంవత్సరము లడవులలోఁ దిరిగినను మనము చూచితిమా, లేక శాస్త్రములు-లోకులు చెప్పఁగా వింటిమా? లేదు. కావున నిది మోసపువేషము అని చెప్పుచుండఁగా లక్ష్మణుని నిలిపి, చిఱునవ్వుతో భర్తయొద్దకుఁబోయి యావాలుఁగంటి మృగచర్మమందు మనస్సున గలిగిన ప్రేమచే నిట్లనెను. ప్రాణేశ్వరా! వినుము. ఇది యాశ గలిగించుచున్నది.

ఉ. దాని మహాభుజా! లఘువి♦ధంబునఁ బట్టుము, కేళి కౌను, నీ
కాననమందుఁ జూడమె మృ♦గంబుల భల్లుకకిన్నరాళులన్

వానరచామరంబులను ♦ వానికి నీతనుశోభగల్గెనే?
కానము దీనితుల్య మగు♦కాంతమృగంబు నిజంబు వల్లభా. ౬౭౩

మహాభుజా = గొప్పభుజములు గలవాఁడా, ఇంత పెద్దచేతులు బలము గల వాఁడవు. ఈ జింకను బట్టలేవా యని భావము. లఘువిధంబున=సునాయాసముగ, కేళికిన్ = ఆటకు, భల్లుక = ఎలుఁగులయు, కిన్నర=కిన్నరపక్షులయు, అఖిలన్ = వరుసలను, వానర = క్రోఁతులను, చామరంబులన్ = చమరమృగంబులను, తను శోభ = దేహకాంతి, కాంతమృగంబు=మనోహరమైన జింక, వల్లభా=ప్రియుఁడా, అనుటచే నాయందుఁ బ్రీతియుండిన దీనిని బట్టి తెమ్మని భావము.

తా. వల్లభా, మహాబాహూ, దీనిని సులభోపాయముగఁ బట్టుము. నే నడిగితి నని ప్రయాసపడవలదు. నీ కేల యిది యందురా ఆడుకొన నుపయోగించును. ఈ యడవియందు మనమెన్ని యెలుఁగుగొడ్లను, చమరమృగములను, క్రోఁతులను, కిన్నరములను చూడలేదు. దీని దేహకాంతి దేనికైనఁగలదా? ఇంత వింతయైన కాంతిగల మృగము మనము చూడలేదుగదా.

ఉ. జింకలు లేవె లోకమునఁ ♦ జిత్రమృగంబుల నెన్ని చూడ, మీ
పొంకపువన్నెయుం జనవు♦పోణిమి కంటిమె దేనియందు? న
ల్వంకల మేనికాంతులు ద♦ళంబుగఁ జల్లుచుఁ గానలోన నే
ణాంకునిఁబోలి యున్నది ప్రి♦యా! దయ దానిని బట్టి తేఁగదే. ౬౭౪

ఏణాంకునిన్ = చంద్రుని.

తా. లోకములో నెన్ని జింకలు లేవు. వింతమృగంబు లెన్ని లేవు. వానినెల్ల మనము చూడలేదా. ఈయందమైన వన్నె,జనవుపొందిక దేనియందైనఁ గంటిమా? దీనిని జూడుఁడు. నాలుగుప్రక్కలఁ దన దేహకాంతులు దట్టముగఁ జల్లుచు చంద్రుని వలె నున్నది. నాయందు దయయుంచి దానిని బట్టకొని రమ్ము.

తే. ఔర రూపంబు బళిబళీ♦యరరె లక్ష్మి, స్వరముసంపద బళిర ప్ర♦శస్త మనఘ
మద్భుతం బైనయీలేడి ♦ ప్రాణనాథ, లాగుచున్నది నామది ♦ బాగుగాను.

తా.ఆహా! యేమి దీనియందము. ఔరా! దీనికాంతిసంపద. బళే! దీని స్వరమాధుర్యము. ప్రశస్తము, నిర్దుష్టము అయిన యీజింక ప్రాణేశ్వరా! నా మనస్సును బాగుగా లాగుచున్నది.

ఉ. జీవముతోడఁ బట్టుపడఁ ♦ జిత్రము గల్గునె దీనికంటె నోం
డావలఁ, గాననస్థితి స♦మాప్తము చెందఁ బురంబుఁ జేర మో
దావహభూషణం బగుచు ♦ నంతిపురంబు నలంకరింపదే
భావనచేసి చూడుము నృ♦పాలశిరోమణి! మద్వచస్థితుల్. ౬౭౬

కాననస్థితి = అడవులయందునికి, మోదావహభూషణంబు=సంతోషకరమైన యాభరణము, అంతిపురము = అంతఃపురము, మత్ + వచస్ + స్థితుల్ = నామాటలయొక్క విధము,

తా. ఈ మృగముప్రాణముతోఁ బట్టువడెనా యింతకంటెఁ జిత్రమైనది మఱియొకటి యేది యున్నది? మన వనవాసకాలము పూర్తికాఁగా మనము పురమునకుఁ బోయినపుడు మనయంతఃపురమునం దిది యొకభూషణమై దానిని సింగారింపదా? రాజచూడామణీ! నేను జెప్పినది నిజమగునో కాదో యాలోచింపుము.

క. భరతునకుఁ మీకును నా, కరయుము మాయత్తలకును ♦ వ్యక్తంబుగ నీ
హరిణము విస్మయజనకము, పురుషోత్తమ దీనిభంగి ♦ బుద్ధిం గనుమీ. ౯౭

తా. దీనిని జూచి సంతోషించు దానను నే నొకతనే కాను. భరతునకు, తక్కిన మీతమ్ములకు, నాకు మాయత్తలకును, స్పష్టంబుగ నీజింక యాశ్చర్యము కలిగించును. పురుషశ్రేష్ఠా! దీనిని విచారింపుము.

తే. ప్రాణములతోడ నియ్యది ♦ పట్టుపడక, పోయినను దీనిచర్మ మ♦మేయముదముఁ
గూర్చుఁ బచ్చికబృసిమీఁద♦బర్చి దీనిఁ, గోర్కెఁ జేసెద నీతోడఁ♦గూరుచుండ.

అమేయముదము = అపరిమితసంతోషము, పచ్చికబృసిమీఁద = గడ్డియాసనముమీఁద. "వ్రతీనా మాసనం బృసీ" అమరకోశము.

తా. ఒకవేళ నిది ప్రాణముతోఁ బట్టువడక పోయినను దీని చర్మమైనను నపరిమితానందము గలిగించును. కావున లేఁబచ్చికతోఁ జేయఁబడిన దర్భాసనముపై దీనిని బఱచి నీతోడఁ గూర్చుండఁ గోరుచున్నాను.

చ. అది యిది లేదు గావలయు ♦ నంచుఁ బతిన్ వ్యథపెట్టు టెంతయున్
సుదతికిఁ గ్రూరమైనపని ♦ సుమ్ము, మదాశయ మిద్ది, యైన ని
య్యది తనమేనికాంతిఁ గడు♦నచ్చెరువున్ ఘటియించె నా కనన్
విదితపరాక్రముండు మృగ♦విస్మయకారణవర్ణశృంగముల్. ౯౯

మదాశయము = నాయభిప్రాయము, విదితపరాక్రముండు = ప్రసిద్ధికెక్కిన శౌర్యముగలవాఁడు, మృగ = జింకయొక్క, విస్మయకారణ = ఆశ్చర్యమునకు హేతువైన, వర్ణ = వన్నెగల, శృంగముల్ = కొమ్ములు.

తా. ప్రాణేశ్వరా! నాకది లేదు ఇది లేదు. అది కావలె నిది కావలె నని (కైకవలె) స్త్రీలు భర్తను సంకటపెట్టుట మిక్కిలి క్రూరమైనపని సుమీ. ఇది తగినది కాదని నాయభిప్రాయము. ఆకారణముచే నేనేదియు మి మ్మడిగినదానఁ

గాను. అయినను నిప్పుడుమాత్ర మిదికావలె నని యేల కోరెదవందువా? దీని దేహకాంతి నాకు మిక్కిలి యాశ్చర్యమును గలిగించెను. ఆఁడుదాననుగాన నిబ్బరించుకొనలేకయును, ఇది మీకు సులభసాధ్య మగుటను, ఊరికిఁబోయినపుడు ఇన్నాళ్ళడవులలో నుంటి రే-ఏమి వింతవస్తువు తెచ్చితి వని నాచెల్లెండ్రు స్నేహితురాండ్రడుగుదు రేమో యనియు దీనిని గోరితిని. (సముచ్చయ మీయర్థముల స్ఫురింపఁజేయుచున్నది.) ముందు మించి నోరు జాఱెను. క్షమింపుఁడు. అని సీతాదేవి చెప్పఁగా ప్రసిద్ధికెక్కిన పరాక్రమముగల రామచంద్రమూర్తి యాజింకయొక్క యాశ్చర్యకరమైన కొమ్ములు.

క. కాంచనరోమంబులు ర, త్నాంచితశృంగములు నీర♦జాప్తప్రభయుక్
మించిననక్షత్రంబుల,సంచును వెర గొల్ప మిగుల ♦ సమ్మదపరుఁ డై. ౬౮౦

కాంచనరోమంబులు = బంగారువన్నెగల వెండ్రుకలు, రత్నాంచితశృంగములు = రత్నములవలెఁ బ్రకాశించుకొమ్ములు, నీరజాప్తప్రభయుక్ = సూర్యుని కాంతియు, వెర = ఆశ్చర్యము, సమ్మదపరుఁడై = సంతోషించినవాఁడై.

తా. బంగారువన్నె వెండ్రుకలు, రత్నకాంతులుగల కొమ్ములు సూర్యుని కాంతియు నక్షత్రములవంటిచుక్కలు మిగుల నాశ్చర్యము గలిగింప సంతోషించిన వాఁడై.

—❀❀ శ్రీరాముఁడు లక్ష్మణునకు సమాధానముఁ జెప్పుట. ❀❀—

క. సీతావాక్యము విని మృగ, రీతిం గని యాసపడుచు ♦ శ్రీరఘుపతి భూ
జాతాప్రచోదితుం డై, భ్రాతం గని యిట్టు లనియెఁ ♦ బరమముదమునన్. ౬౮౧

భూజాతాప్రచోదితుండై = సీతచేఁ బ్రేరింపఁబడినవాఁడై, భ్రాతన్ = తమ్ముఁడగు లక్ష్మణుని - మీఁదిపద్యమునందలి 'వెరగొల్ప' ననునదియు, నీపద్యమునందలి "యాసపడుచు" ననునదియు శ్రీరాముఁడు కేవల భార్యాసంతుష్టికై యామెచేఁ బ్రేరింపఁబడి మృగము వెంటఁ బోలేదనియు నది యాయనకుఁగూడ నాశ్చర్యము గలిగించుటచే నాయనయు నాసపడిపోయె ననియు గ్రహింపనగు.

తా. సీతాదేవిమాటలు మృగమునీటులు చూచి జానకిచేఁ బ్రేరింపఁబడినవాఁడై పట్టుకొనఁ గోరి శ్రీరామచంద్రమూర్తి సంతోషముతో లక్ష్మణునితో నిట్టు లనెను.

ఉ. కంటివె లక్ష్మణా! ధరణి♦కన్యకకుం గలజింకయాశ, ము
న్నంటిమె యిట్టిరూపమును ♦ గల్గుమృగం, బిఁకఁ గల్గ నేర్చు నే,
వింటిమె నందనంబునఁ గు♦బేరవనంబున నైన నుంట, మి
న్నంటెను దేజు హాటకస♦మంచితబిందుకబృందరమ్య మై. ౬౮౨

మిన్ను = ఆకాశము, హాటక = బంగారువలె, సమంచిత = బాగుగఁ బ్రకాశించు, బిందుక = చిన్నచుక్కలయొక్క, బృంద = సమూహముచే, రమ్యమై = అందమై.

తా. లక్ష్మణా! చూచితివా, యీమృగముమీఁద సీత కెంత యాసయున్నదో. ఆఁడువారిమాటలకు వారికోరికలకు నేమిలే యందువా యామెమాట నటుండ నిమ్ము. మనమైనను నిటువంటి సౌందర్యముగల జింకను జూచితిమా. ఇఁకమీఁదఁ జూడఁగలమా. ప్రపంచమంతయు మనము చూచితిమా. ఎందేమున్నదో యందువేమో. చూడకున్నఁబోనిమ్ము. ఈలోకమునఁగాకున్నఁ బోనిమ్ము. ఇంద్రుని నందనవనమున కుబేరుని చైత్రరథమున నున్నదని యెవరైనఁ జెప్పఁగా విన్నామా? లేదుకదా. దీనికాంతి యాకాశ మంటుచున్నదే. బంగారువన్నెచేఁ బ్రకాశించు చుక్కలసమూహముచే నందమై.

తే. రోమములు ప్రతిలోమానులోమముగను
గొనబు మీఱెడి నావలించినను వెడలె
మేఘమున నుండి వెల్వడు మెఱుఁగువోలె
నగ్నిశిఖవోలు నాలుక యాననమున. ౬౮౩

రోమములు = వెంట్రుకలు, ప్రతిలోమానులోమముగను = పైనుండి క్రిందివైపుగా వ్రాలియుండునవి అనులోమరోమములు, వానికెదురుగా క్రిందినుండి పైకివ్యాపించినవి ప్రతిలోమరోమములు-ఒకప్రదేశమున నటులు నొకప్రదేశమున నిటు లుండును. గొనబు = అందము, ఆననమునన్ = నోటియందు.

తా. వెంట్రుకలు కొన్ని యనులోమముగను గొన్ని ప్రతిలోమముగను నందమై యున్నవి. అది యావలింపఁగా మేఘమునుండి వెలువడిన మెఱుఁగువలె నగ్నిజ్వాలవంటి నాలుక నోటినుండి వెడలుచున్నది.

తే. ఇంద్రనీలసమం బయి యెసఁగు మోము, శంఖముక్తానిభం బగు జఠరసీమ
మేలిసౌందర్యములదీవి మృగముఁ దీవి, యెవనిమానసమును హరి యింప లేదొ.

శంఖ, ముక్తా, నిభంబు = శంఖముతోను ముత్యములతోను సమానమైనది, జఠరసీమ = ఉదరము, దీవి = ద్వీపము.

తా. ఇంద్రనీలకాంతి గలముఖము శంఖమువలె ముత్యములవలెఁ దెల్లనైన కడుపు గలిగి యీజింక దీవి సౌందర్యముల కెల్ల దీవిగా నున్నది. ఇట్టిది యెవని మనస్సును హరింపఁ జాలదు? ఎట్టివాని మనస్సునైన హరించు ననుట.

క. నానారత్నమయము జాం,బూనదశుభవర్ణకలిత మూర్రూపంబున్
మానుగఁ గనఁ గరఁగదె యే,మానసమును బాలసీత మా కేమిటికిన్. ౬౮౪

నానారత్నమయము=నానారత్నముల కాంతులతో నిండినది-జాంబూనద శుభవర్ణ కలితమున్ = బంగారుయొక్క మంచివన్నెతోఁ గూడినది.

తా. అనేకవిధములయిన రత్నకాంతులతో నిండినదియు, బంగారు యొక్క మంచి వన్నెతోఁ గూడినదియునైన రూపమును చూడఁగానే బాల సీత మాట యేల కాని యే మనుష్యుని మనస్సు కరఁగ కుండును.

సీ. ఆమిషార్థము విహా♦రార్థంబు మృగముల, ధానుష్కులైనట్టి♦ధరణిపతులు
మృగయాభిరతిఁ ద్రుంత్రు♦పృథ్వీతలేంద్రులు, ధాతువుల్మణిహేమ♦ధననిచయము
లాఖేటమునఁ గాదె♦యార్జింత్రు శుక్రసం,కల్పకల్పితవస్తు♦కాండము లన
వసుధేశ్వరునకు స♦ర్వంబును వనమునఁ, గలిగినదే కదా♦లలితచరిత

తే. యర్థకాముకు లెట్టిప♦దార్థమందు, నాసచేతను వనచారు♦లగుచు దాని
సంగ్రహించెదరో యర్థ♦శాస్త్రవేత్త, లైనవిబుధులు దానినే♦యర్ఘ్యమండ్రు.

ఆమిషార్థము = మాంసముకొఱకు, విహారార్థంబు = వినోద సంచారము కొఱకు, ధానుష్కులు = విలుకాండ్రు, మృగయాభిరతిన్ = వేఁటయందలి విశేష మగు నాశతో, మణిహేమధననిచయము = రత్నములు, బంగారు ధనసమూహ ములను, వేఁటయందు నేనుఁగులఁ జంపి వాని కుంభస్థలమందలి ముత్యములు, ధాతువులందుఁ గల బంగారు వెండి మొదలగు లోహములు, శుక్రసంకల్ప =శుక్రుఁ డు సంకల్పించిన, వస్తుకాండములు=పదార్థ సమూహములు, శుక్రుఁ డేవస్తువు కోరిన నది సంకల్పముచేతనే యాయనకుఁ గలుగునని ప్రసిద్ధి. మనుష్యులు చేయు వ్యర్థసంకల్పములన్నియు శుక్రునకు ఫలవంతము లగును. 'మనుష్యేభ్యః సమా దత్తే శుక్రశ్చింతార్జితం ధన'మ్మని భారతము, ఉద్యోగపర్వము. అర్థకాముకులు = అపూర్వధనము కోరినవారు, అర్థశాస్త్రవేత్తలు = నీతివిషయమైన శాస్త్ర మును దెలిసినవారు, అర్ఘ్యము = అమూల్యవస్తువు, ఏది విశేషము శ్రమించి సంపాదించెదమో యదియే యమూల్యము.

తా. విల్లుకాండ్రగు రాజులు మాంసమునిమిత్తము విహారమునిమిత్తము వేఁటయందలి యాసక్తిచేత మృగములను జంపుదురు. భూపాలనము చేయు రాజులు ధాతువులను మణులు, బంగారు, ధనసమూహమును వేఁటయందే కదా సంపాదింతురు. శుక్రుఁడు తనసంకల్పముచేతఁ గోరినపదార్థములను సృష్టిచేయు నట్లు రాజునకు సర్వము వనములవలనఁ గదా కలుగుచున్నది. అపూర్వవస్తువుల నపేక్షించువారు ఏ పదార్థము గోరి వనములఁ దిరుగుచు దానిని సంగ్రహించెదరో నీతిశాస్త్రవిదులు పండితులు దానినే కదా ప్రశస్తపదార్థ మనుచున్నారు.

క. ఈమృగమణికాంచనమయ, మామహితాజినమునందు ♦ నవనీసుతయుౘ
దా మేలుపడియె నాతో, సౌమిత్రీ! కూరుచుండ ♦ సమ్మదమారన్. ౬౮౭

మృగమణి = మృగశ్రేష్ఠముయొక్క, కాంచనమయ = బంగారుమయమైన, మహితాజినమునందు = మేలైనచర్మమునందు, మేలుపడియెౘ = ముచ్చటపడియెను.

తా. ఈయొక మృగమును జంపుటవలన నేమి విశేషార్థలాభము గలుగఁగల దనెదవా-బంగారుమయమైన యాశ్రేష్ఠమగు జింకచర్మముమీఁద సీతాదేవి నాతోడ సంతోషముతోఁ గూర్చుండ నాశపడుచున్నది.

క. మృదులతఁ బ్రసిద్ధిగాంచిన, కదళీప్రియకీప్రవేణి ♦ కాచర్మములుౘ
విదిత మగుమేషచర్మము, మదిఁ జూడుము దీనితో స ♦ మానం బగునే. ౬౮౮

మృదులతౘ = మెత్తని దగుటయందు, కదళీ=నల్లచాఱల యిఱ్ఱి, ప్రియకీ=బొట్లయిఱ్ఱి, ప్రవేణికా = ఇది మృగజాతి భేదము. వీని చర్మము లయినను ప్రసిద్ధమైన మేఁకచర్మమైనను, దీనితో సమాన మగునా? మృగచర్మములందింతకు మేలైనచర్మము మనకు లభింపదు. కావున దీనిని సంపాదింపఁ దగును.

క. ధారిణి యీమృగరత్నము, తారాపథమందు వెలుఁగు ♦ దైవతహరిణం
బీరెండు నాకుఁ జూడంగా రమణీయములు దక్క ♦ గావు నిజముగన్. ౬౮౯

తా. మృగజాతులలో భూమిమీఁద నీ జింక, ఆకాశమున చంద్రునిలోని జింక, యివి రెండే మనోహరములుగాని తక్కినవి కావు. అని నాయభిప్రాయము. అవునన్నా నీవు చెప్పినది నిజమే. ఇది నిజమైన జింక యయినఁ గదా. ఇది మాయామృగము. ఇది జీవితముతోను బట్టుపడదు. చంపితివా జింక చర్మము నీకు లభింపదు. వ్యర్థశ్రమము. మీకోరిక నెఱవేఱఁ బోదనెదవా? అయినను దీనిని జంపవలసినదే.

## శ్రీరాముఁడు లక్ష్మణుతో మారీచుమాయయేని మాయామృగం బవశ్యవధ్యం బని చెప్పుట.

ఉ. నీవు వచించినట్లు రజ ♦ నీచరమాయయ యేని దీని దు
ర్భావ మడంగఁ జంపుటయె ♦ భవ్యము చూ, యిటు తాటకేయుఁడే
కావలుఁడై మునీశ్వరజ ♦ ఘాంసువునై చరియించుచుౘ నృపా
లావళి రాఁగ వేఁటలకు ♦ నట్టె వధించును వారి వంచనన్. ౬౯౦

రజనీచరమాయ = రాక్షసుఁడు తనయద్భుతయోగశక్తిచే నీరూపము ధరించె నందువా? దీని చెడ్డతలఁపు పోవునట్లు దీనిని జంపుటే శ్రేష్ఠమైన పని.

సుమా. ఈ ప్రకారముగా తాటకాకుమారుఁడైన మారీచుఁడు గర్వించినవాఁడై మునీశ్వరులను జంపఁగోరి తిరుగుచు వేఁటకువచ్చిన రాజులను మోసగించి చంపు చున్నాఁడు.

ఉ. ఏపున దీనిఁ జంపుటయె ♦ యెంతయుఁ గార్యము పూర్వ మిందు వా
తాపి యనంగ రక్కసుఁడు ♦ తాపసగర్భములందుఁ జొచ్చి యా
లోపలనుండి తేలువలె ♦ లూనతదీయపిచిండుఁడౌచు హిం
సాపరుఁడై చరించు చవ♦సానమునం దొకనాఁ డగస్త్యుచేఁ. ౬౯౧

ఏపునన్ = పరాక్రమముచే, లూన = చీల్పఁబడిన, తదీయ = ఆబ్రాహ్మణుల, పిచిండుఁడు - కడుపులు గలవాఁడు, తేలువలె = తేలునకు గర్భము వచ్చేనేని లోపలిపిల్లలు దల్లికడుపు చీల్చుకొని వెలికి వచ్చును. అవసానమునన్ = కడపట.

తా. ఈ కారణముచేఁ బరాక్రమించి దీనిని జంపుటే తగినకార్యము. ఈ ప్రదేశమందే పూర్వము వాతాపి యను రాక్షసుఁడు మునులకడుపులలోఁ బ్రవేశించి తేలువలె వారిపొట్టలు పగులఁ జీల్చికొని హింసాపరుఁడై యుండి కడపట నొకనాఁ డగస్త్యమునీశ్వరుచే

క. భక్షింపంబడి యాతఁడు, కుక్షి వెడలి లేవ నున్నఁ ♦ గుంభభవుం డా
రాక్షసునకు ననియెన్ హృద,యక్షోభముగాఁగ నగుచు ♦ నమరవిరోధీ! ౬౯౨

కుక్షి = కడుపు, హృదయక్షోభము = హృదయము కలఁతపడునట్లు.

తా. భక్షింపఁబడి యతఁడు కడుపులోనుండి లేచుటకు యత్నించు సమయమున నగస్త్యుఁ డారాక్షసునితో వానిమనస్సు వ్యాకులపడున ట్లిట్లు పలికెను. ఓరీ రాక్షసుఁడా!

తే. సరకు సేయక బ్రాహ్మణ♦సంతతులను, నీదు తేజంబునను జంపి ♦ నిష్ఠురతను
బాపచరితుండవైతి వి♦ప్పాట నీవు, జీర్ణమై పొమ్ము నాగర్భ♦సీమ ననియె. ౬౯౩

సరకుసేయక = లక్ష్యములేక, నిష్ఠురతను = కఠినత్వముచే, ఇప్పాట = ఈ విధముగనే, ఈ యర్థమునం దిది ఆ ఈ ఏ శబ్దాదిపూర్వకముగానే ప్రయోగింపఁ బడును.

తా. బ్రాహ్మణు లనిన నీకు లక్ష్యములేక నీశక్తిచే దయాహీనుఁడవై పాపపునడవడి గలవాఁడవై, వారి నందఱఁ జంపితివి. ఇప్పుడు నీ వుండు విధముగానే నాగర్భమున నీవు జీర్ణమై పొమ్ము అనెను. ఆవిధముగా నగస్త్యుఁడు వానిని జంపెను.

క. ఈతండును జూడఁగ నా, వాతాపిని బోలఁడా య♦వశ్యము ఘటసం
జాతునిచే నతఁ డీల్గిన, భాతిని నాచే నితండు ♦ పైపడి చచ్చున్. ౬౯౪

తా. వీఁ డావాతాపివంటివాఁడు కాఁడాయేమి? కావున నగస్త్యునిచే నెట్లు వాఁడు చచ్చెనో వీఁడు మనల మోసగింపవచ్చెను గావున నాచేఁ జావవలసినవాఁడే.

క. సన్నాహంబున జానకిఁ, బన్నుగ రక్షింపు మీవు ♦ పదిలంబుగ నీ
కన్నియపై నున్నవి మన, యన్ని ప్రయత్నములు కావు♦మా౦ సతి శ్రద్ధన్.

సన్నాహంబునన్ = దృఢప్రయత్నముతో, పదిలంబుగన్ = అపాయము రాని విధముగ.

తా. నేను వేఁటకై పోయెదను. నీవు దృఢప్రయత్నముతో నీ సీత కపాయము రాకుండునట్లు కాపాడవలయును. మనప్రయత్నము లన్నియు నీమెపై నాధారపడియున్నవి. కావున శ్రద్ధతో రక్షింపుము.

(మనము పూనినరాక్షసవధాధికార్యములకు నీమె మూలము. ఈమె వేదవతిగా నున్నప్పుడు రావణాది రాక్షసవధ సంకల్పించెను. అది నెఱవేర్చు భారము మనయందున్నది. దానికి భంగము రాకుండునట్లు లీమెను రక్షింపుము).

క. ఈమృగమును వధియింపఁగ,నో మెలపునఁ బట్టుకొనఁగ♦నో నేఁ బోదున్
సౌమిత్రి! కంటె జానకి, యీమృగచర్మంబుఁ జూచు ♦ వ్యామోహంబున్.

తా. ఈమృగము నీవు చెప్పినట్లు రాక్షసమాయ యాయెనా చంపుదును లేక సహజమృగమయ్యెనా హెచ్చరికగా పట్టితెత్తును. ఈరెంటిలో నొకటిచేయుటకుఁ బోయెదను. లక్ష్మణా! సీతాదేవిని జూడుము. ఆమృగచర్మముమీఁద నెంత మోహముపెట్టుకొని చూచుచున్నదో.

ఉ. కావున నొక్క శాతతర♦కాండమునన్ హరిణంబుఁ ద్రుంచి నే
నావరచర్మముం గొని ర♦యంబున వచ్చెద,నంతదాఁక నీ
తావరవర్ణినిన్ మిగులఁ ♦ దత్పరతం గడు నప్రమాద మే
ధావిభవంబు మీఱఁగ స♦దా పరిరక్ష యొనర్పు తమ్ముఁడా. ౬౯౭

శాతతరకాండమునన్ = పదునైన యొక బాణముచేతనే. వరవర్ణినిన్ = ఉత్తమస్త్రీని.

శీతే సుఖోష్ణ సర్వాంగీ, గ్రీష్మేతు సుఖశీతలా.

భర్తృరక్తా చ యా నారీ సా భవే ద్వరవర్ణినీ ఇతిరుద్రః. చలికాలమందు సుఖోష్ణమైన సర్వావయవములు గలది, ఎండకాలమందు సుఖమైన చల్లఁదనము గలది, భర్తయందుఁ బ్రీతిగలది వరవర్ణిని యనఁబడును. తత్పరతన్ = ఆపని

యందే యాసక్తిగలవాఁడవై అనఁగా దిక్కులు చూచుచు నేమఱి యుండక, అప్రమాద = హెచ్చరిక తప్పని, మేధావిభవంబు=బుద్ధిసంపద.

తా. కావున నొక్కవాఁడిబాణముచే నీ జింకను జంపి చర్మము తీసికొని శీఘ్రముగ వత్తును. ఒక బాణప్రయోగమున కెంతకాలమో యంతమాత్రము కాలములోనే వత్తును. నేను బాణము ప్రయోగించుటే యాలస్యము. నేను వచ్చు వఱకు యీసీతను నీవు లవమైన హెచ్చరిక తప్పక యేకాగ్రమనస్సుతో తమ్ముఁడా సర్వధా కాపాడుము.

మత్తకోకిలము. దక్షుఁడుం దృఢసత్త్వుఁడుం మతి♦ధైర్యయుక్తుఁడు లక్ష్మణా!
పక్షిరాజు జటాయు విఖ్యాడ ♦ బాసటై చరియింపఁగా
రక్షణంబు ఘటింపుమీ యుడు♦రాజబింబసమాస్యకుం
దీక్షఁ బూని ప్రమాద మేది ప్ర♦తిక్షణంబును శంకివై. ౯౦

దక్షుఁడుం = కార్యముచేయుటయందుసమర్థుఁడు, దృఢసత్త్వుఁడు = మిగులబలముగలవాఁడు, మతిధైర్యయుక్తుఁడు = ఆలోచన, ధైర్యముతోఁ గూడినవాఁడు, బాసటై = సహాయుఁడై, ఉడురాజబింబ = చంద్రబింబముతో సమాన = పోలికగల, ఆస్యకుం = ముఖముగలదానికి, ప్రమాదమేది = ప్రమాదములేక, శంకివై = సందేహించువాఁడవై, దీక్షఁబూని = ఇది యొక వ్రతముగా నెంచి- ఇచ్చట జటాయుప్రశంస కాఁగలదానిని సూచించుచున్నది.

తా. పక్షిరాజగు జటాయువు కార్యసాధనసమర్థుఁడు. మిగుల బలముగల వాఁడు. కార్యాలోచనము, కార్యముచేయ ధైర్యము గలవాఁడు. ఆయన నీకు సహాయుఁడుగా నీసీతాదేవిని ప్రతిక్షణము ఏమూలమున నేమి యాపదవచ్చునో యని శంక గలవాఁడవై పొరపాటుపడక యిది యొకవ్రతముగా నెంచి రక్షింపుము. శ్రీరామచంద్రమూర్తి యీచర్యగుఱించి భారతమునఁ గొన్నిశ్లోకములుగలవు.

అసంభవంహేమమృగస్య జన్మ, తథాపి రామో లులుభే మృగాయ।
ప్రాయః సమాసన్నవిపత్తికాలే, ధియోపి పుంసాం మలినీ భవంతి.

బంగారుమయమైన జింక లోకమునఁ గలుగదు. అట్లుండియు రాముఁడట్టి మృగమునకై యాసపడెను. ఆపత్కాలము సమీపించినపుడు పురుషులమనస్సులు ప్రాయికముగ మలినము లగుచున్నవి.

కర్మణా బాధ్యతే బుద్ధిః, న బుద్ధ్యా కర్మ బాధ్యతే।
సుబుద్ధి రపి యద్రామో, హైమం హరిణ మన్వగాత్॥

కర్మముచే బుద్ధి బాధింపఁబడునుగాని బుద్ధిచేఁ గర్మము బాధింపఁబడదు.

మంచి బుద్ధిబలముగల రాముఁడు బంగారుజింక వెంటఁ బోయెను. బుద్ధిః కర్మానుసారిణీ = బుద్ధి కర్మమునను సరించి పోవును.

న భూత పూర్వో నచ కేన దృష్టో, హేమ్నః కురంగో న కదాపి వార్తా,
తథాపి తృష్ణా రఘునందనస్య, వినాశకాలే విపరీతబుద్ధిః.

బంగారుజింక పూర్వమున లేదు, ఎవరు చూచినది లేదు. అట్టి దున్నదన్న వార్తయు నెవఁడు వినలేదు. అట్లుండియు రామచంద్రునకు దానిపై నాశగలిగెను. చేటుకాలమునకుఁ జెడుబుద్ధి పుట్టును.

శ్రీరామచర్యవలన గ్రహింపవలసిన నీతు లివి. అందు విశేష మేమనఁగా దాను భ్రమపడుటయేగాక లక్ష్మణుఁడు చెప్పినను విన్నవాఁడుఁగాఁడు. మారీచ మాయ యని విశ్వాసముండిన నున్నచోటున నుండియే బాణము ప్రయోగించి యుండవచ్చును. దాని వెంటఁ బోవలసినపని లేదు. కాకాసురుని వెంటఁ బోయెనా? కావున ఆయనకును నది నిజమైన జింకగా నుండవచ్చు నను భ్రాంతి వదలినదిగాదు.

సీతాదేవి లోకసామాన్యస్త్రీ యగునా? ఆమెకుఁ దెలియని విషయములు లేవు. బంగారుజింక లోకమున లేదని యామెకుఁ దెలియదా?

'నిన్నుఁ బాసి ధరాతనూజయు నేను నొక్కముహూర్తమేᵔ! నిన్నిలం గల వారమె తమ నీటిఁ బాసిన చేఁప లట్లన్న''యని లక్ష్మణుఁడు చెప్పినట్లు 'నను వీడి తేని మెయిఁదాల్ప నిజంబుగ' ననిన యంతటి పరమభక్తిగల సీత యెట్లు క్షుద్రమృగమునకై భర్తను నొలఁగియుండ నాలోచించెను? కావున కర్మానుసారము బుద్ధి యను నీతి ప్రాతీతికార్థమున నెఱుఁగసగును.

పరమార్థము విచారింతము. మనుష్యులకుఁ గోరికలు గోరు స్వాతంత్ర్యము కలదు. దాని నెఱవేర్చు భారము భగవంతునియందుఁ గలదు. ఎవ రేకోరికలు దృఢముగఁ గోరినను భగవంతుఁడు దాని నెఱవేర్చును. కాని దానిఫల మనుభవింపు మనును. కావున మంచికోరికలు కోరువారికి మంచిఫలమే కలదు. చెడుకోరికలు గోరు వారికిఁ జెడుఫలమే కలదు. ప్రకృతివిషయమైన కోరికలు గోరువారి కందఱకు సీతాదేవికి వచ్చినగతియే వచ్చును. మారీచునిమాయయే ప్రకృతి. ప్రపంచమున మనము చూచునవి వినునవి యన్నియు ప్రకృతిచిత్రములే. సీతాదేవి మాయజింకను జూచి భ్రమించి యాశపడినట్లు మనము చిత్రవిచిత్రములైన ప్రకృతిపదార్థములను జూచి సత్యమని భ్రమపడుచున్నాము. ఇవి నిత్యములు గావు. క్షణభంగురములు. ఆజింక వలన సీతాదేవి యెట్లు సుఖింపఁ గోరెనో అట్టులే మనము ప్రకృతిపదార్థములవలన నానందింపఁ గోరుచున్నాము. రామచంద్రమూర్తి సీతాదేవికోరిక నెఱవేర్చినట్లు

మనకోరిక నెఱవేర్చును. సీతాదేవి యనుభవించిన ఫలమువంటి ఫలము మన మను భవించుచున్నాము. సీత కేమిఫలము గలిగెను? అది ముందు విచారింపఁబడును.

-ఀ- ౪౪ వ. సర్గము. శ్రీరాముఁడు మాయామృగమువెంటఁ బోవుట. -ఀ-

క. అని ముప్పంపులవిలుఁ గొని, కనకమయత్సరు కృపాణ ♦ కాండధి యుగముల్
　మనుకులుఁడు కట్టుకొని వెసఁ, జనె మాయామృగముఁ బట్టు♦సంరంభమునన్.

ముప్పంపులవిలు = మూఁడువంకరలుగల విల్లు, కనకమయ=బంగారుమయమైన, త్సరు = పిడిగల, కృపాణ = కత్తిని, కాండధియుగముల్ = రెండంబుల పొదులును, సంరంభమునన్ =త్వరతో.

తా. మూఁడువంకరలుగల విల్లు, బంగారుపిడిగలబాకు, అంబుల పొదులు రెండు ధరించి యామృగమును బట్టుకొనుత్వరతో బయలుదేఱెను.

ఉ. వింటిని గేలఁ బూని వెను♦వెంటన వచ్చెడురాముఁ జూచి లోఁ
　డంటమలాడ గుండెలు త♦టాలునఁ గన్పడ కేగి వెండియున్
　గంటికిఁ దోఁప దూరముగఁ ♦ గాంచి రఘూత్తముఁ డుగ్రవేగుఁ డై
　వెంటనె కూడఁబాఱ నది ♦ వృక్షచయంబుల డాఁగుఁ దోఁచెడున్.　　౨౦౦

తా. చేత ధనుస్సు ధరించి తనవెంట వచ్చు రామచంద్రుని జూచి చంపను వచ్చుచున్నాఁడురా రాముఁడని దిగులుపడి గుండెలు దడదడ కొట్టుకొనఁగా తటాలునఁగానరాకపోయి యట్లే పోద మనిన రావణుఁడు చంపు నని భయపడి మరల దూరమునఁ గానరాఁగాఁ జూచి రామచంద్రుఁడు మిగుల త్వరగలవాఁడై వెంటనే పట్టుకొనుటకై పరువెత్తఁగా నది చెట్లగుంపుల చాటున డాఁగును. కానరాలేదు పోనిమ్మని మరలిన మరలఁ గానవచ్చును.

సీ. చేపడె నిదె యని ♦ వే పట్టఁ బోయినఁ, జెంగున మెలపునఁ ♦ జౌకళించు
　గడుదవ్వు చనె నిది ♦ గడుసంచు నిలిచినఁ, దారసంబున నటఁ ♦ దారుచుండుఁ
　బరువువాఱుచుదీనిఁ ♦ బట్టెద నని పాఱఁ,బొదలలోపలఁదూఱి♦యొదిగియుండుఁ
　జిక్కెఁ బో యిది యని♦చే చాఁపఁ బోవఁ జి, వుక్కున నొకవైపు♦చిక్కకుఱుకుఁ
తే. దోఁచుఁ దోఁపకుండు♦దూరంబుచను డాయు, నెదురు వచ్చు మిగుల♦బెదరి చూచు
　మాఱుమొగము పెట్టు ♦ మాఱాడు తారాడు, లేఁతగసవు మేయు ♦ లీలఁదిరుగు.

చేపడె = లభించె, చెంగున = దాఁటుటయందు ననుకరణము. ఇందుఁ బ్రథమాక్షర మదంతమే కాని ఎదంతముగాదు. 'చంగున గోడదాఁటు నగసాలశిఖామణిఁజూచితే సఖా'- యని శ్రీనాథప్రయోగము. మెలపునన్ = హెచ్చరికతో,

చౌకళించుచు=నాలుగుకాళ్లు కుప్పించి దాఁటు, గహనము=కష్టకార్యము, తారసంబునన్ = సమీపమందు, అటన్ = అచ్చోటనే, తారుచుండున్=సంచరించుచుండును.

తా. దొరకెరా యని పట్టుకొనఁబోఁగా చంగున నాలుగుకాళ్లతో నెగిరి యావల దుముకును. దూరము పోయినది యిఁకఁ జిక్కదు వ్యర్థశ్రమమేల యని వెనుక ముఖమైన సమీపమందే తిరుగుచుండును. పరువెత్తి పట్టుకుందమని పరువెత్తఁగాఁ బొదలలోఁ దూఱి యొదిగియుండును. చిక్కెనని పొదలలోకి చేయిచాఁపఁగా చివ్వకని యావలవైపు దూఁకి పరువెత్తును. కానవచ్చును. కానరాకపోవును. దూరముననుండి మరల సమీపించును. ఎదురుగా వచ్చును. బెదరినట్లు చూచును. మాఱుమొగము పెట్టును. పోఁడువవచ్చును. కదియవచ్చును. పచ్చికమేయును. వినోదముగాఁ దిరుగును.

మాలి. కనఁగఁ గనఁగఁ గాంతుల్ ♦ గ్రక్కుచున్ నిల్చు ధన్విన్
గనుచుఁ గనుచుఁ బాఱు ♦ న్దవ్వుగాఁ జిక్కకుండన్
మునుఁగు వెఱను బాణం♦బుం గనున్ మింట నాడున్
వనుల దరుల డాఁగున్ ♦ వంచనన్ గాసి గ్రాఁగున్. ౨౦౨

గ్రాఁగున్ = సోలును.

తా. రామచంద్రమూర్తి చూడఁజూడఁ గాంతులు గ్రక్కుచున్న దానివలె మెఱయుచు నిలుచును. ఆయన విల్లెత్తినా దృష్టి దానిమీఁదనే యుంచి దూరముగాఁ జిక్కకుండఁ బరువెత్తును. భయమున మునిఁగినట్లయి బాణమును జూచును. ఆకాశమందే గంతులుపెట్టుచు నాడును. అడవులందుఁ జెట్లచాటున గుహలలో దాఁగును. గాసిపడినదానివలె వంచనచే సోలును.

సీ. వెఱచెఁబో యని విల్లు♦మఱుఁగిడి డాయంగఁ, దిన్నతిన్నగ మును♦మున్నుపోవుఁ
జంపెదఁ గా కంచుఁ ♦ జాపంబుఁ దీసిన, బెదరినభంగిఁ గు♦ప్పించి యెగయు
దనవెంట వచ్చెడు♦జననాథుఁ జూడని,యట్టులై పచ్చిక ♦ నాడుచుండు
రద్దు సేయక పొంచు♦రాములీలాగతి, నోరచూపులఁ జూచు ♦ నొంటికంట

ఆ. మఱుఁగుఁ జేరు బయల ♦ మెఱయును మబ్బుల, నడిమిచేందురుండు ♦ నాఁగ నిట్లు
కాన వచ్చి కొంత ♦ కానరాక యొకింత, నేఁగెఁ దీసికొనుచు ♦ నెంతొదవ్వు. ౨౦౩

తా. నన్నుఁ జూచి భయపడినదని తలఁచి శ్రీరామచంద్రమూర్తి విల్లువెనుకవైపుగా నుంచుకొని దగ్గఱకుఁబోఁగా నదియును మెల్లగనే ముందుముందుగఁబోవును. ఇది చిక్కదు. దీనిని జంపెదనని విల్లు దీయఁగానే బెదరినదానివలెఁ గుప్పించి యెగయును. తనవెంట వచ్చుచున్న రామచంద్రునిఁ జూడనిదానివలెఁ బచ్చికలందు నాడుచుండును. సద్దుసేయక పొంచు రామచంద్రమూర్తిని నోరగంట నొకకంటితోఁ

జూచును. కొంతసేపు చాటుగఁ బోవును. కొంతసేపు బయలునందుఁ దిరుగును. మబ్బుల నడిమి చందురువలె నిట్లు కొంతసేపు కానవచ్చి కొంతసేపు కానరాక యాశ్రమము నుండి రామచంద్రుని మిగుల దూరము తీసికొనిపోయెను.

సీ. ఒకమాఱు పొదలలో ♦ నొదిగినట్టులెయుండు, నంచునఁ జేరద ♦ వ్వరిగి యుండు
నొకసారి నేలపై ♦ నొయ్యనఁ బన్నుండుఁ, జేసాఁచునంతలోఁ ♦ జిక్కకుండు
నొకతూరి నాయాస ♦ వికలత నిలుచుండు, బడలె నం చేగఁ గ ♦ న్పడక యుండు
నొకసారి వింతవే ♦ డుకల నాడుచు నుండుఁ, బట్టఁ జూచినయంతఁ ♦ బాఱు చుండు

ఆ. వికటహరిణ మిట్లు ♦ గికురించి వంచించి, యటమటించి మిగులఁ ♦ దటమటించి
మోసగించి మాయ ♦ ముంచి తా బేలించి, తచ్చనలను రాము ♦ దవ్వు లాగె. ౭౦౪

తా. ఒక్కొక్కసారి పొదలలో దాఁగినట్టులే యొదిగి కానరాకయుండును. రామచంద్రమూర్తి దగ్గఱపోవునప్పటికి దూరము పోయియుండును. ఒక్కొక్కసారి నేలమీఁదఁ బండుకొనును. చేసాఁచిపట్టుకొను లోపలఁ జిక్కకుండఁ బోవును. ఒక్కసారిచాల బడలినదానివలె రోఁజుచు నిలుచుండును. బడలినది చిక్కినది యని చేరఁ బోవఁ గానరాకయే పోవును. ఒకసారి వింతవింత యాటలాడును. పట్టఁ జూచినఁబరువెత్తును. ఆకుత్సితపుజింక యీవిధముగ మోసగించి వంచించి బేలించి రాముని మిగుల దూరమునకు నాకర్షించెను.

ఇందలిగీతమున శ్రీనాథుశైలి యనుకరణము గానవగు. మోసముయొక్క యతిశయము రామచంద్రునిమోహాతిశయము రూపింప సమానార్థకపదములే పెక్కులు ప్రయోగింపఁబడెను.

క. అంత రుషావివశత సం,భ్రాంతుం డయి రామవిభుఁడు ♦ బడలిక నిలిచెన్
బ్రాంతమహావృక్షచ్ఛా,యాంతరమున శాద్వలమున ♦ నంతట నదియున్.

అంతన్ = ఈప్రకారము దూరము పోయిన పిదప, రుషావివశతన్ = కోపము వలనఁ గలిగిన పారవశ్యముచే, సంభ్రాంతుఁడయి = కలఁతజెందినవాఁడై, బడలికన్ = గాసిచే, ప్రాంత = సమీపముననుండు, మహావృక్ష = పెద్దచెట్టుయొక్క, ఛాయాంతరమునన్ = నీడయందు, శాద్వలమునన్ = పచ్చిక భూమియందు.

తా. చాలదూర మిట్లు పోయిపోయి కోపముచేఁ బరవశుఁడయి, మనస్సు కలఁతఁజెంద బడలి యొకపచ్చికగల ప్రదేశమున పెద్ద చెట్టునీడ నిలుచుండెను. అంతట నా జింకయు.

క. జింకలమందలలోపలఁ, బొంకంబుగఁ గూడి మాడి ♦ పొదలుచుఁ దోఁచెన్
సంకటతలమున రాముఁడు, బింకంబునఁ బట్టఁ బోవఁ ♦ బెల్కుఱి యుఱికెన్.

మాడి = మలసి, ఈ శబ్దమెప్పుడు కూడి శబ్దముతోఁ గూడియే వచ్చును.

తా. జింకల మందలలోఁ గూడి తిరిగి రామచంద్రమూర్తికి నిలుకు స్థలంబునఁ గానవచ్చెను. చిక్కెనులే ఇఁక నెక్కడికిఁ బోవునని పట్టుకొనఁబోఁగా, వెల్కుఱి = భయముచే విలవిలఁ దన్నుకొని యెగిరి పరువెత్తెను.

ఉ. వెండియు వృక్షషండపద♦వీగత మై కనఁబడ్డ రామచం
ద్రుండు నితాంతరోషమునఁ ♦ ద్రుంచెద దీని న టంచుఁ బూని మా
ర్తండరుచిప్రచండభయ♦దద్రుహిణప్రవినిర్మితాస్త్రము
ద్దండత నారిఁ గూర్చి మృగ♦దానవునిన్ గుఱిచూచి వైచినన్. ౭౦౭

వృక్షషండపదవీగతమై = చెట్లసమూహముగల ప్రదేశమున నుండునదియై, మార్తండ = సూర్యునియొక్క, రుచి – కాంతివంటి కాంతితోఁ, ప్రచండ=మిగుల తీక్ష్ణమైన, భయద = భయము గలిగించు, ద్రుహిణ = బ్రహ్మచే, ప్రవినిర్మితాస్త్రమున్ = చక్కఁగా నిర్మింపఁబడిన యస్త్రమును, ఉద్దండత = భయంకరముగ, నారిన్ = అల్లెత్రాటియందు. ఈ యర్థమున నిది దేశ్యమని శబ్దరత్నాకరమునఁ గానవచ్చుచున్నది కాని నారీ యోషితి మౌర్వ్యాంచ. అను రభసుని ప్రయోగము వలన నిది సంస్కృతశబ్దమే యని గ్రహింపఁదగు. మృగదానవునిన్ = మృగరూపము ధరించిన దానవుని. మధ్యమపదలోపి సమాసము.

తా. మఱియును నది చెట్ల గుంపులుండు ప్రదేశమునందు కానరాఁగా రామచంద్రుఁడు మిగుల గోపించి దీనిని జంపెదనని సూర్యకాంతిగల బ్రహ్మాస్త్రమును వింట సంధించి యామృగరూపధారియైన రాక్షసుని గుఱిచూచి వేయఁగా.

శ్రీరాముని బాణముచే మారీచుఁడు హాలక్ష్మణా యని యఱచి చచ్చుట.

శా. ఆనారాచము తాటకాతనయుమా♦యాదేహముం దూఱి వే
గానన్ వానిదయాహృదిం బగుల ఫ♦ట్కారంబుతోఁ జీల్పఁగా
నానాకీశవిరోధి తాటిపొడ వా♦యస్త్రాభిహతి న్మిట్టిపా
టై నేలం బడె భైరవారవముతో ♦ నల్పాయు వీరీతిగన్. ౭౦౮

నారాచము = బాణము, హృదిన్ =వక్షమును, నాకి + ఈశ + విరోధి= దేవతాప్రభువైన యింద్రునకుఁ బగవాఁడు-తాటిపొడవు= తాటిచెట్టునెత్తు, మిట్టిపాటై=ఎగిరిపడినవాఁడై, భైరవారవముతో = భయంకరధ్వనితో, అల్పాయు = ఆయుస్సు లేనివాఁడు, ఫట్కారంబుతోన్ = ఫట్టనుశబ్దముతో-వానిదయాహృదిన్ = రాక్షసుని దేయగు హృదయమును-ఇట్లు చెప్పుటచే రాక్షసుఁడు తనయోగబలముచే

జింకగా మాఱినను హృదయము మునుపటి హృదయమే కలవాఁడై దానియందు న్నాఁడని యెఱుఁగవలయు. హృదయమునఁగాక మఱియెక్కడ దెబ్బతగిలినను జచ్చియుండఁడు. తప్పించుకొని పోయియుండును. మాయాదేహము అనుటచే, దేహము మాత్రమే యోగశక్తిచేఁ గల్పితము. ఇచ్చట మాయ యనునది యోగశక్తియే.

తా. ఆ బాణము మారీచుఁడు తన యోగశక్తిచేఁ గల్పించుకొనిన శరీర మున దూఱి శీఘ్రముగ మారీచునిదే యైనహృదయము ఫట్టని శబ్దమిచ్చునట్లు చీల్పఁగా ఆ రాక్షసుఁడు ఆ దెబ్బ వేగమునకు తాటిచెట్టు పొడవున భయంకర ధ్వనితో నెగిరిపడెను. ఆ క్షీణించిన యాయుస్సుగల రాక్షసుఁడు.

చ. మరణముఁ గూరుచుం దనదు♦మాయశరీరము వీడి యెట్లు లా
ధరణితనూజ లక్ష్మణుని ♦ దవ్వుగఁ బంపును, రావణుండు నే
కరణి హరింపఁ గల్గు నల♦కంజదళాక్షి నటంచు యోజనా
పరుఁ డయి యర్హ్మాభంగి రఘు♦వర్యు నెలుంగునుబోలు నెల్గునన్.      ౭౯

వీడి=వదలి, మాయశరీరము వదలకున్న లక్ష్మణా యని యఱవ సాధ్యపడదు. ఏకరణిహరింపఁగల్గున్ = ఏమిచేసిన రావణుఁడు సీతను హరింపఁగలఁడు. తా నూరక చచ్చిన రావణుఁడు బ్రదికిపోవును. తన్నుఁ జంపించిన కారణముచే వాఁడును జచ్చునుగాక యనియే యోజించెను. ఇప్పుడఱవకున్నను రావణుఁడు చేయఁగలిగి నది యేమియు లేదుకదా. కావున తనతోపాటు రావణాసురుఁడు చావవలయు ననియే మారీచుని యుద్దేశము.

తా. ఈ ప్రకారము దెబ్బదిని మరణించుచు తన మాయాశరీరము వదలి యేమిచేసిన సీత లక్ష్మణుని దూరముగాఁ బంపును. రావణుఁ డెట్లు సీతను హరింపఁ గలుగును, అని యోజించి తగిన రీతిని రాముని కంఠధ్వనివంటి కంఠధ్వనితో.

క. హాసీత లక్ష్మణా యని, మాసరరవ మార నఱచి ♦ మనుజాదుఁడు నై
జాసురరూపముతోడ ని,జాసువులన్ విడిచి యవని ♦ నాక్షణమ పడెన్.  ౭౦౦

మాసరరవము = అధికమైనధ్వని, మనుజాదుఁడు = రాక్షసుఁడు, నైజా సురరూపముతో = తన సహజమైన రాక్షసరూపముతో, నిజాసువులన్ = తన ప్రాణములను, అవనిన్ = భూమిమీఁద.

దీనివలన మారీచుఁడుఁ మారీచాకారముతోనే చచ్చిపడె నని యేర్పడు చున్నది. మారీచుఁడు మాయామృగ మగుట యోగబలముచే నని తెలియనగు. యోగబలముచేఁ బరకాయప్రవేశము చేయవచ్చును. దీనియందు జీవుఁడు ప్రాణేం

ద్రియములనుగూడఁ దీసికొని మఱియొక దేహమునందుఁ బ్రవేశించును. మొదటి దేహ మాకారణమున శవమై పడియుండును. దేహమువేఱు తానువేఱను జ్ఞాన సిద్ధిపొందినవారు దీనిని జేయవచ్చును. శ్రీ శంకరాచార్యులవా రిట్లుచేసినవారే. ఇది పరకాయప్రవేశముకాదు.

ఇంద్రియములందు సంయమముచేసినచో తీవ్రధారణాబలమున నొకదేహమే మఱియొక దేహముగ కీటము భ్రమరమైనట్లు లగును.

కావుననే భగవత్సారూప్యము సాయుజ్యము కోరువారు ఆయన రూపమునే సర్వదా-అంతకాలమందు సహితము తీవ్రముగ ధ్యానించిన భగవత్స్వరూప సాయుజ్యములు లభించును. తక్కినవారి కిది యెంతోకాలము పట్టును. యోగసిద్ధులం దీ మార్పు త్రుటిలోనే వచ్చును. వారి ధారణాశక్తి యట్టిది. ఇందొక దేహమే మఱియొకదేహముగా మాఱునుగాని ధారణాశక్తి యెంతవఱకుండునో అంతవఱకే ఆ శరీరముండును. ముక్తుని శరీరము భగవద్దత్తము కావున దానికి మార్పు రాదు. శాశ్వతముగానే యుండును. మనశ్శక్తిచేఁ దెచ్చుకొన్నది మన మనోబలముకొలఁది యుండును. ఎప్పుడు మనస్సు చెదరునో యప్పుడాదేహముపోయి యథాప్రకార మగును కావుననే మరణ—సురత—నిద్రలందు మాయాశరీరములు నిలువవు. ఆ దశలందు ధారణ లేదుగదా; మారీచుఁ డీతెగలోఁ జేరినవాఁడు.

దేవతలవరముచేఁ గోరినరూపములు ధరించుశక్తిగలుగును. వారికి సంకల్పముమాత్రము కలిగినఁజాలును. రావణాసురుఁ డీతెగలోఁజేరినవాఁడు. ఈ తెగలోఁజేరినవా రేరూపముతోఁ జత్తురో నిద్రింతురో యప్పుడును, వారి కా దేహములే యుండునుగాని మాఱవు.

రావణాసురుఁడు సహజముగ పదితలలవాఁడు. కోరినపుడు రెండుతలలవాఁడగును. మఱి యే రూపమైన ధరించును. ఈ కారణముచేత వాఁడు రెండుతలలవాఁడై చచ్చిపడెనేకాని పదితలలవాఁడు గాలేదు. వానికిఁ దలలు సహజముగ రెండని శత్రువులను భయపెట్టవలసినపుడు పీర్లపండుగులో బచ్చెన తలకాయలు తగిలించుకొను నట్లు వాఁడును దగిలించుకొనుచుండెనని కొందఱు వ్రాయుట పరిహాసాస్పదము. బచ్చెనతలలు తెగఁగొట్టిన మరల నెట్లు మొలచును. విశాల లక్ష్యము నివారించుటకుఁగాను రామునితో యుద్ధముచేయునపుడు రెండుతలలవాఁడే యయ్యెను.

ఈ కారణముచేతనే

భక్తాస్తే యాదృశేరూపే, సంసారపద మాశ్రితాః
తాదృశం తే సమీహంతే పరమవ్యోమవాసినా॥

గృహస్థులేరూపమునందు భక్తి చేయుదురో పరమపదమందు వారటువంటి రూపమే చూతురు. అనఁగా సీతారామభక్తులు సీతారామలక్ష్మణాంజనేయులనే దర్శింతురు. లక్ష్మీనారాయణుల ధ్యానించువారు ఆ స్వరూపమునే దర్శింతురు. పాషాణము గాఁగోరువారు పాషాణమే యగుదురు—లయము కోరువారు లయమే యగుదురు.

తే. హేమమాలి మహాదంష్ట్రు ♦ హేమభూషుఁ, జిత్ర కేయూరమండితు ♦ శితకలంబ
నిహతు రాక్షసరూపు ని♦ర్నిద్రభయద, వేషు రక్తాంగు క్షితితల♦వేష్టమాను.

హేమమాలిన్ = బంగారుమాలికగల వానిని, మహాదంష్ట్రున్ = పెద్దకోఱలుగల వానిని, హేమభూషున్ = బంగారాభరణములుగల వానిని, చిత్రకేయూరమండితున్ = వింతయగు భుజకీర్తులచే నలంకరింపఁబడిన వానిని, శితకలంబనిహతున్ = వాఁడి బాణముచేఁ జచ్చినవానిని. రాక్షస రూపున్ – రాక్షసాకారముగల వానిని–నిర్నిద్ర భయదవేషున్ = హెచ్చరికతోఁగూడిన భయంకర వేషము గలవానిని, రక్తాంగున్ = ఎఱ్ఱని దేహముగల వానిని, నెత్తుటిచేఁ దడియుటచే రక్తాంగుఁడు, క్షితితలవేష్టమానున్ = భూమిమీఁద పొరలెడివానిని.

తా. బంగారుహారములు, పెద్దకోఱలు, బంగారుసొమ్ములు, చిత్రమైన భుజకీర్తులుగలిగి భయంకారాకారముతో నెత్తుటఁ దడిసిన యెఱ్ఱని దేహముతో వాఁడి బాణముచేఁ గొట్టఁబడి నేలఁబడి పొరలుచుండు రాక్షసరూపుని.

మ. కని సౌమిత్రి వచించినట్టి యలవా♦క్యంబుల్ మదిం దోఁపఁగా
జనకాపత్యముపై మనం బరుగఁ గౌ♦సల్యాత్మజుం డాత్మలో
ననుజుం డియ్యది తాటకాతనయుమా♦యల్ పో యటం చెంచె మ
త్సునిశాతాస్త్రనిహన్యమానుఁ డితఁ డా♦దోషాటనాథుండె యౌ.     ౮౧

జనక + అపత్యము = జనకునిబిడ్డ – సీత, అనుజుండు = లక్ష్మణుఁడు, మత్ = నాయొక్క–సునిశాత = మంచి పదునైన, అస్త్ర = అస్త్రముచే, నిహన్యమానుఁడు = కొట్టఁబడినవాఁడు, దోషాటనాథుండె = రాక్షసుఁడె, దోషా + అటుఁడు = రాత్రియందుఁ దిరుగువాఁడు.

తా. చూచి లక్ష్మణువాక్యములు స్మరణమునకురాఁగా సీతమీఁద మనస్సుపోఁగా రాముఁ డిట్టులు తనలోఁ దలఁచెను. లక్ష్మణుఁ డిది మారీచుమాయలే యని తలంచెను. ఇప్పుడు నా బాణముచేఁ జంపఁబడినవాఁడు ఆ రాక్షసుఁడే యగును.

క. హాసీతా లక్ష్మణ యని యాసురనాథుండు బిగ్గ ♦ నఱచుచుఁ జచ్చెన్
భూసుతయును సౌమిత్రియు, నేసందమువార లైరొ ♦ యెలుఁగున్ వినుటన్.

చచ్చెడివాఁడారక చావక హాసీతా లక్ష్మణా యని యారాక్షసుఁడు గట్టిగా నఱచి చచ్చెను. ఈమాటవిని సీతయు లక్ష్మణుఁడు నీధ్వని విని యెట్లయిరో.

ఏసందము = ఏ + చందము, ఇది త్రికపూర్వక కర్మధారయ సమాసము. కర్మధారయంబునఁ బరంబైన పరుషములకు గసడదవలు వైకల్పికముగనగు, సు. వ్యా. సంధి ౬౧.

ఓసామీ యిటువంటి కొండదరిలో నొంటింబులుల్ సింగముల్
గాసింబెట్టుచు కుట్ర నట్టడవిలోఁ గల్జువ్వి క్రీనీడ నే
యాసంగట్టితి వేటిగడ్డ నిలు నీవాకొన్నచోఁ గూడునీ
ళ్ళే సుట్టంబులు దెచ్చిపెట్టెదరు నీకిందేటికే లింగమా॥ కాళ. మా.

విశ్వామిత్రునియాగవేళ రామచంద్రమూర్తి మారీచునిఁజంపక విడిచినది యీకార్యమునిమిత్తమే.

యన్నామా ౽జ్ఞోపిమరణే స్మృత్వా।తత్సామ్య మాప్నుయాత్। కిము తాగ్రే హరిం పశ్యం స్తేనైవ నిహతో సురః। తద్దేహా దుత్థితం తేజః సర్వ లోకస్య పశ్యతః। రామమేవా విశ ద్దేవా విస్మయం పరమం జగుః। కింకర్మ కృత్వాకిం ప్రాప్తః పాతకీ మునిహింసకః। అథవా రాఘవస్యాయం మహిమా నాత్ర సంశయః। రామబాణేన సంవిద్ధః। పూర్వం రామ మనుస్మరన్। భయాత్సర్వం పరిత్యజ్య గృహ విత్తాదికంచ యత్। హృది రామం సదా ధ్యాత్వా నిర్ధూతాశేషకల్మషః। అంతేరా మేణ నిహతః పశ్య న్రామ తాపసః। ద్విజోవా రాక్షసోవాపి, పాపీవా ధార్మికోపివా। త్యజన్ కళేబరం రామం స్మృత్వా యాతి పరంపదమ్. అధ్యాత్మ ౩.

ఎంతటి యజ్ఞుఁడైనను మరణకాలమందు నెవనినామము స్మరించినచో నతనితో సముఁడగునో (దీనికే సాయుజ్యమనిపేరు) యట్టి హరి నెదుటఁజూచుచు నాయనచేతనే రాక్షసుఁడు చంపఁబడెను. ఆదేహమునుండి లోకమంతయుఁ జూచుచుండ నొకతేజస్సు వెలువడి రామునిదేహమునందుఁ బ్రవేశించెను. మునుల హింసించుచుండినపాపి వీఁడుచేసినకార్యములేమి వీనికిఁగలిగినభగవత్ప్రాప్తి యేమి యని దేవత లాశ్చర్యపడిరి. ఇది రామునిమహిమయే సందేహములేదనుకొనిరి. రామబాణముచేఁ గొట్టఁబడుటను, బూర్వమందు రాముని స్మరించుటచేతను, భయముచే నిల్లు, ధనము, సర్వము వదలి (౬౧౫-౬౧౮ పద్యములు చూడుము) హృదయమందు సర్వదా రాముని స్మరించి సమస్తపాపములు నాశముచేసికొని మరణకాలమందు రామునిచేఁ జంపఁబడి యాయనను జూచుచుఁ బ్రాణము విడిచి రామునిఁబొందెను. బ్రాహ్మణుఁడైనను రాక్షసుఁడైనను పాపి

నైనను ధర్మాత్ముఁడైనను రాముని స్మరించుచుఁ బ్రాణము విడుచువాఁడు పరమపద మునకుఁ బోవును.

పరుసవేది లోహభగవద్విగ్రహమువలెనే కటికవాని కత్తిని బంగారు చేయును. దానిస్పర్శ యుండినఁ జాలును.

క. అని భీతి మేనఁ బులకలు, జనియింపఁగ నొండుమృగముఁ ♦ జంపినమాంసం
బునుగొని యాశ్రమభూమికిఁ, జనుచుండెను రాముఁడెంతొ ♦ సత్వరుఁడగుచున్.

పులకలు = రూ. పులకములు. గగ్గురులు.

తా. అని భయమున దేహమునందు గగ్గురు జనింపఁగా నొక్కమృగమును జంపి యామాంసమును గొని శీఘ్రయానమున రామచంద్రమూర్తి యాశ్రమము నకు వచ్చుచుండెను.

౪౫-వ సర్గము. సీత లక్ష్మణుని రామునకు సహాయుండుగఁ బొమ్మనుట.

ఉ. అక్కడ భర్తృకంఠసదృ ♦ శార్తరవంబును నాలకించి య
మ్మక్క యిదేమి లక్ష్మణ! ర ♦ యంబునఁ బర్విడు రాముఁ జూడ నా
కక్కట గుండె ఝల్లు మనెఁ ♦ బ్రాణము తత్తఱలాడఁ జొచ్చెఁ దా
నెక్కటి యెందుఁ జిక్కెనొ మ ♦ ఱేమి ఘటిల్లెనొ యేమి సేయుదున్. ౨౧౫

అక్కడన్ = ఆశ్రమమందు, భర్తృ = పెనిమిటియొక్క, కంఠ = గళ స్వరముతోఁ, సదృశ = సమానమైన, ఆర్తరవంబును = దుఃఖశబ్దంబును, ఆల కించి = సీతయధ్యాహారము, అమ్మక్క = అయ్యో, ఎక్కటి = ఒంటరిగాఁడు.

తా. ఆశ్రమమందు సీతాదేవి తనపెనిమిటికంఠస్వరము దుఃఖముతోఁ గూడినదై వినిపింపఁగా విని లక్ష్మణుఁ జూచి యయ్యో లక్ష్మణా! యిదియేమి విప రీతము? రామచంద్రునిఁజూచుటకుఁ ద్వరగాఁ బరువెత్తుము. ఆధ్వని వినఁగానే గుండెలు ఝల్లు మనుచున్నది. ప్రాణము చలించుచున్నది. రామచంద్రమూర్తి యొంటివాఁడు ఎక్కడ నెవరిచేతులలోఁ జిక్కెనో లేక మఱేమైన నాపదగ లిగెనో నే నేమి సేయుదును.

పదునాలుగువేలమందియోధుల నొక్కరుఁడు తనకన్నులయెదుటఁ జంపఁ గాఁజూచియు నాయన కేమో యాపద వచ్చిన దని తలఁచుట కర్మబలిష్ఠ మగుట చేత నేకదా. 'అయ్యవారిపెండ్లాని కాపదవచ్చినను గష్టమే సంపదవచ్చినను గష్టమే' యన్నట్లు స్త్రీలకు సంతోషమువచ్చినను దేహము తెలియదు. శోకమువచ్చినను దేహము తెలియదు. ఉన్న తెలివి యూడిపోవును.

చ. అఱచుచు నున్నవాఁడు భవ♦దగ్రజుఁ డాతనిఁ గావఁ బోఁగదే
బిఱబిఱ, నాదుతమ్ముఁ డతి♦వీరుఁడు బాసట యౌ నటంచు నె
త్తెఱఁగున నాసలం గొనెనొ ♦ ధీరుఁడు రాక్షసకోటి ముట్టఁ బె
ల్కుఱి హరిసంచయావృతము ♦ కోడెవిధంబున నుమ్మలింపఁడే. ౭౧౬

భవత్ + అగ్రజుఁడు = మీయన్న, బాసట = సహాయుఁడు, పెల్కుఱి = భయపడి, విలవిలలాడుచు, హరిసంచయావృతము = సింహములగుంపుచేఁ జుట్టఁబడినది, ఉమ్మలింపఁడే = దుఃఖింపఁడా.

తా. లక్ష్మణా! మీయన్న యఱచుచున్నాఁడు. త్వరగా నాయనను గావఁబోవయ్యా. నాతమ్ముఁడు మిగుల పరాక్రమవంతుఁడు. నాకు సహాయుఁడగును. అని యెంతయాశ పెట్టుకొనియున్నాఁడో రాక్షసకోటులు చుట్టుకొనఁగా సింహములగుంపులు చుట్టుకొనఁగా నుండెడి కోడెవలె నెంత దుఃఖించుచున్నాఁడో?

క. అని చెప్ప లక్ష్మణుండును, దనయగ్రజుశాసనంబుఁ ♦ దలఁచి చనక ని
ల్చినఁ గని కుపితాత్మిక యై, జనకతనూజాత యిట్లు ♦ సౌమిత్రి కనున్. ౭౧౭

అగ్రజుశాసనంబు = సీతను సర్వవిధములఁ గాపాడు మనిన యన్నయాజ్ఞను, కుపితాత్మికయై = కోపించినమనస్సు గలదై.

తా. అని చెప్పఁగా లక్ష్మణుఁడు సీతను గాపాడు మని చెప్పిన యన్న యానతి దలఁచి పోక నిలిచియుండఁగాఁ జూచి కోపించి సీత లక్ష్మణునితో నిట్లనెను.

## సీత లక్ష్మణునిఁ గోపించి పలుకుట.

శా. సౌమిత్రీ! భవదగ్రజాతునకుఁ గ♦ష్టంబైన యీకాలమం
దేమాత్రంబును నీవు దోడ్పడఁగ నూ♦హింపంగనుఁ లేమి నా
రామిత్రాకృతి సంచరించెడి మహా♦ప్రత్యర్థి వం చెంతు దు
ష్కామీ! రాముఁడు నీకు నేచెడుగులం ♦ గావించె నో వంచకా. ౭౧౮

సౌమిత్రీ = సుమిత్రానందనా. అడవికి వచ్చునపుడు మీయమ్మ నీ కేమి చెప్పెను? నీవు చేయునది యేమి యని భావము. భవత్ + అగ్రజాతునకు = మీ అన్నకు, లోకములో మఱి యెవ్వరికో కాదు. మిత్రాకృతిఁ = మిత్రుని యాకారముతో అనఁగా మిత్రునివలె వేషము వేసికొని, మహాప్రత్యర్థివి = గొప్ప శత్రువవు, దుష్కామీ = చెడ్డకామము గలవాఁడా, వంచకా = మోసగాఁడా.

తా. సుమిత్రపుత్రా! మీ యన్నకుఁ గష్టము ప్రాప్తించిన యీకాలమునఁ గొంచెమైన సాహాయ్యము చేయుద మని యూహించిన వాఁడవైనను గావు. ఆకారణముచే స్నేహితుని వేషము వేసికొని తిరుగుచుండు గొప్ప శత్రు

వని నేను దలంతును. దుష్ట కామము కలవాఁడా! ఓరీ వంచకుఁడా! నీకు రామచంద్రమూర్తి యేచెడ్డ గావించెను.

చ. ఎఱిఁగితి లెమ్ము నీతెఱఁగు ♦ లెల్లను లక్ష్మణ! రామచంద్రుచేఁ
గఱ యభిలాష చేసెదవు ♦ కల్మషచిత్తుఁడ! నానిమిత్త మా
మొఱ చెవులారఁగా వినియు ♦ మోహము మై నడు గెత్తి పెట్టకి
ట్లుఱక తిరుండ వైతి, విటు ♦ లోర్పు మెయిన్ సుజనుండు నిల్చునే! ౨౦౯

చేఁగఱ = మరణము.

తా. లక్ష్మణా! నీ విధము నీ యాలోచన తెలిసికొంటినిలే. పాపపుమనస్సు గలవాఁడా! ఆయనయార్తధ్వని స్పష్టముగ వినియును, నామీఁద నుండు మోహముచే నన్ను గ్రహింపఁ గోరి యచటికిఁ బోవుటకై యొక యడుగైన నెత్తిపెట్టక స్థిరముగ నిలుచున్నవాఁడవైతివి. అన్నకు నాపద వచ్చినవేళలో సుజనుఁడయిన వాఁడు పోక యిట్లు నిలుచునా?

రామునిఁ గాచియుండు మని నీతల్లి నీకుఁ జెప్పెనుగాని నన్నుఁ గాచియుండు మని చెప్పలేదు గదా. ఆమెమాటనే నీ వలక్ష్యము చేసినవాఁడవు. నా మాట యలక్ష్యము సేయకుందువా.

ఉ. అన్నకుఁ జేటు గూరుట ప్రి♦యం బగు నీ కెద స్నేహ మన్నపై
సున్న నిజంబు నీవు వనిఁ ♦ జొచ్చుట ముఖ్యము రాముకై కదా
యన్నిరఘూత్తముప్రాణమున ♦ కాపద వచ్చినవేళ నేమిగా
నన్నిటఁ గాచి యుండెదు మనంబున జంకవ యెంత చెప్పినన్. ౨౧౦

తా. ఏల నిలిచితినందువా? అన్నకుఁ గీడుమూఁడుట నీకు సమ్మతము గనుక నిలిచితివి. నీకు నన్నుపై స్నేహము సున్న. ఇది నిజము, నీ వడవులకు వచ్చిన యుద్దేశ మేమి? నీతల్లి నీ కేమి చెప్పెను? ముఖ్యముగ రామచంద్రు సేవకై కదా వచ్చితివి? రాముని సేవింపుమని కదా నీతల్లి నీకుఁ జెప్పెను. అటువంటి నీవిషయమున నేపాప మెంచనట్టి రామచంద్రునకుఁ బ్రాణాపాయము వచ్చినపుడు అచ్చటికిఁ బోక యేమని నన్నుఁ గాచుచుండెదవు. ఇంత చెప్పినను లక్ష్యములేక మనస్సునందైనఁ గొంచెమైన జంకవే? రాముని రక్షించిన నాప్రాణము రక్షించినట్టు లగునుగాని రాముఁడు లేకున్న నా ప్రాణము నీవు కాపాడిన నిలుచునా?

క. భీతహరిణాక్షి యీగతి, భీతహరిణిచందమునను ♦ వెగ్గిలి బాష్ప
వ్రాతములు దొరఁగఁ బలికిన, క్ష్మాతనయామణిని గాంచి ♦ సౌమిత్రి యనున్.

భీతహరిణాక్షి = బెదరిన జింకకన్నులవంటి కన్నులు గలది, భీతహరిణి

చందమునను = భయపడిన యాఁడుజింకవలె, బెగ్గిలి = భయపడి, బాష్పవ్రాతములు = కన్నీళ్ల సమూహములు, తొరఁగన్ = రాలఁగా.

తా. స్వభావముచేతనే బెదరిన జింక కన్నులవంటి కన్నులు గలది. దానికిఁ దోడుగా నిపుడు రామున కేమియో యాపద వచ్చెనని భయపడినది కావున భయపడిన యాఁడుజింకకన్నులవంటి కన్నులుగల సీత కన్నీళ్లు రాలఁగా పలుకుట విని యామెను జూచి లక్ష్మణుఁ డిట్లనెను.

లక్ష్మణుఁడు సీతకు సమాధానముఁ జెప్పుట.

చ. వదినె! యి టేటికమ్మ భయ♦పాటునఁ గుందెదు, నీమనోహరున్
త్రిదశమనుష్యయక్షఫణి♦దేవవిరోధిపిశాచనాయకుల్
కదనమునందుఁ దాఁకియు ము♦ఖాముఖి నిల్వఁ గలారె? వారికిన్
బ్రదుకులు దీపుగావె? మఱి♦ప్రాణము లంతటిచేఁదె యేరికిన్? ౭౨

వదినా : = వదినె—వదిన యని రెండు రూపంబులు గలవు - అన్నభార్య- భార్యయక్కకు వదినె యనియే పేరు. వధూశబ్దభవము. మనోహరున్ = భర్తను, త్రిదశ = దేవతలయు, మనుష్య = మనుష్యులయు, యక్ష = యక్షులయు, ఫణి = సర్పములయు, దేవవిరోధి = రాక్షసులయు, పిశాచ = పిసాసులయు, నాయకుల్ = ప్రభువులు, కదనమునందున్ = యుద్ధమునందు, ముఖాముఖి = ఎట్టయెదుట.

తా. వదినా! యేలమ్మ యింతఁగా భయపడి దుఃఖించెదవు. నీపతి దేవతల, మనుష్యుల, యక్షుల, సర్పముల, రాక్షసుల, పిశాచముల నాయకులైనను, యుద్ధమునఁ దాఁకి యెట్టయెదుట నిల్వఁగలరా? వారికి మాత్రము బ్రదుకవలెనను నాశలేదా. ఎవరికైనఁ బ్రాణములు చేఁదా? ఏది తీపనినఁ బ్రాణము తీపు అను సామెత వినలేదా?

చ. ఇటు తగునమ్మ నీకు వచి♦యింపఁగ, రాముఁడవధ్యుఁడెందు, నె
క్కటి నిను వీడి నాకుఁ జనఁ♦గాఁ దెటులాడెడి, ముజ్జగంబులో
క్కటఁ బయి నెత్తెనేని నన♦గప్రతిపంథిమరుద్గణంబు నేన్
దిటముగ రాముఁ డాశుగత♦తిం బరిమార్చును దీర్చ నందఱున్. ౭౩

నీకున్ = గొప్పవంశమునఁ బుట్టిన నీకును, అయోనిజగాఁ బుట్టిన దేవతవంటి నీకును, శ్రీరామచంద్రు నంతటివానికి భార్యవైన నీకును, క్షత్రియ కన్యవైన నీకును, స్వభావముచే సాధ్వీ గుణములు గల నీకును, అవధ్యుఁడు = చంపఁబడ సాధ్యముగాని వాఁడు, ఎక్కటి = ఒంటరిగా, స+నగ ప్రతిపంథి + మరుత్ + గణంబు నేన్ = ఇంద్రునితోడి దేవతా సమూహమునైనను, ఆశుగతతిన్ = బాణ సమూహముచే, పరిమార్చును = చంపును.

తా. నీనోర వచ్చిన మాటలు నీవు చెప్పఁదగినవి కావు. రామచంద్ర మూర్తి యెవరిచేతను జంపఁబడువాఁడు కాఁడు. ఒంటిగా నిన్ను విడిచిపోవుటకు నేనొక యడుగైన నెత్తిపెట్ట నెట్లు సాధ్యము? మూఁడులోకము లొక్కటిగాఁ జేరి దండెత్తి వచ్చినను, ఇంద్రుఁడు దేవతలు గలసి వచ్చినను, ధీరుఁడై చలింపక నిలిచి రామచంద్రుఁడు బాణములచేఁ జంపును. అందఱను నాశము చేయును.

క. నమ్ముము నామాటను మది, నిమ్మళముం గనుము దేవి ♦ నీనాథుఁడు శీ
ఘ్రమ్మున మృగముం జంపి సు,ఖమ్ముగ నిట వచ్చు నేల ♦ కళవళపడఁగన్. ౭౭౭

కళవళపడఁగన్ = వ్యాకులపడఁగా.

తా. అమ్మా నామాట నమ్ముము. మనస్సున నిబ్బరించుకొనుము. నీభర్త శీఘ్రముగ మృగమును జంపి సుఖముగ నేకీడు లేక యిచ్చటికి వచ్చును. ఏల కలఁతి చెందెదవు?

క. రామునిస్వరంబు గా దది, యేమాయావియొ రవంబు ♦ నెసఁగించెఁ జుమీ
యే మన గంధర్వనగర, మా మాడ్కిని గలుగఁ జేసె ♦ నాయసురుం డే.౭౭౮

తా.మనము విన్నది రామచంద్రమూర్తి కంఠస్వరముగాదు. ఏ మాయల మారియో యా విధముగ ధ్వనించెను. ఆ మారీచ రాక్షసుఁడే గంధర్వనగరము గుటవలె స్వరము కలిగించెను. గంధర్వ నగరము. మేఘముల చిత్ర సన్నివేశము- గంధర్వ నగరం ప్రోక్త మింద్రజాలం మనీషిభిః॥ అని గంధర్వనగర మనఁగా, నింద్రజాలమనియుఁ గలదు. లేని దున్నట్లు కనఁబడఁజేయు శక్తి.

ఉ. ఇల్లడపెట్టి పోయె నిను ♦ నియ్యెడ రాఘవుఁ డమ్మహాత్ము ప
ల్కెల్లను బొల్లు చేసి యెటు ♦ లేగుదు, వైరము పూని యున్నవా
రల్లఖరుండు చచ్చినది♦యాదిగ రాక్షసు లెల్ల, వారలే
కల్లరవంబు నించెదరు ♦ ఘాతుకులై సతి యేల చింతిలన్. ౭౭౯

తా. నీవు పో నీవు పో యనెదవే నే నెటులమ్మా పోదును. నిన్ను నారక్షణము నందునిచికదా రామచంద్రమూర్తి పోయెను. ఇల్లడ యుంచిన సొమ్ము పాఱవేసి పోవువాఁడు సొమ్ముకాఁడు వచ్చి యడిగిన నేమి యుత్తరము చెప్పఁ గలఁడు? రామచంద్రమూర్తి వచ్చెనా యిదియా నిన్ను జేయుమని చెప్పిన పని యని యడుగఁడా? ఆయన యాజ్ఞనుల్లంఘించి యాయన మాట వ్యర్థముచేసి నేనెట్లు పోదును? నేను వెడలిపోయిన నీగతి యేమి? నాకేమి యపాయము వచ్చె ననెదవా? ఖరుఁడు చచ్చినది మొదలు రాక్షసు లందఱు మనమీఁద పగ పూని యున్నారు. ఏ విధముగనైన మనలను జంపవలయునని కుట్రలు పన్ను

చున్నారు. వారే మనలను వేఱుచేయుటకై యిటువంటి మోసపుధ్వనులు చేయు చున్నారు. ఇది యాలోచింపక నీవేల దుఃఖపడెదవు.

సీత లక్ష్మణుని నిష్ఠురంబులు పల్కుట.

క. అని సౌమిత్రి వచించిన, జనకతనూజాత కోప♦సంరక్తవిలో
చనయై పరుసనివాక్కుల, ననియెఁ బుతవాది యైన♦యాలక్ష్మణునిన్. ౭_౨౭

కోపసంరక్త విలోచనయై=కోపముచే నెఱ్ఱనైన కన్నులు గలదై, పరుసని= కఠినపు, ఋతవాది = సత్యము చెప్పువాఁడు.

తా. లక్ష్మణుఁ డిట్లు చెప్పఁగా విని సీత కోపముచే కన్ను లెఱ్ఱచేసి సత్యము చెప్పుచున్న లక్ష్మణుని నిట్లు కఠినముగా మాటలాడెను.

ఉ. ఓరిదయావిహీన! విన♦రోరినృశంస! యనార్య! వంచకా!
యోరి సువంశపాంసన! గు♦ణోన్నతుఁ డౌరఘురాముచేటు నీ
కారయ సమ్మతంబది య♦థార్థము సుమ్మటుకానిచోటఁ గ
న్నారఁగఁ గీడు గాంచి యిటు♦లాడెదవా చెడుగా దిటంబుగన్. ౭_౨౮

ఓరి = ఇచ్చట నిందయందుఁ బ్రయుక్తము, దయావిహీన = దయలేని వాఁడా! అన్యునైనను నాపదయందు రక్షించుట దయావంతు లక్షణము. అట్టిఇత రుల యందుఁ జూపవలసిన దయయు అన్నయందుఁ జూపకున్నావే, నీవేమి మను ష్యుఁడవు. వినరోరి = వినుమురా + ఓరి=వినరోరి, నృశంస=క్రూరుఁడా, అనార్య= ఆర్యజాతియం దుండవలసిన గొప్ప గుణము లేనివాఁడా, వంచక = మోసగాఁడా, సువంశపాంసన = మంచివంశమును జెఱుచువాఁడా, గుణోన్నతుఁడు = గుణము లచే గొప్పవాఁడు, ఆరయఁగ = ఆలోచింపఁగా, చెడుగా = దుష్టుఁడా? దిటంబు గన్ = ధైర్యముతో.

తా. ఓరీ మనుష్యుఁ డగువానికి పరాయివారియం దుండవలసిన దయయు నీ యన్నయందు లేదు. వినరా దయ లేకుండినఁ బోనిమ్మనిన చచ్చినఁ జావనీలే యను క్రూరత్వమును గలదు. దీనివలననే నీవు ఆర్యజాతియందుఁ బుట్టవలసిన వాఁడవు కావు. ఏలన ఆర్యుల కుండవలసిన దయాది గుణములు లేకుండుటయే గాక క్రూరత్వము మోసముకూడ నీయం దున్నది. నేనేమి వంచన చేసితి ననె దవా. నీకు సేవ చేసెద నని కూడ నమ్మించి వచ్చి యాపదవేళ కాదుకొనకపోవుట వంచన కాదా. ఇటువంటి గొప్ప వంశమునకు నపకీర్తి తెచ్చి దాని గౌరవము నాశముచేయ నెట్లు పుట్టితివిరా. దుర్మార్గుఁడు చచ్చినఁ జావనీలే యనుటకు రామ చంద్రమూర్తి సద్గుణములచే గొప్పవాఁడు కదా. అట్టివాని కీడు నీకు సమ్మతమై

నపుడు నీ వెట్టివాఁడ వనవలెను? నీవు నిజముగా రామచంద్రుని కీడు గోరువాఁడవే. లేకున్న కన్నారఁగాఁ గీడు వచ్చియుండుట చూచి యార్త ప్రలాపము విని దుష్టుఁడా ధీరుఁడవై కొంచెమైన సంకోచముగాని యయ్యో పాపమని పరితాపముగాని లేక నేను పోను అని కూడఁ జెప్పుదువా?

క. కా దిట్టిది చిత్రము దా,యాదులు ప్రచ్ఛన్న వేషు♦లై నిత్యంబున్.
 లో దయను మాలుచు నీవలె, నోదుర్మతి కీడు సేయ♦నులుకరు వింటే. ౨౨౯

ప్రచ్ఛన్నవేషులై =మాఱు రూపములు ధరించినవారై, దయమాలుచు = దయ వదలిపెట్టుచు, దుర్మతి = చెడు మనస్సు గలవాఁడా, ఉలుకరు = భయపడరు.

తా. నీనడవడియందు వింత యేదియు లేదు. లోకమున జ్ఞాతులు మాఱు వేషములు ధరించి దయవదలి ఎప్పుడు నీవలెఁ గీడుచేయ భయపడరు- వింటివా.

శా.నీవే వచ్చితొ కైకయీతనయుఁడే♦నిన్నంపెనో కాని మా
 యావేషం బిటు లూని నాకొఱక దు♦ష్టా! యొంటిమై నొంటివాఁ
 డౌ వాత్సల్యపయోధి రాముబడి ఘో♦రారణ్యముల్ సొచ్చి దు
 ర్భావా వచ్చితి వీవుదోడ్పడఁగ స♦ద్భావంబునన్ వచ్చితే. ౨౩౦

వాత్సల్యపయోధి = దయారసమునకు సముద్రుఁడగు వాఁడు, దుర్భావా= చెడ్డ తలంపు గలవాఁడా, వాత్సల్యము = తల్లిదండ్రులకు బిడ్డలయందుండు ప్రేమకు వాత్సల్య మనిపేరు, దోషములనెన్నక గుణములనే భావించుట - దోషములున్నను సజ్జనులు దాని గ్రహింపరనికదా రామచంద్రమూర్తి చెప్పెను. రాము బడి= రాము వెంబడి, సద్భావంబునన్ = మంచి యభిప్రాయముతో, రామున కుపకరింపవలెనని వచ్చితివా?

తా. లక్ష్మణా! నీవు నిజముగా నన్నకుఁ దోడుపడవలయు నని, మంచి యభిప్రాయముతో వచ్చితివా? లేదు-చెడ్డయభిప్రాయముతోనే వచ్చితివి. ఏమి నా చెడ్డ తలంపు అనెదవా చెప్పెదవిను. భరతుఁడు నీవు రామచంద్రమూర్తికి సవతి తల్లి కొడుకులు. ఒక సవతితల్లి కొడుకు రాజ్యము నపహరించిన నీవు నన్నపహరింపవలె నని నీవే స్వయముగ వచ్చితివో లేక రాజ్య మపహరించినట్లె భార్యను అపహరించెదను, నీవింను సాహాయ్యము చేయు మని భరతుఁడు పంపఁగా నొంటిగా భయంకరములైన యడవులకు వచ్చి రాముని వెంబడి వచ్చితివో-ఆయనను నీవు చంపుటకు శక్తిలేనికారణముచే నెప్పుడు చచ్చునా యని కాచియున్నావు.

క. నీకోరిక యో మఱి యా,కై కేయీతనయుతలఁపొ♦ కడఁ గనునటరా
 యాకమలాక్షునిభార్యను, గైకొందు నె యొందువానిఁ♦గలలో నైనన్. ౨౩౧

కడఁగను నటరా=తుదముట్టునా? కార్యాపేక్షాహి వర్తంతే భావస్నిగ్ధాః సుదుర్లభాః. (భా. 12-111-86)

వారివారి కార్యము నిమిత్తము వర్తించువారే కాని మనస్సున స్నేహము గలవారు మిగుల దుర్లభులు.

తా. ఇది నీయాలోచన గానీ భరతునియాలోచనగానీ ఇది తుదముట్టునది కాదు. ఏల యందువా? ఆపుండరీకాక్షుని భార్యను మఱియొకనిఁ గలలోనైన గ్రహింతునా.

క. రాముండు లేకయుండిన, నీమేనఁ నిలుపుదాననే ప్రాణంబుల్
సౌమిత్రి? నీవ చూడఁగ, నే మరణించెదను గనుమ యీనిమిషమునన్. ౨౩_౨

తా. రామచంద్రుఁడే లేకుండెనా ఈ దేహమందుఁ బ్రాణముల నుండనిత్తునా? లక్ష్మణా! నీవు చూచుచుండఁగనే నీ కన్నుల యెదుటనే యీనిమిషమందే ప్రాణములను విడిచెదను. చూడుము.

సీతాదేవి సాక్షాల్లక్ష్మీదేవి. అంతకుమించిన యుత్తమురాలేలోకమున లేదు. అటువంటిది లక్ష్మణుతత్త్వము తెలిసి తెలిసి యిటులాడవచ్చునా యని సందేహము. మనుష్యభావనచే గ్రహింపవలసిన దేమన:—ఏ లోకమున నుండినను ఎటువంటి యుత్తమురాలైనను స్త్రీ స్త్రీయే. ఉత్తమ స్త్రీలకు నధమస్త్రీలకుఁ దరతమ భేదమే కాని స్త్రీస్వభావము బొత్తిగ లేని స్త్రీ యుండదు. ఆ యల్ప గుణము దాని కనుకూలసమయము తటస్థించినపుడు బయలుపడునుగాని పడక పోదు. ఆ సమయము వచ్చువఱకు నందఱు నుత్తమురాండ్రే. అందఱు మహిళలే. వారి కప్రియకార్యము జరుగునేని యందఱు ప్రతీపదర్శినులే. అందఱువామలే-అను విషయము దీనివలన గ్రహింపఁదగి యున్నది. వారికిఁ గోపము వచ్చినపుడు వారనరానిమాట చేయరానిపని యుండదు. మనుష్యత్వము వారియందేడువాడల నుండదు.

లక్ష్మణుఁడు నిష్కారణముగా భరతుని ననరాని మాట లనెను. కావున నిపుడు నిష్కారణముగాఁ బడరాని మాటలు పడెను.

నిష్పాపుల నన్నదమ్ముల నిరువుర దిట్టుటచే సీతాదేవియు నిట్టి నిందలకే యావజ్జీవము పాలుగావలసి వచ్చెను. వాక్కుచేఁ జేసిన పాపము వాగ్రూపముగ ననుభవించెదము. ఒకరిని మన మెట్లు చేయుదుమో మనకట్లే కలుగును.

ఇఁక నవతారవిషయమున నాలోచించితిమేని వాస్తవ మేర్పడును. సీత పుట్టినది లంక చెఱుచుటకే. సమూలము రావణుఁ జంపుటకే. 'నీ పీఁచం బడఁగింతు వెండియును జన్మింతుం జుమీ రావణా' యని కదా వేదవతి చెప్పెను.

ఆకార్యము తాను జేయవలసి యున్నది. ఆ నిమిత్తము లంకకుఁ బోవలసి యున్నది. రామలక్ష్మణులు తనయొద్ద నుండినయెడల రావణుఁడు రాఁజాలఁడు. కావున మాయామృగము నెపముఁబెట్టి రాముని నయవాక్యములతో దూరము పంపెను. లక్ష్మణుఁ డట్లు పోవువాఁడు కాఁడు. రామాజ్ఞను గూడ నుల్లంఘించి పోవునంత కార్యము చేసినఁగాని యాయన పోఁడు. ఇట్లు నింద లాడినఁ బోవును. అని కార్యసాధనమార్గ మాలోచించి యిట్లు పంపెను గాని జ్ఞానహీనయై దుష్టురాలై పలికినది గాదు.

ఈ విషయమే కౌసల్యాపరిణయము పీఠికపద్యములం దీకవియే యిట్లు వ్రాసెను.

చ. తెలివిదొఱంగి నీవు దెగి తిట్టితివం దురు నీమఱందినిం
దెలియనివారు, రాక్షసతతిన్ వధియింపఁగఁ బ్రాణనాథుఁడుం
బలికినబాస దీర్పనటుపన్ని తుపాయముఁ గాకనీకునుం
గలుగునటమ్మ సీత! యొకకాలమునన్ భ్రమమానసంబునన్॥.

లక్ష్మణుఁడు సీతపైఁ గోపించి రామునొద్దకుఁ బోవుట.

చ. అని వినరానివాక్యము లిటు ♦ లాడిన జానకిఁ జూచి మేనియం
దొనర గగుర్పు రోఁజి కర♦యుగ్మము మోడ్చి జితేంద్రియుండు ప
ల్కెను బదులాడఁగా మనసు ♦ లే దిఁక, దైవత మీవు నాకు, ని
ట్లనుచితనిష్ఠురోక్తి జన♦కాత్మజ వింతలుగావు స్త్రీలకున్.          ౭౩౩

వినరానిమాటలు = సీతాదేవి మాటలు వినుటకే యోగ్యము కావు. ఇఁక ననుట విషయమై చెప్పనేల? మేనియందున్ = దేహమునందు, గగుర్పు = పులకలు - రోమాంచము, ఒనరన్ = కలుగఁగా, రోఁజి = ఉస్సని బుసగొట్టి, జితేంద్రియుఁడు = ఇంద్రియజయము గలవాఁడు. ఇట్లనుటచే సీతాదేవి యారోపించిన దోషములు లక్ష్మణునందు లేవని కవి యభిప్రాయము. అనుచిత = తగని, నిష్ఠురోక్తి = పరుషపుమాటలు, అనుచిత నిష్ఠురోక్తి వింతలు గావు స్త్రీలకున్, అనునది సర్వ స్త్రీ సామాన్య గుణమని భావము. వారికిఁ గోపము వచ్చినపుడు ఇది యసత్యము ఇది సత్యమని కాని, యీమాట యనవచ్చును, ఈ మాట యన రాదనిగాని తెలివి బొత్తిగ నుండదు.

తా. ఈప్రకారము వినుటకుఁ గూడ యోగ్యములుగాని మాటలను జానకి వంటిది పలుకఁగా జితేంద్రియుఁ డగు లక్ష్మణుఁడు దేహమున గగ్గురు పొడువ రోఁజి రెండుచేతులు మోడ్చి నీకు బదులుచెప్పుటకు నాకు మనస్సంగీకరింపలేదు. నీవు నాపాలిదేవతవని నాయభిప్రాయము. యోగ్యాయోగ్య విచారము లేక నోటికి వచ్చినట్లు కఠినముగ మాటలాడుట స్త్రీలయందుఁ గ్రొత్త విషయముగాదు.

చెడుకార్యమునకైనను మంచికార్యమునకైనను వారి యిష్టప్రకారము నడవని పురుషులను నోటికి వచ్చినట్లు తిట్టుదురు. (౨౦౭ ప. చూడు).

చ. ఇది సహజంబు లోకమున ♦ నింతుల కెల్ల, విముక్తధర్మదు
ర్హృదయలు చంచలాత్మికలు ♦ నెంతయుఁ గ్రూరలు భేదకారిణుల్
ముదితలు, కొఱ్ఱు గాల్చి చెవి♦లోపలఁ గ్రుచ్చినయట్టు లయ్యెనో
మదవతి నీదుపల్కు రవ♦మాత్రమ యేని సహింప నేర్తునే. ౨౩౪

ఇది సహజంబు = స్త్రీల కీదుర్గుణము ఒకరు చెప్పిన వచ్చినది కాదు. నడు మంతరమున వచ్చినది కాదు. పుట్టువుతోడనే దేహము వచ్చినట్లు అది వచ్చినది. విముక్తధర్మ = విడువఁబడిన ధర్మముగల, దుర్హృదయలు=దుష్ట హృదయముగల వారు, చంచలాత్మికలు = చపలచిత్తలు - చపల స్వభావము గలవారు, ఎంత యుఁ = మిక్కిలి, క్రూరలు = దయా దాక్షిణ్యములేని కఠినమనస్కలు, భేద కారిణుల్ = విరోధములు కల్పించి భేదభావము కల్పించి యెంతటి మైత్రిగల వారినయిన వేఱుగఁ జేయుటయందు నేర్పరులు, ముదితలు = స్త్రీలు, కొఱ్ఱు = ఇనుపకడ్డీ, మదవతి = స్త్రీ - మదముగలది.

తా. స్త్రీల కందఱకు లోకమునం దిట్లు పరుషముగా ననుచితభాషణము లాడుట స్వభావము. స్త్రీలు ధర్మజ్ఞానము లేనివారు. కావుననే దుష్టహృద యము గలవారు. దానికితోడు స్థిరబుద్ధి లేనివారు. చపలచిత్తలు. ఎంత క్రూర కార్యమునకైనను వెనుదీయరు. దయా దాక్షిణ్యములు లేవు. అన్నదమ్ములకో తండ్రి బిడ్డలకో, ఒకరితో నొకరు కూడియుండక కొంపలు రెండుమూఁడుగాఁ జేయు నేర్పు గలవారు. మదించినదానా! నీమాట కొఱ్ఱుగాల్చి చెవిలోఁ గ్రుచ్చి నట్టు లయ్యెను. దాని నే నేమాత్రము సహించువాఁడఁ గాను.

ఆ. సాక్షిభూతు లగుచు ♦ సర్వవనేచరు, ల్వినెడివారు గాక ♦ విశదముగను
న్యాయవాది నగుచు ♦ న్యాయంబుఁ బలికిన, నన్ను నీ వనిన చె♦నంటిపల్కు. ౨౩౫

సర్వవనేచరుల్ = వనమునఁ జరించు దేవత లందఱు, చెనంటి పల్కు = చెడ్డమాట.

తా. న్యాయము చెప్పినవాఁడనై న్యాయమందుండు నన్ను నీవు పలికిన దుష్టవాక్యములను, ఈ వన దేవత లందఱు విశదముగ సాక్షులై విందురు గాక.

క. ఛీ పో పాడుగ నీ విపు, డే పాపిష్ఠంబు స్త్రీత్వ ♦ మిల సహజముగాఁ
గోపన గురువాక్యస్థితు, నీపగిది న్నన్నుసంశ♦యించినకతనన్. ౨౩౬

పాపిష్ఠంబు = మిగుల పాపాత్మకమైనది, కోపన = కోప స్వభావము గల

దానా, 'కోపనా సైవ భామినీ' అమరకోశము, గురువాక్యస్థితుః = పెద్దవాఁడగు నన్న చెప్పిన మాటయందు నిలిచిన వానిని.

తా. ఛీ సహజముగ స్త్రీత్వమే పాపాత్మకము. కోపస్వభావముగలదానా! పెద్దవాఁడు తండ్రితో సమానుఁ డగు నన్న శాసనమందుండు నన్ను నీవిధముగా సందేహించిన కారణముచే నీ విపుడే పాడై పొమ్ము.

తమకై తనసర్వసౌఖ్యములు విడిచి యడవులపాలై తల్లికిఁ జేయు సేవ కంటెఁ దనకు నెక్కువగ సేవ సేయువానిని నిట్టి నోటఁ బట్టరాని మాటలాడిన నెవరి మనస్సు విఱుగ కుండును? మరల దాని ముఖమైనఁ జూడ బుద్ధి పుట్టి యుండునా? కావుననే తగిన ప్రాయశ్చిత్త మనుభవించువఱకు భగవంతుఁడు ముఖావలోకనమే లేకుండఁ జేసెను. దీనివలన నెంతటి జితేంద్రియులైనను నెంతటి నిష్పాపమనస్కులైనను యౌవనవంతులు వయస్సుస్త్రీతోడ నొంటరిగా నేసమయమందు నుండరాదు-నింద తప్పదు.

క. పోయెద రాముని కడ కిపుడే యబలా! నీకు స్వస్తి ♦ యొసఁగుత దేవీ
యీయటవి దేవతావళి, పాయక రక్షించుఁగాక ♦ పద్మాక్షి నినున్. ౨౩౭

అబలా = ఇచ్చటనఞ్ అల్పార్థమును దెలుపుచున్నది. అల్ప బలము కలదని యర్థము. అటవి దేవతావళి = వనదేవతా సమూహము, పాడై పొమ్మ నిన వాఁడు. ఇప్పుడు నీకు స్వస్తియగుఁగాత, వనదేవతలు రక్షింతురు గాక! యని యెట్లనెను. పాడై పొమ్ము అన్న తర్వాత రామస్మరణ లాభించుటచే నయ్యో రామునకు సంబంధించినదానిని రామునకుఁ బ్రియమైనదాని నే నిట్లం టిని. అని స్మృతి తెచ్చుకొని నీదోష ఫలము నీవే యనుభవించెదవు. నేనేల తిట్ట వలెనని తలఁచి స్వస్తియగుఁ గాక యనెను. దీనివలన రామునకు సంబంధించిన దానిని దేనినిగాని రామభక్తులు పరుషముగ మాటలాడరా దని యేర్పడుచున్నది. ఇతరులు దూషించిరా దూషింప నిండు. వారి పాపఫలము వారే యనుభ వింతురు.

క. నాకు నిమిత్తము లెంతయు, భీకరమై తోఁచె రామ ♦ వీరునితోనే
నీకడకు వచ్చివైదే, హీ! కందునొ కానలేనొ ♦ యిచ్చట నిన్నున్. ౨౩౮

నిమిత్తములు=శకునములు, భీకరమై=చెడ్డ సూచించునవియగుటచే భయ ముకలిగించునవి, ఇచ్చట = ఈప్రదేశమందు, పునర్దర్శనము లంకయందేకదా.

తా. నాకుఁ జెడ్డసూచించు నవశకునము లగుచున్నవి. రామచంద్రునితో నేనిటకు మరలివచ్చి యిచ్చట నిన్నుఁ జూడఁగలనో చూడలేనో.

చ. అనుచు సుమిత్రపట్టి దను ♦ నాడిన జానకి బాష్పపూరముల్
కనుఁగవఁ గాఱ నేడ్చుచును ♦ గర్ణకఠోరముగాఁగఁ బల్కె నేఁ
దినెద విషంబు, గౌతమిని ♦ దీఱెద, నే నురిపోఁతఁ జత్తు, వ
హ్నిని బడుదానఁ, గాక పరు♦నిఁ స్పృశియింతునె కాలిఁవ్రేలనేన్. ౭౩౯

పట్టి = బిడ్డఁడు, కర్ణకఠోరముగాఁగన్ = చెవులవినుటకుఁ బరుషముగా, గౌతమిని = గోదావరియందు, తీఱెదన్ = దూఁకిచచ్చెదను, ఉరిపోఁతన్ = ఉరిపోసికొనుటచే, వహ్నిని = అగ్నియందు.

తా. ఈప్రకారము లక్ష్మణుఁడు పలుకఁగా జానకి కన్నీళ్లు కార్చుచు నేడ్చుచు కర్ణశూలములవంటి మాటలుపలికెను. నేను విషము దిని చచ్చెదను. గోదావరిలో దూఁకెదను. ఉరిపోసికొందును. మంటలోఁబడి చత్తునుగాని యితరుని కాలివ్రేలిచేనైనఁ దాఁకుదునా.

ఇచ్చట నగ్నిలో దూఁకెదను. అని చెప్పుటచే యగ్నిలో దాఁగెనని కొందఱొకయుక్తి కల్పింతురు. ఉరిపోఁతచే, విషము దినుటచే, నీళ్ళలోదూఁకుటచే చావకుండినఁగదా యావల నగ్నిమాట.

క. అని పల్కి బిగ్గ నేడ్చుచుఁ, దనయుదరము బాఁదుకొనుచుఁ ♦ దనహస్తములన్
జనకజ యుండిన లక్ష్మణుఁ, డను నయములుపల్కమాట ♦ లాడదు సతియున్.

బిగ్గ = గట్టిగా, బాఁదుకొనుచున్ = దబాదబాకొట్టుకొనుచు, అనునయములు = ఊరార్పులు, మాటలాడదు = బదులుచెప్పుచుండిన నీముచ్చటలతో నాలస్యమైపోవును. ఈలో రాముఁడు వచ్చెనా తనపన్నాగమంతయు వ్యర్థమై పోవును.

తా. అనిచెప్పి గట్టిగా నేడ్చుచు రెండుచేతులతో దబాదబాయని కడుపు మీఁద కొట్టుకొనుచునుండెను. లక్ష్మణుఁడూరార్చినను బదులుచెప్పినదికాదు.

సీతకంటె పెద్దగయ్యాళి లోకమున నెవతెయో, యెంతటిగయ్యాళియైన సీతచేసినదానికంటె నెక్కువ యేమిచేయఁగలదో తెలియలేదు.

సీత చిలుకవంటిదే కాని రేఁగిన తేఁచుకుక్క యనుసామెత యీనాఁడు పుట్టినదే.

ఈ సీతాలక్ష్మణసంవాద మిచ్చోటఁ దప్ప మఱియెచ్చటను రామాయణమునఁ బ్రస్తాపింపఁబడలేదు. దానివలన నిది ప్రక్షిప్తమని కొందఱయభిప్రాయము. భాస్కరరామాయణమున "అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధి నే నజ్ఞానినై పల్కితిన్। నన్నాపాపమువచ్చి చుట్టుకొనియె"నని యేడ్చినట్లు వ్రాయఁబడెనుగాని యది నిరాకరము.

ఒకవిషయము రెండవసారి చెప్పఁబడదేని యది ప్రక్షిప్తమనువాదమే సరిగాదు. కాకాసురవృత్తాంతము రెండవసారి చెప్పఁబడలేదు. సీతాలక్ష్మణ సంవాదము వారి కిరువురకే తెలియును. లక్ష్మణుఁడు చెప్పఁగాఁ గొంచెము రామచంద్రునకుఁ దెలియును. ఇఁక నిది బైటపడు విధ మెట్లు? నేను లక్ష్మణు నిట్లంటి నని సీత యేమని యెవరితోఁజెప్పుకొనును? ఎవరితోఁజెప్పినను చకారగుడులే యామెకు ప్రాప్తించును. రామలక్ష్మణులు చెప్పెడివారుగారు. ఆకారణమున రెండవసారి ప్రస్తాపింపఁబడలేదు. బ్రహ్మవరముచేతను యోగదృష్టిచేతను నీరహస్యము దెలిసిన వాల్మీకి బయటఁబెట్టెను.

ఈవాదము కారణము గాదేని లక్ష్మణుఁడు సీతను విడిచిపోవలసిన కారణము గలుగదు. లక్ష్మణుఁడు పోకుండిన రావణవధగాని యావల రామాయణచరిత్రము గాని లేదు. వేదవతి వ్యర్థసంకల్పయై యుండును. రావణుఁడు సుఖజీవియగును.

క. సౌమిత్రి యంతనించుక, కై మోడ్పున నతియొనర్చి ♦ కదలి పలుమఱున్
భూమిజఁ గనుచుం గుపితుఁడు, దామది గొల్పకయుఁబోయెఁ♦ద్వరఁ జనినట్టుల్.

అంతన్ = ఈగయ్యాళితనమును జూచి స్త్రీలెంతకైన సాహసింతురు. ఇఁక నుండిన నింకేమి చేయునో యని సౌమిత్రియంతటివాఁడు భయపడి, ఇంచుకకై మోడ్పునన్ = కొంచెమునమస్కారముతో, అనఁగా నెప్పటివలె వంగిగాని, ముఖము వఱకు చేతులెత్తిగాని నమస్కరింపక బొడ్డువఱకే చేతులు రానిచ్చి ఇట్టి యనిష్ట నమస్కారములు చేయువారిని దేవాలయములందు-పెద్దలయొద్దకుఁ బోవువారి యందుఁ గొందఱియందుఁ గాననగు. లక్ష్మణువిషయమునఁ గోపము కారణము. ఈ పెద్దమనుష్యులయందు నభిమానము కారణము-, కుపితుఁడు = కోపించినవాఁడు, మదిగొల్పకయు = పోవ మనసున నిష్టములేక, పోకున్న వేఱుమార్గములేక. త్వరఁ జనినట్టుల్ = త్వరగాఁబోవువానివలెనే-త్వరగాఁ బోవుటకు కాళ్లు సాగినవికావు. ఈమె కేమియపాయము వచ్చునో యని భయముచే ప్రయాణము సాగలేదు.

ఇచ్చట నొకసందేహము. శ్రీరామచంద్రమూర్తికి శత్రుభయము లేదని సీతాదేవి ప్రేమాంధయై భర్తృక్షేమము గోరి యజ్ఞానముచేఁ దన్ను దూషించుచున్నదని లక్ష్మణుఁ డెఱుఁగనివాఁడుకాఁడు. సీతకు నపాయము రాఁగలదని భయము నుగలవాఁడు. ఇట్టివాఁడు పోకయే యుండరాదా? ఒకవేళపోయినను చూపు దూరమునందుఁ బొదలమాటుననుండి కాచియుండరాదా? పోయినదేపోకగా నేలపోవలెను? ఈరెండును సీతాసందేహమును బలపఱచు నవే యగును.

పోక నిలిచినాఁడనుకొందము. సీత తానుజెప్పినట్లు చేయునేమో? ఉరిపోసికొనియో మఱియొకవిధముననో చచ్చె ననుకొండు. అప్పుడు రామునకు లక్ష్మణుఁ

డేమని చెప్పఁగలఁడు? ఉన్నవాస్తవము చెప్పిన సీతకుఁ గలిగిన యనుమానమే రాము నకును గలుగును. అటు చేయకముందే రామచంద్రమూర్తి వచ్చెననుకొందము. సీత జరిగినవిషయమంతయుఁ జెప్పి నే నెంత చెప్పినను గదలినవాఁడు కాఁడు. ఇతఁడు దురు ద్దేశముకలవాఁడని నాకు సందేహముగానున్నది. కావున వీఁడు మనతోడ నుండ రాదని చెప్పునేమో? అప్పుడు రామచంద్రమూర్తి నిరపరాధి లక్ష్మణుని విడువనా? మూర్ఖురాలు సీతను విడువనా? లక్ష్మణుఁడిన్నినాళ్లు చేసినకైంకర్యము, ఏటఁబెట్టిన మాన్య మగునుకదా. లోకనింద తప్పదుగదా. వీఁడు చెడుకార్యము చేయకుండిన రామచంద్రుఁడు వీనిని బొమ్మనునా యనికదా లోకమనును.

పొదలచాటున డాఁగియుండెనా రామచంద్రుఁడు వచ్చినపుడు లక్ష్మణుని నేను బంపితినే రాలేదా యని సీత యడుగును. రాలేదని రాముఁడు చెప్పును. అప్పుడు జరిగినవృత్తాంతము చెప్పి, వాఁడు మీయొద్దకు రాలేదు. ఇక్కడ నుండలేదు. నా సందేహ మిది యని చెప్పును. ఇది యెక్కువసందేహమునకుఁ గారణ మగును. ఇవన్ని యాలోచించియే లక్ష్మణుఁడు ఋజుత్వమే మేలని సరిగా రామునొద్దకే పోయెను.

## ౪౬-వ సర్గము. రావణుఁడు యతివేషము ధరించుట.

సీ. అది సందుగాఁ గొని ♦ పదిశిరంబులసోఁకుఁ, డాసీత డాయంగ ♦ నరుగ నెంచి
సన్న్యాసివేషంబు ♦ సరగన ధరియించి,శ్లక్ష్ణకాషాయవ♦స్త్రంబుఁ గట్టి
వామభుజంబున ♦ వఱల యష్టి కమండలువులు ఛత్రముసిగ♦లును వహించి
పావలు దొడిగి యా♦పద్మాక్షి సోదరు, ల్విడిచి పోవఁగ రవి♦విధులు లేని

తే. సంధ్యనలమెడియిరులన ♦ శశివిహీన,రోహిణినిడాయుగ్రహమనఁ ♦ గ్రూరబుద్ధిఁ
గదిసెనాతని రాకకు ♦ తనూరుహములు, కదలవయ్యెసమీరంబు ♦ మెదలదయ్యె.

ఇఁక రామభక్తుని దూషించిన ఫలము చెప్పుచున్నాఁడు. సోఁకుఁడు = రాక్షసుఁడు, శ్లక్ష్ణ = సన్నని, యష్టి = త్రిదండము, శిఖ చెప్పుటవలన త్రిదండియనియే చెప్పవలెను. పావలు = పాదుకలు, రవివిధులు = సూర్యచంద్రులు, ఇరులు = చీఁకట్లు, ఇది నిత్యబహువచనాంతము. 'కురులు' అనునది యిట్టిదే. శశివిహీన= చంద్రుని విడిచియుండు, గ్రహము = రాహువు, సమీరంబు = గాలి, ఇచ్చట రావణుఁడు ధరించిన సన్న్యాసివేషము వర్ణింపఁబడినది. ధర్మప్రధాన జనకవంశమున జనించినదికదా సీత. జనకునియొద్దకు వచ్చు సన్న్యాసులవేషములు ఆచారములు అందుఁ దారతమ్యములు సీతకుఁ దెలిసినవే. అట్టియామెను మోసగింప వలయు ననిన నుత్తమ వాస్తవ సన్న్యాసివేషమునే వేయవలయును. లేనియెడల వాస్తవ సన్న్యాసిగాఁడని నమ్మదు. కావున కాషాయవస్త్రము కట్టి, యెడమభుజముమీఁద త్రిదండము మోపి, కమండలువు, గొడుగు, శిఖ, ధరించి, పాదుకలు దొడిగికొని,

రావణుఁడు సీతయొద్దకుఁబోయెను.

ఇదియే సరియైన సన్న్యాసివేష మని యంగిరసుఁడు చెప్పెను.

యతే ర్లింగం ప్రవక్ష్యామి యే నాసౌ లక్ష్యతే యతిః
బ్రహ్మసూత్రం త్రిదండంచ, వస్త్రం జంతునివారణం
శిక్యం పాత్రం బృసీంచైవ కౌపీనం కటివేష్టనమ్
యస్యైత ద్విద్యతేలింగం స యతి ర్నేతరో యతిః॥

ఏవియుండిన యతి యనఁబడునో యాయతి చిహ్నములు చెప్పెదను. యజ్ఞోపవీతము, త్రిదండము, వస్త్రము, చిక్కము, కమండలువు, బృసి, కౌపీనము, నడుముగుడ్డ, ఇవిగలవాఁడే యతి. ఇవి లేనివాఁడు యతి కాఁడు. మహేశ్వరతీర్థీయ మందును, రావణుఁడు త్రిదండి వేషమే వేసెననియున్నది.

అథాశ్రమం చరమం సంప్రవిశ్య యథోపపత్తిం। పంచమాత్రాం దధానః। త్రిదండ ముపవీతం చ వాసః కౌపీనవేష్టనం। శిక్యం పవిత్ర మిత్యేత ద్బిభృయా ద్యావదాయుషం। పంచైతాస్తు యతే ర్మాత్రా స్సాసూత్రా బ్రహ్మణే శ్రుతాః। త్రిదండం వైష్ణవం లింగం విప్రాణాం ముక్తిసాధనం నిర్వాణం సర్వధర్మానా మితి వేదానుశాసనమ్॥

దీనివలన సన్న్యాసులై ముక్తికాంక్షగల విప్రులు త్రిదండిసన్న్యాసులు విష్ణుచిహ్నధారులు కావలయునని యేర్పడుచున్నది. ఈ చిహ్నములన్నియు నిందుఁ జెప్పఁబడకపోయినను సన్న్యాసి యని చెప్పుటచేతను శిఖాదులు చెప్పుటచేతను సన్న్యాసికుండవలసినవన్నియు రావణుఁడు ధరించెనని యెఱుఁగవలెను

బ్రాహ్మణానా మయం ధర్మో యద్విష్ణో ర్లింగధారణమ్॥ విష్ణుచిహ్నములు ధరించుట బ్రాహ్మణధర్మము- బోధాయనుఁడు. ఏకవా సాద్వివాసా వా శిఖీ యజ్ఞోపవీతవాన్। కమండలుధరో విద్వా న్యాతి తత్పరమం పదమ్॥ వ్యాసులు. యావనస్యస్త్రయోదండా స్తావ దేకేన పర్యజేత్॥ మేధాతిథి. ఏకంతువైణవం దండం పాలాశంబైల్వమేవవా। గృహీత్వా విచరే త్తావ ద్యావల్లభ్యే త్త్రిదండకమ్॥

ఇత్యాదివాక్యములు పెక్కులుగలవు. పైవాక్యముల సారాంశ మేమన త్రిదండి సన్న్యాసము సౌమ్యము. వైష్ణవమనియు, నదియే ముక్తిప్రదమనియు త్రిదండధారణశక్తి గలుగువఱకు ఏకదండిగా నుండవలయుననియు—వైష్ణవసన్న్యాసులు మూఁడుదండముల నొకటిగాఁగట్టి ధరింతురు. దానియర్థము చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు మూఁడుభిన్నములయినను శరీర శరీరి భావముచే నొకటియే, యని సూచించునందురు. దీనికి మనుస్మృతియం దిట్టు లర్థము వ్రాయఁబడినది.

వాగ్దండశ్చ మనోదండః కాయదండ స్తథైవచ
యస్యైతే నిహితా బుద్ధౌ స త్రిదండీతి చోచ్యతే

దండమనఁగా దమనము అణఁచుట. వాక్కును మనస్సును కాయమును ఈ మూఁటిని నణఁచుట త్రిదండమనఁబడును.

వాగ్దండో మౌనతా ప్రోక్తా కర్మదండ స్త్వనీహతా
మానసస్య తు దండస్య, ప్రాణాయామో విధీయతే.

మౌనము వాగ్దండము, కర్మదండము కోరికలులేకుండుట, ప్రాణాయామము మనోదండము. పరమహంస యుత్తమసన్న్యాసి. ఈయనకు జ్ఞానము లక్షణము. జ్ఞానియగు సన్న్యాసికి "న దండం నశిఖాం నాచ్ఛాదనం చరతి పరమహంసః॥ మహోపనిషత్ - యథా జాతరూపధ రోఽనాచ్ఛాదనం చరతి పరమహంసః। దండముగాని శిఖగాని వస్త్రముగాని పరమహంసకు పనిలేదు. అట్టిజ్ఞానము లేనివాఁ డేక దండము ధరింపవలెను. 'సా ప్య విదుషః' నిర్ణయసింధువు-వాఁడు తెలిసినవాఁడు కాఁడు. త్రిదండధారణము పరమహంసకుఁ గలదు. 'యతిః పరమహంసస్తు తుర్యాఖ్యః శ్రుతిచోదితః। యమైశ్చ నియమై ర్యుక్తో విష్ణురూపీ త్రిదండభృత్ - పితామహస్మృతి. పరమహంస సన్న్యాసి తురీయుఁడు. వీఁ డార్తప్రపన్నునివంటివాఁడు.

స్వసంప్రదాయాగ్రహపిశాచమును బాఱఁద్రోలి శ్రుతులవాక్యములు స్మృతివాక్యములు శోధించినచో నీకాలమున సన్న్యాసమే నిషిద్ధమగుచున్నది. అధికారి దుర్లభుఁడు.

అశ్వాలంభం గవాలంభం సన్న్యాసం పలపైతృకమ్। దేవరాచ్చసుతోత్పత్తి కలౌ పంచ నకారయేత్.- పరాశరుఁడు. అశ్వమేధము, గోమేధము, సన్న్యాసము. మాంసశ్రాద్ధము, దేవరనియోగము ఈయైదు కలియుగమందు నిషిద్ధము. అశ్వాలంభమనుటకు అగ్నిహోత్ర మనునది పాఠాంతరము కానవచ్చెడిని.

యావద్వర్ణ విభాగో స్తి యావద్వేదః ప్రవర్తతే
సన్న్యాసంచాగ్నిహోత్రం చ తావత్కుర్యా త్కలౌయుగే.

వర్ణభాగము చక్కఁగానుండువఱకు వేదప్రవర్తన ముండువఱకు సన్న్యాసము అగ్నిహోత్రము కలియుగమందుఁ గలవు. ఈకాలమున వాస్తవ వైరాగ్యము కలవారు ప్రాణోత్క్రమణసమయంబున నాతురసన్న్యాసముగ సన్న్యసించితి నని చెప్పుట యొప్పునని తోఁచుచున్నది. ఇట్టి వానికిఁ బ్రేతత్వము లేదు.

దీని కపవాదము:-

చత్వార్యబ్ద సహస్రాణి చత్వార్యబ్ద శతానిచ
కలేర్యదా గమిష్యంతి, తదా త్రేతా పరిగ్రహః.

సన్న్యాసశ్చ నకర్తవ్యో బ్రాహ్మణేన విజానతా॥ వ్యాసులు-కలియుగమందు నాలుగు వేల నాలుగువందల సంవత్సరములు దాటిన తరువాత త్రేతాగ్నిపరిగ్రహము, సన్న్యాసము తెలివిగల బ్రాహ్మణుఁడు పరిగ్రహింపరాదు.

ఊర్ధ్వపుండ్రాదులవలెఁ ద్రిదండము స్వకృత్యము జ్ఞప్తికిఁ దెచ్చుచుండును. త్రికరణములను జయించువఱకుఁ దొలుత శరీరమునైన నిగ్రహింపవలెను. ఇది దండధారణోద్దేశము. స్వమతాగ్రహము లెచ్చగుటచే వీనికి భిన్నార్థములు కల్పితము లయినవి.

ఏకదండం సమాశ్రిత్య, జీవంతి బహవో నరాః।
నరకే రౌరవే ఘోరే, కర్మత్యాగా త్పతంతి తే.

ఏకదండము ధరించి యనేకులు జీవించుచున్నారు. కర్మత్యాగమువలన వీరు ఘోర రౌరవ నరకంబునఁ బడుదురు. రావణాసురునివలెఁ బరుల మోస పుచ్చుటకై ధరించినవాఁడు సన్న్యాసి కాఁడు.

వీఁడు నిజమైన సన్న్యాసి, సౌమ్యుఁడు, విష్ణుభక్తిపరుఁడు, వాఙ్మనః కాయముల నియమించినవాఁడు, నిషిద్ధకార్యప్రవర్తనము లేనివాఁడని నమ్మించు టకుఁగాను రావణుఁ డిట్టి వేషము వేసెను.

సన్న్యాసులు సన్న్యాసము తీసికొనుచు సర్వము వదలి జలాంజలి యిచ్చి యిట్లు చెప్పెదరు.

దత్వా తోయాంజలిం విప్రో, భక్త్యా సంప్రార్థయే ద్ధరిమ్।
సర్వదేవాత్మకే తోయే, తోయాహుతి మహం హరే।
దత్వా సర్వేషణా స్త్యక్త్వా, యుష్మచ్చరణ మాగతః।
త్రాహి మాం సర్వలోకేశ, గతి రన్యా నవిద్యతే।
సన్న్యస్తం మే జగన్నాథ, పాహి మాం మధుసూదన।
త్రాహి మాం సర్వసర్వేశ, వాసుదేవ సనాతన।
సన్న్యస్తం మే జగద్యోనే, పుండరీకాక్ష మోక్షద।
అహం సర్వాభయం దత్వా, భూతానాం పరమేశ్వర।
యుష్మచ్చరణ మాపన్న, స్త్రాహి మాం పురుషోత్తమ॥		యమః.

బ్రాహ్మణుఁడు జలాంజలి యిచ్చి సర్వదేవాత్మకమైన జలమందు హరిని భక్తితోఁ బ్రార్థింపవలయును. హరీ నేను జలాహుతి నిచ్చి దారేషణ, ధనేషణ, పుత్రేషణముల వదలి నీచరణము పొందితిని. సర్వలోకేశనన్ను రక్షింపుము. వేఱు గతి లేదు. జగన్నాథ మధుసూదన సన్న్యసించితిని. సర్వేశ వాసుదేవ సనా

తన నన్ను రక్షింపుము. జగత్కారణా పుండరీకాక్ష మోక్షదా నేను సన్న్యసించి పరమేశ్వర సర్వభూతములకు నభయ మిచ్చి నీచరణములను జేరితిని. పురుషోత్తమా నన్ను రక్షింపుము.

ప్రపన్నుల శరణాగతికిని దీనికిని భేదముగల దేమో పరిశీలింపుఁడు. స్మృతులు ప్రమాణము లైనచో నాలుగువేల నాలుగువందలు సంవత్సరములు దాఁటిన యీ కలియుగమున నెట్టి సన్న్యాసమైన నిషిద్ధమే యని యీవ్యాఖ్యాత యభిప్రాయము. నిషేధ వాక్యములు ఏకదండివిషయ మని నిర్ణయసింధుకారుఁడు వ్రాయుటయు కమండలుధారణ మనఁగా, టెంకాయచిప్పలు సొరకాయ లర్థ మని వైష్ణవగ్రంథమం దుండుటయు స్వమతాభినివేశముచే నని తోఁచుచున్నది. శాస్త్రీయపరమహంసలు మానససరస్సునందే కాని యీ దేశమున దుర్లభులు.

తా. లక్ష్మణుఁ డిట్లు వెడలి పోఁగా నవకాశము దొరకె నని రావణుఁడు సీతను సమీపింపఁ దలఁచి సన్న్యాసివేషంబు వేసికొని సన్నకాషాయవస్త్రము కట్టుకొని యెడమభుజముమీఁదఁ ద్రిదండము పూని, చేతఁ గమండలువు, గొడుగు పట్టుకొని శిఖ గలవాఁడై పావుకోళ్లు దొడిగికొని యన్నదమ్ము లిరువురు విడిచి పోవుటచే సూర్యచంద్రులు లేని సంధ్య నాక్రమించు చీఁకటివలె చంద్రుఁడు లేని రోహిణిని శని అంగారకుఁడు డాసినట్లు సీతయొద్దకుఁ బోయెను. వానికి భయ పడి చెట్లయాకులు కదల వయ్యెను. గాలి మెదల దయ్యెను. సంధ్యను సీతతో నుపమించుటచే నిఁక కొంతకాలమువఱకు సీతాదేవి రూపనామక్రియలు లోక మునకుఁ గానరాక మఱుఁగుపడి యుండుననియు, చీఁకటితో రావణుఁ బోల్చుటచేఁ గొంతకాలము వాని యుద్ధతి విజృంభించి క్రమముగా రూపుమాసి పోవుననియు నెఱుఁగ నగు.

రోహిణినక్షత్రమునకుఁ గ్రూరగ్రహవీక్షణము లోకోపద్రవకారణము. అట్టులే రావణుఁడు సీతాదేవిని జూచుటయు మహానర్థకర మని భావము.

క. వావిరి త్వరఁ బాఱెడిగో,దావరి మెల మెల్లనడిచెఁ ♦ దద్దయు భీతిన్
రావణుఁ డభవ్యుఁడిటు స,ద్భావపురూపముఁ దృణావృ♦తము కూప మనన్. ౭౪౩

వావిరి = క్రమముగ, నిలువక యెప్పుడు పాఱునది, లేక వావిరి త్వరన్ = అధిక వేగమున, అభవ్యుఁడు = దుర్జనుఁడు, సద్భావపురూపము = సాధువేషము, తృణావృతము = గడ్డిచేఁ గప్పఁబడినది, కూపము = బావి.

తా. మిగుల వేగముగాఁ బాఱు గోదావరి వానిభయముచే మెల్ల మెల్లగా నడిచెను. దుష్టుఁడగు రావణుఁడు గడ్డిచేఁ గప్పఁబడిన బావివలె సాధురూపము

ఉ. తాలిచి ప్రాణవల్లభుఁడు ♦ దవ్వుగఁ బోవుటకై తపించునా
బ్బాలను నూత్న చంద్రనిభ♦భాలను బార్వణశీతభానునన్
నీలసరోజలోచన వి♦ని ర్మలపీతదుకూలఁ గాంచి దు
శ్శీలుఁడు కాలుసోదరుఁడు ♦ చిత్రను జేరెడిమాడ్కిఁ దోఁపఁగన్.   ౨౪౪

ప్రాణవల్లభుఁడు = మగఁడు, నూత్నచంద్రనిభభాలను = క్రొత్తచంద్రునితో సమానమైన నొసలుగలదానిని, 'భవేత్ఫాలంచ భాలంచ ఫలితం ఫాలితం తథా'యని శ్రీహర్షుని ద్విరూపకోశము. పార్వణశీతభానునన్ = పున్నమనాఁటి చంద్రునివంటి ముఖముగల దానిని.

నీలసరజలోచన = నల్లని కలువవంటి నేత్రములు గల దానిని, వినిర్మలపీతదుకూలన్ = మిగుల శుద్ధమైన పచ్చని పట్టువస్త్రము కలదానిని, దుశ్శీలుఁడు= పాపస్వభావముగలవాఁడు, కాలుసోదరుఁడు = శని, యమునితోఁబుట్టువు - యముఁడు, శని - సూర్యపుత్రులు, చిత్రను = చిత్రా నక్షత్రమును.

తా. ధరించి తనమగఁడు దూరము పోయెనని సంతాపపడుచున్నయాబాలను క్రొత్త చంద్రునివంటి నుదురు, పున్నమచందురుంబోలు నెమ్మోము, నల్లకలువల వంటి కన్నులు గల దానిని, ముఱికిలేని పచ్చని పట్టువస్త్రము ధరించినదానిని దుష్టస్వభావము గల రావణుఁడు శని చిత్రా నక్షత్రము సమీపించునట్లు.

ఆ. పద్మహీన యైన♦పద్మను బోలుచు, మేనికాంతి దెసల ♦ మెఱుఁగువెట్ట
నాశ్రమాంతరమున ♦ నాసీన యైయున్న, యొంటిదానిఁ జంచ♦లోపమాంగి.

పద్మను = లక్ష్మీదేవిని, ఆశ్రమాంతరమునన్ = ఆశ్రమములోపల, చంచలోపమాంగి = మెఱుపుతోసమానమైన దేహముగలదానిని.

తా. చేతఁ గమలములేని లక్ష్మీదేవివలెనై దేహకాంతి దిక్కులకు మఱింత కాంతిని గలిగింపఁగా నాశ్రమములోపలనున్న మెఱుపుతీఁగతో సమానమైన దేహకాంతిగలదానిని.

రావణుఁడు యతివేషంబున సీతయొద్దకు వచ్చుట.

క. పంచశరశరావిష్టుఁడు, వంచనమెయి రావణుండు ♦ బ్రహ్మరవంబున్
నించుచుఁ జేరం జని యా, చంచలలోచనకు వినయ♦సంగతిఁ బలికెన్.   ౨౪౬

పంచశరశరావిష్టుఁడు = మన్మథబాణములచే నావేశింపఁబడినవాఁడు. ఇది రావణుఁడు కాముకుఁడయియే సీతయొద్దకుఁ బోయెనని వాల్మీకియభిప్రాయము. రహస్యమెఱిఁగిన వాల్మీకియే రావణుఁడు దుష్టుఁడని కాముకుఁడై సీతను సమీపించె నని చెప్పియుండ నితరులు వాఁడు భక్తిచేఁ బోయె ననుట, వాస్తవవిరుద్ధము

గదా. వంచనమెయిన్ = మోసముతో, బ్రహ్మరవంబున్ = వేదఘోషమును, ఉపనిషద మావర్తయేత్తని శాస్త్రము. చంచలలోచనకున్ = కదలుచున్నకన్నులు గలదానికి, వినయసంగతిన్ = వినయముతోఁగూడినట్లు.

తా. ఆవేశించిన కామముగలవాఁడై మోసబుద్ధితో వేదఘోషము చేయుచు, దగ్గఱకుఁబోయి సవినయముగా నామెతో నిట్లనియె.

క. రమణీ పీతసువాసిని, రమణీయసువర్ణవర్ణ ♦ రాజనిభాస్యా
కమలసుదామాలంకృత,కమలినివలెఁ వెలిఁగె దీవు ♦ కలికి యెవతెవే. ౪౪౭

పీతసువాసిని = పచ్చనిచీరగట్టినదానా! రమణీయ = అందమైన, సువర్ణ వర్ణ = బంగారువంటి దేహకాంతిగలదానా! రాజనిభాస్యా = చంద్రునితోసమానమైన ముఖముగలదానా! కమలసుదామాలంకృత = కమలములచేఁ గూర్పఁబడిన హారముచే నలంకరింపఁబడిన, కమలినివలెన్ = తామరతీఁగవలె, తామర తీఁగయందుఁ దామరపూవులున్నట్టు లీమెయందు ముఖకమలము, నేత్రకమలములు, హస్తకమలములు, పాదకమలములు, గలవు గావున, నీమె తామర తీఁగ వలెనున్నదని భావము. కలికి = సుందరీ!

తా. మనోహరమైనదానా! పచ్చనివస్త్రముధరించినదానా! అందమైన బంగారువన్నెగలదానా! చంద్రునివంటి ముఖముగలదానా! కమలములతోఁగూడిన తామరతీఁగవలెనుండుదానా! సుందరీ! నీవెవతెవు? ఈప్రశ్నలు సల్లాపార్థమే కాని తెలియకకాదు.

క. ధరణివొ కీర్తివొ వెన్నుని,తరుణివొ స్వైరచరి పుష్ప♦ధన్వునిసతివో
హరిణీ సురరమణివొ యో,కరిణీగమనా వచింపు ♦ కలరూపంబున్. ౪౪౮

ధరణివో = భూదేవతవా, వెన్నునితరుణివో = లక్ష్మీదేవివా, విష్ణుశబ్దభవము వెన్నుఁడు, స్వైరచరి = ఇష్టానుసారముతిరుగు, పుష్పధన్వునిసతివో=రతీదేవివా, హరిణీ = చూచువారిమనస్సు హరించుదానా, సురరమణివో = దేవతాస్త్రీవో, కరిణీగమనా = ఆఁడేనుఁగువంటి నడకగలదానా, కలరూపంబు = వాస్తవమును.

తా. నీవు భూదేవతవా? కీర్తివా? లక్ష్మీదేవివా? స్వతంత్రించి తిరుగు రతీదేవివా? దేవతాస్త్రీవా? ఆఁడేనుఁగువంటి నడకగలదానా! నామనస్సు హరించుచున్నదానవు. నీవెవతెవు? వాస్తవము చెప్పుము.

సీ. నీరదంబులు శుచి♦స్నిగ్ధముల్ సమములు, కుట్మలశిఖరులే ♦ కుందరదన
నేత్రముల్ రక్తాంత♦నిర్మలదీర్ఘముల్, నీలతారములె వి♦శాలనయన

చారుపీనంబు విశా♦లంబు జఘనంబు, కరికరాకారముల్ ♦ కలికితొడలు
మిట్టలు వట్రువల్ ♦ మిగులసంహతములు, సంప్రవల్గితములే ♦ స్తనము లబల

తే. తాళఫలనిభములును గాం♦తములు పీవ
రోర్ధ్వముఖములు స్నిగ్ధముల్ ♦ యువతి నీదు
విరివిచనుదోయి రత్నప్ర♦వేకభూష
ణాంచితమ్ము దిదృక్షుహృ♦ద్వంచకమ్ము.        ౨౪౯

రదంబులు=దంతములు, శుచిస్నిగ్ధముల్=నిర్మలములు, నునుపులు, కుట్మలశిఖరులే = మొగ్గలవంటికొనలుగలవి. కుందరదన = మొల్లలవంటి దంతములు గలదానా, రక్తాంతనిర్మలదీర్ఘముల్ = కొనలయందెఱుపుగలిగి నిర్మలములై నిడివియైనవి. నీలతారములు = నల్లనిగ్రుడ్లుకలవి, విశాలనయన = వెడలుపాటి కన్నులుగలదానా! చారుపీనంబు=మనోహరమై బలిసినది. విశాలంబు=విరివిగలది. జఘనంబు= (i) మొల, (ii) మడికట్టు; కరికరాకారముల్=ఏనుఁగుతొండములవంటి యాకారములుగలవి, కలికి = ఒప్పిదమైన, 'కలికియొప్పిదంబు కాంతయయ్యె' మిట్టలు=పైకుబ్బియుండునవి. వట్రువల్=గుండ్రములైనవి. మిగులసంహతములు= మిక్కిలికదిసియుండునవి, సంప్రవల్గితములు = పెద్దవిగను నున్నతములుగను నుండుటచే కదలుచున్నవానివలె నుండునవి, స్తనములు = చన్నులు, తాళఫలనిభములును = తాటిపండుతోసమానమైనవి, కాంతములు = మనోహరములయినవి, పీనరోర్ధ్వముఖములును = ఒకచోట సన్నము ఒకచోట లావు లేక అంతటబలసినవైనను, వ్రేలఁబడక పైకెగసియుండునవి, స్నిగ్ధముల్=బిరుసు లేక నునుపుగలవి, యువతీ = ప్రాయపుదానా, విరివి = వెడలుపగు, రత్నప్రవేకభూషణాంచితమ్ము= శ్రేష్ఠరత్నముల సొమ్ములచేఁ బ్రకాశించునది. దిదృక్షు = చూచువారి, హృత్ = హృదయమును, వంచకమ్ము = మోసగించునది.

తా. మొల్లమొగ్గలవంటి దంతములుగలదానా! నీదంతములు నిర్మలములు, నునుపులు, సమములు, మొగ్గలవంటికొనలుగలవి. వెడలుపుకన్నులుగలదానా! నీకన్నులు కడకొలుకులందు నెఱ్ఱనవై నిర్మలములై దీర్ఘములై నల్లనిగ్రుడ్లుగలవి. నీమొల యందముగాబలిసి విశాలమైయున్నది. నీతొడలు ఏనుఁగుతొండములవలె నున్నవి (చీరెలోపలనుండునవి యెట్లుండినవి వీనికెట్లు తెలిసెను? ఇది తన కామోద్రేకముఁ దెలుపఁ జెప్పెడుమాటయే) అబలా! నీ స్తనము లుబ్బి గుండ్రమై గుంతలు మిట్టలు లేక యంతయు నేకవిధముగనై యొకదానినొకటి యొఱసికొనుచు తాటి పండ్లనుబోలి మనోహరములై బలిసియు వ్రేలపడక మీఁదిచూపుగలవై నునుపులై బిరుసులై శ్రేష్ఠరత్నభూషణములచేఁ బ్రకాశించుచు చూచువారి హృదయ

మును వంచించి హరించుచున్నవి. ఇవి సీతయందు మాతృభక్తిగలవాఁడు జెప్పెడు మాటలా?

క. చారుస్మిత చారుదతీ, చారువిలోచన విలాస♦సాగర సుకచా
హారికరాంతమితవలగ్నా రమణీ సంహతోరు ♦ కఠినకుచాఢ్యా. ౭౫౦

చారుస్మిత = మనోహరమైన చిఱునవ్వుగలదానా, చారుదతీ = మనోహర దంతములుగలదానా, చారువిలోచన = మనోహరములైన నేత్రములుగలదానా, చారుస్మితదంతలోచనయని యొకవిశేషణముతోనే చెప్పియుండవచ్చును. ప్రత్యేకముగ చారుచారు అనిచెప్పుట కామోద్రేకముచేతనే. ఒక్కొక్కయవయవము వానిని కామదాసునిజేసెనని తెలుపుటకే. ఛందోవద్భావేన ఛందసీచేతి సూత్రేణ సమాసాంతో దంతస్య దత్రాదేశోవా యని చారుదతి'యను రూపమును సమర్థించినారు. దానిని సందేహించువారు చారురద యని పాఠాంతరము గ్రహింపవచ్చును. విలాససాగర = శృంగారచేష్టలకు సముద్రమా, సుకచా = మంచి నల్లని వెంట్రుకలుగలదానా, హారికరాంత మితవలగ్నా = మనోహరమై పిడికిలిచేఁ గొలువఁదగిన నడుముగలదానా.

తా. అందమైన చిఱునవ్వు, అందమైన దంతములు, అందమైన నేత్రములు, అందములైన వెంట్రుకలుగలదానా! శృంగారచేష్టలకు సముద్రమైనదానా! పిడికిట నడఁగునడుముగలదానా! హృదయమున కింపైనదానా! ఒండొంటినోఅయు తొడలుగలదానా! కఠినములైనకుచములుగలదానా! చెప్పినతొడలను స్తనములను మరలఁజెప్పుట కామోద్రేకమున నని తలంపవలయు.

క. వారక శైవలినీవాఃపూరము తీరంబుఁబోలెఁ ♦ బాలఁతుక నీవుర్
సారెకు నామనమును సరసీరుహలోచన హరించి ♦ చెలఁగెదు గదవే. ౭౫౧

శైవలినీ = ఏటియొక్క, వాఃపూరము = జలప్రవాహము, తీరంబుర్ = ఒడ్డును, బాలఁతుక = చిన్నదానా, సరసీరుహలోచన = కమలములవంటి కన్నులుగలదానా.

తా. ఏటిప్రవాహము అడ్డములేక తీరమును గోసి లోపలికీఁదీసికొనునట్లు కమలములవంటికన్నులు గల చిన్నదానా! నీచూపులచేత నామనస్సును గరఁగించి హరించితివిగదా.

ఉ. చూచితి దేవకాంతలను ♦ జూచితి యక్షసరోరుహాక్షులర్
జూచితిఁ గిన్నరీమణులఁ ♦ జూడ్కికిఁ బండువుసేయువారలర్;
జూచి యెఱుంగ నోసుదతి ♦ సుందరతావిభవంబునర్ మృగీ
లోచన నిన్నుఁబోలు నొక♦లోలవిలోచన భూతలంబునన్. ౭౫౨

సుందరతావిభవంబునన్ = సౌందర్యసంపదచే, మృగలోచన = ఆఁడుజింక కన్నులవంటి కన్నులుగలదానా, లోలవిలోచన = చలించుకన్నులుగల స్త్రీని.

తా. నేను దేవతాస్త్రీలను, యక్షస్త్రీలను, కిన్నరస్త్రీలను, కన్నులకు సంతోషముగలిగించువారి నెందఱనో చూచితినిగాని సౌందర్యసంపదయందు నీవంటిదానిని భూలోకమునఁ జూడలేదు.

క. ఓకోమలి నీప్రాయము, నీకోమలతావిభూతి నీరూపం బా
లోకింప నిచట నడవిని, నేకాంతం బుంట వెఱ్ఱి యెత్తెడి నాకున్. ౨౩

నీప్రాయము = నీవయస్సు, కోమలతావిభూతి = సౌకుమార్యసంపద, నీరూపంబు, నీసౌందర్యము, ఆలోకింపన్ = చూడఁగా, ఏకాంతము = ఒంటరిగా, వెఱ్ఱియెత్తెడిన్ = (1) నీవయస్సు నీసొగసు నీసౌకుమార్యములోనైన నెక్కడ? ఈవనవాసమెక్కడనని నిశ్చయింపలేకున్నాను. (2) నిన్నుఁజూచుకొలఁది కామోన్మాదము ప్రబలమగుచున్నది.

తా. సుందరీ! నీవయస్సు నీసౌకుమార్యము నీచక్కఁదనము ఆలోచింపఁగా నీవొంటరిదానవై యీయడవియందుండుటచే నాకు వెఱ్ఱిపట్టుచున్నది.

ఉ. పొమ్ము లతాంగి యింటికిని భూరిభయంకరకామరూపులై
త్రిమ్మరుయామినీచరులు దీయక యిందుఁ జరింత్రు గాన నీ
విమ్మెయి నొంటి నుండఁ దగవే తగ వేచను రమ్యహేమసౌ
ధమ్ముల నిష్కుటాళి నుచితం బగు నీకు నలంకరింపఁగన్. ౨౪

భూరిభయంకర = మిగులభయము గలిగించువారయి, కామరూపులై = కోరినరూపము ధరింపఁగలవారై, యామినీచరులు = రాక్షసులు. (రేద్రిమ్మరులు) రమ్య = మనోహరములైన, హేమసౌధమ్ముల = బంగారుమేడలను, నిష్కుటాళిన్ = ఉద్యానవనములను.

తా. లతాంగీ! నీవింటికిఁబొమ్ము. మిగుల భయంకరులై కోరినరూపముల ధరించి తిరుగు రాక్షసులు సర్వదా యిందుఁ దిరుగుచుందురు. కావున నీవిట్టులొంటరిగా నుండరాదు. నీకుఁదగినవిధముగ త్వరగాఁబోయి బంగారుమేడలను, ఉద్యానవనములను, అలంకరింపఁబొమ్ము. నీవు వానియందుండుటయే వాని కలంకారము.

క. వరమాల్యము వరభోజ్యము, వరవస్త్రము వరవరుండు వర మగు నీకున్
వరమేచకలోచన నా, పరమాభిప్రాయ మిదియ పంకజనేత్రా. ౨౫

వరమాల్యము = శ్రేష్ఠమైనపూలదండలు, వరభోజ్యము = శ్రేష్ఠమై యింపైన భోజనము, వరవస్త్రము = శ్రేష్ఠమై యమూల్యమైనచీరలు, వరవరుండు =

శ్రేష్ఠుఁడై నీవయస్సునకుఁదగిన వయస్సుగలవాఁడై, నీయోగత్యకుఁ దగినట్టి భోగము లమర్పఁగల మగఁడు, వరము = ఇంపు, వరమేచకలోచన = ఇంపైన నల్లనికన్నులుగలదానా, కాటుక పెట్టుకొనకున్నను, కాటుక పెట్టుకొనున ట్లుండు కన్నులు-పరమాభిప్రాయము=వాస్తవమైన యుత్తమాభిప్రాయము,

తా. కమలముల వంటికన్నులుగలదానా! శ్రేష్ఠములైన పూలదండలు శ్రేష్ఠమైనభోజనము శ్రేష్ఠమైనవస్త్రము శ్రేష్ఠుఁడైన మగఁడు నీకుఁదగును. ఇది నాయుత్తమాభిప్రాయము—అల్పుఁడు సామాన్యపురుషుఁడు నీకుఁదగిన మగఁడు కాఁడు.

ఉ. నిక్కపు దేవకన్య వని ♦ నే మది నమ్మితి రుద్రకాంతవో
నిక్కముగా మరుత్సతివొ ♦ నెమ్మి వచింపుము దేవకిన్నరుల్
మక్కువ నిందు రా రిదియు ♦ మానవభోజులవాస మౌట, నీ
వెక్కడి దాన వెక్కటి చెలీ యిట నుండఁ గతంబుఁ జెప్పుమా. ౭౫౬

రుద్రకాంతవో = ఏకాదశరుద్రుల యాఁడుదానవా, మరుత్సతివో = మరుత్తులదానవా? ఎక్కటి = ఒంటరిగా, కతంబు = కారణము.

తా. మనుష్యస్త్రీలయం దిట్టి యందగత్తెలులేరు కావున నీవు దేవకాంత వని నమ్మితిని. అటయిన వారిలో నెవ్వతెవు. ఏకాదశరుద్రులకు సంబంధించిన దానవా? నిజముగా మరుత్తులకు సంబంధించినదానవా. ప్రేమతోఁ జెప్పుము. దేవతాస్త్రీలుకిన్నరస్త్రీలు ఇది రాక్షసవాసభూమి కావున నిందురారు. నీవెక్కడి దానవు. ఒంటిగా నిందేల యున్నావు-చెప్పుము.

నీవంటిసుందరి మనుష్యులలోలేదు. కావున నీవు మనుష్యస్త్రీవికావు. దేవతాస్త్రీగానే యుండవలె. ఇది రాక్షసభూమి కావున దేవతాస్త్రీలు కిన్నరస్త్రీలులోనగువారు రారు. అయినను నీవు వచ్చియున్నావు. రాక్షసులకు నిష్టదేవత రుద్రుఁడు కావున ఆరుద్రులకు సంబంధించినదానవా లేక వాయువిందు సంచరించుచుండును. గావున వాయువులకు సంబంధించినదానవా నిజముచెప్పుమనియుఁ జెప్పవచ్చును.

క. పులులుం గ్రోఁతులు సింహం,బులుఁ జిఱుతలు నెలుఁగుబంట్లుఁ ♦ బురుకంకంబుల్
దళముగ నిందుఁ జరింపఁగఁ, గలికీ! నీ కెట్లు భయము ♦ గలుగదు చెపుమా.

తా. ఇచ్చటపులులు, క్రోఁతులు, సింహములు, చిఱుతపులులు, ఎలుఁగులు, పెద్దగ్రద్దలు, విస్తారముగ నిందుఁదిరుగుచున్నవే నీవెట్లు భయములేక యిందున్న దానవు.

క. మదయుతములు ఘోరంబులు, మదావళము లిందుఁ బెక్కు♦మలయుచునుండన్
మదిరాక్షి మది భయమ్మును, బొడలక యె ట్లున్న దాన♦వో కద చెలువా.

తా. మదముపట్టినవై, భయంకరంబులైన యేనుఁగులిందు మందలు మందలుగాఁ దిరుగుచుండఁగా భయపడక యెట్లుండఁగలిగితివి.

ఉ. ఎవ్వరిదాన వీవు మది♦రేక్షణ! యెవ్వతె వీ వి కేటికే
యివ్వని జవ్వనీ! తిరిగె ♦ దెక్కటి రక్కసమూఁక లెప్పుడున్
గ్రొవ్వున సంచరించు నిటఁ ♦ గ్రూరత, నావుడు విప్రవేషు నా
గ్రొవ్విరిఁబోఁడి సత్కృతుల ♦ గొబ్బునఁ బూజ లొనర్చి వెండియున్. ౭౪౫

మదిరేక్షణ = మదముకప్పినకన్నులుగలదానా? ఎవ్వరిదానవీవు = నీమగఁ డెవ్వఁడు, ఎవ్వతెవు = ఏజాతిదానవు, ఏకులముదానవు, జవ్వని = ప్రాయముగలదానా, విప్రవేషు = బ్రాహ్మణవేషధారిని, గ్రొవ్విరిఁబోఁడి=క్రొత్తగా వికసించిన పువ్వువలె మనోజ్ఞురాలు.

తా. మదిరాక్షీ! నీభర్తయెవ్వఁడు? నీకులమేది, నీజాతియేది? వయస్సుదానవయ్యు నిందొంటరిగా నేల యున్నావు? ఇది రాక్షసులగుంపు తిరుగుస్థలము. అని యడుగఁగా బ్రాహ్మణసన్న్యాసి వేషము వేసికొనిన వాని నాసీతాదేవి శీఘ్రముగ యతులను బూజింపవలసిన విధమునఁ బూజచేసి మఱియు.

సీత యతివేషంబున నున్నరావణు సత్కరించుట.

సీ. తరుణి పాత్రకుసుంభ♦ధారి యాద్విజవేష,సహితు నపాయద♦ర్శనుని వాని
ద్వేషింప దుస్సాధు ♦ విప్రు నిభంగిన, పూజించి యి ట్లనుఁ ♦ బుష్పగంధి
యిదిగో దర్భాసనం♦బిందుఁ గూర్చుండుమీ, యిదె యర్ఘ్యమిదె పాద్య♦మివిగొ సిద్ధ
వనజాతఫలములు ♦ త్వన్నిమిత్తం బివి, యారగింపుము తని♦వార ననుచుఁ

ఆ. బలుకు చున్నయట్టిప్రతిపూర్ణ భాషిణి, నాన రేంద్రపత్ని ♦ నవనితనయ
నాత్మవధముపొంచె♦నసురలోకేశ్వరుం, డపహరింప మనసు♦నందుఁ బూనె? ౭౪౬

పాత్ర కుసుంభధారి = పాత్రము = పాత్రంబైతే చరణార్థమ్మని యుండుటచే భిక్షాన్నము గ్రహించుటకై యుపయోగపడు సొరకాయ చిప్పగాని మంటి పెంకుగాని యని యర్థము. కుసుంభము = కాషాయ వస్త్రముగాని, కమండలువుగాని—ఈ శబ్దమున కీ రెండర్థములు గలవు. కుసుంభం కుసుమేక్లీబం స్యాన్నహార జనేపిచతత్ । కమండలావుమార్గ—నానా॥౪॥ కుసుంభం కరకేపుమార్గ॥ అమర కోశము. కాషాయవస్త్ర మనుటకంటె నిదియే ప్రశస్తార్థము.

ద్విజవేష సహితుః = బ్రాహ్మణవేషముతోఁగూడిన వానిని, అపాయ దర్శనుః = కీడు చేయు తలఁపు గలవానిని అనఁగా నపహరింపఁ దలఁపు గల వానిని-ద్వేషింప దుస్సాధుః = విరోధించి సాధింపరాని వానిని, విప్రుని భంగిన=విప్రునిఁ బూజించినట్లు, ఇచ్చట విప్ర శబ్దము సన్న్యాస పరమని కొందఱు, సన్న్యాసికాని బ్రాహ్మణుఁడు కాషాయ వస్త్రము, కమండలువు, దండము, భిక్షాపాత్రము లోనైనవి ధరింపఁడు కదా, క్షత్రియాదులకు సన్న్యాసమం దధికారము లేదు. కావున బ్రాహ్మణుఁడనియే సీత తలఁచెను. ఇక్కడ నొక సందేహము బాధించుచున్నది. వచ్చినవాఁడు దొంగ సన్న్యాసి యని తెలిసి సీత సత్కరించెనా? నిజమైన సన్న్యాసి యని నమ్మి సత్కరించెనా? జనకరాజు కూఁతురై యాశ్రమము దెలిసిన దగుటచే వచ్చినవాఁడు దొంగ సన్న్యాసి యని తెలిసియు విరోధించిన జయింపరాదని తలఁచి 'కాషాయ వస్త్రమాత్రేణ యతిః పూజ్యో నసంశయ' యను వాక్యము చొప్పున సత్కరించెనని గోవిందరాజీయము. కాషాయ వస్త్రమున యతి గృహస్థాదులకుఁ బూజ్యుఁడేకాని యతి యనునది వీనియం దన్వయించునా? వీఁడు వాస్తవ సన్న్యాసి కాఁడని సీతకుఁ దెలియును గనుక నా వాక్యమిం దన్వయింపదు. కాషాయ వస్త్రము ధరించిన వారందఱు యతులని యావాక్యమున కర్థము గాదు. యత్యాశ్రమము స్వీకరించిన వాఁడు వానియందు యతి కుండ వలసిన జ్ఞానాదులు కొఱఁతపడినను బూజ్యుఁడే యని యర్థము-ప్రాధాన్యము యతి శబ్దమున కీయవలెఁగాని కాషాయ వస్త్ర శబ్దమున కీయరాదు. సన్న్యాసి పూజా పరిపాటి తెలిసిన సీతాదేవికి - యతిధర్మ సముచ్చయము.

యతిర్ద్వయేన పతతి, బ్రహ్మజ్ఞానయుతోపిసః.
ధీపూర్వ రేతోత్సర్గేణ, తథా ధాతు పరిగ్రహాత్,
యతిహస్తగతం ద్రవ్యం యో గృహ్ణాతి నరః క్వచిత్,
సమూఢో నరకం యాతి, తేనపాపేన కర్మణా
రాత్ర్యధ్వానంచ యానంచ, స్త్రీకథా లౌల్యమేవచ,
మంచకంశుక్లవస్త్రంచ, యతీనాం పతనాని షట్.

యతి బ్రహ్మ జ్ఞానము గలవాఁడైనను బుద్ధి పూర్వకముగ రేతస్సు విడుచుట, లోహముల పరిగ్రహించుట యను రెంటిచేఁ బతితుఁ డగుచున్నాఁడు. సన్న్యాసిచేతి ద్రవ్యమును గొంచెమైనను నెవఁడు తీసికొనునో ఆ మూఢుఁడు ఆ పాప కర్మముచే నరకమునకుఁ బోవును. సన్న్యాసులకు ధన మీయను రాదు. వారిచేతఁ దీసికొనను రాదు. రాత్రి దోవ నడచుట, వాహన మెక్కుట, స్త్రీ కథ లందు నాసక్తుఁ డగుట, మంచము నుపయోగించుట, తెల్లని వస్త్రము గట్టుట ఇవి యాఱు సన్న్యాసులు పతితులగుటకు కారణములు

పాషండినో వికర్మస్థాన్, బైడాల వ్రతికాన్ శఠాన్.

హైతుకాన్ బకవృత్తీంశ్చ వాఙ్మాత్రేణాపి నార్చయేత్॥ మనుస్మృతి, పాషండులను, శాస్త్ర విరుద్ధ కర్మములచే జీవించువారిని, పిల్లివలె, కొంగవలె మోసబుద్ధితో సాధువులవలెఁ జరించు వారిని, వేదములందు నమ్మకము లేని వారిని, వేదవిరోధి తర్కవాదములఁ జేయువారిని, వీరు అతిథులై సకాలమునకు వచ్చినను, వీరిని మాటలచేనైన నాదరింపరాదు.

వైద్యనాథ దీక్షితీయమున హైతుక లక్షణము పాషండ లక్షణ మిట్లు వ్రాయఁబడినది.

యుక్తిచ్ఛలేన సర్వత్ర, యశ్శాస్త్ర విహితేష్వపి।
సంశయం కురుతే సోయం, హైతుకో నాస్తికాధమః॥పరాశరుఁడు

శాస్త్ర విహితమైన దానిని కుచ్ఛితపు యుక్తులచే నెవఁడు సందేహించునో యానాస్తికాధముఁడు హైతుకుఁ డనఁ బడును.

యస్స్వధర్మ పరిత్యాగీ పాషండీ త్యుచ్యతే బుధైః।
తత్సంగ కృత్తత్సమ స్స్యాత్తావుభావపి పాపినౌ।
యేతు సామాన్యభావేన, మన్యంతే పురుషోత్తమం।
తే వై పాషండినో జ్ఞేయా, నరకార్హా నరాధమాః.

తన యాశ్రమ విహిత స్వధర్మము నెవఁడు వదలునో వాఁడు పాషండి యనఁబడును. వాఁడు వానితో సాంగత్యము చేయువాఁడు ఇరువురు పాపాత్ములే.

పురుషోత్తముఁడగు నారాయణుని నితర దేవతలతో సమానుఁడుగ నెవఁడు చెప్పునో వాఁడు పాషండి యనఁబడును. అట్టి నరాధములు నరకమునకుఁ బోదురు. ప్రజాపతి.

వరాహ పురాణమున। కుబుద్ధి రచితం శాస్త్రం పఠిత్వా యే కలౌయుగే, న కుర్వంతి వినిందంతి యజ్ఞాన్ వర్ణాశ్రమోచితాన్, తేవై పాషండినో జ్ఞేయా సర్వ కర్మ సుగర్హితాః। తేషాం సంభాషణం స్పర్శం ప్రమాదేనాపి నాచరేత్॥

కలియుగమందు కుబుద్ధులచే రచింపఁబడి శాస్త్రమని పేరు పెట్టఁబడిన దానిని (అచల పరిపూర్ణ గ్రంథములవంటి వానిని) చదివి వర్ణాశ్రమోచితములగు వానిని యజ్ఞములను నెవరు నిందింతురో వారు పాషండులు. వీరి నేకర్మమందు నియమింపరాదు. ప్రమాదముననైన వారితో మాటలాడ రాదు. వారిని దాఁక రాదు.

బౌద్ధభిక్షుకులు, క్షపణకులు, చార్వాకులు, వీరంద ఱీ తెగలోఁ జేరినవారే.

ధర్మధ్వజీసదా లుబ్ధ శ్ఛాద్మికో లోకదంభకః
బైడాలవ్రతికో జ్ఞేయో హింస్ర స్సర్వాభిసంధకః॥ మను.

ధర్మము నెపముగాఁజెప్పి స్వలాభమునకై ధనమార్జించుటో పరస్త్రీలఁ గలియుటో యిట్టి చెడుకార్యములు చేయువాఁడు ధర్మధ్వజి—పరులధనమునం దాశగలవాఁడు లుబ్ధుఁడు. పరులవంచించువాఁడు, జనులు మెచ్చుకొనవలెనని కార్యములు చేయువాఁడు హింసాస్వభావముగలవాఁడు, పరులగుణములఁ దేరకు నాక్షేపించువాఁడు బైడాలవ్రతికుఁడనఁబడును.

అధోదృష్టి ర్నైష్కృతికః స్వార్థసాధనతత్పరః
శఠో మిథ్యావినీతశ్చ, బకవ్రతచరోద్విజః॥ మను.

పరులు తన్నుఁజూచినపుడు వినయము గలవానివలె నేల చూపులుగల వాఁడు. నిష్ఠురశీలుఁడు, స్వకార్య ధురంధరుఁడు. ఇతరులకార్యము చెఱుచు క్రూరుఁడు దొంగవినయముగలవాఁడు బకవ్రతికుఁడు. ఇట్టి దొంగసన్న్యాసులను మాటచేనైన గౌరవింపరాదని యెఱుఁగదా. వీఁడు దొంగసన్న్యాసియని యామెకెట్లు తెలియునందురా? నీస్తనములిట్లున్నవి. నీమొలయట్లున్నది. నీతొడలిట్లున్నవని యెదురుగానే వర్ణించు సన్న్యాసి, దొంగసన్న్యాసిగాక సాధువగునా?

సన్న్యాసుల నోర నీమాటలయిన రావచ్చునా. ఇది తెలిసి యెట్లు సీతాదేవి సత్కరించెను?

కుటిలబుద్ధుల గెలువంగఁ గుటిలమతియ। యర్హమగుఁగానినీతిగా దార్జవంబు. నైషధము

వంచకులను వంచనచేతనే గెలువవలయునుగాని వారియెడ ఋజుప్రవర్తనము నీతిగాదు, అని నీతిశాస్త్రము చెప్పుచుండ వానినేదోవిధమున మోసగించి పంపక యున్నదున్నట్లేల చెప్పెను? దీనికిఁ బ్రత్యుత్తరము ౭౬-౨ వ పద్యమునఁ గలదు.

విప్రునిభంగిన యనుటకు సన్న్యాసి బ్రాహ్మణుఁడు తప్ప మఱియొకఁడుండఁడు కావున బ్రాహ్మణుఁడని పూజించెనే కాని సన్న్యాసియని పూజించినదికాదని యీ వ్యాఖ్యాత యభిప్రాయము.

పుష్పగంధి = పూలవాసనగల దేహముగలది, పుష్పగంధమువంటి గంధమెవతెదేహమునందుఁగలదో యామె పుష్పగంధి. ఇట్లు విగ్రహము చెప్పుటచే నీమెయందీ పరిమళము సహజమని యేర్పడుచున్నది. కనుకనే యామెకు యోజనగంధ యనిపేరు. ఇట్లు సుగంధి-పూతిగంధి-ఉద్గంధి యను శబ్దంబులందును నూప

గంధి ఘృతగంధి యిత్యాదులందును గంధశబ్ద మికారాంతమగును. ఘృతగంధి భోజనము అనఁగా నేతివాసనగల భోజనము. కొంచెము నేయిగలదని యర్థము. సుగంధిశబ్దమునకు పరిమళద్రవ్యము లమ్మువాఁడని యర్థము. వనజాతఫలములు = అడవియందుఁబుట్టినపండ్లు—త్వదర్థమి త్తము = నీకొఱకు, తనివారక = తృప్తిగ. తనివి + ఆరక, తనివు + ఆరక, రెండుశబ్దములుగలవందురు. ప్రతిపూర్ణభాషిణి = సర్వము సిద్ధము అని యతిథి పూజచేయువారు చెప్పవలసినమాట చెప్పుచున్నదానిని, సన్న్యాసులను స్త్రీలు పూజింపవచ్చునని 'యతీనాం పూజనం కార్యం స్త్రియావా పురుషేణవా' యను వాక్యము తెలుపుచున్నది. కావున సీత యితనిఁ బూజించుట యుచితమె. ఆత్మవధము హేంతోః = తనచావు నిమి త్తము—చేప యెరను మ్రింగు నట్లని భావము. సీతాహరణ కార్యమువలని ఫలము మరణమేగాని మఱియొకటి గాదని భావము.

ఓయీ! నీవిచ్చట నీయర్థము చెప్పరాదు. పద్మపురాణమందు "జహార భార్యాంరామస్య, భార్యాం స్వవధ కాంక్షయా." యని చెప్పి ఆవెనుక 'అశోక వనికామధ్యే నిక్షిప్య జనకాత్మజామ్, నిధనం రామబాణేన కాంక్షయా స్వ గృహం విశత్' అని చెప్పఁబడలేదా యందురేమో—వాల్మీకి ఆత్మవధాయ=తన చావుకొఱకే యని చెప్పెనుగాని తాను చావఁగోరి యని పద్మపురాణమునఁ జెప్పి నట్లు చెప్పలేదు. అదియునుగాక ఇది యేకల్పమందలి రావణువృత్తాంతమో కాని వాల్మీకిరామాయణమందలి రావణువృత్తాంతముకాదు. స్వోక్తి వ్యాఘాతము వాల్మీకిరచనయందులేదు.

తా. సీతాదేవి భిక్షాపాత్రము కమండలువు ధరించి బ్రాహ్మణసన్న్యాసి వేషముతోనుండి తనకుఁ గీడుచేయ నాలోచనఁగలవానిని, విరోధించినను దాను గెలువఁజాలనివానిని (దీనివలన వాఁడు తనకుఁ గీడుచేయవచ్చినాఁడనియు నిరాకరిం చినపక్షమున నప్పుడే పైపడి పట్టుకొనిపోవుననియు మంచిమాటలతోఁ గాలక్షే పము చేయుచుండిన నింతలో రామలక్ష్మణులు రాకుందురా యనియు సీత యుపా యముతలఁచి వానితో ముచ్చటలాడఁ జొచ్చెను.) కావుననే రాక్షసుఁడని యెఱిఁ గియు బ్రాహ్మణుని బూజించు రీతిగానే పూజించి యిట్లనెను. ఈకారణముచేతనే యతియని యామెనోర రానేలేదు. ఇదిగో దర్భాసనము, ఇందుఁగూర్చుండుము. ఇదిగో నర్ఘ్యము. ఇదిగోఁ బాద్యము సర్వము సిద్ధము. ఇదిగో నీయాహారనిమి త్త మడవియందలి ఫలములు—తృప్తిగా భుజింపుము. అని శాస్త్రప్రకారము సిద్ధమని చెప్పుచున్న యారాజభార్యను, భూపుత్రిని తనచావునిమి త్తము రావణుఁడు బలా త్కారముగ నపహరింపఁగోరెను.

తరలము. వనికి వేఁటకుఁ జన్నభర్తయు ♦ భ్రాతతోఁ జనుదెంచునా
యనుచు నాలుగుదిక్కులున్ జల♦జాయతాక్షి. వనీదిశన్
గనియెఁ గాని రఘూత్తముల్ పొడ♦కట్టరైరి, యథాస్థితిన్
వనకుజంబులు దోఁచు చుండెను ♦ భామచిత్తము కందఁగన్. ౭౬౧

వనికిన్ = అడవికి, వేఁటకు = మృగమును వధించుట వేఁటయేకదా, వనీదిశన్ = అడవియందు దిక్కును, పొడకట్టరైరి = కానరాలేదు, యథాస్థితిన్ = పూర్వమున్నట్టులే. కందఁగన్ = వాడిపోవునట్లు–తరలము నభరస జజగగణములు పండ్రెండవ యింటయతి.

వీరుండిన పర్ణశాలకు (ఇప్పటి పర్ణశాలగాదు) నుత్తరమునఁ బర్వతములు, తూర్పునగోదావరియున్నది. దక్షిణము పడమర యడవి. మారీచుఁడు రామచంద్రమూర్తిని బడమరగానే తీసికొనిపోయెను. రావణాసురుఁడు పోవలసినది దక్షిణమార్గమునఁ గావున నాత్రోవయందు రామచంద్రమూర్తి యుండరాదుకదా.

తా. అడవికి మాయామృగమును వేఁటాడుటకై పోయిన రామచంద్రమూర్తి లక్ష్మణుతో వచ్చునాయని యడవివైపు నాలుగుప్రక్కలు చూచెనుగాని వారు గానరాలేదు. యథాప్రకార మడవిచెట్లుమాత్రము కానవచ్చుచుండెను. అదిగని సీతమనస్సు భయసంతాపములచే వాడిపోయెను.

## ౪౭ వ సర్గము. సీత మాయాయతికిఁ దనవృత్తాంతముఁ జెప్పుట.

ఉ. తన్ను హరింప బోడి యయి ♦ దానవనాథుఁడు ప్రశ్న సేయఁగా
సన్నుతశీల వీఁ డతిథి ♦ భూసురవర్యుఁడు మద్విధంబు నే
నున్నటు చెప్పకుండినను ♦ నుగ్రరుషన్ శపియించునో యటం
చెన్నుచు మూర్తమాత్ర మెద ♦ నిట్లని చెప్పఁదొడంగె వానికిన్. ౭౬౨

బోడి = సన్న్యాసి–ముండి; సన్నుతశీల = సజ్జనులచేఁబొగడఁబడిన యాచారముగలది. అతిథుల నభ్యాగతుల నెట్లాదరింపవలెనో యామర్యాద పరిపాటి చక్కఁగాఁదెలిసి వర్తించునది. భూసురవర్యుఁడు = బ్రాహ్మణశ్రేష్ఠుఁడు, మద్విధంబు = నాచరిత్రమును, ఉగ్రరుషన్ = తీవ్రకోపముచే, మూర్తమాత్రము = అల్పకాలము, ఎదన్ = హృదయమందు.

యస్య నజ్ఞాయతే నామ నచగోత్రం నచస్థితిః
అకస్మాద్గృహ ఆయాతః సోతిథిః ప్రోచ్యతేబుధైః.

ఎవనిపేరు గోత్రము స్థితి తెలియదో యెవఁడాకస్మికముగ నింటికివచ్చునో వాఁడతిథి.

తా. తన్ను బలాత్కారముగఁ దీసికొనిపోవఁదలఁచి రావణుఁడు ప్రశ్నింపఁగా నతిథుల నభ్యాగతుల నాదరింపవలసినవిధము చక్కఁగాఁదెలిసిన సీత యింగితజ్ఞ. కావున వానిమాటలు వానిసంభ్రమము విని చూచి వీఁడు నిజమైనసన్న్యాసి కాఁడు. ఉదరనిమిత్తమై సన్న్యాసివేషమును ధరించిన బ్రాహ్మణుఁడు అని తెలిసికొని యతిథితో నసత్యమాడరాదు. బ్రాహ్మణునితో నసత్యమాడరాదు. ఇఁక నతిథి బ్రాహ్మణుఁడగువానితో నెట్లసత్యము చెప్పుదును. వీఁడు దొంగసన్న్యాసిగావున వంచకులను వంచించుటదోషముకాదు. కావున నసత్యముచెప్పవచ్చునా యందునేని బ్రాహ్మణుఁడుకావునఁ గోపించి శపించునేమో. అదియునుగాక వంచకుల వంచింపవచ్చునుగాని వంచింపవలయునని విధిలేదుకదా. అది జఘన్యపక్షమేకాని యుత్తమపక్షముకాదుకదా. కానీ- అయినదగును. సత్యమేచెప్పెదను. అని యల్పకాల మాలోచించి వానికిట్లని చెప్పనారంభించెను.

సీత సన్న్యాసిని బూజింపవలసినవిధముగాఁ బూజింపలేదనియు బ్రాహ్మణాతిథిని బూజింపవలసినవిధముగాఁ బూజించెననియు నెఱుఁగనగు. అదియునుగాక వీఁడు రాక్షసుఁడు. దురుద్దేశముతో వచ్చినాఁడని సీతాదేవిగ్రహించినట్లు 'తన్ను హరింప బోడియయి దానవనాథుఁడు ప్రశ్నసేయఁగా' ననుమాట లెడమిచ్చుచున్నవి. వాస్తవార్థమున వచ్చినవాఁడు రావణుఁడని యామె కెఱుకయేకదా.

సీ. మిథిలాధినాథుఁ డై ♦ ప్రథితమహాత్ముఁ డౌ, జనకుపుత్రిని సీత♦యనుపరుర్వి
క్షేమమౌతను నీకు ♦ శ్రీరాముభార్యను, సర్వకామసమృద్ధ♦జనసుఖములఁ
బదియు రెండేఁడు లి♦క్ష్వాకులయింటను, గడపితి నేదియుఁ ♦ గడమ లేక
యంతటఁ బదియు మూఁ♦డవవత్సరంబున, రామాభిషేకకా♦ర్యంబు పొంటె
తే. రాజు మంత్రులతోడ మం♦త్రంబు సేసి, సర్వసంభారములఁ గూర్పఁ♦జతురకైక
యనెడినృపుభార్యతనహృద♦యాధినాథుఁ, డైనమామను సుకృతవ♦శాత్ముఁ జేసి.

ప్రథితమహాత్ముఁడు = మహాత్ముఁడని కీర్తింపఁబడినవాఁడు. క్షేమము + అవుతను + నీకు = నీకు క్షేమముగలుగునుగాక. ఇందర్థవిశేషములేదేనియిదివ్యర్థపదమగును. నీకు మేలగునుగాక యనుటకు నీవు దురుద్దేశముతో వచ్చినవాఁడవు. నీయుద్దేశము కొనసాగించితివా చెడెదవుసుమా, ఇప్పటికైనను దెలివితెచ్చికో, నిన్నుక్షమించెదను. నిన్ను నాశముచేయఁ బుట్టినదాననుసుమా యని హెచ్చరికగా గ్రహింపవలెను. శ్రీరాముభార్యనునేను. శ్రీరాముఁడు శ్రీరాముఁడుగనుకనే నాయనభార్యనేకాని యితరులకుఁగాను సుమా, కావున నీసంకల్పము వ్యర్థమేయగును. మఱియనర్థకమగును. క్షేమమౌతనునీకు = నేను శ్రీరాముభార్యను. శ్రీరాముభార్యనగు నన్ను నీవుమాటలాడిన కామోద్రేకపుమాటలు

మిగులఁ బాపకారణములు. అయినను ఆపాపము నిన్నంటకపోవునుగాక. ఎవ్వ త్తె వనుటకు నాపేరు సీతయని ప్రత్యుత్తరము. ఎవ్వరిదానవనుప్రశ్నకు శ్రీరాము భార్యను. అని ప్రత్యుత్తరము. సర్వకామసమృద్ధను = కామింపఁబడునదికామము, ఏ వేవికోరఁదగునో యవియన్నియుఁ గొఱఁత లేక దండిగాఁగలదానను. కామములు అనఁగా భోగోపకరణస్రక్చందనాదులు. ఇదిరావణుఁడు ముందుచెప్పఁబోవు సర్వ సౌఖ్యములు నీకు నేనమర్చెదననుటకు నాకు నీవలనఁ గావలసిన దేదియు లేదని ముందు గానే సూచించుచున్నది. జనసుఖములన్ = మనుష్యసుఖములన్, అనుటచే నగ్రామ్యసుఖములనిభావము. మనుష్యసుఖముల నే ననుభవించితి ననుటచే నేను మనుష్యస్త్రీని గా ననిభావము. 'శీతోదకశిరస్స్నానం, కించిదుష్ణంచ భోజనం, మానవానా మిదంపథ్య'మ్మను అశ్వనీదేవతలవాక్కుల స్మరించునది. దీనివలనఁ దన యమానుషత్వము సూచించినదాయెను. సర్వకామ సమృద్ధజనుఁడు = శ్రీరామ చంద్రమూర్తి. అవాప్తసమస్తకాముఁడు కదా భగవంతుఁడు-ఆయనవలనఁగలుగు సుఖము-సర్వకామ సమృద్ధజనసుఖములు. అనఁగా రామకృతసౌఖ్యములు. ఇక్ష్వాకులయింటను = పూజ్యార్థంబున బహువచనము - శ్రీరామునింట ననిభావము. ఇచ్చట సిగ్గుచే నిట్లుచెప్పెనని గోవిందరాజీయము. శ్రీరామమూర్తికిఁ బెత్తనము రానికారణముచే ఇక్ష్వాకులయింటననునది మామగారియింట ననియు గ్రహింప వచ్చును. దశరథపర్యాయమునఁ బూజ్యత- కడమ = కొఱఁత, చతుర = నెఱ జాణ, నేర్పుగలది. తనహృదయాధినాథుఁడు = తనభర్త, తనహృదయమునకే యధినాథుఁడు, తక్కినవారి కూరకనాథుఁడే. తనకులోపడి నడచువాఁడనిభావము, సుకృతవశాత్మన్ = ప్రమాణములచే బద్ధునిఁజేసి, ధర్మమునకువశపడిన మనస్సు గలవానిఁగాఁజేసి, కైక తాను జేసిన ప్రాణదాన మనెడి యుపకారమును జ్ఞప్తికిఁ దెచ్చి స్వాధీనపఱచుకొని.

తా. మిథిలకురాజై మహాత్ముఁడను కీర్తిగనిన జనకరాజుపుత్రిని- నాపేరు సీతయందురు. నీకు మేలు కలుగునుగాక. నేను శ్రీరామునిభార్యను జుమీ. సర్వ విధములయిన భోగోపకరణములుగలదానను. మనుష్యసుఖములచే పండ్రెండేండ్లు మామామగారియింట నాభర్తతోడ నేకొఱఁతయు లేక గడపితిని. ఆవల మా మామగారు శ్రీరామునకుఁ బట్టాభిషేకము చేయవలయునని పదుమూఁడవసంవత్స రమున నాలోచించెను. దానికిఁగావలసిన పదార్థములనెల్ల సమకూర్చెను. అప్పు డాయనకుఁ బ్రియురాలగుభార్య కార్యసాధనమునందు నేర్పుగల కైకయనునది ముందుగా నీవుకోరినది యిచ్చెదనని ప్రమాణముచేయించుకొని.

క. నాపతి ప్రవ్రాజనమును, స్వాపత్యం బైనభరతు♦నభిషేకంబున్
భూపాలుని సత్యాత్ముని, నాపడఁతి వరద్వయంబు ♦ నాకాంక్షించెన్. ౭౬౪

ప్రవ్రాజనమును = దేశమువిడిచిపోవుటయును, స్వాపత్యము = స్వ+అపత్యము = తనకుమారుఁడు, సత్యాత్మని = సత్యముస్వభావముగాఁగలవానిని, వరద్వయంబు = రెండువరములు, ఆకాంక్షించెన్ = కోరెను.

తా. ఆకైక నాభర్త దేశము వదలిపోవలయునని, తనకొడుకు రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడు కావలె నని రెండువరము లా సత్యాత్ముని గోరెను.

క. తిన నన్నముఁ గొన నీరముఁ, గన నిద్దుర యేమియైనఁ ♦ గానిమ్ము రాముని నీ వభిషేకించిన, జననాయక నాకు నుసుఱు ♦ సరి యింతటితోన్. ౭౬౫

ఉసుఱు = ప్రాణము, సరి=ముగింపు, తినను=తినెడిదానఁగాను, కొనన్ = కొనెడిదానఁగాను.

తా. ఎంతటి సత్యాత్మకుఁడైనను ఇట్టి శాస్త్రవిరుద్ధము లోకవిరుద్ధములైన కోరికల నెట్లు కొనసాగించెనందు వేమో. ఆయిల్లాలు నీవు రాముని నభిషేకించితివా నేను గూడ తినను, నీళ్లుత్రాగను. నిద్దురపోను. నాగతియేమైనఁ గానిమ్ము. నేనింతటితోఁ బ్రాణములు విడిచెదను, అని మొండికి వేసికొనెను.

క. అని పలికెడి కైకేయికి, ననఘుఁడు మామామ సార్థ♦కార్థంబు లివే కొను మని యెంతయు వేఁడిన, విన దాయిల్లాలు మగని♦విన్నప మేమిన్.

సార్థకార్థంబు=దానికి ప్రయోజనపడెడి పదార్థములు, సొమ్ములు, చీరలు, ధనములోనైనవి. కైకకోరిన రెండువరములు దాని కుపయోగపడునవి కావు. ఆభరణాదు లామె కుపయోగపడున వని భావము. వేఁడినన్ = ప్రార్థించినను, విన్నపము = మనవి. ఈరెండుశబ్దములచే దశరథుఁ డెంతోదీనుఁడై భార్యను ప్రార్థించె నని, మఱియొకతె యయియుండినచో దాని మనసున జాలిపుట్టియుండు నని కైకకాపరితాపము కాని పశ్చాత్తాపముగాని కలుగలేదని భావము.

తా. ఈ ప్రకారము హఠముచే బందిపఱుచు కైకేయికి దోషమెఱుఁగని మా మామగారు ఆ రెండు వరములవలన నీకు నేమి ప్రయోజనమే, నీ కుపయోగపడు సొమ్ములు చీరలు - ధనము - కావలసినంత యిచ్చెదను దీసికోవే యని యెంతయో ప్రార్థించెను. ఆయన యేమి చెప్పినను ఎంత ప్రార్థించినను ఆయన విన్నపము చెవిని బెట్టినది కాదు.

క. ప్రతిభటరహితుం డగునా,పతి కిరువదియేనుసమల♦ప్రాయం బపు డీ క్షితిఁ బుట్టువాడిగాఁ గన, హితగుణ నా కపుడు పదియు♦ నెనిమిది యేఁడుల్.

ప్రతిభటరహితుఁడు = (1) యుద్ధమున నెదిరించి నిలువగలవాఁడు లేనివాఁడు. (2) వీఁడు నాకు విరోధియను భావమెవరియందును లేనివాఁడు - రావణు

విషయమై వైరము మరణాంతము అని కదా రామచంద్రమూర్తి చెప్పెను. సమల = సంవత్సరముల-ప్రాయము = వయస్సు, క్షితిన్ = భూమియందు, పుట్టువాదిగాన్ = పుట్టినది మొదలుకొని, కనన్ = చూడఁగా, నేను, భూమిమీఁదఁ బుట్టినది మొదలు లెక్కింపఁగా, దీనివలన భూమిలోనున్న కాలము లెక్కింపలేద నుట, తనకుఁ గీడుచేయవచ్చిన వాఁడని తెలిసి యెట్లు హితగుణ యనె నందు రేమో. అప్పుడు పుట్టువాదిగాఁగన్ + అహితగుణ యని పదచ్ఛేదముచేసి కీడు చేయుగుణము కలవాఁడా యని గ్రహింపవలెను.

తా. నా భర్తను యుద్ధమున నెదిరింపఁగలవాఁడు లేఁడు. కావున రాజ్యమును భుజబలమున సాధించియుండ వచ్చునుగాని నా భర్త యెవరిని విరోధిగఁ జూచువాఁడు కాఁడు. క్షుద్రరాజ్యము నిమిత్తమై మన మొకరిని బాధింపనా యను నభిప్రాయము గలవాఁడు. ఆ పట్టాభిషేకవిఘ్నకాలమునకు నా భర్త కిరువదియై దేండ్లు వయస్సు- నేను భూమిమీఁదఁబుట్టినది మొదలు నాకు పదునెనిమిదియేండ్ల వయస్సు. ఇంతటి లేఁతవయస్సు వా రెట్లడవులలోఁ దిరుగఁ గలరనికూడ మా యత్త మామ లాలోచించిన వారుగారు.

రామచంద్రమూర్తి విశ్వామిత్రునితో నరణ్యమునకుఁ బోవునప్పటికి పండ్రెం డేండ్లు. ఆయేఁటనే సీతావివాహము. పిమ్మటఁ బండ్రెండేం డ్లయోధ్యలో సుఖముగా నుండుట. ఆపై యేఁటఁ బట్టాభిషేక ప్రయత్నము కావున రామచంద్రునకు నప్పటి కిరువదియై దేండ్లు. అరణ్యావాసారంభమైన పిదప ఋష్యాశ్రమములలోఁ బది యేండ్లు గడచెను. పంచవటిలో మూఁడేండ్లు గడచినవి. వనవాసారంభము మొదలు పదునాల్గవ సంవత్సరమున సీతాపహరణము కాఁగా నిప్పటికి శ్రీరామచంద్రునకు ముప్పదియెనిమిదవయేఁడు. సీత జనకునకు లభించినది మొదలు ఆఱు సంవత్సరములు మిథిలయందుండెను. వివాహానంతర మయోధ్యలో పండ్రెండువత్సరము లుండెను. పదుమూఁడవ సంవత్సరమున వనప్రయాణము కాఁగా వనవాసమునకు బయలుదేఱు నప్పటికి సీతాదేవికి పదునెనిమిది సంవతర్సములు గడచినవి. కావున నిప్పటికి సీతకు ముప్పదియొక్క సంవత్సరములు వయస్సుగడచెను. ఇది ముప్పది రెండవ సంవత్సరము. అని గోవిందరాజీయము. మహేశ్వరతీర్థులును నీ లెక్క ప్రకారమే వ్రాసియున్నారు. పట్టాభిషేక మప్పటికి సీతాదేవికి ముప్పదిమూఁడు సంవత్సరములు. రామచంద్రమూర్తికి ముప్పదితొమ్మిదియవ సంవత్సరము. ౫౭౧ పద్యము బాలకాండమున దీని వివరము చూచునది.

సీ. రామనామంబునఁ ♦ బ్రథితుండు జగతిని, సత్యవంతుఁడు గుణ♦శాలి శుచియు
నీరజాతాయత♦నేత్రుండు నాజాను, బాహుండు భూతావ♦ళీహితాత్ముఁ

డట్టినాపెనిమిటి ♦ కాలిముచ్చట దీర్ప,నభిషేక మొనరింపఁ ♦ డయ్యె దశర
థుండు కామార్తుఁడై ♦ వెండి తండ్రిని జూడ, నచ్చినరామునిఁ ♦ బలికెఁ గైక

ఆ. వినుము రామ నీదు♦జనకునియానతి, భరతునందు రాజ్య♦భార మునిచి
వని వసింపు మీవు ♦ వర్షము ల్పదునాల్గు, జనకు సత్యవాది ♦ సలుపవయ్య.

వయసుచే వనవాసమున కనర్హుఁ డనిచెప్పి యిఁక గుణములచేతను ననర్హుఁ డని చెప్పుచున్నది.

ప్రథితుండు = ప్రసిద్ధికెక్కినవాఁడు, జగతిని = ప్రపంచమందు, శుచి = పరిశుద్ధుఁడు, నీరజాతాయతనేత్రుండు = కమలములవలె విశాలమైన కన్నులుగలవాఁడు, ఆజానుబాహుండు = మోఁకాలినంటుచేతులు గలవాఁడు, భూతావళీ = జీవకోట్లకు, హిత = మేలుచేయు, ఆత్ముఁడు = మనస్సుగలవాఁడు.

తా. లోకముల జనులయందు రాముఁడు రాముఁడు రాముఁడని సన్నింపని వారు గొప్పగఁ జెప్పని వారులేరు. అంతటి ప్రసిద్ధి యెట్లు వచ్చెనందువా అసత్యము చెప్పఁడు. సద్గుణములచేతనే ప్రకాశించువాఁడు. కావునఁ దప్పుపట్ట నొక దోషగుణమైనఁ గలవాఁడు కాఁడు. స్త్రీల విషయమైకాని ధనవిషయమైకాని నిష్కల్మషమైన హృదయముగలవాఁడు. సర్వభూతములకు మేలుచేయుటయందే కోరిక గలవాఁడు. ఈగుణము లీయనయందుఁ గలవని చాటించిచెప్పుచున్నవా యన్నట్లు కమలములవంటి పెద్ద కన్నులు మోఁకాలినంటు చేతులుగలవాఁడు. కన్నులుచేతులు చూడఁగానే యీయన మహానుభావుఁడను తలంపుగలిగించువాఁడు. ఇటువంటి నా భర్తకుఁ దన భార్య ముద్దుతీర్చుటకై కామార్తుఁడై దశరథరాజు పట్టాభిషేకముచేసిన వాఁడుగాఁడు. తండ్రిని జూడవచ్చిన రామచంద్రునితోఁ గైక రామా మీ తండ్రి యాజ్ఞా ప్రకారము రాజ్యము భరతున కిచ్చి నీవు పదునాలుగేం డ్లరణ్యమున నుండుము. మీ తండ్రిని సత్యవాదిని జేయుము అని చెప్పెను.

క. అని కైకయి వచియించిన, విని యకుతోభయుఁడునాదు♦విభుఁ డాపలుకుం
గొని నిశ్చలవ్రతుం డయి, చనుదెంచెన్ జనకు సత్య♦సంధునిఁ జేయన్. ౭౬

అకుతోభయుఁడు=భయ మెట్టిదో యెఱుఁగనివాఁడు. దేనివలనను భయము లేనివాఁడు.

తా. సవతితల్లి కైకచెప్పినమాటలు విని దేనికిని భయపడనివాఁడు కావున నరణ్యావాసముచేయుటకు భయపడక పదునాలుగుసంవత్సరము లరణ్యావాసము చేసెద నని యది వ్రతముగాఁ బూని తండ్రిని సత్యవచనుని జేయ నరణ్యములకు వచ్చెను.

తే. ఇచ్చునేకాని యొరులచేఁ ♦ బుచ్చుకొనఁడు, సత్యమాడునకాని య♦సత్యమాడఁ
డెట్టివేళల నివియ మా♦దిట్టమైన, రామచంద్రునివ్రతములు ♦ బ్రహ్మతేజ. ८८०

బ్రహ్మతేజ = బ్రాహ్మణతేజస్సువంటి తేజస్సుగలవాఁడా. నాభర్తకు రెండు వ్రతములుగలవు. తానొకరికేదైన నిచ్చునేకాని యొకరిచే దేనిని బుచ్చుకొనఁడు. ఎట్టి సంకటవేళనైన సత్యముచెప్పునేకాని యసత్యముచెప్పఁడు. ఇవి యాయనకు వ్రతములు,

దద్యాద్రాజన్నయాచేత, యజేత నచ యాజయేత్.
నాధ్యాపయే దధీయీత। ప్రజాశ్చపరిపాలయేత్।

భార. రాజధర్మ-౬౦ అధ్యాయము.

ధర్మరాజా, క్షత్రియుఁడియ్యవచ్చును. యాచింపరాదు. యజ్ఞముచేయవచ్చును చేయింపరాదు. వేదాధ్యయనముచేయవచ్చును, చేయింపరాదు. ప్రజలఁ బాలింపవలెను.

సీ. రాము వైమాత్రేయుఁ ♦ డైమించు లక్ష్మణనాముఁడు శూరతా♦ధాముఁ డన్న
కును సహాయుం డగు♦నని లోన విజితారి, యతిదృఢవ్రతుఁడు ధ♦ర్మాత్ముఁ డతఁడు
మా వెంటఁజనుదెంచె♦మహితధనుష్పాణి, యగుచు రాముఁడుజటి♦యగుచుఁదపసి
యాకృతిఁ గైకొని ♦ యనుజుతో నాతోడ, దండకాటవిఁ జొచ్చె ♦ దండితారి
తే. కైక వలనను రాజ్యంబు♦గరిమఁ బాసి, మేము మువ్వుర మివ్వనీ♦భూమిఁదిరుగు
చున్నవారము మూర్తమిం ♦ దుందు వేని, వచ్చు నాభర్త వన్యాలిఁ♦దెచ్చు విప్ర.

వైమాత్రేయుఁడు=విమాతృ+కుమారుఁడు=విమాత=సవతితల్లి, వైమాత్రేయో విమాతృజః॥ అమరకోశము. అపత్యార్థకతద్ధితము, శూరతాధాముఁడు=శౌర్యమునకు స్థానమైనవాఁడు, విజితారి = జయింపఁబడిన శత్రువులుగలవాఁడు, అతిదృఢవ్రతుఁడు=మిగుల స్థిరమైన చలింపనివ్రతముగలవాఁడు, ధర్మాత్ముఁడు=ధర్మముస్వభావముగఁ గలవాఁడు, మహితధనుష్పాణి = గొప్పవిల్లు చేతియందుఁ గలవాఁడు. మమ్ము రక్షించుటకై యనిభావము. జటి=జటలుగలవాఁడు-జడలు గలవాఁడు. తపసియాకృతిన్=తపస్సుచేయు మునులవేషము ధరించి, దండితారి = దండింపఁబడిన శత్రువులుగలవాఁడు, గరిమ=గొప్పతనము, కైకవలనను, హేత్వర్థంబునఁబంచమి, వన్యాలి = అడవియందలి ఫలములులోనైనవి.

తా, నాభర్తయగు రామచంద్రమూర్తికి సవతితల్లికుమారుఁడు లక్ష్మణుఁడనువాఁడు మిగులశూరుఁడు. అన్నకు సహాయుఁడుగా నుండవచ్చెను. యుద్ధమునందు జయింపఁబడిన విరోధులుగలవాఁడు. వ్రతము ననుష్ఠించుటయందు మిగులఁ బట్టుదలగలవాఁడు. ధర్మస్వభావుఁడు. మమ్మురక్షించుటకై విల్లు బాణ

ములు ధరించి యాయన మాతోడ నడవులకువచ్చెను. కైకకారణముగ రాజ్యగౌరవమును బోఁగొట్టుకొని మేము ముువ్వురము అడవిలోఁ దిరుగుచున్నారము. కొంచెముసేపు నీ విందు నిలిచితివేని నాభర్త వచ్చును. నీకు వనఫలములు లోనైనవి యిచ్చును.

క. తావకనామము గోత్రము, భూవిబుధా! కులము సత్త్వ♦మును నిక్కముగా
నావిష్కృతి సేయు మిటే,లా విహరించెదవు దండ♦కాటవి నొంటిన్. ౨౨౨

తావకనామము = నీపేరు, గోత్రము = వంశము, కులము = జాతి, గృహము, సత్త్వము=బలము, ఆవిష్కృతిసేయుము = వివరింపుము.

తా. బ్రాహ్మణుఁడా నీపేరేమి. నీగోత్రమేది? నీవేకులమువాఁడవు? ఏమి జాతివాఁడవు? వివరింపుము. ఎందైన నాశ్రమమున నుండక ఏల యొంటరిగా నీయరణ్యములందుఁ దిరుగుచున్నావు.

బ్రాహ్మణుఁడా యని సంబోధించుచు నీజాతియేది, కులమేది యని యడుగుటచే నీవు బ్రాహ్మణవేషధారివిగా నున్నావు. నిజముచెప్పు మని సందేహించి యడిగినట్టులు సూచితము. రావణుఁడు నిజమైన బ్రాహ్మణుఁడుకాఁడుగదా. సన్న్యాసులను నీకులమేమి, గోత్రమేమి. యనిప్రశ్నింపరాదుకదా. ఎట్లు ప్రశ్నించెను? సన్న్యాసు లరణ్యములలోఁదిరుగుట ధర్మమేకదా, ఏల యొంటరిగాఁదిరిగెదవని యడిగెను? పూర్వాశ్రమ కులగోత్రాదులప్రశ్న యసంగతముకాదు. అందును వేషమొకవిధము మాటలొకవిధముగా నుండుటచే సందేహముకలిగి నప్పుడు నిజముచెప్పుము. నీవు దొంగవలెనున్నావని యడుగుట తప్పుగాదు. సన్న్యాసి భిక్షచే జీవింపవలసినవాఁడు. ఆకారణమున గ్రామములకు సమీపముననుండు నరణ్యముల సంచరింపవలసినవాఁడై యుండఁగా మనుష్యసంచారములేని యడవిలోనేల యొంటరిగాఁ దిరుగుచున్నావనుట దోషముగాదు.

క. అని తన్నడిగినసీతా,వనజాక్షికి ననియె నుగ్ర♦వర్తనుఁ డగున
ద్దనుజేంద్రుఁడు తీవ్రంబుగ, వినవే యోసీత నాదు♦వృత్తాంతంబున్. ౨౨౩

ఉగ్రవర్తనుఁడు = క్రూరపునడవడిగలవాఁడు, తీవ్రంబుగన్ =పరుషముగ.

తా. అని సీతాదేవి యడుగఁగా క్రూరపునడవడిగల యారాక్షసశ్రేష్ఠుఁడు నాచరిత్రముచెప్పెద విను మని పరుషముగా నిట్లనెను.

రావణుఁడు సీతకుఁ దనవృత్తాంతంబుఁ జెప్పి యామెను దురుక్తులాడుట.

ఉ. ఎవ్వనిపేరు విన్న జగ ♦ మెల్లవణంకు సదేవదైత్యమై
యెవ్వఁడు రాక్షసావళుల ♦ కెల్లను నాయకుఁ డట్టివాఁడ నో

క్రొవ్విరిఁబోణి రావణుఁడఁ ♦ గూరుత క్షేమము నీకు నిన్గనన్
బువ్విలుకానిలీలలకుఁ ♦ బోదు మనంబు స్వదారపాళిపై. ౭౭౪

సదేవదైత్యమై = దేవతలతోఁ దైత్యులతోఁగూడినదై, కూరుత క్షేమమునీకున్ = నీకు మేలుకలుగునుగాక, ఇది ౭౬ 3 లో నీకు క్షేమమాతను = అన్న సీతావచనమునకుఁ బ్రత్యుత్తరము - నాక్షేమము నీవేమికోరెదవు. నీక్షేమము చూచుకొనుము. నిన్ను వదలిపెట్టిపోను - పువ్విలుకానిలీలలకున్ = మన్మథక్రీడలకు, స్వదారపాళిపైన్ = నాభార్యలసమూహమునిూఁద. ఇచ్చట స్వదారపాళిపై మనంబు పువ్విలుకానిలీలలకుఁబోదనుటచే నీవు నాకుఁదల్లివి, నిన్నుఁజూడ కామ్యభోగములన్నపై మనస్సుపోక వైరాగ్యముకలదగుచున్నదని తీర్థీయవ్యాఖ్య.

తనమగఁడు ప్రథితుండు జగతి నని మనుష్యులందుఁ బ్రసిద్ధుఁడని సీతాదేవి చెప్పిన మాటకుఁ, దనపేరువిన్న దేవతలు, దైత్యులుకూడ గడగడలాడుదురని తన ప్రతిష్ఠ చెప్పుకొనుచున్నాఁడు. నీపేరేమి యనిన ప్రశ్నకు రావణుఁడని తనపేరు చెప్పుచున్నాఁడు. పేరువినఁగానే గడగడలాడు సీతకు భయపడవలదని నీకు క్షేమముగలుగునుగాక యనుచున్నాఁడు. నీవు మనుష్యుల భక్షించువాఁడవే. నన్ను బ్రతుకనిత్తువా,! యనునేమోయని నీమిూఁద మోహముకలుగుచున్నది, కావున నిన్నుఁజంపనని చెప్పెను. నీకు భార్యలులేరా యనునేమోయని కలరుగాని నిన్నుఁజూచినది మొదలు వారిమిూఁద హేయబుద్ధిపుట్టుచున్నదనుచున్నాఁడు.

తా. ఎవనిపేరువిన్న మనుష్యులుమాత్రమేగాక దేవతలు దైత్యులుకూడ గడగడలాడుదురో యట్టివాఁడను, రాక్షసులనాయకుఁడను, నాపేరు రావణుఁడు, నీకుమేలుగలుగునుగాక. నిన్నుఁజూచినదిమొదలు నాభార్యలమిూఁదఁ గ్రీడార్థమై మనస్సుపోకున్నది.

ఉ. ఎందఱనో వరాంగనల ♦ నేపున నే హరియించి తెచ్చితిన్
సుందరి! వారి కందఱకు ♦ సొంపుగ దేవివి గమ్ము, నాలస
న్మందిర మామహాంబునిధి♦మధ్యమునన్ నగమూర్ధ దేశమం
దుం దిర మైనలంక, యటఁ ♦ దోయజలోచన! నన్నుఁ బొందుమిూ. ౭౭౫

వరాంగనల = స్త్రీలయందు శ్రేష్ఠురాండ్రను, ఏపునన్ = పరాక్రమముచే దేవివి = రాణివి, నీయిల్లెక్కడననుటకుఁ బ్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు. నాలసన్మందిరము = ప్రకాశించు నాయొక్క గృహము - మహాంబునిధిమధ్యమునన్ = సముద్రము నడుమ, నగమూర్ధదేశమందున్ = పర్వతముయొక్క శిరోభాగమున, తిరమైన = నిలుకడగానుండు.

తా. నాకు స్త్రీలకఱవురాలేదు. ఉత్తమస్త్రీల నెందఱనో బలాత్కార

ముగఁ బట్టి తెచ్చితిని. అయినను నీక నేనేలయందువేమో వారికందఱకు నీవు ప్రభ్వి వై యుండుము, నాగృహము లవణసముద్రమునడుమ కొండశిఖరముమీఁద నున్నది. దానికి లంకయని పేరు. అచ్చటికివచ్చి నాతోఁగలియుము.

ఉ. అక్కడి భర్మహర్మ్యముల ♦ నక్కడి సుందరనందనంబులం
 దక్కడి సౌధవీథికల ♦ నక్కడి చారువిహారభూములన్
 బెక్కువమక్కువం జెలఁగి ♦ పెంపును సొంపు రహింప నుండ దే
 నిక్కడి భీకరాటవు లి ♦ వేల రుచించెడి నీకు మోహినీ. ౨౨౬

మోహినీ = పురుషుల మోహింపఁజేయుదానా! రాక్షసుల మోహింపఁ జేయ మోహినియవతారమెత్తిన విష్ణువువలెనుండుదానా! అక్కడి = లంకయందలి, భర్మహర్మ్యములన్ = బంగారుమేడలందును, సుందరనందనంబులన్ = అందమై నందనముఁబోలిన యుద్యానవనంబులందును. సౌధవీథికలన్ = అక్కడిమేడల వరుసలయందును, చారువిహారభూములన్ = మనోహరమై విలాసముగాఁ దిరుగుట కుపయోగపడు ప్రదేశములందును, పెక్కువమక్కువన్ = హెచ్చుగుప్రేమచే, భీకరాటవులు = భయంకరములైన యడవులు.

తా. ఆలంకయందుండు బంగారుమేడలమీఁదను, నందనమువంటి యందమైన యుద్యానవనములందును, అక్కడి తెల్లనిమేడల చాలులందును, విలాస సంచారయోగ్యములైన ప్రదేశములందును, నతిశయప్రీతితో పెంపుసొంపు రాణింప నుండెదవేని యిచ్చటి యీభయంకరారణ్యములు నీకెట్లు రుచింపఁగలవు?

క. నాభార్యవైన నిను స, ర్వాభరణోపేత లైన ♦ యబ్జాక్షులు శ్ర
 ద్ధాభక్తుల భజియించెద, రోభామిని యేనువేవు ♦ రుత్తమకులజల్. ౨౨౭

సర్వాభరణోపేతలు = సమస్తభూషణములతోఁగూడినవారు, అబ్జాక్షులు = కమలములవంటికన్నులుగలస్త్రీలు, ఏనువేవురు = ఐదువేలమంది, ఉత్తమకులజల్ = గొప్పవంశములఁబుట్టినవారు, భజించెదరు = సేవించెదరు. రెండవయర్థమున, భార్య = భా + ఆర్య, భా = కాంతిచేత, ఆర్య = పూజ్యురాలు, నాభార్యవు = నాకు నీవు పూజ్యురాలవైతివేని, నాతోడ నైదువేలమందిస్త్రీలు నిన్నుఁ బూజించెదరని గ్రహింపవలయును.

తా. నాభార్యవు నీవైతివా సమస్తాభరణములతో నలంకరింపఁబడిన యైదువేలమంది యుత్తమవంశమునఁ బుట్టినస్త్రీలు శ్రద్ధాభక్తులతో సేవించెదరు.

సీత రావణు నిష్ఠురంబులు పలుకుట.

క. రావణుఁ డిటుపల్కిన సీ, తావనజాక్షియును దీవ్ర ♦ తరరుషచే ర
 క్షోవిభుఁ దృణీకరించుచు, నీవిధమున మాఱు పలికె ♦ దృఢమానస యై. ౨౨౮

తీవ్రతరరుషచేఀ = మిక్కిలి తీవ్రమైన కోపముచే, సీతావనజాక్షియును, ఈసముచ్చయము సీత మునుపటి యుపచారవాక్యములు వదలి యని సూచించును. తృణీకరించుచుఀ = గడ్డిపోఁచవలెఁజూచుచు, లక్ష్యముసేయక, దృఢమానసయై = గట్టిమనస్సుగలదియై - రావణుఁడుచెప్పినమాటలు భర్తతోఁ జెప్పఁబడియుండిన సీత యేలకోపింపవలె? సీతాదేవి భర్తృనిహృదయము తెలిసికోఁజాలని మూఢురాలా? దీనికిసమాధానముగ రావణుఁడు పుత్రునితోసమానుఁడని యధ్యాహారముచేయవలయుననియు, వాఁడుచేసినది ప్రార్థనయైనను రావణుఁ డతి తామసభక్తుఁడగుటచే శ్రీరామవియోగము సంపాదించునని కోపించి సీత పలికెనని తీర్థీయము. అధ్యాహారకాకులక్షణలచేఁ జేయఁబడు సిద్ధాంతము గ్రాహ్యముకాదని యీవఱకే చెప్పఁబడెను.

తా. ఈప్రకారము రావణుఁడు చెప్పఁగా మునుపటి యుపచారపద్ధతి వదలి. సీతాదేవి మిగులఁ గోపముతో రాక్షసులకుఁ బ్రభువైనను వానిని లక్ష్యముసేయక గట్టిమనస్సుగలదై యిట్లు బదులుచెప్పెను.

క. భూమీధ్రమన నకంప్యుఁడు, భాఽమరపతి యుదధినాఁగ ♦ నక్షోభ్యుఁడు శ్రీ
రాముఁడు నాహృదయేశుఁడు, రామానువ్రతను నేను ♦ రాక్షసరాజా. ౨౨౯

భూమీధ్రము = పర్వతము, అకంప్యుఁడు = కదలింపరానివాఁడు, పర్వతమువలె స్థైర్యధైర్యములుగలవాఁడు, భాః = కాంతిచేత, అమరపతి = దేవేంద్రుఁడు, దీనిచే పతిత్వస్వామిత్వములు చెప్పఁబడెను. ఉదధినాఁగఀ = సముద్రమువలె, అక్షోభ్యుఁడు=కలఁతపెట్టరానివాఁడు, సముద్రము పైభాగమున కలఁతపడినట్లున్నను లోపల నేకలఁతయులేక యుండును. అట్టులే రామచంద్రమూర్తి పైకి వ్యసనిపలెఁ గానవచ్చినను నది హృదయమున వ్యాకులత కలిగింపఁజాలినదికాదు. నాహృదయేశుఁడు = నాభర్త, నా=అయోనిజనై పుట్టుమాహాత్మ్యముగల నాయొక్క, వీర్యశుల్కనైన నాయొక్క, సహధర్మచారిణినైన నాయొక్క, ఆయన బాహుచ్ఛాయాశ్రయబలమున నిర్భయురాలైన నాయొక్క, నీకొంపకూల్చుటకు వచ్చియుండు నాయొక్క భర్త - నాహృదయేశుఁడు = నాహృదయమునకు నీశురాలను నేను గాను-ఆయనయే - ఆయనహృదయానుసారముగ నాహృదయముండును. ఈశ ఈశితవ్యన్యాయము తప్పించి పోఁజాలదని భావము. కావున నీయిష్టప్రకారము వర్తింప నాహృదయ మంగీకరింపదు. రామ+అనువ్రతను = రామునకు ననుకూలనై యుండుటయేవ్రతముగాఁగలదానను, ఆయనకనుకూలనై వర్తించుటే నాకు వ్రతముగాని నాకు మఱియొకవ్రతము లేదు. వ్రతభంగము సైఁచుదానఁగాను. శ్రీరాముఁడు లక్ష్మీదేవియందు రమించువాఁడు - నాభర్త. అట్టిభగ

వంతుని పూర్వజన్మములందు నాయనకై తపస్సులుచేసి నాకుఁ బతిగా స్వామిఁగా సంపాదించుకొన్నదానను. నాహృదయేశుఁడు శ్రీరాముఁడు=నాహృదయమునకు నధిపతి లక్ష్మీవల్లభుఁడేకాని యితరుఁడు కాఁడనుట. నాభర్త పర్వతమువలెఁ బిడుగులు మీఁదఁబడినను చలించువాఁడుకాఁడు. నీవో గాలికి గడ్డిపోఁచవలె బాణఘాతములకే వడఁకువాఁడవు. 'అట్టివీరుఁడు రామబాణార్తి మిగుల వడలి వడఁకుచు ధనువును విడిచెఁబుడమి' (యుద్ధ ౧౩-౩౪ ప) నాభర్త భూమరపతి. నీవో యమరపతిచే యుద్ధమున గ్రస్తుఁడైనవాఁడవు. ఆయనకొడుకుచేతను బరాభవింపఁబడినవాఁడవు. రాముఁడక్షోభ్యుఁడు. నీవు కార్తవీర్యార్జుననితో యుద్ధమునఁ గలవరపడి కారాగృహవాసివైనవాఁడవు. అట్టి కార్తవీర్యార్జుననిజంపిన పరశురాముని జయించిన వాఁడు నాభర్త.

తా. కొండవలెఁ గదలింపరాని స్థైర్యధైర్యములుగలవాఁడు. కాంతియందు దేవతలకు స్వామియుఁ బతియునైన యింద్రునివంటివాఁడు. సముద్రమువలె కలఁతపెట్ట సాధ్యపడనివాఁడు అట్టి శ్రీరామచంద్రమూర్తి నాహృదయేశ్వరుఁడు. నేను రామున కనుకూలమైన వ్రతముగలదానను.

క. శ్రీమహితలక్షణుఁడు వట, భూమిజపరిమండలుండు ♦ పురు తేజుఁడు స
త్యామితరక్తుఁడు రాముఁడు, రామానువ్రతను నేను ♦ రాక్షసరాజా. ౭౮౦

శ్రీమహితలక్షణుఁడు = సంపత్కరములు పూజ్యములునైన శుభగుణములుగలవాఁడు, నీవో విష మహితగుణుఁడవు. శ్రీ = విషము. 'శ్రీర్వేషరచనాశోభా సంపత్సరళశాఖిషు, విషేబిల్వే లవంగేచ॥ నానా॥౪॥ వటభూమిజపరిమండలుండు-వటభూమిజ = మఱ్ఱిచెట్టువలె, పరిమండలుండు = విస్తారముగా వ్యాపించి యుండువాఁడు, మఱ్ఱివిత్తనమువలె సూక్ష్మదశయందు నణువులలో నణువుగానుండి నను వ్యాపించునపుడు జగత్తంతయు స్వరూపగుణములచే వ్యాపించువాఁడు. మఱ్ఱిచెట్టుకొమ్మలచే దిక్కులందు వ్యాపించినట్లు బంధువులచే వ్యాపించినవాఁడు (ii) దానివలె నందఱకు నాశ్రయణీయుఁడు (iii) 'కూపోదకంవటచ్ఛాయా యువతీనాం స్తనద్వయమ్। శీతకాలే భవేత్యుష్ణముష్ణకాలేచ శీతలమ్॥' బావినీళ్లు మఱ్ఱిచెట్టునీడ వయస్సుస్త్రీల స్తనము లుష్ణకాలమునఁ జల్లగాను, చలికాలమున వేఁడిగానుండునన్నట్లు సర్వకాలములందు నందఱకు ననుకూలుఁడని భావము—గోవిందరాజీయము. పురుతేజుఁడు=గొప్పతేజస్సుగలవాఁడు, సత్యామితరక్తుఁడు=సత్యమునందు నమితప్రేమగలవాఁడు. నీవసత్యామితరక్తుఁడవు.

తా. శ్రీరామచంద్రమూర్తి సంపత్కరములై యాకారణముచేఁ బూజ్యములైన గుణములే చిహ్నములుగాఁగలవాఁడు. మఱ్ఱిచెట్టు కొమ్మలచే నలుప్రక్కల

నావరించునట్లు ప్రపంచమంతయు స్వరూపముచేతను, గుణముచేతను వ్యాపించు వాఁడు. గొప్ప తేజస్సుగలవాఁడు సత్యమునందు మితములేనియనురాగముగల వాఁడు. అట్టి రాముసకు నే ననువ్రతను.

క. రాముఁడు నరకేసరి సిం,హామితవిక్రాంతగామి ♦ హరితుల్యుఁడు దే
జోమేదురభుజవక్షుఁడు, రామానువ్రతను నేను ♦ రాక్షసరాజా. ౭౮౧

నరకేసరి = పురుషసింహము, పురుషులందు శ్రేష్ఠుఁడు పురుషోత్తముఁడు గదా, సింహ = సింహమువలె, అమితవిక్రాంతిగామి = మిగుల గర్వముతోఁగూడిన గమనముగలవాఁడు, హరితుల్యుఁడు = విష్ణుసమానుఁడు, సమానుఁడనుటచేఁ దద్భిన్నుఁడని యర్థముకాదు. ఆదీపమువంటిదే యీదీపమనినట్లు ఒకపదార్థమే రెండుగాఁ గానవచ్చునని యర్థము. పరమపదమందలి హరియే లీలావిభూతిరాముఁడనిభావము. నీవు కప్పవంటివాఁడవు- తేజస్ = పరాక్రమముచే- మేదుర = దట్టమైన, భుజవక్షుఁడు = భుజములువక్షము గలవాఁడు. నీవు మాంసముచే నిండిన భుజవక్షస్సులు గలవాఁడవు.

క. భూమీశకుమారుఁడు సమ, సోమసమాననుఁడు సద్య♦శోభరితుండున్
రాముఁడు జితేంద్రియుండు (శ్రీ), రామానువ్రతను నేను ♦ రాక్షసరాజా.

రాముఁడు భూమీశకుమారుఁడు = రాజపుత్రుఁడు, నీవో భూమీశ + కు + మారుఁడవు = రాజులపాలిటి కుత్సితశత్రువు, సమసోమ = పూర్ణ చంద్రునితో, సమ = సరిపోలు, ఆననుఁడు = ముఖముగలవాఁడు. సద్యశోభరితుండున్ = సత్కీర్తిచే నిండినవాఁడు-నీవు తద్విరోధియగు కేతువుముఖమువంటి ముఖముగలవాఁడు. నీవు దుష్కీర్తిచే నిండినవాఁడవు. జితేంద్రియుఁడు = ఇంద్రియముల జయించినవాఁడు. నీవు ఇంద్రియజితుఁడవు. నీ వింద్రియములచే జయింపఁబడినవాఁడవు.

రామానువ్రతనని నాలుగుమార్లు చెప్పుట దార్ఢ్యము దెలుపుటకు.

ఉ. చెన్నఁటినక్క వీవు, నను ♦ సింహి సుదుర్లభఁ గోరువాఁడవా
నన్ను ఖరాంశుదీధితిని♦నా స్పృశియింపఁగ నీకు శక్యమా?
యిన్నిటి రామచంద్రుహృద♦యేశ్వరిఁ గోరుట మందభాగ్యుఁడా
కన్నుల నిప్డె కాంచెదవు ♦ కాంచనవృక్షచయంబు రాక్షసా. ౭౮౩

సింహి = ఆఁడుసింహమును, సుదుర్లభ = మిగుల,దుర్లభ = లభింపనిది, ఖరాంశు = సూర్యునియొక్క, దీధితినినాన్ = ప్రకాశమనునట్లు, స్పృశింపఁగన్ తాఁకఁగన్, మందభాగ్యుఁడా = నిర్భాగ్యుఁడా, భాగ్యము క్షయించుకాలము దాపరించినవాఁడా, కాంచనవృక్షచయంబున్ = బంగారువృక్షముల గుంపు. ఇది

మరణచిహ్నము. సూర్యునిప్రకాశమును దాఁచుటయనఁగాఁ బట్టుకొని వేఱొక చోటికిఁ దీసికొనిపోవుట, ఎట్లు సూర్యకాంతిని మనము పట్టుకొని గాదె బుట్టలో వేసి వేఱొకచోటికిఁ దీసికొనిపోయి రాత్రియందు విడువ సాధ్యపడదో, ఎట్లు ఎండను సూర్యుని వేఱుపఱుప సాధ్యముగాదో యట్టులే నన్ను శ్రీరాముని వేఱుపఱుపఁజాలవు. నీ యిష్టమువచ్చినట్లు నీ కనుకూలముగా నన్నుపయోగించుకొనుటకు సాధ్యపడను. అనిభావము.

తా. నీవు చెడ్డనక్కవలె వంచకుఁడవు, క్షుద్రజంతువవు. నేను ఆఁడుసింహమును-లభించుదాననుగాను. ఇట్టి నన్ను నీవా కోరెదవు? సూర్యతేజస్సును పట్టుకొనరాని యట్లు నీవు నన్ను స్పృశింపఁగనైన సాధ్యమా? బలవంతమున నీవున్నచోటికి నెండ వచ్చునా? ఇటువంటి రామచంద్రమూర్తిభార్యను గోరుటచే నీకు మరణకాలమాసన్నమయ్యెను. బంగారుచెట్లను నిపుడే చూడఁగలవు.

ఉ. నిష్ఠురదుఃక్షుధాకుపిత♦నిర్భరవేగమృగేంద్రగూఢపా
దశ్రేష్ఠకఠోరదంష్ట్రలను♦ బీకఁగఁ బూనుట, ధారిణీధర
శ్రేష్ఠము మందరంబు నఱ♦చే హరియింపఁగ నూనుటల్ నర
శ్రేష్ఠరఘూత్తమాత్మసతి♦నీ వెదఁ గోరుట యోదురాత్ముఁడా. ౭౦౪

ఈప్రకారము రామచంద్రమూర్తి గొప్పతనము ఆయనకుఁ దనకుఁ గల సంబంధముదెలిపి యిఁక రావణుని నీచత్వమును దెలుపుచున్నది.

నిష్ఠుర = క్రూరమైనదియు, దుః = సహింపరాని, క్షుధా = ఆఁకలిచేత, కుపిత = కోపించినదియు, నిర్భరవేగ = అధికవేగముగలదియునగు, మృగేంద్ర + గూఢపాత్ శ్రేష్ఠ = గొప్ప సింహముయొక్కయు, సర్పముయొక్కయు, కఠోర దంష్ట్రలను = కఠినములైన కోఱలను, ధారిణీధరశ్రేష్ఠము = గొప్పపర్వతమగు, మందరంబుర్ = మందరపర్వతంబును, నరశ్రేష్ఠ = పురుషులందు శ్రేష్ఠుఁడగు రఘూత్తమ + ఆత్మ + సతి = శ్రీరామచంద్రమూర్తికి నాత్మయగు భార్యను, దురాత్ముఁడా = చెడ్డమనస్సుగలవాఁడా.

తా. సహింపరాని యాఁకలిచే నాహారార్థమై వేగముగఁ బోవుచున్న సింహమును బెనుబామును గోఱలు పీఁకయత్నించుటయు, మందరపర్వతమునఱచేత నిమిడించుకొని పోవఁజూచుటయు నీవు పురుషశ్రేష్ఠుఁడైన శ్రీరామ చంద్రమూర్తికాత్మయగు భార్యను హరించుటయు పాపాత్ముఁడా సమానములు.

రాక్షసులు చేసిన దుష్టకార్యములకుఁ గోపించి వారిని జంపుటకై వచ్చియుండు శ్రీరామచంద్రుని భార్యను హరింపఁ జూచుట ఆఁకలిగొన్న సర్ప సింహముల కోఱలు పీఁకఁ బూనుట వంటిది.

ఇందు సింహమునకు – పామునకు – రామచంద్రమూర్తికిని, కోఱలు – సీతాదేవికిని నుపమానోపమేయములు. రామ సర్పమునకు, రామసింహమునకు, సీతాదేవి కోఱ-కోఱతోనే సింహము పాము ఎట్లు జంతువుల బాధించునో యట్లే శ్రీరామచంద్రమూర్తి సీతాదేవిమూలమున రాక్షససంహారము చేయనున్నాఁడని భావము. కోఱలేని సింహము పాము-సింహమును పామును విడిచిన కోఱలు దుర్బలములు-కావున సీతలేని రాముఁడు, రాముఁడులేని సీత, దుర్బలులే యనియు, తన కోఱను సింహము పాము రక్షించుకొనువిధమున సీతను రామచంద్రమూర్తి రక్షించుకొనుననియు, ఆ విషయమున సీతా ప్రయత్న మనావశ్యకమనియు నేను రామునకు సాధనమాత్ర మనియు భావము.

యథామయా జగద్వ్యాప్తం, స్వరూపేణ స్వభావతః।
తయావ్యాప్త మిదం విశ్వం, నియంత్రీచ తథేశ్వరీ॥

అన్నట్లు సమస్త ప్రపంచమున వ్యాపించియుండు నన్ను నీవు మందరమును నఱచేతిలో నిమిడించుకొనఁ జూచెదవే! ఇది నీకు సాధ్యమా?

మందరపర్వతమునకంటె గొప్పవి శ్రేష్ఠములైనవి హిమవత్పర్వతము, మేరు వుండఁగా మందరమును బోల్చి చెప్పనేల? భగవంతుఁడు మందరధరుఁడు గాని హిమవత్పర్వత ధరుఁడు కాఁడు. మేరు ధరుఁడు గాఁడు. మందరపర్వతమునకు విష్ణుఁ డాధారము రక్షకుఁడైనట్లు నాకు శ్రీరామమూర్తి యని భావము. మఱియును మందరము తన్నాశ్రయించిన వారికి నమృత మెట్లుత్పాదింపఁజేసి యీయఁ గలిగెనో యట్టులే నన్నాశ్రయించిన నీకు మేలు గలదు గాని నాతో విరోధించినఁ జెడుదువని భావము. నిదర్శనాలంకారము. సమాన వాక్యార్థములకైక్యము చెప్పుట నిదర్శనాలంకారలక్షణము.

చ. పటుతర కాలకూటవిష♦పానముఁ జేసియు సౌఖ్యరీతిఁ గో
రుట, శితసూచికాగ్రములఁ♦ గ్రొవ్వున లోచనమార్జనంబు సే
యుట, పెనుబండ కంఠమున♦ నుండఁగ నంబుధి దాఁట నెంచుటల్
చటులపరాక్రమప్రకట♦సత్త్వరఘూత్తముభార్యఁ గోరుటల్. ౭౬౫

కాలకూటవిషపానముజేసియు = కాలకూటమను పేరుగల విషమును ద్రావియు, శిత=కూచియైన, సూచికాగ్రములన్=సూదికొనలచే, లోచనమార్జనంబు = కన్నులు గోఁకుకొనుట, చటుల పరాక్రమప్రకట=యుద్ధమందు మెఱుఁగుఁ దీఁగవలె మెఱయు పరాక్రమముచేఁ బ్రసిద్ధమైన, సత్త్వ=బలముగల, నిదర్శనాలంకారము.

తా. చంపుటయందు మిక్కిలి సామర్థ్యముగల కాలకూటవిషమును ద్రావియును సుఖముగా జీవింపఁ గోరుటయు, సూదికొనలచేఁ గన్నులు గోఁకికొను

టయు, పెద్ద బండ మెడకుఁ గట్టుకొని సముద్రము నీఁదఁ బూనుటయు నెట్టి యపాయ కరములైనకార్యములో యుద్ధమునందు మహా బలపరాక్రమసంపన్నుఁడైన శ్రీ రామునిభార్యను గోరుటయు నట్టి యపాయకరమైనదే.

ఆమాఁటివలనఁ జెడెడువాఁ డొక్కఁ డొక్కఁడే. శ్రీరామునిభార్యను హరించుటవలన వంశమే నాశమగును.

క. కాలాయసశూలాగ్రము, పై లాఁగులు వేయఁగనుట ♦ ప్రజ్వలితాగ్నిన్
జేలాగ్రంబున ముడుచుట, నాలుక నసి నాకు టగును ♦ నను నీకొనుటల్. ౨౪౬

కాలాయస = ఉక్కుతోఁ జేయఁబడిన, శూలాగ్రముపైన్ = శూలము కొనమీఁద, లాఁగులు = గంతులు, లంఘన శబ్దభవము లాఁగు. ప్రజ్వలితాగ్నిన్ = మండుచున్న యగ్నిని, చేలాగ్రంబునన్ = వస్త్రము కొనయందు, ముడుచుట = ముడివేయుట, అసిన్ = కత్తిచే.

తా. నీవు నన్ను గ్రహించుటలు ఉక్కు శూలము కొనయందు లాఁగులు వేయుట, మంటను కొంగున ముడివేయుట, నాలుకతోఁ గత్తిని నాకుట యెట్టిదో యట్టిదే యగును.

క. ఖరకర హిమకరులను నీ, కరతలములఁ బట్టుకొనుట♦గాఁ దలఁపుము భీ
కరశరుఁడగు శ్రీరాముని, పరమప్రియ నన్నుఁ బట్ట ♦ భావించుటయున్. ౨౪౭

ఖరకర-హిమకరులను = సూర్యచంద్రులను, భీకరశరుఁడు = భయంకరములైన బాణములు గలవాఁడు, పరమప్రియన్ = మిగులఁ బ్రియురాలిని, భావించుట = ఆలోచించుట.

తా. సూర్యచంద్రులను నఱచేతఁ బట్టుకొనుట యెట్టిదో, భయంకర బాణములు గల శ్రీరామునికి మిగులఁ బ్రియురాలగు నన్నుఁ బట్ట నాలోచించుట యట్టిదిగాఁ దలంపుము.

చ. హరిమృగధూర్తకంబులకు ♦ నంబుధికుల్యలకున్ విహంగరా
డ్వరపికవర్ధనంబులకు ♦ వారణమూషక బర్హిమద్గులన్
బరమసురాగ్ర్యకుంజలవి♦భాసితచందనపంకవారులం
బరఁగెడునంతరంబె రఘు♦వర్యునకున్ వినుము నీకు రావణా. ౨౪౮

హరి = సింహమునకు, మృగధూర్తకము = నక్క. స్త్రియాం శివాభూరిమాయు గోమాయు మృగధూర్తకాః సృగాల వంచకక్రోష్టు ఫేరు ఫేరవ జంబుకాః॥ అమరకోశము. అంబుధి=సముద్రము, కుల్య=చిన్నకాలువ, విహంగరాట్ = పక్షిరాజు, గరుత్మంతుఁడు, పికవర్ధనము = కాకి, వారణ = ఏనుఁగు, మూషక =

ఎలుక, బర్హి = నెమలి, మద్గువు = నీరుకాకి, సురాగ్ర్యము = శ్రేష్ఠమైనకల్లు, కుంజల = పులియఁబెట్టఁబడిన కడుగునీళ్లు. కుంజలము, ఆరనాళక సౌవీర కుల్మాషాభిషుతానిచ।అవంతీసోమధాన్యామ్లకుంజలానిచ కాంజికే॥అమరకోశము. విభాసిత = పరిమళముచే మిగులఁ బ్రకాశించు, చందన = శ్రీగంధమునకు-పంకవారులన్ = బురదనీళ్లయందు, అంతరము = భేదము. అంతరము - అంతరమవకాశావధి, పరిధా నాంతర్ధి భేద తాదర్థ్యే, ఛిదాత్మీయవినా బహి రవసర మధ్యేంతరాత్మనిచ॥ అమరకోశము.

తా. రాముఁడుమాత్రమా మగవాఁడు శూరుఁడు నేను గానా యందు వేమో ? సింహమునకు నక్కకు, సముద్రమునకు-వీథులవెంటఁ బాఱు చిన్నకాలువకు, గరుత్మంతునకుఁ గాకికి, ఏనుఁగునకు నెలుకకు, నెమలికి నీరుకాకికి, శ్రేష్ఠమైన సారాయమునకు పుల్లని కడుగునీళ్లకు, శ్రీగంధమునకు బురదనీటికి నెంత తారతమ్యముగలదో శ్రీరామచంద్రునకు నీకు నంత తారతమ్యముగలదు.

క. కాంచన సీసములకు రాయంచకు గ్రద్దకును గల్గు♦నంతర మే యా
నంచితగుణి రామునకు, న్వంచకుఁడగునీకుఁ గలదు ♦ పరిశీలింపన్. ౨౮౯

రాయంచ = రాజహంస.

తా. బంగారునకు సీసమునకు, రాజహంసకు గ్రద్దకు గల భేదమే సుగుణశ్రేష్ఠుఁడైన శ్రీరామునకు మోసగాఁడగు నీకుఁ గలదు.

ఉ. కర్బురపుంఖసంకలిత♦కాండవిభాసితచాపహస్తుఁడై
బర్బరపాణి రాఘవుఁడు ♦ వాసవతుల్యుఁడు నాకుఁ గల్గఁగా
దుర్బల నంచు నీవు నను ♦ దోర్బలవృత్తి హరించి తేనియుం
గర్బురనాథ మక్షికముఁ ♦ గల్గినయాజ్యము నాదు నీ కెటున్, ౨౯౦

కర్బురపుంఖ = బంగారుపిడులతో, సంకలిత = కూడిన, కాండ = బాణములచే, విభాసిత = ప్రకాశింపఁజేయఁబడిన, చాపహస్తుఁడై = విల్లు చేతియందుఁగలవాఁడై, బర్బరపాణి = కఱుకైన హస్తముగలవాఁడు, వాసవతుల్యుఁడు = ఇంద్రునితో సమానుఁడు, దుర్బల = బలహీనురాలు, దోర్బలవృత్తి = భుజబలవ్యాపారముచే, కర్బురనాథ = రాక్షసరాజా, మక్షికము = ఈఁగ, ఆజ్యమను = నేతిని.

తా. బంగారుపిడులుగల బాణములచేఁ బ్రకాశించు విల్లు ధరించు రామచంద్రుఁడు యుద్ధమునందు బిఱుసగు చేయిగలవాఁడు నాకు రక్షకుఁడై యుండఁగా నిది యాఁడుది యబల యేమిచేయఁగలదని నీవు నీభుజబలముచే హరించినను, ఈఁగతోఁడ నేతిని ద్రాగిన వానికడుపులో నిండక నేతితోఁడ నెట్టు ఈఁగ వాంతిపుట్టిం

చి యా నేతిని జీర్ణముకాకుండఁ జేయునో యట్టులే. చేయుదును. నన్ను నీవు జీర్ణించుకొనలేవు. నీవు నీవారితోడఁ జెడుదువు.

క. అని దృఢమతిఁ బరుసంబుల, ననియు వెఱఁ గాలిఁ గదలు♦నలఁతియరఁటియో
 యన గడగడవడఁకఁగ న, ద్దనుజుఁడు భయపెట్టఁ బలుకుఁ ♦ దనకులబలముల్.

దృఢమతిఁ = జంకుగొంకులేక దిటమగు మనస్సుతో, పరుసంబులు = కఠినోక్తులు, అనియుఁ = పలికియును, వెఱఁ = భయముచే, అలఁతియరఁటియో = లేఁతయరఁటిచెట్టో. రావణుని సమూలము నాశముచేయవలయునని కంకణము గట్టుకొని వచ్చియుండు నామె సమయమువచ్చినపుడు భయపడనేల? రావణుఁడు హరించి తన్నుఁ జెఱచునో చంపునోయన్న భయము సీతకులేదు. రామవియోగముకలుగఁగలదే. అది యెట్లు సహింపఁగలనని భయమేకాని యితరభయ మామెకు లేదు. అదియునుగాక గొప్పకార్యము తలపెట్టినపుడు కార్యారంభమున జంకు కొంద ఱకు సాధారణముగాఁగలుగును. అన్నిసంవత్సరములు యుద్ధప్రయత్నముచేసి యుద్ధరంగమునవచ్చి నిలిచిన యర్జునుఁడు గెలుతుమో వారల గెలువంగలేమో గెలుతురేమోవారేయని సందేహించెఁగద. ఈమెకుఁ బరాభవభయములేదుగాని వియోగమునకు వెఱచెను.

తా. అట్టి గట్టిమనస్సుతోఁ గఠినవాక్కులాడియు భయముచే నోరుగాలికి వణఁకు లేఁతయరఁటిచెట్టువలె గడగడవడఁకసాగెను. అదిచూచి యామెను మఱింత భయపెట్ట రావణాసురుఁడు తనకులము బలము వర్ణించుచున్నాఁడు.

౪౮-వ సర్గము. సీతకు రావణుఁడు తనస్వరూపముఁజూపిభయోక్తులాడుట.

చ. విపులలలాట దేశపరి♦వేల్లితభ్రూకుటియై సురారి దు
 ష్కుపితకఠోరవాక్యములఁ ♦ గోమలి కిట్లను నన్ను నేమిగాఁ
 జపలమృగాక్షి చూచెదవు ♦ శంకరమిత్రసహోదరుండ య
 క్షుపుఁడు విమాతృజుండు దశ♦కంఠుఁడ రావణనామధేయుఁడన్. ౭౫-౨

విపుల = విశాలమైన, లలాటదేశ = నొసటి స్థలమునందు, పరివేల్లిత = ఆడుచున్న, భ్రూకుటియై = బొమముడిగలవాఁడై, సురారి = దేవవిరోధి, దుష్కుపిత కఠోరవాక్యములఁ = చెడ్డకోపముగలవాని కఠినపుమాటలతో, చపలమృగాక్షి = చలించు జింకకన్నులవంటి కన్నులుగలదానా, శంకరమిత్ర = ఈశ్వరునికి స్నేహితుఁడైన కుబేరుని, సహోదరుండ = తోడఁబుట్టినవానిని, తమ్ముఁడను, యక్షుపుఁడు = కుబేరుఁడు, విమాతృజుండు = పినతల్లికొడుకు, దశకంఠుఁడ - ని

ముగఁ బదితలగలవాఁడైన నేను బదితలలుగలవాఁడను. రావణుఁ డనుసార్థక నామధేయము గలవాఁడను.

సీ. ఎవ్వనిఁ గని భీతి ♦ మృత్యువుఁ గని నట్లు, పఱచు గంధర్వాహి ♦ పతగవితతు
లెవ్వని ననిఁ దాఁకి ♦ హేత్వంతరంబున, నరవాహనుం డోడి ♦ పరువు వాఱె
నెవ్వనిభీతి స ♦ మృద్ధిమన్నిజపురి, వీడి శ్రీదుఁడు చేరె ♦ వెండికొండ
నెవ్వఁ డాతనికామ ♦ గేద్ధపుష్పాఖ్యవి, మానంబు నొడిచె స్వ ♦ యానముగను
తే. నట్టినామోముఁ జూచిన ♦ నడలి సడలి, వడఁకి తడఁబడి పఱతురు ♦ వాసవాది
విబుధులెవ్వఁడుగలచోట ♦ వెఱచిగాలి, వీవఁడుష్ణాంశుఁడగుఁజలి ♦ వెలుఁగుగాఁగ.

గంధర్వ - అహి - పతగ - వితతులు = గంధర్వులు, పన్నగులు - గరుడులు- వీనిసమూహములు, హేత్వంతరంబునన్ = వేఱొకకారణముచే, ఇది మయూర వ్యంసకసమాసము. నరవాహనుఁడు = కుబేరుఁడు, సమృద్ధిమత్ = ఐశ్వర్యముతోఁ గూడిన, నిజపురి = తనపట్టనమగులంకను, శ్రీదుఁడు=కుబేరుఁడు, వెండికొండన్ = కైలాసమును, కామగ = కోరినట్లుపోఁగల, ఇద్ధ = ప్రసిద్ధికెక్కిన, పుష్పకాఖ్య విమానము = పుష్పకమనుపేరుగల విమానము, ఒడిచెన్ = లాగుకొనెను, స్వయా నముగను = తనవాహనముగ. ఉష్ణాంశుఁడు = వేఁడికిరణములుగల సూర్యుఁడు, చలివెలుఁగు = చంద్రుఁడు.

తా. గంధర్వులు, పన్నగులు, గరుడులు, లోనగువారు, మృత్యువును జూచినట్టు లెవ్వనిఁ జూచినంత మాత్రమునఁ బరువెత్తుదురో, ఏదో యొకకారణముచే యుద్ధమందు నెవనితో డీకొని కుబేరుఁడు పరువెత్తెనో, ఎవనికి భయపడి సర్వైశ్వర్య సంపూర్ణమగు తనపట్టనము లంకను విడిచి కుబేరుఁడు కైలాసముఁజేరెనో, యెవ్వఁడతని కామసంచారము చేయుశక్తిగల విమానమును పుష్పక మనుదానిని లాగికొని తనవాహనముగఁ జేసికొనెనో యట్టి నాముఖముఁ జూచినంత మాత్రమున భయపడి క్రిందపడి వడఁకి కాళ్లు తడఁబడ నింద్రుఁడు మొదలైన దేవతలు పరువెత్తుదురు. నేనున్నచోట గాలి కదలదు. సూర్యుఁడు చంద్రునివలెఁ జల్లగ నగును.

క. ఎట నెట నే నిలిచినఁ జన, నట నట నల్లాడ దొక్క ♦ యాకేఁ జెట్లన్
బటురయము వదలి నదులును, గుటిలాలక పాఱ వెఱచి ♦ గుదివడి నిలుచున్.

కుటిలాలక = వంకరయగు ముంగురులు గలదానా, ఉంగరములవలెఁ జుట్టుకొనియుండు ముంగురులు గలదానా.

తా. ఎందెందు నేను నిలుతునో యక్కడఁ జెట్లయం దొకయాకైన నా భ

యమునఁ గదలదు. నదులుకూడ వానివేగము వదలి కట్లచేఁ గట్టఁబడినట్లు కదలక నిలుచును.

సీ. క్రూరులై భీకరా♦కారులై వెలసిన, రాక్షసిజనులచే ♦ రాజిఁ గూడి
పూర్ణమై ప్రాకార♦కీర్ణ మై కాంచన,కక్ష్యావితతుల సం♦లక్ష్యమగుచు
వారణాదులమణి♦తోరణాదులఁ బొల్చి, తూర్యనినాదగాం♦భీర్య మగుచు
నుద్యానచరశోభి♦తోద్యానసర్వర్తు, సూనఫలావళీ♦స్థాన మగుచు

తే. మత్పురము పొల్చు సాగర♦మధ్యమునను శక్రపురితుల్య మగుచు ని♦ర్వక్రవిభవ
మలర లంకాఖ్యపట్టన ♦ మలరుఁబోణి, కానఁగా రమ్మ కన్నుల♦కఱవు దీఱ.

ప్రాకారకీర్ణమై = ప్రాకారముచేఁ జుట్టఁబడినదై, పూర్ణమై = మంచిపదార్థములచే నిండినదై, కాంచనకక్ష్యావితతులన్ = బంగారు తొట్టికట్ల సమూహములచే, సంలక్ష్యము=చూడఁబడినది, వారణాదులన్=ఏనుఁగులు మొదలైన వానిచే, తూర్య=వాద్యములయొక్క, నినాద=ధ్వనిచే, తోరణము=బహిర్ద్వారము. ఉద్యానచర=దేవతలచే, శోభిత = ప్రకాశించు, ఉద్యాన=తోఁటలయందలి, సర్వర్తు= అన్ని ఋతువులయందలి, సూన=పుష్పములయొక్కయు, ఫల=పండ్లయొక్కయు, ఆవళీ=సమూహమునకు, స్థానము+అగుచు=నెలవై, మత్+పురము=నాయొక్క పట్టనము, సాగరమధ్యమునను = సముద్రమునడుమ, శక్రపురితుల్యము = ఇంద్రుని పట్టనముతో సమానము. నిర్వక్రవిభవము = వంకరపోని సంపద, లంకాఖ్య = లంక యను పేరుగల పట్టనము.

తా. క్రూరులును, భయముగలిగించు నాకారముగల రాక్షసులను గలదై, సర్వపదార్థములచే నిండి ప్రాకారములచేఁ జుట్టఁబడి బంగారు మయములైన తొట్టికట్లు, ఏనుఁగులు, రథములు, గుఱ్ఱములుగలదై మణులతోఁ జేయఁబడిన తోరణములుగలిగి మంగళవాద్యములు బోరుకొలుపుచుండ గంభీరమై దేవతలు సంచరించుటచే శోభించు నుద్యానమందలి సర్వఋతువులందుఁ బూచుకాచు పూలు పండ్లుగల చెట్లకు నెలవై సముద్ర మధ్యమునందు నింద్రపురితో సమానమై లంక యను పేరుగల నాపట్టనముగలదు. కుసుమకోమలా! చూచుటకు రమ్ము. ఈ పాడడవులు చూచిచూచి మంచివస్తువులఁ జూడఁగోరు నీకన్నులకు సంతోషము కలుగును.

తే. అందు నాతోడ నీవు సా♦నంద వగుచు
మందగమనరో క్రీడల ♦ నుందు వేని
డెందమునయందుఁ దలఁపఁగఁ ♦ గందె మనుజ
సుందరీబృందముల నోసి♦కుందరదన.  ౧౩

సానందవు = ఆనందముతోఁ గూడిన దానవు, మందగమనరో = మెల్లని నడకగలదానా, "రోశబ్దంబొండు సంబోధనంబున స్త్రీ వాచకంబునకుఁ బరంబుగ నగు-అయ్యది ప్రాస్త్యాంతంబును నగు-స్త్రీవాచకమనుటచే, అన్నరో, ఏనుంగురో యనునవి యుపప్రయోగములు - బృందములను = సమూహములను, కుందరదన = మొల్లమొగ్గలవంటి దంతములు గలదానా.

తా. నీవు సంతోషముతో నాపట్టనమందు నాతోడఁ గ్రీడింపఁగలిగెనేని యావల నీ వేల మనుష్యస్త్రీల గుంపును, మనస్సునందైన స్మరింతువు?

క. మానుషసురసుఖములఁ జంద్రానన యట మరగి యవల నాత్మఁ దలఁతువే
మానవు గతాయు వగునొక,హీనుని దుర్బలుని భాగ్యహీనుని రామున్.

౭౬౩-వ పద్యమున మనుష్యసుఖము లెల్ల ననుభవించితిననిన మాటకు రావణుఁడు ప్రత్యుత్తరమిచ్చుచున్నాఁడు. అటన్ = లంకాపురమునందు, చంద్రానన = చంద్రబింబమువంటి ముఖముగలదానా, మానుషసురసుఖములన్ = మనుష్యు లనుభవించు సుఖములను దేవతలసుఖములను, మరగి=అలవాటుపడి, గతాయువు = క్షీణించిన యాయుస్సుగలవానిని.

తా. నీ వయోధ్యయందు మనుష్యసుఖము లనుభవించితి నని చెప్పితివి. లంకకువచ్చితివా యందు మనుష్యసుఖములు దేవసుఖములుగూడ ననుభవింపఁ గలవు. వానికి నలవాటుపడితివా యీ పిమ్మట నిప్పుడు నీవు గొప్పవానిగాఁ దలఁచు రాముని మనుష్యమాత్రుని, నీ వియోగదుఃఖముచేఁ జచ్చినవానిని, నీచుని, బలహీనుని, దరిద్రునిఁ దలఁపనైనఁ దలఁతువా ?

మ. తనగారాబుకుమారు రాజ్యమున సంస్థాపించి నీమామ జ్యే
ష్ఠునిఁ దన్ను న్నిరసింప హీనబలుఁడై చొచ్చెన్ వనాంతంబులన్
జనునే నీకటువంటిదుర్బలుని రాజ్యభ్రష్టు నల్పాయువున్
వనచారి న్మునివేషుఁ గట్టుకొని యేడ్వం గానలో సుందరీ. ౭౯౦

రామునియందలి గుణములను దోషములుగాఁ జెప్పుచున్నాఁడు. గారాబుకుమారున్ = ముద్దులకొడుకును-భరతుని, జ్యేష్ఠున్ = పెద్దవానిని, నిరసింపన్ = తఱుమఁగొట్టఁగా, హీనబలుఁడై =బలహీనుఁడై, వనాంతంబులన్ =అడవులందు, దుర్బలునిన్ = బలహీనుని, రాజ్యభ్రష్టున్ = రాజ్యమువలన భ్రష్టుని, అల్పాయువున్ = అల్పకాలముమాత్రమే జీవింపఁగలవానిని, వనచారిన్ =అడవులందుఁ దిరుగువానిని, ఏడ్వన్ = దుఃఖింపఁగ.

తా. తనముద్దుకొడుకు భరతునకుఁ బట్టాభిషేకముఁజేసి నీమామ పెద్దవాఁడగుటచే న్యాయముగ రాజుగావలసిన తన్ను నూరనుండి వెడలఁ గొట్టఁగా

రాజ్యము సాధించుబలము లేని కారణమున నడవులందుఁ బ్రవేశించెను, న్యాయముగఁ దనకు రావలసిన రాజ్యమును దక్కించుకొనుశక్తి లేని బలహీనుని, నా కారణమున నూరిలోనైన నుండనీక తలిదండ్రులు గొట్టఁగా రాజ్యమును వదలిన వానిని ఆకారణముచేతనే జీవనమునకు లేని కారణమున క్షీణించిన యాయుస్సుగల వానిని, ఊరనుండినఁ జంపుదురను భయముతో నడవుల పాలయి యొంటిగా నిందువచ్చి డాఁగినవానిని, "భగ్నాః కృషే ర్భాగవతా భవంతి" యన్నట్లు. కృషిభగ్నము కాఁగా భాగవతుఁడై మునివేషము వేసికొనినవానిఁ గట్టుకొని యడవులలో దుఃఖించుచుండ నెంతో యందకత్తెవగు నీకుఁ దగునా.

ఉ. నీ కిది ధర్మ మా నటవె ♦ నిష్ఠురశీలిని! పంచబాణబా
ణాకులితాంతరంగమున ♦ నాసమెయిం దమిఁ దాన వచ్చి ని
న్నో కమలాక్షి వేఁడికొను♦చున్ననిశాచరలోకనాథునిం
బ్రాకటలీల నేల కవ♦మానముగాఁగఁ దృణీకరింపఁగన్. ౯౯

నిష్ఠురశీలిని = కఠినస్వభావము గలదానా, పంచబాణ=మన్మథునియొక్క, బాణ = బాణములచే, ఆకులిత = కలఁతచెందిన, అంతరంగమునన్ = మనస్సుచే, ఆసమెయిన్ = ఆశచే, తమిన్ = మోహముచే, తృణీకరింపఁగన్ = గడ్డిపోఁచవలె నలక్ష్యముగాఁ జూచుట.

తా. సీతా నీ వెంత కఠినస్వభావము గలదానవే. అట్లుగాకున్న మన్మథ బాణములచేఁ గలఁతచెందిన మనస్సుగలవాఁడై, యెంతోయాశపడి, నీతో సుఖ మనుభవింపఁగోరి వచ్చియున్న రాక్షస లోకమున కంతయుఁ బ్రభువైన నన్ను గడ్డిపోఁచను జూచినట్టు లలక్ష్యముగా నవమానకరముగఁ జూచుచున్న దానవే. ఇది నీకు ధర్మమా, ఎదుటివారి పరు వాలోచింపవలదా.

ఉ. భీరు! నిరాకరించి ననుఁ ♦ బిమ్మట వేఁగెదు మారుకాఁకలన్
ధారిణి మున్ను దాఁ జరణ♦తాడితుఁ జేసి పురూరవున్ వ్యథన్
గూరినయుర్వశీతరుణి♦కోపున, రాముఁడు యుద్ధభూమి నా
గోరికి సాటిరాఁడు, ననుఁ ♦ గూడుటకు న్మది సంశయించెదే. ౧౦౦

భీరు = పిఱికిదానా, వేఁగెదు = సంతాపపడెదవు, మారుకాఁకలన్ =మన్మథ తాపముచే, చరణతాడితున్ =కాలితోఁ గొట్టఁబడినవానిని, ఉర్వశీ=దీనినిగొంద ఱు ఊర్వశి యని వ్రాసెదరుగాని ఉర్వశి యను రూపమే సాధువని "దధత్యూరోజ ద్వయముర్వశీతలం, భువోగతేన స్వయముర్వశీతల" మ్మను మాఘయమకము వలనఁ దెలియనగు. నారాయణుని ఊరువులందుఁ బుట్టినది యను నర్థమందును పృషోదరాదులలోఁ జేరుటచే వర్ణము లోపించి హ్రస్వాదితాలవ్యాంతమునగు

కూపమే సాధువు అని గోవిందరాజీయము. ఉరు = అధికం, వష్టి = ప్రకాశత ఇతి ఉర్వశీ-వరకాంతా = మిక్కిలిప్రకాశించునది. పా - ఊర్వశి - నారాయణు తపస్సు చెఱుప నప్సరస్త్రీలు రాఁగా నాయన తన తొడయందు దీనిని బుట్టించెను. దాని సౌందర్యమును జూచి వారు సిగ్గుపడి దానినే తమకు నాయికగా గ్రహించి కొని పోయిరి. ఇది కొన్నాళ్లు పురూరవు భార్యగా నుండెను. దీని కథకే కాళిదాసు విక్రమోర్వశీయ మనుపేర నాటకము వ్రాసెను. దీని చరిత్రము భారతమున ఆది పర్వమందును, విష్ణుపురాణము IV. 6-15 నందును గలదు. భాగవతము ౯-౧౪ నందును గలదు.

తా. పిఱికిదానా? యిప్పుడు లోకమునకో - మగనికో బంధువులకో భయ పడి నన్ను దిరస్కరించుచున్నదానవు. కాని యావల నీవే మన్మథతాపముచే పరితాపపడెదవు. నీవలె పూర్వ మూర్వశి తన్నుఁగోరిన పురూరవుని కాలితోఁ దన్ని యావల నయ్యో యెంతపొరపడితిని. అటువంటివాని పోఁగొట్టుకొంటినే. ఇప్పుడు నాతాప మెవ్వరు తీర్పఁగలరని పశ్చాత్తాప పడలేదా. నీగతి యంతే యగును. రాముఁ డేమో మహాబలపరాక్రమసంపన్నుఁడని చెప్పెదవు. నాగోరికిఁ గూడ సమానుఁడు కాఁడు. నన్ను=లోకము లన్ని హాహా యని యేడ్పించు వానిని నన్ను-దేవతాస్త్రీల గర్భములు పేరు చెప్పినంత మాత్రమున విచ్ఛిత్తిచేయు వానిని నన్ను-పదితలల వానిని నన్నుఁ-గైలాసపర్వతమెత్తిన వానిని నన్ను-కుబేరు నోడించి పుష్పకము హరించినవానిని నన్ను-నింద్రుని బందీలోనుంచిన వానిని నన్ను-బ్రహ్మచే, శివునిచే వరములు నొందినవానిని నన్ను-మూఁడులోకములు జయించిన వానిని నన్ను-నిట్టి నన్నుఁగూడుటకు నీకు సందేహామటవే. నీవై వచ్చి నన్నుఁ బ్రార్థింపవలసి యుండఁగా నేనై వచ్చి వేఁడినఁగూడుదునా వలదా యని యేమో సందేహించెదవా.

తే. నీయదృష్టంబు పండుట ♦ నీరజాక్షి
వచ్చినాఁడను ద్రోవంగ ♦ వలదు నన్నుఁ
బొందుమీ యనఁ గ్రుద్ధ యై ♦ భూమిజాత
పరుషవాక్కులదశకంఠుఁ ♦ బలికె నొంటి. ౮౦౧

అదృష్టంబు = భాగ్యము, నీవు పూర్వజన్మమునఁ జేసిన పుణ్యము ఫలించుటచేత-క్రుద్ధయై = కోపించినదై.

తా. నీ పూర్వపుణ్యము ఫలించుటచే సీతా! నేను వచ్చితిని. కావున నన్ను నిరాకరింపవలదు. నన్ను నిరాకరించుట యన నీ పూర్వపుణ్యమును ననుభవింపక పోవుటయే యని తలఁపుము. కావున నన్నుఁ గూడుము. అని రావణుఁడు

పలుకఁగా నొంటిదాననే పురుషసాహాయ్యము లేనిదాననే. కఠినపుమాటలాడిన వీఁడేమి చేయునో యను భయములేక కోపించినదై సీతాదేవి కఠినములైన మాటల నిట్లనియె.

రాగం వివిక్తా ఇతివర్ధయంతి=ఏకాంతము రాగవృద్ధికిఁ గారణమై యున్నను, సీతాదేవి మహాపతివ్రత కావున నామెకు రాగాభివృద్ధి కాలేదు. ఈవిషయమున నీ వాక్యము లనుసంధింపఁ దగినవి.

సకామం వీక్షితాప్యన్యైః, ప్రియై ర్వాక్యైః ప్రలోభితా।
స్పృష్టావా జనసమ్మర్దే, నవికార ముపైతి యా।
పురుషం సేవతే నాన్యం, మనోవాక్కాయ కర్మభిః।
లోభితాపి పరేణార్థైః, స్సా సతి లోకభూషణా॥
దైన్యేన ప్రార్థితా వాపి, బలేన విధృతాపివా।
వస్త్రాద్యైర్వాసితావాపి, నైవాన్యం భజతే సతీ।
వీక్షితా వీక్షితే నాన్యం, హసితా నహసత్యపి।
భాషితా భాషతేనైవ, సాసాధ్వీ సాధు లక్షణా।
రూప యౌవన యుక్తాపి, గీతవృత్తేపి కోవిదా।
స్వానురూపం నరం దృష్ట్వా, నయాతి వికృతిం సతీ।
సురూపం తరుణం రమ్యం, కామినీనాంచ వల్లభమ్।
యానేచ్ఛతి పరం కాంతం, విజ్ఞేయా సా మహాసతీ।
భుంక్తేభుంక్తేథ యాపత్యౌ, దుఃఖితే దుఃఖితాచ యా।
ముదితే ముదితాత్యర్థం, ప్రోషితే మలినాంబరా।
సుప్తేపశ్చాచ్ఛయా శేతే, పూర్వమేవ ప్రబుధ్యతే।
నాన్యం కామయతే చిత్తే, సావిజ్ఞేయా పతివ్రతా॥

ఇతరపురుషులు తన్ను సకామదృష్టిఁ జూచినను, ఇచ్చకముల నాశగొల్పినను, జనులగుంపులోఁ దాఁకినను, నెవతె వికారము చెందదో యామె పతివ్రత. ఎవతె మనోవాక్కాయముల నైనఁ బరపురుషు సేవింపదో, ఇతరుఁడు ధనమిచ్చెద ననినను నాశపడదో యామె పతివ్రత. ఆమె జనభూషణ మనఁబడును. దీనురాలై యితరులు ప్రార్థించినను బలాత్కారముగ నీడ్చినను, వస్త్రాదులు తెచ్చి యిచ్చినను పతివ్రత యితరుని గామింపదు. ఇతరుఁడు తన్నుఁజూచి నవ్వినను దాను నవ్వదు. తన్ను వాఁడు చూచినను దాను వానిని జూడదు. ఇతరుఁడు పలుక

రించినను పలుకదు. అట్టిది పతివ్రత. సౌందర్యము యౌవనము గలదైనను సంగీతనృత్తములందుఁ బండితురాలైనను తన కనురూపపురుషుని జూచి యెవతె మనస్సున వికారము చెందదో సుందరుఁడు వయస్కుఁడు స్త్రీజనమనోహరుఁడు, ప్రియుఁడు నగు పరపురుషు నెవతె కోరదో యామె మహాపతివ్రత. మగఁడు భుజించెనా తాను భుజించును. మగఁడు దుఃఖించెనా తాను దుఃఖించును. మగఁడు సంతోషించెనా, తా నెక్కువగ సంతోషించును. మగఁడు గ్రామాంతరము పోయెనా మలినవస్త్రము కట్టును. మగఁడు పండుకొనిన తరువాతఁ బండుకొనును. ఆయనకంటె ముందు నిద్రలేచును. ఇట్టిది పతివ్రత.

### సీత రావణు నిందించుట

ఉ. ఏమిర యక్షగుహ్యకగ♦ణేశ్వరుఁ డై మఱి భూతవంద్యుఁ డై
ధీమహితాత్ముఁ డౌ ధనద♦దేవునితమ్ముఁడ వౌచు నా యఘం
బీ మెయిఁ జేయఁ బూనితి వి♦సీ యజితేంద్రియు బుద్ధిహీను నిన్
భూమిపుఁ గాఁగఁ బొంది పొరి♦పోదు రవశ్యము సర్వరాక్షసుల్. ౨౨

యక్ష, గుహ్యక, గణ, ఈశ్వరుఁడు = యక్షులయు, గుహ్యకులయు, సమూహములకు నధిపతి, భూతవంద్యుఁడు=దిక్పాలకుఁడు కావున నందఱిచే నమస్కరింపఁ బడినవాఁడు, ధీమహితాత్ముఁడు = గొప్ప బుద్ధి మనస్సు గలవాఁడు, అఘంబు=పాపము, ఇసీ=ఛీ, అజితేంద్రియున్ = ఇంద్రియముల జయింపనివానిని, బుద్ధిహీనున్ = బుద్ధిలేని వానిని, పొరిపోదురు = చత్తురు. 'తన పొరిపోవునంతకు నుదగ్రతయుం గపటంబుమాన నేర్చునె ధృతరాష్ట్రసూనుఁడు'.— భారతము.

తా. ఏమిరా? దేవజాతులగు యక్షులకు, గుహ్యకులకు నాథుఁడై సర్వభూతవంద్యుఁడైన కుబేరునితమ్ముఁడ వయియు నిట్టిపాపపుఁబనిఁ జేయఁ బూనితివి. ఛీ, సిగ్గులేని వాఁడా! ఇంద్రియజయములేని నిన్ను రాజుగాఁ గలవారగుటచే నీమూలమున రాక్షసు లందఱుఁ జచ్చెదరు.

క. హరిహయుసతిఁ బౌలోమిని, హరియించియు నైన బ్రదుక♦ నగుఁ గా కెట్లోన్
వరబలుఁ డగు రామునిసుందరి నను హరియించి బ్రతుకఁ♦ దరమా నీకున్. ౨౩

హరిహయు = ఇంద్రుని, సతిన్ = భార్యను, పౌలోమిని = పులోముని కూఁతురగు శచీదేవిని, ఎట్లోన్ = ఏదోయొక విధముగనైన.

తా. ఓరీ! యింద్రునిభార్యను శచీదేవిని హరించియైన నేదో యొక విధముగ నెట్లెట్లో బ్రదికిన బ్రతుకవచ్చును గాని రామచంద్రమూర్తిభార్యను హరించియు మరల బ్రతుక నీకు శక్యమా.

మత్తకోకిలము. దుష్టచిత్తుఁడ వజ్రహస్తుని♦తోయజాక్షిఁ బులోమజన్
భ్రష్టశీలుఁడ! యాహరించి మ♦నంగవచ్చును గాక యు
త్కృష్టతేజుఁడు రామచంద్రుని♦యీశ్వరిన్ ననుబోఁటి నీ
కష్టవాక్యము లాడి మోక్షము♦ కానవున్ సుధఁ ద్రావినన్. ౧౦౪

వజ్రహస్తుని = ఇంద్రునియొక్క, తోయజాక్షిని = స్త్రీని, భ్రష్టశీలుఁడ= పతితుల నడవడి గలవాఁడా, మనంగవచ్చును = బ్రదుకవచ్చును, ననుబోఁటిన్ = నావంటిదానిని, అనఁగా నన్ను బోలినదానిని హరించియు బ్రతుకలేవు. ఇఁక నన్ను హరించిన నీగతి చెప్పనేల? అశ్లీలనివారణార్థము నన్ను అనక నావంటి యనెనని గోవిందరాజీయము. కష్టవాక్యము లాడి = నీచపుమాటలు పలికి, నీచపుమాటలాడుటచేతనే చెడెదవు. సుధన్ = అమృతమును, మోక్షము = విడుదల, కానవున్, పొందనే పొందవు.

తా. చెప్పినమాటయే కోపాతిశయమున మరలఁ జెప్పుచున్నది. ఓరి! చెడ్డమనస్సు గలవాఁడా! యింద్రునిభార్యను హరించియైన బ్రతుక వచ్చును గాని రామచంద్రునిభార్య నగు నన్నుఁ బోలిన దాని నీచవాక్యము లాడుటచేతనే నీ వమృతముఁ ద్రావినను నీకు మోక్షము లేదు. ఇఁక హరించిన నేమగుదువో? మోక్షము మృత్యువువలన నని శేషము. మృత్యువునుండి నీకు విడుదల లేదు. మిక్కిలి మలినమైన యంతఃకరణము కలవాఁడ వగుటచే జ్ఞానముచేతనే కలుగ వలసిన మోక్షము నీకు లేదని భావము. అని తిలక వ్యాఖ్య.

## ౪౯-వ సర్గము.

క. అని పలుకుసీతవాక్కులు, విని దశకంఠుండు కోప♦వివశుం డగుచుం
దనకరములఁ జఱచుచు ననె, వినవే నావిక్రమము వివేకవిహీనా. ౧౦౫

కోపవివశుండు = కోపముచే పరవశుఁడైనవాఁడు, చఱచుచున్ = తట్టుచు, వివేకవిహీనా = ఇది తగును ఇది తగ దను తెలివి లేనిదానా.

తా. సీతాదేవి యాప్రకారము చెప్పఁగా విని రావణుఁడు కోపముచే దేహము తెలియనివాఁడై భుజము లప్పళించుచు నిట్లనియె. బుద్ధిలేనిదానా! నా పరాక్రమము చెప్పెద వినుము.

ఉ. ఎత్తుదునో ధరాతలము♦ నేపునఁ జేతులఁ బట్టి మింటికిన్
మొత్తుదునో రణంబునను♦ మొత్తులు పెట్టఁగ మృత్యుదేవతన్
గుత్తుదునో హిమాచలము♦ రూక్షత బ్రద్దలువాఱ సూర్యునే
నొత్తుదునో శరంబుల మ♦హోదధినీరముఁ ద్రావి వైతునో. ౧౦౬

హుంకృతః = కోపమున, రుత్తుదునో = కొట్టుదునా.

తా. నేనాకాశమున నిలఁబడి భూమిని రెండుచేతులఁ బట్టి పైకెత్తుదునా? మృత్యుదేవత మొట్టో యని యేడుచునట్లు యుద్ధమందు మొత్తుదునా? హిమవత్పర్వతమును బ్రద్దలగునట్లు కొట్టుదునా? సూర్యుని నేలఁబడ నొత్తుదునా? సముద్రములోని నీళ్లన్ని త్రావుదునా?

క. వెంబరవిత్తా! కామసుఖంబులఁ గలిగించునన్నుఁ ♦ గామాకృతి నా
థుం బరికింపుము యనిచూ, పెం బడఁతికిఁ దనదుహావు ♦ భీతిం గొలుపన్.

వెంబరవిత్తా = మూఢురాలా! కామాకృతిః = మన్మథుని యాకారము గలవానిని, కోరినస్వరూప మెత్తఁగలవానిని.

తా. ఓసీ మూఢురాలా! కోరినరూపముల నెత్తఁగలిగి మన్మథునివంటి నాకారముగల నన్ను, సర్వసుఖములఁ గలిగించు నన్ను, నాథుని నిజమైన స్వరూపముఁ జూడుము అని యామెను భయపెట్టుటకై దన నిజస్వరూపమును జూపించెను.

శా. మాయాభిక్షుకరూపము న్విడిచి దు♦ర్మార్గుండు పంక్త్యాస్య మా
స్వీయాకారము సూర్యకల్పదహనో♦ద్వేలంబు సంతప్తగాం
గేయోదంచితకుండలంబును క్రుధా♦కీర్ణాక్షము న్మేచక
చ్ఛాయాభ్రప్రతిమానముః శరశరా♦సస్ఫీతకాలాభమున్. ౧౦౦

మాయాభిక్షుకరూపము = దొంగసన్న్యాసి యాకారము, పంక్త్యాస్యము= పదితలలుగలది, స్వీయాకారము=తనరూపమును, సూర్యకల్పదహన ఉద్వేలంబు= ప్రళయకాలసూర్యునివలె నగ్నివలె మితిమీఱి వెలుఁగునది, సంతప్తగాంగేయ = పుటము వేసిన బంగారుచే, ఉదంచిత=ప్రకాశించు, కుండలంబును=కుండలములుగలది, క్రుధా = కోపముచే, ఆకీర్ణ = వ్యాపించిన, అక్షము=కన్నులుగలది. మేచక= నల్లని, ఛాయా = కాంతిగల, అభ్ర = మేఘముతో, ప్రతిమానము = సమానము, శరశరాసస్ఫీత=బాణములచేతను వింటిచేతను ప్రకాశించునదియు, కాలాభముః = యమునితో సమానమైనదియు నగు తనరూపము చూపించెను.

తా. దొంగసన్న్యాసివేషము వదలి యాదుష్టుఁడు పదితలలు గలదియు ప్రళయకాలమందలి సూర్యాగ్నులవలె మితిమించిన తేజముగలదానిని పుటమువేసిన బంగారుకుండలంబులు గలదియు కోపయుక్తమైనదియు నల్లనిమేఘముతో సమానమైనదియు విల్లుబాణములు కలదియుఁ గాలునితో సమానమైనదగు తనస్వరూపమును చూపించెను.

క. రక్తాంబరధరుఁడై సం,రక్తాక్షుం డయి నిదాఘ♦రవితేజస్సం
సక్తుం డిట్లనియెం గ్రూ,రోక్తుల దైత్యేశ్వరుఁడు స♦ముజ్జృంభితుఁడై. ౧౧

రక్తాంబరధరుఁడై = ఎఱ్ఱనివస్త్రము ధరించినవాఁడై తమోగుణప్రధానమగు క్రూరస్వభావముగలవారు రక్తవర్ణముగల వస్త్రములు, పూలు లోనైనవి ధరింతురు. వీఁడట్టివాఁడు కావుటను సీతాదేవిని భయపెట్టుటకును వాఁడిట్టివస్త్రములు ధరించెను. సంరక్తాక్షుండయి=మిగుల నెఱ్ఱనికన్నులు గలవాఁడై, నిదాఘ= గ్రీష్మఋతువుసందలి, రవితేజస్ = సూర్యకాంతితో, సంసక్తుఁడు=కూడినవాఁడు, సముజ్జృంభితుఁడై = మిగుల దేహము పెంచినవాఁడై.

తా. ఎఱ్ఱనివస్త్రములు ధరించినవాఁడై, ఎఱ్ఱనికన్నులు గలవాఁడై యెండకాలమందలి సూర్యుని తేజస్సు వేఁడిమి కలవాఁడై విజృంభించి కఠినవాక్యముల రావణుఁడు సీతాదేవితో నిట్లనియెను.

రావణుఁడు సీతను బలాత్కారముగ నెత్తికొని పోవుట.

మ. వినవే సీత భవత్సమానవిభునిన్ ♦ విశ్వత్రయీఖ్యాతునిన్
గనఁగాఁ గోరెదవేని నన్గలయుమీ ♦ కల్యాణి! శ్లాఘ్యుండ నే
ననురక్తుండను నీకు నప్రియముఁ జే♦యం బోవ నెన్నండు నా
మనుజు న్వీడుము గూడు నన్నుదనుజున్ ♦ మాంగళ్యసంధాత్రివై. ౧౧

భవత్సమానవిభునిన్ = నీకుసమానుఁడైన భర్తను, విశ్వత్రయీఖ్యాతునిన్ = ముల్లోకములందుఁ బ్రసిద్ధికెక్కినవానిని, శ్లాఘ్యుండన్=పొగడ్తగలవాఁడ, అనురక్తుండను = నీయందనురాగము గలవాఁడను, మాంగళ్యసంధాత్రివై = శుభముగూర్చుదానవై.

తా. వినవే నామాట సీతా నీమనస్సున నీయోగ్యతకుఁదగిన పెనిమిటిని మూఁడులోకములందుఁ బ్రసిద్ధికెక్కినవానిని పొందఁగోరెదవా? కల్యాణీ నన్నుఁ గూడుము. నేనట్టి పొగడ్తగన్నవాఁడను. నీయందుఁ బ్రేమగలవాఁడను. నీకు సమ్మతముగానిది యెన్నఁడు చేయను. నామాట విని యామనుజుని వదలి దనుజుఁడనైన నన్నుఁగూడి నాకు శుభము గూర్పుము.

ఉ. ఏమని మోహ ముంచితివె ♦ యేమిగుణంబులఁ జూచి మెచ్చితే
యోమతిహీనురాల! యొక♦యుగ్మలిమాటను బట్టి రాజ్యమున్
భామ సుహృజ్జనంబులను ♦ బాయుచు వ్యాళనిషేవితాటవిన్
దీమస మేది క్రుమ్మరెడి♦దీనునిఁ బండితమానినీమణీ. ౧౨

వ్యాళనిషేవితాటవిన్ - వ్యాళ = దుష్టసర్పములచేతను దుష్టగజములచేతను, దుష్టమృగములచేతను, దుష్టులగు రాక్షసులచేతను, నిషేవిత = మిక్కిలి యాశ్రయింపఁబడిన, అటవిన్ = అడవియందు. వ్యాళస్సర్పే దుష్టగజే శ్వాపదే

నా శతే త్రిషు॥ నా. ర. దీమసమేది = ధైర్యములేక, ఉగ్మలి = స్త్రీ, పండిత మానిని = పండితురాలనని తలఁచుకొనుదానా.

తా. ఓసి బుద్ధిలేనిదానా! నీవు తెలిసినదాననని తలఁచుకొనుచున్నావుగాని నీకు వివేకములేదు. నీకు వివేకముండెనేని యొకయాఁడుదాని మాటప్రకారము రాజ్యమును స్నేహితులను బంధువులను అందఱనువదలి క్రూరములైన సర్పములు, ఏనుఁగులు, మృగములు, క్రూరరాక్షసులు సంచారముచేయు నడవియందు సంచరించుచు శత్రువుల నెదిరించి రాజ్యము సంపాదించుకొను ధైర్యములేని దరిద్రుని నేమని మోహించితివి? ఏమిగుణములనుజూచి మెచ్చితివే.

క. అని ప్రియవాదిని సత్ప్రియఁ, గనలున దుష్టుండు పల్కి ♦ కామవివశుఁడై
జనకజను బుధుఁడు రోహిణి, వినువీదిని బట్టునట్లు ♦ వెసఁ బట్టుకొనెన్. ౧౧౭

అని= ఈప్రకారముచెప్పి, ప్రియవాదిని= స్నేహముతోఁగూడిన యిష్టవాక్యములు చెప్పుదానిని, ప్రియశబ్దమునకు స్నేహము, సంతోషమను నర్థమునఁబ్రయోగములుగలవు. స్నేహభావముతో సంతోషము గలిగించువాక్యములు చెప్పుదానిని, సత్ + ప్రియాఀ = సజ్జనులకు నిష్టమైనదానిని, కామవివశుఁడై = కామముచే దేహము తెలియనివాఁడై, ఇట్లని రావణునిభావమును వాల్మీకి వెల్లడించెను. వినువీదిని = ఆకాశమున, బుధుఁడు = చంద్రునికుమారుఁడు, రోహిణి = చంద్రుని భార్య అగుటచే రావణుఁడు సీతను బట్టుట కుమారుఁడు కాముకుఁడై తల్లిని బట్టుకొనుటవంటి మహాపాపకార్యము అని కవి యభిప్రాయము.

సీతాదేవి 'శీతోభవ!' చల్లగాఁ గమ్మనఁగానే యగ్ని హనుమంతుని విషయమునఁ జల్లనయ్యెఁగదా. ఇప్పుడు తనవిషయమున రావణాసురు నేల హతోభవ = చావుము అనలేదు.

i. ఒకరికి మేలుచేయుటచేఁ దపస్సు వృద్ధియగును. కీడు చేయుటచే క్షీణించును.

ii. తనరక్షాభారము రామచంద్రమూర్తిపై నైచి కేవల పరతంత్రయై యున్నది. ఆయన నిన్ను నీవు రక్షించుకొనుమని యాజ్ఞ యీయలేదు. ఆకారణమున దన్నుఁదాను రక్షించుకొనుట స్వాతంత్ర్యము వహించినట్లైన స్వరూపవిరుద్ధమగును.

iii. లంకకుఁబోయి రావణు సమూలము నాశము చేయవలయును నని కదా యామె సంకల్పము.

తా. ఈప్రకారమయ్యో వీఁడు చెడిపోవునే యని స్నేహభావముచేఁ జెప్పుచున్న దానిని సజ్జనులకు నిష్టమైనదై సంతోషము గలిగించు దానిని, కోపము

త్రోడఁబలికి కామముచేఁ బరవశుఁడై బుధుఁ డాకాశమునఁ దనతల్లియగు రోహిణిని బట్టునట్లు తర్వాగాఁ బట్టుకొనెను.

ఈసమయమున సీతాదేవి మూర్ఛపోయి యుండినట్లు 'నే వివశగ వ్రాలినచో నావపు వతఁడంటెఁగాని నాస్మమతిఁ గాదు' (యుద్ధ ౨౬-౧౦) 'రామునిఁ దప్ప నింక నెవ్వరిని స్పృశింప నొల్ల, దశవక్త్రుఁడు. దాఁకఁడె నిన్ను నంటివా? పరవశురాల దుర్బలను బ్రాపునులేద, యనాథ నొంటి' నను (సుందర ౯-౧౧) సీతాదేవి వాక్యములచే నెఱుఁగనగు. మఱియు నగ్నిహోత్రుఁడును అస్వాతంత్ర్యనియే చెప్పెను (యుద్ధ    ) ఈ కాండమున ౮-౨౮ వ పద్యముఁ జూడుఁడు. మూర్ఛపోయి పడియుండిన కారణముననే తొడలక్రిందఁ జేయివేయఁ గలిగెను. కూర్చుండియుండినచోఁ దొడలక్రిందఁ జేయివేయుటకుఁగాని తొడలమీఁదఁ జెయివేసి పట్టుకొనుటకుఁ గాని సాధ్యపడదు. సీతాదేవి యసామాన్యబలిష్ఠురాలు. మనోబలమం దెంత యుత్తమురాలో దేహబలమం దంత యుత్తమురాలు – అట్టిదని తెలిసిగదా యీమెకుఁ దగినవరుఁడు బలిష్ఠుఁడు కావలెనని జనకుఁడు వీర్యశుల్క యని చాటించెను. స్మృతిగలిగి యున్నప్పుడు దాఁకి యుండినచో ద్రౌపదిచే కీచకునివలె రావణుఁడు మూఁడు పొర్లిగింతలు పెట్టియుండును. రావణుఁడు ఇతరులవిషయమున దుష్టాత్ముఁడైనను గామమోహితుఁడైనను సీతా విషయమునఁ గాఁడు. కావుననే బుధుఁడు తనతల్లిని రోహిణిని బూజార్థము గ్రహించినట్లె సీతను రావణుఁడు పూజార్థమై గ్రహించెను. తనయింట నుంచుకొని యిష్టదేవతను బూజించినట్లు పూజించుటకై గ్రహించెనని భావము. ఓయీ? నలకూబర వేదవత్యాదులశాప ముండఁగా నెట్లు బలత్కారముగ పరదారను దాఁకెను. అనిన సత్యము రావణుఁడు సీతను సాక్షాత్తుగాఁ దాఁకలేదు. మోఁకాళ్లయు తలవెండ్రుకలయు నీడను మాత్రమే గ్రహించెను. రాక్షసులకు ఛాయాగ్రహణశక్తి గలదు.

ఛాయాగ్రాహిత్వ మప్యస్తి సర్వవిద్యా విశారదే
కేశచ్ఛాయాం పరామృశ్య జానుచ్ఛాయాం తథైవచ
గృహిత్వా జానకీం హృష్టో లంకాం ప్రాయాత్సరావణః. అని స్కాందమందుఁ గలదని మహేశ్వరతీర్థయము.

ప్రియవాదిని = రావణునివిషయమునఁగాక యితరులవిషయమున నని శేషము. సీతాదేవి వాని నాక్షణమే శపించి నాశముచేయఁ గలదయ్యును సమూలము నాశముచేసెదనని వేదవతిగా నున్నప్పుడు సంకల్పించుటచేతను రాముఁడును ఋషుల దేవతల యెదుట నట్లు ప్రతిజ్ఞ చేసియుండుటను దాని నిర్వహించుకొఱకు

శపింపదయ్యెను. తొడ లనఁగాఁ గాళ్లు-కాళ్లు పట్టుకొని లంకకు రమ్మని ప్రార్థించె నని భావమని తిలకవ్యాఖ్య.

క. సీతాశిరోజముల డా,చేతన్ వలచేతఁ దొడలు ♦ శీఘ్రము కొని మా
యాతతఖరయుత మగుతే, రాతలమునఁ దోఁపఁగా ద♦శాస్యం డంతన్.

శిరోజములన్=తలవెండ్రుకలను, డాచేతన్=ఎడమచేతితో, వలచేతన్=కుడిచేతితో, మాయాతతఖరయుతము = మాయాశక్తిచే నింతవఱకుఁ గానరాక యిపుడు కానవచ్చి కంచరగాడిదలు కట్టినది, ఆతలమునన్ = ఆశ్రమముముందు.

తా. ఎడమచేత సీతాదేవి తలవెండ్రుకలను కుడిచేతఁ దొడలను శీఘ్రముగఁ బట్టుకొని మాయారథ మాచోటికి రాఁగా రావణాసురుఁడు

సీతాదేవిని రావణాసురుఁడు ప్రత్యక్షముగఁ దాఁకెనా లేదా యను విషయము విమర్శింపవలసి యున్నది.

వాల్మీకిరామాయణము స్పష్టముగా రావణుఁడు సీతాదేవిని దాఁకి తీసికొని పోయెనని చెప్పుచున్నది. ఇచ్చట, ౮౧౨, ౮౧౩, ౮౧౪ పద్యములందే గాక ౮౮౧వ పద్యమున, 'మదవతి తీఁగెనాఁబెనఁగ మానవభోజియు వీడు వీడుమం/చదలిచి జంకెనల్వలికి యట్టె సతీమణి కేశపాశముల్ వదలకపట్టి యీడ్చె'నని యున్నది.

౮౮౮ అసురనాథాంకగ ౮౯౦ రావణాంక సంకలిత సతీముఖంబు, అని యీ విధముగఁ బెక్కు ప్రయోగములున్నవి. అయినను దుష్టుఁడైన రావణుఁడు సీతను దాఁకుట యనునది సహింపని భక్తులు భక్త్యతిశయముచేఁ గొన్నివింతలు వ్రాసియున్నారు.

౧. కొందఱు రామచంద్రమూర్తి మాయామృగమువెంటఁ బోవునపుడు నిజమైన సీతను దాఁచి మాయాసీతను నాశ్రమమం దుంచి పోయెననియు, ఈ మాయాసీతను రావణుఁడు గ్రహించెననియు రావణవధానంతరము మాయాసీత యగ్నిలోఁ బ్రవేశించి మాయమయ్యెననియు నిజమైన సీత యగ్నిలోనుండి వెలువడి వచ్చెననియు నందురు.

౨. మఱికొందఱు లక్ష్మణుఁడు రామునిమిత్తమై పోవుచు సీతాదేవిచుట్టు గిఱిగీఁచి దీనిని నీవు దాఁటి రావలదని చెప్పినట్టును రావణుఁ డాపెల్లను లేవఁదీసికొనిపోయెనే కాని సీతను దాఁకలేదనియు నందురు.

3. మాహేశ్వరతీర్థీయమున నున్నట్టు సీతాదేవివెండ్రుకల మోఁకాళ్ల చాయ గ్రహించె నందురు.

౪. తతో విదార్య ధరణీం, నఖైరుద్ధృత్య బాహుభిః।
తోలయిత్వా రథే క్షిప్త్వా.యయౌ క్షిప్రం విహాయసా॥ ఆధ్యాత్మ

ఇవన్నియు సద్భావముతో భక్తితో వ్రాయఁబడినవే కాని సత్య చరిత్రములు గావు. వాల్మీకిరామాయణ మొక్కటియే యున్నదున్నట్లు వ్రాయఁబడినది.

వ్యవసాయాత్మికాబుద్ధి రేకేహ కురునందన। బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥ అన్నట్లు నిశ్చయవిషయ మొకవిధము. అది తప్పించి చెప్పఁ బూనినఁ బలువురు పలుపలు విధములఁ జెప్పుదురు.

ఈచిత్రకథలు కల్పింపఁగారణమేమి?

(i) రావణాసురుఁడు తాఁకుటచే సీతాపాతివ్రత్యమునకు హానియనియా, (ii) అట్టి పతివ్రతను దాఁకి రావణుఁడు బ్రదుకుటచే రావణుతపోబలమునకంటె సీతామహిమ తక్కువ యనియా? ఈ రెండు కారణములు సరియైనవి గావు. రావణాసురుఁడు తాఁకుటచే సీతాపాతివ్రత్యమునకు హాని కలుగునేని యామెపాతివ్రత్యము విరాధుఁడు తాఁకియెత్తికొని పోయిననాఁడే నాశమయి యుండవలె. ఏలన రావణుఁ డేదుష్టభావముతో సీతను హరించెనో యాదుష్టభావముతోనే విరాధుఁడు హరించెను. ఆరణ్య ౨౨-వ పద్యముఁ జూడుఁడు. 'యావనితను నాదు పెండ్లముగ వారకకైకొనువాఁడ నమ్మీఁడీ' యని వాఁడును జానకిని యంకతలమునఁ జేర్చినవాఁడేకదా. అప్పుడు పోని పాతివ్రత్య మిప్పు డెట్లు పోయెను? సీతకు మతిమాలెనా? స్త్రీలకుఁ బాతివ్రత్యహాని వారి మనోవికారముచేఁ గలుగునా? ఇతరుల సంకల్పముఁ బట్టి కలుగునా? లేక యే పురుషుఁడైనను దాఁకినంతమాత్రముననే పాతివ్రత్యము చెడునా? ఏ పురుషుఁడైనను దాఁకుటచేతనే పాతివ్రత్యమునకు హానికలుగునేని కొడుకులను దమ్ములను దాఁకు స్త్రీలు పతివ్రతలు గారా? సీత దశరథునిఁ దాఁకెను గదా. (అయోధ్య) అంతతో నామెపాతివ్రత్యము చెడెనా? స్త్రీ కామవికారము నొందదేని పరపురుషులు కామదృష్టిఁ జూచినను, దాఁకినను, దమయంతికివలె, ద్రౌపదికివలె, పాతివ్రత్యమునకు హాని లేదు. అట్టులే పురుషులమనస్సు గామవికారము నొందదేని నగ్నస్త్రీలఁ జూచినను, దాఁకినను దోషము లేదు. శుక భీష్మ హనుమంతులు సాక్షులు. సీతాదేవియందుఁ గామ వికారము లేదు గావున విరాధ రావణులు దాఁకినను దానివలన నామెకు శీలహాని లేదు. కీచకుఁడు దాఁకిన ద్రౌపదికి శీలహాని కలిగెనా? సైంధవుఁడు దాఁకుటచే నామె పాతివ్రత్యమునకు హాని కలిగెనా? కావున రావణుఁడు తాఁకినంతమాత్రమున సీతకొక లోపము వచ్చునని తలఁచుటే దోషము. కావున నీ వింత కల్పనములు నిరాధారములు. ఈ విషయమునఁ గొన్ని సందేహము లీవ్యాఖ్యాతను బీడించుచున్నవి.

౧. రావణుఁ డెత్తికొని పోయి యశోకవనమం దుంచి బాధించునది మాయాసీత నగునేని లోక మేల సీతనిమిత్తమె జాలిపడుచున్నది? ఇంద్రజిత్తు కల్పించిన మాయాసీతకై రాముఁడు వానరులు నేడువలేదా యందు రేమో? ఎంతవఱకు? సత్యము తెలియకుండువఱకు. ఈకల్పకులు సత్యము బయటఁబెట్టిరి కదా? ఇప్పటి కేల లోకము వగచుచున్నది.

౨. నీ వధకు నేను గారణ మయ్యెదనని వేదవతి చెప్పెను గదా? ఆమె యెందో డాఁగియుండెనేని యామెమాట వ్యర్థమైనట్లే కదా.

౩. ఆమె యిట్టు డాఁగఁ గారణమేమి కలిగెను?

౪. గడ్డతోడ సీతాదేవి యెత్తికొనిపోఁబడెనేని జటాయురావణయుద్ధ మందు రథముతోడ సర్వము హతమయ్యెఁ గదా? ఇప్పు డాగడ్డ పోయెనా యుండెనా?

౫. సీతాదేవిఛాయను గ్రహించి రావణుఁడు పోయెనేని సీతాదేవి యెందుండెను? రావణుఁ డాకాశమునఁ బోవుచుండిన సీతాదేవి నేలమీఁదఁ బోవుచుండెనా? సింహిక హనుమంతునిఛాయను సముద్రములో గ్రహింపఁగా హనుమంతుఁ డాకాశమున నుండెను గదా? రావణుఁ డాకాశమునఁ బోవునపుఁడు సీతాదేవి యెందుఁ బోవుచుండెను?

౬. రావణుఁడు చంకలో నిఱికించికొనినది సీతనా సీతనీడనా? నీడను చంకలో నిఱికించుకొనిపోవు టెట్లు?

౭. సీత భూమిపై నుండిన నీడ యాకాశమున నెట్లుండఁ గలదు?

౮. మాయా సీతను కల్పించి దాని నెత్తుకొని పోవునట్లు మోసముచేసి తనభార్య పోయినట్లు దొంగయేడ్పు యేడ్చి యానెపమున వాని నిర్వంశముగఁ జంపిన రామచంద్రుఁ డెట్లు ధర్మాత్ముఁడు? రామ రావణ మాయలలో ఘోర మైనది యేది?

౯. మాయచేఁ (నీడ) గల్పించిన మూర్తియందలి సొమ్ములు వేఱుగఁ దీయ సాధ్యపడునా? అట్లు తీసెనేని దీర్ఘకాలము సత్యముగ నిత్యముగ నిలుచునా?

౧౦. (నీడ) మాయాసీతాపాతివ్రత్యమహిమచేతనా హనుమంతుని తోఁక కాలకుండుట.

౧౧. సీతాదేవిని రామచంద్రున కర్పించుచు నగ్నిహోత్రుఁడు 'నిన్నెడఁ బాసి దీనయయి నిర్జరసీమను నస్వతంత్రయై। యున్న సుశీల నీమె దురితోగ్ర చరిత్రుఁడు బల్మిఁ దెచ్చెనుం। చె న్నిజగేహమందు నటు చేసి ననుఁ నినుఁ జింత సేయుచుం। నిన్నె భజించెఁజూ వికృతనేత్రలు రక్కస లెల్ల గావఁగ; గీ. మోస గించెను -దా నెంతొ యాసముంచె। ధిక్కరించెను బెదరించెఁ గ్రక్కసించె। నేమి

చేసిన లక్షింప దీమె యతని' నను అగ్నిహోత్రుని యీవాక్యములు మాయాసీత యందుఁ గదా నన్వయింపవలె? వాస్తవ సీతయం దెట్లు సార్థకములు? అగ్నిహోత్రుఁడు సమర్పించినది వాస్తవ సీతనే కదా? ఒకతెను జూపించి మఱియొకతె వృత్తాంత మెట్లు చెప్పెను? ఇది బొంకే కదా?

౧౨. సీతాదేవిని విడిచి మారీచుని వెంట రామమూర్తి పోయినపుడు రావణుఁడు వచ్చినపుడు అవల వాఁ డెత్తుకొనిపోయినపుడు హనుమంతుఁడు చూచినపుడు సీత పచ్చనిచీరె కట్టియుండెను. వాస్తవసీతవంటిదే కదా మాయాసీతయును? అగ్నిహోత్రునిలో బయలు వెడలినపుడు విభీషణుఁ డిచ్చిన యెఱ్ఱచీరతో సొమ్ములతో వెలువడెను. వాస్తవసీత కివి యెందుండి వచ్చెను? ఆమె ధరించిన సొమ్ములు చీర యేమాయెను?

౧౩. హనుమంతుఁడు సంభాషించినది యుంగర మిచ్చినది దొంగ సీతకా? రాక్షస స్త్రీల కభయ మిచ్చినది, హనుమంతుని వలన రక్షించినది దొంగ సీతయా? దొంగ సీత యిచ్చిన చూడామణి మాయయే కదా?

౧౪. జటాయువు రావణుఁడు సీతను హరించిన ముహూర్తము వానిని నాశము చేయునది యని చెప్పెను గదా. ఇట్టి ఫలము యథార్థవస్తువుల విషయమా? నీడలను మాయా వస్తువులను హరించిన నిట్టి ఫలము కలుగునా? ఇట్టిది శాస్త్రమం దెందైన నున్నదా?

ఒకవేళ ఛాయాదేవిని దృష్టాంతముగఁ జెప్పెదరేమో? ఛాయాదేవి హుళక్కి రూపము గాదు. సత్యమూర్తియే. బిడ్డలు గనెను గదా? ఉత్తనీడలు బిడ్డలఁ గనునా? సూర్యునిభార్య స్వశక్తిచేఁ దనవంటిదానిని గల్పించి సూర్యునొద్దనుంచి తాను బోయెను.

ఇంత యేల? రావణుఁడు హరించినది మాయాసీత ననుటకు వాల్మీకిరామాయణమునఁ బ్రమాణవాక్యము శూన్యము.

క. దారుణబిభీషికల నా, క్రూరుఁడు బెదరించి యెత్తికొనియంకమునన్
జేరిచె శతాంగమునఁ గమ,లారమణీరూపిణిన్ బలాత్కారమునన్.　　౭౧౪

దారుణబిభీషికలన్ = భయంకరములైన బెదరింపు మాటలచేత, అంకమునన్ = ఒడియందు, శతాంగమునన్ = తేరియందు, కమలారమణీరూపిణిన్ = లక్ష్మీస్వరూపము గలదానిని.

తా. ఆ క్రూరుఁడు భయంకరములైన బెదరింపు మాటలచే బెదరించి బలాత్కారముగ నొడిలో నెత్తుకొనున ట్లెత్తుకొని రథమును జేర్చెను.

క. మృత్యుప్రాయుని భృశతీ, క్ష్ణాత్యంతస్ఫురితదంష్ట్రు ♦ నద్రిసమానున్
దైత్యునిఁ గని వనదేవత, లత్యర్థభయంబునన్ వ♦నాళులఁ బాఱెన్. ౧౧౫

మృత్యుప్రాయుని = మృత్యువువంటి వానిని, భృశ...దంష్ట్రున్ = మిక్కిలి క్రూరములై విశేషించి ప్రకాశించు కోఱలు గలవానిని, అద్రిసమానునిన్ = పర్వతముతో సముఁడగు వానిని, అత్యర్థభయంబునన్ = మిగుల భయముతో, వనాళులన్ = అడవుల వెంట, పాఱెన్ = పరువెత్తెను.

తా. యమునితో సముఁడై మిగుల తీక్ష్ణములై ప్రకాశించు కోఱలుగల వానిని, పర్వతమంత దేహము గలవానిని నా రాక్షసుని జూచి వనదేవతలు భయపడి యడవులలోఁబడి పరువెత్తిరి.

క. రావణగృహీత యార్తా, రావంబున నఱచె రామ ♦ రామా యని యా
శీవిషసతి యనఁ బొరలెడి, యావనిత నణంచి యెగసె ♦ నసురుఁడు దివికిన్.

ఆశీవిషసతి = ఆఁడుపాము, అణంచి = అడఁగఁబట్టి, దివికిన్ = ఆకాశమునకు.

తా. రావణుచేఁ బట్టుకొనఁబడిన సీతాదేవి దుఃఖస్వరముతో రామా రామా యని యేడ్చుచు నాఁడు పామువలెఁ బొరలుచుండఁగాఁ గదలకుండ నణఁగఁ బట్టి యాకాశమున కెగసెను.

క. ఉప్పరవీదిని నీగతిఁ, దెప్పునఁ జను తేరిమీఁదఁ ♦ దీవ్రాతుర యై
యప్పడఁతి వేఁదు అనఁగా, నిప్పగిదిని నేడ్చె భ్రాంత♦హృదయయ పోలెన్.

ఉప్పరవీదిని = ఆకాశమార్గమున, తెప్పునన్ = త్వరగా, తీవ్రాతురయై = క్రూరమైన బాధపడుచున్నదై, వేఁదుఱు = పిచ్చిపట్టినది, భ్రాంతహృదయయ పోలెన్ = భ్రమతచెందిన మనస్సుగల దానివలెనే.

తా. ఈ విధముగ నాకాశమున శీఘ్రముగఁ జను తేరిమీఁద మిగుల బాధ గలదై యా సీతాదేవి పిచ్చిపట్టినదో యన్నట్లు భ్రమచెందిన దానివలెనే యిట్లు లేడ్చెను.

## సీత రామలక్ష్మణులఁ బేర్కొని యేడ్చుట.

క. హా లక్ష్మణ గురుపదసే, వాలోలా యీరసమునఁ ♦ బాపాత్ముం డ
య్యో లావున నను ముచ్చిలి, వాలాయము చనెడి నెఱుఁగ♦వా భూరిభుజా.

గురుపదసేవాలోలా = పెద్దల (అన్న) పాదముల సేవించుటయం దాశగల వాఁడా, ఈరసమునన్ = ఈర్ష్యచేత, ఖరాసురుని జంపినార మను నీర్ష్యచేత, లావునన్ = బలవంతముగ, ముచ్చిలి = దొంగిలి, వాలాయము = అడ్డములేక, భూరిభుజ = గొప్పభుజములు (బలము) గలవాఁడా.

శ్రీరామచంద్రమూర్తి చాలదూరమున నుండుననియు, వెనుకఁ బోయిన వాఁడు కావున లక్ష్మణుఁడు సమీపమందే యుండుననియుఁ దలఁచి ముందు లక్ష్మణునిపేర బఱచుచున్నది.

తా. అయ్యో లక్ష్మణా! పెద్దల పాదసేవచేయుటయందు దాసక్తి గలవాఁడా! మీరు ఖరాదులఁ జంపితి రను నీసుచేత నీపాపాత్ముఁడు నన్ను బలవంతముగా దొంగిలి యడ్డములేక పోవుచున్నాఁడు, మహాభుజబలము గలవాఁడా! ఇది నీకుఁ దెలియలేదా?

క. జీవితమును సుఖ మర్థముఁ, గేవలధర్మార్థముగను ♦ గీడ్పఱిచిననీ
వీవిధి నధర్మగతిఁ గొని,పోవఁగ నన్నసుర కావ♦వో రఘురామా. ౨౫

జీవితమును = బ్రదుకు, కేవలధర్మార్థముగను = ఒకధర్మమునిమిత్తమే, కీడ్పఱిచిన = వదలుకొనిన నాలుగవ పాదమున ప్లుతయతి.

తా. నీ బ్రదుకు, సుఖము, ధనము కేవల మాశ్రితరక్షణార్థముగ వదలిపెట్టిన నీవు రామచంద్రా! నీ యాశ్రితురాలనగు నన్ను వీఁడు ధర్మము తప్పి తీసికొని పోవుట చూడలేదా?

క. అవినీతు లైనదుర్జన,నివహంబుల కెప్పుడున్ వి♦నేతుఁడ వయ్యున్
బావరునఁ బాపముఁ జేసెడి,యవినీతు దశాస్యు నేల ♦ యణఁపవు రామా.

అవినీతులు = దుష్టులు, నివహంబులకు=సమూహములకు, వినేతుఁడవు = శిక్షకుఁడవు, పావరునన్ = గర్వముచే, అవినీతు = దుర్మార్గుని.

తా. రామా! న్యాయము తప్పిచరించు దుష్టుల సమూహముల శిక్షించువాఁడ వయ్యు గర్వమున నన్ను దొంగిలించుట యను పాపముచేసిన యీదుష్టుని రావణుని నేల యణఁపవు?

క. పాపులఁ బాపఫలంబులు, ప్రాపింపవు తోడుతోన ♦ పరిపక్వము లై
ప్రాపించుఁ గాలగతి నో,పాపీ యసురేంద్ర పండు♦పైరులమాడ్కిన్. ౨౭

తా. పాపాత్ముఁడా, రావణా! పాపాత్ములుచేయు పాపముల ఫలములు వెంటనే యనుభవమునకు రావు. కొంతకాలమైన తరువాత పక్వములై ఫలమిచ్చును. విత్తనములు భూమియందుఁ జల్లగానే పైరుపండదు గదా. నీవుచేయు పాపఫలము శీఘ్రకాలమందే యనుభవింపఁ గలవు.

క. కాలోపహతమనంబున, నీలీలం బాపకృతికి ♦ నేతెంచుటచే
బాలిశ! పొందెద వాయరి,కాలునిచే జీవితాంత♦కరదుఃఖంబున్. ౨౮

కాలోపహతమనంబునన్ = చెడిపోవు కాలము వచ్చుటచేఁ జెదరఁగొట్టఁ

...డిన మనసుచే, ఈలీలన్ = ఈ విధముగా, పాపకృతికిన్ = పాపకార్యమునకు, బాలిశ = మూర్ఖుఁడా, అరికాలునిచేన్ = శత్రువులకు మృత్యువగు రామునిచే, జీవితాంతకరదుఃఖంబున్ = ప్రాణమును దీయుకష్టమును.

తా. నీకుఁ జెడిపోవు కాలము దాపరించుటచే రావణా యిటువంటి పాప కార్యముచేయ వచ్చితివి కావున శత్రువులకు మృత్యువగు శ్రీరామునిచే నీప్రాణము పోవఁజేయు కష్టమును బొందఁగలవు.

క. అయ్యో యిప్పుడు కైకయి, నెయ్యురతోఁ గోర్కి దీర ♦ నెఱ సుఖయించున్
గుయ్యిడ హరియించుటచే, నియ్యధముఁడు ధర్మశీలు♦నిల్లాలి ననున్. ౮ ౨౩

నెయ్యురు = నెయ్యముగలవారు, నెయ్యము = స్నేహము, తనకుఁ గావలసినవారు, నెఱ = పూర్ణముగా.

తా. అయ్యో! కైక యిట్టియాపద మాకు రావలయునని కోరికదా మమ్మడవులపాలు చేసెను. ధర్మాత్ముఁడైన రామునిభార్యను నన్ను నీ నీచుఁడు హరించుటచేఁ దన కోరిక నెఱవేఱెను గావునఁ గైక తనకుఁ గావలసిన వారితోఁ బూర్ణముగ సుఖించును. రామచంద్రుని నడవికిఁ బంపినఁ దానుగూడఁ బోదు ననియు, నడవిలోఁ ద న్నేరాక్షసుఁడో హరించుననియు, నాకారణమున రామ చంద్రుఁడు చచ్చుననియు, ఆవల తన కొడుకు సుఖముగా నిష్కంటక రాజ్య మేలు ననియుఁ దలఁచి తమ్మడవుల కంపెనని సీతాదేవి మనస్సునఁ గలదు. ఇప్పు డేకాక యీమె యీ యభిప్రాయము లంకలోఁగూడ నొకసారి బయలుపఱచెను. 'సుప్తప్రమత్త కుపితానాం భావజ్ఞానం దృష్ట'మ్మను న్యాయముచే శోకాతిశయ మునఁ దనమనస్సులో నణఁగియుండిన దానిని బయలు పఱచెను. ఈయభిప్రా యము రామునకును గలదు. సత్యమింతయే కదా.

ఉ. వేమఱు మ్రొక్కెదాన నట♦వీస్థలి నున్నఫలప్రసేవకో
ద్దామములార భూమిరుహ♦దండములార లతాళులార యో
వ్యోమచరిష్ణులార యయ♦యో రఘురామునిఁ గాంచి చయ్యనన్
రామ! హరించె సీత నిదె ♦ రావణుఁ డంచు వచింపరే దయన్. ౮ ౨౪

ఫలప్రసేవకోద్దామములార = పండ్లచేతను పూవులచేతను. నతిశయించిన వారలారా, భూమిరుహదండములారా=వృక్షసమూహములారా, లతాళులారా= తీఁగలగుంపులారా, వ్యోమచరిష్ణులారా = ఆకాశమున సంచరించు వారలారా.

తా. ఓ యడవియందు పూలతోఁ బండ్లతో నిండియుండు వృక్షసమూ హములారా, తీఁగెలారా, ఆకాశమున సంచరించు వారలారా, యయ్యో మీరు

శోకాతిశయముచే భ్రమగొన్న కారణమున చేతనాచేతనవివక్ష లేక యఱచుచున్నది. రామలక్ష్మణులకుఁగాని యాయనపక్షమువారికిఁగాని దనధ్వని వినఁబడవలయుననియే యామె యుద్దేశము. తొలుత వృక్షములను సంబోధించి యవి రామచంద్రమూర్తి తమయొద్దకు వచ్చినఁగదా చెప్పును అని తలఁచి రాముఁ డున్నచోటికిఁబోయి చెప్పఁడని ఆకాశసంచారముచేయు భూతముల సంబోధించెను. ఎత్తుననున్న కారణముచే నాకాశసంచారులకు రాముఁ డెందుండినను గానవచ్చును. సమీపమునకు వచ్చినఁగాని చెట్లు తెలిసికోలేవు.

క. సుందరశృంగాన్వితమా, వందన మోమాల్యవంత ♦ ప్రస్రవణగిరీ
బృందారకారి యిదెసీ,సుందరి హరియించె రామ♦చూడుమ యనుమా. ౧౨౫

సుందర = అందమైన, శృంగాన్వితమా = శిఖరముతోఁగూడినదానా, ప్రస్రవణగిరీ = కొండవంకలు, జలపాతములుగల కొండా, బృందారకారి = దేవవిరోధి = రాక్షసుఁడు-రావణుఁడు.

తా. చక్కని శిఖరముతోను కొండవంకలతోను, జలపాతములతోను గూడిన మాల్యవంతమను పర్వతమా, దేవవిరోధి రావణుఁడు సీభార్యను హరించి కొనిపోవుచున్నాఁడు ఇదిగోఁ జూడుమని చెప్పుము.

క. దండము నీకిదె సారస, కాండసితగరుద్విలాస♦గౌతమి యాకో
దండగురుతోడ నీవే,తండగమన మ్రుచ్చిలించె ♦ దశముఖుఁ డనుమా. ౧౨౬

సారసకాండ = హంసల సమూహముల, సితగరుత్ = తెల్లని ఱెక్కలచే, విలాస = అందమైనది.

ఈవిశేషణమువలనఁ బ్రయోజనమేమన, రామచంద్రమూర్తిని నీవు చూచుటకలుగదేని నీలోని హంసలచేనైన నావార్త రామునకుఁ దెలుపుమనిభావము.

తా. హంసలతోఁగూడిన గోదావరీ నీకు దండము దండము-కోదండగురుఁడైన శ్రీరామునితో సీభార్యను రావణుఁడు హరించెనని చెప్పుము.

ఉ. ఈవనసీమలో వివిధ♦వృక్షతలంబులయందు నుండునో
దైవతకోటులార యిట ♦ దండక వాసము చేయు చున్ననా
నావిహగోరుసత్త్వమృగ♦నాయకులార నమస్కరించెదఁ
నావిభు రాముఁ జేరి కరు♦ణామతి నాగతి యెల్లఁ జెప్పరే. ౧౨౭

నానా = అనేకవిధములయిన, విహగ = పక్షులయు, ఉరుసత్త్వ = గొప్పబలముగల, మృగ = మృగములయొక్కయు నాయకులారా.

తా. ఈయడవియందు పలువిధములగు చెట్లయందు నుండు దేవతా సమూ

హములారా! దండకలో వసించు నానావిధములైన పక్షినాయకులారా! మృగనాయకులారా! మీకు నమస్కారము. నాయందు దయయుంచి శ్రీరామునొద్దకుఁ బోయి నాగతి యిట్లైనదని చెప్పుఁడు. మీకు దయగలదేని త్వరగాఁ జెప్పుఁగలరు.

క. రామా నీప్రాణములకుఁ బ్రేమాస్పద మైన యట్టి ♦ ప్రియను బరవశన్
భూమిజ హరించె రావణుఁ, డోమఁగఁ జను మనుచుఁ జెప్పుఁ ♦ రో గిరులారా. ౩౮

పరవశన్ = స్వాధీనము తప్పియున్నదానిని, మూర్ఛపోయి పడినదానిని, ఓమఁగన్ = రక్షించుటకు, నాలుగవపాదంబున ప్లుతయతి.

తా. ఓ పర్వతములారా! మీరు రామా నీకుఁ బ్రాణములకంటెఁ బ్రేమకు స్థానమైన నీప్రియురాలిని మూర్ఛపోయి పడియుండినదానిని సీతను రావణుఁడు హరించెనని రక్షింపఁగాఁ బొమ్ము అని చెప్పుఁడు.

క. నాపయి దయ నింతటివా, చాపుణ్యము గట్టుకొన్న ♦ సరగున రాముం
డేపున విడిపించును స్వ, స్థాపిత నైనను యముండు ♦ దాఁచిన యేనిన్. ౩౯

వాచాపుణ్యము = వాక్కురూపకమైన సాహాయ్యము, చేయుటచేఁగలుగు పుణ్యము, సరగునన్ = శీఘ్రముగా, ఏపున = పరాక్రమముచే, స్వర్ + స్థాపితనైనను = స్వర్గమందు వీఁడు న న్నునిచినను.

తా. పర్వతములారా! నామీఁద దయయుంచి యింతమాత్రము మీరు మాటమాత్రము సాహాయ్యముచేసెదరేని యావలనన్ను స్వర్గమందున్నను యమలోకమందున్నను రామచంద్రమూర్తి నన్ను విడిపించి తనయొద్దకుఁ దీసికొనును.

పుణ్యములుచేసి స్వర్గమున కర్హులైనవారినైనను, పాపములుచేసి యమలోకమునకు నర్హులైనవారినైనను, బురుషకారబలముచే భగవంతుఁడు సాయుజ్యమొసఁగునని ధ్వని.

### సీత జటాయువుం జూచి పలవించుట.

క. అని విలపించుచు సతి యొక, ఘనతరువున నున్న గృధ్ర ♦ కాంతు జటాయున్
గనుఁగొని దుఃఖభయంబులఁ, బెనఁగొనుమతి తోడఁబిల్చెఁ ♦ బెద్దయెలుఁగునన్.

విలపించుచున్ = ఏడ్చుచు, ఘనతరువునన్ = పెద్దచెట్టుమీఁద, గృధ్రకాంతున్ = గ్రద్దలరాజును, జటాయున్ = జటాయువను పక్షిని, జటాయుశ్చ జటాయుషా'యని ద్వికోశము. 'జటాసంహతమాయురస్య' అని త్రి॥ శే॥ వ్యాఖ్య. 'జటాయు పుంసి సంపాతేః కనీయసిచ గుగ్గులౌ' త్రికాండశేషము. జటాయు, జటాయుస్సని రెండు రూపంబులు గలవు.

తా. అని యేడ్చుచు సీతాదేవి యొక పెద్దచెట్టుమీఁదనుండిన గ్రద్దఱేఁడు జటాయువును జూచి రామవియోగమువలన దుఃఖమున రామచంద్రమూర్తి యేమగునో యను భయము పెనసికొనిన మనస్సుతో పెద్దగొంతున గట్టిగాఁ బిలిచెను.

ఉ. అయ్య జటాయువా! యిదె దు♦రాత్ముఁడు రావణుఁ డుగ్రకర్ముఁ డై
కుయ్యిడు చుండ నన్నుఁ గడుఁ♦గ్రూరత దిక్కెడి లేనిదాని నా
నియ్యెడఁ గొంచుఁ బోయెడి న♦హీనబలుఁ జితకాశిఁ గ్రూరు దు
ర్జయ్యు దురాత్ము సాయుధుని ♦ సాధ్యముగా దెదిరింప నీ కనిన్. ౮౩౧

అయ్యా = తండ్రీ, మామగారి స్నేహితుఁడు గావున మామగా రెట్టి వరుసవాఁడో యాయన యట్టివరుసవాఁడని తండ్రీ యనుచున్నది. కుయ్యిడుచుండఁ = ఏడ్చుచుండఁగా, జితకాశి = జయశీలుని, దుర్జయ్యు = నీవు జయింప సాధ్యముగానివానిని, సాయుధుని = ఆయుధములు ధరించియుండువానిని.

ఇఁక జటాయు దాస్య విధముఁ జెప్పఁబడును. స్వామికార్యము ప్రతిఫలాపేక్ష లేక హెచ్చరికగలిగి చేయువాఁడు దాసుఁడు. దాసుఁడు స్వామికార్యమునందు నీచ మనునది యెఱుఁగఁడు. ప్రాణభయ మెఱుఁగఁడు. లజ్జ యెఱుఁగఁడు. ఈకార్యము నేను జేయఁగలనా నాశక్తికి మించినదే యనఁడు. యథాశక్తి నిర్వంచనముగాఁ బనిచేయుట నావంతు. జయాపజయములు భగవంతునివంతు అని తలఁచును. ఇట్టివాఁడు గనుకనే ముసలివాఁడు నిరాయుధుఁడు అసహాయుఁడు నయ్యు జటాయువు తనప్రాణ మిచ్చి రామసేవ చేసెను గనుకనే మోక్షఫలము లభించెను. కావున మోక్షమనునది మనుష్యులకుమాత్రమేగాక విష్ణుదాస్యముచేయు భూతకోటికంతయుఁ గలదు.

తా. తండ్రీ జటాయూ! యిదిగోఁ జూడు. ఈపాపాత్ముఁడు రావణుఁడు క్రూరకార్యము తలపెట్టనే నేడ్చుచున్నను వదలక దయాహీనుఁడై దిక్కులేనిదానివలె నిపుడు తీసికొనిపోవుచున్నాఁడు. వీఁడు చాల బలవంతుఁడు. జయములచేఁ బ్రసిద్ధినొందినవాఁడు. దయాదాక్షిణ్యములు లేనివాఁడు. నీకు జయింప సాధ్యపడెడివాఁడుకాఁడు. ఏల యందువా? వీఁడు సాయుధుఁడు. నీవు నిరాయుధుఁడవు. పాపుమనస్సు గలవాఁడు కావున నిరాయుధునిఁ గొట్టవచ్చునా యని ధర్మజ్ఞానము లేనివాఁడు.

మత్తకోకిలము. అన్న! తండ్రి! జటాయువా! దురి♦తాత్ముఁ డీయసురుండు న
న్నిన్నెఱిఁ హరియించి యేగెడి ♦ నిట్టినాదురవస్థలఁ
విన్నవింపఁగదయ్య యిప్పుడ ♦ వేగ మేగి సమస్త మా
యన్నదమ్ములకో మహాత్మక♦యార్తనఁ దయఁ బ్రోవుమా. ౮౩౨

దురితాత్ముఁడు = పాపపు మనస్సుగలవాఁడు, ఈనెతిక్ = ఈవిధముగా, దురవస్థలక్ = చెడ్డస్థితులను, ఆర్తక్ = దుఃఖించుచుండుదానను.

తా. అన్నా! తండ్రీ! జటాయువా! పాపాత్ముఁడగు నీరాక్షసుఁడు నన్నీవిధముగా బలవంతముగాఁ బట్టుకొనిపోవుచున్నాఁడు. యుద్ధము చేయవలదంటివే. ఇఁక నేనేమి చేయఁగలనందువేమో? ఇప్పుడే శీఘ్రముగఁ బోయి నా కష్టస్థితి సమస్తము రామలక్ష్మణులకుఁ దెలుపుము మహాత్మా యీమాత్రము సాహాయ్యము చేసి దయతో నీ దీనురాలిని రక్షింపుము.

ఎంత కష్టదశయందున్నను ధర్మాత్ములు ధర్మబుద్ధి వదలరు. అధర్మమార్గమున మేలుపడఁ గోరరు. నీవు యుద్ధము చేసి నన్ను విడిపింపుమని సీతాదేవి గోరినది కాదు. అది యపాయ కార్యమని యామెకుఁ దెలియును. రామలక్ష్మణులకు నావార్త దెలుపుమనియే యామె కోరెను. ఆమె కోరిక నెఱవేర్చెను గాని యప్పుడే పోయినవాఁడు కాఁడు. తాను వారియొద్దకుఁ బోయి తోడి తెచ్చులోపల వాఁడు లంకఁ జేరును. ఏమి ప్రయోజనము? ప్రాణభయమున నీ కార్యముఁ జేసినవాఁడు కాకపోవును. అది దాస లక్షణము కాదు. కొంత కాలమైన వీని నిలువఁజేసిన నింతలో రామలక్ష్మణు లెదిగిరా సంతోషము ఎదుగకుండిన నేను జేయవలసిన కార్యము చేసినవాఁడ నగుదు నని యతఁడు తలఁచెను.

౫౦-వ సర్గము. జటాయువు రావణుని దూషించుట.

చ. కుఱకుఱకూర్కు చున్నవిహ♦గుండు జటాయువు సీత సేయునా
మొఱ విని లేచి రావణుని ♦ ముగ్ధ ధరాసుతఁ గాంచి రావణా
యెఱుఁగు సనాతనోల్లసద♦హీనసుధర్మరతుండ సత్యధీ
గౌఱలెడివాఁడ గృధ్రపతిఁ♦ గ్రూరబలుండను నే జటాయువన్. ౧-౩౩

కుఱకుఱ కూర్కుచున్న = కొంచెము కొంచెముగా నిద్రకునికిపాటుపడుచున్న, విహగుండు = పక్షి, మహద్వ్యవక్షయంబునఁ గొన్ని యమహచ్ఛబ్దంబులకు డుజ్జగు. సముద్రుఁడు, మేఘుఁడు, వాయసుఁడు, వానరుఁడు, ఉరగుఁడు లోనగు శబ్దంబులవలె నిందును 'ఁడు' వచ్చెను. ముగ్ధక్-చక్కనిదానిని-పెద్ద దేహముగల రావణుని తొలుతఁ జూచెను. ఆవల సీతను జూచెను. సనాతన=ప్రాచీనమైనదియు, ఉల్లసత్ =ప్రకాశించునదియు, అహీన=శ్రేష్ఠమైన, ధర్మ = భగవద్దాస్య మను ధర్మమందు, రతుండక్=ప్రీతిగలవాఁడను-సత్యధీక్='సత్యం జ్ఞాన మనంతంబ్రహ్మ' యన్నట్టి పరమాత్ముని స్వరూపజ్ఞానముచే,గౌఱలెడివాఁడను=ప్రకాశించువాఁడను,

సత్యస్వరూపుఁడగు భగవంతుఁడే రక్షకుఁడను బుద్ధి గలవాఁడను, గృధ్రపతిః = గ్రద్దలకు రాజును, క్రూరబలుండను = తీక్ష్ణమైన బలము గలవాఁడను.

తా. కొంచెముగాఁ దూఁగుచున్న జటాయువు సీత చేయుచున్న మొఱ విని లేచి తొలుత మహాకాయుఁడగు రావణుని, వానియంకమున నున్న సీతను జూచి యడ్డము పోయి, రావణా! నే నెవఁడని తలఁచితివో? శాశ్వతమై శ్రేష్ఠమైన భగవద్దాస్య మను ధర్మకార్యమునందుఁ బ్రీతిగల వాఁడను, సత్యస్వరూపుఁడైన భగవంతుని విషయధ్యానరూపకమైన బుద్ధిగల వాఁడను. కావున నట్టి భగవంతుని భార్యను నీవు హరించుకొనిపోవుటచే నా దాస్యధర్మము నిర్వహింప వచ్చిన వాఁడను. గ్రద్దలకు రాజను-పక్షి ! నీ వేమి చేయఁగల వందు వేమో? మహా బలుఁడను నా పేరు జటాయువు. ఇట్టి నేను జీవించియుండ నీ వెట్టు లీమెను హరింపఁగలవు.

క. రాముఁడు సర్వజగద్ధిత, ధీమహితుఁడు దాశరథి సుధీమంతుఁడు సు
త్రామాప్పతితుల్యుఁడు భూ, స్తోమంబుల కెల్ల రాజు సురశాత్రవుఁడా! ౭౩౪

సర్వజగత్ = సమస్త ప్రపంచమునకు, హిత = క్షేమకరమైన, ధీ = బుద్ధిచే, మహితుఁడు = పూజ్యుఁడు, సుధీమంతుఁడు = హితమ్ము చేయవలయు నను తలంపే కాక యెట్లు చేసిన లోకము బాగుపడునో యాబుద్ధి యాలోచనగలవాఁడు, సుత్రామ = ఇంద్రునితోడను, అప్పతి = వరుణునితోడను, తుల్యుఁడు = సమానుఁడు, సుత్రాముఁడు లోకములను జక్కఁగా రక్షించువాఁడు. ఇట్టివాఁడు భగవంతుఁడే. ఇది యింద్రునియందు గౌణము. అప్పతి = అపాంపతిః, జలములకు నధిపతి 'సమ్రాడాపో విరాడాపో' అను శ్రుతి వచనమువలనను, 'ఆపోనారా ఇతి' యను వచనము చేతను సమస్త చేతనాచేతనములను బాలించువాఁడు ఇట్టివాఁడు భగవంతుఁడు. భూస్తోమంబుల కెల్లన్ = భూమిమీఁదఁ బుట్టిన జీవజంతువుల కన్నిటికిని, ఇట్లను టచే నీకును అని భావము. సురశాత్రవుఁడా = దేవవిరోధి సుత్రామాప్పతి = ఉపలక్షణచే నెనిమిది దిక్పాలుర కర్థము.

తా. ఓరీ నాస్వరూపస్వభావములు చెప్పితిని. ఇఁక శ్రీరామచంద్రమూర్తి స్వరూపస్వభావములఁ జెప్పెద వినుము. రాముఁ డనఁగా నేమని తలఁచితివో సమస్త ప్రపంచమునందలి భూతములకు మేలుకోరువాఁడు కావున నీ మేలును గోరువాఁడే. అట్టి నీ మేలు కోరువానికిఁ గీడు చేయు నీవు కృతఘ్నుఁడవు కదా.

ప్రపంచక్షేమము కోరువాఁడు భగవంతుఁడు కదా, యందు రేమో? ఆ భగవంతుఁడే దశరథకుమారుఁ డను పేరఁ గానవచ్చుచున్నాఁడు. మేలుచేయ దలంపుండఁగనే లాభ మేమి యందు వేమో ఆయాలోచన కార్యరూపమునఁ

బరిణమింపఁ జేయు బుద్ధిబలము గలవాఁడు. ఆయనయందే సుత్రామ వరుణ శబ్దములు ముఖ్యముగ నన్వయించును. నీ వెఱిఁగిన సుత్రామ వరుణాదులాయన తన శక్తిలవము ననుగ్రహించుటచే గౌణముగ నాపేరు గలవారైరి. కావుననే యింద్రుఁడు తూర్పునకు, వరుణుఁడు పడమరకు రాజులు కాఁగా నీయన సమస్తప్రపంచమునకు రాజైయున్నాఁడు. రాజు శబ్దము భగవత్పర్యాయముగా యమో వైవస్వతో రాజా యస్తవైష హృది స్థితః। తేనచేద వివాదస్తేమా గంగాం మా కురూం గమః॥ అని ప్రయోగముగలదు. మను.

ఆయన దేవతలకు రాజు మాకుఁ గాదందువేమో, 'దేవానాం దానవానాంచ సామాన్య మధిదైవతే' మ్మన్నట్లు నీకును ఆయనయే ప్రభువు.

లోకమున కంతయు నీశ్వరుఁ డొకఁడే కాని పలుగురు లేరని భావము.

సీ. ఆలోకనాథుని♦ల్లాలి యశస్విని, సీతను హరియింపఁ♦ జెల్లు నటర
ధర్మతత్పరుఁ డైన♦ధారిణీపతికిని, బరదారహరణంబు♦ భావ్య మటర
దానిలో విను రాజ♦దార ముఖ్యంబుగఁ, గాపాడఁ దగు నంట♦ గాన వటర
పరదారమర్శనభావంబు నీచంబు, ధీరగర్హిత మాట♦ తెలియ వటర

ఆ. నీకు బుద్ధిగాదు♦ నీరజలోచనఁ, గొంచు బోవ విడువు♦ క్రూర చరిత
యాత్మ దార రక్ష్య♦యగురీతిఁ బరసతుల్, రక్ష్య లనుచుఁ దలఁపు♦ ప్రాజ్ఞతతికి.

ఆ = అంత ప్రసిద్ధి-మహిమగల, లోకనాథు = జగన్నాథు, యశస్విని = కీర్తిగలది, ధర్మతత్పరుఁడు = ధర్మమునందు విశేషాసక్తి గలవాఁడు, పరదారహరణంబు = ఇతరుల భార్యలను హరించుట, పరదార మర్శన భావంబు = ఇతరునిభార్యను దాఁకవలయునను తలంపు. ధీరగర్హితము = జ్ఞానులచే నిందింపఁబడినది, రక్ష్య = రక్షింపఁ దగినది.

తా. అంత ప్రసిద్ధికెక్కి యంతటి మహిమగల జగన్నాథుభార్యను మహాసాధ్వి యని జగన్మాత యని ప్రసిద్ధి కెక్కినదానిని నపహరింప నీకుఁ దగునా? ఆమెయందు నీకట్టి గొప్పభావ ముండిన నుండుఁగాక! నా కట్టి యభిప్రాయము లే దనెదవా? నీవు రాజవు గదా. రాజు ధర్మపద్ధతి నడవవలయును గదా. అట్టివాఁడు పరస్త్రీ నెట్టిదానినైన నపహరించుట తగునా? అందు ముఖ్యముగ రాజుభార్య తల్లి గదా? తల్లిని గాపాడినట్లు రాజభార్యలఁ గాపాడవలెఁ గదా. ఇతర స్త్రీల నపహరించిన నేమి యందువా? పరులసొత్తు లవమైన నపహరించుట, నీచకార్యమైనపుడు పరులభార్యను నపహరించుట మఱి యెంతనీచమో యాలోచింప

లేవా? అంతటి నీచకార్యమగుటచేఁ గదా జ్ఞానము ధైర్యము గలవారు దాని నిందించుట. అట్టి యకార్యమువలన నితరులకు నీవు కలిగించు కీడునకంటె నీకు నీవు విశేష హాని కలిగించుకొనుట యాలోచింప లేవా? నహీదృశ మనాయుష్యం లోకే కించన విద్యతే। యాదృశం పురుష స్యేహ, పరదారోపసేవనమ్॥ పరభార్యను గోరుటవలన నగు నాయుఃక్షయము మఱి దేనివలనఁ గాదను మనువాక్యము నీ వెఱుఁగవా? కావున సీతను నీవు తీసికొనిపోవుట నీకు బుద్ధి గాదు. వదలిపెట్టుము. ఓరీ క్రూరుఁడా, నీ భార్య యెట్లు లితరులు దాఁకరాదో య ట్లులే యితరులభార్యను నీవు బుద్ధిగలవాఁడైతివేని దాఁకరాదనుట తలంపుము.

ఆ. ధర్మనిరతులైన♦ధారిణీపాలురు, కాంక్షపడరు శాస్త్ర♦గర్హితంబు
లైనధర్మములకు ♦ నర్థకామములకు, విను పులస్త్యపౌత్ర♦విశదముగను. ౮౩౬

తా. ధర్మమందుఁ బ్రీతిగలరాజులు శాస్త్రముచే నిందింపఁబడిన ధర్మము అర్థము కామము నను వీనికి నాశపడరు. పులస్త్యుని మనుమఁడా? యీవిషయము తెలియఁజెప్పెదవినుము. నీవు పులస్త్య నంతటి గొప్పవానికి మనుమఁడై పుట్టియు ధర్మజ్ఞానము నీకు శూన్యముగదా.

క. ధర్మార్థకామములకు సు,కర్మపరుండైనరాజు ♦ ఘనతరనిధి యౌ;
ధర్మమొ పుణ్యమొ, పాపమొ, యర్మిలి విను రాజమూల ♦ మైవర్తిల్లున్. ౮౩౭

తా. ధర్మము, అర్థము, కామముఁ జక్కఁగ నెఱిఁగి ధర్మ మనుసరించి సుకా ర్యములుచేయు రాజు పెద్దనిధివంటివాఁడు. ధర్మముగాని, పుణ్యముగాని, పాపము గాని రాజు లెట్లుచేయుదురో ప్రజలు నట్టులే చేయుదురు నీవు దొంగతనము, పర దారహరణము చేసితివేని నీరాజ్యమునందలి ప్రజలు రాజానుమతము ధర్మము 'యథారాజా తథాప్రజా'యన్నట్లు వారును దొంగతనము పరభార్యాపహరణము చేయుదురు. అప్పుడు రాజ్యము ధర్మము నేగతిపట్టునో యాలోచింపుము. కావున ధర్మార్థకామములకు రాజు మూలము. కావున నీవు స్వచ్ఛందవ్యాపారము మాని శాస్త్రప్రకారము నడచుకొనుము.

క. పాపస్వభావ చపలా, యేపగిదిం గంటి వీవ♦హీనక్రీలన్
బాపాత్ముఁడు సురయానముఁ, బ్రాపించినరీతి సాధు♦బాధాచరణా. ౮౩౮

తా. పాపు స్వభావముగలవాఁడా! ఇంద్రియచపలత గలవాఁడా! సాధువు లకు బాధకలిగించువాఁడా! పాపాత్ములకు దేవలోకమార్గము. అర్చిరాది మార్గము లభించినట్లు నీకు గొప్ప సంపద యెట్లురా లభించెను? సురయానమనుటకు విమా నమనియుఁ జెప్పనగు. ఏదో యల్పపుణ్యముచే స్వర్గము లభించినను శీఘ్రకాలము

నందే క్రిందఁబడునట్లు నీవు నైశ్వర్యము చెడి శీఘ్రకాలమందే భ్రష్టుఁడవయ్యెదవు.

క. పుట్టఁగ వచ్చినగుణములు, కట్టెలతోఁ గాని పోనె ♦ కలుషాత్ములకున్
గట్టిగఁ జెప్పినబుద్ధులు, పట్టునె మనమునకు నిలువఁ ♦ బడునే తిరమై. ౧౩౯

కలుషాత్ములకున్ = పాపపు మనస్సుగలవారికి.

తా. పుట్టఁగా వచ్చినది పుడుకలతోఁగాని పోదన్నట్టు నీకుఁబుట్టఁగావచ్చిన పాపగుణము నీశవమును గాల్చినపుడుగాని పోదు. కట్టియిచ్చిన సద్ది-చెప్పి పెట్టిన బుద్ధి దీర్ఘకాలముండనట్లు నేను జెప్పినబుద్ధులు పాపాత్ముఁడవైన నీమనస్సునకుఁ బట్టునా? ఒకవేళ నిప్పుడు పట్టినను స్థిరముగా నిలుచునా ?

ఉ. నీనగరంబునందొ మఱి ♦ నీవిషయంబునయందొ జానకీ
జాని విరోధమే మయినఁ ♦ జల్పెనురా? యిటు లేల రిత్తక
య్యానకుఁ గాలు ద్రవ్వి యన♦ఘాత్మునిరామునిపట్ల నేరముం
బూనితి చేయఁగా వినుము ♦ మోసము చేకుఱు నీకు దీనిచేన్. ౧౪౦

జానకీజాని = జానకి యెవని జాయయో వాఁడు జానకీజాని. బహువ్రీహి సమాసాంతమున జాయ జానియగు, జాయాయానిఙ్ - పాణిని ౫-౪-౧౩౪-విషయము = దేశము.

తా. విరోధమునకుఁ గారణముండవలెను. అపకారము విరోధిలక్షణము. నీలంకానగరమందుఁగాని నీదేశమందుఁగాని శ్రీరామచంద్రమూర్తి నీకేమైనఁ గీడు చేసెనా? ఏల యీప్రకారము నిష్కారణముగాఁ గలహమునకు గాలుద్రవ్వి పాపమెఱుఁగని శ్రీరామునివిషయమున దోషముఁ జేయఁబూనితివి? దీనివలన నీకు నపాయమే కాని మేలులేదు.

కాలుద్రవ్వు = దీనిని గొందఱు కాలుదువ్వు అనుదురు. ఎద్దులు క్రుమ్ములాడుటకుముందు కాలిగిట్టతో నేల గీఱును. అనఁగా యుద్ధమునకుఁ బిలుచుట యని యర్థము.

ఉ. దానవలోకనాథ యతి♦దర్పితుఁడై యతివృత్తుఁడై జన
స్థాననివాసి యాఖరుఁడు ♦ చచ్చెను శూర్పణఖానిమిత్తమై
పూని రఘూద్వహుం జెనకి ♦ పూరుషపుంగవుచేసినట్టికా
రానిది యెద్ది తత్సతిని ♦ రావణ నీవిటు ముచ్చిలింపఁగన్. ౧౪౧

అతిదర్పితుఁడై = మిగుల గర్వించినవాఁడై, అతివృత్తుఁడై = మర్యాద నతిక్రమించినవాఁడై, శూర్పణఖా నిమిత్తమై = శూర్పణఖకొఱకై, ముచ్చిలింపఁగన్ = దొంగిలించుటకు.

తా. ఓరీ రాక్షసరాజా! నాతమ్ముఁడు ఖరుఁడు మొదలగువారిని జంపుట నాకపకారముచేసినట్లుగాదా యందువేమో? శూర్పణఖ చెప్పినమాటలు విని గర్వించి మర్యాద దప్పి ప్రయత్నపూర్వకముగా శ్రీరామునిమీఁదికి యుద్ధమునకుఁ బోయి ఖరుఁడు చచ్చెను. యుద్ధమందు తనప్రాణరక్షణము తానుచేసికొనుట తప్పా? అట్టులే నీవు మగతనము గలవాఁడవైతివేని శ్రీరామునిమీఁదికి యుద్ధమునకుఁ బొమ్ము. ఏదోషమెఱుఁగని సీతను దొంగిలించికొనిపోయి యామెను బాధ పెట్టుటకుఁ బురుషశ్రేష్ఠుఁడైన శ్రీరాముఁడు చేసిన నేరమేమి?

మాలిని. వలదు వలదు రక్షో♦వల్లభా నీవు సీతన్
బలిమిని గొనిపోవం ♦ బాప మాభూవరుండున్
దెలిసినయెడ నిన్నున్ ♦ దృష్టిచేనే దహించున్
గులిశమునను వృత్రుం ♦ గూల్చు జంభారిమాడ్కిన్. ౪౪౨

తా. రాక్షసరాజా! నీవు సీతను బలాత్కారముగఁ దీసికొనిపోవలదు. వలదు. అది మిగులఁ బాపకార్యము. నీవిట్లు చేసితివని రామచంద్రునకుఁ దెలిసెనా వజ్రముచే నింద్రుఁడు వృత్రుని వధించినట్లు చూపులచేతనే నిన్ను దహించును.

మాలిని, ననమయయగణంబులు. ౯ వ యక్షరము యతి.

క. కొంగున నాశీవిషము భు,జంగమమున్ ముడిచి మెడకు ♦ జముపాశముఁ జ
క్కంగ బిగించికొనియు నెఱుఁ,గంగాఁ జాలవు దురాత్మ ♦ కాఁగలకీడున్. ౪౪౩

ఆశీవిషము భుజంగమము=కోఱలయందు విషముగల సర్పము, ఆశీవిషమను పేరుగల క్రూరసర్పము. ముడిచి = ముడివేసి, జము=యమునియొక్క, కాఁగల= కలుఁగఁబోవు.

తా. క్రూరసర్పమును గుడ్డకొంగున ముడివేసికొని మెడకు యమపాశమురి పోసి బిగించికొనియు వానివలన రాఁబోవు కీడు నెఱుంగలేక యున్నావు. పామును ముడివేసికొనినవాఁడు యమపాశమును నురిగా మెడకుఁ దగిలించికొనినవాఁడెట్లు తప్పక చచ్చునో యట్టులే సీతను హరించి నీవు చత్తువు అనుటచే నలంకారము వ్యాజస్తుతి.

క. మోవఁగల యంతభారమె, మోవం దలకొనఁగవలయు ♦ మొగి రోగముఁ దేఁ
కేవస్తు వెంత యఱుగునో, యావస్తువు నంతె తినుట ♦ యర్హము కుమతీ. ౪౪౪

తా. ఓరీ బుద్ధిలేనివాఁడా! యెంతబరువు మోయ సాధ్యమో యంతబరువే తలమీఁది కెత్తుకొనవలయును. ఎంతదినిన రోగము కలిగింపక సులభముగ జీర్ణించునో యంతే తినవలయును. మోయలేని బరువు తలమీఁది కెత్తినను జీర్ణముకాక

రోగము తెచ్చునట్లు తినినను అపాయము కలిగినట్లు సీతను హరించితివేని నీకును అపాయము తప్పదు.

క. ఏకార్యంబునఁ జెడునో, లోకమున యశంబుకీర్తు ♦ లున్ ధర్మంబున్
జేకుఱునో దేహఖేదం, బాకార్యము బుద్ధిమంతుఁ ♦ డగునే చేయన్. ౧౮౫

తా. ఏపనిచేసిన లోకమున దానాదులచే వచ్చిన యశము, పరాక్రమముచే సంపాదించిన కీర్తి నాశమగునో, దేనివలన దేహమునకు వ్యసనము ప్రాప్తించునో బుద్ధిమంతుఁడగువాఁడు దానిని జేయరాదు.

చ. అఱువదివేలయేండ్లిపుడు ♦ ప్రాయమునన్ సురవైరి నాకు నే
యఱగొఱలేక యేలితిని ♦ హాయిగఁ బైతృకమైనరాజ్య మీ
వుఱిది గలట్టియౌవనము ♦ నొప్పగువాఁడవు విల్లు తేరు మై
మఱువు శరంబులుం గలుగు ♦ మాసటి వే ముదుకండ, నైననున్. ౧౮౬

అఱగొఱ = కొఱఁత, పైతృకము = పితృపితామహులవలన వచ్చిన రాజ్యము, ఉఱిది = దార్ఢ్యము, మైమఱువు = కవచము, మాసటివి = శూరుఁడవు. ఇందు జటాయువు తనకు నఱువదివేలయేండ్లని చెప్పుకొనెను. దశరథుఁడీ యీడువాఁడే కాఁగా దశరథుని తాతలు ముత్తాతలు మాంధాత అనరణ్యుఁడు మొదలగువారితో యుద్ధముచేసిన రావణుఁడు వయస్సువాఁడెట్లయ్యెను? జటాయువు ముసలివాఁడెట్లయ్యెను? జన్మకాలమును బట్టిచూచిన జటాయువుకంటె రావణుఁడు పెద్దవాఁడగుటయందు సందేహము లేదుగాని, కైలాసమెత్తునప్పటికి నెంతయాయుస్సు క్షీణించినదో యంతయాయుస్సు మరలఁ బూర్తిచేసి శివుఁడిచ్చినట్లు ఉత్తరకాండమున 33౯–3౪౦–౩౪౧ వ పద్యములవలనఁ దెలియుచున్నది. కావున మరల వయస్సు నూతనముగ లభించినట్లు తెలియుచున్నది. దీనివలనను తపోబలము వలనను, ఆహారబలమువలనను జటాయువుకంటెఁ జిన్నవాఁడుగా రావణుఁడు గానవచ్చుచుండెను.

తా. ఓరీ! వీఁడు ముసలివాఁడు అని యలక్ష్యము చేయకుము, నిజమే నాకిప్పు డఱువదివేల సంవత్సరములవయస్సు. ఇన్నిసంవత్సరము లే లోపములేక తండ్రిరాజ్యమును బాలించితిని. నీవో దృఢమైన వయస్సునందున్నవాఁడవు. విల్లు, తేరు, కవచము, బాణములు, గల శూరుఁడవు. నేను ముసలివాఁడను.

ఉ. జానకినిన్ హరించుకొని ♦ సౌఖ్యముగాఁ జన లేవు చెప్పితిన్
నేను గనంగ నీవ యవ ♦ నీతనయన్ ధ్రువ నైగమార్థమున్
బూనిక న్యాయహేతువుల ♦ పోలికగా హరియింప నేర వో
దానవ! పౌరుషంబు గల ♦ దా నిలుమీ నిమిషంబు పోరఁగన్. ౧౮౭

1 to 30 Formes Printed at the Liberty Press, Madras.

ధ్రువనైగమార్థముఁ = శాశ్వతమగు వేదముల యర్థమును, న్యాయహేతువులఁ = తర్కయుక్తులచే, పౌరుషంబు = మగతనము - అనుమానప్రమాణము ముఖ్యముగాఁ గలది తర్కము - వేదము స్వతఃప్రమాణము. వేదవిదగ్రేసరుఁడు వినుచుండఁగా వేదార్థములను యుక్తులచేఁబాధచేయుట సాధ్యపడనట్లు నేను జూచుచుండఁగా నీవు సీతను హరింపలేవనిభావము. ఆవేదజ్ఞుఁ డెట్లు తనవలన నైనంత శ్రమించి వేదార్థమును స్థిరపఱిచి తప్పు యుక్తులను ఖండించునో అట్లే నేనును నిన్ను ఖండించి సీతను రామునకుఁ జేర్చెదను. వేదార్థవిషయమునఁ గుయుక్తిపరునకు శ్రమమాత్రమే ఫలమైనట్లు సీతావిషయమున నీకును శ్రమముమాత్రమే లాభము.

తా. అయినను సీతను దీసికొని నీవు సుఖముగా నాకన్నులయెదుటఁ బోఁజాలవు. చెప్పినమాట విను. వేదముల యర్థమును తర్కయుక్తులచే హరించి యపార్థము కల్పింప నెట్లు సాధ్యపడదో యట్లు సీతను నీవు హరించి రామునుండి విడఁదీయలేవు. ఓరీ రాక్షసుఁడా పరువెత్తి పోయెదవే, మగవాఁడవైతివేని యల్పకాలము యుద్ధముసేయ నిలుము.

క. మున్ను ఖరాసురువలెనీ, విన్నేలఁ దీర్ఘనిద్ర ♦ యేగెదు రాముం
డెన్నియొ మాఱులు దైత్యుల, మన్నిగొనినయట్లు పిలుకు♦మార్చు న్నిన్నున్.

దీర్ఘనిద్ర = మృతి, మన్నిగొనినయట్లు = చంపినట్లు, పిలుకుమార్చు = చంపు.

తా. అల్పకాలము నిలువఁబడితివా ఖరుఁడు ముందుచచ్చినట్లు నీవును జచ్చెదవు. ఎన్నిమార్లో రామచంద్రమూర్తి రాక్షసుల వధించినట్లు నిన్ను వధించును.

క. శూరులు రాజకుమారులు, దూరగతుల్ గాఁగఁ జూచి ♦ తొయ్యలి నబలన్ ౮౬౯
గూరినభీతిని బాఱెద, వా రక్కస! కొనుచు; నేమి♦వలఁతిని జేయన్.

దూరగతుల్ = దూరము పోయినవారు, వలఁతిని = సమర్థుఁడను.

తా. శూరులగు రాజకుమారులు దూరముపోవుటఁ జూచి ఆఁడుదానిని నల్పబలముగలదానిని దీసికొని ప్రాణభయమునఁ బరుగెత్తెదవా? ఇప్పుడు నేనేమి చేయఁగల వాఁడను? నీవు నిమిషము నిలిచెదవేని రామలక్ష్మణులఁ దేఁగలను. నేను వారికై పోయితినా నీవు పోయి లంకఁ జేరుదువు.

మ. వినరా నామెయిఁ బ్రాణము ల్గలుగఁ బృ♦థ్వీకన్యకన్ జానకిన్
వనజాతాయతపత్రనేత్రను రఘు♦స్వామీష్టఁ జిత్తేశ్వరిన్
గొనిపోనీ నిదె ప్రాణగొడ్డ మయినం ♦ గూర్తుం బ్రియం బామహా
త్మునకున్ రామున కాజికిన్ వెలయుదున్ ♦ దుర్వారవిక్రాంతిచేన్. ౮౭౦

ప్రాణగొడ్డము = ప్రాణమునకు నపాయము కలిగించునది, వినరా = విను ముఱా, ప్రార్థనార్థకమధ్యమపురుషంబున నెదాదు లనుప్రయుక్తంబు లగుచో ము-డుజ్ఞులకు వురు లగు, సు-వ్యా-క్రియ ౩౮ సూ. వినురా, కనురా. ఇత్యాదుల

సాధువులు - వనజాతాయతపత్రనేత్రను=కమలముల విశాలదళములవంటికన్నులు గల దానిని, ఆజికిన్ = దశరథునకు-స్నేహితుఁడగు దశరథునకు. 'ఉపకారఫలం మిత్ర'మ్మన్నట్లు ఉపకారముచేయుట మిత్రలక్షణము. మిత్రుని కుమారునకు సాహాయ్యముచేసిన మిత్రునకుఁజేసినట్లేకదా. దుర్వార=అడ్డగింపరాని, విక్రాంతిచేన్= పరాక్రమముచేత.

తా. ముసలివాఁడు వీఁడేమిచేయఁగలఁడులే యని తలఁచెదవేమో? వినరా చెప్పెదను. నాదేహమునందుఁ బ్రాణము లుండువఱకు సీతాదేవిని రామచంద్రమూర్తి ప్రియురాలిని, యాయన యాత్మేశ్వరిని, దీసికొని నిన్నుఁ బోనీయను. నాప్రాణమునకు నపాయమైనను సంతోషమే. నాచేతనైనంతచేసి మహాత్ముఁడగు శ్రీరామునకు నామిత్రుఁడగు దశరథునకు నాయనివార్యపరాక్రమముచే సంతోషము గలిగింతును.

ఉ. పోకుర పోకు నిల్వు నిలు ♦ పోఁ గల వెం దిఁకఁ బంక్తికంఠ నిన్
దీకొని విక్రమంబుకొలఁ ♦ దిన్ సమరార్థ రణాతిథేయమున్
జోక గ్రహింపుమీ కనుమి ♦ శూరత నిన్నె రథంబునుండి య
స్తోకజవంబునన్ ధరణిఁ ♦ ద్రోయుదు వృంతమునుండి పండనన్. ౯౦౯

పోకుర = పోకుమురా. వ్యతిరేకప్రార్థనంబున నన్వాదు లనుప్రయుక్తంబులైనపుడు వు, రు, లురావు. కావున పోకుర అనియే రూపము. త్రిప్పకుమన్న మా మతము దీర్ఘములైన విరోధిపాఠముల్ చెప్పకుమన్న ఇత్యాదులు. వృంతము = తొడిమ.

తా. నీవేమిచేయఁగల వందువా? పోకు పోకు. నిలువుము. రావణా! నేనేమి చేయఁగలనో చెప్పెదను. నీవు పోఁజూచినను నాకంటఁబడి నీవెందుఁ బోఁగలవు? ఎదిరించి నాశక్తికొలఁది నీకు నుత్సాహముతో యుద్ధభిక్ష పెట్టెదను. దానిని గ్రహింపుము. నాశౌర్యము చూడుము. తొడిమనుండి పండును నేలరాల్చినట్లు నిన్ను రథమునుండి మిక్కిలి వేగముతో నేలఁబడఁగొట్టెదను. జటాయువు నిన్నుఁ జంపెద ననలేదు. పౌరుషమునకైన నసత్యమాడినవాఁడు కాఁడు. చెప్పినంత చేసెను. ఇది దాసలక్షణము.

## -- ౯౧-వ సర్గము. జటాయు రావణుల యుద్ధము. --

చ. అది విని పంక్తికంఠుఁడు దు♦రాగ్రహరోషవశాత్ముఁ డౌచు ని
ర్వదికనుల న్మిణుంగురులు ♦ రాల జటాయువుఁ దాఁకెఁ దాఁకినన్
జదల మహాప్రవాతధుత♦సారఘనాఘనయుగ్మ భంగిగన్
ఛదయుతమాల్యవంతముల♦చందమునం గనుపట్టి రిద్దఱున్. ౯౧౨

దురాగ్రహ = చెడ్డపట్టుదల, వీనినెటులైన హతునిఁజేయవలయు నను పట్టు

దల. రోషము = కోపము, వీనికి-వశ = స్వాధీనపడిన, ఆత్ముఁడు = మనస్సుగలవాఁడు, చేదలన్ = ఆకాశమందు, మహాప్రవాత = గొప్పవాయువుచేత, ధుత = ఎగురఁగొట్టఁబడిన, సార = బలిష్ఠమైన, ఘనాఘనయుగ్మము = రెండుమేఘముల, భంగిన్ = వలె, ఛదయుత = ఱెక్కలతోఁగూడిన, మాల్యవంతముల = మాల్యవంత మను పేరుగల.

తా. ఆమాటలు విని దశకంఠుఁడు వీని నెటులైన హతునిఁ జేయవలయునను పట్టుదలతో కోపించినవాఁడై యిరువదికన్నులనుండి నిప్పులమిణుఁగురులు రాలఁగా జటాయువును దాఁకెను. అట్లు వారిద్దఱు నొకరి నొక రెదిరించుట పెద్దగాలిచేఁ జిమ్మఁబడిన మేఘములు రెండొకదానినొకటి దగిలినట్లును ఱెక్కలు గల రెండుమాల్యవంతములు ఢీకొనినట్లు లుండెను.

ఇరువురు సమానబలవేగములు గలవారై యుండిరని భావము.

ఇంతకుముందు గోదావరీసమీపమున నొకమాల్యవంతము చెప్పఁబడెను. కిష్కింధా సమీపమున నొక మాల్యవంతము చెప్పఁబడును. ఈ రెండు పర్వతములఁ గవి యుద్దేశించెనని తోఁపదు. ఒక్కమాల్యవంతమునే మనస్సునం దుంచుకొని సమానత్వమును జెప్పుటకై యట్టిదే మఱియొకటి యనుటకై పేరు చెప్పెనని తోఁచెడిని.

రథము గుట్టలకుఁ గ్రిందివైపు వారి పర్ణశాల. అక్కడికి జటాయువృక్షము మించు మించు మైలులోఁగా నుండును. అక్కడ యుద్ధము ప్రారంభము చేసి యక్కడికి రమారమి ౫-౬ మైళ్లు దూరమునఁ గల దుమ్ముగూడెమునొద్ద నున్న జటాయువుగుట్టవఱకు యుద్ధము చేయుచుఁ దఱుముకొని వచ్చి నీ పర్వతమునొద్ద ఱెక్కలు ఖండింపఁబడి పడిపోయెను.

ఉ. వారికి నద్భుతాహవము ♦ వర్తిలు చుండఁగఁ బంక్తికంఠుఁడున్
ఘోరనిశాత బాణములు ♦ కుప్పనఁగూరలు గృధ్రరాజుపై
వారక వృష్టిగాఁ గురియ ♦ వాని జటాయువు చండతుండశా
తోరునఖాగ్రపాళులను ♦ నుర్వరఁ గూలిచి పేర్చి తీవ్రతన్. ౬౫౩

అద్భుతాహవము = ఆశ్చర్యకరమైన యుద్ధము, ఘోర నిశాత బాణములు = భయంకరములైన వాఁడిగల బాణములు, కుప్పనఁగూరలు = కుప్పలు కుప్పలుగా, వృష్టిగాన్ = వర్షమువలె, చండ = తీక్ష్ణమైన, తుండ = ముక్కుతోను, శాత = పదునైన, ఉరు = గొప్పవైన, నఖాగ్ర = గోళ్లకొనలయొక్క, పాళులను = వరుసలచేతను-ప్రదేశముల చేతను, ఉర్వరన్ = భూమియందు.

తా. ఆ యిరువురకు నాశ్చర్యకరమైన యుద్ధము జరుగుచుండఁగా రావణుఁడు జటాయువుమీఁదఁ గుప్పలు కుప్పలుగా వర్షమువలె వెఱపు పుట్టించు పదును

గల బాణములను నడ్డములేక ప్రయోగింపఁగా జటాయువు వానినెల్ల దన ముక్కు తోను గోళ్లతోను నేలఁ బడఁ గొట్టి విజృంభించెను.

ఉ. దానవుగాత్ర మెల్ల వ్రణి♦తంబుగ గోళ్లను గాళ్ల గీఱి యం
 తే నొగు లొందఁజేయ నసు♦రేశ్వరుఁడుఁ యమదండతుల్యతా
 మానితఘోరశాతదశ ♦ మార్గణముల్ గుఱిగా జటాయువా!
 వీనను జచ్చి తీ వనుచు ♦ వే వయిచెం దెగ నిండఁ దీయుచున్. ౮౫౪

వ్రణితంబుగన్ = పుండువలె నగునట్లు, నొగులు = బాధ, యమదండ తుల్యతా = యమ దండముతోడి సమానత్వముచే, మానిత = గౌరవింపఁ దగిన ఘోరశాతదశమార్గణముల్ = భయంకరములై పదునైన పది బాణములను, వీనను= వీనిచే, వే = త్వరగా, తెగ=అల్లెత్రాడు, నిండన్ = ఆకర్ణాంతము, తీయుచున్= లాగుచు.

తా. రావణుని దేహమంతయు పుండువలె నగునట్లు జటాయువు గోళ్లను గాళ్ళను చీల్చి మిగుల బాధ కలిగింపఁగా రావణాసురుఁడు వీనితోఁ జచ్చితివిరా జటాయూ యని పదునైన బాణములు నల్లెత్రాటికిఁ గూర్చి చెవికొనవఱకు లాగి గుఱిచూచి వైచెను.

వీనన్ = అది యిది యెది యనువానికిఁ దృతీయాసప్త మ్యేకవచనము లందు దాన దీన దేన ననియు, వాని బహువచనములందు వాన వీన వేన ననియు రూపంబులు. ప్రౌ. వ్యా. శబ్ద ౬౨ సూ.

ఉ. వానికి నీడఁబోక సుర♦వైరిరథస్థ సబాష్పలోచనన్
 జానకిఁ జూచి వైరిపయి ♦ సాహసికత్వము దోఁప దూఁకి ము
 క్తానిచయాన్వితంబు శిత♦కాండసమన్విత మైనచాపమున్
 దా నిరుతుంటలై పడఁ బ♦తంగకులాగ్రణి త్రుంచి వైచినన్. ౮౫౫

ఈడఁబోక = వెనుదీయక, సురవైరిరథస్థన్ = రావణుని తేరిమీఁద నుండు దానిని, సబాష్పలోచనన్ = కన్నీళ్లతోఁగూడినకన్నులుగలదానిని, ముక్తా నిచయాన్వితంబు = ముత్యాల సమూహములచేఁ గూడినది. శితకాండ సమన్విత మున్ = పదునైనబాణములతోఁగూడినదానిని, ఇరుతుంటలై = రెండు తునుక లై, పతంగకులాగ్రణి = పక్షిజాతులందు శ్రేష్ఠుఁడగువాఁడు.

తా. ఆబాణములకు వెనుదీయక రావణు తేరిపైఁ గన్నీరు కార్చుచున్న జానకిని జూచి మనస్సు తపింప సాహసించి రావణుమీఁద దూఁకి ముత్యాలసరులు వ్రేలఁగట్టినట్టియు ప్రయోగింప బాణములను సంధించియున్నట్టియు వింటిని రెండుతునుకలుగా జటాయువు విఱిచెను.

ఉ. వే ఱొకవిల్లు పుచ్చికొని ♦ విక్రమవంతుఁడు రావణాసురుం
 డాఱనికిన్క భాణనిచ♦యాధికవృష్టిని ముంప గూఁట నో

టాఱినపక్షియో యన జ♦టాయువు కొండొకసేపు చిక్కియున్
మీఱినపక్షవేగమున ♦ మీఱి శరంబులు విల్లు ద్రుంచుచున్.    ౧౯

ఆఱనికిన్కన్ = శమింపని కోపముచే, బాణనిచయాధిక వృష్టిని = బాణ సమూహముల పెద్దవర్షమును, గూటన్ = గూటియందు, ఓటాఱిన = నిస్సత్త్వమైన, పక్షియోయనన్ = బాణముల నడుమఁ జిక్కిన జటాయువు గూటియందుఁ జిక్కిన పక్షివలె నుండెనని భావము. కొండొక సేపు = కొంచెము కాలము, పక్ష వేగమునన్ = ఱెక్కల వేగముచే,

తా. పరాక్రమశాలి రావణుఁడు మఱియొక విల్లు దీసికొని శమింపని కోపముతో బాణవర్షమున జటాయువును ముంపఁగా నాబాణముల మధ్యమున గూటియందుఁ జిక్కి కదలమెదలని పక్షివలెఁ గొంచెముసేపుండి యావల ఱెక్కల వేగముచే వానినెల్లఁ జెదరఁగొట్టి బాణములను వింటిని ద్రుంచి వైచెను.

సీ. సురవైరిఘనశరా♦వరము పక్షాహతిఁ, దుత్తుమురై నేలఁ దొరఁగఁ జేసి
కాంచనోరశ్ఛదో♦దంచితదివ్యపి, శాచాస్యఖరముల ♦ క్షమను గూల్చి
కామగంబు త్రివేణు♦కలితంబు పావకా, ర్చిష్క మారథము ధ♦రిత్రి డొల్చి
చంద్రసన్నిభసిత ♦ చ్ఛత్రంబు సగ్రాహి, సవ్యజనంబుగఁ♦ జదును సేసి
తే. ముక్కునను సూతుతల పట్టి♦నొక్కి త్రుంప
భగ్నచాపుండు హతయంత ♦ పాతితార్వుఁ
డగుచు ధారిణిఁ ద్రెళ్లె సు♦రారినేత
యంకమున బిగ్గ గ్రహియించి ♦ యవనిసుతను.    ౨౦

శరావరము = కవచము, పక్షాహతిన్ = ఱెక్కల దెబ్బచే, తుత్తుమురు= తుమురు+తుమురు = తుత్తుమురు=మిక్కిలి తుమురై, తొరఁగఁజేసి = పడునట్లు చేసి, కాంచన+ఉరశ్ఛద = బంగారుకవచముచేత, ఉదంచిత = బాగుగఁ బ్రకాశింపఁజేయఁబడినవియు, దివ్య = శ్రేష్ఠములయినవియు, పిశాచ+ఆస్యఖరములన్ = పిశాచముఖములుగల కంచరగాడిదలను, మగగాడిదలకు ఆఁడు గుఱ్ఱములకుఁ బుట్టినవి కంచర గాడిదలు. క్షమను = భూమిపై, కామగము = కోరినట్లు పోవునది, త్రివేణు కలితంబు=మూఁడువెదుళ్లనొగతోఁ గూడినట్టిది, పావక+అర్చిష్కము=అగ్నివంటి కాంతిగలది, డొల్చి=త్రోసి, సితచ్ఛత్రంబు= తెల్ల గొడుగు,సగ్రాహిగన్ = దానిని బట్టుకొనువారితోడ, సవ్యజనంబుగన్ = చామరతోడ, చదును జేసి = నేలతో సమముగాఁ జేసి, సూతు = సారథియొక్క, హతయంత = చంపఁబడిన సారథిగలవాఁడు, పాతితార్వుఁడు = పడఁగొట్టఁబడిన గుఱ్ఱములు గలవాఁడు, అంకమునన్ = తొడయందు.

తా. అంతతోఁ బోక జటాయువు రావణాసురుని గొప్పకవచమును ఱెక్కల దెబ్బలచే మిక్కిలి పొడిపొడియై నేలఁబడఁ జేసి బంగారుకవచములచేఁ బ్రకా

శించు పిశాచముఖములు గల కంచరగాడిదల నేలఁ బడఁదన్ని కోరినట్లు పోవునదియు నగ్నివలెఁ బ్రకాశించునదియు నగు మూఁడు వెదుళ్ళ నొగ గలదియు నగు రథమును నేలఁబడఁ జేసి చంద్రునివంటి తెల్లగొడుగును దానిని బట్టుకొనువారితోడను, చామరముతోడను, నేలసమము చేసి సారథి శిరస్సును ముక్కుతో నొక్కి త్రుంపఁగా—విల్లు విఱిగినవాఁడు సారథి చచ్చినవాఁడు గుఱ్ఱములు నేలఁబడినవాఁడు నగుచు రావణుఁడు సీతాదేవిని తొండిపై గట్టిగఁ బట్టుకొని నేలమీఁదఁ బడెను.

ఆ. భగ్నచాపుఁ డగుచు ♦ భగ్నవాహనుఁ డయి, నేలఁ ద్రెళ్లినట్టి ♦ నిర్జరారిఁ
గాంచి భూతకోటి ♦ ఖగరాజు మెచ్చెను, మేలు మే లటంచు ♦ మేలినుతుల.

తా. విఱిగిన విల్లు విఱిగిన తేరు గలవాఁడై నేలమీఁదఁబడిన రావణునిఁ జూచి భూతమ్ములన్నియు జటాయువును మేలుమేలని స్తోత్రము చేసెను.

క. ముదుకం డగుటను బడలిన, విదితబలుఁ గృధ్రరాజు ♦ వీక్షించి మహా
ముదమున మింటికి నెగసెను, మదిరాయతనేత్రతోడ ♦ మనుజాశనుఁడున్. ౮౫౯

తా. ముసలివాఁ డగుటచే బడలిక చెందిన మహాబలుని జటాయువును జూచి యిఁక వీఁడు నన్నేమియుఁ జేయఁ జాలఁడని సంతోషించి సీతతోడ రాక్షసుఁ డాకాశమున కెగసెను.

ఉ. పోవుచు నున్నయాయసుర ♦ పుంగవుఁ గాంచి జటాయు వంతఁ దెం
పావహిలంగ నడ్డ మయి ♦ యాతనితో నను వజ్రతుల్యబా
ణావళిదీపితుం డయిన ♦ యారఘునాయకు దేవి నీవు గొం
పోవుట రాక్షసాన్వయము ♦ మూలముతోఁ జెడిపోకకే చుమీ. ౮౬౦

వజ్రతుల్యబాణావళిదీపితుండు = వజ్రముతో సమానమైన బాణసమూహముచే ప్రకాశించువాఁడు.

తా. ఇట్లెగిరిపోవుచున్న రాక్షసుని జూచి చాలబడలినవాఁడయ్యు జటాయువు తెంపుజేసి వానికడ్డమయి యిట్లనియె: ఓరీ! వజ్రసమానములైన బాణములుగల రామచంద్రునిభార్యను నీవు తీసికొనిపోవుట రాక్షసవంశము సమూలముగనాశమై పోవుటకే సుమా.

-ఀఀ రావణుని జటాయువు పరుషోక్తు లాడుట. ఀఀ-

క. మిత్రులతో బంధులతోఁ, బుత్రులతో సచివసైన్య ♦ పూగంబులతోఁ
బాత్రులతో గరళంబుఁ బవిత్రం బని త్రాగెదే వి ♦ వేకవిహీనా. ౮౬౧

సచివ, సైన్య, పూగంబులతోన్ = మంత్రులయు సేనలయు సమూహముతో, గరళంబు = విషము, పవిత్రంబని = మంచినీళ్లని. 'దధికలశగోమయాంబుషు కుశతామ్ర బ్రహ్మసూత్రమంత్రేషు హేమ్న్యర్ఘేచ పవిత్రం' అని నా॥ర॥

తా. స్నేహితులతోఁ, జుట్టాలతోఁ, గొడుకులతో, మంత్రులతో, సేనా

సమూహముతో, మనుమలతో, వివేకహీనుఁడా విషమును మంచినీళ్లని త్రాగెదవా? ఇందఱతోడ విషముత్రాగుట యెట్టిదో సీతను నీవు హరించి కొని పోవుట యట్టిదని భావము.

క. రాఁగలఫలముం దమమది,లోఁ గానఁగ లేక బుద్ధి♦లోపమున జడుల్
　శేఁగి యకార్యం బొనరిచి, తోఁగుదురు విపత్తునందుఁ♦మది నీకరణిన్. ౧౬౨

తా. బుద్ధిలేనిజను లీకార్యముచేసిన నీఫలముగలుగునే యను నాలోచన లేక నీవలెఁ జేయరానిపనిచేసి కడపట నాపదలందు మునుఁగుదురు.

క. కాలుఁడు పాశము నీమెడఁ, బోలం బిగియింప నెందుఁ♦బోయిన నీకే
　లీల మృతి దప్పు మీనము, గాలం బెరతోడ మ్రింగు♦గతి నైతివిరా. ౧౬౩

తా. యముఁడు నీమెడకు పాశము దగిలించి బాగుగ బిగియించెను. కావున నీ వెందుఁబోయినను నీకుఁ జా వేల తప్పును? చేఁప గాలముతోడ నెరను మ్రింగినట్లు నైతివి.

చ. అలవి యెఱుంగ నేరక మ♦హాత్ములతోఁ బగఁగొంటి, వారు నీ
　కలఁతులు గారు, నీ విటు ని♦జాశ్రమవాసిని సంగ్రహించుటన్
　బలితపుఁగోప మెత్తి సహ♦బాంధవుగాఁగ రణంబులో నినుం
　బొలియఁగఁ జేయువారు, చెడి♦పోకుము పోకుము రోరి రావణా. ౧౬౪

అలవి = కొలఁది, నీకు = నీకంటె, అలఁతులు = తక్కువవారు. నిజాశ్రమవాసిని = తమయాశ్రమమందున్నదానిని.

తా. రావణా! వారిబలపరాక్రమములపరిమాణము తెలియక నీవు వారితో విరోధించితివి. వారు నీకంటెఁ దక్కువవారు గారు. నీవీప్రకారము తమయాశ్రమమందున్నదానిని హరించుటచే, వారు మిగులఁగోపించి నిన్ను బంధువులతోడ యుద్ధమందుఁ జంపుదురు. చెడిపోకుము. పరువెత్తిపోకుము. నిలునిలుము.

క. భీరుత్వంబున నీకర,భోరువు హరియించి కోఁచ♦యుఱికెద విది లో
　నారయ జగంబు దిట్టెడి,చోరునికర్మంబు గాక♦శూరునివిధమే. ౧౬౫

భీరుత్వంబునన్ = పిఱికితనముచే, కరభోరువున్ = స్త్రీని, కరభ + ఊరువున్ = కరభమువంటి తొడలుగలదానిని, కరభము = మణికట్టుమొదలు చిటికెనవ్రేలిమొదలుదాఁకఁ గల చేతి వెలుపలిచోటు, కోఁచ = పిఱికి.

తా. ఓరిపిఱికీ! ఈయాఁడుదానిని హరియించి ప్రాణభయమునఁ బరువెత్తుచున్నావే, ఇది లోకమునిందించు దొంగపనియేకాని శూరునివిధమా?

క. శూరుఁడ వేనియు నిలువుము,రా రావణ మూర్త మొందు♦రణమున నీవున్
　గూరెదవు పెద్దనిద్దుర, నారాముని చేత నీదు♦ననుజునిపోల్కిన్. ౧౬౬

పెద్దనిద్దుర = మరణము.

నీవు శూరుఁడవైతివేని కొంచెముసేపు నిలుము. రామునిచే నీతమ్ముఁడు చచ్చినట్టు నీవును యుద్ధమునఁ జావఁగలవు.

క. మరణం బాసన్నం బై, పొరసిన స్వవినాశమునకుఁ ♦ బొనరుచు నఘముం
బురుషుం డట్టియకార్యము, దురుసున నీ విపుడు సేయఁ ♦ దొడఁగితి వసురా.

ఆసన్నము = దాపు, సమీపించినది.

తా. తనకు మరణకాలము సమీపించినపుడు తననాశమునకై పురుషుఁడెట్టి పాపకార్యమును జేయునో యటువంటి చేయరానిపనిని నీవు దుష్టతనముచేఁ జేయఁబూనితివి. కావున నీకుఁ జావు సిద్ధము.

క. పాపానుబంధకార్యం, బేపురుషుఁడు లోక మెల్ల ♦ నేలెడువాఁడే
నాపరమేష్ఠియ యేనియుఁ, బాపాత్మా! చేయఁ బూనుఁ ♦ బ్రాభవ మఱఁగన్?

పాపానుబంధకార్యము = పాపసంబంధముగలపని, పరమేష్ఠి = బ్రహ్మదేవుఁడు, పరమే – ఉత్కృష్టే పదే బ్రహ్మలోకాఖ్యే తిష్ఠతీతి – పరమేష్ఠి = ఉత్కృష్టస్థానమందుండువాఁడు, ప్రాభవము = ప్రభుత్వము.

తా. ఏపురుషుఁడైనను అనఁగా లోకమునంతయు నేలెడి రాజయినను లోకములను సృష్టించు నాబ్రహ్మదేవుఁడేయైనను తనప్రభుత్వము నశించునట్లు పాపీయెవఁడురా నీవలెఁ బాపసంబంధముగల కార్యముచేయును. నీవుచేసితివి కావున నీవు నాశముకాఁగలవు. బ్రహ్మదేవుఁడైనను బాపకార్యముచేసెనేని చెడుచుండఁగా నీవనఁగా నెంతమాత్రము.

చ. అని హితనీతివాక్యముల ♦ నాడి జవంబున వ్రాలి వీఁపుపైఁ
దననఖపాళి నాతని వి♦దారితగాత్రునిఁ జేసి వేగముం
బొనుఁగువడంగఁ జేసె మద♦ముం గొని రేఁగ గజంబు మావటీఁ
డనుపమితాంకుశంబున ర♦యంబునఁ దాఁ గుదియించుకై వడిన్. ౮౬౯

జవంబునన్ = వేగముగ, విదారితగాత్రునిన్ = చీల్పఁబడిన దేహముగలవానిని, పొనుఁగువడంగన్ = క్షీణించునట్లు, రేఁగన్ = విజృంభింపఁగా, మావటీఁడు = మావటివాఁడు, అనుపమిత = అసమానమైన, అంకుశంబునన్ – కుదియించుకైవడిన్ = మరలునట్లు చేయువిధముగ; వీఁపుమీఁద వ్రాలినాఁ డనుటచే జటాయుమాట లలక్ష్యముచేసి ముందు పరువెత్తుచున్నాఁడని యేర్పడుచున్నది.

తా. ఈప్రకారము హితము నీతి యగుమాటలు చెప్పి జటాయువు వేగముగ వానివీఁపుపై వ్రాలి గోళ్లతో వానివీఁపును జీల్చి మావటివాఁడు మదమున విజృంభించిపోవుచున్న యేనుఁగును అంకుశముపోటున మరలఁ జేసినట్లు రావణుఁడు పోకుండఁ జేసెను.

క. తనఖరనఖరంబులచేఁ, దనముఖవిశిఖమున దైత్యు ♦ తలవెండ్రుకలన్
ఘనబలుఁడు మెఱుక దైత్యుఁడు, కినుకఁ బెదవిఁ గొఱికికొనుచు ♦ గిఱ్ఱునఁ దిరిగెన్,

తా. తన వాఁడిగోళ్ళచేతను, బాణమువంటి ముక్కుచేతను, రావణుని తల వెండ్రుకలను, మహాబలుఁడగు జటాయువు పెఱుకఁగాఁ గోపముచే రావణుఁడు పెదవి గొఱుకుచు గిఱ్ఱున వెనుకకుఁదిరిగెను.

క. తిరిగియు సవ్యాంకంబున, ధరణిసుతం బొదివి పాణితలమున వ్రేసెన్
గురువేగమున జటాయుని, నరుణజుఁ డది తప్పఁగొట్టి యభిముఖుఁ డగుచున్.

సవ్యాంకంబునన్ = ఎడమతొడమీఁద, పాణితలమునన్ = అఱచేతితో, అభిముఖుఁడు = ఎదురుముఖమైనవాఁడు.

తా. ఇట్లు వెనుకకుఁ దిరిగియు సీతను నెడమచేత రొండిపై బిగఁబట్టి కుడిచేత జటాయువును గొట్టెను. ఆయన దానిని వేగముచేఁదప్పించుకొని వానికెదురుముఖమై.

క. వామకరంబులు పదియును, భూమిపయిం దొరఁగఁ దుండమునఁ జిదుమఁగర
స్తోమము వెంటనె పుట్టవి, పామితదంష్ట్రాహులొ దవునట్టులు పుట్టెన్. ౪౭౨

వామకరంబులు = ఎడమచేతులు, తొరఁగన్ = పడునట్లు, తుండమునన్ = ముక్కుతో, చిదుమన్ = గిల్లివేయఁగా, కరస్తోమము = చేతులసమూహము, పుట్టన్ = పుట్టయందు, విషామితదంష్ట్రాహులు = విషము విశేషించిన కోఱలుగల పాములు. ఇట్లనుటచే సాయుధములై చేతులుపుట్టెనని యేర్పడుచున్నది.

తా. జటాయువు తనముక్కుచే సీతనుబట్టుకొనియుండిన యెడమచేతులను బదింటిని ద్రుంపఁగా నవి పుట్టలోనుండి వెలువడు కోఱలతోడిపాములవలె మరలఁబుట్టెను.

ఈచేతులు పడి పోయినవే మరల కలుచుకొనెనా, లేక వేఱేపుట్టెనా, యివి కృత్రిమములా నైజములా, యను విచారము మఱియొకచోఁ జేయఁబడును.

ఇచట నొకటిమాత్రము గమనింపవలసియున్నది. ఎడమచేతులు తెగి క్రిందఁబడియుండెనేని సీతయు నేలఁబడియుండవలెను. అట్లు పడలేదనియు వాఁడే నేలదించెననియు ౪౭౩ వ పద్యమువలనఁ దెలియుచున్నది.

ఉ. అంతటఁ బంక్తికంఠుఁడు దురంతరుషానలదీప్తనేత్రుఁడై
కాంతను వీడి ముష్టిపదఘాతములం బతగాన్వయేంద్రు దు
ర్దాంతపరాక్రమం బడరఁ దాఁచిన నేచెను బోరు ఘోరమై
గొంతవడిన్ శకుంతపునకుం బలలాశనలోకభర్తకున్. ౪౭౩

దురంత = అంతములేని, రుషానల = రోషమనెడి యగ్నిహోత్రముచే, దీప్త = వెలుఁగుచున్న, నేత్రుఁడై = కన్నులుగలవాఁడై, ముష్టి, పద, ఘాతములన్ = పిడికిళ్లయొక్కయు, కాళ్లయొక్కయు దెబ్బలచేత, పతగాన్వయేంద్రున్ = పక్షివంశమునశ్రేష్ఠుఁడగు జటాయువును, దుర్దాంతపరాక్రమంబు = అంతములేని శౌర్యము, తాఁచినన్ = కొట్టఁగా, ఏచెను = పెరిఁగెను, కొంతవడిన్ = కొంత

కాలము, శకుంతపునకున్ = పక్షిరాజునకు, పలలాశనలోకభర్తకున్=మాంసభక్షకులైన రాక్షసజనముల రాజునకు.

తా. ఆపిమ్మటఁ దనచేతులు చిరుమటచే మిక్కుటమైన రోషమున మండుచున్న కన్నులుగలవాఁడై రావణుఁడు సీతనువదలిపెట్టి పిడికిళ్లచేతను పాదముల చేతను జటాయువును గొట్టఁగా నాపక్షి రాక్షసరాజులకు యుద్ధము ఘోరముగాఁ బెరిఁగెను.

-రావణుఁడు జటాయువుఱెక్కలు నఱకుట.-

క. ఆయెడ శ్రీరామునకై, వ్యాయామము సేయుచున్న ♦ పతగేంద్రునిపా
దాయతపక్షంబులు కౌ, క్షేయకమున నసుర నఱకె ♦ క్షితిపైఁ గూలన్. ౧౭౪

వ్యాయామము = దేహపరిశ్రమము. 'శరీరాయాసజనకం కర్మవ్యాయామ ఉచ్యతే'యని వాగ్భటుఁడు. యుద్ధము-పాదాయతపక్షంబులు= కాళ్లు పెద్దఱెక్కలు, కౌక్షేయకమునన్ = కత్తిచే.

తా. ఇట్లు ఘోరయుద్ధము జరుగుచుండుసమయంబున రావణుఁడు కత్తిచే జటాయువు కాళ్లను, ఱెక్కలను, నేలపైఁబడ నఱికెను.

క. నఱికిన నేలన్ వ్రాలుచుఁ, గొఱకొఱ మనికుత్తుకందుఁ ♦ గుట్టుసుఱుండన్
బిఱుమఱిన జటాయువునకుఁ, దెఱవ స్వబంధునకుఁబోలె ♦ దీనత నేడ్చెన్. ౧౭౫

కుట్టుసురు--కుఱు + ఉసురు=కొంచెముప్రాణము. కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దంబుల అడల కచ్చుపరంబైనపుడు ద్విరుక్తటకారంబగు. సు. వ్యా. సంధి ౩౯. పిఱుము + అఱిన = పరుషభావముక్షయించిన, తెఱవ = స్త్రీ, సీత.

తా. ఇట్లు రావణుఁడు నఱకఁగా నేలఁబడి కుత్తుకలోఁ గొంచె మూపిరి కొఱకొఱ యని ధ్వనికలుగుచుండ, పారుష్యముచెడిన జటాయువునుజూచి సీతాదేవి తననిమిత్తముగ నాయనకుఁగలిగిన విపత్తునకై మిక్కిలి దుఃఖించి యేడ్చెను.

తే. కాలజీమూతనిభుఁడయి ♦ నేలఁబడిన,పాండురోరస్కుఁగనెరావ ♦ణుండు శాంత
దావదహనునిమాడ్కిని ♦ ధరణికన్య, రాఘవాశ్రమనికటోర్వి ♦ వ్రాలియున్న.

కాలజీమూతనిభుఁడు=నల్లనిమేఘముతోసమానుఁడు, పాండురోరస్కున్= తెల్లనిఱొమ్ముగలవానిని, శాంతదావదహనునిమాడ్కిని = చల్లాఱిన కాఱుచిచ్చువంటివానిని, రాఘవాశ్రమనికటోర్విన్ = రామునియాశ్రమమునకు సమీపప్రదేశమందు.

తా. నల్లనిమేఘమువంటివాఁడును, తెల్లనిఱొమ్ముగలవాఁడునునై నేలఁబడియున్న జటాయువును రావణుఁడు చూచెను. సీతాదేవియును జల్లాఱిన కాఱుచిచ్చువలెనై రామాశ్రమమునకు సమీపమందే పడినట్టి-జటాయువును,

## ౫౨-వ సర్గము. సీత రామలక్ష్మణులఁగూర్చి యాక్రోశించుట.

ఉ. కంఠగతాయు నాశకున♦కాంతునిఁ గౌఁగిటఁ గ్రుచ్చి యాపికీ
కంఠి భృశార్తి బాష్పములు♦కాల్వలు గట్టఁగ నేడ్చె నిట్లు, ని
ష్కుంఠత సౌఖ్యదుఃఖములఁ♦జూపు శరీరజలక్షణంబు లు
త్కంఠ దొలంగఁ బింగళప♦తత్త్రిముఖాండజకంఠరావముల్. ౧౨౨

కంఠగతాయుః = కంఠమునం దూపిరిగలవానిని, శకునకాంతుని = పక్షిరాజును, పికీకంఠి = ఆఁడుకోవెల కంఠస్వరమువంటి స్వరముగలది. భృశార్తిః = మిగుల దుఃఖముచే, నిష్కుంఠత = కొఱంతలేకుండ, శరీరజలక్షణంబులు=శరీరమునందుఁబుట్టిన కన్ను లదరుట, భుజము లదరుట, తొడ లదరుట, లోనగుగుర్తులు. ఉత్కంఠ = తహతహపాటు, పింగళపతత్త్రి= పింగళపక్షి, ముఖ = మొదలుగాఁగల, అండజ = పక్షుల, కంఠరావముల్ = కంఠధ్వనులు.

తా. ప్రాణములు వెడలిపోవుటకై స్వస్థానములువిడిచి కంఠముదాఁక వచ్చిన యాపక్షిరాజుజటాయువును జూచి సీతాదేవి మిగులఁ బరితాపముచే కన్నీళ్లు కాల్వలుపాఱ నిట్లు లేడ్చెను. దేహమునందుఁ బుట్టిన లక్షణములు-వెలుపల పైఁడికంటిమొదలగు పక్షులకూఁతలు రాఁగలసుఖదుఃఖములను సంపూర్ణముగాఁ దెలుపును.

కావున రామచంద్రా! నాకుఁ గలిగినకష్టము దెలుప నీకు నెడమకన్ను, ఎడమభుజము అదరియుండునుగదా. పక్షులలో పాల గరుడ భరద్వాజములు దప్పఁ దక్కినవి కుడినుండి యెడమకుఁ బరువెత్తియుండునుగదా. ఈయపశకునముల వలననే నాకేదియో కీడుకలిగియుండును నని నీ వూహించి త్వరగా రావచ్చును.

ఉ. ఈమృగపక్షిసంతతియు♦ నిప్పుడు పాఱెడి నిన్నుఁ గూర్చి యే
మామకదుర్దశం దెలుప♦త్మ్మాధవ నీ విపుడే నెఱుంగ వా.
రామ! భవత్సతీగతప♦రాభవ మింతకు నీవెఱుంగఁగా
లేమిని నాదుదుష్కృతము♦ లేశముగా దని నిశ్చయించితిన్. ౧౨౩

ఈమృగపక్షిసంతతి = ఈమృగములయు పక్షులయు గుంపులు, మామకదుర్దశ = నాకష్టదశను, భవత్సతీగతపరాభవము = నీభార్యకు సంభవించిన యవమానము, ఇంతకుః = ఇప్పటివఱకు, జటాయువువలన నింతయాలస్యము జరిగినను.

తా. రామచంద్రా! నీదేహమునందును నీవున్నచోట మృగపక్ష్యాదుల వలనను దోఁచునవశకునములే కాక యిచ్చట నుండుమృగములు, పక్షులుకూడ నీకడకు గుంపులుగుంపులుగా వచ్చుచున్నవి. వీనిని జూచియైన నాకుఁ గలిగినకష్టస్థితి తెలిసికొనియుండవచ్చును. ఇంతవఱకు నీభార్యకుఁ గలిగినయవమానము

నీకుఁ దెలియకుండుటచే నేను మహాపాప మేదియో చేసితి నని నిశ్చయించితిని. అల్పపాపమైనయెడల నింతవఱకు ననుభవించినదానితో సమసిపోయియుండును. నీ విచ్చటికైన వచ్చి యెదిగియుందువు.

క. నన్నుం గావఁగఁ బూనుట, నిన్నీచునిచేత మడసె ♦ నీపుణ్యాధనుం
డిన్నీడోద్భవుఁ డౌరా,మన్నిరృతి యదేల యితని ♦ మనఁగా నిచ్చున్. ౮౭౯

నీడోద్భవుఁడు = పక్షి, జటాయువు-మత్ + నిరృతి = నాపాలిటిపెద్దమ్మ - దార్భాగ్యము. మనఁగానిచ్చుఁ = బ్రతుకనిచ్చును.

తా. నాపాపము గొప్పదనుటకు నావార్త నీకుఁ దెలియకపోవుట యొకటే కాదు కారణము. నన్ను రక్షించుటకుఁ బ్రయత్నించిన యీపుణ్యాధనుఁడు జటాయువు ఈనీచునిచేఁ జచ్చెను. నాపాపము గొప్పదిగాకున్న నీయన జయించియే యుండును గాని నాపాలిపెద్దమ్మ నావంటిపాపాత్మురాలికి సాహాయ్యము చేయఁబూనిన యీయన నేల బ్రతుకనిచ్చును? మహాపాపాత్ములకు సాహాయ్యము చేయఁబూనినవారికిని నాపాపాత్ములపాపము వారాసాహాయ్యము చేయకుండునట్లు బాధించును.

శా. రామా! కావఁగ రమ్ము లక్ష్మణ! వెసన్ ♦ రక్షింపుమా తండ్రి! సు
త్రామద్వేషి హరించి వే యరిగెడిన్ ♦ ధాత్రీభవన్ నన్నటం
చీమాడ్కిన్ వినువారుగాక రఘువం♦శేశుల్ సమీపక్షితిన్
దా ముంటల్ లభియించెనేనియు మదా♦ర్తధ్వాన మం చేడ్వఁగన్. ౮౮౦

సుత్రామద్వేషి = ఇంద్రవిరోధి, ధాత్రీభవన్ = భూపుత్రిని, సమీపక్షితిన్ = దగ్గఱప్రదేశమున, మదార్తధ్వానము = నాయేడుపుధ్వని.

తా. రామా! నేను సీతను. భూమిపుత్రిని. నన్నీరాక్షసుఁడు పట్టుకొని పోవుచున్నాఁడు. రక్షింపరమ్ము. తండ్రీ! లక్ష్మణా! త్వరగా రమ్ము. అని యీ ప్రకారము సీతాదేవి రామలక్ష్మణులు సమీప మందుండిరేని విని వత్తురుగాక యని యేడ్చెను.

మారీచుఁడు, 'హా లక్ష్మణా! సీతా!' యని యఱచిన నాశ్రమమం దున్న వారికి వినవచ్చెనుగదా! సీతయేడ్పుధ్వని యింతకు కొంచెముముందే పోయినలక్ష్మణునకైన నేల వినఁబడలేదు? ఆకాశమునఁబోయిన రావణుఁ డేల వారికిఁ గానరాలేదు?

(i) గాడిదకూసిన వినవచ్చినంతదూరము చిలుక పలికిన వినరాదు. శంఖధ్వని వినవచ్చినంతదవ్వు వీణానాదము వినరాదు. కావున రాక్షసుని చావుకేక యెక్కడ? సీతాదేవి కాకలీధ్వని యెక్కడ? (ii) రావణుఁ డాకాశమున మాయామేఘములచాటునఁ బోయినవాఁడు. "సమీరదుర్దినసమాకులవిస్తృత మాయా-గూఢుఁడై రావణుఁ డేగె." నని జటాయువు రామునకుఁ దెలిపెను.

౧౧౬౧-వ పద్యము. ఆకారణముచే సీతారావణులు కానరారైరి. ఆకాశమున మేఘమండలమున నఱచిన మనుష్యులధ్వని నేలమీఁదివారి కెట్లు వినఁబడును? జటాయువు గ్రద్ద. గ్రద్దలకు దూరదృష్టిబలము గలదు. అందు నెత్తైనచెట్టుమీఁద నుండినది. కావున జటాయువు వినఁగలిగెను. చూడఁగలిగెను. (iii) అరబయలులో వినవచ్చినంతదూరము చెట్లలో ధ్వని వినరాదు. లక్ష్మణుఁడు దూరముపోయినది చూచియే రావణుఁడు వచ్చెను. (iv) మారీచుఁడు రామచంద్రుని నుత్తరముగాఁ దీసికొనిపోయెను. రావణుఁడు దక్షిణముగాఁ బోయెను. కావున దూరమెక్కుడుగాని తగ్గదు.

చ. కదుకొని బాష్పవారి జడి♦కాఱ సమీపధరారుహంబు న
మ్మదవతి తీఁగెనాఁ బెనఁగ ♦ మానవభోజియు వీడు వీడు మం
చదలిచి జంకెన ల్వలికి ♦ యట్టె సతీమణి కేశపాశముల్
వదలక పట్టి యీడ్చె సమ♦వర్తి తనర్క సిగఁ బట్టి యీడ్వఁగన్. ౭౭౧

కదుకొని = అతిశయించి, జడికాఱ్ = జడివానవలెఁ గాఱఁగా, సమీపధరారుహంబుఙ్ = దగ్గఱనున్న చెట్టును, జంకెనల్ = బెదరింపుమాటలు, కేశపాశముల్ = వెండ్రుకలసమూహములు – 'పాశఃపక్షశ్చ హస్తశ్చ కలాపార్థాః కచాత్పరే'—అమరకోశము. కచాత్పరే కచపర్యాయశబ్దాత్ పరతః ప్రయుజ్యమానాః పాశాదయ స్త్రయః కలాపార్థా స్సమూహవాచకా భవంతి. కచశబ్దపర్యాయములైనశబ్దములమీఁదఁ బ్రయోగింపఁబడిన పాశాదిశబ్దములు మూఁడు సమూహవాచకములు.గురు, బాల. కేశపాశమనఁగా కొప్పు అని యొకరు వ్రాసిరిగాని యది సరిగాదు. బహువచనప్రయోగము దానిని బాధించెడిని. ఒకస్త్రీకి రెండు మూఁడుకొప్పు లుండవుగదా. ఒకవేళ సీతాదేవి కొప్పుపెట్టుకొనియే యుండె నని తలఁచినను పొర్లాడుటలో నది నిలిచియుండునా? సమవర్తి = యముఁడు, సిగ = శిఖ–వెండ్రుకలు–పతివ్రతలతలవెండ్రుకలు పట్టుకొనువాఁడు తప్పక నాశమగు నని భావము. రావణుఁడు తనతలవెండ్రుకలు పట్టుకొనుటచేఁగదా వేదవతి నిన్ను నాశముచేసెద నని శపథముచేసెను. సీతాదేవి రావణుఁడు చచ్చువఱకుఁ దలవెండ్రుకలు ముడివైచినదికాదు. ఇట్టులేకదా ద్రౌపదియు దుశ్శాసనుఁడు తనతలవెండ్రుకలు పట్టుకొనె నని దుర్యోధనదుశ్శాసనులు చచ్చువఱకు తల ముడివేసినదికాదు. "తడసిన యేకవస్త్రపరిధానముతోడ విముక్తకేశియై। తొడరుచు దుఃఖభారమున ద్రోవది వోయె."-సభాపర్వము. ఈ సందర్భమున ద్రౌపదివాక్యంబులు స్మరింపఁదగినవి.

ఉ. నీవు సుభద్రకంటెఁ గడునెయ్యము గారవముం దలిర్ప సం
భావనసేయు దిట్టినను బంకజనేత్ర యొకండు రాజసూ

యావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణి వట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన లిట్టు లోర్తురే॥

సీ. ఈవెండ్రుకలు పట్టి యీడ్చిన యాచేయి, దోలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింతలింతలు దునియలై చెదరి రూ, పఱియున్నఁ గని యుడుకాఱఁగాక
యలుపాలఁ బొనుపడునట్టి చిచ్చే యిది.”

యని కదా ద్రౌపది శ్రీకృష్ణునితోఁ జెప్పెను.

వేణీసంహారనాటక మీవిషయమును బోధించునదే. నిప్పుదాఁకి బ్రదుకి వచ్చునుగాని పతివ్రతలతలవెండ్రుకలఁ బట్టువాఁడు వాఁడు సమూలముగ రావణ దుర్యోధనులవలె నాశమగును.

తా. విస్తరించి కన్నీళ్లు జడివానవలెఁ గాఱుచుండ దాపునందున్న చెట్టును సీతాదేవి తీఁగెవలెఁ బట్టుకొని పెనఁగులాడెను గాని రాక్షసుఁడు విడువిడు విడిచెదవా తన్నుదునా చంపుదునా యని బెదరింపుమాటలు పలికి యదలించి యక్కడికి విడిచిరాకుండఁగాఁదన్ను యముఁడు తలవెండ్రుకలు పట్టి లాగుచుండుటచేఁ దాను సీతాదేవి తలవెండ్రుకలు పట్టుకొని లాగెను. ఇచ్చట ఛాయావాదము సరిపడదు.

శా. రామా రామ రఘూత్తమా యని మహా♦రావంబుమై నేడ్వ నా
శ్యామారత్నశిరోజము ల్దిగిచె ర♦క్షోధీశుఁ డవ్వేళ దు
ర్ధామధ్వాంతసమావృతం బయి యమ♦ర్యాదంబునై యీజగ
త్స్తోమంబుల్ సచరాచరంబులు వగం♦దూలెన్ విషణ్ణంబులై. ౫౨-౨

మహారావంబుమైన్ = గొప్పధ్వనితో, శిరోజముల్ = తలవెండ్రుకలు, దుర్ధామ = అణఁపరాని, ధ్వాంత = చీఁకటిచే, సమావృతంబు = బాగుగ ఆవరింపఁబడినది, అమర్యాదంబు = కట్టుపాటుచెడినది. జగత్ + స్తోమంబుల్ = లోకసమూహములు, సచర + అచరంబులు = కదలునవి కదలనివి యగువానితోడ, విషణ్ణంబులై = దుఃఖించినవై, వగన్ = వ్యసనముచే, తూలెన్ = సోలెను.

తా. రామా రామా రఘురామా యని పెద్దయెలుఁగున నేడ్చుచుండఁగా వాఁ డామెతలవెండ్రుకలను బట్టి యీడ్చెను. ఆసమయంబున జంగమస్థావరములతో లోకములు గాఢమైన చీఁకటిచే వ్యాపింపఁబడి స్వస్థావస్థ తప్పి వ్యసనముచే సోలెను. చీఁకట్లు క్రమ్మెననఁగా శోకాంధకారమున మునిఁగి దిగ్భ్రమ పొందియుండెనని భావము.

ఉ. వీవఁడు మారుతుం డపుడు ♦ వెల్వెలఁబాఱె దివాకరుండు రా
జీవభవుండు లో నెఱిఁగి ♦ సీతను రావణుఁ డేఁచు చుండుటల్
కావర మెత్తి, చక్కఁబడెఁ ♦ గార్యము పొమ్మనె, శోకమోదముల్
దేవఋషుల్ భజించిరి స♦తీవ్యథ రావణుచేఁ జూచుచున్. ౫౨-౩

మారుతుఁడు = వాయువు, దివాకరుండు = సూర్యుఁడు, రాజీవభవుండు = బ్రహ్మ, ఏచుచుండుటల్ = బాధించుటలు, కావరమెత్తి = పొగరుపట్టి, కార్యము = దేవతలకార్యము, రావణవధ. శోకమోదముల్ = శోకము సంతోషము. సీత బాధపడునని శోకము. రావణుఁడు చెడునని సంతోషము. క్రమాలంకారము.

తా. వాయువు విసరలేదు. సూర్యుఁడు వెలవెలఁ బోయెను. బ్రహ్మదేవుఁడు రావణుఁడు సీతను బాధించుట మనస్సునం దెఱిఁగి 'దేవకార్యము చక్కఁబడెను, రావణుఁడు చచ్చెను, నిశ్చయము. అనెను. దేవతలు ఋషులు సీతపడెడిబాధ చూచి దుఃఖించిరి. రావణునిచేటు చూచి సంతోషించిరి.

రావణుఁడు సీత నెత్తుకొని పరువెత్తుట.

క. రామా రామా యనుచును, సౌమిత్రీ యనుచు నేడ్చు♦జనకతనూజన్
వ్యోమపథంబునఁ గొని యు, ద్దామజవంబునను బఱచె ♦ దశకంధరుఁడున్. ౧౧౪

తా. రామా రామా లక్ష్మణా యని యేడ్చుచుండు సీతాదేవిని నాకాశమార్గమునఁ దీసికొని మిగులశీఘ్రముగ రావణుఁడు పరువెత్తెను.

ఉ. నీరదదేహుఁడైన రజ♦నీచరుచెంగట స్వర్ణవర్ణ క్రొ
క్కారుమెఱుంగునాఁ బొలిచె ♦ గాలికిఁ బై నెగయన్ సతీమణీ
భూరిమయాంశుకాంచలము ♦ పూర్వసుధాశనలోకభర్తయున్
మారుతమిత్రదీప్తగిరి♦మాడ్కి రహించెను జేటు దోఁపఁగన్. ౧౧౫

నీరదదేహుఁడు = మేఘమువలె నల్లనిదేహము గలవాఁడు, చెంగటన్ = ప్రక్కన, స్వర్ణవర్ణ = బంగారుచాయగలదేహముగలది, క్రొక్కారుమెఱుంగు నాన్ = తొలకరిమెఱుపో యన్నట్లు, సతీమణీ = పతివ్రతలలోశ్రేష్ఠురాలైన సీతాదేవియొక్క, భూరిమయ = బంగారుమయమైన, అంశుకాంచలము = చీరకొంగు, పూర్వసుధాశనలోకభర్త = పూర్వదేవతలగు రాక్షసులసమూహమునకురాజు, మారుతమిత్ర = అగ్నిహోత్రముచే, దీప్త = మండుచున్న, గిరిమాడ్కి = కొండవలె, చేటుదోఁపఁగన్ = కీడుసూచింపఁగా – మెఱుపుదీఁగ యుపమానముగాఁ జెప్పుటచే నవి యెట్లుక్షణకాలము మేఘమునొద్ద నుండునో యట్టులే యల్పకాలమే రావణునొద్ద సీతయుండు నని వస్తుధ్వని.

తా. నల్లనిమేఘమువంటి కాంతిగల రావణుప్రక్కన బంగారువన్నెగల సీతాదేవి తొలకరిమెఱుపువలెఁ బ్రకాశించెను. బంగారుమయమైన యామెపైఁట కొంగు గాలికి పైకెగసి రావణు కప్పుటచూఁడఁగా కాలుచున్నకొండవలె నతఁడు కానవచ్చి యతఁడట్టులే కాలఁగలఁడని రాఁగలకీడును సూచించెను.

క. తరుణీమణి ధరియించిన, పరిమళభరితములు తామ్ర♦పంకజదళముల్
సురశాత్రవనాయకుపై, మరుదాహతిఁ దొరఁగి ధరణి♦మండలి డొల్లెన్. ౧౧౬

పరిమళభరితములు = సువాసనచేనిండినవి, తామ్రపంకజముల్ = ఎఱ్ఱని

కమలముల రేకులు, సురశాత్రవనాయకుపై = దేవవిరోధులగురాక్షసుల రాజుపై, మరుదాహతిఁ = గాలికొట్టుటచే, తొరఁగి = పడి, డొల్లెన్ = రాలెను. దీనివలన రావణునైశ్వర్య మిట్టులే పడిపోవు నని వస్తుధ్వని.

క. ఆకల్యాణిదుకూలం, బాకాశమునందు వెలిఁగె ♦ హాటకరుచి న
స్తోకాతపమున రవిశో,ణీకృతధారాధరంబు ♦ నెఱిచూపట్టన్. ౨౨౧

ఆకల్యాణిదుకూలము = మంగళకారిణియగు సీతాదేవి పచ్చనిపట్టువస్త్రము, హాటకరుచిఁ = బంగారుకాంతితో, అస్తోక = అధికమైన, ఆతపమున = ఎండచే, రవిశోణీకృత = సూర్యునిచే నెఱ్ఱగాఁజేయఁబడిన, ధారాధరంబునెఱి = మేఘమువలె, చూపట్టఁ = కనఁబడఁగా – అస్తోకాతప మనుటచే నిది మధ్యాహ్నసమయ మని యేర్పడుచున్నది. మధ్యాహ్నసమయమున మేఘ మెఱ్ఱనగుట యశుభసూచకము.

తా. ఆమంగళకారిణియగుసీత కట్టినపచ్చనిపట్టువస్త్రము ఆకాశమందు సూర్యుని కిరణములచే నెఱ్ఱనైన మేఘమువలెఁ గానవచ్చెను.

క. ఆసురనాథాంకగ యగు, నాసుందరి సునసవక్త్ర ♦ మారాముఁడు తో
వాసింపమి భాసిల్లదు, వాసి దఱుగఁ దూఁడులేని ♦ వనజం బనఁగన్. ౨౨౨

ఆసురనాథాంకగ = రాక్షసనాయకుని తొండియందుండు సీతాదేవియొక్క, సునసవక్త్రము = మంచినాసికగలముఖము, నాసికాశబ్ద ముపసర్గమునకుఁ బరమైనపుడు నసయగు. "ఉపసర్గాచ్చ" పాణిని, ౫-౪-౧౧౯. తోఁ = తోడుగ, వాసింపమిఁ = లేమిచే, తూఁడు = తామరకాఁడ, వనజము = కమలము. దీనిచే సీతాఖిన్నత విశేషించె నని సూచితము.

తా. రావణాసురునితొడయందుండు నాసీతాదేవియొక్క చక్కనిముక్కుగలముఖము రాముఁడు చెంతలేనికారణమునఁ దామరకాఁడలేని కమలమువలెఁ బ్రకాశింపలేదు.

క. సులలాటము కురుళాంతము, సలలిత మవ్రణము ఫుల్ల ♦ సారససమ మా
జలజాక్షిమోము పొలిచెను, జలదంబును వ్రచ్చి తోఁచు ♦ చెందురుఁ డనఁగన్.

సులలాటము = మంచినొసలుగలది, కురుళాంతము = ముంగురులు కొనగాఁగలది, సలలితము = అందమైనది, అవ్రణము = దోషములేనిది, ఫుల్లసారససమము = వికసించినకమలముతో సరియైనది, జలదంబును = మేఘమును, వ్రచ్చి = పగులఁదీసికొనివచ్చి, తోఁచు = కానవచ్చు. ప్రతిచంద్రదర్శన ముత్పాత సూచకము.

తా. మంచినొసలుగలదియు, ముంగురులవఱకు వ్యాపించినదియు, నందమైనదియు, దోషరహితమైనదియు, వికసించినకమలముతో సమానమైనదియు నగుసీతాదేవిముఖము మేఘమును బగులఁదీసికొని వచ్చి కనఁబడు చంద్రునివలెఁ గానవచ్చెను.

చం. సలలితశుక్లదంతమును ♦ జంపకకుట్మలతుల్యనాసముఞ్
విలసితహాటకాభరణ♦విభ్రమమున్ బతదుత్పతత్సుకుం
తలమును బక్వబింబఫల♦సవ్యతరోష్ఠము రావణాంకసం
కలితసతీముఖంబు దివిఁ ♦ గ్రాలె దినోదితచంద్రబింబమై. ౨౩

సలలితశుక్లదంతమును = అందమైన తెల్లనిదంతములు గలదియు, తాంబూల మభావమగుటచేఁ దెల్లగా నున్నవి. చంపకకుట్మల=సంపెఁగమొగ్గతో, తుల్య=సమానమైన, నాసముఞ్=నాసికకలదియు, విలసిత=విశేషముగఁ బ్రకాశించు, హాటకాభరణ = బంగారుభూషణముల, విభ్రమము = విలాసముకలదియు, పతత్ + ఉత్పతత్ + సుకుంతలమును = పడుచు పైకెగయుచు నుండు మంచివెండ్రుకలుకలదియు, పక్వబింబఫల = పండినదొండపండువలె, సవ్యతరోష్ఠము = మిగుల మనోహరమైన పెదవికలదియు, రావణాంకసంకలిత = రావణునితొడయందుండు, సతీ=సీతాదేవియొక్క, ముఖంబు = మోము, దినోదితచంద్రబింబమై = పగలుపుట్టిన చంద్రబింబమువలెఁ గాంతిహీనమై.

తా. అందమైన తెల్లనిదంతములు, సంపెఁగమొగ్గవంటి నాసిక, బంగారుసొమ్ముల విలాసము, పడుచు నెగురుచు నుండువెండ్రుకలు, దొండపండువంటి పెదవి గలిగి రావణాంకమున నుండుసీతాదేవిముఖంబు పగ లుదయించిన చంద్రబింబము వలె నుండెను. సీతాదేవి సహజసౌందర్యము గలదయ్యును బొగ్గులోఁ బొదివిన మణివలె రావణునొద్ద నుండుటచే కాంతిహీనయై కానవచ్చెను.

కం. ఎంచఁగ నీలాంగాసురు, నంచునఁ గాంచనసువర్ణ ♦ యవనీసుత దాఁ
గాంచనకాంచిక హరినీ,లాంచిత యై నట్లు పొలిచె ♦ నంబరవీథిన్. ౨౪

నీలాంగాసురు = నల్లనిదేహముగల రాక్షసుని, కాంచనసువర్ణ =బంగారువంటి మంచివన్నెగలది, కాంచనకాంచిక = బంగారొడ్డాణము, హరినీలాంచిత = ఇంద్రనీలముతోఁ గూడినట్లు. ఇది వ్యతిరేకోక్తి. తెలుపుమీఁద నలుపునకు కాంతియెక్కువ. వెండితోడ నింద్రనీలము విశేషముగఁ బ్రకాశించును గాని పచ్చని బంగారుమీఁదఁ బ్రకాశింపదు. అంబరవీథి = ఆకాశమార్గము.

తా. నల్లనిదేహముగల రావణునొద్ద బంగారువన్నెగల సీత బంగారొడ్డాణము నీలమణితోఁ గూడినట్లు ప్రకాశింపదయ్యెను.

కం. భాసురతప్తసువర్ణో, ద్భాసితభూషామనోజ్ఞ ♦ పంకజగౌర
శ్రీ సీత మొగులుచెంగట, వాసించిన మెఱుఁగు వోలె ♦ వర్తిలు చుండెన్. ౨౫

భాసుర = ప్రకాశించు, తప్తసువర్ణ = పుటము వేయఁబడిన బంగారుచే, ఉద్భాసిత = మిగులఁ బ్రకాశించు, భూషామనోజ్ఞ = ఆభరణములచే మనోహరమైనది, పంకజగౌరశ్రీ = కమలమువంటి గౌరకాంతిగలసీత.

తా. పుటము వేయఁబడిన బంగారుసొమ్ములచే నింపై కమలమువలె గౌర

కాంతిగల సీత రావణునొద్ద మేఘము చెంగటి మెఱుపువలె నుండెను. అనఁగా మెఱుపువలన మేఘమునకుఁ గాంతియే గాని మేఘమువలన మెఱుపునకు వచ్చు శోభ లేదని భావము.

తే. పగడపుందీఁగెఁ బోలిన♦పడఁతి సీత, నల్ల నగుమేనివాని నా ♦ నల్లదిండి.
బంగరువుశృంఖలచేత ని♦బద్ధ మైన, వారణంబువిధంబున ♦ నఱలఁ జేసె. ౬౯౩

నల్లదిండి = రాక్షసుఁడు, నల్ల = నెత్తురు. ఏనుఁగునకుఁ గట్టఁబడిన గొలుసు మావటివానికి నేనుఁగు పట్టుపడునట్లు చేయును. అట్లులే సీత రావణుఁడు రామునకు లోపడఁ జేసెను.

తా. పగడపుఁదీఁగవంటి సీత నల్లని రావణుకొండినుండి బంగారుగొలుసు గట్టఁబడిన యేనుఁగువలెఁ బ్రకాశింపఁ జేసెను.

క. చంచలనేత్రాసంభృత, కాంచనభూషావితాన♦ఘల్ ఘల్ నినదో
దంచితరాక్షసపతి రా,ణించె సశంపారసితము ♦ నీరద మనఁగన్. ౬౯౪

చంచలనేత్రా = చలించునేత్రములుగలసీతచే, సంభృత = భరింపఁబడిన, కాంచనభూషావితాన = బంగారుసొమ్ముల సమూహముయొక్క, ఘల్ ఘల్ నినద= ఘల్లు ఘల్లుమను ధ్వనిచే, ఉదంచిత = ఒప్పుచున్న, రాక్షసపతి = రావణుఁడు, సశంపారసితము = మెఱుపుతో నుఱుముతోఁ గూడినది, నీరదము = మేఘము.

తా. సీతాదేవి ధరించిన బంగారుసొమ్ముల ఘలుఘల్లనుధ్వని రావణుని మెఱుపులతోను ఉఱుముతోను గూడిన మేఘమువలెఁ గనఁబడఁ జేసెను.

ఉఱుములు మెఱుము లెక్కువగాఁగల మేఘము తక్కువగా వర్షించును. శీఘ్రమునందే రూపుమాయును. అట్లులే రావణుఁ డనిభావము.

చ. జనకసుతాశిరస్ఖలిత♦చారుసుమంబులు నేల వ్రాలు చ
ద్దనుజుఁడు పాఱువేగమునఁ ♦ దద్దయు సుళ్లను బెట్టి కొన్ని యా
తనిమెయిఁ జుట్టుచుం దిరిగెఁ ♦ దారక లోలి సుపర్వమందిరా
వనిధరనాథుఁ జుట్టి చెలు♦వంబుగఁ గ్రుమ్మరు చున్నరీతిగన్. ౬౯౫

జనకసుతా = సీతాదేవియొక్క, శిరస్ = తలనుండి, స్ఖలిత = రాలిన, చారుసుమంబులు = మనోహరములైనపూవులు, మెయిన్ = దేహమును, సుపర్వమందిరావనిధరనాథున్ = దేవతల కాలయమైన మేరుపర్వతమును. 'మేరుస్సుమేరు ర్హేమాద్రీ రత్నసాను స్సురాలయః' – అమరకోశము.

తా. సీతాదేవిశిరస్సునుండి రాలిన యందమైన పూవులు నేలపైఁ బడుచు రాక్షసుఁడు పరువెత్తు వేగమునఁ గలిగిన సుడిగాలిచే నవియును సుళ్లుపెట్టుచు వాని చుట్టు తిరిగి నేలఁబడుట చూడ నక్షత్రములు మేరుపర్వతమును జుట్టి తిరుగునట్లుండెను. ఇది వానిగమనవేగము సూచించుచున్నది.

క. ధరణీతనయోదంచిత, వరరత్నవిభూషణంబు ♦ పదకటకం బు
ర్వర జాఱి పడియె మధుర, స్వరయుతముగ మెఱుఁగుఁదీఁగె ♦ చక్రముపగిదిన్.

ధరణీతనయా = భూపుత్త్రియగుసీతాదేవియొక్క, ఉదంచిత = మిగులప్రకాశించు, వరరత్నవిభూషణంబు = శ్రేష్ఠమైనరత్నములుచెక్కినయాభరణము, అగుపదకటకము = కాలికడియము, ఉర్వరన్ = భూమియందు.

తా. రత్నములుచెక్కఁబడి సీతాదేవి ధరించిన కాలికడియము జాఱి భూమిమీఁద మధురధ్వనితో చక్రాకారమైన మెఱుఁగుఁదీఁగవలెఁ బడెను.

సీ. రావణుం డారాము ♦ రమణి మహోల్కనాఁ, బ్రసభంబుననుగొని ♦ పాఱుచుండ
నాసతియగ్ని వర్ణాభరణంబులు, దివినుండి చుక్కల ♦ ట్లవనిరాలె
స్తనతలభ్రష్టచం ♦ ద్రద్యుతిహారాళి, యాకాశగంగనా ♦ నమరెఁ బడుచుఁ
బడఁతిని ఖగయుక్త ♦ పవనకంపితతరుల్, ధూతాగ్రముల భీతిఁ ♦ దొలఁగు మనియెఁ

ఆ. త్రస్తమీనజలచ ♦ రంబులతో ధ్వస్త, నలినతతులతోడఁ ♦ గొలఁకు లెల్ల
నూర్పు నిలచియున్న ♦ యుత్తమసఖినాఁగ, భూమిసుతకుఁగాఁగఁ ♦ బొక్కుచుండె.

మహోల్క = పెద్దయుత్పాతసూచకనక్షత్రము. ఉల్క యనఁగా కొఱవి. సీతను రావణుఁడు తనయింటికిఁ దీసికొనిపోవుట కొఱవిని దీసికొనిపోయిన ట్లని భావము. అగ్నివర్ణాభరణంబులు = అగ్నికాంతిగలసొమ్ములు, దివినుండి = ఆకాశమునుండి, స్తనతల = స్తనప్రదేశములనుండి, భ్రష్ట = జాఱిన, చంద్రద్యుతి = చంద్రునికాంతిగల, హారాళీ = ముత్యాలదండలవరుసలు, ఖగయుక్త = పక్షులతోఁగూడిన, పవనకంపిత = గాలిచేఁ గదలుచున్న, తరుల్ = చెట్లు, ధూతాగ్రములన్ = ఎగురుచున్నకొనలచే, త్రస్తమీనజలచరంబులతోన్ = భయపడినచేఁపలు మొదలగునీటిజంతువులతో, ధ్వస్తనలినతతులతో = ధ్వంసముచేయఁబడిన కమలములసమూహముతో, ఊర్పునిలిచియున్న = శ్వాసమాడకయున్న, అనఁగా మూర్ఛిల్లిన.

తా. రావణుఁడు సీతను బలవంతముగఁ దీసికొనిపోవుట తనయింటఁ జెఱ్ఱకుఁ గొఱవిని దీసికొని పోయిన ట్లుండెను. ఆమెధరించిన యగ్నికాంతిగల బంగారుసొమ్ము లాకాశమునుండి చుక్కలు రాలినట్లు నేలఁబడెను. ఆమె మెడలో ధరించిన ముత్యాలసరము లాకాశగంగవలెఁ గానవచ్చెను. పక్షులతోఁగూడి గాలికి కదలు కొమ్మలుగల చెట్లు ఎగురుచున్న కొమ్మలతో భయపడవల దని చెప్పుచు చేత సైఁగలు చేసినట్లుండెను (పక్షులకూఁతలు అభయవాక్యములుగాను, కొమ్మలుకదలుట అభయహస్తాభినయముగా నెంచవలెను). సీతభూమిజాత. తాము భూమిజాతములు గావున నీస్నేహప్రదర్శనము. భయపడిన చేఁపలతో చెదరినకమలములతో సరసులు మూర్ఛపోయిన స్నేహితురాలికివలె సీతాదేవికై పొక్కుచుండెను. (చేఁపలు కన్నులుగాను, కమలములు ముఖములుగాను భావింపవలెను.)

క. కలయఁగ నెల్లెడ నెరయుచు, బలితపుసింగములు పులులు♦పక్షులు మృగముల్
తలఁగనిరోసంబున ను, గ్మలినీడలజాడఁ బఱచెఁ♦గను చుప్పరమున్. ౪౯౮

ఉప్పరముఁ = ఆకాశమును, ఉగ్మలి = స్త్రీ.

తా. సింహములు, పులులు, పక్షులు, మృగములు, అన్ని చోటుల వ్యాపించి శమింపని కోపంబున సీతాదేవి నీడ జాడఁబట్టి యాకాశముఁ జూచుచుఁ బరువు లెత్తెను. భూతమైత్రిగలవారివిషయమున నెంతటి క్రూరజంతువైనను మైత్రినే చూపించును. రావణుఁడు భూమిమీఁద దిగియుండిన నివియన్నియు వానిని బీఁకి తినియుండును.

చ. ఉరలఁగ నిర్ఝరాశ్రుగణ♦ ముచ్ఛ్రితశృంగకరంబులఁ గుహాం
తరతలనిర్గతానిలన♦దంబు నెపంబున నేడ్చె సర్వభూ
ధరములు వంచనాపహృత♦ధారిణికన్యవిపద్దశాప్తికిఁ,
సరసిజమిత్రమండలము♦ సాగెను దీనత నెల్ల నెల్ల నై. ౪౯౯

నిర్ఝరాశ్రుగణము=కొండవంకలనెడికన్నీళ్లు, ఉరలఁగఁ = రాలఁగ, ఉచ్ఛ్రితశృంగకరంబులఁ = మీఁదికెత్తఁబడిన శిఖరము లను చేతులతో, నిర్గత= వెడలుచున్న, అనిలనదంబు నెపంబున = గాలియొక్కచప్పుడుమిషగా, సర్వభూధరములు = అన్ని పర్వతములు, వంచనాపహృత = మోసముచే హరింపఁబడిన, ధారిణికన్య = సీతాదేవికి, విపద్దశాప్తికిఁ = ఆపదదశ లభించినదానికై, సరసిజమిత్రమండలము = సూర్యమండలము.

తా. కొండవంక లనుకన్నీళ్లు రాలఁగా నెత్తైన శిఖరము లనుచేతు లెత్తి గుహాలలోనుండి వెలువడు గాలిచప్పుడు రోదనధ్వనిగా పర్వతము లన్నియు మోసముచే సీతాదేవికిఁ గలిగిన విపత్తునకై యేడ్చెను. సూర్యమండలము కాంతిహీనమై వ్యసనముతో మెల్లగఁ బోయిన ట్లుండెను.

ఉ. ఎక్కడిధర్మ మింక నిల♦ నెక్కడిసత్యము నార్జవం బయో
యెక్కడ నానృశంస్య మది♦ యెక్కడ నిక్కుటిలుండు జానకిఁ
దిక్కఱినట్లు వంచనను♦ నిష్ఠురతం గొనిపోవ లోకమం
దొక్కఁడు నైనఁగాదనఁ డ♦యో యని యేడిచె భూతసంఘముల్. ౫౦౦

ఆర్జవము = కపటములేమి, ఆనృశంస్యము = దయ, కుటిలుండు = మోసగాఁడు, వక్రబుద్ధిగలవాఁడు, దిక్కఱినట్లు = దిక్కులేనిదానివలె, నిష్ఠురతఁ = కఠినమనస్సుచే.

తా. ఈవంచకుఁడు సీతాదేవిని దిక్కులేనిదానివలె మోసగించి కఠినుఁడై హరించికొనిపోవుచుండఁగా లోకమున నిందఱుండియు నొక్కరైన నయ్యో పాపమని ఛీ నీకిది తగదు విడువు మని యనరే? ఇంకను లోకమున ధర్మము సత్యము

ఋజుత్వము దయ యనునవి యున్నవా? ఈగుణములు గలవారు లేరు లేరు అని భూతిము లేడ్చెను.

క. వ్రేలెడుమోములతో భయ,లోలత మృగశాబకములు ♦ లుఠదశ్రులతో
బాలామణి చనుమార్గము, వాలాయము చూచి చూచి ♦ వనరుచు నుండెన్.

మృగశాబకములు = మృగములపిల్లలు, లుఠత్ + అశ్రులతోన్ = పొరలి పొరలివచ్చుకన్నీళ్లతో.

తా. పెద్దమృగములు సీత నీడ వెంటఁ బరువెత్తుచుండ పిల్లమృగములు ముఖములు వ్రేలవైచికొని భయముచే వణఁకుచు కన్నీళ్లు పొరలిపొరలిరాఁగా సీతాదేవి పోవుమార్గమును గనుతెప్ప వ్రాల్పక చూచిచూచి మిగుల దుఃఖించుచుండెను.

చ. కనుఁగొనుచున్ ధరాతలముఁ ♦ గమ్రరవంబున రామ లక్ష్మణా
యని పలవించుచున్ దెసల ♦ నడ్డము రారె మహాత్ము లెవ్వరే
నని తిలకించుచుం జనుమృ ♦ గాక్షినిగాంచి వణంకుమేనులొ
ప్పన వనదేవతావితతి ♦ ఘోరన యేడ్చె మహాస్వనంబునన్. ౯౦౨

కమ్రరవంబునన్ = మనోహరమైనధ్వనితో, తిలకించుచున్ = చూచుచు.

తా. భూమిప్రక్కఁ జూచుచు మనోహరధ్వనితో రామా లక్ష్మణా యని యేడ్చుచు పుణ్యాత్ములు గొప్పమనస్సుగలవా రెవ్వరైన నడ్డమురారా విడిపింపరా యని దిక్కులు చూచుచు పోవుచున్న సీతను జూచి తమ దేహములు వణఁకుచుండఁగా వనదేవతలు పెద్దపెట్టున నేడ్చిరి.

చ. పెరిగినతారహారములు ♦ బీఁటలు వాఱినయోష్ఠబింబమున్,
గరఁగినచిత్రకంబుఁ గను ♦ కాటుక, వ్యాకులకుంతలంబులన్
బరఁగుసతీమణిన్ నిజవి ♦ నాశముపొంటె గ్రహించి రావణుం
డరుగ వివర్ణవక్త్రయు భ ♦ యవ్యథితాత్మయు నౌచు సీతయున్. ౯౦౩

పెరిగిన = తెగిన, తారహారములు = ముత్యాలసరములు, బీఁటలువాఱిన = పగిలిన, ఓష్ఠబింబమున్ = దొండపండువంటిపెదవి, చిత్రకము = తిలకము, వ్యాకుల = చెదరిన, కుంతలంబులు = తలవెండ్రుకలు, వివర్ణవక్త్రయు = వన్నెమాఱిన ముఖముగలదియు, భయవ్యథితాత్మయు = దిగులుచేబాధపడు మనస్సుగలదియు.

తా. ముత్తెపుసరులు తెగిపోఁగా, పెదవి యూర్పుకాఁకకు పగుల్లుపాఱఁగా, తిలకము, కాటుక, గరఁగఁగా, వెండ్రుకలు చెదరఁగా, నుండుసీతాదేవిని తనచావు కొఱకే పట్టుకొని రావణుఁడు పోవుచుండఁగా తెల్లఁబాఱినముఖము భయముచే బాధపడుమనస్సుగలదై యామె.

క. రోదనరోషములను నెఱ,జాదుకొన న్నేత్రయుగళి ♦ జనభీకరు వ్యా
పాదరతాత్మకు మర్త్యవి, భేదనముగ నిట్టులనియె ♦ బెట్టిదపునుడుల్. ౯౦౪

రోదనరోషములను = ఏడుపుచేతను కోపముచేతను, నెఱజాఁదుకొనఁగ = మిక్కిలి యెఱ్ఱనకాఁగా, వ్యాపాదరతాత్మకు = ద్రోహచింతనమందే యాసక్తిగల మనస్సుగలవానిని, బెట్టిదపునుడుల్ = భయంకరములైనమాటలు.

తా. ఏడ్చుటచేతను గోపముచేతను గన్నులురెండెఱ్ఱగాఁ గాఁగా ప్రజలకు భయంకరుఁడై పరులహింసించుటయందే ప్రీతిగలమనస్సుగల రావణుని మర్మములు ఛేదించు భయంకరవాక్యముల నిట్లనెను.

## ౫౩-వ సర్గము. సీత రావణు నిందించుట.

ఉ. ఏమిర సిగ్గు లేదటర ♦ యేకత మే నటు లుండఁ జూచి నీ
వీమెయి ముచ్చిలించుకొని ♦ యెత్తినభీతిని బాఱిపోయెదే
నీమటుమాయయే కద వ ♦ నిఁగ మృగరూపముచేత నామనో
రాముని దవ్వుగాఁ బనిచె ♦ రాక్షసవంశదవాగ్నిహోత్రుఁడా. ౧౦౫

తా. ఓరీ! రాక్షసవంశమనువెదురుపొదకుఁగాఱుచిచ్చువంటివాఁడా! ఆఁడుదానను నే నొంటిఁగా నుండుటఁ జూచి నీ వీవిధముగా దొంగిలించికొని పరువెత్తి పోయెదవే నీకుఁ గొంచెమైన సిగ్గులేదేమిరా? నీవు చేసినమాయయే గదా యడవియందు మాయామృగరూపముచేత నామనోవల్లభుని దూరముగాఁ గొనిపోయినది. రాక్షసవంశ మనెడియడవికి నీవే చిచ్చయినా వేమిరా.

ఆ. నాదుమామసఖుని ♦ నన్ను సంరక్షింప, మొనసి వచ్చినట్టి ♦ ముసలిగ్రద్దఁ
బెద్దపెనఁగి నీవు ♦ పిలుకుమార్చితి వోర, యెంతశూరుఁడవుర ♦ హీనచరిత. ౧౦౬

పెద్దపెనఁగి = దీర్ఘకాలము పెద్దయుద్ధము చేసి, పిలుకుమార్చితివి = చంపితివి, హీనచరిత = నీచపునడవడిగలవాఁడా.

తా. నామామమిత్రుఁడై నన్నుఁ గాపాడుటకై వచ్చిన ముసలిగ్రద్దతోఁ బెద్దయుద్ధముచేసి చంపితివి. నీచచరిత్రుఁడా! ఆహా! నీ వెటువంటిశూరుఁడవురా. ముసలిగ్రద్దతోనే యింతపెద్దయుద్ధము చేసినవాఁడవు రామలక్ష్మణుల బారిపడిన నీగతి యేమో.

ఆ. పేరు చెప్పుకొనెడి ♦ బింక మేమియు లేక, కలనిలోన నన్ను ♦ గెలువ లేక
దుష్టరాక్షసుండ ♦ దొంగిలి పఱచెదే, యహహ యేమి నీమ ♦ హాబలంబు! ౧౦౭

బింకము = పౌరుషము, కలనిలోన = యుద్ధమందు.

తా. యుద్ధమందు నిలఁబడి యిదిగో రావణుఁడను, యుద్ధమునకు వచ్చితిని, అని పేరుచెప్పుకొను పౌరుషములేక యుద్ధమందు నాభర్తను గెలువలేక నన్ను దొంగిలించికొని పరువెత్తుచున్నావే! పాపాత్ముఁడా యేమి యహహ నీపౌరుషము!! ఏమినీబలము!

ఉ. ఈదృశ మైనగర్హితపు ♦ హేయపుఁగార్యముఁ జేసి యన్యయా
పైదలి దొంగిలించికొని ♦ పాఱెద భీతి దురాత్మ బాలిశా

లేదట రోరి సిగ్గు లవ♦లేశము ఛీ నిను శూరమాని వ్యా
పాదరతాత్మఁ గాంచి మగ♦వారు హసింతురు సుమ్ము నీచుఁడా. ౯౦౮

ఈదృశము = ఇటువంటి, గర్హితపు = నింద్యమైనది, హేయపుఁగార్యము = నీచమైనపని, అన్య = ఇతరునకుభార్యయగుదాని, పైదలిన్ = ఆఁడుదానిని, బాలిశా = మూఢుఁడా, లవలేశము = మిక్కిలికొంచెము, శూరమాని = శౌర్యములేకున్నను శూరుఁడ ననితలఁచువాని, వ్యాపాదరతాత్మున్ = ద్రోహచింతనమందుఁ బ్రీతిగల మనస్సుగలవానిని.

తా. స్త్రీచౌర్యమను నింద్యమైన నీచపుఁగార్యము చేసి యితరునిభార్య యగు నాఁడుదానిని దొంగిలించుకొని భయపడి పరువెత్తెదవే, మూర్ఖుఁడా, నీకుఁ గొంచెమైన సిగ్గులేదటర. ఛీ. శూరుఁడు గాకున్నను శూరుఁ డనుపేరు చెప్పుకొను ద్రోహచింతగల నిన్ను మగవారు నవ్వుదురు సుమ్ము.

ఉ. ప్రేలితి కాఱుకూఁతలను ♦ బెద్ద బలంబును శౌర్య మంచు ఛీ
కాలుపనే దురాత్మ కల♦కాల మకీర్తియు వంశనాశమున్
బోలఁగఁ జేయుకార్యమును ♦ బూని తిసీ నిలు పోటుబంట వై
చాలు ముహూర్త మంత, జనఁ ♦ జాలుదె యీమెయితోడ నీగతిన్. ౯౦౯

ప్రేలితి = వదరితివి-కాఱుకూఁతలను = నిష్ప్రయోజనములైనమాటలను, పోటుబంటవై = శూరుఁడవై.

తా. నేను శూరుఁడ నని దొడ్డబలవంతుఁడ నని వ్యర్థపుఁ గూఁతలు కూసితివిగదా! పాపాత్ముఁడా! కాల మనునది యున్నంతవఱకు నీ కపకీర్తి గలిగించి నీవంశము నాశముఁజేయు కార్యమును జేయఁబూనితివి. ఛీ, శూరుఁడవై కొంచెము సేపు నిలిచితివేని నీ వీదేహముతో నిట్లు పోఁగలవా? యాతనాశరీరముతో యమలోకమునకుఁ బోదువే కాని.

తే. చావుపరువునఁ బరువెత్తి♦చనెడినిన్ను, నవనివల్లభుఁ డేమి చే♦యంగఁ గలుగు
నేది నిల్వుముక్షణమాత్ర ♦ మిందునీదు, ఘోరకృత్యఫలంబును ♦ గుడువఁజేయు.

తా. మృత్యుదేవత తఱుముచున్నట్లు చావుబ్రతుకు దెలియక పరువెత్తుచున్నావే! నిన్నారామరా జేమి చేయఁగలఁడు? ఏదీ మగవాఁడవైతివేని క్షణము సేపు నిలువుము. నీపాపకార్యఫలము నీ వనుభవింపఁజేయును.

క. భూవరపుత్రులకంట, న్నీ విప్పుడు పడితివేని ♦ నీసైన్యములున్
నీవును ముహూర్త మైనను, జీవముతో నుండఁగలవె ♦ చెనఁటిపలాశీ. ౯౧౧

పలాశీ = రాక్షసుఁడా, పల + అశీ = మాంసము భక్షించువాఁడా.

తా. ఆరాజకుమారులకన్నులకు నీవు కనఁబడితివా నీవు నీసైన్యములు నొక ముహూర్తకాలమైనను బ్రతుకసాధ్యపడునఁటరా? దుష్టరాక్షసుఁడా!

ఆ. కారుచిచ్చు రేఁగఁ ♦ గాననాంతరములఁ, బులుఁగు దానిఁ జేర ♦ బలములేని
యట్లు నీవు వారి♦యంబకములఁ దేటి, చూడనైన లేవు♦పోఁకుఁడేడ. ౯౧౨

పోఁకుఁడేడ = రాక్షసరాజా!

తా. అడవులందుఁ గారుచిచ్చు విజృంభించినపుడు పక్షులు దాని సమీపింప బలములేనియట్లు నీవు రామలక్ష్మణులు ప్రయోగించుబాణములను కన్నెత్తియైనఁ జూడఁజాలవు. ఇఁక నీవు వానిని ఖండించు టేమి? యుద్ధము చేయు టేమి?

మ. వినరా నీకు హితంబుఁ జెప్పెద నను ♦ వే వీడుమీ నానుడుల్
విన వేనిన్ భృశమత్ప్రధర్షణరుషా♦వేశంబునన్ భూమిభృ
త్తనయుం డాత్మసహోదరాన్వితుఁ డనిన్ ♦ దర్పించి యర్పించు నీ
తనువుం గంకసృగాలగృధ్రతతికిం ♦ దన్విం గొన న్విందుగన్. ౯౧౩

భృశ+మత్+ప్రధర్షణరుషావేశంబునన్ = అధికమగు నన్ను నవమానపఱుచుటచేఁ గలిగినకోపావేశముచే, భూమిభృత్తనయుండు = రాజకుమారుఁడు, రాముఁడు, అనిన్ = యుద్ధమందు, దర్పించి = బలాతిశయముచేగర్వించి, తనువున్ = శరీరమును, కంక = రాపులుఁగులయు, సృగాల=నక్కలయు, గృధ్ర= గ్రద్దలయు, తతికిన్ = సమూహమునకు, తన్వి = తృప్తి.

తా. ఏలరా చెడిపోయెదవు. నేను జెప్పిన మంచిమాట వినరా. నన్ను మరలఁ దీసికొనిపోయి రామున కర్పింపుము. అట్లు నామాటచొప్పునఁ జేయకపోయితివా నన్ను నీ వవమానించుటచేఁ గలిగినకోపమునావేశంబున యుద్ధమున నీదేహమును రాపులుఁగులకు నక్కలకు గ్రద్దలకు తృప్తిగలుగ విందుగాఁ జేయును.

శా. ఏమోకోరిక నన్గ్రహించికొని నీ ♦ వెంతే వడిం బాఱెదే
నామాట ల్వినుమీ ప్రయత్న మది యె♦న్నం డైన సాగంగఁ బో
దో మాయావి మదీయ భర్త నవిజ♦య్యున్ లోకనాథోపమున్
రాముం బాసి చిరంబుగా బ్రదుక నే♦రన్ శాత్రవాధీననై. ౯౧౪

శాత్రవాధీననై = శత్రువులకు లోఁబడినదాననై.

తా. ఏదో చెడ్డకోరిక మనస్సునందుంచుకొని నన్ను నీవు తీసికొని పరువెత్తిపోవుచున్నావు. నామాట విను, నమ్ము. ఎప్పటికైన నీకోరిక కొనసాగునదికాదు. ఓరీమాయలమారీ! నామగని జయింపసాధ్యపడనివానిని జగన్నాథసమానుని రామునిఁ బాసి శత్రువు స్వాధీనమందు దీర్ఘకాలము బ్రదుకఁజాలను.

క. కృపణుఁడు మృతికాలంబున, విపరీతమ్ముల భుజించు♦విధమున నీవున్
జపలత నీసేమం బే, వ్యపగతమతి నెఱుఁగ లేవు ♦ పాపాత్ముండా. ౯౧౫

కృపణుఁడు = నీచుఁడు, విపరీతమ్ములన్ = అపథ్యపదార్థములను, చపలత = బుద్ధినిలుకడలేమిని, వ్యపగతమతిన్ = బుద్ధిహీనతచే.

తా. నీచుఁడు మరణకాలము ప్రాప్తించినపు డపథ్యపదార్థములఁ దినునట్లు

నీవును నింద్రియచపలతచే నీకు మేలేదో తెలిసికోలేక బుద్ధిహీనుఁడవై యున్నావు. ఏలయందువా? నీవు పాపాత్ముఁడవు. కావున నీకు మేలగుమార్గము స్ఫురింపదు.

క. పథ్యముచేఁదగు నరునకుఁ, దథ్యము చానున్న వేళఁ ♦ దగులదు సుమి వై
తథ్యము నా నుడికిని నా,తిథ్యమునకు నిన్ను నీడ్చె ♦ దినకరసుతుఁడున్. ౯౧౬

తథ్యము = నిజము, చానున్న వేళ=చచ్చుటకుసిద్ధముగానున్నసమయమున, వైతథ్యము = వ్యర్థము, దినకరసుతుఁడు = యముఁడు.

తా. చావు సమీపించిన సమయంబున మనుష్యునకుఁ బథ్యవస్తువులు దిన మనస్సుపోదు. పథ్యము చేఁదగును. చేఁదు పథ్యముగఁ దోఁచును. ఇది సత్యము. నా మాట యసత్యముగాదు. ఏమి నీమాట యనెదవా? నిన్ను యముఁడు విందుపెట్ట నీడ్చుకొని పోవుచున్నాఁడు.

ఉ. ఇంతటిపాపకార్య మొక ♦ యింతయుఁ గొంకును జంకు లేక ని
శ్చింతతఁ జేయఁ బూనుటను ♦ జెచ్చెరఁ గాంచెదు హేమభూమిరు
ట్సంతతి, నీఁదె దస్రచయ ♦ సద్మము వైతరణిం, గలాఁడవుర్
స్వాంతమునందు నమ్ము మసి♦పత్రవనంబునఁ గ్రీడ సల్పఁగన్. ౯౧౭

హేమభూమిరుట్సంతతి = బంగారుచెట్లసమూహమును, అస్రచయసద్మము= నెత్తుటివెల్లువకుస్థానము, వైతరణిక్ = నిప్పులయేఱు. ఇది యమలోకమును జుట్టి యుండును. పాపాత్ములను కింకరులు దీనిలో వైచి యీడ్తురు. కలాఁడవు = కలవాఁడవు. ఉన్న, కల, న, పద్ధలమీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాషనగు. సు. వ్యా. క్రియ ౧౨౮. స్వాంతమునందు = మనస్సునందు, అసిపత్రవనము = ఇది యమలోకములోని యొకనరకమునకు పేరు. ఇందలి చెట్లయాకులు కత్తులవలె నుండును.

తా. ఇంతఘోరపాపకార్యమును గొంచెమైన జంకుకొంకు లేక నిర్విచారముగాఁ జేయఁబూనుటచే శీఘ్రకాలమునందే బంగారుచెట్లను జూడఁగలవు. యమలోకమందలి నెత్తుటియేఱు నిప్పులయేటియందు నీఁదఁగలవు. అసిపత్రవనంబునఁ గ్రీడింపఁగలవు. నమ్ముము.

క. సంతప్తహేమపుష్పా,క్రాంతము వైడూర్యదళము ♦ కాలాయసశా
తాంతదృఢకంటకచితము, నంతకశాల్మలిని గలవ ♦ యాలోకింపన్. ౯౧౮

సంతప్త = బాగుగఁగాల్పఁబడిన, హేమపుష్ప = బంగారు పూవులచే, ఆక్రాంతము = నిండినది, వైడూర్యదళము - సంతప్తయనుపదము వైడూర్య కాలాయసపదములతోను నన్వయింపవలెను. = బాగుగఁగ్రాఁగినవైడూర్యమయములగు నాకులుగలది, సంతప్త = బాగుగఁగాలిన, కాలాయస=ఉక్కుమయమై, శాతాంత = వాఁడికొనలుగలదియు, దృఢ = గట్టివియునగు, కంటక = ముండ్లచే, చితము = నిండినదియగు, అంతకశాల్మలిని = యమునిబూరుగువృక్షమును.

ఒక్కొక్కచో సమాసగత పూర్వపదంబు వ్యవహితోత్తరపదం బొంటితో డను వానిపెక్కింటితోడను నన్వయించెడి. ప్రౌ. వ్యా-సమాస ౯౮- ఈసూత్రప్రకారము సంతప్తశబ్దము వైడూర్యకాలాయసశబ్దములతోడను నన్వయించును.

తా. బాగుగఁగాలిన బంగారుపుష్పములతో నిండినదియు, బాగుగఁగాలిన వైడూర్యపుటాకులుగలదియు, బాగుగఁగాలిన యినుపమయమైనపదునైనకొనలు గలదై దృఢములైన ముండ్లచే నిండినదియు, నగుయమపురంబునఁ గలబూరుగు చెట్టును జూడఁగలవు. పరస్త్రీలఁగామించిననీ కీనరకబాధలు తప్పవని యర్థము.

ఉ. అల్పచరిత్ర యంతటిమ♦హాత్ముని వంచన చేసి మేనిలో
నిల్పఁగ నేర్తువా యుసురు♦నిర్ఘృణుఁడా విషపాయిభంగి నీ
కల్పము నేఁటితో ముగిసెఁ గాలభటోత్కటపాశబద్ధునిన్
వేల్పులసూడ! రాఘవుఁడు♦ని న్వధియించెడి నెందుఁ జొచ్చినన్. ౯౧౯

అల్పచరిత్ర = నీచపునడవడిగలవాఁడా! అంతటిజగత్ప్రసిద్ధుఁడైన = మహాత్ముని, ఉసురు = ప్రాణము, నిర్ఘృణుఁడా = దయలేనివాఁడా! విషపాయిభంగిన్ = విషముద్రాగినవానివలె, నీకల్పము = నీజీవితకాలము, కాలభట=యమకింకరుల,, ఉత్కట = భయంకరమైన, పాశబద్ధునిన్ = త్రాళ్లచేఁగట్టఁబడినవానిని, వేల్పులసూడ = దేవవిరోధీ!

తా. నీచపునడవడిగలవాఁడా! యింతంతని చెప్పరాని గొప్పస్వభావము మనస్సుగలవానిని శ్రీరాముని మోసగించి విషము ద్రాగినవానివలె నీదేహములోఁ బ్రాణములు నిలుపఁగలవా? అది నీకు సాధ్యమా? దయాహీనుఁడా! నీకు జీవితకాలము నేఁటితో ముగిసెను. నేను లంకలోఁ బ్రవేశించిన రాముఁడు నన్నేమి చేయఁగలఁడందువేమో? దేవతాశత్రువా! యమకింకరులు నీమెడకుఁ బాశములు తగిలించి యున్నారు. కావున నీవు లంకలోనే గాదు స్వర్గపాతాళములఁ బ్రవేశించినను నిన్నుఁ దప్పక రామచంద్రమూర్తి వధింపఁగలఁడు.

ఉ. భ్రాతయుఁ దోడు లేక ఖల♦రాక్షసులం బదునాల్గు వేవురన్
జేతులతీట పోఁ దుమురు♦సేసె నిమిషములోన రాముఁడా
ఖ్యాతమహాస్త్రవేది సుస♦మర్థుఁడు భార్యను మ్రుచ్చిలించు దు
ర్జాతుని నిన్ను సైఁచునె దు♦రంబున వ్రక్కలు చెక్కకుండునే. ౯౨౦

ఖ్యాతమహాస్త్రవేది = ప్రసిద్ధికెక్కినగొప్పయస్త్రములనెఱిఁగినవాఁడు, సుసమర్థుఁడు=ఎంతటిగొప్పకార్యమయిన సాధింపశక్తిగలవాఁడు, దుర్జాతునిన్=నీచపుఁబుట్టువుకలవానిని, దురంబునన్ = యుద్ధమునందు, వ్రక్కలు = వ్రక్కలగునట్లు.

తా. తమ్ముఁడుకూడఁ దోడులేక యొంటరిగాఁడు దుష్టులను రాముఁడు రాక్షసులఁ బదునాలుగువేలమందిని చేతులదురద పోవునట్టు లల్పకాలములో చూర్ణముచేసెను. అటువంటి గొప్పయస్త్రముల నెఱింగినవాఁడు ఎంతటికార్యమైన

సాధింప మనోబల దేహబల సాధనసంపత్తి గలవాఁడు. తనపెండ్లామును దొంగిలించిన నీచజాతు నిన్ను యుద్ధమందు ముక్కలుముక్కలుగా నఱకక సహించి యూరకుండునా?

కరిబృంహితము. ఇట్టు పలుకుచుఁ బెక్కువిధముల ♦ నేడ్చి కరుణము దోఁపఁగాఁ
దిట్టుచును ఘనశోకభరమున ♦ దీన యయి స్మృతి దప్పుచున్
గట్టిగను విలపించి పొరలుచుఁ ♦ గంప మొనరఁ దపించుచో
దిట్ట యయి యసురాధముఁడు నృపు ♦ దేవిఁ గొని చనెఁ బాపియై.

తా. ఈవిధముగాఁ బలువిధముల మాటలాడుచు నేడ్చుచుఁదిట్టుచు శోకాతిశయముచే దీనురాలై స్మృతితప్పి పడుచు గట్టిగా నేడ్చుచుఁ బొర్లుచు దేహమున వణఁకుపుట్టి తపించుచుండఁగా రాక్షసాధముఁడు దిట్టతనంబున సీతను దీసికొని పోయెను.

కరిబృంహితము. భ న భ న ర గణములు, పదుమూఁట యతి.

-ఁఁ- ౫౪-వ సర్గము. సీత తనయాభరణంబులు కపులముందట వైచుట. -ఁఁ-

చ. అతఁ డటు పోవుచుండ నొకఁ ♦ డైనను గానఁగ రామిఁ బొక్కుచున్
క్షితిసుత కాంచి భూమిధర ♦ శృంగచరత్కపిపంచకంబు నీ
క్షితిరుహచారు లేనియును ♦ జెప్పక యుందురె రాముతోడ నా
గతి యని కొంగునన్ ముడిచి ♦ కాంచనభూషలు వారి ముంగలన్. ౯–౨–౨

భూమిధరశృంగ = పర్వతశిఖరమునందు, చరత్ = తిరుగుచున్న. కపిపంచకంబు = ఐదుక్రోఁతులను, క్షితిరుహచారులు = చెట్లయందు సంచరించువారు-క్రోఁతులు, కాంచనభూషలు = బంగారుసొమ్ములు.

తా. ఆపాపాత్ముఁ డిట్లుపోవుచుండఁగా నింతవఱ కొకఁడైనఁ గానరాకుండెను. దానికై తపించుచు నొకచోటఁ గొండశిఖరమునందున్న నైదుగురు వానరులఁ జూచి వీరైనను నాస్థితి రామునితోఁ జెప్పకుందురా యని తనసొమ్ములను దీసి కొంగున ముడివైచి వారిముందు పడునట్లుగా.

ఉ. వైచెను వైచు టాఖలుఁ డ ♦ వారణసంభ్రమసాధ్వసాత్ముఁడై
వేచనుచుంటఁ గన్గొనఁడు ♦ వృక్షచరావళి నిర్నిమేష మా
లోచనముల్ వహించుచు వి ♦ లోలవిశాలవిలోచనామణిన్
జూచెను రామ రామ యని ♦ శోకమునం బలవించు చుండఁగన్. ౯–౩౬

ఖలుఁడు = దుష్టుఁడు, అవారణ = అడ్డములేని, సంభ్రమ = తొట్రుపాటు. సాధ్వస = భయముగల, ఆత్ముఁడై = మనస్సుగలవాఁడై, "సభయహస్తజనితచిత్తక్షోభమువలన నని" తిలకవ్యాఖ్య. రావణుఁడు సీతను జంకలో నిఱికించుకొని పోయినవాఁడు, ఆమె ఎదురుగ నుండినది కాదు. ముందువెనుకలకు త్రాలు

చున్నట్టులు చెప్పఁబడెనుగదా. ఎవరడ్డమువత్తురో యెప్పుడెపుడు పోయి లంకలోఁ బడుదునా యని రావణుదృష్టి ముందుండెను. రామలక్ష్మణులు వత్తురేమో యని సీతాదృష్టి వెనుకప్రక్కనుండెను. ఇట్లు చంకలోఁ బొర్లుటలో వెనుకప్రక్కగ వ్రాలి సీత సొమ్ములుత్తరీయమున ముడిగట్టి వైచెను. కొందఱు చెప్పునట్లు పైఁట కొంగు సీత చింపలేదు. ఇప్పటి స్త్రీల పైఁటవలె సీతకు పైఁటలేదు. కట్టుకొను వస్త్ర మొకటి, కప్పుకొను నుత్తరీయ మొకటి. ఈకప్పుకొన్న దానిలో సొమ్ములు మూటకట్టి వైచెను. కట్టుకొన్నది కప్పుకొన్నది రెండు నొకవన్నె గలవే. ఈ వైచిన సొమ్ములలో కొన్ని దేహమున నొకప్రక్క ధరింపఁబడినవే వైచెను. అనఁగా ఒక చెవికమ్మ, ఒకముక్కుప్రోగు, ఒకచేతి బాజుబందు-వంకీ వైచెనని సుందర కాండమందలి హనుమంతునివాక్యమువలనఁ దోఁచెడి. ఇది తన్ను గుర్తింప ననుకూలపడుటకై చేసిన యుపాయము. వే=శీఘ్రముగ-ఆదరబాదర, నిర్నిమేషము=తెప్పపాటులేనిది, లోచనముల్=కనులు, విలోల=విశేషముగాఁజలించు, విశాల=వెడలుపైన, విలోచనామణిక్=కన్నులుగల శ్రేష్ఠురాలిని.

తా. ఆమూఁటను బడవైచెను. మిగులఁ దొట్రుపాటుతోను భయపడిన మనస్సుతోను, నాదరబాదర వేగముగాఁ బోవుచున్నవాఁడగుటచే రావణుఁడు దానిని జూచిన వాఁడు కాఁడు. చూచియుండిన నానవాలు లేకుండఁజేయ దానిని హరించి యుండును. ఆక్రోఁతులు తెప్పపాటులేని దృష్టులతో విశాలములై చలించుచున్న కన్నులుగల దానిని రామరామ యని శోకమున నేడ్చు దానిని జూచిరి. వాఁడు రావణుఁడని సుగ్రీవాదులు గుర్తించిరి కాని యామె యెవతెయో వారికిఁ దెలియదు. ఈప్రకారము వాఁడెందఱినో యెత్తుకొని పోవుచుండును. ఎవతెయో యేమో యని రిత్తకలహము మనకేల యని వారూరకుండిరి. ఎవతెయైననేమి? ఆఁడుకుయిలు ఆలకుయిలు వినినవారు రక్షించుట ధర్మముగదా యందురేమొ? బలవద్విరోధము. అదియునుగాక వాలికి రావణునకు సఖ్యము గలదు. ఈవార్త తెలియఁగానే వాఁడు బయలుదేఱి సుగ్రీవుని జంప నిదే సమయమని బయలుదేఱి వచ్చును. అని యివి యన్నియు నాలోచించి వారూరక యుండిరి.

ఉ. ఆసురభర్తయుం గడురయంబునఁ బంపను దాఁటి తీక్ష్ణదం
  ష్ట్రాసహితాహికన్యకఁ దోడ్క ధరియించినభంగి దోఁపఁ బృ
  థ్వీసుత మృత్యుదేవి ననఁ దెంపున బల్మి గ్రహించి పర్వతా
  ళీసరసీనదీవనుల లీల నిరస్తశరంబుపోలికన్. ౯-౨౮

తీక్ష్ణదంష్ట్రాసహిత = విషముచేఁ గ్రూరమైనకోఱలతోఁ గూడిన, అహికన్యకక్ = ఆఁడుపామును, పర్వతాళి = పర్వతములవరుసలను, సరసీ=సరస్సులను,

నదీ = ఏళ్లను, వనులన్ = అడవులను. ఇట్లనుటచే నూళ్లమీఁదుగా వాఁడు పోలే దని కేవలనిర్జనమైన యడవిమార్గముననే పోయె నని యేర్పడుచున్నది.

తా. రాక్షసరాజు మిగులవేగముగఁ బంపను దాఁటి క్రూరవిషముగల కోఱలుగల యాఁడుపామును దొడమీఁద నుంచుకొన్నవానివలె సీతను బట్టుకొని తనమృత్యుదేవతనో యన్నట్లు సీతాదేవిని సాహసముచే బలాత్కారముగఁ బట్టుకొని పర్వతములు తటాకములు నదు లడవులు దాఁటి యవలీలగా వింటినుండి విడిచిన బాణమువలె నడ్డములేక యతివేగముగ చక్కఁగా.

ఆ. వడిగ దాఁటి నక్ర♦పాఠీనతిమితిమిం,గిలచయాన్వితంబు ♦ జలధి డాసి
తీఱెఁ బోసురారి ♦ దీనితో నన సిద్ధ,వితతి హృష్టుఁ డగుచు ♦ వేగి యగుచు.

నక్ర = మొసళ్లు, పాఠీన = చేఁప, తిమి = ఇదియొక పెద్దచేఁప, తిమింగిల = తిమిని మ్రింగునది తిమింగిలము, వీని-చయ = సమూహముతో, అన్వితంబు = కూడినది, జలధిన్ = సముద్రమును, డాసి = సమీపించి, సిద్ధవితతి = సిద్ధులసమూహము, దీనితోన్ = ఈసీతాహరణ కార్యముతో, తీఱెఁబో = నిశ్చయముగాఁ జచ్చెను. హృష్టుఁడు = లంకచేరితిని గదా యిఁక భయములేదని సంతోషించిన వాఁడు, హృష్టుఁడు = కొందఱు రామునిచేఁ జచ్చుమార్గము గలిగెఁగదా యని సంతోషించెను. పుణ్యము క్షయింపక పాప మతిశయించినఁగాని మృత్యువు కలుగదు, కావునఁ దమోగుణావృతుఁడై తెలిసితెలిసి తల్లినిగూడ విరుద్ధపువాక్యములు పలికె నని యందురు. దీనికి సర్గాంతమందుఁ జెప్పఁబడు. "బభూవ మోహాన్ముదితః" 'విమోహి మోదితేన్' (౯౩౩-వ పద్యము) అసంగతమగు చున్నది. అట్లులే "ఆత్మానం బుద్ధివైక్లబ్యాత్ కృతకృత్య మమన్యత, కృతకృత్యుఁడ ననుచు బుద్ధిహీనతఁ దలఁచెన్, ౯౩౪ పద్యము అనునదియు నసంగతమే అని తిలకవ్యాఖ్య.

తా. శీఘ్రముగ దాఁటిపోయి మొసళ్లు, పాఠీనములు, తిములు, తిమింగిలములు గలసముద్రమును సమీపించి గడ్డనఁ బడితిని. ఇఁక భయములే దని రావణుఁడు సంతోషించుచు సిద్ధులు దీనితో రావణుఁడు చచ్చెను, సిద్ధమని యనుచుండ వేగముగ.

### రావణుఁడు సీతతో లంకఁ జొచ్చుట.

వ. తననగరంబు లంకను న♦తంద్రగతిం జొరఁ బాఱి రావణుం
డనయత సీత నుంచెఁ దన♦యంతిపురంబున దైత్యశిల్పి ము
న్ననువుగఁ దాను మాయసతి♦యట్టుల, యంతఁ బిశాచకాంతలన్
గనుఁగొని మీరు హెచ్చరికఁ ♦ గావలి యుండుఁడు సీత కెప్పుడున్. ౯౩౫

అతంద్రగతిన్ = హెచ్చరికతో, ఎవ్వరికిఁ దెలియకుండునట్లు, అనయతన్ = నీతితప్పినవాఁడై, దైత్యశిల్పి = మయుఁడు, మున్ను = పూర్వము, మాయన్ =

మాయచే, సతియట్టులు = తానుంచుకొన్న హేమనువలె-మాయచే తనసతి నుంచినట్టు లనుటచే (1) ఈగుహ దుర్గమము. దీనిలో నెవరుండునది లోకమునకుఁ దెలియదు. అట్టులే సీత యిందుండుట యెవరికిఁ దెలియ నసాధ్యము. (2) మయునకు హేమయుంపుడుకత్తె. వాఁడు దానవుఁడు. అది దేవతాస్త్రీ. ఇక్కడ నట్టిభావమే గ్రహింపవలెను. (3) మయు నింద్రుఁడు చంపినట్టులు యుద్ధమున రామచంద్రమూర్తి రావణు వధింపఁగలఁ డని యీయుపమానసారస్యము.

పూర్వము దైత్యశిల్పియగు మయుఁడు తా నుంచుకొన్న హేమ యను దానికై తనయద్భుతశక్తిచేఁ గల్పించిన గుహయందు దాని నుంచినట్టులు-ఈకథ కిష్కింధాకాండమందు ౫౧-వ సర్గమునఁ గలదు. ఇచ్చటఁ దిలకవ్యాఖ్యయందు 'మాయామి వాసుర' మ్మని పాఠము గ్రహింపఁబడినది. ఇట్లు గ్రహించి లంకకుఁ దేఁబడిన సీత మాయారూప యనియు ముఖ్యమాత సీత ముందే యగ్నియందుఁ బ్రవేశించె నని ధ్వనిత మనియు, కావుననే రావణుఁ డీసీతను మోయఁ గలిగె ననియు మాయవలననే రావణుఁడు వాస్తవము తెలిసికొనలేకపోయెననియు వ్రాయఁబడినది. సీత మాయారూపము గనుక రావణుఁడు మోయఁ గలిగె నఁట. విరాధుఁ డేసీతను మోసెను? అప్పు డెవ రేమాయ చేసిరి? కావున నీయభిప్రాయము సరిగాఁ దోఁపదు. ఇఁక నీవ్యాఖ్యాత యభిప్రాయ మేమన, మయుఁడు దానవశిల్పి. వీఁడు దేవతాస్త్రీ యగు హేమను నుంచుకొన్నవాఁడు. దానికై స్వయంప్రభాగుహ తనశక్తిచే నిర్మించి యందు దాని దాఁచి యుంచెను. తనకు శత్రువు, దానవుఁడు నగువాఁడు తనజాతి దేవతాస్త్రీ నుంచుకొన్నాఁ డనుట యింద్రునకు సహింపరానిదై వానిని జంపెను. ఈవిధముగ నా దేవతాస్త్రీ మయునిపాలిటికి మృత్యుదేవత యయ్యెను.

అట్టులే సీతయు రావణునకు మృత్యుకారణ మయ్యె నని యుపమానభావము. కావున నిక్కడ మాయ యనఁగా మయసంబంధమైన యద్భుతశక్తియే కాని యింద్రజాలము కాదు. స్వయంప్రభాగృహ యింద్రజాలము కాదు గదా.

మాయ యనఁగా నింద్రజాల మని యర్థము వ్రాసినవారామాయాస్త్రీ యెవ్వతె? అది యెందుకు నేలయుంచఁ బడె ననునైతిహ్యము వ్రాసినవారు కారు.

తా. తనలంకానగరమును మిగులహెచ్చరికతోఁ బరువునఁ బ్రవేశించి నీతిహీనుఁడై రావణుఁడు పూర్వము మయుఁడు మాయచేఁ దాను నిర్మించిన గుహయందు హేమనువలెఁ దనయంతఃపురంబున నుంచి పిశాచస్త్రీలఁ బిలిచి మీరు సర్వకాల సర్వావస్థల సీతపైఁ గావలియుండుఁడు.

ఉ. కాంతలఁ గాని పూరుషులఁ గాని యిటం జొరనీయ కుండుఁ, డే
కాంతము స్వర్ణరత్నవసనాదుల దేనిని సీత గోర నా

వంతయు నడ్డు చెప్ప కిడుఁ ♦ డాసయుఁ గల్గినయేని మేనిపై ;
నింతి నెఱింగియే నెఱుఁగ ♦ కేఁ బరుషంబులు పల్కఁబోకుఁడీ. ౯-౨౪

ఏకాంతము=మిక్కిలి,స్వర్ణ,రత్న, వసనాదులన్ =బంగారు మణులు వస్త్రములు లోనైనవానిని, పరుషంబులు = కఠినవాక్యములు.

తా. సీతయున్నచోటికి స్త్రీలనుగాని పురుషులనుగాని రానీయకుఁడు. ఆమె బంగారో, రత్నములో, వస్త్రములో, యేది గోరిన నది విశేషముగాఁ దెచ్చి యిండు. మీకు దేహములమీఁద నాశయుండెనా యడ్డము చెప్పవలదు. తెలిసి కాని తెలియకకాని యామెను కఠినోక్తులు పలుకవలదు.

కం. అని యిట్టు లాజ్ఞయిడి య, మ్మనుజాశనుఁ డంతిపురము ♦ మాని యిఁ కేమే
ననువగుఁ జేయఁగనని వర,మున మోహితుఁ డగుచు నెంచి♦పురుబలయుతమున్.

తా. అని యీప్రకార ముత్తరువు చేసి యారాక్షసుఁడు అంతఃపురము వదలి యావల వచ్చి యిఁక నేను జేయవలసిన దేమి యని యాలోచించి బ్రహ్మవరము నాకుఁ గలదు. నా కేమిభయ మని బుద్ధిలేనివాఁడై తలఁచి గొప్పబలముతోఁ గూడినవారిని.

రావణుఁడు జనస్థానమునకుఁ గాపు పంచుట.

కం. అష్టపలాశినిఁ గనుఁగొని, స్పష్టంబుగ ననియె మీరు ♦ చనుఁడీ మీమీ
యిష్టాయుధములఁ గొనుచు న,వష్టంభముతోడ వేగ♦వని దండకకున్. ౯-౨౫

అష్టపలాశిని = ఎనమండ్రు రాక్షసులను. ఇది ద్విగుసమాసము, సంఖ్యాపూర్వోద్విగుః-పాణిని ౨. ౧. ౫౨ సమాహారమున 'ద్విగురేకవచన' మ్మని యుండుటచే నేకవచనరూపము. అవష్టంభముతోన్ = తగినప్రయత్నముతో, వని = అడవి.

తా. ఎనమండ్రుగురు రాక్షసులను జూచి సందేహము లేకయుండునట్లు ఇట్లు పలికెను. మీకు మీకు నిష్టములైన యాయుధము లన్నియుఁ దీసికొని ప్రయత్నముతో దండకారణ్యమునకుఁ బోవలసినది.

సీ. అందుహతస్థాన ♦ మగుజనస్థానంబు,నందు నిల్వుఁడు మీర ♦ లంద అరిగి
మున్ను ఖరాసురుం ♦ డున్నచో టది మీరు, సాధ్వసపడక రో♦షంబు చలము
పౌరుషమారంగఁ ♦ బరికించు చుండుఁడు, మున్ను నే నుంచిన ♦ యన్నిశాట
నాథుల ఖరదూష♦ణప్రముఖులఁ జంపె, రాముండు దాన వై♦రంబు పుట్టె
తే. వైరనిర్యాతనమునకు♦వలనురోయు,వాఁడ ధైర్యంబుకంటెఁ గో♦పంబు మించె
జానకీనాథు రణమునఁ ♦ జంపి కాని, యాద మఱచి నే నిద్రింప ♦ నసురులార.

అందున్ = ఆదండకయందు, హతస్థానము = ఖరాదులుచంపఁబడినస్థలము, సాధ్వసపడక=భయపడక, పరికించుచుండుఁడు = పరీక్షించుచుండుఁడు, నిశాటనాథు

లన్ = రాక్షసనాయకుల, వైరనిర్యాతనమునకున్ = పగదీర్చుకొనుటకు, వలను = మార్గము, రోయువాఁడన్ = వెదకుచున్నాఁడను, ఆదమఱచి = ఆత్మమఱచి.

తా. ఆదండకయందు ఖరాదులు చంపఁబడిన స్థలమునందే మీరుండుఁడు. అది పూర్వము ఖరుఁ డున్నస్థలము. మీరు భయపడవలదు. రోషము చలము పౌరుషము అతిశయించునట్లు శత్రువుల పోకలరాకలఁ బరీక్షించుచుండవలయును. పూర్వము నే నందుంచిన ఖరాదు లగు రాక్షసనాయకుల రాముఁడు చంపెను. దానిచే విరోధము కలిగెను. ఆపగదీర్చుకొనుట కుపాయము నాలోచించుచున్నాఁడను. ప్రత్యక్షముగాఁ బోయి యుద్ధము చేయ ధైర్యము చాలదు. అట్టు లని యూర కుండుటకుఁ గోపము కారణమున వశపడకున్నది. ఏ విధముగనైన రాముని రణమునఁ జంపి కాని మైమఱచి నిద్రింపను.

ఉ. కావునఁ బేద విత్తమును ♦ గాంచినయట్లు ఖరారిఁ జంపి సౌ
ఖ్యావహవృత్తి నుండుఁ, జని ♦ యయ్యెడ మీరలు రామువోకలన్
రేపగ లప్రమాదగతిఁ ♦ ద్రిమ్మరి కాంచుచుఁ దద్విశేషవా
ర్తావళి నాకుఁ బుచ్చుఁడు, నృ♦పాత్మజులన్ వధియింపఁ బూనుఁడీ. ౼ ౩౧

విత్తము=ధనము, ఖరారిన్=ఖరునిఁజంపినరాముని, సౌఖ్యావహవృత్తిన్= సుఖమునుగలిగించు వ్యాపారమునందు, ఈరలు = మీరలు, రేపగలు - రే+ పగలు. రాత్రియుఁబగలు=ద్వంద్వంబునఁ బదంబుమీఁది కచటతపలు గసడదవలగు. సమాహారద్వంద్వసమాసము - సమాహారద్వంద్వము తెనుఁగునఁ బ్రాయికంబుగ బహువచనమగు. అప్రమాదగతిన్ = పొరపాటులేనివిధముగ, త్రిమ్మరి = తిరిగి.

తా. కాఁబట్టి పేదవాఁడు ధనమును సంపాదించుకొన్నట్లు బలవద్విరోధ మువలన సుఖవిషయమున దరిద్రుఁడనై కన్నార నిద్రలేక యుండు నేను ఖరుని జంపిన వాని నెట్లు చంపుదునా యని యాలోచించుచుండు నేను రాముని జంపి మరల సుఖపడుదును. మీ రచ్చటికిఁ బోయి రామునిచర్య లన్నియు కనిపెట్టి రాత్రియనక పగలనక దినదినము హెచ్చరిక తప్పక తిరుగుచు నొకచోటనే యుండక యారాముని విషయమైన విశేషవృత్తాంతముల నాకుఁ జెప్పి పంపు చుండుఁడు. మీరు నారాజకుమారులఁ జంప యత్నింపుఁడు.

క. మీ బలమును మీ శౌర్యం, బే బహురణములను జూచి ♦ యెఱుఁగుట మిమ్మే
యీబలితపుఁగార్యంబున, నే బారకమునకుఁ, బూన్చు ♦ టయ్యెనటంచున్.

బారకము = భారము.

తా. ఇందఱుండఁగా మీయెనిమిదిమందినే పంప నేల యందు రేమో? మీ బలము మీశౌర్యము నేను అనేకయుద్ధములందుఁ జూచి మీవిషయము బాగుగఁ దెలిసినవాఁడ నగుటచే నీమహాకార్యభారమును మీయం దుంచినవాఁడనైతిని. ఇతరు లింతకార్యము నిర్వహింపలేరు.

ఉ. ఈనెఱి నింపు పెంప నసు♦రేంద్రుఁడు పల్కిన రాక్షసాష్టకం
బానతిఁ జేసె, రావణుని♦యానతిఁ జేసి జవంబుమై జన
స్థాన మలక్ష్యదర్శనులు ♦ దారుణభంగిని జొచ్చి, రీగతిన్
జానకిఁ దెచ్చి రామునెడ ♦ శాత్రవ మూని విమోహి మోదిలెన్. ౯౩౩

ఈనెఱిన్ = ఈవిధముగ, ఆనతిన్ = నమస్కారమును, ఆనతిఁజేసి = ఆజ్ఞచే, జవంబుమై = వేగముచే, అలక్ష్యదర్శనులు = వేగాతిశయముచే నాకారము కనఁబడనివారు, విమోహి = జ్ఞానహీనుఁడు, మోదిలెన్ = సంతోషించెను.

తా. ఈవిధముగ సంతోష మతిశయించు మాటలను రావణుఁడు చెప్పఁగా విని యాయెనమండ్రుగురు రాక్షసులు రావణునకు నమస్కరించి యతనియాజ్ఞ చొప్పున తాము కానరానంతటి వేగాతిశయమున దండకయందుఁ బ్రవేశించిరి. ఈవిధముగ రావణుఁడు రామునెడ పగపూని సీతను దెచ్చి యజ్ఞానముచేఁ గృత కృత్యుఁడనైతిని-సీత దక్కెను-రాముఁడు చచ్చెను అని సంతోషించెను. 'శాత్రవ మూని విమోహి మోదిలెన్' అను వాల్మీకివాక్యము భక్తిభావనతో రావణుఁడు సీతను హరించె ననుట నిరసించుచున్నది.

౫౫-వ సర్గము. రావణుఁడు సీతనుఁ దనసౌధంబుఁ జూపుట.

క. వితతబలిష్ఠాదిత్యా,హితులఁ బనిచి సంతసించె ♦ నెనమండ్రను దా
జితదిక్పాలుఁడు తనలోఁ, గృతకృత్యుఁడ ననుచు బుద్ధి♦హీనతఁ దలఁచెన్.

వితతబలిష్ఠ = విస్తారమైనబలముగల, ఆదిత్యాహితులన్ = దేవవిరోధులగు రాక్షసులను, జితదిక్పాలుఁడు=జయింపఁబడిన దిక్పాలురుగలవాఁడు. దిక్పాలకులగు ఇంద్రాగ్నియమాదుల జయించినవాఁడు. బుద్ధిహీనతన్ = బుద్ధిలేకపోవుటచే, కృతకృత్యుఁడను = ధన్యుఁడను. చేయవలసినదానిని జేసినవాఁడను అయితి నని తలఁచెను. ఇదియునురావణుఁ డజ్ఞానమునఁ జేసెనని తెలుపుచున్నది గాని సీతా రాములయందు భక్తితోఁ జేసెనని తెలుపదు.

తా. పరాక్రమవంతులని కీర్తిచే వ్యాపించిన బలముగల రాక్షసుల నెనమండ్రను దండకకుఁ బొమ్మని యాజ్ఞచేసి దిక్పాలుర జయించిన రావణుఁ డట్టిదే యిది యనుకొని చేయవలసినకార్యము చక్కఁగాఁ జేసితిని. ఇఁక నాకు రామువలన భయము లేదని జ్ఞానహీనతచేఁ దలఁచెను.

క. వెండియు సుమకాండాసన, చండతరాశుగనితాంత♦సంతాడితుఁడై
దండితసురరాజుఁడు వే,తండగమనసీతఁ దలఁచి ♦ తటుకునఁ జనియెన్. ౯౩౫

వాల్మీకి రావణునకు భక్తిలేమి యటుండ సీతావిషయమునఁ గామాసక్తి కలదని స్పష్టముగఁ జెప్పుచున్నాఁడు. సుమకాండాసన = పూవిలుతుఁడైన మన్మథునియొక్క, చండతర = మిగులఁ దీక్ష్ణములైన, ఆశుగ = బాణములచే, నితాం

త = మిక్కిలి, సంతాడితుఁడై = బాగుగఁ గొట్టఁబడినవాఁడై, దండితసురరాజుఁడు = దండింపఁబడిన దేవేంద్రుఁడు గలవాఁడు. ఇది బహువ్రీహిసమాసము. కావున రాజుశబ్దమునకు డుజ్జు వచ్చెను. వేతండగమనన్ = ఏనుఁగునడకవంటి నడకగల దానిని.

తా. ఇట్లు తలఁచినవాఁడై యింద్రుని జయించిన యారావణుఁడు మన్మథునిబాణములచే బాగుగఁ గొట్టఁబడినవాఁడై సీతను దలఁచుకొని వెంటనే యామె యున్నచోటికిఁ బోయెను.

చ. చని యట దైత్యనేత నిజ♦శాసితదైత్యసతీపరీత, లో
చనయుగళీగళత్సలిల♦జాత, నతాస్యవరాంబుజాత, భూ
ర్యనిలసమాహతోడుపని♦భాతిసమాకులధీసమేత, ద
ర్శనవిముఖీకృతాత్తముఖ♦సాగరజాతను, సీతఁ గన్గొనెన్. ౩౬

దైత్యనేత = రాక్షసప్రభువు, నిజశాసిత = తనయాజ్ఞకు లోపడిన రాక్షసస్త్రీలచేఁ జుట్టఁబడినదానిని, లోచనయుగళీ = రెండుకన్నులనుండి, గళత్ = జాఱుచున్న, సలిలజాత = నీటిసమూహముగలదానిని, నతాస్యవరాంబుజాత = వంచుకొనఁబడిన ముఖకమలము గలదానిని, భూరి + అనిల = గొప్పగాలిచే, సమాహత = కొట్టఁబడిన, ఉడుప = పడవతో, నిభ = సమానమైన- అతిసమాకుల = మిగులకలవరపడుచున్న, ధీసమేత = బుద్ధితోఁగూడినదానిని, దర్శన = రావణుఁడు చూచుటకు, విముఖీకృత = పెడవాటుగాఁజేయఁబడిన, ఆత్తముఖ = తనముఖమనెడి, సాగరజాతను = చంద్రబింబముగలదానిని.

తా. పోయి యాప్రదేశమందు రావణుఁడు తనయాజ్ఞకు లోపడిన రాక్షసస్త్రీలచేఁ జుట్టఁబడి, రెండుకన్నుల నీళ్లు కాలువలుగాఁ బాఱ, ముఖము వంచుకొని, పెనుగాలిచే సముద్రమునందుఁ గొట్టఁబడుటచేఁగలఁతచెందిన పడవవలె వ్యాకులపడు మనస్సుగలదై తన్నుఁ జూడకుండునట్లు వానికి మాఱుముఖమై యుండుదానిని సీతను జూచెను.

ఉ. ఱేఁచులు తన్నుఁ జుట్టుకొని♦ ఱేసిన నివ్వెఱ ఱిచ్చపాటు దన్
లోఁచఁగఁ జిక్కి స్రుక్కు మృగ♦లోకవిముక్తకురంగిఁ బోలుచున్
ద్రాఁచనదీర్ఘనిశ్వసన♦రాజి నిగుడ్చుచు నున్నదానిఁ దాఁ
బూఁచి బలాత్కృతిన్ సగరు♦పోఁడిమిఁ జూపఁగఁ బట్టి లాగుచున్. ౩౭

ఱేఁచులు = ఱేఁచుకుక్కలు, ఱేసినన్ = అతిశయింపఁగా, నివ్వెఱ = నిండువెఱపుచే, ఱిచ్చపాటు = నిశ్చేష్టత, తన్ = తన్ను, లోఁచఁగన్ = అణఁపఁగా, మృగలోకవిముక్త=జింకలసమూహముచే విడువఁబడి యొంటిగానుండు,కురంగిన్ = ఆఁడుజింకను, త్రాఁచు + అనన్ = త్రాఁచుపామువలె, దీర్ఘనిశ్వసనరాజి = నిట్టూ

ర్భసమూహములను, పూఁచి = ప్రయత్నించి, బలాత్కృతిక్ = బలవంతముగ, పోఁడిమి = అందము, లాగుచుక్ = ఈడ్చుచు.

తా. తనతోడి జింక లన్నియుఁ దన్ను వదలిపెట్టిపోఁగా నొంటరిగానై తోఁడేలు తన్నుఁ జుట్టుకొనఁగా భయపడి చేష్టలుమాని గ్రుక్కిన యాఁడు జింకవలెనై త్రొక్కఁబడిన పామువలె నిట్టూర్పులు విడుచుచు నున్నదానిని రావణుఁడు ప్రయత్నపూర్వకముగ బలాత్కారముగా తననగరుసౌందర్యముఁ జూపుటకై యీడ్చుకొనిపోయి.

క. ముద్దియలు వేలకొలఁదులు, నిద్దపురతనములతోడ ♦ నెఱిగలమేడల్
మిద్దెలు నగళులు వన్నెల,ముద్దులు గొలిపెడిశకుంత♦ములు గలయింటన్. ౯౩౦

తా. వేలకొలఁదులు స్త్రీలును,నిగనిగ మనురత్నములు గల యందమైన మేడలును మిద్దెలు నగళ్లు-ముద్దుపెట్టుకొన బుద్ధిపుట్టించు పక్షులుగల యింటియందు.

క. స్ఫాటిక రాజతదాంతక, హాటక వైడూర్యవజ్ర♦హారి స్తంభో
త్కూటము కాంచనతోరణ,ఝూటము సోపాన మెక్కి ♦ సతి కసురుఁ డనున్.

స్ఫాటిక = స్ఫటికమయములను, రాజత = వెండిమయము, దాంతక = దంతమయములునై, హాటక = బంగారుచేతను, వైడూర్య = వైడూర్యములచేతను, వజ్ర = వజ్రములచేతను, హారి = మనోహరమైన, స్తంభ = స్తంభములుగల, ఉత్కూటము = గొప్పచావళ్లుగలది, కాంచనతోరణఝూటము = బంగారువాకిండ్ల సమూహముగలది, సోపానము = మెట్లవరుస. ఇంతకుముందు తనప్రభావము తెలిపి సీత కాశగలిగింప యత్నించెను. ఇప్పుడు భోగ్యపదార్థములఁ జూపి యాశగలిగింప యత్నించుచున్నాఁడు.

తా. స్ఫటికములు, వెండి, దంతములు, బంగారు, వైడూర్యములు, వజ్రములు వీనిచే మనోహరములైన స్తంభములు గలపెద్దచావిళ్లు గలిగి బంగారు వాకిండ్లు గలసోపాన మెక్కి సీతకు రావణుఁ డిట్లనియె.

సీ. ఇదె చూడవే సీత ♦ హేమదంతసమేత, పూతవాతాయన♦వ్రాతములను
నదె చూడవే భామ♦హృదయంగమోద్దామ, ధామనిర్జితసోమ♦ధామములను
నటు చూడవే గోల ♦ హారికేళీలోల, జాలపాదాంగనా♦జాలములను
నిటు చూడవే చాన ♦ యింపుసొంపుల నిన, మానితనవనవో♦ద్యానములను
తే. జూచి తే యల్లకొలఁకుల♦సొంపు పెంపు, కొమరుఁజిలుకలపులుఁగుల♦గుంపుటంపు
నెల్లపుష్పితవృక్షంబు♦లింపునింపు,మగువరో యింకనై ననీ♦మంపు దింపు. ౯౩౦

హేమదంతసమేత = బంగారుతోను దంతములతోనుకూడిన, పూత = పవిత్రములైన, వాతాయనములను = కిటికీలను, హృదయంగమ = మనోజ్ఞములును, ఉద్దామ = గొప్పవియునయి, ధామ = కాంతిచే, నిర్జిత = జయింపఁబడిన, సోమ = చంద్రునిగల, ధామములను = ఇండ్లను, గోల = ఓముగ్ధా! హారికేళీలోల = మనో

హారక్రీడలయం దాసక్తిగల, జాలపాదాంగనా = ఆఁడుహంసల, జాలములను = సమూహములను, మానిత = పూజ్యమగు, నవనవోద్యానములను = క్రొత్తక్రొత్త తోఁటలను, మంపు = మత్తు -, దింపు = తొలఁగింపుము.

తా. ఓ సీతా! యీప్రక్కఁ జూడుము. బంగారు-దంతము-వీనితోఁగూడి నిర్మలములైన కిటికీలెట్లున్నవో, ఆప్రక్క మనోజ్ఞములై గొప్పవై చంద్రకాంతివంటి కాంతిగలగృహము లెట్లున్నవో చూడుము. ఓసి ముద్దరాలా! ఆవైపు మనోహరక్రీడ లయం దాసక్తిగల యాఁడుహంస లెట్లున్నవో చూడుము. ఈవైపు ఇంపుసొంపు గలుగుపూజ్యములైన క్రొత్తక్రొత్త ప్రమదావనము లెట్లున్నవో చూడుము. అదో ఆ కొలఁకులసొంపుయొక్క యాధిక్య మెట్లున్నదో, ప్రాయంపుఁజిలుకల గుంపుల కల కల ధ్వను లెట్లున్నవో చూచితివా? అన్ని పూచినచెట్లు సంతోషమును నిండించు చున్నవి. చూచితివా. ఇంకనైన నీమైకమును వదలుము.

చ. అని యిటు లాత్మదివ్యభవ♦నావళిచందము మందయాన దాఁ
గనుఁగొనఁజేసి మోసపడఁ♦గ్రమ్మఱ నిట్లను నన్నుఁ గొల్చుచున్
గొనకొని యెప్పు డుండుదురు♦కోటులు ముప్పదిరెండు రాక్షసుల్
వనిత తలంపు మేఁ బ్రభుత♦ వాలెద నిండఱ నేలుచున్ సతీ! ౫౪౧

ఆత్మ = తనయొక్క, దివ్య = దేవతలగృహములవంటి, భవనావళి = ఇండ్ల వరుసల, చందము = విధము, మోసపడన్ = మోసపోవుటకై.

తా. అని యీప్రకారము దేవతలయిండ్లవంటి తనయిండ్లను జూపి యింకను నామెను మోసగింప నిట్లనియె. నాసేవ సేయుచు ముప్పదిరెండుకోట్ల రాక్షసు లెప్పుడుందురు. నే నిందఱకుఁ బ్రభువనై పాలించుచుందును. చూచితివా నాయైశ్వర్యము ప్రభుత్వము.

క. పరిచర్యల నొక్కొకపని, యరయఁగ నొక్కొక్క వేవు♦రసురవరేణ్యుల్
పరిగణనము సేయక బాలుర ముదుకలఁ గలరు సుమ్మి♦లోలాక్షీ యిటన్. ౫౪౨

తా. నాకుఁ జేయవలసిన సేవలయందు నొక్కొక్క సేవ సేయుటకు బాలురు ముసలివాండ్రు గాక యొక్కొక్క వేయిమంది రాక్షసశ్రేష్ఠులు గలరు.

ఉ. ఈవరమందిరావళులు♦నీయసమానసుపూజ్యరాజ్య మిం
దీవరనేత్ర! నాయనుఁగు♦దేవులు వేలకొలంది వెండి నా
జీవనమున్ భవద్వశముఁ♦జేసెద, నిన్నిటి కీవ యిప్పుడే
దేవివి కమ్ము లెమ్ము పరి♦దేవన మేటికిఁ గొమ్ము నన్ బతిన్. ౫౪౩

వరమందిర + ఆవళులు = శ్రేష్ఠములైన యిండ్లవరుసలు, అసమాన = ఈడులేని, సుపూజ్య రాజ్యము = మిగుల గౌరవమునకుఁదగిన రాజ్యము, ఇందీవర నేత్ర = కలువలవంటికన్నులుగలదానా, అనుఁగుదేవులు = ప్రియురాండ్రగు

రాణులు, జీవనమ్ = బ్రదుకు, భవత్ + వశము = నీయధీనము, దేవివి=పట్టపు రాణివి, పరిదేవనము = ఏడ్పు - పతిః = భర్తగా.

తా. ఈశ్రేష్ఠములైనగృహములు అసమానమై గౌరవార్హ మగు రాజ్యము, వేలకొలందులుగా నుండు నారాణులు నాబ్రతుకు నివియన్నియు నీస్వాధీనము చేసెదను. ఇప్పుడే నీవు వీని కన్నిటికి పట్టపురాణివి కమ్ము. ఏల యేడ్చెదవు? నన్ను భర్తగా గ్రహింపుము.

ఉ. ఏల దురంతతాపమున ♦ నేడ్చెద విట్లు? మదీయవాక్యముల్
లాలన నాదరింపుము వి ♦ లాసిని! మే లగుమార్గ మిద్దియే
యాల మిం కేల యేవో యడి ♦ యాసల నేటికి వేఁగె, దర్హమే
బాలిక! పుష్పచాపశర ♦ బాధితునిన్ నను న్ద్రోసి పుచ్చఁగన్? ౯౭౮

దురంతతాపమునన్ = అంతములేని సంతాపముచే, మదీయవాక్యముల్ = నామాటలు, లాలనన్ = బుజ్జగింపుతో, ఆలము = ఉపేక్ష, అడియాసలన్ = వ్యర్థమైనయాశలచే, వేఁగెదు = తపించెదవు, పుష్పచాపశరబాధితున్ = మన్మథబాణములచే బాధపడువానిని.

తా. సంతాపముచే నేడ్చుచుండెదవా, నీయేడుపునకు నంతములేదు. యావజ్జీవము నీ విట్లు లేడ్చుచుండవలసినదానవే. అటుగాకపోయెనా సుందరీ! నీయోగ్యత కుఁదగిన మంచిమార్గము చెప్పెదను. నామాట లాదరించి వినుము. 'ఇంకను రాముఁడు వచ్చును నన్నుఁ దీసికొని పోవును ఇంకను నాయడవిలో నల్లాడుచుందును' అని యేవో యాసలు పెట్టుకొని యేల వేఁగెదవు? ఇఁక నామాట నుపేక్షసేయకుము. కామబాణములచేఁ బీడితుఁడైన నన్ను ద్రోచిపుచ్చుట నీకుఁ దగునా?

ఉ. ఏ మని యెంచితే కువల♦యేక్షణరో శతయోజనాయతం
బై మహితోగ్రరాక్షసస♦హస్రసమావృత మైన లంక ? సు
త్రామముఖామరాసురులు ♦ దాయఁగ నైనను లేరు, నాకు సం
గ్రామమునందు యక్షసుర♦కాండములున్ సరిరావు బల్మిచేన్. ౯౭౯

కువలయేక్షణరో = ఓ కలువకంటీ! శతయోజనాయతము = నూఱామడ నిడివిగలది, మహితోగ్రరాక్షససహస్రసమావృతము = గొప్పభయకంరు లైన వేలకొలఁదిరాక్షసులచే నావరింపఁబడినది, సుత్రామముఖామరాసురులు=ఇంద్రుఁడు మొదలగు దేవతలు, రాక్షసులు, దాయఁగన్ = సమీపింపఁగా, సంగ్రామమునందున్ = యుద్ధమందు, బల్మిచే = బలముచే.

తా. నామగఁ డేలరాఁడు నావి వ్యర్థాశ లెట్లగు నందు వేమో. వినుము. నూఱామడ నిడివిగలదై వేలకొలఁది భయంకరరాక్షసులు నిండియుండు లంకను నీ వేమి తలఁచితే? నీయూరువంటిదే యనుకొంటివా? ఇంద్రుఁడు మొదలైన దేవతలుగాని రాక్షసులుగాని సమీపమునకైన రాలేరు. ఇఁక రాముఁడు లంకలోనికి

వచ్చు టెట్లు సాధ్యపడును? సముద్ర మెట్లు దాఁటును? కోట లెట్లు భేదించును? ఇందలిరాక్షసు లూరక చూచుచుందు రని తలఁచితివా? ఒకవేళ వచ్చినాఁడనుకో-యుద్ధమందు యక్షుల దేవతల సమూహములుకూడ బలమునందు నాతో సరిరావు. ఇఁక నొంటిగాఁడు మనుష్యుఁడా వచ్చి నాతో యుద్ధము చేసి గెలువఁగలవాఁడు? కావున నీకోరికలు గొంతెమ్మకోరికలే.

ఉ. రాముఁడు రాముఁ డంచు నొక♦రాజ్యవిహీనుని దేబ జోగినిన్
వేమఱు నల్ప తేజుని న♦నేకవిధంబులఁగూర్చి యేడ్చెదో
భామిని! నీకు యోగ్యుఁ డగు♦భర్తను నేనె, నను భజింపుమీ
శ్యామరో! యౌవనంబు సత♦మా పిటికీ నను గూడు హాయిగన్. ౫౨౬

దేబె = దీనుని, జోగినిన్ = జీవనాధారములేనివానిని, అల్పతేజుని = కొంచెము తేజస్సుగలవానిని.

తా. రాజ్యములేని వానిని, దీనుని, బ్రతుకుమార్గము లేనివానిని, కొంచెపుఁదేజము గలవానిని, రాముఁడు రాముఁ డని పలుమాఱు తలఁచితలఁచి పెక్కుతెఱఁగుల నేల యేడ్చెదవు? అట్టివాఁడు నీకుఁ దగినభర్త గాఁడు. నీకుఁ దగినభర్తను నేనే. కావున నన్నుఁ బొందుము. చామా! ఓసీ పిటికిదానా! యౌవనము శాశ్వతమా? కాదు. వృథా వయస్సు పోయెనేని యావల నేమి సుఖింపఁ గలవు? కావున నిప్పుడే నన్నుఁ గూడి సుఖింపుము.

ఉ. ఏటికి రిత్తయాస సుద♦తీ రఘురాముని జూతు నంచు, ని
చ్చోటు మనస్సుచే నయినఁ ♦ జొచ్చి నినుం గన వాసి కౌనటే?
త్రాటను గట్టఁగా వశమె ♦ తన్వి నభోగత వేగితానిరా
ఘాటసదాగతిన్, శిఖిశి ♦ ఖానిచయంబును బట్ట శక్యమే. ౫౨౭

రిత్తయాస = ప్రయోజనములేనియాశ, నభోగత = ఆకాశమందుండు, వేగితానిరాఘాట = వేగముచేనడ్డములేని, సదాగతిన్ = వాయువును, శిఖిశిఖానిచయంబును = అగ్నిజ్వాలలసమూహమును.

తా. రాముని జూచెద నని యింకను నీకు నేల యుత్తయాశ? దేహముతో వచ్చి నిన్నుఁ జూచుట యటుండనీ. మనస్సుతో నైన నిచటికి రాఁగలఁడా? నీ విం దున్నావని తెలియు టెట్లు? తెలిసెనుబో, వచ్చు టెట్లు? ఆకాశమున నతివేగముగా నడ్డములేక వీచువాయువును త్రాటితోఁ గట్టుటకు సాధ్యపడునా? అగ్నిజ్వాలలఁ జేతఁ బట్టుకొన శక్యమా?

ఉ. లోకమునందు లేఁడు విను ♦ లోలవిలోచన మామకీన బా
హాకులపాలిత న్నినుఁ బ♦రాక్రమవృత్తిని నన్ను గెల్చియున్
దోకొనిపోవువాఁడు, విబు♦ధుల్ సచరాచరభూతకోటులున్
నీకు సపర్యఁ జేయుఁ,దరు♦ణీ నను నేలుము రాజ్యభూతితోన్. ౫౨౮

తా. చలించు కన్నులు గలదానా! వినుము. నాభుజసమూహములచేఁ గాపాడఁబడు నిన్ను పరాక్రమముచే నన్ను గెలిచి తీసికొని పోఁగలవాఁడు లోకము నందు లేఁడు. నన్ను రాజ్యసంపదతోడ నేలితివా దేవతలు చరాచరములైన భూతసంఘములు నీకు సేవచేయుచుండును.

క. శంకాతంకం బేటికి, లంకారాజ్యంబు నెల్ల ♦ లలనా యభిషే
కాంకితవై యేలుము నీ,కింకరుఁగా నన్నుఁ గొనుము ♦ క్రీడలఁ దేలన్. ౫౪౯

శంకాతంకము = సందేహము, భయము.

తా. నీ వేల సందేహించెదవు? ఎవరికి భయపడెదవు? లంకారాజ్యమున కంతయుఁ బట్టాభిషిక్తవై యేలుము. క్రీడించుటకుఁగాను నన్ను నీకింకరుఁగా నేలుము. నీ వెట్లు చెప్పిన నట్లు వర్తించుచుందును.

క. మును నీచేసినపాపము, వనవాసాయాసమున ని♦వర్తించెను నీ
యొనరించినపుణ్యఫలములు, కనకాంగీ నీవు పొందఁ ♦ గాలం బొదవెన్. ౫౫౦

వనవాస + ఆయాసమునన్ = అడవులందు వసించి పడిన ప్రయాసముచే, నివర్తించెను = తీఱెను.

తా. కష్టము లనుభవించినఁ బాపములు క్షయించును. కావున నీవు పూర్వము చేసిన పాపములు కాఱడవులలోఁ గష్టపడుటచే నశించెను. పూర్వము నీవు చేసినపుణ్యములు నీ వనుభవించు కాలము వచ్చెను.

క. ఈచందన మీసరములు, నీచామీకరవిభూష ♦ లిద్దఱ మిచటన్
వాచాఽగోచరసుఖలీ,లాచతురతఁ బూసి ముడిచి ♦ లలి దొడుగుద మే. ౫౫౧

చామీకరవిభూషలు = బంగారుసొమ్ములు, వాచాఽగోచరలీలాచతురతన్ = మాటలచేఁజెప్పసాధ్యముగాని విలాసచాతుర్యముచే, పూసి = గంధముపూసి, ముడిచి = పూలుముడిచి, లలిన్ = అందముగా, తొడగుదమే = భూషణాదులు ధరింతమా.—క్రమాలంకారము.

తా. వాక్కుచేఁ జెప్ప సాధ్యముగాని విలాసచాతుర్యముచే నీచందనము మన మిరువురము పూసికొందమా! ఈపూలసరములు ముడుతమా! ఈబంగారు సొమ్ములు ధరింతమా!

షష్ఠీవాగురిరల్లోప మవాప్యో రుపసర్గయోః । ఆపం చైవ హలంతానాం యథా వాచా నిశా దిశా ॥ అని వాచాశబ్దము.

మత్తకోకిలము. ఇంచుఁబోణిరో పుష్పకాఖ్యస♦మిద్ధమైనవిమాన మ
భ్యంచదర్కవిభావికాసము ♦ యక్షు నగ్రజుఁ బోర ని
ర్జించి తెచ్చితి హృద్య మయ్యెడఁ ♦ జేరి యిద్దఱ మెంతయున్
జంచదిష్టసుఖోపభోగముఁ ♦ జాన! పొందుచు నుందమా. ౫౫౨

ఇంచుఁబోణిరో = చెఱకువలె మనోజ్ఞమైనదానా, పుష్పకాఖ్య = పుష్పక

మనుపేరుగల, సమిద్ధవిమానము=మిగులఁ బ్రసిద్ధికెక్కిన విమానము, అభ్యంచత్ = అన్ని ప్రక్కలఁ బ్రకాశించు, అర్కవిభా = సూర్యకాంతివంటికాంతిచే, వికాసము = విచ్చినట్లుండినది, హృద్యము = మనోజ్ఞమైనది, చంచత్ = ఒప్పుచున్న, ఇష్ట = మనసునకు సరిపడిన, సుఖోపభోగముల్ = సుఖానుభవమును.

తా. సీతా! పుష్పక మని ప్రసిద్ధికెక్కిన యీవిమానము నలుప్రక్కల వ్యాపించు సూర్యకాంతివంటి కాంతిగలది. దీనిని మాయన్నయగు కుబేరుని యుద్ధమందు జయించి తెచ్చితిని. ఇది మిగుల మనోజ్ఞమైనది. దీనియందు మన మిద్దఱము గడియ గడియకు మాఱుచున్న క్రొత్తక్రొత్త సుఖభోగముల ననుభవించుచుందమా!

మత్తకోకిలము—ర స జ జ భ ర—౧౧ వ యింట యతి.

కం. వదనము తామరస శ్రీ,సదనము నునుముద్దు గుల్కు ♦ చందము చెడె నీ
యదనున రోదనమున నీ,యదవద నెద వదలి నేలు♦మా నన్ను దయన్. ౯౩

వదనము=నీముఖము, తామరస శ్రీ = కమలశోభకు, సదనము = స్థానము, అదనునన్ = సమయమందు, రోదనమునన్ = ఏడ్పుచే, అదవదన్ = కలఁతను, ఎదన్ = హృదయమందు.

తా. కమలములకాంతిగల నీముఖము చూచుటకు ముద్దుగుల్కుచుండునది యీ సమయమున నీవూరక యేడ్చుటచే దానికి సహజవిధము చెడినది. ఈ వ్యాకులత్వము వదలి నన్ను దయతో నేలుము.

క. ఈరీతి నసురుఁ డాడఁగ, నారీమణి చీరకొంగు♦నం దనవదనం
బారఁగఁ గప్పుచుఁ గన్నుల, నీ రోడిక గట్టు చుండ♦ ని వ్వెఱ నుండెన్. ౯౪

తా. ఈవిధముగ రాక్షసుఁడు తన్నుఁ బలుకఁగా స్త్రీరత్నమగు సీతాదేవి వానికి ముఖము కానరాకుండునట్లు చీరకొంగునఁ బూర్ణముగఁ గప్పి కన్నుల నీరు కాల్వలుగాఁ బ్రవహింప నిండుభయమున నుండెను.

చ. అది గని రావణుం డను ధ♦రాత్మజతో సతి! ధర్మలోపబు
ద్ధ్యుదితము సిగ్గు చాలు, వల ♦ దూరక యేడ్వఁగ, ధర్మలోప మిం
దెది వచియింపుమీ, కన ఋ♦షీశులు దైవకృతానుబంధముల్
మది గణియింప రోటు, విను♦మా పలుమాటలిఁకేల మైథిలీ. ౯౫

తనముఖమును వాఁడు వర్ణించుటచే నదియును గానరాకుండునట్లు కట్టుకొన్న చీరకొంగున ముఖము మూసికొనఁగా సిగ్గుచే మూసికొన్నట్టు రావణుఁడు తలఁచి చెప్పుచున్నాఁడు.

ధర్మలోపబుద్ధి+ఉదితము = పతివ్రతాధర్మమునకు హాని వచ్చు ననుబుద్ధి వలనఁ గలిగినది, దైవకృతానుబంధముల్ = దైవముచేఁ జేయఁబడిన సంబంధము గణియింపరోటు = లెక్కింపరాదేమి.

పరపూర్వాః స్త్రియస్త్వన్యా స్సప్తప్రోక్తా స్స్వయంభువా।
పునర్భూ స్త్రివిధా తాసాం స్వైరిణీతు చతుర్విధా।
కన్యా వాక్షతయోనిర్వా పాణిగ్రహణదూషితా।
పునర్భూః ప్రథమా ప్రోక్తా పునస్సంస్కారకర్మణా।
దేశధర్మా నపేక్ష్య స్త్రీ గురుభిర్యా ప్రదీయతే।
ఉత్పన్న సాహ సాన్యస్మై సా ద్వితీయా ప్రకీర్త్యతే।
మృతే భర్తరి తు ప్రాప్తా దేవరాదీ నపాస్యయా।
ఉపగచ్ఛే త్పరం కామా త్సా తృతీయా ప్రకీర్తితా।
ప్రాప్తా దేశా ద్ధనక్రీతా క్షుత్పిపాసాతురా చ యా।
త వాహ మిత్యుపగతా సా చతుర్థీ ప్రకీర్తితా॥—నారదుఁడు.

రెండుమార్లు పెండ్లాడినదానిపేరు పునర్భువు. ఇది మూఁడు విధములు. అందు స్వైరిణి యనునది నాలుగువిధములు. క్షతయోనికాని యక్షతయోని యైన కన్య కాని ముం దొకని బెండ్లాడి వాని వదలి మఱియొకనిఁ బెండ్లాడెనేని యది మొదటిపునర్భువు. ఎవతె దేశధర్మముల నలక్ష్యపఱిచి వ్యభిచరించునో దానిని దానిపెద్దవాండ్రు మఱియొకని కిచ్చిరేని యది రెండవది. మగఁడు మరణింపఁగా మఱఁదుల మాటలో నిలువక మఱియొకమగవాని మన్మథవశయై మరగునో యది మూఁడవది. ధనమునకుఁ గొన్నదికాని, యాఁకలిదప్పులు సైఁపలేక నా కన్నము పెట్టి భరింపుము నీయొద్ద నుండెద నని భార్యగా నుండునది నాలుగవది. వీరందఱు ఋషిప్రోక్తలే కావున నిం దేదో యొకవిధము ననుసరించి పునర్భువుధర్మముచొప్పున నన్ను నీవు గ్రహింపవచ్చు నని రావణు నభిప్రాయము—గోవిందరాజీయము. అష్టవిధవివాహములలో రాక్షసవివాహము అనఁగా బలాత్కారముగఁ గన్యను గ్రహించుట (కృష్ణుఁడు రుక్మిణిని హరించినట్లు) ఋషులు గణించియే యున్నారు. కావున నేను నిన్ను బలవంతముగాఁ దెచ్చితిని. కావున నీవు నాభార్య వగుట ధర్మవిరుద్ధము గాదు అని రావణు నభిప్రాయము. రాక్షసవివాహము కన్యవిషయమైనయే గాని వివాహితస్త్రీ విషయముగాదు. ఇట్లు వాఁడు చెప్పుట తమోగుణప్రాధాన్యమున నని మాహేశ్వరతీర్థీయము. ఇంతతమోగుణప్రధానుఁడు సాత్త్వికభక్తుఁ డెట్లు కాఁగలఁడో వా రాలోచించినవారు గారు. ఈకారణముచేతనే తిలకవ్యాఖ్య వారివాదమును ఖండించెను.

తా. సీతాదేవి తనముఖమును గప్పుకొనుట చూచి రావణుఁ డామెతో నిట్లనియె. సతీ! ప్రతివ్రతాధర్మము చెడు నను నభిప్రాయముతో సిగ్గుపడుచున్నావు. చాలుఁ జాలు. సిగ్గుపడవలసిన పనిలేదు. ఏడువవలసినపనిలేదు. ధర్మమునకు

లోపము కలిగించు కార్యమిం దేమున్నది? దైవకృతసంబంధమును వివాహము లందు ఋషీశ్వరు లొకటిగా లెక్కింపలేదా? ఏల యూరక యెక్కువమాటలు?

ఉ. జానకి త్వత్పదాంబుజర♦జ స్తిలకాన్వితశీర్షయుక్తిఁ జం
ద్రానన వేఁడువాఁడను, ద♦యామతి నేలుము నీదుదాసుఁడన్
సూనశ రార్తిఁ జిక్కి యిటు ♦ శూన్యతరోక్తులు పల్కినాఁడ నో
మానిని! రావణుండు నొక ♦ మానవతిం బద మంటి మ్రొక్కునే. ౫౬

త్వత్ = నీయొక్క, పదాంబుజ = పాదకమలముల, రజస్ = ధూళియనెడి, తిలకాన్విత = తిలకముతోఁగూడిన, శీర్షయుక్తిన్ = పదితలలతో, శూన శరార్తిన్ = కామబాధచే, శూన్యతరోక్తులు = నీచపుమాటలు. వాఁడు స్త్రీకి నమస్కరించుట వానికే యాశ్చర్యకరముగా నున్నది.

తా. జానకీ! నీపాదధూళి నాశిరస్సున ధరించి నిన్నుఁ బ్రార్థించెదను. నేను నీ దాసుఁడను. దయతో న న్నేలుము. మన్మథతాపమునఁ జిక్కి యీప్రకారము నీచ పుమాట లాడితిని. నీపాదములకు నాపదితలలు సోఁక నమస్కరించితిని గాని రావణుఁ డొకయాఁడుదాని కాలు దాఁకి మ్రొక్కునా? ఇందు రసాభాస మని తీర్థీయులు, రసాభాస మనఁగాఁ దనకు నిష్టములేని స్త్రీతోఁ గలియఁ గోరుట.

తోటకము. అని యీగతిఁ బల్కి ద♦శాస్యుఁడు దా
జనకాత్మజ నాత్మను ♦ సంతసిలన్
వనితామణి దక్కెను ♦ నా కిఁకఁ బో
యని యంతక పాశవ♦శాత్మకుఁ డై. ౫౭

అంతకపాశ = యమపాశమునకు, వశ = స్వాధీనపడిన, ఆత్మకుఁడై = ప్రాణముగలవాఁడై.

తా. ఈప్రకారము సీతను బలికి రావణుఁడు తనలో నీస్త్రీరత్నము నాకుఁ దక్కెను నిజము అని యమపాశములకు వశపడిన వాఁ డగుటచేఁ దలఁచెను.

తోటకము—నాలుగు స గణంబులు. తొమ్మిదవయింట యతి.

## ౫౬-వ సర్గము. సీత రావణునిఁ బరుషోక్తు లాడుట.

క. పలలాశనుఁ డిటు పల్కిన,పలుకులు విని సీత దుఃఖ♦భరకర్శిత యై
పులుపోఁచ యడ్డముగఁ దాఁ, బలికెన్ నిర్భీతి నసుర♦పాలకుతోడన్. ౧౫

పలల+అశనుఁడు = మాంసభక్షకుఁడు-రాక్షసుఁడు, దుఃఖభరకర్శితయై = దుఃఖాతిశయముచేఁజిక్కినదై, పులుపోఁచ=గడ్డిపోఁచ, నిర్భీతిన్ = భయములేక, పతివ్రతలగు స్త్రీలు పరపురుషులతో సాక్షాత్తుగ సంభాషింపరాదు గనుక గడ్డి పోఁచ యడ్డము వైచెను. నీ వీగడ్డిపోఁచతో సమాన మని భావము. నిర్భీతిన్ = తనపాతివ్రత్యబలముచే వీఁడు త న్నేమియుఁ జేయఁజాలఁ డను ధైర్యముగలదు

కావున భయములేదు. భయము లేనపుడు దుఃఖ మెట్లు వచ్చు ననిన రామవియోగము కలుగుట చేతను, దననిమిత్తమై రామచంద్రుఁ డెంతశోకించుచున్నాఁడో యను కారణముచేతను శోకించెను. ఈమెయం దిట్టిశక్తిగల దని రామచంద్రమూర్తియు నెఱుఁగు నని యుద్ధకాండము ౨౭౧ వ పద్యము.

చ. చెలువల మిన్న ద న్నెపుడు శీలమహత్త్వముపేర్మిఁ గాచుకోఁ
గలదని పంక్తికంధరుఁడు కాండధి వేలను బోలె మీఱఁగాఁ
వలఁతియుగాఁడ టంచు నతిఁబావుఁడు మండెడుమంటపోలికం
దలఁపుననేని ధిక్కృతి యొనర్పఁగ లేఁడని నేనెఱుంగుదున్.

స్త్రీలతో బలవంతముగా భోగించినచోఁ దలపగిలి చచ్చు నన్న యప్సరస రావణున కిచ్చినశాపము మనస్సునం దుంచుకొని నిర్భయ యయ్యెను. బలాత్కరించెనా యోగబలముచే నదృశ్యను అస్పృశ్య నగుదును అనుబుద్ధిచే నిర్భయ యని తిలక వ్యాఖ్య.

బలాత్కారమును నిషేధించు శాపము రావణునకుఁ గలదని సీత కిప్పటికిఁ దెలియదు.

సీ. సత్యసంధుఁడు పరి♦జ్ఞాత సుస్థిరుఁడును, ధర్మసేతువు నగు♦దశరథునకుఁ
బుత్రుండు త్రిభువన♦పూజ్యుండు రాముండు, విశ్రుతనాముండు ♦ విపులనేత్రుఁ
డాయతబాహుఁ డ♦త్యంతధర్మాత్ముండు, ప్రాణవిభుండు దై♦వంబు సుమ్ము
నిన్నుఁ జంపఁగ నున్న ♦ నిస్తులవీరుఁడు, సహలక్ష్మణుఁడు హరి♦స్కంధుఁ డాతఁ
తే. డవని జనియించె నిక్ష్వాకు♦నన్వయమున, నేమియో ప్రేలెదవు రాము♦నెదుట నీవు
నన్నుఁ జెనకియుయుండిన♦నిన్నునంద, ధరకు బలిపెట్టి యుండఁడే♦ఖరునిమాడ్కి.

సత్యసంధుఁడు = సత్యప్రతిజ్ఞగలవాఁడు, సత్యమే మేరగాఁగలవాఁడు, పరిజ్ఞాత = లోకప్రసిద్ధుఁడు, ధర్మసేతువు = ధర్మముయొక్క మర్యాద చెడనీయక నిలుపువాఁడు, ధర్మమునకు **సేతువు** = అనకట్ట - ఏటిలో నీళ్లు వ్యర్థముగాఁ బోకుండ నిలుపునది యనకట్ట కావున నట్టులే యీయన ధర్మము చెడకుండ రక్షించువాఁడు (౨) ధర్మమును సేతువుగాఁ గలవాఁడు ధర్మసేతువు. దాఁటరాని యేటికి నీప్రక్కను లాప్రక్కఁ బోవుటకై సేతువు నిర్మింపఁబడును. కావున సంసారనది తరించుటకు ధర్మమును సేతువుగాఁ గలవాఁడు. ఇట్టివానికోడల నయియుండి యెట్టు లధర్మకార్యమును జేయుదును? దీనివలన నొకకార్యము చేయువారు తమవలనఁ బూర్వుల కపకీర్తి పాపము రాకుండునట్లు కనిపెట్టవలయు నని భావము. పరుల కపకీర్తి నరకబాధ వచ్చుకార్య మెవరును జేయరాదు. దైవంబుసుమ్ము = నాకు మాత్రమే కాదు సర్వలోకములకు. ఇట్టివాని భార్య నే నెట్లు చేయరానిపని చేయఁగలను? నిన్ను జంపఁగ నున్న నిస్తులవీరుఁడు = నిన్ను నెప్పుడెపుడు చంపుదునా దానికిసమయము దొరకునా యని యుండువాఁడు; హరిస్కంధుఁడు = సిం

హాముమూఁపురములవంటి మూఁపురములు గలవాఁడు, అవని జనియించె నిక్ష్వాకు నన్వయమున=ఏయిక్ష్వాకువంశమునఁ బుట్టినయనరణ్యుఁడు నిన్నుఁ జంపునని శపించె నో యావంశమున నాకార్యమునకై పుట్టినవాఁడు, ప్రేలెదవు=వదరెదవు. రాముఁడు దేబెయని, దీనుఁడని, దుర్బలుఁడని మనుష్యుఁ డని, రావణుఁ డన్నమాటల కిది ప్రత్యుత్తరము.

తా. ఓరీ! నీవు దిక్కులేని దానిని శీలహీనను బలికినట్లు పలుకుచున్నావు. నన్ను నీ వేమని తలఁచితివిరా? సత్యప్రతిజ్ఞ కలవాఁడును సత్యము మేరగాఁ గలిగి దానిని దాఁటనివాఁడును, ధర్మాత్ముఁడని జగత్ప్రసిద్ధుఁడును, ధర్మమందు నిలుకడ గలవాఁడును, ధర్మమున కనకట్ట యయి ధర్మమే తరణోపాయముగాఁ గలవాని కోడలను-నీ వొక్క రథము మీఁద నొక్కదిక్కునఁ బోఁగలవాఁడవు, ఆయన పది దిక్కులఁ బోఁగలవాఁడు. ఒక్క తేరిని నడపినట్లు పదితేరుల నేకకాలంబున నడపఁ గలవాఁడు. అయినఁ బండితపుత్త్రుఁ డన్నట్లు రాముఁడు శూరపుత్త్రుఁ డనియందువా? ఆయనకొడుకు రామచంద్రుఁడు ముల్లోకములందుఁ బూజ్యుఁడు. నీవలె భయముచేఁ గాదు, భక్తిచేఁ బూజ్యుఁడు. కొందఱచేత మాత్రమే కాదు. దేవ మనుష్య తిర్యగ్బాల వృద్ధ స్త్రీపురుష పశు పక్ష్యాదులచేతను బూజ్యుఁడు. రాముఁ డని ప్రసిద్ధి కెక్కినవాఁడు. నీవో హింసించి బాధించి రావణుఁ డని ప్రసిద్ధి కెక్కినవాఁడవు, ఆయనయో రమింపఁజేసి రమించి రాముఁ డని ప్రసిద్ధి కెక్కినవాఁడు. విశాలములయిన నేత్రములు గలవాఁడు. నీవలె భయంకరము లైన మిడిగ్రుడ్లు గలవాఁడుకాఁడు. దీర్ఘములైన బాహువులు గలవాఁడు. ఆయనచేతులు చూడఁగానే యెట్టివారికైన నీయన మహాపురుషుఁ డనునభిప్రాయము గలిగించువాఁడు. నీవలె తుట్టెపురుగులకువలె విశేషహస్తమస్తక పాదములు గలవాఁడుకాఁడు. మిక్కిలి ధర్మస్వరూపుఁడు. నీవలె ధర్మవిరుద్ధస్వభావుఁడు కాఁడు. నాకుఁ బ్రాణవిభుండు. నా ప్రాణములకు నధిపతి. నా ప్రాణము లాయనస్వాధీనమందు ఆయనధారణ పోషణములకు లోపడియున్నవి. నా ప్రాణములపై విభుత్వము నాకును లేదు. కావున నే నాయనసొత్తు. దీనిని మఱియొకరి స్వాధీనముచేయు నధికారము నాకు లేదు. దీనిని బోఁగొట్టుకొనుట కాపాడుకొనుట యాయనకార్యము. నీవనుకూలుఁడవైతివా నాకువలె నీకును ప్రాణవిభుఁడే, కాక ప్రతికూలించితివా నీకుఁ బ్రాణవిభుఁడే. యముఁడు (ఇచ్చటఁ బ్రాణవిభుశబ్దము జీవితేశశబ్దపర్యాయముగా గ్రహింపవలయును. భవేత్ప్రియే జీవితేశో నా యమే నానా॥ ర॥ ప్రాణములుదీయువాఁడు యముఁడే కదా) కాఁబట్టియే దైవము. నాకు మాత్రమే కాదు నీకును. కావున నీ వాయనను బూజింపవలయును గాని ధిక్కరించి చెడిపోరాదు. నీవు మొదటినుండి యాయనను ధిక్కరించుచున్నాఁడవు కావున నిన్నుఁ జంపుటకై యుండు నసమానశౌర్యముగలవాఁడు. చిచ్చునకుఁ

డోఁడు కరువలి వచ్చినక్రియ లక్ష్మణునితోఁ గూడియుండువాఁడు. ఆయన దరిద్రుఁడంటివి. కాఁడు, సర్వదా సలక్ష్మీకుఁడు. (చిహ్నేనామ్నోస్సలక్ష్మీకే సౌమిత్రౌసారసస్త్రియాం అని నా నా॥ ర॥ లక్ష్మి యాయనను విడిచియుండదు. ఎట్లు తెలియవలె నందు వేమో? స + హ + లక్ష్మణుఁడు = పరబ్రహ్మ లక్షణమువంటి లక్షణములు గలవాఁడు. పరబ్రహ్మలక్షణములు పరబ్రహ్మమందుఁ గాక మఱియెందుండును? పరబ్రహ్మ మంత్రణయో. ॥నానా॥ సింహము మూఁపురములవంటి మూఁపురములు గలవాఁడు కావున సింహము క్షుద్రమృగమును జూచునట్లు నిన్నుఁ జూచును. అట్టి దైవము, లక్ష్మీవంతుఁడు, వైకుంఠమున నుండక యిక్కడి కేల వచ్చెనందువా? అనరణ్యుని శాపప్రకారము నిన్నుఁ జంపుటకే యిక్ష్వాకువంశమునఁ బుట్టెను. ఈవిషయములు దెలియక యేమేమో వదరెదవు. అట్లయిన నన్నేల యింతవఱకుఁ జంపరాలే దందువా? నెపమునకై కాచి యున్నాఁడు. నన్ను నీవాయనయెదుట దాఁకియుండిన ఖరుని బలిపెట్టినట్లు నిన్ను నేలకు బలి యిచ్చియుండును. ఎదుటఁ బడలేదు. కావున బ్రతికియున్నావు. ఎదుటఁ బడినఁ జచ్చినవాఁడ వనియే నమ్ముము.

ఉ. భీకరరూప మంచుఁ బటు♦భీమబలాఢ్య మటంచు రాక్షసా
నీకము నెన్నె దీవిచట ♦ నిర్విష మాచును దార్క్ష్యుని ముందర ద
ర్వీకరరాజి యట్లు తల ♦ వ్రేలఁగ వైచి పడుగ్ మదీశచా
మీకరపుంఖ బాణతతి ♦ మ్రింగఁగ వీచులు గంగయొడ్డనన్. ౯౬౦

భీకరరూపము = భయము కలిగించు నాకారము గలది, పటుభీమబలాఢ్యము = దృఢమై భయంకరమైన బలముయొక్క యతిశయము గలది. రాక్షసానీకము = రాక్షససేన, నిర్విషము = నిర్గతవిషము, పోయినవిషముగలది. తార్క్ష్యుని మ్రోలన్ = గరుత్మంతునియెదుట, దర్వీకరరాజి = పాములగుంపు, మత్ + ఈశ = నా భర్తయొక్క, చామీకరపుంఖ = బంగారుపిడులుగల, బాణతతి = బాణముల సమూహము, వీచులు = అలలు.

తా. నారాక్షససేన భయంకరాకారము గలది, దృఢమై భయంకరమైన బలముగలది యని యాఁడుది యగు నాయెదుట నిచ్చట నీమూలయింట్లో గేహేశూరుఁడవై ప్రజ్ఞలు పలికెదవు. నీసేనాబలము భయంకరత్వ మెంతవఱకు? గరుత్మంతుని కంటఁబడునవఱకేకదా పాములభయంకరత్వము బలము. ఆనలఁ దల వంచుకొని నేలఁబడునుగదా. అట్టులే నీబలమంతయు నాభర్త ప్రయోగించు బంగారుపిడులుగల బాణములు గంగానది యల లొడ్డును మ్రింగినట్లు నీ సేనను మ్రింగును.

చ. వరమున దేవదైత్యుల క♦వధ్యుఁడ వైనను నాదుభర్తకాఁ
కరమున గల్గఁ జేసి బ్రదు♦కగ్ వశమా రణసీమ నీకు, స

ధ్వరమున యూపబద్ధపశు♦భంగిని నీవు మనంగఁ జాల వా
శరవర! రామభీకరని♦శాతశరాళికి గోచరుండ వై. ౫౬౧

అవధ్యుఁడవు = చంపరానివాఁడవు, ఆఁకరము = ఆగ్రహము, అధ్వర మునన్ = యజ్ఞమందు, యూపబద్ధపశుభంగిని = యూపస్తంభమునకుఁ గట్టఁబడిన పశువువలె, మనంగఁజాలవు = బ్రతుకలేవు, ఆశరవర = రాక్షసశ్రేష్ఠుఁడా! రామ= శ్రీరామునియొక్క, భీకర = భయంకరమైన, నిశాత = పదునైన, శరాళికిన్ = బాణసమూహమునకు, గోచరుండవై = కనఁబడినవాఁడవై.

తా. నీవు వరబలమున దేవతలచే దైత్యులచేఁ జావకపోదువుగాక. నాభర్తకుఁ గోపము వచ్చినట్లు చేసితివేని యుద్ధమందు నాభర్తచేఁ జావకుండ నావరములు కాపాడఁజాలవు. నాభర్త దేవదైత్యుల తెగలలోఁ జేరినవాఁడు కాఁడు. నామగఁడు సంకల్పించెనేని నీకు వరము లిచ్చినబ్రహ్మరుద్రాదులను గూడఁ జంపఁగలఁడు. ఇఁక వారివరములు నిన్నేమి కాపాడఁగలవు? అదియును గాక మనుష్యులచేఁ జావనట్లు నీకు వరములేదుకదా. కావున యజ్ఞమందు యూపస్తంభమునకుఁ గట్టఁబడిన పశువు చచ్చుట యెట్లు సిద్ధమో నామీఁద మనస్సు పెట్టిన నీవుచచ్చుట సిద్ధము. రామబాణముల బారిఁబడి నీవా బ్రతుకఁ గలవాఁడవు?

క. రాక్షస! క్రోధోద్దీపిత, చక్షువులన్ నిన్ను రామ♦చంద్రవిభుండున్
వీక్షించిన దగ్ధుఁడవై, నీక్షితిఁ దత్క్షణము కూల♦వే నీచమతీ. ౫౬౨

తా. నీచబుద్ధిగలరాక్షసా! రామచంద్రమూర్తి కోపముచే మండుచున్న కన్నులఁ జూచినంతమాత్రముచేతనే యానిమిషమునందే కాలి నేలఁబడవా? కుక్కను గొట్టను బచ్చెనకోల కావలయునా, యన్నట్లు నిన్నుఁ జంపుటకు బాణ ప్రయోగములు కావలయునా?

శా. ప్రాలేయాంశుకబింబమున్ వసుమతిం♦బాతంబుఁ గావించు, దో
ర్లీల న్నాశము నైనఁ జేయు జలధిం♦గ్రీడాగతిన్ శోషిలన్
హేలారీతిని జేయఁ జాలుఘనుఁ డా♦నిస్తుల్యవీర్యుండు ప్రో
యాలిన్ రక్తను బందినుండి విడఁ జే♦యం జాలఁడే రక్కసా. ౫౬౩

సముద్రము దాఁటి రాముఁ డెట్లు రాఁగలఁ డను రావణుమాటకు సీతాదేవి ప్రత్యుత్తర మిచ్చుచున్నది.

ప్రాలేయాంశుక బింబమున్ = చంద్రబింబమును, వసుమతిన్ = భూమిమీఁద, పాతంబుఁగావించున్ = పడునట్లుచేయును. ౧౧౧౩ పద్యము చూడుఁడు. దోర్లీలన్ = భుజబలవిలాసముచే, జలధిన్ = సముద్రమును, శోషిలన్ = ఎండునట్లు, హేలారీతిని = అవలీలగా, చేయఁజాలును = చేయశక్తిగలవాఁడు. యుద్ధకాండము ౪౪౪ పద్యము చూడుఁడు. పద్భ్యాంయాతుప్లవంగమాః॥ వానరులు

కాలినడకతోఁ బోదురుగాక యని రామచంద్రమూర్తి చెప్పెనుగదా. నిస్తుల్య = సమానములేని, వీర్యుండు = శౌర్యముగలవాఁడు, ప్రోఁయాలిన్ = ఇల్లాలు, ప్రోలు + ఆలు—ప్రోయాలు. పురశబ్దభవము ప్రోలు, తద్భవమున నర్థభేదము. రక్తను = తనయం దనురాగముగల దానిని, బంది = చెఱ, విడఁజేయంజాలఁడే = విడిపింపలేఁడా?

తా. నీబలపరాక్రమముల గుఱించి నీవు చెప్పినవి దంభవాక్యములు. వాస్తవము చెప్పెదను విను. రామచంద్రమూర్తికిఁ గోపమువచ్చెనా చంద్రునైన నేలఁబడఁగొట్టును. రూపము కానరాకుండనైన భుజబలముచేఁ జేయఁగలఁడు. సముద్రము నాటవోలె నెండింపఁగలఁడు. అటువంటి యసమానబలుఁ డీతుచ్ఛసముద్రమును దాఁటి వచ్చి తనయం దనురాగముగల తనయిల్లాలిని జెఱనుండి విడిపింపలేఁ డని తలఁచితివటరా, రాక్షసా! అవశ్యము విడిపించును.

క. గతరముఁడవును గతాయువు, గతేంద్రియుఁడు గతబలుఁడవు ♦ కావుట ఖల నీ
కతమున వైధవ్యంబునఁ, గుతిలపడున్ లంక యేటి ♦ కో యీపొగరున్. ౯౬౮

నాయైశ్వర్యము చూడు, నాయిండ్లు మేడలు పట్టనము చూడు మనిన మాటకుఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నది.

నీవుగతరముఁడవు = తొలఁగిపోయిన లక్ష్మికలవాఁడవు, నాభర్తరమాగతుఁడు. నీవు గతాయువు=క్షీణించిన యాయువు గలవాఁడవు. ఏకపత్నీవ్రతుఁడైన నాభర్త దీర్ఘాయుష్మంతుఁడు. గతేంద్రియుఁడవు. నీవు స్త్రీవ్యసనాసక్తుఁడవుకావున నింద్రియబలము క్షీణించినవాఁడవు. నాభర్త జితేంద్రియుఁడు. నీవు గతబలుఁడవు= ఆకారణముచేతనే నీవు బలహీనుఁడవు. నాభర్త బలయుతుఁడు. కావుటన్ = అయినకారణముచే, ఖల = దుష్టుఁడా, నీకతమునన్ = నీవుకారణముగా, లంక-వైధవ్యంబునన్ = విధవాత్వముచే, భర్తలేనిదై. ఇక్కడ లంకయనఁగా లక్షణచే లంకాపురస్త్రీలు విధవలగుదురని భావము. కుతిలపడున్ = బాధపడును. "ఆయుర్బలం యశోలక్ష్మీః పరదారాభి మర్శనాత్, సద్యఏవ వినశ్యంతి" యను స్మృతివాక్యము గ్రహింపనగు.

తా. నీయైశ్వర్యము, నీగృహములు, లంక నీకింకను గల దని నన్నాశ గొలిపెదవు. ఎప్పుడు నీవు పరస్త్రీని కామదృష్టి స్పృశించితివో యప్పుడే నీసంపద నాశము. ఆయుస్సు ఇంద్రియబలము దేహబలము సర్వము నాశమైనదని తలంపుము. నీకారణమున లంకాపురము పతిలేని దగును. అందలి స్త్రీలు విధవ లగుదురు. ఇంతమాత్రమునకా యీపొగరు. వినాశకాలము సమీపించినను పొగరుచేఁ దెలిసికొనలేక యున్నావు. ఎంతమూఢుఁడవురా!

క. నాపతిపార్శ్వంబును నెడఁ, బాపుటచే నన్ను నబలఁ ♦ బాపాత్మా యీ
పాపంబు సుఖోదర్కం, బేపాటియుఁ గాదు చూడు♦మీ నీ కెటులున్. ౯౬౯

అబలన్ = అల్పబలముగలదానను, సుఖోదర్కంబు = ముందుసుఖమిచ్చునది, ఏపాటియున్=ఏమాత్రము, ఎటులు - కళ్లైనను అర్థవిశేషమున మఱిన్. లేకన్, ఉండిన్, మొదలగువానివలె ను వర్ణము వచ్చెను.

తా. అల్పబలముగల నన్ను నాభర్తయొద్దనుండి యెడఁబాపుటచే పాపాత్ముఁడా నీపాపము నీకుఁ గొంచెమైనను సుఖము గలిగింపఁజాలదు. చూచుచుండుము.

ఉ. దైవబలంబుఁ గల్గు మహితద్యుతిమంతుఁడు ధర్మశీలి స
ద్భావుఁడు నిర్భయుండు వితతప్రతిమానవిహీనశూరతన్
గేవలుఁ డుగ్రసత్త్వమృగకీర్ణమహాటవి నున్నవాఁడురా
రావణ బాణవర్షమునఁ గ్రక్కునఁ జేయు భవద్బలోద్ధతుల్. ౯౬౬

మహితద్యుతిమంతుఁడు=గొప్పకాంతిగలవాఁడు, వితత = విస్తారమైన, ప్రతిమానవిహీన = అసమానమైన, శూరతన్ = శౌర్యముచే, కేవలుఁడు = అద్వితీయుఁడు, అటువంటివాఁడు రెండవవాఁడు లేనివాఁడు. ఉగ్రసత్త్వ మృగకీర్ణ మహాటవిన్ = భయంకరమైన బలముగల మృగములచే వ్యాపించిన పెద్ద యడవియందు, భవత్ = నీ, బలోద్ధతుల్ = బలగర్వములను.

తా. నామగనికి దేహబలమే కాదు. దైవబలము గలదు. కావున మిక్కిలి తేజస్సు గలవాఁడు. నీకు దైవబలములేదు. కావునఁ దేజస్సు లేదు. నీవు చెప్పిన దేబె, జోగి నీవే కాని రామచంద్రుఁడుకాఁ డని వానిమాట కిది సమాధానము. ధర్మయుక్తమైన నడవడిగలవాఁడు. మంచిమనస్సుగలవాఁడు. భయమెట్టిదో యెఱుఁగనివాఁడు. విస్తారమై యసమానమైన శౌర్యమునందు నంతటివాఁడు వేఱొకఁడు లేనివాఁడు. భయంకరములైన మృగములచే నిండిన యడవియం దున్నాఁడు. నీబలమును నీగర్వమును బాణవర్షమున గ్రక్కించును. ప్రతిమానవిహీనుఁ డనుట చేతనే కేవలత్వము బోధపడుచుండ మరల కేవలుఁ డనుట పునరుక్తికాదా యని శంకింపరాదు. "ఏక మేవాద్వితీయం బ్రహ్మ" అనుచో నన్వయించిన ట్లన్వయింపవలెను. కేవలశబ్ద మేకత్వమును, ప్రతిమానవిహీనుఁ డనుట అద్వితీయత్వమును బోధించెడిని. అట్టివాఁ డాయన యొకఁడే కాని రెండవవాఁడు లేఁ డనుట.

క. కాలవశులైన పురుషులు, కాలప్రేరణముఁ జేసి కార్యములందున్
జాలఁ బ్రమాదము పడుదురు, మే లని దుష్కార్యములను మేకొండ్రు సుమీ.

కాలవశులు = మృత్యువునకు నధీనపడినవారు, ప్రమాదము = పొరపాటు, మేకొండ్రు = అంగీకరింతురు.

తా. మృత్యువు సమీపించినవారు కాలప్రేరణముచేత వారువారు చేయఁదగు కార్యములందు హెచ్చరికదప్పినవారై చేయరాని చెడుకార్యములవలన మే లున్న దని యవి చేయ నంగీకరింతురు.

క. అట్టివినాశపుఁగాలము, పుట్టెం జుమి నీకు నసుర♦పుంజములకు నిన్
గట్టికొని యున్నసతులకు, నిట్టు నను నీవు బల్మి♦నిటఁ దెచ్చుటచేన్. ౯౬౮

అసురపుంజములకున్ = రాక్షససమూహములకు.

తా. ఆవిధముగా నాశమై పోవుకాలము, నీకు రాక్షససమూహమునకు నిన్నుఁ గట్టుకొన్న స్త్రీలకు నీవు నన్ను బలవంతముగాఁ దెచ్చుటచే, నేకకాలమునఁ గలిగెను.

తే. క్రతువుమధ్యంబునందుస్రు♦గ్భాండమండి,తంబుబ్రాహ్మణమంత్రపూ♦తంబువేది
మాలఁడంటఁగ వశమె యా♦లీల సతిని, రామపత్నిని నన్ జూడ♦రా దురాత్మ.

క్రతువు = యజ్ఞము, స్రుగ్భాండమండితంబు = స్రుక్కులు మొదలగు నుపకరణములచే నలంకరింపఁబడినది, బ్రాహ్మణమంత్రపూతంబు = బ్రాహ్మణు లుచ్చరించు వేదమంత్రములచేఁ బవిత్రమైనది, వేది = తిన్నెను, సతిని = పతివ్రతను, రామపత్నిని = రామచంద్రమూర్తి భార్యను, దురాత్మ = చెడు మనస్సుగలవాఁడా!

తా. యజ్ఞశాలమధ్యమున స్రుక్కులు మొదలగు నుపకరణములుగల పాత్రముచే నలంకరింపఁబడి వేదమంత్రములచే బ్రాహ్మణులచే పవిత్రము చేయఁబడిన వేదిని మాలవాఁడు తాఁక వశమా? ఆవిధముగ పతివ్రతను రాముభార్యనైన నన్ను వేదినిగాను నిన్ను మాలవాఁడుగాను నెంచుకొనుము.

ఆ. ధర్మనిత్యుఁడైన♦దశరథ సుతవర్యు, ధర్మపత్ని సాధ్విఁ♦దరమె నీకు
రాక్షసాధముండ♦రూక్షదుశ్చరితుండ, పాపి నన్నుఁ దాఁక♦బాలిశుండ! ౯౭౦

తా. ధర్మము విడనాడని దశరథుకుమారుని ధర్మపత్నినై పతివ్రతనైన నన్ను రాక్షసాధముండా! పాపుండా! దుష్టచరితుండా! మూఢుండా! నీవు తాఁక సాధ్యమా?

క. అరవిందబృందముల నన,వరతము రాయంచతోడ♦వరకేళీత
త్పర యగుహంసాంగన యే,కరణిఁ దృణస్థంబు నీరు♦కాకిని గనెడిన్. ౯౭౧

అరవింద బృందములన్ = కమల సమూహములందు, అనవరతము = ఎల్లప్పుడు, రా+అంచ = రాజహంస, హంసాంగన = ఆఁడుహంస, ఏకరణిన్ = ఏవిధముగ, తృణస్థంబు = గడ్డిలోనుండు.

తా. తామరలసమూహమందు రాజహంసతో నెల్లవేళల విలాసముగాఁ గ్రీడించు నాఁడుహంస యేవిధమున గడ్డిలోఁ దిరుగు నీరుకాకిని జూడఁగలదు?

చ. తనువు విసంజ్ఞ మియ్యది మ♦దంబునఁ గట్టెద వేని కట్టుమీ
కనలునఁ దిందు వేని తిను♦కా దనుదానను గాను, నాకు నీ
తనువును జీవితం బయిన♦దానవ! రక్ష్యము గాదు రోరి, నా
మన మిది మద్వశంబ యవ♦మానము పాల్పడ నొల్ల నమ్ముమీ. ౯౭౨

తనువు = దేహము, విసంజ్ఞము = జడము, మదంబునన్ = గర్వముచే,

కనలునన్ = కోపముచే, రక్ష్యము = రక్షింపఁదగినది, మనము = మనస్సు, మద్వశంబు = నాయధీనము.

తా. ఓరీ! నీవలన నేను జెడను. నా కాభయయము లేదు. నాభర్త యిచ్చటికి రానే వచ్చును. నిన్ను జంపనే చంపును. లంక నాశముచేయనే చేయును. ఇది నిశ్చయము. నీకు నేను భయపడను. వశపడను. నీమగఁడెప్పుడో వచ్చును నిన్ను రక్షించు ననికదా యనెదవు. ఇప్పుడే నిన్ను నఱకిపాఱవైచిన నేమిచేసెదవు అనెదవా? వినుము. ఈదేహము జడము. దీనిని గర్వించి కట్టెదవా కట్టుము. కోపించి తినెదవా తినుము. నేను వలదనను. ఏలయందువా? దానివలన నా కేహానియు లేదు. ఈదేహము నేను రక్షింప వలసినది కాదు. ఉన్నను బోయినను సంతోషములేదు వ్యసనములేదు. ఇఁక నేదిపోయిన వ్యసన మందువా? నాదేహము చెడిన నేను జెడను. నామనస్సు చెడిన నేను జెడుదును. నామనస్సు నా స్వాధీనమం దున్నది. దానిని నీ వేమియుఁ జేయఁజాలవు. మనస్సు నన్యులకు వశపఱచి యవమానపడ నొల్లను.

క. అని పరుసంబుగ వాకొని, కనరున మఱియేమి యనక ♦ క్ష్మాకన్యక యుం
డిన నసురుఁడు భయసందర్శనముగ మండుచును ననియె ♦ సస్మితవదనా. ౯౨౩

పరుసంబుగన్ = కఠినముగ, వాకొని = చెప్పి, కనరునన్ = కోపముచే, భయసందర్శనముగ = భయముకలుగునట్లు, సస్మితవదనా = చిఱునవ్వుతోడి ముఖముగలదానా! కొందఱయం దేడుపు ముఖము లెట్లుసహజములో కొందఱయందు నవ్వుముఖము లట్లు సహజమగును. అట్లు చెప్పిన మాటయేకాని యీదశయందామెనవ్వుచుండిన దని భావముగాదు. అదియునుగాక యామెముఖము గుడ్డచేఁ గప్పుకొనియుండఁగా నది యెట్లుండినది వాని కెట్లు తెలిసెను?

తా. ఈప్రకారము కఠినముగ మాటలాడి కోపముచే నేమియుఁ బలుకక సీతాదేవి యూరకుండెను. అప్పుడు రాక్షసుఁడామెకు భయము కలుగునట్లు మండిపడుచు నిట్లనియె. ఓసి నవ్వుమోముదానా!

రావణుఁడు సీతమీఁద రాక్షసస్త్రీల కావలి యుంచుట.

మ. విను సీతా పదిరెండుమాసములలో ♦ విశ్వాసపూర్వంబుగా
ననుఁ గామింపఁగఁ గోర వేనియును నం♦తం బ్రాతరాశార్థ మై
నిను నావంటలవారు తున్కలుగ ఖం♦డింపం గలా రంచు న
ద్దనుజుం డచ్చటికావుకత్తెల కనున్ ♦ దైత్యాంగనల్ వింటిరా. ౯౨౪

తా. సీతా! వినుము. ఇఁక పండ్రెండుమాసములలో నీవు నాయందు విశ్వాసముగలదానవై. నన్నుఁ గామింపకపోయితివా పండ్రెండు నెలలు వెళ్లఁగానే (ప్రాతరాశార్థము) ఉదయమున భోజనమునకై నావంటలవారు నిన్ను ముక్కలుగఁ గోసి

వందుదురు. అని చెప్పి యచ్చటికావున్న స్త్రీలను జూచి ఓరాక్షసాంగనలారా! విన్నారా?

ఒకరాజు మఱొకరాజును జయించి యతనిస్త్రీలను చెఱగొనెనేని పండ్రెండు నెలలు గడు వియ్యావలయు ననియు-ఆలోపల వారిమగలు వారిని విడిపించుకొనిపోవ రేని వారు చెఱపెట్టిన రాజుస్త్రీలే యగుదురని భారతమున శాంతిపర్వమున రాజ నీతిపర్వమందుఁ గలదు.

ఇది జ్యేష్ఠమాసము. రామరావణయుద్ధము ఫాల్గునమాసమునందుఁ గృష్ణ పక్షమున:-హనుమంతుఁడు సీతాదేవిని దర్శించినది ఫాల్గునారంభమున. అప్పటికది పదియవ నెల జరుగుచున్న దని సీతాదేవి హనుమంతునితోఁ జెప్పెను. కావున రావ ణుఁడు సీతను హరించినది జ్యేష్ఠమాస మని యేర్పడుచున్నది. హేమంతవర్ణనము నకు-శూర్పణఖాగమనమునకు సంబంధములేదు. అది రామచంద్రమూర్తి తపో విధము దెలుప వర్ణింపఁబడెను. ఇచ్చట గోవిందరాజీయమందు సీతాపహరణము చైత్రమాసమున ననియు పంచవటీవాసము మూఁడుసంవత్సరము లనియు వ్రాయఁ బడినది. ఈవిషయము ముందు చర్చింపఁబడును.

ఉ. దింపుఁడు దీనిక్రొవ్వు కసి ♦ దీఱఁగ నంచు వచింప వారు నై
లింపవిరోధిఁ జూచి ముకు♦ళింపఁ గరంబులు పాదఘట్టనో
త్కంపితభూమిభాగుఁ డయి ♦ దానవనాథుఁడు దీని నిష్ఠ నా
పంపునఁ గొంచుఁ బొందు నవ♦పల్లవపుష్పలతావికీర్ణ మై.　　౯౭౫

కసి = కోపము, నైలింపవిరోధి = దేవతాసమూహముల శత్రువు, ముకుళిం పఁగా = మోడ్చఁగా, పాదఘట్టన = కాలిత్రొక్కుడులచే, ఉత్కంపిత = మిగుల వణఁకుచున్న, భూమిభాగుఁడయి = భూమిప్రదేశముగలవాఁడయి, పంపునన్ = ఆజ్ఞ చే, నవ+పల్లవ+పుష్ప+లతా+వికీర్ణమై = క్రొత్తలగు చిగుళ్లు పూలుగల తీఁ గలచే నిండినదై.

తా. నాకోపము చల్లారునట్లు దీనిక్రొవ్వు దిగఁజేయుఁడు అని చెప్పఁగా వా రంగీకారసూచకముగ నమస్కరించిరి. అంతట వాఁడు భూమి యదరునట్లు కాలితో నేల తన్నుచు రావణుఁడు దీని నిప్పుడే క్రొత్తచిగుళ్లు పూలుగలతీఁగలచే నిండినదై.

క. మానిత మైనయశోకో,ద్యానమునకు నంద విహార ♦ యనవరతము ర
క్షానియతి నుండి యీవన,జానన నరయుండు కదుర♦హస్యము గాఁగన్.　౯౭౬

మానితము = గౌరవింపఁబడినదైన, అశోకోద్యానమునకున్ = అశోకవృక్ష ములు విశేషముగాఁగల ప్రమదావనమునకు. అశోకము మన్మథోద్దీపనము కావున నచ్చటికిఁ దీసికొనిపొమ్మనెను. అనవరతము = ఎల్లవేళ, రక్షానియతి = కాపాడు నేర్పాటునందు, అరయుండు = కనిపెట్టియుండుఁడు.

తా. గౌరవింపఁబడు నశోకవనమునకుఁ దీసికొనిపోయి యచ్చట నీమె

నుంచి యెల్లవేళ విడువక యీమెచేష్టలను మిగుల రహస్యముగాఁ గనిపెట్టి యుండుఁడు.

తే. ఘోరదర్శనలార వి♦కారరూప, లార మాంసాస్రభోజన♦లార సతిని
బెడిదములనొండె మెత్తని♦నుడులనొండె, వశమునకుఁదెండు వనగజ♦వధువునట్లు.

తా. భయంకరములగుచూపులుగలవారలారా! వికారములగు రూపములు గలవారలారా! మాంసము నెత్తు రాహారముగఁ గలవారలారా! ఈస్త్రీని బెదరింపుమాటలచేఁగాని మంచిమాటలచేఁగాని యడవియేనుంగును మచ్చికపఱచుకొనునట్లు నాకు స్వాధీనపడఁ జేయుఁడు.

క. అని చనిన నసురవనితలు, జనకసుతం దోడుకొనుచుఁ♦జని రనవరతం
బును సర్వకాలఫలపు,ష్పనికరములు గలయశోక♦వనతలమునకున్. ౯౨౮

అనవరతంబును = సర్వదా, సర్వకాల=అన్నికాలములయందలి, ఫలపుష్పనికరములు = పండ్లయుఁబూవులయు సమూహములు.

తా. ఈప్రకారము చెప్పి రావణుఁడు పోఁగా రాక్షసస్త్రీలు సీతాదేవిని దోడుకొని సదా యన్నిఋతువుల పండ్లుపూలు గుంపులుగుంపులుగాఁగల యశోకవనప్రదేశమునకుఁ బోయిరి.

క. విడువనివగపున మిగులన్, సుడివడుచును నాఁడుపులులు♦చుట్టుకొనంగా
మిడికెడుహరిణి యనంగాఁ, బడఁతుక రాకాసిగుమికి♦వశపడి యుండెన్. ౯౨౯

హరిణి = ఆఁడుజింక, రాకాసిగుమికిన్ = రాక్షసస్త్రీల గుంపునకు.

తా. వదలనివ్యసనముచే మిగులఁగళవళపడుచు నాఁడుపులులు చుట్టుకొనఁగా దుఃఖించు నాఁడుజింకవలె సీత రాకాసులగుంపునకు వశపడియుండెను.

క. అమ్ముగుద దుస్సహవ్యస,నమ్మున సంగ్రస్త యగుచు♦నవయుచు దృఢపా
శమ్ములకట్టులఁ జిక్కి సు,ఖమ్మెఱుఁగనియాఁడుజింక♦కరణిని నుండెన్. ౯౩౦

దుస్సహ = సహింపరాని, సంగ్రస్త = మిగులఁ గ్రమ్ముకొనఁబడినది, నవయుచున్ = కృశించుచు, దృఢపాశమ్ముల = గట్టిత్రాళ్లు.

తా. ఆసుందరి సీత సహింపరాని వ్యసనముచే మిగుల మ్రింగఁబడినదై కృశించుచు గట్టిపగ్గములచేఁ గట్టఁబడి సుఖమెఱుఁగని యాఁడుజింకవలె నుండెను.

కం. భీకరవికటేక్షణ ల,స్తోకము భయపెట్ట మగువ♦దూలుచు నుండెన్
శోకమున దయితుఁబతినిన్, శ్రీకరు దైవతము నెపుడుఁ♦జింతించు చెడన్. ౯౩౧

భీకరవికటేక్షణలు = భయంకరములై విరుపులైన కన్నులు గలవారు, అస్తోకము = మిక్కిలి, దయితున్ = ప్రియుని, శ్రీకరున్ = శుభముకలిగించువానిని.

తా. భయము కలిగించు పెద్దకన్నులుగల రాక్షసస్త్రీలు భయపెట్టుచుండఁ

గా సీతాదేవి శోకమున సోలిపడుచు తనప్రియుఁడు శ్రీకరుఁడు దైవము నగుమగని సర్వదా ధ్యానించుచుండెను.

సందేహము - యుద్ధకాండమున ౧౩౦౭-వ పద్యమున

ఉ॥ మానితశక్తి మేరువును మందరముం దుహినాచలంబు దో। యానచ రాన్వితంబగు సమస్తజగంబును గేలనెత్తనే। దానవభర్త యాభరతు తమ్ముఁ గదల్పఁగ నేరఁడయ్యె బల్। పూనికపంగటించి పెదవుల్‌బిగియించియు నీలకర్చి యుర్॥ అని-లక్ష్మణు నెత్తఁజాలని రావణుఁడు సీతాదేవి నెట్లెత్తఁగలిగెను? ఈరామాయణమందే "శ్రీలక్ష్మియే సీత—విష్ణుండవే నీవు" అని (యుద్ధ ౨౧౦౭) విష్ణుపురాణము. రాఘవత్వే భవే త్సీతా యనియుఁ గలదుగదా. సమాధానము:

లక్ష్మణుఁడు రావణునకుఁ గదలింపరానివాఁ డయ్యెఁగాని హనుమంతునకుఁ దేలికగానే యయ్యెను. "గీ. పవనతనయుండు సుహృదుండుఁ బరమభక్తి। గలుగు వాఁడును నగుట లక్ష్మణుఁడు పగఱ। కప్రకంప్యుఁడు నయ్యు వనాటునకును। దేలిక గనయ్యె నంతనా" అని యుద్ధ ౧౩౦౩. స్మృతితప్పి స్వాధీనత చెడి పడినవాఁ డొకనికి భారముగాను మఱియొకనికిఁ దేలికగను గాఁజాలఁడుగదా. కావున లక్ష్మణుఁడు స్మృతి తప్పినవాఁడుకాఁడు. కావున స్వసంకల్పముచే రావణునకు భారమయ్యెను. స్వసం కల్పముచే భక్తుఁడగు హనుమంతునకుఁ దేలికయయ్యెను. అట్టులే సీతాదేవియును.

లక్ష్మీదేవి రావణుఁడు పతివ్రతలఁ బెట్టుబాధ చూడఁజాలక వానిని సంహ రింపఁ గోరి యేదైన నొకనెపములేక చంపరాదు. కావున వేదవతిగాఁ బుట్టి వాఁడు తాఁకినాఁ డన్న నెపమున నేనయోనిజగాఁ బుట్టి నీమరణమునకుఁ గారణ మయ్యెద నని శపించి జానకిగా నవతరించెను. ఆసంకల్పము నెఱవేఱ వలసియు న్నది. కావున రావణునకుఁ దేలికగ నయ్యెను. తెలిసితెలిసి తానై చేసికొనిన కార్యమునకు శోకింప నేల యనిన రామవియోగము సహింపలేకయే యని యెఱుంగనగు. తనబిడ్డను బులి పట్టుకొనవచ్చెనేని తాను బులినోటి కడ్డము పోయి తల్లి బిడ్డను రక్షించును. అట్టులే తనబిడ్డలయి పతివ్రతలయిన స్త్రీలను రక్షించి చెఱనుండి విడిపించుటకుఁ దానే చెఱలోఁ బడెను.

ఈయర్థమును సుందరకాండమున ౫౭౮-వ పద్యమున, "హరింపఁజాలుదే దానవ నన్ను నిన్నెడపు తత్పరతన్ విధి యిట్లు చేసెడిన్"—అని సీతయే రావణు నకుఁ జెప్పెను.

మఱియొక విచారము—సీతారాములు లోకమున కుభయవిధ ధర్మము లనుష్ఠానముచే నుపదేశింప నవతరించి రని బాలకాండవ్యాఖ్యయందుఁ దెలుపఁ బడెను. సీతాదేవి ప్రాతివ్రత్యధర్మము స్పష్టముగఁ దెలియుచున్నది. ఆమె యుప దేశించిన పారలౌకికధర్మము అనఁగా ముముక్షువునకుఁ గర్తవ్య మేదియో దాని నెట్లు తెలిపెనో విచారింపవలయును. మతతత్త్వజ్ఞులందు ముముక్షుచర్యావిషయమై

రెండు భిన్నాభిప్రాయములు గలవు. మోక్షేచ్ఛగలవాఁ డని యెప్పుడు చెప్పితిమో వాఁడు బద్ధుఁడై చెఱయందుఁ బడియున్నాఁ డని యప్పుడే యేర్పడుచున్నది. బంధములేనివానికి మోక్షములేదు. అయినను అపహతపాప్మత్వాది షడ్గుణ రహితుఁడైన జీవుఁడు జననమరణాదులకు లోపడి సంసార మనుచెఱయందుఁ బడఁ గారణ మేమి? అది తొలఁగిపోవు నుపాయ మేది? యని విచారింపఁగాఁ గొందఱు జ్ఞానములేమిచే సంసారప్రాప్తి యనియు మరల జ్ఞాని యయ్యెనేని ముక్తుఁ డగు ననియు నందురు. మఱికొందఱు అది సరిగాదు. భక్తిలేకపోవుటచే జీవునకు సంసార ప్రాప్తి యనియు, భక్తి యుదయించిన సంసారము వదలిపోయి బద్ధుఁడు ముక్తుఁ డగుననియు నందురు. మొదటివారు జ్ఞానవాదులు. రెండవవారు భక్తివాదులు. జీవునకు సంసార మారోపితమే కాని స్వభావసిద్ధముకా దని యుభయవాదు లంగీ కరించినవారే. ఇది యెట్లు వచ్చెను? ఎట్లు పోవును? అను విషయమందే యభిప్రా యభేదము. జీవునకు సంసారము ప్రకృతిసాంగత్యముచేఁ గలిగినది. ప్రకృతిసాంగ త్యము తొలఁగిన సంసారముపోవును. ఎట్లన స్ఫటికమునకు ధావళ్యము సహజము. అయినను దాసానిపువ్వుతోఁ గూడెనేని యెఱ్ఱగాఁ గానవచ్చును. కావున స్ఫటిక మునందు రక్తవర్ణ మారోపితము. దాసానిపువ్వు నశించెనేని స్ఫటికమునందలి రక్తవర్ణము తొలఁగిపోయి యథాప్రకారము తెల్లగా నగును. అట్లులే జీవుఁడును ప్రకృతిసాంగత్యమున సంసారి యగుచున్నాఁడు. ప్రకృతి తొలఁగిపోయిన శుద్ధుఁ డగుచున్నాఁడు. ఈసంబంధము తొలఁగు నుపాయ మేది? జీవుఁడు నిత్యుఁడు శాశ్వ తుఁడు. నశించువాఁడు కాఁడు. ప్రకృతి నిత్యము, శాశ్వతము. నశించునది కాదు. కావున నీ రెంటికిఁ గలసంబంధము దొలఁగింపవలెను. జీవునకుఁ బ్రకృతిసంబంధము జ్ఞానమువలనఁ దొలఁగునా? తొలఁగదు. ఎట్టులన, స్ఫటికము తెలు పన్నజ్ఞానము మనకుఁ గలదు. దాసానిపువ్వుసాంగత్యముచే నెఱ్ఱనిరంగువచ్చిన దన్నజ్ఞానము గలదు. స్ఫటికము తెలుపు అని యెన్నినాళ్లు స్మరించినను స్ఫటికము తెలు పగునా? కానేరదు. అట్టులే జీవుఁడును నేను నిర్మలుఁడను అపహతపాప్ముఁడ నని యెన్ని కల్పములు ధ్యానించినను బ్రకృతి తొలఁగదు. త్రిగుణాత్మకమైన ప్రకృతి తొలఁ గుట కుపాయము భక్తి యని భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు భగవద్గీత ౧౪-వ అధ్యాయమున ౨౬ శ్లో.

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
సగుణా౯ సమతీ త్యైతా౯ బ్రహ్మభూయాయ కల్పతే॥

అని భగవంతుఁ డగువిష్ణునందు ననన్యమైనభక్తి (పతివ్రతయొక్క పతి భక్తివంటిదిగాని నాకు నందఱు పురుషులు సమానులే యను జారిణివలె నందఱు దేవతలు నాకు సమానులే యను భక్తిగాదు). ప్రకృతిబంధమును దొలఁగించి ముక్తునిఁ జేయు నని చెప్పెను. కావున ననన్యభక్తి లేకపోవుటయే సంసారప్రాప్తికి

హేతువు. అనన్యభక్తి కుదురుటయే సంసారముక్తికి హేతు వని యేర్పడెను. ఇది లక్షణము. దీనికి సీతాచరిత్రము లక్ష్యము. ఎట్టులన:—

పంచవటియం దున్నసమయంబున మారీచుఁడు మాయామృగమై వచ్చెను. దానిని జూచి సీతాదేవి రామచంద్రమూర్తితో మృగచర్మమందు లోనంటిన మక్కువం బలికెఁ బ్రాణధవా విను మానసగొల్పెడిన్, "దయ దానిని బట్టి తేఁగదే." యని కోరెను.

వెంటనే లక్ష్మణుఁడు శ్రీరాముం గని యిట్లు వాకొనియె. "మారీ చాసురుండే తదాకారం బూని మునిశపాళి మృగయాకాంక్షాగతోర్వీశులన్ గ్రూరుండై వధియించు నీయడవి" "మాయావి యల్లయసురుఁడె మాయామృగరూప మెత్తి మలయును గంధర్వాయతపురి యట్టిది యీకాయము నిక్కంబు గాదు" అని చెప్పెను. దీనివలన సీతాదేవికి మృగవిషయమైన వాస్తవజ్ఞానములే దని చెప్ప సాధ్యపడదుగదా. ఇట్లు చెప్పినను వినక రామచంద్రమూర్తి తన్నుఁ బాసి మృగము వెంటఁ బోవుట కంగీకరించెను. ఇక్కడ నొకవిషయ మాలోచింపవలయును. ఇచ్చట నీసమయమున సీతాదేవికి రామునందు ప్రేమ యెక్కువయా? మృగమందుఁ గామ మెక్కువయా ? కామమునకంటెఁ బ్రేమ మెక్కువయై యుండెనేని ఛీ యీ క్షుద్రచర్మమునకై నామగని నేను కష్టపెట్టవచ్చునా? ఆయనను విడిచి నే నుండ వచ్చునా? యని యాలోచించి తననిమిత్తముగా రామచంద్రుని విడనాడియుండుట కంగీకరించియుండదు. ఎక్కడ నొకక్షణమైన వియోగము వచ్చునో యనుభయమే పరమభక్తి "పున ర్విశ్లేషభీరుత్వం పరమాభక్తి రుచ్యతే" యని పరమభక్తి లక్షణము. సీతాలక్ష్మణు లిరువురు నిట్టి రామవియోగము సైఁపనివారే. కావుననే కదా లక్ష్మణుఁడు "నిన్నుఁ బాసి ధరాతనూజయు నేను నొక్కముహూర్తమే నిన్నిలం గలవారమె తమ నీటఁ బాసిన చేఁప లట్లన్న" యని చెప్పెనుగదా. అంతటిభక్తిగల సీత కామముచే రాముని నెడఁబాయఁగోరుటచే నాక్షణంబున కామముకంటె భక్తి తక్కువయనియె చెప్పకతప్పదు.

ఇది మొదటిపొరపాటు. సీతాదేవి యిట్టులే రెండవపొరపా టొకటి చేసెను. అది లక్ష్మణుని నెడఁబాయుట. లక్ష్మణుఁడు పరమభాగవతోత్తముఁడు. భగవంతునిసాహాయ్యము లేకున్నను భాగవతానుగ్రహముండినచో భయము లేదు, భగవంతుఁడు కోపించినవానిని భాగవతుఁడు కాపాడఁగలఁడు. భాగవతాపచారము చేసినవారిని భగవంతుఁడును గాపాడలేఁడు.

అంబరీషోపాఖ్యానమే దృష్టాంతము. ఇట్లు రామలక్ష్మణసాహాయ్యము (భగవద్భాగవతసాహాయ్యము తొలఁగఁగానే) దశకంఠుఁడు, (దశేంద్రియములు) వచ్చి సీతనుఁ (జీవుని) బట్టుకొని పోయి లంకలోఁ (దేహములో) బ్రవేశపెట్టెను. లంక=

లం అనునది పృథివీబీజాక్షరము. కావున పృథివీతత్త్వమును దెలుపును. పృథివి యొక్కవగాఁగలది లంక = దేహము.

సీత జీవునిఁగాఁ జెప్పుటకుఁగారణ మేమన:—సఏవ వాసుదేవోఽయం, సాక్షాత్పురుష ఉచ్యతే। స్త్రీప్రాయ మేత త్తత్సర్వం, జగద్బ్రహ్మపురస్సరమ్॥ విష్ణుపురాణము. భగవంతుఁడొక్కఁడే పురుషుఁడు, తక్కినదంతయు స్త్రీప్రాయమే. కావున స్త్రీయను సీత జీవుఁడుగాఁ జెప్పఁబడెను. ఎప్పుడు కామ ముదయించి భగవంతునియందుఁబ్రేమ తగ్గునో యప్పుడే సంసారప్రాప్తి యని తెలియునది. కావున సీతాచరిత్రమువలన భక్తిహీనతయే సంసారహేతు వని యేర్పడెను. మోక్షమునకు ననన్యభక్తియే కారణమని సీతాదేవిచరిత్రమునుబట్టి మఱియొకచోఁ దెలుపఁబడును. దీనివలన భక్తిలేనిజ్ఞానము వ్యర్థ మని తెలియునది. దేహవంతుఁడైన జీవుఁడు దుఃఖభూయిష్ఠంబైన సంసారమునుండి తరించుమార్గము ఈ ౫౭-౧-వ పద్యమున నుత్తరార్ధమునఁ జెప్పఁబడెను. దీనివివరణమె తక్కినసీతాచర్య సమస్తము. ఈజీవునకు భగవంతుఁడే దయితుఁడు, ప్రియుఁడు, పతి (ఆత్మేశ్వరగం) శ్రీకరుఁడు దైవము. కావున సీతవలె సర్వదా యాయనను దృఢవిశ్వాసముతోఁ దలంచుచుండుటే మోక్షోపాయము.

సీతావృత్తాంత మింతతో నిలిపి యిఁక రామచంద్రమూర్తివృత్తాంతము చెప్పఁబడును.

## ౫౮-వ సర్గము. రాముఁ డపశకునములఁ గని పరితపించుట.

ఉ. అక్కడఁ గామరూపిఁ బల♦లాశి మృగాకృతిఁ బూని యున్నయా
టక్కరిఁ ద్రుంచి యాశ్రమము ♦ డాయుత్వరం జనుదెంచుచోట వె
న్ప్రిక్కశివారుతంబు విని ♦ రాముఁడు దారుణ మీరవంబు నా
కెక్కుడుకీడుఁ దెల్పె, నసు♦రేంద్రులు మ్రింగరు గాదె జానకిన్. ౫౮-౧

అక్కడన్ = అడవియందు, కామరూపి = కోరినరూప మెత్తఁగలవాఁడు, పలలాశి=మాంసభక్షకుఁడు, రాక్షసుఁడు, మృగ+ఆకృతి = జింకయొక్క యాకారము, టక్కరి = మోసగాని, త్రుంచి = చంపి, వెన్ప్రిక్క = వెనుకతట్టు, శివారుతంబు=నక్కకూఁత, దారుణము = భయంకరము, అశుభసూచకము. రవంబు= ధ్వని, మ్రింగరుకాదె = మ్రింగలేదుకదా.

తా. అక్కడ రామచంద్రమూర్తి కామరూపియు మాంసభక్షకుఁడునై జింకరూపము ధరించిన యావంచకుని మారీచుని జంపి యాశ్రమమునకు రావలయు నని త్వరత్వరగా వచ్చుచు వెనుకప్రక్క నక్కకూఁత విని, యిది యశుభమును దెలుపుచున్నది. దీనివలనఁ గీడుకలుగును. రాక్షసులు జానకిని మ్రింగిరోయేమో?

మ. ఖలమారీచుఁడు మద్రవానుకృతి బి♦గ్గం గూసె, నానాద మా
జలజాతాక్షియు లక్ష్మణుండు విని రా♦సంభ్రాంతులై తత్సతీ

తిలకప్రేషితుఁడై సుమిత్రసుతుఁడెం♦తే వేగ నన్ రోయుచున్
జెలువం గానల వీడి వచ్చు నటపైఁ♦ జేటేమి గా నున్నదో.  గా౧౩

ఖలమారీచుఁడు = దుష్టుఁడగుమారీచుఁడు, మద్రవానుకృతి = నాకంఠధ్వని వలె, బిగ్గన్ = గట్టిగా, సంభ్రాంతులై = నాధ్వనియో యని భ్రమచెందినవారై, తత్ + సతీతిలక = ఆస్త్రీరత్నము, సీతాదేవిచే, ప్రేషితుఁడై = పంపఁబడినవాఁడై, రోయుచున్ = వెదకుచు.

తా. దుష్టుఁడగు మారీచుఁడు నాకంఠస్వరమువంటి స్వరముతో గట్టిగా నఱచెను. ఆధ్వని సీతయు లక్ష్మణుఁడు వినిరా సీత తప్పక లక్ష్మణుని నానిమిత్తమై పంపును. లక్ష్మణుఁడు నన్ను వెదకుచు నడవిలో సీతనొంటిగా వదలి వచ్చును. ఆవల నేమికీడు గలుగునోయేమో?

ఉ. ఎక్కడిపైఁడిజింక, నను♦ నీగతిఁ దాటకసూతి దూరమున్
దక్కక తెచ్చి నాశరము♦తాఁకునఁ జచ్చుచు సీత లక్ష్మణా
చిక్కితి నిం ద టంచఱచె♦ సిద్ధము దీనను జూడ జానకిం
ద్రెక్కొన నున్నవారు రజ♦నీచరు లేపటుమాయచేత నేన్.  గా౧౪

తాటకాసూతి = తాటకాకుమారుఁడు, మారీచుఁడు, త్రెక్కొనన్ = చంపఁగా, మ్రింగఁగా, రజనీచరులు = రేద్రిమ్మరులు = రాక్షసులు.

తా. ఔరాచిత్రము! లోకమున బంగారుజింకయుఁ గలదా? మారీచుఁడు నన్నిమోసవిధముగా దూరముగా తెచ్చి నాబాణముచేతఁ జచ్చుచుఁ జచ్చెడివాఁడూరకచావక, సీతా లక్ష్మణా యిందుఁ జిక్కుఁబడినా నని యఱచెను. ఇదంతయు నాలోచింపఁగా నాకుఁ బ్రత్యక్షముగాఁ గీడుచేయలేరు కావున రాక్షసులేగొప్పమాయచేతనైనను సీతను మ్రింగ నుద్దేశించియున్నవా రనుట సిద్ధము.

సీ. కాన నేకత ముండు♦ కలికికి నాతమ్ముఁ, గుఱ్ఱకు సేమంబు♦ గొఱలుఁ గాక
తెగనివైరము గల్గె♦ దితిజులతో జన,స్థానవాసంబు ని♦దానముగను
ఘోరనిమిత్తముల్♦ గొల్లలుగాఁ దోఁచె, నఱచుచు నున్నవి♦ వఱడు లెందు
నేకీడు మూఁడునో♦ యెది కన్నఁ గల్గునో, యేమి సేయుదు వార♦ లెట్టు లైరొ

తే. యనుచు దీనతఁ జనుచోట♦ నఖిలపక్షి
మృగవితానము సవ్యంబు♦ నేగు చతుల
భీకరారావములు నింపఁ♦ బృథ్వీసుతను
దమ్ముఁ జింతించుచును బోయెఁ♦ దడయ కెందు.  గా౧౫

ఏకతము = ఒంటె, తమ్ముఁగుఱ్ఱకు = చిన్నతమ్మునకు. ఇది విశేష్యపూర్వపద కర్మధారయము. తమ్ముఁడైన కుఱ్ఱవాఁడు. "తమ్ముఁగుఱ్ఱలునీవుఁ దగ విపినంబున కరిగితిరి." భార, అర ౭. నిదానము = ఆదికారణము, ఘోరనిమిత్తముల్ = భయంకరములైన యపశకునములు, కొల్లలుగా = విశేషముగ, వఱడులు =

నక్కలు, అఖిలపక్షిమృగవితానము = సమస్తములైన పక్షులయు మృగములయు సమూహము, సవ్యంబు = ఎడమవైపుగా, అతుల = అసమానములైన, భీకరారవములు=భయంకరధ్వనులు, తమ్ముఁ = తమ్ముని, తడయక = జాగుచేయక.

తా. కాఁబట్టి యొంటరిగానుండు కలికి సీతకు,నాచిన్నతమ్మునకు, క్షేమము కలుగునుగాక! జనస్థానవాసము కారణముగా రాక్షసులతో నంతములేని విరోధము సంభవించెను. అవశకునములు విస్తారముగఁ దోఁచుచున్నవి. ఎక్కడఁ జూచినను నక్క లఱచుచున్నవి. ఏమి కీడుమూఁడునో. ఏఘోరవిపయము చూచుట తటస్థించునో తెలియదు. ఏమి చేయఁగలను? సీతాలక్ష్మణు లేమిగతి పట్టిరో యనుచు వ్యసనపడుచు, వచ్చుచుండఁగా మృగములు పక్షులు కుడినుండి యెడమవైపుగా భయంకరధ్వనులు గావించుచుఁ బోవుటఁ జూచి లక్ష్మణుని సీతను గుఱించి యాలోచించుచు నెందును జాగుసేయక పోయెను.

-రాముఁడు లక్ష్మణుం జూచి సీతఁ దలంచి దుఃఖించుట.-

ఉ. పోవుచు నిట్టు లాశ్రమము ♦ పొంతకు వేగ నదూరమంద సీ
తావిభుఁ డేగుదెంచు తన ♦ తమ్ముని దీనతరాస్యుఁ గాంచి దుః
ఖావిలచిత్తుఁ డై కదిసి ♦ యాతనిసవ్యకరంబుఁ బట్టి తా
నీవిధి నార్తి దోఁప నని♦యెం బరుషంబును మార్దవంబుగన్. ౧౮

అదూరమందు=మిక్కిలి దవ్వుగాని ప్రదేశమందు, దీనతరాస్యుఁ=మిగులఁ జిన్నపోయిన ముఖముగలవానిని, దుఃఖావిలచిత్తుఁడై = దుఃఖముచే వ్యాకులపడిన మనస్సుగలవాఁడై, కదిసి = సమీపించి, సవ్యకరంబు = ఎడమచేయి, పరుషంబుగన్ = కఠినముగ, మార్దవంబుగన్ = మృదువుగ.

తా. ఇట్లు పోవుచు నాశ్రమమునకు సమీపమందే ముఖము వ్రేలవైచుకొని యొంటరిగా వచ్చుతమ్మునిఁ జూచి వచ్చెనే యేదో కీడని వ్యసనముచేఁ గలఁతచెందిన మనస్సుగలవాఁడై యాయనను సమీపించి యెడమచేతిని బట్టుకొని వ్యసనముతోఁ దొలుతఁ బరుషంబుగను, నావల మృదువుగను నిట్టు లనెను. తొలుతఁ దెలివితక్కువ పనిచేసినాఁ డని తలఁచి కఠినముగను, ఇం దతనిదోషములే దని యాలోచించి మృదువుగను బలికెను. కుడిచేతియం దాయుధ ముండుటచేత నెడమచేతిని బట్టుకొనెను.

శా. అయ్యో లక్ష్మణ యేమి చేసితివి నీ ♦ యాసీత నీ వొంటిగా
నయ్యారణ్యతలంబున న్వదలి యే♦లా వచ్చి తిం దక్కటా
యయ్యన్నుఁ మనుజాశనుల్ మెసవిరో ♦ హా కొంచునే పోయిరో
యయ్యో సందియ మింత లే దశుభమే ♦ యత్యంతముం గల్గెడిన్. ౧౯

అయ్యన్నుఁ = ఆయాఁడుదానిని, మనుజాశనుల్ = మనుష్యులఁదినువారు, రాక్షసులు, మెసవిరో = భక్షించిరో?

తా. అయ్యో లక్ష్మణా! ఏమిపని చేసితివి? సీత నేల యొంటిగా నడవిలో విడిచి యిచ్చటికి వచ్చితివి? రాక్షసు లాయాఁడుదానిని దినిరో, తీసికొనిపోయిరో? ఈ రెంటిలో నొకటి జరిగియుండును, సందేహము లేదు. అశుభచిహ్నములే కానవచ్చుచున్నవి.

శా. అన్నా! లక్ష్మణ! చూడఁగాఁ గల మొకో ♦ యన్నారి జీవంబుతో
నున్నన్ సేమముగాఁగఁ, గంటివె యదే ♦ యుగ్రంబుగాఁ గూసె నా
సన్నంబై వఱదుల్ ఖగంబులు మహా♦సత్త్వంబులున్ సూర్యసం
పన్నాశాభిముఖంబులై, శుభ మెటుల్ ♦ ప్రాపించు నోతమ్ముఁడా. ౯౮౭

అన్నారి = ఆస్త్రీ, సూర్యసంపన్నాశాభిముఖంబులై = సూర్యుడుండు దిక్కు-ముఖములుచేసి.

తా. అన్నా! లక్ష్మణా! సీతాదేవి ప్రాణముతోనుండఁగా మనము చూడఁగలమా! లేము. ఏలందువా! అదె చూడుము. నక్కలు, పక్షులు, పెద్దమృగములు, సూర్యున కెదురుముఖమై పరుషధ్వనులు చేయుచున్నవి. ఈ యపశకునములఁ జూచిన తమ్ముఁడా మన కెట్లు మేలుగలుగును? దీనివలన సూర్యున కెదురుముఖమై పక్షులు మృగములు నక్కలు కూసెనేని కీడు కలుగును అని సూచితము.

క. హరిణమువలెఁ దోఁచినయీ, ఖరదైత్యుఁడు వాలకమునఁ ♦ గడుదవ్వనన్
సరగఁ గొనియేగ నెట్లో, పొరిపుచ్చితి వాని మోస♦పోకలు దెలియన్.

వాలకమునన్ = మోసమున, పొరిపుచ్చితిన్ = చంపితిని.

తా. జింకవలెఁ గానవచ్చిన యీదుష్టరాక్షసుఁడు మోసగించి, నన్ను మిగులదూరము తీసికొనిపోయెను. వానిమోసపుఁజేష్టలు మనస్సునకు రాఁగానే వాని నెట్లో చంపితిని.

తరలము. అదరె వామవిలోచనంబు, ప్ర♦హర్ష మేమియు లేదు నా
మదిని, నాశ్రమభూమి నిక్కము ♦ మానినీమణి లేదురా
సుదతినిన్ హరియించిరో తమ♦సూడు దీఱఁగ రక్కసుల్
ముదిత దా మరణించెనో వని♦లోనఁ ద్రోవయె తప్పెనో. ౯౯౦

వామవిలోచనము = ఎడమకన్ను, సూడు = పగ.

తరలము- న భ ర స జ జగములు - పండ్రెండవయింట యతి.

తా. లక్ష్మణా! ఎడమకన్నదరుచున్నది. సంతోష మేమియు మనస్సునందు లేదు. నాయనా యాశ్రమమందు సీతలేదురా. తమపగదీర్చుకొనుటకై రాక్షసులు దానిని పట్టుకొనిపోయిరో లేక వారిచే బాధపడలేక తానే చచ్చెనో లేక మనలను వెదకుచు వచ్చి త్రోవ తెలియక వేఱొకత్రోవ నెందేని పోయెనో.

## ౫౮-వ సర్గము.

ఉ. ఇమ్మున సౌఖ్యముల్ విడిచి ♦ యెంతయు నాపయి భక్తి దండకర్
ణ్యమ్మరి రాజ్యహీనుఁడను ♦ దీనుఁడుఁ ద్రిమ్మటకాఁడు నైననా
కమ్మెయి దుర్దశాప్తిని స♦హాయగనై చరియించు జానకిం
దమ్ముఁడ వీడి వచ్చితివి ♦ నాసతి యేగతిఁ బట్టెఁ జెప్పుమా. ౼౼ ౧

ఇమ్మునన్ = సంతోషముతో, ఇంపుగ, త్రిమ్మటకాఁడు = తిరుగుచుండు వాఁడు, దుర్దశాప్తిని = కష్టదశప్రాప్తించినపుడు, సహాయగనై = తోడై.

నాలుగవపాదంబున బిందుయతి, ంద = న.

తా. ఇంత సుఖము లమరలే దనియే సాధారణముగ స్త్రీలు దుఃఖింతురు. స్త్రీలబుద్ధితత్త్వ మిట్టిదై యుండఁ దానై యొకరు చెప్పక, బలవంతపెట్టక వినోదములఁ జూచుటకు (సుఖపడుటకుఁగాదు) దండకారణ్యమందుఁ గాలినడఁ దిరుగుటకు (నావలన సుఖముగోరికాదు) నాయందలి భక్తిచే వచ్చెను. నే నెటువంటివాఁడను? రాజ్యహీనుఁడను. దుఃఖములఁ దపించువాఁడను. నిలునీడ నీవా రమ్మని పిలుచువారు లేని త్రిమ్మరిని. ఇట్టి నాకు నట్టి కష్టదశయందు సహాయురాలుగనై నాకుఁ దనచేనైన సుఖము కలిగింపఁ గోరి తిరుగుచుండు జనకరాజపుత్రికను తమ్ముఁడా వదలి వచ్చితివే. నాభార్య యేమై పోయెనయ్యా చెప్పుము. ఊపిరితో నున్నదా? లేదా? రామచంద్రమూర్తి శోకమునకు ముఖ్యకారణ మిదియేకాని కామము కాదు. అది నాలుగింట నొకటి.

ఉ. ప్రాణ సహాయురా లెవతెఁ ♦ బాసి ముహూర్తమ యేని దేహసం
త్రాణపరాయణత్వమునఁ ♦ దాళఁగఁ జాల, ధరాపతిత్వగీ
ర్వాణపతిత్వముల్ కమల♦పాణి యెవర్తుక యొద్ద లేనిచోఁ
బోణిమిఁ గోర నట్టిపుప్పుఁ♦బోణి ధరాత్మజ యేది లక్ష్మణా. ౼౼ ౨

ప్రాణసహాయురాలు = నాప్రాణ మీదేహమున నిలుపుటయందు సహాయపడునది. ఆమెసాహాయ్యము లేకున్న, నాప్రాణము లెప్పుడో పోయియుండు నని భావము. దేహసంత్రాణపరాయణత్వమున = దేహమును రక్షించు నభిలాషతో, ధరాపతిత్వ = రాజుగానుండి భూలోక మేలుట, గీర్వాణపతిత్వము = ఇంద్రుఁడుగానుండి స్వర్గ మేలుట, కమలపాణి = (౧) కమలమువంటి చేయిగలది, (౨) కమలమును బాణియందుఁగలది = లక్ష్మి, పోణిమి = సుఖము.

తా. నాప్రాణములు దేహమున నిలుపుటయందు, సాహాయ్యపడు నెవతెను నెడఁబాసి యీదేహమును రక్షింపఁజాలనో, యెవతె నాయొద్ద లేనిచో సార్వభౌమత్వముఁగాని ఇంద్రత్వముగాని కోరనో యెటువంటి సుమకోమల సీత యెదిరా లక్ష్మణా? కమలపాణి = లక్ష్మీదేవి. ఈమెసాహాయ్యము లేకున్న భగవంతుఁడు నిష్క్రియుఁడే. ప్రాణముండియు లేనివానితో సముఁడే. ఈమాయా

శక్తి నాశ్రయించియే దేహధారినై కానవచ్చుట. ఈమె లేదేని భూలోకక్రీడ లేదు. స్వర్గలోకక్రీడ లేదు. లీలావిభూతియందలి క్రీడకు సహాయురాలీమె యేకదే. "స ఏకాకీ నరమేత" యనికదా శ్రుతి చెప్పుచున్నది.

ఉ. ప్రాణముకంటె నాకుఁ బ్రియ ♦ మైనమహీసుత సీత దండక
ప్రాణముతోడ నున్నదియె ♦ పల్కవయా, పదునాలుగేఁడు ల
క్షీణముగా వనీస్థలి వ♦సింతున టన్నమదుక్తి బంభరీ
వేణినెపానఁ గల్లయయి ♦ పెంపఱఁ జేయదుగా కుమారకా. ౬౬౩

అక్షీణముగాన్ = కొఱంతలేక, వనీస్థలిన్ = అడవిప్రదేశమందు, మదుక్తి= నామాట, బంభరవేణి = తుమ్మెదల చాలువంటి జడగలదాని, పెంపఱన్ = గొప్పతనము నశించునట్లు, కుమారకా = నాయనా. ఆదరార్థంబున కప్రత్యయము.

తా. అన్నా లక్ష్మణా! నాప్రాణములకంటె నాకుఁ బ్రియమైనది యగుటచే నాప్రాణ మిచ్చియైన నేనవలెను రక్షింపవలయునో యట్టిసీత దండకయందుఁ బ్రాణముతో నున్నదా లేదా? అది ముందు చెప్పుము. నేను బదునాలుగు సంవత్సరము లరణ్యములందుఁ గొఱంతలేకుండ వసింతునని చెప్పితిని. ఇప్పుడు సీత లేదాయెనా నేను లేనివాఁడనే కావున నేను జెప్పినమాట సీతకారణముగ నసత్యముకాదు గదా. దానివలన రాముఁడు సత్యప్రతిజ్ఞుఁడను గొప్పతనమునకు హానిరాదుకదా. నాయనా చెప్పరా.

క. సీతాకారణముగ నే, వీతాసుఁడ నైన నీవు ♦ వేపురి కరుగన్
జేతము రంజిలఁ గామా,న్వీత యగుచు భరతుమాత ♦ విలసిల్లుఁ గదా. ౬౬౪

వీతాసుఁడను = ప్రాణముపోయినవాఁడను, వే = త్వరగా, చేతము = మనస్సు, కామాన్వీత = నెఱవేఱిన కోరికతోఁగూడినది.

తా. సీత మరణించిన కారణమున నేను మరణించినవాఁడనే. మే మిరువురము లేనప్పుడు నీ కీయడవులలో నేమిపని? ఊరికిఁ బొమ్ము. నీవూరికి వచ్చుటఁ జూచి నే నడవులలోఁ జావఁగోరుచున్న కైక తనకోరిక నెఱవేఱఁగా సంతోషించును గదా. మనస్సులో దాఁగియుండినది శోకాతిశయకారణమున స్మృతిదప్పుటచే బయలుపడెను. "సుప్త ప్రమత్త కుపితానాం భావజ్ఞానం దృష్ట"మ్మని న్యాయము గలదుకదా.

క. సుతరాష్ట్రసహితఁ గైకను, మృతపుత్త్ర తపోవ్రతాఢ్య ♦ మృదుశీలిని స
న్నుతగుణ కౌసల్య యదే,గతిఁ జిత్తమెఱింగి కొలువఁ♦గా నేర్చు నయో.

సుత రాష్ట్రసహితన్ = కొడుకుతోను రాజ్యముతోను కూడినది, మృతపుత్త్ర = కొడుకు చచ్చినది; తపోవ్రతాఢ్య = తపస్సులచే వ్రతములచే సంపన్న, మృదుశీలిని = మెత్తని స్వభావముగలది, సన్నుతగుణ = సత్పురుషులచేఁ బొగడఁబడు గుణములుగలది.

తా. కొడుకుతోను రాజ్యముతోను గూడియుండు కైకను కొడుకు చచ్చెనని పుత్రశోకమున నేడ్చునదియు, తపములు వ్రతములు విశేషించిగలదియు, మృదుస్వభావముగలదియు, సత్పురుషులచేఁ గొనియాడఁబడు గుణములు గలదియు నగు నా తల్లి కౌసల్య యేవిధముగఁ గైకమనస్సు నెఱిఁగి సేవింపఁగలదు. ఇందొక్కొకటి సేవాధర్మమునకు విరుద్ధమైనది. కొడుకు చచ్చెనను శోకముతో వికలమయిన మనస్సుగలది యితరుల చిత్తవృత్తి నెట్లెఱుఁగఁగలదు? అట్టులే తక్కినవి యూహించునది. సేవాభంగమున కొక్కటొక్కటియే చాలియుండఁగా నిఁక నాలుగుచేరిన నెట్లు సేవచేయ సాధ్యపడును? కావున నా తల్లి యేగతిఁ బట్టునో?

క. వచ్చెద నాశ్రమమునకును, సచ్చరితా సీత ప్రాణసహితయ యేనిన్
జచ్చెద నిచ్చట లేదే, నచ్చిగురుంబోణి యాశ్రమాంతరమందున్. ౯౯౬

తా. లక్ష్మణా! సీతాదేవి ప్రాణములతో నుండెనా యాశ్రమమునకు వచ్చెదను. లేదా అంతదూరము రానేల? నేనిందే చచ్చెదను. కావున సీత జీవించి యున్నదా లేదా చెప్పుము.

క. ముద్దులు గులికెడినవ్వున, ముద్దియ నాకెదురు వచ్చి మురిపంబున మేల్
సుద్దులు చెప్పద యేనియు, బిద్దెద నాశ్రమముఱ్ఱొలఁ బెక్కులిఁ కేలా.

బిద్దెదను = చచ్చెదను.

తా. నేను వచ్చునప్పటికి జీవించియుండెను. ఇప్పు డెట్లున్నదో నాకుఁ దెలియ దనెదవా? ముద్దులుగులుకుచు నవ్వుచు నాకెదురుగ వచ్చి యాముగ్ధ నాకు మంచిమాటలు చెప్పకపోయెనా యాశ్రమములోనికి రాను. దానిముందే మరణించెదను. ఎక్కువమాటలవలన నేమి లాభము?

క. పలుకుము లక్ష్మణ జానకి, గలదా ప్రాణంబుతోడఁ గడ తేఱినదా?
పలలాశులు భక్షించిరొ, యెలనాఁగను నీవు చిత్తమేమఱి యుండన్.

ఎలనాఁగ = స్త్రీ.

తా. లక్ష్మణా! చెప్పుము. సీత ప్రాణముతో నున్నదా, తానై చచ్చినదా, లేక నీవు హెచ్చరిక తప్పియుండు సమయమున రాక్షసులు మ్రింగిరా?

క. బాలిక యవిదితదుఃఖ సుశీల సలీల సుకుమారి సీతాసతి యా
గోల మదీయవియోగం, బేలాగునఁ దాళఁజాలు నెటు వగచెడినో. ౯౯౯

బాలిక = చిన్నవయస్సుది, అవిదితదుఃఖ=ఇంతవఱకు దుఃఖమెఱుఁగనిది, సుశీల=మంచిస్వభావముగలది, సుకుమారి=కోమలదేహముగలది, ఆ గోల=అట్టి వంటి ముగ్ధ,

తా. ప్రాణముతోనే యున్నది, రాక్షసులు హరించి రనెదవా? అయ్యో చిన్నవయస్సుది. ఇంతవఱకు దుఃఖ మెఱుఁగదు. మంచిస్వభావముగలది. విలాస

ముతోఁ గూడినది. కోమలాంగి యగు సీత నన్ను విడిచి యెట్లు సహింపఁగలదు? ఎందెట్టు లేడ్చుచున్నదో?

క. నీచుఁడు క్రూరాత్ముఁడు మా, రీచుఁడు వంచకుఁడు నాదు♦రీతిని నిన్నుం
　వాచాకుశలత నఱచిన, నోచెల! నీకును భయంబు ♦ నొదవెనె చెప్పుమా.

నాదురీతిని = నేనఱచినట్టులు, వాచాకుశలతన్ = మాటనేర్పుచేత, ఓచెల = అయ్యో! ఇది సంతాపార్థకము - ఓచెల్లయొక్క రూపాంతరము.

తా. నీచుఁడు, కఠినచిత్తుఁడు, మోసగాఁడు నగుమారీచుఁడు నే నఱచినట్లే గొంతుమార్చుటయందు నేర్పుగలవాఁడు కావున నఱవఁగా నయ్యో నీకును భయము గోఁచెనటయ్యా! ఆఁడుది కావున సీతాదేవి మోసపోయినఁ బోవచ్చును గాని నీ వెట్లుమోసపోయితివి?

ఉ. మామకకంఠనిస్వనస♦మానవిరావము నాలకించి యా
　భూమిజ భీతిఁ జెంది నినుఁ ♦ బొమ్మని నంతనె నానిమిత్తమై
　యీమెయి వచ్చినాఁడవు మ♦హీజ మహాటవి నొంటి వీడి, దు
　ష్టామిషభుగ్వితానమున ♦ కంతర మిచ్చితి సూడు దీర్పఁగన్.　　౧౦౦౧

మామక = నాయొక్క, కంఠనిస్వన=కంఠధ్వనితో, సమాన = సమమైన, విరావము = ధ్వని, ఆలకించి = విని, భూమిజ = సీత, జ్ఞానములేని జడమువంటిది. కనుక నే నాకంఠస్వరమవునా కాదా, నే నట్లఱతునా యని యాలోచింప శక్తి లేని - భూమిజశబ్దము వృక్షమునందు నన్వయించును గావున నీయర్థము సూచితము నానిమిత్తమై = నన్ను రక్షించుటకై. నన్ను నీవా రక్షించువాఁడ వని భావము. దుష్ట = దుర్మార్గవర్తనముగల, ఆమిషభుక్ = మాంసముదిను రాక్షసుల, వితానమునకు = సమూహమునకు, అంతరము = సందు, సూడు = పగ.

తా. నాకంఠస్వరమువంటి స్వరము విని యాయాఁడుది సీత, భయపడి నిన్నుఁ బొమ్మని చెప్పఁగానే రక్షింపవలసినదానిని నబలను నొంటిగా నడవిలో విడిచి నన్ను నేను రక్షించుకొనలే నని నీవు నన్ను రక్షింపవచ్చితివి. వచ్చిన నేమి యందువా? మనకు విరోధులగు రాక్షసులు మనకుఁ గీడు చేయ నెడమిచ్చితివి.

క. ఖరవధమునకును వగచెడి, సురవైరులు సందు గాంచి ♦ సుందరి నెట్లేన్
　బరిమార్చి యుందు రిక్కము, పరికింపవ చూవె యింత♦వట్టు కుమారా.౧౦౦౨

తా. ఖరుఁడు చచ్చె నని యేడ్చురాక్షసులు సీత యొంటరిగా నుండుట తెలిసి యిదియే సమయ మని యామెను చంపియుందురు. ఇది నిజము. నాయనా! ఇది యిట్లు జరుగఁ గలదని యింతమాత్ర మాలోచింపవైతివిగదా!

క. మునిఁగితి దుఃఖసముద్రము, నను బడితిం జెడితిఁ గూలి♦నాఁడను నింకే
　మనుదుం జేయుదు నీగతి, పొనరుట ప్రాప్తవ్య మంచు ♦ బుద్ధిం దలఁతున్.

తా. నాయనా! నిన్నని ప్రయోజనములేదు. సీత నని లాభములేదు. దుఃఖ

సముద్రమునందు మునిఁగితిని. పూర్ణముగాఁ బడితిని, చెడితిని, చచ్చితిని. ఇంత కెక్కువనే నేమందును? ఈగతి నాకు రావలసి మీకీబుద్ధులు పుట్టెనని తలఁతును.

మంజుభాషిణి. అని మంజుభాషిణిని ♦ నాత్మ నెంచుచున్
జనియెం బిపాస క్షుధ ♦ జాలి గొల్ప మో
మును వాడఁగాఁ దొలఁగ ♦ మురువు, స్వాశ్రమం
బున కింతిలేమి నటఁ ♦ బొక్కి యేడిచెన్. ౧౦౦౪

మంజుభాషిణిని = ఇంపైనమాటలుగలసీతాదేవిని, పిపాస = దప్పి, క్షుధ= ఆఁకలి, జాలి = దుఃఖము, మురువు = అందము.

తా. అని సీతాదేవిని తలఁచుచు నాఁకలి దప్పి బాధింపఁగా ముఖము వాడఁగా నందము దొలఁగఁగాఁ దనయాశ్రమంబున సీతలేమికై యందు వెక్కి వెక్కి యేడ్చెను.

## ౫౯-వ సర్గము. రాముఁడు లక్ష్మణుని సీతను విడిచి యేల వచ్చితి వని యడుగుట.

క. తనయుటజమునకు వచ్చుచుఁ, దనుఁ జూడఁగ వచ్చియున్న ♦ తమ్మునిఁ గని యి
ట్లని ప్రశ్నించెను దెరువున, జనకసుతాధవుఁడు శోక♦సంతప్తుం డై. ౧౦౦౫

ఉటజమునకున్ = పర్ణశాలకు.

తా. తనపర్ణశాలకు వచ్చుచుఁ దన్నుఁ జూడ వచ్చియున్న తమ్ముని జూచి త్రోవలో రామచంద్రమూర్తి శోకముచేఁ దపించుచు నిట్లనెను.

ఉ. ని న్నెద నమ్మికాదె హరి♦ణీనయనన్ వని నొంటి వీడి యో
యన్న యి టేను వచ్చితిని ♦ న్యాయమె నీకు నరణ్యమధ్యమం
దన్నవలామిహిన్ విడిచి ♦ యాదరబాదర పాఱుతేర, ని
గన్నదియాది నామనము ♦ కాతరతన్ వహియించె లక్ష్మణా. ౧౦౦౬

నవలామిహిన్ = స్త్రీలయందుశ్రేష్ఠురాలు, ఆదరబాదర = త్వరత్వరగా, కాతరత = భయము.

తా. నీవు సీతను రక్షింపఁగల వని నిన్ను నమ్మికదా సీత నొంటిగా నీస్వాధీనమందుంచి నేనిట్లు వచ్చితిని. నేను గాపాడుకొనలేక నీ కాపని చెప్పితినా? ఆ స్త్రీరత్నమును నడవిలో నొంటిగా విడిచి యిందేమో మునిఁగిపోయినట్టు లాదరబాదర పరువెత్తివచ్చితివి. నిన్నుఁ జూచినది మొదలు లక్ష్మణా! నాకు మిగుల భయము కలుగుచున్నది.

క. సీతావిరహితుఁడవు నీ, వే తేరుట దూరమంద ♦ యేఁ గనినంతన్
భీతం బగలెను నదరెను, నాతమ్ముఁడ వామబాహు♦నయనంబు లహో. ౧౦౦౭

సీతావిరహితుఁడవు=సీతను విడచినవాఁడవు, చేతము = గుండె, అగలెను= పగిలెను, వామబాహునయనంబులు = ఎడమభుజము కన్ను అదరెను.

తా. వచ్చినవాఁడవు సీతనుగూడఁ బిలిచికొని వచ్చియుండరాదా? ఆమె లేక నీవొంటిగా వచ్చుట దూరమునుండి చూడఁగానే నాగుండె పగిలెను. ఎడమ భుజము ఎడమ కన్నదరెను. అయ్యో! మునిఁగెకదా కొంప యనుకొంటిని.

చ. అన భృశదుఃఖతప్తమతి ♦ యై యను లక్ష్మణుఁ డార్తిఁ దూలురా
మునకు స్వతంత్రతన్ మతివి♦మోహముచే నిట రాను, గావరే
జనకజ లక్ష్మణా యనుచు ♦ శబ్ద మరణ్యమునందుఁ గల్గినన్
విని సతి పొమ్ము పొమ్మనియె ♦ నీపయిఁ జెల్మిని భీతి నేడ్చుచున్.		౧౦౦౮

భృశదుఃఖతప్తమతియై=అధికవ్యథచే తపించిన మనస్సుగలవాఁడై, స్వతంత్రతన్ = నేనై స్వతంత్రించి, మతివిమోహముచే = బుద్ధిమోసముచే, రాను = వచ్చినవాఁడఁగాను.

తా. ఈప్రకారము రామచంద్రమూర్తి తనయందు దోష మారోపించుట చేతను, నాయనపడుచున్న శోకబాధచేతను, నిదివఱకు సీత పలికిన పలుకులకే మిగులఁ దపించిన మనస్సుగల లక్ష్మణుఁడు మఱింత తపించి యిట్లనియె. అన్నా! యాధ్వని నీకంఠధ్వని యని మోసపోయి స్వతంత్రించి నేనై రాలేదు. సీతా లక్ష్మణా కావరే యను ధ్వని యరణ్యమునందుఁ గలుగఁగా సీత విని భయపడి పోపొమ్మని నీయందు నుండుస్నేహముచే నన్నుఁ దీవరించెను.

క. ఈరీతిఁ దీవరించిన, నారీతిలకంబుఁ గాంచి ♦ నయమున నెంతో
దూరము నమ్మిక పుట్టఁగ, ధీరగుణా నిన్నుఁ గూర్చి♦ తెలిపితి మఱియున్.౧౦౦౯

తా. ఈప్రకారము తొందరపెట్టఁగా నిన్నుగుఱించి యమ్మా రామునకు భయములేదు. ఆయన కపాయము కలుగఁజేయువాఁడు లోకమునలేఁడు. అది రామునికంఠధ్వని కాదు. ఎవరో మాయలమారులు చేసినపని. రాముఁడు తన్ను రక్షింపుమని యొకరిని వేఁడునా యని యీప్రకారము నమ్మికగలుగుటకై యెం తెంతో చెప్పితిని.

చ. వదినె! యి కేటికమ్మ భయ♦పాటునఁ గుందెదు, రాక్షసాళిచేఁ
గదనమునందు రామునక ♦ కల్గు భయం? బది యేటిమాట యి
య్యది రఘురాముప ల్కనుచు ♦ నాత్మస్ఫురింపదు, దైత్యుఁ డెవ్వఁడో
యదను నెఱింగి యి ట్లుఅచె ♦ నంగన నెమ్మది నిమ్మళింపుమీ.		౧౦౧౦

తా. వదినె! ఏలమ్మా, ఇంతభయపడెదవు? రామచంద్రునకు రాక్షసుల చేతనా యుద్ధమందా భయము కలుగును? ఇది యేమి మాటమ్మా, నమ్మఁదగినదా? అనఁదగినదా? అది రామచంద్రమూర్తి కంఠధ్వని యని నాకుఁదోఁపలేదు. ఎవ్వఁడో

రాక్షసుఁడు సమయ మెఱిఁగి య ట్లఱచెను. అమ్మా! తొందరపడకుము. నిబ్బరించు కొనుము.

క. దేవతలనైనఁ గడిమిని, గావంగాఁ జాలు నట్టి♦కడిఁదిబలుండా
ఈవిధమున నీచంబుగ,వా విడి ననుఁ గావు మనుచు♦వాపోవు సతీ? ౧౧౧

కడిమిన్ = బలముచే, కడిఁదిబలుండా=అధికబలిష్ఠుఁడు, వావిడి = నోరు తెఱచి, వాపోవున్ = ఏడ్చును, అఱచును, నీచంబుగన్ = రక్షింపు మని యాఁడు దానిని బిలుచుట యనునది శూరునకు నీచకార్యము, బలుండా = కాకువు.

తా. రామచంద్రుఁ డనఁగా నేమని తలఁచితివమ్మా? దేవతలనైనను దనభుజ బలముచేఁ గాపాడఁగల యధికబలముగలవాఁడా తన్ను రక్షింపు మని నిన్నుద్దేశించి నీచముగ నీవిధముగ నోరుతెఱచి యఱచును? ఇదియెట్లమ్మా నీవు నిజమని నమ్మెదవు?

మ. ఎవఁడో యేమినిమిత్తమో యఱచెఁ ద♦ల్లీ నమ్ము మాయన్న యా
రవముం బోలఁగఁ బాహి పాహి యని యా♦రావంబు వైస్వర్య మా
త్మ విలోకింపఁగ రాముకంఠ మని న♦మ్మన్ రాదు శాంతింపుమీ
తవునే నీకుఁ గుయోషితాజనముచం♦దం బంది దుఃఖింపఁగన్. ౧౧౨

పాహి = రక్షింపు, వైస్వర్యము = మాఱుగొంతు, కుయోషితాజనము= నీచస్త్రీజనసమూహము. యోషిత్, యోషా-యోషితాయనురూపములుగలవు. "స్త్రీ వధూ ర్యోషితా రామా మండయంతీ వధూజనః" అని త్రికాండశేషము.

తా. ఎవఁడో యేదో కారణముగా మాయన్నగొంతువంటి గొంతుతో రక్షింపు రక్షింపు మని యఱచెను. ఆధ్వనిమార్పు వినఁగా నది మాయన్నగొంతు కాదు. కావున తొందరపడకుము. శాంతింపుము. నీవును నీచస్త్రీలవలె నిట్లు దుఃఖింపవచ్చునా.

ఉ. పుట్టినవారిలో జగతిఁ♦బుట్టెడువారలలో రఘూత్తమున్
గిట్టి రణంబునన్ గెలువ♦నేర్చెడువారలు కల్ల రమ్మ, లోఁ
దొట్టినభీతిఁ బో నడిచి♦తోయజలోచన స్వస్థచిత్త వై
దిట్టవు గ మ్మజయ్యుఁడు స♦తీ రఘురాముఁడు దేవకోటికేన్. ౧౧౩

లోఁదొట్టిన = మనస్సునఁగలిగిన, పోనడిచి = పోఁగొట్టి, అజయ్యుఁడు = జయింపసాధ్యముగానివాఁడు.

తా. ప్రపంచమందు నింతవఱకుఁ బుట్టినవారిలో, నికఁ బుట్టఁబోవువారిలో యుద్ధమునందు రామచంద్రు నెదిరించి గెలువఁజాలినవారు లేరు. కావున నీకు మనస్సునఁ గలిగినభయము వదలి స్వస్థచిత్తవు గమ్ము. దేవతలందఱు నేకమైనను రామచంద్రుని యుద్ధమందు జయింపలేరు. ఇఁక నీముక్కఁడి రాక్షసు లేమిచేయఁ గలరు?

క. నావుడు నతిమోహితమతి,యై వసుధాకన్య యనియె ♦ నగ్రజ! డీల్గన్
నీవు నను& గోరి కల్మష,భావుఁడ వైతట్టికోర్కి ♦ పారముఁ గనునే. ౧౦౧౪

అతిమోహితమతియై = మిగులనజ్ఞానమునకు వశపడినమనస్సుగలదై, వసుధాకన్య = సీత, డీల్గన్ = చావఁగా, కల్మషభావుఁడవు = పాపపుటాలోచనగల వాఁడవు, పారముగనునే = తుదముట్టునా.

తా. అని నేను జెప్పఁగా మిగులమతిభ్రమముగలదై సీత యిట్లనెను. నీవు నన్నుఁ గోరి యన్న చావవలయు నని పాపచింతకలవాఁడవైతివి; నీకోరిక కొనసాగునా?

సీ. తెలిసెను లెమ్ము నీ♦ తెఱఁగెల్ల భరతుండు, నీవు సంకేతంబు ♦ నిశ్చయించి
కొని రాము వెనువెంటఁ♦జను దెంచితివి నీవు, కాకున్నఁ దనయన్న ♦ కావు మనినఁ
బలుకరింపని యట్టి♦భ్రాతయుఁ గలుగునే, ప్రచ్ఛన్నచారి శా♦త్రవుఁడ వగుచు
నానిమిత్తంబుగా ♦ నానాథు వెంబడి, నంతరాన్వేషి వై ♦ యరుగుదెంచి
ఆ. తనినఁ బెదవు లదుర ♦ నాగ్రహంబున రక్త,నేత్రకుండ నగుచు♦నిలువలేక
యాశ్రమంబునుండి ♦ యరుదెంచినాఁడ నో,యన్న యున్నవిధము ♦ నాడినాఁడ.

ప్రచ్ఛన్నచారి = మాఱువేషము వేసికొని తిరుగువాఁడు, సంకేతము = ఒడఁబాటు. నీవిట్లుచేయుము, నేనిట్లుచేసెదనని యేర్పాటు. శాత్రవుఁడు = విరోధి, అంతరాన్వేషివై = సందు వెదకువాఁడవై.

తా. లక్ష్మణా! నీయభిప్రాయము దెలిసె లెమ్ము. నీవు నాకు సీతను లభింపఁ జేయుము. నీకు నేను సహాయముచేసెదనని నీవు భరతుఁ డొడంబడిక చేసికొని రాముని వెంట వచ్చితివి. అట్లుకాదేని నన్నుఁ గాపాడుమని యన్న యఱవఁగాఁ గాపాడఁబోని తమ్ముఁడుండునా? నీవు రహస్యవర్తనముగలపగవాఁడవుకాని రామునకుఁ దమ్ముఁడవు కావు. నానిమిత్తముగా నామగని వెంట నెప్పుడు సందుదొరకునా యెప్పుడు సీతను హరింతునా యని వచ్చితి వనెను. ఆమాటలు వినఁగానే నాకు బెదవు లదరెను. కన్ను లెఱ్ఱనయ్యెను. కోపముపట్టలేక యచ్చటనుండలేక యాశ్రమమునుండి వచ్చితిని. అన్నా! ఉన్నవిధము చెప్పినాఁడ.

## రాముఁడు లక్ష్మణుతో నతఁడు సీతను విడిచి వచ్చుట తగనిపని యని చెప్పుట.

క. అని లక్ష్మణుఁ డన దశరథ,తనయాగ్రణి శోకమోహ♦తాపార్దితుఁ డై
యను సీత విడిచి వచ్చుట, యనఘా సరిగానికార్య♦మన నేమి యిఁకన్. ౧౦౧౬

తా. అని లక్ష్మణుఁడు పలుకఁగా శోకమువలనఁ గలిగిన మోహముచేతను దాపముచేతను బీడింపఁబడినవాఁడై రామచంద్రమూర్తి లక్ష్మణుఁ జూచి, పాపరహితుఁడా! నీవు సీతను విడిచి వచ్చుట సరియైనకార్యము కాదు. ఇఁక నేమి యనుకొనిన నేమిప్రయోజనము? అనఘ యనుటచే సీత సందేహించిన దోషము నీయందు లేదని యావిషయమైన సందేహమును దీర్చెను.

(i) సీతాదేవి ప్రేరింపఁగా రాక్షససంహారమందు నాకు శక్తిలేదని శంకించి వచ్చితివా?

(ii) సీతపరుషవాక్యములవలన నీకు లోకనిందవచ్చునని శంకించి వచ్చితివా?

(iii) పరుషవాక్యములు సహింపలేక వచ్చితివా?

(iv) సీత నేను లక్ష్మణు నిట్లంటిని, అనినను బోలేదని నాతోఁ జెప్పిన నేను నీవిషయమున సందేహింతునని వచ్చితివా—అని వికల్పించుకొని యిందేకారణముచే నీవు వచ్చియుండినను నీవు చేసినది సరిగా దనుచున్నాఁడు. ఇందు నాలవది యనఘా యనుటచేఁ బరిహరింపఁబడెను.

ఉ. ఆఁడుది కింకచేఁ గఱకులాడె నటంచును గోప మెత్తి నా
వాఁడిమ గంటిమిన్ దనుజవారణమందలి శక్తిమత్త్వమున్
బోఁడిమి నీవెఱింగియును బొల్తుకఁ గానల వీడి వచ్చితే!
వేఁడియ కాని నీయెద వివేకము లేదు గదయ్య తమ్ముఁడా. ౧౦౧౭

ఆఁడుది "పెడతలనుండుఁగా యువతిబృందము కెల్లను బుద్ధి" యన్నట్టు సత్యాసత్యవిచారములేని యాఁడుది. కింకచేన్ = కోపముచే, కఱకులు = పరుషపుమాటలు, నావాఁడిమగంటిమిన్ = నాశౌర్యమును, దనుజవారణమందలిశక్తిమత్త్వమున్ = రాక్షసులనివారించుటయందు శక్తిగలవాఁడనగుటను, వేఁడియ = తీక్ష్ణకోపమే.

అయ్యో పాపము! లక్ష్మణుస్థితి శోచనీయము. ఇటు చెంపదెబ్బ, అటు చెంపదెబ్బ. సీతారాములవంటి వారిసేవయందే నిష్కామసేవయందే యింతకష్ట ముండెనేని కడుపుకూటికై ప్రతిఫలముగోరి బానిసలై సేవచేయువారిగతి యే మనుకొనవలయును. సేవాధర్మము పరమగహనము, యోగులకు నగమ్యము, అను భర్తృహరిసూక్తి గలదుగదా. నిష్కామముగ సీతారామసేవచేయువారికిని నిష్కారణముగఁ జెంపదెబ్బలు తప్ప వనియే యనుభవమునుబట్టి చెప్పవలసియున్నది.

తా. స్వస్థావస్థయందే స్త్రీప్రతీపదర్శిని, వామ, దార. ప్రతీపదర్శిని=వక్రముగా నాలోచించునది, వామ = వక్రమైనశీలముగలది, దార = భర్తను భయపెట్టునది. "ప్రతీపదర్శినీవామా వనితామహిళాతథా" యని యమరకోశము. ఇట్టివారికిఁ గోపముకూడ వచ్చిన నెట్లు లాలోచింతురో ఎట్లు ప్రవర్తింతురో యూహింప లేవైతివిగదా.

ఇట్టిది పరుషములాడుట యేమి వింత? మంచివారికిఁ గోపమువచ్చిననే యిది చెప్పవచ్చును, ఇది చెప్పరా దనుజ్ఞానముండదు. (సుందర ౧౨౮౯-౧౨౯౦-౧౨౯౧-౧౨౯౨ పద్యములఁజూడుఁడు.) ఇఁక స్త్రీలకుఁ గోపమువచ్చిన నడుగవలయునా? అందుఁ దనభర్త కేదో కీడుమూఁడె నని భయము శోకముచేఁ బీడింపఁబడినదానివిషయము చెప్పవలయునా? ఇవన్నియు నీ వాలోచింపక యది

కోపించెనని నీవు కోపించి నాశౌర్యము రాక్షసుల నణంచునాశక్తి నీవు తెలిసి తెలిసి యాఁడుదానిని నొంటిగ నడవులలో విడిచి వచ్చితివే - ఏమందును? ఎదుటివారు కోపించిన నేను గోపింపవలె నని తలంచితివే కాని తాఁకుతప్పు, దానివలనఁగలుగు నపాయము నాలోచింపవైతివిగదా తమ్ముఁడా!

క. అంగన నినుఁ బల్కిన దని, చంగునఁ గోపించి యిట్లు ♦ చనుదెంచుటయుక్
సంగతమే? నాయాజ్ఞా,భంగముఁ గావించి తిదియుఁ ♦ బాడియె నీకున్. ౧౦౧౮

సంగతమే = యుక్తమా? పాడియె = ధర్మమా? నీకున్ = నీవంటి పర తంత్రునకు.

తా. ఆఁడుది నిన్నుఁ గఠినోక్తు లాడె నని కోపించి యిట్లు వచ్చుట తగునా? స్త్రీజాతి కిదిస్వభావము. తిట్టినఁ దిట్టనీ, మనకార్యము మనముచేయవలసిన దే యని సహించియుండరాదా? ''కఱకుఁదనంబునను వాఁడికత్తుల బిఱుసుక్,'' అని యగ స్త్యుఁడు స్త్రీలస్వభావము చెప్పెనే మఱచితివా? తిట్టుచుండిన నెదురుగనుండి యెట్లు వినుచుందు ననెదవా? ఈవల వచ్చి దూరమందుండి రక్షించుచు నేను రాఁగానే యీవృత్తాంతము నాకుఁ జెప్పిన నేను విచారింపనా? నేను బెండ్లాము మాటలు విని నిన్ను సందేహింతు నని తలఁచితివా? అటుచేయక యిటుచేయక దూరమున విడిచివచ్చుట తగునా? అట్లు చేయుటచే నాయాజ్ఞమీఱితివే పర తంత్రుఁడవైన నీ కది తగునా? ఆమెది యాజ్ఞయేకదా యందువేమో? కాదనను. తల్లిదండ్రులయాజ్ఞలు పరస్పర విరుద్ధములైనపుడు నే నెట్లు వర్తింతునో యదియైన నాలోచింప వైతివిగదా? రామచంద్రమూర్తి చెప్పిన వన్నియు సత్యములేకాని యాయన యొకవిషయ మాలోచించినవాఁడు కాఁడు. ఆయన చెప్పిన పద్ధతులలో నేది యవలబించినను ఆయనకు సందేహములేకుండును గాని సీతకు సందేహము బలపడును. ఈ సందేహము విషమభావమునకు విరోధమునకుఁ గారణ మగును. ఇట్టి సందర్భములందు స్త్రీలు చేయుకుచేష్టలు, భర్తపరోక్షమున మెటికవిఱుపులు, ముక్కువిఱుపులు, మూఁతివిఱుపులు,కనుగిఱుపులు,కూడునీళ్లయొద్ద ననాదరణము, బిగింపులు లోనైన వెన్నియో చేయుదురు. ఇందొకటియైనను భర్తకుఁ దెలియదు. అనుభవించువాఁడు నీభార్య యిట్లుచేయుచున్న దని చెప్పుటకు వలనుపడదు. అనుటకు లేదు. అనుభవించుటకుఁ గాదు. అట్టికొంపలో నెవఁ డెట్లుండఁగలఁడు? గృహస్థునియాదరణములేని యింట కొన్నిపూఁట లుండవచ్చునుగాని గృహిణి యాదరణములేని యింట మానవంతుఁ డొకపూఁట యుండుటయుఁ గుంభీపాక మున వాసముచేయుటగా నెంచును. ఈకష్టము లక్ష్మణుఁ డాలోచించెఁగాని రామ చంద్రమూర్తి యాలోచించినవాఁడు గాఁడు. భార్యాభర్తలు సుఖపడియుందురు గాని లక్ష్మణుఁడు చెడియుండును. కావున లక్ష్మణుని ఋజువర్తనమే సాధువు. ఇప్పు డట్టి మనస్తాపములకుఁ గుటుంబకలహములకుఁ గారణము లేదయ్యె.

సీ. హరిణరూపంబున ♦ నాశ్రమంబుననుండి, ననుఁ గొని తెచ్చిన♦దనుజుఁ డిదిగొ
నతులశరం బొండు ♦ నవలీల నే వైవ, దానితాఁకున మృగ♦తనువు విడిచి
కేయూరభూషణా♦ళీయుత దేహుఁ డై, ప్రాణముల్ దన్నెప్డొ ♦ పాసి పోవ
వసుధపైఁ బడి యున్న♦వాఁడు దురాత్ముండు, దారుణం బైనమ♦ద్బాణఘాత

ఆ. మోర్వలేక యాతఁ ♦ డూపిరి విడుచుచు, నెద్ది వినుటఁజేసి ♦ యిచటి కీవు
నాతి విడిచి వచ్చి♦నాఁడవా దూరసం, శ్రవము నించె నాదు♦రవముపోల్కి.

హరిణరూపంబునన్ = జింకయాకారమున, మృగతనువు = జింకశరీరము, కేయూరభూషణాళీయుతదేహుఁడై = అంగదములు లోనగు సొమ్ములతోఁగూడిన దేహముగలవాఁడై, మద్బాణఘాతము = నాబాణముదెబ్బను, నాతిని = సీతను, దూరసంశ్రవము = దూరమునకు వినవచ్చుధ్వని.

తా. జింకశరీరముతో నాశ్రమమునుండి నన్నుఁ దీసికొని వచ్చిన రాక్షసుఁడు నే నొకబాణ మవలీలగా వేయఁగా నది తగులుటచే జింకశరీరము విడిచి యంగదములులోనగు సొమ్ములు ధరించిన దేహముగలవాఁడై, తీక్ష్ణమైన నాబాణముదెబ్బను సహింపలేక ప్రాణము లెప్పుడో తన్ను వదలిపోవ భూమిమీఁదఁ బడి యున్నవాఁడు. వాఁ డూపిరి విడుచుచు దూరము వినఁబడ నే నఱచినట్లఱచిన యఱుపు విని నీవు సీతను విడిచి వచ్చితివి.

## ౬౦-వ సర్గము. రాముఁడు పర్ణశాలలో సీతలేమిఁ గని దుఃఖించుట.

క. అని బిఱ బిఱఁ జనురామున,కును గ్రీ డాకన్నుకదలెఁ♦గూలెం బదముల్
దనువు వణఁకంగఁ దొడఁగెను, గని యాయవలక్షణములఁ ♦ గళవళపడుచున్.

క్రీ+డా+కన్ను = ఎడమకంటిక్రిందివైపు. ఇది ప్రబలానిష్టసూచకము. "అథో వామదృశో స్ఫూర్తౌ బహ్వనిష్టో భవేత్ప్రమాః" అని లక్షణము. కాళ్లు కూలఁబడెను. ప్రయాణకాలమునఁ గాళ్లుకూలఁబడుట ఇష్టవిఘ్నమును సూచించును. దశావస్థలయందు నెనిమిదవయవస్థ వర్ణింపఁబడుచున్నది.

దృఙ్మనస్సంగసంకల్పా జాగరః కృశతారతిః ।
హ్రీత్యాగోన్మాదమూర్ఛాంతా ఇత్యనంగదశాదశ ॥ యని యవస్థలు పది. ఇవి విప్రలంభ శృంగారమునకు నంగములు. ఇందెనిమిదవది యున్మాదావస్థ.

తా. ఇట్లు చెప్పి త్వర త్వరగాఁ బోవు రామచంద్రమూర్తికి నెడమకన్ను క్రిందివైపు పదరెను. కాళ్లు కూలఁబడెను. దేహము వడఁకుటకుఁ బ్రారంభించెను. ఆయపశకునములఁ జూచి వ్యాకులపడుచు

మ. కలదా యింకను సేమ మాసుదతికిం ♦ గంజాక్షి నేఁ జూడఁగాఁ
గలనా యంచు నిజాశ్రమస్థలిని వే♦గస్ఫూర్తిమైఁ జొచ్చి లోఁ

గలనాదామణి లేమిఁ గాంచి భృశశో♦కభ్రాంతచిత్తాకృతిన్
గలఁకం బాఱుచుఁ గేల్విదుర్చుచును భూ♦కన్యామనోనాథుఁడున్. ౧౦-౨౧

కలనాదామణి = సీత, భృశశోక = అధికమైన శోకముచే, భ్రాంత = భ్రమచెందిన, చిత్తాకృతిన్ = చిత్తము ఆకారముగ గలవాఁడై, కలఁకంబాఱుచున్ = వ్యాకులపడుచు. కళంకము (వికృతి) కలఁక.

తా. సీతాదేవి యింకను క్షేమముగా నున్నదా నే నామెను జూడఁ గలనా యని తనయాశ్రమములోఁ ద్వరగాఁ బ్రవేశించి సీత లేకుండుట చూచి యధికశోకముచే భ్రమచెందిన మనస్సు ఆకారము గలవాఁడై చేతులు జోడించుచు రామచంద్రమూర్తి

సీ. సీమంతినీమణి ♦ లేమిచే హేమంత,మునఁ బద్మిని యనంగఁ ♦ బొలుచుదాని
నేడుచు చున్నట్టు ♦ వాడినసుమములు, శకునాళి గల్గువృ♦క్షములదానిఁ
గాంతిహీనంబుగఁ ♦ గ్లాంతమృగం బగు, చ్యుతవనదేవతా♦తతులదాని
విప్రకీర్ణాజిన♦విప్రవిద్ధబృసీక, కటకుశం బగుచును ♦ గ్రాలుదానిఁ

ఆ. బాడు పెట్టినట్లు ♦ ప్రభ చెడి యున్నట్టి, స్వాశ్రమంబుఁ జొచ్చి ♦ యరసి చూచి
సీతలేమి దెలిసి ♦ చిత్తముత్తలపడఁ, దలఁచి తలఁచి యేడ్చెఁ ♦ దరుణిఁ గూర్చి.

సీమంతినీమణి = స్త్రీరత్నము, లేమిచే = లేకయుండు కారణమున, హేమంతమునన్ = మంచుకాలమందు, పద్మిని = తామరకొలను, శకునాళి = పక్షులవరుసలు, క్లాంతమృగంబు = డస్సినమృగములుగలది, చ్యుత = విడువఁబడిన, వనదేవతాతతులు = వనదేవతల సమూహములు, విప్రకీర్ణ = చెదరిన, అజిన = జింకచర్మములు, విప్రవిద్ధ = వ్యత్యాసములై పడియున్న, బృసీక, కట, కుశంబు = ఆసనములు, చాఁపలు, కుశలుగలదానిని. రావణుఁడు సీత నీడ్చునపుడు ఆమె వానిని దన కాధారముగఁ బట్టుకొనుట వాఁడు వానిని దీసి పాఱవేయుట మొదలగు కార్యములచే, నాశ్రమములోని పదార్థములు చెల్లాచెదరైన వని భావము. ఇట్లు చెప్పుటచే, సీత గిఱిలో నుండె నని నేలను బెకలించి రావణుఁడు సీతను దీసికొనిపోయె నని చెప్పఁబడు వాదములు నిరస్తములు. ఆమె తనచేతనైనంత మాత్రము రక్షించుకొన యత్నము చేసె నని యేర్పడుచున్నది. కూర్చుండిన దానినో నిలుచుండినదానినో యట్టులే యెత్తికొని పోయియుండిన నీపదార్థములు చెదరవలసిన కారణములేదు. ఉత్తలపడన్ = కలఁతపడఁగా, దర్భకట్టలతోను, కృష్ణాజినములతోను, దర్భాసనములతోను, రావణునిఁ గొట్టె ననియు వాఁడు వానిని దీసివైచెననియుఁ దోఁచెడి. ద్రౌపదీస్వయంవరమునందు "శరణాగతుం డయిన ద్రుపదు నోడకుండు మని బ్రాహ్మణులు తమ తమ దండాజినంబు లెత్తి ప్రతిబలంబులపయి వీచుచున్న" ఆంధ్రభారతము, ఆది, ౭-వ ఆశ్వాసము, ౧౯౨. ఏటిలోఁ గొట్టుకొనిపోవువాఁడు సన్నకట్టెగాని గడ్డిగాని దొరకినను నది తన్ను

రక్షించు నని పట్టుకొన్నట్లు సీతయుఁ జేసె నని భావింపనగు. ప్రభ = కాంతి, అరసి = వెదకి.

తా. గృహలక్ష్మియగు స్త్రీరత్నము సీతాదేవి లేనికారణమున మంచు కాఱునందు కమలములేని కొలనువలెనుండు దాని, వాడిపోయిన చెట్లు మొగములు వ్రేలవైచికొనియుండు పక్షులుగలవై యేడ్చుచున్నట్లుండు వృక్షములు గలదాని, బడలిపడిన జింకలుగలదై వనదేవతలచే విడువఁబడుటవలన కాంతిహీనమైన దానిని, చెదరిపడిన కృష్ణాజినములు దర్భాసనములు చాఁపలు దర్భకట్టలుగల దాని, పాడుపెట్టఁబడినట్లు ప్రభచెడి యున్న తనయాశ్రమము ప్రవేశించి వెదకి చూచి సీత లేదని నిశ్చయించుకొని మనస్సు కలఁతచెందఁగా నామెను దలఁచితలఁచి రామచంద్రమూర్తి యేడ్చెను.

సీ. అపహరించిరొ కదే ♦ యసురులు పగఁబట్టి, ఘాతుకమృగములే ♦ కాంతఁ దినెనొ
యేహేతువుననైన ♦ నెందేని యరిగెనొ, దాఁగియున్నదొ వినో♦దంబుపొంటె
భీరువుగానఁ గాం♦తారంబుఁ జేరెనో, ఫలపుష్పములఁ దేర ♦ వలచి చనెనొ
స్నానార్థ మేగెనో ♦ సరసులపొంతకు, నంబువులకు నేటి ♦ కరిగె నొక్కొ-
ఆ. యేమి సేయువాఁడ ♦ నెక్కడ వెదకుదు, నెందుఁ జొత్తు నిందు ♦ నెవరి నడుగ
ననుచు రోసి రోసి ♦ యంబుజాక్షుఁడు, గనులు వాఁచ నేడ్చె ♦ ననకులుండు.

ఘాతుకమృగములు=హింసించు స్వభావముగల మృగములు, భీరువు=పిఱికి, కాంతారంబు=అడవి, వలచి=కోరి.

తా. సీతయేమైయుండునా యని పలువిధముల నాలోచించుచున్నాఁడు. ''సౌమ్యొకచో నుండిన నపనమ్మక మొకచోట నుండు''నన్నట్లు సత్యము తెలియు వఱకు మనస్సు నానావిధముల నాలోచించుచుండును. సీతను రాక్షసులు పగఁ బట్టి యపహరించిరో - క్రూరమృగములే భక్షించెనో - ఏకారణముచేనైన నెం దైనఁ బోయెనో - నన్నుఁ బరిహసింపఁ గోరి దాఁగియున్నదో - పిఱికి గావున నొం టిగా నిందుండలేక యడవులలోనికిఁ బోయెనో-పూవులు పండ్లు తేఁగోరి పోయెనో- సరస్సులయొద్దకు స్నానముచేయఁబోయెనో-మంచినీళ్లు తెచ్చుటకై యేటికిఁ బోయె నో-నే నేమిసేయుదును-ఎక్కడ వెదకుదును, ఎందుఁ బ్రవేశింతును ఈపాడడవిలో నెవరి నడుగుదును, అని సీతను వెదకివెదకి కన్ను లుబ్బునట్లు రామచంద్రమూర్తి యేడ్చెను.

ఉ. వేఁదుఱు గొన్నయట్లు, నెఱ♦వెంగలిరీతిని, బిచ్చి మెత్తెనాఁ
గాఁ, దలదిక్కు యో యన, వి♦కారపుదృష్టి వెడంగుభంగిఁ, దా
మీఁదులు చూచు దుఃఖభర♦మేదురరక్తవిలోకనంబులన్
మోఁదుకొనున్ శిరంబుఁ దన♦ముంగయిచే నిఁక నేది దిక్కనున్. ౧౦-౧౧

వేఁదుఱుగొన్నయట్లు=ఉన్మాదముపట్టినట్లు, నెఱ=పూర్ణముగా, వెంగలి=

అవివేకి, వెడంగుభంగి=జ్ఞానహీనునివలె, దుఃఖభర=శోకాతిశయముచే, మేదుర=దట్టముగ, రక్త=ఎఱ్ఱనైన, విలోకనంబులన్=కన్నులచే, మోఁదుకొనున్=కొట్టుకొనును, ముంగయిచేన్=ముందరిచేతితో, వేదురు=వెంగలి, వెడఁగు=పిచ్చి, యివన్నియు నించుమించు సమానార్థములే - దుఃఖాతిశయముఁ దెలుపఁ బ్రయోగింపఁబడెను.

తా. శోకాతిశయముచే నెఱ్ఱనైన కన్నులతో వికారపుఁజూపులతో పిచ్చి పట్టినవానివలె మూఢునివలె ముంజేతితో తలకొట్టుకొనును - ఏడ్చును-ఇఁక నాకెవరు దిక్కనును.

—రాముఁడు సీతను వెదకుట.—

చ. పరు విడుఁ జెట్టుచెట్టునకుఁ ♦ బాఱును బల్వడి గుట్టగుట్టకున్
జరగును బుట్టబుట్టకును ♦ సాగును దొందర వాఁకవాఁకకున్
గరము విలాపయుక్తుఁ డగు ♦ గాఢతరార్తి మహాబ్ధిమున్గు నన్
బరఁకులు పెట్ట నీకుఁ దగ♦వా మగువా యని యేడ్చు దీనుఁడై. ౧౦౫౫

బల్వడిన్=మిగులఁద్వరగా, కరము=మిక్కిలి, పరఁకులు=చిక్కులు.

తా. సీతాదేవి మఱుఁగున నున్నదేమో యని చెట్టుచెట్టునకుఁ బరువెత్తును. మిగులఁద్వరగా గుట్టగుట్టకుఁ బరువెత్తును. పుట్టపుట్టకుఁ బోవును. వాఁకవాఁకకు నీళ్లకై పోయెనేమో యని పోవును. మిక్కిలియేడ్చును. అతిశయించిన శోకసముద్రమున మునుఁగును. ప్రియురాలా! నన్నుఁ జిక్కులఁ బెట్ట నీకు మరియాదా యనును. దీనుఁడై యేడ్చును. ఇప్పు డిచ్చట నొకవిషయము విచారింపవలసి యున్నది. శ్రీరామచంద్రమూర్తి సీతకై యేడ్చినయేడుపు వగలయేడుపా నిజమైన యేడుపా? లోపలదుఃఖము లేకున్నను తనకార్యము సాధింపఁ బురుషుని మోసగింప స్త్రీలు దుఃఖమున్నట్టు లేడ్చు నేడుపు వగలయేడుపు - మనస్సు నొప్పితగిలి మనసు కరఁగి యేడుచు నేడుపు నిజమైనయేడుపు. ఈరెంటిలో శ్రీరామచంద్రమూర్తి యేడ్చిన యేడుపేది? మొదటిదా రెండవదా? మహేశ్వరతీర్థులవా రిట్లు వ్రాసిరి. వారువ్రాసినది చక్కఁగ బోధపడుటకై మూలశ్లోకముల ననువదించెదను.

యత్నాన్మృగయమాణస్తు, నాససాద వనే ప్రియాం।
శోకరక్తేక్షణశ్శోకా, దున్మత్త ఇవ లక్ష్యతే॥ ౧౦॥
వృక్షాద్వృక్షం ప్రధావన్ స గిరేశ్చాద్రిం నదాన్నదీం।
బభూవ విలపన్రామ శ్శోకపంకార్ణవే ప్లుతః॥ ౧౧॥

శ్లోకార్థము—ఎంత యత్నముచేసి వెదకినను ప్రియురాలు కానరాలేదు. శోకముచే నెఱ్ఱనైన కన్నులుగలవాఁడై యున్మత్తునివలెఁ గానవచ్చెను॥ ౧౦॥ చెట్టునుండి చెట్టునకు కొండనుండి కొండకు నదమునుండి నదికి పరువెత్తుచు-విలపిం

చుచు శోక మనుపంకసముద్రమున మునింగెను. దీనికి వ్యాఖ్య యిట్లు వారు వ్రాసిరి. ఇందు నున్మత్తునివలె ననుచో నుండు 'వలెను' అనుపదము సర్వత్ర శ్లోకమునందు సంబంధింపం జేయవలెను. అనంగా ఎట్టివైనకన్నులు గలవానివలె, నున్మత్తునివలె, శోకముచేం బరువెత్తినవానివలె, నేడ్చినవానివలె, శోకార్ణవమున మునింగినవానివలెం గానవచ్చెను అని సంబంధము.

వాస్తవ మేమనంగా శ్రీరాముం డట్టివాండు కాండు అని యర్థము. (అనంగా నాయనకుం గన్ను లెఱ్ఱన కాలేదు, ఏడువను లేదు, పరువెత్తను లేదు, శోకమున మునుంగను లేదు అని వారిభావము.) ఈకారణముచేతనే సీత నుద్దేశించి యేడ్చుట సీతను వెదకుసమయమున సీత నుద్దేశించి చెట్లను మృగములను ప్రశ్నించుట సర్వము శ్రీరామునిచే లోకమునకు నేర్పుటకుంగాను నటనము చేయంబడెను అని తెలుపుటకే సర్వజ్ఞుండైన భగవంతుండు వాల్మీకి భ్రమగొన్నవానివలె నున్మత్తునివలెనని యందందు వలెశబ్దమును బ్రయోగించెను. ఆకారణముచేతనే శ్రీశుకులును "రక్షోధమేన వృకవ ద్విపినే సమక్షం। వైదేహరాజదుహిత ర్యపియాపితాయామ్। భ్రాత్రా వనే కృపణవ త్ప్రియయా వియుక్తః। స్త్రీసంగినాం గతిమితి ప్రథయంశ్చచార॥ మర్త్యావతార స్త్విహ మర్త్యశిక్షణం। రక్షోవధాయైవన కేవలం విభోః। కుతోన్యథా స్యాద్రమత స్స్వ ఆత్మని। సీతా కృతాని వ్యసనానీశ్వరస్య, నవైనఆత్మాత్మవతా మధీశ్వర స్సక్త స్త్రిలోక్యాం భగవాన్ వాసుదేవః న స్త్రీకృతంకశ్మలమశ్నువీత నలక్ష్మణం చాపి విహాతు మిచ్ఛతి॥ దీని యర్థము—రాక్షసాధముండు తోడేలివలె నడవియందు భర్తయెదుటలేని యప్పుడు సీతాదేవిని తోలంగం దీసికొనిపోయెను. అంత రాముండు తమ్మునితోడం బ్రియురాలిని బాసి దీనునివలె స్త్రీసంగము గలవారి గతి యిట్టి దగును, అని చాటుటకై యడవిలోం దిరిగెను. ఆవిభునియొక్క మనుష్యావతారము రాక్షసవధముకొఱకే కాదు. మనుష్యులకు ధర్మములు నేర్పుటకును. అటుగాదేని తనయాత్మయందే రమించు నీశ్వరునకు సీతవలన నేల వ్యసనములు గలుగును? ఆత్మవంతులకు నెల్లనాత్మయు నధీశ్వరుండును, భగవంతుండు, వాసుదేవుండు నగువానికి స్త్రీ నిమిత్తమైన కశ్మలమెట్లంటును? లక్ష్మణుని విడువం గోరినవాండును గాండు" అని చెప్పెను. అట్లే స్కాందమున నుమాసంహితయందు,

"అహం దాశరథిర్భూత్వా, హన్మి రావణ మాహవే।
శ్రీమద్రామావతారేస్మి, న్నజ్ఞవ త్క్రియతే మయా।
తత్రశంకా నకర్తవ్యా, సర్వజ్ఞే నాపి మాయయా।
మన్మాయా మోహితం రక్షో, మనుష్యం మా మవేక్ష్యతి।
అన్యథా తస్య నానూనం, నభవే ద్యత్ర కుత్ర చిత్."

అని విష్ణువు దేవతలకుం జెప్పెనని యున్నది. అనంగా నేను దశరథునకు

గొడుకనై రావణుని యుద్ధమందుఁ జంపెదను; శ్రీరామావతారమందు సర్వజ్ఞుఁడనైనను మాయ నాశ్రయించి జ్ఞానములేని వానివలెఁ గార్యములు చేసెదను. అందు సందేహములేదు. నామాయచే మోహితుఁడై రావణుఁడు నన్ను మనుష్యునిఁగానే భావించును. అటుకాదేని వాఁడెందును జావఁడు." అని యర్థము. మఱియు నాత్మవస్తువుగాని దేహాదులందు నాత్మబుద్ధి సేయుటచేతనే అనేకవిధ దుఃఖప్రలాపములు కలుగుచున్నవి. అనాత్మయం దాత్మబుద్ధి కజ్ఞానము కారణము. అట్టి యజ్ఞానము సర్వజ్ఞునకు నెందుండి వచ్చును? మఱియు తనలీలలు వినుటవలన సర్వజనులకు ముక్తి నిచ్చుటకై రాజరూపమున నవతరించిన సచ్చిదానందవిగ్రహుఁడును పరమాత్మయు నగు శ్రీరామునకు మాయాధిష్ఠాతకు పరమేశ్వరునకు భృగుశాపాదులచేనైనను నజ్ఞానవాసన గలదని చెప్పుటకు సాధ్యపడదు. కావున నిట్టివిలాపాదులు సర్వము శ్రీరామునిచే లోకశిక్షార్థమునకే చేయఁబడె నని తెలియవలయును. ఇతర స్థలములందును నిట్టిచోటుల నిట్టులే యర్థము ననుసంధింపవలెను. ఇట్లని మహేశ్వరతీర్థులవారు వ్రాసిరి.

స్వానుష్ఠానముచేత ధర్మములను లోకమున కుపదేశింప వచ్చిన యవతారము శ్రీరామావతార మనుటయు నందు పరత్వహానికాని సర్వజ్ఞత్వహాని కాని లేదనియు నంగీకరింపవలసిన విషయముయలే. విలాపాదులు లోకశిక్షకై చేయఁబడె నని చెప్పఁబడెను గదా! ఇప్పుడు వీరు చెప్పెడు నర్థప్రకారము లోక మేమి నేర్చుకొనవలెను? భార్యను గోలుపోయినవాఁడు శ్రీరామచంద్రమూర్తి వలె వగలేడ్పు లేడువవలయు ననియా నేర్చుకొనవలెను? దీనికంటె నేడువకయే యుండి భార్య పోయినను ఎంతయవమానము వచ్చినను పురుషుఁడు నిబ్బరించుకొనవలయు ననియు నేడువరా దనియు నేర్పిన బాగుండును గదా!

ప్రియవియోగమున నేడువ వలయు నని లోకమునకు భగవంతుఁ డవతరించి నూతనముగ నేర్పవలయునా? భగవద్గీత కష్టదశలందు లోకసంగ్రహార్థ మేడువు మని చెప్పుచున్నదా? సహింపు మని చెప్పుచున్నదా? సీతాదేవియు శ్రీరామచంద్రమూర్తివలె స్త్రీలకు స్త్రీధర్మము స్వానుష్ఠానముచే నుపదేశింపఁ బుట్టినదేకదా? ఆమె యేడ్పు వగలేడ్పా? పతివియోగమున సతులు వగలేడ్పు లేడ్వవలయుననియా యామె యుపదేశము? కావున శ్రీరామచంద్రమూర్తి వగ లేడుపు లేడిచె ననుట నంగీకార్యముగాదు.

శ్రీశుకులు—"స్త్రీసాంగత్యముగలవారి కిట్టిదశ లభించునని చాటుటకై రామచంద్రమూర్తి చరించె ననుటయు నంగీకార్యమే. లోకులారా! స్త్రీసాంగత్యమువలన నాకీకష్టము, అవమానము కలిగెను. మీరును స్త్రీసాంగత్యముచేసిన మీకు నిట్టికష్టదశయే లభించును" అని తాను దుఃఖ మనుభవించుచుఁ జెప్పిన లోకము విశ్వసించును గాని తాను వగలేడ్పు లేడ్చుచుఁ జెప్పిన లోక మిది టక్కని

యెంచునేకాని నిజమని విశ్వసించునా? విశ్వసింపదు. కావున వాస్తవముగ రామచంద్రమూర్తి కన్నీరు గార్చెననియు నాయనకుఁ గన్నులెఱ్ఱనగుట ఆయన చెట్టు చెట్టునకు గుట్టగుట్టకుఁ బరువెత్తుట వాస్తవమనియు గ్రహింపవలెను. వాస్తవదుఃఖ మనుభవించువానివిషయమున లోకము పరితాపపడునుగాని వగలమారుల విషయమునఁ బరితాపపడునా? రావణాసురుఁ డపహరించినది వాస్తవసీతను గాదు గావున రామచంద్రమూర్తిఖేదము వాస్తవము గాదనుట వారివాదనుప్రకారము సరియే. భార్య పోయినఁగదా దుఃఖము! భార్య యింట సుఖముగా నున్న దను జ్ఞానముగలవానికి దుఃఖ మెట్లు వచ్చును? అట్లు వచ్చినట్లు నటించెనేని యది వంచనమే.

శ్రీరామచంద్రమూర్తి లోకమును వంచింప వచ్చినవాఁడు కాఁడు. రావణాసురుఁడు పట్టుకొని పోయినది వాస్తవసీతనే. ఆమె పతివియోగమునకును తన వలనఁ దనభర్తకు మిగులఁగష్టము కలిగెఁగదా ఆయన యెంతపరితపించుచున్నాఁడో యని దుఃఖించుటయు వాస్తవమే. అట్టులే శ్రీరామచంద్రమూర్తి దుఃఖించుటయు వాస్తవమే. వీరు తా ముద్దేశించిన యర్థము సాధించుటకై మాటమాటకు వలెవలె నని కవి చెప్పనిదానిని దాము చేర్చికదా యీయర్థమును గల్పించిరి? కావున నిది వీరియర్థమేగాని వాల్మీకి యుద్దేశించినది కాదు. వ్యాఖ్యాతలు మూలమున కర్థము వ్రాయునపుడు నాయభిప్రాయముప్రకారము దీని కీయర్థమనవచ్చునుగాని లేనిదానిని లక్షణలచే నధ్యాహారములచే కాకువులచే విరుద్ధార్థముఁ గల్పించి యిది కవియుద్దేశ మనుట సరిగాదు.

ఉన్మత్తునివలె నని వాల్మీకి చెప్పలేదా యందురేమో? చెప్పెను. సత్యమే. దాని కేమియర్థము? ఒకఁ డున్మత్తుఁ డెప్పు డగును? మతిచెడి యది వాని స్వాధీనమందు లేకపోయినపుడుగదా? అట్టులే శోకాతిశయముచే మతిచెడి స్వస్థావస్థయందుండువాఁడు వర్తింపవలసినవిధముగ వర్తింపకున్నప్పు డున్మత్తునివలెఁ గానవచ్చును. శోకముపోయెనేని మరల స్వస్థుఁ డగును. ఉన్మత్తునివలె నని చెప్పక యున్మత్తుఁడే యైనాఁడని చెప్పియుండిన శ్రీరామచంద్రమూర్తి వైద్యశాలకుఁ బోవలసినవాఁడే యైయుండును. ఇతరచికిత్సలేక స్వస్థావస్థ వచ్చియుండదు. ఉన్మత్తునివలె నని చెప్పుటకుఁ గారణము చెట్టు చెట్టునకు గుట్ట గుట్టకుఁ బరువెత్తుట, మృగపక్ష్యాదులఁ బ్రశ్నించుటవలన ననియు దానికిఁ గారణము శోకసముద్రమున మునిఁగియుండుట యనియు గ్రహింపనగు.

కావుననే వలె (ఇవ) నను నుపమావాచక మొక్కచోటనే ప్రయోగించి తక్కినతావులఁ బ్రయోగింపఁడయ్యె. కావున నున్మత్తునివలెఁ గానవచ్చుటకు శోకాతిశయమే కారణ మని యెంచవలయును. లోకశిక్షకై యిట్టివేషము నటించె ననిరికదా! ఆయడవియందు మనుష్యుఁడనువాఁడే యాసమయమున లేఁడయ్యెఁ

గదా? ఆవల నెన్నిసంవత్సరములకో వాల్మీకి రామాయణము వ్రాయువఱకు నప్పుడు జరిగినవృత్తాంతము లోకమునకుఁ దెలియదయ్యెఁగదా! ఇఁక నాశిషు యెవ్వరికి? ఓయీ! రామచంద్రమూర్తి వాస్తవముగ శోకించె నని చెప్పెదవు గదా! ఆయన భగవంతుఁ డనువిషయము నీవు నంగీకరించిన విషయమేకదా! భగవంతునందు హేయగుణమైన శోకముండునా? అను ప్రశ్న వచ్చును. భగవంతుఁడు సమస్తకళ్యాణగుణవిశిష్టుఁడు హేయగుణవర్జితుఁ డనుట నిస్సందేహము. శోకావేశము హేయగుణ మనువారు 'క్రోధ మాహారయ తీవ్రం వధార్థం సర్వరక్షసామ్' రాక్షసుల నందఱను వధించుటకై రామచంద్రమూర్తి క్రోధమును గ్రహించె నన్నప్పుడు క్రోధావేశ మెట్లు మీరంగీకరించితిరి? క్రోధము హేయగుణముగాదా? అవతారదశయందేకాక విష్ణుత్వంబునను, మాల్యవదాదులతోఁ బోరినపు డాగ్రహించె నని యుత్తరరామాయణమునఁ జెప్పఁబడెను గదా! దాని కేమిప్రత్యుత్తరము? శ్రీరామచంద్రమూర్తియందు హేయగుణమైన శోకమెందుండివచ్చె ననువారు రజోగుణతమోగుణవిశిష్టులైన మనుష్యులతో రామచంద్రునిఁ బోల్చి మాటలాడుచున్నారు. అది సరిగాదు. ఒకబిడ్డ తీవ్రవ్యాధిచే బాధపడుచు నాబాధ సహింపలేక యేడ్చును. వానిబాధ చూడలేక తల్లి యేడ్చును. రెండు నొకటి యగునా? మనస్తత్త్వమున భేదములేదా? పరదుఃఖమును దనదుఃఖముగా నెంచి యేడ్చుట రెండవది. దీనికే దయ యనిపేరు. దయ హేయగుణముకాదు-మఱి కళ్యాణగుణమే. ఇట్టిదయ విస్తారముగ రాముని యందుఁ గలదు. ఇది వాల్మీకియే వ్రాసియున్నాఁడు: "క. వ్యసనంబులు జనములకును, బొసఁగినఁ దా నధికదుఃఖమును బొందును సం। తసమును గన జనములు సం,తసమును దా నొందుచుండుఁ దండ్రివిధమునన్॥" అయోధ్య ౬౬ ప.

ఇచ్చటఁ దండ్రివిధమున ననునది దుఃఖమందు సంతోషమందుఁ గూడ నన్వయింపవలెను. ఇది హేయగుణమా? కళ్యాణగుణమా? తననిమిత్తమై యితరుల కింతదుఃఖము వచ్చెఁగదా యని రామచంద్రమూర్తి దుఃఖించెనని యయోధ్యాకాండమందుఁ జెప్పఁబడియుండుట పాఠకులకు విదితమేకదా! "నే వనవాసనిష్ఠపై। మనము దిటంబుసేసియును మాన్యుని నబ్బరతుం దలంచినన్। వనటను మానసంబు కడు బాలిశవృత్తి భజించు లక్ష్మణా?" యనియు, "సీతావిరహజందుఃఖం, సమేసౌమ్య తదాగతం। యథావినాశో దుఃఖస్య మత్కృతేచ పరంతప॥" యనియు రామచంద్రమూర్తియే చెప్పెఁగదా! కావున సీతావిషయమున దుఃఖించుటకు నిదియే కారణముగాని కేవలకామముగాదు - అజ్ఞానముగాదు-వగలమారితనముగాదు. శ్రీరామచంద్రమూర్తి దుఃఖించుకారణము హనుమంతుఁ డిట్లుచెప్పెను: "క. శ్రీరాఘవుఁ డేమెకుఁగాఁ, గారుణ్యం బాన్పృశంస్యగరిమయుఁ గడుదు। ర్వారపుశోకము మదనుఁడు గావింపఁగ వేఁగునట్టి కాంత యిదే యా॥ సీ. ఆపదవేళల

సంగననొక్క-డ్తుఁ బ్రోవ లేదనెడికారుణ్యమునను। నన్ను నమ్మినదాని కిన్నిపాట్లబ్బిన సైఁచితి ననునానృశంస్యమునను। అర్ధాంగలక్ష్మిని నకట గోల్పడితిఁగా సుందరి ననియెడిశోకమునను। నొద్దలేదాయెఁగా యొప్పులకుప్ప నాప్రియ యన్న వెరవేఁకి వేఁకరమున। తే. నకట యీనాలుఁగింటను నడలుచుండు। రామచంద్రుండు హృదయ మీరామయందు। నిలిపె నీమెయుఁ బతియంద నిలిపెమనముఁ। గాన బ్రదికిరి వీరలు గడియ యైన॥" (సుం. ౪౫౨-౪౫౩ పద్యములు.)

ఈపద్యముల కర్థము సుందరకాండమందు వ్రాయఁబడును. ఆరణ్యా ౯౯౧-౯౯౨ పద్యములు చూచునది. కావున శ్రీరామచంద్రమూర్తి శోకించుట కీనాలుగు కారణము లని యెఱుంగ నగు. తన కెట్టిసంబంధములేని స్త్రీకైనను ఆపదవచ్చెనేని దయతో నామెకు సాహాయ్యము చేయవలసినది పురుషునకు విధి. ఇఁకఁ దన్ను నమ్మి తనసేవకై వచ్చిన ప్రాణిసదానికైనను నాపదవచ్చెనేని దాని యందు దయదలఁచి రక్షింపవలసినది విధి. అట్లు వచ్చినది భార్యయగునేని దాని నట్టులే రక్షింపవలసినది పురుషున కవశ్యకర్తవ్యము. అట్టిభార్య పరమపతివ్రతయై తనయం దత్యంతప్రేమగలదై తన్నుఁ బ్రాణముగా నెంచికొని యుండునపుడు దానికై దయదలఁపవలసిన దత్యంతావశ్యకము అని వేఱుగఁ జెప్పవలయునా? పామరజనులవిషయ మిట్లుండ పరమకారుణికుఁడగు భగవంతుఁడు తన్నాశ్రయించిన వారివిషయమున నగలేడ్పులేడ్చునా? మనము గ్రహింపవలసిన వాస్తవార్థ మేమనఁగా సీతాదేవి జీవస్థానమున గ్రహింపవలె ననియు, నొకక్షణమునఁ బ్రమాదపడి కామవశయయి భక్తితప్పుటచే నింద్రియములకు వశపడి, దేహప్రాప్తి గాంచె నని ముందు చెప్పఁబడెను. ఇఁక పరమదయాళువగు నీశ్వరునికృత్యము శ్రీరామచంద్రమూర్తిచర్యవలనఁ దెలియనగు. జీవకోటికంతయు భగవంతుఁడు-పిత-మాత-ధాత - శరణము - సుహృత్తు అని యీప్రకారము భగవద్గీత చెప్పుచున్నదికదా! జీవకోటికంతయు ధారణపోషణకర్త భగవంతుఁడేకదా!

ఇట్టిబిడ్డలు సంసారసాగరమునఁ బడి దరిగానక యల్లాడుచుండ కన్నతల్లిదండ్రు లూరక చూచుచుందురా? ఉండరు. కావుననే "ఏవంసంసృతిచక్రస్థే, భ్రామ్యమాణే స్వకర్మభిః। జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కాప్యుపజాయతే." ఈవిధముగ తాము చేసినకర్మములచే సంసారచక్రమునఁ దగులుకొని భ్రమించుచుండు జీవులయందు భగవంతుఁడు దయగలవాఁడై వారికి వచ్చినకష్టములకై యెంతయో పరితపించి వారి నుద్ధరింప యత్నించును. అట్టులే తెలివితక్కువచే ప్రకృతిపదార్థమందు (మాయామృగము) కామముగలిగిన జీవుఁడు (సీత) లంకయందుఁ (దేహమందు) దగుల్కొని దుఃఖింపఁగా "నన్నెకాని యన్య మెన్నఁడు నెఱుఁగనివారి విడువ నెట్టివారినైన" ననియు నన్నే యాశ్రయించినవారి నన్నివిధముల నేనే రక్షింతు ననియు వ్రతముగాఁ గొన్న

భగవంతుఁడు అయ్యో నన్నాశ్రయించిన దానికి (జీవునకు) కష్టమువచ్చెనే యని యాజీవికష్టమునకై పరితపించుట యరణ్యకాండమందును, ఆజీవుని రక్షించుటకై యత్నించుట కిష్కింధా సుందర కాండములందును, రక్షించి యనుగ్రహించి స్వీకరించి సాయుజ్య మిచ్చుట యుద్ధకాండమందును జెప్పఁబడుచున్నది. వక్రమార్గముసఁ బోయిన బిడ్డలకై తలిదండ్రు లెంతపరితపించునది బిడ్డలు తెలిసికొనఁజాలరు. అట్లులే మనకై భగవంతుఁ డెట్లుశ్రమించుచున్నాఁడో మన మెఱుఁగఁజాలము. ఆవిధము రామచంద్రునిచరిత్రమువలనఁ దెలిసికొనవలసియున్నది. కావున మానుష భావముచేతఁ జూచినను రామచంద్రమూర్తిశోకము వాస్తవమే. ''భార్యలుల కన్న రమ్యవస్తువులు లేవు వారలే కష్టములకెల్లఁ గారణములు'' అను నీతియుఁ, బతివ్రతయు ననుకూలయు నగుభార్యవిషయమున భర్త యెట్లుండవలసినదియు మనము నేర్చుకొనవలయును. పరమార్థదృష్టిఁ జూచితిమా. మనము ప్రాకృత విషయములపై మనస్సు పోనీయరాదనియు, దృఢముగ మనము భగవంతునకనుకూలురమై యుండితిమేని మనకై యెన్నికష్టములయినఁ బడి భగవంతుఁడు రక్షించుననియు, దృఢవిశ్వాసము గలిగి ఆత్మనిక్షేపము చేసినవారము కావలయుననియు నేర్చుకొనవలయును. కావున సీతాదుఃఖము మిథ్యగాదు. పరమభక్తి లక్షణ మనియు, రామచంద్రమూర్తిశోకము పరమకారుణికుఁడు భక్తవత్సలుఁడగుభగవంతునిలక్షణ మనియు గ్రహింపనగు. భగవంతుఁ డింతటిదయాళువుగాకుండిన జీవకోటి యాయన ననుసరింపఁ బనియే యుండదు. ఇది భగవంతుని మార్దవగుణమును బ్రకటించుచున్నది. ''ఆశ్రితవిరహాసహత్వమ్ మార్దవ''మ్మని సుదర్శనాచార్యులు. ఆశ్రితవిరహము సహింపలేకపోవుట మార్దవ మనఁబడును. బోయవానిచేఁ జంపఁబడిన పక్షిని దానికై వగచునాఁడుపక్షిని జూచి వాల్మీకి శోకించెఁగదా! కరుణామయుల చిత్తమిట్టిదియై యుండ, స్త్రీ - అందు నాశ్రితురాలు- తననిమిత్తమై సర్వభోగములు వదలి యడవులపాలైనది - భార్యయగుటచే రక్షింపవలసినభారము దనయందుంచినది యిట్టిదానికి నాపదవచ్చినపుడు మగవాఁడు వగలేడ్పు లేడ్చెనన నేమనుకొనవలెను?

భగవంతుఁడు, స్వాభావి కానవధి కాతిశయ జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తితేజస్సౌశీల్యవాత్సల్యమార్ద వార్జవ సౌహార్ద సామ్య కారుణ్య మాధుర్య గాంభీర్యౌదార్యాద్యనేక కళ్యాణగుణములు గలవాఁడు. తనస్వజనుల కాపదవచ్చిన నెట్లు సహింపఁగలఁడు?

అట్లైన నాయనశోకమునకును మనశోకమునకును భేద మేమందువా? మన కొకవస్తువు ప్రియమగుట మనకు దానివలన నొకలాభమో సంతోషమో యేదో నొక ప్రయోజనము సంబంధించియుండుటచేతనే. అట్టిప్రయోజనము లేనిచోట ప్రేమలేదు. మనబిడ్డలు వృద్ధికివచ్చిన సంతోషించునట్లు వారుచచ్చిన యేడ్చు

నట్లు పరులబిడ్డలకై సంతోషింపము ఏడువము. వారివలన మనకుఁ గలిగిన లాభము సంతోషము దొలఁగె నని మనకై యేడ్తుము. చచ్చినవానికై యేడ్చు వారు లేరు. భగవంతుఁ డట్టివాఁడుకాఁడు. అవాప్తసమస్తకాముఁడు. మనవలన నాయన కేప్రయోజనము లేదు. సర్వదా మనశ్రేయస్సు గోరియుండువాఁడు. కావున జగత్పితయగు నాయన తనబిడ్డలమైన మనకు దుఃఖము కలిగిన నయ్యో మనబిడ్డల కిట్లు వచ్చెనే యని దుఃఖించును. మనకు స్వలాభాపేక్ష గలదు. ఆయ నకు లేదు.

ఓయీ! అట్లైనచో శ్రీరామచంద్రమూర్తి శుద్ధసత్త్వమయచైతన్య స్వరూపుఁడుగదా! ప్రాకృతములైన కన్నీళ్లెట్లు కార్చెను? కన్నీళ్లు రక్తము లోనై నవి లోకవిడంబనార్థము స్వమాయాకల్పితము. మాయయనఁగా మిథ్యయని యర్థముగాదు. సంకల్పరూపకజ్ఞానశక్తి. సత్యజ్ఞానము లేదేని రసోదయము లేదు. రసోదయకారణముగాని కావ్య మస్పృశ్యము. కొంద ఱీవ్యసనమున రామచంద్ర మూర్తి తనస్వరూపస్వభావముల మఱచెనందురు. ఇది సరిగాదు. ఆయనకే విస్మృతి వచ్చినచో మఱల నాయనను జక్కఁబఱుచువా రెవరు? దీనికి బ్రత్యుత్త రము భగవద్గీత చెప్పుచున్నది.

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మా మబుద్ధయః।
పరంభావ మజానంతో మ మావ్యయ మనుత్తమమ్॥ ౭-౨౪.

అనుత్తమము నవ్యయము నగు నాపరమభావము దెలియనిమూఢులు నే నొకప్పు డవ్యక్తుఁడుగా నుండి యిప్పుడు వ్యక్తుఁడ నైతి నని తలఁతురు. "సదా పశ్యంతి సూరయ" యన్నట్లు చూడఁగలవారి కక్కడ నవ్యక్తుఁడనే-ఇక్కడ వ్యక్తుఁ డనే. తెలిసికొనలేక నేను దమవలెఁ గర్మబద్ధుఁ డనుకొనువారికి నిచ్చట నవ్యక్తుఁ డనే. బిడ్డలకు రోగము వచ్చినదని యేడ్చువారు తమ్ముఁ దాము మఱతురా?

సీ. బింబమా! రుచిరక♦దంబమా! కంటివే, బింబోష్ఠిని గదంబ♦ప్రియను బ్రియను
గీరమా! పక్వమా♦లూరమా! కంటివే, కీరవాణిని బిల్వ♦హారికుచను
సాలమా! మృగచక్ర♦వాళమా! కంటివే, సాలప్రియను గృష్ణ♦సారనయనఁ
గకుభమా! చెపుమ వే♦గ యిభమా! కంటివే, కకుభోరుఁ గరిరాజ♦గమనరమణిఁ
తే. దిలకసూనమ! ప్రియసతిఁ ♦ దిలకనగమ!, నీవయైనను గంటివె ♦ నెలఁతఁ జెపుమ
యింపు మీఱఁగ జంబు! ని♦జంబు చెపుమ, జంబుసుస్నిగ్ధఁ గంటె వ♦నంబులోన.

బింబమా = దొండతీఁగా, రుచిర = మనోహరమైన, కదంబమా = కడప చెట్టా, బింబ + ఓష్ఠిని = దొండపండువంటి పెదవికలదానిని, కదంబప్రియను = కడపపూవులిష్టముగాఁ గలదానిని. బింబమా! బింబోష్ఠిని జూచితివా? కదంబమా! కదంబప్రియను జూచితివా? యన్నప్పుడు వానిసంబంధము తెలియనగును. ఇట్లులే యిఁకమీఁదఁ దెలియవలెను. కీరమా = చిలుకా, పక్వ = పండిన, మాలూరమా =

మారేడుచెట్టా, కీరవాణిని = చిలుకపలుకలవంటి పలుకులుగలదానిని, బిల్వ = మారేడుపండువలె, హారి = మనోహరమైన, కుచను = స్తనములుగలదానిని. దీని వలన సీత పద్మినీజాతిస్త్రీయని యేర్పడెను. "స్తనయుగ మపి యస్యాః శ్రీఫల శ్రీవిడంబి" యని పద్మినీజాతిస్త్రీలక్షణము. ఇవి మాత్సర్యముచేఁ బ్రత్యుత్తర మీయలేదని మఱికొన్నిటి నడుగుచున్నాఁడు. సాలమా = మద్దీ, మృగచక్రవాళమా = జింకలసమూహమా, సాలశ్రీయను = మద్దిపండ్లయందుఁ బ్రీతిగల దానిని, కృష్ణసారసమయనాం = జింకకన్నులవంటి కన్నులుగలదానిని. అవి యూరక యుండుటచే వానికిఁ దెలియ దని మఱికొన్నిటి నడుగుచున్నాఁడు. కకుభమా = ఏఱుమద్దీ, ఇభమా = ఏనుఁగా, కకుభోరు = కకుభమునంటి తొడలుగలదాని. ఇచటఁ గొందఱు కకుభోరును కరభోరు అని పఠించెదరుగాని యది ప్రకృత శైలికి విరుద్ధము. బింబమా బింబోష్ఠిని, కీరమా కీరవాణిని, సాలమా సాలప్రియను, అని యీప్రకారము చెప్పుచు నునను ఇచ్చటమాత్ర మావరుస దప్పించె ననుట సరిగాదు. కరిరాజగమన = శ్రేష్ఠమైన యేనుఁగునడకవంటి నడకగల దానిని, తిలకసూనమ = బొట్టుగుపుష్పమా, తిలకనగమా = బొట్టుగుచెట్టా, జంబు = నేరేడా, జంబునుస్నిగ్ధాం = నేరేడుపండువలె నునుపైన దేహముగల దానిని.

తా. దొండతీఁగా! దొండపండునంటి పెదవిగలదానిని జూచితివా? కడప చెట్టా! నీపూలయందుఁ బ్రియముపడు నాప్రియురాలిని జూచితివా? చిలుకా! నీవలెఁ బలుకుదానిని జూచితివా? మారేడుపండా! నీవంటి స్తనములుగలదానిని కంటివా? మద్దీ! నీపండ్లయందుఁ బ్రియముగలదానిని వీక్షించితివా? జింకలమంద లారా! మీకన్నులవంటి కన్నులుగలదాని నీక్షించితిరా? కకుభమా! నీవంటి తొడలుగలదానినిఁ గాంచితివా? ఏనుఁగా! నీవలెనడచుదాని దిలకించితివా? తిల కమా! స్త్రీలలోశ్రేష్ఠురాలగు నాప్రియురాలిని గంటివా? నేరేడా! నీవైన నిజము చెప్పుము. నీపండ్లవలె నునుపై మినమిన మెఱయు దేహకాంతిగలదానిని నీవన ములో విలోకించితివా?

క. శోకాపహామ యశోకమ, శోకోపహతాత్ము నన్ను ♦ శుభ మగుఁ ద్వన్నా
మాకలితునిఁ జేయఁగదే, యాకలకంఠీవిధంబు ♦ నని నాతోడన్. ౧౦_౨౭

శోకాపహామ = శోకమును బోఁగొట్టుదానా, శోకోపహతాత్ముం = శోక ముచేఁ గొట్టఁబడినవానిని, త్వన్నామాకలితునిం = నీపేరుగలవాని ననఁగా నశో కుని = శోకములేనివానిని, కలకంఠీవిధంబు = మధురస్వరముగల సీతాదేవి తెఱఁగు.

తా. అశోకమా! నీవు శోకమును బోఁగొట్టుదానవు గనుకఁగదా నీ కాపేరు వచ్చెను. నేను శోకముచే బాధపడుచున్నాను. సీతాదేవివృత్తాంతముఁ జెప్పి నన్ను నీపేరుగలవానిఁగాఁ జేయుము.

సీ. తాళమా! యింత కాం♦తాళమా, చెప్పుమా, తాళఫలస్తని ♦ దార లేదె
చూతమా నీదయ ♦ చూత మానూతన,చూతపల్లవపాణిఁ ♦ జూడలేదె
నీపమా! వృక్షావ♦నీపమా యిచ్చోట, నీపసుమాధర ♦ నీవు కంటె
జంభమా! యింతటి♦జంభమా చెప్పుమా, జంభపయోధర♦జాడఁ గంటె
తే. పాటలాధరఁ గంటివే ♦ పాటలంబ, నవవయస్థను గంటివే ♦ నవవయస్థ
సరళభూజమ! కంటివే♦సరళహృదయ, మల్లికావల్లికా కంటె♦వల్లి కాంగి.

తాళమా = తాటిచెట్టా, కాంతాళమా=కోపమా, తాళఫలస్తని=తాటిపండ్లవంటి స్తనములుగలది, తారలేదె = నీయొద్దకు రాలేదా, చూతమా = మామిడీ, నూతన = క్రొత్తదగు, చూతపల్లవ = మామిడిచిగురువంటి, పాణిక్ = అఱచేయిగలదానిని, నీపమా = మంకెనా, వృక్షావనీపమా = వృక్షరాజమా, నీపసుమాధర = నీప పువ్వులవంటి పెదవిగలదానిని, జంభమా=నిమ్మ, జంభమా= దంభమా, "జంభాదంభజంబీరదానవాః॥" నానా॥ర॥ జంభపయోధర=నిమ్మపండ్లవంటి చన్నులుగలదానిని, పాటలాధరక్=ఎఱ్ఱని పెదవిగలదానిని, పాటలంబ = కలిగొట్టా, నవవయస్థను = క్రొత్త యౌవనముననుండుదానిని, నవవయస్థ = క్రొత్తయుసిరికా, సరసభూజమ = తెల్లతెగడచెట్టా, మల్లికావల్లికా = మల్లెతీఁగా, వల్లికాంగిక్ = తీఁగవంటి దేహముగలదానిని.

తా. ఓ తాటిచెట్టా! నాపై నీకేల యింతకోపము? నీఫలములవంటి కుచములుగలది నీయొద్దకు రాలేదా? మామిడీ! నీదయ యెట్టిదో చూతును. నీక్రొంజిగురువంటి యఱచేయిగలదానిని నీవు చూడలేదా? ఓ నీపమా! నీవు చెట్లకు రాజవు. నీపువ్వులవంటి పెదవిగలదానిని జూచితివా? నిమ్మా! ఏల నీకింత దంభము? పిలిచినను బలుకవే. నీపండ్లవంటి పాలిండ్లు గలదానిని చూచితివా? పాటలమా! నీపువ్వులవలె నెఱ్ఱనైన పెదవిగలదానిని జూచితివా? క్రొత్త యుసిరికా! నీవు క్రొత్త వయస్సుననుండు దానిని జూచితివా? సరళమా! సరళమైన హృదయము గలదానినిజూడలేదా? మల్లెతీఁగా! తీఁగెవంటి దేహము గలదానిని కంటివా?

క. కరిణీ! కరినాసోరువు, హరిణీ! హరిణాక్షి భృంగ ♦ మా! భృంగకచక్
హరివర! హరివరమధ్యను, గరిగమనక్ మీర లెందుఁ♦గానఁగ లేదే. ౧౦-౨౫

కరిణీ = ఆఁడేనుఁగా, కరినాసోరువు = ఏనుఁగుతొండమువంటి తొడలుగలదానిని, హరిణీ = ఆఁడుజింకా, భృంగమా = తుమ్మెదా, భృంగ కచక్ = తుమ్మెదలవంటి వెండ్రుకలుగలదానిని, హరివర = శ్రేష్ఠమైన సింహమా, హరివరమధ్యను = సింహము నడుమువంటి నడుముగలదానిని.

తా. ఆఁడేనుఁగా! నీముక్కువంటి తొడలుగలదానిని, ఆఁడుజింకా! నీకన్నులవంటి కన్నులుగలదానిని, తుమ్మెదా! నీవలె నల్లనగు వెండ్రుకలు గలదానిని,

సింహమా! నీనడుమువంటి నడుముగలదానిని, మీ రేనుఁగువలె నడచుదానిని జూడలేదా?

సీ. మీరైనఁ జెప్పరే ♦ మీలోన నున్నదే, మృగవిలోచన చారు♦మృగములార
నీ వెఱుంగుదు చూడ ♦ నెలంత యేగినజాడ, గజరాజ! గజరాజ♦గమనలీల
శార్దూలమా! నీకు ♦ జం కేల చెప్పుమా, యింతి యెం దరిగెనో♦యెఱుకకలదె
కలకంఠమా! నీకుఁ ♦ దెలిసి యుండఁగవచ్చుఁ, గలకంఠకంఠిని ♦ గానలేదె
తే. హంసమా! నీవు కంటివే ♦ హంసయానఁ, గీరమా! నీవు కంటివే ♦ కీరవాణి
భ్రమరమా! నీవు కంటివే♦భ్రమరవేణిఁ, జెప్పరే మీరు కరుణించి ♦ సీత తెఱఁగు.

జంకు=సందేహము, కలకంఠమా=కోకిలా, కలకంఠకంఠిని=కోకిలకంఠము వంటి కంఠముగలదానిని.

తా. మనోహరములైన జింకలారా! జింకకన్నులవంటి కన్నులుగలది మీలోన నున్నదా? మీరైనఁ జెప్పుఁడు. గజరాజమా! ఏనుఁగువలె నడచునది పోయినజాడ నీకుఁ దెలిసియుండవచ్చును. చెప్పుము. పులీ! ఏల నీకు సందేహము? నీవు మ్రింగితి వని నే ననలేదు. సీత యెం దరిగెనో చెప్పుము. ఓసీ కోకిలా! నీకంఠమువంటి కంఠముగలది యెందుపోయెనో నీకుఁ దెలిసియుండవచ్చును. తెలుపుము. హంసమా! హంసగమనను నీవు చూచితివా? చిలుకా! నీవలె పలుకుదానిఁ గంటివా? తుమ్మెదా! తుమ్మెదలవంటి జడగలదానిని జూచితివా? అయ్యో! నాపై దయయుంచి సీత యేమైనది చెప్పుఁడు.

కవిరాజవిరాజితము.

నిలు నిలు మేగకు మోకలికీ! యెద ♦ నిర్దయమే మరుపూములికీ!
యలుఁగఁగ నేటికి ప్రాణసఖీ! పరి♦యాచకమా యిది చంద్రముఖీ!
కులుకుచుఁ గుల్కుచుఁ బర్వెడిదే కనుఁ♦గొంటిని లే జిగిచీర యదే
పలుకవు కోపమ నీలకచా! నను ♦ బాలన సేయుము! కుంభకుచా! ౧౦౩౧

కలికీ = కాంతా, నిర్దయమే = దయలేనిదా, మరుపూములికీ =మన్మథుని పుష్పబాణమా, అలుగఁగ = కోపింపఁగా, పరియాచకమా = నవ్వులాటలా, జిగిచీర = కాంతిగలచీర, కుంభకుచ= కుంభములవంటి పయోధరములుగలదానా.

తా. కాంతా! పోకుము. పోకుము! నిలు నిలు. మన్మథపుష్పబాణమా! నీహృదయ మింతదయలేనిదా? ప్రాణసఖీ! ఏల నాపై నీవలిగితివి? ఇది పరిహాసనమయమా కులుకుచుఁ గులుకుచుఁ బరువెత్తుచున్నావు. అదో నేను చూచితిలే. నీచీర నాకుఁ గానవచ్చెను. నల్లని వెండ్రుకలుగలదానా! ఇట్లు నేను జూచి పిలిచినను బలుకవే కోపమా? నన్ను రక్షింపుము.

కవిరాజవిరాజితము—ఒక్క న గణము, ఆఱు జ గణములు, వ గణము. యతివిషయ మింతకుముందే చర్చింపఁబడినది.

చ. అడిగినవాని నిట్లడిగి ♦ యాడినమాటయె వెండి యాడి బ
ల్వడి మును పోయి చూచినత ♦ లంబులకే మఱిపోయి యార్తిలో
నడలుచు సోలి సొక్కుచును ♦ నారట మందుచు నార్తిఁ గుందు చా
యడవిని ధారిణీతనయ ♦ సంతటఁ గోసియుఁ గాన కయ్యెడన్. ౧౩౨

తా. ఈవిధముగ నడిగినవానినే యడిగి, చెప్పినమాటయే చెప్పి, ముందు పోయిన చోటికే మరలఁబోయి, యందు సీత లేకుండుటచే మనస్సునఁ దల్లడిల్లుచు మూర్ఛపడి, లేచుచు సొక్కుచు నారటపడుచు దుఃఖపడుచు నాయడవియందు సీతను వెదకి యెందును గానక.

-ఁఁఁ సీత రాక్షసహత యైన దని యెంచి రాముఁడు పలవించుట. ఁఁ-

క. వ్యాలోలచేతమున ని, ట్లాలోచించెను రఘూత్తమాగ్రణి యయ్యో
బాలామణి పలలాశన, జాలంబులచేతఁ జిక్కి ♦ సమయఁగఁ బోలున్. ౧౩౩

వ్యాలోలచేతమునన్ = వ్యాకులపడినమనస్సుచే, పలలాశనజాలంబులచేతన్ = రాక్షససమూహములచే.

తా. మిగులఁ గలఁతజెందిన మనస్సుగలవాఁడై రామచంద్రమూర్తి సీతాదేవి రాక్షసులచేతఁ జిక్కి మరణించెను గాఁబోలు? లేకున్న నింతలో నెందుఁ బోఁగలదు?

క. అంగనను బట్టి రక్కసు, లంగంబులఁ బంచికొంచు ♦ హర్షంబున ను
ప్పొంగుచు నుందురు నాలే, మిం గట్టా యెంతచెట్ట ♦ మ్రింగెను సీతన్. ౧౩౪

తా. సీతాదేవిని బట్టుకొని రాక్షసులు చంపి 'నీ వీతల తీసికో, నాకీ చేతి నిమ్ము,' అని యీప్రకార మొకరొక రొక్కొక్క యవయవమును సంతోషముతోఁ బంచుకొనియుందురు. అయ్యో! నేనులేనికారణముచే సీత కెంత చెడ్డ గలిగెను.

సీ. చారుకుండల మబ్జ ♦ సఖ మైననెమ్మోము, కాంతి వాసెనొ కదే ♦ యింత కయ్యొ
హారిచంపకవర్ణ ♦ తారహారోదీర్ణ, యఱవంగ నసురులు నఱికి రేమొ
పల్లవకోమల ♦ బాహువుల్ తెగఁద్రుంచి, కొఱకెదరో యింత ♦ వఱకుఁ బగఱు
చెఱకుతుంటనుబోలె ♦ విఱచి నెన్నడుమును, భక్షించుచున్నారొ ♦ పాపమతులు
ఆ. గుంపు విడిచి చనిన ♦ కువలయాక్షిని వన్య, సత్త్వచయము లెల్లఁ ♦ జంపుపగిదిఁ
గానలోన నొంటి ♦ గా వీడి నేఁ బోవ, నంబుజాక్షిఁ జంపి ♦ రసురఖలులు. ౧౩౫

చారుకుండలము = మనోహరమైన కమ్మలుగలది, అబ్జసఖము = చంద్రుని తోను, కమలముతోను సమానమైనది. హారి = మనోహరమైన, చంపకవర్ణ = సంపెగపూవువలె పచ్చనికాంతిగలది, (ఎఱ్ఱసంపెఁగియుఁగలదు) తారహారోదీర్ణ = ముత్యాలసరములచే గొప్పదైనది. "హారోముక్తావళీ" యని యమరకోశము.

హారశబ్దమే ముత్యాలసరమునకుఁ బేరు. తారహారమనుట దోషమనరాదు. ఇట్టి చోట రెండవపదము సామాన్యవాచకముగా గ్రహింపవలసిన దని వామనమతము. పల్లవకోమల=చిగురువలె కోమలమైనది, కుసుమకోమలి,పల్లవకోమలి, యిత్యాదు లపప్రయోగములు, పగఱు = పగవారు. అసురఖలులు — విశేష్యపూర్వపదకర్మధారయము.

తా. అయ్యో! అందములైన కన్నులుగలిగి చంద్రబింబముతోను, కమలముతోను సమానమైన ముఖ మిప్పటికి నెంతవాడిపోయినదో కదా? మనోహరమైన సంపెంగపువ్వువలెఁ బచ్చనిదేహముగలిగి ముత్యాలసరములు వ్రేలాడుచుండు దానిని నది యఱవఁగ నఱవఁగ రాక్షసులు నఱికిరేమో? చిగురువలెఁ గోమలములైన చేతులు తెగునట్లు విఱిచి చెఱకుతుంటనువలె శత్రువులు నములుచున్నారేమో? చెఱకుతుంటను విఱిచినట్లు నడిమికి రెండుగా నడుము విఱిచి పాపాత్ములు తినుచున్నారేమో? అడవిలో సంచరించు బిడారువారొంటిగా విడిచిపోయిన స్త్రీని నడవిమృగములు భక్షించినట్లు లడవిలో నొంటిగా విడిచి నేఁ బోవుటచే దుష్టరాక్షసులు సీతను జంపిరి.

మొదటి నాలుగుపాదములందుఁ గ్రమము వివక్షితము.

క. అన్నా! లక్ష్మణ నీకైన న్నవలామిన్న వనిఁ గనంబడియెనె యో
చిన్నారికన్నియా! నాకన్నారఁగఁ జూడఁ గలనె కాంతా! నిన్నున్. ౧౦౩౬

నవలామిన్న = స్త్రీరత్నము, వనిన్ = అడవియందు.

తా. అన్నా లక్ష్మణా! నేను చిత్తభ్రమ గొనియున్నవాఁడఁ గావున నాకు సీత కానరాలేదేమో - నీకైనఁ గానవచ్చెనా? చిన్నారి చిన్నదానా! నిను నేను మరలఁ గన్నారఁ జూడఁగలనా?

క. విలపించుచు నిటు రాఘవుఁ, డలఘుగతిన్ వనము వనము నరయుచు భ్రమచేఁ
బిలుచుచు నిలుచుచుఁ దొలఁగుచు, మలయుచు దూపిల్లె వెకలి మాఢ్కిన్ సతికై.

తా. ఈప్రకార మేడ్చుచు రామచంద్రమూర్తి వేవేగ నొకవనము వెనుక నొకవనము (వీప్స)న వెదకుచు భ్రమచే "సీతా సీతా" యని పిలుచుచు నందు లేదని తొలఁగిపోవుచుఁ నందందుఁ దిరుగుచు వెఱ్ఱివానివలె శోకించెను.

౬౧-వ సర్గము.

క. దీనుండై భయశోకాధీనుండై యాశ్రమాంత దేశమునఁ బరి
ద్యూనుండై ధుతవస్తువితానముఁ గని చేతు లెత్తి తద్దయు నేడ్చెన్. ౧౦౩౭

పరిద్యూనుఁడు = మిక్కిలి ఖేదమునొందినవాఁడు, ధుతవస్తువితానము = విసరి వేయఁబడిన పదార్థములసమూహము. దీనివలన నాశ్రమము చుట్టుప్రక్కలఁ

దిరిగి మరల లోపలికి వచ్చె నని యేర్పడుచున్నది. ఇఁక దశావస్థలలోఁ దొమ్మిదవదగు మూర్ఛావస్థ వర్ణింపఁబడుచున్నది.

తా. దర్ప ముడిగినవాఁడై, భయమునకు శోకమునకు వశపడినవాఁడై యాశ్రమమందుఁ జెదరఁగొట్టఁబడినవి విసరివేయఁబడినవి యగువస్తువులఁ జూచి మిగులఖేదము నొందిన వాఁడై రెండుచేతు లెత్తి హా యని యేడ్చెను.

శా. ఏరా లక్ష్మణ! సీత లేదు గదరా ♦ యెచ్చోటికిం బోయెనో
క్రూరం బైనమృగం బెదే మెసవెనో ♦ కొంపోయిరో యెవ్వరేఁ
నీరేజేక్షణఁ బాసి నిల్వఁ గలనా ♦ నే నొక్కమూర్తంబు, క
న్నారన్ నాచెలి! నిన్నుఁ జూడఁ గలనా ♦ హా మానినీరత్నమా! ౧౦౩౯

మెసవెనో = తినెనో.

తా. ఏరా తమ్ముఁడా! సీత యాశ్రమమందు లేదుగదరా! ఎక్కడికిఁ బోయెనోకదరా! ఘాతుకమృగ మేదైనఁ దినెనేమోకదరా! ఎవ్వరైనఁ బట్టుకొనిపోయినారో యేమో! కమలమువంటి కన్నులుగలసీతాదేవిని బాసి నేనొక్కముహూర్తకాలమైన బ్రతుకఁగలనటరా? నాచెలీ! మరల నిన్నుఁ గన్నారఁ జూడఁ గలనా? అయ్యో స్త్రీరత్నమా!

క. డాఁగికొని చెట్లమాటున, దాఁగురుమూఁతాడి నన్నుఁ ♦ దపియింపింపం
గాఁ గాలమె యిది యోయెల,నాఁగా! పరిహాస మేల ♦ నన్నేలఁ గదే. ౧౦౪౦

తా. చెట్లచాటున డాఁగి, నన్నుఁ దపియింపఁజేయ డాఁగురుమూఁతలాడుటకు నిదియా సమయము? కాంతా! ఏల పరిహాస మాడెదవు? నన్నేలుకొనుము.

క. బాలామణి! నీచెలిమిని, గేళీరతి మరగి తిరుగు ♦ క్రీడామృగముల్
హేలావతి! నినుఁ బాయుట, వాలాయము నేడ్చు చున్న ♦ వదు వెఱుఁగుదువే.

తా. బాలారత్నమా! నాయేడు పటుండనీ. నీవు మచ్చికచేయుటచే నీతోడనాడ నభ్యాసపడి తిరుగుచుండు క్రీడామృగములు నిన్నుఁ బాయుటచే విశేషముగ నేడుచుచున్నవే! అదియైన నీకుఁ దెలియునా?

శా. భామారత్నవియోగభారమున స్వర్గం బేగ నాతండ్రి యే
మేమీ రాముఁడ! యిందు వచ్చి తిటు లీ ♦ రేడేండ్లు దుర్గాటవీ
సీమావాసముఁ జేయు మం చననె? యి ♦ స్సీ తీఱెనా కాల? మం
చీమాడ్కిన్ ననుఁ గల్లరీనిఁ బలుకున్ ♦ స్వేచ్ఛావిహారున్ శఠున్. ౧౦౪౨

ఈరేడేండ్లు = పదునాలుగు సంవత్సరములు, దుర్గాటవీసీమావాసము = చొరరాని యడవిప్రదేశములందుఁ గాఁపురము, తీఱెనాకాలము=గడువు ముగిసినదా? కల్లరీనిన్ = అసత్యవాదిని, స్వేచ్ఛావిహారున్ = నియతిదప్పివర్తించువాని, శఠున్ = మోసగానిని. పదునాలుగుసంవత్సరములు గడచువఱకు నాకుఁ జచ్చుటకు నధికారము లేదుగదా యని భావము.

తా. స్త్రీలయందు శ్రేష్ఠురాలగు సీతాదేవిని విడిచిన దుఃఖాతిశయముచే మరణించి స్వర్గముఁ బోయితినా, యక్కడ నాతండ్రి "ఏమిరా రాముఁడా! నీకు నేనేమిరా చెప్పితిని? పదునాలుగేం డ్లడవులలో నుండు మనలేదా? ఆగడువు ముగిసినదా? ఇక్కడికి వచ్చినావేల? ఛీ!" యని యీవిధముగ నసత్యవాదిని, మోసగానిని, మర్యాదదప్పినవానిని, నాతండ్రి చీవాట్లుపెట్టును.

ఉ. చక్కటి లేనిపూరుషుని ♦ సద్యశ మెల్లను బాయుభంగి నో
చక్కెరబొమ్మ! శోకమున ♦ సంతపియింపఁగ నేను దీనతన్
మక్కువలేక పోవఁ దగు♦నా నినుబోఁటికిఁ, నిన్ను బాసి నే
నెక్కడ కేగువాఁడ? నిఁక ♦ నేగతి మేను ధరింతు? నం చిటుల్. ౧౦౪౩

చక్కటి = ఋజువర్తనము, సద్యశము = మంచికీర్తి.

తా. చక్కనినడవడిలేని పురుషుని మంచికీర్తియంతయు వదలిపోవు విధముగ చక్కెరబొమ్మవలెఁ దియ్యనిగుణము గలనీవు నేను దుఃఖమున నిట్లు సంతాపము నొందుచుండఁగా నాపై దయలేక నన్ను వదలి నీవంటిది పోవచ్చునా? నన్నుఁ బాసి నీవెందో పోవఁగలిగితివిగాని నిన్నుఁ బాసి నేనెందుఁ బోఁగలను? ఇఁక నాగతి యేమి? ఈదేహమును నేనెట్లు మోసికొని తిరుగఁగలను?

క. బిసరుహలోచన వెదకుచు, నసలున మునిఁగినగజంబు♦నట్టులు భృశదు
ర్వ్యసనమున మునుఁగునన్నకు, నసదృశహితసూక్తి నిట్టు♦లను లక్ష్మణుఁడున్.

బిసరుహలోచన = కమలమువంటి కన్నులుగలదానిని, అసలునన్ = బురదయందు, అసదృశ = అసమానమైన, హిత = మేలైన, సూక్తిన్ = మంచిమాటలతో.

తా. సీతాదేవి నిట్లు వెదకుచు బురదలో మునిఁగిన యేనుఁగువలె మిగుల సహింపరాని వ్యసనమున మునిఁగిన యన్నకు లక్ష్మణుఁడు హితములైన మంచిమాట లిట్టు లనెను.

### లక్ష్మణుఁడు రామునకు సమాధానము జెప్పుట.

ఉ. ఏమిటి కన్న! శోకమున ♦ నెంతయు వేఁగెద వీదరీఝరీ
భూముల లోవత్రోవలను ♦ బొల్పగు కానలఁ గోనలన్ గుహా
సీమల భూమిజన్ వెదకఁ ♦ జేపడ కుండునె! ధీరవర్య లె
మ్మా మహిజాత కానఁ దిరు♦గాడఁ బ్రియంపడు టీ వెఱుంగవే. ౧౦౪౪

వేఁగెదవు=తపించెదవు, దరీ=గుహలయు, ఝరీ=వంకలయు, భూములన్=ప్రదేశములందు, లోవత్రోవలను = కొండపగుళ్లమార్గములందు, లోవ=లోయ-రెండుకొండలకు నడిమిసందు. గుహాసీమలన్ = కొండలయందలి గుహలప్రదేశములందు. ముందుచెప్పినది యేళ్లయొడ్డులనుండునది. చేపడకుండునే=లభింపకుండునా?

తా. అన్నా! ఏల యీప్రకారము శోకముచేఁ దపించెదవు? ఈవంకల వాఁగులయొడ్డులఁ గలగుహలలో లోయలలో కానలలో గోనలలో కొండగుహలలో సీతను వెదకితిమేని లభింపకుండునా? ఎక్కడనుండక యెందుఁ బోగలదు? ధీరులలో శ్రేష్ఠుఁడా! లేలెమ్ము. సీతాదేవి వనసంచారమందుఁ బ్రియముకల దని నీ వెఱుఁగవా యేమి?

మ. జలకేళిన్ విహరింపఁగాఁ జనియెనో ♦ చంద్రాస్య ఫుల్లాబ్జసం
కులనీరాకరతీరమే తటిసెనో ♦ కూలంకషల్ చూడఁగా
వలపుం గైకొనెనో మఱుంగుపడెనో ♦ వామాక్షి హాసార్థమై
తెలువ్రల్ చూతమ టంచునే మనకు భీ♦తిం గొల్పనే డాఁగెనో. ౧౦౪౬

ఫుల్లాబ్జ = వికసించినకమలములచే, సంకుల = నిండిన, నీరాకర = సరస్సుల, తీరము = ఒడ్డు, కూలంకషల్ = నదులు, వలపుం గైకొనెనో = మోహపడెనో, హాసార్థమై = నవ్వులాటకై, మఱుంగుపడెనో = దాఁచుకొనెనో, తెలువుల్ = మనవివేకము, భీతింగొల్పనే = భయపెట్టుటకునై.

తా. స్నానముచేయుటకయి యే పోయెనో, వికసించినకమలములుగల సరస్సులయొడ్డునకేపోయెనో, ఏళ్లు చూతమని భ్రాంతిపడెనో, మన తెలువు లేమాత్రమో కనుఁగొనఁగలమో లేమో యని నవ్వులాటకై దాఁగుకొనెనో మనలను భయపెట్టుటకే దాఁగెనో?

ఉ. ఎక్కడ కేగఁజాలుఁ దర♦ళేక్షణ వే జతనంబు చేసినన్
జిక్కకపోనె శోకమునఁ ♦ జిక్కకు మన్న వృథావ్యథామతిన్
దక్కు మటన్న రాఘవుఁడు ♦ తమ్మునివాక్యము లాలకించి తా
గ్రక్కున లేచి వెండియును ♦ గాంతను రోయఁ దొడంగెఁ గానలన్. ౧౦౪౭

వే = త్వరగా, జతనంబు = ప్రయత్నము. యత్నశబ్దభవము జతనము. రోయన్ = వెదకుటకు, తొడంగెన్ = ప్రారంభించెను.

తా. సీతాదేవి యెక్కడికిఁ బోఁగలదు? మనము ప్రయత్నముచేసి వెదకితిమా చిక్కకపోవునా? అవశ్యము చిక్కును. "ఉద్యోగినంపురుషసింహముపైతి లక్ష్మీ" యని కలదుగదా. నీవు నిరుపయోగమైన వ్యసనముగల మనస్సును వదలుము. శోకమున కృశింపకుము. అని చెప్పఁగా రామచంద్రమూర్తి లక్ష్మణు వాక్యములు విని త్వరగా లేచి యడవియందు మరల వెదక నారంభించెను.

ఉ. కొండలు గుట్టలున్ నదులుఁ ♦ గోనలుఁ గానలు మేలొ్కలంకులున్
వెండియు రోసి రోసి పృథి♦వీసుతఁ గానక భ్రాతతోడ నీ
దండక నెల్లఁ గాంచితిమి ♦ దండుగ యయ్యెను గాదె మత్తవే
తండసుయాన యెం దరిగెఁ ♦ దమ్ముఁడ యే మిఁకఁ జేయ నం చనన్. ౧౦౪౮

దండుగు + అ—దండుగ = వ్యర్థమే. భార్యలేక యొనర్చుపండువు దండువు.

"భూవరునకుఁ గొంతదండువును బెట్టెదగుఁ గన్." విజ్ఞా-ప్రా-కాండము. రూ. దండుగ. అట్లులే పండుగు- పండుగ, అనియు రూపాంతరములు గలవు.

తా. కొండలు గుట్టలు నదులు కోనలు కానలు కొలఁకులు మఱిమఱి వెదకి వెదకి సీతాదేవిని జూడలేక రామచంద్రమూర్తి లక్ష్మణుతో నిట్లనియె "లక్ష్మణా! దండకయంతయు వెదకితిమి. వృథాకష్ట మయ్యెనుగదా. ఆమదగజగామిని యెక్కడికిఁ బోయెనో యేమిసేయుదము". అనఁగా లక్ష్మణుఁ డిట్లనియె:

క. సౌమిత్రి యిట్టు లను (శ్రీ),రామా పొందెదవు మరల ♦ రాజీవాక్షిన్
వామనుఁడు మున్ను బలిమిని, భూమిని బలియొద్దఁ గొన్న ♦ పోలుపున ననినన్.

తా. అన్నా! పూర్వము బలియొద్దనుండి బలత్కారముగ భూమిని గ్రహించినట్లు నీవు సీతను మరలఁ బొందఁగలవు అని చెప్పఁగా రామచంద్రమూర్తి యిట్లనియె.

క. వెతకితి మీసర్వంబును, వెత యొక్కటె కాక లేదు ♦ వెలఁదుక యెందున్
క్షితిధరము బహుళకందర, మతివను నిఁక నెందు నెమక ♦ నను వగు ననుచున్.

తా. ఈప్రదేశమంతయు వెదకితిమి. శ్రమ యొక్కటియె కాని సీతయేమో కనఁబడలేదు. ఈపర్వతమందా యనేకగుహలున్నవి. ఎక్కడనని మనము వెదకఁగలము?

క. వ్రాలున్ మూర్ఛల నేలను, సోలున్ దుఃఖమునఁ దూలు ♦ శోషిలి వ్రేలున్
బాలా! సీతా! సీతా!, యేలాగైతివె యటంచు ♦ నేడ్చుచుఁ బొరలున్.

తా. అని మూర్ఛపోవును, నేలఁబడును, దుఃఖమున శోషిల్లును; బాలా! సీతా! సీతా! ఎక్కడఁ బోయినావే యని నేలఁబడి పొరలుచు నేడ్చును.

క. తమ్ముం డూఱటగా వాక్యమ్ముల నే వేవొ చెప్పఁ ♦ గైకొనఁ డెద శో
కమ్మున సీతా! యని కడు, నుమ్మలికం బందుఁ గుందు ♦ నుత్తలమందున్.

తా. లక్ష్మణుఁడు సమాధానముమాట లేవేవో చెప్పినను వాని నంగీకరింపఁడు. శోకముచేఁ బరితపించుచుండెను.

క. నీరజలోచనఁ గానక. నీరజలోచనుఁడు ధర్మ ♦ నిరతుఁడు సుమనో
నారాచోపహతాత్ముండై రోదన మారఁ జేసె ♦ నతివా! యనుచున్.

నీరజలోచనన్ = కమలములవంటి కన్నులుగలదానిని, నీరజలోచనుఁడు = కమలములవంటి కన్నులుగలవాఁడు. ఇట్లు చెప్పుటచే భర్తకుఁదగినభార్య-భార్యకుఁదగిన భర్త యని యభిప్రాయము. ఈవిషయమే సుందరకాండమందు నాంజనేయుఁడును. "రామున కీయసితేక్షణ రాముఁడు నీసతికిఁ దగును" అనికదా యెంచెను. (సుందర. ౪౬౦) ధర్మనిరతుఁడు = భార్యభర్తవ్య యనియు నాశ్రితత్యాగము మహాదోషమనియు నెఱింగినవాఁడు. సుమనోనారాచ = మన్మథునిచే, ఉపహత = కొట్టఁబడిన, ఆత్ముండై = మనస్సుగలవాఁడై.

తా. సీతాదేవిని గానక రామచంద్రమూర్తి భార్యను భర్త భరింపవలసినది-ఆమెకు వచ్చునాపదల రక్షింపవలసినది, భార్యయొక్క ధారణపోషణములు భర్తకార్యము, అందు నాశ్రితురాలైన పతివ్రతను వదలుట మహాపాపము, ధర్మవిరుద్ధకామము దోషముగాదు శ్లాఘ్యము-అనుధర్మ మెఱింగినవాఁడు. మన్మథబాణపీడితుఁడై "సీతా" యని గట్టిగా నేడ్చెను.

-:o:- ౬౨-వ సర్గము. రాముఁ డున్మత్తువలె దుఃఖించుచుసీతను రోయుట. -:o:-

ఉ. కన్నుల మ్రోల లేకయును ♦ గంజశరవ్యథ మ్రోల నున్నయా
కన్నియఁ గూర్చి దుర్వచము♦గా వ్యసనార్తిని బల్కు జానకీ!
క్రొన్ననలందు నీకుఁ గల♦కూరిమి పేరిమి బాఢపుష్పసం
పన్న మశోకశాఖఁ గొని ♦ మాటుగ డాఁగితివే యెఱింగితిన్. ౧౦౫౮

దశావస్థలలో నాఱవయవస్థయగు సరతి యిక వర్ణింపఁబడును. కంజశరవ్యథన్ = మన్మథబాధచే, దుర్వచముగాన్ = (i) గద్గదకంఠమగుటచే మాట తెలియవచ్చి తెలియరాకయుండునట్లు. (ii) సంతాపవిషయము గావున ననుభవముచేఁ దెలిసికొనవలసినదేకాని చెప్ప సాధ్యముకానట్లు - వ్యసనార్తిని = వ్యసనమువలనఁగలిగిన బాధచే, క్రొన్ననలందు=క్రొత్తపుష్పములందు, క్రొత్త+నన= క్రొన్నన; క్రొత్త-కెంపు-క్రిందు శబ్దముల కాద్యక్షరశేషంబునకుఁ గొన్నియెడల నుగాగమంబును-గొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వంబును నగు. బాఢ + పుష్ప + సంపన్నము = విస్తారముగ పూలచేనిండినది.

తా. వాస్తవముగ సీతాదేవి యెదుట లేకుండినను మన్మథతాపముచే ధ్యానబలంబునఁ గన్నులఁ గట్టినట్లున్న యాసీతనుగూర్చి గద్గదస్వరముతో మాట సరిగాఁ దెలియరాకుండునట్లు - ఆసంతాప మిట్టిదని చెప్ప సాధ్యము కానియట్లు వ్యసనమువలనఁ గలిగినబాధచే నిట్లనెను: "జానకీ! క్రొత్తపుష్పములందు నీకుఁగల ప్రేమాతిశయముచే బాగుగ పుష్పించిన యశోకవృక్షపుఁగొమ్మ చాటున డాఁగితివి లే. తెలిసికొంటిని. నేను గనుఁగొన్నతరువాత డాఁగ నేల?

క. కదలీదండనిభంబులు, కద లీలావతిరో నీదు♦కమ్రోరువు లా
కదలీసంవృతములె యై,మదిరేక్షణ యవిగోఁ దోఁచె ♦ మఱుఁగిడ వశమే.

కదలీదండనిభంబులు = అరఁటిబోదెతో సమానమైనవి, కమ్రోరువులు = మనోహరములైన తొడలు, కదలీసంవృతములు=అరఁటిచెట్లచే దాఁపఁబడినవియై అవిగో=చూపి తెలుపుటయం దీశబ్ద ముపయోగింపఁబడును. అవిగో రూపాంతరము. "పూని కర్ణాత్మజుఁడు వృషసేనుఁ డాత్మహయము దాఁటించినట్టి వాఁ గల్లయదిగో," కళా-౧ ఆ. "రామానుజుం డదిగో మహాయతిరాజునాయకుం డనఁగ నున్నాఁడు వెలసి", పర. ౫ ఆ. ఇది ద్రుతాంతము. ఈశబ్దములు 'అదికనుఁగొనుము, అవికనుఁగొనుము' అనువాని హ్రస్వరూపములు. వీనిలోఁ గను లోపింపఁగా అది

కొనుము, అవికొనుము అని, నిలిచి కొనుము, కో కాఁగా, అదిగో అదిగో, అవిగో అవిగో యని రూపంబు లయ్యె. ఇవి లింగవివక్షలేక యుపయోగింపఁబడును. రామానుజుం డదిగో, ఈశబ్దంబులు చూపుట యనునర్థంబునఁ బ్రయోగింపఁ బడును. ఆయర్థంబున కో లేకయుఁ గవులు ప్రయోగించియున్నారు. 'ధీరతఁ బుష్కరాదులగు దీవులనన్నిటినుండి వచ్చియున్నా రిదె శీతభాను దినినాయక వంశజులైన రాజబృందారకులు', శృం-నై. ౫-౭౯. ఇదె రాజబృందారకులు, అదిగో అవిగో యనుప్రయోగంబులు కానవచ్చుచున్నవికాని యిప్పటివారి అదుగో-వారుగో ననుశబ్దములకుఁ బూర్వకవిప్రయోగములు మృగ్యములు. 'ఇదిగో, అదిగో' కళలా ద్రుతప్రకృతికములా యనువిషయంబునఁ గవులం దభిప్రాయ భేదము గలదు. పింగళిసూరకవి కళాపూర్ణోదయంబున "కం. పూఁబోఁడియొరసి కొనిచనఁ, గాఁ బయ్యెద యొడిసి పట్టెఁ గనుఁగొంటె చెలీ! లేఁబొన్నను భళిరా యిది, గోఁ బురుషాహ్వయము నిలుపుకొను సమయంబున్." ౧ ఆ. అని ప్రయోగించెను.

తా. లీలావతీ! నీయందములైన తొడ లరఁటిబోదెలవంటివికదా! అట్టు లయ్యు కదళీవృక్షముల మధ్యముననుండియు వానికంటె నందముగ నుండుటచే నాకు నదిగోఁ గానవచ్చుచున్నవి. దాఁచిపెట్ట నీకు సాధ్యమా?

ఆ. కర్ణికారవనముఁ ♦ గర్ణాంతలోచన, నవ్వులాట కరిగి ♦ పువ్వుల కని
నన్ను నాలిగొనఁగ ♦ నాయమా యోబాల! నిన్ను గానలేక ♦ నేను మిడుక.

కర్ణికారవనమున్ = కొండగోఁగుతోఁపునందు, కర్ణాంతలోచన = చెవుల వఱకుఁగల కన్నులుగలదానా, ఆలిగొనన్ = పరిహాసముచేయ, మిడుకన్ = దుఃఖింపఁగా.

తా. విశాలములు దీర్ఘములు నైన కన్నులుగలదానా! కొండగోఁగుఁ బూవుల కని కొండగోఁగువనమునకుఁ బోయి నవ్వులాటకని నన్నుఁ బరిహాసము చేయుట నీకు ధర్మమా? నిన్నుఁ జూడఁజాలక మిడుకుచున్నవాఁడనే!

క. హేలనపర వగు టెఱుఁగుదు, హేలావతి యిదియు సమయ♦మే గేలి గొనన్
బాలా గాసిలితిసి నా, కేలా పరిహాస మిట్టి♦యెడరున నడవిన్. ౧౦౫౭

హేలనపరవు = పరిహాసప్రియవు, గేలిగొనన్ = పరిహసించుటకు, ఎడరునన్ = ఆపదయందు.

తా. సీతా! నీవు పరిహాసప్రియ వని నాకుఁ దెలియును. అయినను పరిహాస సమయమా యిది? తిరిగి తిరిగి యేడిచి యేడిచి ఛాల బడలితిని. ఇట్టియాపదదశ యందు నా కెగతాళితో నేమిపని?

సీ. అన్న! లక్ష్మణ! సీత ♦ యున్న నో యని రాదె, మ్రింగిరో పరులు హ♦రించినారొ
కన్నీరు దొరఁగ మృ♦గంబులు రక్కసుల్, సీతను దిని రని ♦ చెప్పు చున్న

వెటు పోయితే తన్వి ♦ యెందున్న దానవే, కైక కోరిక నీదు♦కతనఁ దీరె
జానకితో వచ్చి ♦ జానకిఁ గోల్పోయి, యెట్లంతిపురిలోని ♦ కేఁగువాఁడ
తే. రిత్త యంబేద రాముఁడు ♦ సత్తలేదు, నిర్దయుండని పలుకరే ♦ నిఖిలజనులు
కాంత లేకున్న సౌఖ్యమే♦కరణిఁ గాంతు, లేబరముగాదె యిల్లాలు ♦ లేనిబ్రదుకు.

కోల్పోయి = పోఁగొట్టుకొని, అంబేద = అసమర్థుఁడు, సత్త = సత్తువ, లేబరము = శూన్యము.

తా. అన్నా! లక్ష్మణా! నేనింతగాఁ బిలుచుచున్నానే! ఉండెనా ఓయనిబదులు పలికి రాకయుండునా? శత్రువులు మ్రింగనే మ్రింగిరో, హరింపనే హరించిరో రెంటిలో నొకటి జరుగకుండిన సీత కానరాకయుండదు. ఈమృగములు కన్నీరుగార్చుచు సీతను రాక్షసులు దిని రని దుఃఖపడుచున్నవి. ఎందుఁ బోయితివే సీతా? ఎందున్న దానవే? నీవు కారణముగఁ గైక నన్నుఁ జంపఁ దలఁచిన కోరిక నెఱవేఱునా? జానకితోడ నరణ్యమునకు వచ్చి జానకిని బోఁగొట్టుకొని గడువుతీఱఁగానే నేనేమని యంతఃపురమునకుఁ బోదును? పోయితినిబో, లోకు లేమందురు? రాముఁడు కేవల మసమర్థుఁడు చూపుగుట్టమే కాని సత్తువలేదు సత్తువ లేకేమి కలవాఁడే అయినను జానకిమీఁద దయలేనివాఁడు కావున నామెను దక్కించుకొన నిష్టపడలేదు అని యనరా? ఒకరననీ యనకపోనీ, సీత లేకుండెనేని నాకు సౌఖ్య మెక్కడిది? ఏక పత్నీవ్రతుఁడనే. భార్యలేనివాని బ్రదుకు పాడేగదా? సౌఖ్య మెందుండి వచ్చును?

నగృహం గృహమిత్యాహుః, గృహిణీ గృహముచ్యతే।
గృహంతు గృహిణీహీన మరణ్యా సదృశంమతమ్॥ భార 12-144-6.

"భార్యాహీనం గృహస్థస్య, శూన్యమేవ గృహం భవేత్" భార్యలేని గృహస్థునియిల్లు పాడు.

ఉ. క్రచ్చఱఁ దీర్చుచున్ మన మ♦రణ్యనివాసము, నూరి కేగినన్
వచ్చిరి కూఁతు రల్లుఁ డని ♦ వచ్చిమముం గన మైథిలుండు నిం
పెచ్చఁగ క్షేమమా యనిన ♦ నే మని యాతనిమోముఁ జూతు, నా
సచ్చరితుం డెఱింగి తను♦జాతఁ దలంచి తపించి మూర్ఛిలున్. ౧౦౫౯

క్రచ్చఱన్ = వేగముగ, మైథిలుండు = జనకుఁడు, సచ్చరితుండు = మంచి యాచారముగలవాఁడు, తనుజాతన్ = పుత్రికను.

తా. అరణ్యమందు మనము కాఁపురముచేయవలసిన గడువు త్వరగాఁ దీర్చి యయోధ్యకుఁ బోఁగా కూఁతురల్లుఁడు దీర్ఘకాలమునకు వచ్చిరని జనకుఁడు చూడవచ్చి సంతోషముతో 'నల్లుఁడా' యందఱు క్షేమమాయనిన నేనేమని చెప్ప దును? 'మీకూఁతురుతప్ప'నని చెప్పుదునా? చెప్పుట యెట్లయిన నగుఁగాక. ఆయన ముఖము నేనేమని చూతును? జానకి లేదనువార్త యితరులచే సాధువర్త

నముగలయాయన చెవినిబడెనా కడుపుదుఃఖమునఁ దనబిడ్డను దలఁచితలఁచి శోక
ముచేఁ దపించితపించి యరసావు చచ్చునుగదా?

సీ.*నాకోడ లేదిరా ♦ నాయనా! యని నంత, మాయమ్మ కేమని ♦ మాఱు పలుక
రామ! జానకి యేది ♦ రా యంచు నడుగు మీ, యమ్మ కే మనఁగ నో ♦ రాడు నాకు
ధారపోసితివ సీ ♦ తను గాన కని ముసి, ముసి నవ్వు కైక కే ♦ ముసి వచింతు
వదినె రాదాయె నే ♦ మిది యని ప్రశ్నించు, తమ్ముల కేమి యు ♦ త్తరము లిడుదు

తే. సీత రాదాయె రాముండు ♦ చేతఁగాక
యసురవాతను ద్రోచె ని ♦ ల్లాలి ననుచు
నెల్లిదము సేయుజనుల నో ♦ రెట్లు మూయఁ
జెప్పుమా తమ్ముఁడా! యేమి ♦ చేయువాఁడ. ౧౦౬౦

ముసిముసినవ్వు = కల్లచిఱునవ్వు. అతిశయార్థమున ద్విరుక్తి. కేవలము
కల్ల. ఎల్లిదము = చులుకదనము. రూ. ఎలిదము, ఏముసి = ఏమిబొంకు.

తా. నే నింటికిఁ బోగానేఁ మాయమ్మ కౌసల్యాదేవి యెదురుగా వచ్చి
కుమారా! నాకోడ లేదిరా? యని యడుగునే-నే నేమని చెప్పుదును? ఆవల మీ
యమ్మవచ్చి రామచంద్రా యేదిరా జానకి యనునే-ఏమని చెప్ప నోరెట్లాడును?
ఆవలఁ గైకమ్మ కల్లచిఱునవ్వుతోఁ బరిహాసముగా సీతను నడవికి ధారపోసి వచ్చి
తివా యనునే, నేనేమని బొంకుదును? భరతశత్రుఘ్నులు వచ్చి యన్నా! మావదినె
రాలేదా యేమి? యని ప్రశ్నింతురే, యేమి బదులుచెప్పుదును? సీత రాలేదు.
రాముఁ డొక్కయాఁడుదానిని గాపాడుకొనలేక పెండ్లామును రాక్షసులవాతఁ బెట్టి
తానుమాత్రము వచ్చినాఁ డని పలుచఁదనముగా మాటలాడువారి నోళ్లెట్లు మూయు
దును? లక్ష్మణా! నేనేమి చేయుదును? చెప్పుము.

క. పోసీ భరతునిపురి కే, రా నే పో స్వర్గ మేగ ♦ రా కేందుముఖీ
హీనుఁడ నై చనుటను నది, కానంబడు శూన్య మగుచుఁ ♦ గాడుంబోలెన్.

తా. ఇప్పుడు నేను చెప్పినదంతయుఁ బోనిమ్ము. భరతునిపురమునకు నేను
రాను. స్వర్గమునకుఁ బోయెద ననుకో. సీతలేనికారణమున నదియు స్మశానము
వలె శూన్యముగానే కానవచ్చును.

-ఀ రాముఁడు లక్ష్మణుని నయోధ్యకుఁ బొమ్మనుట. ఀ-

సీ. తమ్ముఁడా! నీ వింకఁ ♦ దడయకు మిచ్చటఁ, బొమ్మయోధ్యాపురం ♦ బునకు వేగ
బిగియార భరతునిఁ ♦ బ్రేమఁ గౌఁగిటఁ గ్రుచ్చి, యనుము నామాటగా ♦ నతనితోడఁ
జిరముగా రాజ్యంబుఁ ♦ జేయుమీ భరత! రా, మునియాజ్ఞ యిది యని ♦ యనుము
మాయమ్మ కైకకు ♦ మీయమ్మకును గోస, లాత్మజ కెఱఁగు నా ♦ యాజ్ఞ భక్తి [నీవు

తే, నడిగితిని జాల ననుమ మా ♦ యమ్మతోడ
సీతపోకయు నాచావుఁ ♦ జెప్పవయ్య

యూమె నెల్లవిధంబుల ♦ నరయ రయ్యా
పోయి రా నాయనా! నీకుఁ ♦ బొదలు శుభము. ౧౦౬౨

తా. లక్ష్మణా! నీ విఁక నిచట నాలస్యముచేయక యయోధ్యకుఁ బొమ్ము. భరతుని గట్టిగాఁ గౌఁగిలించి నేను జెప్పితి నని యిట్లు చెప్పుము. "భరతా! నీవు శాశ్వతముగా రాజవై రాజ్యమును బాలింపుము. ఇది రామాజ్ఞ" యని చెప్పుము. ఇంతటికార్యము చేసిన మాతల్లి కైకకు, మాయమ్మకుఁ, గౌసల్యకు నాయాజ్ఞచే భక్తితో నమస్కరింపుము. మాయమ్మను జాల నడిగితి నని చెప్పుము. సీత పోయిన విధము నాచావుకూడఁ జెప్పుము. సర్వవిధముల నీ వామెను విచారించుచుండుము. నాయనా! ఇఁకఁ బోయిరమ్ము. నీకు మేలగునుగాక!

మాతల్లి కైక కనునది ప్రీతిపూర్వకముగఁ జెప్పినమాటగాదు. శోకము వలనఁ గలిగిన కోపముతోఁ జెప్పినమాట. 'మహా' యనునది తెలుఁగున 'మా' యగును. మాయమ్మ యనఁగా నాపాలిపెద్దయమ్మ యనియు ధ్వనింపనగు.

క. నను నీవు కాచి తిరుగం, బని లే దిఁక లక్ష్మణా! క్షమాసుత లేదేఁ
దనువునఁ బ్రాణము నిల్పఁగ, విను శక్యముగా దటంచు ♦ విహ్వలుఁ డైనన్.

తా. నాయనా! నన్నుఁగాచి నీవు తిరుగవలసిన పనిలేదు. సీతాదేవి లేదాయెనా దేహమునందుఁ బ్రాణములు నిల్పఁగసాధ్యముగాదు, అని వెలవెలఁబోఁగా

క. హెచ్చిలుతాపభరమ్మున, నచ్చపలాక్షిని దలంచి ♦ హావడి గొని యా
ముచ్చిరి ముచ్చిర లక్ష్మణుఁ, డుచ్చలితమనస్కుఁ డగుచు ♦ నుత్తలపడియెన్.

హావడి = ఆపద, ముచ్చిరి = శోకముగలవాఁడు, ముచ్చిరఁ = శోకింపఁగా, ఉచ్చలితమనస్కుఁడు = మిగులఁ జలించిన మనస్సుగలవాఁడు.

తా. అతిశయించినసంతాపముచే, సీతాదేవిని దలంచి రామచంద్రమూర్తి యుపద్రవపడి శోకింపఁగా లక్ష్మణుఁడు చలించినమనస్సుగలవాఁడై కలవరపాటు చెందెను.

## ౬౩-వ సర్గము.

ఆ. స్నేహమోహశోక ♦ నిస్తులసంతాప, భరము పేర్మిఁ దాను ♦ గరము కుంది
తనదుదుఃఖమునకుఁ ♦ దనయట్లతపియించు, ననుజుతోడ రాముఁ ♦ డనియె మఱియు.

ఇఁకఁ దాపమనెడి మదనావస్థ చెప్పఁబడును. స్నేహము = కామము, కరము = మిక్కిలి.

తా. ప్రియురాలిని స్మరించుటచేఁ గలిగినకామముచేతను ఆమెకుఁ గలిగిన యాపదను స్మరించుటచేఁ గలిగిన పరవశత్వముచేతను, ప్రియావిరహముచేఁ గలిగినశోకముచేతను, గలిగిన యసమానమైనసంతాపాతిశయముచేఁ దాను మిగులఁ శోకించి తనకు వచ్చినదుఃఖమునకుఁగాను దనవలెనే తాపము నొందుచున్న లక్ష్మణుతో రామచంద్రమూర్తి యిట్లనెను

క. శోకముపై శోకం బ,స్తోకము నాగుండె లవియఁ ♦ దూలించెడి; నీ
లోకంబున ననువంటిమ,హాకిల్బిషకారి గలఁడె ♦ యన్యుం డొకఁడున్. ౧౦౬౬

అస్తోకము = గొప్పగా, తూలించెడిన్ = చలింపఁజేయుచున్నది, కళవళ పడఁజేయుచున్నది, అవియన్ = పగులునట్లు, మహాకిల్బిషకారి = మహాపాపము చేసినవాఁడు. అన్యుఁడు = మఱియొకఁడు.

తా. శోకముమీఁదశోకము విశేషముగాఁ బ్రాప్తించి నాగుండెలు పగులునట్లు కళవళపడఁజేయుచున్నది. ఈలోకమునందు నావంటిమహాపాపి మఱియొకఁ డుండునా? ఉండఁడు.

ఇది మనుష్యస్వభావము. ప్రతిమనుష్యుఁడు తనకుఁ గష్టమువచ్చినపుడు తన కష్టమువంటికష్టము లోకమున నెవరికిని లేదు-అని చెప్పుచుండును. ఎవరికష్టము వారి కట్టులే తోఁచుచుండును. హరిశ్చంద్రునిదుఃఖములో సగముదుఃఖము శ్రీరామునకు లేదని రాములదుఃఖములో సగముదుఃఖము పాండవులకు లేదని నాబాల్యమున మాతండ్రి చెప్పుచుండ వినియుంటిని. ఒకవిధమున నదిసత్య మనియే తోఁచుచున్నది.

క. తొలిబామునఁ బాపుఁబను,లెలమిని నెన్నేనిఁ జేయ ♦ నీబామునఁ ద
త్ఫలమై చేకూరెను న,స్తులదుఃఖముమీఁద ఘోర♦దుఃఖం బిట్టుల్. ౧౦౬౭

తొలిబామునన్ = పూర్వజన్మంబునందు. భవశబ్దభవము బాము. "ఏ బాము లెఱుఁగక యేపాటుమేటికిఁ బసులకాఁపరియింట బాముగలిగె"—భాగ. ఎలమిని = సంతోషముతో, ఎన్నేనిన్ = ఎన్నియో-లెక్కలేక.

తా. పూర్వజన్మంబునందు నేను విస్తారముగ నెన్నియో పాపకార్యములు చేసినకారణముచే నీజన్మమునందు వానిఫలముగ పెద్దదుఃఖముమీఁద దుఃఖ మీరీతిఁ బ్రాప్తించెను.

చ. అనుపమరాజ్యనాశము, హి♦తాప్తవియోగము, తండ్రిచావు, నా
జననిని బాసి వచ్చుటయు ♦ సర్వము దేహము నిర్దహింపఁగా
వనగతదేహకష్టము నె♦వంబున నన్నిటి విస్మరించితిన్
వనితను బాయ నింధనవి♦వర్ధితవహ్నియ యయ్యెఁ గ్రమ్మఱన్. ౧౦౬౮

దుఃఖపరంపర చెప్పుచున్నాఁడు—అనుపమ = అసమానమైన, రాజ్యనాశము=రాజ్యము లభింపకపోవుట, హితాప్తవియోగము = నామేలుగోరు ముఖ్యబంధువుల నెడఁబాయుట, నిర్దహింపఁగాన్ = విశేషముగఁగాల్పఁగా, ఇచ్చట నిర్ అను నుపసర్గము ధాత్వర్థమునకు విశిష్టత్వమును గల్పించుచున్నది. 'ఉపసర్గేణ ధాత్వర్థో బలా దన్యః ప్రతీయతే। ప్రహారాహార సంహార విహార పరిహార వత్ ॥ ధాత్వర్థం బాధతే కశ్చిత్కశ్చిత్త మనువర్తతే। తమేవవిశినష్టన్య ఉపసర్గగతిస్త్రిధా॥,' యని యుపసర్గలక్షణము. నిర్దయమన్నప్పుడు ధాత్వర్థమున బాధింపఁబడెను. నిరుద

రుఁడు = అల్పమైనయుదరముకలవాఁడు. ఇట్టులే సందర్భానుసారము గ్రహింపనగు. వనగతదేహకష్టము=అడవియందనుభవించు దేహముయొక్క కష్టము, నెవంబున= నెపము రూ. నెవము. సాకు = మిష, విస్మరించితిన్=మఱచితిని, ఇంధన = కట్టెలచే, వివర్ధిత = మిగుల వృద్ధిచేయఁబడిన, వహ్ని = అగ్నిహోత్రము.

తా. ఒకటివెంట నొకటిగ వచ్చినకష్టము లేవి యనెదవా? చెప్పెద వినుము. మొదటిది న్యాయ్యముగ నాకు రావలసినరాజ్యము నాకు రాకపోవుట-ఆకారణమున నామేలుగోరు ముఖ్యబంధువుల నెల్ల వదలుట - నానిమిత్తమై తండ్రి చచ్చుట తల్లిని దిక్కులేనిదానిని జేసి నేను వచ్చుట యివియన్నియు దేహమును గాల్చుచుండెను గాని యడవులలోఁబడు దేహకష్టము నెపంబున నవన్నియు మఱచితిని. ఇప్పుడు భార్యను బాయుటచే నవన్నియు స్మరణమునకు వచ్చి కుములుచున్నయగ్నికిఁ గట్టెలుచేర్చినట్లయి భగ్గని మండు నట్లయ్యెను.

క. అసురుం డెవ్వఁడొ జానకిఁ, బ్రసభంబునఁ దిగిచి పట్టి ♦ పాఱఁగ దివి సా
ధ్వసమున నపస్వరంబున, దెసమాలినభంగి నేడ్వ♦దే కోమలియున్. ౧౦౬౯

ప్రసభంబునన్ = బలాత్కారముగ, తిగిచి = ఈడ్చి, సాధ్వసమునన్ =భయముతో, అపస్వరంబునన్ = మాఱుగొంతుతో, దెసమాలినభంగిన్ = దిక్కులేనిదానివలె-ఇది యెట్లు రాముఁ డూహింపఁగలిగెననిన:-ఆశ్రమమందుఁ బదార్థములన్నియుఁ జెదరినట్లు విసరిపాఱవైచిన ట్లుండుటచే బలాత్కారముగ గ్రహించినట్లూహింపనగును. చంపుటకు వచ్చినవాఁడైనచో నందే చంపియుండును. నెత్తురో శవమో కానవచ్చియుండును. కావున వచ్చినవాఁడు ఆమెను జంపవచ్చినవాఁడు కాఁడు. నేలమీఁదఁ బోయియుండిన మంటియందుఁ గాళ్లజాడలు కానవచ్చియుండును. అవిలేవు. కావున నాకాశమార్గముననే పోయియుండును. దుస్సహాశోకసమయమునఁ గావున డగ్గుత్తికచే గొంతు మాఱియుండును. మనకు విరోధులు రాక్షసులే కావున రాక్షసుఁడే యీపని చేసియుండును.

తా. రాక్షసుఁ డెవ్వఁడో బలాత్కారంబున నీడ్చి పట్టుకొని యాకాశమునఁ బరువెత్తఁగా భయపడి సీతాదేవి మాఱుపడినగొంతుతోదిక్కులేనిదానివలె నేడువకుండునా ?

క. లోహితచందనలిప్తము, లై హృద్యము లైనసీర♦జాక్షీకుచముల్
లోహితధారలు గాఱ న,యో హతకుం డెవఁడొ పీక ♦ నొప్పఱ కున్నే. ౧౦౭౦

లోహితచందనలిప్తములై =ఎఱ్ఱనిశ్రీగంధముతోఁబూయఁబడినవై, హృద్యములైన = మనోహరము లయిన, లోహితధారలు = రక్తధారలు, హతకుండు= దుష్టుఁడు.

తా. బలవంతముగఁ దీసికొనిపోయి యేమి చేయఁగలఁడు? వశపఱుచుకొనుట సాధ్యముకానికార్యము కావున నాకోపముతోఁ జంపియుండును. చంపి యెఱ్ఱచంద

నముతోఁ బూయఁబడిన వపుటచే మనోహరములయిన యామెకుచములను నెత్తురు ధారలు కాఱునట్లు దుష్టుఁడెవఁడో పీకఁగా నందము చెడియుండునుగదా.

క. ఆమృదుమధురాలాపం, బామేచక కేశభార ♦ మారుచిరం బై
గోముగొను మోము రాహువు, చే మిడికెడు సోముపగిదిఁ♦ జెన్నఱ కున్నే. ౧౦౭౧

మేచక కేశభారము = నల్లని వెండ్రుకల గుంపు.

తా. మృదువులై తియ్యనైన యామాటలు, ఆనల్లని వెండ్రుకలు, అందమైన ముద్దులుకాఱుముఖము రాహువుచేఁ జిక్కి దుఃఖపడుచంద్రునివలెఁ గాంతిహీనమై యుండునుగదా.

సీ. తారహారవిహార♦హారికంధరఁ జీల్చి, నెత్తురు ద్రావిరో ♦ నీచమతులు
నే నొంటి విడిపోవఁ ♦ గానలో రాక్షసుల్, హింసింపఁ గురరినా ♦ నేడ్వకున్నె
యిదియ గోదావరి ♦ యిది ప్రియురాలికి, నతులితప్రియ మిందు♦నరుగుదెంచు
దినము దినం బిట ♦ వనజాక్షి యుండునే, యుండదు రా దెప్పు ♦ డొంటి నిటకు

ఆ. నీశిలామనోజ్ఞ ♦ దేశంబునందు ను, దారశీల మున్ను ♦ దా వసించి
కాంతహాస నవ్వు♦గదుర నీతోఁ బలు,మాట లాడెనాస♦మక్షమందు. ౧౦౭౨

తారహారవిహారహారికంధర—తారహార = ముత్యాల సరములయొక్క, విహార = సంచారముచే- అనఁగా కదలుటచే; హారి = మనోహరమైన, కంధరక్ = మెడను, (కం + ధర = శిరస్సును ధరించునది) కురరి = ఆఁడు లకుముకిపక్షి, ఉదారశీల = త్యాగస్వభావముగలది, మున్ను = పూర్వము, కాంతహాస = మనోజ్ఞమైననవ్వుగలది.

తా. ముత్యాలహారములు వ్రేలాడుమెడను జీల్చి నీచమనస్సు గలవారు నెత్తురు ద్రావిరేమో? నేనొంటిగా నడవిలో విడిచిపోయినకారణమున రాక్షసులు హింసింపఁగా, నాఁడులకుముకివలె నేడ్వకుండునా? ఇది గోదావరి. దీనియందు సీతకు మిగులఁబ్రేమ. ఇచ్చటికిఁబ్రతిదినము వచ్చుచుండును. ఇందున్నదేమో? ఉండదు. ఏలన నెన్నఁడొంటిగా వచ్చినదిగాదు. లక్ష్మణా! ఈబండచే నింపైన ప్రదేశమునందు-ఉదారశీల = అయోధ్యయందుండుసమయమున సీత యత్తమామలవలనిభయముచేఁ దనభర్తతోడ సరసలీలావిహారములలో సంకోచించియుండును. అదియునుగాక యయోధ్యయందు రామచంద్రమూర్తి పితృసేవకని, మాతృసేవకని, పినతల్లులవిచారణమునకని, భృత్యవిమర్శకుఁ గార్యాంతరముల సంచరించుచుండి యే కొంచెముకాలమో యంతఃపురంబున నుండువాఁడు. ఆకారణముచే సరసలీలా విహారసంభాషణములు మితములయియే యుండును. ఈకారణముచేతనే శ్రీరఘురామచంద్రుఁడును సీతను గూడియని సీత కప్రాధాన్యమీయఁబడెను. (బాల ౧౩౬ ర ప.). ఇప్పుడన్ననో సీతారాముల కిరువురకు నితరకార్యములు లేమిని వియోగములేదు. విజనస్థలము కావున నేకాంతముగ నుండుటంబట్టి సరసవిహారసౌఖ్యములను శ్రీరామునకు సంపూర్ణముగ నడ్డుగోడులేక యిచ్చుచున్నదని భావము.

మున్ను శిలామనోజ్ఞదేశమందుఁ దా వసించి=రామచంద్రమూర్తి సీతాదేవితో గోదావరీజలములందు జలక్రీడ నారంభించి బహుకాలము జరిపి యందు గాసిపడి యొడ్డునకుఁ బోవనెంచి యొకశిలామార్గమునఁ బోవ యత్నించెను. ఇంగితజ్ఞానముగల సీతాదేవి యాయనచూపులచేతనే యాయనభావము గ్రహించి యింకను రామచంద్రుని శ్రమపఱుపఁ దలఁచి యాయన పోవఁదలఁచిన రేవునఁ దాను బూర్వమే యెక్కి యొడ్డునకు రాకుండునట్లు ఆయన దేహమూలరాతిమీఁదఁ గాలుపెట్టఁబోవుచున్నాఁడో యారాయి కనఁబడకుండునట్లు ముఖముమీఁద జల్లు పోరాడఁగాఁ దప్పటడుగుపడెను. ఈవిధముగ నన్నుఁగూడ సీత లీలావిహారములందు జయించెను గదా యని భావము.

కాంతహాస = అనుకొన్నచోట నడుగుపెట్టలేక తప్పటడుగుపెట్టిన నన్నుఁజూచి సీత నవ్వెను. నవ్వుకదుర=ఈజలకేళియందుఁ దాను జయించితి నని యధికసంతోషముకలదై.

నాసమక్షమందు నీతో పలుమాటలాడెక్-లక్ష్మణా నేనెన్నఁడును నెచ్చటను పరాజయమొందినది లేదు. నేఁడు స్త్రీచేఁ బరాభవింపఁబడితినిగదా యని యవమానముచేఁ దలవంచుకొనియుంటిని. కావున నన్ను వదలి సీతాదేవి నీతో మాటలాడ నారంభించె నని భావము.

పలుమాటలాడెక్=మీ రన్నదమ్ము లిరువురు హేమాహేమీలు, ఘటాఘటీలు, జగజ్జెట్టులు మీరు పట్టినపట్టు జయింప సామర్థ్యముకలవారుగదా. నేనో యాఁడుదానను. అబలను. మీరు వేట కని యుద్ధమున కని పలుమాఱు పోవుచుండువారు. నే నంతఃపురము విడిచి వెలుపలరానిముగ్ధను, సుకుమారిని. ఇట్లుండ నాఁడుపిల్లనగు నాచే మీయన్న పరాజయము పొందెను గదా లక్ష్మణా యని యిట్టి సరసోక్తులు నాయెదుటనే నిన్ననెనుగదా.

నాసమక్షమంద-'తోడుతోనైన నందనుతోడనైన నోంటిపాటున భాషించుటుడుగవమ్మ!' యన్నట్టు లొంటిగఁ బరపురుషులతో మాటలాడరాదు.

క. పద్మాస్య పద్మలోచన, పద్మములకు గౌతమికిని ♦ వచ్చెనొకో తా
సద్మంబు విడువ దెన్నఁడు, పద్మిని నేఁ డేకతంబ ♦ వచ్చునె యిటకున్. ౧౦౭౩

గౌతమికి = గోదావరికి, సద్మము = ఇల్లు, పద్మిని = శ్రీసీతాదేవి, ఏకతంబ = ఒంటిగా.

తా. పద్మములవంటి ముఖము, పద్మము వంటికన్నులు గలపద్మిని, సీతాదేవి పద్మములకై గోదావరికి వచ్చెనేమో? ఒంటరిగా నెప్పుడిల్లు విడువనిది నేఁడిచ్చటికి వచ్చునా? రాదు.

క. అసమసుమవిసరసరసము, భసలీకీరీవిహంగ♦భరితం బగునీ
కుసుమకుడుంగము డాసెనొ, పొసఁగదు సతి పిలికియొంటిఁ ♦ బూనునె రాఁగన్.

అసమ = అసమానమైన, సుమ = పుష్పముల, విసర = సమూహముచే, సరసము = అందమైనది, భసలీ=ఆఁడుతుమ్మెదలచేతను, కీరీ=ఆఁడుచిలుకలచేతను, విహంగ = పక్షులచేతను, భరితము = నిండినది, కుసుమకుడుంగము = పూలపొద, ''బంభరశ్చ, మిళిందశ్చ, హిందోళ, భసలాసమా॥''

తా. అసమానమైన పూలసమూహములచే నందమై ఆఁడుతుమ్మెదలు ఆఁడు చిలుకలు పక్షులు వీనిచే నిండిన యీపూఁబొదయొద్దకు వచ్చెనేమో? వచ్చియుం డదు. ఏలన నదిపిఱికి. ఒంటిగా వచ్చుటకు యత్నింపదు.

క. నీకుఁ బ్రమ్మొక్కెద భువనకృ, తాకృతసత్యానృతజ్ఞ! ♦ యాదిత్య! రవీ!
నాకాంత యెందుఁ బోయెనొ, యేకఠినుండేని కొంచు ♦ నేగెనొ చెపుమా.

ఇట్లు వెదకివెదకి యెందునుగానక జగచ్చక్షువు గావున సూర్యునకుఁ దెలిసి యుండవచ్చు నని తనవంశమునకు మూలమైనసూర్యు నడుగుచున్నాఁడు: భువన= లోకులచే, కృత = చేయఁబడిన, అకృత = చేయఁబడని, సత్య = సత్యమును, అసత్య = అసత్యము, జ్ఞ = తెలిసినవాఁడా, ఆదిత్య=సూర్యుఁడా, రవీ! నాభార్య యెందుఁ బోయెను? ఏక్రూరుఁడైనహరించెనా? చెప్పుము.

తా. రవీ! నీకు నమస్కారము. లోకమునందలి వారి సత్యప్రవర్తనము అసత్యప్రవర్తనము తెలిసినవాఁడవుగదా! నాభార్య యెందుఁ బోయెను? ఎవ్వఁ డైన నెత్తుకొని పోయెనా? చెప్పుము.

క. పవనా! నీయెఱుఁగనియది, భువనాళిని లేదు పొలఁతి ♦ పొలిసెనొ లేదే
నెవఁడైన హరించెనొ యీ,దవనీమలఁ జిక్కెనొటు ♦ తడయక చెపుమా.

తా. ఆకాశమున నుండెడిసూర్యుఁడు భూమిమీఁద గృహములలో జరుగు నవి చూచి యుండఁడేమో యని వాయుదేవుని బ్రశ్నించుచున్నాఁడు. పవనా = వాయుదేవా! నీకుఁ దెలియనిది లోకమునందు లేదు. సీత మరణించెనా, లేక యెవఁడైన హరించెనా? ఈయడవులలో నెందైనఁజిక్కువడి త్రోవ తెలియక చిక్కులఁబడినదా? జాగులేక చెప్పుము.

క. అని యీగతిఁ గౌసల్యా,తనయుఁడు పలవింప భూరి♦ధైర్యాన్వితుఁ డి
ట్లనుఁ గాలోచితవాక్యం, బనఘుఁడు లక్ష్మణుఁడు రాము♦నారట మడఁపన్.

తా. ఈప్రకారము రామచంద్రమూర్తి విలపింపఁగా మిగులధీరుఁడగు లక్ష్మణుఁడు రామునియారట మడఁపఁ గాలయోగ్యములగు మాటల నిట్లు చెప్పెను:

ఉ. శోకము మాన వన్న! వెత ♦ సొక్కి తపింపకు మన్న! ధైర్యముం
జేకొన వన్న! దీనతఁ గృ♦శింపకు మన్న! తలోదరీమణిం
బ్రాకటరీతి రోయుదము♦ ♦ రాఁగద వన్న! మహాత్ము లెందు స
న్తోకము గుంద రన్న! కడు♦మస్కరముల్ ఘటియించువేళలన్. ౧౦౭౮

తలోదరీమణిన్ = అఱచేయివలెనుండు కడుపుగలది, స్త్రీలలో శ్రేష్ఠురాలగు సీతను. దుష్కరముల్ = కష్టకార్యములు, ఘటియించు = చేయు.

తా. అన్నా! యేడువకుము. సంతాపముచే శుష్కించి తాపము చెందకుము. ధైర్యముగలవాఁడవు కమ్ము. శోకముచేఁ గృశింపకుము. స్త్రీరత్నమగు సీతాదేవిని వెదకుదము రమ్ము. మహాత్ములగువారలు కష్టకార్యములు చేయుటయందుఁ గొంచెమైనను శోకింపరు.

క. అని యీగతిని సుమిత్రాతనయుం డెన్నేవిధాల ♦ ధైర్యముఁ బలుకన్
విన నొల్లక దుఃఖించుచు, జనకసుతాధవుఁడు మఱియు ♦ సౌమిత్రి కనున్.

తా. ఈవిధముగ లక్ష్మణుఁ డెన్నివిధముల ధైర్యము తెచ్చుకొమ్మని సమాధానపఱిచినను నాయనమాటలు వినక దుఃఖించుచు లక్ష్మణున కిట్లనియె:

ఈ క్రిందివిషయము తిలకవ్యాఖ్యానమందు వ్రాయఁబడినది. ఈప్రకారము రామచంద్రమూర్తి యేడ్చుట చారులవలన విని రావణుఁడు మనుష్యుఁడేయని తలఁచునట్లు చేసి తనకు వధ్యుఁడగునట్లు చేయుటకే. బ్రహ్మాండపురాణమునఁనిట్లు చెప్పఁబడెను—స్త్రీపుంబలానుషంగాత్మా, దేహో నాస్యవిజాయతే। కింతునిర్దోష చైతన్యం, సుఖనిత్యాం స్వకాం తనుం। ప్రకాశయతిసైవేయం, జని ర్విష్ణో నచాపరా। తథా ప్యసురమోహార్థం పరేషాం చ క్వచిత్క్వచిత్। దుఃఖాజ్ఞానశ్రమాదీంశ్చ, దర్శయేచ్ఛుద్ధసద్గుణః। క్వవ్రణాదిక్వచాజ్ఞానంస్వతంత్రాచింత్యసద్గుణే। మోక్షాభావాయ తేషాంతు దర్శయత్తా నజో హరిః॥

స్త్రీపురుషులసంయోగమువలనఁ గలిగినదేహము భగవంతునకు లేదు. అయినను విష్ణుమూర్తియొక్క యితరావతార మేదియుఁ గాక యీయవతారము మాత్రమే దోషరహితమైన చైతన్యముగలదై నిత్యసుఖస్వరూపమైన తనశరీరమును బ్రకాశింపఁజేయుచున్నది. ఇట్టులుండియు రాక్షసులను నొక్కొకచో నితరులను మోహింపఁజేయుటకై దుఃఖము అజ్ఞానము శ్రమము మొదలైనవానిని శుద్ధసత్త్వుఁడు భగవంతుఁడు కనఁబడఁజేయును. ఇంతియకాని స్వతంత్రుఁడు ఇట్టివాఁడనిచింతింప సాధ్యముకానివాఁడునై సత్త్వగుణముగలవానియందు గాయము లెక్కడ? అజ్ఞాన మెక్కడ? అజుఁడైన విష్ణువు రాక్షసులకు మోక్షములేకుండఁ జేయుటకై యవి యిట్లు కనఁబడఁజేయును. దీనివలన రామచంద్రమూర్తియందు రావణునకు భగవంతుఁ డను బుద్ధిలేకుండఁ జేసి వానికి మోక్షములేకుండఁ జేయుటయే రామచంద్రునిశోకమునకు ఫల మని చెప్పఁబడెను. ఈవిధముగ రావణునిచే సీతను హరింపఁజేయుటయు, వానిపుణ్యాతిశయమును నాశముచేసి వాఁడు తనచేఁ జంపఁబడునట్లుచేయుటకే. ఆవిధముగ కేదారఖండమున “ మహాతా తపసా లబ్ధబలో రావణ స్తదధికతపోబలం వినా, జేతు మశక్యో దేవాశ్చ స్వయం తదధికం తపః కర్తు మక్షమా అత స్తేషాం కార్య మత్యంత మనుచిత సీతానుభాగమోహాను

వృత్తి సంపాదనేన రావణస్య తపోవీర్యభ్రంశం సంపాద్య కర్తవ్య మితి లక్ష్మ్యా సహ విచార్య తదర్థం విష్ణు స్సీతయా బ్రహ్మవిద్యయా సహావతీర్ణ ఇతి." గొప్పతపస్సు చేసి సంపాదించిన బలముగల రావణుని నంతకంటె నధికతపోబలము లేక జయింప సాధ్యముగాదు. దేవతలంతకంటె గొప్పతపస్సు చేయఁజాలరు. కావున మిక్కిలి యనుచితమైన సీతయందలి యనురాగము పుట్టించి దానిచే వానిని మోహితునిఁ జేసి వాని (రావణుని) తపశ్శక్తి నాశముచేసి దేవతలకార్యము చేయవలయు నని లక్ష్మీదేవితో నాలోచించి సీతతో బ్రహ్మవిద్యతోడ నవతరించెను అనియున్నది.

రామచంద్రమూర్తి మాయామానుషవేషధారి యనుట యంగీకరింప వలసినదే. అనఁగా నేయేసందర్భముల కర్మబద్ధులై జనించిన ప్రాకృతజను లెట్లెట్లు వర్తింతురో యట్లె శ్రీరామచంద్రమూర్తియు వర్తించె నని యర్థము. ఇప్పుడు భార్యయందుఁ బ్రీతిగలభర్త భార్యను బోఁగొట్టుకొనెనేని యెట్లేడ్చునో యట్లే డ్చెను. ఇవి వగలేడ్పులు-కన్నీరుకాఱలేదు - ఏడువలేదు. ఆవిధముగా మాయచేఁ గనఁబడినాఁడని కొందఱ యభిప్రాయము. కన్నీరుకార్చినది ఏడ్చినది సత్యమే కాని యది తామసశోకమువలనఁ గలిగినదికాదనియు సాత్త్వికదయాగుణముచేఁ గలిగెననియు మఱికొందఱవాదము. ఈవ్యాఖ్యాత యీ రెండవతెగకుఁ జేరినవాఁడు. ఇది వాల్మీకి యభిప్రాయానుసారము. మొదటిది యన్యగ్రంథానుసారము. రావణాసురుని మోస గించియైనను వానికి దుర్బుద్ధికలిగించి వానికి మోక్షము లేకుండఁ జేయవలయు ననుపట్టుదల భగవంతున కేల? వానికి మంచిబుద్ధి పుట్టించి శరణాగతునిఁ జేసి రక్షింప నేలసంకల్పింపరాదు? "యదివా రావణ స్స్వయం" ఈవచ్చినవాఁడు రావణాసురుఁడే యైనను నభయ మిచ్చితి ననిగదా రామచంద్రమూర్తి చెప్పెను. ఇతరగ్రంథములు చెప్పుమోసగుణమునకు వాల్మీకి చెప్పినయార్జవమునకు సంబంధనుగలదా? రావణునితపస్సు గొప్పది యనికదా చెప్పెదరు. రావణుతిపస్సు గొప్పదా? కార్తవీర్యార్జునునిబలము గొప్పదా? అప్పుడు నిట్టనిల్వున రెండుగఁ జీల్చియుండిన వీనితపస్సుగాని బ్రహ్మవరముగాని రావణుని రక్షింపఁగలిగియుండెనా? రావణుని వాలి తనచంకలోనే నలిపివేసియుండిన వీనితపోబలము బ్రహ్మవర మేమైయుండును? వీరిరువురకంటె భగవంతుఁడు తక్కువవాఁడయియా యీమాయోపాయము చేసెను? రావణునియందుఁ దమోగుణము ప్రకోపించుటచే వాని జారత్వదోషమే వానిని జంపఁ గాచియుండఁగా వానిని జంపుటకు వేఱే మాయోపాయము చేయవలయునా? తవుడు తిని చచ్చువానికి విషముఁబెట్టువాఁడు వెఱ్ఱివాఁ డన్నట్లు వానిసహజదుశ్చేష్టలచేత వాఁడు చెడుచుండఁగా నీకార్యము లేల యని సందేహము బాధించెడిని.

జయవిజయులకు మూఁడవజన్మమందుఁగాని ముక్తి లే దనువిషయము భగవంతునకుఁ దెలియనిదికాదు. రావణకుంభకర్ణులది రెండవజన్మమే కావున ముక్తి

లేదు. ఇట్లులేని దానిని లేకుండఁ జేయ నిన్నిమాయవేషములు భగవంతుఁడు వేయనేల ?

భగవంతుఁడు రావణునకు మోక్షములేకుండఁ జేయుటకై వానికి దుర్బుద్ధి పుట్టించి వానిచే నొకయకార్యము చేయించి యదినెపముగా వానిని వధించెనేని దానివలన లోకము గ్రహింపవలసిన నీతిగేమి ? లోకశిక్షకై వచ్చినవాఁడుగదా రాముఁడు?

తిలకవ్యాఖ్యాత యభిప్రాయప్రకారము సత్యసీత యగ్నిలో దాఁగుటచే రావణుఁడు నీచోక్తులాడినది మాయాసీతనే. ఈమాయాసీత రామునిభార్యగాదు కదా-అటులుండ రావణునకు దోషమెట్లు కలిగెను ? ప్రతిబింబమును హరించిన మూలమూర్తిని హరించినదోషము వచ్చునా?

లక్ష్మిదేవి సహాయురాలుగా వచ్చి రావణవధయందామెచేసినసాహాయ్య మేమి? మూల దాఁగియుండుటయా?

భుజబలమునందు సస్త్రబలమునందుఁ దపోబలమునందు రావణునికంటె నింద్రాదులు హీనులుగారు. బ్రహ్మవరమున వాఁడు బలిష్ఠుఁడు. దాని నింద్రాదులు మీఱఁజాలరు. యముఁడు దండమెత్తినపుడు బ్రహ్మ యేమి చెప్పెను?

## ౬౪-వ సర్గము.

శా. పోమ్మా లక్ష్మణ! గౌతమీనదికి నా♦పూఁబోణి పోనోపుఁ బ
ద్మమ్ముల్ గోయఁగ నన్న లక్ష్మణుఁడు స్రో♦తస్తీరముం జేరి సీ
తమ్మా! యోవదినా! యటం చఱచి ప్ర♦త్యాలాప మాలింపలే
కమ్మార్గంబున నెల్ల రోసి కమలా♦స్యం గాన కవ్వార్తయున్.   ౧౦౮౨

స్రోతస్ + తీరముౘ = నదియొడ్డు, ప్రత్యాలాపము = బదులుమాట, రోసి = వెదకి.

తా. లక్ష్మణా! నీవు గోదావరికిఁ బొమ్ము. అక్కడ సీతాదేవి పద్మములు గోయుటకై పోయియుండును అని చెప్పఁగా లక్ష్మణుఁ డట్లే గోదావరితీరము జేరి యోసీతమ్మా యోవదినా యని యఱచి బదులు మాటవినక యామార్గమంతయు వెదకి కమలముఖిని గానక యావార్తను

క. రామునకుఁ దెలిపి యిట్లను, నామహిళారత్నమున్న♦యడ పొడ గానక్
భూమిజ పలుకదు పిలిచిన, నా మహీపసుతుండు దాన♦ నదినిం గనుచున్.

అడ = ఆకారము, పొడ = జాడ, చిహ్నము, గానక్ = చూచినవాఁడ నుగాను, 'అడపొడగానరాక తెగటాఱియు', నను పెద్దనప్రయోగమునందు, అడ + పొడ గానరాక యనిఛేదించిరి. ఇది తప్పని చెప్పవలనుపడదుగాని వాడుక యందు వాఁడు అడపొడ లేకపోయినాఁడు, వానిఅడలేదు పొడలేదు, అని చెప్పుట గలదు. పొడ అనఁగా గుర్తు-మచ్చ-చిహ్నము. కావున అడపొడగానరాక యున్న

ప్పుడు రూపముగా నరాలేదు. పోయినజాడయుఁ దెలియలే దని యర్థము గ్రహిం చుట బాగని తోఁచుచున్నది.

తా. రామచంద్రమూర్తికిఁ దెలిపి యిట్లనియె-ఆసీతాదేవి యాకారము కనఁబడలేదు. ఆమె యెందుఁ బోయినదో జాడయుఁ గనఁబడలేదు. పిలిచినను సీత పలుకలేదు. అని చెప్పఁగా రామచంద్రుఁడు నదిని జూచి

క. తల్లీ! గోదావరి! నా,పల్లవపద సీత యిందు ♦ వచ్చెనె చెపుమా
హల్లకపాణి యె టేగెనో, యెల్లాఁపి హరించెనో క్కొ ♦ యెవ్వం డైనన్. ౧౧౮౨

పల్లవపద = చిగురువంటి పాదములుగలది, హల్లకపాణి = చెంగలువవంటి చేయిగలది, ఎల్లాఁపి = దొంగ,

తా. తల్లీ గోదావరీ! చిగుళ్లవంటి కోమలములైన పాదములుగల నా సీత యిచ్చటికి వచ్చెనా? మఱి యెచ్చటికైనను బోయెనా? దొంగ యెవఁడైన వచ్చి హరించికొని పోయెనా? చెప్పుము.

చ. అనవుడు భూతకోటి చెపు ♦ మా చెపుమా యని యెంతచెప్పినన్
మనుజవరుండు వేఁడినను ♦ మానముఁ దాల్చె సురారిభీతి నా
ధుని; నది మాఱు పల్కు దిక ♦ దోయజలోచన యాశ లేద; త
జ్జనకునకున్ మదంబకును ♦ జానకి యే దన నేమి చెప్పుదున్. ౧౧౮౩

భూతకోటి = భూతముల సమూహము, సురారిభీతి = రావణునివలని భయముచే, ధుని = నది.

> నద్యశ్చ పర్వతాస్సర్వే, ద్విరూపాశ్చ స్వభావతః।
> తోయం నదీనాం రూపంతు, శరీర మపరం తథా।
> స్థావరం పర్వతానాం తు, రూప కాయ స్తథాపరః।
> నదీనాం కామరూపిత్వం, పర్వతానాం తథైవచ।
> జగత్స్థిత్యై పురా విష్ణుః, కల్పయామాస యత్నతః॥

కాళికాపురాణము.

నదులకుఁ బర్వతములకు స్వభావముచేతనే రెండురూపములు గలవు. నదులకు జల మొకరూపము. రెండవది వేఱుగా నున్నది. పర్వతములకు స్థావరరూప మొకటి కలదు. వేఱుగా మఱియొక దేహము గలదు. నదులకుఁ బర్వతములకుఁ గామరూపిత్వము పూర్వము విష్ణువు జగత్తుస్థితికై కల్పించెను.

తా. అని రామచంద్రమూర్తి ప్రశ్నింపఁగా భూతములు రావణుఁడు హరించె నని చెప్పుము చెప్పుము అని యెంతచెప్పినను నది రావణుఁ డేమిచేయునో యనుభయముచే రామచంద్రమూర్తి ప్రార్థించినను జెప్పినదిగాదు. 'మ్రొక్కు దేవరకు వెఱతునా, మొట్టు దేవరకు వెఱతునా?' అని సామెతకలదు కదా. ఇట్లు నది

హానము వహించుటచే నిఁక సీతాదేవి లభించునని యాశలేదు. ఇఁక సీతతండ్రి నా తల్లి సీత యేదని యడిగిన నేనేమని చెప్పుదును?

క. ఘోరిణిఁ గోల్పడి వన్యా,హారంబులఁ గడుపు నించు♦నగచా ల్లెల్లన్
దూరంబుగ నెట్టెడియా,సారసదళనేత్రయెందుఁ ♦ జనియెనో వనిలోన్. ౧౦౮౪

తా. రాజ్యమును బోఁగొట్టుకొని యడవులలోఁ బుట్టిన కందమూలాదులచేఁ గడుపునించుకొను కష్టములన్నియు మనస్సునకు రానీయక కాపాడెడి యా కమలదళాక్షి యడవిలో నెందుఁబోయెనో?

క. ఏ మనుబంధులు లేమిని, రామను బెడబాసి జాగ♦రంబుల స్రుక్కన్
యామవతు లింక బహుళా,యామవతుల్ గావె లక్ష్మ♦ణా! యే మనఁగన్.

యామవతులు = రాత్రులు, బహుళ + ఆయామవతుల్ = మిక్కిలి దీర్ఘములు.

తా. సగతి యేమి యని విచారించి యాదరించు చుట్టములులేని కారణముచేతను సీతాదేవిని బాసి నిద్రలేకుండుటను రేలు మిక్కిలి దీర్ఘములుగాఁ గానవచ్చును గదా.

తే. అహహ జానకి నా కిపు ♦ డబ్బె నేని, యీజనస్థానమందాకి♦నీజలములఁ
బ్రస్రవణగిరిఁ గేల్గేల ♦ రాజిలంగ, నేఁకటలు వాయఁ దిరుగనే ♦ యింతితోడ.

కేల్గేలన్ = సీతాదేవిచేతిని నాచేత, ఏఁకటలువాయ = నాయపేక్షదీర, 'ఏఁకటవాయంగ భిక్ష లిడియెదరండీ' అని భీమఖండము, ౨ ఆ. మందాకిని=ఈ పేరుగల చిన్ననది యీప్రాంతమందుఁ గలదని చెప్పఁబడెను. కాని సమీపమందున్నగోదావరిని విడిచి యెక్కడనో యున్న చిన్ననదికి పోవుదు ననుటకంటె గోదావరి పంచగంగలలోఁ జేరినదగుటచే మందాకిని యనఁగా గోదావరి యని చెప్పుటే బాగని తోఁచినది. కావేరి, తుంగభద్ర, కృష్ణవేణి, గౌతమి, భాగీరథి, యివి పంచగంగలు.

తా. ఆహా! ఇపుడు గనుక నాకు జానకి లభించెనా యీజనస్థానమందుండు గోదావరీజలములందు కొండవంకలు దూఁకుచున్న ప్రస్రవణగిరియందును, సీతాదేవిచేతిని నాచేతఁ బట్టుకొని నాయపేక్షలన్నియుఁ దీర సంచరింపనా?

## అడవిమృగములు రామునకు సీతపోబడి సూచించుట.

సీ. కంటివే లక్ష్మణా! ♦ కాననమృగములు, సారెసారెకును నా♦చాయఁ జూచి
యేమియో చెప్పంగ ♦ నింగితం బెఱిఁగించు, చున్నవియెఱుఁగునో ♦ యువతిజాడ
మృగములారా! మీర ♦ లెఱుఁగుదు రే సీత,పోబడి యని బాష్ప♦ములు దొరంగ
శ్రీరాముఁ డడిగినఁ ♦ జివుకున నవి లేచి, దక్షిణముఖము లై ♦ తరలి మోర
ఆ. లాకసమున కెత్తి ♦ యామ్యదిక్కును బట్టి, వారిమోముఁ గనుచుఁ ♦ బఱువువాఱి
వానిబాసఁ దెలిసి♦వరమతి లక్ష్మణుం, డన్నతోడ నిట్టు♦లనియె నపుడు. ౧౦౮౫

మోరలు = ముఖములు, యామ్యదిక్కును = దక్షిణదిశను, భాస = అభిప్రాయము.

తా. లక్ష్మణా, చూచితివా! అడవియందలి మృగములు పలుమాఱు నా ప్రక్క చూచి యేమియోఁ జెప్పఁదలఁచినట్లు ముఖనేత్రవికారములు గనఁబడఁ జేయుచున్నవి. వీనికి సీత పోయినజాడ తెలియునేమో అని వానిని జూచి మృగములారా! సీతజాడ మీకుఁ దెలియునా యని కన్నీరుగార్చుచు నడుగఁగా నవి చివాలున లేచి దక్షిణదిక్కుగాఁ బ్రయాణమై తలలు పైకెత్తికొని రామలక్ష్మణుల ముఖములు చూచుచుఁ బరువెత్తెను. అప్పుడు లక్ష్మణుఁడు వానియభిప్రాయ మెఱిఁగి యన్నతోడ నిట్లనియె;

సీ. సీత యేదనుచుఁ బ్ర♦శ్నించిన నినుఁ జూచి, దివి భువి దక్షిణ♦దిక్కుగాఁగఁ
గానిపించెడిని మృ♦గములు నైఋతదిశ, పోదమా యాదెసఁ ♦ బోవు చోట
జానకి లభియించు♦నదుపాయ మబ్బదే, నావుడు లెస్సని ♦ నళిననేత్రుఁ
డనుగతలక్ష్మణుం ♦ డై యరుగుచు నెల్ల, రోయుచుఁ బోవుచోఁ ♦ ద్రోవలోన

తే. నేలపైఁ బుష్పచయములు ♦ రాలి యున్న
వడువుఁ గనుఁగొని దుఃఖిత♦స్వాంతుఁ డగుచు
వానిదెసఁ జూపి రఘువంశ♦వర్ధనుండు
తమ్మునకు నిట్టు లనియె గ♦ద్గదిక దనర.  ౧౦౮౭

నైఋతదిశ = దక్షిణమునకుఁ బడమరకు నడుమమూల, అనుగత = వెంట వచ్చిన, పుష్పచయములు = పూలసమూహములు, వడువు = విధము, దుఃఖితస్వాంతుఁడు = దుఃఖముగల మనస్సుగలవాఁడై, గద్గదిక = డగ్గుత్తిక.

తా. అన్నా! నీవు సీత యేది యని యడుగఁగా నిన్నుఁ జూచి మృగములు భూమి యాకాశము దక్షిణదిక్కుగాఁగఁ జూపుచున్నవి. (ఆకాశము రావణుఁడు పోయినమార్గము) దానికి సరిగా భువి వీరు పోవలసినమార్గము. మనము నైఋతిదిక్కుగాఁ బోదమా? చక్కఁగాఁ బోయిన గోదావరి దాఁటి పోవలసివచ్చును. కొంచెము ప్రక్కగాఁ దిరిగిపోయిన నే అడ్డమురాదు. కావున నట్లు పోదము. మన మామార్గమునఁ బోయితిమేని జానకి లభించుమంచియుపాయమేదైన దొరకకపోవునా — అని చెప్పఁగా రామచంద్రమూర్తి విని బాగున్నది యాలోచన యని లక్ష్మణుఁడు తన వెంటరాఁగా నన్నియు వెదకుచుఁ బోవునపు డొకచోట నేలమీఁదఁ బూవులు రాలియుంటఁ జూచి మిగుల దుఃఖముగలవాఁడై వానివైపు లక్ష్మణునకుఁ జూపి రఘువంశవర్ధనుఁడైన రామచంద్రమూర్తి డగ్గుత్తికతో లక్ష్మణుతో నిట్లనియె. సూక్ష్మాలంకారము.

క. కుసుమములు వనమున నేఁ,గోసి ధరాతనయ కీయఁ ♦ గోమలి ముడిచెఁ
భాసురవేణిని శ్వసన,హిమసూర్యులు కాచి రిట్లు ♦ మత్ప్రీతికి నై.  ౧౦౮౮

భాసురవేణిని = ప్రకాశించు జడయందు, శ్వసన,క్ష్మా, సూర్యులు = గాలి, భూమి, సూర్యులు, మత్ప్రీతికినై = నన్ను సంతోషపెట్టుకొఱకు.

తా. ఈ పువ్వులు నేను గోసి తన కీయఁగా సీత తనజడయందు ముడిచెను. ఇవి కొట్టుకొనిపోక దుమ్మునిండక వాడక యుండునట్లు నేను గుర్తించుటకై వాయువు భూమి సూర్యులు రక్షించిరి.

క. అనుచు మహాభుజుఁ డగులక్ష్మణుతో వచియించి ధర్మ♦సద్భావుం డ
ల్లనఁ జని ప్రస్రవణాకుల,ఘనశైలేంద్రంబుఁ గాంచి ♦ కరుణోక్తిననున్. ౧౯౫౦

మహాభుజుఁడు = గొప్పభుజములుగలవాఁడు. అనఁగా విశేషభుజబలముగల వాఁడు అని యర్థము. దీనిచేత శ్రీరామునకు తనబలపరాక్రమములేగాక బలవంతునిసాహాయ్యముకూడఁ గలదని భావము. ధర్మసద్భావుండు = ధర్మముతోఁ గూడిన మంచి యభిప్రాయముగలవాఁడు, గనుకనే పర్వతము ధ్వంసముచేయలేదని భావము. ప్రస్రవణ = కొండవంకలచే, ఆకుల = కలఁతనొందిన, ఘనశైలేంద్రంబు = గొప్పపర్వతశ్రేష్ఠమును, కరుణ+ఉక్తి = శోకముతోఁగూడిన మాటలచే.

తా. అని మహాభుజబలసంపన్నుఁడైన లక్ష్మణునితోఁ జెప్పి ధర్మముతోఁగూడిన మంచిభావముగల రామచంద్రమూర్తి మెల్లగఁ బోయి జలపాతముగల పెద్దకొండను జేరి వ్యసనముతోఁగూడినమాటలచే నిట్లనెను.

తే. అబల సర్వాంగసుందరి ♦ యవనిభృద్వ,రా!మనోహర మగువన♦రాజిఁ జూడఁ
బడియెనాసీతనీచేత ♦ విడువఁబడుట, నొంటి నాచేత నడయాడు♦చుండనిచట.

సర్వాంగసుందరి = ప్రత్యవయవము సుందరమైనది. అవనిభృద్వరా = పర్వతశ్రేష్ఠమా, వనరాజి = వనములసమూహమందు, నడయాడుచుండన్ = తిరుగుచుండఁగా.

## అన్వయక్రమము.

అవనిభృద్వరా యబల సర్వాంగసుందరి సీత మనోహరవనరాజి నాచేత నొంటి విడువఁబడుట నిచట నడయాడుచుండ నీచేతఁ జూడఁబడియెనా?

ఇది శ్రీరామచంద్రమూర్తి పర్వతము నడిగినప్రశ్న. ఇందుఁ జిత్రాలంకారముగలదు. ప్రశ్నయే ప్రత్యుత్తర మయ్యెనేని చిత్రాలంకార మనఁబడును. పశువులు, పక్షులు, చెట్లు ప్రతిధ్వనులీయవు. పర్వతముగావునఁ బ్రతిధ్వని పుట్టును. ప్రతిధ్వనియందు మన మఱచినధ్వనియే వినవచ్చును గాని మనమొకటి యనిన వేఱొక ప్రతిధ్వని పుట్టదు. కావున రామచంద్రమూర్తి చెప్పిన అబల సర్వాంగసుందరి యవనిభృద్వరా, ఇత్యాదివాక్యములే మరల వినవచ్చెను. వాల్మీకిప్రతిభావిశేషమిందుఁ గాననగు. ఇట్లు వినవచ్చిన ధ్వని రామచంద్రమూర్తి ప్రశ్నకుఁ బ్రత్యుత్తరమగుచున్నది, ఎట్లన.

అవనిభృత్ + వరా = రాజశ్రేష్ఠా. తక్కినపదములకు ముందరివలెనే యర్థము గ్రహింపవలెను. ఇప్పు డన్వయక్రమ మెట్టు లన—

ఓయవనిభృద్వరా (రాజా) అబల సర్వాంగసుందరి సీత నీచేత నొంటి విడువఁబడుట మనోహరవనరాజి నిచట నడయాడుచుండ నాచేతఁ జూడఁబడియె.

నీవు విడిచిపోయినసీతను నేనిచ్చటఁ జూచితి నని యర్థము-ఈశ్లోకమును గాళిదాసు తనవిక్రమోర్వశీయమందుఁ ననువదించెను. (ఈపద్యవిషయము పీఠిక యందుఁ గననగు.) అడుగఁబడిన ప్రశ్నకుఁ బ్రత్యుత్తర మభిన్నమగునేని చిత్రాలంకారము. దీనినే చిత్రోత్తరాలంకారము-చిత్రాలంకారము సంఘటించుట యొక గొప్పగాదు. ఏమహాకవియైనను వ్రాయఁగలఁడు. జటాయురావణులయుద్ధకాలమున సీత కొంతసేపిందుండుటయు పర్వతము ప్రతిధ్వనియిచ్చునని స్ఫురించుటయు, ఆధ్వనిని ప్రత్యుత్తర మగునట్లుచేయుటయు నిట్టిసందర్భోచిత ప్రతిభ కుదురుట సామాన్యవిషయముకాదు.

క. అనఁగఁ దనయట్ల పలికిన, వని క్షుద్రమృగంబుఁ గసరు♦పంచాస్య మనన్
వనరుహనయనుం డాగిరిఁ, గనుఁగొని యి ట్లనియె గెంపు♦ గదురం గనులన్.

అనఁగన్ = రామచంద్రమూర్తి యీప్రకారము ప్రశ్నింపఁగా, తనయట్ల = తానుజెప్పినట్లే, క్షుద్రమృగంబున్ = నీచమృగమును-అల్పమృగమును, కసరు = కోపించు, పంచాస్యమనన్ = సింహమోయనునట్లు, పంచాస్యము = వెడలుపయిన ముఖముగలది, వనరుహనయనుండు = కమలనేత్రుఁడు, కెంపు = ఎఱ్ఱనికాంతి.

తా. అని తాను జెప్పినమాటలే మరల వినరాఁగా నిర్లక్ష్యభావమునఁ దన్నుఁ బరిహసించుచున్నది యని కోపించినవాఁడై రామచంద్రమూర్తి యాపర్వతమును సింహ మల్పమృగంబును జూచినట్లు చూచి గన్నులెఱ్ఱనగాఁగా నిట్లనియె.

క. బంగారువన్నె గల నా,బంగరుబొమ్మను మృగాక్షిఁ ♦ బర్వతమా! చూ
పం గడఁగ వేని నాశం,బుం గావించెదను నెత్త♦ముల గిత్తములన్. ౧౦౯౩

బంగరుబొమ్మయనుటచే లావణ్యము చెప్పఁబడెను. నెత్తములన్ = కొండ మీఁద విశాలములైన ప్రదేశములను, గిత్తములన్ – ఇది నిందయందుఁ జెప్పునది.

తా. బంగారుకాంతియు మెఱపునుగల నాసీతను జూపఁ బ్రయత్నముచేయ లేని యోపర్వతమా నిన్ను నీనెత్తములను గిత్తములను నేలఁబడ మొత్తెదను.

క. అని పర్వతమును రాముఁడు,జనకసుతం గూర్చి యడుగ ♦ శైలంబు ప్రతి
ధ్వని నెపమున బదు లిడి యా,వనితామణిఁ జూప కున్న ♦ వసుధాధవుఁడున్.

తా. అని రామచంద్రమూర్తి జనకసుతను జూచితివా యని యడుగఁగాఁ జూచితినని ప్రతిధ్వని నెపమున బదులుచెప్పి యూరకుండఁగా రామచంద్రమూర్తియు,

క. మంచితనంబున సతి న,ర్పించిన సరి కాకయున్నఁ ♦ బృథివీధర! కా
రించెద శరముల మసి గా,వించెదఁ బాడగుము వేరు♦వెల్లంకుల్లతోన్. ౧౦౯౪

తా. మంచిమాటలచే నడిగినపుడు నీవు సౌమ్యమార్గమున సీతను సమర్పించితివా సరే-అటుచేయకపోతివా నాబాణములచే నిన్ను బాధించి నీవేరువెల్లంతులతోఁ గాల్చి బూదిచేసెదను.

క. చిగురుంబోణితెఱంగును, దగువిధమునఁ జెప్ప కున్నఁ ♦ దమ్ముఁడ! నదినీ
రిగిరించెద నని కినుకం, దెగఁ బల్కుచుఁ జూడ నొక్క ♦ దెస నేలపయిన్.

తా. సీతాదేవివృత్తాంత మీనది చెప్పకుండిన దీనిలోని నీళ్లంతయు నిగురఁజేసెదను అని కోపముచే సాహసించి పలుకుచు నందు వెదకఁగా నొకచోట నేలమీఁద.

-రాముఁడు సీతాదేవిభూషణాదుల నేలపైఁ జూచుట.-

చ. ఇట నట భీతి గొంచుఁ బరు ♦ వెత్తినజానకిపాదచిహ్నముల్
స్ఫుటముగ నామె వెన్కొనెడి ♦ సోఁకుల తేనివి పెద్దపాదముల్
త్రుటితధనూరథంబులును ♦ దూణియు నిందును నందు బ్రీలి యుం
డుట గని సంభ్రమించుచు న ♦ నుంగుసహోదరుతోడ నిట్లనున్. ౧౯౯-౭

స్ఫుటముగ = స్పష్టముగ, సోఁకులతేనివి = రాక్షసరాజువి, త్రుటితధనూరథంబులను = విఱిగిన విల్లుతేరును, తూణి = అంబులపొదియును, సంభ్రమించుచున్ = తొట్రుపాటుపడుచు.

తా. భయపడి యిక్కడ కక్కడకుఁ బరువెత్తినసీతవి చిన్నపాదములును ఆపాదములవెంబడి పోయిన రాక్షసునిపెద్దపాదములను విఱిగిపడిన ధనుస్సు, తేరు, అమ్ములపొదియును, నిచ్చటనచ్చటఁ బడియుండఁ జూచి తొట్రుపడుచు లక్ష్మణునితో నిట్లనియె.

సీ. చూడుమా లక్ష్మణ! ♦ సుదతి ధరించిన, జోమాలెపూసలు ♦ సొన్నసగలు
మాల్యముల్ ధరరాలె ♦ మహినిండఁ బైఁడిపూ, సలువోలెరక్తబిం ♦ దులురహించెఁ
గావున నాసతిఁ ♦ గామరూపాసురుల్, ఖండించి ఖండించి ♦ ఖండములుగ
భక్షించి రని యెంతుఁ ♦ బడఁతికై యిద్దఱు, పిరువీఁకులాడుచు ♦ బిరుదు లగుట

తే. రాక్షసులు తమలోన సం ♦ గ్రామమునకుఁ
దొడరి యిట్టి రటంచును ♦ దోఁచె నాకుఁ
గాక యుండిన నిచ్చోటఁ ♦ గార్ముకాది
ఖండములు రాలుటకు నేమి ♦ కారణంబు. ౧౯౯-౮

సొన్నసగలు = బంగారుసొమ్ములు, రక్తబిందులు = నెత్తురుచుక్కలు, కామరూప+అసురుల్ = కోరినరూపముధరింపఁగల రాక్షసులు, పిరువీఁకులాడుచున్ = సీతకొఱకై పెనఁగులాడుచు, బిరుదులు = సమర్థులు, సంగ్రామమునకున్ = యుద్ధమునకు, తొడరి = ఒకరినొకరు ఎదిరించి, కార్ముకాదిఖండములు = విల్లుమొదలైనవాని తునుకలు.

తా. లక్ష్మణా! సీతాదేవి ధరించిన జోమాలెపూసలు బంగారుసొమ్ములు నివె చూడుము. ఆమె ధరించియుండిన పూలదండలు నేలరాలినవి. నేలమీఁద బంగారుపూసలవలె నెత్తురుబొట్లు పడినవి. కాఁబట్టి కోరినరూపము ధరింపఁగల రాక్షసులు నాసీతను బట్టి తెచ్చి యిక్కడ తునుకలు తునుకలుగా నఱికి తిన్నవా రని తలంచెదను. అట్లైన నీవిల్లు లోనైనవి విఱిగి పడనేల యందువేమో? సీతానిమిత్తమై యిరువురు రాక్షసులు నాకు నాకని సుందోపసుందులవలెఁ గలహించి రని తోఁచుచున్నది. ఈవింటి తుంటలు లోనైనవి వారివే. అటుగాకపోయిన నిర్మానుష్యమైన నీయడవియం దిచ్చట నివి యిట్లు లుండుటకుఁ గారణమేమి గలదు?

క. కాంచనభూషాన్వితమై, చంచన్మణిమౌక్తికాది♦సంగతమై రా
జించెడివి ల్లెరిదో యీ,సంచున నిట విఱిగి పడిన♦చందం బెటులో. ౧౭౯

కాంచనభూషా + అన్వితమై = బంగారాభరణములతోఁ గూడినదై, చంచత్ + మణిమౌక్తికాది సంగతమై = మెఱయుచున్న రత్నములు, ముత్తెములు, మొదలయినవానితోఁ గూడినదై, ఈసంచునన్ = ఈవిధముగ.

తా. లక్ష్మణా! బంగారుసొమ్ములచే నలంకరింపఁబడి తళతళమెఱయు రత్నాలు ముత్యాలు గలిగియున్న యీవిల్లెవరిదో కదా! ఇది యిచ్చట విఱిగిపడి యుండఁ గారణమేమో?

క. తరుణార్కనిభము చామీ,కరకృతము విదూరజమణి♦ఖచితం బగుచున్
ధరణిపయిఁ దునుక లగుచును,దొరఁగిన యది కవచ మెవరి♦దో యనఁ గలవే.

తరుణార్కనిభము = లేఁతసూర్యునివంటి కాంతిగలది, చామీకరకృతము = బంగారుతోఁ జేయఁబడినది, విదూరజమణిఖచితంబు = వైడూర్యములచేఁ జెక్కఁ బడినది.

తా. లేఁతసూర్యునివలె నెఱ్ఱనైయుండునదియు బంగారుతోఁ జేయఁబడినదియు వైడూర్యములు చెక్కఁబడినదియు నయ్యు నేలమీఁదఁ దునుకలై పడిన యీకవచమెవరిదో చెప్పఁగలవా?

ఆ. శతశలాకమైన♦ఛత్రంబు దివ్యమా,ల్యోపశోభితంబు ♦ నుర్విమీఁద
భగ్నదండ మగుచుఁ♦బడియున్నది ట్లాట, కేమి హేతు వొక్కొ♦యెవరిదొక్కొ.

శతశలాకము = నూఱుకమ్ములుగలది, ఛత్రము = గొడుగు, దివ్యమాల్యోపశోభితంబు = శ్రేష్ఠములైనపూలదండలచేఁ బ్రకాశించునది, భగ్నదండము = విఱిగినదండముగలది.

తా. నూఱుకమ్ములుగలిగి మేలైనపూలదండలతోఁ బ్రకాశించునదియై పట్టుకొనుకఱ్ఱ విఱిగినదై యీగొడుగు భూమిమీఁద నిట్లు పడియుండ నేమి కారణము? ఇది ఎవరిది?

క. హేమతనుత్రాణంబులు, భీమాకృతు లురుతనువులు ♦ భీష్మపిశాచో
ద్దామాస్యంబులు ఖరములు, భూమండలిఁ దెరలె నెవరి ♦ వో యివి తలఁపన్.

హేమతనుత్రాణంబులు = బంగారుజీరాలు, భీమాకృతులు = భయంకరా కారములు, ఉరుతనువులు = గొప్పదేహములు, భీష్మ = భయంకరమైన, పిశాచోద్దామాస్యంబులు = పిశాచములముఖములవంటి పెద్దముఖములుగలవి, ఖరములు = కంచరగాడిదలు, తెరలెన్ = పడెను.

తా. బంగారుకవచములు, భయంకరాకారములు, పెద్దదేహములు, భయముగలిగించు పిశాచముఖములు గలకంచరగాడిద లిచ్చటఁ బడియుండనేల? ఇవి యెవరివి ?

సీ. దీప్తాగ్నినిభ మయి ♦ తేజరిల్లుధ్వజంబు, విఱిగినయదియు నే♦వీరునిదియొ
యగ్రముల్ దునిఁగిన ♦ యక్షమాత్రస్వర్ణ,పుంఖబాణంబు లే♦పురుషునివియొ
నించినబాణముల్ ♦ నించిన ట్లున్న వీ,దొనలను గంటివే ♦ తునిఁగి పడియె
నొకచేత ఖడ్గంబు ♦ లొకచేత సెలగోల, యొసఁగి సారథి చచ్చె ♦ నెవరివాఁడొ

ఆ. చెవులఁ గుండలములు ♦ శిరమునఁ బాగయుఁ, గొమరుమీఱ నేలఁ♦గూలినారు
చామరములు దాల్చు♦జను లిర్వు రిదెచూడు, మెవరివారొ వీరు ♦ హితచరిత్ర.

దీప్తాగ్నినిభము = మండుచున్నయగ్నితో సమానమైనది, అగ్రముల్ = కొనలు, అక్షమాత్ర = ఇరుసంతపొడుగై, స్వర్ణపుంఖ = బంగారుపిడిగల బాణంబులు. ఇరుసనిచెప్పుటచే శిల్పశాస్త్రప్రకార మెనుబదినాలు గంగుళములపొడుగని యేర్పడెడిని. నించినబాణముల్ = నిండించినబాణములు, దొనలను = అంబులపొదులను. దీనివలన నివి యక్షయబాణతూణీరములని యేర్పడుచున్నవి. సెలగోల = కొఱడా – చబుకు.

తా. మండుచున్నయగ్నితో సమానమై ప్రకాశించు టెక్కెము విఱిగిపడినది. ఇది యేవీరునిదో? ములుకులుండుకొనలు విఱిగి యిరుసుపొడవుగలవై బంగారుపిల్లుగలిగిన యీబాణము లెవరివో? ఈపొదులందు బాణములు నిండించినవి నిండినట్లే యున్నవి. వెలితిపడలేదు. తునిఁగిపడియున్నవి. ఒకచేతఁ బడ్గములు నొకచేతకొఱడా పట్టుకొని సారథి చచ్చిపడియున్నాఁడు. వీఁ డెవనిసారథియో? చెవులందుఁ గుండలములు తలమీఁద పాగా కలవారై చామరములు పట్టుకొన్నవా రిరువురు నేలఁబడియున్నారు. వీ రెవరివారో?

జటాయువుచేఁ ద్రుంపఁబడిన పదార్థములన్నియుఁ దెలుపఁబడినవి. కాని యిందుఁ దెగిపడిన రావణాసురుని చేతులు చెప్పఁబడలేదు. దానివలనఁ గాండీవము నల్లెత్రాటివలెఁ దెగిపడిన చేతులే మరలఁ గలచుకొనె ననియెంచవలసియున్నది.

-- రాముఁడు దేవతలపైఁ గోపించి జగత్సంహారముఁ జేయఁ బూనుట. --

ఉ. ఈవిధ మంతయుం గనఁగ ♦ నెవ్వఁడొ రాక్షసుఁడే యి టీవనిక్
నావనితక్ హరించె నని ♦ నాకు నిజంబుగఁ దోఁచెఁ దమ్ముఁడా
యీవలఁ గేమొలే యనుచు ♦ నెంచితి నిం కిట జీవితాంతకం
బై విడరానిసూడు దను♦జావళితో ఘటియిల్లె దీనిచేన్.　　౧౧౦౪

జీవితాంతకము = ప్రాణముపోవువఱకుండునది, సూడు = పగ.

తా. ఇక్కడ జరిగియుండువిషయ మంతయు నాలోచింపఁగా నెవ్వఁడో రాక్షసుఁడే యీప్రకార మీయడవియందు నాభార్యను హరించె నని నిజముగాఁ దోఁచుచున్నది. ఇంతవఱకు సీతయే తనంతటఁ దానే యెందైనఁ బోయెనో, మృగములే భక్షించెనో, మాంసార్థియైన బక్కరాక్షసుఁ డెవఁడైన హరించెనో యని యెవరియందును నిందమోపలేక యెట్లు పోయినదో యేమో యని యుపేక్షనహించియుంటిని. ఇఁక నిక్కడిస్థితిఁ జూడ బలిష్ఠుఁడైన రాక్షసుఁడే విరోధబుద్ధిచే నాకపకారముచేయఁగోరి సీతను హరించె నని తోఁచుచున్నది. కావున మనకు రాక్షసులతో ప్రాణాంతకమైన విరోధము కలిగెననుట నిశ్చయము.

క. హృతయో మృతయో సతి భ,క్షితయో రాక్షసులచేత ♦ క్షితిసుత రక్ష
స్తతిచేతఁ జిక్కఁగా న,క్షతధర్మం బైనఁ గావఁ ♦ జాలదు కంటే.　　౧౧౦౫

హృత = పట్టుకొనిపోఁబడినది, మృత = చంపఁబడినది, భక్షిత = తినఁబడినది, రక్షస్తతిచేత = రాక్షససమూహముచేత, అక్షతధర్మము = నేననుష్ఠించుకొంటఁతలేనిధర్మముకూడ.

తా. రాక్షసులు సీతాదేవిని హరించి యెందైన దాఁచియయిన నుంచి యుండవలయును, లేక యామె చచ్చియైన నుండవలెను, లేదా రక్షస్సులు తిని యైన నుండవలయును. ఇందేదియో యొక్కటి జరిగియుండుట సత్యము. ఇట్లు రాక్షసులు బాధపెట్టఁగా అస్ఖలితముగ ననుష్ఠింపఁబడుచున్న ధర్మమైనను రక్షింపదుగదా! ధర్మోరక్షతిరక్షితః-ఆపత్సురక్షకోధర్మ యని, ధర్మము తన్ను రక్షించువారిని రక్షించు ననుటయు సరిగాదుగదా! తనయిష్టము వచ్చినపుడు తనయిష్టము వచ్చినవారిని రక్షించునేగాని సర్వత్ర సర్వజనులను సర్వవిధములఁ బ్రతిసమయమందును రక్షించు ననుట సత్యమని నమ్మరాదు.

క. క్షితిసుత యపహృత యై భ,క్షితగా సౌమిత్రి సురలు ♦ కెలసము దీర్పక్
మతి గొనరు వీరె నాకప,కృతిఁ జేసియు క్షేమముగను♦ గెరలెడివారల్.　　౧౧౦౬

క్షితిసుత = భూపుత్రి, అపహృతయై=అపహరింపఁబడినదై, భక్షితగాక్ = భక్షింపఁబడినదియగుచుండఁగా, కెలసము = కార్యము, మతిగొనరు = ఇష్టపడరు, అపకృతి = అపకారము.

తా. రాక్షసు లీప్రకారము సీతను భక్షించుచుండ, లక్ష్మణా! ధర్మఫలదాత

లగు దేవతలైనను నక్కఱవేళ నాదుకొనఁ దలఁపరై రికదా! కావున వీరును నా కపకారము చేసినవారే. వీరిట్లు నాశత్రువుల కనుకూలురై నాకు నపకారము చేయఁ బూని సుఖపడఁగలరా?

ఆ. భువనసంఘములను ♦ బుట్టింపఁ బొలియింప, శక్తి గలిగి కరుణ ♦ సాధు వైన
యట్టిపురుషు లక్ష్మ♦ణా! యెల్లవా రవ,మానపఱుచు వారు ♦ జ్ఞాన మేది. ౧౧౦౭

భువనసంఘములను = లోకసమూహములను, పొలియింపన్ = సంహరించుటకును, జ్ఞానమేది = జ్ఞానములేక.

తా. దేవతలు ధర్మపక్షమువారుగదా! వారేల నీ కపకారముచేసెద రందువా? లక్ష్మణా! బ్రహ్మాండకోటులను బుట్టింపను గిట్టింపను శక్తిగలిగియు నట్టి శక్తిచూపక దయచే సాధువగువానిని జ్ఞానములేనికారణమున ధర్మపక్షమువారు నధర్మపక్షమువారు నందఱు నవమానపఱచువారే. శిష్టులు శిష్టులచేతనే పూజింపఁ బడుదురు. దుష్టులు సర్వత్ర పూజింపఁబడుదురు. కేవలశుద్ధసాత్త్వికులగువారిని మిశ్రసాత్త్వికులుకూడ నధిక్షేపింతురు. అసూయపడుదురు. అపకారముకూడఁ జేయుదురు. జగత్సృష్టిసంహారశక్తి నాయందుండినను దయను బురస్కరించుకొని సాధువృత్తినుండుటచే కేవలతామసులు రాక్షసులేగాక మిశ్రసాత్త్వికులు దేవతలుకూడఁ జులుకన చూతురు.

క. లోకహితయుక్తు సాధువుఁ, బ్రాకటకరుణాత్ము దాంతు ♦ బలహీనునిఁగా
లోకంబు దలఁచు సత్యము, నాకథ యిపు డట్టిదయ్యె♦నాయన వింటే. ౧౧౦౮

లోకహితయుక్తున్ = లోకమునకు మేలుచేయుతలంపుతోఁ గూడినవానిని, సాధువు = అపకారముచేయక నుపకారమేచేయువానిని, ప్రాకటకరుణాత్మున్ = స్పష్టముగాఁగరుణతోఁగూడినమనస్స్వభావము గలవానిని, దాంతున్ = ఇంద్రియనిగ్రహముగలిగి శాంతిపరుఁడైనవానిని, బలహీనునిఁగా = బలములేనివానిఁగా లోకము తలఁచును.

తా. లోకమునకు మేలుచేయఁగోరి యేకారణముచే నెవ్వరికి నపకారముఁ గోరక మెత్తనివాఁడై మిక్కిలిదయయే స్వభావగుణముగాఁ గలవాఁడై యేకారణముచే శాంతుఁడైనవానిని, లోకము వీఁడు బలహీనుఁడు కావున నా లోపమును గుణముగాఁ గనఁబడునట్లు నటించుచున్నాఁడుగాని సామర్థ్యము కలిగి యూరకున్నవాఁడు కాఁడని లోకముఁ దలఁచి యాదరింపదు. ఇది సత్యము. నా చరిత్ర మిప్పుడిట్టిదే యయ్యెను. సంహారశక్తి, దండించునధికారము గలిగియు దానిని వెలిపెట్టక మేలే చేయవలయు ననిపూనిన కారణముచే సురాసురు లిరువురు నన్ను దుర్బలుఁడగుటచే సాధువువలె నటించుచున్నాఁ డని తలంచుచున్నారు.

హ్రీరమ్యున్ జడుఁగాఁగ, సువ్రతుని మాయింగా, శుచిం దంభిగా। సూరున్ నిర్దయుఁగా మునిన్ విమతిఁగా శ్రోత్రప్రియాలాపు ని।స్సారుంగా, బలవంతు గర్వి

తునిఁగా, సర్వోక్త వాచాలుఁగాఁ!, గ్రాసం జెన్ని సుధీగుణంబు, దురితారూఢంబుఁ జేయుంగదా".—భర్తృ.

ఏకః క్షమవతాం దోషో, ద్వితీయో నోపపద్యతే।
యదేనం క్షమయాయుక్తం, మశక్తం మన్యతే జనః॥ భార. ౫-౩౩-౪౮.
క్షత్రియాణాం బలం తేజో, బ్రాహ్మణానాం క్షమాబలమ్।
క్షమమాణం నృపం నిత్యం, నీచః పరిభవే జ్జనః।
హస్తియంతా గజస్యేవ, శిర ఏవా రురుక్షతి।
క్షమా గుణో హ్యశక్తానాం, శక్తానాం భూషణం క్షమా।
క్షమా ప్రశస్యతే లోకే, నతు పాపోర్హాతి క్షమామ్।
క్షమావంతహి పాపాత్మా, జితోయమితిమన్యతే।
క్షమావాన్ నిరమర్షశ్చ నైవస్త్రీ నపునః పుమాన్॥

క్షమగలవానిని లోకు లశక్తుఁ డందురు. ఆయొక్కదోషముతప్ప రెండవ దోష మతనియందు లేదు.

క్షత్రియులకుఁ దేజస్సు బలము. బ్రాహ్మణులకు క్షమ బలము. సర్వదా క్షమయే గలరాజును నీచులు పరిభవింతురు. ఏనుఁగు క్షమగలదగుటచే మావటివాఁడు తలపై కెక్కుచున్నాఁడు. అశక్తులగుణము క్షమ. శక్తుల కది భూషణము. క్షమ లోకమునఁ బ్రశంసింపఁబడునుగాని పాపులను క్షమింపరాదు. పాపాత్ములు క్షమ గలవానిని జూచి మనమే గెలిచితి మని తలఁతురు కోపమే లేక క్షమయే గల వాఁ డాఁడుదిగాఁడు-మగవాఁడు గాఁడు.

క. కుట్టినచోఁ దే లందురు, కుట్టకయే యుండె నేని ♦ కుమ్మరపురువం
చెట్టును లక్ష్యము సేయరు, కట్టిఁడిజను లిడియు జగము ♦ క్రమము కుమారా.

కట్టిఁడి జనులు - కట్టు + ఇఁడి = కట్టుబాటులేనివారు, బుద్ధిహీనులు.

తా. లోకమువిధ మెట్టిదనఁగా కుట్టినా తేలు తేలని భయపడి దూరదూరముననే జనులుందురు. కుట్టకయే పోయెనా ఇది కుమ్మరపురువు అని దానిని లక్ష్యమే సేయరు. పుల్లలతోఁ బొడిచి బాధయుఁ బెట్టుదురు. ఇది బుద్ధిహీనులగు లోకుల లక్షణము.

క. నాయెడఁ గలసద్గుణతతు, లీయెడ దోషంబు లగుచు ♦ నేర్పడెఁ గద కా
నీ యసురభూతచయములు, పాయక కను మిప్పు డెట్టి ♦ పాటులు పడునో. ౧౧౧౦

తా. నాయందుఁగల కళ్యాణగుణము లీసమయంబున వీరిచే దోషంబులుగా భావింపఁబడెనుగదా! కానిమ్ము. రాక్షసులు, భూతసమూహము లింక నాపౌరుషగుణముచే నెట్టిపాటులుపడునో చూచుచుండుము.

క. కలకల మని తొలిమలపైఁ, గలకవెలుఁగు దోఁచి శీత ♦ కరుతేజంబున్
బిలబిల హరించు గతినే, బలుసున మృదుగుణము లణఁచి ♦ వెలిఁగెదఁ గనుమీ,

కఱకువెలుఁగు = సూర్యుఁడు, బిఱుసున = పరుషగుణముచే, తొలిమల = తూర్పుకొండ.

తా. తూరుపుకొండమీఁద కఱకఱమను చుఱుకుగలకిరణములతో ఖరకరుఁడగుసూర్యుఁ డుదయించి చంద్రుని తేజస్సు హరించువిధమున నేనును బరుషగుణములను గలవాఁడనై మృదుగుణములను నణఁచి ప్రకాశించెదను. అప్పటికిఁగాని వీరికి నాయందు భయభక్తులు పుట్టవు.

క. రాక్షసపిశాచకోటుల, యక్షులగంధర్వతతుల ♦ నవనీజనులన్
వీక్షింపు మొక్కఁడేనియు, నీక్షణమున సుఖముగాఁగ ♦ నెసఁగెడి నేమో. ౧౧౧

తా. రాక్షసులందును, బిశాచములందును, యక్షులందును, గంధర్వులందును, భూమీజనులందును నొకఁడైన సుఖపడునేమో నీక్షణమున నాపరాక్రమముఁ జూపెదఁ జూడుము.

చ. హతమరుదర్క పావక మ♦హాప్రభ మై మథితాద్రిశృంగ మై
గతిరహితగ్రహంబు నయి ♦ స్కన్ననిశాకరబింబ మాచు శో
షితజలరాశిసంఘ మయి ♦ ఛిన్నలతాద్రుమగుల్మ మై జగ
త్తతి పొలియంగఁ జేసెద శి♦తప్రదరప్రకరప్రభాళులన్. ౧౧౩

హత = కొట్టఁబడిన (చెడిన), మరుత్ + అర్క + పావక + మహాప్రభమై = వాయువు, సూర్యుఁడు, అగ్నిహోత్రుఁడు, వీరియొక్క గొప్పకాంతిగలదై, మథితాద్రిశృంగమై = విఱువఁబడినకొండశిఖరములుగలదై, గతిరహితగ్రహంబునయి = పోవుటకుమార్గములేని గ్రహములుగలదై, స్కన్ననిశాకరబింబము = జాఱిపడినచంద్రబింబము, ఔచు = గలదై, శోషితజలరాశిసంఘమయి = ఎండినసముద్రముల గుంపులుగలిగి, ఛిన్న = ఛేదింపఁబడిన, లతా + ద్రుమ + గుల్మము = తీఁగలు, చెట్లు, పొదలు, జగత్ + తతి = లోకములసమూహము, పొలియంగన్ = నాశమగునట్లు, శిత = పదునైన, ప్రదర = బాణములయొక్క, ప్రకర = సమూహములయొక్క, ప్రభాళులన్ = కాంతులసమూహములచే.

తా. లక్ష్మణా! వాఁడిగల నాబాణపరంపరల తేజస్సులచే వాయుసూర్యాగ్నిహోత్రులప్రభ చెడ, కొండలశిఖరములు విఱిగిపడ, గ్రహంబులు దోవలులేక తికమకలాడ, చంద్రబింబము జాఱిపడ, సముద్రము లన్నియు నెండిపోవ, చెట్లు తీఁగలు పొదలు తెగిపడ, లోకములు నాశమగునట్లు చేసెదను.

మ. అదిగోఁ జూడు మదస్త్రబాణనిచయ♦వ్యాప్తంబు నాకాశమున్
బ్రిదులం జేసెద వ్యోమచారులను సం♦పీడింతు ముల్లోకముల్
సుదతిం జెక్కు చెమర్ప కుండ విబుధుల్ ♦ చూపంగఁ దా రొల్ల రేన్
విదితామోఘమదీయవిక్రమ మిదే ♦ వీక్షింత్రు గా కేడ్చుచున్. ౧౧౪

మత్ = నాయొక్క, అస్త్రనిచయ = అస్త్రసమూహములచే, వ్యాప్తంబున్ =

వ్యాపింపఁబడినదానిని, ప్రిదులక్ = పడునట్లు, వ్యోమచారులను = ఆకాశమున సంచరించు దేవతలను, చెక్కు-చెమర్పకుండ = కొంచెమైనను బాధలేకుండునట్లు, విబుధుల్ = దేవతలు, ఒల్లరేక = ఇష్టపడరేని, వితత = ప్రసిద్ధికెక్కిన, అమోఘము = వ్యర్థముకాని, మదీయవిక్రమము = నాపరాక్రమము, ఇదె = ఇప్పుడే, వీక్షింతురు గాక = చూచెదరుగాక.

తా. అదిగో నాయస్త్రములచే వ్యాపింపఁబడిన యాకాశమును దలయెత్తి చూడుము. విమానములమీఁదఁ దిరుగుదేవతలను నేలఁబడఁగొట్టెదను. మూఁడు లోకములు బాధపడఁజేసెదను. నాసీతకేబాధ లేకుండునట్లు మంచితనమునఁ దెచ్చి దేవతలు సమర్పించిరా సరి - లేదా ప్రసిద్ధమై వ్యర్థము పోని నాపరాక్రమమును నేఁడ్చుచుఁ జూతురుగాక.

సీ. అతలకుతలము నై ♦ హల్లకల్లోల మై, చెల్లాచెదరు నయి ♦ చెల్ల చెదరు
పచ్చముపాడు నై ♦ పంచబంగాళ మై, పాండవబీడు నై ♦ పగులు వాఱి
మఱి పటాపంచ మై ♦ మామకీనాకర్ణ, పూర్ణ బాణావళీ ♦ పూర్ణ భువన
మిపు డమర్యాద మై ♦ యేర్పడఁ గల దిదే, చూడుమీ లక్ష్మణ ♦ చొక్కి సోలి
ఆ. వ్రాలి తూలి వ్రేలి ♦ మాలి యీ దేవతల్, యక్షరాక్షసాళు ♦ లదవదపడి
పటుతరాస్మదీయ ♦ బాణనికృత్తు లౌ, వారు వీరె యోర్చు ♦ వారు నన్ను. ౧౧౧౫

అతలకుతలమునై = క్రిందిది మీఁదఁ బైది క్రింద, అతలము = అధోలోకములలో నొకటి. ఇది భూమికిఁ గ్రిందిలోకము. కుతలము = భూలోకము, అతలము భూలోకమగునట్లు. హల్లకల్లోలము రూ. అల్లకల్లోలము = తాఱుమాఱు. చెల్లాచెదరు రూ. చెల్ల చెదరు = మిక్కిలిచెదరు. పచ్చముపాడు = పాడు + పాడు = పచ్చముపాడు = మిక్కిలిపాడు, పంచబంగాళము = మిగులదూరము, పాండవబీడు = ఏభూమియైనను తరాలనాఁటినుండి చిరకాలముగ దున్నఁబడకయుండునది పాండవబీడు అందురు. పాండవులనాఁటికాలమునుండి బీడని యర్థము. పటాపంచము = అగోచరము - కానరాకపోవుట. రూ. పటాపంచ. మామకీన = నాయొక్క, ఆకర్ణపూర్ణ = చెవులవఱకు పూరింపఁబడిన, ఆకర్ణపూర్ణము-అవ్యయీభావసమాసము. ఆబాలగోపాలము ఇత్యాదులు. ఆ = వఱకు - బాణావళీ = బాణములవరుసలచే, పూర్ణ = నిండిన, భువనము = ప్రపంచము, అమర్యాదమై = కట్టుపాటుతప్పినదై, మర్యాద = మేర. అదిలేనిది అమర్యాదము. చొక్కి = దేహము తెలియకపోయి, సోలి = నేలఁబడి, వ్రాలి = వంగఁబడి, తూలి = స్థానభ్రష్టమై, వ్రేలి = వ్రేలాడి, మాలి = చెడి, అదవదపడి = కలఁతపడి, పటుతర = మిగులబలముగల, అస్మదీయ = నాయొక్క, బాణ = బాణములచే, నికృత్తులు = ఖండింపఁబడినవారు.

తా. నే నిపు డాకర్ణాంతము లాగివిడిచిన బాణములసమూహములచే ప్రపంచ మతలకుతలమై యల్లకల్లోలమై చెల్లచెదరై పచ్చముపాడై పంచబంగా

శమై పాండవబీడునై పగుళ్లుపాఱి పటాపంచమై మర్యాదతప్పినది కాంగలదు చూడుము. ఈదేవతలు రాక్షసులు లోనగువారు చొక్కి సోలి వ్రాలి కూలి తూలి వ్రేలి మాలి నాబాణములచే ఖండితు లగుదురు. నేను ధ్వంసముచేయంబూనిన వీరా సహింపంగలవారు?

క. నాముద్దురాలి సీతను, సామంబునఁ దెచ్చి యీయఁ ♦ జాలక యున్నన్
సౌమిత్రీ! భువనత్రయి, యేమెయి రూపఱునో చూడు♦మీ నాశక్తిన్. ౧౧౧౬

ముద్దు+ఆలు = ముద్దురాలు. కర్మధారయము. కావున రకారాగమము. సామంబున = మంచిమాటలచే, భువనత్రయి=మూఁడులోకములు, రూపఱునో= రూపములేకపోవునో.

తా. నాకుఁ బ్రియురాలగు సీతను మంచితనమునఁ దెచ్చి దేవతలులోనగువారీయ రేని, లక్ష్మణా! యీమూఁడులోకము లేవిధముగా రూపములేక నాశమగునో నాశక్తి చూడుము.

చ. అని కటముల్ చలింప భయ♦దాసమరోషకషాయితాక్షుఁడై
ఘనతరకార్ముకంబు వెసఁ ♦ గైకొని భీషణపన్నగోపమం
బనుపమతేజ మైనవిక♦టాశుగ మొండు గుణంబుఁ గూర్చి యి
ట్లను ననుజాతుతోడఁ బ్రళ♦యాగ్నివిధంబునఁ దేజరిల్లుచున్. ౧౧౧౭

కటముల్ = చెక్కిళ్లు, భయద = భయముగలిగించు, అసమ = అసమానమైన, రోష = కోపముచే, కషాయిత = ఎఱ్ఱవాఱిన, అక్షుఁడై = కన్నులుగలవాఁడై, ఘనతర = మిగులగొప్పదగు, కార్ముకంబు = విల్లు, వెసన్ = శీఘ్రముగా, కైకొని = చేత గ్రహించి, భీషణ = భయంకరమైన, పన్నగోపమంబు = పాము వంటిది, అసమతేజము = అసమానమైనకాంతిగలది, వికటాశుగము = చక్కని బాణమును, గుణంబున్ = అల్లెత్రాటియందు, ప్రలయాగ్నివిధంబునన్ = ప్రలయ కాలమందు లోకము దహించుటకై ప్రజ్వరిల్లు నగ్నిదేవునివలె, తేజరిల్లుచున్ = ప్రకాశించుచు.

తా. అని చెక్కిళ్లదరుచుండ భయంకరమైన కోపముచే నెఱ్ఱనైన నేత్రములుగలవాఁడై తనపెద్దవింటిని జేతఁ దీసికొని భయంకరమైన పామువంటిదై మిగులఁ దేజముగల చక్కని బాణము నల్లెత్రాటియందు సంధించి ప్రలయకాలాగ్నివలె మండుచుఁ దమ్మునితో నిట్లనియె.

క. ఏవిధి జరయును మరణం, బేవిధిఁ గాలం బదృష్ట ♦ మెట్లనివార్యం
బావిధిఁ గోపప్రాప్తిని, నేవిధి నప్రతిహతుండ ♦ నే సౌమిత్రీ. ౧౧౧౮

జర = ముసలితనము, మరణము = చావు, అదృష్టము = పూర్వజన్మమునఁ జేసినకర్మముల ఫలము, అనివార్యంబు = నివారింపరానిది, కోపప్రాప్తిని = కోపము వచ్చినపుడు, అప్రతిహతుండన్ = ఎదిరించిచెఱుచువాఁడు లేని వాఁడను, అడ్డము

లేనివాఁడను. ఇది శ్రీరామచంద్రమూర్తిసంకల్పమునకు నడ్డములేదనియు. ఆయ నను దిరస్కరింప నెట్టివారు చాలరనియుఁ దెలుపుచున్నది. 'సత్యకామ స్సత్య సంకల్ప' యనుశ్రుతి స్మరింపఁదగును. దీపకాలంకారము.

తా. ఎవ రెన్ని విఱుగుడులు చేసినను ముసలితనము, మరణము, కాలము, అదృష్టము వానివాని కాలమున నవి రాకలప్పనట్లు నాకును గోపమువచ్చినపుడు నేను జేయఁబూనినపనిని నివారించువాఁడు లేఁడు.

క. సల్లలితచరిత స్మితముఖి, మెల్లగ నర్పించిరేని ♦ మే లగుఁ గాదే
నుల్లల నుడికింతును జుమి, హల్లోహలముగ జగంబు ♦ లని రోషింపన్. ౧౭౯

సల్లలితచరిత=మిగులమనోహరమైన నడవడిగలది, స్మితముఖి = నవ్వుతోఁ గూడిన ముఖముగలది, అర్పించిరేని = తెచ్చియిచ్చిరేని, మేలగుఁ = దేవతలు మొదలగువారికి శుభమగును. ఇట్లనుటచే నాయాశ్రమముపొంతకు మాయా మృగము వచ్చినపుడు ఏనవ్వుముఖముతో సీతాదేవి నాకామృగమును బట్టితెమ్మని కోరెనో-అటువంటి నవ్వుముఖముఁ గలదానినిగాఁ దెచ్చి యియ్యవలె ననిభావము. ఉల్లలనుడికింతును - ఉల్లల = ఉడుకుటయందు ధ్వన్యనుకరణము. కుతకుతలాడిం తును. హల్లోహలముగ = మజ్జనోన్మజ్జనముగ, మునుఁగుచుఁ దేలుచుఁ దేలుచు మునుఁగుచు-ఈశబ్దమును ఓగిరాలజగన్నాథకవి తన సుమనోమనోభిరామంబునను అలసానిపెద్దనయుఁ బ్రయోగించియున్నారు. ఈశబ్దము నునికి తెలియక మనుచరిత్ర వ్యాఖ్యాతలు ప్రమాదపడినారు. సుమనోమనోరంజనము-ప్రథమోల్లాసము, "శ్రీ నారాయణదేవ దివ్యపదరాజీవద్వయీ సంతత ధ్యానానూన సుధాపయోధిలహరీ హల్లోహలాత్మీయచేతో నాళీకుఁడనై తదంచితకథాస్తోమంబు లాసక్తి శ్రుత్యానం దంబుగ నాలకించుచు సమస్తాహోనిశల్ పుచ్చుదుర్." ౯౭.

నారాయణదేవునియొక్క-ధ్యాన మనెడిసుధాసముద్రప్రవాహమందుమునుఁ గుచుఁ దేలుచున్న మనఃపద్మము కలవాఁడనై యన్నిరేలుంబగల్లు గడుపుచు న్నాఁడను. హల్లోహలము = మగ్నోన్మగ్నము. 'పరిమళలహరీ హల్లోహలమద బంభర' అని మనుచరిత్ర. 'ప్రగల్భాంగనాకలనాదోదిత పాహిపాహి ముఖవాక్క ల్లోలహల్లోహల', అని, ద॥ గంగాహల్లోహల వాగ్విలాస॥ పాం॥

తా. మనోజ్ఞమైన నడవడిగలదియు నవ్వుముఖముగలదియు నగు నాసీతను మృదుమార్గమునఁ దెచ్చియిచ్చిరా సురాసురులు లోనగువారు బాగుపడుదురు. ఈయకపోయిరా కుతకుత యుడికించి యాపత్సముద్రమున ముంచి తేల్చెదను-అని కోపింపఁగా

౬౯-వ సర్గము. లక్ష్మణుఁడు శ్రీరాముని శాంతునిఁ జేయుట.

సీ. సీతాపహరణక♦ర్శితుఁ దప్యమానుని, సంవర్తకాగ్నియో♦జను జగంబు
నిర్దగ్ధముగఁ జేయ ♦ నిష్ఠురుం డగువాని, సజ్యకోదండంబు♦చాయఁ జూచు

చున్నవానిని వేఁడి♦యూర్పులూర్చెడువానిఁ, బ్రళయరుద్రునియట్లు♦వెలుఁగువాని
నెన్నఁడుఁ గోపించి ♦ యెఱుఁగనివానిని, రాముఁ గన్గొని సుమి♦త్రాసుతుండు
ఆ. పెదవు లెండ ముఖము ♦ వెలవెలఁ బోవఁగ, నిట్టు లనియె భూత♦హితరతుండ
వెపుడు శాంతమతివి ♦ మృదువవు తగు నయ్య, కోపమెత్తి నైజ♦గుణము విడువ.

ఇట్లుచేసినను ప్రాజ్ఞులు నన్ను నిందింపరు, అనిభావము. 'ఈమెకై రాముఁడు లోకమెల్ల దహియించిన యుక్తమ నాకుఁజూడఁగన్', అనికదా హనుమంతు నంతటివాఁడు చెప్పెను. సుం, ౭౬-౩ ప. సీతాపహరణకర్శితున్ = సీత యపహరింపఁబడినకారణముచేఁ గృశించినవానిని. తప్యమానుని = తపించుచున్నవానిని. సీతాపహరణము తాపమునకుఁ గారణము. తాప మీక్రోధమునకుఁ గారణము. ఇట్లనుటచే సీతను మరల గ్రహించుటకై తెచ్చుకొన్న కోపావేశమే కాని స్వభావసిద్ధమైనది ద్వేషమువలన వచ్చినది కాదనియుఁ గార్యము నెఱవేఱిన నుండునది కాదనియు భావము. సంవర్తకాగ్నియోజను = ప్రలయకాలమందలి యగ్ని విధమున-సంవర్తః ప్రలయః కల్పః క్షయః కల్పాంత 'ఇత్యపి' అమరకోశము.

నిర్దగ్ధముగన్ =పూర్తిగఁగాలినదిగ, సజ్య=ఎక్కుపెట్టఁబడిన, కోదండంబు= విల్లు, భూతహితరతుండవు = భూతములకు మేలుచేయుటయందే ప్రీతిగలవాఁడవు, శాంతమతివి = శాంతిగల మనస్సుగలవాఁడవు కోపములేనివాఁడవు, మృదువవు= కఠినత్వము లేనివాఁడవు మెత్తనివాఁడవు, నైజగుణము = సహజగుణము.

తా. సీతాదేవి యపహరింపఁబడిన కారణమునఁ గలిగిన దుఃఖముచేఁ జిక్కినవానిని, శోకముచేఁ దపించుచున్నవానిని, ప్రలయకాలాగ్నివలె లోకమును సమూలముగఁ గాల్చివేయఁ బరుషగుణము వహించినవానిని, ఎక్కుపెట్టిన వింటి చాయఁ జూచుచున్నవానిని, వేఁడినిట్టూర్పులు విడుచుచున్నవానిని, సర్వప్రాణి సంహారముచేయ విజృంభించిన ప్రలయకాలరుద్రునివలె వెలుఁగుచున్నవానిని, శత్రుసంహారము నిమిత్తమైతప్ప నెన్నఁడుకోపించి యెఱుఁగనివానిని, రామచంద్రునిఁ జూచి లక్ష్మణుఁడు పెదవు లెండ ముఖము వెలవెలఁబోవ నిట్టులనియె. అన్నా! నీవు సర్వదా జగమునకు మేలుచేయుటయందుఁ బ్రీతిగలవాఁడవే, కోపములేనివాఁడవే, మృదుస్వభావుఁడవే, ఇట్టి నీవిపుడు కోపము దెచ్చుకొని నీసహజగుణమును విడువవచ్చునా? ఇది నీకు ధర్మమా?

దీనివలనఁ దన్నే నమ్మియుండువారి కాపదగలిగినపుడు భగవంతుఁడు వారిని రక్షించుటయం దెట్టివాఁ డగునో తెలియనగు. ఇది యాశ్రితవాత్సల్యాతిశయమును దెలుపును. ఇట్టులే తమయాశ్రితుల రక్షించుటయందు సర్వవిధప్రయత్నములు చేయవలె ననిసూచన.

ఉ. ఇందునియందు లక్ష్మియు, న♦హీనతరప్రభ సూర్యునందునన్
దండడియోర్పు ధాత్రిని, స♦దాగతియందు సదాగతిత్వ, మ

స్కందగతిం దిరం బగుచు ♦ జేనగు: నిన్నియుఁ గీర్తితోడ నీ
యంద వసించు నిత్యముగ ♦ హావడి పెట్టఁగఁ జన్నె లోకముల్? ౧౧-౨౧

ఇందునియందు = చంద్రునియందు, లక్ష్మి = శోభ, 'లక్ష్మీస్సంపద్రమా శోభా'॥ నానా॥ ర॥ చంద్రునికాంతి సౌమ్యమై ఆబాలగోపాలము సంతోషపఱిచి సుఖ మిచ్చునది. అమావాస్యయందు చంద్రకాంతి లేదుగదా యందురేమో? మనకు లేదు. అంతియకాని చంద్రకాంతికి హానిలేదు. గ్రహణకాలమున మనకు నెండలేనికారణమున సూర్యకాంతి లేదనవచ్చునా? అదియునుగాక సూర్యుని యందు నారాయణుఁ డున్నట్లు, చంద్రునియందు లక్ష్మీదేవి కలదు. సినీవాలీశబ్ద మీయర్థమునే బోధించుచున్నది. అః అనఁగా విష్ణువు. స+అః = సా అనఁగా విష్ణువుతోఁగూడినది లక్ష్మి. ఆలక్ష్మి కలది కనుక సిని యనఁగాఁ జంద్రకళ. ఆచంద్రకళ దీనియందు లేతదై యుండునుగాన సినీవాలి. వబల కభేదము అని గురుబాలప్రబోధిక. అహీనతరప్రభ = మిక్కిలిగొప్ప దగుకాంతి, దండడియోర్పు = అధికమైనయోర్పు, ధాత్రిని = భూమియందు, సదాగతియందు = వాయువునందు, సదా+గతిత్వము = ఎప్పుడుపోవుచుండుట, అస్కందగతిన్ = జాఱిపోనివిధముగ, తిరము = స్థిరము, జేనగున్ = మనోహరమగును, ఇన్నియు = చంద్రసూర్యాదు లందొక్కొక్క గుణమేయున్నది. నీయందో యివన్నియుఁ గీర్తితోడ వసించును. హావడి = బాధ, ఉపద్రవము, చన్నె = చనునా. ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబు లగు నుండు, చను, చేరు, కొను లు ప్రశ్నార్థకైకారపరకంబులగునపుడు వాని కడయచ్చులకు లోపంబు విభాషనగు. అగుచో నుండుడకారంబునకు వకారంబగు. చేరుకొను అనఁగా ననుప్రయుక్తమగు కొనుధాతు వనియర్థము. ఉండునే = ఉన్నె, కొనునే = కొన్నె, చనునే = చన్నె, ప్రౌ-వ్యా. క్రియ. ౨.

తా. చంద్రునియందు లక్ష్మి సూర్యునియందు విశేషప్రభ భూమియందు విశేషముగ నోర్పు, వాయువునందు సదా గమనించుట, కొంచెమైన స్ఖలనములేక స్థిరముగ నుండును. వానియం దాయొక్కొక్కగుణమే యుండును. నీయందవి యన్నియు పైపెచ్చు కీర్తితో శాశ్వతముగఁ గాఁపురము చేయుచునుండును. ఇట్టి నీవు లోకములను బాధింప న్యాయ్యమా?

సీ. అపరాధ మెవ్వఁడో ♦ యాచరించిన నెల్ల, జగముల సమయింపఁ ♦ దగు నటన్న
యీభగ్నమైనతే ♦ రెవ్వనిదో యేల, యెవనిచే హత మయ్యె ♦ నెఱుకపడదు
తునిసినగొఱిజలు ♦ దొరలిన నేమి యై, నెత్తురుబొట్ల నీ♦ నేల యొప్పె
సైన్యంబు పోరిన♦చందంబు లే దొంటి, కాని దురం బయి ♦ కానఁబడియెఁ

ఆ. గాన నొకనికై జ♦గంబుల నెల్లను, రూపు మాపఁ దగునె ♦ రూక్షవృత్తి
రాజులైనవారు♦ రాజిల్ల వలదె మా, ర్దవము శాంతి యుక్త♦ దండ మొనరి.

ఎవ్వఁడో = ఊరుపేరు తెలియనివాఁడు, ఆచరించినన్ = చేసిన, భగ్న

మైన = విఱిగిన, హతము = విఱుగఁగొట్టఁబడినది, తునిసిన = విఱిగిన, గొఱ్ఱెజలు = గుఱ్ఱపుగిట్టలు, నేమి = బండికమ్మి, దురంబు = యుద్ధము.

తా. శాంతింపుము. ఓర్పుకొను మనెదవే-ఇంతసేపోర్పుకొనిన నెవరైన నీస్థితియేమి గతియేమి - ఏల యేడ్చెదవు, సీత యిచ్చోటనున్న దనిపలుకరించినవాఁడొక్కఁడైనఁ గలిగెనా? ఎంతకాల మోర్పుకొనిన నింతయేకదా ఫలము. అందు వేమో? అన్నయ్యా అట్లుకాదు. ఊరుపేరు తెలియనివాఁ డెవ్వఁడో యొక్కఁడు నేరముచేసిన వానిని గనిపెట్టుశక్తిలేక లోకమునంతయు నాశముచేయ న్యాయ్యమా? ఇట్టిపని చేయరాదని నీవే నాకు బోధించితివికదా. (యుద్ధ ౧౫౦౩ పద్యము). ఈవిఱిగినతే రెవ్వనిదో యేల యెవనిచే విఱువఁబడెనో తెలియలేదు. ఇది మనము విచారించి తెలిసికొనవలసియున్నది. గుఱ్ఱపుగిట్టలు విఱిగినవి. చక్రముల కమ్ములు దొరలినవి. నెత్తురుబొట్లు నేలపడినవి. ఇవన్ని పరిశీలించి చూడఁగా నొకనికే యిన్నియుఁ దటస్థించినవిగాని యుద్ధమునందు రెండవవాఁ డెవఁడో తెలియదు. సేనలు పోరాడినవిధమును లేదు. ఒకఁడే తనరథమును దాను విఱుచుకొని తనసారథిని గుఱ్ఱములనుఁ జంపుకొనునా? కావున నివియన్నియు నీ వాలోచింపక యొకనినిమిత్తమై లోకమంతయు నాశముచేయఁదగునా? రాజులగువారు మృదుత్వము శాంతి గలిగి యెప్పు డెవరి నెట్లు దండింపవచ్చునో యట్లుగదా దండింపవలెను? ఇష్టమువచ్చినట్టు లెవరి ననిన వారినందఱఁ గఠినముగ దండింపవచ్చునా?

క. నీ వఖిలభూతములకుం, గేవలము శరణ్యుఁ డవును ♦ కీర్తిత పరమంబై వఱలు గతియుఁ గావున, నేవాఁ డొకొ నీ విపత్తి ♦ కెలమింగాంచున్. ౧౧-౧౨

తా. ఎవఁడో యొకఁ డపరాధముచేయఁగా లోకమంతయు దాని నామోదించెను గావున లోకమంతయు వధ్యమని నీవు తలఁచుట పొరపాటు. ఎట్లన:-తమ రక్షణము కోరు సర్వభూతములకుఁ శరణుచొరఁదగిన వాఁడవు నీ వొకఁడవేకాని నీవు తప్ప వేఱొకఁడు లేఁడు. అట్టివారు పొందఁదగినదై యన్నిటికంటె శ్రేష్ఠమైన దని కీర్తింపఁబడిన పరమగతియు నీవుతప్ప వేఱులేదు. ఇట్లు ప్రాపకము ప్రాప్యమునై యుండునీకు నాపదవచ్చిన నెవఁడు సంతోషించును? సహాయముచేయుటకు సామర్థ్యములేకకొందఱు, తెలియక కొంద ఱుందురుగాని బుద్ధిపూర్వకముగా నీ కపరాధముచేయఁదలఁచినవా రుండరు. ఇందు శ్రీరామచంద్రమూర్తి సర్వశరణ్యత్వము, సర్వప్రాప్యత్వము చెప్పఁబడెను.

తే. సురలు గంధర్వదానవుల్ ♦ గిరులు నదులు, నీకు విప్రియ మొనరింప ♦ నేర వయ్య ఋత్విజులు దీక్షితునిపట్ల ♦ నెగ్గు దలఁపఁ, జాలనివిధాన యోజింపు ♦ శాంతమతిని.

తా. యజ్ఞమునందు ఋత్విజులు దీక్షగొని యజ్ఞముచేయువానికిఁ గీడు కోరినఁ దమకే నష్టికావున వానికీడు కోరరు మేలే కోరుదురు. అట్టులే దేవతలు

గంధర్వులు దానవులు కొండలు నదులు నీకు దుఃఖమును గలిగింపవు. నిబ్బరించు కొని యాలోచింపుము.

ఉ. కేల శరాసనంబుఁ గొని ♦ క్రేవల నే నడ తేరఁగాఁ దప
శ్శీలురబాసటన్ వెమకు ♦ సీతను బర్వతకాననంబులన్
శైలగుహాతరంగిణుల ♦ సారసకైరవవాటికాళులం
దాలిమి దేవతాదిభువ♦నంబుల నెంతయు జాగరూకతన్. ౧౧_౨౫

కేలన్ = చేతియందు, శరాసనంబు = విల్లు, క్రేవల = ప్రక్కల, నడ తేరఁగా = నడచిరాఁగా, తపశ్శీలురబాసటన్ = తపస్సుచేసికొనువారిసాహాయ్యముచే, వెమకుము = వెదకుము, శైలగుహాతరంగిణులన్ = కొండగుహలందు నదులందు, సారస + కైరవ + వాటికాళులన్ = కమలములు, కలువలు, నుండు ప్రదేశములందు, తాలిమిన్ = ఓర్పుగలిగి, దేవతాదిభువనంబులన్ = దేవతలు మొదలగువా రుండుచోటులందు, జాగరూకతన్ = హెచ్చరికతో.

తా. చేత విల్లుపట్టుకొని నేను ప్రక్కల నడచిరాఁగా తపస్వులసాహాయ్యముతో సీతను బర్వతములందు నడవులందు గుహలయందు నదీతీరములయందు కమలములు, కలువలుండు కొలంకులతీరములందు దేవతాదులుండు స్థలములందు నోర్పుతో హెచ్చరికతో వెదకుము. ఇచ్చటఁ దపస్వులసహాయముతో వెదకుము అనుమాట యెంతయుఁ దగియున్నది. వీరికిఁ దెలియనిప్రదేశములు వారికిఁ దెలిసి యుండుటేకాక యోగదృష్టిచే సీత యెందుండునది వారు చెప్పఁగలరు. ఋషీశ్వరులసాహాయ్య మేల వీరు గోరలేదో- ఇద్దఱుమగవారుండి యొకయాఁడుదాని రక్షింపలేకపోయితిరా యని నవ్వుదు రనియో - నీయాఁడుదానినే రక్షించుకొన లేక, హరించినవానిని శిక్షింపలేనివాఁడవు మమ్మేమి రక్షింపఁగలవని యందు రనియో వారిసాహాయ్య మపేక్షింపలేదు. అదియునుగాక యగస్త్యాశ్రమము పోవు వఱకు ఋష్యాశ్రమములు లేవు. రాక్షసులతలవాకిట నెవరుందురు?

క. అప్పటికిమంచితనమున,నప్పింపరయేని సీత ♦ నమరులు మీఁదం
దప్పక కాలోచిత మగు,నప్పనిఁ గావింప న్యాయ ♦ మగుఁ బో నీకున్.౧౧_౨౬

తా. మనము చేయవలసిన కార్యమంతయుఁ జేసి యప్పటికి మంచితనమున దేవతలు సీతను సమర్పింపకపోయినపక్షమున నప్పటికి నుచితమగుపని యప్పుడు నీవు చేయుట న్యాయముగా నుండును. నింద నీ యం దుండదు.

మానిని. సామముచేతను శీలముచేతను ♦ సాధుమతీ! వినయాదులచే
భూమితనూభవ చేపడ కున్నను ♦ భూవరనందన! యాపయి సు
త్రామకఠోరసుసాధనసన్నిభ♦రాజతపుంఖశరౌఘములన్
నీమదివచ్చినచొప్పున లోకము ♦ నీఱుగఁ జేయుము యుక్తమగున్.౧౧_౨౭

చేపడక = లభింపక, సుత్రామ = ఇంద్రునియొక్క, కఠోర సుసాధన =

కఠినమైన మంచియాయుధమగు వజ్రముతో - సన్నిభ = సమానమైన, రాజత పుంఖ = బంగారుపిడులుగల. శరౌఘములన్ = బాణసమూహములచే, నీఱుగన్ = భస్మముగా, యుక్తమగున్ = న్యాయ్యమగును.

తా. మంచిమాటలచేత, మంచినడవడిచేత, వినయము మొదలగువానిచేత సీతాదేవి లభింపకపోయెనా, సాధుమనస్సుగల రాజనందనా యామీఁద వజ్రముల వంటి కఠోరములై బంగారుపింజలుగల బాణములచే నీయిష్టప్రకారము లోకమును భస్మముచేయుము. తగినకార్యముగ నుండును. ఈవిషయమున హనుమంతునివాక్యములు చూడుఁడు.

"క. మేలో త్రిభువనరాజ్యము। మేలో జానకి యటన్న మేదినిసుతకున్। త్రైలోక్యరాజ్యమెల్లను। జాలదుపో యొక్కకళకు సరిపోలంగన్॥" సుందర ౭౬౭. వాస్తవమింతయేకదా. "విష్టభ్యాహ మిదంకృత్స్న మేకాంశేన స్థితో జగత్" భ.గీ. ౧౦-౪౨. ఛందస్సు—మానినికి నేడు భ గణములు, గురువు. ౧౩ వ యింట యతి.

## ౬౬-వ సర్గము.

క. అని పాదంబుల వ్రాలుచు, వినయంబున మఱియు ననియె♦విపులతపమునన్
ఘనసత్కర్మములను నినుఁ, గనె జనకుఁడు సుధనుసురలు♦గాంచినభంగిన్.

విపులతపమునన్ = విస్తారమైన తపస్సుచేత, ఘనసత్కర్మములను = గొప్ప పుణ్యకార్యములచేతను, సుధను = అమృతమును.

తా. ఈప్రకారము చెప్పి యాయన పదములపైఁబడి నమస్కరించి వినయమున మఱియు నిట్లనియె. అన్నా! పూర్వజన్మంబునందేకాక యీ జన్మమందును విస్తారముగఁ దపస్సుచేసి యెన్నియో యశ్వమేధయాగాదులు గొప్పపుణ్యకార్యములు చేసి మనతండ్రి యతిప్రయాసమున దేవత లమృతమును బడసినట్లు నిన్నుఁ బడసెను.

శ్రీరామచంద్రమూర్తిని అమృతమునకుఁ బోల్చుటచే నీ యర్థములు స్ఫురించెడిని. అమృతమువలన నమృతమున కేలాభములేదు. దాని ననుభవించిన దేవతలకే లాభము. అట్టులే నీవు దేవతలకు లోకులకు భోగ్యుఁడవై వారికి మేలు చేయ జనించినవాఁడవు. ఇట్లు లోకము నుద్ధరింపఁబుట్టిన నీవు లోకమును నాశము చేయుట అమృతము చంపుటవలె స్వభావవిరుద్ధకార్యము. ఈయర్థమునే సీతయుఁ జెప్పెను. అమృతమునకై ముప్పదిమూఁడుకోట్లదేవతలు చేసినకష్టమును నీకై దశరథుఁ డొక్కఁడే చేసెను. అమృత మెట్లు రాక్షసవినాశకారణ మాయెనో యట్లు నీవును రాక్షసులవినాశము చేయవలసియున్నది. కావున దేవతలమీఁద మనుష్యులమీఁద నితరభూతకోటిమీఁదఁ గోపము మానుము. అమృతమువలె నీవు సదా నిర్మలుఁడవుకదా. కశ్మలభావము తగదు.

క. వర కేవలయుష్మద్గుణ,పరవశుఁ డై తండ్రి నిన్నుఁ ♦ బాయుటచేతన్
సురలోక మరిగె ననుచున్, భరతుఁడు మన మెల్లవినఁగఁ♦బలికెను గాదే.

వర కేవలయుష్మద్గుణపరవశుఁడై = శ్రేష్ఠములై నీయందుఁదప్ప నితరుల యందు లేనివగునీకళ్యాణగుణములకుఁ బరవశుఁడై తండ్రి నిన్ను నెడఁబాసిన కారణమున మరణించె నని యందఱు వినఁగా భరతుఁడు చెప్పెనుగదా. అట్టి కళ్యాణగుణములను వదలి యిట్టిహేయగుణమును జేపట్టి లోకమున కుపద్రవము గలిగించితి వేని నతండు నీవిషయమై యేమి తలంచును? రాముఁడు సౌమ్యుఁడు, సాధువు, జితేంద్రియుఁడు, శాంతుఁడు ననుకొంటినే, యింతటికౄరుఁడా యని తలఁ పఁడా? నీవు చేయఁబూనిన లోకోపద్రవము తండ్రికిని జేసినవాఁడవే కదా యగు దువు? తననాశమునకా నిన్నుఁ దండ్రి కనెను.

క. కాకుత్స్థవర్య! నీ వే, శోకము సహియింపలేక ♦ స్రుక్కెద వేనిన్
లోకమున నల్పసత్త్వులు, ప్రాకృతులా సైఁచువారు ♦ పటుదుఃఖంబుల్?॥౧౩౦

కకుత్స్థునివంశమునఁ బుట్టినవారిలో శ్రేష్ఠుఁడవైన నీవు, మహాశుద్ధసత్త్వము గలనీవు, అప్రాకృతుఁడవగు నీవు, కకుత్స్థునివలె దేవతల లోకుల రక్షింపవలసిననీవు శోకమును సహింపలేక పరితపించెద వేని యిఁక లోకమునందు కొంచెముసత్త్వ గుణముగలవారు కావుననే దుర్బలులు, ప్రకృతిబద్ధులగుటచేతనే యవశులు,నీచులు నగువారు దుఃఖములను సహింపఁగలరా? అట్టివారియందే శోకమును సహించిన వారు కానవచ్చుచుండ నీవు శోకవశుఁడ వగుట శోచనీయము.

క. వలవంత నీ వె జగములఁ, బొలియింపఁగఁ జూచె దేని ♦ భూప్రజల కెవం
డలవడును గావ దిక్కై, వెలుగే చే న్మేయఁ గాచు♦వెర వెయ్యదియో.॥౧౩౧

వలవంతన్ = వ్యసనముచే, నీవే = సర్వరక్షకుఁడవైననీవే-పొలయింపన్ = సంహరింప, అలవడును = లభించును - దిక్కై = రక్షకుఁడై, వెలుగు = కంచె - పైరును పశువులు మేయకుండునట్లు నాటినకంప. చేను = చేనియందలి పైరు, వెరవు = ఉపాయము.

యయాతిమహారాజు బహువిధపుణ్యకార్యములు తపస్సులుచేసి కొంత కాలము బ్రహ్మాదిలోకంబులందును సుఖ మనుభవించి యింద్రునియొద్దకుఁ బోయెను. అప్పు డింద్రుఁడు నీ వేమితపస్సులు చేసి యింతటిపదవి నొందితి వనెను. ఆ యయాతి "కం. సుర దైత్య యక్ష రాక్షస। నర ఖేచర సిద్ధ మునిగణ ప్రవరులభా।సురతపములు నాదగుదు।ష్కరఘోరతపంబు సవతు గావ, మహేంద్రా"॥ అని యాత్మశ్లాఘ చేసి కొన్ని మహర్షుల నవమానించి పలుకుటచే నీవు గర్వివి - గర్వముగలవారి పూర్వ పుణ్యములు నశించును కావున నీవు మరల భూలోకమునకుఁ బొమ్మని పంపెను. సాధుసాంగత్యముచే నాదోషముఁ బోఁగొట్టుకొని మరల స్వర్గమునకుఁబోయెను. యాదవపాండవులకు మూలపురుషుఁ డీయయాతియే.

తా. జగములను బుట్టించుభారము బ్రహ్మది, సంహరించుభారము రుద్రునిదైనట్లు రక్షించుభారము నీయందుఁగలనీవు నీధర్మమును వదలి జనుల సంహరింపఁబూనెదవేని భూప్రజలకు రక్షకుఁ డెవ్వఁడు దొరకును? పైరును రక్షించుటకై వేయఁబడినకంచెయే పైరును మేయఁబూనిన నింక దాని రక్షించు నుపాయ మేది కలదు.

సీ. నహుషసూతి యయాతి♦నాకంబునొందియు,నవివేకి యయి దుఃఖ ♦ మంద లేదె
మనపురోధవసిష్ఠ♦ముని సుతశతమును, గన నొక్కపరి వారు ♦ చనరె దివికి
భువనవందిత సర్వ♦భూతధాత్రి ధరిత్రి, గడగడ లాడదే ♦ వడఁకు గదుర
భువనచక్షుస్సులుఁ ♦ బూజ్యులు సూర్యజై, వాతృకుల్ గ్రహముల♦వాతఁ బడరె
తే. యెంతటిమహాత్ములైన సు♦రేంద్రులైన,దైవసంకల్పమును దాఁటు♦దాఁటఁ గలరె
కష్ట మెఱుఁగక కాలంబుఁ ♦ గడిపినారె,ప్రాణులకు మేలు కీడు స్వ♦భావ మధిప.

నహుషసూతి = నహుషునికుమారుఁడు యయాతి, నాకంబు = స్వర్గంబు. కము అనఁగా సుఖము. అదిగానిది అకము. అనఁగా దుఃఖము న+అకము = అట్టిదుఃఖము దేనియందు లేదో యది నాకము.-నఞ్ "నలోపోనఞః తస్మాన్నుడచి పాణిని" ౬-౩-౬, ౬-౩-౭౩-౭౪ ప్రకారము నకారమునకు అచ్చుపరమైనపుడు నకారము అఁగా మాఱువలయును. న+ఉచితము = అనుచితము. వీని కపవాదములు నాకము, నాసత్యులు, నారాయణుఁడు, (న+అరాయణుఁడు) అవివేకి = వివేకములేనివాఁడు. ఇచ్చట ఇఞ్ హల్లుపరమగుటచే అకారముగ మాఱెను. పురోధ = పురోహితుఁడు, ఒక్కపరి = ఒక్కసారిగ - ఏకకాలమున. కొందఱు వసిష్ఠుఁడొక్కఁడే కాఁడనియు,।సూర్యవంశపురాజుల పురోహితులకెల్ల గౌరవార్థము వసిష్ఠనామధేయముకలదనియు నందురు. ఇది వారివాదమును ఖండించుచున్నది. వసిష్ఠునికుమారులనందఱ నేక కాలమున నాశముచేసినవాఁడు విశ్వామిత్రుఁడు. ఆ వసిష్ఠుఁడే మనపురోహితుఁ డగువసిష్ఠుఁ డనుటచే నిరువురు భిన్నులుగా రనుట నిర్వివాదము. కావున నొక్కొక్కరాజున కొక్కొక్కపురోహితుఁ డుండెననియు నాయనను వసిష్ఠుఁ డనుబిరుదపదముచేఁ బిలువఁబడుచుండె ననుటయు నిరాకరము. భువనవందిత = విష్ణుపత్నియగుటచే లోకమువారిచే నమస్కరింపఁబడినది, సర్వభూతధాత్రి = సమస్తభూతములను ధరించునది, ధరిత్రి = భూదేవి, భువనచక్షుస్సులు = లోకమునకుఁగన్నులగువారు. వారికాంతిలేకున్న కన్నులు వ్యర్థములు. పూజ్యులు = లోకులచేఁ బూజింపఁబడువారు, సూర్యజైవాతృకులు = సూర్యచంద్రులు, గ్రహములవాతఁ = రాహువుకేతువులనోట. 'ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టేరన్నం తతః ప్రజాః' నుండి 'తోన్న మభిజాయత', యని సూర్యునివలన వర్షము, వర్షమువలన నన్నము గలుగును. కావున సూర్యుఁడు పూజ్యుఁడు. ఓషధులకెల్ల చంద్రుఁ డధిపతి, రక్షకుఁడు. కావున లోకపూజ్యుఁడు.

తా. లోకమునందు నేనొక్కఁడనే దుఃఖ మనుభవించుచున్నాను. నాకున్నంతదుఃఖ మెవరికి లేదనుకొనకుము. ఇంద్రుఁడుగా నుండిన నహుషునికమారుఁడు స్వర్గమునకుఁ బోయియు నవివేకముచే నహంకారకారణమున మరలభూమిపైఁ బడలేదా? మనపురోహితుఁ డగు వసిష్ఠునిపుత్రులు నూర్వు రేకకాలంబున నశింపలేదా? సమస్తభూతములను సర్వదా మోచియుండు భూదేవి యొక్కొక్కసారి గడగడలాడదా? లోకమునకు కన్నులవంటివారగు సూర్యచంద్రులు రాహుకేతుగ్రహములవాతఁ బడరా? ఎంతమహాత్ములైనను దేవతాశ్రేష్ఠులైనను దైవసంకల్పమును దాఁటఁగలవా రున్నారా? ఎవరైనను గష్ట మెఱుఁగక కాలము సుఖముగానే కడపినారా? లేదుగదా. కావున ప్రాణులకు మేలుకీళ్లు స్వభావముగ వచ్చును, పోవును. దైవసంకల్పము దాఁటరా దనుటచే రాముఁడు వేఱు దైవమువే అనితలఁపరాదు. ఇదంతయు నీవు ముందు సంకల్పించి యవతరించినవాఁడవేకదా? ఇప్పుడేల విచారపడెదవు? అనిభావము.

క. హృత యైనను మృత యైనను, క్షితితనయ తదర్థ మిాపు ♦ చిత్తం బగలన్
వెత నొంద వలదు పామరు,గతి శోకము కార్యలాభ ♦ కరమే చెపుమా.

హృతయైనను = అపహరింపఁబడినను, మృతయైనను = చచ్చినను, తదర్థము = ఆమెనిమిత్తము, అగలన్ = పగులునట్లు.

తా. సీతాదేవి రాక్షసులచే నపహరింపఁబడినను, చచ్చినను, ఆనిమిత్తముగా నీవు గుండెలుపగుల నేడ్వవలదు. అది జ్ఞానములేనివాఁడు చేయుకార్యము. ఏడ్చుటవలన రాఁగలలాభమేమి? నీవిట్లేడ్చుచుండిన సీతాదేవి వచ్చునా? ఏడ్చుటవలన దేహము మనస్సు చెడుట లాభమేకాని మఱియేమి లాభములేదు. జ్ఞానము కలవాఁడు దేనికిని దుఃఖింపఁడు.

క. నినుబోఁటి సత్యదర్శను, లనయము దుస్సహతరార్తు ♦ లంటిన యేనిన్
మనమున నేనియు వగ గొన, రనఘయ నిర్విణ్ణదర్శ♦నాథ్యులు గానన్. ౧౧౩౮

నినుబోఁటి = నీవంటి, సత్యదర్శనులు = యథార్థము తెలిసినవారు, అనయము = ఎల్లప్పుడు-ఏకాలమందైనను, దుస్సహతర+ఆర్తులు = కొంచెమైనను సహింపరాని వ్యసనము, మనమున నేనియున్ = మనస్సునందైనను. మనస్సునందే లేనపుడు వెలుపల నెట్లు కానవచ్చును? అనఘ = దోషరహితుఁడా, అనిర్విణ్ణదర్శనాఢ్యులు = విషాదములేని యంతఃకరణముచే సంపన్నులు.

తా. అనఘా! జీవకోటులయథార్థస్థితి యనఁగా జననమరణములు, సుఖదుఃఖములు, శోకసంతోషములు, సంయోగవియోగములు లోనైనవి నిత్యములుగావు. వచ్చుట,పోవుట, వానిస్వభావగుణములు. కావున వానికై పరితాపపడరాదని తెలిసినవారు సహింపరాని యెంతటివ్యసనము కలిగినను వెలుపల రోదనము మొదలయినవి చేయమి యటుండ మనస్సునందైనను నిట్టివ్యసనము వచ్చెనేయని తలఁపరు,

క. వరమతి నాలోచింపుము, సరి యగునే నీకు నిట్లు ♦ సంతాపింపన్
గురుబుద్ధి శుభాశుభములు, పరికింతురు నైజమేధ♦బలమున విబుధుల్. ౧౧౩౫

వరమతి = గొప్పమనస్సుతో నాలోచింపుము, నైజమేధ = స్వభావసిద్ధమైన బుద్ధియొక్క, విబుధుల్ = జ్ఞానముగలవారు, పండితులు.

తా. నీచమైన హృదయదౌర్బల్యము వదలి గొప్పమనస్సుచేసి యీప్రకారము వ్యసనపడ నీకుఁ దగునేమో యాలోచింపుము. జ్ఞానముగలవారు స్వభావసిద్ధమైన బుద్ధిబలముచే మేలుగీళ్లను బరీక్షింతురు.

క. కనరానిదోషగుణతతు,లను గలిగి యనిశ్చితపుఫ♦లంబును నొక
ర్మనిచయముల నొనరింపక, మనుజుం డిటుసౌఖ్యదుఃఖ♦మగ్నుం డగునే.

ఆమేలుగీళ్లు పూర్వజన్మంబులందు మనముచేసిన పుణ్యాపాపము లని చెప్పుచున్నాఁడు.

కనరానిదోషగుణతతులను = ప్రత్యక్షముగాఁగనఁబడక శాస్త్రముచేతనే తెలిసికొనఁదగిన సుఖదుఃఖము లనెడిగుణదోషములను, అనిశ్చితపు ఫలంబును = ఇట్టికర్మమున కిట్టిఫల మనిప్రత్యక్షముచే నిశ్చయింప సాధ్యముకానిదియగు, కర్మనిచయములన్ = పుణ్యాపాపకర్మములను, ఒనరింపక = చేయక, సౌఖ్యదుఃఖమగ్నుండగునే = సుఖదుఃఖములందు మునుఁగునా?

తా. పూర్వముచేసిన పుణ్యాపాపకర్మముల గుణములుగాని దోషములుగాని మన మిప్పుడు ప్రత్యక్షముగాఁ జూడఁజాలము. మన మీకర్మము చేసితిమి, మన కీఫలము కలుగు నని నిశ్చయముగాఁ జెప్పుటకును సాధ్యపడదు. ఈకర్మము నీవిధముగఁ జేయుటచే నీఫల మిప్పు డనుభవించుచున్నా మని కర్మముచేసినవిధము చెప్పుటకును సాధ్యపడదు. కాని, కారణములేక కార్య మెన్నఁడును గలుగదు. ఫలమును మన మిప్పు డనుభవించుచున్నాము కావున దీనికిఁ గారణమైనకర్మమును దేనినో జేసితి మని చెప్పవచ్చును. అట్టికర్మము చేయుటచేతనే యిప్పు డీఫలము గలిగినదనియుఁ జెప్పవచ్చును. మనకుఁ గారణము దెలిసినను దెలియకున్నను ననుభవము దప్పదు. కావున సుఖ మనుభవమునకు వచ్చినపుడు మనమేదో పుణ్యము చేయుటచేఁగదా మన కీసుఖము గలిగెను, గనుక మనము పుణ్యమే చేయుదము, అనియు, దుఃఖ మనుభవించునపుడు మనము పూర్వమున నేదోపాపముచేయుటచేఁగదా మన కీదుఃఖము ప్రాప్తించెను. మన మిఁకఁ బాపము చేయరాదనియుఁ దెలిసికొని, మనము చేసిన కర్మముఫలము మన మనుభవింపకతీఱదని మనస్సు దృఢపఱచికొని సంతోషమునకుఁ బొంగక, వ్యసనమునకుఁ గ్రుంకక యుండవలెను.

క. ఈవిధమున రామా! ము, న్నీవే బోధించినాఁడ ♦ వీ విపుడు వగన్
హోవడి పడిమెద వేనియు, దేవగురుం డైన నీకుఁ ♦ దెలుపం గలఁడే. ౧౧౩౮

తా. ఈవిధముగ రామచంద్రా! నీవే నాకుఁ బూర్వము బోధించితివి.

ఇప్పుడు నీవే వ్యసనముచే బాధపడుచున్నావు. నీవు తెలిసినవాఁడ వనుకొందునా? తెలియనివాఁడ వనుకొందునా? తెలిసియుఁదెలియనొల్లని నీకుఁ దెలుప దేవతలగురు వగుబృహస్పతియు సమర్థుఁడుగాఁడు. ఇంక నేనెంతవాఁడను?

క. "మఱచినఁ దలఁపింపఁగను। నెఱుఁగనినాఁ డెల్లపాట్ల నెఱిఁగింపనగున్। ఎఱిఁగి మఱి యెఱుఁగనొల్లని, కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే।" భార.

"తెలిసియుఁ దెలియని నరుఁ దెల్ప బ్రహ్మదేవుని వశమే"॥ భర్తృహరి.

క. నీనిశ్చలమతి సురలకు, నేనియు దుర్లభము వగపు♦నెచ్చున యుష్మత్
జ్ఞానము ప్రసుప్తమైనను, మానక బోధింప వలసె ♦ మఱకువ దీఁజన్. ౧౧౩౭

తా. రామచంద్రా! నీవు మూర్ఖుఁడవు గావు. కార్యాకార్య ధర్మాధర్మ విషయమున నీకుఁ గల స్థిరజ్ఞానము దేవతలకును లేదు. అయినను దుఃఖాతిశయ ముచే నీజ్ఞానము నివురుగప్పిన నిప్పువలె నిద్రబోవుచున్నది. కాఁబట్టి నీమఱపు పోవ బోధింపవలసివచ్చెనుగాని నీకుఁ దెలియనిది నేను గ్రొత్తగాఁ జెప్పరాలేదు.

క. నోరెఱుఁగని నరులను నప,కారులు గానట్టిసురలఁ ♦ గారింపకు నీ
శూరతఁ దలంపు భవదప,కారిం గని పట్టి దండ్యుఁ♦గాఁ జేయు మనన్. ౧౧౩౮

నోరెఱుఁగని = చెప్పుకొనుటకుఁ జేతఁగాని, అపకారులు = కీడుచేసినవారు, కారింపకు = బాధింపకుము, శూరతన్ = శౌర్యమును, భవదపకారిన్ = నీకునప కారముఁ జేసినవానిని, దండ్యుగా = శిక్షకుఁబాత్రునిగా.

తా. రామచంద్రా! మనుష్యులను జూతమా వారు నీయొద్దకువచ్చి మాపై నీకేల కోపము? మేమేమి చేసితిమి పాపము? నీకుఁ గీడుకోరువారము కామే యని యామాత్రము చెప్పుటకుఁ దెలియనివారు. దేవతలందఱూ నీవలన బాగుపడఁగోరు వారు. కావున నీ కపరాధము చేసినవారుగారు. కావున వారి నేల బాధింపఁ దలఁచెదవు. వ్యర్థకోపమువలన వ్యర్థశోకమువలన నేకార్యము కాఁజాలదు. మన కపకారముచేసినవాఁ డెవఁడు అని వానిని గనిపెట్టి నీవు శూరుఁడవు కావున వానిని దండింపుము. దానివలన నీకు సీత మరల లభించును, కీర్తియుఁ గలుగును. 'ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీ'యన్నటు లుద్యోగవంతునిఁగదా సర్వశ్రేయస్సులు వరించును. బంధువియోగముచే దుఃఖించువారికి వారిహితు లిట్లు బోధింపవలయు నని సూచన.

## ౬౭-వ సర్గము. రాముఁడు లక్ష్మణువాక్యంబుల శాంతుఁడై సీతను వెదకుట.

శా. సారంబైనసుభాషితార్థముల నా♦సౌమిత్రి యన్నంతనే
సారగ్రాహి తదగ్రజుండును మహా♦సారంబుఁ గైకొంచుఁ గో
పారంభం బుపసంహరించి ధను ♦ వాధారంబుగా నిల్చి వ
త్సా! రామం గన నెందుఁ బోద మెది సే♦యం బోలు భావింపుమా. ౧౧౩౯

తివా, వీఁడు రాక్షసుఁడు, సీతను మ్రింగి మనము చంపుదు మనుభయముచే గ్రద్దై హాయిగా నున్నాఁడు.

క. వీనిని మద్ఘోరేషువి,తానంబులఁ జీల్చువాఁడఁ ♦ దడయక యని సీ
తానాయకుఁ డభిముఖుఁ డై, పూనఁగ శర మొండు వఁ్రకె ♦ భూతల మెల్లన్.

మద్ఘోర = నాభయంకరములైన, ఇషు = బాణములయొక్క, వితానంబులన్ = సమూహములచే, అభిముఖుఁడై = ఎదురుగాఁబోయి.

తా. వీనిని నాభయంకరబాణసమూహముచే నిప్పుడే యాలస్యములేక చీల్చెద నని వెనుకనుండి కొట్టరాదుగావున నెరుదుగఁ బోయి యొకతీవ్రబాణమును సంధింపఁగా భూతలము వఁ్రకెను.

క. నెత్తురు లాలలు గ్రక్కుచు, హత్తినమరణాంతబాధ ♦ నారటమున డ
గ్గుత్తికతోడ విహంగమ,సత్తముఁ డిట్లనియె రామ♦చంద్రునితోడన్. ౧౧౪౭

లాలలు = జొల్లునీళ్లు, మరణాంతబాధ = మరణముసమీపించినపుడు కలుగువేదనయొక్క. ఆరటమునన్ రూ. ఆరాటమునన్ = తాపముచే, డగ్గుత్తికతోడ = గద్గదస్వరముతో, విహంగసత్తముఁడు = పక్షిశ్రేష్ఠుఁడు.

తా. నెత్తురు చొంగ గ్రక్కుచు మరణతాపముచే బాధపడుచు గద్గదస్వరముతో రామచంద్రునితో పక్షిరా జిట్లనెను.

—జటాయువు రామునకు సీతాపహరణవృత్తాంతముఁ జెప్పుట.—

క. ఆయుష్మంతుఁడ! యోషధి,నో యన వని నెద్ది రోయు ♦ చున్నారో మీ
రాయంగన నాప్రాణం, బీయెడ రావణునిచేత ♦ హృత మీరెండున్. ౧౧౪౮

ఆయుష్మంతుఁడ = దీర్ఘాయువుకలవాఁడా! ఇది దీవన. బిడ్డలను చిరంజీవు లన్నట్లు, ఖరాదులవధవలన రామచంద్రమూర్తిబలాదు లెఱిఁగియు సీతావిషయము వినఁగానే యేమగునో యని శంకించి యాయుష్మంతుఁడా యని దీవించెను. "జీవన్ భద్రాణి పశ్యతి" బ్రతికియుండిన శుభములు పడయవచ్చునని. కావున సాహసము చేయకుము, అనిబోధ. ఓషధినో = మూలికయన - ఓషధినోయన్నట్లు. ఓయన - ఉత్ప్రేక్షావాచకము. హృతము = అపహరింపఁబడెను. అడవులలో వెదకువారు మూలికలనేకదా వెదకుదురు.

తా. ఆయుష్మంతుఁడా! అడవియందు నోషధిని వెదకినట్టు దేనిని వెదకుచున్నారో యట్టిసీతయు నాప్రాణము రెండును రావణుచే నపహరింపఁబడినవి.

ఉ. నీవును లక్ష్మణుండును వ♦నీక్షితి నొంటిగ వీడి చన్నయా
పావని సీత నెత్తికొని ♦ బల్మిని రావణుఁ డుప్పరంబునన్
బోవుచు నుండఁ జూచి యొక ♦ పూఁపున నడ్డము దాఁకి వానితో
లావునఁ బోరి తద్రథ మి♦లాస్థలిఁ గూల్చితి వాని డొల్చితిన్. ౧౧౪౯

పావని = పవిత్రచరిత్రను, బల్మిని=బలవంతముగా, ఉప్పరంబునన్ = ఆకాశమున, పూఁవున = ప్రయత్నముచే, లావునఁబోరి=బలముతోపోరి - యుద్ధముచేసి, ఇలాస్థలిన్ = భూమియందు, డొల్చితిన్ = పడఁద్రోచితిని.

తా. నీవును లక్ష్మణుఁడు నిరువురు పావనియగు సీతను నొంటిగా నడవిలో విడిచిపోఁగా రావణుఁడు బలవంతముగా సీతను బట్టుకొని యాకాశమునఁ బోవుచుండఁగా నేను జూచి యొకవిసరున వారి కడ్డముపోయి యెదిర్చి వానితో బలముకొలఁది యుద్ధముచేసి వానిరథమును నేలఁ బడఁగొట్టి వానిని గ్రిందఁద్రోచితిని.

క. అదె నే విఱిచినచాపం, బదె తూణి మదీయపక్ష♦హతసారథి వాఁ
డదొ తేరు నేను డస్సిన, ముదుక నగుట నతఁడు ఖడ్గ♦మున నాఱెక్కల్.

తూణి = అంబులపొది, మదీయపక్షహతసారథి = నాఱెక్కలదెబ్బచేఁ జచ్చినసారథి, డస్సిన = బడలిక చెందఁగా, ముదుకన్ = ముసలివాఁడను.

తా. నేను విఱిచినవిల్లదిగోఁ బడియున్నది. అదిగోఁ బొది. నాఱెక్కల దెబ్బచేఁ జచ్చినసారథి యదిగోఁ బడియున్నాఁడు. అదిగో నేను బడఁగొట్టిన తేరు. నేను ముసలివాఁడనై బడలితిని. అప్పుడు తనకత్తిచే నాఱెక్కలను

క. తెగ నఱికి తెఱవఁ గొనుచున్, గగనంబునఁ బఱచెఁ బంక్తి♦కంఠుఁడు మున్నే
మగువకయి చంపె నీవుం, దగవే వెండియును జంప ♦ దశరథపుత్రా.          ౧౧౪౧

తెగన్ = దేహమునుండి తెగిపోవునట్లు, తెఱవన్ = స్త్రీని, సీతను, మున్నె = ముందే.

తా. తెగి నేలఁబడినట్లు నఱికి సీతను బట్టుగొని రావణుఁ డాకాశమునఁ బరువెత్తెను. నీభార్యకై ముందే దశకంఠుఁడు నన్నుఁ జంపెను. నామిత్రుఁడగు దశరథునిపుత్రా! చావనున్నవానిని నీవుకూడఁ జంపవలయునా ?

## —జటాయుదుస్థితికి రాముఁడు దుఃఖించుట.—

చ. అన విని బాష్పపూర్ణముఖుఁ♦డై ద్విగుణీకృతతాపసక్తుఁడై
ధను వటు పాఱవైచి నృప♦తల్లజుఁ డాతనిఁ గౌఁగిలించి హా
యని వివశాత్ముఁడై పడి స♦హానుజుఁడై పలవించె నొంటివా
నిని వనిఁ గాలిత్రోవఁ బడి ♦ నిశ్వసనంబులు పుచ్చుపుణ్యునిన్.          ౧౧౪౨

ద్విగుణీకృత = ఇబ్బడించిన, తాపసక్తుఁడై = తాపముతోఁ గూడినవాఁడై, నృపతల్లజుఁడు = రాజశ్రేష్ఠుఁడు, వివశాత్ముఁడై = పరవశమైనమనస్సు గలవాఁడై, సహానుజుఁడై = తమ్మునితోఁగూడినవాఁడై. ఇట్లనుటచే లక్ష్మణుఁడు కూడ నేడ్చెననిభావము. ఈజటాయువుముసలిగ్రద్ద చేసినంతసేవ నేను జేయలేకపోయితినిగదా! కలకాలము కాచికాచి సమయమునకు ముఖముతప్పించితినిగదా! అని లక్ష్మణుఁడు దుఃఖించెను. పలవించెన్ = విలపించెన్, నిశ్వసనంబులు = నిట్టూర్పులు.

తా. అని చెప్పఁగా విని కన్నీళ్లచే నిండినముఖముగలవాఁడై యిబ్బడించిన తాపముగలవాఁడై విల్లు దూరమున బాఱవేసి రాజశ్రేష్ఠుఁడగు రామచంద్రమూర్తి యతనిని కౌఁగిలించి 'హా' యని పరవశుఁడై పడి తమ్మునితోడ నేడ్చెను. లక్ష్మణా! ఒంటరివాని నడవిలోఁ ద్రోవలోఁ బడి యెగయూపిరివిడుచు పుణ్యాత్ముని

పరమేశ్వరుఁ డగుశ్రీరాముఁడు భక్తపక్షపాతమువలన భక్తుఁడగు జటాయువునకుఁ గలిగిన యాపదఁజూచి పరమప్రియయగు సీత రావణునిచే నపహరింపఁబడెనని విని, "వ్యసనంబులు జనములకును, బొసఁగినఁ దా నధికదుఃఖమును బొందును" (అయోధ్య ౬౫). అని యుండుటచే "భక్తాపదఁ జూచి యిబ్బడియగు తాపమున నార్తుఁడయ్యెను" అని మహేశ్వరతీర్థీయము. ఈన్యాయ్యమే సీతయందు నన్వయింపవలసిన దని యీవ్యాఖ్యాత యభిప్రాయము. ఇది గోవిందరాజ సమ్మతము. ఒకటి వగలేదుపు, ఒకటి నిజమైనయేడు పయ్యేనేని యట్టివగపు ద్విగుణితమనఁదగునా? రెండుసమానములైనఁగదా ద్విగుణితము.

ఉ. తమ్ముఁడ చూడుమీ యకట ♦ ధారిణిరాజ్యము వేఱుపాటు భీ
 ష్మమ్మగుకాననస్థలిని ♦ సంకటపాటు ధరాత్మజాత నిం
 దిమ్మెయిఁ గోలుపాటు విహ♦గేశ్వరు త్రుంగుడుపాటు నాయభా
 గ్యమ్మెటువంటిదో కనితె ♦ కాల్పఁగ నోపుఁ గృశాను నేనియున్. ౧౧౫౩

అభాగ్యము = దురదృష్టము, కృశానుఁడు = అగ్నిహోత్రుని.

తా. లక్ష్మణా! నానిర్భాగ్యదశయెట్టిదో చూచితివా? అయ్యో! రాజ్యము పోవుట, భయంకరారణ్యమ్ముల దుఃఖపడుట, సీతను నింద పోఁగొట్టుకొనుట, జటాయుమరణము ఇవియన్నియు సర్వము దహించు నగ్నిహోత్రునైనఁ గాల్పఁగ నోపును.

అయోధ్యాకాండమందు రాత్రి చంద్రునికాంతి హరింపలేనట్లు రాజ్యనాశము రామునికాంతిని హరింపలేదు అనియు, రాజ్యాభిషేకము మేలా, వనవాసము మేలా యన్నప్పుడు వనవాసమే మేలని ముందు చెప్పఁబడెను. అట్టిది యిప్పుడేల దుఃఖకర మయ్యెననిన

"ఒనరభార్యాసమేతుఁడై యున్నవాని
కెంతయాపదలయ్యును నెఱుకపడవు."

క. అలయు నెడ డయ్యు నెడనాఁ, కలియుఁ దృషయున్నయెడలఁ♦గనుఁగొని ధరణీ
తలనాథపురుషునకు ని,మ్ములభార్యయ పాచుచిత్త♦మున దుఃఖంబుల్॥ భార॥

సీ. ధర్మార్థకామసా♦ధన కుపకరణంబు, గృహనీతివిద్యకు♦గృహము విమల
 చారిత్రశిక్ష కా♦చార్యకం బన్వయ, స్థితికి మూలంబు స♦ద్గతికి నూఁత
 గౌరవంబున కేక♦కారణం బున్నత, స్థిరగుణామణుల కా♦కరము హృదయ
 సంతోషమునకుసం♦జనకంబు భార్యయ, చూవె భర్తకు నొండ్లు♦గావు ప్రియము

లెట్టిఘట్టములను, నెట్టియాపదలను, నెట్టితీరములను♦ముట్టఁబడిన
వంతలెల్లఁ బాయు♦నింతులఁ బ్రజలను, నొనరఁ జూడఁగనిన♦జనుల కెందు॥ భార॥

అనియుండుటచే నపుడు సీతాదేవికూడ నుండుటచే రామున కప్పు డట్లుం డెను. భర్తకు మనస్సునకు దుఃఖము స్పృశింపరాకుండునట్లు మాటలచేత, నుప చారాములచేత సంతోషపెట్టుచుండెను. ఇప్పు డామె పోవుటచే నన్నియు దుఃఖ కరములై కానవచ్చెను.

గీ. పెక్కుదివియ లున్న♦జక్కవచెలి యున్న, రిక్కరాయఁ డున్నఁ♦జుక్కలున్నఁ
జిన్ని లేడిచూడ్కి♦చేడియ నెడఁబాయ, నప్పుడంధకార♦మయ్యె జగము॥ భర్తృ॥

కావున రాజ్యముపోవుట దుఃఖకర మయ్యెను. ఆకస్మికముగ వచ్చిన రాజ్యము పోయినఁబోనీ, లోకములో నందఱు రాజ్య మేలి సుఖించుచున్నారా! అనిన నింటిలోఁ బడియుండుటకైన లేక వనవాసప్రాప్తి, అడవులలో భార్యలతో వానప్రస్థులు సుఖముగ లేరా యనిన భార్యను గోలుపోవుట, అందఱు భార్యల తోనే యున్నారా? బంధువులతోడనైన నుందమనినఁ బ్రాణస్నేహితుఁడు తమకై చచ్చుట యివియన్నియు నుత్తరోత్తర దుఃఖాభివృద్ధికిఁ గారణములు. తగిలిన కాలే పలుమాఱుతగిలెనేని మొదట లక్ష్యపెట్టకున్నను మూఁడునాలుగు మార్లు గాయపడినపిమ్మట నొప్పి తెలియకపోదు. అప్పుడు ప్రాఁతవికూడ జ్ఞప్తికి వచ్చును.

క. ఘోరార్తితాప మాఱఁగఁ, బారావారంబుఁ జొరఁగఁ ♦ బాఱితి నేనిఁ
నీరము నాదౌర్భాగ్యము, పేరిమి శోషిల్లు నేల ♦ బీఁటిక లెగయున్. ౧౧౫౮

పారావారంబు = సముద్రమును, బీఁటికలు = పగుళ్లు.

తా. సహింపరాని యీతాపము చల్లార్చుకొన నేను సముద్రములో దూఁకి నను నాదేహము వేఁడిమిచే సముద్ర మెండుటయేగాక నేలగూడఁ బగుల్లు పాఱును.

క. నాకంటెను నిర్భాగ్యుఁడు, లోకంబున లేఁడు పరివి♦లోకించినచో
నీకరణి దుస్తరం బగు, ప్రాకటదుర్వ్యసనవాగు♦రం జిక్కుటచేన్. ౧౧౫౯

వాగురన్ = వలయందు.

తా. ఈవిధముగఁ దరింపరాని చెడ్డవ్యసన మనువలయందుఁ జిక్కుటచే నెంత వెదకిచూచినను నాకంటె నదృష్టహీనుఁడు లోకమున లేఁడు.

క. మనజనకునిమిత్త్రుం డీ, యనఘుఁడు ముదుకఁడు విహంగ♦మాధిపుఁ డయో
వినిహతుఁడై పడియెను ధా, త్రిని నాదురదృష్టవశత ♦ దీనతఁ గంటే. ౧౧౬౦

అనఘుఁడు=పుణ్యాత్ముఁడు, 'పరోపకారః పుణ్యాయ' యన్నట్లు పరోపకార మందు దేహమువిడిచినవాఁడు.

తా. ఈయన మనతండ్రిస్నేహితుఁడు, పుణ్యాత్ముఁడు, ముసలివాఁడు, పక్షి రాజు, నానిర్భాగ్యదశవలన కొట్టఁబడినవాఁడై నేలఁబడెను చూచితివా!

క. అని జనకస్నేహమ్మున, ననుజునితో లూనపక్షు ♦ నస్రుసుస క్తున్
దనకేలం దడవి యేదీ, యనఘా! నాప్రాణతుల్య ♦ యని ధర వ్రాలెన్. ౧౧౫౭

తా. తండ్రిమిత్రుం డనుస్నేహముచేం దమ్మునితోం జెప్పి ఱెక్కలు నఱకంబడి నెత్తురుకాఱుచున్నవానిని తనచేతితోం దుడిచి 'పుణ్యాత్ముండా' నాప్రాణములతో సమానురాలగు సీత యేదీ యెం దున్నది యని నేలపైంబడెను.

## ౬౮-వ సర్గము. జటాయువు రామునకు సీతావృత్తాంతము సవిస్తరంబుగం జెప్పుట.

ఉ. తెప్పిఱి లేచి లక్ష్మణుని ♦ దిక్కుం గనుంగొని కంటె తమ్ముండా
యిప్పరమోపకారి విహ ♦ గేంద్రుండు నాకయి పూని తెంపుపెం
పొప్పంగం బోరి కూలి కొ ♦ యూపిరితోం బడినాండు, పల్కంన
చ్చొప్పును దోంప, దెల్లు కడు ♦ సూక్ష్మ మ టంచును బల్కి కిట్లనున్. ౧౧౫౮

తెప్పిఱి = మూర్ఛనుండి తేఱి.

తా. ఇట్లు మూర్ఛనుండి లేచి లక్ష్మణునితో రామచంద్రమూర్తి యిట్లనియె: 'తమ్ముండా! మహోపకారముచేసిన యీపక్షిశ్రేష్ఠుండు నాకయి ప్రయత్నించి తెగించి యుద్ధముచేసి పడి కుట్టుసురుతోం బడియున్నాండు. మాటలాడ శక్తి యున్నట్లును గానరాదు. ఏదో యొకమాట చెప్పినను చాలహీనస్వరము' అని జటాయువుతో నిట్లనియె:

శా. ఓదక్షాయ్యకులాధినాయక! జటా ♦ యూ! పల్కనే ర్తేని సీ
తాదేవింగుఱిచియుంచి నీవధముచం ♦ దంబున్ ధరాకన్య నే
లా దైత్యుండు హరించె? నాతం డెద న ♦ ల్గం గారణం బేమి? మి
త్రా! దేవ్యాస్యము చంద్రతుల్య మెటు త ♦ త్కాలంబునం దుండెనో? ౧౧౫౯

దక్షాయ్యకులాధినాయక = గ్రద్దలకులమునకు ప్రభువా, జటాయూ! ఇది సంబోధన ప్రథమ. భూసురోత్తమ 'జగత్కారూ'యని నన్నయభట్టుప్రయోగము. ఈరూప మాచ్ఛికశబ్దంబుల రాదు. నాకొడుకూ, నాతమ్ముండూ, అనరాదు. దేవ్యాస్యము - దేవి + ఆస్యము=సీతాదేవిముఖము. సీతముఖమెట్లుండె ననుటకుం గారణము, సంతోషముతోం బోయెనా దుఃఖించుచుం బోయెనా? తనయందలి ప్రీతి యేమాత్రము తెలిసికొనుటకును సంతోషముతోం బోయెనేని యామెకై శ్రమపడ వలసినపని లే దనుటకును.

తా. ఓగ్రద్దఱేండా, జటాయూ! మాటలాడశక్తిగల దేని, సీతాదేవి గుఱించియు నీవు చంపంబడినవిధము, ఏల సీతను రాక్షసుండు పట్టుకొనిపోయెను, వాని కేల నామీందం గోపము కలిగెను? అప్పుడు సీతాదేవిముఖ మెట్లుండెను? చెప్పుము.

ఉ. ఆమెయిఁ గొంచు నేగ దురి♦తాత్ముఁడు తన్ను ధరిత్రికన్య దా
నే మనుచుండె? నప్పలుకు ♦ లేర్పడఁ జెప్పుము, దైత్యుఁ డెట్టివాఁ
డేమెయివాఁడు? వానిపుర ♦ మెయ్యది? శౌర్యము దెంతమట్టు? తం
డ్రీ! మన మారఁగాఁ బలుక♦వే సతి నెట్లు హరించి యేగెనో? ౧౬౦

తా. ఆవిధముగఁ బాపాత్ముఁ డారాక్షసుఁడు తన్నుఁ దీసికొనిపోవుచుండ నప్పుడు సీత యేమనుచుండెను? ఆమాటలు స్పష్టముగఁ జెప్పుము. ఆరాక్షసుఁ డెట్టి వాఁడు, ఏదేహమువాఁడు, వాఁ డుండుపుర మేది. వాఁడేమాత్రము శూరుఁడు? తండ్రీ సీత నేవిధముగఁ బట్టుకొని పోయెనో సర్వము చెప్పుము.

ఛందస్సు—రెండును బ్లుతాక్షరములే యయినప్పుడు స్వరమైత్రియుండినఁ జాలును. వ్యంజనమైత్రితోఁ బనిలేదు. దీనికి ప్లుతయుగవిశ్రామయతి యనిపేరు.

క॥ తామేవర్ణములైనను, ఱ్ఱామండలమునను బ్రాణ♦మైత్రిగలిగినన్। దామోదర ప్లుతయుగ వి,శ్రామము లనఁగాఁ బ్లుతాక్షరద్వయ మమరున్॥ అప్పకవి.

ఇందు నాలుగవపాదంబున రెండును బ్లుతాక్షరములే.

ఉ. ఈవిధి రాముఁ డాడ విహ♦గేంద్రుఁడు మెల్లన విచ్చి ఱెప్పలన్
భూవిభు మోముఁ జూచుచు న♦నుం గడు నీరెలుఁ గొప్ప రామ! మా
యావి సమీరదుర్దినస♦మాకులవిస్తృతమాయ గూఢుఁడై
రావణుఁ డేగె మింటను ధ♦రాసుత బల్మి హరించి క్రూరుఁడై. ౧౬౧

విహగేంద్రుఁడు = పక్షిరాజు, జటాయువు, ఈరెలుఁగు = సన్ననిధ్వని, మాయావి = మాయలమారి, సమీర=గాలితోఁగూడిన, దుర్దిన= మేఘములచేఁ గప్పఁబడినదినముచే, సమాకుల = మిక్కిలినిండిన, విస్తృత=విస్తరింపఁబడిన, మాయ=అద్భుతశక్తిచే. తనశక్తిచే పెనుగాలి వీచునట్లును ఆకాశమున మబ్బులు క్రమ్మునట్లును జేసి యెవరికిఁ గనరానివిధమున-గూఢుఁడై = ఎవరికిఁ గానరాక డాఁగినవాఁడై, మింటను = ఆకాశమార్గమున, బల్మిన్ = బలవంతముగ.

తా. ఈప్రకారము రామచంద్రమూర్తి యడుగఁగా జటాయువు మెల్లగ ఱెప్పలు తెఱచి రాముని జూచుచు మిక్కిలిసన్ననిగొంతుతో నిట్లనియె: 'రామా! వాఁడు మాయగాడు. తనశక్తిచే పెనుగాలిని మబ్బులగుంపును గల్పించి వాని చాటున నెవరికిఁ గానరాకుండ రహస్యముగ సీతాదేవిని శూరుఁడై బలాత్కార ముగఁ బట్టుకొని యాకాశమార్గమునఁ బోయెను'.

క. బెడిదపుసంగరమున నే, బడలిన ననుఁ గాంచి మీఁదఁ ♦ బడి ఱెక్కలఁ దా
నడిదమున నడిచి యసురుఁడు, కడువడి దక్షిణముఖంబు♦గాఁ బరువెత్తెన్.

తా. భయంకరయుద్ధమందు గాసిపడిన నన్నుఁ జూచి నామీఁదఁబడి కత్తిచే నాఱెక్కలు నఱికి మిగులవేగముగ దక్షిణపుదిక్కుగా పరువెత్తెను.

క. రామా! కన్నులు దిరిగెడి, నామనము వశంబు గాదు ♦ నాయన! తావుల్

దా మెడలెను బ్రాణంబులు, హేమాగము లవిగో నభయ♦కృతకేశము లై.

తావుల్ =స్థానము. ఇది యన్యదేశ్యము. హేమాగములు=బంగారుచెట్లు, అభయ=వట్టివేళ్లచే, కృత = చేయఁబడిన, కేశములై=వెండ్రుకలుగలవై. మరణకాలమున నిట్టిచెట్లు కానవచ్చును.

తా. రామా! కన్నులు తిరుగుచున్నవి. నామనస్సు నాస్వాధీనమందు లేదు. ప్రాణవాయువులు వానివానిస్థానములనువదలినవి. అవిగో వట్టివేళ్లకొనలుగల బంగారుచెట్లు కానవచ్చుచున్నవి.

ఉ. ఆయమరారి భూమితన♦యన్ హరియించినమూర్తముం గనన్
బోయినసొమ్ము స్వామి వెసఁ♦ బొందుట తప్పదు, తత్తఱాన దై
తేయుఁడు తన్ముహూర్తము మ♦దిం దెలియం, డది వింద యండ్రు, నీ
జాయ హరించి వాఁడు బడి♦శంబును మ్రింగినచేఁపయట్టు లౌ. ౧౧౬౪

స్వామి = సొమ్ముగలవాఁడు, స్వమ్ము = సొత్తు - అదిగలవాఁడు స్వామి. భగవంతుని స్వామి యనుటకు చరాచరము లాయనసొమ్మగుటచేతనే. తత్తఱాన = తొందరచే, జాయన్ = భార్యను, బడిశంబును = గాలమును, వింద = నష్టమైనధనము, దీనిచేఁ బొందును గాన దీనికి విందయని పేరు. ఇది పగటపదు నొకండవ ముహూర్తము.

రౌద్ర శ్శ్వేతశ్చ మైత్రశ్చ తథా సారభటః స్మృతః
సావిత్రో వైశ్వదేవశ్చ గాంధర్వ కుతప స్తథా
రౌహిణ స్తిలకశ్చైవ విజయో నైరృత స్తథా
శంబరో వారుణశ్చైవ భగః పంచదశస్స్మృతః॥ ఈపదునైదు పగటిముహూర్తములు. ఇందు విజయముహూర్తమునకు విందయని నామాంతరము-మహేశ్వరతీర్థీయము.

తా. రాక్షసుఁడు సీతాదేవిని హరించిన ముహూర్తమును జూడఁగా నం దపహరింపఁబడిన సొమ్ము మరలస్వామిని జెందును. తప్పదు. ఆరాక్షసుఁడు తొందరచే దీని గమనించినవాఁడు కాఁడు. ఆముహూర్తముపేరు వింద. పోయినసొమ్ము మరల సొమ్ముగలవానిని జేరును గావున దానికి విందయనిపేరు. కావున నీభార్య నపహరించినవాఁడు గాలము మ్రింగినచేఁపవలె నగును.

క. వ్యథపడకుము జనకజకై, ప్రథితగుణా! నీవు ద్రుంచి♦రాక్షసనాథున్
బ్రథనమున మరల సతిఁ గొని, పృథుయశ మొప్పారఁ బురికి♦ నేగెదు నెమ్మిన్.

ప్రథనమునన్ = యుద్ధమందు, పృథుయశము = గొప్పకీర్తి.

తా. రామా! సీతకై నీవు వ్యసనపడవలదు. కీర్తికరములైన గుణములు గలవాఁడా! నీవు రాక్షసపతిని యుద్ధమునఁ జంపి మరల సీతను గ్రహించి గొప్ప కీర్తిని సంపాదించి సంతోషముతో నయోధ్యఁ జేరఁగలవు.

క. అని తెలివి చెడక యింతయు, మనుజేంద్రునితోడఁ బలికి ♦ మఱియు వచింపన్
జనునెడ మాంసము నెత్తురు, ఘనముగ వక్త్రంబునుండి ♦ గ్రక్కుచుఁ బైపై.

తా. ఇంతవఱకు స్మృతితప్పక తెలివితోఁ బలికి యాయన యడిగిన తక్కినప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మీయఁదలఁచి మాటాడఁ బ్రయత్నింపఁగా నింతలో మాంసము, నెత్తురు, నోటనుండి మీఁదమీఁద విస్తారముగఁ గ్రక్కుచు

క. ఔరసుఁడు విశ్రవునకున్, గౌరీవల్లభునిమిత్రు♦నకు సోదరుఁ డం
చీరీతిఁ జెప్పునాలో, నారవయూపిరియు నక్క♦టా వెడలి చనెన్. ౧౧౬౭

విశ్రవునకున్ = విశ్రవసుఁడనువానికి, ఔరసుఁడు = సొంతకొడుకు, గౌరీవల్లభుని = శివునియొక్క, మిత్రునకున్ = స్నేహితుఁడగుకుబేరునికి, సోదరుఁడు = తమ్ముఁడు, రవయూపిరి = కొంచెముగా ప్రాణవాయువు, అక్కటా వెడలిచనెన్ = అయ్యో వెడలిపోయెనే. చెప్పవలసిన విషయము పూర్ణముగాఁ జెప్పక ముందే ప్రాణముపోయెఁగదా యని కవి వ్యసనపడుచున్నాఁడు.

దీనికిఁ దరువాత జటాయువు చెప్పఁదలఁచినది "పేరనురావణుఁడు మదంబారఁగ వసియించు లంకయను నగరమునన్" అనునది కిష్కింధాకాండమున సంపాతి యీపూర్వార్ధమునే తీసికొని యుత్తరార్థమును జెప్పఁగలఁడు. ౧౩౨౩-వ పద్యముఁ జూచునది. కవితాచమత్కృతి యెంతయు వంద్యము.

తా. విశ్రవుఁ డనుముని కన్నకొడుకు, కుబేరునికి సోదరుఁడు అని యీ మాటలు చెప్పుచుండఁగాఁ గొంచెము మిగిలియుండిన యూపిరియు వెడలిపోయెను.

రామచంద్రమూర్తి శంబరాసురుకొడుకును జయించుటకై దండకారణ్యమునకు వచ్చియుండెను. విశ్వామిత్రుఁడు, శూర్పణఖ వీరు రావణాసురుని పేరెత్తినవారేకాని వానియునికిపట్టు లోనగువిషయములు చెప్పినవారు గారు. సముద్రతీరప్రదేశముతప్ప చిత్రకూటము మొదలు దక్షిణమధురవఱకు దండకారణ్యమే. దీనిలో శంబరుఁ డేప్రదేశమున నుండెనో తెలియలేదు. మునీశ్వరులు రాక్షసులని రాక్షసులని సమష్టిమీఁదను, ఖరుఁడని చెప్పిరిగాని రావణువిషయముఁ జెప్పినవారు గారు. వీరందఱు శూర్పణఖతప్ప బుద్ధిపూర్వకముగా నావిషయము దాఁచిరనియే యెంచవలసియున్నది. ఏలన, నీలోపల జరుగవలసినచరిత్ర కొంత గలదుగదా!

క. నుడువుమునుడువుమటంచుం,బుడమివిభుఁడు కేలుముడువఁ ♦ బులుఁగులతేఁడున్
విడిచి తనువు దివికిం జనె, నుడుకుచు రాముండు చూచు ♦ చుండఁగ వెతచేన్.

నుడువుము= చెప్పుము, కేలుముడువన్ = చేతులుజోడించి నమస్కరింపఁగా.

ఇంతకాలము జటాయు వెట్లు ప్రాణము బిగఁబట్టఁ గలిగెను ? ఒకనికి మనస్సున బలిష్ఠమైనకోరిక వేదన యుండెనేని యది నెఱవేఱువఱకుఁ బ్రాణముపోదు. ఇది యనుభవవిదితమే. ఆధారముతగ్గినా వెంటనే ప్రాణముపోవును. నావిషయము రామునకు నీవు చెప్పవలసిన దని సీతాదేవి కోరెను. ఈవిధమైన సాహా

య్యమైనను జేయవలయు నని జటాయువునకుఁ బూర్ణసంకల్ప ముండెను. అది నెఱ వేఱఁగానే ప్రాణముపోయెను. ఇట్లు జటాయువు జీవించుట సీతయనుగ్రహముచే నని స్కాందమునఁ జెప్పఁబడినది. "దేవీ మాం ప్రాహ రాజేంద్ర యావత్సం భాషణం మమ, భవతస్తావదాసన్మే ప్రాణా ఇత్యాహ జానకీ" నేను సీతతో మాట లాడువఱకు నీ ప్రాణములుండునని సీత నాతోఁ జెప్పెను—తీర్థీయము. సీతాదేవి యందిట్టి యనుగ్రహశక్తి పూర్ణముగఁ గలదు. అట్లు సంకల్పించియు నుండ వచ్చును. ఈమాటలు రావణుఁడు వినలేదు కాఁబోలు, వినియుండిన నపుడే జటా యుతల నఱికియుండును.

తా. చెప్పుము చెప్పుము, అని రాముఁడు చేతులు జోడించుకొని యడుగు చుండఁగా పక్షులరాజగు జటాయువు రామచంద్రమూర్తి సంతాపపడుచు చూచు చుండఁగా దేహమువిడిచి స్వర్గమునకుఁ బోయెను.

క. ఎఱు పొత్తఁ గనులఁ దుండముఁ, దెఱచుచుఁ దల వ్రేలవైచి♦స్థిరఁ బాదంబుల్
విఱివిగను సాఁచి దేహము, తఱచు వణఁక నుసుఱు విడిచి ♦ ధరపైఁ ద్రెళ్లెన్.

తుండము = నోరు, తఱచు = విశేషముగ. స్వభావోక్త్యలంకారము.

తా. కన్నులెఱ్ఱనగాఁగా నోరు తెఱచి తల వ్రేలవైచి భూమిమీఁదఁ బాద ములు వెడలుపుగను బొడుగుగను జాఁచి దేహము వణఁకుచుండ నూపిరివిడిచి నేలపైఁ బడెను.

—జటాయుమృతికి రాముఁడు శోకించుట.—

ఉ. ఆపడియున్నగృధ్రము జ♦టాయువుఁ గన్గొని రాముఁ డాత్మసం
తాపము దోఁప నిట్టు లనుఁ ♦ దమ్ముఁడ కీతఁ డనేకవర్షముల్
పాపపురక్కసావళికిఁ ♦ బట్టగుదండక నిర్భయంబుగా
నేపున నుండియుం దుదకు ♦ నిచ్చటనే మృతుఁ డయ్యెఁ గంటివే. ౧౧౭౦

తా. ఆవిధముగ నేలపైఁబడిన జటాయువును జూచి రామచంద్రమూర్తి మిగులఁబరితాపము గలవాఁడై లక్ష్మణునితో నిట్టులనెను. తమ్ముఁడా! ఇతఁ డనేక సంవత్సరములు పాపాత్ములగు రాక్షసులకు స్థానమైన దండకయందు తనపరాక్రమ ముచే భయములేక యుండి కడపట యిందే మరణించెఁ జూచితివా!

క. బాలత్వం బాదిగ నిట, వేలకొలఁదియేఁడు లిచ్చ ♦ విహరించి తుదిన్
గూలి యిచటఁ బడియెఁ గదే, కాలము దాఁటంగ రాదు♦గా యెవ్వరికిన్.

తా. చిన్నతనముమొదలుకొని యిచ్చట వేలకొలఁది సంవత్సరములు తన యిష్టప్రకార మీయడవియందు సంచరించి కడపట నిచ్చటనే పడియెను. కాలము దాఁట నెవ్వరికి శక్యము?

ఈరామాయణమందు కాలముదాఁటరాదు, విధిదాఁటరా దనునీతి పలు మాఱు చెప్పఁబడినది. కావున శుభాశుభములు భగవత్సంకల్పముకొలఁది మన

యదృష్టముచొప్పున వచ్చును, పోవును. వానినిగుఱించి విచారపడి మనము చేయఁగలది యేమియులేదు కావున దానికి విచారపడక పరమపురుషార్థము సాధించి మరల నట్టిస్థితికి రాకుండ యత్నముచేయవలసిన దనుసంగతి బోధింపఁబడుచున్నది.

ఉ. కంటివె లక్ష్మణా! జనక◆కన్యక ముందట నిల్చి దేవతా
కంటకుతోడ డీకొని య◆ఖండవిహంగమ రాజ్య మాయువున్
రెంటిని బాసి నాకయి ధ◆రిత్రిపయిం బడినాఁడు; ధాత్రిపైఁ
గంటిమె యెన్నఁ డిట్టియుప◆కారపరున్ సముదారుఁ బుణ్యునిన్. ౧౧౭౨

ఇఁక జటాయువు ముక్తికి యోగ్యుఁ డని రామచంద్రమూర్తి చెప్పుచున్నాఁడు.

దేవతాకంటకుతోడన్ = రాక్షసునితో.

తా. లక్ష్మణా! చూచితివా, సీతను రావణుఁడు దాఁకకుండునటుల ఆమె ముందటఁ దాను నిలిచి రాక్షసు నెదిరించి యుద్ధముచేసి తనయఖండపక్షిరాజ్యమును, ఆయుస్సును రెంటిని నాకయి వదలి నేలఁబడినాఁడు. భూమిపై నిటువంటి పరోపకారపరుని నుదారచిత్తుని పుణ్యాత్ముని జూచితిమా!

లక్ష్మణా! తండ్రినిమిత్తమై నేను రాజ్యము వదలితి నని గొప్పగాఁ జెప్పుదురు. తండ్రినిమిత్తమై కొడుకు చేయకుండిన దోషముగాని చేయుట గొప్పగాదు. ఇతఁడో మనమనుష్యజాతియందుఁ జేరినవాఁడుగాఁడు. మనకు బంధువుగాఁడు. మనపోష్యవర్గములోఁ జేరినవాఁడుగాఁడు. జీతము తీసికొనుసేవకుఁడుగాఁడు. మన మాయనకుఁ జేసినయుపకార మేదియులేదు. మనయుపకార మాయన యాశించినవాఁడును గాఁడు. ఇట్టివాఁ డొకయాఁడుదానిని రక్షింపవలయునని దీర్ఘకాలముగ నేలుచున్నరాజ్యమును అంతకంటెఁ దీపైనప్రాణమును రెంటిని వదలిపెట్టెను. ఇట్టి కార్యమునకేకదా యుపకారమనియు నౌదార్యమనియుఁ బుణ్యమనియుఁ భక్తి యనియుఁ బేరు. ఇతనికి నేను మోక్షమియ్యఁదగిన సుకృతవిశేష మితనియందుఁ గలదని చెప్పుచున్నాఁడు. ఎట్లులన, అఖండవిహంగమరాజ్యముం బాసి యనుటచే నప్రాప్యప్రాప్తిపరిత్యాగము సూచితము. జటాయువు నీచములును నశ్వరములు నగు నైహికపదార్థములందలి యభిలాష సమూలము వదలెనని భావము. నాకయి యనుటచే నన్నొకనినే తనయిష్టసిద్ధికరునిఁగా నెంచె ననిభావము. దీనిచే నుపాయానుష్ఠానము చెప్పఁబడెను. దీనివలన ముక్తిఁ గోరువాఁడు ప్రకృతిపదార్థములందు నభిలాష వదలుటయు, రామచంద్రమూర్తియొకఁడే మనకిష్టార్థసిద్ధికరుఁ డనివిశ్వసించి యాయనకార్యములు చేయుచుండుటయు నని యేర్పడుచున్నది.

అభ్యాసే ప్యసమర్థోసి, మత్కర్మ పరమోభవ।
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి॥ భ.గీ. ౧౨.

అభ్యాసమందు నీకు శక్తిలేదేని నాకార్యములు చేయవలసినది, నానిమిత్తమై కార్యములు చేసిన మోక్షము కాంచెదవు.

క. శూరులు శరణ్యులును హిత,చారులు సాధువులు ధర్మ♦సత్పథవర్తుల్
ధారిణిఁ గల రెల్లయెడన్, ధీరగుణా! యరసి చూడఁ♦ దిర్యక్కులనేన్. ౧౦౨౩

తా. లక్ష్మణా! పరోపకారులు మనుష్యులందే కలరని, యితరజాతులందు పట్టనములఁదప్ప నితరప్రదేశమందు లేరని తలంపకుము. ఇతరజాతు లగుపశుపక్ష్యాదులందును శూరులు, రక్షించుయోగ్యతగలవారు, పరులకు మేలు చేయఁదిరుగువారు, సాధువులు, ధర్మమార్గమున వర్తించువారు భూమియం దన్నిప్రదేశములఁగలరు.

క. నాతండ్రియట్లపూజ్యుఁడు,సీతయకుఁడు మాన్యుఁడితఁడు ♦ ప్రియుఁడును జుమ్మీ
యీతనిపాటు గనుంగొన, సీతాహరణార్తి సమసెఁ♦ జిత్తమునందున్. ౧౦౨౪

తా. మనతండ్రి నాకెట్లు పూజ్యుఁడో యితఁడు నట్లు పూజ్యుఁడే. అది యెట్లందువా? తండ్రియగుదశరథమహారాజు నాకొఱకై యెట్లు ప్రాణమువిడిచెనో తండ్రిమిత్రుఁడగునితఁడు నట్టులే నాకై ప్రాణము విడిచెను. కావునఁ దండ్రివలె నాచే సంస్కారము పొంద నర్హుఁడు. మంచికీర్తిగలవాఁడు, గౌరవింపయోగ్యుఁడు, ప్రియుఁడు, కావున నితనిపాటు చూడఁగా సీతను గోలుపోయినదుఃఖము నామనస్సునందు లేదు. ఏలయందువా? సీతాదేవి నాసేవవలనఁ గలుగునానంద మనుభవింపఁగోరిక కలిగి వచ్చెను. అది సకామసేవగదా. ఇతఁడో నావలన నేలాభము గోరక నాకై ప్రాణములనే యిచ్చెను. కావున నిది విశేషదుఃఖకరమై యున్నది.

—రాముఁడు జటాయువున కగ్నిసంస్కారాదులు చేయుట.—

క. సౌమిత్రీ! చితఁ బేర్పుమ, యీమత్కార్యార్థనిహతు ♦ నీపతగేంద్రున్
నేమమున నగ్ని దరిచి య,థామతి దహియింతు ననుచుఁ ♦ దదభిముఖుండై.

చితన్ = సొదను, మత్కార్యార్థనిహతున్=నాపనినిమిత్తమై చంపఁబడినవానిని, పతగేంద్రున్ = పక్షులందు శ్రేష్ఠుని, నేమమునన్ = శాస్త్రప్రకారము, తరిచి = మథించి, తదభిముఖుండై = జటాయువునకెదురై.

తా. లక్ష్మణా! నాకార్యమునిమిత్తమై ప్రాణము విడిచిన యీపక్షిరాజును శాస్త్రప్రకారము నాతండ్రినివలె దహింతును. కావున చితిఁ బేర్పుము అని జటాయువుదిక్కు ముఖమై

తే. ఏది గతి యజ్ఞశీలుర ♦ కేది యాహి,తాగ్నులకు నపరావర్తు♦లైనవారి
కుర్విదాతల కట్టియ♦నుత్తమగతి, కరుగు మత్సంస్కృతి మదాజ్ఞ ♦ నమితసత్త్వ.

యజ్ఞశీలురకున్=యజ్ఞముచేయుట స్వభావకృత్యముగాఁ గలవారికి, గృహస్థులకు, ఆహితాగ్నులకున్ = పంచాగ్నిమధ్యమందుండి తపస్సుచేసినవారికి, ఉర్విదాతలకున్ = భూమిభోగత్యాగము చేసినవారికి, నైష్ఠికులకు. అపరావర్తులైన

వారికిన్ = "అరణ్యమియాత్ తతో నపునరేయాత్" అరణ్యమునకుఁ బోయి మరల రాఁగూడ దనునియమముగల సన్న్యాసులకు, ఏదిగతి="గమ్యత ఇతిగతిః" పొందవలసిన లోకమో. " ప్రాజాపత్యం గృహస్థానాం బ్రాహ్మం సన్న్యాసినాం స్మృత"మ్మన్నట్లు సన్న్యాసులు పోవుబ్రహ్మలోక మనియర్థము. "నపునరావర్తతే" యని శ్రుతి. మత్సంస్కృతిన్=నేను నీకు సంస్కారము చేయుటచేత, అనుత్తమగతికి= దేనికంటె నుత్తమమైనగతి లేదో యట్టిగతికి, మత్ + ఆజ్ఞన్=నాయాజ్ఞచే, అమిత సత్త్వ=మితిలేనిసత్త్వగుణముగలవాఁడా. విశేషసత్త్వగుణము కలవాఁడగుటచేతనే కదా పరమప్రేమయు, పరార్థము ప్రాణత్యాగము సహించుటయును.

యజ్ఞశీలాదుల లోకమార్గమున పునరావృత్తిరహితులగు ముక్తుల లోకమును వైకుంఠ మనుపేరుగలదానిని పొందుము. పక్షి కావున కర్మాధికారము లేకపోవుటచేతను, అగ్నిసంస్కారమునకు యోగ్యత లేకపోవుటచేతను, నుత్తమలోకములు లేకపోయినను నాచే నాజ్ఞాపింపఁబడినవాఁడవై ముక్తిని పొందు మని మహేశ్వరతీర్థీయము. అపరావర్తులైనవారి కనఁగా యుద్ధమందు వెనుకంజ పెట్టనివారికని కొందఱు చెప్పెదరు. అట్టిలోకము జటాయు తానే సంపాదించుకొనియున్నాఁడు. దానిని రామచంద్రుఁ డిచ్చినాఁడనిన నేమియర్థము? కావున మరల రానివారనఁగా మోక్షమునుండి యనియే గ్రహింపవలెను. ఇందఱగతులు చెప్పెనే యేగతి కెప్పుడందురేమో? ఆలోకములమార్గమున మోక్షమునకుఁ బొమ్మని యర్థము. శ్రీరామచంద్రమూర్తి జటాయువునకు మోక్ష మిచ్చినట్టు లీగ్రంథమున నేగాక మఱికొన్ని పురాణములందును జెప్పఁబడినది.

"ఉవాచ గచ్ఛ భద్రం తే మమవిష్ణోః పరంపద" మ్మని యధ్యాత్మరామాయణము.

సంస్కార మకరో ద్రామః తస్మై బ్రహ్మవిధానతః।
స్వపదం చ దదౌ తస్మై, యోగగమ్యం సనాతనమ్।
రాఘవస్య ప్రసాదేన సగృధ్రః పరమంపదమ్।
హరేః సామాన్యరూపేణ, ముక్తిం ప్రాయా త్ఖగోత్తమః। పద్మపురాణము.

"సుగ్రీవో హనుమాన్ ఋక్షో గజో గృధ్రో వణిక్పథ" యని ముక్తుల నడుమ గణింపఁబడుటచే జటాయువు ముక్తుఁడే.—తిలకము.

రామచంద్రమూర్తి బ్రహ్మవిధిప్రకారము సంస్కరించి యోగులు పొందు సనాతనమైన తనలోకమును నిచ్చెను. రామానుగ్రహముచే నాగృద్ధ్ర పరమపదమునకుఁ బోయి విష్ణుసారూప్యమును బొందెను.

ఈవిషయమై బాలకాండము ౧౧౬-వ పద్యము వ్యాఖ్య చూడుఁడు.

మోక్షమిచ్చుట పరమాత్మకార్యముగదా. అట్టికార్యము రాముఁడు చేయుటంబట్టి యితఁడు పరమాత్మయని స్పష్టమగునుగదా. అట్లైనచో రామ

చంద్రమూర్తి తా నందఱకు మనుష్యుఁడుగా కనఁబడవలయు నని ప్రయత్నించుట "ఆత్మానం మానుషం మన్యే" నేను మనుష్యుఁడ నని తలఁచెద నని చెప్పుట వ్యర్థమేకదా యని పూర్వపక్షము. సమాధానము—(౧) ఇచ్చట నడవిలో నేమి జరిగినది వాల్మీకి చెప్పువఱకు నెవరికిఁ దెలియదు. రావణవధతో నారహస్యము బయలుపడెను.—(౨) మనుష్యభావముచేఁ జూచినను "సత్యేన లోకాఞ్ జయతి" యని సత్యముచే రామచంద్రుఁడు లోకముల నెల్లఁ దనస్వాధీనపఱచుకొనె ననికదా యర్థము. విశ్వామిత్రుఁ డల్పతపస్సుచే చండాలుని స్వర్గమునకుఁ బంపఁగలిగెనేని యట్టివిశ్వామిత్రునిచే పరమాత్మగా గ్రహింపఁబడిన రామచంద్రమూర్తి వైకుంఠమును, ముక్తికి యోగ్యుఁడగు జటాయువంటివాని కిచ్చుట యేమియబ్బురము! కావున నిందు విపరీతచర్య యేదియుఁ గానరాదు.

ఈరహస్యవిషయము బ్రహ్మవరముచే యోగబలముచే వాల్మీకి తెలిసికొనెనుగాని తక్కినవా రేమియెఱుఁగుదురు? కావున మాయామానుషత్వమునకు హానిలేదు.

జటాయువు ఋషులవలె మోక్షార్థమై పరమాత్మోపాసనము చేయలేదు. అట్టివానికి రాముఁ డెట్లు మోక్ష మిచ్చెను? అట్లైనచో నందఱ కేల యియ్యరాదు? అని యాక్షేపము. సమాధానము-మోక్షమున కాత్మోపాసన మొకటియే మార్గము కాదు. మార్గములు పెక్కు లున్నవి. భగవద్గీతయందు కర్మము, జ్ఞానము, రాజయోగము, భక్తి, ప్రపత్తి, క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానము, అవతారజ్ఞానము, లోనైనవి చెప్పఁబడెను. బ్రహ్మసూత్రములందు ముప్పదిరెండువిద్యలు చెప్పఁబడెను. ఇందేదిలేకున్నను ప్రేమ యొక్కటియే మోక్షసాధన మనిశాస్త్రములు చెప్పుచున్నవి. విష్ణుపురాణమున "తేషు భగవదంశే ష్వనురాగిణః కోసలనగర జానపదా స్తేపి తన్మానసా స్తత్సాలోక్యతా మాపుః" అని కోసలదేశమందలి నగరములవారు పల్లెలవారు రామునిజూచినను జూడకున్నను ఆయనయం దనురాగముగలవారై మోక్షముగాంచి రని విష్ణుపురాణమునఁ జెప్పఁబడెను. శ్రీభాగవతంబున బృందారణ్యమందలి కృష్ణునందలి యనురాగముచేఁ బశుపక్ష్యాదులు మోక్షముగాంచె నని చెప్పఁబడెను. కామముచే గోపికలు, భయముచేఁ గంసుఁడు, వైరముచే శిశుపాలుఁడు ముక్తిగాంచి రనిచెప్పఁబడెను. కావున ననన్యమనస్కుఁడై భగవంతునకై రాజ్యము ప్రాణము ధారవోసి యాయనసమక్షమందు నాయనపై దృష్టి మనస్సు నిలిపి ప్రాణమువిడిచి యాయనచే శాస్త్రవిహిత సంస్కారము పొందిన జటాయువునకే మోక్షములేదేని మఱియెవరికిఁ గలదు? ఇట్లుచేసినవారి కెవరికైన శ్రీరామచంద్రమూర్తి మోక్ష మిచ్చునుగాని ప్రకృతిబద్ధులై కామదాసులై భక్తిశూన్యులైన యందఱకు మోక్ష మెట్లుకలుగును? ఏమార్గముననైన మనస్సును భగవంతునందు నిలుపకున్న ముక్తిలేదు. మార్గము

ప్రధానముకాదు. జటాయువునకంటె నెక్కువత్యాగి యెవఁడు? కావున జటాయువునకు మోక్ష మిచ్చుట యుక్తమే. ఈజటాయువునకు శ్రీరామచంద్రమూర్తి సంకల్పమాత్రముననే మోక్షమిచ్చుటచే శ్రీరామచంద్రమూర్తి మాయలో మునిఁగినాఁడనియు స్వరూపజ్ఞానములేనివాఁ డయ్యెననియుఁ జెప్పెడివారివాదము నిర్మూలితము.

క. అని పులుఁగుఱేనిఁ జితపై, నునిచి శిఖిం గొలిపి రఘుకు♦లోత్తముఁ డార్తిఁ
దనచుట్టమువలె ద[illegible]నం,బును బొనరిచి రోహిమాంస♦మున న్బిండంబుల్.

తా. అని జటాయువును సొదపైఁ బెట్టి యగ్నిరగిల్చి రామచంద్రుఁడు శోకముతోఁ దనతండ్రికివలెనే నిప్పుపెట్టి జింకమాంసముతోఁ బిండములుచేసి;

తండ్రికివలెనే నిప్పుపెట్టియనుటచే నౌరసుఁడు కొడుకు తండ్రిని దహించునపు డేమంత్రములు చెప్పునో యామంత్రములు చెప్పె ననిభావము.

సీ. ఘటియించి లేఁబచ్చి♦కను వాని నిల్పి ద్వి, జాతులు మానవ♦ప్రేతమునకు
స్వర్గసంప్రాప్తికై ♦ చదివెడు పైతృక, మంత్రంబులెల్ల స♦మ్మతి జపించి
గోదావరిన రాచ♦కొమరు లిద్దఱుఁ దోఁగి, గృధ్రఱేనికి నుద♦కంబు లీయ
మిగులదుష్కరమును ♦ మేలికీర్తికరంబు, కార్యంబుఁ గావించి ♦ కదనమునను
ఆ. మృతిని గాంచి యున్న♦గృధ్రరాజు మహర్షి, కల్పుఁ డైనయవని♦కాంతుచేత
సంస్కరణముఁ గాంచి ♦ చనె శుభపుణ్యలో,కముల కంతఁ బుణ్య♦కర్మనిధులు.

లేఁబచ్చికక్ = లేఁతపచ్చికమీఁద, ద్విజాతులు = బ్రాహ్మణులు, అనఁగా క్షత్రియుఁ డగురామచంద్రుఁడు కర్తగావున క్షత్రియోచితమైన మంత్రములు బ్రాహ్మణులు చదువునట్టులని చెప్పవలెను. దుష్కరమును కీర్తికరంబు కార్యంబుఁ గావించి యనుటచే నిష్కారణము క్షిప్రసంగములేదు. మానవప్రేతమునకు=మనుష్యశవమునకు. ప్రేతశబ్దము శవమునకు, దేహము విడిచిపోయిన జీవునికిఁగూడ నన్వయించును. కొన్నికార్యములు శవమునకై చేయవలయును, కొన్నిజీవునకై చేయవలయును, అవిరెండును చేసెనని భావము. నరకమునకుఁ బోవుజీవుఁడు కదా ప్రేత మనిపించుకొనును? జటాయు వట్టివాఁడుకాఁడే! కావున ప్రేతములకుఁ జెప్పు మంత్రములు ముక్తుని కన్వయించునా యని సందేహము.

మనకు శాస్త్రము ప్రమాణము. ముక్తునకు సపిండాదులు నిషేధింపఁబడలేదు. ఒకఁడు ముక్తుఁడుకాని కాకపోనీ, ఈమంత్రములవలన వానికి లాభముండనీ లేకపోనీ, శాస్త్రప్రకారము కర్మమంతయు జరుగవలసినదే. ముక్తుఁ డెవఁడో, ప్రేత మెవ్వఁడో, నిర్ణయింపఁగలవా రెవ్వరు? ఒకఁడు ముక్తుఁ డనుకొని కర్మహాని గావించితిమేని వాఁడు ముక్తుఁడుకాకుండినచోఁ బ్రేతమునకుఁ గర్తకుఁగూడ హాని కలదు. జటాయువు ముక్తుఁ డని రామునకుఁ దెలిసియుండియుఁ బ్రేతకార్యములు చేయుటచే నెట్టివానికైన యథావిధి ప్రేతకార్యములు జరుగవలయును. ఇంతకు

నీకర్మము పితృపూజ కావున పూజాంగముల లోపముకారాదు. మోక్షప్రసక్తి శూద్రాదులకు పశుపక్ష్యాదులకుఁ గలదా? ముక్తికిమార్గ మొక్కటియే యను నియమ మెట్లులేదో యొక్కజాతికే ముక్తి యనునియమము లేదు.

గీ॥ దనుజ భుజగ యక్ష♦దైత్య మృగాభీర, సుందరీవిహంగ♦శూద్రశబరు
లైనఁ బాపజీవు♦లైన ముక్తికిఁబోదు, రఖిలజగము విష్ణుఁ♦డనుచుఁ దలఁచి.

—భాగవతము.

శ్లో॥ పశుర్మనుష్యః పక్షీవా యేచ వైష్ణవ సంశ్రయాః।
తేనైవ తే ప్రయాస్యంతి, తద్విష్ణోః పరమంపదమ్॥

ఇట్టిప్రమాణము లుండుటచే ముక్తి యొకరిసొత్తుగాదు. ప్రేమ సర్వజీవిసామాన్యము. పరమప్రేమయే ముక్తికి సాధనము. కావున నదిగలయేజీవియైనను ముక్తికి యోగ్యతగలదగును. ఆత్మలన్నియు సమానములు, ఏకాకారములు, సచ్చిదానందస్వరూపములు, సచ్చిదానందగుణకములు, కావున భేదములేదు. ప్రేమ ఆత్మగుణముగాని దేహగుణముకాదు. కావున నుపాధులైనదేహము లేవియైనను ప్రేమను బాధింపఁజాలవు. కావున పరమప్రేమగల యేయాత్మయైనను ఏయుపాధియం దున్నను ముక్తికి యర్హమేయగును, లేదా పరిపూర్ణత్యాగమైన నుండవలెను. అట్టిగుణము జటాయువునందుఁ గలదు. కావున నట్టిఫలము నొందుట వింతగాదు. సన్న్యాసులు బ్రహ్మలోకమునకుఁ బోయి, పరాంతకాల మందుండి బ్రహ్మతోడ ముక్తులగుదురు. భక్తులు సూటిగాఁ బోవుదురు. మధ్యమార్గమున నిలువరు. ఇది భేదము.

తా. పిండములుచేసి, లేఁతపచ్చికమీఁద వాని నుంచి బ్రాహ్మణులు స్వర్గసంప్రాప్తికై మనుష్యప్రేతముల నుద్దేశించి చదువుమంత్రములఁ జదివి గోదావరిలో నిరువురు స్నానముచేసి జటాయువునకు నీళ్లువిడిచి చేయుటకు మిగుల నసాధ్యమైనదియు మిక్కిలికీర్తినిగలిగించునది యగుకార్యంబు గావించి యుద్ధమునందు (శస్త్రాస్త్రసంపన్నుఁడైన రామచంద్రమూర్తి రావణు నెట్లుపరిభవించెనో యట్లు జటాయువు నిరాయుధుఁడై బడుగై పరిభవించెను. ఇది యసాధ్యము కీర్తికరము గాదా) మరణించియున్నగృధ్రరాజు మహర్షిసమానుఁడైన రామచంద్రుచేత సంస్కారమునొంది పుణ్యలోకములకుఁ బోయెను. జటాయువును దహించి యామ్యసూక్తవైష్ణవసూక్తముల జపించి గోదావరిలో స్నానముచేసి తర్పణముచేసి రోహిమాంసమున పిండము లిచ్చి రని క్రమ మెఱుంగునది. ఈకార్యము దుమ్మగూడెమున కెదురుగాఁ బడమటవైపున నుండుగుట్టయొద్ద జరిగెను. ఇచ్చట నొకయాక్షేపము—రామచంద్రమూర్తి యుత్తమక్షత్రియుఁడుకదా! తిర్యగ్జాతియైన పక్షికిఁ బైతృకకర్మము చేయవచ్చునా? జాతివివక్ష భక్తివిహీను లగువారియందే కాని పరమభక్తిపరులందుఁ గాదు. కావున "నశూద్రా భగవద్భక్తా, విప్రాః భాగవతా

స్మృతాః, సర్వవర్ణేషు తే శూద్రా, యేహ్యభక్తా జనార్దనే." విష్ణుభక్తిగలవాఁడు శూద్రుఁడనఁబడఁడు. వాఁడు విప్రుఁడు, భాగవతుఁడు అనిచెప్పఁబడును. అన్ని వర్ణములయందు విష్ణుభక్తిలేనివాఁడు శూద్రుఁడనియుండుటచే నిచ్చట జాతివివక్ష కారాదు. ఈవచనము "అపశోవా అన్యేగో అశ్వేభ్యః" లోనగువానివలెఁ బ్రశంసాపర మనరాదు. ఏలన నున్నదున్నట్లు గ్రహించుటవలనఁ గలుగుబాధలేదు. మఱియు బ్రాహ్మణత్వము మొదలయినజాతులు శాస్త్రమువలనఁ దెలియఁదగినవే కాని గోవులవలె రూపముచేఁ దెలియఁదగినవి కావు. గోత్వాదులవలెఁ దెలియసాధ్యమగునేని వానితో సమానముగా శంకింపవచ్చును. ఈకారణముచేతనే విశ్వామిత్రునికి క్షత్రియత్వము తొలఁగించి బ్రాహ్మణత్వము కలిగింపఁబడిన దని బాలకాండమునఁ గలదు. ఈయర్థము శబరీవృత్తాంతమందును జెప్పఁబడును. మఱియు నిది ద్రౌపదీవివాహమువలె నితిహాసనంబంధమైన యొకానొకవ్యక్తి విశేషమునకు మాత్రము చెల్లునని చెప్ప నవకాశములేదు.—గోవిందరాజీయము.

ఓయీ! మృతు లయినవారికిఁ బుత్రులో జ్ఞాతులో ప్రేతకార్యములు చేయవలయును గాని యితరులు చేయవచ్చునా?

శ్రాద్ధేన పరదత్తేన గతః ప్రేతోపి సద్గతిమ్।
కింపునః పుత్రదత్తేన పితాయాతీతి చాద్భుతమ్॥ గరుడపురాణము, 7-64.

మరణించినవానికిఁ బరులు శ్రాద్ధముపెట్టినంతనే ప్రేతత్వము పోయి సద్గతి లభించును. ఇఁక పుత్రులు పెట్టినశ్రాద్ధముచేఁ దండ్రులకుఁ బరలోకము వచ్చుట చెప్పనేల?

ప్రేతస్యపుత్రో దాహాది దద్యాదేవౌరస స్సుతః।
బహుత్వేతు గుణీ దద్యాత్, సామ్యేతు జ్యేష్ఠఏవతు॥

మరణించినవానికి దహనాదికర్మములు ఔరసుఁడే చేయవలయును. అట్లు తాన కన్నకొడుకు లెక్కుమందియుండిరా వారిలో గుణవంతుఁడు చేయవలెను. అందఱు గుణవంతులేయైరా, వారిలోఁ బెద్దవాఁడు (వయస్సుచేఁగాని సవర్ణస్త్రీ యగు పెద్దభార్యకుఁ బుట్టినవాఁడుగాని) చేయవలెను.

పుత్రాణాం మధ్యమో వాపి కనిష్ఠో జ్యేష్ఠ ఏవవా।
పితుర్యస్తు ప్రియతమః సర్వం తేనైవ కారయేత్॥

కొడుకులందు నడిమివాఁడుగాని, కడపటివాఁడుగాని, పెద్దవాఁడుగాని తండ్రికెవఁడు ప్రియుఁడో వాఁడే యన్నికార్యములు చేయవలెను.

పుత్రా స్సర్వే పితుర్ద్విష్టాః, పత్నీ భ్రాతా సఖాపివా।
అగ్నిదాహాది కర్మాణి కుర్యుః, పుత్రాద్యయః పితుః॥ వైద్యనాథీయము.

అందఱుకొడుకులు తండ్రి కిష్టులు గారేని మరణించినవాని భార్యయో,

సోదరుఁడో, స్నేహితుఁడో, పుత్రికలో, శిష్యులు మొదలైనవారో దహనాదికార్యములు చేయవచ్చును.

ఎవరుచేయలేని యాదేశపురాజైనఁ జేయవచ్చును. కావున రామచంద్రమూర్తి చేసినది యకార్యముగాదు.

క. మన సెల్ల నతనిపై నిడి, మనమునఁ దద్వాక్యములను ♦ స్మరియించుచు భూ
తనయాధిగమనవాంఛను, వనసీమం జనిరి విష్ణు♦వాసవులక్రియన్. ౧౧౭౯

తా. ఇట్లు వారు కర్మము నిర్వర్తించి జటాయువుపై మనస్సుంచి సీతాదేవి మరల నీకు లభించునని యతఁడు చెప్పినమాటయందు విశ్వాసముంచి సీతాదేవిని బొందుకోరికతో నింద్రోపేంద్రులవలె నడవులజాడఁ బట్టుకొని పోయిరి.

౬౯-వ సర్గము. లక్ష్మణుఁ డయోముఖిని విరూపఁ జేయుట.

చ. పడమరదక్షిణంబుగను ♦ పార్థివపుత్రకు లేగి కొంత యా
యడవికి మూఁడుక్రోసుల మ♦హాటవిఁ గ్రౌంచముఁ జొచ్చి యందుఁ దా
రెడ నెడ మార్గఖేదమున ♦ వృక్షమునీడలఁ గూరుచుండుచుఌ
బడఁతుక రోయుచుం జనిరి ♦ వ్యాళమృగాండజబంధురాటవిన్. ౧౧౮౦

పడమరదక్షిణంబుగను = నైర్ఋతిమూలగ, ఎడనెడఌ = నడుమనడుమ, మార్గఖేదమునఌ = దారినడచుటవలనఁ గలిగినబడలికచే—ఇట్లు చెప్పుటచే దీర్ఘప్రయాణముచేసినట్టు తోఁచెడిని. వ్యాళ = సర్పములచేతను, మృగ = జంతువులచేతను, అండజ = పక్షులచేతను, బంధుర=నిండిన - దట్టమైన, అటవిఌ = అడవియందు.

తా. ఆరాజకుమారు లిరువురు నైర్ఋతిమూలగ కొంతదూరము పోయి యాయడవికి మూఁడుక్రోసులదూరమున నున్నక్రౌంచారణ్యముఁ బ్రవేశించి యందు దారినడచిన బడలికదీఱ నడుమనడుమ చెట్లనీడలఁ గూరుచుండుచు, సర్పములు మృగములు పక్షులు విశేషముగఁగల యాయడవియందు సీతను వెదకుచుఁ బోయిరి.

ఉ. దానిని దాఁటి తూర్పుగ మ♦తంగవనంబున మూఁడుక్రోసులఌ
బోన రసాతలాభ మయి ♦ ఘోరమృగం బయి శాశ్వతాంధ మౌ
దానిని డాయఁ బో నలఁతి♦దవ్వున భీకరదైత్య తీక్ష్ణదం
ష్ట్రానన ముక్తమూర్ధజ మృ♦గాదన లంబపిచిండ వారలన్. ౧౧౮౧

రసాతలాభము=పాతాళముతో సమానమయి, శాశ్వతాంధము=సూర్యరశ్మి ప్రవేశింపకుండుటచే నెడఁదెగని చీఁకటిగలదై, అలఁతిదవ్వునఌ = కొంచెము దూరమునందు, భీకరదైత్య = భయముకలిగించు రాక్షసి, తీక్ష్ణదంష్ట్రానన=వాఁడికోఱలుగల నోరుగలది, ముక్తమూర్ధజ = విరియఁబోసికొనిన తలవెండ్రుకలుగలది, మృగాదన = మృగములఁదినునది, లంబపిచిండ = వ్రేలాడుపొట్టగలది.

తా. ఆక్రౌంచారణ్యము దాఁటి తూర్పుగఁబోయి మతంగవనంబునందు మూఁడుక్రోసులదూరమున పాతాళమువలెనై మిగులభయంకరమై శాశ్వతమైన గాఢాంధకారముగల యొకకోనను సమీపింపఁగాఁ గొంచెముదూరమునందే భయంకరరాక్షసి వాఁడికోఱలుగలదై తలవెండ్రుకలు విరియఁబోసికొని మృగములఁ దినుచు వ్రేలాడుపొట్టగలది.

చ. కనుఁగొని చేర వచ్చి మును♦గాఁ జనులక్ష్మణు నాఁగి కేల నా
తని బిగిఁగౌఁగిలించి తమి ♦ దానవి యిట్లను నీకుఁ బెండ్లమౌ
దును జనుదెమ్ము యాడుకొనఁ ♦ దూర్ణమజీవితకాల మంతయుఁ
వనతటినీతటాళిఁ; బ్రియ♦నాథ! యయోముఖి యండ్రు నన్జనుల్. ౧౧౮-౨

ఆఁగి = నిలిపి, బిగిఁ = గట్టిగా, తూర్ణము= వేగముగ, వనతటినీతటాళిఁ = అడవిప్రదేశములందు, ఏటియొడ్డులందు.

తా. వారల నడ్డగించి వారిలో ముందుపోవుచున్న లక్ష్మణు నిలిపి చేతులతో నాయనను గట్టిగాఁ గౌఁగిలించి మోహముతో నారాక్షసి యిట్లనియె. 'ప్రియనాథ! నీకు నే పెండ్లము నయ్యెదను. మనము బ్రదికినంతకాల మడవులందు నేళ్లయొడ్డులందు నాడుకొందము. త్వరగా రమ్ము పోదము. నాపేరయోముఖి యందురు.' అయోముఖికి హయముఖి యని పాఠాంతరముగలదు.

క. అనుడు సుమిత్రాపుత్త్రుఁడు, కనలున ఖడ్గంబు దూసి ♦ క్షణమున ముక్కుఁ
జనులుఁ వీనులు నఱకిన, వనితయు మొఱ్ఱోడు చరిగె ♦ వచ్చినత్రోవన్.

కనలునఁ = కోపముచే, వీనులు = చెవులు.

తా. అని చెప్పఁగా లక్ష్మణుఁడు కోపించి కత్తిదూసి దానిముక్కు చెవులు చన్నులు కఱక్కున నఱకఁగా నది మొఱ్ఱో యనిమొత్తుకొనుచు వచ్చినదోవఁ బట్టుకొనిపోయెను.

క. అది చనఁ జనుచో గహ్వర,పదమున సోదరులు రాముఁ ♦ బలికెం దమ్ముం
డెద చెదరె నెడమబాహువు, నదరెడి నశుభంబు గలుగు ♦ నని తోఁచెఁ జుమీ.

తా. అదివెడలిపోఁగాఁ దమదోవనఁ దా మాయడవియందుఁ బోవుసమయంబున రామచంద్రమూర్తితో లక్ష్మణుఁ డిట్లనియె-'అన్నా! గుండె చెదరెను. ఎడమభుజ మదరుచున్నది. ఏదియో కీడు కలుగునని తోఁచుచున్నది. చుమా!

క. అన్నా! నాపలుకులు విని, సన్నాహంబునను నుండు ♦ సంకట మెదో రా
నున్నది వంచులకము మన,కు న్నిశ్చయజయముఁ దెల్పెఁ ♦ గూసెడి వింటే.

సన్నాహంబునను = యుద్ధప్రయత్నమున, వంచులకము = ఒకానొకపక్షి పేరు, నిశ్చయజయము = జయమునిశ్చయమని. శూర్పణఖవలె నీయయోముఖి యెవరినో రాక్షసులను బిలుచుకొని వచ్చు ననిసందేహము.

తా. అన్నా! నామాట విను. మనకేదో నష్టము రాఁబోవుచున్నది. యుద్ధ

ప్రయత్నమున నుండుము. కష్టమువచ్చినను మనకు నిజముగా జయముకలుగు నని యీవంచులకముకూతవలన( దెలియుచున్నది.

చ. అనె నిటు వార లిర్వురు వ♦నాంతరవీథుల రోయుచుం జనన్
ఘనతరనిస్వనంబు వన ♦ కాండవిదారణదక్షమై నభం
బును నిబిరీసవాతపరి♦పూరితముం బచరించి వీచినన్
విని యిది యేమటంచు నట♦వీస్థలి రోయుచు( గాంచి రొక్కెడన్. ౧౧౮౬

ఘనతరనిస్వనంబు = మిగులగొప్పధ్వని, వనకాండ = వనసమూహములను, విదారణదక్షమై = చీల్చుసామర్థ్యముగలదై, నభంబును=ఆకాశమును, నిబిరీస = దట్టమైన, వాత=గాలిచే, పరిపూరితంబు=నిండినది, పచరించి=చేసి, అటవీస్థలిన్ = అడవియందు.

తా. అని లక్ష్మణుఁడు చెప్పఁగా వార లిద్దఱు నడవులలో వెదకుచుఁ బోవుచుండఁగా నాయడవియందు నాకాశమును పెద్దగాలిచే నించి యడవిని చీల్చునట్టి పెద్దధ్వని వినవచ్చెను. అదివిని యేమి యిదియని యడవియందు వెదకుచుండఁగా నొక్కచోట.

## రామలక్ష్మణులు కబంధునిచేఁ జిక్కుట.

మ. గిరిసంకాశుని భూరివక్షుని శిరో♦గ్రీవావిహీనున్ మహా
ఖరరోమావృతు నీలమేఘనిభు మే♦ఘస్ఫూర్జదుర్ఘోషు భీ
కరవక్షస్స్థలలాట దేశగపిశం♦గస్ఫారపక్ష్మాయతా
గ్నిరుచిస్ఫీతశుభేతరైకనయను ♦ దీప్యన్మహాదంష్ట్రినిన్. ౧౧౮౭

గిరిసంకాశునిన్ = కొండవంటివానిని, భూరివక్షుని = పెద్దఱొమ్ముగలవానిని, శిరోగ్రీవావిహీనున్=శిరస్సు మెడ లేనివానిని, మహాఖరరోమావృతున్=మిగుల బిఱుసైనవెండ్రుకలచేఁ గప్పఁబడినవానిని, నీలమేఘనిభున్ = నల్లనిమబ్బుతో సమానమైనవానిని, మేఘస్ఫూర్జదుర్ఘోషున్ = మేఘధ్వనివలె పెద్దధ్వనిఁజేయువానిని, భీకర = భయంకరమైన, వక్షఃస్థ = ఱొమ్మునందుండు, లలాటదేశ = నొసటియందలి, పిశంగ = పచ్చవర్ణముచే, స్ఫార = ప్రకాశించు, పక్ష్మ = ఱెప్పలు కలదై, ఆయత = నిడుపైన, అగ్నిరుచి = అగ్నివంటికాంతిచే, స్ఫీత = ఎక్కువైనదియు, శుభేతర = అశుభమైన, ఏకనయనున్ = ఒంటికన్నుగలవానిని. "ఉరమున రెండుకన్నులు" అను భాస్కరునివాక్యమునకు నాధారము గానరాదు. దీప్యత్ + మహాదంష్ట్రినిన్ = ప్రకాశించు పెద్దకోఱలుగలవానిని.

తా. పర్వతమువలెఁ బెద్దదేహముగలవానిని, పెద్దఱొమ్ముగలవానిని, తల మెడలేనివానిని, బిఱుసువెండ్రుకలుగలవానిని, నల్లనిమబ్బువంటివానిని, ఉఱుమువంటిధ్వనిగలవానిని, ఱొమ్మునఁగల నొసటియందు పచ్చనివన్నెగలిగి నిప్పులవలె నుండు పెద్దకన్ను నొకటిగలవానిని, పెద్దకోఱలుగలవానిని.

మ. అటవీసత్త్వమృగద్విపాదికవికర్షాకర్షఖేలాప్రలం
పటునిన్ యోజనదీర్ఘబాహుయుగళున్ మార్గస్థితున్ భీముఁ బ్ర
స్ఫుట ఘోరాస్యుఁ గబంధుఁ గాంచి తడియం బోవంగ నా ద్దైత్యుఁడున్
బటుదోర్దర్ప మెలర్ప నాయిరువురన్ బాహాయుగిం బట్టినన్. ౧౧౮

అటవీసత్త్వ = అడవిజంతువులగు జింకలను నేనుఁగులు మొదలగువానిని, వికర్ష = వదలుట, ఆకర్ష = లాగుకొనుటయనెడి, ఖేలాప్రలంపటునిన్ = ఆటయందు నభిలాషగలవానిని, యోజనదీర్ఘబాహుయుగళున్ = యోజనమునిడివియగు రెండు చేతులుగలవానిని, మార్గస్థితున్ = తమత్రోవకడ్డముగానుండువానిని, భీమున్ = చూచువారికి భయముకలిగించువానిని, ప్రస్ఫుటఘోరాస్యున్ = తెఱచినభయంకరమైన నోరుగలవానిని, కబంధున్ = మొండెముగలవానిని, బాహాయుగిన్ = రెండుచేతుల.

తా. జింకలు, ఏనుఁగులు మొదలగునడవిమృగములను విడుచుట లాగుట యనునాటయందు నాసక్తుఁడగువానిని, యోజనముపొడవు చేతులుగలవానిని, తమత్రోవలో నుండువానిని, నోరు తెఱచికొనియుండువానిని, కబంధుని సమీపింపఁగా నారాక్షసుఁడు తనభుజబలముపెంపున రెండుచేతులతో వారిని బట్టుకొనెను.

క. ఖరకర తేజో యుతతనుధరులు భయంకరశరాసధరులు కృపాణీ
కరులు మహాబలు లిద్దఱు, పరుచేతికిఁ జిక్కి కీడుపడి రవ్వేళన్. ౧౧౯

ఖరకరతేజోయుత = సూర్యుని తేజస్సువంటి తేజస్సుతోఁగూడిన, తనుధరులు = దేహములుధరించినవారు, భయంకరశరాసధరులు = భయంకరములైన విండ్లను ధరించినవారు, కృపాణీకరులు = చేతఁగత్తులుగలవారు, మహాబలులు = విశేష బలముగలవారు, పరుచేతికిన్ = శత్రువునిచేతికి.

తా. సూర్యునితేజస్సువంటి తేజముగల దేహముగలవారు, పెద్దవిండ్లను ధరించినవారు, చేతఁగత్తులుగలవారు, మహాబలముగలవారయ్యును నాసమయమున వారిద్దఱు శత్రువులచేతఁ జిక్కి యాపదపడినవారైరి.

క. ధీరుఁడు శూరుఁడు రాముఁడు, ధీరతఁ గోల్పడఁడ విగతధృతి తమ్ముఁడు కౌ
మారమున ధైర్య మూనమి,చే రామునితో విషణ్ణచిత్తుం డగుచున్. ౧౨౦

కోల్పడఁడు = పోగొట్టుకొనినవాఁడుకాఁడు, విగతధృతి = ధైర్యముపోయిన వాఁడు, కౌమారమునన్ = బాల్యముచేత, విషణ్ణచిత్తుండు = వ్యసనముతోఁగూడిన మనస్సుగలవాఁడు. రాముఁడుకూడఁ జిక్కుపడుటచే ధైర్యముచెడె ననిభావము.

తా. రామచంద్రమూర్తి ధైర్యముగలవాఁడు, పరాక్రమముగలవాఁడు. కావున ధైర్యము వదలినవాఁడుకాఁడు. లక్ష్మణుఁడు చిన్నవాఁడు, ధైర్యము చాలనివాఁడు. కావున వ్యసనపడుచు నన్నతో నిట్లనెను.

వయస్సుపట్టిచూచిన రామచంద్రమూర్తికంటె లక్ష్మణుఁడు రెండుదినములు

చిన్నవాఁడు. ఇంతభేదము వయస్సునుబట్టి వచ్చినదికాదు. పాయసపరిమాణమునుబట్టి వచ్చినది కావున రామచంద్రమూర్తిలో సగమువాఁడే లక్ష్మణుఁడు. ఆకారణముచే లక్ష్మణుఁడు కుమారుఁ డనఁబడెనుగాని వయస్సుచేఁ గాదు.

శా. అన్నా! నాగతిఁ గంటె చిక్కితిని దే♦వారాతిచే వీనివా
తన్నన్నుం బడ వీడి పర్విడుము దూ♦ర వ్వీవయే నెట్టులేన్
జెన్నారన్ సతిఁ గాంచనేర్తు వని తోఁ♦చెన్, రాజ్యలక్ష్మీసుసం
పన్నత్వంబునఁ గ్రాలువేళ నను మ♦ర్వం బోకుమీ యెన్నఁడున్. ౧౧౯౧

దేవారాతిచేన్ = రాక్షసునిచేత, వాతన్ = నోట, రాజ్యలక్ష్మీసుసంపన్నత్వంబున = రాజ్యైశ్వర్యము పూర్ణముగా ననుభవించునపుడు.

తా. అన్నా! నాగతి చూచితివా! రాక్షసునిచేతఁ జిక్కితిని. వీనినోటం బడునట్లు నన్ను వదలి నీవైనను దూరముగాఁ బరువెత్తుము. ఇరువురిలో నొకరు బ్రదికినను మేలే కదా! ఏవిధముగానైన నీవు నీభార్యను గలిసికొనఁజాలుదువని తోఁచుచున్నది. కాఁబట్టి నేను నిన్నొకటి ప్రార్థించెదను. నీవు రాజవై రాజ్యసంపద పూర్ణముగా ననుభవించు వేళ నన్ను మఱచిపోకుము. జటాయువువలె లక్ష్మణుఁడును రామునకై ప్రాణము గోలుపోయి సేవసేయఁగోరెను.

క. అని సౌమిత్రి వచించిన, విని రాముఁడు నీవు నిట్టి♦విధమున వగవన్
జనునే యనుచుండఁగ నద్దనుజుఁడు వారలకు ననియె♦దారుణఫణితిన్. ౧౧౯౨

తా. అని లక్ష్మణుఁడు చెప్పఁగా విని రామచంద్రమూర్తి లక్ష్మణా! నీవు గూడఁ బిఱికివానివలెఁ బామరువలె వ్యసనపడవచ్చునా! ఇప్పుడేమి మించిపోయినదని చెప్పుచుండఁగా నారాక్షసుఁడు భయంకరమైన విధముగ నిట్టుల నెను.

ఉ. ఎవ్వరు మీరు? చాపనిశి♦తేష్వసు లూని విషాణు లట్టు లి
ట్లివ్వని నేల ద్రిమ్మరెద♦రెంతయు నాఁకొనునాదునోటిలో
నివ్విధిఁ గూల నేమిటికి♦నిచ్చటికిం జనుదెంచినారు? మీ
కెవ్వలనన్ మనంగ వశ♦మే యిఁక, నిండెను నూఱువర్షముల్. ౧౧౯౩

చాపనిశిత+ఇషు+అసులు = విల్లు, వాఁడిబాణములు, కత్తులు, విషాణులట్టులు = కొమ్ములుగలయెద్దులవలె, ఆఁకొను = ఆఁకలిగొనిన, ఎవ్వలనన్ = ఏయుపాయముచేనైనను, మనంగన్ = బ్రతుకుటకు.

తా. మీరెవ్వరు? విండ్లు, బాణములు, కత్తులు, ధరించి వాఁడికొమ్ముల కోడెలవలెఁ దిరుగుచున్నారు. ఆఁకలిగొనిన నానోటిలోఁ బడుటకై యింతదూరమేల వచ్చితిరి? నాబారిఁబడి మీ రేయుపాయముచేనైనను బ్రదుకఁజాలరు. మీకు నూఱువర్షములు నేఁటితో ముగిసెను.

క. అని క్రొవ్వడర వచించెడి,దనుజుని పలుకాలకించి♦తమ్మునితో భూ
తనయావల్లభుఁ డను మోఁ,మున వెల్లఁదనంబు దోఁప♦మునుకొనువగచేన్.

క్రొవ్వడరన్ = గర్వమతిశయింపఁగా, వెల్లఁదనంబు = తెలుపు.

తా. అని గర్వించి పలుకుచున్న రాక్షసునిమాట విని లక్ష్మణునితో రామచంద్రమూర్తి మోము వెలవెలఁబోఁగా వ్యసనము ముంచుచుండఁ దమ్మునితో నిట్లనియె.

క. కష్టంబు మీఁదఁ గష్ట మ,నిష్టంబుగ దాపరించి ♦ యిటు మనుగడకే
రిష్టంబు గూర్చె వ్యసనం, బిష్టాంగన లభ్యపడక ♦ యే పోయెఁ గదా. ౧౧౯౫

అనిష్టంబుగన్ = దుఃఖకరముగ, మనుగడకే = బ్రతుకుపాటునకే, రిష్టంబు = అశుభము, ఇష్టాంగన = ప్రియురాలు.

తా. దుఃఖకరముగఁ గష్టముమీఁదఁ గష్టము కలుగుచుఁ దుదకు మనకు బ్రతుకునకే ముప్పువచ్చెను. ప్రియురాలు లభింపకయే పోయెను. భార్యను బోఁగొట్టుకొని మరల రాఁబట్టుకొనకయే రాముఁ డడవిలోఁ జచ్చె నను నపకీర్తి వచ్చెను. అట్లు ప్రియురాలిని కష్టమునుండి తప్పించినవాఁడను గాకపోయితిని. ఆకార్యమై యుండిన మరణభయము లేదు.

క. అన్నన్న! కాలశౌర్యం, బెన్నఁటి నవ్యాహతంబొ ♦ యెఱిఁగితె భూమ్యు
త్పన్నప్రాణులపై నిను, నన్నున్ దుఃఖములచేత ♦ నవయఁగఁ జేసెన్. ౧౧౯౬

అవ్యాహతంబో = ఎదురులేనిదో, భూమ్యుత్పన్నప్రాణులపై = భూమియందుఁ బుట్టినభూతములమీఁద. మనుష్య వేషములుధరించినంతమాత్రమున మనకే యిన్నికష్టములు వచ్చుచున్నవే యిఁకఁ గర్మబద్ధులై పుట్టినవారిగతి యేమియను భావము. నవయఁగన్ = కృశింపఁగ. అన్నన్న – ఆశ్చర్యార్థకము.

తా. ఔరా! ఏమి యీయాశ్చర్యము! భూమిమీఁదఁ బుట్టిన ప్రాణులపైఁ గాల మెంతశౌర్యముగలదో చూచితివా! నిన్ను, నన్నుఁగూడ దుఃఖములచేఁ గృశింపఁజేసెను. మనగతియే యిట్టులయినపుడు కాలమునకు వశపడక తప్పించుకొన నెవనికి సాధ్యము?

చ. గురుతరధైర్యవంతులు న♦కూటబలుల్ కృతహస్తు లాజి దు
ర్ధరవరతేజు లయ్యు సిక♦తామయసేతువువోలె బీఁటువో
దురు సుమి కాలమో యనఘ ♦ తోడ్పడ కెంతయుఁ దప్పివచ్చినన్;
బరఁగునె దుష్కరం బగుచుఁ ♦ బ్రాణుల దైవము చంపఁ జూచినన్. ౧౧౯౭

గురుతరధైర్యవంతులు = మిక్కిలి గొప్పధైర్యముగలవారు, అకూటబలుల్ = వంచనలేనిబలముగలవారు, ఆజిన్ = యుద్ధమందు, దుర్ధరతేజులు = శత్రువులకు సహింపరాని తేజముగలవారు, కృతహస్తులు = గుఱితప్పకకొట్టువారు, సికతామయసేతువు = ఇసుకతో నేర్పఱిచిన యనకట్ట, బీఁటువోదురు = దుర్బలులగుదురు.

తా. ఎంత గొప్పధైర్యము కలవారు, సత్యపరాక్రములు, లక్ష్యసిద్ధిగల

వారు, యుద్ధములందు శత్రువులకు సహింపరాని తేజముగలవారైనను కాలమును కూలింపక ప్రతికూలించి వచ్చెనేని యిసుకకట్ట యల్పప్రవాహమునకే యురువు లేకపోవునట్లు నిర్వీర్యులయి బెండుపడిపోదురు. దైవము ప్రాణులఁ జంపఁ దలఁచిన నసాధ్య మేది కలదు? విధి కసాధ్యముకలదా?

దీనికి దృష్టాంత మర్జునుఁడే. యాదవస్త్రీలను రక్షింపలేక బోయలపాలు చేసి యేడ్చుచు వ్యాసులయొద్దకుఁ బోఁగా "కం. బలమును బుద్ధియుఁ జేవయు, నలఘుమతీ యుల్లసిల్లు నగుకాలమునన్। బొలియుం గాలవిపర్యయ, కలనంబున బుధుల కుబ్బు కలఁకయుఁ గలదే॥"—మౌసల.

రామాయణమున నేర్చుకొనవలసిన నీతులలో ముఖ్యమైన దిదియే. "పరికి బుద్ధిబలంబులు, గారణములు గావు చూవె కలరె ధరిత్రిన్। నేరిచి బ్రదికిన వారలు, నేరక చెడ్డట్టివారు నీరజనేత్రా॥" యన్నట్లు మనసామర్థ్యముచే నొక కార్యము చేసితిమనియు మనయసామర్థ్యముచే నొకటి చేయఁజాలమైతిమనియుఁ దలఁచుట కేవలము మతితక్కువకార్యము.

అహంకారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే॥—భగవద్గీత. అహంకారముచే బుద్ధిలేనివాఁడు నేనీకార్యము చేసితి ననుకొనును.

## ౭౦-వ సర్గము. రామలక్ష్మణులు కబంధునిబాహువుల నఱకుట.

క. అని తనమది దిటపఱుచుచు, నినవంశవరేణ్యుఁ డుండ ♦ నిట్లనుఁ బలలా
శనుఁడు ననుఁ జూచి నివ్వెఱఁ, గన నేటికి మిమ్ము నోటి♦కడి విధిచేసెన్. ౧౯౯౮

దిటపఱుచుచున్ = దృఢముచేయుచు, తనమదిన్ = లక్ష్మణునిమనస్సును, నివ్వెఱ-నిండు + వెఱ = పూర్ణభయము, కడి = కబళము, విధి = బ్రహ్మ.

తా. అని లక్ష్మణునిమనస్సును గట్టిపఱచు రామచంద్రునిఁ జూచి రాక్షసుఁ డిట్లనెను. నన్నుఁ జూచి మీరేల యింతభయపడెదరు. మిమ్ము నానోటిముద్ద యగునట్లు బ్రహ్మచేసెను.

ఉ. ఈగతి సోఁకుఁ డాడఁగ న♦హీనపరాక్రముఁ డుగ్రవిక్రమో
ద్యోగముమై నిజాగ్రజుని♦తో నను లక్ష్మణుఁ డింక వీఁడు బ
ల్వేగమ నిన్నునన్ను బలి♦పెట్టకమున్న శితాసిధార ర
క్షోగురుబాహుయుగ్మమును ♦ గూల్చుట మేలు వధింపరామిచేన్. ౧౯౯౯

సోఁకుఁడు = రాక్షసుఁడు, విక్రమోద్యోగముమైన్ = పరాక్రమముతోఁడి ప్రయత్నముతో, నిజ+అగ్రజునితోన్ = తనయన్నతో, బలిపెట్టక = చంపక, శితాసిధారన్ = వాఁడిగలకత్తివాదరచే, రక్షో = రాక్షసుని, గురుబాహుయుగ్మమును = పెద్దచేతులరెంటిని, వధింపరామిచేన్ = చంపరాకుండుటచే. తలయుండిన నఱకినఁ జచ్చును. తలలేనివానిఁ జంపుటెట్లు? ఇదియునుగాక చంపరామికిఁ గారణము ౧౨౦౧-వ పద్యమున లక్ష్మణుఁడే చెప్పుచున్నాఁడు.

క. వీఁడు మహాబలముం గల, వాఁ డెంతయుభీమ మైన♦వపువుగలాఁడుర్
దూఁడరి మనలర్ మ్రింగెడు, వాఁడిమి జగమెల్ల గెలిచి ♦ వర్తిలుచుంటన్. ౧౨౦౦

వపువు = శరీరము, తూఁడరి = దుష్టుఁడు. రూ. తూఁటరి వాఁడిమిర్ = శౌర్యముచే.

తా. వీఁడు మహాబలము, భయంకరదేహము గల దుష్టుఁడు. పరాక్రమముచేఁ బ్రపంచమునంతయు గెలుచువాఁడు కావున మనలను మ్రింగునుగాని వదలఁడు.

క. ప్రతికారశక్తిహీనుల, మృతిఁ గూర్చుట పాడిగాదు ♦ నృపవర్యులకుర్
గ్రతుమధ్యానీతముఁ బశు,తతిఁ గూల్చినభంగిఁ గుత్సి♦తంబు మహాత్మా. ౧౨౦౧

ప్రతికారశక్తిహీనులర్ = ఎదిరించియుద్ధముచేయ శక్తిలేనివారిని, క్రతుమధ్యానీతము = యజ్ఞకాలమున నడుమఁ దీసికొనిరాఁబడినది—(౧) ఆదినుండి యజ్ఞాంగముగా గ్రహింపఁబడి సంస్కరింపక నడుమఁ దేఁబడినది. (౨) యజ్ఞము నిమిత్తమై యాగశాలకుఁ దేఁబడి యెదిరించి యేమియుఁ జేయఁజాలనిది. ఈకారణముచేతనే ప్రతికారశక్తిహీన మని చెప్పఁబడెను. (౩) 'పర్యగ్నికృతా నారణ్యానుత్సృజం త్యహింసాయై' యన్నట్లు అశ్వమేధయాగమునందుఁ దేఁబడిన యరణ్యపశువులను జంపక విడువవలయును. వానిని జంపుట నీచకార్యము. (౪) యజ్ఞప్రదేశమునుండి యీవలఁ దేఁబడినది యూపస్తంభమునొద్దఁ దప్ప నితరప్రదేశముల జంతుహింస చేయరాదు.

తా. మహాత్మా! రాజులగువారికిఁ దమ్ముఁ దాము కాపాడుకొనలేక యెదిరించి యుద్ధముచేయలేక యుండువారిని యజ్ఞమధ్యమునఁ దేఁబడిన పశువుల హింసించుటవలె నీచకార్యము. అది న్యాయ్యముగాదు.

క. అను లక్ష్మణువాక్యంబులు, విని దనుజుఁడు వారి వాత ♦ వేసికొనంగర్
గను నింతలోన నానృప,తనయమణుల్ దేశకాల♦తత్త్వవిధిజ్ఞుల్. ౧౨౦౨

దేశకాలతత్త్వవిధిజ్ఞుల్ = ఏప్రదేశమున నేకాలమున నేకార్య మెట్లు చేయవలయునో శాస్త్రప్రకారము దాని వాస్తవార్థము తెలిసినవారు.

తా. లక్ష్మణుఁడు చెప్పినమాటలు విని యారాక్షసుఁడు వారిని నోటవేసికొన నాలోచించులోపలనే దేశము కాలము వీనితత్త్వము దెలిసి పనిచేయువారు.

క. రాముఁడు దక్షిణబాహువు, సౌమిత్రియు సవ్యభుజముఁ ♦ జటులాసిహతిర్
భీమగతి నఱక వాఁడును,భూమిం బడె దిగ్ధరాది♦వుల్ ధ్వని నిండన్. ౧౨౦౩

దక్షిణబాహువు = కుడిచేయి, సవ్యభుజము = ఎడమచేయి, చటులాసిహతిర్ = తళుక్కని మెఱసి మెఱుపుదీఁగవలెఁ జలించుకత్తిచే. రామునికుడిచేయి లక్ష్మణుఁ డన్నట్లు రామునకుఁ గుడిప్రక్క లక్ష్మణుఁడుండినవాఁడు కావున వారి కట్లు చేయ ననుకూలపడెను. దిక్ + ధరా + దివుల్ = దిక్కులు, భూమి, ఆకాశను.

తా. రామచంద్రమూర్తి కుడిచేతిని నఱకెను. ఆయనకుఁ గుడిప్రక్కన నున్నవాఁడగుటచే కత్తిదెబ్బచే లక్ష్మణుఁ డెడమచేతిని నఱకెను. ఇట్లు నఱకఁగా వాఁడు భూమి, ఆకాశము, దిక్కులు ధ్వనిచే నిండునట్లు నేలఁబడెను.

—లక్ష్మణుఁడు కబంధునకుఁ దమవృత్తాంతముఁ జెప్పుట.—

క. దీనుండై దోర్యుగళవి,హీనుండై దనుజవర్యుఁ ♦ డెవ్వరు మీరల్
గానఁ బని యేమి యనఁగా, వానికి లక్ష్మణుఁడు పలికె ♦ స్వచరిత మెల్లన్. ౧౨౦౪

దోర్యుగళవిహీనుండై = రెండుచేతులు లేనివాఁడై.

తా. దుఃఖముతోఁగూడినవాఁడై, రెండుచేతులులేనివాఁడై యారాక్షసుఁడు మీరెవ్వరు? ఈయడవియందు మీకేమిపని? యని యడుగఁగా లక్ష్మణుఁడు తమచరిత్రము నిట్లు చెప్పెను.

సీ. ఇక్ష్వాకువంశభ♦వేంద్రుఁ డీయనఘుండు, రాముఁ డటందురు ♦ ప్రజలు దనుజ!
మాయన్న యితఁడు ల♦క్ష్మణుఁ డంద్రు నాపేరు, దేవప్రభావుండు ♦ దేవితోడ
దండకాటవిలోన ♦ నుండ సుఖంబుగ, రాక్షసుల్ మాయచే ♦ రాజవదన
ముచ్చిల నామెను ♦ రోయుచు నిట వచ్చి,నార; మెవ్వఁడ వీవు ♦ కారణం బ
తే. దేమియొ కబంధ మైనయా♦కృతి వహింప?
నురమునను నోరు జంఘల♦యొప్పు లేదు
పొరలు చున్నాఁడ వన వాఁడు ♦ సురచయేంద్రు
వాక్యములు స్మరియించుచు ♦ వఱలి ప్రీతి. ౧౨౦౫

తా. ఈపుణ్యాత్ముఁ డిక్ష్వాకువంశమునఁ బుట్టినవాఁడు. ఈయనను లోకులు రాముఁడందురు. ఈయన మాయన్న. నాపేరు లక్ష్మణుఁ డందురు. దేవతల మహిమగల యీయన తనభార్యతోడ దండకారణ్యమం దుండఁగా రాక్షసులు మాయచేసి యాచంద్రవదనయగు సీతను దొంగిలింపఁగా నామెను వెదకుచు నిచ్చటికి వచ్చితిమి. నీ వెవ్వఁడవు? ఇట్లు మొండెముమాత్ర ముండునాకారము ధరింపనేల? ఱొమ్మున నోరున్నది. పిక్కలులేవు. పొరలెదవు. అనిన వాఁడు దేవేంద్రునివాక్యములు స్మరించి శాపమోక్షణకాలము వచ్చెఁగదా యని సంతోషముతో నిట్లని బదులుచెప్పెను.

క. ఉత్తర మిట్లను నో రఘు,సత్తమవరులార! మీకు ♦ స్వాగత మా నా
హత్తినభాగ్యంబున మిము,నిత్తఱిఁ బొడగంటిఁ జేతు ♦ లివి పోఁగంటిన్. ౧౨౦౬

తా. ఓ రాఘవులారా! మీకు స్వాగతము. నాభాగ్యము పండుటచే మిమ్ము నీసమయంబున నిందుఁ జూడఁగంటిని. చేతులు పోఁగొట్టుకొంటిని. చేతులు పోవుట నాయదృష్టముచేతనే.

ఆ. అవినయంబుచేత ♦ నబ్బె నీవికృతంపు,రూపు దాని యున్న ♦ రూపు నీకుఁ
జెప్పువాఁడ వినుము ♦ శ్రీరామచంద్ర! ని,ర్వక్రసుగుణసాంద్ర! ♦ రాఘవేంద్ర!

అవినయంబుచేత = వినయముతప్పినపని చేయుటచేత, వికృతంపురూపు = వికారస్వరూపము, ఉన్నరూపు = యథార్థము, నిర్వక్ర = వంకరలేని, సుగుణ = కళ్యాణగుణములచే, సాంద్ర = దట్టమైనవాఁడా.

తా. శ్రీరామచంద్రా! గర్వముచే వినయము దప్పినకార్యము చేయుటచే నిట్టి వికారస్వరూపము నాకుఁ గలిగెను. యథార్థము చెప్పెద వినుము.

౭౧-వ సర్గము. కబంధుఁడు రామలక్ష్మణులకుఁ దనవృత్తాంతముఁ జెప్పుట.

క. సోమఖరధామవిబుధ, స్తోమధవసమాన మైన♦సుందరరూపం
బే మును దాల్చి జగంబుల, రామా! విశ్రుతిని గంటి ♦ రమణీయతకున్. ౧-౨౦౮

సోమ = చంద్రునితోను, ఖరధామ = సూర్యునితోను, విబుధస్తోమధవ = ఇంద్రునితోను, సమానమైన = సరిపోలుచున్న, విశ్రుతిని = ప్రసిద్ధిని, రమణీయతకున్ = అందమునకు.

తా. నేను దొలుత సూర్యచంద్రేంద్రులతో సమానమైన సుందరాకారము గలవాఁడనై లోకములందు రామచంద్రా! అందమునకుఁ బ్రసిద్ధిగంటిని.

క. ఆమిక నే నీరూపము,తో మునులన్ గహనచరులు ♦ దూలఁగ భీతిన్
వేమఱు గోడాడించుచుఁ, దామసమతి స్థూలశిరుని ♦ దలరఁగఁ జేయన్. ౧-౨౦౯

ఆమికన్ = గర్వముచే, గహనచరులు = వనములందు సంచారముచేయువారు, గోడాడించుచున్ = బాధపెట్టుచు, తామసమతి = తమోగుణమువలనఁ గలిగినదుర్బుద్ధిచే, తలరఁగన్ = కలఁతచెందునట్లు.

తా. గర్వముచే నిట్టియాకారముగలవాఁడనై మునులును అరణ్యవాసులునుభయపడునట్లు పలుమాఱు దుఃఖపెట్టుచు తమోగుణము ప్రకోపించుటచేఁ గలిగిన దుర్బుద్ధిచే స్థూలశిరుఁ డనుమునినిఁ గలఁతచెందింపఁగా.

క. శాపాయుధుఁ డాసంయమి, కోపంబునఁ దిట్టె నన్ను ♦ గుచ్ఛిత మగునీ
రూపంబున బెదరించెద,వా పాపీ! రూప మిదియె ♦ యగుత సతంబున్. ౧-౨౧౦

శాపాయుధుఁడు = శపించుటయే యాయుధముగాఁ గలవాఁడు, సంయమి = ముని, సతంబున్ = ఎల్లప్పుడు. నాలుగవపాదంబునఁ బ్లుతయతి.

తా. శపించుటయే యాయుధముగాఁగల ఋషీశ్వరుఁడు; "ఓరి పాపాత్ముఁడా! నింద్యమగు నీరూపమున నన్ను బెదరించెదవా? నీ కీరూపమే శాశ్వతమగును గాక!" యని కోపంబున శపించెను.

క. అని తిట్టిన శాపాంతం, బనఘా! కరుణింపవే య ♦ టంచును వేఁడన్
వని రాముఁడు నీకరములు, దునిమి దహించినను గల్గుఁ ♦ దొల్లిటిరూపున్.

తా. అని శపింపఁగా శాపమెప్పుడు పోవునో చెప్పుమని వేఁడఁగా 'నీయడవియందు రామచంద్రుఁ డెప్పుడు నీచేతులు తెగనఱకి దహించునో, యప్పుడు నీకీశాపము దొలఁగిపోవును. నీపూర్వస్వరూపమును నీవు పొందుదువు' అనెను.

కం. అని యాన తిచ్చె శ్రీయుత,దనుసంజాతుండ నేను ♦ దగ వికృతశరీ
రిని నగుటకు లక్ష్మణ, శ,క్రుని కోపము కారణంబు ♦ క్రొవ్వున నతనిన్. ౧౨౧౨

అని యాజ్ఞచేసెను. ఇఁకఁ గబంధరూపము వచ్చినకారణము చెప్పెదను వినుము. శ్రీయుతదనుసంజాతుండన్ = (౧) శ్రీతోఁగూడిన దనువనువాని పుత్త్రుఁడను. (౨) శ్రీయనుపేరితోఁగూడినవానివలనఁ బుట్టినవాఁడను, దనువను వాఁడను. 'దనుర్నామ శ్రియఃపుత్త్రః శాపా ద్రాక్షసతాం గతః" అనియుఁ, దను ర్నామ దితేః పుత్ర యనియుఁ బాఠాంతరములు గానవచ్చుచున్నవి. వికృతశరీరిని= వికారపుశరీరము గలవాఁడను.

తా. అని సెలవిచ్చెను. నేను శ్రీయుతుఁడగు దనువువలనఁ గలిగిన వాఁడను. ఈవికారాకారము వచ్చుటకు నింద్రునికోపము కారణము. ఆయన కేల నీపైఁ గోపము వచ్చె నందు వేమో!

క. రా ర మ్మని రణమునకుం, జీరితి ఘోరంపుఁదపముఁ ♦ జేసి విధాతం
గోరుట దీర్ఘాయుష్యం, బేరీ నాసము లటంచు ♦ నెంచి వెకలి నై. ౧౨౧౩

తా. నేను గొప్పతపము చేసి దీర్ఘాయువు కలుగునట్లు బ్రహ్మచే వరము గొంటిని. ఆకారణమున నిఁక నాకేమి భయ మని బుద్ధిహీనుఁడనై నాసమాను లెవరని పొగరున నింద్రుని యుద్ధమునకు రారమ్మని పిలిచితిని.

క. ఆతఁడు శతారధారా,పాతంబున శిరము గుదియఁ♦బడ వక్షమునం
దాతతసక్థిని గడుపున, వీతదయుం డగుచు నణఁప ♦ వేఁడితిఁ జంపన్. ౧౨౧౪

శతారధారాపాతంబునన్ = వజ్రాయుధము వాదరపడ వేయుటచే తల ఱొమ్మునందు, కడుపునందుఁ దొడలు కుదించుకొని యుండునట్లు (దిగఁబడునట్లు) దయలేనివాఁడై యణఁగఁజేయఁగా 'నయ్యా! నా కీదురవస్థకంటె మరణము మేలు. చంపు' మని ప్రార్థించితిని.

క. ఎంతయు వేఁడిన ననుఁ దా, నంతకుకడ కనుపఁ డయ్యె ♦ నన్నృతమె భాషా
కాంతుని పలు కని సీతా,కాంతా! రెంటికిని జెడితిఁ♦గావర మాఱన్.౧౨౧౫

తా. ఎంత నేను వేఁడినను బ్రహ్మదేవుని వా క్కసత్యమగునా యని నన్నుఁ జంపఁడయ్యెను. ఈవిధముగఁ బొగరు చచ్చినవాఁడనై చచ్చినవాఁడనుగాక బ్రదికిబాగున్నవాఁడనుగాక రెంటను జెడితిని.

ఇట్లు రెంటికిఁ జెడినవారిని రేవణుతోఁ బోల్చుటకలదు. 'ఉంభేకః కారికాంవేత్తి। తత్త్వంవేత్తి ప్రభాకరః। మండనస్తూభయంవేత్తి। నోభయంవేత్తి రేవణః॥'అనికలదు. ఇది తెలిసిఅల్లసానిపెద్దన'రెంటికిం జెడిన రేవణుఁడౌదు నె'యని ప్రయోగించెను. ఇది తెలియక శబ్దరత్నాకరమున రేవఁడనొదునె యని సవరించి వ్రాయఁబడి రేవఁడనఁగాఁ జాకలవాఁడని యర్థముకూడఁ గల్పింపఁబడినది. ఈ కబంధునిచరిత్రమువలన గర్వము సర్వానర్థకరమనియుఁ బెద్దలతోఁ బరిహాసమాడ

రాదనియు నేర్చుకొనవలసియున్నది. యాదవులు మునులతోఁ బరిహాసమాడి వంశ నాశమై పోయిరికదా! దంభోద్భవుఁడనువాఁడు, గరుడుఁడు గర్వముచేతనేకదా భంగపడినది.

క. ఎటు లయ్యా! నే బ్రదుకుదు, నిటు లాహారంబులేక ♦ యేగతిఁ దినుదుఁ
గటకట భగ్నముఖుండ వి,ఘటితశిరస్కక్షితలుఁడఁ♦గరుణింపు మనన్. ౧౨౧౬

తా. ఈవిధముగా నాహారములేక యెట్లు బ్రదుకుదునయ్యా? అయ్యో! నోరులేక శిరస్సు తొడలులేక యెట్లు తిందును? నాయందు దయదలంపుము.

క. సురపతి యామడ నిడు పగు,కరములు వదనంబు దంష్ట్రి♦కలు జఠరమునఁ
గరుణించె దాన ద్వీపకే,సరిశార్దూలాదిసత్త్వ♦సంతతిఁ దినుదున్. ౧౨౧౭

తా. అని ప్రార్థింపఁగా ఆమడనిడివిగల చేతులు కడుపునందు నోరు కోఱలు ననుగ్రహించెను. వానిచే నేనుఁగులయు, సింహములయు, పులులయు, నీలోనుగాఁగల మృగసమూహములను భక్షింతును.

క. రాముఁడు లక్ష్మణయుతుఁ డై, నీమహితకరాళి నిశిత♦నిస్త్రింశహతిఁ
భూమిఁ బడ నడువ నిర్జర,ధామము నీ కబ్బు నని బు♦ధప్రభు వరిగెన్.౧౨౧౮

నీమహితకరాళిఁ = నీపెద్దచేతులను, నిశిత = పదునైన, నిస్త్రింశ = కత్తి యొక్క, హతిఁ = దెబ్బచే, అడువఁ = కొట్టఁగా, నిర్జరధామము = స్వర్గము, బుధప్రభుఁడు = దేవేంద్రుఁడు. 'బుధస్సూరా సురేసౌమ్యే' యని నానా॥ ర॥

కల్క్యవతారవిషయము మన కిప్పుడు తెలిసినట్లు శ్రీరామావతారవిష యము దేవతలకు ఋషీశ్వరులకు ముందుగానే తెలిసియుండెను.

తా. లక్ష్మణుతోడ రాముఁడు నీచేతులను గత్తులతో నెప్పుడు నేలఁబడ నఱకునో యప్పుడు మరల నీవు స్వర్గమునకు వత్తువని చెప్పి యింద్రుఁడు పోయెను.

ఉ. ఆమునిమాట నమ్మి వికృ♦తాకృతి వేగమ పాయఁ గోరి నే
నేమృగ మేపదార్థమును ♦ దృష్టిపథంబునఁ బడ్డఁ బట్టినఁ
రాముఁడు చిక్కఁడే యని ఘ♦నం బగునాశను నేదియేని నీ
యామడలోనఁ దోఁచిన ర♦యంబునఁ బట్టుదు నోటఁ బెట్టుమన్. ౧౨౧౯

వికృతాకృతి = వికారస్వరూపము.

తా. ఆస్థూలశిరునిమాట నమ్మి యీవికారస్వరూపము వదలి పోవఁగోరి నాకంటిదృష్టికి నేపదార్థము ఏమృగము కనఁబడినను వానిని బట్టుకొనుచుంటినా రాముఁడు చిక్కకపోవునా యను నాశతో నీయామడలోపల నేది కనఁబడినను బట్టుకొని తినుచుందును.

క. ఆమౌనివరుఁడు చెప్పిన,రాముఁడ వీవే మహాత్మ! ♦ రణతలమున న
న్నీమెయి వధియింపఁగ లే, రేమగపంతంబువార ♦ లేనియు రామా! ౧౨౨౦

తా. మహాత్మా! నన్ను యుద్ధమం దెంతటిపౌరుషముగలవారైనను నీవిధముగఁజంపలేరు. కావున ఆమునీశ్వరుఁడు చెప్పినరాముఁడు నీవే.

మ. మతిసాచివ్య మొనర్తు, మిత్రవరు సం♦పాదింతు, న న్నగ్ని సం
స్కృతుఁ గావింపుఁ డటన్న రాముఁ డనియె ♦ స్వేచ్ఛ జనస్థానమం
దితఁడు న్నేనుఁ జరింప రావణుఁడు నా♦యిల్లాలి గిల్చాడె; దు
ర్మతిపేరొక్కటి మే మెఱుంగుదుము, శౌ♦ర్యం బేనిరూపంబు నేన్.౧౨౧

మతిసాచివ్యము = ఆలోచనయందు సాహాయ్యము, మిత్రవరుఁ = మంచి గొప్పస్నేహితుని, అగ్నిసంస్కృతుఁ=అగ్నిచే సంస్కరింపఁబడినవానిని, అనఁగా దహింపఁబడినవానిని, గిల్చాడెఁ = హరించెను.

తా. మీకు నాలోచనయందు సాహాయ్యము చేసెదను. మీకు మీకార్యమనుకూల మగునాలోచన చెప్పెదను. మీకార్యము సాధింపఁగలస్నేహితుని దొరకఁ జేసెదను. నన్ను నగ్నిచే దహింపుము. అనఁగా రామచంద్రమూర్తి వీనిని దహించినపిమ్మట తెలియవలసినవిషయము తెలియకపోవు నని తలఁచి యిట్లనియె. ఇతఁడు నేను జనస్థానమందు మాయిష్టానుసారము తిరుగుచుండ రావణుఁ డనువాఁడు నాభార్యను దొంగిలించెను. ఆదుర్బుద్ధిపేరుమాత్రము మాకుఁ దెలియును. వానిశౌర్య మేమాత్రమో, వానిరూప మెట్టిదో?

చ. అతనినివాస మైనఁ దెలి♦యంబడ, దాతని నీ వెఱింగినన్
మతి చెడి కానకాన దెస♦మాలి చరించెడిమమ్ముఁ దీవ్రదుః
ఖితుల హితప్రవర్తనులఁ ♦ గేవలసత్కృపఁ జూచి చెప్పవే
స్థితి గతి యిట్టి దంచు నఱ♦సేయక వీర! మహోపకారి వై. ౧౨౨

తా. వాఁడుండుస్థలమైనను దెలియరాదు. వానిని నీవెఱిఁగియుండినఁ జెప్పుము. మనస్సు వికలతనొంది దిక్కులేక యడవియడవి తిరిగి బహుదుఃఖ మనుభవించుచున్నాము. మేము పరుల కుపకారము చేయుదుముకాని యపకారము చేయము. నీవుకోరినట్లు నీ కుపకారమే చేయుదుము. కావున మాయందు దయదలఁచి యలక్ష్యము సేయక వంచింపక గొప్పయుపకారముచేసినవాఁడవై వాని స్థితిగతి యిట్టిదని చెప్పుము.

క. కుంజరము లప్పు డప్పుడు, భంజించిన శుష్కకాష్ఠ♦పటలంబులు ప్రో
వుం జేర్చి బిలమునను ని,న్నుం జతన మొనర్తు నీదు♦నుడిమైఁ గాల్పన్.౧౨౩

తా. నా కేమియుపకారము చేసెదనందువా, యేనుఁగు లప్పుడప్పుడు విఱిచిన యెండుకట్టెలగుంపులను కుప్పచేర్చి బిలమునందు నిన్ను నీమాటప్రకారము కాల్చుటకు యత్నించెదను.

క. ఎవ్వాఁడు హరించె జానకి, నెవ్వలనం దాఁచినాఁడొ ♦ కృపచే మా కా
నెవ్వడి తెలిపి శుభమునఁ, నివ్వటిల నొనర్పవయ్య ♦ నీ వెఱిఁగిన నాన్.

తా. నీవలన మాకుఁ దెలియవలసిన దేమనిన జానకిని హరించినవాఁ డెవ్వఁడు? ఆమె నెక్కడ దాఁచినాఁడు? నీకుఁ దెలిసినయెడల ఆజాడ మాయందు దయయుంచి తెలిపి మాకు మేలుసేయుము.

ఉ. తీఁపురముల్ ఘటించి కొని ♦ తెచ్చినయీవికృతంపురూపుతో
దోఁపుడుపోయితిం దెలివి ♦ తోయజలోచన సీతగాథయున్
దోఁపదయిప్డు నాతనువుఁ ♦ దూర్ణమ కాల్చిన దాఁపరీని యా
దాఁపఱికంబు నంతయును ♦ దాఁపక నీకు నెఱుంగఁ జేసెదన్. ౧-౨-౨౬

తీఁపురముల్ = ఆగడము, ఘటించి = చేసి-కొని తెచ్చిన = కావలయునని తెచ్చికొనిన-ఇచ్చటఁ దెచ్చికొనిన నని యాత్మనేపదముండుట బాగు. అయినను ఆగమసూత్ర మనిత్య మగుటవలన తెచ్చిన యనియె ప్రయోగింపఁబడె. 'పట్టముఁ గట్టి యేలుము కృపన్ మము నెల్లర' యని భారతప్రయోగము కలదు. దాఁప రీని = దాఁచినవాని.

తా. ఆగడములగు కార్యము చేసి కొని తెచ్చికొనిన యీ వికారస్వరూప ముతో నా తెలివికూడఁ బోఁగొట్టుకొంటిని. సీత చరిత్రయు నాకు స్ఫురింపలేదు. వేగమే నా దేహమును గాల్చితిరేని నాస్వస్వరూపము నొంది సీతను దాఁచిన వాని రహస్యమంతయు దాఁపక నీకుఁ జెప్పెదను.

క. అవటమున నన్ను వెస నిడి, సవిత పరిశ్రాంతహయత ♦ జాఱక మున్నే
సవిధిగ దహియింపుముమఱి, యవనిసుతాహర్తఁ దెలియు♦నతని వచింతున్.

అవటమునన్ = బిలమునందు, సవిత = సూర్యుఁడు, పరిశ్రాంత=గాసిపడిన, హయతన్ = గుఱ్ఱములు గలవాఁడగుటచేత, జాఱకమున్నే=అస్తమింపకముందే, సవిధిగ=శాస్త్రప్రకారము, అవనిసుతాహర్తన్=సీతనుహరించినవానిని, తెలియు నతనిన్ = తెలిసినవానిని, వచింతున్ = చెప్పెదను.

తా. నన్ను బిలమునందుంచి సూర్యుఁ డస్తమింపకముందే దహించితివేని సీతను దొంగిలించినవానిని దెలిసినవానిని దెలిపెదను.

ఉ. వాని నెఱుంగఁగాఁ గలుగు♦వాఁ డొకరుండు గలండు, వానితో
మానుగ న్యాయ్యమార్గమున ♦ మైత్రి యొనర్పుము, కారణాంతరం
బైనఁ జరించె వాఁడు భువ♦నావళి నెల్ల, నతండు ధాత్రిపైఁ
గానిచోటు గల్గ, దుప♦కారము నీకొనరించు నావుడున్. ౧-౨-౨౭

న్యాయ్యమార్గమునన్ = న్యాయముతోఁగూడిన విధమున, కారణాంత రంబు = వేఱొకకారణము, భువనావళి = లోకసమూహము.

తా. వానిని దెలిసికొనఁగలుగువాఁ డొకఁ డున్నాఁడు. వానితో ధర్మపద్ధ తిని నీవు స్నేహము సేయుము. ఒకానొకకారణమున వాఁడు ప్రపంచమంతయుఁ దిరిగెను. వాఁడు చూడనిచోటు భూమియందు లేదు. నీకు వాఁ డుపకారము

చేయును. ఇన్నియుఁ జెప్పి వానిపేరేల చెప్పలే దనిన తన్నుఁ గాల్చుటకుఁ బూర్వమే చెప్పినఁ దనకుత్సితశరీరమును జూచి రోసి కాల్పకుండు నని యని గోవిందరాజీయము. రాముఁ డసత్యవాది యని తన్ను మోసము చేయునని కబంధుఁడు తలఁచె ననుట సరిగాఁ దోఁపదు. చెప్పవలసిన విషయము చాలఁగ నుండుటచేతను ఆనింద్య శరీరమునఁ జేతులు దెగినబాధపడుచు నొకనిమిషమైన నుండుట సహింపలేమిని దన్నుముందు దహింపఁగోరె నని తోఁచెడిని.

—౭౩—వ సర్గము. కబంధుఁడు స్వస్వరూపంబు నొందుట.—

చ. తొఱటను వానిదేహమును ♦ దోఁపి సుమిత్రసుతుండు మండుపె
న్గొఱవులు దెచ్చి కాష్ఠమునఁ ♦ గూరిచి వహ్నుల నూలుకొల్పఁగా
నెఱచిని నేతిముద్దకును ♦ నీడగు దేహముఁ గాల్ప నగ్నియున్
జుఱుకరి గాక మందుఁ డయిఁ ♦ చూఁడుచు నుండఁగ వారు చూడఁగన్.

తొఱటను = బిలమునందు, దోఁపి = తూర్చి, ఎఱచిని = మాంసముచే, ఈడగు = సమానమైన, చుఱుకరి = చుఱుకుఁదనముగలవాఁడు, చూఁడుచున్ = కాల్చుచు, వారు = రామలక్ష్మణులు.

తా. వాఁ డీప్రకారము చెప్పఁగా వానిదేహమును నొకబిలమందు దోఁపి లక్ష్మణుఁ డెండినకట్టెలు పేర్చి మండెడు కొఱవి యాకట్టెలలోనుంచి యగ్నులను పురిగొల్పఁగా మాంసముముద్ద కావున క్రొవ్వుతో నిండి నేతిముద్దవలె నుండు దేహమును నగ్నిహోత్రుఁడు వేగముగఁగాల్పక మెల్లగఁ గాల్చుచుండెను. ఇంతలో రామలక్ష్మణులు చూచుచుండఁగా.

ఉ. మండెడుమంటనుండి యస♦మానవినిర్మలచేలుఁ డుజ్జ్వల
న్మండనమండితుండు ఖప♦థంబున కుద్గమనం బొనర్చి శ్వే
తాండజయుక్త మైనసుర♦యానమునన్ దిశ లెల్ల వెల్గఁగా
నుండి కబంధుఁ డిట్లనియె ♦ నుర్వ్యజఁగాంచు తెఱంగు రామునితోన్.౧౩౯

అసమాన = సమానములేని, వినిర్మల=మలినములేని, చేలుఁడు=వస్త్రము గలవాఁడు, ఉజ్జ్వలత్ =మిగులఁ బ్రకాశించుచున్న, మండన = అలంకారములచే, మండితుండు = అలంకరింపఁబడినవాఁడు, ఖపథంబునకున్ = ఆకాశమునకు, ఉద్గమనంబొనరించి=ఎగసి, శ్వేతాండజయుక్తము= తెల్లపక్షులగు హంసలతోఁగూడిన, సురయానమునన్ = విమానమునందు – హంసలవిమానము బ్రహ్మలోకప్రాప్తిని దెలుపుచున్నది. రామచంద్రమూర్తి కొఱవివేసినకారణమున నిట్టియుత్తమలోక ప్రాప్తి.

తా. మండుచున్నమంటలోనుండి మిగులనిర్మలమైన వస్త్రములు గలిగి తళతళలాడుసొమ్ము లలంకరించుకొని యాకాశంబునకెగసి, హంసలఁగట్టిన విమా

నముమీఁద దిక్కులు వెల్గఁగానుండి సీతను జూచువిధము రామునితో నిట్లని యెను.

మ. అనఘా! రామ జగంబునందు షడుపా♦యజ్ఞుల్ క్రియాళీవిమ
ర్శనముం జేయుదు రందు దుస్థితిసమా♦క్రాంతుల్ సమావస్థు లౌ
జనులన్ రోసి ఘటింత్రు మైత్రి నిపుడో ♦ జాయానిమిత్తంబు నీ
వనుజాన్వితుఁడ వౌచు నీచదశచే ♦ నాయాసపా టొందవే? ౧౨౩౦

షట్ + ఉపాయజ్ఞుల్ = ఆఱుపాయములు తెలిసినవారు-సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయము-ఇవియాఱుపాయములు. క్రియా + ఆళీ + విమర్శనమున్ = సమస్తకార్యములను న్యాయ్యముగా నాలోచించుటను, దుస్థితిసమాక్రాంతుల్ = కష్టదశయందుండువారు, సమావస్థులు = తమవలె కష్టదశయందుండువారు, రోసి = వెదకి, జాయానిమిత్తంబు = భార్యకొఱకు, అనుజాన్వితుఁడవౌచు = తమ్మునితోఁగూడినవాఁడవై. నీభార్యనిమిత్తముగా నీకుఁ గష్టదశవచ్చినది. నీనిమిత్తముగా నీతమ్మునికిఁ గష్టదశవచ్చినది.

తా. రామచంద్రా! లోకమునందు సంధి విగ్రహ యా నాసన ద్వైధీభావ సమాశ్రయంబు లను నా ఱుపాయములను రాజులగువారు కార్యములు సాధించుట యం దాలోచింతురు. ఈయాఱింటియందు సంధితప్పఁ దక్కినవి నీకుఁ బ్రకృతము సరిపడునవి కావు. విరోధియునికి తెలిసినఁగదా యుద్ధము ప్రయాణము లోనైనవి. కావున సంధివిషయ మొకటే యాలోచింపవలసియున్నది. ప్రత్యక్షశత్రు వెవఁడైనది నీకుఁ దెలియలేదు గనుక నీవు వానితో సంధిచేయుద మన్నను బొసఁగదు. కాఁబట్టి తొలుత నీశత్రువిషయము - సీతయునికి తెలిసికొనవలసియున్నది. ఇది మీయిరువురవలన సాధ్యమగునదికాదు. కావున నన్యసాహాయ్య మావశ్యకమై యున్నది. ఇతరులతో సంధి యెట్టివారితోఁ జేయవలయును? కయ్యమునకు నెయ్యమునకు వియ్యమునకు సమత్వము వలయును. తనకంటె గొప్పవానితోడ స్నేహము కుదురదు. తక్కువవానితో మైత్రిచేసియుఁ బ్రయోజనములేదు. తనకంటె నెక్కువవాఁడు తన్నుఁ జులుకనచూచునుగాని నిండుమనస్సుతో నాదరింపఁడు. ఇప్పుడు మీయన్నదమ్ములిరువురు సమర్థులేయైనను నీభార్యనిమిత్తమై నీకుఁ గష్టదశ ప్రాప్తించినది. నీనిమిత్తమై నీతమ్ముఁడు కష్టదశయందే యున్నాఁడు. ఈ కారణముచే వాలితో మైత్రి నిషేధించుచున్నాఁడు. అది నీతిశాస్త్రానుసారము గాదు.

కబంధుఁడు రామునకు సుగ్రీవునితో మైత్రి చేసికొనఁ జెప్పుట.

ఉ. కాన భవత్సమానదశుఁ ♦ గాంచి ఘటించుట మేలు మైత్రి, కా[illegible]
దేనియు నీదుకార్యము తు♦దిం గను టెట్టులొ తోఁపదయ్యె రా[illegible]

మా! నగచారి క్రుద్ధుఁ డయి ♦ యన్నసురాధిపసూతి వాలి రా
జ్యానకుఁ గాఁగఁ దాఁపఁగ వ♦నాటచతుష్క సహాయుఁడై వెతన్. ౧౨౩౧

కానన్ = కావున, భవత్సమానదశున్ = నీదశవంటిదశయందుండువానిని, నగచారి = క్రోఁతి, క్రుద్ధుఁడయి = కోపించినవాఁడై, సురాధిపసూతి = ఇంద్రుని కుమారుఁడు, వాలి = వాలియనువాఁడు, తాఁపఁగన్ = తన్నఁగా, వనాట చతుష్క సహాయుఁడై = నలుగురుక్రోఁతులను సహాయులుగాఁగలవాఁడై, వెతన్ = దుఃఖముచే.

తా. కాఁబట్టి నీస్థితివంటి స్థితియందుండువానినిగాఁ జూచి నీవు స్నేహము చేయుటబాగు. అటుచేయనొల్లవేని నీకార్యము కొనసాగు నుపాయము నాకుఁ దోఁపలేదు. అట్టివాఁ డెవఁడైన నున్నాఁడా యందువా? రామా! వానరుఁడును నింద్రునికొడుకును తనయన్నయు నగువాలియనువాఁడు కోపించి రాజ్యము నిమిత్తమై తన్నుఁ దన్నఁగా నలుగురువానరులను సహాయులుగాఁ దీసికొని దుఃఖపడుచు.

ఉ. పావనఋశ్యమూకగిరిఁ ♦ బంపతటిం జరియించుఁ, బేరుసు
గ్రీవుఁడు, వీర్యవంతుఁడు న♦రీణచరిత్రుఁడు సత్యవాది ప్ర
జ్ఞావిభవుండు ధీరుఁడు ప్ర♦శస్తపరాక్రమశాలి వానితో
నీవు పొనర్పు నెయ్యమును ♦ నీప్రియురాలిని రోయ బాస టౌ. ౧౨౩౨

పావన = పవిత్రమైన, ఋశ్యమూకగిరిన్ = ఋశ్యమూక మనుపర్వతము నందు, పంపతటిన్ = పంపయొడ్డున, అరీణచరిత్రుఁడు = చక్కటినడవడిగలవాఁడు, బాసట ఔన్ = సహాయపడును.

తా. అతఁడు పవిత్రమైనఋశ్యమూకపర్వతమునందు పంపయొడ్డున సంచరించుచుండును. ఆయనపేరు సుగ్రీవుఁడు. అతఁడు పరాక్రమవంతుఁడు. ఋజువర్తనముగలవాఁడు. సత్యముచెప్పువాఁడు. బుద్ధిసంపదగలవాఁడు. ధైర్యవంతుఁడు. శౌర్యమునఁ బ్రసిద్ధుఁడు. వానితో నీవు స్నేహముచేసితివేని నీభార్యను వెదకుటయందు నీకు సహాయుఁ డగును.

క. ఏలా దుఃఖించెదు నర,పాలా! యెవ్వరికి నైన ♦ భవితవ్య మిలన్
దూలం బుచ్చఁగ వశమే, కాలము దురతిక్రమంబు♦గా యెవ్వరికిన్. ౧౨౩౩

భవితవ్యము = జరుగవలసినది – అదృష్టము, తూలంబుచ్చఁగన్ = త్రోసివేయుటకు. దురతిక్రమంబు = దాఁటరానిది.

తా. రాజా! నీవేల దుఃఖించెదవు? ఏది యెట్లుజరుగవలసియున్నదో యది యట్టులే జరుగును గాని దానిని ద్రోచివేయ నెవరికి సాధ్యము? ఎట్టివారికైనను గాలము దాఁటరానిదిగదా!

క. గమనింపు మచటి కిప్పుడ, యమలమతీ! యిచటనుండి ♦ యతిజవమున స్నే
హము సుగ్రీవునితోఁ జే,యుము వాఁడు మహాబలుం డ♦నుత్తమగుణుఁడున్.

అమలమతీ = నిర్మలమైనమనస్సుగలవాఁడా. గమనింపుము = ప్రయాణమై పొమ్ము, అతిజవమునన్ = మిగులవేగముగ, అనుత్తమగుణుఁడు = మిక్కిలియుత్తమమైనగుణములుగలవాఁడు.

తా. నిర్మలమనస్సుగలవాఁడా! నీ వచ్చటి కిపుడే శీఘ్రముగఁ బ్రయాణమై పొమ్ము, సుగ్రీవునితో స్నేహము చేయుము. వాఁడు మహాబలవంతుఁడు. శ్రేష్ఠతమములైన గుణములుగలవాఁడు.

ఉ. వంచన యింతలేక, యొక♦వానరుఁ డెయ్యది చేయనోపు నం
చెంచక, చెల్మి సేయుము క♦పీశునితోడుత నగ్ని సాక్షిగా;
సంచితవీర్యవంతుఁడు, స♦హాయతఁ గోరినవాఁడు, మేలు గా
వించుఁ గృతజ్ఞుఁ, డెల్లకపి♦వీరుల కేలిక, కామరూపియున్. ౧౨౩॥

సహాయతన్ = సాయమును, ఏలిక = ప్రభువు.

తా. మోసబుద్ధిలేక వీఁ డొకక్రోఁతి వీఁ డేమిచేయఁగలఁ డని యలక్ష్యము సేయక యగ్నిసాక్షిగా వానరరాజుతో మైత్రి చేయుము. వాఁడు మిగులపరాక్రమవంతుఁడు. ఎవరైన సహాయుఁడు దొరకునా యని కోరియున్నాఁడు. మీకు మేలే చేయును. నీవు చేసినమేలు మఱవఁడు. వానరులకెల్లఁ బ్రభువు. కోరిన రూపము ధరింపఁగలవాఁడు.

క. మీ రాతనివాంఛితమును, దీరుపఁ గల రతనికోర్కెఁ ♦ దెప్పున మీరల్
దీరిచినఁ దీర్ప కున్న న,వారణ మీకార్య మతఁడు, ♦ వలనుగఁ గూర్చున్.

వాంఛితమును = కోరికను, తీర్పఁగలరు = చక్కఁజేయశక్తిగలవారు.

తా. ఆతనికోరిక నెఱవేర్చుశక్తి మీయందున్నది. ఆయనకోరిక మీరు వెంటనే నెఱవేర్చినను నెఱవేర్పకున్నను మీకార్య మాతఁడు చక్కఁబఱచును.

సీ. అతఁడు ఋక్షరజుని♦యాత్మసంజనితుండు, జలజాప్తు నౌరస♦సంభవుండు
పంపాసరోవర♦ప్రాంతదేశంబున, నగ్రజుఁ డగువాలి ♦ కాత్మఁ దలఁకి
చరియించుచున్నాఁడు ♦ సకలాయుధంబుల, నంటి ప్రతినచేసి ♦ యతనితోడ
నెయ్యం బొనర్పుము ♦ నిర్జరారులయిక్క, లతఁ డెఱుంగనియవి ♦ యవని లేవు
తే. తరణికిరణాళి ప్రసరించు♦ధరణిలోనఁ గలనదీనదపర్వత♦కాననముల
రోయఁ గపులను బంచి నీ♦జాయ వెదక, వార్తఁ దెప్పించు నమ్ముము♦కీర్తిపూత.

ఆత్మసంజనితుండు = దేహమునఁబుట్టినవాఁడు, జలజాప్తు = సూర్యునియొక్క, ఔరససంభవుండు = సొంతకొడుకు. ఇందు స్నానముచేసినవారు స్త్రీలగుదురని పార్వతీదేవిశపించిన యొకసరస్సునందు ఋక్షరజుఁడు స్నానముచేసి స్త్రీయయ్యెను. దానిని ఇంద్రసూర్యులు మోహించిరి. ఇంద్రునికొడుకు వాలి, సూర్యునికొడుకు సుగ్రీ

వ్రుఁడు. తలఁకి = భీతిల్లి, నిర్జరారుల = రాక్షసుల, ఇక్కలు = వాసస్థానములు, తరణికిరణాళి=సూర్యునికిరణములసమూహము, నదీ=పడమటిముఖమైపాఱునేళ్లు, జాయన్ = భార్యను.

తా. అతఁడు ఋక్షరజుఁడు స్త్రీయై యున్నకాలమున నామెదేహమున సూర్యునకు జనించినవాఁడు. పంపాసరోవరముప్రక్కప్రదేశమందు నన్నయగు వాలికి భయపడి తిరుగుచున్నాఁడు. వాఁడు నమ్మునట్లు నీవు సకలాయుధములను దాఁకి ప్రతిజ్ఞచేసి స్నేహముచేయుము. వాఁడెఱుఁగనిరాక్షసులుండుచోటులు భూమిమీఁద లేవు. సూర్యకిరణములు వ్యాపించు భూమియందుఁగల నదులు, సదములు, కొండలు, అడవులు, వెదకి నీభార్యయెందున్నది వార్త తెప్పింపఁగలఁడు. నమ్ముము.

క. నీకువియోగముకతమున, ఖేదంబునఁ గుందు విమల♦క్షితిసుత సవ్యా
పాదుఁ డగురావణునిప్రా, సాదంబున నుండువార్త♦శక్తుఁడు దెలియన్. ౧౨౩౮

వియోగముకతమునన్ =ఎడఁబాసినకారణమున, ఖేదంబునన్ =శోకంబున, సవ్యాపాదుఁడు=ద్రోహచింతగలవాఁడు, ప్రాసాదంబునన్ =అంతఃపురంబున, మేడయందు, శక్తుఁడు = సమర్థుఁడు, విమలన్ = అనుటచే నామెపాతివ్రత్యముగుఱించి నీవు సందేహింపవల దనిభావము.

తా. ని న్నెడఁబాసినకారణమున దుఃఖించుచున్న సీతాదేవి ద్రోహచింతఁగల రావణునిమేడయందుండువార్త తెలిసికొన సమర్థుఁడు.

క. ఆరావణునినిశాంతము, నారసి పాతాళలోక♦మం దుండినయేన్
మేరువుకొన నుండిన సీ, తారమణిం దెచ్చుఁ జంపి♦దైత్యచయంబున్. ౧౨౩౯

నిశాంతము = ఇల్లు, ఆరసి = విచారించి, వెదకి, దైత్యచయంబున్ = రాక్షససమూహమును.

తా. ఆరావణునియిల్లు వెదకి వాఁ డామెను బాతాళమందు దాఁచినను మేరువుకొనయందుంచినను రాక్షసులగుంపును జంపి సీతాదేవిని దేఁగలఁడు.

-❀❀- ౭౩-వ సర్గము. కబంధుఁడు రామునకుఁ బంపామార్గంబుఁ జెప్పుట. -❀❀-

సీ. అనుచు సీతాప్రాప్త్యు♦పాయంబు వచియించి, పల్కువెండియును గ♦బంధుఁడిచట
నుండి ప్రతీచిగా♦నొప్పు చుండువనాళి, ఫలపుష్పసముదాయ♦కలిత మగుచు
మా రేళ్లు నేరేళ్లు♦మంచిగన్నేరులు, గోఁగులుఁ బనసలు♦రేఁగుచెట్లు
రావులు మావులుఁ♦గ్రోవులు ముంతమా, మిడులువారిజములుఁ♦గడప లాది

తే. గాఁగ ధరణీరుహంబులు♦గలవు పెక్కు,
చెట్టు లెక్కియొ ఫలములు♦గొట్టి నేలఁ
ద్రోచియో మీరు మెసవుచుఁ♦ద్రోవఁ బోవ
నవులఁ బుష్పితతరువనం♦బలరు చుండు. ౧౨౪౦

సీతాప్రాప్తి+ఉపాయంబున్ =సీతలభించు నుపాయమును, ప్రతీచిగా=పడ

మరగా, ఫలపుష్పసముదాయకలితము = పండ్లు పూలు వీనిరాసులచే గూడినది, మావులు = మామిడిచెట్లు, పుష్పితతరువనంబు = పూచినచెట్లుగల వనము.

ఇంతవఱకు రామలక్ష్మణులు దక్షిణముగానే పయనించిరి. తూర్పు దక్షిణము పడమర సముద్రములతీరములందు సంధ్ర పాండ్యాదిదేశములు గలవు. కావున వారు తూర్పుపోలేదు. అదియునుగాక కొండ లడ్డమువచ్చును. అదియునుగాక జటాయువు దక్షిణముగానే పొమ్మనెను. ఈమార్గమునకుఁ గిష్కింధ పడమరగానున్నది. అదియునుగాక శబరియాశ్రమము జేరుటకుఁ దూర్పునఁదప్పఁ దక్కినదిశలఁబోవ మార్గములేదు. కొండ లడ్డము. కావున వీరు పడమరగానే పోయి యావలఁ దూర్పు తిరుగవలసినవారైరి. నాసిక పంపవటి యనువారివాదమున కిది యడ్డ మగుచున్నది.

తా. అని సీతలభించు నుపాయము చెప్పి కబంధుఁడు మఱియు నిట్లనియె. ఇచ్చటనుండి పడమరగాఁ బోయిన పండ్లతోను బూవులతోను నిండిన వనములు గలవు. అందు మారేళ్లు, నేరేళ్లు, గన్నేరులు, గోఁగులు, పనసలు, రేఁగులు, రావులు, మామిడులు, క్రోవులు, ముంతమామిడులు, వారిజములు, కడపలు మొదలుగాఁ బెక్కులు చెట్లు గలవు. ఆచెట్లెక్కిగాని నేలరాలఁగొట్టిగాని, మీరు వాని పండ్లను దినుచుఁ బోఁగా నావల పూచినచెట్లుగల వనమొకటి గలదు.

క. నందనసుందరమై ని,ష్యందమధురసంబు నగుచు ♦ నఖిలర్తుఫలా
స్పందితవిటపియుతం బై, పొం దగువన ముత్తరకురు♦భూముల కెనయై. ౧౨౮౧

నందనసుందరము = నందనవనమువలె నందమై, నిష్యంద = కాఱుచున్న, మధురసంబు = తేనెవలెఁ దియ్యనైనరసముగలది, అఖిలర్తు = అన్నిఋతువులయందలి, ఫలాస్పందితవిటపి = ఫలములులేకుండనిచెట్లుగలది. అన్నిఋతువులయందుండుఫలములును గలవనిభావము. ఉత్తరకురుభూములకున్ = హిమవత్పర్వతమున కుత్తరముననుండు కురుదేశమునకు, ఎనయై = సమానమై.

తా. నందనవనమువలె నందమై స్రవించుచున్న తియ్యనిరసముగలదై యన్నిఋతువులయందలి పండ్లు పూలు గలచెట్లతోఁగూడి యుత్తరభూములకు సమానమై.

క. ధారాధర ధరణీధర, వారంబులఁ బోలి పక్వ♦ఫలభారనతం
బై రమ్యవిటపియుత మై, (శ్రీ)రంజిలు నచట నచట ♦ వృక్షచయంబుల్.

ధారాధర = మేఘములయు, ధరణీధర = పర్వతములయు, వారంబులన్ = సమూహములను, పక్వ = పండిన, ఫల = పండ్లయొక్క, భార = బరువుచే, నతంబు = వంగినది, రమ్యవిటపి = మనోహరమైనచెట్లతో, యుతమై = కూడినదై, (శ్రీ) = కాంతిచేత, వృక్షచయంబుల్ = చెట్లగుంపులు.

తా. మేఘములతోను పర్వతములతోను సమానమై పండినపండ్ల బరువుచే నేలకు వంగినవై కాంతిచే నచటివృక్షసమూహములు శోభిల్లుచుండును.

క. ఆచెట్టులెక్కియో యిలఁ, ద్రోచియొ ఫలములను నీకుఁ ♦ దోరము గూర్చున్
నీచిన్నతమ్ముఁ డటపై, వే చనినం గొండకొండ ♦ విపినముఁ గనుచున్.

తోరము = విశేషముగ, విపినము = అడవి.

తా. ఆచెట్టు లెక్కిగాని, ఫలములు నేలరాల్చిగాని నీకు విశేషముగా లక్ష్మణుఁడు తెచ్చియిచ్చును. అది దాఁటి కొండకొండ యడవియడవి చూచుచుఁ బోఁగా.

కబంధుఁడు రామునకుఁ బంపాసరస్సు వర్ణించి చెప్పుట.

మానిని. సారసరాజమరాళరథాంగక ♦ చారురవంబు,లశైవలవ
న్నీరములున్, సికతాతలరాజిత ♦ నిర్మలగాఢసమావను లౌ
తీరములున్, నవసారసకైరవ ♦ దివ్యసుగంధిఘుమంఘుమవాః
పూరములున్, విలసిల్లఁగఁ బంప ♦ యపూర్వముదావహమై యెసఁగున్.

సారస = బెగ్గురులయు, రాజమరాళ = రాజహంసలయు, రథాంగక = చక్రవాకములయు, చారురవంబులు = మనోహరమైనధ్వనులు, అశైవలవత్ = పాఁచిలేని (నాఁచులేని), నీరములు = నీళ్లు,సికతాతల = ఇసుకప్రదేశములచే, రాజిత = ప్రకాశించు, నిర్మల = మలినములేని, గాఢ = దృఢమైన, సమ = చదరమైన, అవనులు = భూములు, ఔ = కల, తీరములు = ఒడ్డులు, నవ = క్రొత్తగా వికసించిన, సారస = కమలములయు, కైరవ = కలువలయు, దివ్య = మిగుల శ్రేష్ఠములయిన, సుగంధి=మంచివాసనచే, ఘుమంఘుమ = గుమగుమలాడుచున్న, వాఃపూరములున్ = జలప్రవాహములును, అపూర్వముదావహమై=క్రొత్తసంతోషము గలిగించునదియై, ఎసఁగున్ = అతిశయించును.

మానిని – ఏడు భగణములు, గురువు. ౧౩వ యింట యతి.

తా. బెగ్గురులయు రాజహంసలయుఁ జక్రవాకములయు మనోహరధ్వనులును, పాఁచితీఁగలులేని జలములును, ఇసుకనేలచేఁ బ్రకాశించు నిర్మలమై గట్టియగు చదరపునేలలుగల తీరములు, క్రొత్తగావికసించిన కమలములయు, కలువలయు, మేలగుమంచివాసనలచే గుమగుమలాడు జలప్రవాహములును గలిగి పంప యిదివఱకు ననుభవింపనిసంతోషము కలిగించునది యగును.

ఆ. వధముఁ దెలియనట్టి ♦ వనచారిపక్షులు, ముదము మీఱఁ దిరుగు ♦ నదరుబెదరు
గొనక నరులు తమ్ముఁ ♦ గూడ వచ్చిన నైన; నేతిముద్ద లట్లు ♦ భాతిమెఱయు.

వధము = చంపఁబడుటను, వనచారి = నీటఁదిరుగుపక్షులు.

తా. వేఁటలాడువారు లేమిచేఁ జంపఁబడుట యెట్టిదో తెలియని జలముల విహరించుపక్షులు మనుష్యులు తమయొద్దకు వచ్చినను, బెదరక చలింపక సంతోషముతోఁ దిరుగుచు బాగుగఁ గ్రొవ్వి నేతిముద్దలవలె నుండును.

ఉ. మీరలు గండుమీలుఁ జొర♦మీలును రొయ్యలుఁ గొజ్జుచేప ల
వ్వారిగ బొమ్మిడాయలును♦ వాలుగలుర్ మఱి ముండ్లు లేని వా
వారిచరంబు లెన్నియొ ని♦వాసము చేయు సరోవరంబునన్
గోరిన వెల్లనుం గొనుఁడు; ♦ గూల్చుచు వానిని దమ్ముఁ డమ్ములన్. ౧౨౪౬

వారిచరంబు = జలంబులందు సంచరించునవి, చేపలు.

తా. ఆసరస్సునందు గండుచేపలు, చొరలు, రొయ్యలు, కొజ్జులు, బొమ్మిడాయలు, వాలుగలు, మఱియును ముండ్లులేనిచేపలు ననేకములు వాసముచేయు చుండును. మీకుఁగావలసినవి గ్రహింపుఁడు. లక్ష్మణుఁడు వానిని బాణములచేఁ గొట్టి.

తే. ఒలిచి చర్మంబు తెక్కలు♦ దులిచి వైచి
యినుపకాఁడలకును గ్రుచ్చి♦ యనలమందుఁ
బక్వ మొనరించి చిక్కని♦వాని ముండ్లు
దీసి సద్భక్తి నీకయి♦ తెచ్చి యిచ్చు. ౧౨౪౭

తా. చర్మ మొలిచి తెక్కలుపీఁకివైచి యినుపకడ్డీలకుఁ గ్రుచ్చి నిప్పునందుఁ బక్వముచేసి బలిసినవానిముండ్లు దీసి భక్తితోఁ దెచ్చియిచ్చును.

చ. తనివి సనన్ భుజించి నవ♦తామరసామలగంధ మై సుఖో
జ్జనకసుశీతలం బగుచు♦ స్ఫాటికరౌప్యవినిర్మలంబు నై
యనిశము మోదహేతు వగు♦నక్కమలాకరవారిఁ గ్రోలుమీ
యనుజుఁడు పద్మపత్రపుటి♦యం దొగిఁ దేరఁగ హాయి మీఱఁగన్. ౧౨౪౮

తనివిసనన్ = తృప్తికలుగ, నవతామరస = క్రొత్తతామరలయొక్క, అమల = శుద్ధమైన, గంధమై=పరిమళముగలిగి, సుఖోజ్జనక = సౌఖ్యమును విశేషముగఁగలిగించు, సుశీతలంబు=మిగులఁజల్లనిది, స్ఫాటికరౌప్యవినిర్మలంబు = స్ఫటికమువలెను వెండివలెను దెల్లనిది, అనిశము = ఎల్లవేళల, మోదహేతువు = సంతోషకారణము, కమలాకరవారిన్ = సరస్సునందలి జలము, క్రోలుమీ = త్రాగుము, పద్మపత్రపుటి = తామరాకుదొప్ప, తేరఁగన్ = తీసికొనిరాఁగా.

తా. తృప్తికలుగఁ దిని క్రొత్తతామరపూలవాసనగలదై సుఖకరమగు చల్లఁదనముగలఁదై స్ఫటికమువెండివలెఁ దెల్లనై సర్వదా సంతోషకరమైన యాసరోవరజలమును నీతమ్ముఁడు తామరాకుదొప్పయందుఁ దీసికొనిరాఁగా సంతోషముగఁ ద్రాగుము.

క. వాలుమెకంబులు నీరము, గ్రోలుతఱిన్ ఒప్పుకొనుచుఁ♦ గోడెల రీతిన్
వాలాయము వచ్చుట నర, పాలా! కాననంగఁ గలవు♦ పంపతటముననన్.

వాలుమెకంబులు = అడవిపందులు.

తా. అడవిపండులు నీరు త్రావుకోరికతోఁ గోడెలవలె ఱొప్పుచు విశేషముగ వచ్చుట రాజా! పంపాతీరమందుఁ జూడఁగలవు.

క. సుమనోభరరంజిత మగు, కమనీయకుజాళి శీత♦కాండము సంధ్యా
సమయమునఁ బచారముగొని, యమలమతీ! యుల్ల మలర ♦ నటఁ గనెదుసుమీ.

సుమనోభరరంజితము = పూవులయతిశయముచేత మనోహరమైనది, కమనీయకుజాళి = అందమైనచెట్లవరుసలు. సాయంకాలముగాన చెట్లు పూచియుండును. శీతకాండము = చల్లనిజలము, సంధ్యాసమయమునన్ = సాయంకాలమందు, పచారముగొని = ప్రచారశబ్దభవము-తిరిగి. ఉల్లము = మనస్సు.

తా. సాయంకాలము వేళఁ దిరిగితివేని పూలువిశేషించి పూయుటచే సంతోషకరములైన చెట్లవరుసలను చల్లనినీళ్లను మన స్సానందింపఁ జూడఁగలవు.

కబంధుఁడు రామునితో శబరికి దర్శన మిమ్మని చెప్పుట.

సీ. విరిదమ్మిగలువలు ♦ వరసుమనశ్చిత,నక్తమాలతిలక♦నవ్యతరులు
సంతసం బిడు మీకు ♦ జనము లాపూవులు, ధరియింప రెవ్వరుఁ ♦ దరణికులుఁడ
వాడవు తోడిమెల ♦ నూడ వెన్నండును, నచట మతంగసం♦యమివరుండు
తప మొనరింప నా♦తనిశిష్యగణములు, వన్యముల్ దేరంగ ♦ వనిని దిరుగ

తే. నమ్మహాత్ముల చెమ్మట ♦ లవని వ్రాల, వాన జనియించె నవి గాన ♦ వసుమతీశ!
యట్టిమహిమంబుఁగాంచె న♦య్యనఘు లచటు,వీడి చన వారివరవుడు♦వీడదధిప!

విరిదమ్మిగలువలు = వికసించినకమలములు, కలువలు,వర = శ్రేష్ఠములైన, సుమనస్ = పుష్పములచే, చిత = నిండిన, నక్తమాల = కానుగుచెట్లు, తిలక = బొట్టుగుచెట్లు, నవ్య = అందమైన, తరులు = చెట్లు, తరణికులుఁడ = సూర్యవంశమునఁబుట్టినవాఁడా, వన్యముల్ = అడవియందుఁబుట్టినవి కందమూలఫలాదులు, వానన్ = వానియందు, వరవుడు = దాసి.

తా. వికసించినకమలములు కలువలు శ్రేష్ఠములై యింపైన పూలచే నిండిన కానుగుచెట్లు బొట్టుగుచెట్లు మొదలగు మనోహరములైనచెట్లు మీకు సంతోషము గలిగించును. ఆపూవులను మనుష్యు లెవ్వరు ధరింపరు. అవి యెప్పుడును వాడవు. తొడిమ లూడవు. ఆస్థలమునందు మతంగుఁ డనుముని శ్రేష్ఠుఁడు దపముచేయఁగా నతనిశిష్యు లడవినుండి కందమూలఫలాదులఁ దెచ్చుసమయంబున వారిదేహములనుండి చెమటలుగాఱఁగా వానివలనఁ బుట్టినవి కావున వాని కట్టి మహిమము వచ్చెనుగాని చెమటవలనఁ గలిగినవి కావున నెవరు ధరింపరు. వా రాస్థలము విడిచిపోయిరి కాని వారిదాసిమాత్ర మాచోటు విడిచినది కాదు. ఈమతంగునకు భారతమందలి . చండాలమతంగునకు సంబంధములేదు. ఇరువురు భిన్నపురుషులు. ఈపేరుగలవారు మఱియు నొక రిరువురు గలరు. చెమటబిందు

వులు చెట్లమీఁదఁ బడి పుష్పము లాయె. నని గోవిందరాజీయము. పుష్పములు విస్తారముగ నుండుటచే వీని నెవరు ధరింప రని గోవిందరాజీయము.

అచటు, అచోటు, అచ్చటు, అచ్చోటు, అచ్చోటు రూపాంతరములు.

క. చిరజీవిని శ్రమణీమణి, వరధర్మచరిత్ర శబరి ♦ స్వర్గముఁ జేరున్
దరిసించి దేవసము నన, వరతంబు సమస్తభూత ♦ వందితు నిన్నున్. ౧౨౯౨

చిరజీవిని = దీర్ఘకాలముగ బ్రదికియుండునది, ముసలిది, శ్రమణీమణి = గొప్పఆఁడుసన్యాసి. చతుర్థాశ్రమస్వీకారము చేసినదని యర్థము కాదు. సన్యాసిధర్మములైన జ్ఞానవైరాగ్యాదులుకలది. జ్ఞానమేకదా సన్యాసలక్షణము. వరధర్మచరిత్ర = శ్రేష్ఠమైన గురుశుశ్రూషాధర్మము నాచరించునది, శబరి = బోయస్త్రీ, దేవసమున్ = నారాయణునితో సముఁడవైనవానిని, అనవరతంబు = సర్వదా, సమస్తభూతవందితున్ = దేవతిర్యఙ్మనుష్యాది సమస్తభూతచయములచే స్తోత్రము చేయఁబడువానిని, దరిసించి = దర్శించి. దీనివలన రామచంద్రమూర్తిపరత్వజ్ఞానము కబంధునకుఁగలదని యేర్పడుచున్నది.

తా. దీర్ఘకాలముగ జీవించియుండునది యతిధర్మమున జరించునది గురుశుశ్రూష యనుపరమధర్మ మనుష్ఠించునది బోయెత భగవత్సముఁడవైన నిన్ను సర్వభూతములచే నమస్కరింపఁబడువానిని దర్శించి స్వర్గముఁ జేరును. నీరాకకై కాచియున్నది.

ఉ. ఆమహి నాగపాళి చేర♦లాడుచు నుండియు నమ్మతంగు తే
జోమహిమాన నాశ్రమము♦సూరెలఁ జేర దొకండుఁ, దత్సరో
భూమికిఁ బశ్చిమంబునను ♦ బొల్చును గుహ్యతరాశ్రమోర్వి, యం
దామహిళావతంసము ని♦రంతరముం దప మాచరించెడిన్. ౧౨౯౩

ఆమహిన్ = భూమియందు, నాగపాళి = ఏనుఁగులగుంపు, చేరలాడుచున్ = తిరుగుచు, సూరెలన్ = ప్రాంతముల, గుహ్యతర = మిగులరహస్యమైన, ఆశ్రమోర్వి = ఆశ్రమప్రదేశము, మహిళావతంసము = స్త్రీలయందు శ్రేష్ఠురాలు, నిరంతరమున్ = సర్వదా.

తా. ఆవనప్రదేశమందు నేనుఁగులగుంపు సంచరించుచు నుండును గాని మతంగునితపోమహిమచే నొకయేనుఁగైనను ఆప్రక్కలకు రాదు. ఆసరస్సునకుఁ బడమట మిగులరహస్యమైన యాశ్రమమొకటి గలదు. అందాస్త్రీరత్నము సర్వదా తపము చేయుచుండును.

క. బృందారకవననిభ మై, నందనసంకాశ మగుచు ♦ నవ్యగరుత్మ
ద్బృందాకుల మగునావని, నందింపఁగలాఁడ వీవు ♦ నానాగతులన్. ౧౨౯౪

బృందారకవననిభము = దేవతలయుద్యానమగు చైత్రరథము మొదలగు వనములతోసమానము, నందనసంకాశము = ఇంద్రునివనమగు నందనముతో

సమము, నవ్య = క్రొత్తక్రొత్తలగు, గరుత్మత్ = పక్షుల, బృంద = సమూహాముచే, ఆకులము = కలఁతచెందినది, వనిక్ = అడవియందు, నందింపఁగలాఁడవు = ఆనందింపఁగలవాఁడవు.

తా. దేవతలచైత్రరథము మొదలగువనములతోను నింద్రునినందనముతోను సమానమై వింతవింతపక్షులగుంపులచే వ్యాకులమైన యాయడవియందు నానావిధముల సంతోషింపఁగలవు.

సీ. ఆమెను గనుఁగొని ♦ యరుగుమీ యావలఁ, బంపాసరోవర ♦ ప్రాంతమునకు
నచ్చట సుమభార ♦ హారిశైలము ఋశ్య, మూకంబు పొలుచు న ♦ నేకపముల
సమ్మర్దమునఁ జేసి ♦ సౌఖ్యంబుగాఁ గొండ, నెక్కఁగ, రాదది ♦ నిక్కువంబు
ఆమలపై నిద్ర ♦ నందువాఁ డేసొమ్ముఁ, గలలోనఁ గాంచు మే ♦ ల్కనినయంత

తే. దానిఁ బడయును; బాపు లా ♦ ధరణిధరము
పైకిఁజనరాదు; చని నిద్ర ♦ గైకొనినను
రాక్షసులు వారిఁ బ్రహరింత్రు ♦ రామచంద్ర!
బ్రహ్మనిర్మిత మియ్యది ♦ పార్థివేంద్ర! ౧౨౫

ప్రాంతమునకు = సమీపమునకు, సుమభారహారిశైలము = పుష్పముల యతిశయముచే మనోహరమైనపర్వతము, అనేకపముల = ఏనుఁగుల, సమ్మర్దమునఁ జేసి = రాయిడిచేత, మలపై = కొండమీఁద, ధరణీధరము = పర్వతము, ప్రహరింత్రు = తన్నుదురు, బ్రహ్మనిర్మితము = బ్రహ్మచే నేర్పాటుచేయఁబడినది.

తా. ఆమెను జూచి యాపిమ్మట పంపాసరోవరసమీపమునకుఁ బొమ్ము. ఆసరోవరతీరంబున ఋశ్యమూక మనుపర్వతము విశేషముగఁ బూచినచెట్లచే మనోహరమైనది కలదు. అందు నేనుఁగులు విశేషించి తిరుగుచుండుటచేత వాని రాయిడికిఁ గొంత యెక్కుట సుకరముగాదు. ఇది నిజము. ఆకొండమీఁద నిద్రించువాఁ డేసొమ్ము కలలోఁ జూచునో యాసొమ్ము మేలుకొనఁగానే లభించును. పాపాత్ములాకొండమీఁద నిదురింపరాదు. అట్లు వారు నిద్రపోయిరా నిద్రలో వారిని రాక్షసులు కొట్టుదురు. రామచంద్రా! ఇది బ్రహ్మచేసిన యేర్పాటు.

తే. మనికి గొనుచు మతంగాశ్ర ♦ మంబునందుఁ
బంపయొద్దనఁ జేరలాడు ♦ వారణముల
పోతములు గీఁక లిడినను ♦ భూమిధరము
మీఁదఁ జక్కఁగ వినవచ్చు ♦ మిహిరవంశ్య. ౧౨౬

మనికిగొనుచు = వాసముచేయుచు, చేరలాడు = తిరుగు, వారణముల = ఏనుఁగుల, పోతములు = బిడ్డలు, గీఁకలు = ఘీంకారములు, మిహిరవంశ్య = సూర్యవంశమునఁబుట్టినవాఁడా. పంపసమీపమందే పర్వత మున్నదనిభావము.

తా. మతంగాశ్రమంబునందు వాసముచేయుచుఁ బంపాతీరంబున సంచరించు నేనుఁగుపిల్లలు ఘీంకరింపఁ గొండమీఁదికి బాగుగా వినఁబడును.

క. జలధరవర్ణంబులునై, బలితము లగుకరులు మదము♦బలమునఁ దమలోఁ
కలహించి తోఁగి నెత్తుటఁ,దొలఁగి చనుఁ వేఱు వేఱు♦త్రోవల నచటన్.

జలధరవర్ణంబునై = మేఘములకాంతిగలిగి, బలితములు = బలముగలవి, మదముబలమున = గర్వాతిశయమున, తోఁగి = తడిసి.

తా. నల్లమబ్బులవలె నల్లనై బలిష్ఠములైన యేనుఁగులు మదమునఁ దమలోఁదాము కలహించి గుమ్ములాడి నెత్తుటఁ దడిసి యేదియు నోడిపోవమిచే వేఱు వేఱు త్రోవలఁ బోవును.

క. విమలం బై శీతం బగు,కమలాకరవారిఁ ద్రావి ♦ కాననగజముల్
తమిమీఱ నచ్చట యథే,చ్ఛముగా విహరించు సౌఖ్య♦సమ్మదమతులన్.

కమలాకరవారిఁ =సరోవరజలమును, కాననగజముల్ =అడవియేనుఁగులు.

తా. పరిశుద్ధమై చల్లనై యుండు కొలనినీటిని ద్రావి యడవియేనుఁగులు కోరిక లతిశయింపఁగా నచ్చటనే యిష్టప్రకారము సౌఖ్యముచే సంతోషించిన మనస్సులచేఁ దిరుగుచుండును.

సీ. ఎలుఁగులఁ బులులను ♦ నింద్రనీలచ్ఛాయ,మృగములఁ గనశోక ♦ మెడలు నీకు
నాపర్వతమున మ♦హాగుహ యొక్కటి, యుర్వీశ యొప్పారు♦చుండు నదియు
రాతి పెన్మూఁతచేఁ♦గ్రా లెడు నద్దానిఁ, జొరఁగఁ బూనుట సుఖ♦కరము గాదు
తద్గుహకును దూర్పు♦ద్వారంబుకడ నొండు, మంచి చల్లనినీటి♦మడుఁగు గలదు

తే. ఆజలాశయతీరంబు ♦ తేజరిల్లు, హారిఫలమూలయుత మయి ♦ హరిణనికర
యుక్తి నాగుహసుగ్రీవుఁ♦డుండు నయ్య,వానరచతుష్కయుతుఁ డయి♦వాలిభీతి.

వానరచతుష్కయుతుఁడు = నలుగురువానరులతోఁగూడినవాఁడు, వాలి భీతి = వాలివలనిభయముచే.

తా. అందలి ఎలుఁగుగొడ్డులను, పులులను, ఇంద్రనీలములవన్నెగల జింకలనుజూడఁగానే నీకు శోక ముపశమించును. ఆపర్వతమునందుఁ బెద్దగుహ యొక్కటి గలదు. అది పెద్దరాతిమూఁత గలది. దానిలోఁ బ్రవేశించుట సుకరముగాదు. ఆగుహకును తూర్పువాకిట నొకమంచిచల్లనినీళ్లమడుఁగు గలదు. ఆమడుఁగునొడ్డున మంచిఫలమూలములతోఁగూడిన చెట్లు జింకలమందలు గలవు. ఆగుహయందు సుగ్రీవుఁడు వాలివలనిభయముచే నలుగురువానరులతోఁ గూడియుండును.

క. ఎపుడేనియు గిరిశిఖరము, నుపరితలమునందు నిలుచు ♦ చుండు న టంచుఁ
విపులాధీశులకును విశ,దపడఁ వచియించి మింటఁ♦దరలుచు నిలువన్. 1210

ఉపరితలమునందు = మీఁదిభాగమున, విపుల+అధీశులకుఁ = భూపతులకు, తరలుచుఁ = పోవుచు.

కీడుగాఁబరిణమించు నని మనము దేనికిభయపడుదుమో భగవత్సంకల్పము కొలఁది యది మేలుగానే పరిణమించును. తమకు మృత్యువనితలఁచిన కబంధుని వలన నెంతమేలుగలిగెనో చూడుఁడు. మనము మేలుకలుగు నని తలఁచినవారి వలనఁ గీడుకలుగుటయు భగవత్సంకల్పమే.

తా. ఒకానొకప్పుడు పర్వతముపై భాగమందు గుహ విడిచి నిలుచుండును అని యారాజకుమారులకుఁ జెప్పి ప్రయాణమునకు సిద్ధపడఁగా.

క. పొమ్మని సెలవిచ్చిన వాఁడుమ్ముదమునఁ బోయె రాముఁ♦డుం దమ్ముఁడు శీ
ఘ్రమ్మునఁ బడమటిదెస గో,త్రమ్ములు మధుమధురఫలయు♦తమ్ములు వనముల్.

వాఁడుమ్ముదమునన్ - వాఁడున్ + ముదమునన్ - ప్రాసంబున మకారంబు పరమగుచో ద్రుతమునకు మకారాదేశమగు-త్రి. శే. సంధి ౨౨ సూ.

గోత్రమ్ములు = కొండలు, మధు = తేనెవలె, మధుర = తియ్యనైన, ఫల = పండ్లతో, యుతమ్ములు = కూడినవి.

తా. పొమ్మని యాజ్ఞ సేయఁగా వాఁడు సంతోషముతోఁ బోయెను. రాముఁడు లక్ష్మణుఁడు త్వరగాఁ బడమటిదిశగా కొండలు, తియ్యనిపండ్లుగల యడవులు.

## ౭౪-వ సర్గము. రామలక్ష్మణులు శబరిం జూచుట.

క. తరువులు గనుచుం జని భూ,ధరముసమీపమున నాఁటి♦తమిఁ బుచ్చి తమో
హరుఁ డుదయించిన నిర్మల,తరవారిమనోజ్ఞ పంప♦తటముం గనుచున్. ౧౬౨

తరువులు = చెట్లు, భూధరముసమీపమునన్ = పర్వతముదగ్గఱ, నాఁటి తమిన్ = ఆదినమురాత్రి, నాఁడు=ఇచ్చట, నాఁడుశబ్దమునకు ఆదినమని యర్థము. ఇది భూతమునను ప్రయోగింపఁబడును. 'నాఁటికై దేండ్లవాఁడను నాఁడునృపాలపుత్రి వనినమ్మివరించితిఁగాక,' భాస్కరుఁడు. తమోహరుఁడు=చీఁకటిని బోఁగొట్టువాఁడు, సూర్యుఁడు, నిర్మలతర = మిగులఁబరిశుద్ధమైన, వారి = నీళ్లుగల, మనోజ్ఞ = అందమైన, పంప = పంపయొక్క, తటమున్ = తీరమును.

తా. చెట్లుఁ జూచుచుఁ బోయి కొండదగ్గఱ నారాత్రి గడపి సూర్యోదయ ముకాఁగానే పరిశుద్ధజలముగల పంపయొక్కతీరముఁ జూచుచు.

క. వరుణదిశాతీరంబున, నరసి యచట శబరి రమ్య♦మగునాశ్రమమున్
బరికించి చేరఁ జన న,త్తరుణియు వెస లేచి మోడ్చి♦తనహస్తంబుల్.

వరుణదిశా = పడమటిదిక్కు, అరసి = వెదకి.

తా. పడమటిదిక్కు నొడ్డునందు వెదకి యచట శబరియుండురమ్యమగు నాశ్రమమును జూచి సమీపింపఁగా ఆమె త్వరగాలేచి చేతులుమోడ్చి.

పంపయొడ్డున నీయాశ్రమ మిప్పటికి నున్నది. ఈగుహవాకిటఁ బట్టపగ

లెండలుమండిపోవుసమయంబునఁ గూర్చుండినను వస్త్రముకప్పుకొనవలసినంత చల్లనిగాలి వీచుచుండును.

క. వారలపదములు సోఁకఁగ, సారమతిఁ మ్రొక్కి పాద్య♦జల మిడి తగుస
త్కారము లెల్ల యథావిధిఁ, దీరిచి నిలుచున్న రామ♦దేవుం డనియెన్.

తా. వారిపాదము లంటి నమస్కరించి పాద్య మిచ్చి తగినయుపచారముల నెల్ల శాస్త్రప్రకారము గావించి నిలువఁబడియుండఁగా శ్రీరామచంద్రదేవుం డిట్లనెను.

సీ. నీతపో వ్రతములు ♦ నిర్విఘ్నితంబు లై, సాగుచున్నవిగదా ♦ సాధుశీల!
యాగ్రహమునయందు ♦ నాహారమునయందు, నియమంబు గలదుగా♦నిర్మలాత్మ
నీనియమంబులు ♦ నెఱవేఱు చున్నవే, మనసు నిర్మళ మయి ♦ యొనరు నమ్మ
గురుపరిచర్యలు ♦ కొనసాగు చున్నవే, సఫలంబులా యవి ♦ చారుచరిత

ఆ. యనుచు రాముఁ డడుగ ♦ న త్తపోధనురాలు, సిద్ధసమ్మత యగు♦సిద్ధురాలు
కౌసలేయుఁ జూచి ♦ ఘనభక్తియుక్తి ని, ట్లనియెఁ దన తెఱంగు ♦ వినయమునను.

నిర్విఘ్నితంబులు=విఘ్నములులేనివి, ఆగ్రహమునయందు=కోపమునందు, ఆహారమునయందు=తినెడిపదార్థమందు మితమందు, నిర్మళము = శాంతి, కలవర పాటు లేనిది, కౌసలేయుఁ=కౌసల్యాపుత్రుఁడగురాముని-అపత్యార్థకతద్ధితాంతము.

నిర్విఘ్నితంబులు—కామము, క్రోధము, లోభము. వీనివలని విఘ్నములు కలుగుటలేదుకదా. ఈమూఁడును దపస్సునాశము చేయుటయేకాక నరకమునకు ద్వారము లగును.

త్రివిధంనరక స్యేదం, ద్వారం నాశన మాత్మనః।
కామః క్రోధ స్తథాలోభ, స్తస్మా దేతత్త్రయంత్యజేత్॥

భగవద్గీత, ౧౬-౨౧

కామముచేఁ దపస్సునాశముచేసికొన్నవారు విశ్వామిత్రాదులు. కావునఁ దపశ్శీలు రీమూఁటికి నెడమీయరాదు. ఆగ్రహము తపస్సునకు విఘ్నము కలిగించునదే యైనను కామాదులకంటె దుర్జయమైనది కావున నిది ప్రత్యేకముగఁ జెప్పఁబడెను. 'అక్రోధనుఁడ కరం బధికుఁడండ్రు త త్త్వవిధిజ్ఞుల్' భార.

ఆహారమునయందు=నిషిద్ధవస్తువులఁ దినకుండుట నిషిద్ధకాలములఁ దినకుండుట నిషిద్ధవిధముగఁ దినకుండుట, మితభుక్తి, సాత్త్వికపదార్థభుక్తిలో నైనవి.

"ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః," "తపోనానశనాత్పర" మ్మని యుపనిషత్తులు చెప్పుచున్నవి.

పంక్తిలోభుజించువారితో నుపచారవాక్యములు మాట్లాడవచ్చును. ఇతర విషయములు మాటలాడరాదు. అట్లుమాటలాడినయెడల 'భూర్భువస్సువరోం'

అని జపించి శేషమును (మిగిలినపదార్థము) భుజించవచ్చును. నోటినుండి జాఱి పడినదానిని, భుజింపఁగా మిగిలినపదార్థమును, కబలశేషమును మరల తినరాదు. పిండివంటకము, కూరలు, దుంపలు, ఫలములు మొదలగువానిని చేతితోవిఱిచి తినవలెను. పండ్లతోకొఱికి తినరాదు. విస్తరియందు ఉప్పునొకటి ప్రత్యేకముగా వేయరాదు. పెరుఁగులోఁగాని, మజ్జిగయందుఁగాని చేర్చియుంచవలెను. నూనెతోవండినవిగాని, పచ్చివిగాని, గరిటెలతో నుంచరాదు. అన్నము, వ్యంజనములు (కూరలు, పచ్చడులు), మంచినీరు, పెరుఁగు, పాలు, నెయ్యిచేతితో నుంచరాదు. గరిటెలు మొదలగువానితో వడ్డింపవలెను. అట్టివిలేనిచో ఆకునైననాధారముచేసికొని వడ్డింపవలెను. అన్నమునందుఁగాని, వ్యంజనములందుఁగాని భుజించునప్పుడు దోషములనుఁ జెప్పరాదు.

దేవాలయమందునుఁ జీకటియందును, బట్టబయటను, మిద్దెలపైభాగమునను, వట్టినేలయందు, పాడుపడినయింటియందు భుజింపరాదు. పగటియందుఁగాని, రాత్రియందుఁగాని, రెండుపర్యాయములు భుజింపరాదు. రాత్రి రెండు జాములు దాఁటినతరువాత, అర్ధరాత్రియందు, పగలు రెండుజాములందు (అనఁగా 12 గంటలప్పుడు) భుజింపరాదు. నిలుచుండిగాని, కుర్చీ మున్నగువానిమీఁదఁ గూర్చుండిగాని, ఆచమనముచేయకుండఁగాని, ఒంటివస్త్రముతోఁగాని, తలగుడ్డతోఁగాని, ఇతరులనుదాఁకిగాని, చండాలురయు, బయటఁజేరినవారి యొక్కయు (ముట్టువారు), శూద్రులయొక్కయు మాటలనువినుచుఁగాని, పతితాదులతో సహపంక్తినగాని భుజింపరాదు. చేతియందుఁగాని, దోసిలియందుఁగాని విడిఆకులోఁగాని, మట్టిపాత్రయందుఁగాని, వస్త్రమునందుఁగాని భుజింపరాదు.

ఒకపంక్తిలో భుజించుచుండఁగాఁ దాను ముందుగా భుజించి లేచి వెళ్లరాదు. త్వరగా లేచివెళ్లవలసివచ్చినయెడల అప్పుడు అగ్నిహోత్రము, బూడిద, స్తంభము, ఉదకము, దర్భలు, ద్వారబంధము పెచ్చుతగ్గుప్రదేశములో నొకదానిని పంక్తిభేదము గల్పించి లేచి వెళ్లవచ్చును.

నూనెగానుగ, చెఱకుగానుగ, పతితులు, శూద్రులు, ముట్టుతలు, రోఁకలిపోటు, మొదలగువానిశబ్దము వినుచు భుజింపరాదు. భోజనసమయమందు భార్య మొదలగువారితో పోట్లాడుట, పుత్రులుమొదలగువారిని కోపించుట ఎంగిలిపదార్థములు పెట్టుట పనికిరాదు. పాయసము, పెరుఁగు, క్షీరములు, ఉదకము, నెయ్యి, వీనిని చప్పిడికాకుండఁ (శబ్దముకాకుండ) త్రాగవలెను. పాత్రలో నున్నయుదకమునుగాని, త్రాఁగఁగా మిగిలిననీరుగాని భూమియందు కొంచెము పోసి పుచ్చుకొనవచ్చును. పెరుఁగు, పాలు, నెయ్యి, నీరు, పిండి, మొదలగునవి పాయసాన్నముతప్పనన్నియు సశేషముగా భుజించవలెను. రాత్రిభోజనసమయమందు దీప మారిపోయినయెడల ఆసమయమందు సూర్యుని మనస్సున స్మరించి చేతులతో పాత్ర

మును దాఁకియుండి తిరిగి దీపముంచువఱకు భుజింపరాదు. దీపముంచినతరువాత పాత్రమందున్న పదార్థముమాత్రమే భుజింపవలెను. ప్రతికబళమునకు గోవింద నామ ముచ్చరించుచు భుజింపవలెను.

జాతిదుష్టము:—ఎఱ్ఱగడ్డ, తెల్లగడ్డ, ముల్లంగి, తెల్లవంకాయ. సొర కాయ, మునఁగకాయ, తాండ్ర, అడవికంద, ఎఱ్ఱఅవిస, కుమ్మట్టి, తాణికాయ, మునగకూర, చిల్లగింజ, మఱ్ఱికాయ, అత్తికాయ, బీరకాయ, గోంగూర, చిఱ్ఱి కూర, చేఁదుపొట్ల, చవిటిఉప్పు, గానుగపిండి (నువ్వుపిండి). ఎఱ్ఱయింగువ, దొం డకాయ, కుక్కగొడుగు, రావి, గంజాయి, సజ్జలు, జొన్నలు, ఆళ్లు, కుసుమలు, రాగులు, (నువ్వులు, మినుములు) ఇదిగాక మిగిలిన నల్లధాన్యములు గవ్వసున్న ము మొదలైనవి.

క్రియాదుష్టము:—ఋతుస్నానదినమున స్త్రీచే తగిలినపదార్థము. (౪-వ దినము.) పంచసంస్కారములుగానివారిచే పక్వముచేయఁబడిన యన్నము, జేతితో కలిపినపెరుఁగు, నోటితోనూఁదబడినది, ఇతరులచేతితో ముట్టుకొనఁబడినది, వస్త్ర ముచేతవడకట్టఁబడని యుదకము, పునఃపాకముచేయఁబడిన యన్నము, విక్రయా న్నము, వేయించినయుప్పు, సారముతీసికొనఁబడిన పిప్పిపదార్థములు, దీపములేకుండ వెన్నెల, అగ్నిమొదలగు వెలుతురులందు రాత్రులందు భుజించినయన్నము, భోజన మధ్యమందుంచుకోఁబడిననెయ్యి, గోటితోఁజీల్పఁబడిన (గిల్లఁబడిన) వస్తువులు, తాత, ఆచార్యులు, పెద్దఅన్న, భర్త, వీరియొక్క యుచ్ఛిష్టముతప్ప మిగతావారి యెంగిలి (యుచ్ఛిష్టము), కాఁచినకొబ్బరినీరు మొదలైనవి.

కాలదుష్టము:—మూఁడు సంవత్సరములకుపైఁబడిన ధాన్యము, ఒకమాస ముపైఁబడిన బియ్యము, నొకమాసమునకు మించినవడియములు, పదునైదుదినము లకుపైఁబడిన నెయ్యి, నూనె, పెసరపప్పు, పదునైదుదినములకు మించివాఁడునట్టి మట్టిపాత్రములయందువండెడి పదార్థములు, ఒకదినముమించి నిలువ యున్నయుద కము, ఒకరాత్రికిపైఁబడిన పక్వపదార్థములు, పాలు, ఉప్పు, వక్కలు, పసుపు, వడియాలు, పిండివడియములు, వేయించినబియ్యము, వేయించినకందులు, పెసలు. మొదలైనవానికి పర్యుషిత (చలిది) దోషములేదు. సున్నము, మిరియాలు, ఊరుఁ గాయలు, అల్లము, బెల్లము పాకము, పిండితోచేరిన పెరుఁగు, అటుకులు, క్షీరా న్నము, పేలాలు, నీటియందుంచిన యన్నము, నూనె, నెయ్యి, పెరుఁగు, వీని యందు దేనితోనైనను చేర్చినయన్నము, ఫలములు, కోవా, మందు, పునఃపాక ముచేసిన కూరలు, అకాలమందు ఉత్పత్తిచేయఁబడిన ఫలములు. పాడ్యమినాఁడు గుమ్మడికాయ, విదియయందు వంకాయ, అష్టమిదినమున టెంకాయ, దశమి పొట్ల కాయ, ఏకాదశి చిక్కుడుకాయ, త్రయోదశి నువ్వులు, చతుర్దశి చింతపండు, సప్తమి ఆదివారము వుసిరిక, పగటియందుపాలు, వెలగపండు, పేలపిండి, రాత్రు

లందు నువ్వులుకలసిన పదార్థములు, పెరుఁగు, పిండి, తేనె, నూనె, అల్లము, పితృదినములందు బూడిదగుమ్మడి, వంకాయ, పచ్చిమిరపకాయ, పొట్లకాయ, కొత్తిమేర, ఇంగువ, నిమ్మపండు, బఱ్ఱెపాలు, కందిపప్పు, ఆవాలు, శనగపప్పు, బొబ్బరులు (అలచందలు), ఉలవలు, తెల్లచిక్కుడు, కొయ్యతోఁటకూర; ద్వాదశిపారణయందు చింతపండు, ఆవాలు, మినుములు, శనగపప్పు, నువ్వులనూనె, వంకాయ, కదళీపంచకము (అరఁటిఆకు, పువ్వు, కాయ, పండు, ఊచ) పనికిరావు.

సంసర్గదుష్టము:—ఉప్పుతోఁగూడిన నెయ్యి, పాలు; పురుగులు, ఈఁగలు, వెండ్రుకలు గోళ్లు వీనితోనుండిన యన్నము (ఆపత్కాలమం దట్టియన్నము తినవలసివచ్చినచో వానికి సంబంధించిన పిడికెఁడు అన్నమును తీసివేసి మిగతా ప్రసాదమందు భగవత్పాదతీర్థము ప్రోక్షించి భుజింపవచ్చును.) సన్న్యాసులభిక్షాపాత్రమందున్న యన్నము, సన్న్యాసులచేత యియ్యఁబడిన యన్నము, టెంకాయతోఁ జేరినపాలు, చింతపండుచేర్చిన పెసరపప్పు, చిక్కుడు, ధనియాలు. పొట్లకాయ మొదలైనవి.

ఆశ్రయదుష్టము:—కంచుపాత్రయందుంచిన కొబ్బరినీరు, రాగిపాత్రయందుంచిన తేనె, నెయ్యి, పాలు; ఇనుపపాత్రతో వడ్డించిన పదార్థములు, ఇనుపపాత్రమందుంచఁబడిన నీరు, ఆవు యీనినపదినాళ్లలోనిపాలు, మజ్జిగకలిసినపాలు, చూడియావుపాలు, దూడచచ్చిన ఆవుపాలు, రెండుదూడలుపుట్టిన ఆవుపాలు (కవలదూడలు), పింగాణి మొదలగు పాత్రములందుంచఁబడిన యుదకము మొదలగునవి.

నిమిత్తదుష్టము:—బ్రాహ్మణులచే విక్రయించఁబడిన పాలు, పెరుఁగు, మజ్జిగ; కుక్క, కాకి, కోడి, ఎలుక, పిల్లి, ముంగిస, మొదలగువానిచే తగిలినయన్నము, కూరలుమున్నగునవి; మనుష్యులు, పశువులు వీనిచే వాసనచూడఁబడినయన్నము, కాళ్లుకడుగుకొనఁగా మిగిలిననీరు, కాలికితగిలిన యన్నము, కాళ్లతో దాఁటిన యన్నము, సత్రమందుపెట్టిన యన్నము, చలివేంద్రయందు ఉదకము, విసుకుకొనుచు (తిట్టుచు) పెట్టినయన్నము, సింహద్వారమందుఁగాక దొడ్డివాకిటనుండి లోపలికి తీసికొనివెళ్లఁబడినయన్నము, మాడినయన్నము; నాలుగుసారులుబియ్యము కడుగకవండియన్నము; పెసరపప్పుకూరలు, ఫలములు, పేరుతెలియని పదార్థములు; తనకొఱకై చేయించుకోఁబడిన పదార్థములు, భూమిమీఁదపడని వర్షపునీరు మొదలగునవి.

తా. సాధుచరిత్రా! నీతపస్సులు వ్రతములు విఘ్నములులేక జరుగుచున్నవి కదా! కోపమునందు ఆహారమునందు నిర్మలమగు మనస్సుగలదానా! నియమము గలదుకదా! నీవు నియమించుకొన్నవ్రతములు నెఱవేఱుచున్నవా? మనస్సు సర్వదా ప్రసన్నమయి శాంతమైయున్నదా? గురుసేవలు కొనసాగుచున్నవా? దాని

వలనిఫల మనుభవమునకు వచ్చుచున్నదాఁయని రామచంద్రమూర్తి ప్రశ్నింపఁగా తపస్సే ధనముగాఁగల యాపుణ్యస్త్రీ ముక్తులగువారికి సమ్మతమైన నడవడిగల యాయోగసిద్ధురాలు కౌసల్యాపుత్రునిఁ జూచి మిగులభక్తితోఁ దనవిధము వినయముతో నిట్లనెను.

గురువు, గురుపుత్రులు లేరుగదా. ఇప్పుడేమి గురుశుశ్రూష యనరాదు. గురువుపోయినను నిజమైనశిష్యులు గురుపాదుకలునైన నుంచుకొని వానికి గురుపూజ విధముగనే పూజ చేయవలయును. 'యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ। తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥' శ్వేతాశ్వతర. భగవంతుని యందు పరభక్తియు, దేవునియందువలె గురువునందు నట్టిభక్తియుఁగల మహాత్మునకే యీచెప్పఁబడిన రహస్యవిషయములు మనస్సునఁ బ్రకాశించును. ప్రత్యక్షగోచరము లగును. కావున గురుబోధ మనస్సునఁ బ్రకాశించి దానిఫలమునంద వలయుననువాఁడు నిర్మలచిత్తుఁడగుటయేగాక దేవునియందు గురువునందు పరమభక్తిగలవాఁడై యుండవలెను. గురుభక్తిలేనివానికి నాయన చెప్పినవిషయములు మనస్సునకే రావు. ఇఁక ఫలానుభవమెక్కడ? ఈనిమిత్తమయియేకదా రామచంద్రమూర్తి 'సాధుశీల, నిర్మలాత్మ మనస్సునిమ్మళమయి యొనరునమ్మ' యని ప్రశ్నించి యావల గురుపూజాఫలముగలదా యని ప్రశ్నించెను. సిద్ధురాలనుటచే నీమె యోగారూఢ యనియే చెప్పవలసియున్నది. అందుసిద్ధసమ్మతయఁట.

సీ. ఇపుడెకా ఫలియించె ♦ హితగురుశుశ్రూష, నిన్నుఁ జూచుటఁజేసి ♦ నిర్మలాత్మ
　యిపుడెకా సిద్ధించెఁ ♦ దపములు వ్రతములు, నీదర్శనంబున ♦ నీరజాక్ష
　యిపుడెకా నాజన్మ ♦ మెల్ల సార్థక మయ్యెఁ, గనులార నినుఁ జూడఁ ♦ గౌసలేయ
　యిఁక నెకా స్వర్గంబు ♦ నే నేగఁ గందును, దివుటఁ నిన్ బూజింప ♦ దేవవర్య
ఆ. నీదయార్ద్రదృష్టి ♦ నిహతపాతక నైతి, నరివిదారి! యక్ష ♦ యంబులైన
　పదము లందుదానఁ ♦ బరమభవ్యచరిత్ర, యఘలతాలవిత్ర ♦ యసితగాత్ర.

రామచంద్రుప్రశ్నకుఁ బ్రత్యుత్తరముగా పరమార్థవాక్యములను నుపచారవాక్యములవలెనే చెప్పుచున్నది. ఇపుడెకా = ఇప్పుడేకదా, దేవవర్య = దేవతలయందుశ్రేష్ఠుఁడా యనుటచే శబరికి శ్రీరామచంద్రమూర్తివిషయమునఁ బరతత్త్వజ్ఞానముగల దనిసూచింపఁబడియె. దయార్ద్రదృష్టిన్ = దయారసముచేఁ దడిసిన చూపుచే, నిహతపాతకన్ = నాశముచేయఁబడిన పాపములుగలదానను, అరివిదారి = భక్తులయందలి అరిషడ్వర్గమగు కామక్రోధలోభమోహమదమాత్సర్యములను జీల్చువాఁడా, కామాదిజయము భగవదనుగ్రహమునఁ గలుగవలయునేకాని కేవలస్వప్రయత్నమున నగునదికాదు. భగవంతుఁడు హృషీకేశుఁడు (ఇంద్రియముల శాసించువాఁడు) చ॥ యమనియమాదియోగముల, నాత్మ నియంత్రితమయ్యుఁ గామరోషములఁ బ్రచోదితంబ యగు శాంతివహింపదు, విష్ణుభక్తిచేఁ గ్రమమున శాంతి

గైకొనినకైవడి॥ భా॥ అట్టులే పాపములు భగవదనుగ్రహముచే నశింపవలయును గాని కేవల మచేతనకర్మములగు కృచ్ఛ్రచాంద్రాయణాదులచే నశింపవు. అక్షయం బులు = ఇంద్రలోక బ్రహ్మలోకాదిసౌఖ్యములు, నశ్వరములు = శాశ్వతంబులుగావు, 'ఆబ్రహ్మభవనాల్లోకాః పునరావర్తినోఽర్జున' అన్నట్లు కావున పునరావర్తిలేని లోక ములను - ముక్తిని, అఘలతాలవిత్ర = పాపమనుతీఁగలకు కొడవలియైనవాఁడా, అసిత = నల్లని, గాత్ర = దేహముగలవాఁడా: నీదయార్ద్రదృష్టి నిహతపాతకనైతి. నీదయార్ద్రదృష్టి యరిషడ్వర్గము జయించితిని. నీదయార్ద్రదృష్టి యక్షయపుణ్యాలోక ములను గందు నని యన్వయము.

ఐహికసుఖములైనను ఆముష్మికసుఖములైనను మోక్షమైనను భగవ దనుగ్రహముచే లభించునుగాని మనము చేయుకర్మజ్ఞానయోగములచేఁ గాదు. ఇవి వ్యవధానకారణములు. అవ్యవధానకారణము భగవత్సంకల్పమే. అది వచ్చు నట్లు చేయునది భక్తియే. దానికి కర్మజ్ఞానయోగములు సాధనములు. భక్తితోఁ గూడిననే ఫలవంతములు, లేకున్న వ్యర్థములు.

మనస్సు వాక్కు కాయము శుద్ధములుగా నుంచుకొని గురుభక్తి దైవభక్తి గలవారమైతిమేని భగవంతుఁడు మనల వెదకికొనుచుఁ దానే వచ్చు నని యీశబరీ రామచరిత్రమువలన నేర్పడుచున్నది. భగవద్దర్శనాపేక్షయుండినఁ జాలును. రామచంద్రమూర్తిని వెదకుచుఁ బోయి దర్శింప శబరికి సాధ్యమా?

తా. అపహతపాపా! నాగురుశుశ్రూషకు ఫలము నిన్నుఁ జూచుటచే నిప్పుడే కదా ఫలించెను. గురుశుశ్రూషకు ఫలము భగవత్సాక్షాత్కారము. అది నా కిప్పుడే కలుగుటచే గురుశుశ్రూష యిప్పుడే ఫలించెను. అట్టులే నాతపములకు వ్రతములకు ఫలమేమి? భగవత్సాక్షాత్కారమే. అదియు నీదర్శనంబునఁ బుండరీ కాక్షా! ఇపుడే ఫలించెను. భూమి జన్మించినవారిలో సార్థకజన్ముఁ డెవఁడు? భగవం తుని సాక్షాత్కరింపఁజేసికొనినవాఁడే. ఇప్పుడు నేను నిన్నుఁ గన్నులారఁ బ్రాకృత చక్షువులచేఁ జూడఁగలుగుట నాజన్మము సార్థకము. దేవతాశ్రేష్ఠుఁడా! నిన్నుఁ జేతు లారఁ బూజించుటచే నికఁగదా మోక్షము పొందఁగలను. నీదయార్ద్రదృష్టి పాప ములు నశించెను. అరిషడ్వర్గము హతమయ్యెను. మోక్షము లభించెను.

ఉ. శ్రీరఘురామ! నేఁ బరిచరించుచు నుండినమద్గురూత్తముల్
సారతపోధనుల్ చనుచు స్వర్గముఁ జేరఁగ మీరు చిత్రకూ
టోరుధరంబునం దునికియుం బినతమ్ముఁడు నీవు నీమెడల్
జేరఁగ వత్తు రంచును విశిష్టగతిఁ మిముఁ జూచినంతటన్. ౧౫౭

పరిచరించుచుఁ = సేవసేయుచు, చిత్రకూటోరుధరంబునఁ = చిత్రకూట పర్వతంబున, విశిష్టగతిఁ = మిగుల శ్రేష్ఠమైనవిధముగ.

తా. శ్రీరఘురామచంద్రా! నేను శుశ్రూషచేయుచుండిన నాగురువులు

మీరు చిత్రకూటమునకు వచ్చినారనియు నిందు వచ్చెదరనియు మీదర్శనము చేసి కొంటినేని.

చ. ఒదవెడు నవ్యయం బగున♦నుత్తమలోకము లంచుఁ జెప్ప స
　మ్మదమెదఁ గ్రమ్మ నీకొఱకు ♦ మంచివి మంచివి యేఱి కోరి పె
　క్కడెగల వన్యసంతతులఁ ♦ గూరిచి యుంచినదాన; నన్ను ని
　ర్విదళితవైరి జ్ఞానపద♦వీపరిణద్ధ దృఢాత్మమానసన్.　　౧౨౬౮

తా. మరలజన్మమునకు రానిలోకము లభించు ననిచెప్పిన కారణమున సంతోషముతో మీకయి మంచివి కోరి యేఱి నానావిధములయిన కందమూలఫలాదులు సంపాదించియుంచితిని. అని చెప్పఁగా శత్రుసంహారకుఁడగు రామచంద్రమూర్తి జ్ఞానపదమునఁ జక్కఁగాఁ గట్టఁబడినదానిని, దృఢాత్మమానసన్=దృఢమైన పరమాత్మవిషయమైన మనస్సుగలదానిని.

ఉత్తమలోకము ఆత్మావలోకనపరులకు లభించు కైవల్యమనియు, అనుత్తమలోకము భగవదవలోకనపరులకు లభించుముక్తియనియు గోవిందరాజీయము. జ్ఞానపదవీపరిణద్ధ-దృఢాత్మమానస ననుటచే, జీవాత్మపరమాత్మసంబంధజ్ఞానము దృఢముగఁ గలదని యేర్పడుచున్నది. దీనిచే నీమెకు యోగమందే కాక జ్ఞానమందును భక్తియందును పారముముట్టినట్టు గ్రహింపనగు.

ఇచట శబరియందు సహజస్త్రీత్వము వ్యక్తము. శరభంగాది పురుషఋషులు రామునిరాక ముందుగ నెఱిఁగినవారే. ఆవేళకు నాశ్రమమున నున్న పండో కాయో సమర్పించినవారే. శబరియో ముందుగానే యేర్పఱిచి తెచ్చియుంచినది. 'మాతాసమోనాస్తి శరీరపోషణే' యన్నట్లు దేహపోషణ ముత్తమస్త్రీల లక్షణము. అది వారికి సహజగుణము. అతిథి వచ్చిన నాఁకలిదప్పులు విచారించువారు వారేకదా.

చ. శ్రమణిని గాంచి యిట్లనియె ♦ రాముఁడు త్వద్గురుసత్ప్రభావముల్
　శ్రమణిరో యాదనుప్రభవు♦సన్నిధి వింటిని, గన్నులార నా
　శ్రమమువిచిత్రముల్ గనఁగఁ ♦ జాలఁ గుతూహల మయ్యె వానిని
　గ్రమముగ గానిపింపుమది ♦ గల్గినయేని య టన్న నామెయున్.　　౧౨౬౯

తా. శబరిని జూచి రామచంద్రమూర్తి యిట్లనియె. 'అమ్మా! నీ గురువుల ప్రభావము దనుపుత్త్రుఁడు చెప్పఁగా వింటిని. అది ప్రత్యక్షముగాఁ జూడఁగోరెదను. కావున నీకు నిష్టమున్న యెడల నాచిత్రములను గనఁబఱుపుము.'

శబరి రామలక్ష్మణులకు మతంగాశ్రమమునందలి వింతలు చూపుట.

సీ. ఇదె ఘనాఘనతుల్య♦మృగపక్షిసంకీర్ణ, మైనమతంగవ♦నాంతరంబు
　ఇచ్చోటఁ దమమంత్ర♦భృశశక్తిఁ దీర్థముల్, కల్పించి మాగురుల్ ♦ గ్రాలినారు
　పడమటివేది మ♦త్స్వాములు వణఁకుచే,తులఁ బూలఁ బూజలు ♦ సలిపినారు

వారితపః ప్రభా♦వంబున వేదులు, నేఁడును వెలిఁగించె ♦ నిఖిలదిశల
ఆ. నిట్రుపాసములను ♦ నిర్గతసత్త్వులై, నడువలేమిఁ జింత♦నంబు సేయ
సప్తసాగరములు ♦ చనుదెంచె నిచటికిఁ, జూడవయ్య రామ ♦ సుగుణధామ.

ఘనాఘనతుల్య=వర్షించుమేఘముతో సమానమైన, "ఘనాఘనస్త్వింద్రే వర్షుకమేఘే, ఘాతుకమత్తేభే, త్రిషుత్వయం సాంద్రే॥ నా నా॥ ర॥ మృగపక్షిసంకీర్ణము=మృగములచేతను పక్షులచేతను నిండినది. ఇది విశేషణోభయపదకర్మధారయము. భృశ = అధికమైన, నిట్రుపాసములను = శుష్కోపవాసములచే, నిర్గతసత్త్వులై = సత్త్వములేనివారై.

తా. అనియడుగఁగా శబరి యిట్లనియె. రామచంద్రా! వర్షించుమేఘమువలె నల్లనై వ్యాపించి మృగములచేతను పక్షులచేతను నిండియుండు నిదియే మతంగవనము. ఈస్థలమునందుఁ దమమంత్రముల యధికశక్తిచే మాగురువులు తీర్థములను గల్పించినారు. పడమటివేదిమీఁద మాస్వాములు (శిష్యులు గురువు సొమ్ము కావున స్వామియని ప్రయోగము.) ముసలితనముచే వణఁకుచున్నను భగవదారాధనము మానక పూలచేఁ బూజించినారు. వారితపోమహిమచే వేదులు వారులేకున్నను దిక్కులనన్నిటిని ప్రకాశింపఁజేయుచున్నవి. దీనివలన నాచార్యులు లేకున్నను వారి కభిమతమైన ప్రదేశములు పదార్థములు శిష్యులకు నత్యంతోద్దేశ్యము లనిసూచితము. శుష్కోపవాసములుచేసి బలహీనులయి నడువలేని కారణమున సముద్రములకుఁ బోఁజాలక పిలువఁగా నేఁడు సముద్రము లిచ్చటికేవచ్చెను. రామచంద్రా! చూడుము.

ఉ. తానము లాడి వల్కపరి♦ధానము లీద్రుమశాఖలం దిడన్
మానవనాథ! యాఱవవి ♦ నాగురువర్యతపంబు పెంపునన్
మ్లానత నొంద కున్నవి సు♦మంబులు చూడుము దేవపూజయం
దానియమాఢ్యు లుంచినవి ♦ యాదర మార సుశీలతానిధీ. ౧౨౭౧

తానములు=స్నానములు, వల్కపరిధానము=నారలచేనైన కట్టువస్త్రము, ద్రుమశాఖలన్ = చెట్లకొమ్మలందు, ఇడన్ = ఉంచఁగా, మ్లానత = వాడకుండుట, సుశీలతానిధీ = సద్వర్తనమునకు స్థానమైనవాఁడా. ఈపద్యమువలన శిష్యుఁడు గురువుమహిమ ప్రకటింపవలయు నని సూచితము. 'గురుం ప్రకాశయే ద్ధీమాన్' అని శాస్త్రము.

తా. మాగురువులు స్నానముచేసి తడిసిననారవస్త్రములను నీ చెట్లకొమ్మలందుంచి పోయిరి. వారితపఃప్రభావముచే నేఁటికి నవియాఱకున్నవి. వారు దేవతారాధనమందుఁ బూజించిన పూలు నేఁటికిని వాడకున్నవి.

క. వింటివి వినఁదగుదానిని, గంటివి వన మెల్ల నింకఁ ♦ గాయము విడి నే
డంట లగునాదుగురువులఁ, గంటకుఁ జన నాన తిమ్ము ♦ కాకుత్స్థ యనన్.

కాయము = దేహము, విడి = వదలి, దంటలు = సమర్థులు, కంటకున్ = చూచుటకు, ఆనతి = ఆజ్ఞ.

తా. వినఁదగువాని నెల్ల వింటివి. చూడఁదగినవానిని జూచితివి. ఇఁక నేను నాగురువులున్నచోటికిఁ బోయి వారల దర్శింపవలెను. రామచంద్రా! ఆజ్ఞనిమ్ము.

ఇది యాచార్యాభిమానముచేఁ గలుగుఫలము. ఆచార్యు లేలోకమునకుఁ బోదురో వారిశిష్యు లాచార్యునందభిమానముగలిగి వారిప్రీతికిఁ బాత్రులయిన వారును ఆలోకమునకే పోదురు. ఇది నిర్వంచనశుశ్రూషాఫలము.

క. అచ్చెలువపలుకులను విని, మెచ్చుచు శ్రీరామవిభుఁడు ♦ మెలఁతకు ననియెన్
వచ్చెను నీదుసపర్యలు, సచ్చరిత! యథాసుఖంబు ♦ చను కోర్కి మెయిన్.

తా. ఆపుణ్యాత్మురాలు చెప్పినపలుకులు విని యామెగురుభక్తికి దైవభక్తికి మెచ్చుకొని రామచంద్రమూర్తి యామె కిట్లనియెను. సాధుచరిత్రా! నీవు చేయ నుద్దేశించినసత్కారములన్నియు గ్రహించినట్లే యెంచుము. నీకోరికప్రకారము పొమ్ము.

ఉ. ఆజనకాత్మజేశుఁ డిటు ♦ లాజ్ఞ యిడన్ ముదిబోయచేడె కృ
ష్ణాజినచేల నాయతజ♦టాన్విత యాత్మసమాధి వహ్నులం
దోజమెయిం గళేబరము ♦ నొప్పుగ వీడి లసత్పరిష్క్రియా
రాజితదివ్యదేహ యయి ♦ క్రచ్చఱఁ జేరె మునీంద్రసన్నిధిన్.  ౧౭౭౪

కృష్ణాజినచేల = కృష్ణాజినము వస్త్రముగాఁ గట్టుకొన్నది, ఆయతజటాన్విత = దీర్ఘములయినజడలుగలది, ఆత్మసమాధి = ఆత్మవిషయయోగబలముచే, వహ్నులన్ = యోగబలముచేఁ గల్పించినయగ్నులందు, ఓజమెయిన్ = ఉత్సాహముతో, కళేబరము = దేహము, కళే + అవరము = కళేబరము. వబలకభేదము. లసత్ = ప్రకాశించుచున్న, పరిష్క్రియా = అలంకారములచే, రాజిత = ప్రకాశించు, దివ్య = దేవతాసంబంధమైన, దేహయయి = శరీరముగలదై, క్రచ్చఱన్ = శీఘ్రముగా, మునీంద్రసన్నిధిన్ = గురువులగు ఋషుల సమీపప్రదేశమును.

దీనివలన నాచార్యశుశ్రూష భగవదనుగ్రహమును సంపాదించి మోక్షమునకుఁ గారణమగు ననియేర్పడుచున్నది.—గోవిందరాజీయము.

ఈశబరిచరిత్రవలన విదురాదిశూద్రవిశేషులకుఁబోలె స్త్రీలకు జ్ఞానమందు యోగమందు దేవపూజాదులందు నధికారముగలదు. యజ్ఞాదులగు వైదికకర్మములందు నధికారములేదు. వానిస్థానమున గురుశుశ్రూష నియమితము. దీనివలనిఫలము స్వర్గము, అవ్యయలోకము చెప్పఁబడెను. దేవతలుండు స్వర్గము అవ్యయముగాదు. 'ఏవమేవాముత్ర పుణ్యచితోలోకఃక్షీయతే' యన్నట్లు స్వర్గాదులు నశ్వరములుకాఁబట్టి పునరావృత్తిలేని వైకుంఠము చేరినదని యెఱుంగునది. —గోవిందరాజీయము. స్వర్గశబ్దము మోక్షస్థానపర్యాయముగఁ బ్రయోగములు

గలవు. 'విద్వేషా దపిగోవిందం దమఘోషాత్మజః స్మరన్। శిశుపాలో గత స్స్వర్గం కింపున స్తత్పరాయణః' అత్రిస్మృతి.

భక్తిసంజీవని యందలి శబరివిషయమైన వ్యాసమిందుఁ బ్రకటింపఁబడెను.

శబరి

శబరియనఁగా శబరజాతిస్త్రీ. శబరులు బోయలు. శబరి బోయస్త్రీ. ఈమె విషయము శ్రీమద్రామాయణమున నరణ్యకాండమునఁ గలదు. ఈమె శ్రమణి యని చెప్పఁబడెను. శ్రమణియనఁగా సంసారసంగములేక నియతవ్రతమూని బ్రహ్మచర్య మవలంబించి విరక్తురాలై తపస్సుచేయుచుండుస్త్రీ. శ్రీరామలక్ష్మణులు సీతను వెదకుచు నరణ్యసంచారము చేయునపుడు మార్గమధ్యమునఁ గబంధుని వధించిరి. ఆయన దివ్యరూపము ధరించి శ్రీరామున కిట్లు చెప్పెను.

సీ. ...అచట మతంగసం ♦ యమివరుండు, తప, మొనరింప నా♦తనిశిష్యగణములు
వన్యముల్ దేరంగ ♦ వనిని దిరుగ.

తే. నమ్మహాత్ముల చెమ్మట ♦ లవనిప్రాల, వానజనియించె నవిగాన ♦ వసుమతీశ
యట్టిమహిమంబుఁ గాంచెన♦య్యనఘు లచటు, విడిచన వారివరవుడు♦వీడ దధిప.

క. చిరజీవిని శ్రమణీమణి, వరధర్మచరిత్ర శబరి ♦ స్వర్గముఁ జేరున్
దరిసించి దేవసము నన, వరతంబు సమస్తభూత ♦ వందితు నిన్నున్.

ఆమెను గనుఁగొని యరుగు మావల నని కబంధుఁడు బోధింప శ్రీరాములట్టులే యామెయొద్దకుఁ బోయి యామెను దర్శింప నామెయు లేచి మ్రొక్కులిడియెను. అంత శ్రీరాముఁ డిట్టు లామెను బ్రశ్నించెను.

సీ. నీతపోవ్రతములు ♦ నిర్విఘ్నితంబులై, సాగుచున్నవిగదా♦సాధుశీల!
యాగ్రహమునయందు♦నాహారమునయందు, నియమంబుగలదుగా♦నిర్మలాత్మ!
నీనియమంబులు ♦ నెఱవేఱుచున్నవే, మనసునిమ్మళమయి ♦ యొనరునమ్మ!
గురుపరిచర్యలు కొన♦సాగుచున్నవే, సఫలంబులా యవి ♦ చారుచరిత!

ఆ. యనుచు రాముఁ డడుగ ♦ నత్తపోధనురాలుఁ, సిద్ధసమ్మతయగు ♦ సిద్ధురాలు
కౌసలేయుఁ జూచి ♦ ఘనభక్తియుక్తి ని,ట్లనియెఁ దన తెలంగు ♦ వినయమునను.

సీ. ఇపుడెకా ఫలియించె ♦ హితగురుశుశ్రూష, నిన్నుఁ జూచుటఁ జేసి ♦ నిర్మలాత్మ!
యిపుడెకా సిద్ధించెఁ ♦ దపములువ్రతములు, నీదర్శనంబున ♦ నీరజాక్ష
యిపుడెకా నాజన్మ♦మెల్ల సార్థకమయ్యెఁ, గనులార నినుఁ జూడఁ ♦ గౌసలేయ
యింక నెకా స్వర్గంబు ♦ నే నేగఁగందును, దివుట నిన్ బూజింప ♦ దేవవర్య

ఆ. నీదయార్ద్రదృష్టి ♦ నిహతపాతక నైతి, నరివిదారి యక్షయంబులైన
పదములందుదాన ♦ పరమభవ్యచరిత్ర, యఘులతాలవిత్ర ♦ యసితగాత్ర.

ఉ. శ్రీరఘురామ! నేఁబరిచ♦రించుచునుండిన మద్గురూత్తముల్
సారతపోధనుల్ చనుచు ♦ స్వర్గముఁజేరఁగ మీరు చిత్రకూ

టోరుధరంబునం దునికి♦యుం బినతమ్ముఁడు నీవు నీయెడన్
జేరఁగవత్తు రంచును వి♦శిష్టగతిన్ మిముఁ జూచినంతటన్.

చ. ఒదవెడునవ్యయంబగు న♦నుత్తమలోకములంచుఁ జెప్ప స
మ్మదమెదఁ గ్రమ్మ నీకొఱకు ♦ మంచివి మంచివి యేఱి కోరి పె
క్కుదెగల వన్యసంతతులఁ ♦ గూరిచియుంచినదాన నన్న ని
ర్వ్యదళితవైరి జ్ఞానపద♦వీపరిణద్ధ దృఢాత్మమానసన్.

చ. శ్రమణిని గాంచి యిట్లనియె ♦ రాముఁడు త్వద్గురుసత్ప్రభావమున్
శ్రమణిరో యాదనుప్రభవు♦సన్నిధి వింటిని గన్నులార నా
శ్రమము విచిత్రముల్ గనఁగఁ ♦ జాలఁగుతూహలమయ్యె వా
నినిన్ గ్రమముగఁ గానిపింపు మది♦గల్గినయేని యటన్న నామెయున్.

—శబరి రామలక్ష్మణులకు మతంగాశ్రమమునందలి వింతలు చూపుట.—

సీ. ఇదె ఘనాఘనతుల్య♦మృగపక్షిసంకీర్ణ, మైన మతంగ♦వనాంతరంబు
ఇచ్చోటఁ దమమంత్రభృశ♦శక్తిఁ దీర్థముల్, కల్పించి మాగురుల్ ♦గ్రాలినారు
పడమటివేది మ♦త్స్వాములు వణఁకుచే, తులఁ బూలఁ బూజలు ♦ సలిపినారు
వారితపఃప్రభా ♦ వంబునవేదులు, నేఁడును వెలిఁగించె ♦ నిఖిలదిశల

ఆ. నిట్రుపాసములను ♦ నిర్గతసత్త్వులై, నడువలేమిఁ జింత♦నంబుసేయ
సప్తసాగరములు ♦ చనుదెంచె నిచటికిఁ, జూడవయ్య రామ ♦ సుగుణధామ.

ఉ. తానములాడి వల్కపరిధానము ♦ లీద్రుమశాఖలం దిడన్
మానవనాథ యాఱ వవి ♦ నాగురువర్యతపంబు పెంపునన్
మ్లానత నొందకున్నవి సుమంబులు ♦ చూడుము దేవపూజయం
దానియమాఢ్యు లుంచినవి ♦ యాదరమార సుశీలతానిధీ.

క. వింటివి వినఁదగుదానిని, గంటివి వనమెల్ల నింకఁ ♦ గాయము విడి నే
దంటలగు నాదుగురువులఁ, గంటకుఁ జననానతిమ్ము ♦ కాకుత్థ్స యనన్.

క. అచ్చెలువపలుకులను విని, మెచ్చుచు శ్రీరామవిభుఁడు ♦ మెలఁతకు ననియెన్
వచ్చెను నీదుసపర్యలు, సచ్చరిత! యథాసుఖంబు ♦ చను కోర్కిమెయిన్.

ఉ. ఆజనకాత్మజేశుఁ డిటు♦లాజ్ఞ యిడన్ ముదిబోయచేడె కృ
ష్ణాజినచేల యాయతజ♦టాన్విత యాత్మసమాధి వహ్నిలం
దోజమెయిం గళేబరము♦నొప్పఁగ వీడి లసత్పరిస్ఫుర
ద్రాజితదివ్యదేహయయి ♦ క్రచ్చఱఁ జేరె మునీంద్రసన్నిధిన్.

ఇప్పుడు మన మాలోచింపవలసిన విషయములు:—

౧. శబరి బోయెతగదా యామెకు బ్రహ్మజ్ఞానమం దధికారము గలదా?

౨. శూద్రుఁడైన శంబుకుఁడు తపస్సుచేసె నని యతనివధించిన రాముఁడు శబరి నెట్లు గౌరవించి కృతార్థురాలను జేసెను?

౩. శబరి రామునకుఁ బెట్టినవి యెంగిలిపండులా?

-శూద్రులకు బ్రహ్మజ్ఞానమం దధికారము గలదా?-

ఇది మొదటఁ జర్చింపవలసినవిషయము:—

'రాఘవః ప్రాహ విజ్ఞానే తాం నిత్య మబహిష్కృతామ్,' అని మూలమందుఁ గలదు. అనఁగా విజ్ఞానమునందు నిత్యముగ బహిష్కరింపఁబడనిది యని యర్థము. ఇచట విజ్ఞానమనఁగా, విశేషజ్ఞానము బ్రహ్మజ్ఞాన మనియర్థమే కాని యమరుఁడు చెప్పిన శిల్పజ్ఞానముగాదు. శబరికి లభించిన బ్రహ్మలోకము శిల్పజ్ఞానముచే రాదు. అదిగాక యోగసమాధిచే దేహము విడిచె నని చెప్పుటచే నామె మహాయోగిని యని స్పష్టపడుచున్నది. కావున శబరికి బ్రహ్మజ్ఞానము లేదనుట సరిగాదు. అట్లైనచో బ్రహ్మసూత్రములందు నపశూద్రాధికరణంబున 'సూ॥ శుగస్యతదనాదర శ్రవణా త్తదాద్రవణాత్సూచ్యతేహి॥'

౩౫ క్షత్రియత్వా గతేశ్చోత్తరత్ర చైత్రరథేన లింగాత్

౩౬ సంస్కార పరామర్శాత్ తదభావాభిలాపాచ్చ

౩౭ తదభావనిర్ధారణేచ ప్రవృత్తేః

౩౮ శ్రవణాధ్యయనార్థప్రతిషేధా త్స్మృతేశ్చ.

ఈసూత్రములు శూద్రుఁడు బ్రహ్మజ్ఞానమున కధికారి కాఁడని స్పష్టముగ నిషేధించుచున్నవి. ఈసూత్రములకు వ్యాఖ్యానము వ్రాసిన శ్రీశంకర రామానుజ మధ్వశుకబలదేవనింబార్కాచార్యులందఱు శూద్రుల కధికారము లేదని వ్యాఖ్యానము వ్రాసియున్నారు.

నారదచరిత్రమునందు నారదుఁడు పూర్వజన్మంబున దాసికిఁబుత్త్రుఁడై యుండినపుడు ఋషులచే జ్ఞానోపదేశము పొందినట్లు భాగవతమునఁ గలదు. విదురుఁడు బ్రహ్మజ్ఞానియగుట స్పష్టము. ఇట్టివారు మఱికొందఱు గలరు.

ఈపరస్పరవిరుద్ధవిషయములకు సమన్వయ మెట్లు? గతసంచికయందు శూద్రులకు బ్రహ్మజ్ఞానమం దధికారము లేదని శారీరకమీమాంసాసూత్రము లనువదింపఁబడెను. ఆసంచికయందే నారదుఁడు తనపూర్వజన్మమునఁ బరిచారికాపుత్త్రుఁడుగా నున్నప్పుడు కొందఱుఋషులును, శబరికి మతంగమహామునిశిష్యులును బ్రహ్మజ్ఞాన ముపదేశించినట్లు వ్రాయఁబడెను. ఋషీశ్వరచర్య శాస్త్రవిరుద్ధమా యని యాలోచింపవలసియున్నది. సామాన్యవిధి యని విశేషవిధియని విధులు రెండువిధములు. "సత్యంవద" సత్యమునుజెప్పుము. అని శ్రుతిసామాన్యధర్మము విధించుచున్నది. అట్లుండియు నిష్కారణముగ నిరపరాధులకుఁ గీడుగలుగునట్లు చెప్పెడుసత్యమువలనఁ బాపము సంభవించుననియు నట్టి సందర్భముల సత్యముఁ జెప్పరాదనియు శాస్త్రములు చెప్పుచున్నవి. మొదటిది సామాన్యవిధి. రెండవది విశేషవిధి. 'అహింసా పరమో ధర్మః॥' అహింసయే యుత్తమధర్మ

మనునది సామాన్యవిధి. యజ్ఞములందుఁ బశుహింసచేయవచ్చు ననుట విశేష విధి. సామాన్యవిధికంటె విశేషవిధి బలీయము. సామాన్యవిధిననుసరించి దశరథుఁడు భగవంతుఁడైన శ్రీరాముని విడనాడి స్వర్గలోకగతుఁడయ్యెను. విశేష విధి ననుసరించి యసత్యమాడి వసుదేవుఁడు కృష్ణుని దక్కించుకొని ముక్తుఁడయ్యెను. అన్నిసామాన్యవిధులకు ఫలము సోపానమార్గమున భగవత్ప్రాప్తియే. భగవద్ధర్మమునకు ఫలము సద్యోముక్తియే. కావున సామాన్యవైదికధర్మమునకంటె భగవద్ధర్మము బలీయము. అనఁగా నట్టిదావశ్యకమైనపుడు వైదికధర్మము వదలియైనఁ దనకులధర్మమువిడిచియైన భగవద్ధర్మము ననుష్ఠించుట శ్రేయస్కరము. భక్తిసంజీవని బోధించునది భగవద్ధర్మమే. భక్తిప్రపత్తు లనుష్ఠానమార్గములు. కర్మము ప్రధానముగానెంచి తరించుటకు దానిపై నాధారపడక భగవంతునే యాధారముగాఁ గొని కర్మము గౌణముగానెంచువారు భగవద్ధర్మనిష్ఠులు. వీరి మతము ననుసరించి శబరికి బ్రహ్మజ్ఞానమం దధికారముకలదు. వైదికధర్మము ప్రకారము సంస్కారార్హులై వైదికకర్మయోగ్యులైన బ్రాహ్మణాదులుమాత్రమే ముక్తి కర్హులు. స్త్రీశూద్రాదులుకారు. భగవద్ధర్మముప్రకారము భగవంతుఁడు సర్వసముఁడు, భక్తప్రియుఁడు, దీనజనపక్షపాతి, లోకజనకుఁడు. కావున నాధర్మమునందుండువా రందఱు జాతివివక్షలేక వీరువారనక, పుణ్యులు, పాపులు, బాలురు, వృద్ధులు, స్త్రీలు, పురుషు లనుభేదములేక భగవంతు నాశ్రయించినవారందఱు భగవత్కటాక్షమునకుఁ బాత్రులే. ఎట్లన:-భక్తులు ప్రపన్నులు, శూద్రులైనను బోయలయినను జండాలురైనను భగవద్ధర్మనిష్ఠులైరేని వారిని జాతిసామాన్యదృష్టి ననఁగా వారిని దక్కిన శూద్రులను బోయలను జండాలురను జూచునట్లుచూచువారు నరకమునకుఁ బోదురని భగవద్ధర్మశాస్త్రము చెప్పుచున్నది.

శ్లో॥ య శ్శూద్రం భగవద్భక్తం, నిషాదం శ్వపచం తథా।
　వీక్షతే జాతిసామాన్యా, త్స యాతి నరకం నరః॥

అనిప్రమాణము. అట్లైన వారిని నేదృష్టితోఁ జూడవలయు ననిన

శ్లో॥ నశూద్రా విష్ణుభక్తాశ్చ, విప్రా భాగవతాస్స్మృతాః।
　విష్ణుభక్తులు శూద్రులుగారు. విప్రులు, భాగవతులు.

అని చెప్పుటచే నట్టిభక్తులను బ్రాహ్మణులను నందు భాగవతులను జూచు దృష్టిచేఁ జూడవలయునని యర్థము. ఇట్టి విష్ణుభక్తులలక్షణ మెట్టిదై యుండవలయు ననిన:—

శ్లో॥ మద్భక్తజనవాత్సల్యం, పూజాయాం చానుమోదనమ్
　తత్కథాశ్రవణేభక్తిః, స్వరనేత్రాంగవిక్రియా।
　స్వయమారాధనే యత్నో, మదర్థే దంభవర్జనమ్।
　మమానుస్మరణం నిత్యం, యచ్చ మాం నోపజీవతి॥

భక్తిరష్టవిధా హ్యేషా, యస్మిన్ మ్లేచ్ఛేపి వర్తతే।
స విప్రేంద్రో, ముని, శ్శ్రీమాన్, స యతి స్సచ పండితః।
తస్మై దేయం తతో గ్రాహ్యం, సచ పూజ్యో యథాహ్యహమ్।

అర్థము: నాభక్తజనులయందుఁ బ్రేమ, పూజచేయుటయందు సంతోషము, నాకథలు వినుటయం దత్యంతానురాగము, నాకీర్తనలు పాడుటయందు నన్ను గుఱించిచెప్పుటయందు డగ్గుత్తిక, దేహమునందు గగ్గురుపాటు, కన్నులయందు నీరు, తానై నన్నారాధించుటయందుఁ బ్రయత్నము (పూజాద్రవ్యములు స్వయంకృషిచే సంపాదించి స్వహస్తములఁ బూజించుట), నానిమిత్తముగ దంభములేక (మెఱ మెచ్చులకుఁగాదు) కార్యములుచేయుట, ఎల్లప్పుడు నన్నే స్మరించుచుండుట, నన్ను విడిచి జీవింపలేకయుండుట యను నీయెనిమిదివిధములభక్తి మ్లేచ్ఛునియందుండినను వాఁడే విప్రశ్రేష్ఠుఁడు, వాఁడే ముని, వాఁడే శ్రీమంతుఁడు, వాఁడే యతి, వాఁడే జ్ఞాని. వానినిమిత్తమై దానమీయవచ్చును. వానిచే గ్రహింపవచ్చును. నావలె వాఁడును బూజ్యుఁడు, అని భగవద్వాక్యము.

ఇట్టిభక్తిఁగలవాఁడు వర్ణహీనుఁ డని నీచపుదృష్టిఁ జూడరాదు. పూజ్యుఁ డనియే గౌరవింపవలయును. ఏలన, అతనియందు మ్లేచ్ఛ, నిషాద, శ్వపచాది శబ్దములు సార్థకములుగావు. ఏల? ఆశబ్దార్థముల కతఁడు విషయభూతుఁడుకాఁడు కావున:—

ఈయెనిమిదింటియందు ముఖ్యముగఁ గడపటిదానిగుఱించి కొంచెము చెప్ప వలసియున్నది. అది భక్తికిఁ బరాకాష్ఠ కావునఁ గడపటఁ జెప్పఁబడినది.

"నన్ను విడిచి జీవింపలేకయుండుట" యన నేమి? ఈగుణము పరమభక్తిని దెలుపుచున్నది.

శ్లో॥ "మయ్యేవ మనఆధత్స్వ, మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ, అత ఊర్ధ్వం నసంశయః॥ భగ. ౧౨వ అధ్యా.

నాయందే మనస్సుంచుము. బుద్ధి నాయందే నిలుపుము. ఇటు చేసినయెడల నిటుపిమ్మట నీవు నాయందే వసింతువు. సందేహములేదు, అనియర్థము.

ఏవకారార్థము (అందే) ప్రాకృతపదార్థములందు విషయములందు నేమాత్ర మైన మనస్సును బోనీయరాదని నిషేధించుచున్నది. అనఁగా నేయుపాయముచే నైన సర్వకాల సర్వావస్థలయందు నేయవయవముతో నేకార్యమును చేయు చున్నను మనస్సు బుద్ధి భగవంతునియందే యుంచవలయును.

అనఁగా ననన్యుఁడై యనన్యశరణ్యుఁడై యనన్యోపాయుఁడై యనన్య ప్రయోజనుఁడై సర్వదా యుండవలయును. అనన్యుఁడు=సూర్యునకు నెండ, చంద్రు నకు వెన్నెల, సముద్రమునకు నల, అగ్నిహోత్రమునకు మిణుఁగురునెట్లో యట్లే

తాను భగవంతునంశమై విశేషణమై ధారణపోషణములకు భగవంతునందే యాధారపడి తాను భగవంతువాఁడేగాని వేఱుగా దనునభిప్రాయముగలవాఁడు.

అనన్యశరణ్యుఁడు = భగవంతునికంటెఁ దన్ను రక్షింపఁగలవాఁడు, తన్ను రక్షింపుమనికోరఁదగినయోగ్యుఁడు వేఱొకఁడు లేఁడని తలఁచువాఁడు.

అనన్యోపాయుఁడు = తరించుటకు భగవంతుని కృపదప్ప వేఱుపాయము లేదనుకొనువాఁడు.

అనన్యప్రయోజనుఁడు = భగవత్ప్రాప్తిదప్ప వేఱుఫలము కోరనివాఁడు. ఇట్టివాఁడు భక్తుఁడు. ఇట్టివానిభక్తి యనన్యభక్తి.

భగవదనుగ్రహముఁ దప్ప వేఱేదియు భక్తుఁడు కోరఁడు. కావున నది యెంతశీఘ్రముగా లభించునా యని తహతహపడుచుండును. వీనితహతహపా టెట్టిదై యుండునసిన రామకృష్ణపరమహంస లిట్లు తమశిష్యున కొకనికిఁ దెలిపిరి.

రామకృష్ణపరమహంసలశిష్యులలోనొకఁడు భగవద్విషయమై భక్తునిమన స్సెట్టిదై యుండు నని ప్రశ్నించెను. ఆశిష్యుని గంగకు స్నానార్థమై పిలుచుకొనిపోయి గంగయందు వాఁడు మునిఁగినప్పుడు రామకృష్ణపరమహంసలవారు వాని నీళ్లలో నట్టె యదిమెను. కొంతసేపు వాఁడు నీటిలో గిజగిజతన్నుకొన్నతరువాత చేయి విడిచి వాఁడు లేచినతరువాత నీటిలోమునిఁగినప్పుడు నీమనస్థితి యెట్టిదై యుండె నని యడిగెను. ఎప్పు డీముప్పునుండి తప్పించుకొని బయటఁబడుదునా, యెప్పుడు గాలిపీలుతునా, యని యుండె నని శిష్యుఁడు చెప్పెను. అట్టిపరితాపమే నీకు సంసారవిషయమై యెప్పుడుకలుగునో భగవత్కటాక్షమునకై యెప్పు డేకారుదువో యప్పుడు నీకు భక్తికల దనియనుకొనుము, అని చెప్పెను.

ఇది నిజమైనభక్తిలక్షణము. దీనికే పరమభక్తి యనిపేరు. ఇదియే యార్త ప్రపత్తి. ఇట్టిదశవచ్చువఱకు నెవ్వఁడు భక్తుఁ డనుపేర బిలువఁబడుటకు యోగ్యుఁడు కాఁడు. పూజాదులు గౌణభక్తియే, యోగసమాధియు గౌణభక్తియే. గౌణభక్తి యవ్యవధానమోక్షకారణముగాదు. క్రమముగ నగును. పరమభక్తుఁడే సద్యో ముక్తి కర్హుఁడు (అవ్యవధానము = ఎడములేనిది).

శ్లో॥ నచసీతా త్వయాహీనా, నచాహమపి రాఘవ।
ముహూర్తమపి జీవావో, జలాన్మత్స్యావివోద్ధృతౌ॥

నిన్ను విడిచి సీతగాని నేనుగాని, రామా! నీటినుండి బయట వేసిన చేఁపవలెఁ గొంచెముకాలమైన జీవింపఁజాలము, అని లక్ష్మణుఁడు చెప్పెను. అట్లులే చేసెను. ఇది పరమభక్తి. ఇది పరమప్రేమస్వరూపము.

శ్లో॥ యన్ముహూర్తం క్షణంవాపి, వాసుదేవో నచింతితః।
సాహాని స్తన్మహచ్ఛిద్రం, సాభ్రాంతి స్సాచవిక్రియా।

ఏకస్మిన్నప్యతిక్రాంతే, ముహూర్తే ధ్యానవర్జితే।
దస్యుభిర్ముషితానేవ, యుక్తమాక్రందితుంభృశమ్॥

వాసుదేవునిఁ జింతింపనియొకముహూర్తమైనను క్షణమైనను గలిగెనేని యదియే ప్రాణహాని. అదియే మహాఛిద్రము. అదియే భ్రాంతి. అదియే వికారము. అల్పకాలమైనను భగవద్ధ్యానములేక కాల మతిక్రమించెనేని దొంగలచే సర్వస్వము దోఁపుడుపోయినట్టు వెక్కి వెక్కి యేడువవలయును. ఇది పరమభక్తిలక్షణము. "యచ్చమాం నోపజీవతి" నన్ను విడిచి జీవింపలేక యుండుట యనుట కిది లక్షణ మనియెఱుంగవలయును. ఇదియే భగవద్ధర్మసారతమము. శ్రీకోదండరామసేవక సమాజసభ్యులందఱు నన్నివర్ణములవారు స్త్రీలు పురుషులు నిట్టియుత్తమస్థితి కీ జన్మమందే, దేహము పడిపోవుటకుముందే వచ్చుటకు దృఢప్రయత్నముచేయుదురు గాక యనివాసుదాసుఁడు ప్రణామపూర్వకముగాఁ బ్రార్థించుచున్నాఁడు. ఎట్టి భక్తుఁడైన, మ్లేచ్ఛుఁడైనను, మనీషాపంచకమందు శంకరాచార్యులవారు "చండాలోస్తు సతుద్విజోస్తు" అనిచెప్పిన జ్ఞానియైన చండాలుఁడుగాని తనపూర్వపుణ్యావశమున వాసుదాసుఁడు తనకు లభించునా యని యేకారుచున్నవాఁడు.

బ్రహ్మయు ఘటకారుఁడే, నేను ఘటకారుఁడనే కావున బ్రహ్మవలె నన్ను గౌరవింపుఁ డని కుమ్మరవాఁ డనుటయు, ఖద్యోతశబ్దము సూర్యునందు నాయందు వర్తించునుగనుక నేను సూర్యుఁడు సమానుల మనిమిణుఁగురుపురు గనుటయు, శబరివిదురాదులు శూద్రులుకావున వారికివలె మాకును బ్రహ్మజ్ఞానమం దధికారము గలదని జాతిమాత్రసామాన్యముచే వారిజాతులవా రనుటయు సమానములు. బ్రహ్మజ్ఞానమునకు నధికారమావశ్యకము. బ్రాహ్మణుఁడైనను జాతిమాత్రోపజీవి యగుబ్రహ్మబంధు వగునేని బ్రహ్మజ్ఞానమున కధికారిగాఁడు. బ్రహ్మసూత్రమునం దలి నిషేధసూత్రములు సామాన్యవిధులు. మీఁదననువదించిన భగవద్ధర్మశాస్త్ర వాక్యములు విశేషవిధులు.

మీఁదఁజెప్పిన పరమభక్తి పరజ్ఞానములేక రాదు. పరభక్తిలేక పరజ్ఞానము రాదు, అష్టాంగయోగయుక్తమయిన గౌణభక్తిలేక పరభక్తిలభింపదు.

శ్లో॥ దర్శనం పరభక్తిస్స్యాత్, పరజ్ఞానంతు సంగమమ్।
పునర్విశ్లేషభీరుత్వం, పరమాభక్తిరుచ్యతే॥

అర్థము: దర్శనము (ఆత్మసాక్షాత్కారము) పరభక్తియగును. ఈదశయందు నాత్మను జూచుటమాత్రము కలుగును. దానితోడి కొంచెముకాలముసంగమము పరజ్ఞానము. దానితోడివియోగము కలుగునేమో యనుభీతి పరమభక్తియగును.

"సాక్షాత్కారతుల్యావైశద్యవతీధ్యానశబ్దవాచ్యాపరభక్తిః। తతః సాక్షాత్కారవాణీత్యభినివేశానంతరతత్కాలనియతసాక్షాత్కారః పరజ్ఞానమ్। తతో నిరంతరసాక్షాత్కారాభినివేశహేతుభూతాసాక్షాత్కృతే బ్రహ్మణినిరతిశయవిపుల

సుఖత్వవిషయణీయావిశేషప్రీతిస్సాపరమభక్తిరితి నిష్కర్షః॥" కనులకు నెదురఁ గానవచ్చినవు డెంతవిశదముగా నొకరూపము గానవచ్చునో యంతవిశదముగా ధ్యానవేళ మనస్సున నాత్మగోచరించెనేని యట్టిధ్యానము పరభక్తి యనఁబడును. ఆపిమ్మట భగవంతునిసాక్షాత్కారము చేసికొందు నని పట్టుదల గలుగఁగా నా సమయమందుమాత్రము కించిత్కాలము సాక్షాత్కారము గలుగుట పరజ్ఞానము. ఇది యాసాక్షాత్కార మెడఁదెగక యెల్లప్పు డుండవలయు ననుపట్టుదలకుఁ గారణ మగును. అట్లు సాక్షాత్కరించినబ్రహ్మమునందు నిరతిశయమై విపులమై సుఖకారణ మైన ప్రీతి కలుగును. ఇది విశేషప్రీతికిఁ బరమభక్తి యనిపేరు.

కావునఁ బరభక్తి లభించుటకు నాత్మజ్ఞాన మవశ్యమగుచున్నది. ఈకారణ ముచే సప్తవిధభక్తులు సాధించినయోగసాధకునకు నాత్మజ్ఞాన ముపదేశింపవచ్చును.

శబరి యెంతగొప్పతల్లియో యెంతసాధించినదో తెలుపుటకుఁగాను నింత దూరము వ్రాయవలసివచ్చెను.

మోక్షమున కుపాయములు కర్మజ్ఞానభక్తిప్రపత్తులేగాక యాచార్యాభి మాన మను నైదవయుపాయము పేరుకొనఁబడినది. ఇందు శిష్యునకుఁ బరమార్థము పరమోపాయము సర్వస్వము గురువే.

శ్లో॥ యస్యదేవే పరాభక్తి ర్యథా దేవే తథాగురౌ।

అని శ్వేతాశ్వతరోపనిషత్తు చెప్పినట్లు దేవునియం దెట్టి విశేషభక్తియో యట్టియుత్తమభక్తి గురువులయందుఁ గలిగి శిష్యుఁడు శబరివలె యావజ్జీ వమో నారదునకుఁ బూర్వజన్మమందువలె గురువు లనుజ్ఞయిచ్చువఱకో యంతేవాసియై యుండి వారలకు సేవలుచేయుచు వారుచెప్పినది విని యాప్రకా రము నడచుకొనుచు వా రనుగ్రహించినది సాధింపవలయును. ఒకఁడు దీపము చేతఁబట్టుకొని ముందుపోవుచుండ మఱికొంద ఱావెలుతురునందుఁ బోవుటయెట్టిదో యాచార్యాభిమాన మట్టిద. ఇందు శబరివలె శిష్యులు గురువు పోవులోకమునకుఁ బోవుదురు. కావున నీమార్గమున నడచువారు తామెట్టివానిని గురువుగా గ్రహింప వలయునో వారే యెఱుంగుదురుగాక! గ్రుడ్డివెంటఁ బోవుగ్రుడ్డి గుంతలోఁ గూలును. ఈకారణముచే శబరిచర్యగాని యామెగురువులచర్యగాని శాస్త్రవిరుద్ధమైనది కాదు. కావున రాముఁ డామెను దప్పుపట్టలేదు. మఱి మెప్పే పలికెను. అను గ్రహించెను.

శబరి ముముక్షువు, మోక్షమందాశగలది. శంబుకుఁడు బుభుక్షువు, భోగమం దాసక్తిగలవాఁడు. కావుననే యతఁడు హఠయోగమార్గమున విపరీతకరణి (తలక్రిందుగవ్రేలాడుట) సాధింపఁజొచ్చెను. శంబుకవధ నాటకమందు శంబుకుండు ముముక్షువుగాఁ జెప్పుట సత్యవిరుద్ధమైన కవికల్పితము.

శబరితపస్సు సక్రమము, శాస్త్రీయము, ఆచార్యోపదిష్టము. శంబుక తపస్సు అక్రమము, అశాస్త్రీయము, అనాచార్యోపదిష్టము,

మోక్షాధికారికి శాస్త్రము, క్రమము, విధినిషేధములు లేవు.

శ్లో॥ అత్యంతభక్తియుక్తానాం, నచశాస్త్రం నచక్రమః।
నిస్త్రైగుణ్యే పథివిహరతాం, కోవిధిః కోనిషేధః?॥

త్రిగుణాతీతమైనమార్గమందు నడచువానికి విధినిషేధములు లేవు. అత్యంత భక్తియుక్తునకు (పరమభక్తునకు) శాస్త్రము క్రమము లేదు. ఈవాక్యములు త్రిగుణాతీతుఁడు పరమభక్తుఁడు నగునారూఢున కన్వయించునుగాని బిడాలకాదులకుఁ గాదు, సాధకదశయందుండువారికిని గాదు.

ఇట్టి యధికారియైనవాఁ డేవర్ణమువాఁడైనను జ్ఞానోపదేశమునకు నర్హుఁడే యనుభగవద్ధర్మశాస్త్రముకూడ హీనవర్ణునకు మంత్రోపదేశాధికార మున్నట్టు చెప్పఁగా నిదివఱకు నేను జదివినగ్రంథములందుఁ గానరాలేదు. అట్టిశాస్త్రవాక్యము లున్నయెడల నెవరైన వానిననువదించుచు సప్రమాణముగ వ్రాసిరేని సంజీవని సంతోషముతోఁ బ్రకటింపఁగలదు. సంజీవని సత్యాన్వేషియే కాని హఠవాదినిగాదు. మంత్రోపదేశముచేయువిషయమున శాస్త్రవాక్యములు నాకుఁగానరాలేదుగాని (అల్పజ్ఞుఁడగుటయే కారణము) జ్ఞానోపదేశముచేయువిషయమునఁ బ్రమాణవాక్యములు కానవచ్చుచున్నవి. జ్ఞానమనఁగా హితాహితబోధ. ఇది మంచి యిదిచెడ్డయని చెప్పుట.

శ్లో॥ ప్రాప్యం జ్ఞానం బ్రాహ్మణా త్క్షత్రియా ద్వా।
వైశ్యా చ్ఛూద్రా దపి నీచా దభీక్ష్ణమ్॥

బ్రాహ్మణునివలనఁగాని క్షత్రియునివలనఁగాని వైశ్యునివలనఁగాని శూద్రునివలనఁగాని, నీచునివలననైనను జ్ఞానమును బొందవచ్చును.

శ్లో॥ నాచార్యఃకులజాతోఽపి, జ్ఞానభక్త్యాదివర్జితః।

ఉత్తమకులమందుఁబుట్టినవాఁడైనను, జ్ఞాన, భక్తి, సదాచారసంపత్తులు లేనివాఁ డాచార్యుఁడుగా నుండఁదగఁడు.

శ్లో॥ స్త్రియశ్శూద్రాదయశ్చాపి
బోధయే యుర్హితాహితమ్
యథార్హం మాననీయాశ్చ
నార్హంత్యాచార్యతాంక్వచిత్ —భారద్వాజ సంహిత.

స్త్రీలు, శూద్రులు, మొదలగువారు హితమిది యిదియహితమని బోధింపవచ్చును. యోగ్యతకొలఁది వీరు గౌరవింపఁదగినవారే యగుదురు. కాని యాచార్యత్వమునకుఁ గొంచెమైన నర్హులుగారు.

నజాతుమంత్రదా నారీ నాశూద్రో నాంతరోద్భవః।

స్త్రీగాని, శూద్రుఁడుగాని యొకప్పుడైన మంత్ర మిచ్చువారుకారాదు. అష్టవిధభక్తులుగల మ్లేచ్ఛుఁడు విప్రుఁడు, ముని, యతి, యని చెప్పుటచే వారికిఁగల యధికారములు వర్తనములు కర్మములు వీనికిఁగలవని కొందఱు సందేహింప వచ్చునుగాని దాని కవకాశములేదు. పరమభక్తుఁడైన మ్లేచ్ఛుని మ్లేచ్ఛుఁడని చూడవలదని శాస్త్రముచెప్పెనే కాని విప్రుఁడుగా యతిగా మాటెనని చెప్ప లేదు. పరమభక్తుఁడు బ్రహ్మచారిగానో గృహస్థుఁడుగానో వానప్రస్థుఁడుగానో యేయాశ్రమములేనివాఁడుగానో యుండవచ్చును. యతి యట్లుండరాదుగదా. పరమభక్తుఁ డేయాశ్రమమందుండి మరణించెనో దానికిహితమైన పరలోక క్రియలే జరుపవలయునుగాని భక్తుఁ డనుకారణమునఁ దక్కినవారికి జరుపు పర లోకక్రియలు యతికి జరుపరాదుగదా. భక్తుఁడు బోడియై కాషాయవస్త్రములు దండకమండలువు ధరించి భిక్షాచర్య నడపవలసినపనిలేదుగదా. జనకప్రహ్లాదా దులు సంసారులుగారా? కావునఁ బరమభక్తుఁడైన మ్లేచ్ఛుఁడు విప్రునితో యతి తో సమానముగఁ బూజింపఁబడ నర్హుఁడేకాని విప్రున కున్నయధికారములుగల వాఁడగునని యర్థముకాదు. ఇచ్చట విప్ర యతి శబ్దములు జీవచ్ఛవ జీవన్ముక్త పురుషసింహములవంటివి. జీవచ్ఛవమనఁగా బ్రతికినపీనుఁగు. ఒకకళేబరమునందు జీవుఁ డుండువఱకు దానికిఁ బీనుఁ గనుపేరు రాదు. పీనుఁ గనుపేరు వచ్చినతరు వాత జీవుఁ డుండడు. కావున జీవచ్ఛవమనఁగా బ్రతికియుఁ జచ్చినవానితో సమా నుఁడని యర్థమేకాని శవమునకుఁ జేయుదహనాదిక్రియల కతఁ డర్హుఁడని యర్థము కాదు.

దీర్ఘరోగియుఁ జిరతరప్రవాసియుఁ బరాన్నభోక్తయు జీవన్మృతులని నీతి శాస్త్రము చెప్పుచున్నది. ఇట్టివారిని వారు బ్రదికియుండఁగానే దహింపవచ్చునా? పూడుపవచ్చునా? (చిరతరప్రవాసి = ఇల్లువిడిచి దీర్ఘకాలము గ్రామాంతరములఁ దిరుగుచుండువాఁడు. పరాన్నభోక్త = విశేషకాల మితరులయన్నముఁ దిని బ్రతు కువాఁడు) అటులే ప్రాకృతదేహధారియగు జీవి ముక్తుఁడుకాఁడు. ముక్తునకుఁ బ్రాకృతదేహ ముండదు. కావున జీవన్ముక్తుఁ డనఁగా జీవించియుండినను భామ రులకువలెఁ బ్రాకృతబంధములు సంసారబాధలు లేనివాఁడని యర్థము. పురుష సింహ మన్నప్పుడు మృగములందు సింహ మెట్లు విక్రమసాహసాదులశ్రేష్ఠమో యట్లు వీఁడును బురుషులందు శ్రేష్ఠుఁడని యర్థమేకాని సింహమున కుండుతోఁక కోఱలు మెడవెండ్రుకలు గలవాఁ డని యర్థముకాదు. అట్టులే మ్లేచ్ఛయతి మ్లేచ్ఛ విప్రుఁ డన్నప్పుడు మ్లేచ్ఛుఁడు గుణములందు యతితో విప్రునితో సమానుఁ డని యర్థమేకాని సంబంధబాంధవ్యాదుల కర్హుఁడనియు యజనయాజనాదులకు సపంక్తి భోజనమునకు యోగ్యుఁడనియు నర్థముగాదు.

అధికారముగలవార లేవర్ణమువారైనను స్త్రీలైనను బురుషులైనను

బ్రహ్మజ్ఞానోపదేశముగొన నర్హులే యని భగవద్ధర్మశాస్త్రమతము. అధికారు లందఱు నట్టులు జ్ఞానముసంపాదించుకొని బాగుపడవలయుననియు నధికారము చాలనివా రధికారులగుటకు సాధనముల సాధింపవలయుననియు సంజీవని యభిలాష. ఆవిషయమందే దానిపరిశ్రమము. నిజముగ బాగుపడఁగోరికఁగలవారికి సదుపదేశముఁజేసి బాగుపఱచుటయందు సంజీవనికి జాతిమతాదిభేదములు తెలియవు. యోగ్యతానుసారముగఁ గ్రమమార్గమున బోధించును. శిశ్నోదరపరాయణులైన కొందఱు సన్న్యాసులమని యోగులమని వేదాంతులమని వేషములువేసికొని తెలియనివారిని మోసగించుచున్నారు. ఇట్టివారి మాయమాటలకు లోపడి లోకులు చెడవలదని సంజీవని బోధించుచున్నది గాని నీచమైన జాతిమతద్వేషమునకు వశపడి యెవరినిగాని మీకు జ్ఞానము సంపాదింప నధికారములేదు బాగుపడు యోగ్యతలేదని యధమదశయందే యుండుఁడని చెప్పదు. కామదాసులై దొంగ వేషములు వేసికొని తిరుగువారు తమ యశనశిశ్నములందు సంజీవని మన్ను వేయుచున్నదని వాపోయినఁ బోనిండు, కాని తదితరులు స్వశ్రేయస్కాములు వారివిలాప ప్రలాప విప్రలాపములు విని చెడవలసినపనిలేదు.

## శంక

బ్రహ్మవిద్య వీరికిఁ దెలుపవచ్చును, వీరికిఁ దెలుపరాదను విధినిషేధము లేల? అందఱకుఁ జెప్పిన వారివారి శక్తికొలఁది వారువారు సాధించి బాగుపడరా యనుశంక కొందఱకుఁ గలుగవచ్చును కాని యది సరియైనదిగాదు.

బ్రహ్మవిద్య విచ్చలవిడిగా నెవ్వరికైనఁ జెప్పరాదని శ్రుతిస్మృతీతిహాస పురాణములు చెప్పుచున్నవి. ఇట్లు చెప్పుటకుఁ గారణము లేకపోలేదు.

శ్లో॥ ఉత్తిష్ఠతః జాగ్రత! ప్రాప్యవరాన్ నిబోధత। క్షురస్యధారా నిశితా దురత్యయా దుర్గం పథం తత్కవయో వదంతి॥-కఠోపనిషత్తు. లెమ్ము. మేలుకొమ్ము. సద్గురువులను జేరి చక్కఁగఁ దెలిసికొనుము. ఈమార్గము మిగుల దుర్గమము. అతిప్రయాసముచే నడవఁదగినది. కష్టముతోడఁ దాఁటఁదగినది. మంగలకత్తి వాదరవలె మిగులఁబదునైనది యని బ్రహ్మజ్ఞానులు చెప్పుచున్నారు అని యర్థము.

లెమ్ము, మేలుకొమ్ము... తెలిసికొమ్మనుటకు మేలుకొలు పనుగ్రంథమునందు విశదముగ నర్థము వ్రాయఁబడినది. తెలిసికొనఁగోరువా రాగ్రంథమును బఠింపవలయును.

ఈమార్గము మంగలకత్తియొక్క పదునైనకొనమీఁద నడచుట యెట్టిదో యంతకష్టమైనదని యామార్గమున నడచినబ్రహ్మవేత్త లెఱుఁగుదురు. అనిన నేమిభావము? ఆమార్గమున నడచువారు మిక్కిలి హెచ్చరికతో నడువవలయునని ప్రమాదపడిన మిగులనపాయకర మని యట్లు నడువఁబూనినవారు సాధన సామగ్రి యభ్యాసము లభింపఁజేసికొని యుండవలయుననికదా! ఆ మార్గమునందలి

యపాయము లుపాయములు ననుభవముచేఁ దెలిసినవారగుటచే వా రామార్గమున నడువఁగోరువారికి హెచ్చరికవాక్యములు పలికియున్నారు. పొగబండిమీఁద మనము ప్రయాణముచేయునపుడు ప్రక్కల 'హెచ్చరిక,అపాయము' అని వ్రాసిన పలకలు స్థాపించియుందురే యేల? అట్టులే యిదియును.

ఈమార్గమందు నడువఁబూనినవారికి రాఁగలయపాయములు నవి తప్పించుకొను నుపాయములు ముందుగ సాధింపవలసిన సాధనములు చేయవలసిన యభ్యాసములు నివి వ్రాయుట కిది సమయముగాదు.

శ్లో॥ ఇదం తే నాతపస్కాయ, నాభక్తాయ కదాచన।
నచాశుశ్రూషవే వాచ్యం, నచ మాం యోభ్యసూయతి॥భ-గీ.౧౮అ.

ఈభగవద్గీతాశాస్త్రము తపస్సులేనివానికి భక్తిలేనివానికి గురుశుశ్రూషచేయనివానికి నాయందసూయగలవానికి నెప్పుడైనఁ జెప్పరాదని యర్థము. ఇది శ్రీకృష్ణవాక్యము.

ఇం దసూయయనఁగా నిర్లక్ష్యభావము. కృష్ణుఁడు మనవంటి మనుష్యుఁడే. వాఁడు చెప్పుట మనమువినుటయా! వాఁడు మనకంటె నేమిట గొప్పవాఁడు! అను తిరస్కారభావముతో నుపదేశించిన విషయమందు ననుకూలగ్రహణబుద్ధి లేకయుండుట.

శ్రీమద్రామాయణమందును "శ్రోతవ్య మనసూయయా" అసూయలేక వినఁదగినది యని చెప్పఁబడెను. ఇప్పుడు కొందఱు తామసులు ననధికారులు యసూయాపిశాచగ్రస్తులగుటచేతనే రామాయణమందును భగద్గీతయందును భాగవతమందును విపరీతాభిప్రాయు లగుచున్నారు. నిర్మలమైనయద్దమందు గ్రోఁతులకు గ్రోఁతులముఖములు, సుందరులకు సుందరముఖములుగదా కనవచ్చును! సాత్త్వికులకు సరియైన యర్థమే రామాయణభగవద్గీతాదులందుఁ దోఁచును.

శ్లో॥ నవిశ్వాసః క్వచిత్కార్యో, విశేషాత్తు కలౌయుగే।
పాపిష్ఠా వాదవర్ణేణ, మోహయం త్యవిచక్షణాన్।
గోపయే న్నోచ్చరే ద్ధర్మం, నాపృష్టః కించి దుచ్చరేత్।
పృష్టోపి న వదే దర్థం, గుహ్యం సిద్ధాంత మేవచ।
ఆశ్రితా యాతిభక్తాయ, శాస్త్రశ్రద్ధాపరాయచ।
న్యాయేన పృచ్ఛతే సర్వం, వక్తవ్యం శౌచయోగినే।
ఆత్మపూజార్థమర్థార్థం, దంభార్థమపి భిన్నధీః।
అయోగ్యేషు వదన్ శాస్త్రం, సన్మార్గా త్ప్రచ్యుతోభవేత్।
ఊషరే నివపే ద్బీజం, షండే కన్యాం ప్రయోజయేత్।
సృజేద్వా వానరే మాలాం,నాపాత్రే శాస్త్రముత్సృజేత్॥శాండిల్యసంహిత.

అర్థము: సదాచారసంపత్తి, భక్తి, గురుసేవ, పెద్దలవలన వినికి లేని

వారలయందు కొంచెమైనను సందువిశేషించి కలియుగమందు విశ్వాసముంచ రాదు. పాపిష్ఠులు వాదవర్షముచేఁ దెలియనివారిని మోహపెట్టెదరు. రహస్యమైన సిద్ధాంతవిషయమును దాఁపవలయునుగాని తానై కొంచెమైనను ధర్మరహస్య మడుగనివారికిఁ జెప్పరాదు. కొందఱు కడిగినను జెప్పరాదు. (అట్లయిన శాస్త్రజ్ఞానము లోకమున నశింపదా యందురేని) ఆశ్రితుఁడుగానుండి యతిభక్తిపరుఁడై శాస్త్రవిశ్వాసముకలిగి న్యాయ్యమైన మార్గమున వాదమునకుఁగాక తత్త్వము తెలిసికొని బాగుపడవలయు ననుతలంపుతో నడిగెనేని మనోవాక్కాయశౌచముగల వానికిఁ జెప్పవలయును. తనగౌరవముగోరిగాని ధనాశచేఁగాని దంభమునకైకాని భేదబుద్ధిగలవాఁడు అయోగ్యులకు శాస్త్రవిషయము చెప్పెనేని సన్మార్గమునుండి భ్రష్టుఁడగును. చవిటినేల విత్తనములు నాటవచ్చును. వృషణహీనునకుఁ గన్య నీయవచ్చును. క్రోఁతిమెడలోఁ బూలదండ వేయవచ్చునుగాని యనర్హునకు శాస్త్రతత్త్వములు చెప్పరాదు.

ఇట్టివాక్యములు ప్రతితత్త్వశాస్త్రమందును గలవు. ఇట్లు వ్రాయుటయందు శాస్త్రకారుల యభిప్రాయమేమి? లోకమున జ్ఞానము వ్యాపింపరాదనియా? అటయినచో వారాశాస్త్రములు వ్రాయనేల? ధర్మజ్ఞానముచే లోకము బాగుపడవలయు ననెడివారియుద్దేశ మెట్లుసార్థకముకాఁగలదు? ఇతరులు నేర్చుకొనినఁ దమయంతటివారగుటచేఁ దమగౌరవము చెడుననియా? అడవులలోఁ గందమూలాదులు దిని యేకాంతనిరతులై "స్వస్తిప్రజాభ్య," "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అని పూఁటపూఁట చెప్పుచుండువారికి తమరు చెప్పినవిషయము లోకమెఱిఁగి బాగుపడవలయు ననునభిప్రాయముండునే కాని దానివలనఁ దమకు గౌరవహాని కలుగు ననునభిప్రాయ ముండఁజాలదు. పలువురు చదివిన కీర్తి హెచ్చును. 'సమ్మానఃకాలకూట' మ్మని గౌరవమును విషముగాఁ జూచువారికి నగౌరవభయ మెందుండివచ్చును? కాఁబట్టి యిట్టిదురభిప్రాయములు వారికి లేవు. సదభిప్రాయముతోనే యోగ్యులుగానివారు పఠింపరా దని శాసించిరి. ఇది వారిమేలు కోరి చేసినపనియేకాని యితరముకాదు. ఈఁతనేరనివారు నీళ్లలోఁ దుముకవల దనుట యసూయచేతనా? సామునేరనివాఁడు కత్తిని ద్రిప్పవలదనుట యసూయచేతనా? జీర్ణశక్తిలేనివారు గట్టిపదార్థములు దినవల దనుట యసూయచేతనా? అట్టులే యిదియును. యోగ్యతలేనివారు తత్త్వశాస్త్రము చదివినఁ జెడుదురు. వీనికి ననర్థకరమైన యల్పజ్ఞానముకంటె నజ్ఞానముమేలు. అజ్ఞాని కాపదలేదు. పెద్దలు చెప్పినమాటయందు విశ్వాసముంచి యాప్రకారము వర్తించి బాగుపడును. వీనికి శాస్త్రపఠన మనావశ్యకము. శబరినారదాదులే (పూర్వజన్మమున) నిదర్శనములు. అల్పజ్ఞుఁడో కొంచె మేదో తెలిసి యదియహంకారమునకుఁ గారణముకాఁగా ప్రగల్భతచే శాస్త్రవాక్యముల కపార్థముచేసి సర్వజ్ఞత్వభ్రమ నెత్తిపై వేసికొని వక్ర

మార్గములఁ బోయి చెడును. తాను జెడిన మేలే. తాఁజెడ్డకోఁతి వనమెల్లఁ జెఱిచినట్లు లితరులనుగూడఁ జెఱుచును. అనుభవమే సాక్ష్యము. ఎట్లందురా? భగవద్గీతయందు "సోమపాః పూతపాపా" యని యుండుటఁ జూచి సోమమనఁగాఁ గల్లని యర్థముచేసికొని భగవద్గీత కల్లుద్రాగవచ్చునని చెప్పుచున్న దని యొక ప్రబుద్ధుఁడు వ్రాసెను. 'మద్యాజీ మాం నమస్కురు' అనుచో మద్య+అజ+ఇ=సారాయము మేఁకమాంసము గలవాఁడవై నాకు నమస్కరింపవలయు ననికృష్ణుఁడు చెప్పినట్లు కొందఱు మాంసభక్షకగురువులు శిష్యులకు శిష్యురాండ్రకు బోధించుచున్నారు. 'ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతిధారయన్', ఇంద్రియము లింద్రియార్థములందు వర్తించుచున్నవి. నేను జేయునది యేమిలేదు. ఇంద్రియము దాని పని యదిచేసినపుడు పాపము నాకెట్లు కలుగును? చేసినవాఁడను నేను గాను వ్యభిచరింప భగవద్గీత యనుజ్ఞ యిచ్చుచున్నదని కొందఱు పరస్త్రీలకు బోధించి వారలఁ జెఱుచుచున్నారు.

క. ఱలపెట్టనేని వీనులు, కలియంగాఁ బెట్టుటకును ♦ గలకాలంబున్
గలదే పుడకల నియమము, దలఁపఁగ నటుకాదె యోని♦ధర్మంబకటా.

చెవులందును, గన్నులందును, ముక్కులందును దురద యెత్తినపుడు యావజ్జీవము నొకవ్రేలే యొకపుల్లయే కాని వేఱొండుకూడ దనునియతిగలదా? అట్టులే కదా, యోనిరంధ్రముధర్మ మనియీదుష్టగురువులు స్త్రీలకు వయస్సువిధవలకు బోధించుచున్నారు. తక్కెళ్లపాటిలోను అచ్చమ్మపేటలోను నిటువంటిమతగురువులకు వాసుదాసునకు జరిగినసంవాదము మఱియొక పత్రికలో వ్రాయఁబడును. ఇట్టి మతాధిపతులు సన్న్యాసులు అనుపేరి కలిదూతలు పెక్కురున్నారు.

హింసచేసి నేను జేయలేదనుకొనిన హింసాదోషము రాదని భగవద్గీత చెప్పుచున్నది కావున నెవరైన నెవనినైనఁ జంపి నేను గాదనిన దోషము రాదని యొకరు చెప్పిరి. ఇట్టు లర్థముచేసి యట్లువర్తించువారు చెడుదు రనుటకు సందేహముకలదా?

అట్టులే కామదాసులు శ్రీకృష్ణచరిత్రము చదివి కామజయము సంపాదించుటకుమాఱు కృష్ణుఁడు అంకాడెననియు మనమట్టులే చేయవచ్చుననియు కొందఱు వదరుచున్నారు. రాముఁడు దుష్టుఁడు రావణాసురుఁడు శిష్టుఁడని చెప్పుపుణ్యాజనులు కలరుగదా!

"ఆకాశో బ్రహ్మ" యను నుపనిషద్వాక్యమునకు నమరమందు "ఆకాశం గగనం శూన్య"మని యుండుటచే బ్రహ్మము శూన్యమని యర్థముచేసి కొందఱు దుర్బోధములు చేయుచున్నారు. శూన్యమనఁగా నాస్తియని యీమూఢులతలంపు. "తస్యధీరాః పరిజానంతి యోనిం"ఆయనయోనిని పండితులుచక్కఁగా నెఱుఁగుదురు అనియుండుటచే బ్రహ్మమునకు స్త్రీలకువలె యోనియున్నదఁట. ఇది "మమయోని

ర్మహద్బ్రహ్మ” నాయోని పెద్దబ్రహ్మయంతదియని కృష్ణుఁడే యంగీకరించెనఁట. అట్లు యోనిద్వారములేదేని “ప్రజాపతిశ్చ రతి గర్భే అంతః” ప్రజాపతి గర్భములో పల సంచరించుచున్నాఁ డనుశ్రుతివాక్యము సార్థకమగునా? యోనిలేకపోయిన ప్రజాపతి గర్భములోని కెట్లుపోవును? ఇది యీవేదవేత్త లెఱిఁగినయర్థము. ఇది యూహగాదు. కల్పితముగాదు.

నేను వేలుపూరుగ్రామప్రాంతమందు దిరుగునపుడొకఁడు ‘బ్రహ్మముఖము నందుండి బ్రాహ్మణులు పుట్టుచున్నారని వేదముచెప్పుచున్నదే బ్రహ్మకు ముఖము నందుఁగూడ యోనులున్నవా’ యని ప్రశ్నించెను. అవునని చెప్పినను లేదనిచెప్పి నను విపరీతప్రశ్నలు వాదములు బయలుదేఱునని తలఁచి ‘సీతలలో పేలున్నవే. సీతలలో నెన్నియోనులున్నవని యడిగితిని’. మరలప్రత్యుత్తరము వాదము లేక పోయెను. ఈకాలపువైతండికుల కియ్యవలసినవి యిట్టిప్రత్యుత్తరములే. మూఢుల శాస్త్రజ్ఞాన మెట్లుపరిణమించెనో కంటిరిగదా! రహస్యములు గొప్పవిషయము లల్పులు గ్రహింపఁజాలరు. ఆవిషయమందుఁ గొంతపరిచయము జ్ఞానము అను కూలభావము గలవానికిఁగాని చెప్పినను బోధపడదు.

“విటుఁజొక్కించె బ్రఫుల్లపద్మనయనావీరాయితంబెంతయున్” అను నలం కారశాస్త్రవాక్యమునకుఁ జిన్నప్రాయమందలి సాహిత్యవిద్యార్థికి నుపాధ్యాయుఁ డేమని యర్థముచెప్పి మెప్పింపఁగలఁడు? చెప్పకుండుటకుఁ గారణ మసూయయా, నిజగౌరవహానిభయమా? ‘ఒ’ ఇట్లేలవ్రాయవలె ‘ఌ’ యిట్లు ఏలవ్రాయరా దననేమిచెప్పవలయును? ౧+౨=౩ అనితెలియనివానికి సిద్ధాంతగణిత మెట్లు బోధపడఁగలదు? ఒక బ్రాహ్మణబాలుఁడు గురువునొద్ద సాహిత్యశాస్త్ర మభ్యసించి పంచకావ్యములు చక్కఁగవల్లించెను. అందు మాఘకావ్యంబున స్త్రీలయధరా మృతము విశేషించివర్ణింపఁబడెను. విద్యయంతయు సాంతముగఁ జదివి గురువు నను్జ్ఞదీసికొని తనయూరి కావిద్యార్థిపోవుచుండ దారిలో నొకయెఱుకలిది కల్లు త్రావి నోటఁదమ్మలముండ నోడలెఱుఁగక పడియుండ దానినోరనుండి జొల్లు కాఱుచుండెను. ఆ బ్రాహ్మణబాలుఁడు మాఘకావ్యమందుఁ దాఁ జదివిన యధరా మృత మిదియే యనితలఁచి దానియొద్దకుఁ బోయి పెదవులక్రింద దోసిలిపట్టెను. కొంతసేపటికి దోసిలినిండఁగా దానిఁ దననోరఁ బోసికొనెను. కల్లుత్రాగిననోరు పొగాకుతోడితమ్మలము ఆయధరామృత మహహా (అధరము = పెదవి, అమృ తము = నీళ్ళు. పెదవినుండివచ్చునీళ్ళు) యెంతరుచి యెంతరుచి యెంతరుచిగా నుండెనో! హరిహరీ! ఆవిద్యార్థియవస్థ నేమని చెప్పను? రుచితలకెక్కెను. కన్ను లు గిఱ్ఱునఁదిరిగెను. వాంతులుపుట్టెను. కడుపులోపలి ప్రేగులువెలికి వచ్చెను. వాసనకు ముక్కులోనివెంట్రుకలు కమరెను. నాలుక బఱికికొనెను. చింతా కువేసి రుద్దెను. పుక్కిలించి యుమ్మివేసెను. నోరుతెఱచికొని కూర్చుండెను.

ఏమిచేసిననేమి ? ఆయధరపీయూషమువాసన నతని వదలలేదు. చాల బాధ పడి యాయూథుఁడు మాఖముపైఁ గోపించి మాఖమును గాల్పవలయునని గట్టిగానఱచుచుఁ బోయెను. తక్కినకథ యప్రస్తుతము. ఇప్పుడు కొందఱు వృద్ధ సేవలేక గురుశిక్షలేక సంప్రదాయజ్ఞానములేక ప్రతిష్ఠమాత్రము గోరి యుద్గ్రంథ ములఁ జదివి యీవిద్యార్థిగతికి వచ్చుచున్నారు. ఇతరులను జెఱుచుచున్నారు. ఎన్ని అసత్యములకు నెన్నిదురూహములకైన జీవబ్రహ్మైక్యవేదాంతరహస్యమను గ్రంథ మందు లక్ష్యములు దొరకఁగలవు. ఆపుస్తకమును జదివి చెడినవారెందఱో కల రని వింటిని. ఈగ్రంథములోని కొన్నియసత్యవిషయములను సంజీవని ముందు ముందు లోకమున కెఱిఁగింపఁగలదు. "మేలుకొలుపు" చూచినఁ గొన్ని తెలియఁ గలవు. ఐహికవిషయములందుఁ జెడినను బ్రాయశ్చిత్తము పెట్టుకొనవచ్చును. ఆత్మ విషయమందుఁ బ్రమాదముగలిగిన నధోగతియే. కావుననే యధికారికానిశిష్యు నికి నాత్మజ్ఞాన ముపదేశింపరాదని శాస్త్రములు శాసించెను. శబరి తొలుత మునీ శ్వరులయొద్దఁ బరిచారికగాఁ గుదిరినను గురువాక్యశ్రవణమువలనఁ గలిగినశ్రద్ధా భక్తులుగలదై యావిషయమునే మననముచేయుచు శిష్యురాలిధర్మమైన శుశ్రూష చేయుచు "తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేనసేవయా" యని శ్రీకృష్ణభగవాను లుపదేశించినట్లు నమస్కారాదిపూర్వక పరిచర్యచేయుచు గురువాక్యము నమ్మి వితండావాదము సేయక న్యాయ్యమైన ప్రశ్నలు వేయుచు యావజ్జీవ మంతేవాసినియై శిష్యశబ్దమును సార్థకపఱచుచుఁ గ్రమక్రమమున యోగ్యతసంపాదించుకొని ముము క్షువై యోగసిద్ధికి బ్రహ్మజ్ఞానమునకుఁ బాత్రురాలయ్యెను. ఇట్టిశిష్యులకు శిష్యు రాండ్రకు యోగ్యులైన గురువులు తత్త్వరహస్య ముపదేశింపవచ్చును గాని యిట్టియోగ్యతలేనివాఁ డేజాతివాఁడైన నుపదేశింపరాదు. ఇఁక శిష్యలక్షణ మెఱిఁ గించెద. దానివలన శబరియోగ్యత తెలియును.

## శిష్యలక్షణము.

ఇది కొంత మేలుకొలుపునందుఁ జెప్పఁబడినది. అయినను మరలఁ గొంత చెప్పవలసియున్నది.

శ్లో॥ సద్బుద్ధి స్సాధుసేవీ,సముచితచరిత, స్తత్త్వబోధాభిలాషీ, శుశ్రూషు,
స్త్యక్తమానః, ప్రణిపతనపరః, ప్రశ్నకాలప్రతీక్షః, శాంతో దాంతోఽనసూయు,
శ్శరణముపగత, శ్శాస్త్రవిశ్వాసశాలీశిష్యః,ప్రాప్తఃపరీక్షాం,కృతవి,దభిమత, స్తత్త్వ
తశ్శిక్షణీయః.

అర్థము: సద్బుద్ధిః = మంచిబుద్ధిగలవాఁడు, చెప్పినవిషయమును జక్కఁగా గ్రహించుశక్తి గలిగి సాత్త్వికమైన మనస్సుగలవాఁడు. సాధుసేవీ = సాధువుల సేవించినవాఁడు. జ్ఞానవృద్ధులు సదాచారవృద్ధులు నగువారియొద్దనుండి వారిసేవ సేయుచు వారు చెప్పువిషయములు శ్రద్ధాభక్తులతో వినుచు, వారియాచారమును

గనుచు లోప మున్నయెడలఁ దననడవడి సవరించుకొనువాఁడు. శ్రేయస్సౌధము నకుఁ బ్రథమసోపానము సాధుసేవ. సముచితచరితః = గురువుపట్లఁ, బెద్దలపట్ల, విజ్ఞులపట్ల, సమానులపట్ల, నెట్టిమర్యాదతో వర్తింపవలయునో యది యెఱిఁగి భయభక్తులతో వినయవిధేయతలతో స్నేహభావముతో వర్తించువాఁడు. తత్త్వబోధాభిలాషీ = ఈశ్వరజీవప్రకృతులవాస్తవరహస్యమును సలక్షణముగ సప్రమాణముగఁ దెలిసికొనుటయందు మిక్కిలికోరికగలవాఁడు. శుశ్రూషుః = గురువుచెప్పినది వినుటయం దాసక్తిగలవాఁడై యాప్రకారము నడచువాఁడు. త్యక్తమానః=లజ్జాభిమానములు వదలినవాఁడు. ఇతరులు చూచుచుండఁ దన గురువునకో తల్లిదండ్రులకో పెద్దలకో చేయుసేవ (కసవుచిమ్ముట, నీళ్లుమోయుట, అలుకుట, పాదములొత్తుట) లోనగుకార్యములను జేయ బిడియపడుట లేనివాఁడు. నేనింతటిగొప్పవాఁడనే, ధనికుండనే, అధికారముగలవాఁడనే, బలముగలవాఁడనే, దేశప్రభువనే, గొప్పవిద్యావంతుఁడనే, నన్ను వీఁడు నేలఁగూర్చుండుమననే, నాకీ యల్పకార్యము చేయుమనిచెప్పెనే, నాగౌరవమెంచఁడాయెనే, నేలఁగూర్చుండిన నాచలువదోవతిమాయునే, నేలఁబరుండిన దేహము ధూళియగునే యని యిట్టి దురభిప్రాయములు లేనివాఁడు. ప్రణిపతనపరః = సాష్టాంగనమస్కారము చేయుట యందు నాసక్తిగలవాఁడు. బోరగిలఁబడిన దేహమునకు మట్టియగునే, యెట్లుపడు దునా యని రెండుచేతులుజోడించి కుడిభుజముమీఁదనో యెడమభుజముమీఁదనో యుంచువాఁడుకాఁగూడదు. ముసుఁగులోఁ జేతులుజోడించువాఁడును గాఁగూడదు. ఏవర్ణమువారైనను దమకంటెఁ దక్కువవర్ణమువారికి నమస్కరింపరాదు.

ఉచ్ఛిష్టము, సూతకము, ఆశౌచము – వీనితోఁగూడినవానికిని, పరువెత్తు వానికిని, ధనమదముగలవానికిని, చెట్టెక్కియుండువానికిని, అపరిశుద్ధునకును, బరువు మోసికొనిపోవువానికిని, దూరమునందుండువానికిని, తలంటుకొనియుండువానికిని, విరుద్ధకర్మములుచేయువానికిని, పతితునకును, భగవద్భక్తిలేనివానికిని, కర్మచండా లునకును నమస్కరింపరాదు. భరద్వాజులు.

శ్లో. పితాచ మాతాచ పితామహాశ్చ
జ్యేష్ఠః పితృవ్యః శ్వశుర స్తథా ర్త్విక్
మాతామహాధ్యాపక మాతులాశ్చ
మాన్యాస్స్యు రేతే క్రమతోఽభివాద్యాః॥ స్మృతిదర్పణము.

తండ్రి, తల్లి, తండ్రితండ్రి, అన్న, తండ్రితోడఁబుట్టినవారు, మామ, ఋత్విజుఁడు, తల్లితండ్రి, వేదాధ్యయనము చేయించువాఁడు, మేనమామ, వీరం దఱు మాన్యులే. వీరికి వరుసగ నమస్కరింపవలయును.

శ్లో. స్వనామపూర్వం పరికీర్త్య పశ్చాత్
భోశబ్ద ముచ్చార్య గురోస్తు శిష్యః

వ్యత్యస్య పాణిం పరిలభ్యపాదౌ
పిధాయకర్ణౌ-వభివాదయీత॥ స్మృతిదర్పణము.

ముందు తనపేరు ఆవల భోశబ్దము చెప్పి శిష్యుఁడు గురువుకుడిపాదమును గుడిచేత నెడమపాదమును నెడమచేత నంటి రెండుచెవులు మూసికొని గురువునకు నమస్కరింపవలయును. కాని గురువులపాదములు గాయపడునట్లు, నరములుబ్బునట్లు, ఎముకలు విఱుగునట్లు, పొడిచి, పిసికి, నలిపి, గురువుప్రాణములు కంఠగతములు చేయరాదు. ఈవైభవము వాసుదాసునకుఁదప్ప నితరులకుండదని తలఁచెదను.

తలవిరియఁబోసికొని యుండువానికి, జపము, హోమము, భోజనముచేయువానికి, చీఁకటియందుండువానికి, నిద్రించువానికి, పతితునకు, శవమునకు, నమస్కరింపరాదు. తలమీఁద ముసుఁగు వేసికొనికాని, తలంటుకొనికాని, నమస్కరింపరాదు. క్షత్రియుఁడు వైశ్యునకు నమస్కరించెనేని ౮-౧౦ మందిబ్రాహ్మణులకు నమస్కరించిన శుద్ధుఁడగును. బ్రహ్మక్షత్రియవైశ్యులందెవరైన శూద్రులకు నమస్కరించిరేని కట్టువస్త్రములతో స్నానము చేయవలయును; శివునిఁగాని విష్ణువునుగాని పూజింపవలయును; లేదా మహాభాగుఁడైన బ్రాహ్మణునకైన నమస్కరింపవలయును. దీనికిఁ బ్రమాణవాక్యములు—స్మృతిదర్పణము.

శ్లో. క్షత్రవైశ్యాభివాదేన, ప్రాయశ్చిత్తం కథంభవేత్
బ్రాహ్మణానాం దశాష్టౌ వా, అభివాద్య విశుద్ధ్యతి
అభివాద్య ద్విజ శ్శూద్రం, సచేలస్నాన మాచరేత్
అర్చయే త్పుండరీకాక్షం, దేవం వాపి త్రిలోచనమ్
బ్రాహ్మణంవా మహాభాగ, మభివాద్య విశుద్ధ్యతి॥

శ్లో. ఉదక్యాం, సూతికాం, నారీం, భర్తృఘ్నీం, గర్భఘాతినీమ్
అభివాద్య ద్విజో మోహా, దహోరాత్రేణ శుద్ధ్యతి॥

ఏవర్ణమువైనను ముట్టయినదానికి, పురిటిదానికి, భర్తనుజంపినదానికి, గర్భమును బోఁగొట్టుకొనినదానికి, బ్రాహ్మణుఁడుగాని క్షత్రియుఁడుగాని వైశ్యుఁడుగాని యజ్ఞానముచే నమస్కరించెనేని యొకరేయిపగ లుపవసించి శుద్ధుఁడగును.

పతితుఁడనఁగా భ్రష్టుఁడు. తాను జనించిన వర్ణమునుండి పడిపోయినవాఁడు. పుట్టువుచే బ్రాహ్మణుఁడైనను పతితుఁడయ్యెనేని వానికి జాతిచండాలుఁడును నమస్కరింపరాదు. పతితుఁ డేవర్ణమునందును జేరఁడు. కొట్టకొనకొమ్మనుండి పడినకాయ నేలఁబడునేకాని నడుమఁ గ్రిందికొమ్మలకుఁ దగులుకొనదు కదా!

దీని కపవాదము.

సర్వాత్మకబ్రహ్మోపాసనము చేయువానిని పైసామాన్యవిధులు బాధింపవు. వీఁడు మనుష్యులకేకాదు కుక్కలకు గాడిదలకు ఎద్దులకుఁ జెట్లకుఁగూడ

సర్వము బ్రహ్మకళావిశిష్టమని బ్రహ్మస్వరూపమని నమస్కరించును. దృష్టిభావ భేదము కారణము. ప్రశ్నకాలప్రతీక్షః=ఎప్పుడు గురువు విరామముగా నితరచింతలు లేక యేకాంతియై ప్రసన్నుఁడై యుండునా, యెప్పుడు ప్రశ్న లడుగసమయమగునా, యని సమయము వేచియుండువాఁడు. రాత్రిపదిగంటలమీఁదఁ బరుండినగురువును లేపి అయ్యా మాకు మంత్రార్థముచెప్పుమని యడుగువారు కాఁగూడదు.

శాంతఃదాంతః = అంతరింద్రియనిగ్రహము బాహ్యేంద్రియ నిగ్రహము గలవాఁడు.

అనసూయః = అసూయలేనివాఁడు. మనకంటె వీనికెక్కువ యేమితెలి యును? మనముచదివిన పుస్తకములలోవే కదా వీఁడు చెప్పుచున్నాఁడు. ఇఁక నిన్నిపుస్తకములు చదివిన వీనియంతటివారము మనము కాఁగలము. అనునిర్లక్ష్య భావముకలవాఁడు కాఁగూడదు.

శరణముపగతః = శరణముచొచ్చినవాఁడు. నన్ను రక్షింపఁ బోషింప నీవు దప్ప మఱియెవరులేరు. నీవే నాకుదిక్కు. నన్ను రక్షించుభారము నీది, నీయాశ్ర యమునఁ దాపత్రయబాధలులేక సుఖింతును. అనిపాదములపైఁబడువాఁడు. అట్టి నిశ్చయము, నిశ్చలమైనశ్రద్ధయు, భక్తియుఁ గలవాఁడు.

శాస్త్రవిశ్వాసశాలీ = శాస్త్రమునందుఁ జెప్పఁబడినది వాస్తవము. ఆప్రకా రము నడచుకొనిన నందుఁజెప్పినఫలము తప్పక కలుగును, అని దృఢనిశ్చయము. నమ్మికగలవాఁడు శ్రుతిస్మృతీతిహాసపురాణములందు నమ్మకములేనివానిని దగ్గఱ చేర్పరాదు. శాస్త్రవిశ్వాసలక్షణము శాస్త్రీయాచారము. నాకు శాస్త్రవిశ్వా సముకలదని నోరఁజెప్పుచు శాస్త్రీయాచారములేనివాఁడు శాస్త్రవిశ్వాసియనఁ బడఁడు.

ప్రాప్తఃపరీక్షాం = శిష్యునినడవడిని భక్తిశ్రద్ధలను సంవత్సరమో, యాఱు నెలలో, మూఁడుమాసములో, మూఁడుపక్షములో (౪౫ దినములు), మూఁడు దినములో, సందర్భముకొలఁది పరీక్షింపవలయును. ఇట్టిపరీక్షయందుఁ గృతార్థుఁడై గురువును మెప్పింపఁగలుగువాఁడు శిష్యుఁడుగానుండ యోగ్యుఁడు.

కృతవిద్ = గురువు తనకుఁ జేసినమే లెఱింగినవాఁడు. నేను 'సేవచేసితిని, ఆయన యుపదేశ మిచ్చెను, కాయకుఁగాయ చెల్లుబోయెను, ఇఁక నాయనతో నాకేమిపని' యనుట కృతఘ్నులలక్షణము. ఇట్టివానికి మంత్రము జ్ఞానబోధ ఫల మీయవు. ఎన్నిజన్మములెత్తి యెన్నినరకములపాలై యెంతయో బాధపడు నాకు నీనరకబాధ నైహికబాధ తొలఁగునుపాయము తెలిపిన మహాత్మునకు నేనెంత యిచ్చిన నెంతసేవచేసిన నాయనఋణమునుండి ముక్తుఁడఁ గాఁగలను? నేనాయన నుపేక్షించితినేని నాకంటెఁ గృతఘ్నుఁ డెవఁడు? అని తలఁచువాఁడు.

అభిమతః = గురువున కిష్టుఁడై సమ్మతింపఁబడినవాఁడు. ఆయన యనుగ్ర

హామునకుఁ బాత్రుఁడై యాయనచే నభిమానింపఁబడినవాఁడు. 'వీనివలన నాకుఁ గీర్తిప్రతిష్ఠలు గలుగును. వీనికిఁ జెప్పిన విద్య సార్థకము' అని గురువునకు నమ్మకము గలిగించువాఁడు. ఇట్టిశిష్యుఁడు గురువుచే బోధగొన యోగ్యుఁడు.

అంతేవాసి లక్షణము.

గురువుసమీపమున యావజ్జీవము శిష్యుఁడుండి చేయవలసినకార్యములను గుఱించి భగవద్ధర్మశాస్త్రవాక్యము లుదాహరించుచున్నాఁడను.

శిష్యో యావజ్జీవం గురూపదేశ ముపతిష్ఠ, న్నాచార్యాధీనవృత్తి, స్తమేవ పరంబ్రహ్మేతి మన్వానః, తమేవ సతతంధ్యాయన్, జపన్, నమన్, అర్చయన్, తన్నామోచ్చారయన్, తత్పదతీర్థం, తదుచ్ఛిష్టం, తదుపభుక్తం, వాసోభూషణాది నిత్యముపయుంజాన, స్తదర్థమేవ శరీరాదిధారయన్, తదనుజ్ఞాప్రతీక్షకోఽవంచనయా పరివస్యన్, సర్వదాస్యాత్మయాత్రామనపేక్షన్, తచ్ఛరీర సంరక్షణపరో భవన్, గురోర్గురూనపి తత్ప్రీత్యైయజన్,తద్దారాదౌభాగవతేష్వపిచ సబ్రహ్మచారిషు గురువృత్తి ర్యథాయోగ్యంచ తేషు పరివస్యన్,గురుకృతముపకారమాదేహపాతమప్రత్యుపకృత్యనుసందధన్, నవిస్మరన్, తదారాధ్యే భగవతి అధికప్రీతిస్తమేవ ఉపాయోపేయభావే నాలంబమానస్సర్వశోనద్రుహ్యన్, గురునిందాద్య శృణ్వన్, ఐహికాముష్మికం సర్వం గురు రేవేతిభావయన్, నియమాతిక్రమే రహసిబోధయేత్ పతనీయంవారయన్ అతికృచ్ఛ్రగతం భగవత్ ప్రపత్త్యాదిభిస్సముద్ధరన్ అవశ్యావారణే తదంతర్యామిణే తదాచార్యంవా భజన్ తన్నివర్తనావకాశం ప్రతీక్షమాణోజాతేవకాశే సంబోధ్య మార్గే స్థాపయన్ గురుసన్నిధావప్రగల్భమానః స్వసమానశీలై రేవ సహవసన్ యావదాయుషం గురుముపాసీత.

దీని కర్థము.

శిష్యుఁడు తాను బ్రదికియుండువఱకు గురు వుపదేశించినపద్ధతి నడచుకొనుచు నాచార్యున కధీనమైనవర్తనముకలవాఁడై యాయన చెప్పినదాని నతిక్రమించి నడవక యాచార్యుఁడే పరబ్రహ్మ మనితలఁచుచు నాయననే నారాయణుఁ డని ధ్యానించుచు జపించుచు నమస్కరించుచు నర్చించుచు నాయనపేరే యుచ్చరించుచు నాయన పాదతీర్థము ఆయనయుచ్ఛిష్టము ఆయన యుపయోగించివిడిచిన వస్త్రములు భూషణము లుపయోగించుచు నాయననిమిత్తమై శరీరము మొదలైనవాని ధరించుచు నాయనయనుజ్ఞను వేచి వంచనలేక శుశ్రూషచేయుచు నెల్లప్పుడుఁ దనదేహయాత్రయందుఁ గాంక్షలేక యాచార్యునితపస్సు కార్యాంతరముల వ్యర్థపడిపోకుండునట్లు ఆయనశరీరరక్షణమం దాసక్తిగలిగి గురువుసంప్రీతినిమిత్తమై యాయనగురువును బూజించుచు నాయనభార్యాదులందు భాగవతులందు తనతోడిశిష్యులందు గురువృత్తిచే యోగ్యతకుఁ దగినట్లు సేవసేయుచు, గురువుచేసిన

యుపకారము తనదేహముపడిపోవువఱకుఁ జేసినను జాలినంత మఱుమేలుచేయ సాధ్యముకానిదని తలఁచుచు, దానిని మఱవక, యాయన యారాధించు భగవంతునియందు విశేషప్రీతియుంచి యాయనయే ముక్తికుపాయము, ముక్తిఫల మను తలంపుగలవాఁడై యెప్పుడుగాని ద్రోహమెంచక గురునిందాదులు వినక నైహికాముష్మికములు సర్వము గురువని తలఁచుచు గురువు నియమ మతిక్రమించెనేని రహస్యముగ బోధించుచు పతితుఁడుగాకుండ నేవిధముగనైన వారించుచు నదియు నదియు నతికష్టమైనయెడల భగవత్ప్రపత్త్యాదులచే నతని నుద్ధరించుచు నట్టును వారింప నసాధ్యమైనయెడల తదంతర్యామియైన భగవంతునిఁగాని యాయనగురువునుగాని భజించుచు నాయనను జక్కఁజేయ నెప్పుడవకాశముదొరకునా యని యెదురుచూచుచు నవకాశము దొరకినపుడు బోధించి సరియైనమార్గమున నుంచి గురుసన్నిధియందుఁ బ్రగల్భములుమాని తనసడవడికి సమానమైన నడవడిగలవారితోఁ గలిసివర్తించుచు నాయుస్సుండువఱకు నాచార్యు నుపాసింపవలయును. ఇదియంతయు యావజ్జీవము గురువులసమీపమందుండి సేవించు నంతేవాసుల లక్షణము. అట్లుండుటకు సాధ్యపడనివారు దూరమునందుండినను దేహముతో శుశ్రూషచేయకపోయినను మానసికారాధనము, చేతనైన సాహాయ్యము, యోగక్షేమవిచారణము లోనైనవి చేయుచుండవలయును. శబరి యావజ్జీవము గురువులఁ గొలిచి వారియుపదేశప్రకారము వర్తించి దానిఫలముగ భగవత్సాక్షాత్కారము దానిఫలమైన పుణ్యలోకము సంపాదించెను. మీఁదఁజెప్పినట్లు గురుభక్తి దైవభక్తి గలిగి వర్తించువారికే తత్త్వార్థము స్ఫుటముగ మనస్సునఁ బ్రకాశించునుగాని తక్కినవా రెంతశ్రమించినను నావిరికప్పిన యద్దమువలె నుండును.

మీఁదఁజెప్పినవాక్యములందలి గురుశరీరరక్షణము గురూచ్ఛిష్టభోజనము గుఱించి కొంచెము చెప్పవలసియున్నది. గురుశరీరరక్షణము శిష్యునికార్యము. శిష్యునియాత్మరక్షణకార్యము గురువుకార్యము. శాస్త్రము గురుశరీరరక్షణ మని చెప్పెనేకాని గురుశరీరపోషణమని చెప్పలేదు. గురువు తనకడుపుకూటికై దేవులాడుచుండినయెడల నాయన తపస్సు పూర్ణముగఁ జేయఁజాలకపోవును. ఆకారణముచేఁ గొంతయాయు స్సుదరనిమిత్తమె వ్యర్థమగును. ఆవిచారభారము గురువునకుఁ దప్పించినయెడల నాయన శీఘ్రముగఁ గృతకృత్యుఁడగును. అందు సగభాగము ఫలము శిష్యునికి లభించును.

శ్లో॥ యస్యాన్నపానపుష్టాంగః, కురుతే ధర్మసంగ్రహమ్।
అన్నప్రదాతు స్తస్యార్ధం, కర్తుశ్చార్ధం నసంశయః॥

అని ప్రమాణముగలదు.

శరీరపోషణమనఁగా శరీరము బలియునట్లు చేయుట. ఇట్టితిండి శిష్యుఁడు పెట్ట

రాదు. శిష్యుఁడు బీదవాఁడై సజాతీయుఁడై నచో మాధుకర మెత్తి తెచ్చినదాని నాయనముందుంచి యాయన కావలసినది తీసికోఁగా మిగిలినది తాను భుజింప వలయును. మాధుకర మెత్తునపుడు గురువునిమిత్తమై బిచ్చమెత్తుచున్నానని చెప్ప వచ్చును. గురువునకు శిష్యుఁడు పెట్టునది మితాహారపదార్థముగా నుండవలయును. కాని యాహారములుగాని కాఫీ, టీ, కోకో, పొగాకు, సారాయి, కల్లు, గంజాయి, లోనగుపదార్థములుగ నుండరాదు. గురువులవారు దీనికై లబలబ నోరుకొట్టు కొన్నను శిష్యుఁ డీయరాదు. ఆహారపదార్థమైనను దామసాహారములైన మాం సము గ్రుడ్లు మొదలైన వీయరాదు. సాత్త్వికాహారమైనను మితిమించి యీయ రాదు. అమితాహారమైనను తపోవిఘ్నకారియే. అమితసాత్త్వికాహారము తామ సాహారము సమానములు. ఎక్కువతినుటచే నోడలు మాఱుమసలును, చిత్తము స్వస్థముగాదు. కావున నిట్టిదుష్టాహారము నిచ్చు శిష్యుఁడు గురువును జెఱచినవాఁ డగును. ఆపాపఫల మనఁగా తపస్సునకు విఘ్నముకలిగించినపాపము శిష్యుఁ డను భవింపవలసియుండును. చేయుసత్కార్యమునకు శిష్యుఁడు యథాశక్తి సాహా య్యముచేయవచ్చునుగాని గురు వకార్యము చేయఁబూనిన నేమాత్రమైన సాహా య్యముచేయరాదు. ముందుపోవువాఁడు తప్పుత్రోవఁబోయి గుంతలోఁబడిన వాని నాధారముగఁ గొనివచ్చు గ్రుడ్డివాఁడును వానివెంట గుంతలోఁబడినట్లు గురువు దుర్గతికిఁబోయిన శిష్యులును బోవకతప్పదు. కావునఁ దెలివిగలవారు సరియైన నడవడి జ్ఞానముగలవానిఁగాఁ జూచి గురువుగ గ్రహింపవలయును. గురువుచేత సత్కార్యములే చేయింపవలయును. గురువు తెలిసి గర్వముచేతఁగాని తెలియక గాని యతిక్రమించిపోవుచుండెనేని బోధింపవచ్చును. ఎటువినకపోయిన దండింప వచ్చును.

శ్లో॥ గురోరవలిప్తస్య కార్యాకార్యమజానతా।
ఉత్పథం ప్రతిపన్నస్య కార్యంభవతి శాసనమ్॥

ఇట్టికష్టదశ కోదండరామసేవకసమాజమువారికిఁ గలుగకయుండునుగాక!

గురుశరీరరక్షణ మనునది యాహారవిషయమాత్రముగాదు. సన్న్యాసుల కేకభిక్ష నిషిద్ధము. (ఏకభిక్షయనిన నొకయింటమాత్రమే కావలసినయాహారము తినుట) కావున 3, 5, 7 యిండ్లభిక్షమెత్తి తినవలయును. ఇట్లు భిక్షకుఁ దిరుగుకాల ములో నెవరైన నమస్కరించిరేని యానాఁ డుపవసింపవలయును.

శ్లో॥ భిక్షాకాలేచ కేనాపి, నమస్కారః కృతో యది।
తదన్నంతు పరిత్యాజ్యం, భుక్త్వా చాంద్రాయణం చరేత్॥

భిక్షాకాలమం దెవ్వఁడైన నమస్కరించెనేని యాయన్నము పరిత్యజింప వలయును. తినెనా చాంద్రాయణము జరుపవలయు నని ప్రమాణము.

శ్రీరామానుజాచార్యులవా రొకనాఁడిట్లు తిరుగుకాలమునం దొకయింటికి

భిక్షకుఁ బోఁగా నాయింటియిల్లాలు భిక్ష వేసి తటాలున నమస్కరించి గిఱ్ఱునతిరిగి పోయెను. మతవిద్వేషకారణమున నామెమగఁడు భిక్షాన్నములో విషముకలిపి యాయన్న మాయనకుఁ బెట్టుమని బలవంతపఱచి పంపెను. బిచ్చగాఁడు బ్రాహ్మణుఁడు యతి ఇట్టివానికి నెట్లు విషముపెట్టుదునా యని యాయిల్లా లేమిచేయుటకుఁ దోఁపక మగనిపోరుపడలేక యావిషాన్నము పెట్టి ధర్మశాస్త్రము తెలిసినది గావున నమస్కరించెను. అట్లు చేయుటచే నాయన యాయన్నము తినఁడని యెఱుఁగును.

భిక్ష వేసి యాయిల్లాలు నమస్కరింపఁగనే యాయన తటాలున మఠమునకుఁ బోయి యాయన్న మావలవైచి యాదిన ముపవాసముందునని శిష్యులకు జెప్పెను. వారును దానిలో నేదో కృత్రిమ మున్నది. లేకుండిన నాయిల్లా లట్లుచేసి యుండదు. ఈయన్నము మీరు తినరాదని యామెయభిప్రాయము అని చెప్పి పరీక్షార్థ మాయన్న మొకకుక్కకు వేయఁగా నది తిని వెంటనే చచ్చెను. వారిసందేహము స్థిరపడెను. ఇంతటివిరోధులుగల గ్రామమందు వసింపరాదని యాయన శిష్యులతోడ వెంటనే బయలుదేఱి యెందుల నిలువక చక్కగ శ్రీరంగమునకు వెళ్లెను. అప్పుడు మధ్యాహ్నవేళ యయ్యెను. కావేరి దాఁటి వారు వెళ్లునప్పటికి శ్రీరామానుజాచార్యులవారిగురువు కావేరికి మధ్యాహ్నస్నానార్థమై వచ్చుచుండెను. గురువును జూడఁగానే రామానుజాచార్యులవా రాయనపదములపైఁ బడిరి. నిండువేసంగి మండునెండలు. ఇసుక పెనమువలెఁ గాలుచుండెను. ఆమండు నిసుకలోనే యాయనపడెను. ఎంతసేపైనను గురువు లెమ్మన్నవాఁడు కాఁడు. శిష్యుఁడు గురువునాజ్ఞ లేక లేచినవాఁడు కాఁడు. అప్పుడు రామానుజాచార్యులవారి శిష్యులలో నొకశిష్యుఁడు కోపముచే మండిపడుచు నాగురువును బలువిధముల దూషించి యీకోమలశరీరుని జంపఁజూచెదవా యని తానాయిసుకలోఁబడి తనపై రామానుజాచార్యులవారిని వేసికొని యింకనెంతసే పూరకుండెదవో యుండుమనెను. అప్పుడాగురువు, నాయనా! యీయనకు మీరిందఱు శిష్యులున్నారు. ఈయన దేహరక్షణమం దెక్కువశ్రద్ధగలవాఁ డెవఁడో తెలిసికొనఁగోరి యిట్లు పరీక్షించితిని. ఇఁకమీఁద నీవొకఁడవే యీయనకు నాహారము కల్పించుచుండుము. ఏకభిక్షకనుజ్ఞ నిచ్చితి ననెను ఈశిష్యుఁడే రామానుజాచార్యులవారి కాదినమునుండి యాహారముచేసి పెట్టుచుండెను. ఇట్టులుండ నొకనాఁడు శ్రీరంగములో స్వామి యూరేగింపు జరుగఁ బెరుమాళ్లు వీథులవెంట వచ్చిరి. రామానుజాచార్యులవారు పోయి నమస్కరించిరికాని లోపలనున్న యాశిష్యుఁడు పాలుగాఁచుచు స్వామిని దర్శింపరాఁడయ్యెను. రామానుజాచార్యులవా రావల లోపలికిఁ బోయి, ఏమిరా! పెరుమాళ్లు వాకిటవిచ్చేసియుండఁగా నీవు వచ్చి దర్శింపవైతివని యడిగిరి. సరే సరే మీస్వామిని నేను దర్శింపవచ్చిన నాస్వామికి పాలెవరు కాఁచియిత్తురు అనెను.

చోళ దేశంబునఁ గ్రిమికంఠుఁ డనునొక ప్రభువుండెను. ఈయన కేవల శైవమతపక్షపాతి. ఇతఁడొకపత్రముమీఁద 'శివాత్ పరతరం నాస్తి.' శివుని కంటె గొప్పవాఁడు లేఁడు, అని వ్రాసి వైష్ణవులందఱచే చేవ్రాలుచేయించుకొని రమ్మని సేవకుల కాజ్ఞాపించెను.

దుష్టుఁడైన యతనికి భయపడి యందఱు సంతకములుచేసిరి. రాజభటులు రామానుజాచార్యులవా రున్నచోటికివచ్చిరి. వారు లోపలనుండిరి. శిష్యులందఱు వాకిటనుండిరి. సేవకులు వారిచేత నాకాగిద మిచ్చిరి. అందొకశిష్యుఁడు దానిని జూచి 'ద్రోణ మస్తితతఃపరం' అని దానిక్రింద వ్రాసెను. సేవకుఁ డావ్రాసినవాఁడే రామానుజాచార్యు లనుకొని పోయెను. ఈసంగతిని రామానుజాచార్యులవారికి శిష్యులు తెలిపిరి. ఇఁక నిచ్చటనున్న యుపాయముతప్ప దని వారెల్లనొక యాలోచనచేసిరి. ఆవ్రాసినశిష్యుఁడే తాను రామానుజాచార్యుల నని యీసారి భటులు వచ్చినప్పుడు చెప్పనంగీకరించెను. ఇట్లు తన్ను భటులు పట్టుకొని పోయినయెడల నక్కడివారు వీఁడు రామానుజాచార్యులుకాఁ డని చెప్పినఁ దన్ను రాజు విడిపించును. ఈమధ్యకాలములో రాజ్యముపొలిమేర దాఁటి రామానుజాచార్యులు తక్కినశిష్యులు పోవచ్చునని యీయుపాయముచేసిరి. రామానుజాచార్యులవారొక్కని నాతనితోడ నుంచి తక్కినశిష్యులతోడ శీఘ్రగమనంబున నాయూరువిడిచి పలాయనమైరి. రాజాపత్రమును జూచి మండిపడెను. 'శివాత్ పరతరంనాస్తి'యనుటకు శివునికంటె గొప్పవాఁడులేఁడని రాజునభిప్రాయము. వైష్ణవశిష్యుఁడు శివశబ్దము సేరువంటికొలఁత పాత్రకర్థముగలదియు నగుటచే నాయర్థము గ్రహించి సేరుకంటె తూముపెద్దదున్నదని యర్థమగునట్లు 'ద్రోణమస్తితతఃపరం' దానికంటెఁ బెద్దది తూముగల దనియర్థ మిచ్చునట్లు వ్రాసెను. ఇది యెవరువ్రాసిన దని రాజడుగ రామానుజాచార్యులవారు వ్రాసిరని వారు బదులుచెప్పిరి. వెంటనే యాయనను బట్టి తెమ్మని భటులఁ బంపెను. వారువెదకుచు వచ్చి యెవరు రామానుజాచార్యు లని యడుగ నేనే యని యాశిష్యుఁడు చెప్పెను. వెంటనే యాయనను గట్టి భటులు కొంపోయిరి. రాజు నీవెవఁడ వేమని విచారింపక యాయనయే రామానుజాచార్యులని కొఱ్ఱులు గాల్చి యతనిరెండుకన్నులఁ బొడిపించెను. ఆవల నీవార్త రెండవశిష్యుఁడు వచ్చి తెలిపెను. ఆరాజు కుత్తుకలో పురుగులుపుట్టి చచ్చెను. ఈవిధముగ నీశిష్యుఁడు గురువుప్రాణము రక్షించెను.

గురువుదేహమును శిష్యుఁడు తనసొంతధనముతోనో బిచ్చమెత్తిపెట్టియో రక్షింపవలయునుగాని తనదేహమును గురుద్రవ్యముతోఁ బోషించుకొనరాదు. ఇట్టివాఁడు శిష్యుఁడుగా నుండఁదగఁడు. గురువు తానై యేదైన నిచ్చిన గ్రహింపవచ్చునుగాని నిరాకరింపరాదు.

గురూచ్ఛిష్టభోజనము—ఉచ్ఛిష్టము = ఉత్ + శిష్టము, భుజించి ఎక్కువ

కాఁగా మిగిలిన దనియర్థము. భుజించుట యనఁగా నేయింద్రియముతోనైన నను భవించుట. ఒకఁడొక యరఁటిపండులోఁ గొంచెము త్రుంచి నోరవేసికొనినఁ దక్కినపండు ఉచ్ఛిష్టము. కొఱికి తినవలసినపనిలేదు. గిల్లి నోరవేసికొనినను జాలును. ఒకగెలలో నొకపండు తినినఁ దక్కినపండ్లన్నియు వానియుచ్ఛిష్టమే. ఒకతపిలెఁడన్నములోఁ గొంత నొకఁడు ముందు తినినఁ దక్కినదంతయు యుచ్ఛిష్టమే. ఇట్టి గురూచ్ఛిష్టమును శిష్యుఁడును, భర్తయుచ్ఛిష్టమును భార్యయుఁ దినవచ్చును కాని యొకఁడు కొఱికి తినఁగా మిగిలినది నములుచు నోటనుండి తీసినది సర్వథా దుష్టములు. ఇట్టియెంగిలి గురూచ్ఛిష్టమని శిష్యుఁడు తినరాదు. ఇప్పుడు కొందఱు పరమనీచు లెక్కువకులమువారిని జెఱుపుటకై తమనోటి యెంగిలి తీసిపెట్టుచున్నారు. బుద్ధిలేని పశుప్రాయులు తినుచున్నారు. ఇరువురు పాపులే. 'మాటికిఁ దక్కువయైనఁ గులమునకుఁ దక్కువా' యనుసామెతయైన మన సునఁ దలఁపకఁ గొందఱు కమ్మవారు కమసాలులు కాఁపువారు కొందఱుబ్రాహ్మణులు తమకులగౌరవమును గోదావరిపాలుచేసి నీచులనోటియెంగిలి తినుచున్నారు. రామరామ! ఇదియేమి కలికాలమహిమయో యెఱుఁగరాకున్నది. మేముబ్రాహ్మణుల మని మేముక్షత్రియులమని చెప్పుకొను వర్ణములవారు ఉత్తమాచారముల నవలంబించి బాగుపడుటకుమాఱుగా నిట్టు లోగులై పోవుటకు సంజీవని దుఃఖించుచున్నది. సత్యముగాని యసత్యముగాని యెవ రేవర్ణమువారని చెప్పుకొనినను సంజీవని తప్పుపట్టదుగాని చండాలుఁడైనను నేను బ్రాహ్మణుఁడ నని చెప్పినేని బ్రాహ్మణాచారమందుండుమని బోధించును. ఉండకుండిన దుఃఖించును. మరియొక భ్రష్టుఁడు దేశమునఁజేరెఁగదా యనితలంచును. ఇటుండ గొప్పకులమువారు దొంగపరమహంసల మాయాయోగీశ్వరుల మాటలు నమ్మి పశువులును దినఁ గూడని యితరులనోటియెంగిలి దిని భ్రష్టులగుచున్నారుగదా యని సంజీవని యెంతపరితపించుచున్నదో శ్రీరామునకే యెఱుక. ఈసందర్భమున నాచిన్న నాఁడు మాపిన్నతండ్రి లక్ష్మణరావుగారు చెప్పిన యొకచరిత్రము స్మృతికివచ్చుచున్నది.

ఆంధ్రదేశము తురకలకు లోపడిపోయినపిమ్మట మన స్వదేశప్రభువునకు రెండుకన్నులు పోయెను. ఆయనయెంతో పుణ్యాత్ముఁడు, భక్తుఁడు. ఇట్టివాఁడు తనకుఁ గన్నులుపోయెనే యని వ్యసనపడి భగవంతు ననేకవిధముల నారాధించెను. ఒకనాఁటిరాత్రి స్వప్నమందు శ్రీరాముఁడు ప్రత్యక్షమై 'రాజా! నీవు గోల్కొండనవాబు నుచ్ఛిష్టము తింటివేని నీకుఁ గన్నులు వచ్చు' నని చెప్పెను. రాజు మేలుకొని భగవదనుగ్రహమునకు సంతోషించెను గాని తురకవాని యెంగిలి యెట్లు తిందునా యని చాలవిచారపడి కానీ కన్నులువచ్చినతరువాతఁ బ్రాయశ్చిత్తమైనఁ బెట్టుకొందునని తగినపరివారముతోఁ గోల్కొండకుఁ బోయి నవా

బునకుఁ జెప్పిపంపెను. నవాబు సభతీరి రాజునకు వార్తపంపెను. రాజొకవెండి పళ్లెరమందుఁ గొన్నియరఁటిపండ్లు మొదలైనఫలములు తగిననజరానా తీసికొని పోయి నవాబున కర్పించి తనస్థితియున్నదున్నట్లు చెప్పెను. ఆనవాబు సరేయని యరఁటిగొలలో నొక పండుతిని మఱియొకపం డొలిచి రాజుచేతిలోఁ బెట్టి తినుమనెను. ఆపం డారాజు దినెను. రెండుకన్నులు వచ్చెను. రా జాశ్చర్యపడి నవాబునకు సలాములుగొట్టి 'మహాప్రభూ! మీయుచ్ఛిష్టము దినినఁ గన్నులువచ్చునని భగవంతుఁడు చెప్పెనుగదా! మీ రూరకయిచ్చినదానితోనే కన్నులువచ్చెనే యిదియెట్లని ప్రశ్నించెను. అప్పు డానవాబు 'రాజా! గొలలో నేనొకపండు తిని నీకొకపం డిచ్చితిని. ఎప్పుడు నేనొకపండుతింటినో యప్పుడే తక్కినపండ్లు నా యుచ్ఛిష్టము లయ్యెను. ఆకారణముచే నీకుఁ గన్నులు వచ్చెను. దైవ మసత్యమాడునా' యనెను. రా జానవాబుఁ జూచి మీరింతగొప్పవారు గనుకనే భగవంతుఁడు మీయొద్దకుఁ బొమ్మని చెప్పెను. మఱియొకఁడై యుండిన నేను గులభ్రష్టుఁడనై యుందుఁగదా యని యభివాదనము లాచరించి తనరాజ్యమునకు వచ్చెను.

తనవెనుకఁ దనయుచ్ఛిష్టము దినువారుండిరేని భర్తలైనను విస్తరిలోని కూరలుగాని యూరగాయలుగాని యప్పళములుగాని మఱియేవైన కొఱికి సగము నోరనుంచుకొని సగ మాకులో వేయరాదు. చేతనుంచుకొనరాదు. నోటికిఁ బెద్దదిగానుండిన నాకులోనే త్రుంచి నోర వేసికొనవలయును. సగమునమలి తక్కినది తుపుక్కున విస్తరిలో నుమ్మివేయరాదు. చేతఁదీసి యాకులో నుంచరాదు. ఒకవేళ నోటినుండి తీయవలసివచ్చెనేని తీసి యాకున కెడముగా నుంచి చేయి కడుగుకొని మరల భుజింపవలయును. ఎంగిలిచేతితో భుజింపరాదు. ఒకపెద్దమనుష్యుని యింటికి నొకయాచకుఁడు వచ్చెను. ఆపెద్దమనుష్యుఁ డాయనను జూచి నీకేవిద్యయందుఁ బ్రవీణత గలదని యడిగెను. భోజనమందని యాచకుఁడు చెప్పెను. భోజనముచేయ నీకు వచ్చునా యని పెద్దమనుష్యుఁడడిగెను. వచ్చు నని యాచకుఁడు చెప్పెను. అటైన రమ్మని తనప్రక్క నతనికి విస్తరివేయించి తనతోపాటు పదార్థములన్నియుఁ బిండివంటలతోడ వడ్డింపఁజేసెను. ఇరువురు భోజనమున కుపక్రమించిరి. పెద్దమనుష్యుఁ డేమియు మాటలాడినవాఁడుగాఁడు. యాచకుఁడు మౌనము వహించియే యుండెను. మజ్జిగ వడ్డించిరి. ఆయన్నము తినుచు యాచకుఁ డూరుగాయ తటాలున నోరనుంచి కొఱికెను. అప్పుడాగృహస్థుఁడు అయ్యా మీదేయూరని యడిగెను. తన తెలివితక్కువచేష్ట తెలిసికొనినాఁడురా యని లజ్జించి యాచకుఁడు అయ్యా యూరుపేరుచెప్పను. ఊరుగాయ కొఱికననెను. గృహస్థుఁడు నవ్వుకొని ప్రమాదపడె నని తలఁచి తోఁచినసత్కారము చేసి పంపెను. ఇట్టిది భోజనలక్షణము. ఈవిషయమున శాస్త్రవాక్యములు కొన్నియనువదించెద.

శ్లో॥ వక్త్రప్రమాణపిండాంశ్చ, గ్రసేదేకైకశః పునః
వక్త్రాధికంతు యత్పిండ, మాత్మోచ్ఛిష్టం తదుచ్యతే
పిండావశిష్ట మన్నంచ వక్త్రా న్నిస్సృతమేవచ
అభోజ్యం తద్విజానీయా ద్భుక్త్వా చాంద్రాయణం చరేత్॥
అశ్వమేధికము.

నోట నెంతమాత్రము ముద్దపట్టునో యంతమాత్రము ప్రమాణముగల ముద్దనే యొక్కొక్కసారిగ నోర నుంచుకొని తినవలయును. నోరఁబెట్టుకొనఁగా ముద్దలో మిగిలినయన్నము ఆత్మోచ్ఛిష్టమనఁబడును. నోరఁబెట్టుకొనఁగా ముద్దలో మిగిలినయన్నముగాని నోటనుండి వెలువడినదిగాని మరల భుజింపరాదని తెలియవలెను. అట్లు భుజించెనేని చాంద్రాయణవ్రతము జరుపవలయును. (చాంద్రాయణవ్రతమనఁగా శుద్ధపక్షమునఁ బాడ్యమినాఁడొకముద్దయన్నము, విదియనాఁడు రెండు, తదియనాఁడు మూఁడు యిట్టులే హెచ్చించి పున్నమనాఁడు 15 ముద్దలు తినవలయును. ఆవల మరల బహుళమునఁ బాడ్యమినాఁడు 14, విదియనాఁడు 13, ఇట్లువరుసగ అమావాస్యనాఁటివఱకుఁ దగ్గింపవలయును.) ఇట్లుచేయుట చాంద్రాయణవ్రత మనఁబడును.

దీనివలనఁ దనయెంగిలికూడుఁ దాను దినరాదని యేర్పడుచుండ నితరుల నోటి జొల్లుతోడికూడు తినుట నిషిద్ధకార్య మని వేఱుగఁ జెప్పవలయునా?

శ్లో॥ ఏకపంక్తిషు భుంజానా, ఉచ్ఛిష్టం స్పృశతో యది।
ద్వావిప్రౌ విసృజేదన్నం, భుక్త్వా చాంద్రాయణం చరేత్॥
ఆచారసంగ్రహము.

ఏకపంక్త్యుపవిష్టానాం, విప్రాణాం సహభోజనే।
యద్యేకోపి త్యజేత్పాత్రం, శేషమన్నం నభోజయేత్।
మోహాద్భుంజీతచే ద్విప్రః, పంక్త్యా ముచ్ఛిష్టభోజనమ్।
ప్రాయశ్చిత్తం చరేద్విప్రః, కృచ్ఛ్రం సాంతపనం స్మృతమ్॥పరాశరము.

ఒకపంక్తిలో భోజనముచేయుటకుఁ గూర్చుండినవారిలో నొకఁ డాకువిడిచి లేచిపోయెనేని తక్కినవారు తమయాకులలోని మిగిలినయన్నము తినరాదు. మోహముచే బ్రాహ్మణుఁ డాయుచ్ఛిష్టమును దినెనేని కృచ్ఛ్రముగాని సాంతపనముగాని ప్రాయశ్చిత్తము పెట్టుకొనవలయును. ఇది బ్రాహ్మణులకు నన్వయించును. ఇతరులును దీనిని బాటించినఁ బాటింపవచ్చును.

శ్లో॥ భార్యాభృతకశిష్యేభ్యః ఉచ్ఛిష్టం శేషయేద్బుధః।
భోజనంతు ననిశ్శేషం కుర్యాత్ప్రాజ్ఞః కదాచన॥

వంటచేసినదానిలో భార్యకు పోష్యులకు శిష్యులకు మిగులునట్లు బుద్ధిమంతుఁడు తినవలయును. వీరికి మిగులకుండునట్లు చేసినదంతయుఁ దానే తినరాదు.

ఇది పాత్రలందు మిగిలిన శేషముగుఱించియే కాని యాకులో మిగిలిన యన్నముగుఱించి కాదు.

తనయెంగిలియే తనకుఁ బనికిరాదని శాస్త్రము మొఱలుపెట్టుచుండ, నారోగ్యశాస్త్రము నిషేధించుచుండ, కన్నకసుమాలపు నీచజాతివానియెంగిలి కమ్మ, కాఁపు, కమసాలులు, (బ్రాహ్మణులుకూడ) తినుట దోషమని వేఱె చెప్పవలయునా? ఈదోష మన్నవిషయమాత్రమే కాదు. త్రాగెడినీటికి నన్వయించును.

శ్లో॥ నహస్తేన పిబేత్తోయం, నపిబన్ శయనం చరేత్।
పీత్వావశిష్టం చషకే, పునస్తన్నపిబే జ్జలమ్॥

భోజనకాలమందును, గుడిచేతితో నీళ్లుత్రాగుటకు సాధ్యపడనిసమయంబులందుఁ దప్ప నెడమచేతితో నీళ్లుత్రాగరాదు. నీళ్లుత్రాగి పండుకొనరాదు. త్రాగఁగాఁ బాత్రయందు మిగిలిన నీటిని మరలఁ ద్రాగరాదు. అనఁగా జలపాత్రము నోటఁగఱచుకొని యెంగిలిచేసి త్రాగరాదు. పాత్రలోనినీళ్లు కొంతత్రావి తక్కిన నీళ్లు పాత్రమునం దట్టేయుంచి మఱియొకసారి దానిని ద్రావరాదు. పాత్రమునందు నీరుమిగులకుండునట్లు ద్రావవలయును. పాత్ర చేతనుండఁగానే గుటకలుగాఁ ద్రాగవచ్చునుగాని క్రిందనుంచిన తరువాత మరల దానినెత్తి త్రాగరాదు. ఈ విషయమింకను సదాచారపద్ధతి వ్రాయునపుడు విపులముగ వ్రాయఁబడును.

ఉచ్ఛిష్టమనఁగా ననుభవింపఁగా మిగిలిన దని చెప్పుట యేల? ఒకరు ముడిఁచితీసినపూలు మూచూచినపూలు మఱియొకరు ధరింపరాదు.

ఒకరు కట్టివిడిచినవస్త్రముగాని యుపయోగించినవస్త్రముగాని యితరు లుపయోగింపరాదు. కట్టరాదు. ఒకనిశయ్యా పాదుకలు మఱియొకఁ డుపయోగింపరాదు.

ఒకఁడుస్నానముచేయఁగా మిగిలిననీళ్లు మఱియొకఁడు స్నానమాడరాదు.

ఒకఁడు పీల్చివిడిచినగాలి మఱియొకఁడు పీల్వరాదు. ఒకఁడనుభవించిన స్త్రీని మఱియొకఁడనుభవింపరాదు. ఇది యుచ్ఛిష్టలక్షణము. ఇఁక శబరి శ్రీరామునకు నెట్టిఫలము లిచ్చెనో చూతము.

ఉచ్ఛిష్ట (ఎంగిలి) మనఁగా నెట్టిదై నదియు నెట్టిది యెవరికి గ్రాహ్యమయినదియు నెట్టిది యెవరిది త్యాజ్యమయినదియుఁ బూర్వసంచికయందు వ్రాయఁబడెను. ఇప్పుడు కొందఱు నీచజాతిగురువులు తమనోటియెంగిలి శిష్యులకు గురూచ్ఛిష్టమని పెట్టి వారిని కులభ్రష్టులను జేయుచున్నారు. అంతియకాదు. వైద్యశాస్త్రప్రకారముగను, అనుభవమువలనను, ఒకనియెంగిలి మఱియొకఁడు తినెనేని వాని రోగములన్నియు నీతినినవానికి లభించును. ఇందు సందేహములేదు. మోక్షమునకు ననిపోయిన మొసలియెత్తుకొనిపోయి నట్లగును. కావున నీమోసగురువులు తమ్మునమ్మి బాగుపడఁదలఁచిన శిష్యులను నుభయలోకభ్రష్టులఁ జేయుచున్నారు.

ఎవరైన నాక్షేపించిన శబరి శ్రీరాముని కెంగిలిపండులు పెట్టలేదా యని బదులుచెప్పుచున్నారు. ఈయుపమానము వీరుచెప్పుటచేతనే వీరియవివేకము జ్ఞానహీనత బయలుపడుచున్నది. ఎట్లనఁ—

నీచపుగురువులుకదా శిష్యురాండ్రకు నోటియెంగిలి పెట్టుచున్నారు? శబరి కదా శ్రీరామునకు నెంగిలిపండ్లుపెట్టినది? శబరి శ్రీరామునకు గుర్వా? కాదేని వీరియుపమాన మెట్లుసార్థకము? శబరి వీరియుపమానప్రకారము శిష్యురాండ్ర నోటియెంగిలి గురువులుకదా తినవలయును? అందఱ శిష్యులశిష్యురాండ్ర నోటియెంగిళ్లు దొంగగురువులు తినుచున్నారా? శబరి శ్రీరామునకుఁ దానుగొఱికి నమలిన ఫలములా పెట్టెను? శ్రీమద్రామాయణమునఁ దియ్యని యడవిపండ్లు తెచ్చి పెట్టెనని యున్నది. అన్నియేండ్లుగా గురువులకు నడవిఫలములఁ దెచ్చియిచ్చుచున్న శబరికి నేచెట్టుపండ్లు తియ్యనివో తెలియకుండునా? కొఱికి తిని రుచిచూడవలసిన పనియేమి?

చిత్రకూటమందు రాముఁడుండఁగానే శబరి కామెగురువు లావిషయముఁ దెలిపి శ్రీరాముని నీవు పూజించి కడతేఱు మనిచెప్పిరి. సగుణరూపముగనో భగవత్సాక్షాత్కారములేక ముక్తిలేదు. శబరిగురువులు తమయోగదృష్టిచే శ్రీరాము దర్శించి తరించిరి. శబరి కంతటిశక్తిలేదు. కాని భగవత్కటాక్షమునకుఁ దద్దర్శనమునకు యోగ్యురాలుకావున వారామె కట్లుబోధించిరి.

చిత్రకూటమునువిడిచిన పదునాలుగవసంవత్సరమందు శ్రీరాముఁడు పంప చేరెను. అప్పటినుండి ఫలములెత్తియుంచినఁ గుళ్లక చెడక యుండునా? శ్రీరామలక్ష్మణులు పంపాతీరమును జేరవచ్చువార్త గురువాక్యములనలన శబరికి ముందుగాఁ దెలియును. ఏదినమువచ్చునదియును వారు ముందేచెప్పియు నుందురు. అట్లు తెలియదేని ముందుగా ఫలములెత్తి దాఁప సాధ్యపడియుండదు. ఇట్లు దాఁచిన ఫలములను శబరి ముందుగాఁ గొఱికి కొంత తినియుండెనా యని చెడియే యుండును. కావునఁ గొఱికితినిన యెంగిలిపండ్లు రామలక్ష్మణులకుఁ దిన శబరి యిచ్చెననుట యసంగతము. అన్నిసంవత్సరములు గురుశుశ్రూషచేసి శబరినేర్చికొనిన యాచారమిదియా? గురుభక్తికలదిగదా! శబరి గురువుల కిట్లే యెంగిలిపండ్లిచ్చుచుండెనా? ఇట్టులామె యశాస్త్రీయమై లోకగర్హితమై పాపావహమైన కార్యమును జేయుచుండెనని బుద్ధిగలవాఁడు నమ్మునా? కావున శబరి తానుగొఱికి తినిన యెంగిలిపండ్లు రామలక్ష్మణులకు నిచ్చెననుట సర్వథాదుష్టము. అటయినచో

శ్లో॥ ప్రత్యుద్గమ్య ప్రణమ్యాథ నివేశ్య కుశవిష్టరే
పాదప్రక్షాళనం కృత్వా, తత్తోయం పాపనాశనమ్
శిరసా ధార్య పీత్వాచ, వన్యైః పుష్పైరథార్చయేత్
ఫలాని సుపక్వాని మూలాని మధురాణిచ

స్వయమాసాద్య మాధుర్యం, పరీక్ష్య పరిభక్ష్యచ
పశ్చాన్నివేదయామాస, రాఘవాభ్యాం దృఢవ్రతా
ఫలాన్యాస్వాద్య కాకుత్స్థ, స్తస్యై ముక్తిం పరాం దదే

అని పాద్మపురాణంబున నున్నట్లు కొందఱు వ్రాసియున్నారుకదా! ఇందు శబరి ఫలములను దెచ్చి తీపు పరీక్షించి భక్షించి యావల రామలక్ష్మణుల కిచ్చెనని యున్నది గదా యందురేమో? పై పాఠమెందుండి గ్రహింపఁబడినదో నాకుఁదెలియదుగాని ముద్రితములైన పాద్మపురాణములం దావాక్యములు లేవు.

శ్లో॥ ప్రత్యుద్గమ్య ప్రణమ్యాథ నివేశ్య కుశవిష్టరే
పాదప్రక్షాళనం కృత్వా వన్యైః పుష్పైస్సుగంధిభిః
అర్చయామాసభక్త్యావై హర్షనిర్భరచేతసా
ఫలానిచ సుపక్వాని, మూలాని మధురాణిచ
నివేదయామాసతదా, రాఘవాభ్యాం దృఢవ్రతా
ఫలాన్యాస్వాద్యకాకుత్స్థ స్తస్యై ముక్తిం దదేఽపరామ్

అనియే యున్నది. అనఁగా—

శబరి శ్రీరామలక్ష్మణుల కెదురుగాఁ బోయి నమస్కరించి దర్భాసనమునఁ గూర్చుండఁబెట్టి పాదములు కడిగి మంచివాసనగల యడవిపూలచే పూజించి భక్తిచే సంతోషముచే నిండినమనస్సుగలదై మాగినపండ్లను తియ్యనిమూలములను దృఢవ్రతయగు శబరి రామలక్ష్మణులకు నివేదించెను. శ్రీరాముఁ డాఫలముల నారగించి యామెకు శ్రేష్ఠమైనముక్తి నొసఁగెను.

ఇందుముందుఁగాఁ దిని యాఫలములను శ్రీరామలక్ష్మణుల కిచ్చినమాటయే లేదు.

పాఠాంతరమందున్నదిగదా యందురా? అందు "భక్షించి" యనియున్నది కాని "కొఱికితిని" యనిలేదు. కావున భక్షించియనుటకు మనము దోసపండ్లను టాకావేసి కొంచెము గిల్లి నోరవేసికొన్నట్టు లెంచవలయునేకాని యితరముకాదు. శబరి శ్రీరాముని భగవంతుఁడని భక్తిచేఁగలిగినసంతోషాతిశయముచే మైమఱచినదై పూజించెనుగాని మనుష్యుఁ డనుదృష్టిచేఁగాదు. ఇది నిస్సందేహము. భక్త్యతిశయముచే స్త్రీలు దేహము మఱచుట యీకాలమందును బ్రత్యక్షముగఁ గానఁబడుచుండుట యనుభవైకవేద్యము. ఇట్టి భక్తిపరవశలయిన స్త్రీలు కార్యములు తాఱుమాఱుచేయుటయుఁ గలదు. భక్తిలక్షణము భావోల్బణము విధము నెఱిఁగిన భాగవతులు దానిని దోషముగ గ్రహింపరు; మఱి యనుగ్రహింతురు.

కృష్ణుఁడు విదురునింటికి విందునకై పోయినపు డాయనభార్య 'కృష్ణా! భోజనమునకుఁ బ్రొద్దుపోవును. ఆఁకలి తాళఁజాలవు. ఫలాహారముఁ బెట్టెదర'మ్మని యెదురుగఁ గూర్చుండఁ బెట్టుకొని సంతోషాతిశయముచే మైమఱచి యరఁటిపండు

లొలిచి చెక్కను కృష్ణునిచేతిలోనుంచి పండు పాఱవైచెను. ఇట్లు కొన్నిపండు లిచ్చినతరువాత దేహస్మృతిగలవాఁడై చూడఁ బండ్లు పడియున్నవి. చెక్కలు కానరాలేదు. కృష్ణుఁడాచెక్కలే నమలుచుఁ దినుచుండెను. అప్పుడాయిల్లాలు మిగులఁ బరితపించి యెంతటిపాపిని నని యావల మఱియొకపండొలిచి చెక్కపాఱవేసి పండు కృష్ణునిచేతిలో నుంచెను. కృష్ణుఁడు దానిని నోరనుంచుకొని యబ్బబ్బా, యిది బాగుగలేదు నాఁ కాచెక్కే యిమ్మనెనఁట.

దీనివలన గ్రహింపవలసినదేమి? భక్తి ప్రధానముగాని వస్తువుగాదు. పూతన విషము, కాఱుచిచ్చు, యశోదచనుఁబాలు, గొల్లెతల పాలుపెరుఁగు సమానముగ నారగించువానికి భగవంతునకు విధినిషేధములుగలవా? గుణాతీతుఁడైన మనుష్యునకే విధినిషేధములు లేవే? భగవంతున కెందుండి వచ్చెను? అంతటిభక్తి గలిగినదనుట చేతనేకదా శబరికి వెంటనే ముక్తి లభించెను.

ఈనాఁటి నీచగురువులు తమనోటియెంగిలి శిష్యురాండ్రకుఁ బెట్టుట ప్రేమచేతనా? కామముచేతనా? మోహాసక్తిచేతనా? స్త్రీమోహాసక్తిచేతనా? ఏమని వీరు తమదుష్టచరిత్రమునకుఁ బ్రమాణముగాఁ బరమభాగవతురాలు దృఢవ్రత మహాతపస్విని యోగసిద్ధయగు శబరిచరిత్రమును దృష్టాంతముగాఁ జెప్పెదరు. వినెడివారు పశువులు. తామేమి చెప్పినను వారు చెవులువ్రేలవైచి విందురుగదా! అనియేకదా యిట్టికుచేష్టలుచేయుట.

(1) తక్కువకులమువా రెక్కువకులమువారికి మహామంత్రోపదేశము చేయుట (2) ఎవరైననెట్టివారికైనఁ దమనోటియెంగిలిపెట్టుట, యీరెండును దుష్టకార్యము లనియే సంజీవనియభిప్రాయము. అయినను సంజీవని సర్వజ్ఞత్వము నభినయింపదు కావున నదిపొరపడియుండవచ్చును. కావున సత్యముస్థిరపడుటకై యది పైరెండు విషయములు శాస్త్రీయములని శ్రుతిస్మృతీతిహాసవాక్యములు ప్రమాణములుగ ననువదించుచు, సిద్ధాంతముచేసి పైరెండుకార్యములు చేయుచుండు గురునామధారులు వ్రాసిరేని యావ్యాసమును సంజీవని ప్రకటించును. అట్లు సిద్ధాంతముచేయఁజాలరేని యాగురువులు చేయుకార్యము మహాపాపకార్యమని లోక మెఱుంగఁగలదు.

## గురులక్షణము.

మీఁదవివరించిన లక్షణములుగల శిష్యునకు గురువెట్టివాఁడై యుండవలయును?

శ్లో. సిద్ధం, సత్సంప్రదాయేస్థిరధియ, మనఘం, శ్రో
త్రియం, బ్రహ్మనిష్ఠం, సత్త్వస్థం, సత్యవాచం,
సమయనియతయా సాధువృత్త్యా సమేతమ్,
డంభాసూయాదిముక్తం, జితవిషయగణం,

దీర్ఘబంధుం, దయాళుం, స్ఖాలిత్యేశాసితారం
స్వపరహితపరం, దేశికంభూష్ణురీప్సేత్.

సిద్ధం = మంత్రసిద్ధుఁడుగానైనను, యోగసిద్ధుఁడుగానైన నుండవలయును.

సత్సంప్రదాయేస్థిరధియం = శాస్త్రసమ్మతమై, పూర్వాచార్యులచే నను ష్ఠింపఁబడినదై యుండు సంప్రదాయంబున స్థిరమయినమనస్సుగలవాఁడై యుండ వలయును. దురాచారములు దుష్టసంప్రదాయములు గలవాఁడు గురువుగానుండ యోగ్యుఁడు కాఁడు.

శ్రోత్రియం = వేదములునేర్చి పెద్దలవలన వినికిడి కలిగినవాఁడుగా నుండ వలయును.

బ్రహ్మనిష్ఠం = బ్రహ్మవిచారమందు విశేషముగ మనసునిలిపి దానియందే విశేషకాలము గడపువాఁడు.

సత్త్వస్థం = సత్త్వగుణమును విడువక దానియందే స్థిరముగనుండు వాఁడు.

సత్యవాచం = సత్యముచెప్పువాఁడుగా నుండవలయును. శాస్త్రమునం దున్నదున్నట్టు చెప్పిన శిష్యులు మనస్సునొచ్చుకొని తొలఁగిపోదురేమో? దాని వలన లాభముతగ్గునేయని యిచ్చకములు చెప్పువాఁడుగా నుండరాదు.

సమయనియతయా = శాస్త్రమువిధించిన కట్టుపాటు లందలి నియతిచేతను.

సాధువృత్త్యా = సాధువర్తనముచేతను.

సమేతం = కూడినవాఁడుగా నుండవలయును.

దంభాసూయాదిముక్తం = మోసబుద్ధి, ప్రతిష్ఠయందుఁ గాంక్ష. మనకుఁ దెలిసినదంతయు నేర్చిన శిష్యుఁడు మనలమించినవాఁ డగునేమో యనుతలంపు లోనైనవి లేనివాఁడుగ నుండవలెను.

ఆదిశబ్దముచే దుష్కామక్రోధలోభాదులు లేనివాఁడని గ్రహింపఁవలయును.

జితవిషయగణం = విషయసమూహములను జయించినవాఁడుగా నుండ వలెను. విషయము లీడ్చినట్టు పోవుమనస్సుగలవాఁడుగా నుండరాదు.

దీర్ఘబంధుం = యావజ్జీవము నెనరుగల చుట్టమువలెఁ బ్రేమగలవాఁడయి యుండవలయును.

దయాళుం = దయగలవాఁడుగా నుండవలయును.

స్ఖాలిత్యేశాసితారం = శిష్యునినడవడియందు దోషముగలిగెనేని వానిని దండించియైనఁ జక్కఁదిద్దువాఁడుగా నుండవలెను.

స్వపరహితపరం = తనమేలు, ఇతరులమేలు కోరువాఁడు పరులనిమిత్తమై తానుజెడరాదు. తననిమిత్తమై పరులను జెఱుపరాదు.

ఉపదేశముచేయరానిదాని నుపదేశించినను ఉపదేశము చేయరాని వాని కుపదేశించినను గురువుచెడును.

స్వశ్రేయస్కాముఁడగు శిష్యుఁ డిట్టి గుణముగలవానిని గురువుగా గ్రహింపవలయును.

మీఁద దీర్ఘబంధువై గురువుండవలయునని చెప్పఁబడెను. దీర్ఘబంధువగు గురు వెట్టివాఁడన—

### దీర్ఘబంధువగు గురువు లక్షణము

గురు రపి శిష్య మౌరసవ త్పశ్య న్నుపాధిం వినా విద్యా
గ్రాహయ న్ స్వదేహయాత్రా నపేక్ష మేత దుజ్జీవన
పరో యథాగ్రహణ మాపనిషదీం విద్యాం మాతృ
వత్స్వయమే వాస్య రక్షణే ప్రవృత్తో ధర్మా న్ పూర్వా
చార్య పరిగృహీతా న్ చిన్వ, న్నతి దుష్కరే కర్మ ణ్య
నియోజయ న్, అర్థలోభే నాగర్హయ న్, అంతరాంత
రానధ్యయనవిఘ్నం దాస్యేషు నియుంజానః స్ఖలనే
భర్త్సయ న్ స్ఖలనం పరేభ్యః ప్రకాశయ న్, అస్ఖలనే
ఉపలాలయ న్, మనసిప్రియమాణే విద్యమానస్య
గుణస్యాభినందయ న్, అవిద్యమానస్య శిక్షయ న్,
అనుగృహ్ణ న్, మార్గాత్పతంతం వారయ న్, అతిక్ర
మగతం భగవత్ప్రపత్త్యాదిభి రుద్ధర న్, అశక్యవార
ణేపి స్వకృపయా సముద్ధర న్, ఏవ మస్యద్యథా
శాస్త్రమాచర న్ దీర్ఘబంధుర్భవేత్.

అర్థము: గురువు తనశిష్యుని దనకడుపునఁబుట్టిన బిడ్డవలెఁ జూచుచుఁ బ్రతిఫలమేదియుఁగోరక విద్యగ్రహింపఁజేయుచుఁ, దనదేహయాత్రకూడ నపేక్షించిన శిష్యుని నుజ్జీవింపఁజేయుటయం దాసక్తిగలవాఁడై వాఁడు గ్రహింపఁ గలిగినంత యుపనిషద్విద్యను నేర్పుచుఁ దల్లివలెఁ దానే యతనిరక్షణమునకుఁ జేయవలసినపనులు చేయుచుఁ బూర్వాచార్యు లనుష్ఠించిన ధర్మములను దెలుపుచు మిక్కిలి కష్టమైన పనులుచెప్పక ధనలోభముచే నిందింపక, యతఁడెంతయిచ్చునో యంతతోనే తృప్తిపడుచు నతఁడు సమర్పించినదానియందు భేదబుద్ధివదలి వాని యభ్యాసమునకు విఘ్నము కలుగకుండునట్లు విరామకాలములందుఁ బనులు చెప్పుచు నేదైనలోపముచేసెనా బెదరించుచు ఆలోపములను నితరులకుఁ జెప్పక దానిని మనస్సున నుంచుకొనక, స్ఖలనములేక యభ్యసించు శిష్యుని లాలించుచుఁ దనమనస్సుననుఁ బ్రియమైనకార్యములను జేసినయెడలఁ దనకుఁ దెలియవచ్చిన

వానిని మెచ్చుకొనుచుఁ దెలియనివి నేర్పుచు ననుగ్రహించుచు సరియైన త్రోవ నుండి పడిపోకుండ నివారించుచు శిష్యునికి మిక్కిలి కష్టము ప్రాప్తించినపుడు భగవత్ప్రపత్తిచేయించి యుద్ధరించుచు వారించుటకు నశక్యమైనవానివిషయమునఁ దానే కృపచే నుద్ధరించుచు నీవిధమున శాస్త్రప్రకార మితరకార్యములను జేయు గురువు దీర్ఘబంధువనఁబడును.

ఇది యంతేవాసియగు శిష్యునియందు నన్వయించునుగాని భిన్నదేశముల నందు వారిపట్లఁ బూర్ణముగ నన్వయింపదు.

బుభుక్షువై స్వైరుఁడగు శంబుకునకు, ముముక్షువై శాస్త్రబద్ధయగు శబరికిఁ గల తారతమ్యమెఱిఁగి వారివిషయమున నజ్ఞలోకము దురభిప్రాయములు మానునుగాక!

—౭౫-వ సర్గము. రామలక్ష్మణులు పంపాతీరంబుఁ జేరుట.—

క. ఆసతి యీగతిఁ బరగతి, డాసిన నేకాగ్రచిత్తుఁ ♦ దమ్ముని హితునిన్
వాసవనిభుఁ డగురాముఁడు, మాసరముదమునను బల్కె ♦ మౌనివిషయమై.

పరగతి = పరమపదము, ఏకాగ్రచిత్తున్ = గురుశుశ్రూషమహిమయేమని చెప్పుదును, క్రూరాత్మకమైన బోయకులమునందుఁబుట్టియు, నాఁడుదియయ్యు గురుశుశ్రూషామహిమచే నింత యుత్తమయోగ్యత సంపాదించెఁగదా! నే నిట్టులే నా గురువగు శ్రీరామచంద్రమూర్తికి శుశ్రూషచేసితినేని నాకు నిట్టి యోగ్యతగలుగునుగదా, యని యీ విషయమందే మనస్సునిలిపి యాలోచించుచున్నవానిని, మాసరముదము = అధిక సంతోషము. ఇది యస్థానసంతోషముకాదు. పుణ్యాత్మురాలిదర్శనము లభించెను. ఇఁక నిదిమొదలు మనకష్టములు నశించును. కార్యము జయమగును. మహాత్ములదర్శనము శుభము గలిగించునుగాని వ్యర్థముపోదు అని సంతోషము.

తా. ఆమె యీవిధముగఁ 'దద్విష్ణోః పరమంపద'మ్మన్నట్లు పరమపదము నకుఁబోఁగా నేకాగ్రమనస్కుఁడయి తనమేలుకోరు లక్ష్మణుని జూచి యింద్రునితో సమానుఁడగు రామచంద్రమూర్తి యధికసంతోషముతో మతంగమునివిషయమై యిట్లు చెప్పెను.

శా. ఏమీ వారలసత్ప్రభావము! ల వెం♦తే నక్కజం బయ్యెడిన్
సౌమిత్రీ! మృగముల్ పులుల్ చనవు హె♦చ్చన్ నమ్మికం గ్రుమ్మరెన్
నేమం బారఁగఁ బైత్రతర్పణము మౌ♦నిశ్రేష్ఠసంస్పృష్టత
త్సాముద్రాంబులఁ దీర్చినారము శుభో♦దర్కంబుగా నీయెడన్. ౧-౨౬

అవి+ఎంతేన్ = ఆప్రభావములు మిక్కిలి, అక్కజంబు = ఆశ్చర్యము, పైత్రతర్పణము = తీర్థములకుఁబోయినపుడు పితృతర్పణము చేయవలయును.

ఇచ్చట సముద్రతీర్థములు లభించుటచే పితృతర్పణముచేయఁబడెను. మహాని శ్రేష్ఠ = మునులందు శ్రేష్ఠుఁడైన మతంగునిచే, సంసృష్ట = సృజింపఁబడిన, తత్సాముద్రాంబులన్ = ఆసముద్రసంబంధ జలములచే, శుభోదర్కముగా = ముందుశుభము గలుగునట్లు.

తా. ఆహా! ఏమి యాఋషుల మహామహిమ! అవి చూడఁజూడ మిక్కిలి యాశ్చర్యమగుచున్నది. లక్ష్మణా! ఇచ్చట జింకలు, పులులు మచ్చికచేత సహజ విరోధముమాని సమ్మికతోఁ దిరుగుచున్నవి. మునీశ్వరులున్నప్పుడేగాక వారు పోయిన తరువాతఁగూడ వారితేజస్సు వ్యాపించియుండుటచే హింసయనునది కనరాకయున్నది. మునీశ్వరుఁడు సృష్టించిన సముద్రజలములతో పితృతర్పణము చేసితిమి. ఇఁక మనకు మేలగును.

ఉ. హావడి దీఱె, సౌఖ్య మిఁక ♦ నబ్బెడుఁ, జిత్తము తుష్టి చెందె, సు
గ్రీవుఁడు సంచరించెడి గి♦రిం గడుదూరము లేదు, పంపకై
పోవలదా యిఁకన్ మనము ♦ పొల్పుఁ గదా యట ఋష్యమూక మన్
గ్రావము, సూర్యపుత్త్రుఁ డటఁ ♦ గ్రాలుఁ గపీంద్ర చతుష్కయుక్తుఁ డై. ౧౨౭౭

హావడి = ఉపద్రవము, కష్టకాలము, తీఱెన్ = నశించెను.

తా. లక్ష్మణా! మనకష్టకాలము నశించెను. ఇఁక సౌఖ్యమే కలుగును. మనస్సుకూడ వ్యసనముదొలఁగి సంతోషముతోఁగూడియున్నది. ఇక్కడికి సుగ్రీవుఁడుండు పర్వతము సమీపమే. మిగుల దూరముగాదు. ఇఁక మనము పంపకై పోదము. అచ్చటఁగదా సుగ్రీవుఁడు నలువురు వానరులతోనుండు ఋశ్యమూకమున్నది.

ఉ. పోదము లెమ్ము పద్మహిత♦పుత్త్రునిఁ గానఁగ వేగ, వానిచేఁ
గాదె ధరాతనూజ వెద♦కం దగుకార్యము తీరు, నన్న సీ
తాదయితున్ వచించు విను త♦ద్విషయంబునయంద నామనం
బాదటఁ దీవరించెఁ బద♦మా యనివారలు చేరి పంపనున్. ౧౨౭౮

పద్మహితపుత్త్రునిన్ = సూర్యునికొడుకును, తీరున్ = చక్కఁబడును, ఆదటన్ = ప్రేమచే.

తా. మనము సుగ్రీవుని జూచుటకుఁ బోదము లెమ్ము. సీతనువెదకుకార్యము వాఁడుగదా చేయవలసియున్నది. అని చెప్పఁగా లక్ష్మణుఁడును 'నే నా విషయమే యాలోచించున్నాను. ఇక్కడ జాగుసేయకపోదమని తొందరపడుచున్నాను'. అని వారలు పంపాతీరముఁ జేరి.

సీ. నానాలతాకీర్ణ♦నవ్యభూరుహపూర్ణ,పానీయవాహినీ♦భవ్య మగుచు
నిష్యందమకరంద♦నీరంధ్రదరవింద,కహ్లారవితతి ర♦క్తంబు నగుచుఁ

బుండరీకవితాన♦పురుకైరవాదీన, లలితరోచులచే వ♦ళక్ష మగుచు
నవగణనాతీత♦కువలయసంజాత, నిబిడకాంతులచేత ♦ నీల మగుచుఁ

తే. గుథముఁబోలిన యాపంప♦కొలఁకుఁ గాంచి
నియమసముదారజనసమ♦న్వీత మైన
దానిమహిమకు మిగులఁ జో♦ద్యంబు నొంది
కనులపండువుగా దానిఁ ♦ గనుచు నరిగి.    ౧౨౯

నానా...భవ్యము = పెక్కుతీఁగలల్లుకొనిన యనేక వృక్షములచేత నిండి నదియయి, పానీయవాహినీ భవ్యము = త్రాగుటకు యోగ్యమైన జలముచే శుభమైనది, నిష్యంద = స్రవించుచున్న, మకరంద = తేనెచే, నీరంధ్రత్ = ఎడములేనిదగు, అరవింద = ఎఱ్ఱకమలములయు. కహ్లార = ఎఱ్ఱకలువలయు, సంస్కృతమున కహ్లార మనియే రూపము. దీనికిఁ బ్రాకృతరూపము కల్హారము. ఇక్కడ సంస్కృతసమాసమున నుండుటచేఁ గహ్లారమనియే పఠింపనగు.—హ్లో ల్హః॥ హ్లాకారస్య లాక్రాంత హకారస్స్యాత్। అత్ర ప్రాయోలుగితి దలోపః – కహ్లారపరః,–కహ్లారపరః॥ ఇట్టిదే ప్రహ్లాదశబ్దము-సంస్కృతమున హ్లా, ప్రాకృతమున ల్హాయగు. షడ్భాషాచంద్రిక ౧-౪-౬౬. వితతిః = సమూహముచే, రక్తంబయి = ఎఱ్ఱనికాంతిగలది, పుండరీక వితాన = తెల్లతామరల సమూహముయొక్కయు, పురు = గొప్పవగు, కైరవ = తెల్లకలువలయు, అదీన = విస్తారమగు, లలిత = మనోహరమైన, రోచులచేః = కాంతులచే, వళక్షము = తెల్లన, నవ = క్రొత్తవగు, గణనాతీత = లెక్కకు మించిన, కువలయ = నల్లకలువలచే, సంజాత = పుట్టిన, నిబిడ = దట్టమైన, కాంతులచే నీలమగుచు = నల్లనై, కుథముః = తివాసిని, నియమ = వ్రతములచే, సముదార = గొప్పవారగు, జన = ఋషులచే, సమన్వీతము = కూడినది.

తా. అనేకవిధములైన తీఁగలచే నల్లుకొనఁబడి యందమైన చెట్లు తీరమునందు గలదై త్రావుట కుపయోగించు మంచినీళ్లుగలదియు, తేనెచేనిండిన యెఱ్ఱనికమలములచేతను ఎఱ్ఱనికలువలచేతను నెఱ్ఱనై, తెల్లదామరలచేతను దెల్లకలువల చేతను తెల్లనై, లెక్కకు మిక్కుటమైన నల్లకలువలచేఁ దట్టమగుకాంతులచే నీలమై, నానావర్ణములుగల తివాసివలెనుండు పంపాసరోవరముఁజూచి వ్రతనిష్ఠ గలమునులతోఁ గూడిన దానిమహిమకు నాశ్చర్యపడి నేత్రానందముగా దానిని జూచుచుఁబోయి.

తే. దానికిని నాతిదూరాన ♦ మాననీయ, మగుమతంగసరసమున ♦ నాథరాధి
పతికుమారులుదోఁగి త♦త్ప్రాంతరమ్య,వనములను తిలకించుచుఁ♦జనుచునుండ,

నాతిదూరానక్ = కొంచెముదూరమున, మానసీయ = గౌరవింపఁదగినది, మతంగసరసమున = మతంగుని సరోవరమునందు, తోఁగి = మునిఁగి, తత్ = దానికి, ప్రాంత = సమీపమునసుండు, రమ్య = మనోహరములగు, తిలకించుచుక్ = చూచుచు.

తా. దానికిఁ గొంచెముదూరమునందు గౌరవయోగ్యమైన మతంగుకొలనియందు స్నానముచేసి యారాజకుమారులు ఆసమీపమునసున్న యందములైన వనములను జూచుచు పోవుచుండఁగా.

తే. లలితలతికావిరాజిత♦తిలకబీజ, పూరకకరవీరకుందభాం♦డీరసప్త
పర్ణకేతకనిచుళామ్ర♦వణవిభాసి,త మయి భూషితప్రమద నాఁ♦ దనరుదాని.

లలిత+లతికా+విరాజిత = అందములైన తీఁగలచేఁ బ్రకాశించు, తిలక = బొట్టుగుచెట్లు, బీజపూరక = మాదిఫలముచెట్లు, కరవీర = గన్నేరుచెట్లు, కుంద = మొల్లతీఁగలు, భాండీర = మఱ్ఱిచెట్లు, సప్తపర్ణ = ఏడాకులయరఁటిచెట్లు, కేతక = మొగలిచెట్లు, నిచుళ = ఎఱ్ఱగన్నేరు, ఆమ్రవణ = (ఆమ్ర+వన) మామిడితోఁపు వీనిచే, విభాసితమై = ప్రకాశించునదియై, భూషితప్రమదనాక్ = అలంకరింపఁబడిన తరుణియోయన్నట్లు, తనరుదాని = ఒప్పుచున్నదానిని.

తా. అందములైన తీఁగలచేఁ బ్రకాశించు బొట్టుగుచెట్లు, మాదిఫలవృక్షములు, గన్నేరులు, మొల్లతీఁగలు, మఱ్ఱులు, ఏడాకులయరఁటులు, మొగలిచెట్లు, ఎఱ్ఱగన్నేరులు, మామిడితోఁపులు వీనిచేఁ బ్రకాశించుచు నలంకరింపఁబడిన పడుచువలె నుండుదానిని.

తే. కీరకోయష్టికార్జున♦హారిపక్షి, చయనినాదితవనమును♦ స్ఫటికశుద్ధ
వారి నిర్మలవాలుకఁ♦ బంప వెండి, జేరి తమ్మునకనియె శ్రీ♦ సీతనేత॥

కీర = చిలుకలు, కోయష్టిక = చీఁకుకొక్కెరలు, అర్జున = నెమిళ్లు అనెడి, హారి = మనోహరములయిన, పక్షిచయ = పక్షులసమూహముచే, నినాదిత = ధ్వనికలదిగాఁ జేయఁబడిన, వనమును = తోఁపును, ఎలమి = సంతోషముతో, రాగము = ప్రేమ.

వనము పైపద్యమున శృంగారవతియగు పడుచుగాఁ జెప్పుటచేఁ గంఠస్వరము దానికిఁ దగినట్లు చెప్పఁబడెను. శుభశకునమైన ముత్తైదువ దర్శనము సూచితము.

తా. చిలుకలు గ్రుడ్డికొంగలు నెమిళ్లు అను మనోహరములైన పక్షుల ధ్వనికల వనమును జూచుచు సంతోషముతోఁబోయి పంపఁజేరి రామచంద్రమూర్తి లక్ష్మణునితో నిట్లనియె.

క. ఈపంపాతీరంబున, నేపారెడుబుశ్యమూక♦పృథివీధర మం
దాపుణ్యుఁడు సుగ్రీవుం, డీపట్ల వసించుచుండు♦ నిష్టులతోడన్, ౧౨౩

పృథివీధరము = పర్వతము.

తా. ఈపంపయొడ్డుననుండు ఋశ్యమూకపర్వతమునందు అపుణ్యాత్ముఁడైన సుగ్రీవుఁ డిప్పుడు మిత్రులతో వసించుచుండును.

క. దీనుఁడ నై రాజ్యశ్రీ, హీనుఁడ నై సీతఁ బాసి ♦ యెటు మనవచ్చున్
గాన దివాకరతనయునిఁ, గానఁగ నీ వరుగ వయ్య ♦ కార్యము పొంటెన్.

దీనుఁడనై = దుఃఖతప్తుఁడనై, రాజ్యశ్రీహీనుఁడనై = రాజ్యలక్ష్మిలేనివాఁడనై, మనవచ్చున్ = బ్రదుకవచ్చును, దివాకరతనయునిన్ = సూర్యపుత్రుఁ డగుసుగ్రీవుని, కార్యముపొంటెన్ = మనపనికొఱకు.

తా. శోకతప్తుఁడనై రాజ్యము గోల్పోయి, భార్యనుబోఁగొట్టుకొని యెట్లు బ్రదుకనేర్తును? కావున మనకార్యమునిమిత్తమై సుగ్రీవునిఁ జూడ నీవుపొమ్ము. నేను బోవుట మర్యాదగాదు.

దుఃఖమువచ్చినను రాజ్యమైన నుండిన నది సహ్యముగనుండును. రాజ్యము పోయినను భార్యయైననుండిన ఆదుఃఖము తెలియకయుండును. అన్నిటిని పోఁగొట్టుకొని దుఃఖించుచు మనచేతిక్రిందివాఁడగు వానరునొద్దకు నేనేమని వత్తును? నీవే పోయి సంధి కుదుర్చుకొని రమ్ము.

క. అని లక్ష్మణసహితుం డై, యినకులచంద్రుఁడు విషాద♦భృశతాపితుఁ డై
తనయనుఁగుఁదమ్మునితోఁ బంపను దృష్టిమనోహరైక♦భాగముఁ జేరెన్.

తా. ఈప్రకారము లక్ష్మణునితోఁ జెప్పుచు రామచంద్రమూర్తి యధికదుఃఖముచేఁ దపించి (తనసామంతరాజునొద్దకుఁ దాను దీనుఁడై కార్యార్థియై పోవుట దుఃఖకరముగదా) తనచిన్నతమ్మునితో పంపాతీరమునఁ జూచుటకు నింపైన స్థలముఁ జేరెను.

మానిని. ఈవిధి దుఃఖకరంబులఁ గానల ♦ నెల్లను దాఁటి క్రమంబుగ వి
ఘ్నావళిఁ బాయఁగఁ జేయుచు దవ్వు ప్ర♦యాణము చేసి మనోజ్ఞకనా
నావిధపక్షిసమాకులఁ బంపను ♦ నవ్యజలాశయసత్తమ నా
భూవరనందనయుగ్మము గాంచి య♦పూర్వముదంబున నుల్లసిలెన్.

తా. ఈప్రకారము దుఃఖములకలిగించు నడవులనెల్ల వరుసగదాఁటి నడుమ నడుమవచ్చిన విఘ్నములనెల్లఁ దొలఁగించుకొనుచు దూరప్రయాణముచేసి మనోహరములై యనేకవిధములయిన పక్షులచేనిండిన యందమైన కొలఁకగు పంపను జేరి, యిన్నిదినములుగ నెఱుంగని సంతోషముచే రాజకుమారు లిరువురు ముఖవికాసమునొందినవారైరి.

అభ్రమండలమునుజొచ్చు జలజాప్తులీల మబ్బుమాటునకుఁబోయిన సూర్యుని

వలెనని చెప్పఁబడెను. ఇప్పుడా మబ్బు తొలఁగిపోయెను. సూర్యుఁడు యథాప్రకారము ప్రకాశింపఁబోవుచున్నాఁడు.

ఆరణ్యకాండాంతపద్యములు.

క. రామా! గుణధామా! రిపు, భీమా! సౌందర్యకామ! విశ్రుతతేజ
స్సోమా! శుభనామా! రుచి, సీమా! లసదొంటిమిట్టసీతారామా! ౧౭౭౮

రామచంద్రా! ఆశ్రితరక్షణాదికల్యాణగుణములకు స్థానమైనవాఁడా! దీనిచే ఋషులశరణాగతి నభయప్రదానము చెప్పఁబడెను. రిపుభీమా = శత్రువులకు భయంకరుఁడా! దీనిచే విరాధఖరాది రాక్షసవధ చెప్పఁబడెను. సౌందర్యకామా = అందమునందు మన్మథుఁడా! తరుణులు ప్రాప్తరూపులనిచెప్పిన శూర్పణఖావాక్యములు స్మరింపనగు. విశ్రుత = ప్రసిద్ధికెక్కిన, తేజస్ = తేజమునందు, సోమా = చంద్రుఁడా, శుభనామా = పాపములహరించి మేలునుగలిగించు నామముగలవాఁడా, రుచిసీమా = కాంతికిపొలిమేరయైనవాఁడా. అందఱుకాంతులు నీయనకాంతికి లోపడినవనిభావము. లసత్ = ప్రకాశించు. ఒంటిమిట్టయందలి సీతావిశిష్టుఁడైన శ్రీరామచంద్రమూర్తీ! పాహి పాహి పాహి!

చ. అయగతి వందనీయ దురవాప్తపదార్థరతైకచేతనో
చ్చయసువిదూర యింద్రియవశంగతదేహిభృశార్తిమోక్షణా
వ్యయదయ యాజవంజవనిబద్ధసదైకగతీ మహామతీ
జయజయ ధర్మభృద్వరప్రశస్తసమస్తగుణైకమందిరా. ౧౭౭౯

అయగతి = శుభకరమైననడకగలవాఁడా. ఈయన యరణ్యమునకు వచ్చుటకు వాస్తవకారణము ఋషులకు మేలుచేయనేకదా. వందనీయ = ఋషులనమస్కారమునకు యోగ్యుఁడైనవాఁడా, దురవాప్త = పొందఁదగని, పదార్థ = వస్తువులయందు, రత = ఆశగల, ఏకచేతన = ప్రధానముగాఁగల మనస్సుగలవారి, ఉచ్చయ = సమూహమునకు, సుదూర = మిగులదవ్వైనవాఁడా. సీతాదేవి ప్రాకృతమాయామృగముపై మనస్సునిచ్చుటచేఁగదా రామచంద్రమూర్తి యామెను వదలిపెట్టి దూరముపోయెను. ఇంద్రియవశంగత = వశంగతేంద్రియుఁడనిభావము. ఇంద్రియములను తనవశముచేసికొనిన దేహి = జీవుల = ఋషుల, భృశార్తి = విస్తారమైనదుఃఖమును, మోక్షణ = పోఁగొట్టుటయందు, అవ్యయదయ = క్షీణింపనిదయగలవాఁడా, ఆజవంజవ = సంసారమున, నిబద్ధ = బాగుగఁగట్టఁబడిన, సత్ = మంచి, ఏక = ఒకటేయగు, సదా=సర్వదశల-ఏక=ఒక్కటేయగు గతీ = యుపాయమైనవాఁడా. జటాయువునకుమోక్షము దీనిచేసూచితము. సంసారులకుమోక్షము కైంకర్యముచేఁదప్ప వేఱొకవిధముగ రాదనిభావము. మహామతీ = గొప్పమనస్సుగలవాఁడా, జయజయ = జయముకలుగునుగాక! జయ

ముకలుగునుగాక! ధర్మభృత్ + వర = (1) వింటిని పట్టెడువారిలో శ్రేష్ఠుఁడా, (2) ధర్మమునుధరించి రక్షించువారిలో శ్రేష్ఠుఁడా, ప్రశస్త = మిగులఁగొనియాడఁబడు, సమస్త = సకల, గుణ = వాత్సల్యసౌశీల్యౌదార్యదయాదిగుణములకు, ఏక = ఒకటియేయైన, మందిరా = వాసస్థానమైనవాఁడా.

మందాక్రాంత. ధీరా! యూర్ధ్వేశ శుచినముచి♦ ద్వేషిదిక్సాంఖ్యపద్యో
దారారణ్యప్రథితచరితో♦ ద్దామ వాత్సల్యసీమా
క్రూరారాతిక్రథనకలిత♦ క్రూరకోపా యపాపా
వారాశీడ్జాకమలమధుపా ♦ భక్తహృత్పద్మసద్మా. ౧౨౪౯

ధీరా = ధైర్యముగలవాఁడా, ఊర్ధ్వ = పదిదిక్కులలో నూర్ధ్వముతొమ్మిదవది. ఈశా = ఈశాన్యదిక్కు ఎనిమిదవది, శుచి = ఆగ్నేయము రెండవది, నముచిద్వేషి.దిక్ = ఇంద్రునిదిశ మొదటిది, ౯-౮-౨-౧ వీనిని తలక్రిందుగఁ జూచిన ౧౨౪౯ యగును. సాంఖ్య = సంఖ్యగల, పద్య=పద్యములచేఁ (అనఁగా నీకాండమందు ౧౨౪౯ పద్యములున్నవని యర్థము.) ఉదార = గొప్పదగు, అరణ్య = వనమునందు, ప్రథిత = ప్రసిద్ధికెక్కిన, చరిత = చరిత్రముచే, ఉద్దామ= గొప్పయైనవాఁడా, వాత్సల్య = కరుణకు, సీమా = ఎల్లయయినవాఁడా, క్రూరారాతి = క్రూరులైనశత్రువుల, క్రథన = వధించుటయందు, కలిత = తెచ్చుకొనఁబడిన. 'కలిఃకామధేనుః' అని ప్రమాణము. క్రూరకోపా = తీవ్రమైనకోపముగలవాఁడా! శత్రువులెంత క్రూరులో నీయనకోప మంత క్రూరమని తెలుపుటకై క్రూర శబ్దమే రెండుస్థలములఁ బ్రయోగింపఁబడెను. అపాపా = అపహతపాప్మా, పాపస్పర్శలేనివాఁడా, వారాశీట్ + జా = సముద్రతనయయగు లక్ష్మీదేవియనెడి, కమల = తామరకు, మధుపా = తుమ్మెదయగువాఁడా, భక్తహృత్ = భక్తుల హృదయమనెడి, పద్మ = కమలము, సద్మా = గృహముగాఁగలవాఁడా.

## — గద్యము. —

సీ. తనపాదభక్తుల ♦ తనయునిఁగాఁజేసి యనుకంపవీక్షించె ♦ జననమంద
ఆవలఁదాలక్ష్మ ♦ణార్యుఁడై రక్షించి రామాయణం బను ♦ గ్రహముచేసె
స్వీయమంత్రంబును ♦ జేట్లూరినరసింహ, దేశికుండై యుప ♦ దేశమిచ్చె
ఏకశిలానగ ♦ రాకుఁడై గ్రహియించి, యాంధ్రవాల్మీకిరా ♦ మాయణంబు
వ్యాఖ్యదానికిపుడు♦ వ్రాయించుకొనియెను, గరిమెళ్లోడను వన♦కాండమునకు
వాసుదాసుచేత స్వ ♦ ప్రభావంబును, బ్రకటపఱుపరామ ♦ భద్రవిభుఁడు.

ఇది శ్రీమద్రామచంద్ర చరణారవింద మిళిందాయమాన,
మానసత్వమహావైభవ వావిలికొలను రామచం
ద్రరాయతనూభవ సుజనవిధేయ సుబ్బరాయ
(వాసుదాస) నామధేయప్రణీతంబైన
మందరాఖ్య స్వయంకృత వ్యాఖ్యాన
సమేత శ్రీ మదాంధ్ర వాల్మీకి
రామాయణమను నిర్వచన
మహాకావ్యంబునందు
నారణ్యకాండము



శ్రీ రామార్పణమస్తు.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్లో॥ నమోస్తురామాయ సలక్ష్మణాయ, నమోస్తుదేవ్యై జనకాత్మజాయై।
నమోస్తువాతాత్మభువేవరాయ, నమోస్తువల్మీకభవాయతస్మై॥

# నివేదనము

శ్రీరాముఁడగు శ్రీరామునకుఁ బ్రణతులొనరించి విన్నవించెదము. శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము నెఱుఁగనివారు మన తెలుఁగుసీమలో లేరనియె చెప్పవచ్చును. దానిని రచించినవారు శ్రీరామచంద్ర పాదారవిందమిళిందాయమానమానసులు ఆంధ్రవాల్మీకి బిరుదాంకితులు, ద్విసహస్ర శిష్యసంసేవిత పాదారవిందులు, శ్రీకోదండరామ సేవక సమాజస్థాపనాచార్యులు, శ్రీవాసుదాస దేశికాపరనామధేయులగు శ్రీశ్రీవావిలికొలను సుబ్బరావుపంతులుగారు. వీరు శ్రీమద్వాల్మీకిరామాయణమును ఆంధ్రభాషయందు తూచ తప్పకుండ నిర్వచన పద్యకావ్యముగా రచించి,యంతతోఁ దనివిసనక తామే దానికి 'మందర'మనుపేర విపులమగు స్వతంత్రవ్యాఖ్యను జేసి బాలకాండము, అయోధ్యకాండము, అరణ్యకాండమున నొకభాగము మిగులవ్యయప్రయాసములకోర్చి ముద్రించి ప్రకటించియుండిరి. ఇంతలో శ్రీవారు పరమపదించుటచేఁ దక్కినభాగములు ముద్రితములుఁగాక యట్టే నిలిచిపోయినవి. అచ్చుకావలసిన భాగములు దాదాపు ఇరువదియుండును. ఒక్కొక్కభాగమున కేడునూర్లపైచిలుకు రూపాయలవఱకు పట్టును. అప్పటికి మొత్తము గ్రంథమంతయు నచ్చుకావుటకు ౧౫ వేలరూప్యములు కావలసియుండును. ఇంతమొత్త మనఁగానే యెల్లరకును అబ్బోయనిపంపకమానదు. ఆకారణమున శ్రీవారికి శిష్యులందేమి యభిమానులందేమి లక్ష్మీపుత్రులు నుదారులును భక్తిశ్రద్ధలు విశేషించికలవారు కలరుగాని ఒకరుగానే యీకైంకర్యమహాఫలమున భాగస్వాములుగానుండి యొకరేతరించుట భగవత్సంకల్పము కాదు కాఁబోలు. అందుచేతనే వీరిలో నెవరికిని ఆబుద్ధిపుట్టినది కాదు. కాని 1939 సంవత్సరము జనవరి నెలలో జరిగిన శ్రీవాసుదాస దేశికులవారి జయంత్యుత్సవమున శ్రీసీతారాములప్రేరణముచే శ్రీవారిశిష్యులందు, నభిమానులయందు మందరముద్రణవిషయమున సంచలనమేర్పడి అరణ్యకాండము ౧౩ భాగమున కప్పటికప్పుడు రు. ౨౦౦ లు పైచిలుకు (సరస్వతీప్రసన్నమయిననేమి లక్ష్మీప్రసన్నమైననేమి) ప్రోగయినవి. దీనితోఁ బని ప్రారంభింపఁబడినది. శ్రీవారి ప్రియశిష్యులలో [illegible] శ్రీశ్రీ ఈదర వేంకటరావు పంతులుగారు ప్రధానులు. ఏలూరులోని వే[illegible]లు. ఇది అండ్ కంపెనీ యజమానులు. ప్రారంభవిద్యయను పత్రికకు వ్యవ[illegible] తృతీయచుళుకవఱులో శ్రీవారిచే రచింపఁబడిన శ్రీకృష్ణలీలామృతము [illegible]నముచే ప్రతిఫలమాశింములు ద్వితీయముద్రణము నాచార్యునియందలి య[illegible] [illegible]మయమునఁ దమసహజౌదార్యము పక యచ్చొత్తించి యొసఁగియున్నారు. [illegible] నకు దేశికస్వామియందలి భక్తియు[illegible]డుపడ ననితరసాధ్యమగు మందరముద్రణ

కార్యభారమును నిర్వ్యాంచనముగా వహించియున్నారు. ఇదియే సుగ్రీవసాహాయ్యము. వీరి పూనికచేతనే వెనుక ముందాడక మందరముద్రణమున కిట్లు కడంగుట.

౧౦-వ భాగము (అరణ్యకాండములో ౨ భాగము)నకు విరాళములొసంగిన వారిని గుఱించి యిదివఱలోనే తెలియఁజేసికొనియున్నాము. భగవత్ప్రేరణమున, గంజాముమండలమందలి చికాకోలుపురవాసులు ఉపవేతనమునందిన సబ్ రిజష్ట్రారు శ్రీ శ్రీ తెన్నేటి మల్లవఝులుగారును వారి ధర్మపత్ని శ్రీమతి సౌభాగ్యవతి సుబ్బమ్మగారును వారియత్తగారు బలిజేపల్లి అన్నపూర్ణమ్మగారు రు. ౮౦౦ లు ౧౧-వ భాగము ముద్రించుటకుఁగా నొసంగిరి. అది చూచుకొని ౧౧-వ భాగము అచ్చునకీయఁబడినది. శ్రీ ఈదర వేంకటరావుగారి సహాయసంపత్తితో నీయరణ్యమునుండి బైటఁబడఁగలిగితిమి. ఖరాసురాది యుద్ధఘట్టము మున్నగునవెన్నియో యద్భుతగిలినవి కాని యవియన్నియు శ్రీరామచంద్రమూర్తికరుణచే ననాయాసముగఁ దొలఁగిపోయినవి. కాని కొంతకాలవిలంబనమునకుమాత్రము కారణము కాఁగలిగినవి. భగవత్సహాయముగల కార్యము లెట్లును సిద్ధింపక మానవుగదా ! అరణ్యమునుదాఁటితిమి - తెఱపినబడితిమి !

ఈ రెండు భాగములు ముద్రించుట కించుమించు ౧౮౦౦-౦-౦ లు వ్యయమైనవి. పైనవివరించినప్రకారము చేతికివచ్చిన రొక్కము ౯౦౦-౦-౦ లు. ఇంక నచ్చుకూటమునకేమి, కాగిదము మున్నగువానికేమి యీయవలసినది రు. ౫౦౦ లుండును. కావున సమాజసభ్యులు ముద్రితములయిన ౧౦-౧౧ భాగములను ద్వరలో నమ్మకముచేసి ఋణవిముక్తులగుటయే గాక కిష్కింధాకాండ ముద్రణమునకుఁగూడ కృషిసలిపి తమ కాచార్యునియందుఁగల నిష్కళంకభక్తిచే స్వధర్మనిర్వహణమునకై కడంగెదరు గాక ! వీరికి శ్రీసీతారాములయు శ్రీవాసుదాసస్వామివారియుఁ బరమానుగ్రహమున నితోధికశక్త్యుత్సాహము లభివృద్ధిగాంచుఁగాత !

౧౦-౧౧ భాగము లచ్చొత్తించుటకు భూరివిరాళము లొసంగిన మహాత్ములకు శ్రీసీతారాములు పరమశ్రేయస్సును బ్రసాదించెదరు గాత !

ఈకైంకర్యమునఁ గేవలగురుభక్తియే కారణముగ నిర్వ్యాంచనముగ సర్వవిధములఁ గృషిసలుపుచున్న శ్రీ శ్రీ ఈదర వేంకటరావుపంతులుగారిని వీరిసహధర్మచారిణి శ్రీమతి సౌభాగ్యవతి సుబ్బమ్మాదేవిగారిని శ్రీసీతారాములు సర్వదా సర్వధా తమకైంకర్యములందే నిలిపి శక్త్యుత్సాహసంపద లవ్వారిగా ననుగ్రహించెదరుగాక !

అరణ్యకాండమునకు మరల శుద్ధప్రతి వ్రాయవలసివచ్చిన కారణమున రాత్రిపగలు కష్టపడి వ్రాసియిచ్చుటయేకాక నడిగడ్డపాలెమునందలి శ్రీవాల్మీకా

శ్రమమునందు రెండున్నర సంవత్సరములనుండి జరుగుచున్న అఖండహరినామ కీర్తన మవ్యాహతముగా జరగుటకుఁ గారకులయిన శ్రీ పొత్తూరు వేంకటప్ప దాసుఁడుగారికిని, శ్రీ దేశికునికై సర్వసమర్పణ మొనరించి, మందరముద్రణ మింత తొందరలో కావుటకుఁ బ్రోత్సాహకులైన శ్రీ కూనంనేని వేంకటప్ప దాసుఁడుగారికి నితోధికకైంకర్యప్రాప్తిని సీతారాము లనుగ్రహించెదరుగాక !

ఈకార్యము 'సర్వేజనా స్సుఖినో భవంతు' అనుమంగళాశాసనముతోఁ ప్రారంభమైనది. లోకకళ్యాణమాశించినది శ్రీ కోదండరామ సేవకసమాజము కావున సర్వశోభనదాయి యగు శ్రీ సీతారామచంద్రు లీసమాజము సర్వతోముఖ వ్యాప్తిఁ జెంద ననుగ్రహించెదరుగాక! శ్రీ రామచంద్రులకు జయమగుఁగాక! జగత్కళ్యాణకారణమగు మందరముద్రణకార్యము నిర్విఘ్నముగాఁ బరిసమాప్తి నొందించి శ్రీ సీతారాములు తమభక్తవాత్సల్యము ప్రకటించుకొనెదరుగాక! ఆంధ్రసోదరు లీపరమోత్కృష్టగ్రంథరాజము నాదరపూర్వకముగఁగొని తక్కిన గ్రంథము త్వరలోఁ బ్రకటనమగుటకు సాయపడెదరుగాక ! సర్వజనులు సుఖసంపదల నానందించెదరుగాక !

ఇట్లు విన్నవించు

శ్రీరామసేవకసమాజసభ్యులు.

# తప్పొప్పుల పట్టిక

| పుట-పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| ౨౪౧-౪ | వచ్చినాకాశము | వచ్చి యాకాశము |
| ౨౪౨-౩౦ | కుట్టో | కుయ్యో |
| ౨౫౬-౩౧ | వృధ్ది | వృద్ధి |
| ౨౫౭-౮ | చేలింక | చేలును |
| ౨౭౦-౨ | భేధినా | భేదినా |
| ౧౧ | సరణ | స్మరణ |
| ౨౭౫-౨౦ | దిగ్బ్రిమ | దిగ్భ్రిమ |
| ౨౭౬-౨౨ | నిర్బవా | నిర్భయ |
| ౨౯౩-౨ | గలఁవాడు | గలవాఁడు |
| ౩౦౩-౩౩ | ఇచ్ఛాశక్తి-సాక్షాచ్ఛక్తి ఇచ్ఛా | ఇచ్ఛాశక్తి-సాక్షాచ్ఛక్తి-ఇచా |
| ౩౭౦-౬ | వాఁదు | వాఁడు |
| ౩౯౫-౧౬ | ప్రమోద | ప్రమాద |
| ౪౦౮-౨౦ | నిల్వగల | నిల్వఁగల |
| ౪౦౮-౨౩ | వధ్యుడె | వధ్యుఁడె |
| ౪౦౯-౨౭ | చెప్పగల | చెప్పఁగల |
| ౪౧౬-౧౧ | మంటలో బడి | మంటలోఁ బడి |
| ,, | చత్తునుగానిఁ | చత్తునుగాని |
| ౪౩౩-౫ | త్వన్మిత్తము | త్వన్నిమిత్తము |
| ౪౪౫-౨౯ | గొవ్ప | గొప్ప |
| ,, | వాఁడవు | వాఁడు |
| ౫౨౫-౩౩ | కరమున | కరమును |
| ౫౨౮-౧౯ | దర్మ | ధర్మ |
| ౫౮౬-౧౬ | పెద డను | పెద్ద కొండను |
| ౫౯౩-౧౨ | రెడవ | రెండవ |
| ౫౯౫-౧౨ | యుఁడు | యుండు |
| ౬౧౦-౮ | నెరుదుగ | నెదురుగ |
| ౬౧౧-౩౨ | విశ్వసనంబులు | నిశ్వసనంబులు |
| ౬౨౫-౨౩ | లెక్కమంది | లెక్కవమంది |
| ౬౨౯-౨౭ | పోగొట్లు | పోఁగొట్టు |
| ౬౪౫-౨౪ | యుత్తర భూము | యుత్తర కురుభూము |
| ౬౫౭-౨౬ | శ్రేషుఁడా | శ్రేష్ఠుఁడా |
| ౩౦ | భగనదను | భగవదను |
| ౬౫౯-౨౧ | వచ్చివ | వచ్చిన |
| ౬౬౫-౩౧ | తత్కథా | మత్కథా |
| ౬౭౦-౬౭ | యుర్వితాహితమ్ | యుర్విహితాహితమ్ |

31 to 60 Formes Printed at the Liberty Press, Madras.